TPLA130B101

# సందేశం

## ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ శతవార్షికోత్సవ సంచిక



# సందేశం

## ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామ
## శతవార్షికోత్సవ సంచిక

*శాలివాహనశకం 1879*

*20 వైశాఖం 1957, మే 10*



సంపాదకవర్గం:

కంభంపాటి సత్యనారాయణ

మోటూరు హనుమంతరావు

దేవులపల్లి వెంకటేశ్వరరావు

# విషయసూచిక





వెల : 1-2-0 (రూపాయి 12 నయాపైసలు)

---

ఈ సంచికలో **45, 61** పేజీలలోని చిత్రాలు ఛార్లెస్ బాల్ రచించిన History of Indian Mutiny లోనివి. మిగతా చిత్రాలు వినాయక దామోదర సావర్కార్ రచించిన Indian War of Independence లోనివి. ఆ చరిత్రకారులకు, ప్రచురణకర్తలకు మా కృతజ్ఞత. —సంపాదకవర్గం.

# స్వాతంత్ర్య వీరులకు జేజేలు!

వందసంవత్సరాలక్రితం మన దేశంలో బ్రిటిషు పాలనను తుదముట్టించాలనే దృఢ సంకల్పంతో భారత ప్రజ ఆయుధాలు తీసుకు లేచింది.

బ్రిటిష్‌వాళ్లు మన దేశాన్ని జయించేటందుకై శిక్షణయిచ్చి తయారుచేసిన దేశీసిపాయి పటాలాలే తుపాకులు తీసేయి. అయిదారువందల సంవత్సరాల సుదీర్ఘ కాలంలో పాతుకుపోయిన హిందూ, ముస్లిం విభేదాల్ని పక్కకుపెట్టి భారత ప్రజ ఏకం అయింది. రైతులు, జమీందార్లు అనే తేడా మరిచేరు. బ్రాహ్మణుడు, కడజాతివాడు అనే సంకుచిత భావాల్ని తోసేసేరు. జనానీకం యావత్తూ చేతికి దొరికిన ఆయుధమల్లా తీసుకొని సిపాయీలకు అండగా నిలబడింది. దేశ స్వాతంత్ర్యం సాధించేందుకు రక్తం నీళ్ళల్లా ఖర్చుపెట్టింది.

కాని, ఆ విప్లవం ఓడిపోయింది. ఓడినా—

ఒక వీరుడు మరణిస్తే, వేలమంది ప్రభవింతురు
ఒక నెత్తుటి బొట్టులోన, ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు.

విప్లవం ఓడినా భారతజాతి ఇంగ్లీషువాళ్లని నిద్ర పోనియ్యలేదు. తుపాకీ తీసి విప్లవోద్యమం ఎంత అదటు కలిగించిందో, దాని తర్వాత ప్రార్థనలూ, మహాజర్లతో ప్రారంభమైన జాతీయోద్యమం అంత భయమూ కలిగించింది.

ప్రార్థనలూ, మహాజర్లూ నిరాపదము లనిపించవొచ్చు. కాని, త్రింశత్ కోటి కంఠాలు కలిసేసరికి అవి విదేశీపాలకులకు అంతిమ సందేశాలుగా, సమర ఆదేశాలుగా పరిణతిపొందేయి.

అంతతో కూడా ఆగలేదు. తమ భవిష్యత్తును సుఖమయంగా నిర్మించుకొనేటందుకు సోషలిస్టు ఆదర్శాల మద్దతుతో జాతీయోద్యమ కర్తవ్యాలను రూపొందించేయి.

మళ్ళా చరిత్రచక్రం తిరిగింది; భారతనౌకాదళం తిరగబడింది. భూ విమాన సైన్య దళాలు వారికి వత్తాసు నిలబడ్డాయి. భారతప్రజానీకం వారి వెనక నిలబడింది.

ఈమారు ప్రజలు స్వాతంత్ర్యాన్ని గుంజుకొన్నారు. కాంగ్రెసు నాయకత్వాన దేశంలో స్వతంత్రప్రభుత్వం ఏర్పడింది.

నూరేళ్ల పోరాటంలో భారతప్రజ స్వాతంత్ర్యం అనేది ప్రజల సుఖజీవితంతో గాని పర్యవసితం కాదని అర్థం చేసుకొంది. సమగ్ర స్వాతంత్ర్యం సాధించేటందుకై వారి పోరాటం కొనసాగుతూంది.

ప్రథమ స్వాతంత్ర్యపోరాటం ప్రారంభమైన నూరేళ్ళకు సమగ్రమైన స్వాతంత్ర్యం సాధించేటందుకు కావలసిన పూర్వరంగం ఏర్పడింది. దేశంలో ఒక రాష్ట్రంలో సోషలిస్టు సమాజ సాధన ఆదర్శంగాగల కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వంలోకి వచ్చింది.

ఇది చాల శుభపరిణామం.

1857, 58 సంవత్సరాలనాటి రణరంగాలలోనూ, తర్వాత నూరేళ్ళుగా కొనసాగుతున్న పోరాటాలలోనూ భారతప్రజ చేసిన మహాత్యాగాల ఫలితం ఇది.

వారందరికీ మన జోహార్లు.

—సంపాదకవర్గం

4

# వీరావళికి జోహారు

అంబర చుంబిత హిమగిరి శిఖరాంచల ధవళిమలో తూగి
గంగా యమునా రంగదభంగ తరంగ డోలికల నూగి
పల్లీపత్తన తీర్థస్థల నానావన పథముల రేగి
త్రింశత్కోటి జనగళ గళన్మంగళ రణరణ కాహళులై

స్వేచ్ఛా భారత మంత్రకవాటము
తెరిచిన వీరావళి కిదె జోహార్ !
చిరతరదాస్య మలీమస ధాత్రిని
మెరిసిన తారావళి కిదె జోహార్ !

చెదరిన హిందూ ముస్లిమ్ జోదులు ఎదలొక్కటిగా రగిలి
పెనునిద్దర విడి మేల్కొన్న కొదమ సింగము లన ప్రజ కదిలి
కల్లల పుట్టిల్లై క్రుళ్లిన తెల్లదొరల త్రుళ్లడగించి
గుట్టల మిట్టల పేటల కోటల నెగయు తొలిపతాకలై

స్వేచ్ఛా భారత మంత్ర కవాటము
తెరచిన వీరావళి కిదె జోహార్ :
ప్రథమ స్వాతంత్ర్య మహావిప్లవ
నరనారీగణముల కిదె జోహార్ !

ఎవరా కృపాణధారిణి ? శత్రుధ్వంసిని ఝాంసీరాణి !
ధగద్ధగద్ధగారుణోజ్జ్వల జ్జ్వలన్నేత్రి ! వీరపుత్రి !
విద్యున్మేరుమహానగ ధీరత మోహరిల్లువా రెవరెవరోహో ?
ఇతడే కుంవర్ ! నానా, తాంతియ లరుగో ఎల్లడ తామై మొనసి

స్వేచ్ఛాభారత మంత్రకవాటము
తెరచిన వీరావళి కిదే జోహార్ !
భారత భాగ్యవిధాతలు త్యాగులు
పరమ పవిత్రులు మీ కిదె జోహార్ !

జాతిమతాలకు చోటీయని నాటి నీతి పోరాదు పోదు !
ఆనిత్యాగ్నుల త్యాగాగ్నులు ఆరవులే ! చల్లారవులే !
అజ్జోదుల ఘనదేశభక్తి కుదిపి కుదిపి కదిలించునులే !
ఆ వీరుల వారసులముగా ఆ గాథల కీర్తింతుములే !

— చిరంజీవి కృష్ణమూర్తి

# ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం: చారిత్రక ప్రాముఖ్యత

కంభంపాటి సత్యనారాయణ

భారతదేశ చరిత్రలో మొట్టమొదటిసారి బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని పునాదులతో సహా కదల్చివేసిన మహాపోరాటమే 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం. ఆంగ్లేయ పాలకు లదివర కెన్నడూ అంత పెద్దయెత్తున వలస ప్రజలనుంచి సాయుధ ప్రతిఘటన నెదుర్కొనియుండలేదు. కొన్నాళ్లు ఆంగ్ల సామ్రాజ్యమే తుడిచిపెట్టుకు పోతుందా - అనిపించింది.

అది "సిపాయిల కలహమ"నీ, స్వాతంత్ర్యసమరం కాదనీ అనేకమంది బ్రిటిష్ రచయితలు తమ గ్రంథాల్లో వ్రాశారు. వాటి అనుకరణలే మన పాఠశాలల్లో కూడ మొన్న మొన్నటివరకు బోధింపబడేవి. "అది పూర్తిగా దేశభక్తిరహితమైన సిపాయిల పితూరి" అన్నాడు, సర్ జాన్ సీలీ అను బ్రిటిష్ కన్సర్వేటివ్ రచయిత. "ప్రజలెవరూ దాన్ని బలపరచలేదు" అనికూడా అతడు అన్నాడు. ట్రెవెలిన్ అను లిబరల్ చరిత్ర కారుడు "అదొక సిపాయిల పితూరి; ప్రజల తిరుగు బాటు కాదు," అన్నాడు.

బ్రిటిష్ పాలకవర్గం యీ విధమైన నిర్వచనాలతో దీన్ని వక్రంగా చిత్రించడానికి కారణం తెలుసు కోడం కష్టమేమీ కాదు. కలహాలూ, పితూరీలూ కొన్ని స్వల్పకోర్కెలకోసం పరిమితస్థాయిలో మాత్రమే జరుగుతాయి. ప్రభుత్వాలను మార్చే ప్రసక్తి వాటికి లేదు. అందుచేత వాటికి రాజకీయ ప్రాముఖ్యత అంటూ ఉండదు. 1857 నాటి తిరుగుబాటు యిలాంటిదేనని చిత్రించడంద్వారా, వైరచయితలు దాని నిజ స్వభావాన్ని ప్రజల దృష్టినుంచి మరుగుపరచ దలచు కున్నారు.

## పోరాట స్వభావం

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం సిపాయి తిరుగుబాటుతో ప్రారంభమైనమాట నిజమే. కా మరుక్షణం నుంచీ దానికి ప్రజల ప్రత్యక్ష సహకా లభించింది. ఆంగ్లేయపాలనకు వ్యతిరేకంగా నిలబడి సంస్థానాధీశులు మొదలు సామాన్య రైతులవర అన్ని వర్గాల ప్రజల్ని సిపాయిలు సమీకరించి, వా ప్రత్యక్ష సహకారంతో దాదాపు రెండేండ్లు యుద్ధ చేశారు. కనుకనే దీన్ని స్వాతంత్ర్యప్రియు లందరు జాతీయ విముక్తి పోరాటమని కొనియాడుతారు.

బ్రిటిష్ పాలకవర్గంలో కూడా కొందరు యీ వి యాన్ని అంగీకరించకుండా ఉండలేకపోయారు. ఉద హరణకు సర్ రాబర్టు గార్డినర్ 1858 లో బ్రిటిష్ పా మెంటుకు పంపిన తన రహస్యనివేదికలో ఇలా తెలియ జేశాడు:

"భారతదేశపు తిరుగుబాటు రెండు లక్షణాలను కలిగియుంది. ఒకవైపు అది ప్రజలపోరాటం; రెండవవైపు సిపాయిల తిరుగుబాటు...ఈ రెండూ కలిసి ఒక సాంఘిక విప్లవంగా సంలీనమయాయి. కేవలం సిపాయిల పితూరీయే దానికి కారణమని వాదించడమంటే చిరకాలంగా ఆ దేశంలో కొనసాగుతూన్న దుష్పరిపాలనను మరుగుపరచ డమే అవుతుంది."

జస్టిన్ మెకార్తీ అను ఆంగ్లచరిత్రకారు డిలా వ్రాశాడు :

"అది కేవలం సిపాయిల తిరుగుబాటే కాదు. ఆంగ్లేయులు భారతదేశాన్ని ఆక్రమించుకున్నందుకు

సిపాయిలలో వ్యాపించిన అసంతృప్తి, దేశీయులందరిలో చెలరేగిన ద్వేషం, అన్ని మతాలవారిలో కలిగిన అసహ్యత - యివన్నీ కలిసి తిరుగుబాటు రూపంధరించాయి...కొవ్వుతూటాల విషయంలో వచ్చిన తగాదా ప్రేలుడుమందులోపడ్డ ఒక నెరుసు మాత్రమే. ఆ నెరుసు అప్పుడు పడియుండకపోతే, మరొక నెరుసైనా పడియుండేది."

(జస్టిన్ మెకార్తీ: 'హిస్టరీ ఆఫ్ అవర్ ఓన్ టైమ్స్': 3 వ సంపుటం)

## ఆంగ్లేయుల కసాయిపాలనక్రింద వివిధ వర్గాల పరిస్థితి

ఎన్నో శతాబ్దాలనుంచి మన దేశంలోస్థిరపడిపోయిన ప్రాచీన సామాజిక వ్యవస్థను ఆంగ్లేయులు నాశనమొనర్చి, అన్ని వర్గాల ప్రజల్నీ నిర్దాక్షిణ్యంగా కొల్లగొట్టుకొని, వారి మతవిశ్వాసాలనూ, ఆచార వ్యవహారాలనూ కాలరాయడంవల్ల ప్రజలలో అసంతృప్తి అంతకంతకు ఎక్కువై చివరకు తిరుగుబాటురూపం ధరించింది.

ఈస్టిండియా కంపెనీ రాకముందు మన దేశంలో వర్ణవ్యవస్థపై ఆధారపడ్డ స్వయంపోషక గ్రామీణ వ్యవస్థ చాలకాలంగా స్థిరపడిపోయి వుంది. అతిప్రాథమికమైన జీవితావసరాలను ఏ గ్రామాని కాగ్రామం సప్లయిచేయగలిగేటట్లు అన్ని గ్రామసంఘాలు చూసేవి. వ్యక్తులకు భూమిపై సొంత హక్కు ఉండేదికాదు; గ్రామంయొక్క ఉమ్మడి ఆస్తిగా భూమి పరిగణింపబడేది. చక్రవర్తులు తమ ఉద్యోగుల ద్వారా ప్రతి గ్రామంలో పండే పంటనుబట్టి కొంతభాగం పన్నుగా వసూలుచేసుకొనేవారు. ప్రతిసేద్యగానివద్ద కాకుండా, గ్రామమంతటినుంచి ఉమ్మడిగా వసూలుచేసే అధికారమే వారి కుండేది. అలా వసూలైనదానిలో కొంత భాగాన్ని తప్పనిసరిగా నీటిపారుదల వసతులకు వినియోగించేవారు. అది ఒక ముఖ్యమైన 'రాజధర్మం'గా పరిగణింపబడేది. రెండవ విషయం, గ్రామసంఘాలే గ్రామసమస్య లన్నిటినీ పరిష్కరిస్తూ, వ్యవసాయానికీ, చేతిపరిశ్రమలకూ మధ్య సమన్వయం కుదిర్చి, ఏ గ్రామాని కాగ్రామం స్వయంపోషకంగా ఉండేటట్లు చూచేవి. మూడవది, ప్రతిగ్రామంలోనూ కులాలనుబట్టి వృత్తులు నిర్ణయింపబడేవి; తత్ఫలితంగా వివిధవృత్తుల మధ్య పోటీ అంటూ ఉండేదికాదు. ప్రజల అవసరాలు ప్రాథమిక దశలో ఉండడంవల్ల యీ పద్ధతి కొంతవరకు ప్రయోజనకారిగానే ఉండేది.

అయితే, దీన్నిబట్టి గ్రామాల్లో దోపిడీ లేదని అర్థంకాదు. ప్రతి గ్రామం మీద రాజప్రతినిధులు - ఫ్యూడల్ భూస్వాములు - నిరంకుశ పెత్తనం చెలాయించేవారు. ప్రతి గ్రామం లోను బ్రాహ్మణ పురోహితులు, క్షత్రియ గ్రామాధికారులు రైతుల, పారిశ్రామికుల శ్రమ ఫలితాన్ని దోచుకొనేవారు. మూఢ నమ్మకాలు, సనాతన సాంప్రదాయాలు అనే సంకెళ్ళతో వారి మేధస్సులను బంధిచేవారు. "హీన" కులస్థులు చేసిన నేరాలకు అమానుషమైన శిక్షలు విధించేవారు.

ఇదీ, క్లుప్తంగా ఆనాటి భారతదేశ ఫ్యూడలిజం యొక్క స్వరూపం.

హిందూ రాజుల, మహమ్మదీయ చక్రవర్తుల పరిపాలనలో రాజ్యాంగ మార్పులెన్ని సంభవించినప్పటికీ యీ సామాజిక వ్యవస్థ విచ్ఛిన్నం కాకుండా నిలబడి వుంది. మొగలాయి చక్రవర్తులు యుద్ధాల ద్వారా మన దేశాన్ని స్వాధీనపర్చుకున్నప్పటికీ, దేశ సంపదను వారు బయటికి తరలించలేదు. పన్నులు, కప్పాల రూపంలో పిండుకోగలిగినంత ధనం పిండుకొనేవారు; అనుభవించగలిగినదంతా అనుభవించేవారు; మిగతా ధనాన్ని పబ్లిక్ వర్క్స్ తదితర ప్రజోపయోగ కార్యాలకు ఖర్చుపెట్టేవారు. పట్టణాలలో చేతి పరిశ్రమల మీద తయారైన విలాస వస్తువులు రాజభవనాలకు చేరేవి; ఆ విధంగా వాటికి మార్కెట్ లభించేది. అనవసరపు సరకులు విదేశాలకు ఎగుమతి చేయబడేవి.

## పారిశ్రామికుల హీనస్థితి

కాని ఈస్టిండియా కంపెనీ హయాంలో -ముఖ్యంగా రాజ్యాంగాధికారం వారి వశమైనతర్వాత - యీ పరిస్థితి పూర్తిగా తలక్రిందులైంది. కంపెనీ అధికారులు మొదటిదశలో ప్రపంచ ప్రఖ్యాతివహించిన మన పారిశ్రామిక సరకులను కారుచౌకగా కొని తమ దేశానికి ఎగుమతిచేసేవారు. చౌకగా అమ్మనివారికి జుల్మానాలు, జైలుశిక్షలు విధించేవారు; అడవిజంతువుల్ని వేటాడినట్లు వేటాడేవారు. రెండవదశలో వారు మన దేశంనుంచి విస్తారంగా ముడిసరకులను తీసుకుపోయి, వాటితో చౌకగా యంత్రశక్తి సహాయంతో సరకులు తయారుచేసి, వాటిని మనదేశంమీద రుద్దేవారు. దీనివల్ల మనదేశంలో అనేకశతాబ్దాలనుంచి ఉచ్ఛస్థితిలోవున్న చేతిపరిశ్రమలు విదేశపోటీని తట్టుకోలేక సర్వనాశనమయాయి; లక్షలాది పారిశ్రామికులు వృత్తులను కోల్పోయారు; ఏటా కోట్లకొద్దీ రూపా

యలు లండన్ బ్యాంకులకు ధారావాహినిగా ప్రవహించాయి. ఈస్టిండియా కంపెనీ విధానాన్ని అతి నిశితంగా ఖండించిన కారల్ మార్క్స్, భారతదేశ పారిశ్రామికులు "ఐహిక ప్రపంచం నుంచి విముక్తి చెందారు" అని వ్యాఖ్యానించారు.

## వర్తకుల అధోగతి

పారిశ్రామికులవలెనే వర్తకులుకూడా అధోగతి పాలయ్యారు. ఈస్టిండియా కంపెనీ హయాంలో వాణిజ్యమంతా ఇంగ్లీషు వర్తకుల గుత్తాధిపత్యంక్రింద ఉండేది. వర్తకు లెవరూ సరాసరి ఉత్పత్తిదార్లవద్ద సరకులు కొనుక్కోకూడదు; కంపెనీ ఏజెంట్లవద్దనే విపరీతధరలు చెల్లించి కొనుక్కోవాలి. ఏవ్యక్తీ కంపెనీ ఏజంట్లకుతప్ప యితరులకు సరకులను అమ్మరాదు; యితరుల వద్ద కొనరాదు. ఈ నిబంధనలను ఉల్లంఘించినవారు కొరడాదెబ్బలకు, జుల్మానాలకు, జైలుశిక్షలకు సిద్ధం కావాలి. అంతేకాదు;ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి సరకులను రవాణా చేసేటప్పుడు చౌకీ పన్నుల రూపంలో విపరీతమైన మొత్తాలను చెల్లించుకోవాలి. కంపెనీ ఏజంట్లుమాత్రం ఒక్క దమ్మిడీ చెల్లించనక్కర్లేదు. వీటన్నిటికీతోడు, కంపెనీ గుమాస్తాలుకూడా సొంత వ్యాపారంలో ప్రవేశించి, దేశీయ వర్తకుల్ని వెయ్యివిధాల కొల్లగొట్టుకొనేవారు. ఇట్టి పద్ధతులవల్ల, పేరు ప్రఖ్యాతులుగల వర్తకు లనేకమంది దివాళాతీసి, ఈస్టిండియా కంపెనీకి దళారులుగా పనిచేయవలసిన గతి పట్టింది. ఈ సందర్భంలో శ్రీ ఆర్. కె. ముఖర్జీ యిలా వ్రాశారు :

"భారతీయ వర్తక పెట్టుబడిదార్లు ఐశ్వర్యవంతులుగాను, పలుకుబడిగలవారుగాను వృద్ధిచెందే రోజులు గతించాయి. ఈ వర్గం యింగ్లీషువారికీ, భారతదేశ పారిశ్రామికులు - రైతులకూ మధ్య చిన్న దళారులుగా మాత్రమే తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకొన వీలయింది. ఈ విధంగా కంపెనీ, కంపెనీ గుమాస్తాలు భారతదేశాన్ని స్వతంత్ర పెట్టుబడిదారీమార్గంలో అభివృద్ధిచెందనీయకుండా ఆటంకపరిచారు. ఆంగ్లేయులక్రింద గుమాస్తాలుగా, 'బనియాలు'గా పనిచేసే యీ 'కొలోనియల్ వర్తక పెట్టుబడిదార్ల' వర్గం బ్రిటిష్ వర్తక పెట్టుబడిదార్లవర్గంనుంచి ఉద్భవించింది." (ఆర్. కె. ముఖర్జీ: "ఈస్టిండియా కంపెనీయొక్క అభివృద్ధి, పతనం" పేజీ 181).

## రైతుల దుస్థితి

ఇక రైతుల విషయం చూదాం. ఈస్టిండియా కంపెనీ గ్రామ సంఘాల యాజమాన్యం క్రింద ఉన్న ఉమ్మడి భూములను వ్యక్తుల సొంత ఆస్తిగా మార్చివేసి, ప్రతి వ్యక్తినుంచి యకరానికింత రేటు అని (పూర్వంవలె పంటలో యింత భాగం అని కాకుండా) వసూలు చేయడం ప్రారంభించింది. పండినా ఎండినా సేద్యగాడు ఆ రేటు ప్రకారం పన్ను చెల్లించుకోవాలి; చెల్లించుకోలేకపోతే, భూమిని వదులుకోవాలి. ఈ విధంగా బ్రిటిషువారు మొట్టమొదటిసారిగా తమ స్వార్థంకోసం వ్యక్తులకు భూమిపై యాజమాన్యపు హక్కు యిచ్చి ఒక విధమైన సామాజిక విప్లవాన్ని తీసుకొచ్చారు. రైతాంగాన్ని పీల్చి పిప్పిచేయటాని దాన్ని ఉపయోగించుకున్నారు. దాన్ని ప్రాతిపదికగా తీసుకొని, వివిధ రకాలయిన భూమిపన్ను పద్ధతిని ప్రవేశపెట్టారు. (పెర్మనెంట్ సెటిల్మెంటు తాత్కాలిక సెటిల్మెంటు, రైత్వారీ సెటిల్మెంటు) వాటివల్ల విపరీతమైన ఆదాయం లభించింది. ఉదాహరణకు బెంగాల్లో ఈస్టిండియా కంపెనీ కొత్తగా పన్ను వసూలు చేసే అధికారాన్ని సంపాదించిన తర్వాత (1766 లో) 14,70,000 పౌనులు వసూలయితే, 1793 నాటికి - అంటే పెర్మనెంటు సెటిల్మెంటు వచ్చేనాటికి-30,91,000 పౌనులయింది. 1800 నాటికి 42,00,000 పౌనులు, 1857 నాటికి 1,53,00,000 పౌనులు అయింది. ఈ రివెన్యూలో ఒక్క దమ్మిడీ కూడా వ్యవసాయాభివృద్ధికి వినియోగించబడలేదు; అదంతా ప్రతియేడు వస్తురూపంలో ఇంగ్లండుకు తరలింపబడేది.

ఇక తాత్కాలిక సెటిల్మెంటు అమలుజరిగిన ఉత్తర హిందూస్థాన్‌లో కూడా పరిస్థితి యింతే. అక్కడ థాంప్సన్ ప్రవేశపెట్టిన ల్యాండ్ రివెన్యూ పద్ధతి జమీందార్లనూ రైతులనూ కూడ కలవరపెట్టిందని, ఏ రాష్ట్రంలోనూ జరగనంత ఉధృతంగా అయోధ్య రాష్ట్రంలో తిరుగుబాటు జరగడానికి కారణ మిదేనని కర్నల్ మాలిసన్ తన 'భారతీయ సిపాయిల పితూరీ' అనే గ్రంథంలో తెలియజేశాడు. అయోధ్య రాష్ట్రంలో పన్నులు చెల్లించలేని రైతుల్ని రివెన్యూ ఉద్యోగులు మండుటెండల్లో నిలబెట్టేవారనీ, తమ బిడ్డల్ని అమ్ముకొని పన్ను చెల్లించేటట్లు ఒత్తిడి చేసేవారనీ, రైతులు యీ బాధ పడలేక గ్రామాలు విడిచిపెట్టి పారిపోయేవారనీ, అలాంటివారిని సైనికులు

వెనక్కు తీసుకొచ్చి చిత్రహింసలకు గురిచేసేవారనీ బ్రిటిష్ పార్లమెంటు సభ్యులే ఆక్షేపణ తెలిపారు.

దక్షిణ భారతదేశంలో ప్రవేశపెట్టిన రైత్వారీ సెటిల్మెంటుకూడా పైవాటికేమీ తీసిపోదు. మద్రాసు రాజధానిలో ల్యాండ్ రివెన్యూ 1778 లో 4,94,208 పౌనులు వసూలయితే, 1792 నాటికి అది 7,42,760 పౌనులు అయింది; 1798 కి 8,56,666 పౌనులు, 1801 నాటికి 10,95,972 పౌనులు అయింది. భూమిపన్నును వసూలుచేయడానికి "ప్రతిబ్రిటిష్ రాష్ట్రంలోనూ చిత్రహింస అనేది ఏదో ఒక రూపంలో ఉందనడంలో ఎట్టి సందేహం లేదు" అని గవర్నరు జనరల్ డల్హౌసీయే 1855 లో అంగీకరించాడు. మద్రాసు రాజధానిలో ఆనాడు రైతులపై అమలుజరపబడిన చిత్రహింసలను వర్ణిస్తూ ముగ్గురు బ్రిటిష్ విచారణకర్తలు ఒక సుదీర్ఘ నివేదికను సమర్పించారు.

మొత్తంమీద యింగ్లీషువారు రైతులనుండి భూమి పన్నును వసూలుచేయడానికి వేర్వేరు ప్రాంతాల్లో వేర్వేరు పద్ధతులను ప్రవేశపెట్టినప్పటికీ, వాటి ప్రధాన లక్ష్యం రైతుల్ని దోచుకొని ధనం ఆర్జించడం. ఈ విధానం కరువుకాటకాలకు దారితీసి, కోట్లసంఖ్యలో ప్రజల మరణానికి కారణమైంది.

## సంస్థానాధీశుల పాట్లు

భారతదేశంలో ఆంగ్లేయులు కాలూనడానికి అవకాశ మిచ్చి, కోట్లాది ధనాన్ని కొల్లగొట్టుకోడానికి వీలుకలిగించిన సంస్థానాధీశుల్ని సైతం వారు విడిచిపెట్టలేదు. వారి అస్తిత్వానికే భంగం కలిగించారు. ఈస్టిండియాకంపెనీ భారత సంస్థానాధీశులయెడ అవలంబించిన విధానాన్ని కారల్ మార్క్స్ 1853 లో యిలా వర్ణించారు:

"బ్రిటిష్ దురాక్రమణదార్లెప్పుడైతే భారతదేశంలో అడుగుపెట్టి అధికారం చెలాయించ పూనుకున్నారో, అప్పుడే సంస్థానాధీశుల పెత్తనాన్ని బలప్రయోగంద్వారా లేక కుట్రలద్వారా నిర్మూలించడం తప్ప మరోమార్గం వారికి లేకపోయింది. పూర్వం రోమన్ చక్రవర్తులు తమ మిత్రుల విషయంలో ఏ విధాన మవలంబించారో ఆ విధానాన్నే వీరు సంస్థానాధీశులయెడ అవలంబించారు. ఒక ఆంగ్ల రచయిత వ్రాసినట్లు, మాంసం కొరకు ఎద్దును మేపేవిధంగా మిత్రుల్ని తెగమేపి, చివరకు వారిని స్వాహాచేసే పద్ధతి యిది. ఈస్టిండియా కంపెనీ ప్రాచీన రోమన్ చక్రవర్తుల మాదిరిగా, తమకు సహాయంచేసే మిత్రుల్ని సంపాదించుకొని, ఆ తర్వాత ఘాజి ఆలీ కనిపెట్టిన ఆధునిక పద్ధతిలో వారిని ఉరితీస్తున్నారు. సంస్థానాధీశులు ఈస్టిండియా కంపెనీతో చేసుకున్న ఒప్పందాలను అమలుజరపడానికి వారివద్దనే విపరీతమైన వడ్డీరేట్లకు రుణాలు చేయవలసి వచ్చింది. వారి చిక్కులు ఉచ్ఛస్థాయికి చేరుకోగానే, రుణదాతలు పాషాణహృదయులై 'శిలను బిగించేవారు'. అలాంటప్పుడు సంస్థానాధీశులు మర్యాదగా ఈస్టిండియా కంపెనీకి తమ సంస్థానాలను స్వాధీనమైనా చేయాలి; యుద్ధానికైనా తయారుకావాలి. తమ రాజ్యాలను అపహరించినవారు ప్రసాదించే భిక్షతోనైనా సంతృప్తిపడాలి; 'ద్రోహులు' అనే పేరుతెచ్చుకొని సింహాసనాలనుంచైనా నైదొలగాలి. ఈ రోజున సంస్థానాధీశులక్రింద 6,99,965 చదరపుమైళ్ళ విస్తీర్ణం, 5,29,41,263 జనాభాగల ప్రదేశం ఉంది. వీరు బ్రిటిష్ ప్రభుత్వానికి మిత్రులుగా పరిగణింపబడే స్థితికూడా నేడు లేదు. సైన్య సహకారం, రక్షణ మొదలైన రూపాల్లో అనేక షరతులకు కట్టుబడియుండవలసిన పరాధీన రాజ్యాలుగా యీ సంస్థానాలు తయారయాయి. ఇట్టి పద్ధతులవల్ల సంస్థానాధీశులు ఆత్మరక్షణ చేసుకోడానికిగాని, యితర సంస్థానాలతో దౌత్య సంబంధా లుంచుకోడానికిగాని, తమలో తాము స్వతంత్రంగా తగాదాలను పరిష్కరించుకోడానికిగాని హక్కు లేకుండాపోయింది. ప్రతి సంస్థానాధీశుడు నగదురూపంలోగాని, సైన్యాలరూపంలోగాని కప్పం చెల్లించితీరాలి. ఇలాంటి సంస్థానాలను కలిపివేసుకోడం మంచిదా కాదా- అనేది యీ రోజున ఒక వివాదగ్రస్త సమస్యగా తయారైంది. అలా కలిపివేసుకోడం మహాపచారమని సంస్కరణవాదులూ, అవసరమేనని వర్తక ప్రముఖులూ వాదించుకొంటున్నారు. నా అభిప్రాయంలో యిది పూర్తిగా అపసవ్యమైన ప్రశ్న. స్వదేశ సంస్థానాలెప్పుడైతే కంపెనీతో సైన్య సహకార పద్ధతిపై లేదా రక్షణ కొరకు ఒప్పందాలు కుదుర్చుకున్నాయో, ఆ క్షణంనుంచే అవి తమ అస్తిత్వాన్ని యించుమించు కోల్పోయాయి." (కారల్ మార్క్స్: 'న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్' పత్రికకు వ్రాసిన వ్యాసం : 12-7-1853).

మార్క్స్ పైవాక్యాలు వ్రాసిన తర్వాత పరిస్థితులు మరింత తీవ్రరూపం దాల్చాయి. రాజ్యాలను కోల్పో

యిన సంస్థానాధీశులు పింఛన్లనుసైతం పొందడానికి నోచుకోలేదు. కొడుకులులేని సంస్థానాధీశులకు దత్తతాధికారం నిరాకరింపబడింది. వారి రాజ్యాలన్నిటినీ యింగ్లీషువారు తమ తాత ముత్తాతల ఆస్తి మాదిరిగా కాజేశారు; వారి దత్తపుత్రులకు పింఛన్లను నిరాకరించారు. 1857 తిరుగుబాటుకు నాయకత్వం వహించినవారిలో ముఖ్యులంతా యింగ్లీషు దొరతనం చేత ఏదో ఒకవిధంగా పరాభవింపబడ్డవారే.

ఉదాహరణకు, నానాసాహెబు మహారాష్ట్ర రాజు బాజీరావుకు దత్తపుత్రుడు. ఇంగ్లీషువారు బాజీరావు మరణానంతరం నానాసాహెబుకు పింఛను యివ్వడం (రు. 8 లక్షలు) ఆపివేశారు. ఝాన్సీలక్ష్మీబాయి భర్త గంగాధరరావు యీస్టిండియా కంపెనీ తరఫున యుద్ధం చేసి, కాల్పీనగరాన్ని కాపాడిన ఆంగ్లేయ భక్తుడు. అతడు తన్ను తాను 'ఫిద్వీబాద్‌షా · జాంజా ఇంగ్లిస్తాన్' (ఘనతవహించిన యింగ్లండ్ చక్రవర్తి క్రింది సామంతుణ్ణి) అని సగర్వంగా పిలుచుకొనేవాడు. అట్టివాని సంస్థానాన్ని యింగ్లీషువారు నిర్దాక్షిణ్యంగా కలిపివేసుకొని, గంగాధరరావు దత్తపుత్రునికి వారసత్వపు హక్కు లేకుండా చేశారు. ఇలాగే, అదివరకెప్పుడూ యీస్టిండియా కంపెనీ ఆజ్ఞలను జవదాటి యెరుగని అయోధ్య నవాబు దుష్పరిపాలకుడుగా వ్యవహరిస్తున్నాడనే సాకుతో (తాము సత్పరిపాలకులైనట్లు) అతని సంస్థానాన్ని గుటకాయస్వాహా చేశారు. ఈ విధంగా బ్రిటిష్ పాలకులు చిరకాలంనుంచీ తమకు విధేయులుగా ఉంటున్న సంస్థానాధీశుల్ని సింహాసనభ్రష్టుల నొనర్చి, వారి కివ్వవలసిన పింఛన్లను సైతం ఎగవేసి పరాభవించడంవల్ల వారిలో ఓరిమి నశించింది; ప్రతీకారవాంఛ తలఎత్తింది. అన్ని వర్గాలవలెనే వారిలో కూడా తిరుగుబాటుభావాలు వ్యాప్తిచెందాయి. అవి చివరకు 1857 లో కార్యరూపం ధరించాయి.

సంస్థానాధీశులవలెనే జమీందార్లు, జాగీర్దార్లు, తాలూక్‌దార్లు మొదలైన ఫ్యూడల్ వర్గాలుకూడా ఇంగ్లీషు దొరతనం ప్రవేశపెట్టిన పన్నుల విధానంవల్ల తీవ్రంగా అసంతృప్తి చెందారు. ఇక్కడ మనం పాత జమీందార్లకూ, కొత్త జమీందార్లకూ గల వ్యత్యాసాన్ని గమనించకపోతే, ఆనాటి వాస్తవ పరిస్థితి అర్థం కాదు. బెంగాల్లో ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ల్యాండ్ రివెన్యూ పద్ధతివల్ల ప్రజలంటే సానుభూతిగల పాత జమీందార్లెందరో అధోగతిపాలయ్యారు. ఉదాహరణకు ఏటా 1,40,000 రూపాయల పేష్కసు చెల్లించవలసిన దినాజ్‌పూర్ జమీందార్లు ఇంగ్లీషువారికి బాకీ పడ్డందుకు జైళ్లలో నిర్బంధింపబడ్డారు. 3,50,000 రూపాయల పేష్కసు చెల్లించే బర్ద్వాన్ జమీందారు మరణానంతరం అతని భార్య కంపెనీకి కొంత సొమ్ము బాకీ పడ్డంవల్ల వారు బ్రిజ్ కిశోర్ అను వ్యక్తిని ఏజెంటుగా నియమించి, అతనిద్వారా శిస్తు వసూళ్లకు పూనుకున్నారు. కాని రాణి అతనికి సీలును ఒప్పగించడానికి నిరాకరించింది. కంపెనీ అధికారు లామెను లోబరచుకోడానికి ఆమె పైనకు కొడుకు తేజ్‌సింగును అపహరించారు. రాణి వారంరోజులు దుఃఖసముద్రంలో మునిగి, చివరకు కంపెనీ ఏజెంటుకు ఎస్టేటు సీలును ఒప్పగించింది. ఇలాగే, ఏటా 2,60,000 రూపాయల పేష్కసు చెల్లించే రాజ్‌షాహి రాణి ఇంగ్లీషు ప్రభుత్వానికి కొంత పేష్కసు బాకీ పడ్డంవల్ల ఆమె యిల్లు సైనికులచే ముట్టడింపబడింది. ఇంట్లో లభించిన యావద్ధనాన్నీ, సొంత ఖర్చులకైనా మిగల్చక లాక్కుపోయారు. మొత్తం రు. 22,58,67 ఆ విధంగా కొల్లగొట్టుకున్నారు. ఆమె ప్రైవీ కౌన్సిల్‌కి వ్రాసుకున్న అప్పీలులో యిలా తెలియజేసింది :

"నేనొక పాత జమీందారిణిని. రైతుల బాధలు చూడలేక, నేనే ఎస్టేటునుంచి శిస్తును వసూలుచేసే బాధ్యతను తీసుకున్నాను. కాని తీరా చూచేసరికి, శిస్తుకు సరిపడ్డా పంటలుపండవని తెలుసుకున్నాను. భద్రానదిగట్లు తెగిపోయి, పొలాలన్నీ జలమయమవడంవల్ల పంటలు ధ్వంసమయ్యాయి. నేను జమీందారిణిని గనుక, రైతుల్ని కాపాడవలసిన ధర్మం నామీద ఉంది. రైతులందర్నీ కొన్ని వాయిదాల్లో బకాయి చెల్లించవలసిందని నేను చెప్పాను. అదేవిధంగా నాకుకూడ కొంత వ్యవధి యివ్వవలసిందని కంపెనీ అధికారుల్ని కోరాను. కాని నా మాటను వారు నమ్మలేదు...."

తర్వాత కంపెనీ ఉద్యోగులు తన యింటి నెలా దోచుకున్నారో రాణీ భవానీ తన జాబులో తెలియజేసింది.

ఇట్టి జమీందార్లన్నిటిని ప్రభుత్వం వశపరచుకొని, తమ గులాములుగా వ్యవహరించేవారికి స్వాధీన పర్చడంవల్ల పాత జమీందార్లు అసంతృప్తి చెందడంలో ఆశ్చర్యంలేదు.

23,000 గ్రామాలుగల అయోధ్య రాష్ట్రాన్ని ఇంగ్లీషువారు కలిపివేసుకొని, నూతన ల్యాండ్ రివెన్యూ పద్ధతిని ప్రవేశపెట్టడంతో, నేలాది తాలూక్‌దార్లలో అసంతృప్తిజ్వాలలు అలముకొన్నాయి.

మద్రాసు రాజధానిలో రైత్వారీ పద్ధతిని ప్రవేశ పెట్టేందుకు బ్రిటీషువారు అనేక జమీందారీలను వశ పరచుకొని కొత్తవారికిఅమ్మివేయడం, బాకీలు చెల్లించ లేనివారి ఎస్టేట్లను కలిపివేసుకోడం చేశారు. ఉదా హరణకు, గుంటూరుజిల్లాలో ఏటా 60,000 పౌనుల ల్యాండ్ రివెన్యూచెల్లించే వాసిరెడ్డివారి ఎస్టేటును 600 పౌనులకు అమ్మివేశారు; 3000 పౌనులు చెల్లించే నిడద వోలు ఎస్టేటును 1200 పౌనులకు అమ్మివేశారు; 1000 పౌనులు చెల్లించే గొలుగొండ ఎస్టేటును 10 పౌనులకు అమ్మివేశారు. విజయనగరం, పర్లాకిమిడి, గుంసూరు, పోలవరం మొదలైన అనేక ఎస్టేట్లను ప్రభుత్వం యిలా వశపరచుకోడమో, వశపరచుకోడానికి ప్రయత్నించ డమో చేసింది.

ఇట్టి జమీందార్లు ఈస్టిండియా కంపెనీ కెదురు తిరిగి, ప్రభుత్వసేనలతో ప్రత్యక్షంగా పోరాడిన ఉదంతాలుకూడా ఉన్నాయి. తెలుగుదేశంలోనే, విజయనగరంరాజా బకాయి చెల్లించకుండా, జిల్లాను విడిచి వెళ్ళిపోవాలనే ఉత్తర్వును ధిక్కరించి, 4000 మంది సిపాయిల సహాయంతో పద్మనాభం అనే గ్రామంవద్ద యింగ్లీషువారి సేనలతో యుద్ధంచేసి మర ణించాడు (1794, జూలై 10). గంజాంజిల్లాలోని గుంసూరు, జలంత్రా, పర్లాకిమిడి, టెక్కలి మొద లైన జమీందారీలను వశపరచుకోడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలను భగ్నం చేసేందుకు వాటి జమీందార్లు గెరిల్లా పోరాటాలను నడిపారు.

## జాతీయ విముక్తి పోరాటం

ఈ విధంగా భారతదేశంలో బ్రిటిష్‌పాలన అన్ని వర్గాల ప్రజల్నీ కోపోద్రిక్తుల నొనర్చింది. అగ్నిలో ఆజ్యం పోసినట్లు, తరతరాలుగా భారత ప్రజలెంతో పవిత్రంగా ఎంచుకొనే మత సాంప్రదాయాలను కాల రాచి, క్రైస్తవమతాన్ని బలవంతంగా ప్రవేశపెట్ట డానికి పూనుకోడంతో, పెషావరునుంచి కలకత్తావరకు ప్రజల అసంతృప్తి దావానలం మాదిరిగా వ్యాపించింది; బ్రహ్మాండమైన జాతీయ విముక్తిపోరా టంగా అది రూపొందింది. హిందువులు - మహమ్మ దీయులు, స్త్రీలు - పురుషులు, రైతులు - జమీందార్లు, వర్తకులు - పారిశ్రామికులు అంతా యీ మహా సమరంలో పాల్గొన్నారు.

బెనారస్‌జిల్లా ప్రజలు ఇంగ్లీషువారిచే నియమింప బడ్డ కొత్త జమీందార్లను తరిమివేసి, పాతవారికి అధికారమిచ్చారు. అలహాబాద్ జిల్లాలో తాలూక్ దార్లు మహమ్మదీయులు; రైతులు హిందువులు. అయినా జిల్లాలోని ప్రతిగ్రామం తిరుగుబాటులో పాల్గొంది. అలహాబాద్ సైన్యాధికారి జనరల్ నీల్ వర్తకులలో అధికసంఖ్యాకులు "మనకు వ్యతిరేకంగా ప్రత్యక్ష పోరాటంలో పాల్గొన్నారు" అని తెలియజేశాడు. అయోధ్యరాష్ట్రంలో బషీర్‌గంజ్ అనే కేంద్రాన్ని వశపరచుకున్న తిరుగుబాటుదార్లలో అధికసంఖ్యాకులు జమీందార్లు. లక్నోవద్దనున్న నవాబ్‌గంజ్‌ని స్వాధీన మొనర్చుకోడానికి జమీందార్లు ప్రదర్శించిన ధైర్య సాహసాలు ఇంగ్లీషు అధికార్లనుసైతం ఆశ్చర్య పరిచాయి. హోప్‌గ్రాంట్ అను యింగ్లీషు జనరల్ ఆ పోరాటాన్ని గురించి యిలా చెప్పాడు:

"భారతదేశంలో నే ననేకమంది ధైర్యవంతుల్ని చూచాను. విజయమో వీరస్వర్గమో అంటూ పోరాడిన వారిని చాలమందిని చూచాను. కాని యీ జమీందార్ల అద్భుతచర్యలను మించిన చర్యల నెన్నడూ నేను చూచి యుండలేదు." (హోప్‌గ్రాంటు : 'సిపాయిల యుద్ధ గాథలు' - పేజీ 292).

సంస్థానాధీశుల్లో ఝాన్సీ లక్ష్మీబాయి, నానా సాహేబు, కుమార్‌సింగ్ మొదలైనవారు, తాంతియా తోపే వంటి గెరిల్లా నాయకులు యుద్ధరంగాల్లో ప్రద ర్శించిన అసమానమైన ధైర్యసాహసాలు యావద్భారత దేశంలోని స్త్రీ పురుషుల్నీ పులకితులొనర్చక మానవు.

ఇక సామాన్యప్రజలు ప్రదర్శించిన చొరవ, పోరాట దీక్ష వర్ణనాతీతం. కొందరు సంస్థానాధీశులు తమతో కలియనిచోట్ల ప్రజలు వారి ఆజ్ఞలను ధిక్కరించి తిరుగుబాటుచేసిన సందర్భాలున్నాయి (గ్వాలి యర్, ఇండోర్, కిర్వీ). తిరుగుబాటు జరిగిన ప్రతి చోటా ప్రజలు సిపాయిలకు అండదండలుగాఉండి సర్వవిధాల సహాయంచేశారు. తిరుగుబాటుయొక్క చివరిదశలో (1858) కూడా, బ్రిటిష్‌వారి అధీనం క్రింద ఉన్న అయోధ్యరాష్ట్రాన్ని తిరిగి వశపరచు కోడానికి సిపాయిలు యుద్ధం సాగిస్తూన్నప్పుడు, ప్రజలు వారికి "గంటగంటకూ శత్రువును గురించిన సమాచార మందజేసేవా" రని ఛార్లెస్ బాల్ తన గ్రంథంలో పేర్కొన్నాడు ('భారతీయ పితూరీ చరిత్ర' రెండవ సంపుటం; పేజీ 572).

డాక్టర్ డఫ్ అను ఆంగ్లదయిరి 1857 తిరుగు బాటును వర్ణిస్తూ యిలా వ్రాశాడు :

"అదొక బ్రహ్మాండమైన విప్లవం; కేవలం సైనిక తిరుగుబాటే కాదు...అనేకసార్లు మనం శత్రువును తరిమివేశాం; చెల్లాచెదరొనర్చాం; ఆయుధాలను వశపరచుకొన్నాం. కాని సిపాయిలు ఎన్నిసార్లు దెబ్బతిన్నప్పటికీ, మళ్ళీ మనమీదికి దుముకుతున్నారు; మళ్ళీ యుద్ధం చేయడానికి సన్నద్ధమవుతున్నారు. ఒక నగరాన్ని మనం స్వాధీనమొనర్చుకున్న మరుక్షణంలో మరొకనగరం ప్రమాదానికి లోనవుతోంది." (డాక్టరు డఫ్ : 'భారతీయ తిరుగుబాటు'— పేజీ 241)

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంయొక్క స్వరూపస్వభావాలను వినాయక దామోదర్ సావర్కార్ ఎంతో చక్కగా వర్ణించారు. ఆయన యిలా వ్రాశారు :

"హిందుస్థాన్ ఆనాడు ఒక సజీవమైన అగ్ని పర్వతం మాదిరిగా ఉంది. శంకరుని త్రినేత్రం వలె మహోగ్రరూపం దాల్చింది; చివరకు అగ్నిపర్వతం బ్రద్దలైంది. దాని అంతర్భాగంలో ఉన్న లావా కట్టలుతెగి ప్రవహించింది. రకరకాలైన ప్రేలుడు పదార్థాలన్నీ అతి ప్రమాదకరంగా కలిశాయి. స్వాతంత్ర్యపిపాస అనే నెరుసు వచ్చి దానిమీద పడింది..." (వి. డి. సావర్కార్ : 'భారతస్వాతంత్ర్య సంగ్రామం' పేజీ 99).

## పోరాటంలో సిపాయిల నాయకత్వం

1857 తిరుగుబాటుకు నాయకత్వం వహించినది సిపాయిలు.

ఈస్టిండియా కంపెనీ హయాంలో 19వ శతాబ్దమంతటా సిపాయిలు వేర్వేరు రాష్ట్రాలలో వేర్వేరు కారణాలవల్ల స్థానిక తిరుగుబాట్లు అనేకం చేశారు. హిందూ సిపాయిలు బొట్టు పెట్టుకోరాదనీ, చెవులకు కమ్మలు ధరించరాదనీ యింగ్లీషు సైనికాధికారులు విధించిన ఆంక్షలకు వ్యతిరేకంగా 1806 లో వెల్లూరు సిపాయిలు తిరుగబడ్డారు; ఒక సైన్యాధికారిని హత్య చేశారు. ఆ సంవత్సరమే కొందరు సిపాయిలు తలపాగాలకు బదులు టోపీలు ధరించాలన్న ఉత్తర్వును ధిక్కరించినందుకు నలుగురు కాల్చి చంపబడ్డారు. బెంగాల్ సిపాయిలలో జీతభత్యాలు, సెలవులు, ప్రమోషన్లు తదితర సౌకర్యాల విషయమై అసంతృప్తి చాలా ఉండేది. చివరకు 1824 లో అధికారులు బ్యారక్‌పూర్ పటాలాన్ని బర్మాయుద్ధంలో పోరాడేందుకు బలవంతంగా తీసుకువెళ్ళబోతే, సిపాయిలు తిరుగబడ్డారు. పటాలాన్నంతటినీ అధికారులు కాల్చి చంపడమో, ఉరితీయడమో చేశారు. 1840 లో చైనా నల్లమందు యుద్ధంలో పాల్గొనేందుకు సిద్ధంచేయబడిన రెండుపటాలాలు ఓడయెక్కడానికి నిరాకరించాయి. 1844 లో సింధురాష్ట్రంలోని బెంగాల్ సిపాయిలు జీతభత్యాల సమస్యపై తిరుగబడ్డారు. 1849-50 లో పంజాబ్‌లోని బెంగాలీపటాలాలు తిరుగబడ్డాయి. హైదరాబాద్ సంస్థానంలో 1806, 1812, 1827 లో నైజాం పటాలాలు తిరుగబడ్డాయి. 1855 లో బోలారం పటాలం తిరుగబడింది.

ఈ విధంగా, సిపాయిలు బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడే సాంప్రదాయం చాలకాలం నుంచీ ఉంది. జాతీయ సాంప్రదాయాలకు, మత విశ్వాసాలకు విరుద్ధమైన మార్గాలను ఇంగ్లీషు దొరతనం చేపట్టడంవల్ల వారిలో మరింత అసంతృప్తి కలిగింది. సైన్యాధికారులు హిందూ-మహమ్మదీయ మతాలను న్యూనపరుస్తూ, వారి దేవుళ్ళనూ దేవతలనూ దూషిస్తూ, క్రైస్తవమతంలో చేరే సిపాయిలకు ప్రమోషన్లివ్వడం సాగించేసరికి సిపాయిలు కోపోద్రిక్తులవడంలో ఆశ్చర్యంలేదు.

పరిస్థితులు ఇలా ఉండగా, కొవ్వు తూటాల ఉదంతం ప్రేలుడు మందులో నిప్పురవ్వ మాదిరిగా పనిచేసింది. ఆంగ్లేయులిక హిందూ-మహమ్మదీయ మతాలను సమూలంగా నాశనమొనర్చ దలచుకున్నట్లు సిపాయిలందరూ భావించారు. 1857 జనవరి లగాయతు ఉత్తర భారతదేశమంతటా రహస్య సమావేశాలు జరుపుకొని, కొవ్వు తూటాలను ఉపయోగించ కూడదని శపథాలు చేశారు. ఈ సమస్యపై మార్చి 29 వ తేదీన బ్యారక్‌పూర్ సిపాయిల సమక్షంలో ఒక బ్రిటిష్ సైన్యాధికారిని హత్యచేసి యిద్దరిని గాయపరచిన మంగళ్‌పాండ్యాను భారతీయ సిపాయిలు మార్గదర్శిగా పరిగణించారు.

బ్రిటిష్ సైన్యాధికారుల క్రింద బ్రిటిష్ పద్ధతులలో శిక్షణ పొందిన సాయుధ సైనికులే సహజంగా అందరికంటె ఎక్కువ చొరవతో పోరాడగల శక్తివంతులు. సిపాయిల ద్వారా వేలాది గ్రామాలకు రహస్యంగా విప్లవ సందేశ మందచేసినది సిపాయిలు. సైనిక తిరుగుబాటును జాతీయ సమరంగా మార్చేందుకు బహదూర్‌షాను చక్రవర్తిగా చేసినది సిపాయిలు; రాజధానిలో ఒక్క ప్రతిభాశాలియైన

సైన్యాధిపతి లేకపోయినప్పటికీ, దాదాపు 5 మాసాలు శత్రుసేనల ముట్టడిని ఛిన్నాభిన్నమొనర్చినది సిపాయిలు; చివరి రోజుల్లో తాంతియాతోపే నాయకత్వాన జరిగిన గెరిల్లా పోరాటాల్లో శత్రువును ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించినది సిపాయిలు; తిరుగుబాటు జరిగిన అన్ని ప్రాంతాల్లోను హిందూ మహమ్మదీయ సిపాయిలు ప్రదర్శించిన ఐక్యత, చొరవ, తెగింపు వర్ణనాతీతం.

తిరుగుబాటు కెవరు నాయకత్వం వహించారన్న విషయమై కొంత గందరగోళం ఉంది. సంస్థానాధీశులు వగైరా ఫ్యూడల్ వర్గాలు యీ పోరాటానికి నాయకత్వం వహించారనీ, తమ నిరంకుశ పరిపాలనావిధానాన్ని తిరిగి స్థాపించుకోడానికి వారు చేసిన ప్రయత్నమే యీ తిరుగుబాటు అనీ కొందరి అభిప్రాయం.

ఇందులో కొంత వాస్తవ మున్నప్పటికీ, పూర్తి వాస్తవం మాత్రం కాదు.

1857 నాటి కింకా అధికారం చెలాయిస్తున్న సంస్థానాధీశులు తిరుగుబాటులో పాల్గొననే లేదు. సైన్య సహకార సంధులవంటి ఒడంబడికలద్వారా ఆంగ్లేయులు సంస్థానాధిపతుల అధికారాన్ని సంకుచిత పరచినప్పటికీ, వారి భూభాగాలలో కొన్నిటిని కాజేసినప్పటికీ, ఆ సంస్థానాధీశులు తిరుగుబాటులో చేరలేదు. పైగా బ్రిటిష్‌వారికి ప్రత్యక్షంగా సహాయం చేశారు. కాశ్మీర్, పాటియాలా, నేపాల్; హైదరాబాద్, నాభా, కపుర్తలా, ఝిండ్, గ్వాలియర్, ఇండోర్, బరోడా, జైపూరు, జోధ్‌పూరు, మైసూరు సంస్థానాధీశు లిట్టివారే. ఆనాడు భారతదేశంలో ఫ్యూడల్ వ్యవస్థకు పునాదు లనదగ్గవారు వీరే. వీరి సహాయం లేనిదే ఇంగ్లీషువారు 1857 నాటి తిరుగుబాటును అణచగలిగేవారు కారనడంలో అతిశయోక్తి లేదు. ఉదాహరణకు, గవర్నరు జనరల్ కానింగ్ గ్వాలియర్ సంస్థానాధీశుని సహాయాన్ని కొనియాడుతూ యిలా అన్నాడు:

"సింధ్యా గనుక తిరుగుబాటులో చేరియుంటే, నేను రేపే మూటముల్లె కట్టుకొని బయల్దేరేవాణ్ణి."

అంతేకాదు. పాటియాలా, నాభా, ఝిండ్, కపుర్తలా, నేపాల్ వంటి సంస్థానాధీశులు తమ సేనలను ప్రత్యక్షంగా తిరుగుబాటుదార్లమీదికి నడిపారు.

అందుచేత, ఫ్యూడల్ వర్గాలు పోరాటానికి నాయకత్వం వహించారనడం సరికాదు. నాయకత్వం వహించిన సంస్థానాధీశులు, జమీందార్లు బ్రిటిష్ పాలన క్రింద తమ అధికారాలన్నిటినీ పూర్తిగా కోల్పోయినవారు.

భారతదేశంలో ఫ్యూడల్ వ్యవస్థకు పట్టుగొమ్మలైన సంస్థానాధిపతు లెందువల్ల తిరుగుబాటులో చేరలేదో పరిశీలిద్దాం.

సిక్కుల మతగురువు, యుద్ధనిపుణుడు ఐన గురు గోవిందసింగును ఔరంగజేబు తనవద్దకు పిలిపించుకొని, బ్రతికుండగానే అతన్ని పూడ్పించాడు. అప్పటినుంచీ సిక్కు రాజులు, సిక్కు ప్రజలు ప్రతీకారంకొరకు వేచిఉండడంలో ఆశ్చర్యంలేదు. ఆ ఔరంగజేబు వంశీయుడే (బహదూర్ షా) ఢిల్లీలో రాజ్యమేలుతూన్నప్పుడు అతన్నీ, అతని రాజ్యాన్నీ నాశనమొనర్చాలనే ప్రతీకారవాంఛతో పాటియాలా, నాభా, ఝిండ్ వంటి సంస్థానాధీశులు సిక్కు పటాలాలను వెనుకవేసుకొని ఆంగ్లేయులపక్షం వహించడం అసహజమేమీ కాదు. ఇక హైదరాబాద్, గ్వాలియర్ మొదలైన సంస్థానాల్లో బ్రిటిష్ అనుకూలురైన మంత్రులు అమితమైన పలుకుబడి సంపాదించి, వారే నిర్ణయాత్మకమైన పాత్ర వహించారు. అందుచేత ఆ సంస్థానాధీశులు యింగ్లీషువారి పక్షం వహించారు. తాము యింగ్లీషువారి పక్షం వహించకపోతే మిగిలిన అధికారమైనా దక్కుతుందో లేదో నన్న అనుమానం కొందరిలోను, తీరా తాము పోరాటంలో పాల్గొంటే సిపాయిలు పెత్తనం చేస్తారనే భయం మరికొందరిలోను పనిచేసి యుండవచ్చు. ఏది ఏమైనా, సింహాసనాలను అధికారాలను కోల్పోని సంస్థానాధీశు లెవరూ తిరుగుబాటులో పాల్గొనలేదనేది చారిత్రక సత్యం.

అంతేకాదు. పోరాటంలో పాల్గొన్న సంస్థానాధీశులుసైతం ప్రజలమీద, సిపాయిలమీద పెత్తనం చెలాయించగలిగినట్లు ఒక్క ఉదంతంకూడా లేదు.

మొగలాయి వంశానికి చెందిన బహదూర్ షా ఢిల్లీ చక్రవర్తిగా అధికారం స్వీకరించినమాట నిజమే అయినప్పటికీ, మొగలాయి చక్రవర్తుల ఫ్యూడల్ రాచరికం తిరిగి నెలకొల్పబడినట్లు అర్థం చేసుకోకూడదు. అసలు మొగలాయి రాజులు ప్రజల ఆహ్వానంవల్ల రాలేదనీ, అనేక యుద్ధాలు - రక్తపాతం జర్పాకనే వారు ఢిల్లీ సింహాసన మధిష్ఠించారనీ మనం మరచిపోకూడదు. కాని 1857 లో బహదూర్ షా సిపాయిల, ప్రజల ఆమోదంతో సింహాసన మధిష్ఠించాడు. బ్రిటిష్ ప్రభుత్వంపై తిరుగబడి, విజయపతాకాన్నెగురవేసిన సిపాయిలు పాత నిరంకుశ రాచరికాన్నే కోరితెచ్చు

కోసేటంత మూర్ఖులు కారు. బహదూర్ షా కూడ తన మీద ప్రజలుంచిన విశ్వాసాని కనుగుణ్యంగానే వ్యవహరించాడు. ఢిల్లీలో సమర్థులైన నాయకులు లేనందున యుద్ధపరిస్థితి ఆందోళనకరంగా పరిణమించడం చూచి, బహదూర్ షా తనకంటె సమర్థులైనవారికి సింహాసన మివ్వడానికి నిశ్చయించుకున్నాడు. జైపూరు, జోధ్‌పూరు, బికనీర్, ఆళ్వార్ మొదలైన సంస్థానాధిపతులకు వ్రాసిన ఒక జాబులో అతను యిలా తెలియజేశాడు:

"ఇంగ్లీషువారిని తరిమివేసిన తర్వాత భారత దేశాన్ని పరిపాలించాలన్న కోరిక నాకు లేదు. స్వదేశీ రాజులైన మీరంతా శత్రువును దేశంనుండి తరిమివేయడానికి కత్తిదూసి పోరాడినట్లయితే, నేను నా చక్రవర్తి పదవికి రాజీనామా చేసి, కొత్తగా ఎన్నుకోబడే సంస్థానాధీశుల కూటమికి అధికారం హస్తగతం చేస్తాను". (మెట్కాఫ్: 'దేశీయగాథలు'—పేజీ 226).

ఈ జాబు వ్రాసింది హిందూ, సిక్కు రాజులకనే విషయాన్ని మనం మరచిపోకూడదు. సమర్థవంతమైన నాయకత్వం కొరకు, హిందూ-మహమ్మదీయ-సిక్కు ప్రజలమధ్య జాతీయైక్యతను పటిష్ఠం మొనర్చడానికి ఆతడెంత ఔదార్యం కనపరచాడో పైజాబు తెలియజేస్తుంది. ఛార్లెస్ బాల్ వంటి కరడుగట్టిన సామ్రాజ్యవాది సహితం ఆ జాబును యిలా కొనియాడాడు:

"అంత అనూహ్యమైన, ఆశ్చర్యకరమైన, అసాధారణమైన మార్పు ప్రపంచచరిత్రలో బహు అరుదుగా మాత్రమే సంభవిస్తుంది."

కాన్పూరు, లక్నో, ఝాన్సీ, బరేలీ, జగదీశ్‌పూర్ మొదలైన కేంద్రాల్లోకూడ సిపాయిల ఆమోదంతోనే సంస్థానాధీశులు అధికారంలో ఉండగలిగారు.

అంతేకాక, కేంద్రంలోనూ, సంస్థానాల్లోను సిపాయిల ప్రతినిధులతోకూడిన మిలిటరీ కౌన్సిళ్ల లేదా మిలిటరీకోర్టులు ప్రభుత్వ నిర్వహణ, యుద్ధవ్యూహం మొదలైన విషయాల్లో అంతిమ నిర్ణయాధికారం కలిగి యుండేవి. 'మ్యూటినీ రికార్డ్స్' అను పంజాబు ప్రభుత్వ ప్రచురణ ఆనాటి ఢిల్లీ మిలిటరీకోర్టులో ఎవరెవరు సభ్యులుగా ఉండేవారో వివరించింది.

"మే 12 వ తేదీ తర్వాత—అంటే ఢిల్లీ విముక్తి చెందిన 24 గంటల్లో—తిరుగుబాటుదార్లు చక్రవర్తి సొంత కార్యాలయాన్ని వశపరచుకొని, రాజభవనంచుట్టూ కాపలా పెట్టారు. రోజూ దర్బారు జరగాలని పట్టుపట్టారు. ఆ దర్బారు కెవరైనా సరే వచ్చి తమగోడు చెప్పుకోవచ్చు. చక్రవర్తి అంగరక్షకులు బర్తరఫు చేయబడ్డారు. వారి స్థానే కొత్తవారు నియమింపబడ్డారు." (ఒక ప్రత్యక్ష సాక్షి: 'ఢిల్లీ తిరుగుబాటును గురించి రెండు దేశీయగాథలు'—పేజీ 60-61)

ఢిల్లీ ప్రభుత్వంయొక్క స్వభావాన్ని గురించి సర్ జాన్ కాంప్‌బెల్ అను బ్రిటిష్ సైనికోద్యోగి యిలా వ్రాశాడు:

"ఢిల్లీ ప్రభుత్వం ఒకవిధమైన చట్టబద్ధ రాజరికంగా కనబడుతుంది. ప్రజలు రాజును చట్టబద్ధ చక్రవర్తిగా మాత్రమే గౌరవించేవారు అయితే, పార్లమెంటుకు బదులు అతనికి సిపాయిల కౌన్సిల్ ఒకటి ఉండేది...." (సర్ జాన్ కాంప్‌బెల్: 'నా భారతీయ జీవితగాథలు' — రెండవ సంపుటం పేజీ 356)

అందుచేత, ఫ్యూడల్ రాజులు నిరంకుశంగా పరిపాలించడానికి అవకాశమే ఆనాడు లేదని స్పష్టమవుతుంది. పైగా సిపాయిలు ఆ స్థానాలలో కొన్ని అవాంఛనీయ ధోరణులను సొంత చొరవద్వారా అరికట్టిన సందర్భాలున్నాయి. ఉదాహరణకు ఢిల్లీ ప్రధాన పోలీసు అధికారి, ఆస్థాన వైద్యుడు అయి హకీం అహసనుల్లాఖాన్ ఇంగ్లీషువారితో కుట్రచేస్తున్నట్లు సిపాయిలు అనుమానించి, అతనిమీద కాపలా పెట్టారు. మహారాణి జీనత్ మహల్ ని కూడా ఒక సాధారణ సిపాయి నాయకు లనుమానించి, ఆమె భవనానికి కాపలా పెట్టారు. సర్వసైన్యాధిపతి బఖత్ ఖాన్ ఇంగ్లీషు సేనలను సమర్థవంతంగా ప్రతిఘటించజాలనందున మిలిటరీకోర్టు అతనిని బర్తరఫుచేసింది. అతని స్థానంలో చక్రవర్తి పెద్దకొడుకు మీర్జా మొగల్ ని సర్వసైన్యాధిపతిగా నియమించింది. కాని అతడుకూడా పనికిరాడని స్పష్టంకావడంతో, మీర్జా మొగల్ కూడ బర్తరఫ్ చేయబడ్డాడు. అయోధ్యలో మౌల్వీ అహమ్మద్ షా శక్తి సామర్థ్యాలను చూచి ఓర్వలేని కొందరు సామంతులు అయోధ్య రాణిచేత ఆయన్ని అరెస్టు చేయించారు. కాని సిపాయిలలో ఆయనకు అంతరిక్షంగా యెక్కువ పలుకుబడి ఉండటంవల్ల వారు రాణిపై ఒత్తిడి తెచ్చి తమ నాయకుని విడిపించుకోగలిగారు.

కాబట్టి, భారత స్వాతంత్ర్య సమరంలో సిపాయిలే నిర్ణయాత్మకశక్తిగా పనిచేశారనీ, వారే నాయకత్వం వహించారనీ స్పష్టంగా కనిపిస్తుంది.

## కాలచక్రాన్ని వెనుకకు తిప్పే పోరాటమా?

1857 తిరుగుబాటు కాలచక్రాన్ని వెనుకకు తిప్పే అభివృద్ధి నిరోధక పోరాటమనీ, జాతీయ పోరాటం కాదనీ రమేష్ చంద్రదత్తు మొదలైన మితవాద నాయకులు కొందరు అభిప్రాయపడేవారు. వారంతా పాశ్చాత్య పెట్టుబడిదారీ నాగరికతయొక్క పునరుజ్జీవన పాత్రను చూచి ఉత్తేజం పొందినవారు. అయితే, మితవాదులతోబాటు కొందరు అతివాదులు సహితం మొన్నటివరకు యిలాగే వాదించారు. ఉదాహరణకు మీరట్ కుట్రకేసులో (1929-33) శిక్షితుడు, మనదేశంలో విప్లవ కార్మికోద్యమ నిర్మాణానికి సహాయం చేసిన వ్యక్తి అయిన హచిన్సన్ (బ్రిటిష్ పౌరుడు) యిలా వ్రాశారు:

"ఇది (1857 తిరుగుబాటు) జాతీయ సమరం కాదు. కారణమేమంటే, అప్పటికింకా భారత దేశంలో జాతి అనేది ఏర్పడలేదు. బ్రిటిష్ పాలకుల ఐక్యతా విధానంవల్ల అది ఆనాడు రూపొందు తూంది...చారిత్రకంగా చూస్తే, అది జాతీయతకు ఆధునిక భావాలకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటు. అది కాలచక్రాన్ని వెనుకకుతిప్పడానికి, ఫ్యూడల్ ఒంటెత్తుతనాన్నీ, నిరంకుశత్వాన్నీ పునరుద్ధరించడానికి, రాట్నాన్నీ, మగ్గాన్నీ తిరిగి పైకి తీయడానికి, పాత రవాణా మార్గాలనూ, కమ్యూనికేషన్లనూ తిరిగి ప్రవేశపెట్టడానికి జరిగిన ప్రయత్నం". (లెస్టర్ హచిన్సన్: 'నవాబుల సామ్రాజ్యం': పేజీ 136)

పైవిధంగా వాదించే అతివాదులు మనదేశంలో కూడ ఉండేవారు. వారు ప్రపంచంలోకల్లా బ్రిటనే జాతీయ భావాలకూ ప్రజాస్వామ్యానికీ పుట్టినిల్లని అభిప్రాయపడేవారు. బ్రిటిష్ విద్యావిధానం, ఆధునిక రవాణా మార్గాలు మొదలైనవాటి ద్వారానే భారత దేశంలో జాతీయోద్యమం ఉద్భవించిందని వారి విశ్వాసం.

కాని యిది వాస్తవం కాదు.

చారిత్రకంగా చూస్తే "జాతి," "జాతీయత" అనేవి పెట్టుబడిదారీ విధానంయొక్క పరిణామక్రమంలో ఉత్పన్నమైన భావాలు. బ్రిటన్ మాత్రమే వాటిని గుత్తకు తీసుకోలేదు. నిజం చెప్పాలంటే, బ్రిటిష్ పెట్టుబడిదారీవర్గం రాచరిక ప్రభుత్వానికీ పార్లమెంటరీ విధానానికీ మధ్య రాజీని అంగీకరించింది. కాని ఫ్రెంచి పెట్టుబడిదారీవర్గం స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం అనే మహోన్నత లక్ష్యాలను ప్రపంచం ముందుంచింది. అందుచేతనే ఫ్రెంచివిప్లవం అంతకంటె యెక్కువగా భారత ప్రజల మన్ననలందుకొంది. మన దేశంలో బూర్జువా జాతీయతకు మూలపురుషుడని చెప్ప దగ్గ రాజా రామమోహనరాయ్ 1830 లో బ్రిటిషు పార్లమెంటు వద్దకు రాయబారం వెళ్ళినప్పుడు ఫ్రెంచి ఓడలోనే గాని, బ్రిటిషు ఓడలో ప్రయాణం చేయడానికి నిరాకరించాడు. 1917 లో రష్యాలో జరిగిన సోషలిస్టు విప్లవం, 1949 లో చైనాలో జరిగిన ప్రజాస్వామ్య విప్లవం జాతీయోద్యమాలకిచ్చినంత ప్రోత్సాహం ఏ యితర విప్లవాలూ యివ్వలేదు. అదే కాక, ఏదేశంలోనైనా జాతీయభావాలు, ప్రజాస్వామ్యం పెంపొందాలంటే విదేశీయుల పెత్తనం అవసరమనే హాస్యాస్పదమైన అభిప్రాయానికి పైవాదన దారితీస్తుంది.

మెకాలే ప్రవేశపెట్టిన విద్యా విధానంయొక్క ఉద్దేశం మన యువకుల్లో జాతీయ చైతన్యాన్ని రేకెత్తించడమని చెప్పగలమా? భారతీయ యువకుల్లో జాతీయ చైతన్యాన్ని నాశనం మొనర్చడానికి అది ఉద్దేశింపబడిందని అతడే స్వయంగా చెప్పుకున్నాడు! అయితే మన యువకులు బ్రిటిష్ ప్రజాస్వామ్యంలోని కొన్ని అభ్యుదయ లక్షణాలనుచూచి ఉత్తేజితులై జాతీయోద్యమంలో పాల్గొన్నారంటే, అది సామ్రాజ్య వాదంలోని వైరుధ్యాలను తెలియజేస్తుందేగాని, దాని ఔదార్యాన్ని కాదు.

రవాణా, కమ్యూనికేషన్ల విషయంకూడా యింతే.

అందుచేత, భారతదేశంలో జాతీయోద్యమానికి మూలం సామ్రాజ్యవాదుల దోపిడీయేనని గ్రహించవలసియుంది.

ఈస్టిండియా కంపెనీ అధికారులు మన ప్రాచీన సామాజిక వ్యవస్థను తమ స్వార్థంకొరకు ధ్వంసం చేశారు. అట్టి నిర్మూలన ముందుకు అడుగిడడానికి ఆనాడు అవసరమై యుండవచ్చు. అయితే దీన్నిబట్టి అట్టి నిర్మూలన బ్రిటిష్ ఆక్రమణవల్లగాని సాధ్యం కాదనుకోడం పొరబాటు. నిజం చెప్పాలంటే, ఆంగ్లేయులు మన దేశంలో అడుగు పెట్టేనాటికే ఫ్యూడల్ వ్యవస్థ శిథిలమయ్యే సూచనలు కనిపించాయి. ఈసందర్భంలో ప్రఖ్యాత కమ్యూనిస్టు నాయకుడు పామీదత్తు యిలా వ్రాశాడు:

"బ్రిటిష్ ఆక్రమణనాటికి సాంప్రదాయ సిద్ధమైన భారత సమాజం శిథిలావస్థలో పడింది; తన

సొంత సాధన సంపత్తి ఆధారంపై పెట్టుబడిదారీ విప్లవంయొక్క ప్రాథమికదశలో, దాని అంచున అది కదులుతూ నిలబడి ఉండడానికి ఆధారాలున్నాయి. కాని, అప్పటికే పరిపక్వత చెందిన బ్రిటిష్ పెట్టుబడిదారీ విప్లవం నాటి ఆరాచక పరిస్థితుల్లో, పరివర్తనదశలో దాన్ని ప్రక్కకునెట్టి తాను ముందుకు దుమికింది” (పామీదత్తు: ‘నేటి భారతదేశం’ 1955 కూర్పు-పేజీ 109”)

మొగలాయి చక్రవర్తులు ప్రవేశపెట్టిన కొన్ని సంస్కరణలను పరిశీలిస్తే, పై అభిప్రాయంలోని యథార్థం మనకు గోచరిస్తుంది.

1539 లో అధికారానికివచ్చిన షేర్షా రెవెన్యూఉద్యోగులే ఒక్కొక్క గ్రామంనుంచి వసూలు చేయవలసిన భూమిపన్నును నిర్ణయించాలని ఉత్తర్వులు జారీచేశాడు. గ్రామాధికారి గ్రామ ప్రతినిధిగా కాక, ప్రభుత్వ ప్రతినిధిగా గుర్తింపబడ్డాడు. షేర్షా తర్వాత సింహాసన మధిష్టించిన అక్బరు యీ విధానాన్ని కొనసాగించడంతోబాటు మరికొన్ని సంస్కరణలను కూడ ప్రవేశపెట్టాడు. వ్యవసాయోత్పత్తిని అధికం చేసేందుకు రైతులకు అప్పులివ్వడం, పన్నును ధాన్యరూపంలోకాక ధనరూపంలో వసూలుచేయడం, అందుకనుగుణ్యంగా ప్రభుత్వమే ధాన్యపు ధరలను నిర్ణయించడం, వ్యవసాయభూములన్నిటినీ వాటిసారాన్ని బట్టి మూడు తరగతులుగా విభజించి ఒక్కొక్క తరగతిక్రింద పండే సగటుపంటలో మూడవవంతును రాజభాగంగా వసూలుచేయడం మొదలైన పద్ధతులు ప్రవేశపెట్టబడ్డాయి. భూమిపన్ను సరాసరి రైతులవద్దనే వసూలు చేయబడేది. దేశానికంతకూ ఒకే కొలమానం అమల్లోకి వచ్చింది.

ఈ చర్యలన్నిటిఫలితంగా, ఆనాటి స్వయంపోషక గ్రామీణ వ్యవస్థలో వర్తకపు సరకుల ప్రభావం ప్రవేశించింది. వాటి క్రయ విక్రయాల కొరకు వడ్డీ వ్యాపారం, ద్రవ్య చెలామణీ మొదలైనవి ప్రబలంకాజొచ్చాయి. (అక్బరు చనిపోయినతర్వాత వీటిలో కొన్ని రద్దుచేయబడ్డాయి). కారల్ మార్క్స్ చెప్పినట్లు:

“ఆసియా దేశాల ఆర్థిక విధానాల్లో ఒకటైన వడ్డీవ్యాపారం (ఫ్యూడల్ వ్యవస్థకు చిహ్నం—రచయిత) చాలకాలం వరకు అమల్లో ఉండడం సంభవమే కావచ్చు. అయినప్పటికీ అది పెట్టుబడిదారీ ఉత్పత్తికి పూర్వంఉన్న వ్యవస్థ లన్నిటిలోను విప్లవకరమైన మార్పులను, ఆర్థికవిచ్ఛిన్నాన్ని, రాజకీయ పతనాన్ని తీసుకొస్తుంది.” (మార్క్స్ ‘క్యాపిటల్’ 1909 అమెరికా కూర్పు; పేజీ 701)

అంటే, ఆర్థిక వ్యవస్థ ఒకదశనుంచి మరొకదశకు మార్పు చెందడానికి బయటిశక్తులు ప్రోత్సాహం కలిగించు తీరాలనే నియమంలేదని స్పష్టమవుతుంది. ఈస్టిండియా కంపెనీ ఆనాడు బలప్రయోగం ద్వారా, మాన నిర్మూలన ద్వారా గ్రామీణ ఆర్థిక వ్యవస్థను నాశనం చేసి యుండకపోతే భారతదేశం శాశ్వతంగా అంధకారయుగంలో ఉండిపోయేదనీ, కాలచక్రం వెనుకకు తిరి యుండేదనీ భావించడం పొరబాటని దీన్నిబట్టి తెలుసుకోవచ్చు. అంతేకాదు. మొగలాయి చక్రవర్తులు చౌ పన్నును రద్దుచేశారు; తపాలా పద్ధతిని విస్తృపరచారు; బ్రహ్మాండమైన రోడ్లను నిర్మించారు; ద్రవ్యానికి బదులు ద్రవ్యమారకపు చిహ్నాలను (టోకెన్స్) ప్రవేశపెట్టారు; దేశమంతటికీ ఒకే రకమైన నాణేలను అమల్లోకి తెచ్చారు; ప్రభుత్వ కార్ఖానాలను నెలకొల్పారు; విదేశవ్యాపారంలో భాగస్వాములయారు. ఇట్టి చర్యలన్నిటి పర్యవసానం ఏమంటే, అప్పటివరకూ పట్టణఆర్థిక వ్యవస్థతో ఎట్టి సంబంధంలేని మన గ్రామాలు వ్యాపారం- కార్ఖానాల పద్ధతిలో ప్రవేశించవలసి వచ్చింది. ఫ్యూడల్ వ్యవస్థయొక్క మూల స్తంభం ఒకటి యీ విధంగా బీటలు వారింది.

ఆనాడు మన దేశంలో విస్తృతంగా వ్యాప్తి చెందిన భక్తి ఉద్యమంకూడ యీ పరిణామానికి దోహదమిచ్చింది. పురోహితులు, కర్మకాండ, కులాలు, మొదలైనవాటితో నిమిత్తంలేకుండా, భగవంతునిమీద భక్తిభావ మలవరచుకుంటే మోక్షం సాధించవచ్చుననేది యీ ఉద్యమంయొక్క సారాంశం. 15, 16 శతాబ్దాలలో రామానందుడు, వల్లభాచార్యుడు, చైతన్యుడు, నామదేవుడు, కబీరు, నానక్, ఏక్నాథ్, తుకారాం, తులసీదాస్, తిరువళ్లువార్, వేమన, రామదాసు మొదలైనవారు వేర్వేరు ప్రాంతాల్లో వివిధకాలాల్లో యీ భావాలను ప్రచారం చేశారు. ఈ ఉద్యమం యావద్భారత దేశంలో ఫ్యూడల్ వ్యవస్థకు వెన్నెముక అయిన కులభేదాలపై బ్రహ్మాండమైన దాడిచేసింది. ఈ ఉద్యమంయొక్క చారిత్రిక ప్రాధాన్యతను వివరిస్తూ, ప్రఖ్యాత సోవియట్ చారిత్రక పరిశోధకుడు ఎ. దయకోవ్ యిలావ్రాశారు:

“భారతదేశంలో భక్తిఉద్యమం అధిక సంఖ్యాక ప్రజలు నివసించే ప్రాంతాలన్నిటిలోను, పట్టణ వ్యాపారస్తుల, వృత్తి పనివారల ఉద్యమంగా

ప్రారంభమైంది. తర్వాత 17 వ శతాబ్దంలో రైతులుకూడ కొన్నిచోట్ల యిందులో పాల్గొన్నారు......ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగా వృత్తి పనివారలలోను, వ్యాపారస్తులలోను బయల్దేరిన అసంతృప్తి తీవ్రమై, పెద్ద పెద్ద భూస్వాములకు వ్యతిరేకంగా స్థానికమైన సాయుధ ఘర్షణల రూపం ధరించింది. ఈ ఉద్యమంలో పుట్టిన సాహిత్యం — ముఖ్యంగా కావ్యసాహిత్యం — ఫ్యూడల్ వ్యతిరేకస్వభావాన్ని కలిగియుంది." (ఎ. డయకోవ్ : "15-17 శతాబ్దాలలో భారతదేశంలో వ్యాప్తిచెందిన మతోద్యమాల చారిత్రిక ప్రాధాన్యత" — 1954. పేజీ 19-20)

అలాంటి పరిస్థితుల్లో వచ్చారు, బ్రిటిష్‌వారు మన దేశానికి. పాత సమాజాన్ని వారు సమూలంగా నాశనమొనర్చారు. క్రొత్త సమాజానికి తెలవని తలంపుగా భౌతిక పునాదులను నిర్మించారు. ఇంగ్లీషు పెట్టుబడిదార్లెప్పుడైతే యినుము, బొగ్గు విస్తారంగా లభించే భారతదేశంలో రైల్వేలను నిర్మించారో, అప్పుడు వాటి తక్షణావసరాలకోసం యంత్రశక్తిని విరివిగా ఉపయోగించవలసి వచ్చింది. ఆ తర్వాత రైల్వేలతో ప్రత్యక్ష సంబంధం లేని యితర పారిశ్రామిక శాఖలు కూడ యంత్రాలను ఉపయోగించవలసి వచ్చింది. అందుచేత భారతదేశంలో రైల్వేల నిర్మాణం ఆధునిక పరిశ్రమలకు నాందీప్రస్తావన అని చెప్పవచ్చు. ఈ ఆధునిక పరిశ్రమలవల్ల, అభివృద్ధిని ఆటంకపరచే కుల వ్యవస్థ నిర్మూలింపబడుతుంది.

క్రొత్త సమాజానికి భౌతిక పునాదులను నిర్మించడమంటే అర్థమిదేనని కారల్ మార్క్స్ 100 సంవత్సరాల క్రిందట తెలియజేశారు.

అయితే, దీన్నిబట్టి భారతదేశంలో సామ్రాజ్యవాదం అభివృద్ధికరమైన పాత్ర నిర్వహించిందని అర్థమా ? కానేకాదు. ఇంగ్లీషువారు సామాజికాభివృద్ధికి పునాదులను మాత్రమే నిర్మించారనీ (అదైనా తలవని తలంపుగా), ముందు ముందు అభివృద్ధిని సాధించుకోవలసింది ప్రజలేననీ మార్క్స్ స్పష్టంచేశారు. ఆయన యిలా వ్రాశారు :

"బ్రిటిష్ పెట్టుబడిదారీవర్గం వెదజల్లిన నూతన సామాజికశక్తులవల్ల భారత ప్రజలకు మంచి ఫలితం లభించాలంటే, గ్రేట్ బ్రిటన్‌లో ప్రస్తుతమున్న పాలకవర్గంస్థానే పారిశ్రామిక కార్మికులు అధికారంలోకైనా రావాలి; హిందువులు (భారతీయులని మార్క్స్ అభిప్రాయం - రచ.) బ్రిటిష్ సంకెళ్ళను పూర్తిగా ఛేదించుకోగల శక్తినైనా సంపాదించుకోవాలి." (కారల్ మార్క్స్ ; 'న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్' వ్యాసం 1853).

మార్క్స్ చెప్పిన విధంగా, "బ్రిటిష్ సంకెళ్ళను పూర్తిగా ఛేదించుకోడానికి" జరిగిన పోరాటమే 1857 నాటి తిరుగుబాటు. అంతేగాని, కాలచక్రాన్ని వెనుకకుత్రిప్పే అభివృద్ధి నిరోధక పోరాటంకాదు అది.

## విఫలతకు కారణాలు

దాదాపు రెండు సంవత్సరాలు బ్రిటిష్ పాలకుల్ని ఉక్కిరిబిక్కిరిచేసిన యీ తిరుగుబాటు విఫలమవడానికి కారణాలేమిటో తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం.

ఇంగ్లీషువారు మన దేశంవచ్చేనాటికి ఫ్యూడల్ వ్యవస్థ బీటలువారిందనీ, సంస్థానాధీశులు గతించిన కాలానికి చెందినవారనీ, అందుచేత తిరుగుబాటు ఓడిపోవడం అనివార్యమనీ కొందరు వాదించవచ్చు. ఇదెంతవరకు సత్యమైన వాదనో పరిశీలిద్దాం.

చారిత్రక పరిణామంలో "కాలంతీరిన" వర్గాలు మంతతట తాము అధికారాన్ని ఒదులుకోరనీ, నూతన శక్తులను మొండిగా ప్రతిఘటించడమే గాక, కొన్ని అనుకూల పరిస్థితుల నవకాశంగా తీసుకొని వాటిని ఓడించడంకూడ సంభవమనీ మనం మరచిపోకూడదు. అలా ఓడించిన సందర్భాలు ప్రపంచ చరిత్రలో కొన్ని ఉన్నాయి. మన దేశంలో "కాలంతీరిన" ఆదిమ కమ్యూనిస్టు గణాలు విల్లంబులవంటి సరికొత్త ఆయుధాల నుపయోగించి, అదివరకే ఉన్నత దశనందుకొన్న అనార్య సంఘాలనోడించలేదా ? యూరపులో బానిస వ్యవస్థను పెంచి పోషించిన రోమన్ సామ్రాజ్యం 4 వ శతాబ్దంలో అంతకంటె ఎన్నోరెట్లు వెనుకబడిన హూన్, గాత్, వాండల్ తెగల తాకిడికి నిలువలేక విచ్ఛిన్నంకాలేదా ?

అందుచేత భారత స్వాతంత్ర్య సమరంలో "కాలం తీరిన" ఫ్యూడల్ ప్రభువులు కొందరు పాల్గొన్నంత మాత్రంచేత (ఆనాడు ఫ్యూడలిజానికి పట్టుగొమ్మలైన సంస్థానాధీశు లెవరూ అందులో పాల్గొనలేదని పైనే

వివరించాను) అది ఓడిపోక తప్పదని నిర్ధారణ చేయడం పొరపాటు.

1857 తిరుగుబాటు ఓడిపోవడానికి ప్రధాన కారణాలేవో తెలుసుకోవాలంటే శత్రువుయొక్క బలం, తిరుగుబాటుదార్ల బలహీనతలు తెలుసుకోవాలి.

తిరుగుబాటు యావద్భారతదేశంలో ఒకే రోజున — మే31న ప్రారంభం కావాలని తొలుత నిర్ణయింపబడింది. కాని, మీరట్ సిపాయిలు తాత్కాలిక ఆవేశానికి లోనై మే 10 వ తేదీన—నిర్ణీత కాలానికి 21 రోజులుముందు—తిరుగబడ్డారు. దీన్ని బ్రిటిష అధికారులు హెచ్చరికగా తీసుకొని మిగతా కేంద్రాలలో ముందు జాగ్రత్తలు తీసుకున్నారు. ఉదాహరణకు, బ్రిటిష సైన్యాధికారులు మే 13 వ తేదీని లాహోరు సిపాయిలను, 15 వ తేదీని అమృతసర్ సిపాయిలను నిరాయుధులొనర్చారు. తత్ఫలితంగా ఇంగ్లీషు పటాలాలు పంజాబునుంచి ఢిల్లీకి సులభంగాను, త్వరగాను చేరుకోగలిగాయి. ఇలాగే యితర కేంద్రాలలోకూడ తిరుగుబాటును అణచివేయడానికి వారు సన్నాహాలు చేసుకోగలిగారు. ఈ సందర్భంలో జి. బి. మాలిసన్ యిలా వ్రాశాడు :

"ఈ చర్య (మీరట్ తిరుగుబాటు) నిర్ణీత కాలానికి ముందే జరగడంవల్ల ఇంగ్లీషువారి పుచ్చ పూచింది; తిరుగుబాటుదార్లకు ఆ చర్య వినాశకారిగా పరిణమించింది. యావద్భారతదేశంలో ఒకేసారి దెబ్బతీయడంవల్ల కలిగే ఫలితంలో సగం మాత్రమే అక్కడక్కడ అప్పుడప్పుడు జరిగే తిరుగుబాట్లవల్ల కలుగుతుంది." (జి. బి. మాలిసన్ : '1857 నాటి భారతీయ పితూరి' — పేజీ 88)

రెండవ కారణం, దేశంలోని పెద్ద సంస్థానాధీశులందరూ బ్రిటిష్ గులాములుగా, దేశద్రోహులుగా పనిచేయడం. బ్రిటిషవారికి గ్వాలియర్ సంస్థానాధీశుని సహాయ మెంతగా తోడ్పడిందో తెలియజేస్తూ గవర్నర్ జనరల్ కానింగ్ వ్రాసిన లేఖను పైన ఉదహరించాను. 1858 లో సర్ జాన్ లారెన్స్ సర్ ఫ్రెడరిక్ కర్రీకి వ్రాసిన జాబులో "పంజాబుకూడా జారిపోయివున్నట్లయితే మనం సర్వనాశనమయేవాళ్ళం," అని తెలియజేశాడు.

సిక్కు సంస్థానాధీశులు, నేపాళ్ మహారాజు, నైజాం నవాబు మొదలైన వారంతా ఆంగ్లేయులకు సహాయం చేసియుండకపోతే, బ్రిటిష్ సోల్జర్ల రక్తం భారతదేశపు గడ్డమీద ఏరులై ప్రవహించి యుండేది. ఇంగ్లీషు ప్రభుత్వం తుడిచిపెట్టుకుపోయేది.

సిపాయిలలో క్రమశిక్షణగాని, యుద్ధనైపుణ్యంగాని, శాస్త్రీయ పరిజ్ఞానంగాని లేకపోవడం మరో ముఖ్య కారణమని చెప్పవచ్చు. పోరాటం చివరిదశలో ముఖ్యంగా పరాజయాలు ప్రారంభమైన తర్వాత వీటి దుష్ఫలితాలు మరీ నగ్నంగా కనిపించాయి.

దేశవ్యాపితంగా ఒకేరోజున తిరుగుబాటు చేయాలన్న ప్లాను విఫలమైన తర్వాత విప్లవకారులు విజయావకాశాలున్న ప్రాంతాలలో తమ బలాలను కేంద్రీకరించి యుండవలసింది. కాని వారలా చేయలేదు. ముట్టమొదటే ఢిల్లీని స్వాధీనపరచుకొన్నారు; ఆ విధంగా శత్రుసేనల్లో ప్రధానభాగాలను తమ మీదికి తెచ్చుకున్నారు. సాధారణంగా జాతీయవిముక్తి పోరాటాల్లో ముఖాముఖీ పోరాడే పద్ధతిని చేపట్టకూడదు; పట్టణాలను రక్షించుకోడం, శత్రువు రాకపోక మార్గాలను ఛేదించడం వంటి పద్ధతులను అవలంబించాలి. జాతీయ విముక్తి పోరాటాలబలం వాటిలోనే ఉంది. కాని, తిరుగుబాటుదార్లీవిషయాన్ని గమనించలేదు.

పోనీ, తిరుగుబాటుకు కేంద్రంగా పరిగణింపబడ్డ ఢిల్లీనగరంలో శత్రుబలాలను సమర్థతతో యెదుర్కొగల సైనిక నిపుణులుగాని, పరిపాలనా దక్షులుగాని ఉన్నారా అంటే లేరు. తాంతియాతోపే, కుమార్ సింగ్ వంటి యుద్ధనిపుణు లంతా ఢిల్లీ బయటనే పోరాటానికి నాయకత్వం వహించారు. ఇక చక్రవర్తి బహదూర్ షా కాటికి కాళ్లుచాచుకొని కూర్చున్న 80 ఏండ్ల ముసలి. సైన్యాధిపతులు అసమర్థత కారణంగా ఒకరితర్వాత ఒకరు బర్తరఫ చేయబడ్డారు. ఇలాంటి పరిస్థితుల్లో సిపాయిలమధ్య ఐక్యత, క్రమశిక్షణ సహజంగా సన్నగిలి అంతరంగిక తగాదాలు ప్రారంభమయాయి.

దాదాపు 5 మాసాలు ఢిల్లీని రక్షించుకోడానికి జరిగిన పోరాటం విషయమే చూదాం.

తిరుగుబాటుదార్లలో ప్రతిసిపాయి వ్యక్తిగతంగా అసాధారణమైన ధైర్యసాహసాలతో పోరాడినమాట నిజమే. కాని వారిలో దృఢమైన ఐక్యతగాని, సమర్థవంతమైన నాయకత్వంగాని, శాస్త్రీయ పరిజ్ఞానంగాని లేవు. ఇవి లేనిదే ఆధునిక యుద్ధాలలో ఏపట్టణాన్నిగాని రక్షించుకోడం అసంభవం. అంతరంగిక తగాదాలవల్ల పటాలాలకు పటాలాలు ఢిల్లీనుంచి వెళ్లిపోతూండడంవల్ల శత్రువుకు సుంచి అరకాని మేస్ప

డింది. సెప్టెంబరు మాసంలో (1857) ఇంగ్లీషు సేనల సహాయార్థం అదనపుబలాలు ఢిల్లీకి చేరుకోవడంతో, తిరుగుబాటు సేనల పరిస్థితి ఆత్మరక్షణ దశనుంచి ఎదురుదాడి చేసే దశకు చేరుకుంది. చివరిరోజుల్లో సిపాయిలకు ఒక యూరపియన్ నిపుణుడు శాస్త్రీయ పద్ధతులపై పోరాడ్డం నేర్పినట్లు కొన్ని దాఖలాలు కనిపించాయట. క్రిమియాయుద్ధంలో (1853లో రష్యన్లకూ ఇంగ్లీషు-టర్కీ వారికీ మధ్య జరిగింది) అట్టి పద్ధతులే అవలంబింపబడ్డాయట. కాని, సిపాయిలు వాటిని సమగ్రంగా అర్థం చేసుకోలేకనో, నాయకత్వపు కొరతవల్లనో అవి సరిగా అమలు జరగలేదు. నిరర్థక ప్రయత్నాలుగానే అవి ఉండిపోయాయి.

అయోధ్యకు ముఖ్యపట్టణమైన లక్నో కొరకు జరిగిన పోరాటంలో కూడ యిట్టి బలహీనతలే ద్యోతకమయాయి. ఉదాహరణకు, ఇంగ్లీషు సేనల కెదురుగా 50,000 మంది తిరుగుబాటుదార్లు నిలబడ్డారు. వారు రెసిడెన్సీలోని 1500 బ్రిటిష్ సైనికుల నెదుర్కొని నిర్మూలించదలచుకున్నారు. కాని ఆ 50,000 మంది లోను సైనిక శిక్షణ గలవారు 5000 మంది మాత్రమే! మిగతావారిలో అనేకమందికి ఆధునిక ఆయుధాలే లేవు. ఉన్నవారైనా వాటిని శాస్త్రీయంగా ఉపయోగించడం తెలియదు. ఉదాహరణకు, ఫిరంగి గుండ్లను గురిచూచి వదలడం కాకుండా, ఎటుపడితే అటు వదిలేవారట. మందుపాతర్లను అమర్చడంలో కూడ క్రమపద్ధతి లోపించిందట. ఫిరంగి దళాల్లో అనుభవంగలవారు కొందరు సిపాయిలలో ఉన్నప్పటికీ, వారి పోరాటం శత్రువుయొక్క అగ్నివర్షంనుంచి రక్షించుకొనేందుకే పరిమితమయింది.

కారల్ మార్క్స్ లక్నో పోరాటాన్ని వర్ణిస్తూ, సిపాయిల బలహీనతలను గురించి యిలా వ్రాశారు:

"వారిలో కొందరు సింహాలవలె పోరాడియుండవచ్చు. కాని, పటాలాల్లోనివారు పారిపోయిన తర్వాత బలహీనమైన రక్షణప్రదేశంకొరకు కంత ధైర్యంతో పోరాడితేమాత్రం లాభ మేమిటి?" (కారల్ మార్క్స్: 'న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్' - 1-2-1858).

## ముగింపు

ప్రపంచ చరిత్రలో అన్నివిప్లవాలూ జయించలేదు. ఓడిపోయినవాటిలో ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామం ఒకటి. అంతమాత్రంచేత దాని చారిత్రక ప్రాముఖ్యత తగ్గిపోదు. ఇంగ్లీషు సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని కూలద్రోసేందుకు మొట్టమొదటిసారి దేశ వ్యాపితంగా జరిగిన ఆ మహాసంగ్రామం భారత స్వాతంత్ర్యోద్యమానికే ఒక వెలుగుబాట. పరాయి పాలకుల పెత్తనాన్ని పటాపంచలొనర్చడానికి అన్ని వర్గాల ప్రజలు, అన్నివృత్తులవారు, హిందూ ముస్లిం ప్రజానీకం అపూర్వమైన జాతీయైక్యతను సాధించి రాజీలేని పోరాట మెలా సాగించారో నేర్పారు. ఆ పోరాటంలో మరణించిన స్వాతంత్ర్యయోధులు భావి తరాలవారికి మార్గదర్శకు లయారు. ఆనాడు వారు ధారవోసిన రక్తం భారత స్వాతంత్ర్యోద్యమానికి పుష్టిని చేకూర్చి, 90 సంవత్సరాల అనంతరం బ్రిటిష్ ప్రత్యక్షపాలన రద్దుకావడానికి దోహద మిచ్చింది.



# తిరుగుబాటుకు కారణాలు

'చిత్తజల్లు'

ఎందరో అజ్ఞాత యోధులు, అమరవీరులు, త్యాగధనులు భారతజాతి స్వాతంత్ర్యంకోసం 1857 లో దేశవ్యాపితంగా మొట్టమొదటిసారి పోరుసల్పారు. ఆ సమరానికి నూరుసంవత్సరాలయింది. నాటిస్వాతంత్ర్య సమరాన్ని నేడు మనం స్మృతిపథంలోకి తెచ్చుకొని, నాటి వీరయోధుల అమరగాథలనూ, మాతృభూమి దాస్య శృంఖలాలను విచ్ఛేదనం చేసేందుకు వారుపడ్డ బాధలనూ తలచుకొనడం ప్రతి భారతీయ దేశభక్తుని విధ్యుక్తధర్మం.

ఈ వ్యాసంలో, ప్రథమ భారతస్వాతంత్ర్య సమరానికిగల కారణాలను వివరించడానికి ప్రయత్నిస్తాను.

ఆంగ్ల, భారతీయచరిత్రకారుల దృక్పథాలప్రకారం దీనికి కారణాలు ఈవిధంగా చెప్పబడ్డాయి:

1. బ్రిటిష్ గవర్నర్‌జనరల్ అయిన డల్‌హౌసీ ప్రవేశపెట్టిన దత్తస్వీకార నిషేధ పద్ధతివల్ల (Doctrine of Lapse) భారతదేశంలోని స్వదేశ సంస్థానాలు బ్రిటిష్, సామ్రాజ్యంలో అంతర్గత భాగాలుగా చేరిపోయాయి. రాజ్యాధికారాన్ని కోల్పోయిన స్వదేశసంస్థానాధీశులు స్వప్రయోజనాలను సాధించుకొనేందుకు జరిపిన పోరాటమే 1857 సమరమని కొంతమంది బ్రిటిష్ చరిత్రకారుల అభిప్రాయం.

2. నాటి మొగల్ చక్రవర్తి అయిన బహదూర్‌షా నామమాత్రపు అధికారాన్ని చెలాయించే కొండపల్లి బొమ్మలాగ తయారయ్యాడు. బ్రిటిష్‌వారిచేతుల్లో కీలుబొమ్మగా మారిపోయాడు. ఆచారవ్యవహారాలు, సాంప్రదాయాలు, మతవిషయాల రీత్యా కలిగిన అసంతృప్తిని అతడు తన స్వార్థప్రయోజనాల కొరకు వినియోగించుకున్నాడు. తత్ఫలితమే 1857 పోరాటమని మరికొందరి దృక్పథం.

3. నాటి సమరంలో స్వయంగా పాల్గొన్న సర్ జాన్ లారెన్స్ ఆ పోరాటాన్ని గూర్చి యిలా అన్నాడు: "ఇది కేవలం సిపాయిలకలహం మాత్రమే. దీనికి బీజం సిపాయిల అసంతృప్తి. ఆవు, పంది కొవ్వులతో చేయబడిన తూటాలే దీనికి చివరికారణం. సిపాయిలయొక్క ఈ అసంతృప్తిని భారతదేశంలోని కొందరు స్వార్థపరులు స్వప్రయోజనాలకొరకు ఉపయోగించుకొన్నారు."

4. "జాగ్రత్తగా ఆర్గనైజ్ చేయబడి బ్రిటిష్ అధికారాన్ని కూలద్రోసేందుకు విశాలమైన ప్రాతిపదికపై జరుపబడిన బ్రహ్మాండమైన మహమ్మదీయ కుట్ర యిది; హిందువుల అసంతృప్తిని నాటి కుట్రదారులు తమ స్వార్థంకొరకు ఉపయోగించుకో యత్నించారు" అంటాడు సర్ జేమ్స్ ఔట్‌రామ్. ఇతడుకూడా స్వయంగా తిరుగుబాటులో పాల్గొని సిపాయిలను అణచివేసినవాడే.

పై నాలుగు వాదనలలోను పాక్షిక సత్యముంటే ఉండవచ్చునుగాని, పూర్ణ సత్యంమాత్రం లేదు. ఒక మహోద్యమాన్ని పరిశీలించేటపుడు మనకు సైంటిస్టుకుండే దృక్పథం వుండాలి. ఆ ఉద్యమాన్నీ, దాని జయాపజయాలనూ పరిశీలించునపుడు మన రాగద్వేషాలు ఆ పరిశీలనలో ప్రవేశించకూడదు.

విన్‌సెంట్ స్మిత్, రాబర్ట్సన్‌లాంటి బ్రిటిష్ చరిత్రకారులు ఒక చివరకువెళ్ళి దీన్ని "సిపాయిల కలహము"ని పిలిచారు. వినాయక దామోదర సావర్కార్ మరొక చివరకువెళ్ళి తన గ్రంథాన్ని అతిశయోక్తులతో తయారుచేశాడు. స్వమత స్వధర్మాలను రక్షించుకొనేందుకే హిందూ ముస్లిములు ఈ సమరంలో పాల్గొన్నారని తేల్చి చెప్పాడు.

రూసో, వాల్టేర్, డిడిరోలాంటి ఫ్రెంచిమేధావుల విప్లవభావ ప్రచారమే ఫ్రెంచివిప్లవానికి మూలకారణమని అంటే ఎంత హేతుబద్ధంగా, వివేకవంతంగా వుంటుందో, 1857 స్వాతంత్ర్య సమరానికి ప్రథమ కారణం హిందూముస్లిం ప్రజలలో స్వధర్మ స్వమతోద్ధరణకొరకు ఉన్న ఆ కాంక్ష అని చెప్పడంకూడా అంతహేతుబద్ధంగానే వుంటుంది. బండిని ముందు పెట్టి, గుఱ్ఱాన్ని వెనుక కట్టాలనే వాదనవంటిది యిది.

ఈ సమరానికి రాజకీయ, ఆర్థిక, సైనిక, సాంఘిక, ధార్మిక కారణాలెన్నో వున్నాయి. వాటిని వరుసగా పరిశీలిద్దాం.

## రాజకీయ కారణాలు

క్రీ. శ. 1600 లో ఎలిజబెత్ రాణి ఆంగ్లేయ వర్తకులకు ఒక ఛార్టరును మంజూరుచేసింది. తత్ఫలితంగా, ఈస్టిండియా కంపెనీ అను పేరుతో ఒక వర్తకసంఘ ఆవిర్భవించింది. అది మనదేశంలో వ్యాపారం సాగిస్తూ వుండేది. ఇది ఆ కంపెనీ చరిత్రలో ప్రథమదశగా పేర్కొనవచ్చు. తర్వాత, స్వదేశరాజుల నవాబుల అంతరంగిక విషయాలలో జోక్యం కలుగజేసుకొని వారిలోవారికి తగవులుపెంచి చివరకు యిరుపక్షాలవద్ద భూభాగాలను, ధనాన్ని కాజేసే కూటనీతిని కంపెనీవారు అనుసరించారు. ఇది రెండవదశ. 1757 ప్లాసీయుద్ధంతో మూడవదశ ప్రారంభమైందని చెప్పవచ్చు. బెంగాల్ నవాబైన సిరాజుద్దౌలా ఆంగ్లేయ వర్తకులకు వ్యతిరేకంగా బెంగాల్‌లోనూ, కలకత్తాలోనూ కొన్ని నిర్బంధాలను విధించాడు. అవి ఆంగ్లేయ వర్తకులకు కంటగింపుగా తయారయ్యాయి. అందుకని, రాబర్ట్‌క్లయివ్ సిరాజుద్దౌలా సేనాని మీర్జాఫర్‌తో కుట్రపన్నాడు. యుద్ధంలో ఇంగ్లీషువాళ్ళు గెలిచే పక్షంలో సిరాజుద్దౌలాను సింహాసన భ్రష్టునిచేసి, అతనిస్థానంలో మీర్జాఫర్‌ను నవాబుగా చేయాలనే ఒప్పందం జరిగింది. ఆవిధంగా 1757 లో జరిగిన ప్లాసీ యుద్ధంలో సేనాని మీర్జాఫర్ చేసినద్రోహం ఫలితంగా నవాబు ఓడిపోయి పారిపోయాడు. మీర్జాఫర్ నవాబుగా ప్రకటించబడ్డాడు. అతడు కంపెనీకి పారితోషికంగా బెంగాల్‌లో 24 పరగణాలనూ విపరీతమగు ధనకనక వస్తువాహనాలనూ బహూకరించాడు. బ్రిటిష్ సామ్రాజ్య భవనానికి ఈ విధంగా క్లయివు పునాదులు వేశాడు. నాటినుండి బ్రిటిష్‌వారు స్వతంత్ర భూభాగంపై సార్వభౌమాధికారం చెలాయించ నారంభించారు.

1763లో బక్సార్ యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో బెంగాల్ నవాబైన మీర్ఖాసింను ఇంగ్లీషువారు సునాయాసంగా ఓడించారు. 1765 లో అలహాబాద్ సంధి వల్ల ఈస్టిండియా కంపెనీకి బెంగాల్, బీహార్, ఒరిస్సాలపై దివానీ హక్కులు "సంక్రమించింది." ఈ హక్కువల్ల పై మూడురాష్ట్రాలలోకంపెనీ రెవెన్యూ వసూలుచేసే అధికారాన్ని సంపాదించింది. తత్ఫలితంగా ఆంగ్లేయ వర్తక సంఘానికి సాలీనా కొన్ని కోట్ల రూపాయలు నికరాదాయం రానారంభించింది. ప్లాసీ యుద్ధంవల్ల వారికి స్వతంత్ర భూభాగం దొరికింది. 1765నుండ ఆ భూభాగంమీద నికరాదాయం రానారంభించింది. ఈ విధంగా, వర్తకానికి వచ్చినవారు క్రమంగా రాజ్యపాలకులై మన నెత్తిన ఎక్కారు. 1800 సంవత్సరం నాటికి భారతదేశం బ్రిటిష్‌సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష దోపిడీకి కేంద్రంగా మార్చివేయబడింది. నాటినుండీ భారత ప్రజల రక్తాన్ని బ్రిటిష సామ్రాజ్యవాదులు జలగల్లాగ పీల్చనారంభించారు.

వెల్సీ ప్రవేశపెట్టిన సైన్య సహకార పద్ధతివల్ల కొంతమంది స్వదేశ సంస్థానాధీశుల కోరలు ఊడ పెరుకబడ్డవి. ఈ సైన్యసహకార పద్ధతి (Subsidiary Alliance) అంగీకరించిన సంస్థానాధీశుల రాజ్యాలలోకి బ్రిటిష్ సైన్యం ప్రవేశించి, కోటలలో పాగా వేసింది. సంస్థానాధిపతులు కోటల్లోనే కీలుబొమ్మలుగా తయారయ్యారు.

ఇట్టి అధిపతులలో కొందరికి డల్హౌసీ ప్రవేశపెట్టిన దత్తస్వీకార నిషేధపద్ధతివల్ల (Doctrine of Lapse) ఉద్వాసనజరిగింది. అలా ఉద్వాసన జరిగిన వారిలో కొందరికి డల్హౌసీ పెన్షనను మంజూరు చేశాడు. నానాసాహెబ్ లాంటి వారికి ఆ కొద్దిపెన్షన్లను కూడా ఎగవేయడంతో ఇంకేముంది—అగ్గికి గుగ్గిలం తోడైంది. నూనెకు నిప్పు అంటుకుంది.

అంతవరకు చంద్రకాంత శిలలతో నిర్మింపబడిన సుందర భవనాలలో విలాస జీవితాలను గడిపే సంస్థానాధీశులు పదచ్యుతు లవడంతో, వారు హఠాత్తుగా మేల్కొన్నారు. వీరికంటె ముందే మేల్కొన్న సిక్కు రాజు రంజిత్‌సింగ్, భారతదేశ పటాన్ని చూసి "అంతా ఎర్రబడిపోతోందే!" అని వ్యథచెందాడు.

డల్‌హౌసీ ప్రవేశపెట్టిన "దత్తస్వీకార పద్ధతి"వల్ల సతారా, నాగపూర్, సంబల్‌పూర్, ఉదయపూర్, జోధ్‌పూర్, ఝాన్సీ మొదలగు సంస్థానాలు బ్రిటిష్ వారిచే స్వాధీనం చేసుకోబడ్డాయి. అయోధ్య నవాబు దుష్ట పరిపాలకుడుగా తయారయాడనే సాకుతో అయోధ్యకూడా స్వాధీనం చేసుకోబడింది. నామమాత్రావశిష్టంగా ఉంటూ కీలుబొమ్మ ప్రభువుగా చలామణి అయ్యే మొగల్ పాదుషా పదవిని డల్‌హౌసీ రద్దుచేశాడు. పీష్వా బాజీరావు దత్తపుత్రుడైన నానాసాహెబ్‌కు యివ్వవలసిన పెన్షన్‌కి ఎగనాం పెట్టాడు. అందువల్ల నానాసాహెబు బ్రిటిష్ ప్రభుత్వానికి బద్ధశత్రువుగా తయారయ్యాడు. ఈవిధంగా డల్హౌసీ విధానంవల్ల అనేక

సంస్థానాలు సామ్రాజ్యంలో కలిపివేయబడ్డాయి. మొగల్ చక్రవర్తి పదవి రద్దయింది. భారతదేశంలోని పాలకవర్గాలలో చాలమంది స్థానభ్రష్టులయ్యారు. వారి హోదాలు ఎగిరిపోయాయి. ఆదాయం మాయమయింది. కాబట్టి పదభ్రష్టులైన సంస్థానాధీశులు, వారి సన్నిహితులు - హిందూ, ముస్లిం భేదం లేకుండా - తమ తమ హోదాలను తిరిగి సంపాదించుకొనే దృఢసంకల్పులయారు. కార్యరంగంలోకి దుమికారు. విదేశీయుల ప్రభుత్వాన్ని సర్వనాశనం చేసిననాడే తమ ప్రయోజనాలు రక్షింపబడుతవనే సత్యాన్ని గుర్తించారు. ఈ విధంగా భారతదేశంలో హిందూ ముస్లిం పాలకుల ప్రయోజనాలసాధనకూ, భారత స్వాతంత్ర్య సంపాదనకూ అవినాభావ సంబంధం ఏర్పడ్డది. బ్రిటిష్ వారు అనేక సంస్థానాలను స్వాధీనపరచుకొనడంతో ఉత్తమ పరిపాలనాదక్షులు, రాజనీతి విశారదులు అయిన భారతీయ ముఖ్యులు పదవీచ్యుతులుగావింపబడ్డారు. తాంతియా తోపే, అజిముల్లాఖాన్, మౌల్వీ అహమ్మద్ షా వంటి వ్యక్తులపేర్లను యిచట ఉదాహరించవచ్చు. వీరువిప్లవజ్వాలలకు ఆజ్యంపోశారు.

## సాంఘిక కారణాలు

హిందూ మహమ్మదీయులు తరతరాలనుండి అత్యంత పవిత్రంగా పరిగణించే సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, మత విశ్వాసాలు న్యూనపరచబడినవి. ఆంగ్లప్రభుత్వం సహగమనాన్ని, పసిపాపలను గంగలో పారవేసే ఆచారాన్ని నిషేధించింది. ఆంగ్లవిద్యావిధానాన్ని ప్రవేశపెట్టడంవల్ల యూరపియన్ సైన్స్, ఖగోళశాస్త్రం మొదలగు శాస్త్రాలు బోధించబడ్డవి. అవి సాంప్రదాయసిద్ధంగా వస్తున్న భారతీయ విశ్వాసాలను ఖండించాయి. భారతీయ పురాణేతిహాసాలను లార్డ్ మెకాలే ఒక వ్యాసంలో అతి నిశితంగా విమర్శించి, ఎగతాళిచేశాడు :

"ఆంగ్ల విద్యాభ్యాసం భారతీయుని ఆంగ్లేయునిగా మార్చివేస్తుంది. రక్తంలోను, రంగులోను, భారతీయుడుగా వున్నా, వేషభాషల్లో ఆచార వ్యవహారాలలో, ఆలోచనాక్రమంలో ఆంగ్లేయునిగా ఈ విద్యాభ్యాసం మార్చివేస్తుంది." (మెకాలే).

వేల మైళ్ళపొడుగున రైలుపట్టాల, తంతితీగల నిర్మాణం జరిగింది. ఇది సామాన్య భారతీయహృదయంలో అవ్యక్తమగు భీతిని, అనిర్వచనీయమగు భయోత్పాతాన్ని కలుగజేసింది. భారతమాత ఈ తీగెలచే ఈ బానిసబంధనాలచే - చుట్టబడుతోందనే అనుమానం ప్రబలింది. విధవా వివాహాలను ప్రవేశపెట్టడంతో, పరమ పవిత్రమగు హిందూకుటుంబ గౌరవమే సర్వనాశనమై పోయిందన్న క్రోధంతో పలువురు ఉగ్రులైపోయారు. తరతరాలనుండి అత్యంత పవిత్రంగా పరిగణించే సాంప్రదాయాలపై భయంకరమగు దండయాత్రగా వీటిని తలచారు నాటి ప్రజలు.



దీనితోపాటు, బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని క్రైస్తవదేశంగా మార్చేందుకు ప్రయత్నిస్తున్నదనే అభిప్రాయం ప్రజలలో నానాటికీ వృద్ధికాజొచ్చింది. దీనితో హిందూ ముస్లిములు ఒక్కుమ్మడిగా మేల్కొన్నారు. 1857 లో పార్లమెంటులో ఈస్టిండియా కంపెనీ అధ్యక్షుడు మాంగలెస్ యీ విధంగా అన్నాడు :

"భగవంతుడు బ్రిటిష్‌వారికి భారతజాతిపై అధికారమిచ్చి తద్వారా భారతావని అంతటా క్రైస్తవ పతాకను ఎగురవెయ్యాలని సంకల్పించాడు. కనుక మన సర్వశక్తులను ఒడ్డి క్రైస్తవమతంగూర్చి ప్రచారం చేయాలి."

ఇంతేగాక నాటి ప్రభుత్వం భారత ప్రభుత్వాదాయంనుంచి బిషప్పులకు, ఫాదరీలకు మతప్రచారం కొరకు పెద్దపెద్ద జీతాలిచ్చేది.

ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ విధానంవల్ల భారతదేశంలో కలిగిన ఫలితాలను గురించి మద్రాస్ కౌన్సిల్ సభ్యుడు మైకమ్ లూయిస్ యిలా వ్రాశాడు :

"భారతీయులకును, మనకును గల సంబంధం దాసులకు ప్రభువులకు వుండే సంబంధం తప్ప మరొకటి కాదు. మన భోగభాగ్యాలకు కావలసిన సర్వసంపదలను చేజిక్కించుకొన్నాం. వారిని సంస్కారహీనులుగా, ఆత్మజ్ఞానరహితులుగా చేసివేశాము. వారి మతధర్మాలను వారే మన్నింపకుండా వుండేటట్లు చేశాం. వారి వారసత్వపు నియమాలను తారుమారు చేశాం. గవర్నమెంట్ పత్రాలలో వారిని నాస్తికులుగా వ్రాశాం. వారి జమీందారీలను మ్రింగివేశాం."

## సైనిక కారణాలు

అన్నిటికన్న సైనిక కారణాలు విప్లవానికి ప్రధాన కారణాలుగా కన్పిస్తున్నవి. హిందూ మహమ్మదీయ

సిపాయిలు తమ మతం, ధర్మం, ఆచారం, సాంప్రదాయం, జీవనస్థితి అన్నీ క్రమంగా అడుగంటిపోతున్నవని దృఢంగా నమ్మారు. వారీవిధమగు అభిప్రాయానికి రావడానికి కారణం నాటి బ్రిటిష్ ప్రభుత్వపు చర్యలే.

"యుద్ధంలేని సమయంలో సైనికులకు తీరుబడి ఎక్కువ. అజ్ఞానులైన హిందూ ముస్లిం సైనికులకు క్రైస్తవమత సిద్ధాంతాలను నూరిపోయు కరపత్రాలను పంచేవారు. సైన్యం మత ప్రచారానికి చక్కని క్షేత్రంగా ఉపయోగపడింది. మొదట సిపాయిలు వీటినిగూర్చి ఉపేక్షతో వున్నా, రానురాను వారిలో మతం మార్పు ప్రారంభమైంది. దీనిని గుర్తించిన సిపాయిలలో కలవరం హెచ్చింది." (Causes of Indian Revolt.)

జీతాలలోని వ్యత్యాసంకూడా ఒక కారణమే. భారతీయ సిపాయి సుబేదారు వుద్యోగం చేసినా నెలకు 174-రూకలే గిట్టేవి. కాని కొత్తగా చేరిన ఆంగ్ల సైనికుడు యింతకంటె అధిక మొత్తాన్ని సంపాదించేవాడు. "నాలుక తోక బెత్తెడే" అన్నట్లు, ప్రమోషన్లు లేక జీవితాంతం తక్కువ వుద్యోగాల్లోనే భారతీయ సిపాయిలు బ్రతకాల్సివచ్చేది. సైనిక కవాతు చేసేటపుడు సిపాయిని బ్రిటిష్ మిలటరీ ఆఫీసర్లు బండబూతులు తిట్టేవారు. సైన్యంలో చేరేటపుడు దేశంలోనే పనిచేయాలిగాని విదేశాల్లో పనిచేయవలసిన అగత్యం లేదని సిపాయిలకు బ్రిటిష్ ప్రభుత్వం మొదట వాగ్దానం చేసింది. తర్వాత బ్రిటిషు ప్రభుత్వానికి బర్మాతో యుద్ధం వచ్చింది. 1824 లో బారక్‌పూర్‌లోని సిపాయిలను ప్రభుత్వం బర్మా వెళ్ళవలెనని ఆజ్ఞాపించింది. సిపాయిలు నిరాకరించారు. అందుకని గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ 1856 లో "జనరల్ సర్వీసు ఎన్‌లిస్టుమెంటు చట్టం" ఒకటి చేసి, సైన్యంలోని ప్రతి సిపాయి అవసరమైతే విదేశాలకు పోవలసిందేనని ఆజ్ఞలు జారీచేశాడు. సముద్రాంతర ప్రయాణం హిందూ సాంప్రదాయానికి విరుద్ధం. ఈ విధంగా ప్రభుత్వం తన పూర్వ వాగ్దానాలను భంగపరచింది. తిరుగుబాటు వచ్చేనాటికి ప్రభుత్వ సైన్యంలో 2,23,300 మంది భారతీయ సిపాయిలు, 45,322 మంది బ్రిటిష్ సైనికులు వుండేవారు. ఇంత అధిక వ్యత్యాస ముండటంవల్ల ప్రభుత్వాన్ని ఒక్క దెబ్బతో నాశనం చేయవచ్చుననే విశ్వాసం సిపాయిలలో గాఢంగా నాటుకుంది.

అగ్రవర్ణాలకు చెందిన బ్రాహ్మణులు, రాజపుత్రులు అత్యధిక సంఖ్యలో వుండే బెంగాల్ రెజిమెంటును కంట్రోల్ చేయటం చాల కష్టమైంది. 1824 లో బారక్‌పూర్‌లో సిపాయిలు బర్మాకు వెళ్ల నిరాకరిస్తే 1844 లో బెంగాల్ సిపాయిలు ఏ విదేశానికీ వెళ్ళబోమని ధిక్కరించారు. ఈ విధముగా తిరుగుబాటు తత్వం సిపాయిలకు అలవాటైంది.

సైనిక కారణాలన్నిటిలోకి ప్రధానమైనది తూటాల వ్యవహారం. కొత్తగా కనిపెట్టబడిన ఎన్‌ఫీల్డు రైఫిల్‌కి నునుపైన తూటాలు అవసరమయ్యాయి. హిందువులకు పరమ పవిత్రమైన గోవునూ, ముస్లిములకు పరమ అసహ్యకరమైన పందినీ చంపి – ఆవు, పంది క్రొవ్వులతో తూటాలను నునుపుచేసి సైనికులకు యివ్వనారంభించారు. కాల్చేముందు సిపాయిలు తూటా మూతిని కొరకాలి. ఈ విషయం హిందూ మహమ్మదీయ సిపాయిలకు తెలిసింది. నివురు గప్పిన నిప్పులావున్న సైనికుల క్రోధాగ్ని కట్టలు తెంచుకొని మహోగ్ర దావానలంలా ఆ సేతుహిమాచలం వ్యాపించింది. ఈ తూటాల వ్యవహారం ఎంత ప్రధానపాత్ర వహించిందో చూడండి:

"కొన్ని రాజ్యాలను తిరిగి వశపరచుకోడం, ఆంగ్లభాషను వ్యాప్తిచేయడం, స్త్రీలకు చదువునేర్పడానికి ప్రయత్నించడం, జ్ఞానాన్ని పెంపొందించడం, రైల్వేలను, టెలిగ్రాఫులను నిర్మించడం – యివిమాత్రమే చాలవు, లక్షమంది సిపాయిలు అమానుషంగా తిరుగుబాటు చేయడానికి. ఇతర కారణాలన్నిటినీ కలిపినా యివి సరిపోవు. క్రొవ్వు తూటాల గాధ కలిగించిన ఆవేశం ఒక్కటే యిందుకు సరిపోయింది." (డాక్టర్ మార్ష్‌మన్)

తూటాల వ్యవహారం అబద్ధమని కొంతమంది ఆంగ్లేయ చరిత్రకారులు బుకాయించినా, తరువాతి పరిశోధనవల్ల, నిజమనే విషయం తేలింది. "తూటాలను నునుపుగా చేయడానికి చేర్చబడ్డ వస్తువులలో ఆవుక్రొవ్వు ఉందనడానికి కట్టి సందేహం అక్కర్లేదు," అని వ్రాశాడు సర్ జాన్ లారెన్స్.

నాటి భారతీయ సిపాయిలు తిరుగుబాటుకు సంబంధించిన వ్యవహారాలను రహస్య కరపత్రాల ద్వారా, ఒకరికొకరు అందజేసుకొనేవారు. ఇలాంటి కరపత్రం ఒకటి ప్రమాదవశాత్తు ఇంగ్లీషు ఆఫీసర్ల చేతిలోపడింది. అందులో యిలా వుంది:

"సోదరులారా, మనం విదేశీయుల కరకుకత్తులతో మన గుండెకండలను స్వయంగా కోసు

కొంటున్నాం. తోడిసోదరుల అమాయకపు గుండెల్లో పొడుస్తున్నాం. మనం ధైర్యంతో నిలబడ గల్గితే, మన మాతృభూమిని రక్షించుకొనగలం. కలకత్తా మొదలు పెషావరువరకూ ఏకచ్ఛత్రాధిపత్యం సాగించగలం. సిపాయిలమైన మనం, తిరుగుబాటుదార్లమైతే మరుక్షణంలోనే పారతంత్ర్యపు మబ్బులు విచ్చిపోయి, స్వాతంత్ర్య భానుడు ఉదయిస్తాడు. స్వాతంత్ర్య పిపాసులైన భారతప్రజలు స్వేచ్ఛాకమలం చుట్టూ వేయిరేకులై నిలబడుతారు. అప్పు డీవ్యూహపద్మమందలి స్వాతంత్ర్య మకరందాన్ని ప్రజాసామాన్యం అనుభవిస్తుంది."

రాత్రిళ్ళు రహస్యంగా సభలు చేసేవారు. వారికి తోచిన నిర్ణయాలు తీసుకుంటుండేవారు. డల్‌హౌసీ అయోధ్యను స్వాధీనపరచుకున్న తర్వాత అయోధ్య నవాబుక్రింద పనిచేసే వేలకొలది సిపాయిలకు ఉద్యోగాలు పోయినవి. వారంతా పొట్టకోసం దోపిళ్ళు ప్రారంభించారు. ఏనాడు ఎలాంటి అవకాశ మొచ్చినా—ఈ నిరుద్యోగులైన సిపాయిలు ఆ అవకాశాన్ని వినియోగించుకొన సిద్ధంగావున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే, అయోధ్య నవాబేకాదు... ఆ సంస్థానానికి చెందిన సిపాయిలుకూడా అసంతృప్తితో నిండి, ఎలాంటి అపాయకర కార్యాలకైనా సంసిద్ధు లయ్యారు.

## ఆర్థిక కారణాలు

పేష్వ బాజీరావు బ్రతికియుండగానే బ్రిటిష్ వారు ఆయన రాజ్యాన్ని స్వాధీనంచేసికొని, సాలీనా 8 లక్షల రూపాయలు పింఛనుగా యిచ్చుటకు అంగీకరించారు. కాని అతని దత్తపుత్రుడైన నానాసాహెబ్‌కు యివ్వడం మానివేశారు. అప్పుడు నానా అజిముల్లా ఖాన్ అను వ్యక్తిని తన తరఫున వ్యవహారం నడిపేందుకు ఇంగ్లండు పంపాడు. కాని ఫలితం శూన్యం. కడుపుమండిపోయిన నానా, గత్యంతరంలేక కత్తి పట్టాడు.

మహారాష్ట్ర దేశంలోని ఝాన్సీ సంస్థాన పరిపాలకుడు 1853 లో మరణించాడు. అతని భార్యయైన లక్ష్మీబాయి పరిపాలకురాలు ఐంది. కాని డల్హౌసీ ప్రవేశపెట్టిన దత్తస్వీకారపద్ధతికి ఈ సంస్థానం ఆహుతైంది. సాలీనా లక్ష్మీబాయికి నగదురూపంలో 60 వేల రూపాయలు యిస్తామన్నారు. సంస్థానాన్ని కలిపివేసుకొన్నపుడు ఈమె కొంత అసంతృప్తి చెందినా, శాంతంగానే వుంది. కాని, నగకిచ్చే 60 వేల నుండి బ్రిటిష్ ప్రభుత్వం తన భర్త-బాకీలను తీర్చుకుందుకు కొంత ధనం తగ్గించివేసింది. సంస్థానమూ, దాంతోపాటు ఆదాయమూ రెండూపోయే పరిస్థితి ఏర్పడింది. బ్రిటిష్‌వారిని దేశాన్నుండి తరిమివేసిననాడే తన ఉనికికీ సంస్థాన భద్రతకూ రక్షణ యేర్పడుతుందని తలచి, లక్ష్మీబాయి సమరానికి నాయకత్వం వహించింది. "ఇండియన్ బోడీషియా", "ఇండియన్ జోన్ ఆఫ్ ఆర్క్" అని ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన ఈ వీరవనిత కాళికాదేవివలె మహోగ్రరూపం దాల్చి సమరంలో పాల్గొన్నది.

రాణా కుమారసింహ జగదీశ్‌పూర్ రాజ కుటుంబానికి చెందినవాడు. డల్హౌసీయొక్క దత్తస్వీకార నిషేధపద్ధతి ఈయన సంస్థానాన్ని కూడా మింగివేసింది. దానితోపాటు ఆదాయం కూడా అదృశ్యమైంది. 80 సంవత్సరాల వయస్సులో వుండికూడా యితడు కత్తిపట్టి కసితో శత్రువును చెండాడాడు.

రైతులవద్ద సాంప్రదాయసిద్ధంగా రెవెన్యూవసూలు చేసే భూస్వాముల హక్కును బ్రిటిష్ ప్రభుత్వం కాలరాచింది. జమీందారుల చేతిలోవున్న భూములను లార్డ్ బెంటింక్ స్వాధీనపరచుకొని వాటిని యితరులకు కౌలుకిచ్చాడు. తద్వారా ప్రభుత్వాదాయాన్ని హెచ్చించాడు. ఈ భూముల స్వాధీనంవల్ల ఎంతోమంది జమీందార్లు పదవీభ్రష్టులయ్యారు. ఈనాముల కమిషన్ 20 వేల ఎస్టేట్లను స్వాధీనపరచుకొంది. వారంతా అసంతృప్తితో మండిపోయారు.

ఈ స్వాతంత్ర్య సమరానికి అయోధ్య అత్యంత ప్రధానమైన కేంద్రంగా వున్నట్లు కన్పిస్తోంది. దీనికి కారణం లేకపోలేదు. కరణం మునసబుల్లాగ సాంప్రదాయ సిద్ధంగా వుండే తాలూక్‌దార్లు అనే వర్గం ఒకటి అయోధ్య సంస్థానంలో వుంది. ఈ తాలూక్‌దార్లు రెవెన్యూ వసూలుచేసి బ్రిటిష్ ప్రభుత్వానికి కట్టేవారు. అయోధ్య ప్రధాన రంగస్థలంగా వున్నా, ఈవర్గం విప్లవాన్ని మొదట సమర్థించలేదు. కాని నాటి గవర్నర్‌జనరల్ అయిన లార్డ్ కానింగ్ వీరిని ఉద్యోగాలనుండి ఊడబెరికాడు. ఆస్తీ, ఆదాయం రెండూ పోయిన వీరు కడుపుమండి విప్లవజ్వాలలకు ఆజ్యంపోశారు. ఈవిధంగా సంస్థానాధిపతులు, జమీందారులు, రెవెన్యూ వసూలుచేసే తాలూక్‌దార్లు అందరూ పదవీభ్రష్టు లయ్యారు. మరిపట్టి సమరాంగణంలోకి దూకారు.

సమరానికి నాయకత్వం వహించిన పాలకవర్గంలో

పాటు, నాటి సామాన్య ప్రజలు కూడా భయంకరమైన కష్టనష్టాలకు గురిచేయబడ్డారు. చేనేతపనివాండ్రు, కర్షకులు, చిన్న వర్తకులు, సామాన్య ప్రజలు కరువు కాటకాలలో, దారిద్ర్యపు టూబిలో, పైశాచికపీడనలో, అడవి మృగాల క్రూరత్వాన్ని మరపించు రాక్షసపాలనలో, ఎండి మాడి అతినికృష్టమైన బ్రతుకు బ్రతకవలసి వచ్చింది.

క్రీ. శ. 1600 లో స్థాపింపబడ్డ ఈస్టిండియా వర్తక సంఘం దేశంలో వ్యాపారం చేసుకొనేందుకు స్వదేశ రాజుల, నవాబులవద్ద అనుమతి పత్రాలు పొంది క్రమంగా వర్తకంతో పాటు ప్రభుత్వాన్ని కూడా స్థాపించుకొంది. 1600 లో స్థాపింపబడ్డ వర్తకసంఘం 1698 లో అదృశ్యమై కొత్తఈస్టిండియా వర్తకసంఘం వచ్చింది. అది 1708 వరకు సమగ్రస్వరూపాన్ని పొందలేదు. "భారతదేశాన్ని జయించిన ఈస్టిండియా కంపెనీ పారిశ్రామిక విప్లవంలో ఇంగ్లండును గుప్పిటలో పెట్టుకొన్న పాలకవర్గపు గుత్త వ్యాపార సంస్థ అని బోధపడుతుంది." (పామీదత్ : నేటి భారతదేశం - పేజి 109).

మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైన పిదప, 18 వ శతాబ్దిలో జరిగిన అంతర్యుద్ధాలను అవకాశంగా తీసుకొని విదేశ దురాక్రమణదారులు (ఈస్టిండియా కంపెనీ సాహసికులు) కుట్రలద్వారా, కూహకాలద్వారా, యుద్ధాలద్వారా భారతదేశంలో స్వతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించారు. 1757 లో జరిగిన ప్లాసీయుద్ధం యిందుకు అంకురార్పణ అని అర్థంచేసుకోవచ్చు.

1757 లో జరిగిన ప్లాసీయుద్ధం, భారతదేశ చరిత్రలో అనేక మార్పులకు కారణమవడమేగాక, బ్రిటిష్ జాతియొక్క ప్రపంచాధిపత్యానికి కూడ దోహదం చేసింది. 1760 లో ఇంగ్లండులో ప్రారంభమయిన పారిశ్రామిక విప్లవంవల్ల కొత్తగా కనుగొనబడిన నూత్నయంత్రసామగ్రికి అవసరమైన బ్రహ్మాండమగు పెట్టుబడి ప్లాసీ విజయంద్వారానే లభించింది.

"ప్లాసీయుద్ధం 1757 లో జరిగింది. ఆ తర్వాత జరిగినంత తీవ్రమైన మార్పు ముందెన్నడూ బహుశా జరగలేదు...............................
.........ఈ యంత్రాలన్నీ కాలగతిని ముందుకు నడిపే సాధనాలయినప్పటికీ, ఆ కాలగతికి కారణంమాత్రం యివికావు. వట్టి యంత్రాలను కనిపెట్టడంలోనే ఏమీలేదు. ఇలాంటి ముఖ్యమైన యంత్రాలు ఎన్నో శతాబ్దాలుగా మూలబడి వున్నాయి. వాటిని నడిపే బలవచ్ఛక్తికోసం అవి వేచివున్నాయి. ఆ బలవచ్ఛక్తి డబ్బు. ఆ డబ్బు కూడా, దాచినదికాక మారకంలో వుండాలి. భారతదేశ ధనప్రవాహం రాకముందు, తద్వారా పరపతి పెరగకముందు, అలాంటి బలవత్తరమైన సమగ్రశక్తి లేదు. **ప్రపంచం పుట్టినప్పటినుండి ఏ పెట్టుబడికూడా భారతదేశ దోపిడీవల్ల వచ్చినంత లాభాన్ని ఎక్కడా సంపాదించి వుండదు.** సుమారు 50 ఏళ్లు బ్రిటన్ పోటీ లేకుండా నిలవగలిగింది. (1694-1757 వరకు) కాని తర్వాత ఆదాయాభివృద్ధి 1760 - 1815 మధ్య అతివేగంగా, అఖండంగా సాగింది." (నాగరికతయొక్క సూత్రాలు - దాని వినాశనం; బ్రూక్స్ ఏడమ్ పేజి 259-60)

పరమ పైశాచికంగా, జలగలు రక్తం పీల్చినవిధంగా దోపిడీచేసి, ఆ వచ్చిన ధనాన్ని ఇంగ్లండు పారిశ్రామికీకరణకు వినియోగించారు. ఈ విధంగా దోపిడీ చేయబడిన ధనమే పెట్టుబడి కేంద్రీకరణకు దోహదంచేసింది; బ్రిటన్‌లోవచ్చిన పారిశ్రామిక విప్లవం విజయవంతమయేందుకు దోహదమిచ్చింది.

1763 లో జరిగిన బక్సర్‌యుద్ధం ఫలితంగా ద్వంద్వ ప్రభుత్వం ఏర్పడింది. సివిల్, క్రిమినల్ పరిపాలన మొగల్ చక్రవర్తిది. రివెన్యూ వసూలుచేసేది కంపెనీ వారు. కంపెనీవర్తకులు ఈ ద్వంద్వప్రభుత్వపు మేలి ముసుగులో అడ్డూ ఆపూలేని విధంగా దేశాన్ని దోచుకున్నారు. చేజిక్కిన ప్రభుత్వాధికారాన్ని తప్పుడు మార్గంలో వినియోగించి కొద్దికాలంలోనే లంచాలు, "బహుమతులు", "బలవంతపు బ్రాహ్మణార్థాలు" రూపంలో లక్షల ధనాన్ని సంపాదించారు. చిల్లిగవ్వయినా చేతలేకుండా భారతదేశానికి వచ్చిన రాబర్టు క్లయివు "లార్డు క్లయివు"గామారి 2½ లక్షల పౌనుల ధనాన్ని సంపాదించాడు. కంపెనీ ఉద్యోగుల, వర్తకుల, గుమాస్తాల సంగతి చెప్పనక్కరలేదు.

"నాలుగోవంతు వెల మాత్రం యిచ్చి వారు రైతులవద్ద, వర్తకులవద్ద ఉన్న సరకును, వస్తువులను బలాత్కారంగా తీసుకొనిపోతున్నారు. హింసను, నిర్బంధ విధానాన్ని ఉపయోగిస్తూ, రైతులు మొదలైనవారినుండి ఒక రూపాయి వెలగల వస్తువుకు ఐదు రూపాయలు లాక్కుంటున్నారు". (ఇంగ్లీషు గవర్నరుకు బెంగాలు నవాబు నివేదిక. మే 1762).

ఇలాగే విలియం బోల్ట్సు అనే బ్రిటిష్‌వ్యాపారస్థుడు 1772 లో యిలా వ్రాశాడు :

"ఇంగ్లీషువారు తమ గుమాస్తాల, వర్తకుల ద్వారా, నిరంకుశంగా ఏయే ఉత్పత్తిదారు ఎన్నెన్ని వస్తువులు యివ్వాలో, వాటికి ఎంత ఖరీదివ్వాలో కూడా తామే నిర్ణయించేవారు.........కంపెనీ వర్తకులు యిచ్చిన డబ్బును (ధర), సాలివారు నిరాకరిస్తే వారిని ముక్కోణానికి కట్టి కొరడాలతో కొట్టి పంపించేవారని తెలుస్తోంది......ఈ కంపెనీ గుమాస్తాలశాఖలో వున్న వంచకత్వం, మోసం ఊహాతీతం. ఇవన్నీ పేదసాలీని మోసంచేసేందుకే. గుడ్డల పరిశీలకులలో చేరి, ఈ కంపెనీ గుమస్తాలు నిర్ణయించే వెలలు అన్నిచోట్ల నూటికి 15 వంతులు (15%), కొన్నిచోట్ల 40 వంతు స్వయంగా వారు బజారులో అమ్ముకుంటే వచ్చే ధరలకన్నా తక్కువగా వుండేవి." (భారతదేశ వ్యవహారాల పరిశీలన : విలియం బోల్ట్సు—పేజి 191-194.)

ఇది వర్తకం కాదు. పట్టపగటి దోపిడీ వీరు వర్తకులు కారు; పచ్చి దోపిడీదారులు; నరరూప రాక్షసులు. అంతేకాదు. ఈ దోపిడీదారులు, తాము అమ్మే సరకులమీద ప్రభుత్వానికి చిల్లిగవ్వకూడా పన్నురూపంలో చెల్లించేవారు కాదు. కంపెనీ వర్తకులు తమకిష్టంవచ్చిన ధరలకు సరకులను కొనేవారు; అమ్మేవారు. ఒప్పుకోకపోతే అసహాయులు, అమాయకులుఐన ప్రజలను తంతాదని బెదిరించి భయపెట్టేవారు. బాధ్యతా రహితమగు అధికారం (power without responsibility) చలామణీ అయిన ఆ కాలంలో, కంపెనీ నిరంకుశత్వం హిమాలయ శిఖరాలను అందుకొంది.

"సరకుల క్రయవిక్రయాల మీద వారు టోల్ డ్యూటీ చెల్లించనవసరం లేకుండా మినహాయింపబడ్డారు. నిస్సహాయులైన ప్రజలను తాము నిర్ణయించిన ధరలకు వస్తువులు కొనేటట్లు, అమ్మేటట్లు ఒత్తిడితీసుకురావడానికి భయభ్రాంతులోనర్చారు. ఈ విధంగా బాధ్యతలేని అధికారం, క్రమబద్ధమైన దోపిడీ విశృంఖలంగా అమలుజరిగేశకం ప్రారంభమైంది."

1770 లో బెంగాలులో కరువువచ్చింది. దీనిలో కోటిమంది ప్రజలు చనిపోయినట్లు అంచనా వేయబడింది. ఐనప్పటికీ భూమిపన్ను నిర్దయగా ఖచ్చితంగా వసూలు చెయ్యడమేగాక ఎక్కువపన్ను వసూలుచేశారని 1771 లో కంపెనీ నివేదికలోనే చెప్పబడింది.

1784 లో పిట్స్ఇండియా బిల్లును పార్లమెంటుసభలో ప్రవేశపెట్టబడిన తీర్మానంలో యిలా వుంది :

"ఈస్టిండియా కంపెనీ తమఉద్దేశాలనే రాకీయంగా, వర్తకరీత్యాకూడ ఉల్లంఘించుటలు చేసి కల్మషభరితమైపోయిందని పార్లమెంటు విచారణ వల్ల తేలింది. ...............ఇప్పుడు సర్వ సౌభాగ్యవంతమైన దేశాలు అసమర్థ శిథిల జన విహీన దేశాలుగా, అధమస్థితికి వచ్చాయి."

అంతేకాదు. ఈస్టిండియా కంపెనీ పాలన మానవ చరిత్రలోనే కని విని యెరుగని మహత్తర ప్రజాక్షేమ కార్యాలను చేస్తున్నదనే ఆత్మస్తుతులకు సమాధానంగా కార్నివాల్ లెవిస్ యిలా అన్నాడు :

"1765-84 వరకున్న ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వంకంటె ఘోరమైన, కుళ్ళి గబ్బుకంపు కొడుతున్న, నీచమైన, క్రూరమైన యింకే నాగరిక ప్రభుత్వమూ ప్రపంచంలో ఏ కాలంలోనూ ఉండలేదు."

1765 లో అలహాబాద్ సంధి ఫలితంగా అమలులోకి వచ్చిన ద్వంద్వ ప్రభుత్వాధికారాన్ని పురస్కరించుకొని, కంపెనీ వర్తకులు రెవెన్యూ పన్నును ఎంత దారుణంగా వసూలుచేశారో చూడండి. రైతుయొక్క విత్తనాల గింజలు, కాడీ మేడీ, తాడూ పేడూ, చివరికి పెళ్ళాం మెడలోని పుస్తెతోసహా ఒలిచి పన్నులు వసూలుచేశారు. బెంగాలును పరిపాలించిన కడపటి భారతీయ సుల్తాను - సిరాజ్ ఉద్దౌలా పాలించిన చివరి సంవత్సరంలో వసూలుచేసిన భూమి పన్ను (1764-65) 8,17,000 పౌన్లు. కంపెనీ "వర్తకుల" వెన్నెలాంటి అతిచల్లని పాలనక్రింద 1765-66 లో 14,70,000 పౌన్లు. 1771-72 లో 23,41,000 పౌన్లు; 1775 - 76 లో 28,18,000 పౌన్లు; 1793 లో 34,00000 పౌన్లు వసూలుచేశారు. 1789 లో లార్డ్ కారన్‌వాలీస్ ఇండియానుగూర్చి వ్రాస్తూ యిలా అన్నాడు :

"హిందుస్థానంలో కంపెనీ ప్రభుత్వంక్రింద వున్న ప్రాంతంలో మూడోవంతు నేడు కేవలం క్రూరమృగాలు మాత్రం నివసించే కీకారణ్యమైపోయిందని నిస్సందేహంగా చెప్పవచ్చు."

## చేతిపరిశ్రమల వినాశం

ఈ విధంగా ఒకవైపు వ్యవసాయం నాశనం చేయబడుతోంటే, మరోవైపు చేతిపరిశ్రమలు - ప్రధానంగా చేనేత పరిశ్రమ - సర్వనాశనం చేయబడింది.

1813 లో బ్రిటిష్ పారిశ్రామికుల దోపిడీద్వారానే బ్రిటిష్ ఎగుమతులు 3,86,152 పౌన్లనుండి 80,24,000 పౌన్లకు హెచ్చాయి. ఈ దోపిడీ 1780-1850 సంవత్సరాల మధ్య జరిగింది.

తత్ఫలితంగా, భారతదేశ ఆర్థికవ్యవస్థ అన్నివిధాల ధ్వంసం చేయబడింది. 1814 లో బ్రిటన్‌నుండి భారతదేశానికి పదిలక్షల గజాలకంటె తక్కువగానే బట్టలు దిగుమతి అయ్యాయి. కాని, రానురాను ఈ దిగుమతులు శిఖరాలను అంటుకొన్నవి. గులాబీరేకుల మార్దవం, సొగసు కలిగిన ఢాకా మస్లిన్‌లతో, చీని చీనాంబరాలతో రోమన్ సౌందర్యవతులను ఆకర్షింపజేశారు మన చేనేతగాండ్రు. రోమ్‌నుండి మణుగుల కొలదీ బంగారాన్ని తీసుకురాగలిగారు. ఒకనాడు నాగరిక ప్రపంచానికంతటికీ గుడ్డను సప్లయిచేసిన భారతదేశం 1850 నాటికి బ్రిటిష్‌గుడ్డల ఎగుమతుల్లో నాల్గోవంతును దిగుమతిచేసికొనే దౌర్భాగ్యస్థితికి దిగజారింది. దీన్నిబట్టి మన చేతిపరిశ్రమలు ఎంతసమగ్రంగా, ఎంతదారుణంగా విధ్వంసం చేయబడ్డాయో ఊహించవచ్చు

1818—1836 వరకు భారతదేశానికి బ్రిటిష్ ఎగుమతులు ఒకటికి 5200 వంతున పెరిగాయి. 1824 లో భారతదేశానికి బ్రిటన్ ఎగుమతిచేసిన గుడ్డలు కేవలం 60 లక్షల గజాలు మాత్రమే. మరి 1837 లో అది 6 కోట్ల 40 లక్షల గజాలకు పెరిగింది! ఆ దేశమయంలో ఢాకా జనసంఖ్య 1,50, వేల నుండి 20, వేలకు తగ్గింది. కరువు చేనేతపనివారిని అడవుల్లోకితరిమివేసింది. మిగిలినవారిని మింగివేసింది అందుకనే, 1834 లో గవర్నర్ జనరల్‌గా వున్న లార్డ్ విలియం బెంటింక్, భారతీయ నేతగాండ్ర ఎముకలు భారతదేశ మైదానాలను చలవచేస్తున్నాయని వ్రాశాడు.

భారతదేశంలో తయారైన వస్తువులను మొదట ఇంగ్లండుకు రాకూడదనీ, తర్వాత యూరపుకే రాకూడదనీ నిషేధించి, తద్వారా భారతదేశ వస్త్ర వ్యాపారాలను నిర్మూలనం చేశారు. 18 వ శతాబ్దంలో ఇండియానుండి ఇంగ్లండుకు ఎగుమతిచేసిన ద్రవ్యం అంతా ప్రత్యక్ష దోపిడీమూలంగా వచ్చినదే. వ్యాపారంద్వారావచ్చిన డబ్బు చాల తక్కువ. ఎన్నో శతాబ్దాల నుండి హిందూ మహమ్మదీయ పాలకులు కాపాడిన ఎన్నో నీటివనరులను, బాటలను ఉదాసీనతతో నాశనం చేశారు.

"హిందూస్థానంపై బ్రిటిష్‌వారు విధించిన దుస్థితి పూర్వం హిందూస్థానం పడిన బాధ లన్నిటికన్నా పూర్తిగా భిన్నమైనదీ, తీవ్రమైనదీను. ఇందులో అనుమాన మేమాత్రం లేదు. ఆసియా నిరంకుశవిధానంపై బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ స్థాపించిన యూరపియన్ దోపిడీవిధానం సాల్‌సెట్టీ దేవాలయంలో తన రాక్షసత్వంతో ప్రత్యక్షమవుతుంది." (కారల్ మార్క్స్.)

హృదయ విదారకమగు పన్నులు, బందిపోటు దొంగలను మరపించు ప్రత్యక్ష దోపిడీ, తత్ఫలితంగా సర్వసమగ్రంగా విధ్వంసంచేయబడ్డ వ్యవసాయం, చేతిపరిశ్రమలు – ఇవే వందసంవత్సరాల (1757-1857) కంపెనీ పాలనవల్ల కలిగిన ఫలితాలు.

సర్వసంపదల కాలవాలమై, సహజ సంపదలకు పుట్టినిల్లయి, రత్నగర్భ అని పేరుపొందిన భారతదేశం సహారా ఎడారిగా మారిపోయింది. విదేశ పాలకులు ప్రజల మూలుగులను పిల్చివేశారు. సస్యశ్యామలమై కళకళలాడుతూన్న పచ్చని పొలాలు, గడ్డి గాదంతో, బీళ్ళుగా మారిపోయాయి. స్వయం సంపూర్ణ గ్రామ వ్యవస్థ నాశనం గావింపబడింది. ఇలాంటి ఆర్థిక పరిస్థితులలో 1857 స్వాతంత్ర్యసమరం జరగడంఆశ్చర్యకరం కాదు.



# సమరానికి సన్నాహాలు

## బండ్లపల్లి ఓబులరెడ్డి

వంద సంవత్సరాలుగా మనదేశంలో పాదుకొనివున్న బ్రిటిష్ పెత్తనాన్ని తుదముట్టించడమెలాగన్నది భారతీయులను కలతపెట్టింది. ఆర్థికదాస్యంతోపాటు రాజకీయ దాస్యం అన్నివర్గాల ప్రజల్లో అసంతృప్తిని రగుల్కొలిపింది. అగ్నిలో ఆజ్యం పోసినట్లు, పరాయి పెత్తనం మూలంగా జాతీయ సంప్రదాయాలన్నీ ఒక్కొక్కటే మంటగలుస్తున్నాయి. వాటిస్థానంలో వింత వింత సంప్రదాయాలను ప్రవేశపెడుతున్నారు.

1853 లో తుపాకి తూటాలు తయారుచేసే ఫ్యాక్టరీని బ్రిటిష్‌వారు కొత్తగా నెలకొల్పారు. ఆవురక్తం, పందికొవ్వు అందుకు ఉపయోగించారు. సిపాయిలలో ముస్లింలూ, హిందువులూ వున్నారు. పొట్టకూటి కోసం స్వధర్మాన్ని మంటకలుపుకోవలసిన పరిస్థితి వారికి యేర్పడింది. కొత్త తూటాలను ఉపయోగించబోమని సిపాయిలు ఖచ్చితంగా చెప్పారు. అందుకు బ్రిటిష్ అధికారులు అనేకమందిని హింసించారు.

ఆవు రక్తమూ, పందికొవ్వూ తూటాలకు ఉపయోగించడం దేశీయాచారాలకు వ్యతిరేకమని బ్రిటిష్‌వారికి తెలుసు. అయినప్పటికీ బుద్ధిపూర్వకంగానే అలా ఉపయోగించినట్లు వారి వ్రాతలనుబట్టి తెలుస్తున్నది.

డల్హౌసీ భారతీయులకు దత్తతాధికారాన్ని లేకుండా చేయడంతో దేశంలో పెద్ద సంచలనం బయలుదేరింది. బిఠూరులో పీష్వా నానాసాహెబ్‌ను ఇది చాల కలత పెట్టింది. బ్రిటిష్‌వాళ్ళను తరిమివేసి స్వాతంత్ర్యం సాధించుకోవాలనే నిశ్చయానికి అతడు వచ్చాడు. స్వాతంత్ర్య సాధనానంతరం అన్ని సంస్థానాధీశ్వరులతోను భారత సంయుక్త రాష్ట్రాలను స్థాపించాలని ఆయన ఉద్దేశం. ఐక్యపోరాటం, స్వాతంత్ర్యసాధన ఆయన నినాదం. మహమ్మదీయులు, హిందువులు అన్నదమ్ములని ఆయన భావం.

ఇందుకోసం అనేక ప్రాంతాల్లో రహస్య సంస్థలు నెలకొల్పబడ్డాయి. వానిలో బిఠూర్ సంస్థ ఒకటి. దానితరఫున విప్లవంలో పాల్గొనవలసిందిగా నానాసాహెబ్ అనేక సంస్థానాధీశ్వరులకు జాబులు వ్రాశాడు. రాజకీయ ప్రచారకులతో కబురు పంపించాడు. దత్తతాధికారాన్ని బ్రిటిష్‌వారు రద్దుచేయడం దురన్యాయమని దేశమంతటా చాటాడు. ఈ సందర్భంలో మైసూరు సంస్థానాధీశ్వరుని వద్దకు వచ్చిన ఒకదూత అరెస్టుచేయబడ్డాడు కూడ.

అప్పట్లో ఇంగ్లీషువారికి పర్షియాతో యుద్ధం ఏర్పడింది. యుద్ధంలో ఇంగ్లీషువారు పరాజితులు కావాలని భారతీయులు ఎదురు

చూచేవారు. ఆ వాంఛను వెల్లడిస్తూ ఢిల్లీలో ఏ గోడపై చూచినా బ్రిటిష్ వ్యతిరేక నినాదాలు వ్రాసి వుండేవి. పర్షియా భారతదేశాన్ని విముక్తి చేయగలదని భావించినవారుకూడ వున్నారు. చాలమంది బ్రిటిష్ వాళ్ళు ఓడిపోవాలనే వాంఛను వెల్లడించారు. ప్లాసీ యుద్ధం తరువాత వంద సంవత్సరాలకు ఇంగ్లీషు కంపెనీ పరిపాలన అంతరిస్తుందని యెవరో జోస్యం చెప్పారు. ఆ జోస్యాన్ని పత్రికలు ప్రకటిస్తూ, సరిగా 1857 జూన్ 23 న తేదీన కంపెనీపాలన అంతమవుతుందని వ్రాశాయి. ఇంగ్లీషువారికి ఇది గాబరా కలిగించింది.

కలకత్తా, మీరట్ సిపాయిలు బయటి ప్రపంచంతో సంబంధాలు పెట్టుకొంటున్నారు. కంపెనీ పరిపాలన తొలగిపోతే కాని తమ బ్రతుకులు బాగుపడవనే నిశ్చయానికి వారు వచ్చారు. బ్రిటిష్‌వారిని చూస్తేచాలు, కళ్ళలో నిప్పులు కురిపిస్తున్నారు.

ప్రజలలో అక్కడక్కడ తిరుగుబాటు బయలుదేరింది. తెల్లవాళ్లు అంటే చాల అసహ్యతను వ్యక్తం చేసేవారు. సాధువేషంలో అనేకమంది యువకులు రాజకీయ ప్రచారం చేయనారంభించారు. ప్రచారకుల ఖర్చుకోసం ప్రజలు బంగారు, వెండి విరాళంగా యిచ్చేవారు. దేశంలో పలుతావుల రహస్య సంస్థలు ఏర్పడ్డాయి.

అధికారులు మతవిషయాలకోసం ముల్లాలను, పురోహితులను పటాలాలలోకి రానిచ్చేవారు. సిపాయిలబారక్స్ ప్రజలనివాసాలమధ్య ఉండేవి. అందుచేత సిపాయిలకూ ప్రజలకూ మధ్య నిత్యసంబంధా లుండేవి. అక్కడక్కడ మాత్రమే ఊరివెలుపల కంటోన్మెంటు లుండేవి. మిగతా అన్నిచోట్ల ప్రజలు నివసించే ప్రాంతాల్లో సిపాయి లుండేవారు. ఈ పరిస్థితి రహస్య సమావేశాలకు, చర్చలకు అనుకూలంగా ఉండేది. సిపాయిల ఆలోచనలు, పథకాలు శత్రువుకు సులభంగా తెలిసేవికావు. దీనికితోడు సిపాయిలు తమలో తాము ఎన్నుకొనే రహస్య కమిటీల ద్వారా విప్లవ సన్నాహాలు చేసేవారు.

ఈ సందర్భంలో మాలిసన్ ఇలా తెలియజేశాడు :

"బ్యారక్ పూర్ లో నే కాక, పశ్చిమోత్తర రాష్ట్రాలలోని (ప్రస్తుత యు. పి. రాష్ట్రం) ప్రధాన కేంద్రాలన్నిటిలోను సిపాయిల గుడిసెలలో అర్ధరాత్రి పూట రహస్య సమావేశాలు జరిగేవి. వీటినిబట్టి బోధపడే విషయమేమంటే, అయోధ్య రాష్ట్రాన్ని తమ రాజ్యంలో కలిపివేసుకున్న విదేశీపాలకులు బలవంతంగా తమను క్రైస్తవమతంలో చేర్చుకు తీరుతారనే అభిప్రాయం సిపాయిలలో దృఢంగా నాటుకుపోయింది." (జి. బి. మాలిసన్ : "భారతీయ పితూరీ"–పేజీ 53.)

**జాతి ప్రయోజనాలకై ప్రాణాల నొడ్డగల ధీరులు**

మే 30 న హిండన్ నదివద్ద జరిగిన యుద్ధంలో బ్రిటిష్ సేనలు ఢిల్లీ సిపాయీలనుంచి ఫిరంగుల్ని పట్టుకొన్నాయి. వానివద్ద చేరిన సోల్జర్లనీ, ఫిరంగుల్నీ కూడ నాశనం చేయడానికై ఒక సిపాయి మందుగుండు పెట్టెలకి నిప్పు పెట్టి పేల్చేశాడు. ఆ ప్రేలుడులో తానూ మరణించేడు. ఈ సిపాయిని గూర్చి 'కేయీ' యిల్లా వ్రాస్తున్నాడు :

"తన జాతీయ ప్రయోజనాల కోసం ప్రాణాల నొడ్డగల ధీరులూ, వీరులూ తిరుగుబాటుదారుల్లో వున్నారని అర్థమయింది."

కాశీ దేవాలయాలలో బహిరంగంగానే బ్రిటిష్ వ్యతిరేక ప్రార్థనలు జరిగేవి.

విప్లవకారులు తిరనాళ్ళు జరిగేచోటికి వెళ్ళి స్వాతంత్ర్య సముపార్జనావశ్యకతను వివరించేవారు. తోలుబొమ్మలాటలలో చేరి బ్రిటిష్‌వారిని కిరాతకులుగా చిత్రించేవారు. ప్రేక్షకులలో ఉద్రేకాన్ని కల్గించేవారు ఒకనాడు ఢిల్లీ చక్రవర్తి ఆస్థానానికి ఒక కవీశ్వరుడు వచ్చాడు. నిండు సభలో ఒక జాతీయగీతం చదివి వినిపించాడు. సభికులందరూ చాల ఉత్తేజం పొందారు.ఆగేయం కొద్ది రోజులలోనే మారుమూలగ్రామాలకు ప్రాకింది.

ఈ సందర్భంలో విప్లవకారుల ఉత్తర ప్రత్యుత్తరాలు రహస్యపద్ధతులలో నడిచేవి. సున్నలు,చుక్కలు, అంకెలలో లేఖలు వ్రాయడం ప్రారంభించారు. ఎవరికి వారు రహస్యం బయటపడకూడదని జాగ్రత్త వహించేవారు.

**పది పన్నెండేళ్ళ పసివాళ్ళకు ఉరిశిక్ష**

**1857 లో అలహాబాద్ లో 14 ఏళ్ళలోపు బాలురు కొందరు విప్లవజెండా తీసుకుని పూరేగింపు జరిపేరు. వెంటనే ఇంగ్లీషువాళ్ళు ఆ చిన్నపిల్లల్ని పట్టుకొని ఉరిశిక్ష వేసేరు. ఒక ఇంగ్లీషు ఉద్యోగి యీ దురంతానికి సిగ్గుపడి అటువంటి శిక్ష అన్యాయమని వాదించేడు కాని, ప్రయోజనం లేకపోయింది.**

**ఆ పిల్లగాళ్ళని ఉరితీసేరు!**

ఉదాహరణకు 'నీ పేరేమిటి?' అని ఎవరినైనా అడగదలచినప్పుడు, 'నింగీ పెంగే రెంగేమిటి?' అనేవారు. గొడ్లుకాచే కుర్రవాళ్ళుకూడ వినోదంకోసం ఈపద్ధతిని అనుసరించినట్లు తెలుస్తున్నది.

ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్య అకస్మాత్తుగా పెరగడంవల్ల దేశంలో ఏదో విపరీత పరిస్థితి ఏర్పడినట్లు ఇంగ్లీషువాళ్ళకు అనుమానం తట్టింది. జాన్ లారెన్సు అను బ్రిటిష్ అధికారి కొన్ని ఉత్తరాలను తెరచిచూశాడు. "మనఎదలో మనమే విదేశీయుల కత్తిని దూసుకొన్నాం" అని ఒకఉత్తరంలో వ్రాయబడి వుంది. ఒక విప్లవకారుడు వేరొకనికి ఇచ్చిన సందేశంలో చెప్పిన మాటలివి. ఇవి చదివినతోడనే జాన్ లారెన్సుకు గంగ వెర్రు లెత్తాయి. తన అనుమానం తీవ్రతరమైంది. రహస్య ఉత్తరాల రవాణా జరగకుండా కట్టుదిట్టాలు చేశాడు.

బెంగాల్‌లో సిపాయిలు ఎర్రకలువ ఉద్యమం ప్రారంభించారు. దీనిప్రకారం, ఒక పటాలంలోని ప్రధానాధికారి తనకు అతి సమీపంలో ఉన్న సిపాయి చేతికి ఒక ఎర్రకలువ యిస్తాడు. దాన్ని సిపాయి మరొకనికందిస్తాడు. ఈవిధంగా, పటాలంలోని 1000 మందికీ అది అందుతుంది. ఆ తర్వాత రెండవ పటాలంలోని ప్రధానాధికారి కది అందజేయబడుతుంది. ఒక్కొక్క సిపాయితనచేత ఎర్ర కలువను పట్టుకొంటూంటే పొందే ఆనందం, ఆవేశం ఊహించుకోవలసిందేగాని వర్ణించలేం. "పితూరీ గాథలు" అనే గ్రంథంలో యిలా ఉంది :

"ఎర్రకలువ పంచిపెట్టబడకుండావున్న సిపాయి దళంగాని, సిపాయి కేంద్రంగాని బెంగాల్లో ఎక్కడా లేదని చెప్పవచ్చు." ("పితూరీ గాథలు" : పేజీ 4).

ట్రెవెలియన్ అనునత డిలా వ్రాశాడు :

"ఎర్రకలువ నిజంగా ప్రజలందరినీ ఒకటిగా చేసింది. ఎందుకంటే, బెంగాల్లో సిపాయిల, రైతుల కండ్లలో అసాధారణమైన, విచిత్రమైన భావాలు తాండవమాడు

తూండగా 'అంతా ఎర్రనైపోయింది!' అను కొంటూ ఉత్తేజితులయ్యేవారు" (మై నెలి యన్ : "కాన్పూరు").

ఇదే సందర్భంలో అయోధ్య మొదలైన ప్రాంతాల్లో చపాతీల ఉద్యమం ప్రారంభ మైంది. రహస్య విప్లవ ప్రచారానికే వీటిని కూడ ఉపయోగించేవారు.

సుమారు 20,000 గ్రామాలు గల అయోధ్యరాష్ట్రంలోను, గంగా - యమునా నదులమధ్య ఉన్న ప్రాంతంలోను చపాతీల ద్వారా విప్లవ సందేశాన్ని అందజేసే పద్ధతి వ్యాప్తిలో ఉండేది. ప్రతిగ్రామంలోని చౌకీ దారు తన ప్రక్కనున్న గ్రామానికి పరుగెత్తు కెళ్ళి, ఆ గ్రామ చౌకీదారుకు రెండు చపాతీ లిచ్చేవాడు. రెండవ గ్రామానికి చెందిన చౌకీదారు మరొక 10 చపాతీలను తయారు చేయించి, ఒక్కొక్క గ్రామానికి రెండేసి చొప్పున ఐదు గ్రామాలలోని చౌకీదార్లకు పంచిపెట్టేవాడు. ఆ అయిదు గ్రామాల చౌకీ దార్లు ఇలాగే పొరుగు గ్రామాలకు పరుగెత్తు కుంటూ వెళ్లి చపాతీ లందజేసేవారు. ఈ విధంగా కొద్ది గంటల సేపట్లో అనేక గ్రామా లకు చపాతీ లందజేయబడేవి.

ఈ ఉద్యమాన్ని ప్రారంభించినదీ, నడిపి నదీ సిపాయిలు. జి. బి. మాలిసన్ ఈ సంద ర్భంలో యిలా వ్రాశాడు :

"వారు (సిపాయిలు) చపాతీలను పంచి పెట్టడం ద్వారా కార్యరంగంలో దూకేటం దుకు సమయ మాసన్నమవుతోందని గ్రామీణ ప్రజలకు తెలియజేసేవారు. (జి బి. మాలిసన్: "భారతీయ పితూరీ," ఉపో ద్ఘాతం)

తిరుగుబాటుకు చిహ్నమైన యీ చపాతీలను ఎవరైనా సులభంగా తయారు చేయవచ్చు; వాటిని ఒకగ్రామం నుంచి మరొక గ్రామానికి అందజేయడం కూడా సులభం. దానివల్ల శత్రువుకు ఎలాంటి అను మానం కలుగదు. సిపాయిలు దేశవ్యాపి తంగా ఒకేరోజున ప్రారంభించ దలచుకున్న తిరుగుబాటుకు ప్రజల సహకారం పొంద డానికి యీపద్ధతి చక్కగా ఉపయోగ పడింది. వీటిద్వారా విప్లవ సందేశం ఎంత వేగంగా గ్రామసీమలకు వ్యాపించిందో ఇంగ్లీషు చరిత్రకారులే తమగ్రంథాల్లో వ్రాశారు. ఉదాహరణకు ఛార్లెస్ బాల్ యిలా వ్రాశాడు :

"ఈ వెల్లువ పశ్చిమోత్తర రాష్ట్రాలలో ఎంతవేగంగా వ్యాపించిందంటే, ప్రభుత్వో టపాకన్న కూడా త్వరగా యీ సమాచారం అందజేయబడేది. వెలుతురు కిరణాలకన్న వేగంగా కార్యరూపం ధరించే యీ విచిత్ర పద్ధతి చూచి ఇంగ్లీషు అధికారులు కంగారు పడ్డారు. కొంతమంది దూతలు అరెస్టు చేయ బడ్డారు. మేజిస్ట్రేట్లూ, పోలీసు ఉన్నతో ద్యోగులూ ఆ వ్యక్తుల్ని బాగా పరీక్షించే వారు. వారివద్ద దొరికిన చపాతీలను క్రిందా మీదా పరీక్షించి, ముక్కలు ముక్కలుగా చేసి, నోటిలో వేసుకొని రుచిచూచేవారు. కాని అనుమాన మేమీ కలుగలేదు. మామూలు చపాతీల మాదిరిగానే అవి కనిపించాయి." (ఛార్లెస్ బాల్ : 'భారతీయ పితూరీ చరిత్ర'-పేజీ 39.)

అరెస్టు చేయబడిన చౌకీదార్లు, తమ కేమీ తెలియదనీ, ప్రభుత్వ ఉత్తర్వు లావిధంగా ఉన్నాయి కాబోలునని తాము భావించామనీ చెప్పేవారు. మరికొందరు, కలరా - మశూచి వ్యాధులు తగ్గుతాయను కొని యిలా పంచిపెడుతున్నామని చెప్పారు

చివరకు ప్రభుత్వోద్యోగులు యీ విషయమై దర్యాప్తులు చేయడం మానివేశారు; దాన్ని గురించి వారు పట్టించుకోనే లేదు.

అక్కడక్కడ గ్రామాలలో మునసబులూ (పటేల్), కరణాలు (కులకర్ణి), సిపాయిల ఉద్యమానికి తోడ్పడ్డారు. బ్రిటిష్ అధికారులు యీ గుట్టును తెలుసుకొన్నారు. ప్లేగు, కలరాల సాకు చూపించి, గ్రామాలలోకి కొత్తవారి నెవరినీ రానీయవద్దని ఆజ్ఞాపించారు. గ్రామ తలారులను ఊరి ముగల్లో కాపలా పెట్టించారు. కాని 'చపాతీల'ను గురించి అదివరకే ప్రచారమైవుంది. అందువల్ల వాటినిచూడగానే తలారులు మహాప్రసాదంగా భావించి విప్లవకారులను లోపలికి పోనిచ్చేవారు

లక్నోలో విప్లవకారులు గోడవార్తా పత్రికలు అతికించేవారు. స్థానికాధికారులు ఇందుపై తీవ్రమైనచర్య లేవీ తీసుకోలేదు. పోలీసులు గోడవార్తాపత్రికలను తొలగిస్తూవుంటే, వేరొకప్రక్క నుండి అతికిస్తూ వుండేవారు. పోలీసులు ఎవరినీ పట్టుకొనకపోవడం వల్ల బ్రిటిష్ ఉన్నతాధికారులకు అనుమానం తట్టింది. చివరికి పోలీసులకు కూడ రహస్యంతో సంబంధం వున్నట్లు వెల్లడయింది. అట్టివారి నందరినీ తొలగించివేశారు.

ఇలాంటి రహస్య సంస్థలు దేశంలో చాల ప్రాంతాలకు విస్తరించాయి. తిరుగుబాటును అణచడంలో ప్రముఖపాత్ర వహించిన ఆంగ్లేయులుసైతం యీవిషయాన్ని అంగీకరించారు. ఉదాహరణకు కేయీ, మాలిసన్‌లు తమ గ్రంథంలో యిలా వ్రాశారు:

"ఈ కుట్రకు నాయకత్వం వహించినది మౌల్వీ అహమ్మద్ షా అనుటలో యెట్టి సందేహం లేదు. దాని శాఖలు యించుమించు భారతదేశమంతటా ఉన్నాయి. ముఖ్యంగా ఆగ్రాలోను (ఇక్కడ మౌల్వీ కొంతకాలం నివసించాడు), యించుమించు రూఢిగా ఢిల్లీలోను రహస్య సంస్థలుండేవి. మీరట్, పాట్నా, కలకత్తా నగరాల్లో కూడా ఉండేవి." (కేయీ, మాలిసన్: 'భారతీయపితూరీ చరిత్ర' : 5 వ సంపుటం పేజీ 292)

సిపాయిలు రాత్రిపూట రహస్యంగాసమావేశమయేటప్పుడు ఒకరి ఆనవాళ్ళు మరొకరికి తెలియకుండా ఉండేందుకు ముఖాలు కనిపించకుండా ముసుగులువేసుకొని వచ్చేవారట. కళ్ళు మాత్రమే కనిపించేవట. ఆ సమావేశాల్లో బ్రిటిష్‌పాలన అంతరించేటట్లు ఉద్రేకపూరితమైన ఉపన్యాసా లిచ్చేవారు. తీర్మానా లన్నీ సర్వసభ్య సమావేశాల్లో జరిగేవట. ఆంతరంగిక సంఘం చేసే నిర్ణయాలను తు. చ. తప్పక అమలు జరిపేవారు. వివిధపటాలాలు ఉమ్మడి సమస్యలను చర్చించుకోవలసిన అవసరమేర్పడితే, పండగదినాల్లోనో సెలవురోజుల్లోనో ఒకపటాలం మరొక పటాలాన్ని విందుకు పిలిచేది. ఆ పేరుతో అంతా కలిసి సమావేశమయేవారు. ప్రత్యేక సమా

**ఉరితీయడానికి ప్రమాణం తీసుకున్న జడ్జీలు**

"తప్పుచేయనీచేయకపోనీ ఉరిశిక్ష వేస్తానని ప్రమాణంతో ఇంగ్లీషు ఆఫీసర్లు కోర్టుమార్షల్ విచారణ నడిపేవారు. అట్లాంటి చాలు మూలంలేని పద్ధతికి ఎవరన్నా అభ్యంతరం చెప్తే తోడివాళ్ళు కోప్పడి నోరు మూయించేవారు. ఆదరాబాదరాగా విచారించి, ఉరిశిక్ష వేశాక నిందితుల్ని సైనికులు చిత్రవధ చేస్తూంటే ఆఫీసర్లు చూస్తూండేవారు."

హోల్ఫ్ సిపాయి యుద్ధచరిత్ర.

వేశాలు సుబేదార్ల యిండ్లలో జరిగేవి. నాయకులు బ్రిటిష్‌వారి రాజకీయ, మత విషయిక విధానాలను ప్రతి సాధారణ సిపాయికి బోధించేమాట నిజమే అయినప్పటికీ, ప్రతి సిపాయి యింగ్లీషువారితో పోరాడ్డానికి ఉవ్విళ్లూరుతూఉండేమాటకూడా నిజమేఅయినప్పటికీ, ఏవిధంగా పోరాడాలో, ఎప్పుడు తిరుగబడాలో, ఏ యే శాఖలకు ఎవరెవరు నాయకులో యిలాంటివి అందరికీ చెప్పేవారు కాదు. రహస్యాన్ని శత్రువుకు తెలియజేసిన వ్యక్తిని చంపివేయాలనికూడా తీర్మానాలు చేసేవారు. ప్రతి సిపాయి తనకిచ్చిన పనిని వినయవిధేయతలతో పాటిస్తానని గంగా జలమో, తులసిఆకో, ఖురాన్ గ్రంథమో పట్టుకొని శపథం చేసేవాడు. ఈవిధంగా ఒక పటాలం ఐక్యతను సాధించిన తర్వాత, అది యెన్నుకున్న కమిటీ మరొక పటాలంయొక్క కమిటీతో సంప్రతింపులు ప్రారంభించేది. రెండు కమిటీలూ కలిసి ఉమ్మడి విధులను నిర్వర్తించేవి. సిపాయిల శపథాలవలెనే పటాలాల శపథాలుకూడ ఒండొరులకు శిరోధార్యాలు.

రహస్య సంఘాలు పనిచేసే పద్ధతినిగురించి తర్వాత ఇంగ్లీషువారు చాలసమాచారం సంపాదించారు. విల్సన్ అను ప్రభుత్వోద్యోగి తన నివేదికలో యిలా తెలియజేశాడు:

"ప్రతి పటాలానికి ముగ్గురితో కూడిన కమిటీ ఉండేది. ఈ కమిటీయే తిరుగుబాటుకు సంబంధించిన కార్యక్రమాన్నంతటినీ అమలు జరిపేది. కమిటీ నిర్ణయాలు సిపాయిలకు తెలిసేవికావు. వివిధ పటాలాల మధ్యజరిగే ఒప్పందాలు ఉమ్మడి కార్యక్రమానికి సంబంధించినవై ఉండేవి. ముఖ్యస్కీము లన్నిటినీ నిర్ణయించవలసిందీ, ఉత్తర ప్రత్యుత్తరాలను నడపవలసిందీ, తదితర సమస్యలను పరిష్కరించవలసిందీ యీ కమిటీలే..."

ఒక్కొక్కప్పుడు సిపాయిల రహస్యాలు ప్రభుత్వానికి తెలిసిపోయేవి. వెంటనే అధికార్లు పటాలాన్నంతటినీ డిస్మిసు చేసేవారు. అలా డిస్మిసు చేయబడిన సిపాయిలు గ్రామాలకు వెళ్లి విప్లవ ప్రచారం చేసేవారు.

దేశభక్తి కలిగిన భారతీయ న్యాయమూర్తులవద్దకు విప్లవకారులకు సంబంధించిన కేసులు విచారణకు వచ్చేవి. విప్లవకారులను తగువిధంగా దండించకపోతే బ్రిటిష్‌వాళ్ళకు అనుమానం కలుగుతుంది. రహస్య సంస్థల పట్ల తమకు సానుభూతి వున్నప్పటికి బయట పడ దలచుకోలేదు. విప్లవం జయిస్తుందనే నమ్మకంకొద్దీ విప్లవకారులకు వారు పెద్దపెద్ద శిక్షలు విధించిన సందర్భాలున్నాయి.

1857 మార్చిలో నానాసాహేబ్, ఆయన సోదరుడు బాలాసాహేబ్, ఆయన సలహాదారుడు అజిముల్లా – వీరు ముగ్గురూ 'తీర్థయాత్ర'కు బయలుదేరారు. దేశంలో రాజకీయ పరిస్థితులు తెలుసుకోవడం వీరి ఉద్దేశం. వీరు ముగ్గురూ ఢిల్లీకి వచ్చి, అక్కడి న్యాయమూర్తిని కలుసుకొన్నారు. జాతీయ కర్తవ్యాన్ని గురించి ఆయనతో సంప్రతింపులు జరిపారు. ఏప్రిల్ 28వ తేదీన లక్నోకు వెళ్ళగా అక్కడి ప్రజలు మహోత్సాహంతో స్వాగతమిచ్చారు. ఆ రోజున మరొకచోట ఉద్రిక్తులైన ప్రజలు హెన్రీ లారెన్సు అను బ్రిటిష్ అధికారిపై రాళ్ళవర్షం కురిపించారు. పై తీర్థయాత్రను గురించి మాలిసన్ యిలా వ్రాశాడు.

"నానాసాహేబు, అజిముల్లా యీ పర్యటనను చక్కగా ఉపయోగించుకున్నారనుటలో

సందేహం లేదు. అయోధ్య రాష్ట్రంలో అసంతృప్తి చెందిన సామంత ప్రభువులతో వారు సంప్రదింపులు జరిపారు. ఒక సాధారణ కార్యక్రమాన్ని వారితో కలిసి రూపొందించారు" (జి. బి. మాలిసన్ : "భారతీయ పితూరీ" పేజీ 31).

బీహారు రాష్ట్రంలో పాట్నా నగరం రహస్య సన్నాహాలకు కేంద్రంగా ఉండేది. వర్తకులు, జమీందార్లు కూడా రహస్య సంఘంలో సభ్యులు. అందుచేత ధనానికి కొరత ఉండేది కాదు. పేరు ప్రఖ్యాతులుగల మౌల్వీలు దీన్ని నడిపేవారు. ఇతర రాష్ట్రాలకార్యకలాపాలతో వారు సంబంధ ముంచుకొనేవారు. పోలీసులుకూడా రహస్యసంఘంలో చేరడంవల్ల, ఎట్టి విఘాతాలు లేకుండా సమావేశాలు జరుగుతూ ఉండేవి. రాష్ట్రంలోని ముఖ్య కేంద్రాలన్నిటితోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ ఉండేవి.

## పాండ్యాలు

సైనికుల్ని విప్లవానికి ప్రోత్సహించినందుకై 1857 ఏప్రిల్ 8 న కలకత్తా సమీపంలోని బారక్పూర్ లో మంగల్ పాండ్యాను బ్రిటిష్ వాళ్లు వురితీసేరు. అటు తర్వాత వచ్చిన స్వాతంత్ర్య విప్లవంలో పాల్గొన్న వారందరినీ ఇంగ్లీషువాళ్లు పాండ్యాలనే పిలిచేరు. అవిధంగా పాండ్యా పేరు భారత స్వాతంత్ర్య పోరాట చరిత్రలో చిరస్థాయిగా వుండిపోయింది.

జగదీశ్‌పూర్ సంస్థానాధిపతి కుమారసింగ్ (ఇతని సంస్థానం ఇంగ్లీషువారిచే స్వాధీన మొనర్చుకోబడింది) యుద్ధసామగ్రిని సేకరించి విప్లవసన్నాహాలు చేస్తున్నాడు.

తిర్‌హుట్ జిల్లాకు చెందిన పోలీసు జమేదారు వారిస్ ఆలీ స్వయంగా రహస్య కార్యకలాపాలు నడుపుతూ వుండేవాడు. అతని యింటిని అకస్మాత్తుగా సోదా చేసినప్పుడు ఒక ఉత్తరం దొరికింది. దాని ఆధారంమీద అతనికి ఉరిశిక్ష విధించారు. గయలో ఆలీ కరీం అను మరొక విప్లవనాయకుని అరెస్టు చేయడానికి జరిగిన ప్రయత్నం విఫలమైంది.

ఉత్తర హిందుస్థానంలోనే గాక, దక్షిణాన హైద్రాబాద్‌లో కూడా రహస్య సమావేశాలు, సంప్రతింపులు జరుగుతూ ఉండేవి. నైజాం బ్రిటిష్ అనుకూలుడే అయినప్పటికీ, మహమ్మదీయ ముల్లాలు బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల్లో రహస్య ప్రచారం చేసేవారు.

మద్రాసుకు సహితం విప్లవ కార్యకలాపాలు వ్యాప్తి చెందాయి. ఉదాహరణకు 1857 ప్రారంభంలో కొన్ని చోట్ల యీ క్రింది వాక్యాలుగల పోస్టర్లు గోడలమీద అంటించబడ్డాయి.

"దేశీయులారా! లేవండి! ఇంగ్లీషు కాఫిర్లను దేశంనుంచి తరిమివేయడానికి లేవండి! న్యాయాన్ని ధర్మాన్ని వారు కాలరాచారు; స్వరాజ్యాన్ని అపహరించారు. మన దేశాన్ని మట్టిపాలు చేయడానికి వారు సంకల్పించనున్నారు. వీటన్నిటికీ ఒకటే మందు ఉంది. అది భారతదేశాన్ని ఇంగ్లీషు కాఫిర్ల పాలననుంచి విముక్తిచేయడం. ఇప్పుడు జరిగేది స్వాతంత్ర్యం కొరకు ధర్మయుద్ధం; మతయుద్ధం. అట్టి యుద్ధాలలో మరణించినవారు వీరస్వర్గ మలంకరిస్తారు. ద్రోహులుగా తయారైనవారు నరకబాధలు అనుభవించవలసి వస్తుంది. దేశప్రజలారా! ఈ రెండింటిలో ఏది మీకు కావాలి? నిర్ణయించుకోండి. ఇప్పుడే నిర్ణయించుకోండి!"

1857 మే 31 వ తేదీన దేశవ్యాపితంగా విప్లవం లేవదీయాలని సిపాయిల నిర్ణయం. ఆరోజు ఆదివారం. బ్రిటిష్ ఆఫీసర్లందరూ క్రైస్తవ దేవాలయాలకు వెళ్లుతారు. వాళ్లను అక్కడే చంపివేయవచ్చు. ఆఫీసులను స్వాధీనపరచుకోవచ్చు. ఖజానాలను పట్టుకోవచ్చు. జైళ్ళ తలుపులు బద్దలు చేయవచ్చునని శిపాయిలు అనుకొన్నారు. జైళ్ళలో మొత్తం 25 వేల మంది ఖైదీలు వున్నారు. వీరినే సైనికులుగా మార్చి శత్రువుకు వ్యతిరేకంగా మొహరించవచ్చునని సిపాయిల వ్యూహం.



# రెండేళ్ల స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

మహీధర రామమోహన్‌రావు.

సరిగ్గా నూరేళ్ల క్రితం ఇదే రోజుల్లో మన దేశంలో ఇంగ్లీషువాళ్ల పరిపాలనను ధ్వంసం చేయడానికై ఒక మహాగ్ని రాజుకుంటూండింది.

అన్ని తరగతుల ప్రజలలో ఇంగ్లీషువాళ్ళ దాస్యం నుంచి బయటపడాలనే కోరిక తీవ్రంగా వుండేది. దేశంలో ఎక్కడికక్కడే ప్రతివారూ స్వాతంత్ర్యం సాధించేటందుకు పథకాలు వేస్తున్నారు; ప్రయత్నాలు చేస్తున్నారు. చిట్టచివరకి బ్రిటిషువాళ్లు తయారుచేసిన సిపాయీ పటాలాలలోకూడా పరపాలనమీద తీవ్రమైన అసహ్యం పుట్టింది. స్వాతంత్ర్యం పొందాలనే సంకల్పం కలిగింది.

ఈ అసహ్యమూ, ఈ సంకల్పమూ, అనేక రూపాలలో 1857 సంవత్సర ప్రారంభంనుంచీ దేశంలో పలుమూలల బయటపడుతూ వచ్చింది. ముఖ్యంగా కొవ్వుపూసిన తోటాలను వుపయోగించడానికి నిరాకరించడం ఈ రూపాలలో ప్రముఖస్థానం వహించింది.

మొట్టమొదట బెంగాల్‌లోని సైన్యాలలో ఇది కనిపించింది. ఫిబ్రవరి ఆఖరువారంలో, బర్హాన్‌పూర్ అనే చోట సిపాయీదళం కొవ్వుతూటాల నుపయోగించడానికి నిరాకరించింది. మార్చి ఆఖరువారంలో బారక్‌పూర్ అనే చోట సిపాయీదళం ఆ తూటాలను ముట్టుకోనంది.

ఫిబ్రవరిలో జరిగిన ఘటనకు ఇంగ్లీషువాళ్ళు ఏమీ చెయ్యలేకపోయేరు. ఆజ్ఞల్ని ధిక్కరించిన పటాలాన్ని లొంగదీయాలంటే తెల్లసోల్జర్ల పటాలాలు అందుబాటులో లేవు. అందుచేత ఆ నెలఅంతా వీలయినన్ని సోల్జరు పటాలాలని కలకత్తా చుట్టుప్రక్కలకి తెచ్చేరు. వాటి ఆసరా చూసుకొని మార్చినెలలో బారక్‌పూర్ సిపాయీలచేత కొవ్వుతూటాలు ముట్టించాలని ఇంగ్లీషు అధికారుల ఆలోచన.

ఆ ఆలోచనల్ని సిపాయీలుకూడా పసికట్టేరు. మంగళపాండే అనే ఒక యువసిపాయి ఎంతో ఆవేశంతో బహిరంగంగానే తిరుగుబాటును ప్రోత్సహించ సాగేడు. పటాలం ఆయనను అనుసరించలేదు. కాని, వ్యతిరేకించనూలేదు. పాండే తనను అరెస్టు చేయవచ్చిన ఒక బ్రిటిష్ ఆఫీసరును కాల్చేసేడు. మరొకనిని నరికేసేడు. ఇంకొకణ్ణి మరో సిపాయి నేల పడలేసేడు.

మంగళపాండేను అరెస్టుచేయడానికి సిపాయి పటాలం నిరాకరించింది. సైన్యాధికారి సోల్జర్లను తెచ్చేడు. పాండే శత్రువుకు ప్రాణంతో దొరకడం ఇష్టంలేక తన్నుతానే కాల్చుకొన్నాడు. కాని చావలేదు.

ఇంగ్లీషువాళ్లు ఆయన్ని అరెస్టుచేసి విచారణ జరిపేరు. ఉరితీసేరు.

తర్వాత అదే పటాలంలోని ఒక సుబేదారు సిపాయీలతో రహస్య సమావేశాలు జరుపుతున్నట్లు బయటపడి ఆయననూ వురితీసేరు. పైన చెప్పిన రెండు పటాలాలనుంచీ ఆయుధాలు లాక్కొని వాళ్ళని ఇళ్ళకు పంపేరు.

ఏప్రిల్ నెల అంతా దేశంలో చాలచోట్ల అనేక రూపాలలో తెల్లప్రభుత్వంమీద ద్వేషం ప్రకటించబడుతూనే వుంది.

అంబాలాలో ఇంగ్లీషు అధికార్లు వుండే ఇళ్ళు ఒకదాని తర్వాత ఒకటి తగలబడిపోతున్నాయి.

అదేపని లక్నోలో సాగిపోయింది. మార్చి మూడో తేదీన లక్నోలో మరోఘటన జరిగింది. నలుగురు సిపాయీలు ఆనాటిరాత్రి లెఫ్టినెంట్ మేకం అనే వుద్యోగిని పట్టుకొని చంపేస్తామన్నారు.

"నిజానికి నీతో మాకేం ద్వేషంలేదు. కాని, నువ్వు ఫరంగివాడివి. చావవలసిందే-"నని వాళ్లు అంటూంటే మేకం వణికిపోయేడు. క్షమించమని కాళ్ళా వేళ్ళా పడ్డాడు.

"తలుచుకుంటే మీరు నన్ను క్షణంలో చంపేస్తారు. నన్ను చంపితే మీకేం వస్తుంది? నా బదులు మరొకడొస్తాడు. తప్పు నాదేముంది? ప్రభుత్వానిదికాని? నామీద యీ కక్ష ఎందుకు?"

మేకం ప్రార్థనలు విని సిపాయీలు నిజమే అనుకొన్నారు. వానిని వొదిలేసిపోయేరు. ఈ వార్త వెంటనే అధికారులకు తెలిసింది. లక్నో అధికారి హెన్రీ లారెన్సు ఎంతో నేర్పుగా ఆ పటాలం చేతుల్లోంచి ఆయుధాలు లాగేసుకొని పంపేసేడు. అది వేరే కథ.

ఇల్లాంటి ఘటనలు బోలెడు. ఒకచోటనిలేదు. చివరికి చిలికి చిలికి గాలివాన అయిందన్నట్లు మే నెలలో పెద్ద తిరుగుబాటే ప్రారంభమయింది. అది క్రమంగా దేశంఅంతటా వ్యాపించి విప్లవంగా పరిణామం పొందింది.

ఈ విప్లవానికి ప్రముఖపాత్ర సిపాయీలే వహించేరు. ఉత్తర భారతదేశంలోని హిందూ, ముస్లిం ప్రజాసామాన్యం దానిలో చేరింది. భాగం తీసుకొంది. రెండేళ్ళపాటు కత్తి దింపకుండ పోరాటం సాగింది. నడిపించగల నాధులు లేక ఓడిపోయింది.

ఈ మహావిప్లవం ప్రారంభమయింది సరిగ్గా నూరేళ్ళనాడు మే పదో తేదీ ఆదివారంనాడు.

## మీరట్‌లో తిరుగుబాటు

మే పదో తేదీన మీరట్‌లో విప్లవం ప్రారంభమయింది.

అది ఇల్లా జరిగింది.

అక్కడ బలమైన సోల్జర్ల పటాలాలున్నాయి. వాటిని అడ్డంపెట్టుకొని, 90 మంది అశ్వికసైనికులుగల దళానికి కొవ్వుతూటాలిచ్చి వుపయోగించమన్నారు, అధికార్లు. ఒక్క అయిదుగురు తప్ప మిగతా 85 మందీ వాటిని ముట్టుకోడానిక్కూడా నిరాకరించారు. వెంటనే ఆజ్ఞాధిక్కరణనేరంమీద వారందరినీ అరెస్టు చేసేరు. మిగిలిన సైనికులందరికీ పాఠంగా వుండడానికై సోల్జరు పటాలాల కాపలాలో సిపాయి పటాలాలను కవాతుమైదానంలో పెట్టి, వారిఎదుట విచారణ తంతునడిపారు. ఒక్కొక్కరికీ ఎనిమిదేసీ, పదేసీ ఏళ్లు శిక్షలువేసేరు. అవమానించేరు. చేతులకు, కాళ్లకు సంకెళ్ళువేసి తీసుకుపోయేరు.

ఈ ఘటన ఒక్క సిపాయీలనేగాక పట్టణ ప్రజల్ని కూడా ఆవేశపరచింది. బజార్లలో, ఇళ్లవద్ద ఆడవాళ్ళూ, పిల్లలూసహా సిపాయీ కనిపిస్తేచాలు పిరికిపందలని తిట్టేరు. తోటివాళ్ళని అవమానించి శిక్షిస్తూంటే చూస్తూ వూరుకున్నందుకు నానామాటలూ అన్నారు.

అసలే లోపల్లోపల వుడికిపోతున్న సిపాయీలు ఈపాడుపుల్ని భరించలేకపోయేరు. రాత్రంతా కూడబలుక్కున్నారు.

తెల్లవారితే ఆదివారం. ఇంగ్లీషువాళ్ళంతా చర్చిలలోచేరి అజాగ్రత్తగావున్నప్పుడు దెబ్బతియ్యాలని నిర్ణయించుకొన్నారు.

ప్రజలలోకూడా ద్వేషం చాల ఎక్కువగావుంది. ఆరోజున తెల్లవాళ్ళయిళ్ళకు పనివాళ్ళు పోనేలేదు. పల్లెటూళ్ళనుంచికూడా జనం ఆవేశాలతో మీరట్ వచ్చేరు.

సిపాయీలు తిరుగుబాటు ప్రారంభించేముందు మీరట్‌నుంచి ఇతర ప్రదేశాలకున్న టెలిగ్రాఫ్ తీగలు తెంపేసేరు.

తెల్లవాళ్ళంతా చర్చికి బయలుదేరేవేళకి సరిగ్గా మూడు దేశీపటాలాలు తిరుగుబాటు ప్రారంభించేరు. వారు మొదటిపనిగా తమరిని పీడించి, బాధిస్తున్న ఆఫీసర్లని ఏరి చంపేసేరు. తమయెడ సానుభూతీ, ప్రేమా చూపినవారి నెవ్వరినీ ముట్టుకోలేదు. పైగా తప్పించేటందుకు సహాయపడ్డారుకూడా.

పీడకులయిన ఆఫీసర్లని చంపేసి సిపాయీలు జైళ్ళు బద్దలుకొట్టేరు. తమ మిత్రుల్ని విడిపించుకొన్నారు. వారితోపాటు సమాజశత్రువులుగా నిర్బంధించబడిన వారు, పన్నులు ఇవ్వలేదనో, ఇతర కారణాలతోనో జైళ్లలో పెట్టినవారుకూడా విడుదలయ్యేరు. ఇంక వారు నగరంలోపడి ప్రజల సహాయంతో ఇంగ్లీషు వాళ్ళమీదనున్న కసి తీర్చుకొన్నారు. చేతికి దొరికిన

### మీరట్ తిరుగుబాటు ఇంగ్లీషువాళ్ళకేఉపకారం

"మీరట్‌లో తిరుగుబాటు చాల భయంకరమే అయినా, ఒక విధంగా అసమానమైన ఉపకారం చేసిందనాలి. నిర్ణీత సమయానికి ముందే అదిజరగడం చేత, దేశం అంతటా సిపాయీలు 1857 మే 31 ఆదివారంనాడు ఒక్కమారుగా తిరగబడాలని చేసుకొన్న పథకాలన్నీ తల్లక్రిందులయిపోయేయి."

వైట్ వ్రాసిన చరిత్రలో

ఇంగ్లీషువాళ్ళని ఆడ, మగ, చిన్న, పెద్ద భేదంలేకుండా చంపేసేరు. అదివరకే సిపాయీలు ప్రారంభించిన గృహదహనాలను సంపూర్ణం చేసేరు.

సిపాయీలు తిరుగుబాటు చేసేక ఢిల్లీనగరంవేపు బయలుదేరేరు. అదివరకే జరుగుతున్న ఏర్పాట్లప్రకారం మీరట్‌లోకూడా ఢిల్లీ వగైరా ప్రదేశాలతోపాటు ఒకేసమయంలో తిరగబడవలసివుంది. ఆ నిర్ణయం ప్రకారం ఢిల్లీ సిపాయిపటాలాలు వేచివుండకుండా తమతోపాటు వెంటనే కార్యరంగంలోకి దిగేటట్లు చేయాలి. మీరట్ పటాలాలు వెంటనే ఢిల్లీవేపుగా కదిలేయి.

తిరుగుబాటు జరుగుతున్నంతసేపూ దూరదూరంగా వుండి ప్రాణాలు దక్కించుకొన్న సోల్జరుదళాలు వారు నగరం వదిలిపోయేక పట్టణంమీద పడ్డారు. చేతికి దొరికిన వారినల్లా పట్టుకొన్నారు. ఇల్లు కాల్చేరనో, ఎవరినో చంపేరనో నేరం మోపడం, వురితీయడం సాగించేరు.

మీరట్ ప్రజలు రక్షించమని దేవులాడలేదు. ఆ రోజుల్లో జరిగిన ఒక ఘటనను గురించి ఒక ఇంగ్లీషు వాడు తన జాబులో వర్ణించేడు.

"నిన్న సాయంకాలం అయిదుగురు హంతకుల్ని వురితీసేరు. మొన్న ఆరుగుర్ని. నిన్న వురితీసిన వాళ్ళలో కొత్తానే సతిని చంపినవాళ్ళున్నారని తేలింది. వారిలో ఒకడు దోడిప్యూటీ కలక్టరు పనివాడు. వాళ్ళల్లో ఒకడు ఆఖరుక్షణంవరకూ నిర్భయంగా నిలుడ్డాడు. తమ్ముళ్ళు, అన్నలనుంచి సెలవు తీసుకొన్నాడు. వాళ్ళ నాశీర్వదించేడు. తన తప్పేమీ లేదనీ, పగంగిలు అకారణంగా తన్ను చంపుతున్నారనీ చెప్పేడు. ఉరితీసేవాళ్ళు ముడి సరిచెయ్యక పూర్వమే తనంత తాను పీఠంమీదినుంచి ఉరికి వ్రేలాడిపోయేడు."

మీరట్‌లో తలవని తలంపుగా ఈ అగ్నిజ్వాల రేలెత్తింది. క్షణక్షణం అది అంతంతై ఉత్తరభారతాన్నంతనీ ఆక్రమించింది.

## స్వాతంత్ర్య ప్రకటన

మీరట్‌కీ, ఢిల్లీకీ మధ్య దూరం ముప్ఫయిరెండు మైళ్ళు. పదకొండోతేదీ తెల్లవారేసరికి మీరట్ తిరుగుబాటుదారులు ఢిల్లీ పరిసరాలకు చేరుకొన్నారు.

అంతదాకా ఢిల్లీలోని తెల్ల అధికార్లకి మీరట్ తిరుగుబాటు వార్తే తెలియదు. అప్పటికీ తమవద్ద నున్న సిపాయీ పటాలాలలో రేగుతున్న జ్వాలలూ అర్థంకాలేదు.

మీరట్‌లో సిపాయీలు తిరగబడి ఢిల్లీకి వస్తున్నారన్న వార్త తెలియగానే కర్నల్ రిప్లే అనే సైన్యాధికారి తన అధీనంలోని సిపాయీ పటాలాన్ని ఒకచోట చేర్చి మీరట్ తిరుగుబాటుదార్లని ఎదుర్కోవాలని కర్తవ్య బోధ చేసేడు. "వాళ్ళని చూపిస్తే చెప్తాంగా" అని వారు అంటూంటే "షెభాష్" అని మెచ్చుకొన్నాడు.

కాని, తీరా రెండు పటాలాలూ ఎదుటపడేసరికి ఢిల్లీనుంచి వచ్చిన పటాలం తమ అధికారులందర్నీ రిప్లేతోసహా కాల్చేసేరు. ఆ రెండుసేలూ కోలాహలంగా కాశ్మీర్ గేటుగుండా నగరంలో అడుగు పెట్టాయి.

మీరట్‌నుంచి బయలుదేరిన మరో పటాలం కలకత్తాగేట్‌గుండా దర్యాగంజ్ ప్రవేశించింది. యూరోపియన్ల కాపురాలిక్కడ. వారికి దొరికిన వారినల్లా చంపేసి, ఇళ్ళు తగులబెట్టి ముందుకు నడిచేరు.

ఈ సైన్యాలన్నీ ఢిల్లీకోటకు నడిచేయి. అక్కడున్న సైనికులుకూడా తిరుగుబాటులో చేరేరు. కోటలోవున్న తెల్లఆఫీసర్లను చంపేసేరు. దానిని స్వాధీనపరచుకొన్నారు.

తిరుగుబాటు క్రమంగా నగరంలో పాకింది. ఢిల్లీ బ్యాంకు పట్టుకొన్నారు. ఢిల్లీగెజెట్ పత్రికను పట్టుకొన్నారు.

రాజభవనం సమీపంలోనే మందుగిడ్డంగి వుంది. కాపలాకాస్తున్న ఇంగ్లీషువాళ్ళు సిపాయీలకు దానిని స్వాధీనపరచడానికి నిరాకరించేరు. రక్షించలేమను కొన్నప్పుడు దానిని పేల్చేసేరు. ఆ ప్రేలుడులో తామూ చచ్చిపోయారు. మందుగుండు పేలిపోయినా అక్కడవున్న తుపాకులు వేలసంఖ్యలో తిరుగుబాటుదార్ల చేతచిక్కేయి.

గిడ్డంగిసంగతి తేలేవరకూ కంటోన్మెంటులోని సిపాయీదళాలు కదలలేదు. సాయంకాలం నాలుగ్గంటలవేళ గిడ్డంగి ప్రేలిపోయిన చప్పుడు వినగానే వాళ్లుకూడా తిరుగుబాటు చేసేరు. తమ ఆఫీసర్లని చంపేసేరు.

ఢిల్లీనగరంకూడా తిరుగుబాటులో చేరింది. తిరుగుబాటుదారుల నాయకులూ, పురప్రముఖులూ ఢిల్లీ చక్రవర్తుల వంశంలోని బహాదూర్‌షా వద్దకు రాయబారం వెళ్ళేరు. ఆయనను చక్రవర్తి పట్టం స్వీకరించవలసిందిగా కోరేరు.

బహాదూర్‌షా 70-80 ఏళ్ల వృద్ధు, బలహీనుడు. ఆయన తానా భారంవహించలేనని సందేహించాడు.

కాని తిరుగుబాటుదారులు ఆయనను వదలలేదు. ఆయన భార్య జీనత్ మహల్ కూడా వారితో చేరి భర్త మీద ఒత్తిడితెచ్చింది. కాని బహదూర్ షా ఒప్పుకోలేదు.

"నావద్ద ధనంలేదు. జీతాలివ్వలే"నని ఒక అభ్యంతరంచెప్పాడు. భారతదేశంలోని ఖజానాలన్నీ తెచ్చి ఆయన ఎదుట పెడతామని సమాధానం వచ్చింది.

ఎట్టకేలకు బహదూర్ షా సైనికులూ, ప్రజలూ వొత్తిడిమూలంగా ఢిల్లీ చక్రవర్తిత్వానికి సిద్ధపడవలసి వచ్చింది.

బహదూర్ షా ఢిల్లీ చక్రవర్తిగా ప్రకటించబడ్డాడు. సిపాయీలు ప్రారంభించిన తిరుగుబాటు స్వాతంత్ర్య పోరాటంగా పరిణామంపొందింది.

చక్రవర్తిగా ప్రకటించబడినాక బహదూర్ షా యూరపియన్ల హత్యలను నిలపడానికి ప్రయత్నించేడు. ప్రారంభంలో 50 మందినివరకూ రక్షణకోసం జైలులో పెట్టేడు. కాని, వారిని రక్షించగలశక్తి ఆయనకులేక పోయింది. వారిని సైనికులు లాక్కుపోయి నరికేసేరు. చక్రవర్తిగా ప్రకటించబడినా బహదూర్ షాకు ప్రభుత్వాన్ని నిర్వహించగల శక్తిలేదు. ఆయన సైన్యాల్ని నడపగలవాడూ కాడు. పాలన సాగించగలవాడూ కాడు. ఆ బాధ్యతల నిర్వహణకై సిపాయీలూ, పౌరులూ తమ ప్రతినిధులను ఎన్నుకొని సైనిక సమితిని ఏర్పరచుకొన్నారు.

ఈ పోరాటంలోగాని, తర్వాత ఏర్పరచిన పాలక పద్ధతులలోగాని హిందువులూ ముస్లిములు అనే భేదం తలఎత్తలేదు.

గద్దె నెక్కగానే బహదూర్ షా దేశంలోని హిందూ ముస్లిం ప్రజానీకాన్ని వుద్దేశించి ఒక ప్రకటన చేసేడు.

"ధర్మరక్షణ ఒక్కటే మనఎదుట వుంది. ఆస్తులు పోతాయి, ప్రాణాలు పోతాయనకుండా ధైర్య స్థయిర్యాలు కలవారందరూ మన ప్రాచీన ధర్మ రక్షణకోసం కలిసిరాండి. ప్రజాక్షేమంకోసం ఆత్మలాభాన్ని త్యజించగలిగినప్పుడే మన భూమినుంచి ఇంగ్లీషువాళ్ళని తరిమెయ్యగలం. శివుని ఆజ్ఞలేనిదే చీమేనా కుట్టదు. కాలం తోసుకువచ్చినప్పుడు ఎవ్వరూ కాపాడలేరు. మారీ, మహామారీ వచ్చి వేలూ, లక్షలూ చచ్చిపోతున్నారు. ధర్మరక్షణకోసం జరిగే యుద్ధంలో మరణించినవాడే అమరజీవి. భారతభూమినుంచి ఇంగ్లీషువాళ్ళని తరిమెయ్యడమో, చంపెయ్యడమో చేయాలి. ఇది స్త్రీపురుషులందరి కర్తవ్యం."

గోవధ నిషేధించేడు. దానిని శిక్షార్హంగా ప్రకటించేడు.

బహదూర్ షా పదవీస్వీకారం చెయ్యగానే బ్రిటిష్ వాళ్ళమీద యుద్ధం ప్రకటించి విప్లవంలో చేరవలసిందిగా దేశంలో స్వతంత్రంగా మిగిలిన సంస్థానాధిపతులందరికీ జాబులు వ్రాసేడు.

అటువంటి జాబులతో సవార్లు పంజాబులోని శిక్కురాజులవద్దకు వెళ్లేరు.

పంజాబులోని శిక్కురాజుల్ని విప్లవంలోకి లాగేటందుకై అదివరకే కొన్ని ప్రయత్నాలు జరిగేయి. వారు ఆలాగే అలాగే యని తలలూపేరట కూడా. కాని తీరా విప్లవం ప్రారంభమయ్యాక వారు కనీసం తటస్థంగాకూడా వుండలేదు. ఇంగ్లీషు ప్రభుత్వాన్ని నిలవబెట్టడానికై సర్వవిధాలా సహాయపడ్డారు.

మీరటులోనూ, ఢిల్లీలోనూ తిరుగుబాటు ప్రారంభమైననాటికి బ్రిటిష్ వాళ్ళ చేతిలో సోల్జరుపటాలాలు చాలా తక్కువగా వున్నాయి. ఉన్నవేవో పంజాబులో వున్నాయి. సర్వ సేనాధిపతి అంబాలాలో వున్నాడు. అక్కడనుంచి ఢిల్లీకి వెళ్ళాలి.

సేనలంటే వెళ్లినా, వాటికి కావలసిన పరికరాలూ, యుద్ధసామగ్రులూ తీసుకువెళ్ళేటందుకు ఎంతరో జనం కావాలి. బళ్ళూ గుర్రాలూ మొదలయినవి వుండాలి. అవేవీ అంబాలాలో దొరకలేదు. బ్రిటిష్ వాళ్ళమీద విప్లవం ప్రారంభమయిందన్న వార్త తెలిసేక వాళ్ళకి మనుష్యులూ, పరికరాలూ దొరకడం అసంభవం అయిపోయింది.

ఆ సమయంలో పాటియాలా, నాభా, ఝింద్ రాజులు ఇంగ్లీషు వాళ్ళకి సాయం వచ్చేరు. చక్రవర్తి పంపిన దూతల్ని వీరు చంపేసేరు. డబ్బు, మనుష్యులు, సైన్యాలు బ్రిటిష్ వాళ్ళ కాళ్ళముందుంచేరు.

పాటియాలారాజు సైన్యాలనిచ్చి తన తమ్ముణ్ణి స్థానేశ్వరం రోడ్డు కాపలాకోసం పంపించేడు. ఝింద్ రాజు పానిపట్ రోడ్డుకాపలా కాచేడు.

ఈ సంస్థానాధీశుల రక్షణల వెనక బ్రిటిష్ వాళ్ళు సన్నాహాలు చేసుకొని మే నెల 25వ తేదీన ఢిల్లీ మీదికి బయలు దేరేరు.

బ్రిటిష్ వాళ్ళ ఈ సేనలు ఢిల్లీకి వచ్చే దారిలో చేసిన దుష్కృత్యాలు వర్ణనాతీతం. దారిపొడుగునా వున్న గ్రామాల్ని తగులబెట్టేసేరు. గ్రామ ప్రజలందర్నీ చంపేసేరు.

ఇంగ్లీషు సైన్యాలు ఈ విప్లవం సాగిన రెండేళ్ళలోనూ ఈ మాదిరి విధ్వంసాలు ఒక కార్యక్రమం మాదిరిగా సాగించేరు.

ఈ హత్యా, విధ్వంస కాండలు ఏవిధంగా వుండేవో చూసి అనుభవించిన వారి ముఖతః విన్న కథలు కొన్ని ఈ మధ్య నవభారత టైమ్సులో వేసేరు.

ఆ కథ వినవలసిందే.

మీరట్ సమీపంలో ఘూంట్, పాంచాలీ అనే రెండు దగ్గర దగ్గర గ్రామాలు కలిసి వున్నాయి. విప్లవ పతాక ఆ గ్రామాల మీదకూడా ఎగిరింది. కొద్ది రోజుల్లోనే డిప్యూటీ కలెక్టరు హుల్సన్ కొంత మంది తెల్ల సైనికులతో ఆ గ్రామాన్ని చుట్టేసేడు. అక్కడినుంచి నాలుగుమూలలా వూరుకు నిప్పుముట్టించేరు. ఎవరికి పారిపోయి వచ్చినవారిని కాల్చేసేరు. కొందర్ని మంటల్లో పారేసేరు.

వూరికొచివర చిన్న గుడిసె వేసుకొని కొత్తగా కాపురం పెట్టిన హరిజన దంపతులు కాపురం చేస్తున్నారు. ఆమె ఆరాత్రే బిడ్డనికంది. ఇంటివద్ద మగడు లేడు. ఇంటి వెనకలు కాలుతూంటే ఆమెకి తెలివివచ్చింది. అతి కష్టంమీద ఆమె బయటకు బిడ్డతో వచ్చింది. ఎదుట హుల్సన్ గుర్రంమీద కూర్చునివున్నాడు. ఆమె ప్రార్థిస్తున్నా హుల్సన్ కత్తితో ఆ శిశువును నరికేసి, ఆ నవప్రసూతను మంటల్లోకి తోసేడు.

తర్వాత తగులబడుతున్న ఇంటివాసం ఒకటి పేలి ఒక కొరివి గుర్రంమీద పడడం, అది బెదిరి పరుగెత్తడం, రికాబుల్లో కాలు చిక్కుకొని ఈడిగిలబడ్డ హుల్సన్ చచ్చిపోవడం అది వేరే కథ.

అంబాలానుంచి ఢిల్లీకి నడుస్తున్న బ్రిటిష్ సైన్యాలతో కలియడానికై మీరట్ లోని సోల్జరు పటాలం కదిలింది. ఇవి రెండూ కలియకుండా అడ్డగించేటందుకు ఢిల్లీనుంచి ఒక సిపాయి పటాలం హిండన్ నదివద్దకు అడ్డం వచ్చింది. కాని వారు ఓడి పారిపోయేరు. ఈ యుద్ధంలో అనేకమంది సిపాయీలు అత్యద్భుతమైన సాహసం ప్రకటించేరు.

**ఆడవాళ్ళ నాలిక వాడి**

బజారులోని అమాయకులు వీళ్ళని ఈ హత్యాస్మరణం నుంచి రక్షించేరు. మందుపాతర పెట్టేరు. మరో మూడు వారాల్లో దానిని వెలిగించాలను కొన్నారు. ఆడవాళ్ళ నాలికవాడి దానికి వెంటనే నిప్పు పెట్టింది. ఇండియా బ్రిటిషవాళ్ళ చేతుల్లోకి వచ్చేక ఎప్పుడూ కనివిని ఎరుగని మహా ప్రమాదం మే 10 రాత్రి ప్రారంభమయింది."

— జె. సి. విల్సన్.

ఢిల్లీనుంచి వచ్చిన సిపాయి పటాలంలో అయిదు ఫిరంగులున్నాయి. వానిని స్వాధీనం చేసుకొనేటందుకు బ్రిటిష్ పటాలాలు ఎంతోమందిని పోగొట్టుకొంటున్నా తీవ్రంగా ప్రయత్నించేరు. చివరకు అంతమందినీచంపుకొనివారు చేయగలిగిందల్లా సిపాయీల్ని వెనక్కి తరమడం ఒక్కటే. ఫిరంగులు మాత్రంవారికి స్వాధీనం కాలేదు.

ఆ ఫిరంగులు ప్రమాదంలో పడ్డాయన్న సంగతి గ్రహించిన ఒక సిపాయీ సోల్జర్లు సమీపించగానే మందుగుండు పెట్టెలకు నిప్పుముట్టించేడు. మందుగుండు, ఫిరంగులతోపాటు అతడుకూడా పేలిపోయేడు. తానొక్కడే కాదు. సమీపించిన సోల్జర్లు కూడా చాలమంది చచ్చిపోయేరు.

సిపాయీలు ఈమాదిరిగా అసాధారణమైన సాహసం ప్రదర్శించినా ఓటమి తప్పలేదు. ఓడిపోయి ఢిల్లీనగరానికి తిరిగి వచ్చినా వారికి అవమానం తప్పలేదు. "పగరకు వెన్నిచ్చినవారో" నవ్వేవాళ్ళు ఒక్క తెలుగుదేశంలోనే పుట్టలేదు. ఆరోజున ఢిల్లీలో జనం పారిపోయి వచ్చినవారిని చేసిన ఎగతాళి చూసేక మర్నాడుదయమే కొత్తపటాలం బయలుదేరింది.

మే 31 న కూడా హిండన్ నదివద్ద యుద్ధం జరిగింది. ఈ పోరాటంలో ఇంగ్లీషు సైన్యాలు చాల నష్టపడ్డాయి. కాని, యుద్ధరంగం వదలలేదు. ఇంతలో నేపాల్ రాజు జంగ్ బహదూర్ పంపిన గూర్ఖా సైన్యాలు వారికి సహాయంవచ్చేయి. ఢిల్లీ పటాలాలు వెనక్కి తిరిగి పోయేయి.

జూన్ 7 వ తేదీన అటు అంబాలానుంచి వస్తున్నవీ, ఇటు మీరట్ నుంచి వస్తున్నవీ ఏకం అయ్యేయి. మరునాడవన్నీ ఢిల్లీవైపు ప్రయాణం సాగించేయి.

బుందేల్ కీ - సరాయి అనేచోట సిపాయి పటాలాలు ఫిరంగులతో వారిని ఎదుర్కొన్నాయి. ప్రారంభంలో ఇంగ్లీషు వాళ్ళు గట్టిదెబ్బ తిన్నారు. కాని, ఫిరంగుల్ని స్వాధీనం చేసుకొనేటందుకై వాళ్ళు తెగించి, కాల్పుల్ని లెక్కచేయకుండా మీదపడేసరికి సిపాయీలు ఫిరంగుల్నే వదిలి పారిపోయేరు.

అక్కడి నుంచి బ్రిటిష్ సేనలు ఢిల్లీ నగరాన్ని ఆనుకొని వుంచి కీలకస్థానంలోవున్న కొండగుట్టల్ని పట్టుకొనేటందుకై సర్వశక్తుల్నీ వినియోగించి కృత కృత్యం అయ్యేయి.

ఇంగ్లీషు సేనలను నిలవరించడానికై సిపాయీలు చాల తెగువచూపేరు.

"వాళ్ళు మహా మొండిగా యుద్ధం చేసేరు. ప్రతి అంగుళం మేరా యుద్ధంతోగాని స్వాధీనం కానీయ లేదు" అని ఇంగ్లీషు సేనాని కార్యాలయం ఒక నివేదికలో వారి పరాక్రమాన్ని పేర్కొంది.

ఇంత పట్టుదలా, పరాక్రమమూకూడ విఫలం అయ్యేయి. ఇంగ్లీషువాళ్ళ తరపున వచ్చిన "గూర్ఖా పటాలం, కాపట్లు, ఇతర దేశీసైన్యాలు చేసిన పని అద్భుతం, అభినందనీయం. వీరు ఇంగ్లీషు పటాలాలతో పోటీపడి యుద్ధాలలో పనిచేసేరు. ఝీంద్ రాజా మొద లయినవారు పంపిన దేశీపటాలాలుకూడా సైవానిలాగే అసమానంగా పనిచేసేయి" అని ఆనాడు బ్రిటిష్ సైన్యాలకు నాయకత్వం వహించిన బెర్నార్డ్ మరో నివేదికలో వ్రాసేడు.

ఢిల్లీ గోడలవద్దకు బ్రిటిష్ సైన్యాలు వచ్చేయి. కాని సేనాని ముఖాముఖి ముందుకు తోసుకువచ్చి ఢిల్లీ పట్టుకోడానికి సాహసం చేయలేకపోయేడు. ఇంకా సైన్యాలు కావాలి. పంజాబుకు సహాయంకోసం వ్రాసేడు. వాటి రాకకోసం ఎదురుచూస్తూ ఢిల్లీ ఎదుట నిలబడిపోయేడు.

## పంజాబులో తిరుగుబాట్లు

మీరట్‌లో తిరుగుబాటు జరిగిన వార్తరాగానే పంజాబులోని బ్రిటిష్ అధికారులు అతిత్వరగా జాగ్ర త్తలు తీసుకొన్నారు.

మొట్టమొదట వారుచేసినపని సిక్కుల్ని విప్లవంలో చేరకుండా చెయ్యడం. వారిలోవున్న ఒక వెర్రివిశ్వా సమూ, ఢిల్లీసింహాసనంయెడ వారికున్న అనంతమైన ద్వేషమూ ఇంగ్లీషువాళ్ళకి బాగా తోడ్పడింది.

సిక్కు గురువు గోవిందసింగ్‌ను ఔరంగజేబు హత్య చేయించేడు. ఆయన వంశీకుడు బహదూర్‌షా ఢిల్లీలో చక్రవర్తిగా ప్రకటించబడ్డాడు. తమ గురువును చంపించినవాని వంశాన్ని నిర్మూలించడం సిక్కుల బాధ్యత అని ఇంగ్లీషువాళ్ళు ప్రబోధం ప్రారంభించేరు.

తమ గురువును చంపినదానికి ప్రతిగా సిక్కు లొకనాడు ఢిల్లీనగరాన్ని నేలమట్టం చేస్తారని భవిష్య వాణి చెప్పినట్లు సిక్కుల్లో ఓ కథ ప్రచారంలోవుంది.

బస్! అటువంటి సమయం వచ్చిందని ఆంగ్లే యులు చెప్పేరు. ఈ విశ్వాసమూ, ద్వేషమూ వాళ్ళ కెంత వుపయోగించిందంటే విప్లవం జరిగిన రెండేళ్లూ ఇంగ్లీషు దావుటాను కాపాడ్డానికి సిక్కులు నిలబడ్డారు. దీనిలో మినహాయింపులు చాలా తక్కువ.

రెండోవేపున సరిహద్దు తెగల నాయకులకు బాగా ధనంఇచ్చి వారి దాడులు లేకుండా చూసుకొన్నారు.

పంజాబులోని స్కంధావారాల (Contonment) లో దేశంలో ఎక్కడికన్నా సోల్జర్ల పటా లాలు చాలా హెచ్చు. వాటి బలం చూసుకొని నెమ్మది నెమ్మదిగా స్వదేశీ పటాలాలనుంచి (హిందూ ముస్లిం పటాలాలనుంచి) ఆయుధాలను లాగెయ్యడం ప్రారం భించేరు. లాహోర్ సమీపంలోని మియామీర్‌లో, లాహోర్‌లోనే యుక్తిగా దేశీసైన్యాల ఆయుధాలు లాగేసేరు. లాహోర్‌కోటను చేతపట్టుకొని గట్టిపరచు కొన్నారు. అలాగే అమృతసర్ తిరుగుబాటుదారులకు చిక్కకుండా నిలబెట్టుకొన్నారు.

కాని, అన్నిచోట్లా వీరి ఎత్తులు పనికిరాలేదు.

పెషావరులో దేశీ పటాలాన్ని నిరాయుధం చేసిన వార్త తెలియగానే సమీపంలోనేవున్న హోతీమర్దన్ అనే చోట వున్న పటాలం తిరుగుబాటు చేసింది. ఎక్కడో దూరాన, ఇంగ్లీషు పటాలాల మధ్యవున్న ఈ సైన్యం తిరగబడడం, ఆత్మహత్యాసదృశమే. ఐనా వారు తిరగబడ్డారు. కాని నాలుగువేపులనుంచీ శత్రు వులు తరుముకొని వస్తూంటే వారు కాశ్మీర్‌లో ప్రవే శించడానికి ప్రయత్నించేరు. కాని, కాశ్మీర్ రాజు గులాబ్‌సింగ్ ఇంగ్లీషు వాళ్ళ మెప్పు సంపాదించడం కోసం హద్దులలో ప్రవేశించిన వారందరినీ చంపించేసేడు. ఇంగ్లీషువాళ్లు కొందర్ని చంపేసేరు. ఆయాసం, తిండిలేమితో, కొందరు చచ్చిపోయారు. మొత్తం పటాలం పటాలంయావత్తూ వేయిమందీ ఊచకోత అయి పోయేరు.

ప్రతిచోటా సిపాయీలకు ఈ దుర్దశా పట్టలేదు.

మే 13 వ తేదీన ఫిరోజ్‌పూర్‌లో ఇంగ్లీషువాళ్లు రెండు దేశీపటాలాల మనస్థితిని పరిశీలించడానికై కవాతు మైదానంలోకి తెచ్చేరు. అనుమానించదగిన కారణం కనబడలేదు. ఆయుధాలు తీసుకోకుండానే మళ్ళీ వెనక్కి తీసుకెళ్లేరు. వాటిలో ఒక పటాలం నగర వీధుల్లోంచి పోతూంది. జనం తీవ్రమైన ప్రోత్సాహం ఇచ్చేరు. బజారు దాటేసరికి పటాలం తిరుగుబాటు చేసింది. తిన్నగా అక్కడినుండి అల్లా ఢిల్లీవేపు వెళ్ళిపోయేరు. సిపాయీలతోపాటు ప్రజలు

కూడా ఈ తిరుగుబాటులో పాల్గొన్నారు. యూరపియన్ల బంగళాలు, ఆఫీసులు తగులబెట్టేసేరు.

సిపాయీలు వెళ్ళిపోయేక ఇంగ్లీషుపటాలాలు నగర ప్రజలమీద కసి తీర్చుకొన్నారు.

ఈ ఘటనలన్నీ చూస్తూన్న జలంధర్ ప్రాంతంలోని సిపాయీ పటాలాలు తిరగబడ్డానికి నిర్ణయించుకొన్నాయి. తొందరపడకుండా తమ గమ్యం సాధించుకొనేటందుకు ఒక పథకం వేసుకొన్నారు. దాని ప్రకారం ప్రయత్నాలు చేసుకొంటుండగా ఆ రహస్యం తెలిసిపోయింది. ఇంగ్లీషువాళ్ళు సన్నాహాలు చేసుకొన్నారు.

కాని సిపాయీలు చూపిన ఓర్పు, శాంతమూతో అధికార్లకు తమ అనుమానాలు అకారణం అనిపించింది. ఢిల్లీని ముట్టడిస్తున్న ఇంగ్లీషు సేవలకు సంభారాలు వెడుతున్నా సైనిక పటాలాలలో కదలిక లేకపోయేసరికి ఆఫీసర్లు పరాకుతుగా వున్నారు. ఆ సమయంలో జూన్ 9న జలంధర్, ఫిల్లౌర్ లలోని పటాలాలు తిరుగుబాటు చేసేయి.

ఈ రెండు పటాలాలూ లూధియానావేపు బయలుదేరేయి. వాని గమ్యం ఢిల్లీ. దారిలో వారు సట్లెజ్ నదిని దాటాలి. దాటకుండా ఇంగ్లీషువాళ్ళకి సహాయంగా నాభా రాజు సైన్యాలు వచ్చేయి. వంతెన కూలగొట్టినా విప్లవకారులు చీకటిమాటున మరోచోట నదినిదాటడం ప్రారంభించేరు. ఆ వార్త తెలిసి బ్రిటిష్, శిక్కు పటాలం దాడి ప్రారంభించింది. రాత్రి, పది పన్నెండు గంటలవేళ విప్లవసేనలు మొండిపట్టుదలతో తమ స్థానాన్ని కాపాడుకొంటూ శత్రువును దెబ్బ తీసేయి. వారు పారిపోయేరు. మరునాడు మధ్యాహ్నానికి విజయోపేతంగా విప్లవదళాలు లూధియానాలో అడుగుపెట్టేయి. వారికి నగర ప్రజ మహోత్సాహంతో స్వాగతం ఇచ్చింది. ప్రజలుముందుండి చూపిస్తూంటే సిపాయీలు తెల్లపరిపాలన చిహ్నాలన్నింటినీ నిర్మూలించేరు. తెల్లవాళ్ళ బంట్లుగా దేశద్రోహంచేస్తున్నవారిని తరిమేసేరు. జైళ్ళుపగలకొట్టేరు. కోట వారిచేతికి చిక్కింది.

లూధియానా విముక్తం అయింది.

కాని సిపాయీలు అక్కడ నిలవడడానికి ప్రయత్నించలేదు. వారూ ఢిల్లీవేపే బయలుదేరి పోయేరు.

## ఆలీఘర్ ప్రాంతంలో

ఆలీఘర్ ప్రాంతంలో సిపాయీల తిరుగుబాటుకి ఇంగ్లీషువాళ్ళే ప్రత్యక్షంగా తోడ్పడ్డారు. అదెలాగంటే మండుతున్న మంటలలో నెయ్యిపోసినట్లు వాళ్ళు బుద్ధిహీనతను చూపేరు.

మే నెలలో ఒక యువకుడు బొలాంద్ అనేచోట జనంలోనూ, సైనికులలోనూ విప్లవప్రచారం చేస్తూండగా బ్రిటిష్ అధికార్లు పట్టుకొన్నారు. తిరగబడ్డాలన్న వారికి గుణపాఠం చెప్పాలని ఆయనను ఆలీఘర్ తీసుకొచ్చి ఉరితీసేరు. ఉరిసమయంలో ఆలీఘర్, బొలాందు పటాలా లన్నింటినీ అక్కడ నిలోబెట్టేరు.

ఈ దుశ్చర్యకి సైనికులు ఉడికిపోయి వెంటనే తిరుగుబాటు చేసేరు.

ఇటావాలో కూడా ఇటువంటి ఘటనే మరొకటి జరిగింది.

మీరట్ లో తిరుగుబాటు చేసిన సిపాయీలలో కొందరు ఇటావా వచ్చేరు. అక్కడి కలెక్టరు వాళ్లను గస్తీ తిరిగేటందుకై తయారుచేసిన ఒక దళం వాళ్ళని చూచి లొంగిపొమ్మని ఆజ్ఞాపించింది. సిపాయీలు లొంగిపోతున్నట్లే నటించి దగ్గరగా వచ్చేక తమని పట్టుకొనేటందుకు వచ్చినవారిని నరికేసేరు.

ఈ వార్త తెలిసి ఇటావాలో వున్న ఒక పటాలాన్ని పంపి మీరట్ సైనికుల్ని తీసుకురమ్మన్నారు. వీరు వెళ్ళేసరికి ఇటావా ప్రజలు ఆ మీరట్ వీరులకు బ్రహ్మాండమైన స్వాగతం ఇస్తున్నారు. వారినందరినీ చంపడానికి తెల్ల అధికారి ఆజ్ఞలిచ్చి ముందుకు నడిచేడు. కాని సైనికు లెవ్వరూ ఆయన ఆజ్ఞలు పాలించలేదు. ఒంటిగా ముందుకు వచ్చిన అధికారిని మీరట్ సిపాయీలలో ఒకడు కాల్చివేశాడు.

ఆ ఘటన అక్కడితో ఆగింది. కాని ఆ మునాడే ఆలీఘర్ లో తిరుగుబాటు జరిగిన వార్త తెలిసి ఇటావాలో సైనికులుకూడా తిరుగుబాటు చేసేరు.

మైనపూర్ అనే చోట ఘటనలు మరొక పద్ధతిలో సాగేయి. అక్కడి సిపాయీలకు విప్లవంమీదా, విప్లవకారులమీదా పూర్తి సానుభూతి వుంది. ఆ మొదటి రోజుల్లో మీరట్ తిరుగుబాటులో పాల్గొన్న రానాథ సింగ్ అనే ఆయన జీవంతి అనే వూరు వచ్చినట్లు ఇంగ్లీషువాళ్ళకి మైనపూర్ లో తెలిసింది. ఆయనను పట్టుకొని రమ్మని అధికార్లు కొందరు సిపాయీల్ని పంపేరు. వారాసింగ్ ను గ్రామంలోంచి పంపేసి అక్కడ ఎవ్వరూ దొరకలేదని చెప్పేరు. అలాగే రామదీన్ సింగ్ అనే తోటి సిపాయీని అధికార్లు జైలుకు పంపుతూంటే దల్లగా వానిని విడిపించి పంపేసేరు. గ్రామాలలో అల్లకల్లోలం పెరుగుతూందని

తెలిసి, వానిని అణిచివెయ్యడానికై మీనపూర్ అధికార్లు సైనికదళాన్ని గ్రామాలమీదకు పంపేవారు. కాని, వారు గ్రామాలన్నీ ఓచుట్టు చుట్టి లేచివచ్చేవారు.

ఇటువంటి పరిస్థితిలో అలిఘర్‌లో ఇంగ్లీషువాళ్ళు ఆ యువకుణ్ణి వురితీయడం చాల ఉద్రేకపరచింది.

కాని ఈ ప్రదేశాలలో ఎక్కడా సిపాయీలు ఇంగ్లీషువాళ్ళమీద చేయిచేసుకోలేదు. ఆ యువకుణ్ణి వురితీసిన కోపంతో రగిలిపోతున్నా సైనికులు ఇంగ్లీషువాళ్ళనిపిలిచి "బతికి తలుచుకుంటే బయటికి పొమ్మ"న్నారు. ఇటావాలోనూ అంతే. మీనపూర్‌లోనూ అంతే. ఎంతో కోపాలున్నా ఎవ్వరినీ ఏమీ చెయ్యలేదు. ఊరువదిలి పొమ్మన్నారు. వాళ్ళు పోయేక స్వాతంత్ర్యంవచ్చినట్లు వూళ్లల్లో టముకులేయించేరు.

ఈ నగరాలన్నింటాకూడా విప్లవకారులు ట్రెజరీలు స్వాధీనంచేసుకొన్నారు. ఆయుధాగారాలను ఖాళీచేసి చేతబట్టుకొన్నారు. వాటన్నింటితో రాజధానీనగరం వైపుగా కదిలివెళ్ళేరు.

రోహిల్ఖండ్ రాష్ట్రంఅంతటా మే 31 వ తేదీన ఒక్కమారుగా తిరుగుబాట్లు జరిగేయి.

మీరట్‌లో తిరుగుబాటు జరిగినవార్త తెలియగానే ఇక్కడున్న ఇంగ్లీషువాళ్ళు తమ భార్యాబిడ్డల్ని నైనితాల్ పంపేసేరు. ఇక్కడ సిపాయీలకు కొవ్వు తూటాల నివ్వబోమని హామీ యిచ్చేరు. ఆ విధంగానే రాష్ట్రం అంతటా ప్రకటనకూడా చేసేరు.

కాని, అవేవీ పనిచేయలేదు.

మే 31 వ తేదీన ఉదయం 11 గంటలవేళ బరేలీలో తిరుగుబాటు జరిగింది. కొద్దిగంటల తేడాలో మొరాదాబాద్, షహాజహాన్‌పూర్, బదూన్ మొదలయిన నగరాలలోకూడా తిరుగుబాట్లు జరిగేయి. నగరాలన్నీ స్వాతంత్ర్యం ప్రకటించేయి.

బరేలీలో సిపాయిదళాలు అక్కడున్న దేశీ ఫిరంగి సైన్యంలో సుబేదారుగావున్న బఖత్‌ఖాన్ అనే వానిని సేనాధిపతినిగా ఎన్నుకొన్నాయి. ఆయన నాయకత్వాన సైన్యాలన్నీ ఢిల్లీనగరానికి కదిలేయి.

ఈ బఖత్‌ఖాన్ ఢిల్లీకి చేరేక చక్రవర్తివద్ద సైనిక కోర్టులో సభ్యుడయ్యేడు. ఢిల్లీ రక్షణలోనూ, అనంతరమూ ఈయన అనేక పోరాటాలలో అసమానమైన పట్టుదల చూపించేడు.

## బెనారెస్ రాష్ట్రంలో

దేశం అంతటా సిపాయీ పటాలాలు తిరుగుబడుతున్న వార్తలు వినవస్తుండగనే ఇంగ్లీషువాళ్ళు వారణాసిలో తగు జాగ్రత్తలు తీసుకొని మొగ్గలోనే తుంపేసేరు. సంస్థానాలను, సంపదలను కోల్పోయి కాశీ విశ్వేశ్వరుని సన్నిధిలో కాలం గడపడానికివచ్చిన సిక్కురాజులు, సర్దార్లూ ఈ ప్రయత్నంలో ఇంగ్లీషువాళ్ళకి బాగా తోడ్పడ్డారు. వారణాసిరాజు కూడా తన సర్వస్వం బ్రిటిష్ వాళ్ళ రక్షణకుపయోగించేడు.

వీరికితోడు మద్రాసునుంచి జనరల్ నీల్ అనే సేనాని సోల్జరు పటాలాలతో కాశీచేరి అక్కడి సిపాయీ పటాలాన్ని తరిమివేసి స్థానం గట్టిపరచుకొన్నాడు. ఆ సిపాయీలు అయోధ్య పోయేరు.

ఈ విధంగా రాష్ట్రరాజధాని శత్రువుల చేతుల్లో వుండిపోయినా రాష్ట్రం అంతటా విప్లవం వ్యాపించిపోయింది. సిపాయీలు చేయలేకపోయిన పనిని రైతులూ, జమీందార్లూ చేసేరని ఒక ఇంగ్లీషు చరిత్రకారుడు వ్రాసేడు. రాష్ట్రం అంతటా ప్రజలు లేచి ఎక్కడికక్కడ ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చేసేరు. తంతితీగలు తెంపేసేరు. ఇంగ్లీషువాళ్లు తెచ్చి నియమించిన కొత్త జమీందార్లని తరిమేసేరు.

ఇంత ద్వేషంవున్నా రాష్ట్రంలో ఎక్కడా ఇంగ్లీషువాళ్ళని చంపడం జరగనేలేదు.

అజింఘర్‌లో సిపాయీ పటాలం తిరగబడినప్పుడు జూన్ 3 న ఇంగ్లీషుజనం ఉక్కిరిబిక్కిరిగా పరుగెత్తడం ప్రారంభించేరు. వెంటనే సిపాయీలు వారిని ఒకచోట చేర్చి వెంటనే నగరం విడిచి వెళ్ళిపొమ్మని కోరేరు. ఆఫీసర్ల భార్యలు పదచలనం చేయలేరు మరి. వెంటనే బళ్లు తెచ్చేరు. తెల్లవాళ్ళని, ఆడ, మగవాళ్ళందర్నీ ఎక్కించేరు. దారిలో వాళ్ళకి ప్రమాదం జరక్కుండా కొంత దళాన్ని రక్షణకిచ్చేరుకూడా. బెనారెస్ పంపేరు.

7 లక్షల రూపాయలు, బోలెడు ఆయుధాలతో ఈ సైన్యం (అజింఘర్) ఫైజాబాద్‌కు వెళ్లింది.

ఇది జరిగిన మూడో రోజునే బెనారస్‌లో సైన్యాన్ని నిరాయుధం చేయడానికి ప్రయత్నిస్తేవారు తిరగబడ్డారు. కాని శిక్కులు, వారణాసిరాజు, ఇంగ్లీషు వాళ్ళ పటాలాలమధ్య నిలువలేక అయోధ్య పోయేరు. ఆ విషయమేపైన చదివేరు.

బెనారెస్‌ను గట్టిపరచుకొన్నాక జనరల్ నీల్ రాష్ట్రప్రజలమీద కసితీర్చుకొనేటందుకు పూనుకొన్నాడు. ఇంగ్లీషువాళ్ళనీ, శిక్కుల్నీ చేర్చి చినచిన్న దళాలుగా చేసి గ్రామాలపైకిపంపేరు. గ్రామాలలో కనపడ్డ వాళ్ళని కనపడ్డట్లు నరికేసేరు. లేకపోతే ఉరితీసేరు.

ఒక స్తంభం చాలక వరసన స్తంభాలు పాతేరు. అవీ చాలలేదు. చెట్టు కొమ్మలకి వురితీసేరు. ఒక్కొక్క చెట్టున బోలెడు కొమ్మలుంటాయి. ప్రతి కొమ్మా ఒక ఉరికొయ్య అయింది.

ఇదీ చాలలేదు. ఒక ఊరా, ఒక లోకమా? దేశం దేశమే తిరగబడిందాయె. కనక వూళ్ళకి వూళ్ళే తగలబెట్టడం ప్రారంభించేరు. మీరట్ వద్ద జరిగిన ఘట్టం ఒకటి పైన వ్రాసేను.

“జనంతో నిండివున్న ఒక పెద్ద గ్రామానికి నిప్పు పెట్టేము. చుట్టూ కమ్ముకొని బయటికి వచ్చిన వాళ్ళని కాల్చేసేము” అని ఇంగ్లీషు సైనికుడొకడు వ్రాసిన వుత్తరాన్ని ఛార్లెస్ బాల్ అనే అతడు ఉదాహరించేడు.

అలా వెళ్ళిన ఒక దళం నాయకుడు ఇంగ్లండుకు వ్రాసిన జాబులో “యిరవై ఊళ్ళన్నీ నేలమట్టం చేసేము మేము.” అని వ్రాసేడు.

బెనారస్‌లాగే అలహాబాద్‌ను కూడా ఇంగ్లీషువాళ్ళు శిక్కుల సహాయంతో కాపాడుకోగలిగేరు.

ఇక్కడ జూన్ 6 న తిరుగుబాటు జరిగింది. అంతకుపూర్వమే తెల్లవాళ్ళు కుటుంబాలతో సహా కోటలోకి చేరుకొన్నారు. ఒక్క కోటమీద తప్ప నగరంలోగాని అలహాబాదు రాష్ట్రంలోగానీ ఎక్కడా ఇంగ్లీషు వాళ్ళ జెండా మిగలలేదు. ఈ రాష్ట్రంలో తాలూద్దార్లు హెచ్చుగా ముస్లిములున్నారు. రైతులంతా హిందువులు. కాని ఇంగ్లీషు వాళ్ళని తరిమెయ్యడంలో రెండు మతాలూ, రెండు వర్గాలూ ఏకం అయినాయి.

ప్రతి గ్రామంలోనూ రక్షణదళాలు ఏర్పడ్డాయి. ముసలివాళ్ళయి పెన్షను తీసుకొన్న మాజీ సిపాయిలు వాళ్ళకి సాయం వచ్చేరు.

అలహాబాద్ పట్టణంలో లియాకత్ అలీ అనే అతను విప్లవకారులకి నాయకత్వం వహించేడు. విప్లవానికి పూర్వం ఆయన ఒక అధ్యాపకుడు. ప్రజాభిమానం పొందినవాడూను. అలహాబాద్ రాష్ట్రం స్వాతంత్ర్యం ప్రకటించగానే రాష్ట్రంలోని జమీందార్లూ, ఇతరులూ ఆయన్ని రాష్ట్ర ప్రధానాధికారినిగా ఎన్నుకొన్నారు. ఆయన ఖుస్రూబాగ్‌లో కార్యాలయం పెట్టుకొని రాష్ట్రంలోని విప్లవ కేంద్రాలను ఒక నిర్మాణం క్రిందికి తేవడానికీ, శాంతిస్థాపనకూ పూనుకొన్నాడు.

అలహాబాద్‌లో తిరుగుబాటు వార్త తెలియగానే కల్నల్ నీల్ బెనారస్‌నుంచి సేనలతో పరుగెత్తి వచ్చేడు. ఆయన వచ్చేక ఇంగ్లీషు సేనల్ని మాత్రమే కోటలో వుంచి సిక్కు దళాన్ని కోట వెలపల పెట్టేరు. ద్రోహులమీద ఎవ్వరికీ నమ్మకం వుండడం అసంభవం!

జూన్ 17 న ఖుస్రూబాగ్ మీద ఇంగ్లీషు సేనలు దాడి ప్రారంభించేయి. ఒక రోజు యుద్ధం చేసేక లియాకత్ సేనల్ని వెంటదీసుకొని కాన్పూరు తరలిపోయేడు. అప్పటికి కాన్పూరులో తిరుగుబాటు జరిగి, కోటముట్టడి అవుతూంది.

అలహాబాద్ కూడా బెనారస్ లాగే ఇంగ్లీషువాళ్ళ చేతుల్లో మిగిలింది.

కాని రాష్ట్రంలో ప్రజలు మాత్రం లొంగలేదు. ఇంగ్లీషు వాళ్ళు విప్లవానికి నాయకత్వం వహించిన వారి పేర్లను ప్రకటించి ప్రతిఒక్కరికీ బహుమతులిస్తామన్నారు. కాని ప్రజలెవ్వరూ కక్కుర్తిపడలేదు. ఒక వూళ్ళో జరిగిన సంగతిని ఒక చరిత్రకారుడు ఇలా వర్ణించేడు.

“ప్రజలు అందరూ బాగా ఎరిగిన ఒక తిరుగుబాటుదారు నాయకుణ్ణి పట్టిఇచ్చినా, చంపి తెచ్చినా వేయిరూపాయల బహుమానం ఇస్తామని మేజిస్ట్రేటు ప్రకటించేడు. కాని, ఒక్కడూ ముందుకు రాలేదు. వాళ్ళకి మనమంటే (ఇంగ్లీషువాళ్ళు) అంత ద్వేషం.”

నాయకుల్ని పట్టి ఇవ్వడం, పత్తా చెప్పడం మాట అటుంచండి. ఆఖరుకి ఇంగ్లీషు వాళ్ళకి ఏవన్నా సరుకులు అమ్మడం కూడా అపరాధమే. దానికి [illegible] కఠినమైన శిక్ష విధించేరు.

“ఇంగ్లీషు వాళ్ళ దగ్గిర ఎవ్వడన్నా పనికి వెడితే ఈ హంతకులు చంపేస్తున్నారు. ... ఒక నర్తకుడు

## అంబర్పూర్ కోట

1858 ఫిబ్రవరి 25 న అయోధ్య రాష్ట్రాన్ని జయించడానికి వస్తున్న నేపాలీ, బ్రిటిష్ సైన్యాల్ని అంబర్పూర్ అనే అడవికోట అడ్డం కొట్టింది. అందులో వున్నది 34 మంది సిపాయిలు మాత్రమే. ఆఖరువాడు కూడా చచ్చిపోయే వరకూ కోట లొంగలేదు.

“ఎంతో పట్టుదల, పరాక్రమంతో దానిని కాపాడేరు. ఫలితంగా దాడిదారుల్లో ఏడుగురు చచ్చిపోయేరు. 48 మంది గాయపడ్డారు. కోటను కాపాడుతున్న వారంతా తమ స్థానాల్లో మరణించేరు.”

—మాలిసన్.

సునకి రొట్టె అమ్మేడని అతనిచేయి నరికి, ముక్కు-కోసేరు" అని ఇంకో ఇంగ్లీషువాడు వ్రాసేడు.

వాళ్లకి జాలీలకు మనుష్యులులేరు. బళ్లులేవు. సరుకులులేవు. ప్రజలంతా ఏకకంఠంతో వారి కెదురు తిరిగేరు

ఇటువంటి ప్రజని లొంగదీయడంకోసం బెనారస్ రాష్ట్రంలో చేసినట్లే జనరల్ నీల్ ఇంగ్లీషు శిక్కు-సైనికుల్ని దళ దళాలుగా పంపి గ్రామాలకు గ్రామాలనే నాశనం చేసేడు. వేలకొద్దీనుంచి స్త్రీలు, పిల్లలు, సైనికులు, పౌరులు అందరినీ గుత్తులు గుత్తులుగా చెట్లకు వేళ్ళాడదీసేరు.

హోమ్సు అనేవా డిల్లా వ్రాసేడు:

"ముసలివాళ్లు మనకేమీ అపకారం చేయలేదు. నిరపరాధులు స్త్రీలు. పసి పాపల కేమీ తెలియదు. కాని వీళ్ళందరూ మన కసికి గురి అయ్యేరు."......

## కాన్పూరు చేరిక

1857 విప్లవంలో నాయకత్వం వహించిన ప్రసిద్ధులలో నానా సాహేబ్ ది కాన్పూరు దగ్గరున్న బిఠూరు. రాణీ లక్ష్మీబాయిది ఝాన్సీ.

ఈ రెండు కేంద్రాలలోనూ కూడ జూన్ 4 వ తేదీన తిరుగుబాటు ప్రారంభ మయింది.

మీరట్ లో తిరుగుబాటు సంగతి తెలియగానే కాన్పూరులోవున్న ఇంగ్లీషు సేనాని గంగవొడ్డునే ఒక రక్షణ స్థానం నిర్మించుకొని దానిలోకి తన జనాన్ని తర్లించిజాగ్రత్త పడ్డాడు. ఖజానారక్షణభారం,తమరక్షణ భారం తీసుకోవలసిందనీ, సాయపడమనీ నానా సాహేబ్ ను కోరేడు. నానాసాహేబ్ కాన్పూరు సమీపంలోని బిఠూర్ లో వుంటున్నాడు. దీనికే బ్రహ్మావర్తం అనేది మరో పేరు. ఇంగ్లీషు వాళ్ళకోరిక మేరకు నానాసాహేబ్ తన బలగంతో కాన్పూరు వెళ్ళేడు.

ఒక నేపున అగ్నిహోత్రంలాగ విప్లవం చుట్టుముట్టుతూవున్నా ఇంగ్లీషు అధికార్లు తెపుదురభిమానం, దురన్యాయం మానుకోలేదు. ఓ రోజున ఓ ఇంగ్లీషు సైనికుడు తప్పతాగి ఒక సిపాయిమీద తుపాకీ కాల్చేడు. అది గురితప్పి సిపాయి బ్రతికేడు. కోర్టులో ఆ సోల్జరుమీద కేసుపెట్టేడు. కాని ఇంగ్లీషు మాజిస్ట్రేటు సోల్జరును విడుదలచేస్తూ "ఒళ్ళెరగని దశలో తుపాకీ దానికదే పేలింద"న్నాడు.

ఇల్లాంటి క్రూరత్వం: న్యాయం కొత్తకాదు. ఇంకో కప్పుడైతే సాగిపోయేది. కాని ఇప్పుడు కాలం మారింది.

సిపాయీలలో క్రోధం చెలరేగివున్నా అదివరకే లక్నోనుంచి వచ్చిన బలమైన ఇంగ్లీషు పటాలం నగరంలో వుండడంచేత తొందరపడలేదు. జూన్ 3 వరకూ ఆ సైన్యం పట్టణంలోవుంది. ఏమీ గంద్రగోళం లేకపోవడం గమనించి ఆ రోజున లక్నో తిరిగి పోయింది. వాళ్ళు బయలుదేరిపోయిన 24 గంటలలో కాన్పూరులో తిరుగుబాటు ప్రారంభమయింది. విప్లవ సైన్యాలు 5 వ తేదీనుంచి ఇంగ్లీషువాళ్ళు తలదాచుకొన్న కోటమీద ముట్టడి ప్రారంభించేయి.

ఈ ముట్టడి 21 రోజులు జరిగింది. ఈ మహా పోరాటంలో నగరంలోని ప్రజానీకం యావత్తూ అన్ని వర్గాలవారూ పాల్గొన్నారు. మహోత్సాహంతో పాల్గొన్నారు.

ఆ రోజులలో విప్లవకారుల విషయాలను గమనించే టందుకు వచ్చిన ఒక గూఢచారి వ్రాసిన నివేదికలో ఇల్లా వ్రాసేడు:

"మహమ్మదీయుడి వేషంలో నేనోచాప పరచుకుని కూర్చున్నాను. చాలమంది ప్రజలు యుద్ధం చేస్తున్న సిపాయీలకు దాహమూ, తిండీ యిచ్చి తిరిగి వస్తూ నన్ను చూసేరు. వాళ్ళల్లో ఒకరు నావద్దకు వచ్చేరు. "మన వాళ్ళామెయిని యుద్ధం చేస్తూంటే... నువ్వలా వున్నావు. దోమల్ని కొట్టుకొంటూ కూర్చోడానికి సిగ్గులేదూ? రా. ఫిరంగులవద్ద సాయం చెయ్యి"-అన్నారు.

నగరంలో అజీజాన్ అనే వేశ్య వుండేది. ఆమె యిల్లు తిరుగుబాటుదారులకి అడ్డాగా వుండేది. తిరుగుబాటు ప్రారంభమైన తర్వాత ఆమె గుర్రంమీద సిపాయీల పంక్తులలో తిరుగుతూ ప్రోత్సాహం ఇచ్చింది.

తిరుగుబాటు ప్రారంభమయి ఇంగ్లీషువాళ్లు కోటలోకి పోగానే నగరంలో స్వాతంత్ర్యం ప్రకటించబడింది. వెంటనే పరిపాలన శాఖలకు వుద్యోగుల్ని ఏర్పరచేరు. పెద్దల నుంచి న్యాయాధిపతుల్ని ఎన్నుకొన్నారు. సివిల్, క్రిమినలు కేసుల విచారణకు కోర్టులు ఏర్పరచేరు. నగరంలో ఆహార పదార్థాల సరఫరాలు చూడ్డానికి ఒక వుద్యోగిని నియమించేరు.

ఆ రోజుల్లో దోపిడీలు చేయడం, మరో మతం వాళ్లని అవమానించడం ఘోరమైన నేరాలుగా పరిగణించేరు. చిన్నదొంగతనాలకు గాడిదల నెక్కించి అవమానించేరు.

కాన్పూరులో యుద్ధం జరుగుతున్న కాలంలో బెనారెసు, అలహాబాద్ రాష్ట్రాలలో ఇంగ్లీషువాళ్లు చేస్తున్న



జనరల్ నీల్ సైన్యాలు వేలకొద్దిమంది సిపాయిల్నీ, పౌరుల్నీ గుత్తులు గుత్తులుగా చెట్లకు వ్రేలాడదీసేయి.

42-44 పుటలు.

దురంతాలకు ఉడికి పోతున్న సిపాయిలూ, ప్రజలూ అనేకమంది కాన్పూరు వచ్చేరు. దేశంలో జరుగుతున్న ఘోరాలకు ప్రజలు వుడికిపోయేరు.

చివరకు ఇంగ్లీషువాళ్ళు లొంగిపోయి నానా సాహేబ్ ఇచ్చిన పడవల్లో సురక్షితంగా అలహాబాద్ వెళుతున్నారనే సరికి భరించలేక పోయేరు. పడవల్ని నాశనంచేసి ఇంగ్లీషువాళ్ళని చంపేసేరు. అతి కష్టం మీద నానాసాహేబ్ 125 మందిని రక్షించి జైలులో పెట్టగలిగేడు.

కాన్పూరు జూన్ 26 న పట్టుబడింది.

కాని, ఝాన్సీలో కోట రెండురోజుల్లోనే పట్టుబడింది. ఇంగ్లీషువాళ్లు ఆయుధాలు కిందపెట్టేసి లొంగిపోయేరు. ఇక్కడ కూడా లొంగిపోయిన వారిని చంపేసేరు.

## అయోధ్య రాష్ట్రంలో

అసలు విప్లవం నిర్మాణయుక్తంగా జరిగిందీ, సుదీర్ఘకాలం ఇంగ్లీషువాళ్ళను తిప్పలు పెట్టిందీ అయోధ్య రాష్ట్రంలోనే.

ఇక్కడే విప్లవం అన్ని వర్గాలలోనూ పాతుకుపోయింది అని చెప్పడానికి వీలుంది.

అనుకొన్న ప్రకారం మే 31 న లక్నోలో తిరుగుబాటు ప్రారంభమయింది. వారం పది రోజులలో రాష్ట్రంలో ఎక్కడా ఇంగ్లీషు పరిపాలన నామరూపాలు లేకుండా పోయింది.

అయోధ్యలో వచ్చిన విప్లవాన్ని గురించి చెప్పినప్పుడు మౌల్వీ అహమ్మదుషాను గురించి చెప్పడం చాల ప్రధానం.

అహమ్మదుషా ప్రారంభంనుంచీ విప్లవానికి వెన్నెముకల్లే నిలబడ్డాడు. ఆయన మంచివక్త. మంచి వ్రాయసకాడూను. ఆయన వుపన్యాసాలూ, పత్రాలూ రాజకుటుంబాలనుంచి, నడివీధి జనంవరకూ వుత్తేజపరిచేవి. అయోధ్య రాష్ట్రం అంతటా ఆయన పర్యటించి ప్రచారం చేస్తుండగా ఆంగ్లేయులు ఆయనను అరెస్టు చేయడానికై ఆజ్ఞలు జారీచేసేరు. కాని, పోలీసులు ఆయనను ముట్టుకోలేరు. అధికారులు మిలిటరీని పంపి అరెస్టు చేయవలసివచ్చింది. విచారణ జరిపి ఉరిశిక్ష విధించేరు. కాని ఆ శిక్ష అమలుజరిగేలోపున

### నౌపారా రాజ వంశం దేశభక్తి

"పరిపాలకులమార్పులో నౌపారా రాజుకన్న బాధపడిన మనిషి లేడు. ఇంగ్లీషు ప్రభుత్వం ఏర్పడగానే ఆయనకు వెయ్యి వూళ్ళిచ్చేరు. మిగిలిన వాళ్ళందర్నీ కాదని తల్లిని సంరక్షకురాలిని చేసేం. కాని, ఆమె సైన్యం ఆదినుంచీ లక్నోలో మన మీద యుద్ధం చేస్తూనేవుంది."

—లార్డుకానింగ్ లేఖ.

సైనికులూ, ప్రజలూ తిరుగుబాటుచేసి జైళ్లు బద్దలు కొట్టేరు. మౌల్వీ విడుదల అయిన వెంటనే విప్లవానికి నాయకత్వం వహించేడు.

బయటకు రాగానే మౌల్వీ తనకు జైలులో హుక్కా యిచ్చినందుకు బ్రిటిష్ అధికార్లకు అభినందనాలు తెలిపేడు. తర్వాత ఇంగ్లీషువాళ్లని నగరం వదిలిపొమ్మని ఆజ్ఞాపించేడు.

సిపాయీ పటాలాలు విడబడి అల్లర్లు సాగించకుండా వెంటనే చర్యలు తీసుకొన్నాడు. ప్రభుత్వ భవనాలకు, మందు గిడ్డంగికి, ఖజానాకు సైనిక బందోబస్తు ఇచ్చేడు. హత్యలు మొదలయినవి జరక్కుండా కట్టుదిట్టాలు చేసేడు. ఇంగ్లీషువాళ్లని స్వంత ఆస్తి తీసుకుపొమ్మన్నాడు. పడవలు ఎక్కించి పంపేసేడు. జూన్ 9 న ఫైజాబాద్ విముక్తి ప్రకటించబడింది.

ఈ మధ్యకాలంలో జిల్లా తర్వాత జిల్లా, నగరంతర్వాత నగరం, ప్రతివూరూ, ప్రతి సైనిక కేంద్రమూ విప్లవకేతనం ఎత్తి స్వాతంత్ర్యం ప్రకటించేయి.

ఈ విధంగా పదిరోజుల్లో అయోధ్య రాష్ట్రంలో కంపెనీ పరిపాలన కలలాగ కరిగిపోయింది. సైన్యాలు తిరగబడ్డాయి. ప్రజలు తిరగబడ్డారు. కాని ఎక్కడా క్రౌర్యం ప్రతీకారేచ్ఛా కనబడలేదు. ఎక్కడో కొన్ని చోట్లమినహాగా ప్రజలు అంత ఆవేశంలోనూ, అంత అల్లకల్లోల పరిస్థితిలోనూ అంతవరకూ తమపై దౌర్జన్యాలుచేసిన ఆ కాందిశీకుల విషయంలో ఎంతో దయ చూపేరు. "అధికారంలో వున్నప్పుడు సదుద్దేశంతోనేనాయె ఎన్నో తప్పు పనులుచేసిన తమ దొరల ఎడ అయోధ్య ప్రజలు ఎంతో మర్యాద, ఎంతో హుందాతనం చూపించేరు." అని ఫారెస్టు అనే వుద్యోగి వ్రాసేడు.

రాష్ట్రరాజధాని లక్నోలో మే 31 నాడే విప్లవం ప్రారంభమయింది. రాష్ట్ర అధికారి సర్ హెన్రీ లారెన్సు మీరట్ వార్త తెలియగానే నగరంలోని ఇంగ్లీషువాళ్ళనీ, వాళ్ళ కుటుంబాల్నీ రెసిడెన్సీలోకి చేర్చేడు. కాని, మే 31 న తిరుగుబాటు చేసినా జూన్ 12 న గాని ఆఖరుపటాలం తిరుగుబాటు చెయ్యలేదు.

ఈ లోపున రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల నుంచీ లక్నో నుంచి ఇంగ్లీషువాళ్ళని తరిమెయ్యడానికై విప్లవకారులు, సిపాయీ పటాలాలూ సమీకరించసాగేయి.

చిట్టచివరకు ఇంగ్లీషువాళ్ళు వేయిమంది సైనికులతోనూ, పది ఫిరంగులతోనూ నగరం చుట్టూ కేంద్రీకరిస్తున్న విప్లవ సేనల్ని ఎదుర్కొనేటందుకు బయలుదేరేరు.

జూన్ 29 వ తేదీన చిన్హాత్ అనే గ్రామం వద్ద యుద్ధం జరిగింది. ఇంగ్లీషువాళ్ళు రమారమి మూడో వంతు బలగాన్ని పోగొట్టుకొని లక్నో పారిపోయి వచ్చేరు. వారిని తరుముకొంటూ విప్లవ సైన్యాలు లక్నోనగరంలో ప్రవేశించేయి. నగరం అంతా వారి అధీ అయింది.

అక్కడినుంచి నగరపాలనను ఒక క్రమస్థితిలో పెట్టడానికై సన్నాహాలు ప్రారంభించేరు.

లక్నో ప్రభువు వాజిద్ ఆలీషా కలకత్తాలో ఇంగ్లీషువాళ్ళ ఖైదీగా వుండడంచేత ఆయన కొడుకును బిర్జిస్ కాదిర్‌ను పాలకుడుగా ఎన్నుకొన్నారు. కాని నవాబు మైనర్ కావడంచేత అతని తల్లి బేగంహజ్రత్ మహాల్ పాలనాధికారం తీసుకొంది. ఈమె తెలివీ, తెగువాగల మగువ. మహబూబ్ ఖాన్ అనే ఉమ్రావు తోడ్పాటుతో ఈమె న్యాయ, పరిపాలనా, పోలీసు, సైన్య శాఖలకు అధికారుల్ని నియమించింది.

రాజ్యాంగ వ్యవహారాల సమాలోచనకు ఈమె దినమూ దర్బారుచేసేది. ఆమె ముద్రికతో అయోధ్య ఇంగ్లీషు పాలననుంచి విముక్తమైనట్లూ, తాము ఢిల్లీ చక్రవర్తి పెత్తనాన్ని స్వీకరిస్తున్నట్లూ బహదూర్ షాకు లేఖ పంపింది. తర్వాత రాష్ట్రంలోని జమీందార్లకూ, సామంతులకూ సైన్యాలను తీసుకొని దర్బారుకు రావలసిందని ఆహ్వానాలు పంపింది.

నగరాన్నంతనూ కట్టుదిట్టం చేసుకొన్నాక ఆమె ఆంగ్లేయుల చేతిలో మిగిలిన కొద్ది ప్రదేశాన్ని స్వాధీన పరచుకోవడానికై జూలై 20 న కదిలింది.

కాని, ఈ పదిహేను 20 రోజులలోనూ ఆంగ్లేయులు తమ స్థానాల్ని గట్టిపరచుకొన్నారు.

రెండోవేపున బ్రిటిష్‌వాళ్ళని తొలగ తోసేవరకూ వున్న ఏకాభిప్రాయాలు విప్లవకారులలో పోయి పరస్పర వైమనస్యాలు ప్రారంభమైనాయి.

## ఇతరత్రా అనేకచోట్ల

గ్వాలియర్ పాలకుడు సింధియా విప్లవంలో చేరడానికి నిరాకరించేడు. కాని సైన్యాలూ, ప్రజలూ, తామే చొరవతీసుకొని జూన్ 14 తేదీన తిరుగుబాటు చేసేరు. ఆగ్రాను ఇంగ్లీషువాళ్ళ చేతులనుంచి విముక్తం చేయడంలో నాయకత్వం వహించవలసిందని కోరేరు. ఆయన కాలక్షేపం చేస్తూ తిరుగుబాటు ఫలితాలను నీళ్ళు కార్చేడు.

సింధియాలాగే ఇందూర్‌లో హోల్కార్ కూడా ప్రవర్తించేడు. కాని, ప్రజలూ సైన్యాలూ తిరుగబడ్డారు.

కచ్, బుందేలా, రాజపుతానాలలో కూడా పాలకులూ పాలితులూ విభిన్న మార్గాల ననుసరించేరు. భితోగ్, భరత్పూర్, జయపూర్, జోధపూర్ మొదలయిన పాలకులు ఇంగ్లీషువాళ్లకి సహాయంగా సైన్యాలను పంపేరు. సిద్ధంచేసేరు. కాని వారుపోరాడ నిరాకరించడంతో వూరుకోవలసి వచ్చింది.

ఈ విధంగా ఉత్తర భారత దేశంలో ముఖ్యంగా మధ్యభారతంలో మూడేళ్లపాటు అలముకొన్న విప్లవ జ్వాలలు ప్రారంభమైనాయి.

## ఢిల్లీపోరు : పతనం

ఢిల్లీ, లక్నో, కాన్పూరు మొదలయిన విప్లవకేంద్రాలన్నింటా విప్లవసేనలు బ్రిటిష్ అధికారాన్ని త్రోసివెయ్యగలిగేయి. నూతన పరిపాలకుల్ని కూడా ఎన్నుకొన్నారు. ఎన్నుకొన్నవారు పరిస్థితుల్ని అదుపులో పెట్టడానికి ప్రయత్నించేరు.

వ్యక్తిగతంగా అసమానమైన త్యాగాలకు సిద్ధపడ్డ సిపాయీలూ నాయకులూ కూడ ఆ తర్వాత సమన్వయ భావము చూపలేక పోయేరు. క్రమ శిక్షణా ప్రదర్శించలేక పోయేరు.

సమన్వయ భావాన్ని చూపలేకపోవడం వలన అంతఃకలహాలు పొటమరించి తాము తలపెట్టిన పనిని సమగ్రం చేయలేక పోయేరు.

క్రమశిక్షణ లేకపోవడంతో బందిపోట్లకూ, దొంగలకూ తయారయి తమ్ము సమర్థించే ప్రజలే శత్రువులయ్యేటట్లు చేసుకొన్నారు.

ఇది అన్నిచోట్లా కనిపించిన విషయం.

బందేళ్ కి సరాయివద్ద నెగ్గిన బ్రిటిష్ సేనలు ఢిల్లీ నానుకొనివున్న రిడ్జినాక్రమించి బైఠాయించిన వైనం చదివాము. ఢిల్లీని సరాసరి పట్టుకోవాలనే ఆశవున్నా ఇంగ్లీషువాళ్ళు సాహసించలేకపోయారు. రిడ్జిమీద బైఠాయించి సహాయం కోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు. కాని విప్లవ సేనలు వారిని ఊపిరి తిప్పుకోకుండా దెబ్బమీద దెబ్బతీయడం సాగించేయి.

జూన్ 12 న, 17 న, 20 న, 23 న విప్లవ సేనలు చాల సాహసం, చొరవా చూపేయి. ముఖ్యంగా 20న జరిగిన దాడిలో నసీరాబాద్ నుంచి వచ్చిన సేనలు పాల్గొన్నాయి. ఒక కీలకస్థానాన్ని స్వాధీనపరచు కొన్నాయి. బ్రిటిష్ సైన్యాలుగాని, పంజాబ్ గూర్ఖా సైన్యాలుగాని వారిని నిలపలేకపోయినాయి. రాత్రి ఒంటిగంటవరకు తీవ్రమైన పోరాటం జరిగింది. ఇంగ్లీషువాళ్ళు వెనక్కిపోయేరు.

కాని, విప్లవ సైనికుల తరవాత కార్యక్రమం ఏమిటి? ఇక్కడే సమగ్రమయిన పరిజ్ఞానంగల నాయకత్వం అవసరం. నసీరాబాద్ సేనలు వెళ్ళేయి. ఒక స్థానం పట్టుకొన్నాయి. తర్వాత ఏంచెయ్యాలి? దాన్ని కాపాడాలంటే బలగాల్ని సహాయం పంపాలి. మందుగుండూ, తిండీ తిప్పలూ చూడాలి. ఆ ప్రణాళికకు ఒక గమ్యంకావాలి. విప్లవకారులవద్ద లేనిదే అది. అందుచేత నసీరాబాద్ పటాలాలు ఆరాత్రే తిరిగి ఢిల్లీ వచ్చేసేయి. ఇంగ్లీషు సేనలు ఒక్క తుపాకి కాల్చకుండా మళ్ళీ ఆ స్థానాన్ని ఆక్రమించుకు కూర్చున్నాయి.

ఈ దశలో జూలై 2న రోహిల్ఖండ్‌నుంచి పటాలాలను తీసుకొని బఖత్‌ఖాన్ ఢిల్లీలో అడుగుపెట్టేడు. ఆయనకు విప్లవసేనల మీద సర్వాధిపత్యం వప్ప చెప్పేరు. ఆయన వుంటనే పౌరులందరికీ ఆత్మరక్షణకు ఆయుధాలిచ్చేడు. లూటీలూ, దౌర్జన్యాలూ జరిపే వాళ్ళని శిక్షించేడు. అటుతర్వాత నగరంలో కొంత ప్రశాంతి ఏర్పడింది.

తర్వాతనే ఇంగ్లీషు స్థావరాలమీద దాడులుకూడా కట్టుదిట్టంగా జరిగేయి. ఎక్కువ అయ్యాయి.

ఈ సందర్భంలో జూలై 9 న జరిగిన ఒక దాడి నిక్కడ వుదహరించడం చాల ఉచితం. ఆ రోజున విప్లవకారులు బ్రిటిష్ సేనల్ని బాగా మర్దించేరు. శత్రువుల నోరు మూయించేరు. ఒక సిపాయి బ్రిటిష్ సేనాని హిల్‌ను, మరికొంతమంది ఆఫీసర్లను, సోల్జర్లను ఒంటరిగా కత్తితో ఎదుర్కొన్నాడు. హిల్ గుర్రంతో సహా నేలబడ్డాడు. ఇతరులు సాయంరావడంతో ప్రాణాలు దక్కేయి. ఆ విప్లవకారుడు విసిరినకత్తికి ఒక సోల్జరు చచ్చిపోయేడు. మరొకడు గాయపడ్డాడు. కాని ఆ సిపాయి చచ్చిపోలేదు. కేయీ అనే చరిత్రకారుడు ఆ సైనికుని పరాక్రమాన్ని అభినందిస్తూ "బహదూర్‌షా పతకం" పొందతగిన ఘటికుడన్నాడు

ఆనాటి యుద్ధంలో సిపాయీలుచూపిన పరాక్రమం చెప్పడానికి ఇదొక్కటీ చాలదు.

ఆ రోజున విప్లవకారుల చేతుల్లో దెబ్బలుతిని పారిపోయిన తెల్లవాళ్ళు కనిపట్టలేక తమ గుడారాల్లో చాకిరీచేస్తున్న పనివాళ్లనీ, వంటవాళ్లనీ, సేవకుల్నీ నరికేసేరు. "నమ్మకం, విశ్వాసం, చేసినచాకిరీ ఏమీ కనబడలేదు" అన్నాడు కేయీ. ఈవిధంగా నగరంలో ఆగస్టు ఆఖరు వరకూ యుద్ధాలు సాగుతూనే వున్నాయి.

ఒక మూల వ్యక్తిగతంగా అసమానమయిన సాహసమూ, ధైర్యమూ కనబడుతున్నా రెండోవేపున క్రమశిక్షణా హీనత, అరాజకం బాగా ప్రబలింది. సిపాయీలలో సైనిక శిక్షణలేనివారుకూడా వచ్చిచేరడంతో వారి సంఖ్య పెరిగింది. శక్తి క్షీణించింది. యుద్ధంలో వాళ్లని నమ్మి నిలబడ్డానికి వీలులేదు. నాయకత్వం బహుళం అయింది. ఒకరిమాట ఒకరికి నచ్చదు.

ఆగస్టు 25 న సర్వసేనాని బఖత్‌ఖాన్ ఇంగ్లీషు సేనల ప్రయత్నాలను భగ్నం చేయడానికై నీమచ్, బరెల్లీల పటాలాన్ని పంపేడు. వీరువెళ్లింది వీరకార్యం మీదనే. కాని సేనాపతులకు పడదు. కనక నీమచ్ పటాలాల సేనాని రెండోవాని ప్రక్కన వుండనిష్టంలేక పక్కవూళ్ళో మకాం చేశాడు. ఆ వూరు చాల బలహీన స్థానంలో వుంది. ఆ రహస్యం గమనించి ఇంగ్లీషువాళ్ళు నీమచ్ పటాలాలమీద పడి సర్వనాశం చేసేరు. ఆ యుద్ధంలో నీమచ్ సైనికులు ఎంతసాహసం ప్రదర్శిస్తేమాత్రం ఏం ప్రయోజనం?

దీనితో ఇంగ్లీషు వాళ్ళకి బాగా అలుసుచిక్కింది. సెప్టెంబరు 14 న వాళ్ళ సేనలు నాలుగు ముఖాలుగా యుద్ధం ప్రారంభించి చాల చోట్ల నగరంలో చొరబడ్డారు. కాని, విప్లవకారులు రమారమి పదోకంతు మందిని బలిపుచ్చుకొన్నారు.

ఇంగ్లీషువాళ్లు నష్టాలకు జంకి తిరిగి పోదామను కొన్నారు. కాని పట్టుదలగా నిలబడ్డారు.

నగరంలో కొంత ఇంగ్లీషు వాళ్లచేత పడింది. కనక లాభంలేదనే నిరాశతో సిపాయీ శిబిరాల్లో నగరం వదలాలనే ఆలోచన కలిగింది. కొందరు బయటికి పోయేరు. కొద్దిమంది బఖత్‌ఖాన్ నాయకత్వాన నిలబడ్డారు. పదిరోజులపాటు సిపాయీలు ప్రతిఅడుగునా అడ్డుతగిలేరు. కాని వారి సంఖ్యాబలం కూడా ఇప్పుడు తగ్గింది. క్రమంగా నెట్టి వేయబడ్డారు.

నగరం మూడు వంతులు ఇంగ్లీషువాళ్ళకి పట్టుబడ్డాక బఖత్‌ఖాన్ బహదూర్‌షాను బయటికి తీసుకుపోవడానికి ప్రయత్నించేడు. కాని, ఆ ముసలి రాజుకు ధైర్యం

లేదు. భయం. సుఖం మరిగిన ప్రాణి యుద్ధరంగంలోని కష్టాలను ఓర్చుకోగలదా? సేనలు వొత్తిడి పెడతాయని తెలిసినప్పుడు ఆయన పారిపోయి హుమయూన్ గోరీలో దాగి ఇంగ్లీషు వాళ్ళకి కబురుపెట్టి లొంగి పొయ్యేడు.

అక్కడే దాగుకొన్న బహదూర్ షా కొడుకులు ముగ్గురినీ, ఒక మనవణ్ణి కూడా ఇంగ్లీషు వాళ్ళు పట్టుకొన్నారు.

బహదూర్ షాను ఖైదుచేసేరు. ఆయన కొడుకుల్ని, మనవణ్ణీ నరికేసి కుక్కలకి పారేసేరు.

అటుతర్వాత బ్రిటిష్, శిక్కు సేనలు ఢిల్లీలో జరిపిన విధ్వంసకాండ నాదిర్ షా క్రౌర్యాల తలతన్నిందన్నాడు ఒక ఇంగ్లీషువాడు.

ఈ నగరంకోసం జరిగిన యుద్ధంలో బ్రిటిష్ సేనలలో కలిగిన నష్టం మరెక్కడా కలగలేదట.

## బీహార్‌లో రహస్య సంస్థలు

పాట్నాలో బ్రిటిష్‌వాళ్లని తరమాలనే ఆలోచనలూ, రహస్యసంఘాలు ఏర్పడి పనిచేయడమూ 1852 నాటి నుంచీ సాగుతూనేవుంది. ఇక్కడ విప్లవోద్యమ నాయకులలో పీర్‌ఆలీ అనే ఆయన చాల ప్రముఖుడు. ఆయన ఎంతో శాంతుడనీ, మాటలు చాల గంభీరంగా మనసు నొప్పించకుండా వుంటాయనీ, ఆత్మ నిగ్రహం గలవాడనీ ఇంగ్లీషు చరిత్రకారుడు వర్ణించేడు.

ఈయనను జూలై నెలలో ఇంగ్లీషు వాళ్లు అరెస్టుచేసి ఉరిశిక్ష విధించేరు. శిక్ష అమలు జరిపేటప్పుడు ఆయన తనతో పనిచేస్తున్నవారి పేర్లు బయట పెడితే ప్రాణం దక్కుతుందన్నారు. కాని, ఆయన నిరాకరించేడు.

"జీవితంలో ప్రాణందక్కించుకోనేటందుకు ప్రయత్నం చేయవలసిన ఘట్టాలున్నాయి. కొన్ని సమయాల్లో ప్రాణత్యాగం చేయడమూ మంచిది. నేడు అటువంటి సందర్భం వచ్చింది."

పీర్ ఆలీని వురితీసినవార్త తెలియగనే అక్కడికి సమీపంలోవున్న దానాపూర్ అనేచోట సిపాయీల పటాలం తిరుగుబాటు చేసింది. విప్లవం ప్రారంభమైన నాటికి ఉత్తర భారతంలో కలకత్తా, ఆగ్రాల మధ్య ఇంగ్లీషు పటాలం వున్నది ఈ దానాపూర్‌లోనే. తిరుగుబాటు చేసిన సిపాయీల్ని ఇంగ్లీషు సేన వెంబడించింది. వారు శోణనది (సోన్)ని దాటి జగదీశ్‌పూర్ వెళ్ళి అక్కడి రాజు రాణాకుమారసింగ్‌ను తమకు నాయకత్వం వహించమని కోరేరు. దానాపూర్ సిపాయీలేగాక నగరంలోని ప్రజకూడా రాణా తిరుగుబాటులో చేరాలనే కోరింది.

విప్లవకాలంనాటికి కుమారరాణా 80 ఏళ్ళ ముసలి పండు. అయినా ఆయనమీద ఇంగ్లీషువాళ్ళకి నమ్మకం లేదు. అరెస్టుచేయలేరు. కనక మంచిమాటలతో పాట్నా రప్పించి పట్టుకోవాలనుకొన్నారు. కాని, అదివరకే పాట్నా కమీషనరు టైలర్ సభకు రమ్మని పిలిచి ముగ్గురు మౌల్వీలను అరెస్టుచేసివున్నాడు. ఆ అనుభవం గుర్తువేసుకొని కుమారసింగ్ చల్లనిమాటలు చెప్పి వెళ్ళడానికి నిరాకరించేడు.

సైనికులు, ప్రజలు కోరిన ప్రకారం సింగ్ విప్లవ సైన్యాలకు నాయకత్వంవహించేడు. వారితో జిల్లాలోని ప్రధాన నగరం ఆరాను పట్టుకొన్నాడు. అక్కడ కోట వుంది. ఇంగ్లీషువాళ్ళు దానిలో దూరేరు.

రాణాకుమారసింగ్ తన క్రిందవున్న సైన్యం బలహీనతలు, మంచి లక్షణాలు గమనించినవాడు. కనక అనుకూలంగానే తన పథకం వేసుకొన్నాడు. ఆరా కోటమీద దాడి మాని ముట్టడిలో పెట్టేడు. ఆరాకు సాయం వస్తున్న దానాపూర్ సోల్జరు పటాలాన్ని సరాసరి ఎదుర్కోకుండా దారికాచి, ఒక మామిడితోటలో పట్టుకొని హతమార్చేడు.

కాని బలమైన ఇంగ్లీష్ సేనలు రావడంతో ఆయన ముందు ఆరాను, తర్వాత జగదీశపూర్‌ను వదలి [illegible] మారేడు.

అప్పటి కప్పుడే బ్రిటిషు సేనలు కాన్పూర్ పట్టుకొని లక్నోమీదికి నడుస్తున్నాయి. ఆ [illegible] అజింఘర్ అనే చోటవున్న తెల్లసేనలను కొట్టాలనీ, బెనారెస్ మీదికి దాడి నడపాలనీ ఆయన [illegible]. అదే నెరవేరితే ఇంగ్లీషు సేనలకు వెనక [illegible] తెగిపోతాయి.

ఆ పథకం వేసుకొని ముందు ఆయన 1858 మార్చి 18 న అజింఘురుమీదికి బయలుదేరి అత్రో[illegible] అనే చోట ఆగేడు. చెదిరివస్తున్న సిపాయీలను కూర్చుకొని సన్నాహాలలో వుండగా 1858 మార్చి 22 న అజింఘర్‌నుంచి సోల్జరు పటాలం వాళ్ళమీదికి బయలుదేరి వచ్చింది.

కుమారసింగ్ తెలివిగా పథకం వేసేడు. కొంచెం సేపు యుద్ధం జరిగాక సిపాయీలు పారిపోతున్నట్లు నటించేరు. తెల్లసోల్జర్లని కొంతదూరం పారనిచ్చి ఎదురు తిరిగేరు. మూడువేపుల నుంచి విప్లవకారులు దెబ్బ తీస్తూంటే ఇంగ్లీషుసేనలు అజింఘర్ పారిపోయేయి.

మళ్లీ 28 వ తేదీన అననపుంలగాలతో ఇంగ్లీషువాళ్లు దాడిచేసేరు. మళ్ళీ ఆరు రోజుల క్రితం జరిగిందే. ఇంగ్లీషు సేనలు బాగా దెబ్బతిని పారిపోయేయి.

కుమారసింగ్ ఆజింఘర్ అగల్‌బగల్‌లోనే తిరుగుతున్నాడు. కోటలో వారిరక్షణకోసం అలహాబాద్ నుంచిబలీయమైన శతఘ్నిదళంతో సోల్జరు పటాలాలు వచ్చేయి. కాని సింగ్ మళ్లీ యుక్తిగానే వాళ్ళమీద దెబ్బతీసేడు. వాళ్లూ పారిపోయి ఆజింఘర్‌లో దూరేరు.

కుమారసింగ్‌కు ఎంతో చాకచక్యం, నేర్పు, దూరదృష్టీవున్నా, ఆయనవద్దచేరిన సిపాయిదళాలనాయకులు ఎవరికివారే ఒక్కొక్క పద్ధతిని సూచిస్తూ ఏక నాయకత్వాన్ని నిరసించేరనీ, ఫలితంగా కుమారసింగ్ ఆలోచనలు వారినికలుపుకోనేటందుకే సర్దుబాటు అయిపోతూ వచ్చేయనీ ఒక ఇంగ్లీషు చరిత్రకారుడు వ్రాసేడు.

ఈలోపున మరో పెద్ద ఇంగ్లీషు సైన్యం ఆయనమీదికి వస్తూంది. కుమారసింగ్ ఒక పథకం వేసేడు. తాను ఆజింఘర్ మీద కేంద్రీకరించినట్లు కనబరుస్తూ హఠాత్తుగా సేనల్ని దూరానవున్న జగదీశపూర్ మీదికి నడపాలనీ, ఇంగ్లీషువాళ్ళు లొంగదీసేమని భావిస్తున్న షాబాద్ జిల్లాలో మరల విప్లవధ్వజం ఎత్తాలనీ ఆలోచించేడు.

చుట్టూ ముట్టుతున్న ఇంగ్లీషు సేనల్ని ఎక్కడికక్కడ అడ్డగిస్తూ, దెబ్బతీస్తూ వాళ్ళముట్టడి నుంచి బయట పడుతూ ఆయన సైన్యాలతో గంగానదిని దాటేడు. కాని దాటేటప్పుడు ఒక దుర్ఘటన జరిగింది. సింగ్ నదిని దాటుతూంటే ఇంగ్లీషు సేనలు కాల్చేయి. సింగ్‌కు మణికట్టుమీద దెబ్బతగిలింది. వెంటనే శస్త్రచికిత్సజరగాలి. కాని అక్కడేమీ లేదు. కుమారసింగ్ రెండోచేత కత్తి తీసుకొని గాయపడిన చేతిని నరికేసి గంగలో పారవేసేడు.

ఏప్రిల్ 22 న ఆయన జగదీశపూర్ మరల పట్టుకొన్నాడు. కాని మరునాడే తెల్లసేనలతో యుద్ధం. ఆరోజునకూడా సింగ్ తన సేనలను ఇంగ్లీషువాళ్ళు వచ్చే దారిలో దాచేడు. వాళ్ళను బాగా ముందుకు పోనిచ్చి నాలుగువేపులనుంచే కమ్ముకున్నాడు. ఆనాడు ఇంగ్లీషువాళ్లు తిన్న దెబ్బలను ఒకసైనికుడు ఇల్లా వ్రాసేడు.

"శత్రువులు బాదేస్తూంటే అడవిలోంచి పారిపోతున్నాం. దాహం. త్రాగేందుకు నీరులేదు. ఓ మురికి గుంటలో నీరు కనబడితే ఎగబడి త్రాగబోయేరు. ఇంతలో సింగ్ గుర్రపుదళం వెంటబడింది. సిగ్గులేదు. ఎగ్గులేదు. శిక్షణలేదు. పాడులేదు. ఒకటే పరుగు. సేనాధిపతి చచ్చిపోయేడు. సిక్కులు ఏనుగులెక్కి పుడాయించేరు. ఆరోజున ఇంచుమించు 200 తెల్లవాళ్లు చచ్చిపోయేరు. కొంతమంది మాత్రమే ప్రాణాలు దక్కించుకొన్నారు."

ఈ యుద్ధం జరిగిన మూడోరోజున ఏప్రిల్ 26 న రాణా కుమారసింగ్ మరణించాడు. ఆయన సోదరుడు అమరసింగ్ విప్లవసేనలకు నాయకత్వం వహించేడు.

అన్నగారు తొక్కిన దారినే ఆయనకూడా అనుసరించేడు. యుద్ధంచేస్తాడు. ఫలితం తేలకపూర్వమే యుద్ధరంగంనుంచి తప్పుకొంటాడు. మరునాడు మరోచోటున హాజరు. జూన్‌లో ఆయన ఆరా పట్టుకొన్నాడు. మూడు నాలుగు నెలలు జగదీశపూర్‌లో పరిపాలన చేసేడు.

అక్టోబరులో 7 ఇంగ్లీషు పటాలాలు జగదీశపూర్‌ను చక్రబంధం చేసేయి. వానిలో ఒకదానితో 17 వ తేదీన జరిగిన యుద్ధంలో ఆయనసైన్యం నిశ్శేషంగా హరించిపోయింది. ఇంగ్లీషువాళ్ళ ఆయుధబలం, సైన్యబలం ముందు సింగ్ పాతతుపాకులు పనిచేయలేదు.

అమరసింగ్ ముగ్గురితో రంగంనుంచి తప్పించుకుపోయేడు.

తర్వాత కొత్త బలగాల్ని కూర్చుకొని కైమూర్ పర్వతాలలో వుండి చాలనెలలు ప్రతిఘటించేడు. కాని, క్రమంగా ఆయన సైన్యం క్షీణించిపోయింది. అపజయం తప్పదని గ్రహించి, శత్రువు చేతబడడం ఇష్టంలేక రాణాకుమారసింగ్ జనానా రమారమి 150 మంది స్త్రీలు ఆత్మహత్య చేసుకొన్నారు. అమరసింగ్ మారువేషంలో ఎక్కడికో పోయేడు.

మరి ఆయనగాథ తెలియదు.

## కాన్పూరు పతనం

బ్రిటిష్ అధికారులు అలహాబాద్‌నుంచి విప్లవకారుల్ని తరిమేసి దానిని ప్రధానస్కంధావారం చేసుకొన్నారు. బ్రిటిష్ పటాలాల నక్కడికి చేర్చి అక్కడినుంచి వివిధ కేంద్రాలమీదికి దాడులు ప్రారంభించేరు.

ముందుగా వారు కాన్పూరును ముట్టడినుంచి తప్పించాలని ఆతురత పొందసాగేరు. కాని సన్నాహాలు పూర్తి అయ్యేలోపునే అక్కడ ఇంగ్లీషువాళ్ళు లొంగిపోవడం వాళ్ళని సిపాయీలు చంపెయ్యడం జరిగిపోయింది. ఆ వార్త తెలిసేక మహాకసిగా బయలుదేరేరు. మామూలు పద్ధతే. దారి పొడుగునా చేతికి దొరికిన

వాళ్ళందర్నీ లింగవయోభేదం చూడకుండా చంపడం, కనిపించిన వూరల్లా తగులబెట్టడం. ఆ విధంగా జూలై 12 న ఫతేపూర్ అనేచోటికి చేరేరు. అక్కడ నానాసాహేబ్ పంపిన సైన్యాలు వారి నడ్డగించడానికి ప్రయత్నించేయి. కాని వారి ప్రయత్నం విఫలమయింది. ఇంగ్లీషువాళ్ళు ఫతేపూర్‌ను కాల్చేసి, ప్రజల్ని చంపేరు.

ఈ వార్త తెలియగానే కాన్పూరులో సిపాయీలు అక్కడ జైలులో పెట్టిన 125 మంది తెల్లవాళ్ళని స్త్రీ శిశువులతో సహా నరికేసి ఒక నూతిలో పారేసేరు.

నానాసాహెబ్ సేనలు పాండూ అనే నదివద్ద, కాన్పూరువద్ద ఇంగ్లీషు సేనల్ని నిలవరించడానికి మళ్ళీ ప్రయత్నించేయి. కాని లాభం లేకపోయింది. కాన్పూరును శత్రువుకు వదలి బిఠూర్ వైపు తిరోగమించేరు.

జూలై 17 న బ్రిటిష్ సేనలు కాన్పూరులో ప్రవేశించేయి. నగరం తగలబెట్టి వేలకొలది మందిని వురితీసేరు. విప్లవకారులు ఈ శిక్షలను ఎంత నిర్లక్ష్యంగా చూసేరో ఇంగ్లీషు చరిత్రకారులే చాలపొగడేరు.

నానాసాహెబు మేజిస్ట్రేటుగా నియమించిన ఒకరిని పట్టుకొని ఉరిశిక్ష వేసేరు. తనవురికి సన్నాహాలు జరుగుతూంటే ఆయన తనకు పట్టనట్లే చూస్తూ నిలబడ్డాడు. "నిర్లక్ష్యంగా ఉరిస్తంభం ఎక్కేడు. యోగి సమాధిలో ప్రవేశించినట్లే"నని ఛార్లెస్ బాల్ వ్రాసేడు.

కాన్పూరునుంచి బ్రిటిష్ అధికారులు జలగల్లాగ ముందుకు పాకి లక్నోను పట్టుకోడానికి సేనలను పంపేరు. కాని వారు గంగానది దాటి అయోధ్య రాష్ట్రంలో ప్రవేశించేక బ్రిటిష్‌వాళ్ళ నడక అంత సులభం అనిపించలేదు. ఇక్కడ వూరూరా ప్రతిఘటిస్తూంది. ఎక్కడా సిపాయీలు అమీ తుమీ తేల్చుకోడానికి అవకాశం ఇవ్వలేదు. ముఖాముఖి కొనసకంటూ నిలబడరు. ఎదుర్కొంటారు. కొంతసేపు యుద్ధంచేసి తప్పుకొంటారు. మళ్లీ మర్నాడూ అదేపని, మూడోనాడూ అదేపద్ధతి. ఇంగ్లీషు సేనాని జయం సాధించేమని ధైర్యంగా అడుగు వెయ్యడానికి లేదు. ఈవిధంగా నాలుగైదుమార్లు వరసగా జరిగిన యుద్ధాల్లో సగంమంది చచ్చేరు. ఇంతలో బిఠూర్ వద్ద నానాసాహెబ్ సేనల్ని చేర్చుకొంటున్నట్లు వార్త. ఇంక తిరిగి పోవక తప్పలేదు.

లక్నో వెడుతున్న ఇంగ్లీషువాళ్ళని వెనక్కి లాగడం తప్ప నానాసాహెబ్ సేనలు ఏమీ చేయలేకపోయేయి. ఆగస్టు 16 న బిఠూర్ సమీపంలో జరిగిన యుద్ధంలో నానాసాహెబ్ ఓడిపోయేడు.

ఇంగ్లీషు వాళ్లు మళ్లీ సేనల్ని తీసుకొని సెప్టెంబరు 20 న లక్నోకు బయలుదేరి 2[illegible] ఆలంబాగ్ చేరేరు. అంగుళం అంగుళం మేరా ప్రాణాలు [illegible] గాని విప్లవకారులు దారివ్వలేదు. మహా క్రూరంగా గ్రామాలకు గ్రామాలే నాశనం చేసిన జనరల్ నీల్ ఇక్కడే [illegible] బజారు పోరాటంలో [illegible]యేడు. ఇంగ్లీషు సేనలు ఎట్టకేలకు 25 న లక్నో కోటలో ప్రవేశించేయి. కాని బయటనుంచి మరలవ[illegible] బంధింపబడిపోయేయి. విప్లవ సేనలు మరల ముట్టడి ప్రారంభించేయి.

మరల [illegible] యడానికి, లక్నోను [illegible] డానికి ఇంగ్లీషు [illegible] గాని కాంబెల్ పెద్ద సైన్యంతో నవంబరులో లక్నోకు బయలుదేరేడు. అప్పటికి [illegible] పడిపోయింది. అక్కడచిక్కుకున్న బ్రిటిష్ సేనలకు సులువు చిక్కింది. అవన్నీ లక్నో వేపు [illegible]యి.

ఈ సైన్యాలు మళ్ళీ లక్నోను పట్టుకోవడానికి నవంబరు 14 న ఆలంబాగ్ చేరేయి. [illegible] అనుకున్నా ఎన్నో ప్రాణాలను బలిపెట్టి ఇంగ్లీషు సేనలు నవంబరు 23 వరకు యుద్ధం నడిపింది. దిల్‌కుషా బాగ్, సికందర్ బాగ్, షానజాఫ్, మోతీమహల వద్ద సిపాయీలు ప్రాణాలు లెక్కచేయకుండ పోరాడేరు. సికందర్ బాగ్‌ను కాపాడుతున్న రెండు వేలమంది సిపాయీలలో ఆ బాగ్‌ను పట్టుకొనే [illegible] మాత్రమే ప్రాణాలు దక్కించుకొన్నారు [illegible] గాని నమ్మలేమన్నాడు ఒక ఇంగ్లీషు చరిత్రకారుడు, మాలెసన్.

## అష్రఫ్ బక్ష్ ఖాన్ స్వాతంత్ర్యప్రేమ

"అష్రఫ్ బక్ష్ ఖాన్ తాలూక్దారు. నవాబు ఆయనను నానా ఇబ్బందులూ పెట్టేడు. మనం రాగానే ఆయన ఆస్తికూడా ఖాన్ చేతిలో పెట్టేం. కాని, మొదటి నుంచి ఆయన మనమీద పరమాసహ్యం ప్రకటిస్తున్నాడు. దీనికీ, ఇలాంటి వాటినీపట్టి చూస్తే మన వలన నష్టం పొందడమే ఈ రా[illegible]లూ, జమీందార్లూ తిరగబడ్డానికి కారణం అనుకోలేము."

—లార్డ్ కానింగ్ లేఖ.

లక్నో ముట్టడి విడిపించినాక ఇంగ్లీషు సేనలు నగరాన్ని పూర్తిగా చేతికి తెచ్చుకోవడానికి ముందు కడు చెయ్యడానికి ఇంకా యుద్ధం కొనసాగించవలసే వుంది. దిల్ కుష్‌బాగ్‌లో స్కంధావారం పెట్టుకొని సన్నాహాలు ప్రారంభించేరు.

కాని ఈ లోపుననే నానాసాహెబ్ వద్దనున్న సేనాయకుల్లో ఒకడయిన తాంతియాతోపే నరల కాన్పూరుమీద పడ్డాడనే వార్తవచ్చి ఇంగ్లీషు సేనలు అటు కదలవలసివచ్చింది. లక్నో ఆక్రమణ ప్రయత్నాలను వాయిదా వేసుకోక తప్పిందికాదు.

*   *   *

ఆగస్టు 16 న బిఠూర్‌వద్ద ఓడిపోయిన నానాసాహెబ్ సేనలు గంగానదినిదాటి ఫతేపూర్ చేరుకొన్నాయి. నూతనంగా సేనలను కూర్చుకొంటేగాని అడుగుపడేస్థితి లేదు. ఆ బాధ్యతను మీదపెట్టుకొని తాంతియాతోపే గ్వాలియర్ వెళ్లేడు. సింధియా సేనలు అదివరకే తిరుగుబాటు చేసేయి. కాని రాజును నమ్ముకుని అవి నగరంలోనేవుండి పోయేయి. తాంతియా వారిని కదిల్చి కాల్పీచేర్చేడు. సైనికతంత్రం దృష్ట్యా ఇది చాలా అనుకూలమైన స్థానం.

నవంబరులో లక్నోవద్ద బ్రిటిష్ సేనలు గట్టిగా యుద్ధంలో చిక్కుకొనే వరకూ తాంతియా సద్దుకొన్నాడు. నవంబరు 25 న హఠాత్తుగా పాండూనది వరకూ తోసుకువచ్చేసరికి కాన్పూరులోని ఇంగ్లీషు సేనలు కదిలేయి. తాంతియా కొంపరసపడకుండా సమయంకోసం చూసేడు. వీలు దొరకగానే కమ్ముకొన్నాడు. ఇంగ్లీషువాళ్ళు ఈ యుద్ధంలో ఓడిపోయి, పరికరాలను సహా వదలిపెట్టి కాన్పూరు పారిపోయేరు.

కాన్పూరును పట్టుకొనేటందుకు మరో రెండు రోజులు యుద్ధం జరిగింది. స్వాధీనమయింది కూడా. కాని, లక్నోవద్దనున్న బ్రిటిష్ సేనలకు తాంతియా వార్త తెలిసి సర్వసేనాని సైన్యాలతో వచ్చిపడ్డాడు. డిసెంబరు 6 వ తేదీవరకు ఘర్షణలు జరిగి తాంతియా సైన్యం విధ్వంసం అయింది. ఆయన వారి వ్యూహం భేదించి తప్పించుకొని బయటపడ్డాడు.

ఇంగ్లీషు సేనలు వెంటనరిమేయి. శివరాజ్‌పూర్ అనేచోట 9 వ తేదీన తాంతియా సేనలు ఛిన్నాభిన్నం అయ్యేయి

కాన్పూరును మరలపట్టుకొన్నాక ఇంగ్లీషు సేనలు గంగా యమునలమధ్య ప్రాంతంలో విప్లవకారులు లేకుండా తుడిచిపెట్టి గట్టిపరచు కొన్నారు.

నరల అన్ని ఏర్పాట్లూ చేసుకొని బ్రిటిషు సైన్యం ఫిబ్రవరి 28 న లక్నో ఆక్రమణను పూర్తి చేయడానికై బయలుదేరేయి. ఈ లోపున నేపాల్ రాజు జంగ్ బహద్దూర్ కూడా 9 వేల నేపాళ సేనలతో లక్నో మీదికి వచ్చేడు. మార్చి 11 న ఈ సైన్యాలు రెండూ లక్నోలో కలిసి యుద్ధానికి ఉపక్రమించేయి.

*   *   *

## ఝాన్సీరాణీ లక్ష్మీబాయి

యమునానదికి ఉత్తరభాగంలో సర్వసేనాధిపతి కాంబెల్ విప్లవకారుల్ని నెట్టివేయడానికి పూనుకొన్నప్పుడే యమునకు దక్షిణాన మరొక బలమైన ఇంగ్లీషుసైన్యం విప్లవకారులమీదకు తయారయింది. ఉత్తరాన పనిచేస్తున్న ఇంగ్లీషువాళ్ళకి శిక్కులూ, గూర్ఖాలూ తోడ్పడుతున్నట్లే దక్షిణభాగంలోని సైన్యాలకు హైదరాబాద్‌నుంచీ, మద్రాసు, బొంబాయిల నుంచీ సైన్యాలనుపంపి స్వదేశీ సంస్థానాధీశ్వరులు తోడ్పడ్డారు.

1858 జనవరిలో ఇంగ్లీషు సేనలు బొంబాయినుంచి ఒకటీ, మౌ నుంచి ఒకటీ తమ కార్యక్రమాన్ని ప్రారంభించేయి.

వానిలో మౌనుంచి బయలుదేరిన సైన్యం ఝాన్సీనీ, అక్కడనుంచి వెళ్ళి కాల్పీనీ పట్టుకోవాలని పథకం వేసుకొని జనవరి 6 వ తేదీన బయలుదేరింది.

1957 జూన్ నాలుగో తేదీన ఝాన్సీలోని సైన్యాలు తిరగబడ్డాయి. 7 వ తేదీన కోటను పట్టుకొన్నాయి. ఇంక సరాసరి ఢిల్లీకి ప్రయాణం అయి వెళ్ళేయి.

దేశంలో పాలకు లెవ్వరూలేరు. వెంటనే ఝాన్సీ రాణి జబ్బల్‌పూర్‌లోని ఇంగ్లీషు సేనాధిపతికి తాను తాత్కాలికంగా అధికారం తీసుకొంటున్నట్లు తెలియపరచి పరిపాలన ప్రారంభించింది.

కాని, బ్రిటిషువాళ్ళు దానిని చెవిని వేసుకోలేదు. ఝాన్సీరాణిని శత్రువుగానే జమకట్టి 1858 జనవరిలో దానిమీదికి సైన్యాలను నడిపేరు. తప్పనిసరి అయి లక్ష్మీబాయి యుద్ధరంగంలోకి దిగింది. దిగాక మరి ప్రాణంవుండగా కత్తిదింపలేదు. జూన్ 20 న గ్వాలియర్ కోటముందు జరిగిన యుద్ధంలో మరణించేవరకూ లక్ష్మీబాయి ఇంగ్లీషు సైన్యాధిపతుల గుండెల్లో బల్లెంలా వ్యవహరించింది.

## తాంతియాతోపే

జూన్ 20 న ఝాన్సీరాణి మరణించిన గ్వాలియర్ యుద్ధంలో మరో మహావీరుడు తాంతియా తోపే

కూడా వున్నాడు. ఆ యుద్ధరంగంనుంచి ఆయన తప్పించుకొని, మళ్ళీ 22 వ తేదీనాడే జౌరా ఆలీపూర్ వద్ద మళ్లీ ఇంగ్లీషు సేనల్ని తలపడ్డాడు.

1859 జనవరి 17 వ తేదీన లండన్ 'టైమ్సు' పత్రిక తర్వాత ఆరునెలల కాలంలో తాంతియాతోపే వీరవిహారాల్ని ఇల్లా వర్ణించింది.

"మన మిత్రుడు తాంతియాతోపే మహాపేచీకోరు. మహాతెలివిగల వాడూ. జూన్ నుంచి మధ్య భారతంలో మంటలు రేపుతూనే వున్నాడు. సైన్య కేంద్రాల్ని ముట్టించేసేడు. ఖజానాలు దోచుకొన్నాడు. సంచుకోతారులు వూడ్చేసేడు. సేనలు పోగుచేసేడు. పోగొట్టుకొన్నాడు; యుద్ధాలు చేసేడు. ఓడేడు; దేశీరాజుల్నించి ఫిరంగులు పట్టుకొన్నాడు. పోగొట్టుకొన్నాడు; మరికొన్నిలాక్కొచ్చేడు. అవీపోయేయి; మెరుపులా కదిలేడు. రోజుకు ముప్ఫయి నలభయిమైళ్ళు చొప్పున వారాల తరబడి సేనల్ని నడిపించేడు. నర్మద అటూ ఇటూ ఎన్నో మాట్లు కదిలేడు. మన సేనలకు మధ్యనుంచి, ఎదటినుంచి వెనకనుంచి సేనలతో కదులుతూనే వున్నాడు. కొండల మీద, నదులుదాటి, లోయల్లో, చరియల్లో, చిత్తడి నేలల్లో వెనక్కి, ముందికి పక్కలకి వంకరటింకరగా సేనల్ని నడుపుతూ ఏదోవూరు మీద పడతాడు. దొరకడు."

చివరకు మానసింగ్ అనే ద్రోహి 1859 ఏప్రిల్ 7వ తేదీన ఆయనను ఇంగ్లీషు వాళ్ళకి పట్టిచ్చేడు.

ఏప్రిల్ 18 వ తేదీ మధ్యాహ్నం నాలుగ్గంటలకి ఆయన్ని వురితీసేరు.

## ఇటావా వీరులు

1857 డిసెంబరులో ఇటావా అనేచోట 25 మంది విప్లవకారులు ఒకఇంట్లో చేరి విజయయాత్ర సాగిస్తున్న పెద్ద ఇంగ్లీషు సేనను నిలబెట్టేసేరు.

"వున్నది కొద్దిమందే. వాళ్ళ దగ్గరున్న ఆ యుధాలయినా భర్మాల్లు. కాని తమ ఆశయంకోసం వీరమరణాన్ని వరించే ఉత్తమావేశంలో వున్నారు. వాల్పోల్ పరివారాలు చూసేడు. సైన్యాలను ఆపేటందు కది చాలదు. దానిని చులకనగా నొక్కెయ్యొచ్చు. కాని, లోపలున్నవారి పట్టుదల చూస్తే చాలమందిని బలిపెడితే తప్ప లొంగేలా కనబడలేదు. అంతకంటె సులువూ, ఖర్చులేని పద్ధతులు ఆలోచించేరు. ప్రయత్నించేరు. చేతి బాంబులు విసిరేరు. గడ్డితెచ్చి ఊదరపెట్టేరు. కాని లోపలున్న వారుకంతల్లోంచి కాలుస్తూ 3గంటలసేపు ఎవ్వరినీ దరిదాపులకు చేరనివ్వలేదు. చివరకు దానిని పేల్చెయ్యాలనుకొన్నారు. అందుకోసం......ఇంజనీర్లను నియమించేరు. వారు ఒకగాతం తీసి తుపాకితూటాలతో నింపేరు. అదిపేల్చేరు. ఆ యిల్లెగిరి పోయింది. దానిలో వాళ్లూ పేలి వూడిపోయేరు."

—మాలిసన్.

## లక్నో పతనం

1857 నవంబరు నెలాఖరున సర్ కాంబెల్ లక్నో నుంచి తనసైన్యాలను ఉపసంహరించుకొని వెడుతూ ఆలంబాగ్‌లో మాత్రం నాలుగువేల సైన్యాన్ని దిగవిడిచి వెళ్లేడు. వారికి అవసరమైతే ఆత్మరక్షణ చేసుకోవడం తప్ప దాడులూ, గిడులూ తలపెట్టవద్దని ఖచ్చితంగా ఆజ్ఞాపించేడు.

ఆ సైన్యం 1858 మార్చి 11 వ తేదీన మరల ఇంగ్లీషు సేనలు వచ్చేవరకూ అక్కడే తిష్ఠవేసివుంది. వారిని కదిలించడానికి విప్లవకారులు చేసిన ప్రయత్నాలు ప్రయోజనకారి కాలేదు. లక్నోలోవున్న విప్లవసైన్యాలను సన్నద్ధపరచి ఇంగ్లీషు వాళ్ళను నెట్టివేయడానికై ప్రయత్నించిన వారిలో మౌల్వీ అహమ్మదుషా ప్రధానపాత్ర వహించేడు కాని విప్లవ నాయకులలో [illegible] మాట ఒకరికి నచ్చదు. అంద[illegible] మాటా ఎవరికీ నచ్చదు. సైన్యాలను ఒక దారిలోకి తెచ్చేటందుకు [illegible] చేసిన ప్రయత్నాలు [illegible] కంటకం అయేయి. [illegible] వద్ద చాడీలుచెప్పి ఆయనను అరెస్టు చేయించేరు. కాని సిపాయీలలోనూ, విప్లవ[illegible]లలోనూ ఆయనకుగల పలుక[illegible]డి[illegible]లితంగా మరల విడుదలచేయ[illegible]లసి వచ్చింది.

వెంటనే [illegible] సన్నాహాలు ప్రారంభించేడు. గాని "[illegible] మించి పోయింది." [illegible] మాత్రంగా [illegible] నిలోకి దిగేడు. ఆలంబాగ్‌లో[illegible] ఇంగ్లీషు సేనల[illegible] హతమార్చడాని[illegible] కో[illegible] మారు[illegible]. వారికి [illegible]వస్తువ్న [illegible] నోమాటూ ధ్వంసంచేయడా[illegible] వ్యూహాలు పన్ని [illegible] తోడవా[illegible] కలిసిరా[illegible] వల్లనే [illegible]డిపోయేడు. [illegible] పర్యాయం జరిగినపోరాటంలో గాయపడ్డాడు [illegible]. ఇవి జరిగేక విప్లవసేనలల[illegible] నిరుత్సాహమూ. [illegible]తంగా అంతఃకలహాలూ [illegible]చ్చేయి.

అహమ్మదుషా మౌల్వీ గాయం మాని నెలరోజులకి వీధిలోకి వచ్చేసరికి పరిస్థితులన్నీ అస్తవ్యస్తంగా వున్నాయి. ఫిబ్రవరి 15 న మరల ఇంగ్లీషువాళ్ళమీద దెబ్బతీయడానికి ప్రయత్నించేడు. కాని విఫలుడయ్యేడు.

ఇన్ని అంతఃకలహాలున్నా విప్లవకారులు బ్రిటిష్ వాళ్ళని ప్రతిఘటించాలనే ప్రయత్నంలో లోపం రాలేదు. మార్చిలో ఇంగ్లీషు, శిక్కు సేనలు నగరంవద్ద మోహరించేసరికి ఎక్కడికక్కడే వీధుల్లో బారికేడ్లు కట్టేరు.

యుద్ధరంగంలో ఒక్కొక్క అంగుళాన్నే ఇంగ్లీషు వాళ్లు పట్టుకోవలసివచ్చింది.

అందరితోపాటు నగరం వెలుపలికి నెట్టివేయబడ్డా మౌల్వీ అహమ్మదుషా ఎల్లా లోపలికి వచ్చాడో పావత్ గంజ్ ని పట్టుకొన్నాడు. దానిని తిరిగి ఆక్రమించేటందుకై ఇంగ్లీషువాళ్లు ఎన్నో ప్రాణాలు బలి పెట్టవలసివచ్చింది. మౌల్వీను మరల బయటకు నెట్టివేసేక ఇంగ్లీషువాళ్ళు నగరంలో తమ క్రౌర్యానికి పరాకాష్ఠను ప్రదర్శించేరు.

బ్రిటిష్ సేనాని విప్లవసేనల్ని అయోధ్యనుంచి ఉత్తరపు దిక్కుగా రోహిల్ఖండ్ లోకి నెట్టివేసి ఉచ్చుబిగించి నాశనం చేయాలనే ప్రయత్నంలో ఏప్రియల్ ఒకటవ తేదీనుంచీ తన సైన్యాలను బహుముఖాలుగా నడుపుతున్నాడు.

విప్లవకారులు మొండితెగువనే చూపేరు. శత్రువుకు అమితనష్టం కలిగించేరు. ఏప్రిల్ 15 న రుయ్యాకోటవద్ద 250 మంది సిపాయీలు నరపతిసింగ్ అనే జమీందారు నాయకత్వాన ఇంగ్లీషు సేనలకు అమిత నష్టం కలిగించేరు. సుప్రసిద్ధుడైన ఇంగ్లీషు సేనాని జనరల్ హోప్ అక్కడే మరణించేడు.

క్రమంగా మే నెల నాటికి విప్లవకారుల్ని ఇంగ్లీషు వాళ్ళు రోహిల్ఖండ్ లోకి నెట్టివేసేరు. నానాసాహేబ్, మౌల్వీ, బఖ్త్ ఖాన్ వగైరా అంతా షహజహాన్ పూర్ లో వున్నారు. అందర్నీ ఒక్కచోట చేర్చి పట్టేయ్యాలనే ప్రయత్నం సఫలమైనట్లే కనబడింది. కాని షాహజహాన్ పూర్ లోనూ, తర్వాత బరేల్లీలోనూ కూడ ఇంగ్లీషువాళ్ళు విజయం పొందినా, యుద్ధం ముగియలేదు.

రోహిల్ఖండ్ లోకివెళ్ళి బ్రిటిష్ సేనలు స్థానాల నాక్రమిస్తూంటే విప్లవ నాయకులూ, సైన్యాలూ మరల అయోధ్యలోకి ప్రవేశించేరు.

కాని, ఇక్కడ పావెన్ రాజునూ, ఆయన సేనలనూ విప్లవానికి ఆకర్షించాలనే ప్రయత్నంలో మౌల్వీ అహమ్మదుషా చంపివేయబడ్డాడు. చర్చిద్దాం రమ్మన్న పావెన్ రాజు షా వచ్చేక చంపి, తల ఇంగ్లీషువాళ్లకిచ్చేడు. (జూన్ 5)

ఈ దుష్కార్యాని కాతనికి 50 వేల రూపాయల బహుమతి లభించింది.

• అహమ్మదుషా మౌల్వీ మరణించక పూర్వం తీవ్రమైన యుద్ధాలు చెలరేగుతున్న కాలంలోనే గవర్నర్ జనరల్ కానింగ్ ఒక ప్రకటన చేసేడు. ఆయుధాలు దింపేస్తే క్షమిస్తామనీ, వారి ఆస్తులిదివరలో ఏమున్నా లాక్కున్నంటే తిరిగిఇచ్చివేస్తామనీ, అలాగాక మొండిగా యుద్ధం కొనసాగిస్తే తీవ్రంగా శిక్షిస్తామనీ ఆ ప్రకటన సారాంశం.

చాలమంది నాయకులు యుద్ధంలో చచ్చిపోయేరు. అనేకచోట్ల వోడిపోయేరు. ఈ పాటికి కాళ్లుపీకి వుంటాయి. త్వరగాలొంగి పోతారని ఆంగ్లేయుల ఆశ. కాని ఆ ప్రకటన నెవ్వరూ లెక్కచేయనే లేదు.

ఈ దశలో మౌల్వీ అహమ్మదుషాను పవెన్ రాజు హత్యచేసేడనే వార్త. మళ్ళీ అయోధ్యరాష్ట్రం, రోహిల్ఖండ్ లు ఆ మూలం కదిలిపోయినాయి. విప్లవకారులన్నిచోట్లా విజృంభించేరు. కొత్తప్రజలు చేరేరు. పవెన్ రాజుకు కాళ్ళవణికేయి. ఇంగ్లీషువాళ్ళు ఆతనికి సాయంగా సైన్యాల్ని పురికించేరు.

నిజామలీఖాన్, ఖాన్ బహదూర్ ఖాన్, విలాయత్ ఖాన్, నానాసాహెబ్ మొదలయిన వారంతా తలొక నాలుగు మూడువేల మందితో శత్రువునుంచి రక్షణ స్థానాలను గుంజుకోడానికి ప్రయత్నించేరు.

గోగ్రానదికి ఆవల బేగం హజ్రత్ మహల్, సర్దార్ మామూఖాన్ లు విజృంభించేరు.

ఇంక అయోధ్య అంతటా రాజా రామ్ బక్ష్, బాహునాథ్ సింగ్, చందాసింగ్, గులాబ్ సింగ్, హనుమంతసింగ్, భోపాల్ సింగ్, రాజా నరపత్ సింగ్, రాజా వేణీమాధవ్ మొదలయిన పెద్ద చిన్న జమీందారులంతా వీరవిహారం చేస్తున్నారు. ఈ జమీందార్లగురించి ఇంగ్లీషు సేనాపతి హోప్ గ్రాంట్ చాల ప్రశంసించేడు.

కాలా సంస్థానాధిపతి హనుమంతసింగ్. విప్లవం సాగుతున్న రోజుల్లో దురవస్థలు పడుతున్న ఆంగ్లేయులకి ఆయన శరణుఇచ్చి కాపాడేడు. వారా మెత్తదనం చూసి విప్లవాన్ని అణచడంలో సాయపడమన్నారు. కాని హనుమంతసింగ్ నిరాకరించేడు.

"మీరు దురదృష్టంలో వున్నారు. వచ్చేరు. నేను రక్షించేను. ఇంక ఇప్పుడా?... నా బలగంతో లక్నో పోతున్నా. మిమ్మల్ని మా దేశంనుంచి తరుముతా."

రాజా గులాబ్ సింగ్ ను గురించి మాటలతో ఇంగ్లీషు వాళ్ళు లొంగ దీసుకోనేందుకు ప్రయత్నించేరనీ, దానికాయన లొంగక "మీ కాల్బలాలు, అశ్విక సేనలు, అసంఖ్యాక సైన్యాలు నేను నాశంచేసేను. చేస్తాను" అని సమాధానం ఇచ్చినట్లు నేటికీ జానపద గీతాలు పాడుతారు.

అలాగే రాణా వేణీ మాధవ్ నుకూడా ఇంగ్లీషు వాళ్లు ఆశచూపి లాగబోయేరట. "నా గొంతులో వూపిరున్నంతవరకూ మిమ్మల్ని హతమారుస్తా" నని ఆయన సమాధానం ఇచ్చేడు.

జూన్ నుంచి అక్టోబరువరకూ అయోధ్య, రోహిల్ఖండ్ లు రక్తంలోమునిగి తేలేయనడం అలంకారం అవుతే కావచ్చుకాని, అతిశయోక్తిమాత్రం కాదు.

అక్టోబరులో ఇంగ్లీషు సేనానాయకుడు విప్లవకారుల్ని ఒకవేపునుంచి నెట్టుకొంటూ రాష్ట్రం బయటకు నెట్టి, ఒకచోటుకు చేర్చి నాశనంచేయాలని సేనల్ని నడిపించేడు.

దీనితో రెండోవేపున విక్టోరియారాణి ప్రకటన ఒకటి వెలువడింది (1858 నవంబరు). కంపెనీ చేతుల్లోంచి అధికారం రాణి తీసుకొంటూందనీ, ఆయుధాలు దించినవారిని క్షమిస్తాననీ ఆ ప్రకటన తెలిపింది. అల్లాంటివారి ఆస్తులు లాక్కోము అన్నారు. ఇతర విధాలయిన వాగ్దానాల నిచ్చేరు.

కాని, విప్లవకారులు ఆయుధాలను దించలేదు. విప్లవకారులతో వున్న అయోధ్యరాణి దీనిని చట్టబాతాఖాతీగా తోసేసింది. యుద్ధాలు సాగుతూనే వున్నాయి.

నవంబరు, డిసెంబరులు గడిచేయి. 1859 జనవరి వచ్చింది. వెళ్లింది. ఇంకా యుద్ధం ఆగలేదు. ఏప్రిల్ లో బ్రిటిష్ సేనలు వెంట తరుముతూంటే విప్లవకారులు అడుగడుగునా ప్రతిఘటిస్తూ నేపాల్ లోకి అడుగు పెట్టేరు.

అప్పటికి యుద్ధాలలో చాలమంది విప్లవనాయకులు మరణించేరు. చావగా మిగిలిన వారిలో అయోధ్య రాణీకీ, కొడుక్కూ మాత్రం నేపాల్ రాజు ఆశ్రయం ఇచ్చేడు.

నానాసాహెబ్ ఆఖరున బ్రిటిష్ సేనానికో ఉత్తరం మాత్రం వ్రాసి అదృశ్యుడయ్యేడు. తర్వాత ఆయన చరిత్ర ఏమీ తెలియదు. 1908 ప్రాంతంలో ఓవ[illegible] చాల వృద్ధాప్యంలో హరిద్వారం లోనో ఎక్కడో ఓమారు కనిపించేడని ఓకథ మాత్రం వుంది.

ఆయన ఇంగ్లీషు సేనాధిపతికి వ్రాసిన జాబులో మా దేశంలో "మేము దొంగలమూ, ఫరంగివాళ్ళు దొరలూనా" అని అడిగేడు.

ఆ ప్రశ్నకి సమాధానం ఆ యుద్ధం జరిగిన నూరేళ్ళకి ఈనాడే మనం ఇవ్వగలిగే దశలో వున్నాం.

"కాదు."



# హైద్రాబాద్ సంస్థానంలో విప్లవ ఛాయలు

టి. కె. విశ్వనాథం

మే 10 వ తేదీన మీరట్‌లో సిపాయీలు తిరగబడ్డారనీ, వారు ఢిల్లీకి వెళ్లి అక్కడి సిపాయిల్ని చేర్చుకొని మొగలాయీ చక్రవర్తుల వంశీకుడైన బహదూర్‌షాను చక్రవర్తిగా ప్రకటించారనే వార్త దేశాన్నంతనీ ఉద్రిక్త పరచింది. అదివరకే ఇంగ్లీషు పెత్తనంయెడ తీవ్ర వ్యతిరేకతవున్న హైద్రాబాద్ సంస్థానంలో ప్రజానీకం ఈ వార్తకు స్వాగతం ఇచ్చింది. మహోత్సాహం చూపింది. అదివరకే రహస్యంగా జరుగుతున్న విప్లవ ప్రయత్నాలు బహిరంగంగా మరింత విస్తృత రూపంలో సాగింపబడ్డాయి.

మసీదుల్లో ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు యిచ్చారు. బ్రిటిషువారిపై ధర్మయుద్ధం (జెహాద్) ప్రారంభించమని ప్రజల్ని ప్రోత్సహిస్తూ మసీదుల గోడలపైన, యింకా యితరచోట్ల పోస్టర్లు అంటించారు. అప్పటి నవాబు అఫజల్-ఉద్-దౌలా కూడా బ్రిటిషువారిపై తిరుగుబాటు చేయాలని కోరారు! అలా చేయకపోతే గాజులు తొడిగించుకొని యింట్లో కూర్చోవాలని, మహమ్మదు ప్రవక్తకు, మతానికి ద్రోహంచేసిన వాడవుతాడని హెచ్చరించారు. ప్రతి ఒక్కరూ యీ యుద్ధంలో పాల్గొనాలని - అట్లా పాల్గొనని ముస్లిము పందితో సమానుడని, హిందువు ఐతే గోహత్య చేసినవాడవుతాడని ఆ పోస్టర్లలో వ్రాయబడింది.

సికింద్రాబాదులోని సహాయ సైన్యాలలో తిరుగుబాటు ప్రోత్సహించటానికి ప్రయత్నాలు జరిగాయి. ఒక ఫకీరు నగరవాసులను బ్రిటిషువాళ్ళపై తిరుగుబాటు చేయవలసింది అనీ, సికింద్రాబాదులో సహాయ సైన్యాలుకూడా తమతో చేరుతవనీ ఉపన్యాసాలు యిస్తూంటే ఒక అరబ్బుజమేదారు (సైనికాధికారి) ఆ ఫకీరుని బంధించి ప్రధాన మంత్రి సాలార్ జంగుకు అప్పగించాడు.

నైజాం నవాబు, ప్రధానమంత్రి సాలార్‌జంగు సైనిక తిరుగుబాటు విషయంలో బ్రిటిష్‌వారికి చేతనైనంతసాయంచేశారు. తిరుగుబాటును ప్రోత్సహించే ఫకీరులను రెసిడెంటు ఆజ్ఞపై అరెస్టు చేయించేవారు. తిరుగుబాటు ప్రయత్నాలు, లక్షణాలు ఎక్కడ కనపడినా అణచివేశారు. అట్లా అణచివేసినట్లు ఉత్తరాలద్వారా బ్రిటిష్ రెసిడెంటుకు తెలియపరచేవారు. బ్రిటిష్‌వారి యెడలచాలా భయనమ్రతలతో మెలగి బ్రిటిషు రెసిడెంటు డేవిడ్‌సన్ యోగ్యతాపత్రాలను, కృతజ్ఞతలను అందుకొన్నారు. రెసిడెంటు చెప్పినట్లు ప్రవర్తించారు.

ఆనాటి హైద్రాబాద్ పరిస్థితులను 'ఇంగ్లీషుమన్' అను పత్రిక ప్రచురించిన ఒక వార్తనుబట్టి మనం తెలుసుకోవచ్చు.

"సికింద్రాబాదులో సహాయ సైన్యంలోని భారత సిపాయీలు తిరుగుబాటుచేశారని, నగరంలోని ప్రజలను కూడా తిరుగుబాటుకు తోడ్పడవలసిందిగా అడిగారని, నైజాం నవాబు సిపాయీలు నగరంలోకి రాకుండా నగర ద్వారములవద్ద అరబ్బు సైనికులను కాపలావుంచారని తెలియవచ్చింది. ముస్లిము మతాన్ని బ్రిటీషువారు నాశనంచేశారు కాబట్టి, ప్రజలంతా తిరుగుబాటుచేయాలి అని పోస్టర్లు గోడలపై అంటించారు. నగరంలోని క్రింది తరగతుల ప్రజలు తిరుగుబాటు చేసేలాగు కనపడుతున్నారు. ఒక మసీదులో ప్రార్థన సమయంలో మద్రాసునుండి వచ్చిన యిద్దరు మనుష్యులు "అట్లా ఆడముండల్లాగా వాగుతారేం? మతం నాశనంచేసిన (బ్రిటిషు) వారిమీద తిరుగుబాటు

ప్రోత్సహించరేం" అని అన్నారని, అంతట అక్కడ ఉన్న కొత్వాల్ వారిద్దర్నీ అరెస్టుచేయగా వారు కామోషా అనే ఫకీరు అనుచరులవల్ల విడిపించబడ్డారనీ కూడా తెలియుచున్నది. బ్రిటిషు రెసిడెన్సీవద్దర సికింద్రాబాదునుండి తెచ్చిన గుర్రాలులాగే ఫిరంగుల తోను, బోలారంనుండి వచ్చిన గుర్రపు దళాలతోను రక్షణఏర్పాట్లు చేస్తున్నారు.

నైజాం మంత్రి తిరుగుబాటు అణచివేయటానికి అన్ని సన్నాహాలు మనతో సహకరించి చేస్తున్నాడు. ప్రజలు గుమిగూడకుండా అన్ని సైనికులను నియమించినాడు."

## ఔరంగాబాదులో సిపాయిల తిరుగుబాటు

హైదరాబాద్‌లోపరిస్థితిశ్రుతిమించిసికింద్రాబాదు, బోలారంలోని కంటిన్‌జెంటులోను, సహాయ సైన్యాల లోను తిరుగుబాటుకై ప్రయత్నాలు జరుగుతున్న సమయంలో - అనగా 1857 జూన్‌లో-ఔరంగాబాద్‌లోని సైన్యంలో తిరుగుబాటుతత్వం పెద్దస్థాయి నందుకొన్నది. హైదరాబాదు కంటిన్‌జెంటులోని 3 వ అశ్విక పటాలం కెప్టెన్ ఆర్ నాయకత్వాన బొంబాయి ప్రభుత్వం కోరికపై మాలెగాంకు పంపబడింది. దాని స్థానే హైదరాబాద్ కంటిన్‌జెంటు 1 వ అశ్విక పటాలం కెప్టెన్ అబ్బాట్ నాయకత్వాన మొమినాబాద్‌నుండి పిలిపించారు. 1 వ అశ్విక పటాలం మొమినాబాద్‌నుండి ఔరంగాబాద్‌కు పయనిస్తూ దారిలో చోటాపింపల్‌గాం వద్ద మజిలీ చేసింది అక్కడికి ఔరంగాబాదు యింకా 14 మైళ్ళుంది. ఈ మజిలీలో వుండగా 1 వ అశ్విక పటాలానికి ఉత్తర భారతదేశంలో జరిగిన సిపాయిల తిరుగుబాటు వార్తలు అందినవి. ఆ వార్తలతో సైనికులలో ఉత్సాహం కలిగింది. తమరిని ఢిల్లీకి పంపుతారని వారు ఊహించారు. అది వారి కిష్టంలేదు.

వారు 1857 జూన్ 4న ఔరంగాబాదు చేరుకొని విడిదిచేశారు. అప్పటికిగాని సైనికుల్లోని తిరుగుబాటు తత్వం కెప్టెన్ అబ్బాట్‌కు తెలియలేదు.

ఢిల్లీలోని తమ చక్రవర్తికి వ్యతిరేకంగా పోరాడటానికి తమను పంపరాదని, దక్కనులో పనిచేయటానికి మాత్రమే తాము కొలువు కుదిరామని అందుకు భిన్నంగా ఆజ్ఞలువస్తే తిరుగుబాటు చేస్తామని సైనికులు నిశ్చయించుకొన్నారు.

కెప్టెన్ అబ్బాట్, లెఫ్టినెంట్ డీకరు, రిస్సల్‌దారులు సైనిక క్యాంపులోకి వచ్చినప్పుడు వారిని కాల్చివేయాలనే నిశ్చయంకూడా జరిగిపోయింది. అది తెలిసి అధికారులు తప్పుకొన్నారు. ఈ పటాలంలోని 5 వ దళంవారు చొరవతీసికొని తిరుగుబాటును ప్రోత్సహించి క్రింది అధికార్లనుకూడా వారిలో చేరమని అడిగారు.

దానితో అధికార్లలో కంగారు పుట్టింది. అంతకు క్రితం ప్రయాణంకమ్మని ఆజ్ఞలిచ్చినా తన లాంఛనాలు తీసి అవతలపెట్టి నమాజ్ చేసికొనుటకు పోయిన ఒక సైనికునిపై కెప్టెన్ అబ్బాట్ కోపగించుకొని సంచలించాడనేది కూడా దీనికి ఒక కారణంగా భావించసాగారు.

ఒకనాడు కెప్టెన్ అబ్బాట్ తన క్రింది అధికారులను పిలిపించి పరిస్థితిని సరిచేయమని, సైనికులంతా కొద్దిమంది గుండగిడుల వలలో పడ్డారని, ఉత్తర భారతదేశానికి యీ దళాన్ని పంపే ఆలోచన తనకు తెలిసినంత వరకు లేదని చెప్పాడు. కాని క్రింది అధికారులు యీ పని కొద్దిమంది గుండగీండ్రది కాదని, అధిక సంఖ్యాక సైనికులు తిరుగుబాటు తత్వం చూపిస్తున్నారని తేల్చివేశారు. ఒకనాడు కెప్టెన్ అబ్బాట్ కూడా తక్కిన అధికారులతో పటాలాల్లోకి వెళ్ళాడు. కాని ప్రమాదం ఏమీజరుగలేదు. సైనికులంతా గౌరవంగా విధేయతతో ఉన్నట్లే కనపడ్డారు. అనుమానం మాత్రం పోలేదు. క్రింది అధికారులు సైనికులను సముదాయిద్దామని, తమ వైపుకు తిప్పుకోవాలని ప్రయత్నించారు. అలా చేసిన ఒక అధికారిని ఒక సైనికుడు "నీవు ముసల్మానువు కాదురా" అని నానా బూతులు తిట్టాడు.

ఈ పరిస్థితులను కెప్టెన్ పై అధికారులకు తెలియపరచి, ఏం చెయ్యమంటారని సలహా కోరుతూ వ్రాశాడు.

నచ్చజెప్పి పరిస్థితిని చక్కబెట్టవలసిందని, అవసరమనుకొంటే బొంబాయి సేనాధిపతికి వ్రాసి సైన్యాలను పంపించుతామని పై అధికార్లు తెలియపరిచారు. కెప్టెన్ మొదటి అశ్విక సైన్యాన్ని రాకపోకల కుపయోగించే ఒక వంతెనకు కాపలా ఉంచాడు. సామ దాన భేదముల నుపయోగించి హిందూ సైనికులను, ఒక పటాలాన్ని అధికార్లు తమవైపుకు తిప్పుకొన్నారు. సైనిక శిక్షణకు కట్టుబడతామని వారిచే వాగ్దానం చేయించుకొన్నారు. కాని తక్కిన సైన్యానికి భయపడి వారు బయటకు రాలేకపోయారు. ఏది ఏమైనా నైజాం సరిహద్దును దాటి పనిచేయము అని మొదటిఅశ్విక సైన్యం పట్టుపట్టింది. జమేదార్

చేదాఖాన్ ఆ సైన్యంలో నాయకుడుగా పేరు పొందాడు.

తరువాత కెప్టెన్ 2 వ పదాతి దళాన్ని అనువైన ప్రదేశాల్లోవుంచి విపత్తునుండి కాపాడుకోవడానికి సన్నద్ధమైనాడు. చెట్లునరికించి బారికేడ్లు నిర్మించారు. అధికారుల కుటుంబాలను రక్షితప్రాంతాలకు పంపివేశారు. కాని ఆనాడు సాయంకాలం 5 గంటలకు రిస్సల్ దారు అబ్దుల్ రేమాన్ ఖాన్ కెప్టెన్ దగ్గరకు వచ్చి తనపటాలం పరిస్థితి మెరుగైందని, వారు ఆజ్ఞలను పాలించటానికి సిద్ధంగావున్నారని, అలా సంతకాలు చేశారని, తప్పు ఒప్పుకొన్నారని చెప్పాడు. అంతట కెప్టెన్ రేమాన్ ఖాన్ పటాలాన్ని తక్కిన సైన్యంనుండి వేరుచేయించాడు.

మరునాడు ఉదయం రెజిమెంటులోని హిందూ అశ్వికులుకూడా రేమాన్ ఖాన్ క్యాంపులో చేరతామని కబురుపంపారు. కెప్టెన్ అందుకు అనుమతించాడు. 2, 3, 5, 6 దళాలకు చెందిన అశ్వికులు కూడా జరిగిన దానికి విచారం తెలియపరుస్తూ వర్తమానం చేశారు. కెప్టెన్ జరిగిన తప్పిదాన్ని అంగీకరిస్తూ ఎక్కడబడితే అక్కడ కొలువుచేయటానికి వారు అంగీకరిస్తే చూస్తానన్నాడు. కాని ఏ కారణం లేకుండా తిరుగుబాటు చేయటానికి ప్రయత్నించిన యీ సైనికులపట్ల విశ్వాసం వుంచలేకపోయాడు. అయినా, పరిస్థితి అదుపులోకి వచ్చిందని తలచాడు. తిరుగుబాటు చేసినవారికి ద్రోహం తలపెట్టి అధికార్ల తరఫున భుజంవేసికొన్న డఫేదార్లను జమేదార్లుగా నియమించాడు. పదాతిదళం రాజభక్తియుత ప్రవర్తనకు ప్రశంసాపత్రాలను పొందింది.

కెప్టెన్ అబ్బాట్ రిపోర్టుపై బ్రిటిషు రెసిడెంటు జూన్ 19 తేదీని ఒక ఉత్తర్వుచేశాడు. ఈ తిరుగుబాటుకు మూలకారకులయిన వారితో సమాధానం పడకూడదని, ఔరంగాబాద్‌కు తెల్ల సైన్యం వస్తూంది కాబట్టి రాజద్రోహానికి కారకులను అరెస్టుచేసి వారిని కోర్టుమార్షల్ చేయవలసిందని, శిక్షలను అమలుపరచవలసిందని ఆజ్ఞలు జారీచేశాడు.

కాని యిది అంతటితో అంతంకాలేదు. తిరుగుబాటుతత్వం రెండో పదాతిదళానికి ప్రాకింది. ఈ దళంలో 250 మంది సైనికులు - అయోధ్యనుండి వచ్చినవారు ఉన్నారు.

అశ్విక సైన్యం తాలూకు కొందరు మనుష్యులు పదాతిదళంవారి వద్దకు రహస్యంగా రాకపోకలు సాగించేసరికి తెల్ల ఆఫీసర్లు అసలు నిద్రపోవటమే మానివేశారు.

పదాతిదళం సైన్యాధిపతి కెప్టెన్ స్పీక్. అతనికి నమ్మకస్తుడైన పదాతిసైనికుడు బరాన్ బక్సు అనే అతను ఒకరోజు అర్ధరాత్రి కెప్టెన్ స్పీక్ వద్దకు వచ్చి అశ్వికదళం సాయుధం అవుతోందని, కంటోన్మెంటుపై తెల్లవారేసరికి దాడిచేస్తుందని వర్తమానం తెచ్చాడు. తక్షణం కెప్టెన్ స్పీకు, తన భార్యాబిడ్డలను, యింకా కొందరు స్త్రీలను ఒక రెండెడ్ల బండికి పద్దాలుకట్టి (జనానా బండిలాగా) బరాన్‌బక్సు సాయంతో అహమ్మద్ నగరం పంపేడు. ఆరాత్రి విపరీతమైన గాలివాన వచ్చింది. ఉరుములు మెరుపులు ప్రకోపించినవి. అశ్వికసైనికులు తమపై భగవంతుడు క్రోధం వహించాడనీ, తుపానుకు జండా ఎగిరిపోవటం ఒక అశుభం అని సిపాయీలు ఆరాత్రి తిరుగుబాటు చేయలేదట.

ఔరంగాబాద్ కంటోన్మెంటులో తిరుగుబాటు లక్షణాలు పొడచూపగానే పూనానుండి కొత్త సైన్యాలను పంపమని కబురువెళ్ళింది. పూనానుండి వచ్చే సైన్యాలు దారిలో వుండగానే ఔరంగాబాద్‌లో పరిస్థితి శృతిమించింది. ఫిరంగిదళం మీద కూడా అనుమానం కల్గింది. అశ్వికదళంపై కాల్పులు సాగించమని ఆర్డర్లు యిస్తే, ఫిరంగులు పట్టించకూడదని ఫిరంగిదళ సైనికులు ఒక నిర్ణయానికి వచ్చినట్లు ఫిరంగిదళ అధిపతి కెప్టెన్ సింక్లేరుకు తెలిసింది. పదాతిదళాలవారు "మీతోపాటే మేమూ" అని అశ్వికదళంవారితో అన్నట్లు తెలిసింది. అశ్వికదళంవారు ఏక్షణాన్నయినా తిరుగుబాటుకు సంసిద్ధులుగా ఉన్నట్లు కనిపించింది. ఇట్టి పరిస్థితిలో బొంబాయినుండి తెల్లసైన్యాలు దిగుతున్నాయని ఒక వదంతి పాక్కింది.

1857 జూన్ 23, న అహమదునగర్ నుండి సైన్యాలు ఔరంగాబాద్‌కు వచ్చాయి. వాటికి మేజరు జనరల్ వుడ్‌బరన్ సేనాపతి. కంటోన్మెంటు రక్షణకు చర్యలు తీసికొన్నారు. వీరు కెప్టెన్ అబ్బాట్‌తో కలిసి మొదటి అశ్వికదళం క్యాంపుకు వెళ్ళారు.

ఉదయం 10 గంటలకు జనరల్ వుడ్‌బరన్ బ్రిగేడ్ వచ్చింది. సరాసరి తిరుగుబాటు చేసిన అశ్విక పటాలం క్యాంపుకు వెళ్ళారు. ఆయుధాలు యిచ్చివేసి లొంగి పొమ్మన్నారు. ఒక దళం తప్ప తక్కినవాళ్లంతా ఆయుధాలు క్రింద పారవేశారు. లొంగిపోని ఒక పటాలానికి ఆలోచించుకోండని 6 నిమిషాలు వ్యవధి యిచ్చారు.

అయినా వారు లొంగివచ్చే సూచనలు కానరాలేదు. ఫిరంగిదళాన్ని కాల్చమని ఆర్డరిచ్చారు. కాల్చారు. కొద్దిమంది చచ్చిపోయారు. తెల్లవాళ్ళ కత్తులకు సుమారు ఒక డజనుమంది ఎరఅయ్యారు. తక్కిన వాళ్ళు దగ్గరవున్న పట్టణంలోకి పారిపోయారు. కెప్టెన్ మెయిన్ 3 వ ఆశ్వికదళంతో పట్టణంలోకి వెళ్లాడు. ఎదురుతిరిగి నిలబడితే తిరుగుబాటుదారులను నాశనం చేస్తారు. గార్డులోవున్న మొదటి ఆశ్వికదళ సైనికుల్ని నిరాయుధుల్ని చేశారు. వారిస్థానే 3 వ ఆశ్వికదళం వారిని నియమించారు. మరునాడు సిటీలో చాలా మందిని ఉరితీయటంతో, తుపాకులతో కాల్చివేయటంతో చేస్తారు.

ఈ దాడివేళ మీర్ ఫిదా అలీ అనే దఫేదారు కెప్టెన్ అబ్బాట్‌పై పిస్టల్‌తో కాల్చాడు. కాని గురి తప్పింది. వెంటనే అతనిని బంధించారు. రిసాల్దారు మహమ్మదు హాషీం, జమేదారు నాజిర్ ఖాన్ యింకా అయిదుగురు తిరుగుబాటుకు ప్రయత్నాలు చేసిన వారిలో ముఖ్యులని చెప్పి, వారిని నిరాయుధులను చేసి బంధించారు. జమేదారు షేర్‌ఖాన్ కొద్దిమంది సైనికుల సహాయంతో కంటోన్మెంటులోని తెల్లఆఫీసర్లందరినీ హత్యచేయ చూచాడని అతనినికూడా బంధించారు. ఇంకా కొందరిని అలానే నిరాయుధంచేసి నిర్బంధించారు. వీరితోపాటు ఒక దఫేదారుని, 9 మంది సైనికుల్ని మొమినాబాద్‌లో నిర్బంధించారు.

మీర్ ఫిదా అలీకి కెప్టెన్ అబ్బాట్‌పై పిస్టల్ కాల్చినందుకు ఉరిశిక్ష వేశారు. తక్కినవారిపై కోర్టు మార్షల్ విచారణ పెట్టారు.

మీర్ ఫిదా అలీని ఉరితీయటానికి లైన్ల ముందు భాగంలో ఒక ఉరికంబం ఏర్పాటుచేశారు. ఉదయం జనరల్ వుడ్‌బరన్ దళాలు పెరేడు చేసినవి. ఖైదీని బయటికి తీసికొనివచ్చి క్లుప్తమైన కోర్టుమార్షల్ విచారణలో ఉరిశిక్ష విధించి ఫిరంగిశకటంపై యెక్కించి, ఉరితాటిని మెడకు తగిలించారు. తర్వాత ఫిరంగి శకటాన్ని ఖైదీ కాళ్ళక్రిందినుండి తొలిగించారు. ఆశ్వికదళాలు, ఫిరంగిదళం, పదాతిదళం ముందు భాగంలో పెరేడు చేస్తుండగా మీర్ ఫిదా అలీని ఉరితీశారు. ఈ సందర్భంలో పట్టుబడిన సైనికుల్ని కొద్దిరోజులపాటు విచారణ జరిపారు. ఫలితంగా 21 మందిని తుపాకులతో కాల్చి చంపారు. ముగ్గుర్ని ఫిరంగి కాల్పులకు ఆహుతిచేశారు. ఈ విషయాన్ని గురించి చార్లెస్ బాల్ యీ విధంగా వర్ణించాడు:

"ఇదిచాలా భయంకర దృశ్యం. ఫిరంగితో కాల్చబడిన వానితల 29 గజాల ఎత్తు ఆకాశంలోకి ఎగిరింది. వాని చేతులు 7,8 గజాలదూరం యిటు అటు ఎగిరిపడి పోయాయి. మరణశిక్ష విధించబడినవారు ఎంతో నిబ్బరంగా వార్తను స్వీకరించారు. ఫిరంగితో కాల్చబడిన సైనికుడు "నాపై సాక్ష్యం చెప్పినవారు పరలోకంలో యిందుకు ప్రతిఫలం అనుభవిస్తారు." అన్నాడు. తనను త్రాటితో ఫిరంగికి కట్టనక్కరలేదని నిబ్బరంగా ఫిరంగిముందు నిలబడతానని చెప్పాడు. ఉరితీయబడిన సైనికుడు తన "పాపాలన్నీ కడుక్కొన్నా"నని, "ఎంతత్వరగా స్వర్గానికి వెళ్ళితే అంత మంచిది" అని అన్నాడు."

ఆశ్వికదళాన్ని నిరాయుధం చేసినప్పుడు ఆశ్విక సైనికులు చాలా మంది ఔరంగాబాద్‌లో వారివారి యిండ్లలో అరెస్టు చేయబడ్డారు. వారి నాయకుడు అమీర్‌ఖాన్ దొరకలేదు. అమీర్‌ఖాన్‌ను, వహీద్ ఖాన్‌ను పట్టి యిచ్చినవారికి రు 2000, రు 500 బహుమానాలు ప్రకటించారు. ఇంకా అనేకమందిని అరెస్టుచేసి, చిత్రహింసలకు గురిచేసి సైన్యంలోనుండి బయటికి నెట్టివేశారు.

మీరట్‌లో జరిగిన తిరుగుబాటు తర్వాత కొన్ని వారాల్లోనే హైదరాబాదు స్టేటులో జరిగిన ఔరంగాబాదు తిరుగుబాటు యీ విధంగా ముగిసింది.

## హైదరాబాదులో బ్రిటిష్ రెసిడెన్సీపై దాడి

జనరల్ వుడ్‌బరన్ సైన్యాలు ఔరంగాబాదులో దిగిన మరునాడే కెప్టెన్ గాల్ నాయకత్వాన ఒక సైనికదళం బుల్డానాకు ప్రయాణమైంది. తిరుగుబాటు తత్వం చూపుతున్న 3 వ సైనిక పటాలాన్ని లొంగదీయటమే కెప్టెన్ గాల్ దళం కర్తవ్యం. కెప్టెన్ గాల్ దళం బుల్డానా సమీపించుతున్న వార్త వినగానే అక్కడవున్న 3 వ సైనికదళంలోని ఒక రిసాల్దార్, యిద్దరు జమేదార్లు, ముగ్గురు దఫేదార్లు, ఏడుగురు ట్రూపర్లు, యిద్దరు బ్యాండువాళ్ళు 3 వ సైనికదళాన్ని వదలివేసి హైదరాబాదు దిక్కుగా పలాయనం చేశారు.

జమేదారు చీదాఖాన్ నాయకత్వాన బుల్డానా సైన్యంనుండి పరారయిన పదముగ్గురు మాజీ సైనికులు హైదరాబాదు చేరుకొన్నారు. చీదాఖానును పట్టి యిచ్చినవారికి రు. 3,000 బహుమానం ప్రకటించారు. వారు హైదరాబాదు చేరగానే ప్రధాని సాలార్‌జంగు వారిని అరెస్టుచేసి బ్రిటిషు రెసిడెంటుకు అప్పగించాడు.

దానిమీదట హైదరాబాదులో ఉద్రేకాలు పెరిగాయి.

1857 జూలై 17, దిన మక్కామసీదులో పెద్దసమావేశం జరిగింది. మౌల్వీలు ఉద్రేక పూరితమైన ఉపన్యాసాలు యిచ్చారు. తురకు నలుగురు మౌల్వీలను నవాబు వద్దకు రాయబారంపంపి జమేదారు చీదాఖానును,అతని అనుచరులను బ్రిటిష్ రెసిడెన్సీనుండి విడుదల చేయించాలని కోరడానికి నిశ్చయించారు. అలా విడుదల కాకపోతే రెసిడెన్సీపై దండయాత్ర చేయాలని నిశ్చయించారు.

రెసిడెన్సీ ఏక్షణాన్నైనా ముట్టడింప బడుతుందని బ్రిటిషువారు ప్రమాదాన్ని ఎదుర్కొనడానికి సిద్ధపడుతున్నారు. సైనిక పటాలాలను అదివరకే పెంచుకొన్నారు.

మక్కామసీదులోని సమావేశాన్ని భగ్నం చేయటానికిగాను ప్రధాని సాలార్‌జంగు అరబ్బు సైనికుల్ని పంపి సమావేశాన్ని చెదరగొట్టించాడు. అలా చెదరగొట్టినట్లు బ్రిటిషు రెసిడెంటుకు వర్తమానంకూడా పంపాడు. కాని సాయంకాలానికి సాలార్‌జంగు హడావుడిగా రెసిడెంటుకు ఒక వర్తమానం పంపాడు. 500 మంది రోహిల్లాలు, మౌల్వీ అల్లాఉద్దీన్, రోహిల్లా నాయకుడు తురాబాజ్‌ఖాన్‌ల నాయకత్వాన తెగబడ్డారనీ బ్రిటిషు రెసిడెన్సీపైకి వచ్చిపడుతున్నారనీ తెలియజేశాడు. బ్రిటిషువారు అన్ని ప్రయత్నాలూ చేసికొని దాడిని ఎదుర్కొనడానికి సిద్ధపడ్డారు.

సాయంకాలం సరిగ్గా పావుతక్కువ ఆరు గంటలకు సాలార్‌జంగు వర్తమానం అందింది. బ్రిటిషు వారిని స్వరక్షణ సాగించుకోవలసిందని, యీ లోపున నైజాం సైన్యాలు బ్రిటిషువారి సాయానికి రాగలవని కూడా తెలియపరచాడు.

రెసిడెన్సీ గేట్లన్నీ బంధించారు. ప్రవేశించటానికి వీలుగావున్న ప్రతిచోట తుపాకులు గురిపెట్టబడి పొంచిచూస్తున్నాయి. రెసిడెంటు ఆత్మరక్షణ ఎత్తుగడే చాలదని, ఎదురుదెబ్బ కొట్టాలని, చొరవ తామే తీసికోవాలనే ధోరణి అవలంబించాడు.

దాడిచేసిన జనసందోహం రెసిడెన్సీకి పడమటగోడ ప్రక్కగా రోడ్డుప్రక్కన వున్న ఉబ్బా సాహెబు, జయగోపాల్ అనే షావుకార్ల మేడల పైభాగాల్లోకి ఎక్కి రెసిడెన్సీ ఆవరణలోకి ప్రవేశించాలనిచూచారు. రెసిడెన్సీ ప్రక్కనేవున్న దిల్‌సూఖ్ గార్డెన్సు దాడి చేసే జనంతో నిండిపోయింది. ముట్టడిదారులు పుతలీబావరీ వద్ద గేటుపై పడ్డారు.

ప్రధానమంత్రిచేపంపబడినఅరబ్బుసైనికులు ముట్టడిదారులకు సాయంచేశారు! ముట్టడిదార్లు షావుకార్ల మేడల్లో నుండి సొరంగాలుచేసుకొని నగరంలోకి పారిపోనిచ్చారు. తెల్లవారేసరికి అంతా రహస్య ప్రదేశాల్లో దాక్కున్నారు.

ఉభయపక్షాల మధ్య జరిగిన పోరాటంలో 32 మంది ముట్టడిదార్లు చనిపోయారు. రాత్రంతా రెసిడెన్సీ చుట్టూ సంఘర్షణ సాగుతూనేవుంది. జూలై 18 ఉదయానికి ముట్టడిదార్లంతా పూర్తిగా చెదరగొట్టబడ్డారు.

రాత్రిదాడి తర్వాత 200 మంది తెల్లసైనికులను, మద్రాస్ ఫిరంగిదళం తాలూకు శిఫిరంగులను, మద్రాసు అశ్విక దళాన్ని సికింద్రాబాద్ నుండి పిలిపించి రెసిడెన్సీ బలాల్ని పెంచారు.

రెసిడెన్సీపైజరిగిన యీ దాడినిగురించి నవాబు రెసిడెంటుకు తెలియపరచాడు. తూరెబాజ్‌ఖాను తప్పించుకుపోయాడని, నైజాం పంపిన అరబ్బుసైనికులు నిర్లక్ష్యంగా ప్రవర్తించారని వ్రాశాడు. దానికి సమాధానంగా ప్రధానమంత్రి జరిగిన దానికి క్షమాపణ వేడుకొన్నాడు. అప్పటికే నేరస్తుల కొరకై చర్యలు తీసికొన్నట్లు, తూరెబాజ్‌ఖాను సహచరుల్ని 12 మందిని అరెస్టుచేసినట్లు తెలియపరచాడు. నవాబు తూరెబాజ్‌ఖానును అరెస్టు చేయాలని దిగువ అధికారులకు ఆర్డరు పంపాడు. తర్వాత కొద్దిరోజులకే తూరెబాజ్‌ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్‌ల ఆస్తులన్నిటినీ ప్రభుత్వం వశం చేసికొంది. చాలా నెలలకు మౌల్వీ అల్లావుద్దీన్ కూడా హైదరాబాదు దగ్గరగావున్న మంగళపల్లి అనే గ్రామంలో పీర్‌మహ్మద్ యింటిలో అరెస్టు చేయబడ్డాడు.

తూరెబాజ్‌ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్‌లు నవాబు కోర్టుల్లో విచారింపబడి ద్వీపాంతరవాస శిక్ష విధింపబడ్డారు. కాని తూరెబాజ్‌ఖాను జైలునుండి 18-1-1859 తేదీని తప్పించుకు పారిపోయాడు. తిరిగి అరెస్టు చేయబడే సందర్భంలో తుపాకి కాల్పులకు గురై చనిపోయాడు. చంపబడిన తర్వాత తూరెబాజ్‌ఖానుశవాన్ని హైదరాబాదు పబ్లిక్ స్థలంలో వ్రేలాడదీశారు.

మౌల్వీ అల్లావుద్దీన్‌కు ద్వీపాంతరవాస శిక్ష విధించి అండమాను దీవులకు పంపారు. అక్కడ 1884 వరకు



విప్లవకారుల్ని ఫిరంగులకి కట్టి కాల్చివేస్తున్న దురంతం

ఖైదీగావుండి అల్లావుద్దీన్ మరణించాడు. అల్లావుద్దీన్ ఒక మతగురువు. ఒడ్డుపొడుగుగల ఆజానబాహువు.

రెసిడెన్సీపై జరిగినదాడి విజయవంతం కాకపోవడంతోను, నైజాం నవాబూ ప్రధానమంత్రి సాలార్‌జంగూ బ్రిటీషువారికిదోస్తులై బ్రిటిషు వ్యతిరేక ప్రవర్తనలను నిర్దాక్షిణ్యంగా అణచివేయడంతోను హైదరాబాదులో బ్రిటిషువారికి వ్యతిరేకంగా కొత్త తిరుగుబాట్లు జరగటానికి అవకాశాలు సన్నగిల్లినవి. అంతేగాక దక్షిణ భారతదేశం అంతటిలోను బ్రిటిషువారికి వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాట్లను అణచివేయడంలో హైద్రాబాదు ముఖ్యపాత్ర వహించింది.

## షోలాపూర్ రాజు తిరుగుబాటు

గుల్బర్గా జిల్లాలోని షోలాపూర్ రాజు వెంకటప్ప నాయక్ బ్రిటిషు వారికి వ్యతిరేకంగా లేవదీసిన తిరుగుబాటు అణచివేయబడింది. రాజా వెంకటప్పనాయక్ తప్పించుకొని హైదరాబాదు వచ్చివేశాడు. అతన్ని నైజాంనవాబు, ప్రధానమంత్రి సాలార్‌జంగు నిర్బంధంలోవుంచి బ్రిటిషు రెసిడెంటుకు అప్పగించారు. రాజా వెంకటప్ప నాయక్‌కు విచారణజరిపి, ఉరిశిక్ష విధించారు. రెసిడెంటు ఉరిశిక్షను రద్దుచేసి ద్వీపాంతరవాస శిక్షగా మార్చాడు. చివరకు గవర్నరుజనరల్ ఆ శిక్షను 4 ఏండ్ల శిక్షగా తగ్గించి దక్షిణాన ఒక కోటలో నిర్బంధించాడు. దక్షిణాదికి తరలించుకుపోతుండగా రాజా వెంకటప్పనాయక్ దారిలో కాపలా సైనికుల నుండి రివాల్వర్ లాక్కొని ఆత్మహత్య చేసికొన్నాడు.

## భిల్లుల ప్రతిఘటన

అజంతా ప్రాంతంలో 1857 లో భాగోజీనాయక్ అనేవాని నాయకత్వాన భిల్లులు తిరుగుబాటు చేశారు. ఈ పోరాటాలు 1859 చివరవరకూ సాగుతూనే వచ్చాయి. ఔరంగాబాద్ జిల్లాలోని వైజాపూర్‌కు చెందిన ఒక ప్రసిద్ధ భూస్వామి గోవింద్ కాశిరావ్ దేశపాండే వారితో కలిశాడు.

1858 నవంబరు 17 న తేదీన లనవావెలా అనే గ్రామంవద్ద భిల్లులు బ్రిటిష్ సేనలతో తలపడి ఓడి చెదిరిపోయారు. వారి నాయకుణ్ణి ఇంగ్లిషువారు వురితీశారు.

తరవాత కాశిరావ్ దేశపాండేను అరెస్టుచేసి విచారించారు. విచారణకాలంలోనే ఆయన జైలులో మరణించినట్లు తెలుస్తూంది.

## రోహిల్లాల తిరుగుబాటు

1858 నవంబరులో తాంతియాతోపే నర్మద దాటి దక్షిణానికి రాగానే, ఆ వార్త విని హైద్రాబాద్ ఉత్తర సరిహద్దులలో రోహిల్లాలు తిరుగుబాటు చేశారు.

ఉత్తర హిందూస్థానంలోని సిపాయీ పటాలాలలో తిరుగుబాటు చిహ్నాలు పొడచూపగానే బ్రిటిష్ అధికార్లు సిపాయి పటాలాలను విడగొట్టి వారివారి ఇళ్ళకు పంపేశారు. ముఖ్యంగా రోహిల్లాలను అలా పంపేశారు. వారంతా చెదిరిపోయి దక్షిణానికి వచ్చారు ఈ విధంగా వచ్చినవారు అజంతా, బస్మత్, లాటూర్, మఖ్తల్, నిర్మల్ లలో చేరారు. తాంతియాతోపే దక్షిణానికి వచ్చిన వార్త తెలియగానే, వారంతా తిరుగుబాటుగా చేశారు. నిజాము సేనలు వారిచేతుల్లో ఓడిపోయాయి. తర్వాత బ్రిటిష్ సేనలు వారిని వెంటాడించాయి.

వీరు, తాము నానాసాహేబ్ అనుచరులమని చెప్పుకొన్నారు. నిజాము బ్రిటిషువాళ్ళతో చేరి నానాసాహేబ్‌తో శత్రుత్వం వహించేవనీ, కనక ఆయన దేశాన్ని నాశనం చేస్తామనీ అక్కడక్కడ కాగితాలు వ్రాసి అతికించారు.

ఈ తిరుగుబాట్లు జరిగిన ప్రాంతంలో ప్రముఖులు, దేశపాండేలు రోహిల్లా దళాలకు కావలసిన సహకారాలు, వార్తలు అందిస్తూండేవారు.

జూలానాయిబు పేష్కారు గులామ్ హుస్సేన్, ఆయన సోదరుడు గులాం మొహసన్ మొదలయిన పెద్దపెద్ద ఉద్యోగులు, రాజవంశీకులు వీరికి సహాయం చేశారు.

కాని బ్రిటిష్ సేనలు వారిని వెంటాడించి, చివరకు 1860 ప్రారంభం తిరుగుబాటును అణిచివేశాయి. 1859 నవంబరులో వారినాయకులు షేర్ అలీ అనే అరబ్బునూ, అబ్దుల్ రహీమ్‌ఖాన్ అనే రోహిల్లానూ వురితీశారు. మరొకనికి ఏడేళ్ళ శిక్ష విధించారు.

నిర్మల్ ప్రాంతంలోని రోహిల్లాలు గోండుల్ని కూడా తిరుగుబాటులోకి ఆకర్షించారు. రాంజీ అనే గోండు నాయకుడు వారికి నాయకత్వం వహించాడు.

1860 ఏప్రిల్ 9 న నిర్మల్‌కు కొంతదూరంలో యుద్ధం జరిగింది. కొంతసేపు తుపాకులతో కాల్పులు జరిగాయి. తర్వాత ఉభయపక్షాలూ కత్తులు దూసి తలపడ్డారు. గోండులూ, రోహిల్లాలూ ఓడిపోయారు. రోహిల్లాల నాయకుడు మియాసాహెబ్ ఖుర్ద్ యుద్ధరంగంలో చచ్చిపోయాడు. గోండు నాయకుడు రాంజీ

తప్పించుకు పోయాడు. తర్వాత ఆయనను పట్టుకొని నిర్మల్‌లో ఉరితీశారు.

## కౌలాస్ జమీందారు తిరుగుబాటు

పైన చెప్పిన తిరుగుబాట్లలో రోహిల్లాలకు తోడ్పడ్డారనే కారణంతో పల్లీపటేల్‌ను బ్రిటిష్ వాళ్ళు అరెస్టు చేశారు. ఇది 1859 ఏప్రిల్ ప్రారంభంలో జరిగింది. ఆ పటేల్ ఇల్లు సోదా చేసినప్పుడు విప్లవకారుల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు కొన్ని పట్టుబడ్డాయి.

వాటిని పట్టుకొని ఆరాలు తియ్యగా తేలిన కథ ఇది:

హైద్రాబాద్ సంస్థానానికి చెందిన ఉన్నత వంశీకులలో రాయురాయా ఎస్టేట్‌లో సోనాజీ పండిట్ అనే దఫ్తర్‌దారు వున్నాడు. ఆయన 1857 ఫిబ్రవరిలో బిఠూర్‌లోవున్న నానాసాహెబ్ పీష్వాకు జాబు వ్రాశాడు. దానిని ఒక గ్రామ కరణం రంగారావు పాలికిచ్చి పంపించాడు. రంగారావు కాన్పూరుకు 1857 మధ్యలో వెళ్ళాడు. నానాను కలుసుకొన్నాడు. ఆయననుంచి దక్షిణ భారతంలోని కొందరు ప్రముఖులకు ఉత్తరాలూ, సూచనలూ తీసుకొని వచ్చాడు. వానిలో కొన్ని దోపిడీగాళ్ళ చేతుల్లో పడ్డాయి. ఒకటో రెండో జాబులు మిగిలాయి. వానిని తీసుకొని ఆయన ఔరంగాబాదుకు 1859 లో వచ్చాడు. అప్పటికే ఆయనను పంపిన సోనాజీ పండిట్ చనిపోయాడు.

రంగారావు ఔరంగాబాద్‌నుంచి హైద్రాబాద్ వెడుతూ దారిలో నాందేడ్ జిల్లాలోని కౌలాస్ చేరాడు. అక్కడ రాజు అయిన దీప్‌సింగ్‌ను కలుసుకొన్నాడు. ఆయనతో ఆలోచించి నగరంలోనూ చుట్టుప్రక్కలా ఉన్న కొందరు ప్రముఖులతో సంబంధాలు పెట్టుకొన్నాడు. సుప్రసిద్ధ నింబాల్కరు కుటుంబానికి చెందిన సర్దరుద్దౌలాను కలుసుకొన్నాడు.

అన్ని ఏర్పాట్లూ సరిగ్గా జరగాలంటే ధనం అవసరమయింది. రంగారావు వద్ద ధనమే లేనిది.

ఇంతలో పల్లీపటేల్ వద్ద వుత్తరాలు దొరికాయి. వెంటనే రంగారావును, కౌలాస్ జమీందారు రాజా దిలీప్‌సింగ్‌ను, సర్దరుద్దౌలాను అరెస్టు చేశారు.

తర్వాత విచారణ జరిపి రంగారావుకు మరణశిక్ష వేసి, తిరిగి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షగా మార్చారు. అండమాన్లకు పంపేశారు. రాజా దిలీప్‌సింగ్‌కు మూడేళ్ల శిక్ష విధించారు. జాగీరు లాక్కున్నారు. కాని తర్వాత మరల ఆయన కొడుక్కి ఇచ్చివేశారు. సర్దరుద్దౌలా స్థిరచరాస్తులన్నీ జప్తుచేశారు. యావజ్జీవం బందీగా వుంచారు. మిగిలిన వారికికూడా ఇతర శిక్షలు పడ్డాయి.

రంగారావు 1860 లో అండమాన్లలోనే మరణించాడు.

* * *

ఈవిధంగా హైద్రాబాద్ సంస్థానాధీశుడూ, అతని మంత్రి సాలార్‌జంగూ బ్రిటిష్‌వాళ్ళకు గులామీ, దేశానికి ద్రోహం చేశారు. సంస్థాన ప్రజలు, జాగిర్దార్లు, గ్రామకరణాలు, సిపాయీలు, భిల్లు-గోండు రైతులు ఎల్లరూ బ్రిటిష్‌వాళ్ళ పెత్తనాన్ని స్వీకరించడానికి నిరాకరించారు. 1859 ఏప్రిల్‌లో విప్లవ సేనలన్నీ ఓడిపోయాయి. ప్రధాన నాయకులు చనిపోయారు. ఇంగ్లీషు ప్రభుత్వం సుస్థాపితం అయింది. అయినా హైద్రాబాద్ ప్రజలలో ఆంగ్లేయులమీద ద్వేషం చల్లారలేదు. స్వాతంత్ర్యవాంఛ చావలేదు.

1862 మార్చిలో విప్లవ నాయకులలో ఒకడయిన రావుసాహెబ్ పీష్వా హైద్రాబాద్ వచ్చినాడనే సరికి ఆయన చుట్టూ జనం చేరారు. ఏమాత్రం అవకాశం దొరికినా కత్తులు దూయడానికి ప్రజలు సంసిద్ధత చూపుతూవచ్చారు.



# ప్రథమ భారత స్వాతంత్ర్యసమరంలో గెరిల్లాయుద్ధగాథలు

దామిశెట్టి పార్థసారథి

"స్వధర్మ, స్వరాజ్య" దీక్షతో చెలరేగిన భారత స్వాతంత్ర్య సమరంలో గెరిల్లాతంత్రం ఒక్కటే ప్రయోజనకారి కాగల యుద్ధవిధానం. సుశిక్షితులైన సైనికులతో—సమర్థులైన నాయకులతో — ఆధునిక అస్త్రశస్త్రములతో ముందుకు సాగుతున్న యింగ్లీషు దళాలను భారతసిపాయిలు జయప్రదంగా బాహాబాహీ పోరాటంలో ఎదుర్కొనడం కష్టసాధ్యమైన విషయం. ప్రత్యక్షపోరాటంలో ప్రదర్శితమయ్యే స్వాతంత్ర్య దీక్ష మాత్రమే విజయాన్ని సాధించలేదు. సైనికశిక్షణ, సమర్థనాయకత్వం అతిప్రధానం కావాలి. దురదృష్టవశాత్తు సమర్థులైన నాయకుల లోటువల్ల ఈసమరంలో అనేక అమూల్యవిజయావకాశాలు జారిపోయేయి. అయినా అట్లాంటి లోటును కొంతవరకు తీర్చడానికి సమర్థుడైన నాయకుడుగా జగదీశ్‌పుర రాణా కుమార సింహుడు బుజువు పర్చుకున్నాడు. ఈ మహా నాయకుడు సకాలంలో గెరిల్లా యుద్ధతంత్రం యొక్క అమూల్య ప్రయోజనాన్ని గమనించి, దానిని సక్రమంగా ప్రయోగించి చరిత్రలో గర్వంగా వ్రాసుకోదగ్గ విజయాలను సాధించాడు. కుమారసింహుని తమ్ముడు అమర సింహుడూ, సేనాపతి తాంతియాతోపే ఈ ఆయుధంతోనే ఇంగ్లీషు శత్రువును కట్టుదిట్టంగా ప్రతిఘటిస్తూ వచ్చేరు.

## గెరిల్లా యుద్ధ కీలకం

కుమార్ ఆనాటి చారిత్రక పరిస్థితుల్లో అమోఘమైన ఆయుధంగా ఎదుటపెట్టిన యీ గెరిల్లా యుద్ధకీలకం ఏమిటి? "యుద్ధభూమిని ఎప్పుడూ పిరికితనంతో విడిచిపెట్టవద్దు" అన్న సూత్రం దీనిలో ప్రధానమైనది. శత్రువుయొక్క గుండెజేజారిపోయేలాగున, తన అనుచరులలో ఆత్మవిశ్వాసం కలిగించేలాగున యుద్ధం సాగించే బాధ్యత నాయకునిపై వున్నది. ఒక్కసారి పోరాటంలోనికి దూకితే ధైర్య, సాహసాల ప్రదర్శనం తప్పనిసరి అవుతుంది.

చొరవ — సామర్థ్యం — ప్లాన్ ప్రకారం దాడి చేయడం, ఉపసంహరించడం — సైనికుల్లో ఆత్మవిశ్వాసం తగ్గకుండా చూడడం — తక్కువ నష్టంతో శత్రువుపై యెక్కువ నష్టాలు కలుగచేయడం — శత్రువును విసిగి వేసారించి, నీరసపర్చి, నిరుత్సాహపర్చుట ...వగైరా లక్షణాలు గెరిల్లా పోరాటానికి కీలకాలు. సర్వబల సమన్వితంగా శత్రువు వస్తూవుంటే అడకత్తెరలో పడకుండా తప్పించుకుపోవడం — అతడు విశ్రమించి వుంటే హఠాత్తుగా మీదపడుట — అలసిపోయి వున్నప్పుడు హఠాత్తుగా మీదపడుట — ఒకవైపు దాడిచేస్తున్నట్లు నటించి మరోవైపు దాడిచేయటం యివి గెరిల్లా పోరాటాలకు కొన్ని ఎత్తులు. ప్రజల్లో కలసిమెలసిపోయి, వారిలో ఒకరుగా లీనమైపోయి వున్న వీరులు, తమ ఆదర్శజీవిత విధానాలవల్ల ప్రజలను ఆకర్షించగల యోధులు సాగించే గెరిల్లా పోరాటం మంచి విజయాలను యిస్తుంది.

కుమార సింహునికి యీ యుద్ధ తంత్రకీలకములన్నీ కరతలామలకములుగా వున్నాయి.

## కుమారసింహుని పోరాటాలు

అదను కనిపెట్టి శత్రువుయొక్క కుంభస్థలాన్ని బ్రద్దలు కొట్టాలన్న దీక్షతో కుమారసింహుడు తన తమ్ముడు అమరసింహునితోను, సహచరులైన ఈశ్వర సింగు, జవాన్ సింగులతోను, రాణివాసంలో సహా

పశ్చిమ బీహార్ అడవుల్లోనికి శోణనదిద్వారా ప్రయాణం చేయ్యారు. ఇంగ్లీషు సైన్యాలు బలహీనంగావున్న తూర్పు అయోధ్యలోకిపోయి అక్కడ చిందరవందరగా వున్న విప్లవకారులను కూడగట్టేడు. లక్నోను స్వాధీనంచేసుకొను నిమిత్తం గూర్ఖాసైన్యాలు, యింగ్లీషు సైన్యాలు కలసి అజంగఢ్ నుంచి అయోధ్య పంపబడుతున్న విషయం గమనించి, కుమార్ అజంగఢ్‌ను పట్టుకొనదలచేడు. శత్రువు చేతిలోవున్న బనారస్ అల్హాబాదులపై విజయంసాధించి శత్రువు రహదారులను అడ్డుకోవాలనీ, యింగ్లీషు సేనలను బలహీనస్థితిలోనికి నెట్టాలనీ కుమార్ ప్లాను.

ప్రతీకార దీక్షతో తగిన అవకాశం కోసం చూస్తున్న కుమార్ వద్దకు 1858 మార్చి 18 న రేవా విప్లవకారులు వచ్చి చేరేరు. ఆయన బలం పెరిగింది. మొత్తం విప్లవ సైన్యం 1200 మంది, 500 వాలంటీర్లు కలిసి అజంగఢ్ విముక్తికై దానికి 25 మైళ్ళలో ఉన్న అత్రౌలియా తోటల్లో మకాం చేశారు.

ఇంగ్లీషు సేనా నాయకుడు మిల్మాన్‌కు కుమార్ జాడ తెలిసి, 3 0 మంది సుశిక్షిత కాల్బలం, రెండు మంచి ఫిరంగులు, గుర్రములతో వచ్చేడు. విజయాశతో వున్న మిల్మాన్ సైన్యం, కుమార్ సైన్యాల అగ్రదళాన్ని 22 వ తేదీ సూర్యోదయ సమయంలో ఎదుర్కొంది. యుద్ధం జరిగి కుమార్ సైన్యాలు తీవ్రపరాజయం పొందినట్లు పారిపోయేయి. విజయోత్సవం జరుపుకుంటూ భోజనాలను స్వీకరించబోతున్న మిల్మాన్ సైన్యంపై కుమార్ సింహుడు మెరుపు తీగలా విరు

# దేశభక్తులుగా మారిన బందిపోట్లు

1857 లో జరిగిన భారత స్వాతంత్ర్య సమరం బందిపోట్లను సైతం దేశభక్తులుగా మార్చిన ఒక ఉదంతం యీ మధ్యనే వెలుగులోకి వచ్చింది.

ఉత్తరప్రదేశ్ స్వాతంత్ర్యోద్యమ చరిత్రను రచించడానికి నియమింపబడ్డ ఉపసంఘ కార్యదర్శి డాక్టర్ నందాలాల్ చటర్జీ యీ విషయాన్ని ఒక వ్యాసంలో పేర్కొన్నారు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఫతేపూర్ జిల్లా డబ్ల్యు. జి. ప్రోబిన్ అను ఆంగ్లేయుడు 1857 లో కలెక్టరుగా పనిచేశాడు. అక్టోబరు 24 న అతడు వ్రాసిన ఒక జాబులో బందిపోటుదొంగలు పెద్దయెత్తున ప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో పాల్గొంటున్నారనీ, తత్ఫలితంగా పశ్చిమ ప్రాంతంలో శాంతిభద్రతలు నశించి అరాజకం తాండవిస్తోందనీ వ్రాశాడు. వారిని అణచడానికి పోలీసులు చాలడంలేదనికూడా తెలియజేశాడు.

1857 అక్టోబరు చివర ప్రోబిన్ మరొక నివేదికలో జిల్లా అంతటికీ బందిపోట్ల "బెడద" వ్యాపించిందని తెలియజేశాడు. "కొన్ని సైనికపటాలాల సహాయం లేనిదే జిల్లాలో శాంతిభద్రతలను నెలకొల్పడం అసాధ్యం; యీ తొత్తుకొడుకుల్ని అణచడానికి పోలీసు ఎంతమాత్రం సరిపోరు" అని అందులో పేర్కొన్నాడు.

ఇలాంటి బందిపోట్లవద్ద మామూలు తుపాకులే గాక, ఫిరంగులుకూడా ఉండేవట. నాటి సహాయంతో, బ్రిటిష్‌భక్తులుగా వ్యవహరించే తహసిల్దార్ల, థాణేదార్ల యిండ్లమీద దాడులుచేసి, వాటిని నేలమట్టం చేసేవారట.

చివరకు నలువైపులనుంచి వచ్చిన బ్రిటిష్ సైనిక పటాలాలు బందిపోట్లను చక్రబంధంలో బిగించి వారి స్థావరాలపై దాడులు సాగించడంద్వారా యీ ప్రతిఘటనను అణచగలిగారు.

ఇలాంటి బందిపోట్లలో జోధాసింగ్, మహారాజ్ సింగ్ అను వారి పేర్లను ప్రోబిన్ తన రిపోర్టులలో పేర్కొన్నాడు. జోధాసింగ్ 1858 ఏప్రిల్ 8 వ తేదీని బ్రిటిష్ సైనికులచే పట్టుబడ్డాడు.

ఈ ఉదంతాన్ని గురించి డాక్టర్ చటర్జీ 'జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ' అను పత్రికలో యిలా వ్రాశారు:

"బందిపోటు దొంగలు సైతం ఆనాడు దేశభక్తి భావాలకు ఉత్తేజితులై బ్రిటిష్ ప్రభుత్వం మీద తిరుగుబాటు చేశారనడానికి తగినన్ని ఆధారాలున్నాయి. వారిని 'తొత్తుకొడుకు'లని జిల్లాకలెక్టరు పిలిచినప్పటికీ, బ్రిటిష్‌వారిని దేశంనుంచి తరిమివేయడానికి వారుకూడా ప్రయత్నించి విఫలులయ్యారు. ఏది ఏమైనా, బందిపోట్లుకూడ అకస్మాత్తుగా దేశభక్తులవడం చూస్తే, కొన్నిప్రాంతాల్లో ఈ తిరుగుబాటు ఎంత విస్తృతమైన ప్రజాపోరాటంగా రూపొందిందో తెలుసుకోవచ్చు."

చుకుపడ్డాడు. అన్నివైపులా వస్తున్న అగ్నివర్షం మధ్య యింగ్లీషు సైన్యం చిక్కుకున్నది. ఇంగ్లీషు సైన్యాలు అట్రోలియానుంచి కోశిల్లా వరకు అక్కడ నుంచి అజంగఢ్ వైపుకు నిర్దాక్షిణ్యంగా తరుమబడ్డాయి.

ఆశలుడుగంటిపోయివున్న మిల్మాన్‌కు బనారస్, గాజీపూర్‌ల నుండి 350 మంది కొత్త సైన్యం సహాయం రాగానే ఆశలు చిగిరించేయి. మొత్తం సైన్యాలు కర్నల్ డేమ్స్ నాయకత్వాన ప్రతీకార దీక్షతో అజంగఢ్ నుంచి 26వ తేదీన దండయాత్ర సాగించేయి. కొత్త సైన్యాలు, కొత్త నాయకుడు, కొత్త ఉత్సాహంతో వచ్చినా, కుమార్ అతి చాకచక్యంగా పాత విధానాన్నే మరింతబాగా సాగించేడు. "ఓడిపోయినట్లు" కనిపించి హఠాత్తుగా పైబడి చిందరవందర చేయడం ఆయన విధానం. డేమ్స్ కోటలోనికి పారిపోయేడు. కుమార్ అజంగఢ్ నుంచి ఉత్సాహంతో బనారస్ వైపు సాగుతున్నాడు.

## గవర్నర్ జనరల్ దిగులు

మిల్మాన్, కర్నల్ డేమ్స్ వంటి నాయకులను కుమార్‌సింగు ఓడించి బనారస్ వైపుగా సాగుతూ వుండడం అల్హాబాద్‌లో వున్న గవర్నర్ జనరల్ కానింగు ప్రభువుకు చాలా దిగులు కలిగించింది. అజంగఢ్‌లో సైన్యాన్ని బంధించి, 8 మైళ్ళ మహావేగంతో సాగిన కుమార్ సాహసాన్ని, బెనారస్‌పై దాడిచేసి అల్హాబాద్‌ను కలకత్తానుంచి వేరుచేయగలచిన కుమార్ యొక్క వ్యూహరచనా సామర్థ్యాన్ని అర్థంచేసుకొని తమకు రాగల ప్రమాదాన్ని గుర్తించేడు. తిరుగుబాటు ప్రారంభంలోనే ఇంగ్లీషువారు శిక్కుల సహాయంతో అల్హాబాద్, బెనారస్‌లను పట్టుకొని కలకత్తాచుట్టూ గల ప్రాంతంలోని తిరుగుబాట్లను పుట్టుకలోనే నాశనం చేయగలిగరు. అల్లాంటి అత్యంత కీలక ప్రాంతంపై కుమార్ ప్రమాదకరంగా విరుచుకుపడుతున్నాడు.

ఇంతలోనైన కుమార్ ప్లాన్ ఆటంకం లేకుండా సాగిపోతే ఇంగ్లీషు ప్రభుత్వం యిరుకున పడగలదని కానింగు ప్రభువు గమనించి లార్డుమార్కు కెర్ అనే సమర్థ యింగ్లీషు నాయకుని పంపించేరు. ఈ లార్డు మార్కు కెర్ క్రిమియా యుద్ధంలో ప్రశంసలు పొందిన సమర్థుడు. 500 మంది నైపుణ్యం గల సైనికులతో ఫిరంగులతో మార్కు కెర్ అజంగఢ్‌కు 8 మైళ్ళ లోపలికి వచ్చేసేడు.

## మార్కు కెర్‌తో తీవ్రపోరాటం

ఏప్రిల్ ఆరోతేదీ సూర్యోదయ సమయానికి సర్వసన్నాహాలతో కుమార్ సైన్యపు ఎడమ భాగంపై మార్కు కెర్ పడ్డాడు. కుమార్ తన తెల్ల గుర్రంపై మహా సాహసంతో యుద్ధభూమి అంతటా ప్రజ్వలించేడు. గుళ్ళవర్షం కురుస్తున్నా తన సైన్యాన్ని మార్కు కెర్ సైన్యం వెనుకకు తీసుకువచ్చేడు. ఇంగ్లీషు వారి ఫిరంగులు నిష్ప్రయోజనం అయిపోయేయి. కుమార్ సైనికులు ధైర్యంగా ముందుకు సాగేరు. కుమార్ శత్రువు వెనుక భాగంపై గట్టిగా దెబ్బతీయడంతో, అక్కడున్న యేనుగులు పిచ్చెక్కిపోయి, వళం తిప్పి తమ మనుష్యులనే చిందర వందర చేసేయి. కెర్ యొక్క ప్లాను అంతా తల్లక్రిందులై కుమార్ యొక్క వ్యూహరచనా ప్రాశస్త్యం మరోసారి వెల్లడి అయ్యింది.

కెర్ యుద్ధభూమిని విడిచిపెట్టాలని అవస్థపడ్డాడు. కష్టంమీద (ఫిరంగుల సహాయం బాగా వున్నా) తప్పగలిగేడు. అజంగఢ్ చుట్టూగల ప్రాంతం విప్లవకారుల చేతుల్లో ఉండడంతో కెర్ సైన్యాలు యిబ్బందుల్లోనే వున్నాయి.

## తానూ వంతెనపై సాహస యాత్ర

అజంగఢ్‌లో ప్రమాదంలో చిక్కుకున్న యింగ్లీషు సైన్యాల రక్షణకై బ్రిటిషు జనరల్ లుగార్డు తానూ వంతెన మీదుగా వస్తున్నాడు. కుమార్ సైన్యంకూడ ఆ వంతెన దాటి తన ప్లానును అమలు పర్చదలచింది. అందుకై తీవ్రమైన పోటీ పందెం ప్రారంభమైంది.

కుమార్ తన పోరాట విధానాన్ని యీ సరికే నిర్ణయించేడు. ఎల్లాంటి ప్రమాదం వచ్చినా వెనుదిరుగని మహాయోధులతో కూడిన ఒక ప్రత్యేక దళాన్ని ఏరేడు. ఈ ప్రత్యేక దళం శత్రువుతో కలబడి కుమార్ యితర సైన్యాలు గమ్యస్థానం చేరిన సూచన వచ్చేవరకూ పోరాడుతూ వుంటుంది. సూచన రాగానే జాగ్రత్తగా తగ్గుతూ సంకేతస్థలానికి చేరుతూ వుంటుంది. కుమార్ మిగతా సైన్యం రెండుభాగాలుగా వేర్వేరు మార్గాల్లో ప్రయాణం చేస్తూ, కలుస్తూ విడిపోతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు శత్రువును కంగారు పెట్టేందుకు ఈ సైన్యం యింకా విభాగాలవుతుంది.

కుమార్‌సింగ్ అమలుపరచదలచిన ప్లాను యిది: "అజంగఢ్‌ను కాపాడుతున్నట్లుగా శత్రువుప్పెనిఅటు

ఆక్రమించడం, శత్రువు అటువస్తూ వుంటే జగదీశ్‌పూర్ వైపు యాత్ర సాగించటం - ఆజంగఢ్ నుంచి ఘాజీపూర్ సాగి, గంగానది దాటి జగదీశపూర్‌ను జయించుకోవడం. ఇదంతా వెనుక వైపు లుగార్డుసైన్యాలు, ఎదుటవైపు అర్రా ప్రాంత సైన్యాలు ప్రమాదకరంగా తరుముతూ అడకత్తెరలో వేయజూస్తుండగానే జరగాలి."

ప్రధానంగా యీ ప్లాను నిర్వహణ నిమిత్తమే కుమార్ ప్రత్యేకసాహసిక యోధుల దళాన్ని నిర్మించేడు. ఆ దళం వెనుకరక్షణంగా శత్రుసైన్యాలదాడిని తిప్పికొట్టుతూ ఆశ్చర్యకరంగా యుద్ధం సాగించింది. కుమార్ సైన్యం జనరల్ లుగార్డు కళ్లు కప్పి దాటిపోయింది. లుగార్డు పరాభవం పొంది, ఆయుధ సామగ్రితో నుంచి అశ్వసైన్యాన్ని పంపించేడు. 12 మైళ్ళ యీ సుశిక్షితదళం స్వారీచేసినమీదట గాని కుమార్ సైన్యం మంచి బందోబస్తు స్థావరంలో, మంచి వ్యూహంలో వుందని తేలింది. జనరల్ డగ్లస్ దొంగ మార్గాలద్వారా 5,6 ఫిరంగులతో సహాయం వచ్చేడు. ప్రత్యేకదళం శత్రువును నిలబెట్టగా కుమార్ తన సైన్యాన్ని రెండుమార్గాలుగా వనక సాగించేడు. అసీ గ్రామంవద్ద ఏప్రిల్ 17 న యింగ్లీషుసైన్యం అలసి, విశ్రమించివున్న తరుణంలో కుమార్ సైన్యం 18 మైళ్ళు సాగిపోయింది. గోగ్రానదిని దాటి గాజీపూర్ రాష్ట్రంలోని మనోహరగ్రామంలో, తప్పనిసరియై (ప్రమాదం వున్నప్పటికీ) కుమార్ విశ్రాంతికి ఆజ్ఞ యిచ్చేడు.

మనోహరగ్రామం వద్ద అలసి విశ్రాంతిలోవున్న కుమార్ సైన్యంపై హఠాత్తుగా డగ్లస్ సైన్యాలు దాడిచేసి చిందరవందర చేసేయి. కుమార్ సైన్యాలు ఓడిపోయి సామగ్రిని, ఏనుగులను అన్నిటినీ పోగొట్టుకున్నాయి. కాని కుమార్ ధైర్యం చెక్కుచెదరలేదు.

## జగదీశ్‌పూర్ పునరాక్రమణ

మనోహర యుద్ధంలో అన్నీపోయినా కుమార్ ధైర్యం పోలేదు. కొత్తయెత్తులను అవలంబించేడు. సైన్యాలను చిన్నచిన్న దళాలుగాచేసి అన్ని దిశలుగా యాత్ర సాగించేడు. ఈ రకంగా శత్రువు యొక్క దాడిని అరికట్టి అయోమయంలో పెట్టేడు. ముందే నిర్ణయించుకున్న స్థలానికి కుమార్ సైన్యాలు వచ్చేయి. గంగానది గట్టుల్లోవున్న కుమార్ సైన్యం వెనుకకు అప్పుడే యింగ్లీషు సైన్యాలూ చేరేయి. సైన్యాలు తగ్గిపోయివున్నందున యిక యుద్ధం లాభంలేదని కుమార్ కొత్త యెత్తు యెత్తేడు. పడవలు తగినన్ని లేనందున బల్లియావద్ద ఏనుగు వీపులపై నదిని దాటుతున్నట్లు పుకారు వ్యాపింపజేసేడు. దాన్ని నమ్మి యింగ్లీషు సైన్యాలు బల్లియా వద్దకు పోయేయి. కుమార్ శత్రువుని భ్రమలోపెట్టి పడవలపై నదిని దాటేసేడు. అంతా దాటేసేరు. ఈలోగా తాము దగాపడినట్లు తెలిసికొన్న యింగ్లీషు సైన్యాలు వేగంగావచ్చి చివరి పడవపై కాల్పులు సాగించేరు. దానిలోనే కుమారసింగ్ ఉన్నాడు. ఆ కాల్పులవల్ల అతని కుడిచెయ్యి ప్రమాదకరంగా గాయపడి, నిష్ప్రయోజనం అయ్యింది. రెండో చేతితో ఆ చేతిని ఖండించుకొని భక్తిపూర్వకంగా గంగామాతకు ఉపహారంగా సమర్పించేడు.

ఈ రకంగా 22 వ తేదీ నాటికి జగదీశపూర్ అడవులను చేరి కుమార్ తన ముఖ్యపట్టణ పునరాక్రమణకు వేచి వున్నాడు. అమరసింహుడు కొంతసైన్యంతో రాగా, 8 నెలల నాడు వదిలిపెట్టిన కోటను పునః స్వాధీనం చేసుకొని ఏప్రిల్ 23 న అభిషిక్తుడైనాడు.

## జనరల్ లీగ్రాండు పరాభవం

అర్రాలో వున్న బ్రిటిషు జనరల్ లీగ్రాండు కుమార్ విజయాలవల్ల కోపంతో మండిపోయేడు. జగదీశ్‌పూర్ కోట పునరాక్రమణ, రాజా సింహాసనంపై స్వతంత్రంగా అధిష్టించడం అన్నీ లీగ్రాండుకు అయిష్టకారణం అయ్యేయి. సైన్యాలను పోగొట్టుకొని, ఆయుధాలు లేక, పైగా ప్రమాదకరంగా గాయపడివున్న కుమార్‌ను తేలికగా జయించగలననే ధైర్యంతో 400 సైనికులతోను, రెండు ఫిరంగులతోను 23 వ తేదీనే దండయాత్ర చేసేడు. ఇంగ్లీషు సైన్యాలు హతాశులై పారిపోవడం తప్పలేదు. సైన్యం అంతా దిక్కులేని చావు చచ్చింది. వధ్యశాలకు పోతున్న పశువులవలె వారంతా మృత్యుమందిరంలోనికి వచ్చేరు. చివరకు జనరల్ లీగ్రాండు కూడా కాల్చివేయబడ్డాడు. శత్రువును తరిమివేసి కుమార్‌సింగ్ నగరానికి తిరిగి వచ్చేడు. 26 వ తేదీన ఆయన మరణించేడు.

## కుమార్‌సింహుని ప్రత్యేక లక్షణాలు

మొత్తంమీద స్వాతంత్ర్య పోరాటంలో నూతన మార్గాన్ని చూపి ఇంగ్లీషు శత్రువుపై విజయం సాధించగల యుద్ధతంత్రాన్ని ప్రదర్శించేడు కుమార్. "మనోనిబ్బరం - దూరదృష్టి గలవాడు. అంతిమ విజయం కోసం ప్లాన్‌వేసి ఆచరణలో పెట్టగల సమర్థుడు. తన సైనికుల యొక్క శక్తి సామర్థ్యాలను,

బలహీనతలను గమనించగల నేర్పరి. శత్రువుయొక్క సామర్థ్యాన్ని, లోటుపాట్లను గమనించగల సమర్థుడు. తన వ్యక్తిగత జీవిత ఆచరణ ద్వారా అనుచరులను ఆకర్షించి కార్యోత్సాహ వంతులను చేయగల ప్రత్యేకత గలవాడు. సమయం యొక్క విలువను గమనించి ఏ క్షణంలో ఏ పని చేస్తే, ప్రయోజనం సాధించగలమో దానిని అమలుచేసే సాహసం ఆయన లోవుంది. దారితప్పి శత్రువులతో కలిసిన స్వదేశీయుల పట్ల ఆయనకు ద్వేషంలేదు. సిక్కులను, బెంగాలీలన హతమార్చకుండా విడిచిపెట్టాలనేది యితని ఆజ్ఞ.

కుమార్ సింహుడు ఆదర్శ అమరమూర్తిగా భారత స్వాతంత్ర్య పోరాటంలో పూజనీయుడయ్యేడు.

# అమరసింహుని పోరాటాలు

కుమార్ సింహుని మరణం తరువాత జగదీశపూర్ కోటను తేలికగా స్వాధీనపర్చుకోగలమని తలచి గతంలో పరాభవం పొందివున్న బ్రిగేడియర్ డగ్లస్, జనరల్ లుగార్డులు మే 3 వ తేదీనుంచి దండయాత్రలు ప్రారంభించేరు. విప్లవకారుల నివాసాలుగావున్న జీహియా, హాతాంపూర్, దలీల్పూర్ వగైరా ప్రదేశాలపై దండయాత్ర సాగించేరు.

అమరసింహుడు సరిగ్గా కుమార్ సింహుని నమూనాలోనే గెరిల్లా పోరాటాలు ప్రారంభించేడు. అదృశ్య రూపంలో వున్నట్లున్న శత్రువుతో పోరాటం చేయవలసి వచ్చింది. ఇంగ్లీషువాళ్ళకి సాధించినట్లు కనపడుతున్న విజయం అంతలో దూర మయ్యేది. విజయంకోసం ఎండమావుల వెంటపడినట్లుగా వుండి, చివరకు జనరల్ లుగార్డు జూన్ 15 న రాజీనామా యిచ్చి యింగ్లండు పోయేడు. అతని సైన్యాలు రంగంనుంచి తొలగిపోయినవి. అంతకంతకు ప్రజల సానుభూతిని సంపాదించుకుంటూ ప్రజల ప్రేమాభిమానాలకు పాత్రుడైన అమరసింహుని పట్టుటకు యింగ్లీషు ప్రభువులు లంచాలు ప్రకటించేరు. కొన్నాళ్ళు దూరంగావున్నారు.

చిట్ట చివరకు యెలాగైనా అమరుని బంధించాలని యింగ్లీషువారు అక్టోబరు 17 న గొప్ప వ్యూహం పన్నేరు. ఏడు వైపులనుంచి ఏడు సైన్యాలు ఒక్కసారిగా దిగ్బంధనంచేసి అమరుని బంధించాలని ప్లాను. అయితే ఆ సైన్యాలు సకాలంలో వచ్చినా ఏడవది ఒక్క అరగంట ఆలస్యంచేయడంతో, ఆ సావకాశంలో అమరుడు తప్పించుకుపోయేడు.

1858 అక్టోబరు 19 న నోనదీ గ్రామంలో మిగిలివున్న 400 మంది విప్లవకారులు ఇంగ్లీషు సేనలతో చాలా సాహసంగా పోరాడేరు. ఎలాగో అమరసింహుడు, మరి యిద్దరు తప్పించుకు పోయేరు. మిగతా సేన యుద్ధరంగంలో ఒరిగింది.

మరికొందరు విప్లవకారులను చేర్చుకొని అమరసింగ్ కైమూరు పర్వతాలపై చేరిపోయేడు. ప్రతిచెట్టు, గుట్ట, పుట్ట, లోయ యింగ్లీషు సేనలతో తీవ్రంగా పోరాడినవి. ఎంత చేసినా, ఎన్ని ప్రయత్నాలు సాగించినా అమరుడు దొరికలేదు. చరిత్రలో అమరుడుగానే వుండిపోయేడు.

# తాంతియాతోపే సాహస గాథలు

1858 జూన్ 20 వ తేదీన గ్వాలియరు యుద్ధంలో ఝాన్సీ లక్ష్మీబాయి మరణించింది. స్వాతంత్ర్య పోరాటం తిరోగమన దశలో పడింది. దాదాపు పోరాటం అంతరించిపోయినట్లే కనిపించింది. కాని తాంతియాతోపే యుద్ధరంగంనుంచి చాకచక్యంగా తప్పించుకు పారిపోవడంతో, పోరాటజ్వాలను వెలిగించగల ఒక సమర్థుడు తప్పించుకోగలిగేడు.

విజయోత్సాహంతో సర్వసామగ్రితో తులతూగుతున్న ఇంగ్లీషు సైనికులు, వారి సమర్థులైన నాయకులు మిచ్చేల్, కర్నల్ లిడ్డేల్, కర్నల్ మీడే, పార్కు వగైరా యోధులు పన్నుతున్న చక్రవ్యూహం మధ్య ఆయుధాలూ, ఆహారసామగ్రి, సైన్యము లేక తాంతియాతోపే తప్పనిసరిగా లొంగిపోతాడని ప్రపంచం ఎదురుచూచింది. కాని అత్యంత ప్రమాదకర పరిస్థితులలో సైతం మనో నిబ్బరాన్ని కోల్పోని మహావీరుడు తాంతియా, ఇంగ్లీషు నాయకులకు స్వాతంత్ర్య ఖడ్గం యొక్క రుచిని చూపించేడు. అతడు తన చాకచక్యం ద్వారా సైనికులను - సామగ్రిని

సాధించేవాడు. పోరాడేవాడు. పోగొట్టుకునేవాడు. మళ్ళీ ఇదే చక్రక్రమం. సర్వశూన్య పరిస్థితుల్లో, మహా ప్రమాదకర దుస్థితిలో 1859 ఏప్రిల్ 7 న బంధించబడేవరకూ అతడు సాగించిన సాహసపోరాటాలకు ప్రపంచమంతా ఆశ్చర్యంతో విస్తుపోయింది.

## మూడు పోరాట సూత్రాలు

జూన్ 20 న గ్వాలియరు పోరాటంనుంచి తప్పించుకుపోయినట్లే, 22 న జోరా ఆలిపూర్ నుంచికూడ తప్పించుకుపోయిన తాంతియా, రావుసాహెబ్ లు తమ మిగతా సైన్యాన్ని సారమధుర గ్రామం తీసుకుపోయేరు. బాహాబాహీ పోరాటం తెలివి తక్కువ బలిదానాలకు తప్ప ప్రయోజనకారి కాజాలదని గుర్తించిన తాంతియా, నూతనయుద్ధతంత్రాన్ని చేపట్టేడు. జగదీశ్ పూర్ రాజాకుమారసింహుడు చేపట్టిన సూత్రం యిదే. అదే గెరిల్లా యుద్ధతంత్రం. అతడు తన కార్యకలాపాలను మూడుపోరాట సూత్రాలపై కేంద్రీకరించి నడిపింప నిశ్చయించేడు.

ఆ సూత్రాలు యివి: 1. ఏమైనప్పటికీ యుద్ధరంగములో ఇంగ్లీషుసైన్యంచే చుట్టబెట్ట బడరాదు. 2. రక్షణ లేనిచోట్ల గెరిల్లా దాడులు సాగించాలి.

ఈ రెండు సూత్రాలు బాగానేవున్నాయి. ఐతే ఆచరణలోకి రావాలంటే ఆయుధ - ఆహార సామగ్రి విధిగా కావలసిందేగదా. అందుకై ఏమి చెయ్యాలి? ఇంగ్లీషు ప్రభుత్వం ధర్మమా అంటూ అన్నివిధాలా దోపిడికి గురియై కరువు కాటకాల మధ్య దిన దిన మరణంగా శల్యావశిష్టులై పోయి వున్న పేదప్రజలపై భారం వేయడం పోరాట విజయానికి తోడ్పడదు. అందుచేత తీవ్రంగా ఆలోచించి మూడవ సూత్రాన్ని నిర్ణయించేడు.

ఎక్కడైనా భారత సంస్థానం కనిపిస్తే, ఆయుధ - ఆహార - ధనరూపాల్లో విరాళాలను వసూలుచేయుట.

ఉత్తర - మధ్య భారతదేశంలో చాలా సంస్థానాలున్నాయి. వీరు స్వార్థ ప్రేరితులై విప్లవపోరాటంలో చేరలేదు. ఆయుధాలు - ఆహారం కూడబెట్టుకొని హాయిగా వున్నారు. వీరికి సైన్యాలు వున్నా చిన్న చిన్నవి. స్వాతంత్ర్య దీక్షాపరులు మాడి చావడం, స్వార్థపరులు హాయిగా వుండడం, రెంటినీపోల్చి తాంతియా పై మూడవ కీలకసూత్రాన్ని చాల న్యాయమైనదిగా భావించేడు. వారు మనస్ఫూర్తిగా యివ్వకపోతే చావకొట్టి వసూలు చేయాలని నిశ్చయించేడు. అంటే పోరాట భారాన్ని వహించవలసినవారు ఆహార ధన వస్తుసంపదలను కూడబెట్టి, కులుకుతున్న సంస్థానాధిపతులు మాత్రమే.

అప్పటికప్పుడే భారతీయ హస్తాల సహకారంతో అజేయమై వున్న బ్రిటిషు ఖడ్గాన్ని వంచి వేయాలంటే యిదే అమూల్య విధానం అన్న నిశ్చయంతో తాంతియా రంగంలోకి దుమికేడు.

## నర్మదా నదిపై సాహసయాత్రలు

తాంతియా యొక్క అసలు ఆశయం ఏమంటే: "అన్నివైపులా పొంచివున్న యింగ్లీషు సేనానాయకులతో నూతన విధానంలో యుద్ధం కొనసాగిస్తూనే, మంచి అదునైన సమయం కనిపెట్టి నర్మదానదిని దాటి తన జన్మభూమియైన మహారాష్ట్రి అడవులలో స్థానబలం, నూతనశక్తి సంపాదించుకొని నిర్భయంగా నిశ్చింతగా విహరించడం." ఇంగ్లీషువారి నిశ్చయం దీనికి సరిగ్గా వ్యతిరేకం. తాంతియాను నర్మదానది దరిదాపులకే రాకుండా ఆటంకపర్చాలనేది వారిప్లాను. రెండు పక్షాలు దృఢనిశ్చయంతోనే వున్నాయి. ప్రపంచమంతా ఫలితాల నిమిత్తం వేయికళ్ళతో చూస్తూంది.

తాంతియా మామూలుగా సంస్థానాలపై దండయాత్రలు చేయడం అయితే సులువే. తాంతియాపట్ల, నానాపట్ల, స్వాతంత్ర్యపోరాటంపట్ల భక్తివిశ్వాసాలు కలిగి సమయం రాగానే తాంతియాతో కలిసిపోజూచే సైనికులు, దర్బారు ఉద్యోగులు ప్రతి సంస్థానంలోనూ ఉన్నారు. తాంతియాయొక్క విజయంకోసం వెయ్యి మొక్కులు, లక్ష ప్రార్థనలు చేస్తున్నారు. ద్రోహబుద్ధితో యింగ్లీషు ప్రభువుల అనుచరులుగా వున్న తమ స్వదేశప్రభువులను బహిరంగంగా ధిక్కరించగల సాహస ప్రదర్శనల వాతావరణం లేదు. తెగించగల సాహసం వారిలో లేకపోయినా, తమ సానుభూతికి అభిమానానికి కార్యరూపం యివ్వగల అదునుకై కనిపెట్టుకొని వున్నారు. తాంతియాకు వారు తమ ఆంతరంగిక అభిప్రాయాలను విశదపరుస్తూ, పోరాట దీక్షకు ప్రోత్సాహం యిస్తూ సందేశం పంపించేవారు.

అసాధారణ పరిస్థితుల్లో వున్న తాంతియా, యింగ్లీషువారి పద్మవ్యూహాలను వేయికళ్ళతో కనిపెడుతూ, తప్పించుకుంటూ, ప్రతిక్షణం మృత్యురాక్షసితో యుద్ధంచేస్తూనే - తన కార్యకలాపాలను కొనసాగించాలి. అదృశ్యరూపంలో వున్న మృత్యురాక్షసితో ఒక వంక, దృశ్యరూపంలో మృత్యు రాక్షసులుగా అన్నివైపులా పొంచివున్న యింగ్లీషు

నాయకులతో మరొకవంక పోరాడుతూ సంస్థానాల పైకిపోవాలి. ఊహించ వీలులేని సాహసకార్యక్రమం యిది.

తాంతియా మొదట భరత్పూర్ పైకి పోబోయేడు. ఇంగ్లీషు సైన్యం అడ్డురాగా జైపూర్‌కు మార్గం మార్చేడు. తాంతియాకు అనుకూలమైన సైన్యం ప్రజలు గల ప్రాంతం యిది. అక్కడకు పోగలిగితే మరింత బలపడగల సావకాశంవుంది. కాని యింగ్లీషు సేనలు జైపూర్‌రాగానే ఆ ప్లాను విఫలమైపోయి సిద్ధాన్నం పాడైపోయింది. అనేక ఆశాభంగాలకు అలవాటుపడ్డ తాంతియా, దీనిని లెక్కచేయలేదు. ఈమారు దక్షిణదిశగా బయలుదేరాడు. మరోవైపు నుంచి కర్నల్ హోమ్సు నాయకత్వాన సైన్యం తరుము కొచ్చింది. వాళ్ళ కళ్ళలో కారంకొట్టి తాంతియా టోంకు సంస్థానంపై దాడిచేసేడు. నవాబు కొందరు సైనికులను నాలుగు ఫిరంగులతో యుద్ధానికి పంపగా ఆ సైన్యం తుపాకులతోసహా తాంతియాతో కలిసి పోయేరు.

కొత్తగా ఆహారపదార్థాలను, సైన్యాన్ని, ఫిరంగులనుసంపాదించి, కొత్తబలంతో పుష్టిపొందిన తాంతియా దక్షిణంగా యింద్రగఢ వరకూ వచ్చేడు. దారుణమైన వర్షాలు కురుస్తున్నాయి. ఎదుట చంబల్ నది. హోమ్సు, రాబర్ట్సు సేనాధిపతులు కత్తెరవ్యూహంతో రెండు వైపుల నుంచీ వస్తున్నారు. తాంతియా ప్రమాదం నుంచి తప్పించుకునేందుకై విప్లవానికి అనుకూలంగా వున్న నీముచ్-నసీరాబాద్ రాష్ట్రముకు తిరిగేడు. ఈశాన్య దిశగా మారి బుంది మీదుగా ప్రయాణంచేసి భిల్వాడావద్ద విశ్రాంతికై మకాంచేసేడు. ఆశించిన పంట తాంతియా చేతిలో పడనున్నది. కాని హఠాత్తుగా ఆగస్టు 7 న సర్వాగ్రాంనుంచి ఆయనపై రాబర్ట్సు సైన్యాలు దాడిచేసేయి. పగలంతా యుద్ధంచేసి, రాత్రి కాగానే తాంతియా ఉదయపురరాజ్యంలోని కోత్రాకు తనసైన్యంతోను, ఫిరంగులతోను సురక్షితంగా దాటిపోగలిగేడు. నాథద్వార దేవాలయంలో ప్రార్థనానంతరం అర్థరాత్రివేళ చూడగా, అప్పుడే ఇంగ్లీషుసైన్యాలు దరిదాపులో కనిపించేయి. అలసిపోయి వున్న సైన్యం కదల నిరాకరించిన ఫలితంగా, యుద్ధం తప్పిందికాదు. దానిలో పరాజయం కలిగింది. సామగ్రి శత్రువశం అయ్యింది.

ఖాళీచేతులతోవున్న తాంతియా సైనికులు అన్ని వైపులా యింగ్లీషు సైన్యాలు ముట్టివున్నా విడి విడిగా చంబల్‌నదినిదాటి అందరికీ ఆశ్చర్యం కలిగించేరు. ఒక్క ఫిరంగి లేకుండానే వట్టి సైనికులతో తాంతియా ఝాల్రపట్టణంపై దాడిచేసేడు. దాని ప్రభువు తన నమ్మకమైన సైనికులను తాంతియాను శిక్షించమని ఫిరంగులతో పంపగా, వారు యుద్ధం చేయకుండానే తాంతియాతో కలిసిపోయి అతన్ని తమ యజమానిగా గుర్తించేరు. ఒక్క ఫిరంగిలేకుండా వెడితే 32 ఫిరంగులు, సైన్యం, పుష్కలంగా ఆహార సామగ్రి దొరికేయి. తాంతియా ఆ ప్రభువుకు 25 లక్షల అపరాధం విధించేడు. ఆయన తాంతియాను, రావుసాహెబ్‌ల కాళ్ళమీదపడి క్షమాభిక్ష కోరుకొని 15 లక్షలు యిచ్చుకొన్నాడు.

డబ్బు తగినంత దొరికినందున తాంతియా సైన్యానికి ప్రోత్సాహకరంగా బహుమతులు పంచేడు. రావుసాహెబ్-బందా నవాబులతో కలిసి భవిష్యత్తు గూర్చి ఆలోచనలో పడ్డాడు. నర్మదానదిని దాటి దక్కన్ పీఠభూముల్లో ప్రవేశించి విప్లవవిహారం చేయాలన్న ప్లాను నిర్వహించడం ఎల్లాగో ఆలోచిస్తూవున్నాడు. నర్మదానదిని చేరనీయకుండా ఇంగ్లీషువారు అన్నివైపులా మహేంద్రజాలంతో ఉచ్చులు పన్నివుంచేరు.

ఇందూర్ సైన్యం తాంతియాలో తాము కలిసిపోనున్నామనీ, హోల్కార్ (యిందూరుప్రభువు) పైదాడ సాగించమనీ లోపాయికారీసందేశం పంపేరు. ఈసారి తాంతియాకు అన్నివైపులా రాబర్ట్సు, హోము, పార్కు, మిచ్చెల్, హోప్, లాఖార్టు మరింత బలంగా బస్తుతో సైన్యాలను ఉంచి పొంచిచూస్తున్నారు. తాంతియా దక్షిణపువైపు పోతున్నట్లే కనిపించి, కూర్వాలోనికివచ్చి మళ్లీ రాజగఢలో ప్రత్యక్షమైనాడు. ఇంగ్లీషు నాయకులు ఏమిచేయాలో తోచక దిగ్భ్రమలో పడ్డారు.

అలసివున్న జనరల్ మిచ్చెల్ యింగ్లీషుసైన్యాలు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో తాంతియా సైన్యాలు దాటిపోయేయి. కాని శత్రువు సమీపంలోనికి వచ్చేసరికి వీరు అలసివున్నారు. 30 ఫిరంగులతో, 5000 సైనికులతోవున్న తాంతియాసైన్యం 1000 మందిగల సుశిక్షితయింగ్లీషు సైన్యాన్ని తట్టుకోలేకపోయింది. ప్రారంభంలోనే భయంతో ఫిరంగులు వదలి చెల్లాచెదర్లై పారిపోయేరు. జగదీశపుర కుమారసింహుడు ప్రత్యక్షయుద్ధం జరుగకుండా వ్యూహం రచించి సాధించుకుంటూ వచ్చేడు. కాని తాంతియా అల్లాంటి ప్రమాదపరిస్థితి నుంచి తప్పించుకోలేక పోయేడు. ఈ ప్రమాదాన్ని దాటగలిగి వుంటే, యిందూరుపై దాడిచేసి మరింత

సైన్యాలను, సామగ్రిని, శక్తిసామర్థ్యాలను బలపర్చుకో గలిగి వుండేవాడు. దాని ప్రభావం మొత్తం పోరాటంపై పడివుండేదేమో!

అన్నిటినీ పోగొట్టుకున్న తాంతియా అరణ్యాల గుండా బేత్వా నదిని దాటి శిరంజీ గ్రామం చేరాడు. 4 ఫిరంగులు సంపాదించేడు. వర్షాలవల్ల యింగ్లీషు సైన్యాలు కదలలేని స్థితిలో వుండగా తానుకూడ సేనలకు ఒకవారం విశ్రాంతి యిచ్చేడు. మరల కదలి ఉత్తరంవైపు సింధ్యా రాష్ట్రంలోని యిజాగఢ్‌పై దాడిచేసి 8 ఫిరంగులు సంపాదించేడు.

ఈసారి కొత్తయెత్తుగడలతో తాంతియా యుద్ధం ప్రారంభించేడు. సైన్యం తాంతియా-రావుసాహెబ్‌ల నాయకత్వంక్రింద రెండుగా చీలిపోయింది. వేర్వేరుగా అనుకూల ప్రాంతాలపై పడటం, మళ్ళీ కలుసుకోడం, విడిపోవడం ఈపద్ధతి నూతనంగా ప్రారంభించేడు. ఈ విధానం మంచిఫలితాలను సాధించిందికూడా.

ఇంగ్లీషువారుకూడ నూతనయెత్తు వేసేరు. మిచ్చెల్, విడ్డెల్, మీడే, పార్కు సేనానాయకులు నాలుగు వైపులా చంబల్‌నుంచి చక్రవ్యూహం పన్నేరు. రావుసాహెబ్, తాంతియాలు ఈ వ్యూహంనుంచి తప్పించుకొని కజూరి వచ్చేరు. అక్కడా యింగ్లీషుసైన్యం వుంది. వారు అక్కడనుంచి అడవుల్లోకి తప్పించుకొని ఉత్తర దిశకు మారి తల్బహాట్‌కు పోయేరు. నర్మదానదిని దాటే ఆశను వదలుకున్నారని యింగ్లీషువారు అనుకోసాగేరు.

దక్షిణదిశకుపోయే ఆశను వదలుకున్నారని యింగ్లీషువారికి భ్రమలుకలిగించి తాంతియా యీసారి ప్రపంచం అంతా దిగ్భ్రమ చెందేటట్లు ముందుకు దూకేడు. తాంతియా - రావుసాహెబ్‌లు హఠాత్తుగా ముందుకు వచ్చి బేత్వానదిని దాటి, కజూరివద్ద యింగ్లీషువారితో యుద్ధంచేసి, మళ్ళీ రాయగఢ్‌పైబడి ఒకసారి కనిపిస్తూ, మరోసారి కనిపించకుండా దారితప్పిస్తూ ముందుకు సాగేరు. ఇంగ్లీషువాళ్ళు కలవరపడిపోయి, యీ వీరులు ఎక్కడవున్నదీ గమనించేలోగానే అందరికీ దిగ్భ్రమ కలిగేలా హోషంగాబాద్‌వద్ద సైన్యంతోసహా నర్మదానదిని దాటి నాగపూర్ వచ్చేసేరు. 1858 అక్టోబరులో తాంతియాచేసిన ఈ సాహసకార్యం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. అయితే మంచి ఫలితాన్ని మాత్రం యివ్వలేదు. కొండంత ఆశతో మంచి సహాయం దొరుకుతుందనే ఆశతో అన్ని వ్యూహాలను దాటి నాగపూర్‌వస్తే, భయభీతులైపోయి వున్న అక్కడి ప్రజలు స్వాగతంకూడ చెప్పలేని పరిస్థితుల్లో వున్నారు. నర్మదానదిని దాటిన సాహసం నిరుపయోగం అయింది.

దిగ్భ్రమనుంచి తేరుకొన్న ఇంగ్లీషు సైన్యాలు నర్మదానదిని దాటి తాంతియాను తరుము నారంభించేయి. భీభత్సం మధ్యవున్న దక్షిణదేశం తాంతియాకు మరింత ప్రమాదకరంగా కనబడింది. మళ్ళీ నర్మదానదిని దాటా లనుకొన్నాడు. ఉత్తరదేశంలో అయితేనే ఎక్కువకాలం పోరాటం సాగించగలనని అనుభవంవల్ల తెలిసికొన్నాడు. చుట్టబెట్టుతున్న ఇంగ్లీషు సైన్యాలను అడ్డుకుంటూ, చక్రబంధంలో పడకుండా తప్పించుకుంటూ, మెయిళ్ళను దోచుకుంటూ, టెలిగ్రాఫు తీగెలను ధ్వంసంచేస్తూ చికాకు పెడుతున్నాడు. దక్షిణంలో అయితేనే తాంతియాను బంధించవచ్చునని ఇంగ్లీషువారి ప్లాను. అందుచేత నదీ ప్రాంతం అంతా బందోబస్తులో వుంచేరు. కాని కర్గున్ గ్రామంవద్ద కమాండెంట్ మేజర్ సండర్లాండుతో యుద్ధంచేసి, ఫిరంగులను వదలివేసి తాంతియా సైన్యాలు నర్మదను దాటేసేయి. నర్మదను దాటి అవతలకు వస్తే ప్రపంచం యెంత దిగ్భ్రమ పొందిందో, ఇవతలకు దాటినప్పుడుకూడ అంతే దిగ్భ్రమపొందింది.

## ఇతర గెరిల్లా పోరాటాలు

శత్రువు కళ్లుగప్పి నర్మదానదిని ఈవలకు ఆవలకు దాటిన తరువాత తాంతియా ఖాళీచేతులతో వున్నాడు. బరోడా దర్బారు సైన్యంలో తనకు అనుకూలమైన ప్రముఖులు చాలామంది వున్నందున బరోడాపై పడాలని ఆయన ప్లానువేశాడు. బరోడా యాత్రను జయప్రదంగా సాగించాలంటే మళ్లీ ఆయుధాలు, సామగ్రి కావాలి. అందుకై రాజపురా అధిపతిపైపడి డబ్బును గుర్రాలను గుంజుకున్నాడు. బరోడాకు 50 మైళ్ళలో వున్న ఛోటా వుదయపురం సంస్థానంలో మకాం చేసేడు. అతని అడుగుల్లో అడుగువేసుకుంటూ వెనుకవైపునుంచీ, యితర వైపులనుంచీ ఇంగ్లీషుసైన్యాలు వస్తున్నా తప్పించుకొని ఆశ్చర్యచకితులను చేస్తున్నాడు. పార్కు సేనానాయకుడు తాంతియా దరిదాపుల్లోకి వచ్చివేసినందున బరోడా దండయాత్రప్లానును తాంతియా వదలివేసేడు. వాస్వారా అడవుల్లోకి ఉత్తరంగా యాత్రసాగించేడు.

తాంతియా - రావుసాహెబ్‌తోపాటు వుంటున్న బందానవాబు యిక యీ యిబ్బందులు పడలేకపోయేడు. అవకాశం కోసం చూస్తుంటే విక్టోరియారాణి ప్రకటన (ప్రొక్లమేషన్) వచ్చింది. దాన్ని సావకాశంగా

75

# స్వాతంత్ర్య వీరుల జీవిత గాథలు

## కవులూరి వెంకటేశ్వరరావు

'నిన్న' అప్పుడే గతంలో చేరిపోయింది. గిర్రున తిరిగే, ఆద్యంతాలు లేని కాలచక్రంలో అట్టి 'నిన్న' లెన్ని చేరినవో? అట్టి గతంలోకి మన మొకసారి వెనుదిరిగి వంద సంవత్సరాలనాటి మన దేశచరిత్రను సింహావలోకనం చేసుకోవాలి. బ్రిటిషు సామ్రాజ్య వాదుల నెదిరించి, అనన్యమైన వీరత్వాన్ని ప్రదర్శించి, భారతదేశపు కీర్తిని నిలబెట్టి ఆత్మబలిదానం చేసిన వీరులను, వీరనారీమణులను మన మొకసారి స్మరించుకొందాం.

## మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి

లక్ష్మీబాయి అంటే చాలమందికి తెలీదు. ఝాన్సీ పేరు వింటేచాలు, వెంటనే మహారాణి ఝాన్సీ మన కండ్లముందు ప్రత్యక్ష మవుతుంది. ఝాన్సీకి, ఆమెకు అంత అవినాభావ సంబంధ ముంటున్నమాట! అంతే కాదు. చరిత్రలో ఝాన్సీచరిత్ర మహాప్రసిద్ధం – ఒక ఆడకూతు రేమిటి, బ్రహ్మాండమైన సామ్రాజ్యాన్ని పాలించే బ్రిటిష్‌రాణి అధికారాన్ని సవాలుచేసి కత్తి పట్టడ మేమిటి! అట్టి వీరపుత్రినిగన్న భారతమాత ఎంత అదృష్టవంతురాలు! ఆమెను గన్న మాతాపిత లెంతధన్యులు! ఈ మహావీర సాధ్వీమతల్లినే శత్రు గణముకూడ 'హైందవ జోన్ ఆఫ్ ఆర్క్' అని శ్లాఘించక తప్పలేదు.

మోరోపంతు తాంబే అను మహారాష్ట్ర వీరుడు, ఈ వీరవనిత తండ్రి. అతడు పేష్వాల సైన్యములలో గొప్ప సర్దారుగా ఉండేవాడు. అంతిమ పీష్వా బాజీరావు తన రాజ్యాన్ని ఇంగ్లీషువారి కమ్మివేసి, బ్రహ్మావర్తమునకు (బిఠూర్) వెళ్ళిన తరువాత, ఇతడుకూడ బ్రహ్మావర్తం చేరెను. మహారాణి తల్లిపేరు భాగీరథీబాయి. ఈ కన్యారత్నం 1835 నవంబరు 16 వ తేదీన జన్మించింది. ఈమె పేరు మనూబాయి. మోరోపంతు బ్రహ్మావర్తం చేరగానే, మనూబాయి తల్లి మరణించింది. చిన్ననాడే తల్లిలేని జీవితమైంది.

బాజీరావు వద్ద నానాసాహెబ్ పెరుగుతున్నాడు. ఈ కన్యారత్నంకూడ అతనితోపాటు విద్యాభ్యాసం, యుద్ధవిద్య, కత్తిసాము నేర్చుకునేది. వీరిద్దరికి తోడు తాంత్యాకూడ నేర్చుకునేవాడు. ఆమె అందరికి వారామెను 'ఛబేలి' (సంపంగి పుష్పం) అని పిలిచే వారు. ఆమె కత్తిసాములో అసమాన చాతుర్యాన్ని సంపాదించింది. గుర్రపు స్వారీ, కవాతు మొదలైనవి ముఖ్యవిద్యలు–ఈ విధముగా ఆమె భవిష్యత్ జీవితానికి గట్టిపునాదులు చిన్ననాడే పడినవి.

ఇంతలో 1842 లో మహారాజా గంగాధరరావు (ఝాన్సీ రాజు) ఆమె నత్యంత వైభవంతో వివాహ మాడెను. వారి ఆచారాన్నిబట్టి అత్తవారామెకు లక్ష్మీబాయి అని పేరు పెట్టారు. ఈ విధంగా ఆమె మహారాణి లక్ష్మీబాయి అయినది.

గంగాధరరావు రాజ్యమునకు వచ్చిన తరువాత మహారాజు ఖర్చుపై ఝాన్సీ రాజ్యములో కొంత ఆంగ్ల సైన్యం ఉంచబడెను. దానికొరకు 3 లక్షల రూపాయలు కేటాయించబడినవి. ఝాన్సీ రాజ్యములో ఏనుగుల అంబారీలు, గుర్రపుజీనులు వగైరా బంగారంతో తయారుచేయబడేవి. 5000 కాల్బల సైన్యం, 2000 రక్షకభటులు, 500 గుఱ్ఱపుదళం, వ[illegible] ఫిరంగులను తయారుచేయు నాల్గు కార్ఖానాలు ఉండేవి. అట్టి రాజ్యాన్ని, సమయం చూచి దిగ్మింగా[illegible] బ్రిటిషువారు నిశ్చయించుకున్నారు.

గంగాధర, లక్ష్మీలకు పుత్రసంతానం కల్గినట్లే క[illegible] ఆ పసికందు రాలిపోయెను. దానితో గంగాధరరావు

మనోవ్యాధితో మంచంపట్టి కృశించి ప్రాణాపాయ స్థితి కల్గెను. మహారాణి పుత్రశోకముతో నేకాక, భర్త స్థితిని చూచి మరింత బాధపడుచుండెను.

గంగాధరరావు తన వంశానికి చెందిన ఆనందరావను బాలుణ్ణి బుందేల్ఖండు సహాయ ప్రభుత్వాధికారి మేజర్ ఏలిసు సమక్షంలో దత్తత చేసుకుని, ఆ బాలునికి దామోదరరావని నామకరణ మిడిరి. ఆ తరువాత గంగాధరరావు తన వంశోద్ధరణకై దామోదరరావును దత్తత చేసుకున్నట్లుగను, ఆ బాలుడు తన వంశంలోని వాడనియు, దానిని అంగీకరించవలయునని ఇంగ్లీషు ప్రభుత్వానికి ఒక లేఖ వ్రాసెను. దానిలో తనకు బ్రిటిషు ప్రభుత్వంపైగల శ్రద్ధాభక్తులను కూడ ఉదహరించినాడు.

ఏలిసుదొర మంచివాడే. అయితే బుందేల్ ఖండ్ ఏజెంటు, దత్తతను గుర్తించవద్దని ప్రభుత్వ కార్యదర్శికి నవంబరు 25 న ఒక జాబు వ్రాసెను. గంగాధరరావు ప్రభుత్వమునకు పంపిన అర్జీలో "నా భార్య జీవించునంతకాలం, ఆమెయే రాజ్యాధిపతి. ఆ బాలునకు ఆమెయే తల్లి. ఆమె యధీనంలోనే రాజ్యవ్యవస్థ ఉండవలెను" అంటూ తన కోర్కెను తెల్పినాడు. దత్తతను గుర్తించినట్లుగాని, గుర్తించనట్లుగాని అధికారయుతంగా మహారాణికి ఏ వర్తమానం చేరలేదు. వెంటనే ఆమె మేజరు ఏలిసుద్వారా ఒక లేఖ పంపెను. తన భర్త దత్తత చేసుకున్నట్లు, ఆ దత్తుడే తన భర్తపోయినపుడు పితృక్రియలన్నిటిని జరిపినట్లు, ఆ బాలుని రక్షణ, పాలనాభారము సర్కారుమీద కలవనీ, లోగడ సర్కారువారు ఇతరుల దత్తతల నేవిధంగా అంగీకరించిరో ఆ విధముగనే అంగీకరించవలెననీ వ్రాసెను. డల్హౌసీ నిర్మొగమాటంగా ఝాన్సీని బ్రిటిషు రాజ్యంలో కలిపివేయాలన్నాడు. సమయం మించిపోయినతర్వాత మాల్కం దొర దత్తతను గుర్తించవలసిందిగా రాశాడు. కాని లాభం ?

అన్యాయం చేయడ మెరుగని మహారాణి, సర్కారువారు న్యాయానికి కట్టుబడతారని ఆశించింది. కాని న్యాయాన్ని మంటల్లో పారవేశారు తెల్ల ప్రభువులు! ప్రభుత్వంవారు గంగాధరరావు చేసుకున్న దత్తతను గుర్తించలేదనీ, 1854 మార్చి 2 న ఝాన్సీ రాజ్యం బ్రిటిషు రాజ్యంలో కలిపివేయబడిందనీ, మేజరు ఏలిసు ప్రభుత్వాధికారనీ ప్రకటించడంతో మహారాణి మొదలు విరిగిన చెట్టువలె కూలిపోయింది. ఒకవైపు పుత్రశోకం; మరోవైపు భర్త వియోగం - మూడోవైపు రాజ్య నాశనం! అంతటి చిన్నవయసులో ఆ కోమలి కన్ని కఠోర పరీక్షలు!

డల్హౌసీ ప్రకటన సారాంశం :

1. మహారాణి లక్ష్మీబాయికి ఝాన్సీ ఖజానా నుండి జీవితపర్యంతం నెలకు రు. 5000.

2. పట్టణంలోని రాజమహలు నామె కిచ్చివేయవలెను. దాని కామెయే రాణి అట.

3. ఆమెపైగాని, ఆమె నౌకర్లపైగాని బ్రిటిషువారి కెట్టి అధికారమూ లేదు.

4. దామోదరరావునకు రాజ్యాధికారం లేనప్పటికీ గంగాధరరావు నిజసంపత్తికీ, జవ్హారికీ దామోదరరావే అధికారి.

అబ్బా! ఎంత దయ బ్రిటిషువారికి!

మన మహారాణీ బ్రిటిషువా రిచ్చిన సొమ్మును బిచ్చంలా తృణీకరించింది. దామోదరరావు పేరున, ఇంగ్లీషువారు తమఖజానాలో రు. 6 లక్షలు జమకట్టారు. రాజ్యంలోని జవ్హారీ, నగలు మొదలైనవి దామోదరరావు ఉపయోగం నిమిత్తం, లక్ష్మీబాయి అధీనమందుంచబడెను. దామోదరరావు ఉపనయనానికి మహారాణి లక్షరూపాయలడిగితే, న్యాయశాస్త్రకోవిదులైన బ్రిటిషువారు అంతతేలిగ్గా ఇస్తారా? ఇవ్వలేదు. అవమానంతో ఆమె కోమలహృదయం దగ్ధమైపోతూంది. అంతకుముందు పెద్దపెద్దవకీళ్ళను తనతరఫున వాదించేందుకు ఇంగ్లాండు పంపింది. ఎన్ని చేస్తే ఏం? రాజ్యాపహరణకై కూర్చున్న బ్రిటిషు ప్రభుత్వం రాజ్యాన్ని వదలుకొని న్యాయానికి కట్టుబడుతుందా!

ఇంగ్లీషు గొడ్డలి తనపని ప్రారంభించింది. ఝాన్సీ సైన్యాన్ని ఊడబెరికి ఇంగ్లీషు సైన్యాలను పెట్టుకున్నారు. కోటను విడిచి మహారాణి రాజమహలుకి వెళ్లవలసివచ్చింది. గొప్పగొప్ప మరఫిరంగులన్నీ నిరుపయోగములు చేయబడ్డాయి. దీనిని భరించలేక, మహారాణికి విపరీతమైన ఆవేశం వచ్చింది. కాని సంబాళించుకొన్నది.

ఇప్పుడామె దైనందిన జీవితం క్లుప్తంగా ఇది : తెల్లవారుఝామున లేచి, స్నానాదికములు ముగించుకుని పూజలు చేయడం, దానధర్మాలు చేయడం, రామకోటి వ్రాసికొనుట, పురాణ శ్రవణం.

ఝాన్సీని ఇంగ్లీషువారు స్వాధీనపరచుకుని 2 సంవత్సరాలైంది. 1857 సంవత్సరం తొంగిచూచింది. లార్డ్ కానింగు మనకు గవర్నరుజనరల్. దేశమంతటా విప్లవాగ్నులు దావానలంలా చెలరేగినయ్. ఝాన్సీలో



తాంతియాతోపె బ్రిటిష్ సేనలతో పోరాడుతున్న ఒక దృశ్యం

తీసుకొని ప్రాణభయం లేదని బందావాలు యింగ్లీషు ప్రభుత్వానికి జోహార్ చేసేడు. రావు సాహేబ్, తాంతియాలు శత్రువుకు జోహారుచేయడం కంటె కర్తవ్యపాలనలో మరణించడానికే నిశ్చయించుకున్నారు. ఇతరులకు ఆదర్శంగా వుండాలనుకున్న వారికి ఆపదలన్నా, చావన్నా తృణప్రాయంగా వుంటుంది. డిశంబరు 11 న ఒక అడవి ఖిల్లాదారు నుంచి కొంతసామగ్రిని కూర్చుకొని తాంతియా ఉదయపురంవైపు సాగిపోయేడు. ద్విబంధంనుంచి తప్పించుకొని ప్రతాపగఢవైపుకు పోతూవుంటే గాఖీసేనాధిపతి సైన్యాలు చుట్టుముట్టేయి. వారి నుంచి తాంతియా తప్పించుకున్నాడు.

గోజులు బాగాలేవు. కాని తాంతియా పట్టుదల పెరుగుతూనేవుంది. ఇంతిలో గంగా, యమునా నదులను మహాసాహసంతో దాటిన ఢిల్లీ రాజకుటుంబంలోని మీర్జా ఫిరోజిషా కూడ ఆయనతో వచ్చి చేరేడు. సింధ్యాకోట్లలోని సర్దారు మానసింగు కూడ వచ్చేడు. నల్గురు నాయకులూ, అనేక ప్రమాదాలు తప్పించుకొని భవిష్యత్తు కార్యక్రమం నిమిత్తం 1859 జనవరి 13 న యింద్రగఢలో సమావేశం జరిపేరు. శత్రుదాడులు సమావేశానికి సావకాశం యివ్వలేదు. నేపియరు - సోమర్సెట్ - హోయర్సు - స్మిత్ - మిచ్చెల్ - బెన్సన్‌లు మహా నైపుణ్యంతో పన్నిన అడకత్తెర వ్యూహాన్ని తప్పించుకుంటూ 18 వ తేదీన వారు దివాసా చేరేరు. ఇంతలో ఇంగ్లీషు సైన్యాలు తాంతియా గుడారంపై పడ్డాయి. తాంతియా నేర్పరితనంగా శత్రువులను తప్పించుకుపోయేడు. ఆల్వార్ ప్రాంతంలోవున్న షికార్ గ్రామంవద్ద 21 వ తేదీన మరల రావుసాహెబు, తాంతియా, ఫిరోజ్‌షాలు కలుసుకున్నారు. హోమ్సు తన సైన్యాలతోవచ్చి విప్లవకారులను తీవ్రంగా దెబ్బకొట్టేడు. షికార్‌యుద్ధం తరువాత విప్లవకారులు కోలుకోలేనంత దారుణ పరాజయం పొందేరు. నాయకులంతా విడిపోయి తలో దారీ అయ్యేరు. తాంతియా రెండు గుర్రాలను, ఒక పొట్టిగుర్రాన్ని, యిద్దరు వంటబ్రాహ్మణులను మాత్రం వెంట పెట్టుకొని అతి హీన పరిస్థితులలో కూడా సాహసాన్ని కోల్పోకుండా బయలుదేరేడు.

## స్వాతంత్ర్య మహాయజ్ఞంలో ఆఖరు సమిధ

ఫిరోజ్‌షా తాంతియాకు ఒక సురక్షితప్రాంతం నిర్ణయించి రమ్మని వర్తమానం చేసేడు. కాని ఆయన మానసింగ్ దగ్గరికి వెళ్లేడు. ఈలోగా మానసింహుని ఇంగ్లీషువారు కలుసుకొని అతన్ని క్షమిస్తామనీ, జాగీరు యిప్పిస్తామని ఆశపెట్టి లోబరచుకున్నారు. తన స్వంత పినతండ్రినే యీ ద్రోహి యిదివరలో ఒప్పజెప్పివున్నాడుకూడ. మానసింహుడు ధైర్యాన్ని కోల్పోయి ఇంగ్లీషువారికి లొంగిపోబోతున్నాడని ఊహించేడు తప్ప మిత్రద్రోహం చేస్తాడని కలలోకూడ తాంతియా అనుకోలేదు. తాంతియాను మానసింహుడు ఒక రక్షిత ప్రదేశంలో వుంచి, తరువాత అన్నీ ఆలోచించుకుందాం అని వెళ్ళిపోయేడు.

మూడురోజుల తరువాత తాంతియా నిద్రపోతూవుంటే యింగ్లీషుసైనికులను వెంటబెట్టుకొని వచ్చేడు మానసింహుడు. సైనికులకు తాంతియా అంటే వుండే ప్రేమాభిమానాలను చూచి భయపడుతూవుండే యింగ్లీషువారు ఎవరిని బంధించబోతున్నదీ తెలియనీయకుండానే వచ్చేరు. మిత్రద్రోహం కారణంగా మాత్రమే తాంతియా దొరికిపోయేడు. శత్రువుల వాడి ఖడ్గాలను తప్పించుకున్న తాంతియా మిత్రద్రోహపు విషపన్నాగంవల్ల ఏప్రిల్ 7 వ తేదీన బందీ అయిపోయేడు.

తాంతియా యింగ్లీషుకోర్టుల బూటకపు విచారణను తిరస్కరించి భారతీయుల గౌరవానికి వన్నె పెట్టేడు. నిర్భయంగా, నిశ్చింతగా ఉరిపీఠం ఎక్కి, తనకు తానుగా ఉచ్చును తగిలించుకొని బలిఅయ్యేడు.

1857 ఏప్రిల్ ప్రారంభంలో అమరవీరుడు మంగళ పాండ్యా బలితో ప్రారంభమైన స్వాతంత్ర్య మహాయజ్ఞం 1859 ఏప్రిల్ 18 న తాంతియా తోపే ఉరితో అంతమైంది. రెండేళ్లు సాగిన యీ మహాయుద్ధం భారతప్రజల స్వాతంత్ర్య దీక్షను పెంపొందించి అనేకమంది ఆదర్శ-అమర జ్యోతులను సృష్టించింది.





ఝాన్సీ రాణి లక్ష్మీబాయి ఉపయోగించిన కైజారు.



రాణి లక్ష్మీబాయి ఉపయోగించిన సుప్రసిద్ధ ఫిరంగి "శత్రు సంహార"



మరొక ఫిరంగి "నాల్దార్". ఇవి ఇప్పుడు గ్వాలియర్ సంస్థానంలోని నార్వార్‌కోటలో జాగ్రత్తచేయబడి వున్నాయి.



ఝాన్సీలో రాణీ లక్ష్మీబాయి నివసించిన రాజమహల్.

గురుభక్ష్ అను హవల్దార్ నాయకత్వంక్రింద సిపాయిలు బ్రిటిషు అధికారాన్ని సవాలుచేశారు. విప్లవ సైనికుల విజయవిహారానికి, ఇంగ్లీషువారి పైప్రాణాలు పైననే లేచిపోతున్నయ్. ఇంగ్లీషు అధికారులు కోటలో దాక్కున్నారు. వెంటనే తమకవసరం వచ్చిందికదూ, తమను రక్షించవలసిందిగా మహారాణి కాళ్ళమీద పడ్డారు. ఏముంది - చీమూ నెత్తురు లేనివారికి! కాని, ఆవార్త ఆమెకందలేదు. కోట విప్లవవీరుల వశమైంది.

ఇట్టి విషమపరిస్థితుల్లో మహారాణి పాత్ర ఏమిటి? విప్లవంలో ఆమెకుగల సంబంధ మేమిటి? బ్రిటిషు ప్రభుత్వంపట్ల ఆమె ప్రవర్తన ఎట్టిది? మెలిసన్ 'సిపాయి చరిత్ర' అను గ్రంథములో 'మహారాణి తప్పేమీలేదు. బ్రిటిషువా రామెను ఆస్థితికి తెచ్చారు.' అన్న భావం వెలిబుచ్చాడు.

1889 ఆగస్టు 10 వ తేదీన హతశేషుడైన మార్టిన్ దొర దామోదరరావుకు ఒక జాబులో ఝాన్సీ మహారాణి తప్పేమి లేదనీ, బ్రిటిషువారి ప్రవర్తనే క్రూరమైనదనీ ఝాన్సీలో 1857 జూన్‌లో జరిగిన హత్యాకాండతో ఆమె కట్టి సంబంధంలేదనీ, ఆమె తనకు సహాయం చేసినదనీ, తమ సేవయే తమ్ము చంపినదనీ వ్రాశాడు.

ఇంగ్లీషుపాలన ఝాన్సీ ప్రాంతంలో అంతమైంది. మహారాణి ప్రజలను కాపాడాలి. దేశంలో క్రమబద్ధ పరిపాలన ఏర్పరిచింది.

అప్పటినుండి ఝాన్సీని మహారాణి పాలిస్తున్నది. ఈ పదిమాసముల పాలనలో ఆ మహాసాధ్వి రాజ్యతంత్ర ప్రావీణ్యత, న్యాయకుశలత, ప్రజావాత్సల్యం బయటపడ్డాయి. ఆమె ప్రాతఃకాలమున పూజలు పూర్తిచేసిన తర్వాత సర్దారులను కలుసుకుని, ఒకరోజు రానివారిని రెండవరోజున కారణం అడిగి తెలుసుకోవడం, బీదలకు దానధర్మాలు, సాయంత్రం వరకు రాజకీయ వ్యవహారములను స్వయంగా చూచుకొనడం చేసేది. ఆమె యిష్టదేవత శ్రీ లక్ష్మి. రాజఠీవిని ఎన్నడూ ప్రదర్శించి ఎరుగదు. లక్షరూపాయలు విలువచేసే ఒక రత్నఖచితమాలను ఆమె మెడలో ధరించేది. బంగారు పటకా నడుముకు బిగించి ఉండేది. రెండువైపులా రెండు పిస్తోళ్ళు అమర్చి వుండేవి. దాని సమీపాన్నే ఒక కైజారు వ్రేలాడేది. అప్పుడప్పుడు పైజామాకూడ వేసేది.

మహారాణి చేసిన సహాయం బ్రిటిషువారు అపుడే మరిచారు. వారికి కావలసింది రాజ్య విస్తరణ. విప్లవ ధాటికి తట్టుకోలేక పారిపోయి, మహారాణి ఝాన్సీపై యుద్ధం ప్రకటించారు.

ఝాన్సీని దిగమ్రింగడానికి ఇంగ్లీషు సేనలు వస్తున్నవని మహారాణికి వార్త చేరింది. అంతే — వెంటనే ఝాన్సీ చుట్టుపట్ల ప్రదేశమంతా బీడు. అడుగు పెట్టిన ఇంగ్లీషు సిపాయిలకు తలతిరిగింది. అరె! తమకు కావలసిన సరంజామా ఎక్కడ దొరుకుతాయ్? 'ఎంత పనిచేసింది ఆడది' అని మండిపడ్డాడు రోజ్ దొర.

అయితే సింధియా — దేశద్రోహుల పుణ్యమా అంటూ, ఇంగ్లీషు సైన్యాలకు కావలసినసరంజామా చేకూరింది.

"పుట్టడం చావడానికే. బ్రిటిషు జెండా ఈ పరిసరాల్లో కనుపించగూడదు. విజయం సాధించండి, లేదా మరణించండి" అని వీరనారి గర్జించింది. అంతే. ఇక సైనికుల ఉత్సాహానికి అంతులేదు. కపోష్ణరక్తం నదుల్లా పారుతోంది. తన భర్త పోయిన దుఃఖం హరించిపోయింది మహారాణికి. కోమల హృదయం వీర హృదయంగా మారింది. యుద్ధదృశ్యం కడు బీభత్సం. రాత్రీ లేదు, పగలూ లేదు. యుద్ధం సాగవలసిందే. తన యావచ్ఛక్తినీ వినియోగించి, రణరంగంలో తన సైనికుల నుత్సాహపరుస్తూ, మహారాణి రుద్రదేవిలా ఉంది. ఆహా! ఏమమ్మా నీశౌర్యం! తొట్రుపాటు లవలేశంలేదే!

ముమ్మరంగా రోజులతరబడి యుద్ధం సాగుతోంది. స్వయంగా గాయపడ్డవారిని పరామర్శచేసి కట్లు కట్టిస్తోంది. ఆమెలో పౌరుషం సముద్రంలా పొంగుతూనే ఉంది. ఎంతోమంది ఇంగ్లీషువారిని హతమార్చింది. ఇంకేముంది? ఝాన్సీ కోటపై బ్రిటిషు జెండా ఎగురుతోంది. ఈ హృదయ విదారకదృశ్యం ఆమె కోమల హృదయాన్ని కదలించింది. ఝాన్సీకి తనకూ ఋణం తీరిపోయిం దనుకుంది.

ఒక వేడికన్నీటిచుక్క ఆమె కొలకులనుండి క్రింద పడింది.

అశ్వంపై ఎక్కింది. వెనుక దామోదరరావును కూర్చోబెట్టుకుంది. ఇంగ్లీషు సైన్యాలను చీల్చుకుంటూ గాలికన్న వేగంతో మహారాణి వెళ్ళిపోతోంది. ఆమె ఇంగ్లీషువారి కళ్ళలో దుమ్ముకొట్టింది.

ఓ మహారాణీ! జాగ్రత్తసుమా! ఈ బ్రిటిషు సామ్రాజ్యవాదులకు నీ రాజ్యాన్ని హారతి కర్పూరంలా హరించివేసినా సంతృప్తి కలుగలేదు. నిన్ను చెరబట్టాలట! అప్పుడు వారికి సంతృప్తి. ఇంకా వేగంగా స్వారీచేయుతల్లీ! వెనుకనే ఘోరకరుదొర వస్తున్నాడు. ఓ అశ్వమా! నీ గుప్పిటలో ఉంది మా ఝాన్సీ ప్రాణం!

మరేంచేస్తావో ? తెల్లవారేసరికి ఛాండియర్ గ్రామం చేరి కొద్దిగా విశ్రాంతితీసుకుని మళ్ళీ బయల్దేరింది.

మహారాణి కాల్పీరోడ్డుమీదుగా ప్రయాణం సాగించింది. వెనువెంటనే వచ్చాడు రోకరు. ఆమెతో ఉన్న కొద్దిమంది అశ్వికదళం ఇంగ్లీషు సేనతో తలపడ్డారు. రాణి వెళ్ళిపోతోంది. అర్ధరాత్రికి కాల్పీ చేరుకుంది. 102 మైళ్ళ ఏకధాటి ప్రయాణం! ఆమె గుర్రంపై నుండి దిగింది. అంతే—గుర్రం కుప్పలా నేలకూలింది. వెంటనే దానికి సపర్యలు చేయమని రాణీ ఆజ్ఞాపించింది.

అక్కడ రావుసాహెబ్ పేష్వాను కలుసుకుంది. అంతంలో ప్రాణం ఉన్నంతవరకూ యుద్ధం చేయాల్సిందేనని నిశ్చయించుకొంది.

హ్యూరోజ్ తన సైన్యాలతో కాల్పీ చేరుకున్నాడు. మహారాణి యుద్ధానికి సన్నద్ధమైంది. ఇంగ్లీషు సైనికుల తలలు గాలిలో ఎగురుతున్నాయి.

రుద్రమూర్తిలా మన ఝాన్సీ యుద్ధభూమిని గడగడలాడిస్తోంది. ఇంగ్లీషువారు కాళికి బుద్ధిచెప్పారు.

మహారాణి పోరాటం రోజ్ మతి చెడగొట్టింది. ఇక లాభంలేదనుకుని ఒంటెల సైన్యాన్ని దింపాడు. రోజ్ ఆశ ఆ ఒంటెల సైన్యంమీదనే. పేష్వా సైన్యాలోడిపోయినయ్. కాల్పీ ఇంగ్లీషువారి చేతుల్లో పడిపోయింది.

తాంతియా, ఝాన్సీలు బ్రతికి ఉన్నంతవరకూ ఇంగ్లీషుసైన్యాలకు డొక్కా, పిక్కా ఆగుతుందా ? గ్వాలియర్‌ను స్వాధీనం చేసుకున్నారు. అక్కడి జనం సంతోషంతో చిందులు తొక్కుతున్నారు. రావుసాహెబ్, (నానాసాహెబ్ ప్రతినిధి) కొత్త సింహాసనాన్ని సంపాయించాడు. తాంతియా సర్వ సైన్యాధ్యక్షుడు.

రోజ్ మళ్ళీ గ్వాలియర్ వచ్చాడు. రోజ్ సైన్యాలముందు విప్లవ సైన్యాలు నిలువలేకపోయాయి. దాంతో విప్లవ సైన్యంలో కలవరం బయలుదేరింది - రావు సాహెబ్ కలవరపడ్డాడు. కాని వీర మహారాణి ధైర్యం చెప్పింది. యుద్ధానికి బయలుదేరింది. కొద్దిమంది అశ్వికదళంతో ఇంగ్లీషు వారిపై విరుచుకపడి, వీర విహారంచేస్తున్నది. ఆమెపై దాడికి స్మిత్ నాయకత్వం వహించాడు. ఆమె స్నేహితురాండ్రు మందర్, కాశీలు వీరోచితంగా పోరాడారు. యుద్ధరంగంలో ఎక్కడ చూచినా ఆమెయే. ఏమైతేనేం, ఆ రోజు స్మిత్ వెనకడుగు వేయకతప్పలేదు.

మళ్లీ 18 న కోటపై యింగ్లీషువారి దాడి ప్రారంభమైంది. స్మిత్ ఝాన్సీరాణి పైననే యుద్ధం చేస్తున్నాడు. హ్యూ రోజ్ కూడ ఈసారి ఇటువైపునే ఉన్నాడు. ఇంగ్లీషువారు ముందుకు చొచ్చుకు వస్తూంటే, వాళ్లపైకి దూకింది వీరనారి. కాని ఒంటెల సైన్యం రాణి సైన్యాలను వెనక్కునెట్టాయి. గ్వాలియర్ కోట శత్రువు చేతుల్లో పడింది - మహారాణి పోరాడుతూ ఉండగా, మందర్ ఆత్మత్యాగం చేసింది - అంతే! వెంటనే, మందర్‌ను చంపిన ఇంగ్లీషువాని కుత్తుక గాలిలో ఎగిరింది. ఆమెను నలువైపులా ఇంగ్లీషు వాళ్లు చుట్టుముట్టారు. ఒక కత్తిపై ఎన్ని కత్తులు లేస్తున్నయ్ ? ఒక స్త్రీ కరవాలం, ఎంతమందికి జవాబు చెబుతోంది!

అమ్మా, ఝాన్సీ! నీకు ఒక కత్తి వెనుకగావచ్చి తలపై దెబ్బ కొట్టిందమ్మా! నీ కవోష్ణ రక్తం ధారా ప్రవాహంగా ప్రవహిస్తోందమ్మా! అరె! కుడి కన్నుపై దెబ్బ! గుడ్డు బయటకు వచ్చిందే! వక్షస్థలంపై మరో దెబ్బ! ఎన్నింటిని భరించావు తల్లీ! అయినా నీ కరవాల ప్రతాపం తగ్గలేదే! ఆహా! ఎంతటి సాహసివి!

గాయపడిన ఆమెను ఆమె సేవకుడు ఒక పర్ణశాలలోనికి తీసుకువెళ్లి చికిత్సచేశాడు.

సూర్యుడస్తమించాడు. ఒక వీరనారి రక్త పంకిల భూతాల్లో కలిసిపోయింది! అయినా ఆమె మరణించలేదు - ఆమె దేహం శత్రువులకు తెలీకుండానే బూడిదయ్యింది! అయినా, ఆమె మనముందు సజీవంగానే ఉంది! మనముందేకాదు, చరిత్ర ఉన్నంత వరకూ ఆమె చిరంజీవియే! తన జీవితానికి సార్థకత చేకూర్చుకున్న మహోన్నత వీర నారీలలామ!

# నానాసాహెబ్

నానాసాహెబ్ జీవితమే మనకొక ఉత్తేజం - అతనిశక్తి, యుక్తి, దీక్ష మరుపురానివి. ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాట సందేశాన్ని చాకచక్యంతో దేశం పొడవునా వ్యాపింపచేసిన సమర్థుడు.

అట్టి వాని జీవిత విశేషాలేమిటి ?

పవిత్ర మహారాష్ట్ర దేశంలో, వేణు అనే గ్రామంలో 1824 లో మాధవరాయ నారాయణ భట్టు, గంగాభాయిలకు జన్మించాడు. వారు సామాన్య కుటుంబీకులు - పేదరికంలో పుట్టిన నానా సాహెబ్ ఒక రాజ్యాధినేత అయ్యాడు.

అదే సమయంలో కడపటి బాజీరావు, తన జీవిత శేషాన్ని గంగానది ఒడ్డున గడుపుతున్నాడు. నానా తండ్రి బాజీరావు వద్దకు చేరుకున్నాడు. అదే బ్రహ్మావర్తం (బిటూర్). అక్కడ ఆ బాలుడు, బాజీరావు హృదయాన్ని దొంగిలించాడు. బాజీరావు యీ బాలుణ్ణి దత్తత చేసుకున్నాడు. అప్పటికి నానా వయసు రెండున్నర సంవత్సరాలు.

ఇక్కడే మన వీరవనిత మనూభాయి (తరవాతి ఆమెయే మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి) కూడ పుట్టి పెరుగుతోంది. నానా, మనూ మహారాష్ట్ర బెబ్బులిగా పేర్గాంచిన తాంతియా ఒకే జట్టువారు. ఆటల్లోనూ, పాటల్లోనూ, విద్యల్లోనూ ముగ్గురూ ఒకేవిధంగా, అభేద్యంగా ఉండేవారు. తరతమ భేదాలేవీ ఉండేవికావు. యుద్ధశాస్త్రం, కవాతు, కత్తిత్రిప్పుట మొదలైనవన్నీ యీ ముగ్గురు మిత్రులూ నేర్చుకునేవారు.

నానాసాహెబ్ పెద్దవాడయ్యాడు. ఇంగ్లీషు చరిత్రకారులు అంగీకరించిన సత్యాల ప్రకారమే అతని జీవితవిశేషాల్లో కొన్ని క్రింద యిస్తున్నాం.

తండ్రి బాజీరావు చనిపోయిన తర్వాత, నానా బ్రహ్మావర్తమునే తన గృహంగా చేసుకున్నాడు. ఈ నగరం అత్యంత సౌందర్యవిలసితమైనది.

నానాసాహెబ్‌కు జంతువులంటే మహాసరదా. అతనివద్ద ఉత్తమజాతి గుర్రాలుండేవి. అన్నిటికంటే అతడు తాను ప్రోవుచేసిన ఆయుధాలనుచూసి గర్వపడేవాడు. వాటిలో రకరకాల కత్తులు, దూరశ్రేణి ఫిరంగులు, పెద్దపెద్ద తుపాకులు కూడ ఉండేవి.

అతడు విద్యావంతుడు. అతనివద్ద సంస్కృతి పేర్గాంచింది. అతనికి రాజకీయాలలో ఎంతో శ్రద్ధ ఉండేది. పెద్దదేశాల రాజకీయాలను, రాజకీయ పరిణామాలను శ్రద్ధతో పరశీలించేవాడు. 'టాడ్' అను ఇంగ్లీషువానిచే ఇంగ్లీషు దినపత్రికలు చదివించుకునేవాడు.

పీష్వా బాజీరావు 1851 లో చనిపోయాడు. చనిపోయేముందు అతడొక వీలునామా వ్రాశాడు. ఆ వీలునామాద్వారా, నానాసాహెబ్‌కు(దత్తపుత్రుడు గదా) తన ఆస్తులను, పీష్వా సర్వాధికారాలనూ సంక్రమింపచేశాడు. బాజీరావు, తన రాజ్యాన్ని బ్రిటిషువారి కప్పగించినందుకుగాను వారతనికి ఏటా 8 లక్షలు ఫించనుగా చెల్లించేవారు. బాజీరావు చనిపోగానే, ఇంగ్లీషువారు పేచీలు ప్రారంభించారు.

8 లక్షల పింఛను కంపెనీవారు నానాకు యివ్వవలసిన పనిలేదని ప్రకటించారు. ఆ ఎనిమిదిలక్షలపైన దత్తపుత్రుడైన నానా కెట్టి హక్కూలేదట! రాజ్యాన్ని అపహరించిన కంపెనీవారికి దీన్నికూడ దిగమ్రింగే హక్కున్నదట!

అతని హక్కులను గురించి కంపెనీవారు పంపిన ప్రకటనకు నానా తొట్రుపాటులేకుండా, హుందాగా జవాబు వ్రాశాడు. కంపెనీవారు ఒక ఉన్నత కుటుంబాన్ని అంతచులకనగా చూడడం పాడిగాదనీ, 8 లక్షల రూపాయలను ప్రతి ఏటా చెల్లించేపద్ధతిపై తన తండ్రి కంపెనీవారికి రాజ్యాన్ని, సింహాసనాన్ని విక్రయించినాడనీ, అట్టి పరిస్థితుల్లో పై మూల్యమును అగ్రిమెంటు ప్రకారం చెల్లించనపుడు కంపెనీవారికి రాజ్యం, సింహాసనములపై హక్కు ఎలా ఉంటుందనీ, అగ్రిమెంటు ఉభయపార్టీలకు వర్తిస్తుందనీ జవాబు వ్రాశాడు.

ఏదో ఒక సాకుతో 8 లక్షలను ఎగవేయాలని కూర్చున్న కంపెనీవారికి నానా మరింత ఘాటుగా మరొక జాబు వ్రాశాడు. తన తండ్రి ఫించనును ఏ విధంగా ఖర్చుపెట్టుకున్నాడో కంపెనీ వారి కనవసరమనీ, వారి బాధ్యత ఫించను చెల్లించడం మాత్రమేననీ, తమ నౌకరులు జీతాలేవిధంగా ఖర్చుపెడుతున్నారో అడిగేహక్కు కంపెనీవారికి లేనపుడు, తనవంటి వారిపై అట్టి హక్కు ఎలా ఉంటుందని ప్రశ్నించాడు. ఇది సంధిపత్రాన్ని కాలరాయడం తప్ప మరేమీ కాదని నానా వ్రాసి పంపాడు. ఈ లేఖను లండనుకు తీసుకు వెళ్లింది నానా రాయబారి అజీముల్లాఖాన్.

అజీముల్లాఖాన్ ఎంత మేధావి అయితే ఏం? ఇంగ్లీషు పాలకులా న్యాయాన్ని పాలించేది? అజీముల్లాఖాన్ విఫల మనోరథుడై, తిరిగి వచ్చేసరికి బ్రహ్మావర్తములో పరిస్థితిమారింది. భారత స్వాతంత్ర్య పోరాటానికి యావద్భారతదేశం సిద్ధమవుతోంది. నానాసాహెబ్, అజీముల్లాలు ఉత్తర హిందూస్థానం సంచారం బయల్దేరారు. స్వాతంత్ర్యపోరాటం ఉచ్ఛస్థాయిలో సాగాలంటే, హిందూ - ముస్లిమ్ ఐక్యత ప్రధాన మన్నది నానాకు, అజీముల్లాకు తెలుసు. అందుకువారు తీవ్ర కృషి చేస్తున్నారు.

అయితే, నానా ప్రయత్నాలు ఇంగ్లీషు పాలకులకు ఏమాత్రం అనుమానం కల్గించలేదు. ఇంగ్లీషు వాళ్ళను అట్టి పరిస్థితిలో పెట్టాడు నానా.

నానా ప్రజల బాధలను కళ్ళారాచూశాడు. బాని సత్వపు మహమ్మారికి ఖడ్గం మినహా మరోమార్గం లేదనుకున్నాడు. "విజయమో! వీరస్వర్గమో" అన్న వాణి అతని హృదయంలో ప్రతిధ్వనించింది.

నానా, అజిముల్లాఖాన్‌లు దేశమంతటా సంచారం చేసి స్వాతంత్ర్య పోరాటానికొక పథకం తయారు చేశారు. సామంతులు మొదలు సామాన్యులవరకు అన్ని వర్గాల ప్రజల్నీ సమీకరించే విధంగా, సిపాయి కమిటీలకు ప్రధానపాత్ర ఉండేటట్లు అది తయారు చేయబడింది. దేశవ్యాపితంగా ఒకేరోజున (1857 మే 31) తిరుగుబాటు ప్రారంభం కావాలని నిశ్చయించబడింది.

పథకం ఆచరణలో పెట్టేరోజులు దగ్గరపడుతున్నయి. నానా తగిన బందోబస్తులో ఉన్నాడు. కాని అకస్మాత్తుగా, మీరట్‌లో సైనికుల తిరుగుబాటు (1857 మే 10), ఆ తరువాత ఢిల్లీ తిరుగుబాటు. నానా తొణకలేదు, బెణకలేదు. ప్రశాంతంగా ఆ వార్తను స్వీకరించి, ఉన్న అవకాశాలనే వినియోగించుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు.

బ్రహ్మవర్తం అంతా పైకి ప్రశాంతంగా నేఉంది. నానా విప్లవ సంఘటనలతో తనకేమీ సంబంధంలేనట్టే నటించేవాడు. దేశంలో పరిస్థితులు తమ కనుకూలించని సరికి ఇంగ్లీషువారు - నిన్నగాక మొన్న నానా వారసత్వాన్ని నిరాకరించిన కంపెనీ ప్రబుద్ధులు సిగ్గూ ఎగ్గూ లేకుండా నానాకాళ్ళు పట్టుకున్నారు. నానా తనలోతాను నవ్వుకున్నాడు. కాన్పూరులో విప్లవం ఎప్పుడు రేగుతుందో అనే భయంతో ఇంగ్లీషువారి కాళ్ళు వణికిపోతున్నాయి. అట్టిపరిస్థితుల్లో నానా కాన్పూర్ వెళ్లి ఇంగ్లీషువారి మధ్యనే మకాంవేశాడు. ఖజానా రక్షణభారాన్ని ఇంగ్లీవారు నానాకు వప్పగించారు. నానా రెండు వందలమందిని దానికి రక్షకులుగా నియమించాడు. ఇదంతా విప్లవానికి వారం రోజులుముందు! తెల్లవారి స్త్రీలు, పిల్లలు అవసరమైతే బ్రహ్మవర్తములో నానా భవనంలోనే ఆశ్రయం!

రేపు తిరుగుబాటు జరుగుతుందనగా కూడ నానా నాయకత్వం ఇంగ్లీషువారి కళ్ళను కప్పగల్గింది. గతంలోని కార్యక్రమాన్ని నేటి పరిస్థితుల కనుగుణంగా మార్చుకోవడం అవసరంగదా! జూన్ 1 వ తేదీన నానా, అతని సోదరుడు బాలాసాహెబ్, అజిముల్లాఖాన్, సుబేదార్ టిక్కాసింగు వగైరా విప్లవనాయకులు అంతిమ కార్యక్రమాన్ని రూపొందించుకుని వెళ్ళిపోయారు.

ఇంగ్లీషు ఉద్యోగస్థులు తమ ప్రాణాలను అరచేతిలో పెట్టుకు కూర్చున్నారు.

కాన్పూరు ప్రశాంతంగా నిద్రలో ఉండగా, అర్థరాత్రి మూడుసార్లు తుపాకుల మోతలు విన్పించాయి. ఇంగ్లీషువారి భవనములను అగ్నిదేవుడు తనలో లీనం చేసుకుంటున్నాడు. భారతీయ స్వతంత్ర సైనికుల తుపాకులు, ఇంగ్లీషు సామ్రాజ్యవాదులపై గురి పెట్టబడ్డాయి. సర్వం విప్లవసైనికులు వశపరచుకున్నారు.

నానా ఇంగ్లీషు సైన్యాధిపతి హ్యూకు తాను బ్రిటిషువారిపై కత్తిగట్టానని సమాచారం పంపాడు.

ఘోరమైన యుద్ధం జరిగింది - సామ్రాజ్య సైన్యం స్వాతంత్ర్య సైన్యం పోరు సాగిస్తున్నయి. కాన్పూర్ స్వతంత్రమైంది. బ్రహ్మవర్తం స్వతంత్రమైంది.

ఇంతకల్లోలంలోకూడ నానా తన రాజ్యంలో ఎట్టి అరాచకంలేకుండా, ప్రజల కన్ని సౌకర్యములు ఏర్పరచి, న్యాయపాలనా నిర్వహణ, ఆహారపదార్థముల సరఫరా, శిక్షణ తప్పిన సిపాయిలవలన ప్రమాదాలు రాకుండా కట్టుదిట్టాలు చేశాడు.

ఆ తరువాత విప్లవ సైనికులు నానాసాహెబ్‌ను రాజుగా ప్రకటించారు. పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన సైనికులందరికీ నానా తన అభివందనలు తెలియ పరచాడు. ఇది 28 జూన్‌న జరిగింది. ఆ తరువాత బ్రహ్మవర్తం వెళ్ళి, అక్కడ నొసట రాజతిలకాన్ని ధరించి జూలై 1 న బ్రహ్మవర్త సింహాసనాన్ని అధిష్టించాడు.

కాన్పూర్‌లో ఇంగ్లీషు వారికి జరిగిన శృంగభంగ వార్త లార్డ్ కానింగ్ చెవిని పడింది. కలకత్తానుండి తన కార్యాలయాన్ని అలహాబాద్‌కు మార్చుకున్నాడు. కాన్పూరును తిరిగి జయించాలని హేవ్లక్ నాయకత్వం క్రింద ఇంగ్లీషు సైన్యాలు బయలుదేరాయి. మేజర్ రేనాడ్ సైన్యాలు ఫతేపూర్ వెళ్తున్నట్లు సమాచారం చేరగానే నానా కొన్ని సైన్యాలను అచ్చటకు పంపాడు. కాని విప్లవ సైనికులు ఇంగ్లీషు సైన్యాలముందు నిలువలేకపోయినయి. ఆ తరువాత ఇంగ్లీషు వారుచేసిన అత్యాచారాలు వ్రాయలేం. బాలాసాహెబ్ పీప్పాగుండుదెబ్బ తిని కాన్పూర్ చేరాడు. అక్కడ నానా భావిని గురించి ఆలోచించాడు. కాన్పూర్‌ను రక్షించాలని నిర్ణయించుకున్నారు. నానాయే స్వయంగా నాయకత్వం వహించాడు. కాని ఎంత పోరినా లాభం లేక, బ్రహ్మవర్తమునకు చేరుకున్నాడు.

జూలై 16 న బ్రహ్మావర్తంలో తన భవనంలో యుద్ధతంత్రాన్ని గురించి హేవలాక్ పన్నాగములను భగ్నంచేయడానికి తాంతియా, బాలాసాహెబ్, రావుసాహెబ్ లతో నానా మంతనాలు సాగించాడు. లక్నో రాష్ట్రంలో ఫతేపూర్ వెళ్తున్నాడు నానా. కాన్పూకోటను రక్షించే బాధ్యత బాలాసాహెబ్, తాంత్యాలది.

ఇట్లా బ్రహ్మావర్తంకూడా శత్రువశం అయింది. అయినప్పటికి నానా అచంచల దీక్షతో ఇంగ్లీషువారికి దొరకకుండా అనేకచోట్ల యుద్ధాలను సాగిస్తూనే ఉన్నాడు. పోరాడి పోరాడి స్థావరములేక విప్లవ సైనికులు నేపాల్ చేరుకున్నారు. ఎన్నిసార్లు ఓటమి సంభవిస్తున్నా, తాను బ్రతికే ఉన్నానని ఇంగ్లీషు వారిని హెచ్చరిస్తూ, యుద్ధజ్వాలలను ఆరనివ్వలేదు. నానా కూడ, ఇంగ్లీషు వారికి చిక్కకుండా 60 వేల మంది విప్లవ సైనికులతో నేపాల్ చేరుకున్నాడు. నేపాల్ రాజైన జంగ్ బహదూర్ విప్లవకారులకు సహాయంచేయ నిరాకరించాడు. విప్లవ సైనికులకూ నేపాల్ రాజుకూ మధ్య అనేక రాయబారాలు జరిగాయి. చివరకు నేపాల్ రాజు, తన సహాయం విప్లవకారులకుండదని స్పష్టంగా చెప్పేశాడు. అంతటితో ఆగలేదు. విప్లవ వీరులను నేటాడేందుకు బ్రిటిషువారికెన్ని సదుపాయాలూ కలుగచేశాడు.

ఈవిధంగా విప్లవ వీరుల ఆశ లడియాసలయ్యాయి ఆయుధాలు దాచి, ప్రశాంతంగా ఇండ్లకు వెళ్ళిపోయారు. ఆ సమయంలో నానాసాహెబ్ తనను ద్రోహిగా ప్రకటించిన బ్రిటిషు కమాండర్ హోప్ గ్రాంటుకు ఈ విధంగా జాబు వ్రాశాడు :

“భారతదేశంలో ఇంగ్లీషువారు సాగించే అక్రమ పాలనను ఖండిస్తూ, “భారత దేశాన్ని ఆక్రమించుకునేందుకు నీకు హక్కేముంది? నన్ను ద్రోహిగ ప్రకటించేందుకు నీకు హక్కేమిటి? భారత దేశాన్ని పాలించేందుకు నీకు హక్కు ఎవరిచ్చారు? మా దేశంలో మేము దొంగలమా, ఫిరంగులైన మీరేమో దొరలా, ఎలా!

# కుమార్ సింగ్

ప్రథమ భారతస్వాతంత్ర్య పోరాటానికి సారథ్యం వహించిన అగ్రనాయకులలో రాణా కుమార్ సింగ్ ఒకరు. అతడు పిరికితనం మచ్చుకైనా దొరకని రాజపుత్ర వంశీయుడు. ఎన్ని కష్టాలొచ్చినా, ప్రతిజ్ఞను విడువక ఆమరణాంతం పోరాటాన్ని నడిపిన మేటియోధుడు. యుద్ధవ్యూహంలో అందెవేసినచేయి. అతని వయస్సు 80 ఏండ్లు. ఆ వయస్సులోనా మహాసామ్రాజ్యాధినేతలైన ఇంగ్లీషువారిని చీల్చిచెండాడింది? బీహార్ రాష్ట్రంలో జగదీశ్ పూర్ కు అతడు రాణా.

డల్హౌసీ రాజ్యాపహరణ పథకంలోనే మన కుమార్ రాజ్యంకూడ పోయింది. అంతేకాదు. ఇంగ్లీషువారి రెవిన్యూవిధానాన్ని అతడు సహించలేకపోయాడు. ఆనాటినుండి బ్రిటీషువారిపై కత్తిదూశాడు. సమయానికై నిరీక్షిస్తున్నాడు.

విప్లవానికి కుమార్ సింగ్ జీ. ఉచ్చులు పన్నుతున్నాడని పాట్నా కమీషనర్ టైలరు విన్నాడు. అతణ్ణి పరీక్షించేందుకు, టైలర్ తన ఆతిథ్యాన్ని అందుకోవలసిందిగా జాబు వ్రాస్తే దానికి జవాబుగా కుమార్ “మీ ఆతిథ్యానికి అనేక అభినందనాలు. నా ఆరోగ్యం ఏమీ బావుండడంలేదు. కొంచెం నయమైనవెంటనే వస్తాను” అని వ్రాశాడు.

దానాపూర సిపాయిలు కుమార్ జబ్బును నయం తెచ్చారు! అది 1857 జూలై 25. కుమార్ సింగ్ తమ నాయకునిగా ఉండవలసిందని కోరారు. అంగీకరించాడు. పాట్నాకు ఏనుగుపై ఆతిథ్యానికి వెళ్ళలేని కుమార్, నేడు స్వాతంత్ర్య పతాక నెగరవేసి, ఇంగ్లీషువారిపై కత్తిదూశాడు.

వెంటనే విప్లవ సైనికులు, షాహాబాద్ జిల్లాకు ముఖ్య పట్టణమైన అర్రాకువెళ్ళి, ప్రభుత్వ ఖజానాను దోచి ఇంగ్లీషు జైళ్ళను నాశనంచేసి, ఇంగ్లీషు జెండాలను పీకివేశారు. బ్రిటిషుసామ్రాజ్య రక్షణభారం యావత్తూ తమ భుజస్కంధాలపైననే ఉన్నట్లు సిక్కులు విప్లవసైన్యాలతో తలపడ్డారు. మూడు రోజుల పోరాటం. ఇంగ్లీషుసైన్యాలకమేందరు చనిపోయారు ఇంగ్లీషువా డొక్కడూ యుద్ధరంగంలో లేకుండా పలాయనమంత్రం పఠించారు.

ఈ పరాభవానికి జవాబు చెప్పాలనే కక్షతో మేజర్ ఐర్ వడిగా వస్తున్నాడు. కుమార్ సింగ్ ఎక్కడివాడు? బీబీగంజ్ అనే గ్రామంవద్ద మకాం పెట్టి, ఇంగ్లీషువారి అంతు కనుక్కుంటున్నాడు. ఇంగ్లీషు ఫిరంగులు నిరంతరంగా అగ్నిని కురిపిస్తున్నాయి అయినా లాభంలేకపోయింది. ఫిరంగులు సాధించలేక

విజయాన్ని, ఇంగ్లీషువారి బాయొనెట్లు సాధించాయి. తిరిగి అర్రా పట్టణం ఇంగ్లీషువారి చేతుల్లో పడింది.

అతడు వెంటనే జగదీశపూర్‌కు తిరోగమించాడు. జగదీశ్‌పూర్ వద్ద చెల్లాచెదరైన సైనికులను ప్రోవుచేసుకున్నాడు. ఇంగ్లీషు సైన్యాలను బహిరంగంగా యుద్ధంలో ఓడించడం అసాధ్యమని గ్రహించి, గెరిల్లా యుద్ధమే ఉత్తమ మార్గమని నిర్ణయించుకున్నాడు. ఐర్ సైన్యాలు, కుమార్‌జీ భవనాన్ని పట్టుకుని నాశనం చేశాయి. అయినా కుమార్‌జీనిగాని, అతని తమ్ముడు అమర్‌సింగ్‌నుగాని, రాణివాసపు స్త్రీలనుగాని పట్టుకోలేకపోయారు.

పశ్చిమబీహార్ అడవుల్లో మకాం పెట్టింది మన వృద్ధసింహం. కంగారులేదు. వ్యాఘ్రరాజు కదూ! అడవినంతా గాలిస్తోంది. కాని లక్నోను నాశనం చేయడానికి యింగ్లీషు, నేపాల్ సైన్యాలు పంపబడ్డాయని విన్నంతనే అడవినుండి కాలు బయటపెట్టి తూర్పువైపుగా అయోధ్యకు బయల్దేరాడు. 1858 మార్చి 18న, అత్రోలియావద్ద ఏవా విప్లవసైన్యాలీ వీరుణ్ణి కలిశాయి.

అత్రోలియావద్ద కుమార్‌సింగ్ సన్నాహాలు చేసుకొంటుండగా సమీపంలోని ఆజింఘుర్ కోటనుంచి రెండుమార్లు బ్రిటిష్ సేనలు ఆయనమీదికి దాడికి వచ్చేయి. సింగ్‌కు లేని ఆయుధబలం ఇంగ్లీషు సేనలకున్నా ఈ రెండుయుద్ధాలలోనూ కూడ బ్రిటిష్‌వాళ్ళు ఓడి పారిపోయారు. వారు విపరీతంగా నష్టపడ్డారు.

వృద్ధసింహాన్ని ఓడించేటందుకు గవర్నర్ జనరల్ కానింగ్ మార్క్ కెర్ అను సైన్యాధిపతిని పంపాడు.

మార్క్ కెర్ సైన్యాలు, కుమార్ సైన్యాలతో యుద్ధం సాగించినయ్. కుమార్ వద్ద ఫిరంగులే లేవాయె. అయినా కుమార్ నైపుణ్యం, ప్రతిభ వలన ఇంగ్లీషు ఏనుగుల దళం ఘీంకారాలు చేస్తూ, కాలికి బుద్ధిచెప్పినయ్. ఈ యుద్ధఘట్టాన్ని గురించి వ్రాస్తూ, మాలిసన్ ఈ విధంగా వెలిబుచ్చాడు. "కుమార్‌సింగ్ ఎత్తుగడలలో కంటే, వ్యూహనిర్మాణంలో మంచి దిట్ట. అతని యుద్ధతంత్రం చాల మెచ్చుకోదగింది."

పోరు సాగుతూనే ఉంది. తాను వెనుకంజ వేయాలన్న విషయం కుమార్‌కు తెలుసు. కాని అది శత్రువు పసికట్టగూడదు. తాను వెడుతున్న దే దిక్కుకో తెలియకుండా చేయాలి. వెంటబడి తరమకుండా చేయాలి. దానికోసం తన సేనను రెండుభాగాలు చేసాడు. ఒక భాగాన్ని ఇంగ్లీషు సేనలతో యుద్ధానికి వదిలాడు. మిగతా భాగం తీసుకొని బయలుదేరాడు.

ఆయన వ్యూహం మళ్లీ జగదీశపూర్‌ను పట్టుకోవడం. షాబాద్ జిల్లాను మళ్లీ విప్లవంలోకి ఈడవడమూను. అక్కడి ఇంగ్లీషు సేనలు తాను దూరంగా వున్నానని అజాగ్రత్తగా వున్నాయి. ఆ అవకాశం ఉపయోగించుకోవాలని కుమారసింగ్ ఆలోచన.

అయినా ఇంగ్లీషు సేనను ఆయన పూర్తిగా వదలించుకోలేకపోయాడు. దారిలో గంగానదిని దాటుతుండగా వెనకనుంచి ఇంగ్లీషు సేనలు అందుకొని కాల్పులు సాగించాయి. కుమార్ తన సేనలన్నీ ఆవలి వొడ్డు చేరేవరకూ నిలబడి ఆఖరు పడవలో బయలు దేరాడు. ఇంగ్లీషు సేనలు వచ్చేవరకిదింకా నది మధ్యలో వుంది. వారి కాల్పుల ఫలితంగా రాజా కుమార్‌సింగ్ చేయి గాయపడింది. వెంటనే ఆయన తన రెండోచేత కత్తి తీసికొని గాయపడిన చేతిని నరికేసి గంగార్పణం చేశాడు.

ఏప్రిల్ 22న తన స్వరాష్ట్రమైన జగదీశ్‌పూరు చేరాడు. లీగ్రాండు దీనిని మహాసామ్రాజ్య ప్రతిష్టకే అవమానంగా భావించి, కారాలు మిరియాలు నూరాడు. ఏప్రిల్ 23న, జగదీశ్‌పూర్‌పై దాడికి బయల్దేరాడు. కుమార్ వద్ద అప్పటికి మహా ఉంటే వేయిమంది సైన్యం మినహా, ఒక ఫిరంగికూడా లేదని ఇంగ్లీషువారంగీకరించిందే. అందులోనూ తీవ్రమైన గాయం. అంత విశ్రాంతి తీసుకుని, ఎంతో అంగబలమున్న లీగ్రాండ్ మరి కాలికి బుద్ధిచెప్పాడే! అయినా లీగ్రాండ్ బ్రతికి బయటపడ్డాడా? లేదు. అడవిలోపడి పారిపోతూంటే విప్లవసేనలు వెంటతరిమి, లీగ్రాండ్‌నీ, అతని అనుచరుల్నీ హతమొనర్చాయి.

ఈవిధంగా ఏప్రిల్ 23న అంతిమవిజయం సాధించాడు. ఇక మరల ప్రపంచరంగంపై ఆ మహావీరుడు మనకు కన్పించడు. స్వతంత్రుడుగా, తన రాజ్యంలో ప్రవేశించాడు. ఒక మందహాసంచేశాడు. తన ప్రాణాలను మ్రింగబోయే ఆ గాయపు మొసలిని చూచి ఏమీ చలించలేదు. స్వతంత్ర బావుటా క్రింద, ఆమరణాంతం తన ప్రతిజ్ఞను నిలబెట్టుకుని మాతృదాస్యవిమోచనా సమరంలో ప్రశాంతంగా 1858 ఏప్రిల్ 26న కన్నుమూశాడు

# అమర్ సింగ్

అమర్ సింగ్ రాజపుత్ర జాతికి చెందిన క్షత్రియ వీరుడు. కుమార్ సింగ్ సోదరుడైనందుకు ఆయన ప్రతిష్టను ఇనుమడింపజేశాడేగాని, లేశమైనా అపచారం తెచ్చిపెట్టలేదు.

కుమార్ 1858, ఏప్రిల్ 26 న వీరశయ్య నలంకరించడంతో, స్వాతంత్ర్య బావుటాను రక్షించేభారం అమర్ సింగ్‌పై పడింది. ప్రాణంతో సమానమైన సోదరుడు చనిపోయిన తర్వాత, నాలుగు రోజులైనా విశ్రాంతి తీసుకోకుండా, వెంటనే విప్లవ సైన్యాలకు నాయకత్వం వహించాడు. ఒక నిముషంకూడా వ్యర్థం కాకూడదన్నాడు.

మే 3 న అప్పుడే ఇంగ్లీషు సైన్యాలొచ్చిపడ్డాయి. పోరాటం బ్రహ్మాండంగా సాగిపోతోంది. అమర్ సింగ్ పరిస్థితులనుబట్టి ఎత్తుగడలను మార్చాడు. ఒకవేళ ఇంగ్లీషువారిదే పైచేయిగా ఉంటే, సైన్యాన్ని చిన్న చిన్న దళాలుగా విభజించి, అనేక దోవలపంపి, మరల అందరూ ఒకేచోట కలిసే పధకమును అమల్లో పెట్టేవాడు. అలాంటపుడు, ఈ విచిత్రమైన కనుపించని శత్రువుతో ఎల్లా పోరాడాలా అని డగ్లస్ నెత్తి పగులగొట్టుకుంటున్నాడు.

ఇంగ్లీషువారు అమర్‌తో చేసిన ప్రతి పోరాటంలోనూ విజయం దక్కుటట్లుండేది. కాని మరుక్షణమే అమర్ సింగ్ ఎంతో బలవంతుడై తెమను చావుదెబ్బ కొట్టేవాడు. ఒక అడివిలోనికి మన అమర్‌ను తరిమివేస్తే, మరో అడవిలోనుండి ఇంగ్లీషు సైన్యాలను చితగ్గొట్టేవాడు.

అనేక ప్రయత్నాలుచేసి అమర్ సింగ్ అర్రాపై దాడిచేశాడు. తిరిగి జగదీశ్ పూర్‌లో ప్రవేశించాడు. జూలై జరిగిపోయింది. ఆగస్టు, సెప్టెంబరులు గడచిపోయాయి. డగ్లస్ అతని 7000 వేల సైన్యం, అమరసింగ్ అంతు కనుక్కోవాలని ప్రయత్నం పాపం! చివరకు లంచాల ఆశకూడ ఇంగ్లీషువారు చూపారు. అమర్ సింగ్ తలను నరికి తెచ్చినవారికి బహుమానాలు ఇస్తామని ప్రకటించారు....ఎంత ప్రకటించినా ఇంగ్లీషు సైనికులు అమర్ చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకుంటూనే ఉన్నారు.

చివరకు ఇంగ్లీషు సైన్యాలు జగదీశ్ పూర్‌పై 7 వైపుల దాడిచేశారు. జగదీశ్ పూర్ త్రోవలన్నియు బంధింపబడ్డాయి. దానితో అమర్ బోనులో పడ్డాడు. దొరికాడని డగ్లస్ ఎంకలెగురవేశాడు. అక్టోబరు 17 న దాడి ప్రారంభమైంది. కాని వారికి బోను దొరికింది కాని, సింహం దొరకలేదు.

ఎన్నెన్నో యుద్ధాలు సాగుతున్నాయి. అమర్ ఎల్లా యుద్ధంచేస్తున్నాడో ఇంగ్లీషువారికి తెలియ లేదు. అతడేమైనా కొత్తసైన్యాన్ని సృష్టిస్తున్నాడా లేక ఘటోత్కచుడులా మాయాశక్తిని సృష్టిస్తున్నాడా? ఎంత రక్తపాతం! ఎంత రక్తపాతం అయినా సామ్రాజ్యవాదుల దాహం తీరడంలేదు.

అమర్! ఏమిటి నీకీ మొండితనం! ఏనుగుమీద ఎందుకున్నావు. చుట్టూ ఆయుధాలతో శత్రుసైనికులుంటే ఏమిటి నీ ధైర్యం? వీళ్ళందర్నీ తప్పించుకోగలవనే - ఏనుగు శత్రువులకు బందీగా దొరికింది. కాని మన అమర్ ఏడీ? ఏమో?

విప్లవసైనికులు ప్రతి అంగుళంకోసం తమ రక్తాన్ని ధారపోసి పోరాడుతున్నారు. ఇంగ్లీషువారితో, ఆ అడవుల్లో ప్రతిగుట్ట, మెట్ట, చెట్టూ, పుట్ట దెబ్బలాడుతూనే ఉన్నయి. ఎక్కడనుకున్నారు పోరాటం? చివరకు కైమూర్ కొండలవద్ద సాగుతోంది.

అయినా "లొంగిపోయాం" అన్న ముక్క విప్లవ సైనికులనోటినుండి రాదే?... మన అమర్ ప్రతి చోట ఉన్నాడు. ఆ దేశభక్త విప్లవదళంలో కుమార్, అమర్ సింగ్ జీల కుటుంబముల పట్టమహిషులు, ఇతర స్త్రీలు ఉన్నారు. వారూ పోరాటంలో పాల్గొంటూనే వున్నారు... ఒక్కొక్కరే నేలకొరిగారు. తమ రక్తాన్ని మాతృదాస్య విమోచనానికి ధారవోశారు. ఆ వీరమహిళలు శత్రుచేతుల్లో పడడాని కిష్టంలేక, ఆత్మహత్యలు చేసుకొని తమ మానాలను కాపాడుకున్నారు. ఆవిధంగా బీహారురాష్ట్రములో స్వాతంత్ర్య పోరాటం ముగిసింది... దేశభక్తులు దేశంకోసం వీరస్వర్గ మలంకరించారు.

మన అమర్ సింగ్ జీ మాటేమిటి? శత్రువుకు చిక్కలేదా?...లేదు... అయితే ఎక్కడకు వెళ్ళాడు?... ఏమో. ఆ కొండల్లో ఎక్కడున్నాడో, ఏమయ్యాడో? ఎలాంటి బిడ్డలను కన్నావమ్మా భారతమాతా! అట్టి దేశభక్తులను గని ధన్యజీవి వయ్యావమ్మా... అమర్, పేరుకు తగినట్లు నీవు అమరుడవే... నీకివే మా అభినందనలు.

# తాంతియా తోపే

ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం సృష్టించిన మేటి వీరుల్లో తాంత్యా ఒక ముఖ్యుడు. అనేక గెరిల్లా పోరాటాలు నడిపి, మహాఘటికులనుకున్న ఇంగ్లీషు జనరల్స్‌ను నేలగూల్చిన యోధాను యోధుడు.

తాంత్యా తోపే మహారాష్ట్రదేశస్థుడు. 1814 లో జన్మించాడు. తండ్రిపేరు పాండురంగభట్. పాండురంగభట్, చనిపోయిన పీష్వా బాజీరావు వద్ద ధర్మకార్యముల శాఖాధిపతిగా పనిచేసేవాడు. బ్రహ్మవర్తములో పుట్టి నానా, ఝాన్సీరాణీలతో పాటు పెరిగిన వాడే మన స్వాతంత్ర్య పోరాటయోధుడు. నానా, తాంత్యా లిద్దరూ చిన్నప్పటి నుండి ఆప్తమిత్రులు.

దేశంలో విప్లవసైన్యాలు విజృంభించినయ్. నానా, తనకు పెత్తనం వచ్చినప్పటినుండి, తాంతియాను తన వద్దనే ఉంచుకున్నాడు...అసలే స్వాతంత్ర్య పిపాస ఉగ్గుపాలతో అంకురించిన తాంతియా కూర్చోగలడా? ... అందులోనూ కథానాయకుడేమో ఆప్తమిత్రుడైన నానాసాహెబ్.

దర్బారులో తాంతియాను సర్వసైన్యాధిపతిగా నానాసాహెబ్ ప్రకటించాడు. అందరూ ఆశ్చర్యపోయారు. - అంతే, నానా అతనిమీద పెట్టుకున్న ఆశలను, అతణ్ణిగురించి కన్నకలలను సఫలంచేశాడు.

తాంత్యా, మహారాష్ట్రీల యుద్ధతంత్రమును, ఎత్తుగడలను కూలంకషంగా అధ్యయనంచేసి, వాటినే అనుసరించాడు. అతడు నిజంగా 'మిలిటరీ జీనియస్.' దెబ్బతిన్న విప్లవసైనికులను కూడగట్టాలి - అందులోనూ వారతనికి వ్యక్తిగతంగా సన్నిహితులూ గాదు, తెలిసిన వారూ గాదు. వారందర్నీ ఐక్యపరచేది స్వాతంత్ర్య పిపాసయే. నిస్పృహచెందిన సైన్యాన్ని, క్రమశిక్షణ లేని సైన్యాన్ని, శత్రువును హడలెత్తించే విధంగా, నిరంతరం చలనంలో ఉంచడం సామాన్యమా?

తాంతియా పేరు వినేప్పటికి, చెల్లాచెదరైన విప్లవ సైనికులకు ప్రాణాలు లేచివచ్చాయి. వెంటనే తాంతియా వెనుకవచ్చేవారు. అతని కిదొక పెద్దపని. కాన్పూర్ పతనమైంది; తాంతియా బ్రహ్మవర్తం చేరుకున్నాడు. - మళ్ళీ ఫతేపూర్‌లో నానాను కలుసుకున్నాడు. - మళ్ళీ గ్వాలియర్ వెళ్ళి ఒకసైన్యాన్ని పట్టుకొచ్చాడు - వాళ్ళను కాల్పివద్ద పెట్టాడు - ఇవన్నీ శత్రుసైన్యాలు తనను తరుముతూన్నపుడు చేసినవే - యమునానదిని దాటాడు - విండ్‌హామ్‌పై పడ్డాడు. కాన్పూర్ చుట్టుప్రక్కల గ్రామాలను వశపరచుకున్నాడు. 19 నవంబరునాటికి బ్రిటిషు సైన్యాలకు సరఫరా లందకుండా చేశాడు.

25 నవంబరున తాంతియా పాండునదికి చేరాడు. విండ్‌హాంకు శృంగభంగం తప్పలేదు. ఇక్కడే, 'మాలిసన్' అన్న యింగ్లీషు చరిత్రకారుడు, తాంతియాను గురించి తన అభిప్రాయం యిలా తెలియచేశాడు: "విప్లవసైనికుల నాయకుడు మూర్ఖుడు కాడు. విండ్‌హాం కొట్టిన దెబ్బ అతణ్ణి భయపెట్టడం పోయి, బ్రిటిషు నాయకుల బలహీనత బయటపడింది. నిజమైన సైనికనాయకుడుగా, అతడు శత్రువుయొక్క బలహీనతలనుండి లాభాన్ని పొందడానికి నిర్ణయించుకున్నాడు."

సగం కాన్పూర్ మరల తాంతియా చేతుల్లోపడింది.

ఝాన్సీ పడిపోతోందంటే, అక్కడికి వెళ్ళాడు. అక్కడ తన శాయశక్తులా పోరాడాడు. ఝాన్సీరాణీ పోరాడింది ... అయినా ఫలితం లేకపోయింది.... మళ్ళీ వెనక్కు తిరిగాడు. కాని ఎక్కడికో?... అతని జాడలు తెలుసుకోలేక బ్రిటిషువారుచస్తున్నారు.

కాల్పివద్ద పోరాటం సాగింది. కాల్పిన్నీ బ్రహ్మాండంగా ముట్టడివేశాడు. ఇది డిసెంబరు 1, 2 తేదీలలో. ఏమైనాసరే తాంతియాను పట్టుకోవాలని వేసిన పన్నాగం కాలిన్సుది. కాని తాంతియా దొరకలేదు. మళ్లీ మధ్యభారతం వెళ్లాడు. అక్కడ పోరాటం సాగించాలి...కాని ఇక నానా ఎక్కడో...తాంతియా ఎక్కడో?...ఒకరి కొకరికి సంబంధంలేదు.

రావుసాహెబ్ పీష్వా, తాంత్యాలు సారమధుర చేరారు. వారి ఉద్దేశమల్లా స్వాతంత్ర్యజ్యోతిని కాపాడుతూ, వీలుచిక్కినపుడల్లా శత్రువును దెబ్బతీయడం.

మన తాంత్యా నర్మదానదిని దాటాడు. అడవిలో మకాం పెట్టాడు. ఇంగ్లీషువేటగాళ్లు చుట్టూ వలయం పన్నారు...ఏమో, వలలో చిక్కుకుంటుందేమో?... అన్నిరోజులూ మనవాడివేనా? డిసెంబరు 11 న, ఉదయపూర్ నగరంపై తాంత్యాబెబ్బులి దాడిచేసిందా? ఈ వలయాన్ని దాటే?... ఎంతటి ధీమంతుడవయ్యా తాంతియా?

జనవరి 13, 1859 న రావుసాహెబ్, తాంత్యాలు, ఫిరోజ్ షా, మాన్‌సింగ్‌లను కలుసుకునేందుకు బయల్దేరారు. కలుసుకున్నారు. బయటకు వెళ్ళేందుకు దారి ఏదీ?... ఎటుచూసినా బ్రిటిషు తుపాకులే...

తాంతియానీపుపై ఇంగ్లీషువాని చేయిపడింది...ఏమిటీ, ఇంగ్లీషువానిచేయా ?...అనుకున్నంతపనీ జరిగింది... అరే తప్పించుకున్నాడూ! ఎంత సంతోషవార్త!

జనవరి 21 న తాంత్యా ఒకగుర్రాన్ని, రెండు పోనీలను, ఇద్దరు వంటవాళ్ళను తీసుకుని రావు సాహెబ్, ఫిరోజ్ షాల వద్ద సెలవుపుచ్చుకుని బయల్దే రాడు. రహస్యంగా వున్న మాన్ సింగ్ వద్దకు వచ్చాడు.

ఇంగ్లీషువారు అదివరకే మాన్ సింగ్ కు లంచం పెట్టారు. తనను క్షమించి, తన రాజ్యాన్ని తనకిప్పించడం, దానికి లంచంగా తాంత్యా బెబ్బులిని వారికి వప్పచెప్పడం-ఏమిటీ మాన్ సింగ్ ? నీచాతినీచమైన పనిచేస్తావా ?...నీవు ఇంతవరకు వీరుడిలా పోరాడిన వాడివేగా !

ఫిరోజ్ షా, తన కాంపుకు రావలసిందిగా కోర్తూ తనకు వ్రాసిన ఉత్తరాన్ని తాంత్యాచదివి వినిపించాడు మాన్ సింగ్ కు. "మరిక్కడ ఉండడమా, అక్కడకు వెళ్ళడమా?" అడిగాడు, నిర్మలహృదయుడు తాంత్యా-కొంచెం సేపు ఆగమన్నాడు మాన్ సింగ్. -తనను మోసం చేస్తాడని కలలోకూడ అనుకోలేదు తాంత్యా.



తాంతియా తోపే

మానసింగ్, తన మనిషినిచ్చి, తాంతియాను ఒకచోటకు పంపుతూ, తాను తిరిగివచ్చేవరకూ అక్కడ ఉండమన్నాడు. 'సరే' అన్నాడు తాంత్యా. - మాన్ సింగ్ మనిషితోకూడా ఆ స్థలంలో మూడురోజులున్నాడుతాంత్యా. - అర్ధరాత్రి - అంతా నిశ్శబ్దం - అలిసిన ప్రాణ మేమో, వళ్ళుమరిచి నిద్రపోతోంది బెబ్బులి.

వెంట్రుకవాసిలో ఎన్నోసార్లు శత్రువు కళ్ళల్లో దుమ్ముకొట్టి తప్పించుకున్న తాంత్యాను వంచనతో అర్ధరాత్రి బ్రిటిషువారు పట్టుకోగలిగారు. ఎంత పాడుపని చేశావ్ మాన్ సింగ్ ?...ఇంత ద్రోహమా ?

ఇది జరిగింది ఏప్రిల్ 7 న. ఏమీ తొణకలేదు, బెణకలేదు.

"నేను బ్రిటిషువారికి వ్యతిరేకంగా పోరాడానంటే, చావుకు సిద్ధంగావాలని నాకు తెలుసు. నాకేం కోర్టుఅక్కర్లేదు, విచారణ అక్కర్లేదు" అని తన రెండు చేతులను ఎత్తి "ఈ సంకెళ్ళనుండి, ఉరికంబం ద్వారా గాని, మరి ఫిరంగిద్వారా గాని నాకు విముక్తి కలుగుతుందని ఆశిస్తున్నా" నన్నాడు.

ఏప్రిల్ 18 న, విచారణతంతు ముగిసింది. ఉరిశిక్షచెప్పారు. తాంతియా కాళ్ళకు, చేతులకు ఉన్న సంకెళ్ళను బ్రద్దలుకొట్టారు. చిరునవ్వుతో తాంతియా ఉరికంబంవద్దకు వెళ్లి, తానే ఉరిత్రాడును తగిలించుకున్నాడు...వ్రేలాడుతోంది ఒక గొప్ప దేశభక్తుని శవం. దేశం కార్చిన కన్నీరు ప్రవాహాలై పారింది... తాంతియా, తాంతియా! అమరజీవివి...

ఒక యింగ్లీషు చరిత్రకారు డన్నట్లు, "తాంత్యా తోపే లాంటివారు అరడజనుమంది ఉండివుంటే, 1857 విప్లవయుద్ధం మరోవిధంగా ఉండేది."



# తెలుగు సిపాయీల తిరుగుబాట్లు

**1857** లో తెలుగు సిపాయిలు పెద్ద యెత్తున తిరుగుబాటు చేయక పోయినప్పటికీ, బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా 18, 19 శతాబ్దాలలో అక్కడక్కడ కొన్ని ఘర్షణలు జరిగాయి.

1780 లో

మైసూరు నవాబైన హైదరాలీ బ్రిటిష్ అధీనం క్రిందవున్న కర్ణాటక ప్రాంతాన్ని తన అధీనం క్రిందికి తెచ్చుకొని, ఈస్టిండియా కంపెనీకి గుండెలో బల్లెంగా తయారయాడు. 1780 లో హైదరాలీకి, బ్రిటిష్ వారికి మధ్య రెండవ మైసూరుయుద్ధం ప్రారంభమైంది. ఆ యుద్ధంలో బ్రిటిష్ సేనలకు సహాయం చేసేందుకు విశాఖపట్నం నుంచి కొంతమంది సిపాయిలను మద్రాసుకు పంపదలచుకున్నారు.

1780 అక్టోబరు 3 వ. తేదీన బ్రిటిష్ ఆఫీసర్లు 4 పటాలాలను సిద్ధంకమ్మని ఉత్తరువులు జారీచేశారు. ఓడ ప్రయాణానికి అన్ని యేర్పాట్లూ పూర్తిఅయాయి. బ్రిటిష్ ఆఫీసర్లకు వీడ్కోలు యివ్వడానికి గవర్నరు యింట్లో విందు ఏర్పాటు చేయబడింది. అక్కడ ఆఫీసర్లు విందారగిస్తున్న సమయంలో చేరింది పిడుగువంటివార్త. మద్రాసుకు ప్రయాణమై వెళ్ళవలసిందని ఆజ్ఞాపించబడ్డ సిపాయిలందరూ తిరుగబడ్డారు. హైదరాలీతో యుద్ధం చేయడానికి వారు నిరాకరించారు.

వెంటనే బ్రిటిష్ సైనికాధికార్లు విందు నుంచి సిపాయిలున్న చోటికి పరుగెత్తి వెళ్లారు. ప్రయాణానికి సిద్ధంకావలసిందని సిపాయిలను ఆజ్ఞాపించారు. కాని ఒక్కరూ అంగీకరించలేదు. అధికార్లు సిపాయిలను బలవంత పెట్టసాగారు. వెంటనే సిపాయిలు తుపాకులను ఎక్కుపెట్టి తమ అధికార్లమీద అగ్నివర్షం కురిపించారు. ప్రతియింగ్లీషు సైనికోద్యోగి తెలుగు సిపాయిల తుపాకి గుండ్లకు ఆహుతి అయాడు. సిపాయిలు బ్రిటిష్ గవర్నరు కాన్సెజరనీ, సివిల్ ఉద్యోగుల్నీ బందీలుగా పట్టుకున్నారు. గవర్నరు యింటిని కొల్లగొట్టుకున్నారు. ప్రభుత్వ ధనాన్నీ, యితర ఆస్తినీ దోచుకున్నారు. ఈ హడావిడిలో గవర్నరు తప్పించుకు పారిపోయాడు.

మరునాడు ఉదయం సిపాయిలు బ్రిటిష్ ఉద్యోగుల చేతులకు సంకెళ్ళు తగిలించి, వారందరినీ ఖైదీలుగా హైదరాలీకి వశపరచేందుకు వెంటపెట్టుకొని బయల్దేరారు.

అదివరకు పర్లాకిమిడి ఎస్టేటుకు జమీందారుగా ఉంటూ, బ్రిటిష్‌వారిచే తొలగింపబడ్డ గజపతిదేవ్‌కి యీ తిరుగుబాటుతో సంబంధం ఉందని చెప్పుకుంటారు. అక్కడికి సిపాయిలు యీ ఖైదీలను తీసుకువెళ్లారు.

తిరుగుబాటువార్త విన్న వెంటనే, గంజాం రెసిడెంటు ఆస్కాలోని కెప్టెన్ బ్రూస్‌కి తక్షణమే శ్రీకాకుళం బయల్దేరి వెళ్ళవలసిందనీ, అక్కడఉన్న సైనికుల్ని వెంటబెట్టుకొనితిరుగుబాటుదార్లను హతమార్చ వలసిందనీ ఆజ్ఞలు జారీచేశాడు. కాని తప్పించుకు పారిపోయిన గవర్నరు మిగతా సిపాయిల సహాయంతో తిరిగి అధికారం చేబట్టినట్లూ తిరుగుబాటుదార్లు విశాఖపట్నం నుంచి వెళ్లిపోయినట్లూవిని కెప్టెన్ బ్రూస్ తన ప్రయాణాన్ని విరమించుకున్నాడు.

తిరుగుబాటుదార్లు కొన్నిరోజుల తర్వాత ఇంగ్లీషువారు దాడిచేయ బోతున్నారని విని, నలు వైపులకూ చెదిరిపోయారు.

## 1797 లో

1797 లో విశాఖపట్నం జిల్లా వాసులతో కూడిన సిపాయిదళ మొకటి గుంటూరుజిల్లాలో బ్రిటిష్ ఆఫీసర్ల ఆజ్ఞలను ధిక్కరించింది.

గుంటూరుజిల్లాకు సైనికాధికారిగా నియమింపబడిన కర్నల్ రాబర్ట్సు 27 వ బెటాలియన్‌ని వాలాజాబాద్‌కు పంపించడానికి నిశ్చయించుకొని, ఆవిధంగా ఉత్తర్వులు జారీ చేశాడు. వారి సహాయంతో టిప్పుసుల్తాన్ అధీనం క్రింద ఉన్న శ్రీరంగపట్నాన్ని బ్రిటిష్ వారు వశపరచుకో దలచారు.

అసలు ఈ పటాలం 1786లో నెలకొల్ప బడింది. సిపాయిలను చేర్చుకొనేటప్పుడు అధికారులు రివెన్యూ విధులను మాత్రమే నిర్వర్తించవలసి యుంటుందని వారికి చెప్పారు. ఆ షరతు ప్రకారం సర్కారు జిల్లాలనుదాటి మరెక్కడికీ వారిని తీసుకెళ్ళ లేదు. 1780–82 మధ్య బ్రిటిషువారు తెలుగు సిపాయిలను దక్షిణాదికి పంపదలచుకొన్నప్పుడు కొందరు సిపాయిలు తిరుగబడ్డం, మరి కొందరు పారిపోవడం కూడా జరిగింది.

ఇట్టి పరిస్థితుల్లో కర్నల్ రాబర్ట్సు 27 వ పటాలాన్ని వాలాజాబాద్‌కి ప్రయాణం కమ్మని ఉత్తర్వులు జారీచేశాడు. వెంటనే సిపాయిలు ఉద్రిక్తులయి, తాము దక్షిణాదికి వెళ్లబోమని ఖచ్చితంగా తెలియజేశారు. తెల్లఉద్యోగులు యితర సిపాయిలచే బలవంతంగా వారిని లాక్కువెళ్లడానికి ప్రయత్నించారు. కాని ఆప్రయత్నం విఫలమైంది. తమ సోదరులమీద చెయ్యి చేసుకోడానికి యితర సిపాయిలు నిరాకరించారు. ప్రభుత్వం కొంత అదనపుభత్యం యిస్తామని వాగ్దానం చేయడంతో, వారు ప్రయాణానికి సన్నద్ధమయారు. కర్నల్ రాబర్ట్ యీ విధంగా సిపాయిలయెడ "మెతకతనం" చూపించినందుకు అతన్ని పై అధికారులు మందలించారు.

అప్పుడు జనరల్ బ్రిడ్జెస్ ఉత్తరసర్కార్ జిల్లాలకు సైనికాధికారిగా ఉండేవాడు. మద్రాసు ప్రభుత్వం అతన్ని 27 వ పటాలం వెంట వెళ్లమనిఆజ్ఞాపించింది. అతడు బందరు నుంచి కొంతమంది యూరపియన్ సోల్జర్సును, సిపాయిలను వెంటబెట్టుకొని బయల్దేరాడు. వారితోకలిసి ఒంగోలు చేరుకున్నాడు. 27 వ పటాలం కూడా అప్పటికి ఒంగోలు చేరుకొంది. వెంటనే బ్రిడ్జెస్ సిపాయిలపై కోర్టు మార్షల్ విచారణ ప్రారంభించాడు. దక్షిణాదికి ప్రయాణ మవడానికి నిరాకరించిన

## గోదావరిజిల్లాలో తిరుగుబాటు

**1857** ఆగస్టులో – అనగా ఢిల్లీనగరం సిపాయిల వశమైన మూడునెలల తర్వాత – గోదావరిజిల్లా ఎర్రగూడెం, తడిమెళ్ళ తాలూకాల ఉత్తరభాగంలో కొరటూరు గ్రామ మునసబు కోరుకొండ సుబ్బారెడ్డి నాయకత్వాన చిన్న తిరుగుబాటు జరిగింది. నానా సాహేబు విజయదుందుభులతో విప్లవసేనలను వెంట బెట్టుకొని వస్తున్నట్లు విని, సుబ్బారెడ్డి ఆ చుట్టుపక్కలున్న కోయప్రజల్ని సమీకరించాడు. అతని నాయకత్వంక్రింద కోయలు ప్రభుత్వంమీద తిరుగబడి పోలీసులతో సాయుధ పోరాటం ప్రారంభించారు. ప్రభుత్వం కోయలను అణచడానికి సైనికుల్ని పంపింది. ఉభయపక్షాలమధ్య 15 రోజులు గెరిల్లాయుద్ధం జరిగింది. సైనికులు మలేరియాకు తట్టుకోలేక చాలమంది మరణించారు. మిగిలినవారిని ప్రభుత్వం వెనక్కు రప్పించి, కొత్త సైనికుల్ని పంపింది. వారికీ కోయలకూ కొంతకాలం ఘర్షణలు జరిగాయి. చివరకు తిరుగుబాటు అణచివేయబడింది. సుబ్బారెడ్డినీ, మరి 7 గురినీ ప్రభుత్వం ఉరితీసింది.

సిపాయిల నాయకునికి మరణశిక్ష విధింపబడింది. అందరి సమక్షంలోనూ అతన్ని ఫిరంగిగుండుకు ఆహుతిచేశారు. మరికొందరికి యితరశిక్షలు విధింపబడ్డాయి.

## 1809 లో

ఆ తర్వాత బందరులో సిపాయిలు తిరుగుబాటు చేశారు. ఇది 1809 లో జరిగింది. ఆ రోజుల్లో బందరు ఒక ముఖ్యమైన రేవు పట్టణం. సికింద్రాబాద్, కాంప్టీలలో ఉన్న సిపాయిలకు దుస్తులు వగైరా సప్లై చేసే ప్రధాన కేంద్రంగాకూడ ఉండేది. అందుచేత బ్రిటిషువారు బంధరులో ఒక బ్రిటిషుడివిజన్‌నీ, కొంతమంది సిపాయిలనూ ఉంచారు. కాని వేసవిఎండలు ఇంగ్లీషుసైనికులకు దుర్భరంగా ఉండేవి. దీనికితోడు కలరా, జిగటవిరేచనాలు మొదలైన వ్యాధులకు తెల్లసిపాయిలు ఆహుతి అయేవారు. పరిస్థితు లిలా ఉండగా, 1809 లో మద్రాసులోని బ్రిటిషుసోల్జర్లు జీతభత్యాల సమస్యపై తమ అధికార్లమీద తిరుగబడ్డారు. ఆ వార్త బందరుకు చేరింది. వెంటనే బందరులో బ్రిటిషుసోల్జర్లు మద్రాసు సోల్జర్లకు సహాయంగా తిరుగుబాటుచేశారు. చాలాకాలంగా ఎన్నో యిబ్బందులకు లోనవుతున్న తెలుగుసిపాయిలుకూడ బ్రిటిషు సోల్జర్లతో చేతులు కలిపారు! ఈ సందర్భంలో లెఫ్టినెంట్ కర్నల్ విల్సన్ "మద్రాసు సైన్యంయొక్క చరిత్ర"లో యిలా వ్రాశాడు:

"కొంతమందికి ఆశ్చర్యంగా కనిపించినప్పటికీ, జరిగిన విషయ మేమంటే, ఇంగ్లీషు సోల్జర్లు పులికట్టమీదుగా సెంట్ థామస్ మౌంట్‌కు (మద్రాసు) ఒక తపాలా సర్వీసును నడిపారు. సిపాయిలు రన్నర్ల వేషం వేసుకొని మద్రాసుకు ఉత్తరాలను మోసుకు పోయేవారు."

సోల్జర్లు, సిపాయిలు బందరునుంచి మద్రాసువైపుగా కొన్నిమైళ్లు నడిచివెళ్ళారు. అక్కడ ప్రభుత్వంమీద తిరుగబడ్డ సోల్జర్లకు సహాయం చేయడమే వారి ఉద్దేశం.

ఈ వార్తను విన్న వెంటనే మద్రాసునుంచి సర్ జాన్ మాల్కమ్ ఓడమీద బయల్దేరి బందరు చేరుకున్నాడు. మొదట అతను సిపాయిలను డ్యూటీలో ప్రవేశించేటట్లు చేశాడు. తర్వాత సోల్జర్లలోను, సిపాయిలలోను ముఖ్యులయిన వారికి కఠినశిక్షలు విధించాడు.

## 1857 లో

బర్మానుంచి తిరిగివచ్చిన మొదటి పదాతిదళం విజయనగరం కంటోన్మెంట్‌లో ఉండగా, 1857 ఫిబ్రవరి 28 వ తేదీన బ్రిటిష్ అధికారులు వచ్చి, తక్షణమే కర్నూలుకు ప్రయాణం కట్టవలసిందనీ, తమ కుటుంబాలను వెంట తీసుకువెళ్లడానికి వీల్లేదనీ ఆజ్ఞాపించారు. సిపాయిలందరూ పెరేడ్ మైదానం మీద తాము యీ ఆజ్ఞను ఉల్లంఘించడానికి నిశ్చయించుకున్నట్లు తెలియజేశారు. బ్రిటిష్ ఆఫీసరు ఒత్తిడిచేయగా సిపాయిలు పెద్ద పెద్ద కేకలు, నినాదాలద్వారా తమ దృఢనిశ్చయాన్ని చాటారు. వారిని లొంగదీసుకోడానికి అప్పట్లో అధికారులవద్ద అదనపు బలాలు లేనందున, బ్రిటిష్ సైనికాధికారి ఎవరి కుటుంబాలను వారు వెంట తీసుకువెళ్లడాని కంగీకరించాడు. సిపాయిలు మార్చి 3 వ తేదీన తమ తమ కుటుంబాలతో కర్నూలుకు బయల్దేరారు.

తర్వాత వారు సికింద్రాబాదుకేగాని, కర్నూలుకు వెళ్లబోమని రైల్లో పట్టుపట్టగా, అధికారులు అందుకుకూడా అంగీకరించారు.



# కర్ణాటక ప్రాంతంలో సాయుధ ప్రతిఘటన

భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని గురించిన వార్తలు బళ్ళారి, ధార్వార్, రాయచూర్ జిల్లాలకు వ్యాపించడంతో ఆ ప్రాంతాల ప్రజలు ఆవేశపూరితులయారు. బ్రిటిష్ ప్రభుత్వం కంగారుపడి, అనుమానమున్న యిండ్లన్నిటినీ ఆయుధాలకోసం సోదాలు చేయించింది. ఈ చర్య సామాన్యుల్ని, సామంతుల్ని కూడ ఉద్రిక్తపరిచింది. ముందగ్గి భీమారావు అనునతని నాయకత్వాన తిరుగుబాటు జరిగింది.

భీమారావు ముంబగ్గి గ్రామానికి దేశముఖ్ గా ఉండేవాడు. కొంతికాలం బళ్ళారి, హార్పనహళ్లి తాలూకాలకు తహసీల్దారుగా పనిచేశాడు. అతనికి చాలా సొంతభూమి ఉండేది. ఆ ప్రాంతాల్లో యితడు గొప్పబలశాలి అని పేరు సంపాదించాడు. బళ్ళారి జిల్లాలోనే కాక, నైజాం పాలనక్రింద ఉన్న కొప్పాల్ ప్రాంతంలోకూడ అతనికెంతో పలుకుబడి ఉండేది. అతని భార్య జీవాబాయి పుట్టిల్లు కొప్పాల్ ప్రాంతంలోనిదే.

1858 మే మాసంలో భీమారావు నాయకత్వంక్రింద రైతులు ప్రభుత్వానికి రివెన్యూ చెల్లించడం మాని వేశారు. భీమారావు, హమ్మిగిదేశాయి కలిసి ధార్వార్ జిల్లాలో తిరుగుబాటుకు సన్నాహాలు ప్రారంభించారు. వీరి ప్రయత్నాలకు దంబాల్ దేశాయి, దామల్ దేశాయి, నార్గండ్ జమీందారుకూడా సహాయం చేశారు. నార్గండ్ జమీందారు బాబాసాహెబు నానాసాహెబుతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపేవాడు. భీమారావు హోస్పేట, కమలాపురం మొదలైన ప్రాంతాల్లో ప్రజల్ని సమీకరించాడు. నైజాంపాలన క్రిందఉన్న కొప్పాల్ జమీందారు కొడుకును తనతో సహకరించమని భీమారావు అడగ్గా, అతడు అంగీకరించాడు.

తిరుగుబాటు ఒకేరోజున—1858 మే 27 న —జరగాలని దేశాయిలంతా నిశ్చయించుకొన్నారు. నార్గండ్ జమీందారు తన బలగంతో ధార్వార్ ప్రాంతానికి వెళ్లి నావల్‌గండ్‌ని వశపర్చుకోవాలనీ, దంబల్ దేశాయి దంబల్, గడగ్ పట్టణాలపై దాడి చేయాలనీ, భీమారావు రాయచూర్ జిల్లాలోని కొప్పాల్ కోటను స్వాధీనం చేసుకోవాలనీ నిశ్చయించుకున్నారు.

కాని, తిరుగుబాటుకు 3 రోజులు ముందుగా (మే 24 న) ప్రభుత్వపోలీసులు ఆయుధాలకోసం హమ్మిగిదేశాయి ఇంటిమీద దాడిచేసి, ఎన్నో ఆయుధాలను వశపరచుకొన్నారు. ఈవిధంగా ఒకేరోజున తిరుగుబాటుచేయడానికి వేసుకున్న ప్లాను విఫలమయింది. వెంటనే భీమారావు ఎక్కడికక్కడ తిరుగుబాట్లు చేయవలసిందని పిలుపునిచ్చాడు.

తిరుగుబాటుదార్లలో ఒకభాగం భీమారావు నాయకత్వాన కొప్పాల్ కోటను వశపర్చుకొన్నారు. అక్కడ ప్రజలు భీమారావుకూ, అతని అనుచరులకూ, హృదయపూర్వకంగా స్వాగతమిచ్చారు. మొత్తం 400 మంది కొప్పాల్ కోటను వశపరచుకొని విజయపతాక మెగురవేశారు.

తిరుగుబాటును అణచేందుకు మే 30 వ తేదీన ధార్వార్, బళ్ళారి, రాయచూర్ జిల్లాలనుంచి బ్రిటిష్ సేనానులు సాయుధబలగాలను తీసుకొచ్చారు. 31 వ తేదీన భీమారావును లొంగిపోవలసిందని అంతిమ హెచ్చరికయిచ్చారు. అతడు నిరాకరించడంతో, కోట మీద అగ్నివర్షం కురిపించ నారంభించారు. జూన్ 1 వ తేదీని కోట పైముట్టడి ప్రారంభమైంది.

కొప్పాల్ దుర్గం చాల బలీయమైనది. దాన్ని స్వాధీనపరచుకొన్న తిరుగుబాటుదార్లవద్ద మామూలు తుపాకులేగాని, ఫిరంగులు లేవు. అయినా, వారు సాహసోపేతంగా పోరాడారు. శత్రుసేనలు ఫిరంగుల సహాయంతో కోటగోడను ఛేదించగలిగారు. తిరుగుబాటుదార్లలో 100 మంది వీరోచితంగా పోరాడుతూ ప్రాణాలర్పించారు. భీమారావు, అతని సహచరుడైన హమ్మిగిదేశాయి కోటగుమ్మంవద్ద పోరాడుతూ చనిపోయారు. 150 మంది ఖైదీలుగా పట్టుబడ్డారు. వారిలో 75 గురిని బ్రిటిష్ అధికారులు ఫిరంగి మూతులకు కట్టి పేల్చివేశారు.

ఇలాగే నార్గండ్ జమీందారు నడిపిన తిరుగుబాటు కూడా అణచివేయబడింది. పోరాటంలో పాల్గొన్న దేశాయిల భూములన్నిటినీ ప్రభుత్వం వశపరచుకొంది.



# మద్రాసు సిపాయీల తిరుగుబాటు

బ్రిటిష్‌వారిచే. నిరాయుధులోనర్చబడిన బెంగాల్ సిపాయిలు దఫాలు దఫాలుగా మద్రాసుకు రావడం, వారు బెంగాల్ పరిస్థితిని గురించి సైనికులకు, ప్రజలకు వార్తలందజేయడం సాగిస్తూ ఉండేవారు. తత్ఫలితంగా మద్రాసు యూరపియన్లలో భయాందోళనలు వ్యాపించాయి. ప్రభుత్వం ఒక బలమైన ఫిరంగిదళాన్ని మద్రాసుకు తీసుకొచ్చి, వలంటీర్ ఆశ్వికదళంతో సహా నగర వీధుల్లో కవాతు చేయించారు.

మద్రాసు ఆశ్వికదళంలో 8 వ రెజిమెంటు 1857 ఆగస్టు 18 వ తేదీన బెంగుళూరునుంచి మద్రాసుకు వస్తూంటే, మార్గమధ్యంలో - మద్రాసుకు 26 మైళ్ళదూరంలో శ్రీ పెరంబుత్తూరువద్ద - తిరుగబడింది. ఆ రెజిమెంటు మద్రాసు నుంచి కలకత్తాకు ఓడమీద ప్రయాణంకావాలి. కాని మధ్య యిలా తిరుగబడ్డంతో మద్రాసు ప్రభుత్వం హడలెత్తిపోయింది.

మద్రాసు సిపాయిలు 1837 కు పూర్వమిచ్చే జీతభత్యాలు యిస్తేనే కలకత్తాకు వెళ్తామనీ, లేకపోతే వెళ్లమనీ పట్టుపట్టారు. కొంతమంది ఆఫీసర్లు వెంటనే మద్రాసు ప్రభుత్వంతో సంప్రతించడానికి రైల్లో బయల్దేరి వెళ్ళారు. మద్రాసు ప్రభుత్వం గత్యంతరం లేక సిపాయిలకోర్కెను అంగీకరించింది. ఆ వార్తను అందజేయడానికి ఆఫీసర్లు శ్రీ పెరంబుత్తూరుకు తిరిగివచ్చారు. సిపాయిలు సంతోషంతో ప్రయాణం సాగించారు.

రైలు మద్రాసుకు 13 మైళ్ళలో ఉన్న పూనమల్లి చేరుకోగానే, తాము అసలు కలకత్తాకు వెళ్ళబోమనీ, "తమ సోదరులమీద యుద్ధం చెయ్య" మనీ అధికారులకు తెలియజేశారు.

పూనమల్లికి రెండు ఫిరంగులతో అప్పుడే వచ్చిన కొంతమంది సైనికుల సహాయంతో అధికారులు తిరుగుబాటుదార్లను నిరాయుధులోనర్చారు; ఆ రెజిమెంటును మొత్తంగా రద్దుచేశారు.

ఈ వార్త మద్రాసు చేరగానే, యూరపియన్ వలంటీర్లు డ్యూటీకి రప్పింపబడ్డారు. రాత్రింబగళ్లు రోడ్లమీద, వీధుల్లోను గస్తీ ప్రారంభించారు. ప్రభుత్వ కాంపౌండు ఫిరంగి దళాలతోను, భోజనశాల సైనికులతోను నిండిపోయింది. ట్రిప్లికేన్‌లో మహమ్మదీయులు నివసించేపేట కెదురుగా అధికార్లు ఫిరంగులను అమర్చారు. ఏ నిమిషాన తిరుగుబాటు జరుగుతుందోనని ప్రభుత్వం హడలిపోయింది. యూరపియన్లు కొన్ని రోజులు తమ ప్రాణాలను అరచేతపట్టుకొని గడిపారు.



# భారతప్రజల తిరుగుబాటుకు బ్రిటిష్ కార్మికుల అండ

జేమ్స్ బ్రైన్

[ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ శతవార్షికోత్సవ సందర్భంలో పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్ (ఢిల్లీ) వారు ప్రచురిస్తున్న స్మారక సంపుటిలో జేమ్స్ బ్రైన్ రచించిన వ్యాసభాగం.]

బ్రిటిష్ పాఠశాలల్లో చదువుకొనే బాల బాలికలకు 1857 లో జరిగిన తిరుగుబాటును గురించి పదేపదే నేర్పుతూన్న పాఠాలేమిటంటే: భారతీయులు వట్టి మూర్ఖులూ, అజ్ఞానులూను; వారిని బాగుచేసేందుకు బ్రిటిష్‌వారు చాల దూరదేశం వెళ్ళి, సామ్రాజ్యమనే పెద్దభారాన్ని మోస్తున్నారు. ఆవిధంగా తమ విధ్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తున్న స్త్రీ పురుషులమీద, బాల బాలికలమీద భారతీయులు అమానుషమైన చిత్రహింసలు జరిపారు. వారి ఘాతుక చర్యలను బ్రిటిష్ ప్రజలంతా ఒక్క గొంతుతో ఖండిస్తున్నారు.

కాని ఆ రోజుల్లో బ్రిటిష్‌ప్రజలు నిజంగా యేలా ఆలోచించేవారో తెలుసుకోడానికి జరిగిన పరిశోధనలు బహు స్వల్పం. నాటి విద్వత్ పరిశోధకులకు విస్తారమైన సాధనసంపత్తి ఉన్నప్పటికీ, వారీపనికి పూనుకోనేలేదు. చారిత్రకదృష్ట్యా దీనికి కొంత ప్రాముఖ్యత ఉంది. అయినప్పటికీ ఒక విషయం మాత్రం యిదివరకే స్పష్టం కావొచ్చింది. అదేమంటే, బ్రిటిష్ ప్రజాభిప్రాయంగా చిత్రింపబడేదంతా వాస్తవానికి విరుద్ధం...

ముఖ్యంగా, బ్రిటిష్ కార్మికవర్గం ఆ రోజుల్లో యెలా ఆలోచించేవారో క్లుప్తంగా పరిశీలించడానికి ప్రయత్నిస్తాను.

ఈ నాటి పెట్టుబడిదారీవర్గం యొక్క అభిప్రాయాలను తెలుసుకోడానికి కన్నో లిఖిత పూర్వకమైన ఆధారాలున్నాయి. గ్రామసీమల్లో క్రైస్తవ దేవాలయాలనుంచి, గ్రామకార్యాలయాలనుంచి వ్రాయబడిన లేఖలు, రాజకీయ ఘటనలను తెలియజేసే డైరీలు, పార్లమెంటు ఉపన్యాసాలు, సంపాదకీయాలు — యిలాంటి వెన్నో ఉన్నాయి. కాని, కార్మికవర్గం వివిధ దేశాల్లో సమావేశాలు జరుపుకొనేటప్పుడు సమకాలీన ఘటనలనుగురించి ఏమేమి చెప్పుకొనేవారో మన కింకా తెలియకపోవచ్చు. ఆ సమావేశాలను గురించిన వ్రాతపత్రాలు మనకు లభించడంలేదు. అవి బహుశా లేవేమోకూడా. అయితే స్థూలంగా మాత్రం కొన్ని అభిప్రాయాలు మనకు తెలుసు. పరిశోధనల వల్ల మరికొంత సమాచారం లభించవచ్చు.

1857 నాటికి ఛార్టిజం (బ్రిటన్‌లో వర్గపోరాట ప్రాతిపదికపై స్థాపింపబడిన అతివాద కార్మికోద్యమం -అను) బ్రిటిష్ వాణిజ్య విస్తరణయొక్క ప్రభావంవల్ల బలహీనపడింది. బ్రిటిష్ కార్మికవర్గంనుంచి ఉద్భవించిన సోషలిజం తాత్కాలికంగా మరుగునపడింది. 1885 లో ఎంగెల్స్ వ్రాసినట్లు "1848 నాటి ఫ్రెంచి విప్లవం బ్రిటిష్ మధ్యతరగతిని కాపాడింది. విజయపతాకా న్నెగురవేసిన ఫ్రెంచి కార్మికుల సోషలిస్టు ప్రకటనలు. చాలా. చిన్నదైన బ్రిటిష్ మధ్యతరగతిని హడలెత్తించాయి. అంతకంటే సంకుచితమైన, మొరటు స్వభావం గలిగిన ఇంగ్లీషు కార్మికోద్యమాన్ని చింద రవందరచేశాయి...ఛార్టిస్టు ఉద్యమం అంతరంగికంగా విచ్ఛిన్నమై, చివరకు 1848 ఏప్రిల్ 10 వ తేదీని రద్దు చేయబడింది. కార్మికవర్గంయొక్క ప్రత్యక్ష కార్యకలాపాలు మూలపడ్డాయి. పెట్టుబడిదారీవర్గం పైచేయి

సంపాదించింది." (ఎంగెల్స్: 'లండన్ కామన్ వీల్' పత్రిక: 1885, మార్చి 1). ఆతర్వాత 25 సంవత్సరాల వరకు ఇంగ్లండు "ప్రపంచ వర్క్-షాప్"గా ప్రసిద్ధి కెక్కింది. దాని ఆధిక్యత నెవ్వరూ కాదనలేక పోయారు. ఆకాలంలోనే భారతీయుల తిరుగుబాటు కూడా జరగడంవల్ల అది బ్రిటిష్ కార్మికవర్గంలో పెద్ద సంచలనమేమీ కలిగించలేకపోయింది. కొద్ది మాత్రపు సంచలనమైనా కలగడమే ఆశ్చర్యం.

## 'రైనాల్డ్స్ న్యూస్‌పేపర్'

'రైనాల్డ్స్ న్యూస్‌పేపరు' సోషలిస్టు ఉద్యమంతో సంబంధంలేని కార్మికవర్గ దృక్పథాన్ని ప్రతిబింబిస్తూ ఉండేది. ఆ పత్రిక తిరుగుబాటు యెడల సానుభూతి ప్రకటించింది. 1857 జూలై 5 వ తేదీని అది యిలా వ్రాసింది:

"ప్రపంచంలో న్యాయమనేది ఉంటే, బ్రిటిష్ప్రభుత్వమూ ఈస్టిండియా కంపెనీ చేసిన ఘోరదురంతాలకన్న ఎన్నోరెట్లు ప్రతిక్రియ జరక్కమానదు. అది అప్పుడే ప్రారంభమయిందికూడా... తిరుగబడ్డ పటాలాలు కొన్ని అత్యాచారాలు చేసినందుకు మనం తప్పక విచారిస్తాం. కాని, మనసానుభూతి ఎల్లప్పుడూ బలవంతులకు వ్యతిరేకంగా పోరాడే బలహీనులమీదనే ఉంటుంది; తమ్ము పీడించేవారికి వ్యతిరేకంగా పోరాడే భారతీయులమీదనే ఉంటుంది; హింసింపబడ్డ, దోచుకోబడ్డ, బంధింపబడ్డ, అవమానింపబడ్డ భారతీయులమీదనే ఉంటుంది; క్రూరులైన, దయావిహీనులైన, పశుతుల్యులైన, కపటత్వంతో నిండిన తమశత్రువుల సంకెళ్ళను ఛేదించుకొనిస్వాతంత్ర్యంసంపాదించుకోడానికి పాటుబడే అభాగ్యులమీదనే ఉంటుంది; ఏ తిరుగుబాటుదార్లనైతే బంధించి కాల్చివేయడం, ఉరితీయడం, చెట్ల కొమ్మలకు వ్రేలాడగట్టి చంపడం చేశారో—ఆ తిరుగుబాటుదార్లమీదే మన సానుభూతిఉంటుంది."

తిరుగుబాటుదార్ల 'అత్యాచారాల'ను గురించి అతిశయోక్తులతో జరిగే ప్రచారాన్ని ఖండిస్తూ ఆ పత్రిక యిలా వ్రాసింది:

"స్వదేశంలోఉన్న మనం పాక్షిక విషయాలను మాత్రమే వింటున్నాం.........ఆ అత్యాచారాలకు ప్రోద్బల మిచ్చిన దుగంతాలు చాల దారుణమైనవి." (1857, జూలై 26)

'రైనాల్డ్స్ న్యూస్ పేపర్' భారతదేశ ఘటనలకూ, స్వదేశంలో స్వాతంత్ర్య నిర్మూలనకూ గల సంబంధాన్ని వివరించింది. "పర్వదినంనాడు ప్రదర్శింపబడిన మూర్ఖత్వాన్ని" ఖండిస్తూ, ఆనాడు "జీతాలు పుచ్చుకొంటున్న మతాధిపతులు, పుచ్చుకోని మతాధిపతులు" అతి నీచంగా వ్యవహరించారని వ్రాసింది.

"ధర్మోపదేశాలు చేసినవారిలో అధిక సంఖ్యాకులు యుద్ధోన్మాదంతో, కసితీర్చుకోవాలని బోధించారు; రక్తంత్రాగాలన్నారు; ధనాన్ని దోచుకోవాలన్నారు; దయతో మెలగాలని ఒక్కరూ చెప్పలేదు."

అట్టి ఉపదేశాలిచ్చిన వారిలో "పరమ మూర్ఖుడు స్పర్జన్"ని ఆ పత్రిక ప్రత్యేకంగా పేర్కొంది. స్పర్జన్ నాన్ కన్ఫార్మిస్టుశాఖకు చెందిన క్రైస్తవ మతబోధకుడు. తన ప్రేక్షకుల్ని మందుచల్లినట్లు వశపరచుకోగల ప్రజ్ఞ అతని కుందని ప్రతీతి. ఆ వ్యక్తి క్రిస్టల్ ప్యాలస్‌లో 20,000 మంది సమక్షంలో భారతీయుల తిరుగుబాటును గురించి ఉపన్యసించాడు. సభకు వచ్చినవారంతా డబ్బు చెల్లించుకున్నవారే. అతని ఉపన్యాసాన్ని గురించి 'రైనాల్డ్స్ న్యూస్ పేపరు' యిలా వ్రాసింది:

"స్పర్జన్ రక్తాన్ని ప్రవహింపజేయాలని బోధించాడు; ప్రేక్షకుల ఉద్రేకాలను రెచ్చగొట్టేటందుకు వాస్తవవిషయాలను వక్రంగా చిత్రించాడు; చరిత్రను మరుగుపరిచాడు. భారతీయులు యిష్టపూర్వకంగానే తమ స్వాతంత్ర్యాన్ని ఇంగ్లీషువారికి సమర్పించారనీ, యిప్పుడు సిపాయిలు తిరుగబడ్డంవల్ల వారు పితూరీదార్లేగాని దేశభక్తులుకారనీ అతడు చెప్పాడు. నిజమే. వారు తమ స్వాతంత్ర్యాన్ని వదులుకున్నమాట నిజమే. బందిపోటుదొంగ దారినపోయే ప్రయాణీకు

నికి పిస్తోలు గురిపెట్టి కాల్చి చంపుతానని బెదిరించినప్పుడు ఆ ప్రయాణీకుడు తనవద్ద నున్న ధనాన్నంతటినీ దొంగకు వశపరిచేటట్లే భారతీయులుకూడా తమ స్వాతంత్ర్యాన్ని వశపరిచారు." ('రైనాల్డ్స్ న్యూస్ పేపర్'- 1857, అక్టోబరు 11).

ఈ విధంగా 'రైనాల్డ్స్ న్యూస్ పేపర్' రాజీలేని విధంగా తిరుగుబాటుదార్లపక్షాన నిలబడి పోరాడింది. కాని ఆ పత్రిక సామ్రాజ్యవాదమనే మహామారికి లొంగిపో నారంభించింది. బ్రిటిష్ పరిపాలనా విధానాన్ని సంస్కరించడంద్వారా భారతదేశాన్ని తమ పెత్తనంక్రింద ఉంచుకోవాలనే వారి వాదనను బలపరచ నారంభించింది. అక్టోబరు 11 వ తేదీ సంచికలో యిలా వ్రాసింది:

"భారతదేశం యెడల మన మింతవరకూ అనుసరిస్తున్న దోపిడీ విధానాన్ని, దురాక్రమణ విధానాన్ని మార్చుకొనకపోతే, భారతదేశ మిక మన చేతుల్లో సురక్షితంగా ఉండదు. ఇకమీదట మనం భారతీయులకు దయ, న్యాయం గ్యారంటీ చేయాలి. ప్రస్తుతం వారిలో ఉన్న నిస్పృహను, ద్వేషాన్ని నిర్మూలించాలి. ఇంగ్లీషు ప్రభుత్వం, స్వదేశస్తులు కలిసి భారతదేశాన్ని అదుపులో పెట్టుకోగలిగితే, బ్రిటిష్ వాణిజ్యానికి విశాలమైన రంగస్థలంగా అది ఉపయోగపడుతుంది. ప్రాచ్యఖండంలో మనకు బంగారం పండే ఒక ఉద్యానవనం ఉంది. దాన్ని అట్టేపెట్టుకోడానికి నేడు చిట్టచివరి అవకాశం లభించింది. దాన్ని బ్రిటిష్ ప్రజలు చక్కగా వినియోగించుకోవాలి. దుష్ట పరిపాలన, ఫ్యూడల్ ప్రభువులు చేసే నేరాలు జరక్కుండా చూస్తేనే, యీ చివరి అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగల్గుతాం."

## ఎర్నెస్ట్ జోన్స్ ఆందోళన

ఛార్టిస్టు ఉద్యమనాయకుడు ఎర్నెస్ట్ జోన్స్ చాల కాలం భారతదేశంపట్ల శ్రద్ధవహించాడు. 1853 లో అతడు భారతదేశాన్ని గురించి పత్రికల్లో అనేక వ్యాసాలు వ్రాశాడు ('పీపుల్స్ పేపర్': మే 7, 14, 21, 28; జూన్ 11, 18; జూలై 2—1853). 1851 లో జైల్లో నిర్బంధింపబడినప్పుడు అతడు "హిందుస్థాన్‌లో తిరుగుబాటు" రాగలదంటూ ఒక సుదీర్ఘమైన గేయం రచించాడు. తిరుగుబాటు నిజంగా ప్రారంభమైనప్పుడు ఆ గేయం పునర్ముద్రింపబడింది. దానికి వ్రాసిన తొలిపలుకులో "బ్రిటిష్ సామ్రాజ్యంమీద సూర్యుడు అస్తమించడు" అనే సామ్రాజ్యవాద నినాదాన్ని అతడిలా మార్చి వ్రాశాడు: "బ్రిటిష్ సామ్రాజ్యంలోని వలసదేశాలమీద సూర్యుడు అస్తమించడు; రక్తం ఇంకదు."

> ## హైద్రాబాద్‌లో రావుసాహెబ్ పీష్వా
>
> 1862 ప్రారంభంలో విప్లవ నాయకులలో ఒకడైన రావుసాహెబ్ పీష్వా నిర్మల్‌లో వెంకట్రావు అనే ఒక మక్తేదారువద్ద కొంతకాలం వున్నాడు. తర్వాత మార్చిలో హైద్రాబాద్ వచ్చి బేగంబజారులో మకాం పెట్టేడు. నిజాము సైన్యాలలో మూడువేలమందిపై అధికారి అమృతలాల్ అనే ఆయన సోదరుడు తులజారావ్, మరికొందరు మహాధనవంతులయిన గోసాయీలు ఆయనకు తోడ్పడ్డారు.
>
> రావుసాహెబ్ పీష్వా హైద్రాబాద్‌లో సాగించిన ప్రయత్నాలు బయటపడిపోయేయి. ఆయన తప్పించుకుపోయేడు. కాని ఆయనకు తోడ్పడ్డవారు చాల కఠినశిక్షలకు గురిఅయ్యేరు. వెంకట్రావు అనుభవిస్తున్న 40 గ్రామాలలో 39 లాగివేయబడ్డాయి.
>
> తర్వాత ఆ సంవత్సరమే రావుసాహెబ్ ఆగ్రా సమీపంలో పట్టుబడ్డాడు. కాన్పూరులో వురితీయబడ్డాడు.

ఆరోజుల్లో జోన్స్ ఛార్టిస్టు ఉద్యమంయొక్క పోరాట సాంప్రదాయాలను యించుమించు ఒంటరిగా ముందుకు తీసుకెళ్ళాడు. ఆ తర్వాత అతడుకూడా పోరాటంనుంచి విరమించుకొని పెట్టుబడిదారీ వర్గంతో రాజీ చేసుకున్నాడు. అతడు సాగించిన చిట్టచివరి పోరాటం— భారతప్రజల పక్షాన సాగించిన పోరాటం. అది అతని విప్లవ జీవితానికే తలమానికమని చెప్పవచ్చు.

జోన్స్ జూలై 4 వ తేదీన తన ఉద్యమం ప్రారంభించాడు. "న్యాయమార్గంద్వారా, సామరస్యపద్ధతి

వల్ల భారతప్రజల అంతిమపోరాటం వాయిదాపడి యుండేది" అని అతడు వ్రాశాడు. బ్రిటిష్ కార్మికుల్ని అతడీవిధంగా హెచ్చరించాడు.

"కష్టజీవులైన ఓ బ్రిటిష్ కార్మికులారా! మానవజాతి చరిత్రను ఎన్నడూ కలుషితమొనర్చనంతటి హేయమైన దురాక్రమణను పోషించడానికి మీరు మీ ధనప్రాణాలను ధారపోయవలసి వస్తుంది. అట్టి ఆజ్ఞలు మీకోసం ఎదురుచూస్తున్నాయి. ఇంగ్లీషు ప్రజలారా! హిందూస్థానీయులు నేడు మానవాళికే పవిత్రమైన ఆశయంకోసం పోరాడుతున్నారు. పోలిషుప్రజల, హంగరీ ప్రజల, ఇటలీప్రజల, ఐరిష్‌ప్రజల స్వాతంత్ర్యమెంత పవిత్రమైనదో భారతప్రజల స్వాతంత్ర్యంకూడా అంత పవిత్రమైనది...ఇంగ్లండ్ దేశీయులైన మీరందరూ ప్రపంచంలో పరమోత్కృష్టమైన ఒక మహోద్యమాన్ని అణచేటందుకు మీ ధన ప్రాణాలను ధారపోయవలసివస్తుంది. అలాంటిఆర్డర్లు జారీఅయి తీరుతాయి... సోదర దేశీయులారా! యితరుల స్వాతంత్ర్యాన్ని అణచడంకన్న—అంటే మీ పోరాటాన్ని మీరు అణచుకోడం కన్న — చేయవలసిన ఉత్కృష్టమైన పని మరొకటి ఉందని గమనించండి."

జూలై 11 వ తేదీని అతడు ఒక వ్యాసంలో పాలక వర్గంయొక్క భయాందోళనలు చూచి, భవిష్యత్తుపై విశ్వాసం ప్రకటించాడు. టైమ్సు పత్రిక యిలా వ్రాసింది: "ప్రస్తుతం స్టాక్ మార్కెటు ధరలు రోజూ పడిపోతున్నాయి. ఒకవైపు బ్యాంకులలో బంగారపు నిల్వలు రోజూ పెరుగుతూంటే, పంటలు విస్తారంగా పండే సూచనలు కనిపిస్తూంటే, స్టాక్ మార్కెట్ ధరలు యీ విధంగా పడిపోతూండడం అసాధారణమైన విషయం. భారతదేశంపట్లగల ఆందోళన మిగతా సమస్య లన్నిటినీ మరుగునపెట్టింది. రేపు-అంటే ఏదో ఒక పరిష్కారం కుదిరేలోగా - ఒక దుర్వార్త వచ్చిందా, పెద్ద గందరగోళం తప్పదు."

అయోధ్య రాణికి విక్టోరియారాణి చేసిన సన్మానాన్ని గురించి కూడా అతడు పేర్కొన్నాడు. (అయోధ్యను ఈస్టిండియా కంపెనీ స్వాధీనపరచుకోడం అక్రమమని వాదించడానికి అయోధ్యరాణి ఇంగ్లండుకు వెళ్ళి విక్టోరియారాణిని సందర్శించబోయింది — అను.) మొదట విక్టోరియారాణి ఆమెకు ఎందువల్ల దర్శనమీయలేదు? అయోధ్యరాణి చిన్న చిన్న రాణివాస మర్యాదలను ఉల్లంఘించిందనీ, అందుచేత విక్టోరియారాణి అంతరాత్మ పరితపించిందనీ అన్నారు. తర్వాత ఆమెకు దర్శనం లభించింది. ఇంగ్లీషు రాణి అంతరాత్మ తృప్తిపడింది. అసలు విషయమేమంటే, బందిపోటు దొంగలు అయోధ్యరాజ్యాన్ని అపహరించారు. వారి దేశానికి రాణి అయిన ఆమె సహజంగా అయోధ్యరాణిని చూడ నిరాకరించింది. కాని నేడు ఆ బందిపోటు దొంగలు భారతదేశం నుంచి తరిమివేయబడే సూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అందుచేత బ్రిటిష్‌రాణి కాలికి బలపంకట్టుకొని తిరుగుతూన్న అయోధ్యరాణి యెడల సౌమ్యంగా ప్రవర్తించవలసి వచ్చింది. ఆమెను తమ పనిముట్టుగా ఉపయోగించుకోవచ్చునని బందిపోటుదొంగలు ఆశించి యుండవచ్చు."

[1856 లో ఇంగ్లీషువాళ్ళు అయోధ్య నవాబు వాజిదాలీని కలకత్తాలో నిర్బంధించి రాజ్యం స్వాధీనం చేసుకొన్నారు. ఆయన ప్రథమభార్య భర్త తరఫున ఇంగ్లీషు రాణివద్దకు రాయబారం వెళ్ళింది. మరొక భార్య బేగం హజ్రత్ మహల్ విప్లవంలో నాయకత్వం వహించింది. — అను]

## 'రాజులతో సంఘర్షణ కాదు; ప్రజలతో యుద్ధం'

ఆగస్టు 1 వ తేదీ సంచికలో జోన్స్ యిలా వ్రాశాడు:

"మేము మొదటినుంచీ మా పాఠకులకు నొక్కి చెబుతున్న విధంగా యీ పోరాటం కేవలం సైనిక తిరుగుబాటుగానే ఉండక, జాతీయ సంగ్రామంగా రూపొందుతూంది."

దీనికి సన్నాహాలు బహు జాగ్రత్తగా జరిగినట్లు నిదర్శనలు కనిపిస్తున్నాయనికూడ అతడు వ్రాశాడు.

"ఇది కేవలం సంస్థానాధీశులతో జరిగే యుద్ధమా? కానేకాదు. ప్రజలతో జరిగే యుద్ధమే యిది. భారతదేశంలో ఈస్టిండియా కంపెనీవారు రాజులకూ,

రాజులకూ మధ్య అనేక యుద్ధాలను రెచ్చగొట్టారు. కాని ప్రస్తుత యుద్ధంలో పాల్గొంటున్నంతమంది ఏ యుద్ధంలోనూ పాల్గొని యుండలేదు."

ఆ వ్యాసంలోనే జోన్స్ బ్రిటిష్ పాలకవర్గాన్ని యిలా హెచ్చరించాడు :

"తిరుగుబాటుదార్లు తమలోతాము తగువు లాడుకోవచ్చు; దుర్బలులుగా ప్రవర్తించ వచ్చు. కాని ఒకటి మాత్రం వాస్తవం. ఈ తిరుగుబాటు ఓడిపోయినా జయించినా, భారతదేశం మాత్రం మనకు దక్కదు... మానసలహా ఒక్కటే : భారతజాతియొక్క స్వాతంత్ర్యాన్ని గుర్తించండి...నూరు సంవత్సరాల క్రిందట ఒక విదేశీముఠా, భూగోళం చుట్టూ తిరిగే వర్తకబృందం, లెడెన్‌హాల్ బందిపోట్లు కపటనాటక మాడి, యీ సామ్రాజ్య భూభాగంమీద దొంగతనంగా ప్రవేశించి, దాని అమూల్య ఆభరణమైన స్వాతంత్ర్యాన్ని అపహరించారు... ఆ 100 సంవత్సరాల పరిపాలనలో 100 కోట్ల సంవత్సరాల పాపాలు యిమిడి వున్నాయి."

తిరుగుబాటుదార్లు అత్యాచారాలు చేస్తే చేసి యుండవచ్చునని అతడంగీకరించాడు. అయితే, వాటికి దారితీసిన కారణాలనుకూడా అతడు నొక్కిచెప్పాడు. స్పానిష్ యుద్ధంలో బ్రిటిష్ సైనికుల పైశాచిక హత్యలను పాఠకుల దృష్టికి తెచ్చాడు. "టైమ్స్ పత్రిక వాటిని ఖండించిందా ? పల్లెత్తుమాటకూడా అనలేదు," అని వ్రాశాడు. భారతదేశంలో దుష్పరిపాలన కంతకూ బాధ్యత ఈస్టిండియా కంపెనీదని చెప్పి, తప్పంతా దానిమీదనే నెట్టడానికి జరిగే ప్రయత్నాన్ని ఖండిస్తూ అతడిలా వ్రాశాడు :

"ఈస్టిండియా కంపెనీని రద్దుచేసి, ఇంగ్లీషు ప్రభుత్వానికి పెత్తన మీయడమంటే అర్థం, ఒక బందిపోటు దొంగకు బదులు మరోవానిని తీసుకురావడ మన్నమాట."

టైమ్స్ పత్రిక సూచించిన ప్రతీకారచర్యలను ప్రస్తావించి, అతడిలా వ్రాశాడు : "క్రైస్తవ సిద్ధాంతాలకు, మానవ నాగరికతకు ఎంత చక్కటి నిదర్శనాలు ! ఇక యెవ్వరూ భారతీయుల క్రౌర్యాన్ని ప్రస్తావించకండి !"

## 200 మంది బ్రిటిష్ సైనికుల రాజీనామా

'పీపుల్స్ పేపర్'లోనే అదే సంచికలో, భారతీయుల తిరుగుబాటును గురించి బ్రిటిష్ కార్మికవర్గం యొక్క వైఖరిని తెలియజేసే చక్కని ఉదంతం వివరింపబడింది. "ఛాదామ్, రోచెస్టర్ నగరవీధుల్లో కదంతొక్కుతూ నడిచివెళ్తున్న 200 మంది సాధారణ సైనికులు, చిన్న ఉద్యోగులు ప్రజలదృష్టిని ఆకర్షించారు. వారంతా మంచి హుషారులో ఉన్నారు. భారతదేశంనుంచి అప్పుడే వారు తిరిగి వచ్చారు. అంతకుముందు వారు పదేండ్లవరకు సైనికులుగా ఉంటామని వ్రాసియిచ్చారు. ఆ గడువు యిప్పుడు పూర్తిఅయింది. అందుచేత తమ్ము వెంటనే డిస్చార్జి చేయవలసిందని అడిగారు. కాని అధికారులు వారిని డిస్చార్జి చేయలేదు. రెండేసిపౌనుల బోనస గ్రాట్యూటీ, కొత్త సామాను యిస్తామని ఆశ చూపారు. కాని లాభంలేకపోయింది. తామిక సైన్యంలో ఉండబోమని చెప్పేశారు."

ఆగస్టు 29 న జోన్స్ మరొకసారి పోరాట పరిస్థితిని సమీక్షిస్తూ వ్యాసం వ్రాశాడు. తిరుగుబాటు జయించితీరుతుందని అతడింకా అప్పటికి ఆశిస్తున్నాడు. "దురాశాలమీద, శాంతిభద్రతలమీద ఆధారపడే అతి కృత్రిమమైన బ్రిటిష సమాజంపై" యీ పోరాటం ఎట్టి ప్రభావాన్ని కలుగజేస్తుందో అతడు ఊహించుకో నారంభించాడు. ఇతర దేశాలు వాణిజ్యరంగంలో బ్రిటిష్ ఆధిక్యతను కూలద్రోయడానికి ప్రయత్నిస్తాయని వ్రాశాడు. అందుచేత అనివార్యంగా "ఆహారపదార్థాల ధరలు పెరుగుతాయి; కూలిరేట్లు పడిపోతాయి; ఉత్పత్తిదార్లలో దారిద్ర్యం పెరుగుతుంది," అని వ్యాఖ్యానించాడు.

సెప్టెంబరు 5 వ తేదీని జోన్స్ భారతీయుల తిరుగుబాటును ప్రశంసిస్తూ మరొకవ్యాసం వ్రాశాడు. ఆ పోరాటాన్ని యిలా వర్ణించాడు :

"ప్రపంచ చరిత్రలో అత్యంత న్యాయమైన, ఉదాత్తమైన, అవసరమైన తిరుగుబాట్లలో యిదొకటి...17 కోట్లమంది ప్రజలు ఇందులో పాల్గొనడం ఆశ్చర్య మేమీకాదు. ఆశ్చర్యమల్లా వారు ఓడిపోవడం (ఢిల్లీ పత

నాన్ని గురించి రచయిత పైవిధంగా (వ్రాసి యుంటాడు—అను.) సంస్థానాధీశులు వారికి ద్రోహం చేసియుండకపోతే, వారు ఓడిపోయే వారు కారు. ఈ సంస్థానాధీశులు ఒకరి రాజ్యాన్ని మరొకరు విదేశస్తులకు ధార పోశారు...ప్రపంచ చరిత్రలో అన్ని యుగాల లోను రాజులు, చక్రవర్తులు, భూస్వామ్య వ్యవస్థకు చెందిన తదితరులు యిలాగే చేశారు. వారికి ఆశ్రయమిచ్చిన ప్రతిదేశంలోను ద్రోహులుగానే వ్యవహరించారు...ఇంగ్లండ్ లోని కష్టజీవులంతా తమ హిందూసోదరుల పట్ల ('హిందూ' అంటే 'భారతీయ' అనే అర్థంలోనే రచయిత వ్రాశాడు — అను.) సానుభూతిని ప్రదర్శించాలి. వారిలక్ష్యమూ, మీలక్ష్యమూ ఒకటే. వారివిజయం పరోక్షంగా మీకూ—డా విజయమే."

సెప్టెంబరు 12 వ తేదీని అతడొక వ్యాసంలో, 1857 తిరుగుబాటువల్ల కలిగే ఫలితాలనుగురించి యిలా వ్రాశాడు :

"ఈ తిరుగుబాటును అణచేటందు కయ్యే ధనం బ్రిటిష్ కార్మికవర్గం నుంచి వసూలు చేయబడుతుంది. కాని దాన్ని ఖర్చుపెట్టే విషయంలో బ్రిటిష్ కార్మికుల ప్రయోజనాలను లెక్కలోకి తీసుకోరు; ఇండియాలో బ్రిటిష్ పాలనవల్ల మన కార్మికులకు కొంచెమైనా మేలుకలిగిందా ? లేదు. ఎవరు లాభం పొందారు ? ఫ్యూడల్ భూస్వాములు, నిరంకుశ పెత్తందార్లు, వర్తక ప్రముఖులు, పెట్టుబడిదార్లు. దోపిడీలు, దురంతాలు, అత్యాచారాలలో ఆరితేరిన యువక భూస్వామ్య కుటుంబీకులు లాభంపొందారు.

...ఇండియా ఇంగ్లండ్ వశమైన తర్వాత మన మాదేశాన్ని దారిద్ర్యంలో ముంచలేదా ? సర్వనాశన మొనర్చలేదా ? బిచ్చగాళ్ళ దేశంగా మార్చలేదా ? ఆ దేశంలో మనం స్నేహపూర్వకంగా, స్వతంత్ర హోదా యిచ్చి వర్తకం చేసియున్నట్లయితే, యీపాటికి ఆ దేశపు మార్కెట్టు ఎంతగా విస్తరించి యుండేది !"

ఆ వ్యాసంలోనే జోన్స్ చిత్రహింసల గాథలను ప్రస్తావించాడు. "చిత్రహింసలు చేసిం దెవరు ?" అనే శీర్షికతో అతడు అనేక చారిత్రక సత్యాలను వెలుతురులోకి తెచ్చాడు. మద్రాసు రాజధానిలో చిత్రహింసలను గురించి దర్యాప్తు చేసేటందుకు నియమింపబడ్డ ఉపసంఘం 1855 లో సమర్పించిన నివేదిక నుంచి కొన్ని ఉదంతాలను అతడు పాఠకుల దృష్టికి తెచ్చాడు.

సెప్టెంబరు 19 వ తేదీ వ్యాసంలో అతడు తన వైఖరి సరియైనది కాదన్న ఆరోపణకు జవాబు చెపుతూ, యిలా వ్రాశాడు :

"ప్రజాస్వామ్యం అంటే అందరికీ సమాన న్యాయం కలుగచేసేది. భగవంతుడు నిస్సందేహంగా న్యాయం, ధర్మం వైపు వుంటాడు. మానవుడుకూడా అలా ఉండితీరాలి. ఏ వ్యక్తీ 'నేను హాంగరీ తరఫున వుంటాను, ఇండియా తరఫున వుండను' అని చెప్ప కూడదు. అలా చెబితే, అతడు తన్ను తాను మోస పుచ్చుకుంటాడు; తాను నమ్మిన సిద్ధాంతానికి ద్రోహం చేసినవాడవుతాడు; సత్యాన్ని ఖూనీ చేసినవాడవుతాడు; పరువు, మర్యాదలకు స్వస్తిచెప్పినవాడవుతాడు. హిందువుల పక్షాన ('భారతీయులు' అని అర్థం – అను.) నిలబడ్డం 'ఇంగ్లీషు సాంప్రదాయాలకు విరుద్ధ' మనుకుంటే, నిరంకుశపాలన, క్రౌర్యం, దోపిడీ, దురాక్రమణల పక్షాన నిలబడ్డం కూడా 'ఇంగ్లీషు సాంప్రదాయాలకు విరుద్ధమే అవుతుంది'... అందుచేత, ఇంగ్లండ్ తన పద్ధతులను మార్చుకోవలసిన సమయం వచ్చింది. ఇంగ్లీషు ప్రజల యథార్థవాణిని ప్రపంచానికి వినిపించవలసియుంది. గొంతెత్తి 'ధర్మం ధర్మమే; సత్యం సత్యమే' అని చాటవలసియుంది.

"ధర్మం హిందువులపక్షాన ఉంది. అందుచేత వారికి విజయం తప్పక లభిస్తుంది. ఇంగ్లీషుప్రజలు ఆశయాల్లోను, చర్యలలోను న్యాయబుద్ధిగలవారు; అందుచేత వారు గొప్పవారు, శక్తివంతులూను."

అక్టోబరు 3 వ తేదీని 'పీపుల్స్ పేపర్'లో ఎర్నెస్ట్ జోన్స్ 'కాలం అందరినీ విచారిస్తుంది' అనే సంతకంతో ఒక వ్యాసం వ్రాశాడు. 1857 తిరుగుబాటులో నష్టపడిన బ్రిటిష్ కుటుంబాల సహాయార్థం వసూలు చేసే నిధిని గురించి వ్రాసిన ఆ వ్యాసంలో అతడిలా హెచ్చరించాడు :

"వాళ్ళకోసం బ్రిటిష్ కార్మికుడు ఒక్క ఫార్దింగు చందా యిచ్చినప్పటికీ మహా నేరం చేస్తున్నాడని గట్టిగా చెప్పదలచుకున్నాను. స్వార్థపరులైన పరమనీచులూ, దురాక్రమణదారులూ కలిసి స్థాపించిన ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో దారి దోపిళ్ళు - మోసాలు చేసి, నమ్మిన వాళ్ళందరినీ మోసం చేసింది. అట్టి పైశాచిక వ్యవస్థతో మీకు ప్రసక్తేమిటి ? ఇండియన్ బాండ్లు, ఇండియన్ షేర్లు గలిగిన ధనవంతుల్నే యిచ్చుకోమనండి చందాలు. భారతదేశాన్ని స్వాధీన మొనర్చుకొని, తెగ దోచుకొని లాభాలు సంపాదించిన ధనవంతుల్నే యిచ్చుకోమనండి."

క్రిమియన్ యుద్ధంలో (1858) నష్టపడిన కుటుంబాలపట్ల ప్రదర్శింపబడిన వైఖరికి ఈ ఇంగ్లో యిండియన్ కుటుంబాలపట్ల ప్రదర్శింపబడే వైఖరికీ గల వ్యత్యాసాన్ని ఎత్తిచూపుతూ, రాచరిక కుటుంబాల మీద వారి వివాహాల మీద చేయబడే విపరీతపు ఖర్చులను అతడు నిశితంగా ఖండించాడు. తన వ్యాసంలో అతడిలా వ్రాశాడు :

"ఈ రాజ వంశ కుల ఐశ్వర్యాన్ని ఒకసారి చూడండి. రెండో వైపున నిరుపేద కార్మికుల దారిద్ర్యం చూడండి. ఈ అభాగ్యులు గత్యంతరం లేక బాస్టైల్ బందిఖానాను పోలిన బిచ్చగాండ్ర శరణాలయాల్లో ప్రవేశిస్తే, భార్యాభర్తలు తలొక చోటికి పోవాలి; బాలబాలికలు మైళ్ళకొద్దీ దూరం నడిచివెళ్ళాలి. 'గంజి' అనే పేరుతో వారికిచ్చే నీళ్ళు మనుష్యుల కీయవలసిన ఆహారం కాదని సెంట్ పాన్ క్రాస్ శరణాలయం నుండి క్రిందటివారం వెలువడిన రిపోర్టులవల్ల స్పష్టమవుతోంది...అందువేత బ్రిటిష్ కార్మికులు రాజకీయ కార్యకలాపాలకోసం కొంతడబ్బు దాచుకోవాలి. మీ దేశం సంగతి ఆలోచించుకోండి. మీ ప్రయోజనాలను కాపాడుకోండి. అందుకై చందాలు చెల్లించండి. సంఘటితులు కండి".

అక్టోబరు 19 వ తేదీని నోన్స్ భారతీయుల 'చిత్రహింసలను' గురించి ఒక వ్యాసం వ్రాశాడు. ఆ వర్ణనలన్నీ "భయంకరమైన అతిశయోక్తులు" అని చెప్పాడు. "ఒకవేళ అవి నిజమని నిరూపింపబడినప్పటికీ, అది ఒక పాక్షిక దృశ్యం మాత్రమే"నన్నాడు. అమెరికన్ స్వాతంత్ర్య సంగ్రామంలో బ్రిటిషువారు చేసిన ఘాతుకచర్యల నొకసారి జ్ఞాపకం చేసుకోమన్నాడు. "అప్పుడు మనం రెడ్ఇండియన్లచేత చెయ్యరాని పనులెన్నో చేయించాం. బ్రిటిష్ క్యాంపుకు తెచ్చే ప్రతిపురుషుని పుర్రెకు, స్త్రీ పుర్రెకు, శిశువు పుర్రెకు కొంతధనం చెల్లించేవాళ్ళం. అవిశ్రాంతంగా రెడ్ఇండియన్లను వుపయోగించుకునేవాళ్ళం. అలా చంపబడ్డ అభాగ్యులు చిత్రహింసలవల్ల ఎట్టి బాధలు పడియుంటారో మనవాళ్ళకు బాగా తెలిసే వుండాలి. అవన్నీ అంధకారయుగంలో కాదు జరిగింది. మనందరికీ జ్ఞాపకమున్న రోజుల్లోనే జరిగాయి."

భారతదేశంలో బ్రిటిషువారు జరిపిన ఘాతుకాలను వర్ణిస్తూ అతడిలా వ్రాశాడు :

"మనుష్యుల్ని చంపడానికి వారు కనిపెట్టిన సరికొత్తపద్ధతి మానవజాతికే తలవొంపులు తెస్తుంది. కరుణాహృదయులైన ఆ క్రైస్తవ మహనీయులు మనుష్యుల్ని ఫిరంగి మూతులకు కట్టి సజీవంగా కాల్చి చంపేరు. అక్కడ నిలబడ్డవారిమీద ఆ కళేబరం రక్తాన్నీ, మాంసపు ముక్కలను, ప్రేగులను అభిషేకంచేస్తూంటే, అమితానంద మనుభవించేవారు. నీరో చక్రవర్తి సహితం అట్టి పనులు చేయలేకపోయాడు (నీరో చక్రవర్తి రోమ్ తగలబడుతూంటే ఫిడేలు వాయించుకొంటూ కూచున్నాడట. —అను.) మానవుడు భగవంతుని ప్రతిబింబమని క్రైస్తవ బోధకులు చెబుతూ ఉంటారు. అట్టి మానవుని శరీర మెలా తుత్తునియలు చేయబడేదో చూడండి !"

అక్టోబరు 31 వ తేదీన అతడు చిత్రహింసలను గురించి మళ్ళీ వ్రాశాడు. "తిరుగుబాటుదార్ల చి[illegible] [illegible] [illegible] అపగుణాల్లో [illegible] పడచాయి"ని తెలియజేశాడు.

## 'రక్తానికి జవాబు రక్తమే'

నవంబరు 14 వ తేదీన ఎర్నెస్ట్ జోన్స్ "హిందూ సిపాయిల వీరోచిత ప్రతిఘటనను" మరొకసారి కొనియాడాడు. నవంబరు 21 వ తేదీ పత్రికలో "రక్తానికి జవాబు రక్తమే; క్రౌర్యానికి మూలం క్రౌర్యం," అని వ్రాశాడు. డిసెంబరు 5 వ తేదీని "ఎప్పటికైనా హిందువుల లక్ష్యం నెరవేరకపోదు," అంటూ తన పాఠకుల్ని పుత్సాహపరిచాడు. కాని, బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని భారతీయులు విజయవంతంగా దెబ్బతీయగలరనే ఆశ అతనిలో క్షీణించ నారంభించింది. తిరుగుబాటును గురించి పూర్వమంత తరచుగా అతడు వ్యాసాలు వ్రాయలేదు. ఛార్టిస్టుల మహాసభకు సన్నాహాలు జరపడంలో అతడు నిమగ్నమవడం మరొక కారణం కావచ్చు. 1858 ఏప్రిల్ 3 వ తేదీని అతడు "ఇండియన్ దేశభక్తులకూ, విదేశీ దురాక్రమణ దారులకూ మధ్య అంతిమ పోరాటం" జరుగుతూన్నట్లు వర్ణించాడు. "మన హిందూ సోదరులు జయించితీరుతారు" అంటూ ఏప్రిల్ 10 వ తేదీని అతడు వ్రాసిన వాక్యం దూరభవిష్యత్తునుగురించి వ్రాసినదేగాని, తక్షణ భవిష్యత్తును గురించి కాదు. "భారతదేశం బ్రిటిష్ పాలనకు స్వస్తిచెప్పి సంపూర్ణమైన, నిర్నిబంధమైన స్వాతంత్ర్యం సంపాదించుకోడం ద్వారా తన గొప్పతనాన్ని చాటుకోగల్గుతుంది. ఇందుకు మరీ దీర్ఘకాలం పట్టదు" అన్నాడు. మే1 వ తేదీని, తిరుగుబాటు ఎలా పరిణమించినప్పటికీ "ఇండియా యిక ఇంగ్లండుకు దక్కదు," అని స్పష్టంచేశాడు. మే 8 వ తేదీని అతడిలా వ్రాశాడు:

"మనం భారతదేశాన్ని తిరిగి జయించాలంటే కత్తితోగాక సౌమ్యపద్ధతులద్వారా జయించాలి. ఆ దేశస్థులు మనకు సంబంధించినంతవరకు గతాన్ని జ్ఞాపకముంచుకుంటారు. వారిని వారి భూములనుంచి వేరు చేశామన్న విషయం మరచిపోరు. తరతరాలనుంచీ భూమిపై యాజమాన్యం గల ఒక జాతి తన భూమినంతటినీ యితరులు కాజేశారనీ, వారివద్దనే ఆ భూమిని కౌలుకు తీసుకోవలసిన గతి పట్టిందనీ వారు జ్ఞాపకముంచుకుంటారు; భరించశక్యం కానంతపన్ను తమ భూములమీద విధింపబడిందనీ, దాన్ని చెల్లించుకోడానికి తమవద్దనున్న వ్యవసాయ పరికరాలను తాకట్టు పెట్టవలసివచ్చిందనీ విత్తనాలకోసం వుంచుకున్న గింజలను సైతం అమ్ముకోవలసివచ్చిందనీ, బ్రిటిష్ ప్రభుత్వానికి పన్నులు చెల్లించేటందుకు బిచ్చమెత్తుకొని తిరగవలసివచ్చిందనీ—వారు జ్ఞాపకముంచుకుంటారు. అట్టి దారుణపరిస్థితుల్లో వ్యవసాయం చేయడం దుర్లభమైనప్పుడు తమ భూములను ఒదులుకోవలసి వచ్చిందనీ, తామెన్నడూ దున్నని భూమికికూడా పన్ను చెల్లించుకోవలసివచ్చిందనీ వారు జ్ఞాపకముంచుకుంటారు. స్నేహితులెవరివద్దా అప్పు దొరకక్కపోతే తామెలాంటి చిత్రహింసలకు గురిచేయబడ్డారో కూడ జ్ఞాపకముంచుకుంటారు.

"మండు టెండలో తలక్రిందులుగా వేళ్లాడదీయడం, జుట్టును చెట్లకుకట్టి క్రింద రాళ్లు కట్టడం, గోళ్లలో సన్నని కర్రముక్కలు కొట్టడం – వారికి జ్ఞాపకముంటుంది. తండ్రినీ, కొడుకునీ తాళ్లతో కలిపికట్టి యిద్దరినీ ఒకేసారి కొరడాలతో కొట్టడం (ఒకరి బాధకు మరొకరు వ్యధచెందేటట్లు), స్త్రీలనుకూడా కొరడాలతో కొట్టి, వారి రొమ్ములకు తేళ్లు కట్టడం, వారి కళ్లలో కారంకూరడం – యివన్నీ వారికి జ్ఞాపకం ఉంటాయి. ఇలాంటి చిత్రహింసలన్నీ ఆనాడు అమల్లో ఉన్నట్లు ప్రభుత్వ నివేదికలు, పార్లమెంటు రికార్డులే నిరూపిస్తున్నాయి."

జూన్ 12 వ తేదీని వ్రాసిన వ్యాసంలో బ్రిటన్ - భారతదేశాలమధ్య సంబంధాలు దుష్పరిపాలనవల్ల, క్రౌర్యంవల్ల, దోపిడీవల్ల చెడిపోయాయనీ, వాటిని తుపాకిగుండ్లతో తిరిగి నెలకొల్పడం సాధ్యంకాదనీ జోన్స్ వివరించాడు. జూన్ 19 వ తేదీని మరొకసారి "ప్రజలంతా మన కెదురు తిరిగారు" అని వ్రాశాడు.

తిరుగుబాటుయొక్క చివరి రోజుల్లో 'పీపుల్స్ పేపర్'కి ఆర్థిక యిబ్బందులు అధికమయాయి. 1858 జూన్‌లో ఆ పత్రిక మూసివేయబడింది. ఆ తర్వాత 'లండన్ న్యూస్' అనే పేరుతో మళ్ళీ వెలువడింది. అందులో కూడా జోన్స్ కొన్నాళ్లు వ్యాసాలు వ్రాసేవాడు. కాని ఆ పత్రిక కూడా నిరంతరం చిక్కుల్లోనే పడివుండేది. క్రమక్రమంగా దాని పోరాటదీక్ష సన్నగిలింది. చివరకు అది పూర్తిగా మూసివేయబడింది. అయితే, అందులో భారతీయుల తరఫున జోన్స్ వ్రాసిన వ్యాసాలు కొన్ని ప్రచురింపబడ్డాయి. 1858 ఆగస్టు 15 న అతని చిట్టచివరి వ్యాసం ప్రచు

రింపబడింది. ఇండియా బిల్లు ప్రకారం భారతదేశం ఈస్టిండియా కంపెనీ పెత్తనంనుంచి పార్లమెంటు అధీనం క్రిందికి రావడంతో యేర్పడ్డ నూతన పరిస్థితిని అతడా వ్యాసంలో పరిశీలించాడు. పూర్వం ప్రజాభిప్రాయానికీ, భారతదేశానికీ మధ్య ఈస్టిండియా కంపెనీ వుండేదని, కాని యిప్పుడా పరిస్థితిలేదనీ అతడు వ్రాశాడు.

"పూర్వపు పరిస్థితి యిప్పుడు మారిపోయింది; సూత్రప్రాయంగానే కాక ఆచరణలో సైతం మారిపోయింది. ప్రజాభిప్రాయాన్ని నిపుణతతోను, శక్తివంతంగాను వ్యక్తంచేయగలిగితే, పూర్వంకంటె యిప్పుడు భారతదేశ సమస్యపై బలమైన ప్రజాభిప్రాయాన్ని తప్పకుండా సృష్టించవచ్చు. కాని అలా జరిగే సూచనలేవైనా కనిపిస్తున్నాయా? బ్రిటిష్ ప్రజలు తమమీద గొప్పబాధ్యత పడిందనే విషయాన్ని గుర్తిస్తున్నారా?... కాబట్టి జాగ్రత్తగా పరిశీలనలు జరపడం, ఎల్లవేళల అప్రమత్తతతో ఉండడం అవసరం. మొట్టమొదట తీసుకోవలసిన చర్య ఏమంటే, భారతీయులపై విచక్షణా రహితంగా రక్తపాతంతో కూడిన క్రూరకృత్యాలు అమలు జరక్కుండా చూడాలి. అక్కడ నివసించే ఇంగ్లీషువారు పేద భారతీయుల నుంచి ఎంత పిండుకోగలరో అంతా పిండుకొంటున్నారు. దాన్ని మాన్పించాలి."

## జోన్స్ ఉపన్యాసాలు

ఎర్నెస్ట్ జోన్స్ వ్యాసాలు వ్రాయడంతోనే సంతృప్తిచెందలేదు. అనేక సభల్లో ఉపన్యాసాలు కూడ యిచ్చేవాడు. 1857 డిసెంబరులో అతడు సెంట్ మార్టిన్స్ హాలులో ఉపన్యసిస్తూ, తానెన్నడూ భారతదేశంలో అమలుజరుగుతూన్న పరిపాలనా విధానాన్ని ఆమోదించలేదని తెలియజేశాడు.

"ఆ పరిపాలన ఒక నాగరిక జాతి చరిత్రలో హీనాతిహీనమైన నేరం"గా పరిగణిస్తున్నానన్నాడు.

ఏప్రిల్ మాసంలో బర్మింగ్‌హాంలోను, కోపెన్‌హాగన్ మైదానంలోను (ఇప్పుడక్కడ స్మిత్‌ఫీల్డ్ మాంసం బజారు వుంది) కూడా అనేక బహిరంగ సభల్లో అతడు ఉపన్యసించాడు. అలాంటి సభల్లో ఒకదానికి హాజరైన డబ్ల్యు. ఇ. ఏడమ్స్ తన గ్రంథంలో యిలా వ్రాశాడు:

"అతని ఉపన్యాసం వినడానికి నేను లండన్ నగర వీధులలో అనేక మైళ్ళు నడచివెళ్లాను. భారతీయులు తిరుగుబాటు చేసిన రోజులవి. అతని గొంతులో పూర్వపు వుత్సాహం, ఆవేశం స్పష్టంగానే కనిపించాయి. కాని అతడు పీక్కుపోయిన మొగం, చిరిగిపోయిన బట్టలతో కనిపించాడు. దారిద్ర్యంవల్ల అతడెన్ని బాధలు పడ్డాడో కనిపిస్తూనే వుంది. అతని కోటు మాసిపోయి వుంది. మెడకు బొత్తాలు విరిగి వున్నాయి. ఫలించని ఒక లక్ష్యం కొరకు విపరీత పట్టుదలతో పోరాడిన ఫలితంగా దారిద్ర్యం అతన్ని ఓడించింది. అది కనపడకుండా చేసుకోడానికే అతడలా మెడకు బొత్తాలు బిగించుకున్నాడు" (డబ్ల్యు. ఇ. ఏడమ్స్: "నా స్మృతులు": రెండవ సంపుటం, పేజీ 230).

అతని లక్ష్యం ఫలించకుండా పోలేదు; తాత్కాలికంగా అది దెబ్బతింది. బ్రిటిష్ కార్మికులు చాలా కాలం తమ యజమానులతో జగడం పెట్టుకోకుండా కాలం వెళ్ళబుచ్చవలసిన గతిపట్టింది. పెట్టుబడిదారులు ప్రపంచంలో సగభాగాన్ని తమ పెత్తనం క్రింద తెచ్చుకొని, అనేక దేశాలను కొల్లగొట్టుకోవడం ద్వారా విపరీతమైన లాభాలను సంపాదించుకొన్నారు. అందులో కొంతభాగాన్ని ఎంగిలిమెతుకులుగా బ్రిటిష్ కార్మికులకు వేసేవారు. భారత ప్రజలు స్వాతంత్ర్యం సంపాదించుకోనేముందు దాదాపు 100 సంవత్సరాలు బ్రిటిష్ పాలనక్రింద గడపవలసి వచ్చింది

1857 పోరాటం యొక్క శతవార్షికోత్సవ సందర్భంలో బ్రిటిష్ కార్మికవర్గం [illegible] పోరాట కాలంలోను, ఓడిపోయినప్పుడు కూడా నాడు భారత ప్రజలకు అండగా నిలబడ్డారని జ్ఞాపకం చేసుకోవడం మంచిది.



# సామ్రాజ్యవ్యతిరేక పోరాటంలో చైనా ప్రజలకు 1857 విప్లవం చేసిన సహాయం

యూ పెంగ్-యు, చాంగ్ చెన్-కున్

[పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్ (న్యూ ఢిల్లీ) వారు ప్రకటిస్తున్న 1857 విప్లవ స్మారకసంపుటిలో వ్యాసానికి యిది అనువాదం.]

19వ శతాబ్ది మధ్యకాలంలో ఆసియాఖండములోని వివిధ దేశాలలో జాతీయ విముక్తి వుద్యమాలు ఒకదాని తర్వాత మరొకటి ప్రవాహళ్లా విజృంభించాయి. చైనాలో తైపింగ్ విప్లవం, రెండవ నల్లమందు యుద్ధం, ఇండియాలో ప్రజలవిప్లవాలు, పర్షియాలో బాబిస్టుల విప్లవాలు, ఆంగ్లో-పర్షియన్ యుద్ధం, సిరియా, లెబనాన్‌లలో రైతుపోరాటాలు, బోర్నియోలో వలసవ్యతిరేక ప్రజాపోరాటాలు— ఇవన్నీ అంధకారశక్తులను తుడిచిపెట్టిన మహోద్యమాలు. ఈ పెల్లుబుకుతున్న ప్రజాపోరాటాలలో విదేశీ దురాక్రమణకు, వొత్తిడికి వ్యతిరేకంగా చైనా, భారతదేశాల ప్రజలు సాగించిన పోరాటాలు విస్తృతమైనవి. ఈ పోరాటాలే తర్వాత ఆసియాదేశాల విముక్తి వుద్యమాలకు చాలా ప్రోత్సాహం కల్గించాయి. పెట్టుబడిదారీ దురాక్రమణపైన, భూస్వామ్యశక్తులపైన గట్టి దెబ్బతీశాయి. ఆసియాదేశాల జాతీయ విముక్తి వుద్యమాలలో ఇండియా, చైనా పోరాటాలు చాల ప్రధానమైనవి.

గత శతాబ్ది మధ్యకాలంలో ఆసియా దేశాలలోని విముక్తివుద్యమాలు పాశ్చాత్య పెట్టుబడిదారీ దురాక్రమణదారుల వలస విధానం ఫలితంగానే వుద్భవించాయి. పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలు అనేక కుతంత్రాలతో, దౌర్జన్యాలతో ఆసియా ప్రజలను బానిసలుగ చేసి దోపిడీ జరిపాయి. ఇవి అప్పటి ఆసియాదేశాల ఆర్థిక పునాదులను తారుమారుచేసి తమ క్రింద వలస, అర్ధవలస దేశాలుగ మార్చివేశాయి. వీటి ఫలితంగా ఆసియాదేశ ప్రజలు తమ హక్కులను గోల్పోవడమేగాక, క్షుద్బాధకు, దారిద్ర్యానికి గురైనారు. బానిసబంధ విముక్తికోసం విదేశదురాక్రమణదారులకు వ్యతిరేకంగా దృఢమైన పోరాటం సాగించడమే తమ లక్ష్యంగా ఆసియాప్రజలు ఎంచుకున్నారు.

ఆసియాలోని పాశ్చాత్య పెట్టుబడిదారీ దురాక్రమణ శక్తులు పెరిగినకొద్దీ వలస వ్యతిరేక పోరాటాలు సర్వసామాన్యమైనాయి. అంగారి బానిసత్వములో మ్రగ్గుతున్న ఆసియా ప్రజానీకానికి యీ పోరాటాలు గురుతర కర్తవ్యాలుగ పరిణమించాయి. ఈ పోరాటాలు ఒకేరకమైన ఆశయాలను, గమ్యాన్ని కలిగివుండటంవల్ల ఆసియా దేశాలన్నీ సన్నిహితమవడం, జాతీయ విముక్తి పోరాటాలు ఒకదానితో ఒకటి సన్నిహిత సంబంధాలను కల్గివుండటం జరిగింది. **1857-'59** మధ్యకాలంలో జరిగిన తిరుగుబాట్లనుగూరి చర్చిస్తూ మార్క్స్ తన అభిప్రాయాన్ని యీ విధంగా వెలిబుచ్చారు.

"దేశవ్యాపితంగా జరిగిన యీ జాతీయ విముక్తి పోరాటాలు ఇంగ్లీషు పెత్తనానికి వ్యతిరేకంగా ఆసియా ప్రజలు జరిపిన పోరాటాల్లో ఒకభాగమే. బెంగాలు సైనిక తిరుగుబాటుకూడా నిస్సందేహంగా పర్ష్యా, చైనా పోరాటాలతో ముడిపడి వున్నది."

ఆంగ్లో పర్షియన్ యుద్ధం బ్రిటిష్‌సైన్యాలకు పని కల్పించడంద్వారా భారతదేశంలో వెల్లుబికిన తిరుగుబాట్లకు అనుకూల పరిస్థితులను కల్పించింది. బ్రిటిష్-ఫ్రెంచి దురాక్రమణదారులకు వ్యతిరేకంగా చైనా ప్రజలు సాగించిన రెండవ నల్లమందు యుద్ధం, భారతదేశంలో వచ్చిన తిరుగుబాట్లు అవినాభావ సంబంధం కల్గి, శత్రువుల ఆటకట్టే శక్తిగా రూపొందాయి. జాతీయ విముక్తి పోరాటాలలో ఒకదేశపు జయాపజయాలు యితరదేశాల జాతీయవిముక్తి వుద్యమాలపై ఎక్కువగా ఆధారపడి వున్నాయి. ఆసియాప్రజలు గుర్తించినప్పటికీ యీ అవినాభావ సంబంధాలు ఆరోజుల్లో వున్నాయి.

## చైనాలో రెండవ నల్లమందు యుద్ధం : 1856 - '60

బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు 1856-60 మధ్య చైనాలో సాగించిన రెండవ నల్లమందు యుద్ధం, పాశ్చాత్య పెట్టుబడిదారీ దోపిడీవర్గాల ప్రాబల్యాన్ని విస్తృతం చేయడానికి సాగించినదే. దీనికి వ్యతిరేకంగా చైనా ప్రజల పోరాటం న్యాయసమ్మతమైన జాతీయ పోరాటంగా పరిణమించింది. ఈ యుద్ధం 1840 లో వచ్చిన మొదటి నల్లమందు యుద్ధంయొక్క శేషం మాత్రమే. కాని అప్పటి ప్రపంచ పరిస్థితులలో యీ రెండు యుద్ధాలకు స్పష్టమైన భేదం ఒకటి వుంది. మొదటి నల్లమందు యుద్ధకాలంలో చైనా ప్రజలు విదేశాల సహాయాన్ని ఏవిధంగాను పొందలేదు. కాని రెండవ నల్లమందు యుద్ధకాలంలోని క్లిష్టపరిస్థితులలో, 1857-59 వరకు బ్రిటిష్ వలస పెత్తనానికి వ్యతిరేకంగా వీరోచిత పోరాటాలను సాగిస్తున్న భారత ప్రజలు చైనా ప్రజలకు చేదోడువాదోడుగా వున్నారు. ఇప్పటివలెనే ఆనాడు ప్రత్యక్ష సంబంధాలు ఏర్పర్చుకోడానికి కొన్ని పరిమితులు కల్పించబడినప్పటికిని, ఒకే శత్రువును ఏకకాలంలో అణగద్రొక్కడానికై చైనా, భారత ప్రజలు సాగించిన పోరాటాలు ఒకదానిపై మరొకటి ప్రభావాన్ని కల్గివుండడమేగాక, ఒకదాని కొకటి తోడ్పడ్డాయి.

దొంగవ్యాపారం సాగించే ఓడలను రక్షిస్తున్న బ్రిటిష్ దురాక్రమణదారులు శాంతియుతంగా జీవిస్తున్న కాంటన్‌నగర ప్రజలనేకమందిని భయంకర చిత్రవధలకు గురిచేయడంతో రెండవ నల్లమందు యుద్ధం ప్రారంభమైంది. ఓడదొంగలు నాగరిక ప్రపంచమని చెప్పుకొంటూ ఫిరంగుల సహాయంతో కాంటన్ మీద విరుచుకుపడ్డారు. వారు 1856 అక్టోబరు 27 నుండి ఏకధాటిగా కాంటన్‌నగరంపై గుండ్లవర్షం కురిపించారు. వారి నావికాసైనికులు పట్టణంలో ప్రవేశించి మానభంగాలు, హత్యలు, గృహదహనాలు మొదలైన ఘోరకృత్యాలు చేశారు. ఈ భయంకర ప్రదర్శనాల మూలంగా చైనాప్రజలు భయకంపితులై లొంగిపోతారని దురాక్రమణదారు లూహించారు. కాని వారి ఊహలు భ్రమలైనాయి. దురాక్రమణదారుల దాడిని చైనాప్రజలు ధైర్యంగా ఎదుర్కొన్నారు. బలప్రదర్శనల నిమిత్తం, పెర్ల్‌నదిలో ప్రవేశించిన బ్రిటిష్ యుద్ధనౌకలు చైనాప్రజల తిరుగుదాడికి తట్టుకోనలేక కాంటన్ పరిసర ప్రాంతాలనుండి పలాయనం చిత్తగించాయి.

ఈ క్లిష్టపరిస్థితులనుండి బయటపడేందుకు యుద్ధాన్ని విస్తృతం చేసేందుకు, దెబ్బతిన్న దురాక్రమణదారులు భారతదేశాన్నుండి సైన్యాలను దింపాలని ఆలోచించారు. 1857 జనవరి 10 వ తేదీన చైనాలోని బ్రిటిష్ మంత్రి బౌరింగ్ హాంకాంగ్‌నుండి భారతదేశ గవర్నర్ జనరల్‌గా వున్న కానింగుకు ఒక అధికార పత్రాన్ని పంపాడు. దానిలో, [illegible] 5 వేల మంది సైనికులను ఆయుధసామగ్రితో చైనాలో వినియోగపడే నిమిత్తం వెంటనే పంపమని వ్రాశాడు. దూరప్రాచ్య సైనికాధికారి యం. సేమూర్ కూడా కానింగును యిదేవిధంగా కోరాడు. కాని దురాక్రమణదారులు తిరిగి పొరపాటు అంచనావేసుకున్నారు. 1857 లో భారతదేశం, చైనాకు వ్యతిరేకంగా బ్రిటిష్ దురాక్రమణదారులు సాగించే యుద్ధానికి ఎంతమాత్రం సదుపాయాలు కల్పించే [illegible] లేదు. [illegible] దేశంలో బ్రిటిష్‌వారి నిర్దాక్షిణ్యమైన వలస [illegible] క్రోధాన్ని రగుల్కొలిపింది. భారత ప్రజలు వారి [illegible] సత్వాన్ని, వలసపెత్తనాన్ని సహించే స్థితిలో లే[illegible]. బ్రిటిష్‌వారిచే సుశిక్షితులైన [illegible] సహితం బ్రిటిష్ వ్యతిరేకత వ్యాప్తిచెందింది. [illegible] వంతులైన భారతసిపాయిలు 1857 సంవత్సరంలో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగ అనేక చోట్ల తిరుగుబాట్లు లేవదీశారు. ఇవన్నీ [illegible]

నాందీవాచకాలు. అట్టి పరిస్థితులలో చైనాపై దాడి చేసేవారికన్నా భారతదేశంలో వున్నవారి పరిస్థితి ఎంతమాత్రం మెరుగ్గాలేదు. చైనామీద దాడిచేసే నిమిత్తం ఇండియానుండి సైన్యాలను తరలించడం పథకికల మాత్రమే. కానింగ్‌కు బౌరింగ్ చేసిన విజ్ఞప్తి సముద్రంలో రాయిని విసిరినట్లయింది. అది చిత్తుకాగితాల బుట్టపాలయింది.

## భారతీయుల సహాయం

ఈవిధంగా రెండవ నల్లమందు యుద్ధం ప్రారంభమైనప్పటినుండీ చైనాప్రజలు తమ భారతీయ సోదరుల నుండి సహాయాన్ని పొందుతున్నారు. దురాక్రమణకు వ్యతిరేకంగా, స్వాతంత్ర్యంకోసం వారు సాగించిన పోరాటాలలో ఒకరికొకరు సహాయం చేసుకుంటూ శత్రువు ఆటల నరికట్టారు.

బ్రిటిష్ ప్రభుత్వం 1857 మార్చిలో బ్రిటన్, మారిషస్‌లనుండి సైనికదళాలను పంపడానికి నిర్ణయించుకొంది. వలసపాలనలో ఘటికుడైన లార్డ్ ఎల్జిన్ చైనాకు ప్రత్యేక రాయబారిగను, యీ దళాలకు నాయకుడుగను నియమించబడ్డాడు. ఇతను తర్వాత భారతదేశ గవర్నర్ జనరల్‌గ కూడా చాలాకాలం పనిచేశాడు. వలసపెత్తందార్లకు చెప్పుదెబ్బలాగ భారతీయప్రజలు యీ కుట్రలను చాలావరకు భగ్నం చేశారు. బ్రిటిష్‌వారి అత్యవసర సైనికదళం తూర్పు వైపు బయలుదేరిన రోజుల్లోనే మే 10 వ తేదీన కాకలుతీరిన భారతప్రజలు బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా గొప్పవిప్లవాన్ని లేవదీశారు. వెంటనే ఢిల్లీని ఆక్రమించారు. వలసపెత్తనం కూలిపోయే పరిస్థితి ఏర్పడింది. కొద్దిరోజుల క్రితమే బౌరింగ్ కానింగ్ సహాయాన్ని కోరాడు. కాని యిప్పుడు కానింగ్ ఎల్జిన్ సహాయాన్ని కోరాల్సిన దీనస్థితి ఏర్పడింది. ఎల్జిన్ సింగపూరుమీదుగా చైనాకు బయలుదేరి వెళుతున్నప్పుడు భారతదేశంలో చెలరేగిన తిరుగుబాట్లను గూర్చి, భారతదేశంలో బ్రిటిష్‌వారి క్లిష్టపరిస్థితులను వివరిస్తూ వ్రాసిన కానింగ్ లేఖ ఎల్జిన్‌కు 1857 జూన్ 8 వ తేదీన అందినది. ఆ లేఖలో కానింగ్ యిలా వ్రాశాడు :

"గంగానది లోయలో కలకత్తా, ఆగ్రాల మధ్య నున్న 750 మైళ్ళ దూరంలోను వేయిమంది యూరోపియన్ సైనికులకన్న ఎక్కువ లేరు. అక్కడ ముఖ్యమైన కోటలు, ఖజానాలు, యూరోపియనులు నివసించే అనేక పేటలు, క్యాంపులు గలవు. ఇవన్నీ దేశీయ దళాలక్రింద వున్నాయి. ఈ ప్రదేశాలలో తిరుగుబాటు తలెత్తినచో భారత ప్రభుత్వం అణచే స్థితిలో లేదు. తిరుగుబాటుదార్లు అక్కడున్న ప్రతి వస్తువును తీసుకొని వెళతారు. వారు వాటిని ఏవిధంగా వుపయోగించుకొనేది మనకు తెలుసు. ఆ విప్లవాగ్ని కారుచిచ్చులా విస్తృతమై ఆప నలవికానిదిగా పరిణమిస్తుంది. ఢిల్లీ తిరుగుబాటుదార్ల చేతిలో వున్నంత కాలం ఎక్కడో ఒకచోట ప్రతిదినము తిరుగుబాటుకు అది ప్రోత్సాహమిస్తుంది. ఈ పరిస్థితి కష్టభరితమైనది. నేను చూపించిన కొన్ని ప్రదేశాలలోని దేశీయ దళాలు సునపై అసంతృప్తిని కల్గివున్నాయి."

ఈ పరిస్థితి నదుపులో పెట్టడానికి, బెంగాలులో కూలిపోతున్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి తక్షణం తన సైన్యాలను కలకత్తాకు తరలించాలని కానింగ్ ఎల్జిన్‌ను కోరాడు. చైనాలో తనబాధ్యతను నిర్వహించడానికి తహతహలాడుతున్న ఎల్జిన్ కానింగ్ కోర్కెను నిరాకరించ లేకపోయాడని గవర్నమెంటు పత్రాలలో రికార్డు చేయబడినది. ఈవిధంగా చైనాకు వెళుతున్న బ్రిటిష్ అత్యవసర బలగాన్ని వీరభారత ప్రజలు మధ్యలో ఆపివేశారు.

స్వాతంత్ర్యం కొరకు అచంచల విశ్వాసంతో భారతప్రజలు సాగిస్తున్న పోరాటం దురాక్రమణకు వ్యతిరేకంగా చైనాప్రజలు సాగిస్తున్న పోరాటంలో ఐక్యమైంది. 1857 ఏప్రిల్ 20 వ తేదీన బ్రిటీష్ విదేశాంగ కార్యదర్శి క్లారెండన్ అత్యవసర బలగంతో చైనా ప్రవేశించిన వెంటనే ఉత్తరదిక్కునకు నడిపి నంచూ ప్రభుత్వాన్ని బెదరించి, సంధిచేసుకొనమని ఎల్జిన్‌ను ఆజ్ఞాపించాడు. భారతదేశంలోని తిరుగుబాట్ల మూలంగా యీ దురాక్రమణ ప్రయత్నం సుమారు సంవత్సరంవరకు కార్యరూపం తీసుకోలేదు.

ఈవిధంగా భారతప్రజల తిరుగుబాట్లు చైనాపై దురాక్రమణ కుద్దేశించబడిన సైన్యాలను ఆపివేశాయి. అది ఒకటి.

## భారతీయులకు చైనాప్రజల చేయూత

రెండోవైపున దురాక్రమణకు వ్యతిరేకంగా చైనా ప్రజల పోరాటం భారతప్రజల పోరాటానికి చేయూత నిస్తూ శత్రుచర్యల నరికట్టుటకు తోడ్పడింది. భారతదేశంలో తిరుగుబాట్లు విజృంభించిన పిదప దూర ప్రాచ్యంలోని తన సైన్యాలను అన్నిటినీ అక్కడ కేంద్రీకరించి భారత ప్రజలు చైనా ప్రజలతో ఏకం కాకమునుపే అణగద్రొక్కాలని బ్రిటిష్‌వారు ప్రయ

త్నించారు. చైనా ప్రజలు సాగించిన రాజీలేని పోరాటం వారి కుట్రలను భగ్నపరిచింది. చైనాకు కేటాయించబడిన బ్రిటిష్ అత్యవసర బలగంలో కొంత భాగాన్ని ఎల్జిన్ భారతదేశం తరలించినప్పటికీ చైనా ప్రజలు అనేక బ్రిటిష్ నౌకా పదాతిదళాలను ఆపగల్గారు. దురాక్రమణదారుల రక్షణకై బ్రిటిష్‌వారు తమ సైన్యాలను చైనాలో వుంచవలసి వచ్చింది.

1857 జూన్‌లో భారత విప్లవజ్వాలలు మీరట్, ఢిల్లీలనుండి గంగానది లోయలోని అనేక ప్రాంతాలకు వ్యాపించాయి. కలకత్తాలోకూడా పరిస్థితి విషమించింది. బ్రిటిష్ పాలకులు భయకంపితులైనారు. హాంకాంగ్ చేరిన ఎల్జిన్‌ను ఎక్కువ సైనిక సహాయం పంపమని కానింగ్ అనేక పర్యాయాలు కోరాడు. క్లిష్టపరిస్థితిలోనున్న ఎల్జిన్ చైనానుండి ఒక్క సైనికుని కూడా పంపగలస్థితిలో లేడు. ఎల్జిన్ క్లారెండన్‌కి (1857 జూలై 29 న) యిలా రిపోర్టుచేశాడు :

"సాధ్యమైనంతవరకు లార్డు కానింగ్ విజ్ఞప్తిని పాటించే వుద్దేశ్యంతో నాకున్న అవకాశాలను పరిశీలించాను. హాంకాంగ్ వద్దర వుంచిన సైనికబలంలో ఏ కొంచమైనా భారతదేశానికి పంపడం వృధా ప్రయాస అని నేను అభిప్రాయపడ్డాను. ఆ యీ స్థావరాలదగ్గర వున్న మన ప్రజల రక్షణకోసమూ, కాంటన్‌లోనున్న వర్తకదారుల రక్షణకోసమూ మన నౌకాబలంమీద మేము ఆధారపడడంమూలంగా దానిని తగ్గించడం చాలా ప్రమాదం." ఈ పరిస్థితుల్లో ఎల్జిన్ కానింగ్‌కు నైతిక సహాయాన్నిస్తూ న్నానంటూ, ఒంటరిగా కలకత్తాకు పయనమైవెళ్లాడు! చైనానుండి అనేక దళాలు సహాయంగా వచ్చినపుడు ఎలాంటి ప్రభావం వుంటుందో అలాంటి ప్రభావాన్ని తన దర్శనం కల్గిస్తుందనీ, బ్రిటిష్ సైనికులు వుత్సాహపూరితులౌతారనీ అతడు వివరించాడు. ఐక్యంగా చైనా భారత ప్రజలు సాగించిన పోరాటాలు బ్రిటిష్ దురాక్రమణదారులను అతి క్లిష్టపరిస్థితుల్లో పడవేశాయి.

## చైనాప్రజల ఉత్సాహం

ధైర్యసాహసాలతో పోరాడుతున్న భారతసోదరుల యెడ చైనాప్రజలు గాఢాభిమానము కల్గివున్నారు. వారు సాధించిన ప్రతివిజయం చైనాప్రజలను త్తేజపరిచింది. వార్తాపత్రికలు లేకపోవడం వలన లిఖితపూర్వకమైన రికార్డులు కొన్నిమాత్రమే వుండడంవలన వానిలో చైనా ప్రజాభిప్రాయం కొద్దిభాగమే ప్రతిబింబించింది. చైనాప్రజలు భారతదేశంలోని తిరుగుబాటు యెడల ఎట్టి సృకృధాన్ని ప్రదర్శించారో ఆనాటి పాలకవర్గంయొక్క చెదురుచెదురు వ్రాతలలో సైతం స్పష్టంగా కనిపిస్తుంది.

"కాన్‌టన్ ప్రజలు బ్రిటీష్‌వారిని ద్వేషిస్తున్నారు. బ్రిటీష్‌వారి అధీనంలో నున్న భారతదేశంలో తిరుగుబాటు ప్రజ్వరిల్లిందని, బ్రిటిష్‌సైనికులు ఓడిపోయారని, అనేకమంది సైనికాధికారులు మరణించారని...' 'యె-మింగ్-షెన్‌ను పట్టుకోడం' అనే వ్యాసంలో హ్వ్యా-ఫు-చెంగ్ అను రాజకీయవేత్త వ్రాశాడు భారతదేశంలోని తిరుగుబాటును గురించిన వార్తలు క్వాంటుంగ్ రాష్ట్రంలోని ప్రజలకు ఏవిధంగా వ్యాపించాయో పైవాక్యం సూచనప్రాయంగా తెలుపుతుంది. 'విదేశీయులతో సంబంధాలు' అనే పుస్తకంలో క్వాంటుంగ్ రాష్ట్రంలోని నాన్‌హైజిల్లా మేజిస్ట్రేట్ భారత తిరుగుబాటు నేవిధంగా క్వాంటుంగ్ ప్రజలు ఆహ్వానించిందీ వివరించాడు.

"బ్రిటీష్‌వారు ఆర్థికదుస్థితికి గురైనారని, సైనికులకు సకాలంలో జీతం చెల్లించలేకపోవడమేగాక దినభత్యాలకుకూడా డబ్బులేక బాధపడుతున్నారనీ, ఆనాడు హాంకాంగ్ నుండి వచ్చినప్రజలు చెప్పారు. బ్రిటిష్‌వారు చైనాతో వ్యాపారం చేయాల్సిన అవసరం యెంతైనా వుందని వారు చెప్పారు. బ్రిటీష్ ఆధీనంలో వున్న బెంగాలులో తిరుగుబాటు విజృంభించిందనీ, బ్రిటీష్‌దళాలు ఓడిపోయాయనీ కొందరు చెప్పారు. ఒకటి రెండు నెలలు గడిచిన తర్వాత బ్రిటీషుసైన్యాలు ఒక వ్యూహంలో చిక్కుకొన్నాయని, సమూలంగా నాశనం చేయబడ్డాయని వదంతులు వ్యాపించాయి. ఒకసైన్యాధిపతి హతమార్చబడ్డాడనీ, అతను గాయపడి అల్లుడనీ వదంతి బయలుదేరింది. మిగతా సైన్యాధిపతులు ఏమిచేయవలెనో తోచక ఆందోళనచెందారు. ఈ వార్తలు ప్రతివారినోట ప్రతిధ్వనించాయి. వారి పరిస్థితులను గురించి నవన్నరు జనవలు యె-మింగ్-షెన్‌ను అడిగినపుడు తనకూ అలాంటి వార్తలే అందాయని చెప్పారు. హాంకాంగ్‌లోని వ్యాపారస్తుల లేఖలలో యీ విషయాలే వుల్లేఖించబడ్డాయి. ప్రజలు ఆనందపరవశు లయ్యారు".

భారతదేశంలోని ఘటనల వివరణ సమగ్రమైనది కాకపోయినప్పటికీ భారతదేశంలోని తిరుగుబాటు యెడల క్వాంటుంగు ప్రజల ఆత్రతను, భారతీయులు విజయాన్ని పొందాలనే వారి ఆకాంక్షను తెలుపు చేస్తున్నది. ఆనాడు దురాక్రమణకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో క్వాంటుంగ్ రాష్ట్రం అగ్ర

శ్రేణిలో వున్నది. అది భారతదేశానికి సమీపంలో కూడా వున్నది. హాంకాంగ్ దాని పరిసరప్రాంతంలోనే వున్నది. కాబట్టి క్వాంటంగ్ ప్రజలు భారతదేశంలోని ఘటనలనుగురించి మొట్టమొదటగా తెలుసుకొనుట, తదనుగుణ్యంగా ప్రవర్తించుట సహజం.

## క్వాంటంగ్ గవర్నరు నివేదిక

భారతదేశంలోని తిరుగుబాట్లను శ్రద్ధతో పరిశీలించింది సామాన్య చైనా ప్రజలే కాదు. క్వాంటంగ్, క్వాంగ్ సీ రాష్ట్రాల గవర్నరు జనరలూ బ్రిటిష్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా సాగిన యుద్ధంలో సైన్యాధిపతియూ నైన యె-మింగ్-షెన్ భారతప్రజల పోరాటాలను కడు జాగ్రత్తగా పరిశీలించేవాడు. చక్రవర్తికి పంపిన నివేదికలో అతడు భారతదేశములోని తిరుగుబాట్లనుగూర్చి పదేపదే చెప్పాడు. "విదేశీయుల పరిస్థితి మెరుగు కాలేదనీ", "బ్రిటిషు దురాక్రమణదారులు సైన్యాలను పంపలేకపోవడాని కిది ముఖ్యకారణ"మని తన నివేదిక చివరిభాగంలో వివరించాడు. సింకియాంగ్‌లోని రష్యా దౌత్యరాయబారి సలహామీద 1859 సంవత్సరం ఉత్తరార్థభాగంలో యిలీ (సింకియాంగ్) టార్టారిస్ న్యాయాధిపతి బెలఫెంటూ, మాండరిన్ పఫూలీ అనువారు బ్రిటిషువారికి వ్యతిరేకంగా ఒప్పందం కుదుర్చుకొని శత్రువుమీద విజయాన్ని సాధించేందుకు భారతదేశానికొక రాయబారవర్గాన్ని పంపాలని సూచించారు. రష్యా దౌత్యరాయబారి సలహాను ప్రస్తావిస్తూ చక్రవర్తికొక నివేదికను సమర్పించారు. అందులో యిలా వ్రాశారు :

"బ్రిటిషు, ఫ్రెంచివారలు తమ సైన్యాలను పునర్నిర్మించుకొంటున్నారు. పగ సాధించే నిమిత్తం రాబోయే సంవత్సరం ఫిబ్రవరి మార్చి నెలలలో టీన్‌ట్సిన్ మీద సమిష్టిదాడి చేయుడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఇట్టి పరిస్థితుల్లో వారిఎత్తుకు ప్రతిఎత్తు వేయడం అత్యున్నతమైన విధానం. బ్రిటిషు ఆధీనంలోవున్న ప్రాంతాలలో భారతదేశం చాలా ఉపయోగకరమైనది. అచ్చట బ్రిటిషు సైన్యాలు తిష్టవేసుకొని వున్నప్పటికీ ప్రజలు బ్రిటిషువారిని తీవ్రంగా ద్వేషిస్తున్నారు. తిరుగుబాటుకు తగు సన్నాహాలు చేస్తున్నారు. అచ్చట మనకు మంచి అవకాశం వుంది... ఒక సమర్థుని రహస్యంగా భారతదేశం పంపి బ్రిషుటివారికి వ్యతిరేకంగా దేశంలో అశాంతిని రెచ్చగొడతామని భారతీయుల వద్ద హామీతీసుకొంటే బ్రిటిషువారు వారి దాడికి తట్టుకోలేరు......దేశంలో అశాంతి విజృంభిస్తుందని భయపడతారు. ఆవిధంగా చైనామీద యుద్ధప్రమాదాన్ని తొలగించవచ్చు".

రష్యా దౌత్యరాయబారి చెప్పినది వాస్తవమని, ఆచరణయోగ్యమని మరొక నివేదికలో బెలఫెంటూ, పఫూలీలు నొక్కిచెప్పారు. ఆ సలహాను పాటించవలసిందిగా చక్రవర్తిని కోరారు. వ్యవధిలేని మూలంగా ఆ సలహాను ఆచరించడం అసాధ్యమైనప్పటికీ, దురాక్రమణకు వ్యతిరేకంగా భారతదేశంతో మైత్రి కుదుర్చుకోవాలనే భావం చైనాలో నూరు సంవత్సరాలక్రితం వుంది.

బ్రిటిషు వలసదారులు భారత ప్రజల తిరుగుబాటులను నిర్దాక్షిణ్యంగా అణచివేసినప్పటికీ, రెండవ నల్లమందు యుద్ధంలో చైనా ఓడిపోయినప్పటికీ, యీ రెండుదేశాల జాతీయ విముక్తి వుద్యమాలు నిరాటంకంగా కొనసాగుతూనే వచ్చాయి. ఇదే తరుణంలో చైనా ప్రజా విప్లవంలో పాల్గొనిన భారతీయుల సాహసకృత్యాలు, దూరదృష్టి, ధైర్యసాహసాలు వెల్లడైనాయి.

ఈరెండు ఆశియాదేశాల ప్రజలూ ఒకరినొకరు ద్వేషించుకొంటూ, ఒకరినొకరు పోరాడుతూ, ఒకరినొకరు చంపుకొంటూంటే వలస విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటం బలహీన పడుతుందనీ, సరైన గాడినుంచి తప్పిపోతుందనీ, చివరకు సంపూర్ణంగా సమసిపోతుందనీ దురాక్రమణదారుల ఆశ. అందుచే చైనా-భారతప్రజల మధ్య స్నేహసంబంధా లుండటం వారికేమాత్రం రుచించదు. 1857 లో విప్లవజ్వాలలు దేదీప్యమానంగా వెలుగుతున్న రోజుల్లో "అవిశ్వసనీయులైన" భారత సైనికులను చైనావారితో పోరాడే నిమిత్తం పంపాలని "టైమ్సు" విలేఖరి డిమాండు చేశాడు. అతడిలా వ్రాశాడు :

"భారతదేశంలోని పరిస్థితులను చక్కబెట్టే నిమిత్తం తీసుకొనే చర్యలూ, చైనాతో యుద్ధమూ రెండూ ఒకేపర్యాయం సాగించడం కష్టమేమీ కాదని అనేకమంది అభిప్రాయ పడుతున్నారు. బహిరంగంగా తిరుగుబాటు చేయనప్పటికీ తోటిమతస్థులకు వ్యతిరేకంగా తీసుకొనే చర్యల విషయంలో నిస్సందేహంగా కొన్ని సిపాయిదళాల స్థితిని నమ్మలేము. అటువంటి వారిని చైనాకు ఎందుకు పంపకూడదు ?"

రెండవ నల్లమందు యుద్ధం చివరిదశలో బ్రిటిషువారు చైనాకు భారత సైనికులను పంపారు. భారతదేశంలోని తిరుగుబాట్లను పూర్తిగ అణచివేసినతర్వాత,

మంచూ రాజులతో చేతులు కలిపి చైనా విప్లవకారుల నణచే నిమిత్తం వారిని పంపారు.

## చైనా విప్లవకారులతో భారతీయ సిపాయిల చేరిక

ఆసియావాసులకు వ్యతిరేకంగా ఆసియావాసులనే వినియోగించాలన్న దురుద్దేశ్యం బ్రిటిషువారిది. కాని పరిస్థితులు వారనుకున్నట్లు అనుకూలంగా పరిణమించలేదు. తైపింగ్ విప్లవకారులమీద దాడిచేసినపుడు అనేకవందల భారతీయ సైనికులను ఉపయోగించారు. వారిలో తిరుగుబాటు చేసిన అనేకమంది భారతీయులు విప్లవకారులతో కలిసిపోయారు. బ్రిటిషు దళాలతో సహా విదేశదళాలన్నింటికీ వ్యతిరేకంగా పోరాటం సాగించారు. చైనా - భారతదేశ సంబంధాలలో ఒక నూతన శకం ప్రారంభమైంది. వలస విధానానికి వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో చైనా, భారతదేశాల మధ్య ప్రత్యక్ష సంబంధాలేర్పడ్డానికిది నాంది.

అందుబాటులోనున్న సమాచారాన్నిబట్టి తైపింగు దళాలలో భారతీయులు ప్రవేశించారనే వార్త ప్రథమంగా వారి బద్ధశత్రువైన చెంగ్ కు-ఫాన్ యొక్క లేఖలలో వుదహరించబడింది. జనరల్ హూలిన్-ఇకు జనాబు వ్రాస్తూ చెంగ్ కు-ఫాన్ "యూహానుపట్టణమును ముట్టడించినపుడు తిరుగుబాటుదారులలో వున్న రాజకుమారుడు లిహ్సి-చెంగ్ దళంలో అనేకమంది నల్లటి శరీరం కల్గిన విదేశీయులున్నట్లు విన్నా"నని వ్రాశారు.

ఇక్కడ చెంగ్ వుదహరిస్తున్నది 1861 ప్రారంభంలో లిహ్సి-చెంగ్ నాయకత్వాన తైపింగుదళాలు యాంగ్సీ రాష్ట్రంలోని యూహాను ముట్టడించిన విషయం గురించి. "నల్లటి శరీరం కల్గిన విదేశీయులు" తప్పకుండా భారతీయులే అయివుండాలి. ఎందుకంటే మంచూ రాజులు భారతీయ సైనికులను "టీన్ సూ (హిందూ) దేశపు నల్లటి శరీరం కల్గిన సైనికు"లని పిలిచేవారు.

ఏ పరిస్థితులలో భారతీయులు లిహ్సి-చెంగ్ నాయకత్వం క్రింద చేరిందీ స్పష్టంగా తెలియదు. 1860 ఆగస్టులో లీ తన సైన్యాలను షాంఘైమీదకు నడిపినపుడు బ్రిటిషు దురాక్రమణదారులు జోక్యం కల్గించుకొని తైపింగులకు వ్యతిరేకంగా పోరాడాలని భారతదళాలను ఆజ్ఞాపించారు. తరువాత కొద్దికాలంలోనే ఆ దళాలు కియాంగ్సీ రాష్ట్రంలోకి చొచ్చుకొని పోయాయి. కాబట్టి వీరిలోనున్న భారతీయులు షాంఘైలోనున్న బ్రిటిషు సైనిక స్థావరంనుండి వచ్చినవారై వుండాలి.

తైపింగులను అణచడంలో బ్రిటిషు అధికారులు బహిరంగంగా పాల్గొనకముందే కొందరు భారతీయులు తైపింగులతో కలిసి పనిచేయడం గమనార్హం. దూరదృష్టిగల భారతీయులు కొందరు చైనా జాతీయోద్యమంయెడల సానుభూతిని కలిగివుండి దురాక్రమణ వ్యతిరేకపోరాటంలో పాల్గొన్నారు. బ్రిటిషు దురాక్రమణదారులకు వ్యతిరేకంగా నిలబడ్డారు. వలసవిధానానికి వ్యతిరేకంగా చైనా, భారతప్రజల మధ్య అన్యోన్యసంబంధాలకు వీరు పునాదులువేశారు. వారి మహత్తరపాత్ర చరిత్రలో శాశ్వతంగా నిలుస్తుంది.

ఎంతో కాలంగడువకముందే తైపింగ్ వుద్యమంలోని విప్లవకారులను చిత్రవధ చేసేందుకు బ్రిటిషువారు మరి

## హైద్రాబాద్ రెసిడెంట్‌పై హత్యాప్రయత్నం

విప్లవాన్ని అణచివేయడంలో నిజాముచేసిన సహాయానికి ప్రశంసగా బ్రిటిషురాణి యిచ్చిన బిరుదు నిశానీలను 1859 మార్చి 15న బ్రిటిషు రెసిడెంటు నిజామున కందించి ఆయనను అభినందించేడు. తిరిగి వచ్చేస్తున్నప్పుడు సభాభవనం ముందర నే జహంగీర్ ఖాన్ అనే రోహిల్లా పఠాను రెసిడెంటును కార్బయిన్‌తో కాల్చి చంపడానికై ప్రయత్నించేడు. కార్బయిన్‌లో మందుకూరి, సీసా పెంకులు, మేకులు, ఇనపముక్కలు దట్టించేడేమో, అవి నాలుగు మూలలకూ చిమ్ముకొని రెసిడెంటునూ, ఆయన ప్రక్కనేవున్న సాలార్‌జంగ్‌నూ చంపుతాయనుకొన్నాడు. కాని అవి ఇద్దరకూ తగలలేదు. వెంటనే కత్తిదూసి తన పని పూర్తి చేయడానికి రెసిడెంట్‌పైకి వురికేడు. కాని, మంత్రి సాలార్‌జంగ్ భటులు లాతనిని నరికివేసేరు. ఇదంతా క్షణంలో జరిగిపోయింది.

రెసిడెంటును చంపడానికి ప్రయత్నించిన జహంగీర్ ఖాన్ నిజాము సోదరి కొడుకు-తేగ్ జంగ్ వద్ద వుద్యోగి. నిజాము అంతరంగిక సలహాదారు మిర్దాచంద్‌కు బాగా పరిచితుడూను.

కొంతమంది భారతీయులను వినియోగించారు. ఇది ఎంతో విచారకరమైన ఘటన. తైపింగులకు, విప్లవకారులకు మధ్య సాగిన పోరాటంలో (1862-63) అనేకమంది చైతన్యవంతులైన భారతీయులు భయంకర పోరాటం సాగుతున్న సమయంలో కూడా (కియాంగ్సీ, చెకియాంగ్ రాష్ట్రాలలోని అనేక భాగాలలో) విప్లవకారులవైపు వెళ్లారు. ఇందుకు క్రింది ఘటనలు తార్కాణం.

1863 ఫిబ్రవరి 19న చెకియాంగ్ రాష్ట్రంలోని షావోషింగ్‌లో జరిగిన యుద్ధంలో, తైపింగులతో కలిసి పోరాడుతున్న భారతీయులు మంచూవారికి తోడ్పడుతున్న ఫ్రెంచి అధికారి తార్డిఫ్-డి-మాయిడ్రీని నామరూపాలులేకుండా చేయడానికి తోడ్పడినారు. మంచూ ప్రభుత్వపు పత్రాలలో పేర్కొనబడ్డ విషయాలనుబట్టి ఆరోజున మంచూ, విదేశీయుల సైన్యాలు "హ్సీకో గేట్ బయటనుంచి షావోషింగ్‌మీద బాంబులవర్షం కురిపించి పట్టణప్రహరీని 100 అడుగులకు పైగా కూల్చివేసి, అనేకమంది 'దారిదోపిడిదారు'లను హతమార్చాయని మంచూఅధికార పత్రాలు చెపుతున్నాయి. తార్డిఫ్ ఒక్కడే వంతెనమీద నిలబడి తన సైన్యాలను పట్టణప్రహరీమీదకు ఎక్కవలసినదిగా ఒత్తిడిచేస్తున్నాడట. విప్లవకారులు రాళ్ళతోను మరతుపాకులతోను గండ్లను రక్షిస్తున్నారు. విప్లవకారులను బలపర్చుతున్న 50 లేక 60 మంది నల్లటిశరీరం గల్గిన విదేశీయులు గురిపెట్టి తార్డిఫ్ మీద సాగించిన కాల్పుల మూలంగా తలమీద దెబ్బతగిలి అతడు చనిపోయాడు."

అదే సంవత్సరం మే 2వ తేదీన కియాంగ్సీ రాష్ట్రంలోని వైట్‌సాంగ్ జిల్లాలో జరిగిన పోరాటంలో "గతంలో 5వ బొంబాయి దేశీయదళంలో వుండి ప్రస్తుతం తైపింగులతో కలిసి పోరాడుతున్న ముగ్గురు సిపాయిలు" తమ ప్రాణాలను కోల్పోయారు.

అదే సంవత్సరం అక్టోబరు 7న చెకియాంగ్ రాష్ట్రంలోని హాంగ్‌చౌ, యూహాంగ్ మధ్యనున్న షిహిలీ చాంగ్ చీలో జరిగిన యుద్ధంలో మంచూ, ఫ్రెంచి సైన్యాలు కలిసి "అనేకమంది దారిదోపిడిదారులను, నల్లశరీరం గలిగిన ఒక విదేశీయుని చంపినట్లు" చెప్పుకొన్నారు.

తైపింగులతోనున్న "నల్లటి శరీరం కల్గిన విదేశీయుల"ను గురించిన వివరణ లనేకంఉన్నాయి. పై మూడు వుదాహరణలలోని తైపింగ్ బలాలూ చైనా అంతరంగిక పోరాటాలలో జోక్యం కలుగజేసుకొంటున్న విదేశీయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న సైన్యాధిపతి లీహ్సి-చెంగ్ నాయకత్వాన వున్నవే. విదేశీ సైన్యాలకు వ్యతిరేకంగా ఏకధాటిగా సాగుతున్న పోరాటాల్లో కొందరు భారతీయులు ఆ దళాలలోనికి ఆకర్షింపబడి యుండవచ్చు.

చైనాలో బ్రిటిషు సైనికాధికారుల ఒత్తిడిక్రింద, తీవ్ర అజమాయిషీ క్రిందనున్న భారతీయులు తైపింగులతో చేరడం ఎలా సాధ్యమైంది? అందుబాటులోనున్న సమాచారాన్నిబట్టి, యుద్ధరంగంలో పట్టుబడిన భారతీయులు విప్లవకారులతో చేరివుంటారని ఖచ్చితంగా చెప్పవచ్చును.

1862 సెప్టెంబరు 17న షాంఘైలోని బ్రిటిష్ దౌత్యరాయబారి చైనాలోని బ్రిటిష్‌మంత్రి కొక లేఖలో యిలా వ్రాశాడు: "ఒకటిరెండురోజులక్రితం సూచోనుండి ఒక బెల్జియం సాహసి వచ్చాడు. యుద్ధసామగ్రిలో లాభసాటియైన వ్యాపారం చేశామని చెప్పుకుంటున్న ఇద్దరు యూరోపియనులను అక్కడ చూచానని, గత మే నెలలో పట్టుబడిన ముగ్గురు సిపాయిలు ప్రస్తుతం సూచోలో వున్నట్లు వారు చెప్పారని అతడు నాతో అన్నాడు."

పరిశీలనవల్ల స్వీయానుభవంద్వారా చైతన్యం పొంది చైనా విప్లవాదులలో చేరిపోయిన భారతీయ సైనికులు ఈ నలుగురేకాక ఇంకా అనేకమంది వుండి వుంటారు.

కొంతమంది భారతీయులు మరొకవిధంగా తైపింగులలో చేరారు. అక్టోబరు 18, 1863 వ తేదీన తైపింగులలో చేరడానికి తానూ ఒక "భారత కామ్రేడూ" ఏవిధంగా షాంఘైనుండి సూచోకు వెళ్ళినదీ అగస్టస్ విన్‌స్లే అను బ్రిటీష్ పౌరుడు ఒక పుస్తకంలో వివరించాడు. ఈ "భారత కామ్రేడ్" తైపింగ్ వుద్యమాన్ని బలపర్చిన ఒక వలంటీరనేది నిర్వివాదాంశం. హెచ్.ఎ. బర్గ్‌వైన్ తదితరులతోపాటు ఫుకీన్ రాష్ట్రంలో నున్న తైపింగ్‌లలో చేరాలని వుద్దేశపడిన "ఒక బ్రిటిషు ఇండియావాసి"ని గురించి ఆ పుస్తకంలో ప్రస్తావింపబడింది. తమంతట తామే తైపింగులలో చేరిన ఈసిపాయిలు భారత ప్రజలకు ఉత్తమ ప్రతినిధులని చెప్పాలి. విదేశీ దురాక్రమణకు వ్యతిరేకంగా వందసంవత్సరాల క్రితమే చైనా భారత ప్రజల ఐక్యతకు వీరు మార్గాన్ని సుగమం చేశారు. వారు చైనా విప్లవకారుల యెడల గాఢసానుభూతిని కలిగియున్నారు. ఈసానుభూతివారి స్వానుభవంనుండి ఉద్భవించినది. వీరుఅవకాశందొరికిన వెంటనే విదేశీయ పెత్తందార్లకు వ్యతిరేకంగా పోరాడే

నిమిత్తం చైనా విప్లవకారులలో చేరారు. యుద్ధంలో పట్టుబడినప్పుడు భారత సైనికులు వున్నత లక్ష్యాన్ని అవగాహన చేసుకోవడం, తదను గుణ్యంగా భావ పరిణామం చెందటం జరిగియుండవచ్చు. ఈ పరిణామాన్ని అర్థం చేసుకొనడానికి విన్‌ప్లే ఒక ముఖ్య విషయాన్ని వివరించాడు. "ఒకసారి విప్లవకారులను కలుసుకున్న వారు మంచూలకంటె వారి ఆధిక్యతను గుర్తిస్తారు. కష్టాలతోను, ప్రమాదాలతోను కూడుకున్నప్పటికీ తైపింగులతో సహకరించడానికి పూనుకుంటారు. ఇదే వాస్తవమైన కారణం"అని విన్‌ప్లే వ్రాశాడు.

విన్‌ప్లే యూరోపియన్ సానుభూతిపరులనుగురించి పైవిధంగా చెప్పాడు. భారతీయులు సాంప్రదాయ సిద్ధంగా సత్యశీలము, స్వాతంత్ర్యాభిలాషగలవారు. వారి మాతృభూమి విదేశ దురాక్రమణకు గురి యగుటవలన పై వాక్యాలు భారతీయుల విషయంలో కూడా వాస్తవమై యుండాలి. బ్రిటీషు సైనిక దాస్యాన్నుండి విముక్తి పొందినతర్వాత విప్లవకారుల చర్యలవలన కనువిప్పు కలిగి, తమ చైతన్యాన్ని పెంపొందించుకొని, స్వాతంత్ర్యంకోసం శత్రువుకు వ్యతిరేకంగా పోరాడడానికి వారు నిశ్చయించుకున్నారు. చైనా ప్రజల జాతీయ విముక్తి వుద్యమాన్ని వారు బలపర్చటం చైనా - భారత ప్రజల స్నేహసంబంధాల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడటమేగాక వారి జీవితాలకు ఒక నూతన అర్థాన్నికూడా యిస్తుంది. అట్టడుగున వున్న ప్రజానీకం చేతులు కలిపినపుడే దేశానికీ తమకూ ఉన్నతమైన విముక్తి మార్గాన్ని కనుగొనగల్గుతారనే సత్యాన్ని యీ ఉదంతం వివరిస్తుంది.

చైనా భారత ప్రజలు విదేశ దురాక్రమణదారుల నసహ్యించుకొన్నారు. చైనా - విప్లవకారులతో కలసి పోరాడుతున్నపుడు తైపింగులతోనున్న భారత మిత్రులు యిదే హేయభావాన్ని వ్యక్తపరిచారు.

జాతీయ విముక్తికోసం పోరాడుతున్న యీ రెండు దేశాల ప్రజల కోర్కెలు వీరిలో మూర్తీభవించాయి. వీరు 1857 విప్లవవీరుల వారసులు. చైనా ప్రజల విప్లవం కోసం వారిలో అనేకమంది తమ ప్రాణాలర్పించారు. ఆ సమయంలో చైనా - భారత ప్రజల సహకారం పరిపక్వత చెందినదికాదనీ బాల్యదశలోనే వుందనీ గుర్తించాలి. ఇనుపపిడికిలితో భారతదేశాన్ని పాలిస్తున్న బ్రిటిషు దురాక్రమణదారులు తర్వాత తమ లాభం కోసం బలవంతంగా భారతీయులను చైనా యుద్ధాలలో వినియోగించడం మూలాన భారత-చైనా ప్రజల అన్యోన్య అవగాహనకు, స్నేహసంబంధాలకు అవాంతరం ఏర్పడింది. చైనాకు పంపబడిన భారత సైనికులు బ్రిటీషు దురాక్రమణ విధానానికి గురియైనవారు. బ్రిటీషు సైనికాధికారులదాస్యబంధనాలలో చిక్కుకొని వారి అధీనంలోనుండి బయటపడడానికి వీలులేనివారు. దీనికంతకు కారణం బ్రిటీషు వలసవిధానమే.

ఇప్పుడు చరిత్ర తీర్పునిచ్చింది. పరిస్థితి పూర్తిగా మారిపోయింది. నూరు సంవత్సరాల క్రితం వలసదారులు ఏవిధంగా ఎదురులేని అధికారాన్ని చెలాయించారో, కుట్రలను పన్నారో ఆ విధంగా వారు యీరోజున చేయలేరు. విదేశ దాస్యబంధనాలనుండి విముక్తి పొంది స్వాతంత్ర్యం సంపాదించిన పిదప చైనా భారత ప్రజలు వలసవిధానానికి వ్యతిరేకంగా సాగే పోరాటంలో గణనీయమైన శక్తులుగ అవతరించారు. మన రెండుదేశాల ప్రజలమధ్య సరాసరి విస్తృత సహకారానికి అవకాశాలేర్పడ్డాయి. మనలను వేరుచేయుటకు సామ్రాజ్యవాదులు పన్నే కుట్రలు తప్పక విఫలమౌతాయి. దురాక్రమణ వ్యతిరేక పోరాటంలో తమ ప్రాణాలర్పించిన అమరవీరులను స్మరించుకొన్నప్పుడు మనం హృదయపూర్వకంగా వారికి జోహార్లు అర్పిస్తాం.



# స్వాతంత్ర్య సంగ్రామ ఘటనలపై కారల్‌మార్క్స అభిప్రాయాలు

[1857 విప్లవకాలంలో బ్రిటిష్ సైన్యాధిపతులు పత్రికలకిచ్చే రిపోర్టులు, సోల్జర్లు వ్రాసే లేఖలు, పార్లమెంటు చర్చలూ - వీటిని ఆధారంచేసుకొని కారల్‌మార్క్స 'న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్'కు ఎప్పటికప్పుడు వ్యాసాలు వ్రాసేరు. వాటిలో కొన్నింటిని యిక్కడ యిస్తున్నాం. మార్క్స స్వదస్తూరీలోవున్న లేఖలను మొట్టమొదటిసారిగా పైకితీసి, ఫోటోగ్రాఫు తీసి జాగ్రత్తచేసినది జర్మన్ సోషలిస్టు యూనిటీపార్టీ వారి మార్క్సిజం - లెనినిజం ఇన్‌స్టిట్యూట్. ఆ లేఖల ప్రతులన్నిటినీ దయతో మాకు పంచిన పై సంస్థకు కృతజ్ఞత తెలియజేస్తున్నాం. — సంపాదకవర్గం.]

## ఇండియాలో తిరుగుబాటు

తిరుగుబాటుచేసిన సిపాయీలు ఇండియాలో చేసిన అత్యాచారాలు భయంకరమూ, బీభత్సమూ, అసహ్యకరమూ అవును. కాని అల్లాంటివి తిరుగుబాట్లు వచ్చినప్పుడూ, జాతులమధ్య - తెగలమధ్య యుద్ధాలు వచ్చినప్పుడూ, అన్నింటికన్నా ఎక్కువగా మతయుద్ధాలు వచ్చినప్పుడూ జరుగుతూనే వుంటాయి. వెన్‌దియనులు కవెనాంటీర్లమీద, స్పానిష్ గెరిల్లాలు కాఫిర్ ఫ్రెంచివాళ్ళమీద, సర్వియావాళ్ళు తమ పొరుగునవున్న జర్మన్లమీద, క్రోట్‌లు హంగరియన్ల వియన్నా తిరుగుబాటు దార్ల మీద కవైనాగార్డు దళాలు, బోనపార్టీ డిసెంబరిస్టులు ఫ్రెంచి శ్రామిక సంతానంమీద ఇల్లాంటి అత్యాచారాలే జరిపినప్పుడు మర్యాదస్థుల మనుకునే ఇంగ్లీషువాళ్ళు వారిని అభినందిస్తూండే వారుకూడా. ప్రాచ్యదేశాలలో సామ్రాజ్యాన్ని నిర్మిస్తూన్న దశలోనేకాదు, స్థిరపరిపాలన ఏర్పడ్డ గత పదేళ్ళల్లోనూకూడా ఇంగ్లండు అనుసరిస్తున్న ఆర్థిక విధానాలలో చిత్రహింస ఒకభాగం అయిపోయింది. సిపాయీలు చేసిన పని దుష్టమే కావచ్చు. కాని అది ఇంగ్లండు ఇండియాలో చేసిన పనులకు ప్రతిబింబం మాత్రమే అనాలి. మానవజాతి చరిత్రలో ప్రతిహింస అనేదొకటివుంది. ఇక్కడో సూత్రంకూడావుంది. ఆ ప్రతిక్రియను సాధనాన్ని తయారుచేసేది పీడితులుకాదు; పీడకులే.

ఫ్రెంచి రాజరికంమీద మొదట దెబ్బతీసినది కులీన కుటుంబాలు. రైతులుకాదు. బ్రిటిష్‌వాళ్ళు చిత్రహింసల పాల్జేసి, అవమానించి, సర్వస్వం ఊడ్చివేసిన రైతులుకాదు ఇండియాలో తిరుగుబాటు ప్రారంభిస్త. బ్రిటిష్‌వాళ్ళు తిండీ గుడ్డా యిచ్చి, తయారీ ఇచ్చిన సిపాయీలే ఈ తిరుగుబాటు ప్రారంభించేరు. ఈ సిపాయీలు చేసిన అత్యాచారాలకు పోలికలకోసం కొన్ని ఇంగ్లీషు పత్రికలు వ్రాస్తున్నట్లు మధ్య యుగాలనాటి కథలు తవ్వనక్కర్లేదు. అధునాతన ఇంగ్లండు చరిత్రలోనే బోలెడు కనిపిస్తాయి. చైనాతో బ్రిటన్ చేసిన మొదటి (నల్లమందు) యుద్ధం సంగతి చూడండి. ఇది జరిగి ఎంతోకాలం కాలేదు. ఇందులో కేవలం వినోదంకోసం ఇంగ్లీషు సోల్జర్లు ఎల్లాంటి దురంతాలు సాగించేరో కనబడుతుంది. అవి మతోన్మాదంలో చేసిన పనులుకావు. ఒకరిని అణచివేసి పీడిస్తున్న జాతిమీద కలిగిన ద్వేషంతో ఆ పనులు చేసేరనలేము. శత్రువు అధిక పరాక్రమంతో నిరోధించడంమూలంగా రెచ్చిపోయి వారు ఆ పనులు చేసేరని కూడా చెప్పలేము. ఆడవాళ్ళని చెరిచేరు. పిల్లల్ని

ఖండతుండాలు చేసేరు. ఊళ్ళకి వూళ్లు మంట పెట్టేరు. ఇవన్నీ విరోధానికి అలవోకగా చేసిన పనులు. అల్లా వ్రాసింది పైనా పండితులు కాదు. ఇంగ్లీషు అధికార్లే. సిపాయీలు వట్టి క్రూరులనీ, ఇంగ్లీషువాళ్ళలో మానవ దయ మూర్తీభవించినదనీ ఈ ప్రమాద సమయంలో సహితం భావించడం పెద్దతప్పు.

ఇంగ్లీషు వుద్యోగుల జాబుల్లో అక్షరం అక్షరాన కసి కనబడుతూంది. పెషావరులో 55 వ దేశీయ పటాలంమీద దాడి చెయ్యవలసిందని 10 వ ఇర్రెగ్యులర్ గుర్రపు సేనకు ఆజ్ఞ ఇచ్చేరు. కానివాళ్లు ఆ ఆజ్ఞలను ధిక్కరించేరు. దానిమీద ఆ సేన నుంచి ఆయుధాలు లాక్కొన్న వైనాన్ని ఒక వుద్యోగి తన లేఖలో వర్ణించేడు. వాళ్ళనుంచి ఆయుధాలు లాక్కున్నారు. బట్టలు, బూట్లు తీసేసుకొన్నారు. ఒక్కొక్కరికి పన్నెండేసి పెన్నీలు మాత్రం ఇచ్చి సింధునదిలో పడవ లెక్కించి వదిలేసేరు. ఈ ముండాకొడుకులంతా నది ఉరవళ్ళలో మునిగిపోతారని ఆ వుద్యోగి తన జాబులో పట్టలేని ఆనందం ప్రకటించేడు. పెళ్ళిళ్ళలో బాణసంచా కాల్చడం అక్కడ దేశ రివాజు. ఒక రోజు రాత్రి పెషావరులో ఒక గృహస్థు ఇంట జరుగుతున్న పెళ్లి సందర్భంలో మందు సామగ్రి కాల్చేరు. ఆ ధ్వనులకు ఇంగ్లీషు వాళ్లు హడలిపోయేరు. మర్నాడు పొద్దున్నే ఆ పెళ్లివారిని పట్టుకొన్నారు. తమరిని అల్లా కంగారు పెట్టినందుకు వాళ్ళని కట్టేసి "జన్మ జన్మాలకూ మరిచి పోకుండా చీరిఎండేసేము" అని ఒకడు వ్రాసేడు. సర్ జాన్ లారెన్సుకు రావల్పిండిలోని ముగ్గురు జమీందార్లు ఏదోపథకం వేస్తున్నారని తెలిసింది. ఆ సభకు వెన గూఢచారి నొకణ్ణిపంపేడు. వాడిచ్చిన నివేదికను పట్టుకొని వాళ్ళు ముగ్గుర్నీ వురితీ సెయ్యమని ఆజ్ఞాపించేడు. వాళ్ళని ఉరితీసేరు. సివిల్ శాఖలో పనిచేస్తున్న మరో వుద్యోగి అలహాబాద్ నుంచి ఇల్లా వ్రాస్తున్నాడు: "ప్రాణాలివ్వడానికీ, తియ్యడానికీ మన చేతుల్లో అధికారంవుంది. దానిని పూర్తిగా వినియోగిస్తున్నాం." "యుద్ధంలో పాల్గొనివుండనివారిని ఏనాడూ పది పదిహేనుమందిని వురితియ్యకుండా వుండడం లేదు-" అని అదే పట్టణంనుంచి వేరొకరు వ్రాస్తున్నారు. "పదులూ పాతికలూ లెక్కని హామ్సు వురితీస్తున్నాడు"- అని మరొకడు మహోల్లాసం వెలిబుచ్చేడు. చాలమంది దేశీయుల్ని వురితీసిన ఒక ఘటననుగురించి మరొకడు "అప్పుడుంది తమాషా..." అంటూ కొనసాగించేడు. మరొకడు వ్రాసేడు... "మేం గుర్రం కూడా దిగకుండానే సైనిక విచారణ సాగించేస్తున్నాం. మాదారిలో కనిపించిన నల్లవాడినల్లా కాల్చెయ్యడమో ఉరితియ్యడమో—" గ్రామదేశం వాళ్ళ విషయంలో సానుభూతి చూపేరనే అనుమానంతో ముప్పయి మంది జమీందార్లని వురితీసేరనీ, అదే పేరు చెప్పి గ్రామాలకు గ్రామాలే తగులబెట్టేరనీ బెనారెస్ నుంచి వచ్చిన వార్తలవల్ల తెలుస్తూంది. బెనారసునుంచే ఒక వుద్యోగి వ్రాసిన లేఖ నొకదానిని లండన్ టైమ్సు ప్రకటించింది. "...దేశీయులతోడి పోరాటంలో యూరపియన్ సేనలు సహాకిరాతకంగా వ్యవహరిస్తున్నాయి—" అని ఆ లేఖలో వ్రాసేడు.

ఇంగ్లీషువాళ్లు చేసిన దురంతాలన్నిటినీ తిరస్కృత్యాలుగా వర్ణిస్తున్నారు. బాధాకరంగా వుండే వివరాలు ఇవ్వకుండా ఏదో మామూలు విషయంలాగ, దాటేసి చెప్పేస్తున్నారు. దేశీయులు చేసిన పనులు భయంకరం అయితే కావచ్చు. కాని, వాటిని పనికట్టుకొని అతిగా వర్ణిస్తున్నారు. ఢిల్లీలోనూ, మీరట్ లోనూ జరిగిన ఘాతుక చర్యలంటూ మొదట 'లండన్ టైమ్సు' లోనూ, తర్వాత ఇతర లండన్ పత్రికలలోనూ ఈ దుష్కృత్య ఒక వ్యాసం పడింది. దానిని వ్రాసిందెవరో తెలుసా? ఘటనాస్థలానికి వెయ్యిమైళ్ళపై దూరాన బెంగుళూరులో కూర్చున్న ఒక పిరికి మతబోధకుడు. ఒక హిందూ విప్లవకారుడి వూహలకు కూడా అందని దారుణ చర్యల్ని ఈ మతబోధకుడు అక్కడ కూర్చుని ఆలోచించుకున్నాడు.

సిపాయీలు ముక్కులు కోసేరనీ, రొమ్ములు కోసేసేరనీ, అనేక చిత్రహింసలు పెట్టేరనీ వ్రాస్తున్నారు. యూరపియన్లకివి మహాభయంకరంగా వుంటాయి, నిజమే. మాంచెస్టరు శాంతి సమాజ కార్యదర్శి కాన్టన్ లోని ప్రజానివేశనాలమీద అగ్నిగోళాలు కురిపించడం వాళ్ళకి భయంకరం అనిపించకపోవచ్చును. అరబ్బుల్ని ఫ్రెంచి సర్వసేనాని ఒక గుహలో పెట్టి ప్రాణాలతో తగలబెట్టేడంటే ఆశ్చర్యం కలిగించకపోవచ్చు. శిక్షా భాగంగా పనులుచేయించే బ్రిటిష్ బందిఖానాల్లో విచారణలంతూ అనీ సాగించి, బాధించకుండా నిల్చున్నపాటున కొరడాలతో ఇంగ్లీషు సోల్జర్ల చర్మాలు వొలిచెయ్యడం వాళ్ళకి దారుణంగా తోచకపోవచ్చును. అన్నింటికిలాగే క్రౌర్యానికూడా "ఫేషను"లుంటాయి. క్రౌర్యంకూడా దేశ, కాలాన్ని పట్టి మారుతూంటుంది. మహావిద్వాంసుడైన సీజరు కొన్ని వేలమంది గాలిక్ యోధుల కుడిచేతులను నరికించేసినట్టు నిశ్శంకగా వ్రాసుకొన్నాడు. రిపబ్లిక్ కావాలని కోరుతారనే అనుమానం కలగడంతోనే నెపోలియన్

కొన్ని ఫ్రెంచి సేనల్ని సెయింట్ డొమింగోకు పంపేసి ఆటవికులతోను, అంటురోగాలతోను చావనుని వదిలేసేడు.

సిపాయీలు చేసిన భయంకరమైన చిత్రవధలవంటివి క్రైస్తవ బైజాంటియన్ సామ్రాజ్యంలో నిత్యకృత్యాలు. అయిదో ఛార్లెసు కాలంనాటి శిక్షాస్మృతులలో అల్లాంటి శిక్షలున్నాయి. దేశద్రోహంవంటి నేరాలకు ఇంగ్లండులో ఇటువంటి శిక్షలు విధించినట్లు న్యాయాధిపతి బ్లాక్‌స్టన్ వ్రాసేడు. తన్ను తాను హింసించుకోడం ఒక కళగా, ఒక పవిత్ర కార్యంగా హిందువులకి వాళ్ళమతం బోధిస్తున్నప్పుడు తమజాతికీ, మతానికీ శత్రువులయిన వారిమీద వానిని ప్రయోగించడంలో పెద్ద ఆశ్చర్యమేంలేదు. పూరీ జగన్నాథ రథోత్సవాలలో ఇటువంటి హింసాత్మక మతాచారాలకు రక్షణ ఇచ్చి తోడ్పడుతూ ఆదాయం గడిస్తున్న ఇంగ్లీషువాళ్లు వీటికింత తల్లక్రిందులు కావలసిన అవసరం కనబడదు.

మొజార్టు సంగీతనాటకం ఒకదాంట్లో శత్రువు నురిదీసి, మంటలలో కాల్చి, చీల్చి చెండాడి, చర్మం వొలుస్తూనే మధురాతిమధురమైన రాగాన్ని ఆలపించే ఒక భయంకర పాత్రను సృష్టించేడు. ఆ పాత్రలో ప్రతీకారపూర్వకమైన ఆవేశాన్ని సూక్ష్మాతిసూక్ష్మంగా చిత్రించేడు. అటువంటి బీభత్స సన్నివేశంలో కొంత నాటకీయ వైచిత్రిని ప్రవేశపెట్టేడు గనకగాని, లేకుంటే అదంతా చిలిపితనంగా కనిపించి వుండేది. 'లండన్ టైమ్సు' ఈ విషయంలో కొంచెం అతిగా పోతూందంటే, అది కేవలం కంగారు మూలంగానే అనుకోకూడదు. మొలీర్ (ఒక ప్రఖ్యాత ఫ్రెంచి నాటక కర్త—సం.) వూహకుకూడా అందని అద్భుతమైన వూహతో అది అలా చేస్తూంది. దానికి కావలసింది ప్రభుత్వచర్యల్ని సమర్థించడమూ, కావలసిన ధనాన్ని కంపెనీకి ఇప్పించడమూను. జెరికో పట్టణపు ప్రహరీలాగ ఢిల్లీ గోడలు వూదితే పడిపోలేదు. అందుచేత, ప్రతీకారంకోసం కేకలతో ఆ పత్రిక ఇంగ్లీషుప్రజల చెవులు ఘడియలు వేయదలచింది. ఈ దుస్థితికంతకూ మూలం ప్రభుత్వమేననీ, అది ఇంత తీవ్రరూపం ధరించడానికి వాళ్లే కారణమనీ ప్రజలకు జ్ఞాపకం రాకుండా చెయ్యడమే ఆ పత్రిక తాపత్రయం.

న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్
16—9—1857

# అయోధ్య ఆక్రమణ

పద్దెనిమిది నెలలక్రితం కాన్‌టన్‌మీద చేసిన దాడితో బ్రిటిష్‌ప్రభుత్వం యుద్ధప్రకటన లేకుండానే ఒక రాజ్యానికి సంబంధించిన రాష్ట్రప్రభుత్వంమీద దండయాత్ర సాగించవచ్చుననే కొత్త సూత్రాన్ని ప్రపంచ రాజ్యనీతి సూత్రాలకు జతపరిచింది. ఆ ప్రభుత్వమే ఈవేళ భారత గవర్నర్‌జనరల్ లార్డు కానింగ్‌ద్వారా ప్రపంచ రాజ్య ధర్మ సూత్రాలను తల్లక్రిందులు చేయడానికి పూనుకొంది. "అయోధ్య రాష్ట్రంలో భూస్వామ్యపు హక్కును బ్రిటిష్‌ప్రభుత్వం స్వాధీనం పరచుకొంది. ఆ హక్కును తనకు ఉచితమని తోచినరీతిని వినియోగిస్తుంది" అని ఆయన ప్రకటించేడు.

రష్యా చక్రవర్తి వార్సాను స్వాధీనపరచుకొన్నాక 1831 లో పోలండ్‌లోని కులీన కుటుంబాలవారి భూముల్ని లాక్కున్నాడు. ఆ చర్యను బ్రిటిష్ పత్రికలూ, పార్లమెంటూ తిట్టిపోసేయి. నోవారా యుద్ధం అయిపోయేక ఆస్ట్రియాప్రభుత్వం స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన లొంబార్డు కులీన కుటుంబాలవారి ఆస్తిని స్వయంగా స్వాధీనం చేసుకోకపోయినా వాళ్ల చేతుల్లో లేకుండా చేసింది. దానికూడా ఇంగ్లీషు వాళ్లు ఎంతో వ్యతిరేకత ప్రకటించేరు. 1851 డిసెంబరు 2 న లూయీ నెపోలియను ఆర్లియన్సు రాజ కుటుంబీకుల ఆస్తిని స్వాధీనం చేసుకొన్నాడు. ఫ్రాన్సులోవున్న చట్టాల ప్రకారం లూయీ ఫిలిప్ అధికారం స్వీకరించగానే ఈ భూములు ప్రభుత్వాస్తికి దఖలు అయిపోతాయి. ఏదో న్యాయశాస్త్ర సంబంధమైన తికమక వచ్చి ఆగిపోయిందికాని, ఈ చర్యవలన సమాజ భద్రతను కాపాడే పునాదులే కదిలిపోతాయనీ, నాగరిక సమాజం బ్రతికే స్థితే లేదనీ 'లండన్ టైమ్సు' పత్రిక వ్రాసింది. ఇంగ్లీషు వాళ్ళు తెగకోప్పడ్డారు. ఆ ఆవేశపరులంతా ఇప్పుడేమంటారో! ఇక్కడ ఇంగ్లీషు ప్రభుత్వం స్వాధీన మొనర్చుకున్న భూమి ఏ రాజకుటుంబానిదో, ఏ కొద్దిమంది కులీన కుటుంబాలవారిదో కాదు. ఐర్లండంత విస్తీర్ణంగల రాజ్యంలో, లార్డు ఎడింబరో చెప్పినట్లు "దేశంలోని యావన్మంది ప్రజల ఆస్తినీ" స్వాధీనం చేసుకొన్నారు.

ఇటువంటిపని చెయ్యడానికి లార్డు కానింగ్ చెప్పిన

సాకులేమిటి? ఒకటి: లక్నో బ్రిటిష్ సేనలస్వాధీనం అయింది. రెండు: సిపాయీలు ప్రారంభించిన తిరుగుబాటుకు నగరప్రజలూ, రాష్ట్ర ప్రజలూ పూర్తిగా సాయపడ్డారు. మూడు: వాళ్ళు ఒక సహాపరాధం చేసేరు. శిక్షార్హులు. దీనినే స్పష్టంగా చెప్పాలంటే బ్రిటిష్ ప్రభుత్వం లక్నోను పట్టుకొన్నది గనక మిగతా రాష్ట్రం ఇంకా స్వాధీనం కాకపోయినా అక్కడున్న భూమినంతనూకూడ స్వాధీనం చేసుకొనే హక్కు వున్నదన్నమాట. బ్రిటిష్‌వాళ్ళ జీతభత్యాలు తింటున్న సిపాయీలు తిరగబడ్డారుగనక బ్రిటిష్ వాళ్లు బలాత్కారంగా ఆక్రమించుకున్న అయోధ్య రాష్ట్రంలో ప్రజలు జాతీయ స్వాతంత్ర్యంకోసం తిరగబడకూడదన్నమాట. ఇంకా క్లుప్తంలో చెప్పాలంటే అయోధ్యలో న్యాయసమ్మతంగా ఏర్పడిన బ్రిటిష్ ప్రభుత్వంమీద ప్రజలు తిరగబడ్డారు. అలా తిరగబడ్డందుకు వాళ్ళ ఆస్తులు స్వాధీనం చేసుకోవచ్చునన్నమాట. లార్డు కానింగ్ ప్రకటనలోని మొలిక మాటల్ని అట్లావుంచితే, ఈ ప్రకటన ప్రకారం అయోధ్యలో బ్రిటిషు ప్రభుత్వం న్యాయసమ్మతంగా ఏర్పడ్డట్లే ఆయన భావిస్తున్నాడనుకోవాలి.

అయోధ్య అసలు బ్రిటిష్ ప్రభుత్వంచేతుల్లోకి ఎల్లావచ్చింది? - ఈ విషయం గమనించవలసిందే... 1856 లో లార్డు డల్హౌసీ అయోధ్యను కబళించవలసిన సమయంవచ్చిందనుకొన్నాడు. ఆ ఏర్పాటులో కాన్పూరులో సేనల్ని సమీకరించడం ప్రారంభించేడు. నేపాళ్ రాజును కనిపెట్టి వుండడానికే ఈ సేనల్ని ఇక్కడికి చేరుస్తున్నట్లు అయోధ్యరాజుకు చెప్పేరు. ఉన్నట్లుండి ఈ సైన్యం ఒకరోజున అయోధ్యలో ప్రవేశించింది. లక్నో పట్టుకొంది. రాజును ఖైదు చేసింది. రాజ్యాన్ని ఇంగ్లీషువాళ్ల కిచ్చెయ్యమని ఆయనపై ఒత్తిడి తెచ్చేరు. కాని ఆయన అంగీకరించలేదు. ఇంక ఆయనను కలకత్తాకు పట్టుకు పోయేరు. అయోధ్యరాష్ట్రాన్ని తూర్పుఇండియా కంపెనీ ఆస్తులలో చేర్చేసేరు.

1801 లో లార్డు వెలస్లీ అయోధ్యరాజుతో చేసుకొన్న సంధిపత్రంలోని ఆరో ఆర్టికిలును పురస్కరించుకొని ఇంగ్లీషు ప్రభుత్వం ఈ దొంగదెబ్బ తీసింది. ఈ 1801 నాటి సంధి అయినా సర్ జాన్‌షోర్ 1798 లో చేసుకొన్న సంధికి పరిణామం తప్ప మరేమీ కాదు. ఆరోజులలో స్వదేశ రాజులతో బ్రిటిషు ఇండియా ప్రభుత్వం పెట్టుకొంటూవున్న సంబంధాలన్నింటిలాగే ఈ 1798 సంధికూడా ఒక పరస్పర సహాయ సంధిమాత్రమే. మూడోవారి మీద తమలో ఒకరు దాడిచేస్తే లేదా మరొకరు తమలో ఒకరిమీద దాడిచేస్తే ఉభయులూ ఒకరికొకరు సాయం చేసుకోవడం దీని వుద్దేశం. ఈ ఒడంబడిక ఫలితంగా తూర్పిండియా కంపెనీకి ఏటా అయోధ్యరాజు 76 లక్షల రూపాయలు ముట్టచెప్పవలసి వచ్చింది. అదే ఒడంబడికలోని పన్నెండు, పదమూడు ఆర్టికల్సు ననుసరించి అయోధ్య రాజు ప్రజలపై పన్నులను తగ్గించాలి. నిజానికివి రెండూ పరస్పర విరుద్ధం. అయోధ్యరాజు ఈ రెండింటినీ ఒకే సమయంలో అమలుజరపలేడు. తూర్పిండియా కంపెనీకి కావలసింది అదే. దీనితో కొత్త చిక్కులు వచ్చేయి. వాటిని సర్దుకొనేటందుకంటూ 1801 లో మరోసంధి చేసుకొన్నారు. దీనిప్రకారం అయోధ్య రాజు మొదటి ఒడంబడికను అమలు జరపనందుకుగాను కొంత రాజ్యభాగాన్ని వదులుకోవలసి వచ్చింది. ఆ విధంగా రాజ్యభాగం లాక్కోవడం వట్టి బందిపోటు దొంగతనమని ఆరోజుల్లో పార్లమెంటులో ఘాటుగా ఖండించేరు. లార్డు వెలస్లీ తన కుటుంబానికున్న పలుకుబడి ఫలితంగా తప్పించుకు బయటపడ్డాడే గాని, లేకపోతే విచారణ కమిటీని ఎదుర్కోవలసి వచ్చేదే.

ఒడంబడికలోని మూడో ఆర్టికలు ప్రకారం ఈ భూమిని తీసుకొన్నందుకు ప్రతిఫలంగా తూర్పిండియా కంపెనీ అయోధ్యరాజుచేతిలో మిగిలిన రాజ్యభాగాన్ని బాహ్యాంతర్గత శత్రువులనుంచి కాపాడడానికి అచ్చుకొంది. ఆ మిగిలిన రాజ్యభాగంమీద ఆయనకు ఆయన వారసులకు, ఆయన వంశీకులకు శాశ్వతమైన అధికారం వున్నదని ఆరో ఆర్టికలులో అంగీకరించేరు. కాని, ఆ ఆర్టికలులోనే రాజు అధికారానికి గోతులు త్రవ్వుతున్న మాటలు కొన్ని ఉన్నాయి. తన ప్రజల క్షేమాభివృద్ధులకు తోడ్పడే పరిపాలనా విధానాన్ని తన ఉద్యోగులద్వారా నిర్వహింపచేస్తానని రాజు దానిలో అంగీకరించేడు. రాజు యీ నియమాన్ని తప్పుతాడు అందాం. తన ప్రజల ప్రాణాలకూ, ఆస్తులకూ భద్రతను కలిగించడనుకుందాం. ఫిరంగులకి కట్టి ప్రజల్ని కాల్చేస్తూన్నాడనీ, వాళ్ల ఆస్తులు లాక్కొంటున్నాడనీ అనుకుందాం. అప్పుడు తూర్పిండియా కంపెనీ ఏం చెయ్యాలి? అయోధ్యరాజుతో ఒడంబడిక చేసుకొన్నారంటే ఆయన సర్వస్వతంత్రుడనీ, తన యిష్టానుసారమే ఒప్పందంలోకి వచ్చేడని ఒప్పుకొన్నట్లేగద! పై పరిస్థితులు ఏర్పడితే తూర్పిండియాకంపెనీ ఆ ఒప్పందాన్ని రద్దుపరచాలి. తర్వాత

వాళ్ళకి మిగిలేవి రెండే రెండు దారులు. రాయబారాలు ప్రారంభించి ఒత్తిడితెచ్చి మరో ఒడంబడికనైనా కుదుర్చుకోవాలి. లేదా ఆయనమీద యుద్ధమైనా ప్రకటించాలి. అలాగాక, ఆయన రాజ్యంమీద యుద్ధ ప్రకటన జరక్కుండా దాడిచెయ్యడమో, అజాగ్రత్తగా వుండగా మైనువేసి రాజ్యం లాక్కోవడమో సంధిపత్రాన్ని అతిక్రమించడమేకాదు. ప్రపంచ రాజ్యనీతి ధర్మాలను నేల రాయడంకూడా.

అయోధ్యను స్వాధీనం చేసుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఎన్నోఏళ్లుగా ప్రయత్నిస్తూంది. 1831 లో పామర్స్టన్ బ్రిటిష్ విదేశాంగమంత్రి కాగానే అయోధ్యను కలిపివేసుకొమ్మని అప్పటి భారత గవర్నర్ జనరల్ కు ఆజ్ఞలు పంపేడు. కాని ఆయన ఆ పని చేయ నిరాకరించేడు. ఈ వ్యవహారం అయోధ్యరాజు చెవిని పడింది. ఆయన ఏదో నెపంతో లండన్ కు ఒక రాయబారిని పంపేడు. ఆయన ఆటంకాలన్నీ నిగ్రహించుకొని బ్రిటిష్ రాజు నాలుగో విలియమ్‌తో భేటీ చేసేడు. తన దేశాన్ని ఎదుర్కొంటున్న ప్రమాదాన్ని వివరించేడు. బ్రిటిష్ రాజుకు ఈ వ్యవహారం అంతవరకూ తెలియదు. దీని ఫలితంగా రాజుకూ, పామర్స్టనుకూ మాటలు ముదిరేయి. ఇంక ఇల్లాంటిపనులుచేస్తే వెంటనే బర్తరఫుచేస్తానని రాజు పామర్స్టన్ కు గట్టిగాచెప్పేడు. అప్పటికది అయింది. మళ్లీ అయోధ్యను కలిపేసుకోవడమూ, అయోధ్య భూముల్ని స్వాధీనపరచుకోవడమూ పామర్స్టన్ విదేశాంగమంత్రిగా వున్నప్పుడే జరగడం గమనించతగి వుంది. 1831 లో అయోధ్యను కలుపుకోనేటందుకు ప్రయత్నించినప్పటి పత్రాలను దాఖలు చేయవలసిందని కొద్ది వారాలక్రితం కామన్సుసభలో ప్రతిపాదన వచ్చింది. కాని, కంట్రోల్ బోర్డు కార్యదర్శి బెయిలీ ఆ కాగితాలు కనిపించడం లేదన్నాడు.

1837 లో మళ్ళీ పామర్స్టన్ విదేశాంగమంత్రి అయ్యేడు. అప్పట్లో లార్డు ఆక్లండు భారతదేశంలో గవర్నరు జనరలు. ఆ కాలంలో అయోధ్యరాజు తూర్పిండియా కంపెనీతో మరో ఒడంబడిక చేసుకోవలసివచ్చింది. 1801 ఒప్పందంలోని 6 వ ఆర్టికలు విధించే బాధ్యతలను రాజు నెరవేర్చకుంటే ఏం చెయ్యాలో ఎక్కడా లేదుగనుక, దానిని స్పష్టంచేసేటందుకే ఈ కొత్త సంధి అన్నారు. ఈ సంధిలో 7 వ ఆర్టికలును కొత్తగా చేర్చేరు. దానిలో ఇల్లావుంది—

"అయోధ్యరాజు తన ప్రభుత్వంలోని పోలీసుశాఖలోను, న్యాయ పరిపాలనా శాఖలలోను వున్న లోపాల్ని సరిచేసేటందుకై బ్రిటిష్ రెసిడెంటుతో ఆలోచించి పరిష్కారం చూడాలి. బ్రిటిష్‌ప్రభుత్వం యొక్క సలహాలనూ, సూచనలనూ నిర్లక్ష్యంచేస్తే, అయోధ్యరాష్ట్రంలో అదేపనిగా నిర్బంధచర్యలు సాగిస్తూంటే, అరాజకమూ, దుష్పరిపాలనా కొనసాగుతూ ప్రజాశాంతికి భంగం ఏర్పడేటట్లయితే—ఇటువంటి పరిస్థితులు కొద్దిపాటి ప్రదేశంలోవున్నా, విస్తార ప్రదేశాలలోవున్నా సరే—అక్కడ తన అధికార్లను నియమించి పరిపాలన నడిపించే హక్కు బ్రిటిష్ ప్రభుత్వానికి వుంది. అవసరంవుందని అనుకొన్నంతకాలం ఆవిధంగా పరిపాలనాధికారాన్ని తీసుకొంటుంది. ఆ ఖర్చులుపోగా మిగిలిన ఆదాయాన్ని ప్రభువు ఖజానాకు జమకడతారు. జమాఖర్చుల లెక్కలు సరిగ్గా వుంచి ప్రభువుకు అప్పచెప్తారు."

దీని తరవాత ఆర్టికలులో ఈ విధంగా వుంది -
"ఏడవ ఆర్టికలులో చెప్పినట్లు గవర్నరు జనరల్ పరిపాలనా బాధ్యతలను తీసుకోవలసివస్తే దేశీయ పరిపాలనా సంస్థలనూ, పరిపాలనా రూపాలను సాధ్యమయినంతవరకు యథాతథంగా వుంచడానికీ, వీలయినంతవరకు ఎక్కువరచడానికీ శ్రద్ధ తీసుకొంటారు. ఆ ప్రాంతాలను ప్రభువుకు తిరిగి వప్పచెప్పడానికి సమయం వచ్చినప్పుడు చిక్కులు ఏర్పడకుండేటందుకు ఈ శ్రద్ధ తీసుకొంటారు."

ఇది అయోధ్యరాజుకూ, గవర్నర్ జనరల్ కూ జరిగిన ఒప్పందం అని చెప్పేరు. ఆ విధంగానే ఇరుపక్షాలూ ఒడంబడికను స్వీకరించాయి. కాని అది తూర్పిండియా కంపెనీ డైరక్టర్లబోర్డు ముందుకు వెళ్ళేసరికి వారు దానిని వెంటనే రద్దు పరిచేరు. అయోధ్య రాజుకూ, కంపెనీకీ మధ్యవున్న స్నేహ సంబంధాలను ఇది భంగపరుస్తూందనీ, దీనిద్వారా ఒక స్వతంత్రరాజు అధికారాలను గవర్నరు జనరల్ భంగపరుస్తున్నాడని అభ్యంతరం చెప్పి దానిని త్రోసివేసేరు. ఇటువంటి ఒప్పందంచేసుకొంటామని విదేశాంగమంత్రి పామర్స్టన్ డైరక్టర్లబోర్డు అనుమతి కోరలేదు. వాళ్లు ఆలా చేసుకోకూడదంటే ఆయన లెక్కచెయ్యలేదు. ఆ ఒప్పందం రద్దయిన సంగతికూడా అయోధ్యరాజుకు ఎన్నడూ చెప్పలేదు. ఈ విషయాన్ని లార్డుడల్హౌసీ స్వయంగా ఒప్పుకొన్నాడు. 1856 జనవరి 5 నాటి మినిట్సులో ఈ విధంగావుంది- "అయోధ్య రాజు రెసిడెంటుతో మాట్లాడేటప్పుడు 1837 లో అప్పటి రెసిడెంటుతో చేసుకొన్న ఒడంబడికను గురించి ప్రస్తావిస్తాడు. ఆ ఒడంబడికను ఇంగ్లండుకు పంపగానే

డైరెక్టర్ల బోర్డు దానిని రద్దుచేసింది. ఆ సంగతి రెసిడెంటుకు తెలుసు. 1837 సంధిలోవున్నట్లు సైన్యాలను ఎక్కువచేయడంవంటి బాధాకరమైన కొన్ని షరతులను అసలు జరపబోమని అయోధ్యరాజుకు చెప్పేరు. అంతేగాని దానిని అసలే రద్దుపరచినట్లు ఆయనకు చెప్పలేదు. ఆసంగతి రెసిడెంటుకు తెలుసు. ఆవిధంగా మూతిముప్పిడిగా వుంచడం బాధ కలిగిస్తూంది. ప్రభుత్వం అధికారయుతంగా 1845 లో ప్రకటించిన ఒడంబడికల సంపుటంలో దానిని కూడా చేర్చడం మరీ ఇబ్బందిగావుంది."

ఆ మినిట్సులోనే 17 వ పేరాలో ఇల్లావుంది. "అయోధ్యపరిపాలన విషయంలో ఇంకేమన్నా చర్యలు తీసుకోవలసివుంటే, ఆఒడంబడిక ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వానికి వున్న విశేషాధికారాల ప్రయోగించవచ్చును గాదా అని రాజు అడగవచ్చు. అప్పుడు డైరెక్టర్ల బోర్డు దానిని రద్దుచేసిందనీ, అది అమలులోనే లేనట్లే భావించాలనీ చెప్పాలి. అదనపు సైన్యాలను వుంచేటందుకై ఎక్కువ ధనం ఇవ్వవలసి వుంటుందంటూ 1837 ఒడంబడికలోవున్న షరతును, మరి కొన్నిటిని అమలు జరపబోవడంలేదని లక్నో ప్రభుత్వానికి ఆ రోజుల్లోనే తెలియపరచిన సంగతిని గుర్తుచెయ్యాలి. మిగిలినవి తక్షణం అమలు జరపవలసిన తొందర లేకపోవడంవల్ల సంధి రద్దును గురించి వెంటనే చెప్పవలసిన అవసరంలేనట్లు భావించబడిందనీ, తర్వాత అశ్రద్ధకొద్దీ చెప్పడం జరగలేదని చెప్పాలి."

1845 లో ప్రకటించబడిన ఒడంబడికల సంపుటంలో దానినికూడా చేర్చడం ఒక్కటే కాదు. 1839 లో లార్డు ఆక్లెండు అయోధ్యరాజుకు వ్రాసిన ఒక లేఖలో యీ సంధి అమలులో వున్నట్లే వ్రాసేడు. 1847 జనవరి 23 న అప్పటి గవర్నరు జనరలు లార్డు హార్డింజి అయోధ్యరాజుకు వ్రాసిన లేఖలోనూ, 1851 డిసెంబరు 10 వ తేదీన లక్నో రెసిడెంటు కర్నల్ స్లీమన్ లార్డ్ డల్హౌసీకి వ్రాసినదాంట్లోనూ కూడ యీ ఒడంబడిక సజీవంగా వున్నట్లే వ్రాసేరు. ఈ విధంగా తనకు ముందున్న గవర్నరు జనరల్సు, తన క్రిందనే పనిచేసినవారూ అయోధ్యరాజు తోడి వ్యవహారాలలో అమలులో వున్నట్లే ఒప్పుకొన్న ఒడంబడిక రద్దయిందనాలనే ముద్దా లార్డు డల్హౌసీ కెందుకు? బ్రిటిషువాళ్ళ సౌకర్యం కలిగించుకొనే అవకాశాలను అయోధ్యరాజు కలిగించినా, ఆ ఒడం

## ఇద్దరు తెలుగుజమీందార్ల తిరుగుబాటు

1858 జనవరిలో చాందా జిల్లాలోని మొలంపల్లి జమీందారు బాపూరావు, ఆరపల్లి జమీందారు వెంకట్రావు అనే ఇద్దరు తెలుగు జమీందార్లు ఇంగ్లీషు ప్రభుత్వంమీద తిరుగుబాటు చేసేరు. వీరిలో బాపూరావును అతని జమీందారిలోని తాలూకు మనుష్యులు ఆ సంవత్సరమే మోసంతో పట్టుకొని బ్రిటిషు వాళ్ళకి అప్పగించారు. వాళ్ళాయనను వురితీసేరు. వెంకట్రావు 1860 వరకూ గోండులను, రోహిల్లాలను కూర్చుకొని పోరాటం సాగిస్తూనే వున్నాడు. ఆ సంవత్సరం పట్టుబడ్డాడు. ఆయనకు ద్వీపాంతరవాస శిక్ష విధించారు.

ఈ ఇద్దరు వీరుల్ని గురించి చాందా జిల్లాలో పాటలు తెలుగులో ప్రచారంలో వున్నాయి.

బడిక వుండగా వాళ్ళు పెట్టుకోగల సైన్యం చాల పరిమితం. అయోధ్యరాజు పేరుకుమాత్రమే. బ్రిటిషు అధికారులు పాలనాభారాన్ని ఎత్తుకోవాలి. ఆయనకు జమాఖర్చులు చెప్పాలి. ఖర్చులుపోను మిగతాధనం ఆయనకు ఇచ్చెయ్యాలి. అలా చెయ్యడం వాళ్ళ కిష్టంకాదు. రాజ్యాన్ని కలిపేసుకోవడం తప్ప మరొకటేదీ లాభమూలేదు: అవసరమూలేదు.

ఇరవయ్యేళ్ళుగా అయోధ్యరాజుతోడి వ్యవహారాలకు పునాదిగా తీసుకొంటున్న ఒడంబడిక చెల్లదనడమూ, తామే చేసుకొన్న ఒడంబడికకు విరుద్ధంగా ఒక స్వతంత్ర రాజ్యాన్ని ఆక్రమించుకోవడమూ, అంతటితో తనివితీరక దేశంలోవున్న ప్రతి అంగుళం మేరనూ స్వాధీనపరచుకోవడమూ ఇండియన్ల విషయంలో బ్రిటిష్‌వాళ్ళు అనుసరిస్తున్న విశ్వాసఘాతుకత్వానికీ, పశుత్వానికీ నిదర్శనాలు. వాటిఫలితాలు నేడు ఇండియాలోనూ, ఇంగ్లండులోనూ కూడా కొట్టుకువస్తున్నాయి.

న్యూయార్కు డైలీ ట్రిబ్యూన్
28-5-1858.



# సంపాదకలేఖ

## 1857 విప్లవం: దాని వర్గప్రయోజనాలు

ఆర్యా,

**1857** నాటి భారత స్వాతంత్ర్య పోరాటం జాతీయ సమర స్వభావాన్ని జనరల్‌గా కలిగివున్నా, ఈ తిరుగుబాటు ప్రధానంగా ఏవర్గ ప్రయోజనాలను సాధించేందుకు జరుపబడిందో, మొగల్ చక్రవర్తి జారీచేసిన ఒక కరపత్రంవల్ల బోధపడుతుంది. అందులో యిలా ఉంది:

"హిందూ మహమ్మదీయులైన భారతీయులందరినీ మ్లేచ్ఛులూ, ముట్రదారులూ అయిన బ్రిటిషువారు అణగద్రొక్కవలెనని ప్రతిక్షణం ప్రయత్నిస్తున్నారు. హిందూ మహమ్మదీయులలో అనేకమంది పెద్దవారు, గౌరవనీయులు, క్రైస్తవమతపు పీడనుండి తప్పించుకొనుటకు తమ ఆస్తిపాస్తులను విడిచి నా వద్దకు వస్తున్నారు. వారందరూ ఈ స్వాతంత్ర్య సమరంలో పాల్గొంటున్నారు. ప్రజాసామాన్యానికి తెల్పేందుకు ఈ పత్రం జారీచేయబడుతోంది. అందరూ యీ కరపత్రంలోని విషయాలను అవగాహనచేసికొని అట్లు ప్రవర్తించవలెను. ఈ సమరంలో పాల్గొనువారికి ఆయుధాలు, ధనము మొదలైన సామగ్రి కావలసివస్తే తగురీతిగా యివ్వబడుతాయి.

"హిందూమహమ్మదీయుల పురాతనగ్రంథములునూ, వాటిని చదివిన పెద్దలునూ (మతగురువులు, మౌల్వీలు) ఆంగ్లరాజ్యం భారతభూమిపై మనజాలదని నొక్కి వక్కాణిస్తున్నారు. గనుక మన యీ విప్లవం సఫలం కాజాలదని అధైర్యపడి నిరాశ చెందవద్దు. ఈ సమయంలో పాదుషా ప్రభుత్వానికి అన్నివిధాలా తోడ్పడి స్వాతంత్ర్య సమరాన్ని కొనసాగించండి. దీనివల్ల భారతదేశంలోవున్న ప్రతివ్యక్తికీ అనేకలాభాలు కలుగుతవి. కనుక ఈ శుభతరుణాన్ని జారవిడువకండి. సమయందాటిన పిదప దుఃఖములో మునిగి దిక్కుమాలి కూర్చొనవలసివచ్చును.

"ఎవరికైనను సైనికులవలన అన్యాయముగా ధన, ప్రాణ నష్టములు సంభవించినచో నాకు తెలిపిన యెడల తగురీతిని విచారించి వారి కష్టసుఖములను కనుగొందును.

"జమీందారుల విషయము: ఈ దేశంలో బ్రిటిషువారు తమ స్వార్థంకొరకు జమిందారీలను స్థాపించుచున్నారుగాని ప్రజల యోగక్షేమములను విచారించి కాదు. అందువల్లనే తమ స్వార్థ ప్రయోజనాలకు అడ్డుతగులు జమిందారులను కష్టాల పాలుకావించుటే గాక పరాభవాగ్నిలో ముంచుచున్నారు. రెవెన్యూ బాకీ యున్నదని మిషపెట్టి జమీలను వేలానికి తెస్తున్నారు. కనుక, జమిందారులందరు యీ స్వాతంత్ర్య సమరంలో పాల్గొని మాతృభూమికి సేవ చేయండి. ఏ దిక్కులేనివాడు ఏ చిన్న దావావేసినా పెద్ద జమిందారునైననూ కోర్టుకు రప్పించి చిన్నబుచ్చుచున్న అనుభవం మీరు ఎరిగినదే. ఎంత చిన్న విషయముపైననూ గౌరవనీయులనుగూడ (జమిందారీ, జాగీర్దారీ, భూస్వామ్యవర్గం) ఖైదుచేసి, దేశగౌరవమును నేలపాలు చేయుచున్న విషయం మీకు తెలుసును. స్టాంపు ఫీజనీ, యింకో ఫీజనీ, దావాలను అంతులేకుండా వాయిదాలు వేస్తూ యిబ్బందులు కల్గించటమే కాకుండా, ఆస్తిపాస్తులకు నష్టంకూడా కలిగిస్తున్నారు. జమిందారులవద్దనుండి పాఠశాలలకనీ, త్రోవలకనీ అమితమైన ధనాన్ని వసూలుచేస్తూ, క్రైస్తవమత ప్రచారం కొరకు ఉపయోగించుకొంటున్నారు. ఇటువంటి బాధలు పాదుషా ప్రభుత్వం వచ్చినమీదట వుండవు. ఇంతేకాక శిస్తులు, మామూళ్లు తగ్గింపబడతవి. పాదుషా ప్రభుత్వం జమిందారుల గౌరవప్రపత్తులను తన గౌరవప్రపత్తులుగా యెంచుతుంది.

"ఈ స్వాతంత్ర్య సమరంలో నాతో చేయికలిపి, ధనసహాయం చేస్తే, మున్ముందు ప్రభుత్వానికీయవలసిన శిస్తులో నాల్గవవంతు తగ్గించబడును. ఇంతకు ముందు బ్రిటిషు ప్రభుత్వంచేత జమిందారీలనుండి తొలగింపబడ్డ జమిందారులు, యీ ఉద్యమంలో నాకు తోడ్పడితే విప్లవానంతరం అట్టివారి జమిందారీలు తిరిగి యివ్వబడి శిస్తులో నాల్గోవంతు తగ్గించబడును."

వ్యాపారస్తుల విషయం: "ఆంగ్లేయ ప్రభుత్వం వ్యాపారస్తులను నాశనంచేసి, ఆ తెగనుగూడా తనకు

బానిసగా చేసికొనదలచి, సుగంధ ద్రవ్యాలూ, నీలి మందూ, యిలాంటి యెక్కువ ఖరీదుగల యెన్నో సరకులను, వ్యాపారాన్నంతనూ తన కంట్రోల్‌లో వుంచుకొని, తానే గుత్తాధిపత్యం వహించి, చిన్న చిన్న సరకులకు సంబంధించిన వ్యాపారాన్ని మాత్రం వారికి వదలివేసింది. అందులోనూ, మళ్ళీ డబ్బు గుంజుకోనెంచి, శాయిరీ అంటూ, స్టాంపు ఫీజంటూ ఏమేమో పిండుతోంది. ఇదీ చాలక గిటు పన్నంటూ వసూలు చేస్తోంది. స్కూళ్ళను స్థాపించేందుకని మళ్ళీ చేతులు చాపడం - ఇంత జరిగినా ఎవడైనా వ్యాపారస్తులపై రిపోర్టు చేస్తేచాలు, శిక్షలు బాధలు తప్పడం లేదు. పాదుషా ప్రభుత్వంలో మీకీ బాధ లుండవు. .........కావున ప్రతి వ్యాపారస్తుడు ధనమిచ్చీ, మనుష్యులను పంపీ, రహస్యంగాగానీ బహిరంగంగా గానీ ఈ స్వాతంత్ర్య సమరంలో పాల్గొని విప్లవ విజయానికి తోడ్పడాలని కోరుతున్నాను."

ప్రభుత్వోద్యోగుల విషయం: "సోదరులారా, మీరు పొట్టకోసం నౌకరీలు చేస్తున్నారుగాని, మీ మానమర్యాదలు దక్కడంలేదనేది అందరికీ తెలిసినవిషయమే. మానంపోయినా దాణా ఐనా దొరకడంలేదు. పెద్ద ఉద్యోగాలు, హెచ్చుజీతాలు తెల్లదొరలవే. జీవితమంతా సైన్యంలో గడిపినా, సుబేదారైతే రు. 60 యిచ్చేటప్పటికి అతికష్టం ఔతోంది. "సర్దార్ ఆలా" లాంటి పదవిలోకి ఎవరైనా వచ్చి, 500 రూపాయలజీతం పుచ్చుకొన్నా గౌరవమర్యాదలు మాత్రం సున్నా. పాదుషాప్రభుత్వం వచ్చిన పిదప "సన్నాదీ", "పంచ కాజార్", "సిపాహి సాలార్"లాంటి మహోన్నతపదవులు లక్షలజీతాలతో దేశీయులపరం చేయబడును.

కార్మికుల, కర్షకుల విషయం: "బ్రిటిషువారు తమ దేశాన్నుండి సరకులను తెచ్చి యీ దేశంలో అమ్ముతున్నారు. అందువల్ల ఇక్కడ నేతగాండ్రు, వడ్రంగులు, కంసాలులు, చెప్పులుకుట్టేవాళ్ళు, అందరూ తమ జీవనోపాధులను పోగొట్టుకొన్నారు. పాదుషాప్రభుత్వంలో పైచెప్పినవారంతా తమతమ జీవనోపాధులు పొందగలుగుతారు. కాబట్టి చేతనైనంతవరకు, ఈ సమరంలో చేరి, సహాయం చేయండని కోరుతున్నాను."

పండితులు, ఫకీరుల విషయం: "హిందూమత పండితులు, గురువులు, ఫకీరులు స్వాతంత్ర్యమున్నగాని తమతమ మతములు పోషింబడవుగాన, యీ స్వాతంత్ర్య సమరంలో దేశహితాన్ని చేయగోరుచున్నాను. లేనియెడల ధర్మశాస్త్ర ప్రకారం షరీయత్ ననుసరించి శిక్షింపబడుదురు."

ఈవిధంగా నాటి మొగల్ చక్రవర్తి బహదూర్ షా వివిధవర్గాలకు, తరగతులకు చెందిన ప్రజలకు వాగ్దానం యిచ్చాడు. ఆ కరపత్రంలో ప్రధానంగా జమీందారీ భూస్వామ్యవర్గంయొక్క ప్రయోజనాలు ఏవిధంగా దెబ్బతిన్నవో, వాటిని తిరిగి ఏవిధంగా తాను కాపాడగలడో పాదుషా వాగ్దానంచేశాడు. పోతే మిగతా తరగతులకు చెందిన ప్రజలకు సాధారణమగు వాగ్దానాలే యివ్వడం కన్పిస్తుంది....

డల్హౌసీ పెన్షన్ ఎగనాంవేయగా క్రోధాగ్నిలో మండిపోయిన నానాసాహెబ్, అతని కుడిభుజమైన అజిముల్లాఖాన్, తన సంస్థానాన్ని అక్రమంగా అన్యాయంగా హరించగా (మొదట ఎంతో మిత్రభావాన్ని చూపినా) అసంతృప్తి జ్వాలలో ఆహుతైన ఝాన్సీ లక్ష్మీబాయి, పదవీభ్రష్టుడు గావింపబడి మాన మర్యాదలు మంటగలవగా మట్టిబొమ్మలా తయారైన బహదూర్ షా, తాంతియాతోపే, కుమార్ సింహ్, రంగోబాపూజీలాంటి వీరులు, రాజనీతితంత్రజ్ఞులు సమరానికి నాయకత్వం వహించారు. పోరాటంలో ప్రథమశ్రేణిలో వున్నది సైనికులు. ప్రధానంగా అయోధ్య, బెంగాల్, రాజపుటానాలకు చెందిన సిపాయిలు ప్రధానపాత్ర వహించారు.

ఈ సమరం భారతజాతి స్వాతంత్ర్యంకొరకు ప్రథమంగా దేశవ్యాపితంగా జరిగినదనే విషయంలో భారతదేశంలోని ఏ వ్యక్తీ శంకించడు; శంకించలేడు. ఐతే ఈ సమరానికి నాయకత్వం వహించినది సర్వశక్తులు జీర్ణించిపోయి శిథిలమై కాలగర్భంలో కలిసిపోవ సిద్ధంగావున్న స్వదేశ సంస్థానాధీశులు, జమీందారీ జాగీర్దారీ ఫ్యూడల్ భూస్వామ్యవర్గం - అంటే నాటి పాలకవర్గ మన్నమాట. అసంతృప్తితో బ్రిటిష్ ప్రభుత్వంపై పగ సాధించేందుకు సమయంకొరకు పొంచి వున్నారు పదవీభ్రష్టులైన నాటి స్వదేశసంస్థానాధీశులు.

సంస్థానాలను ఆక్రమించుకొనకపోతే ఎంతమంది ప్రధానవ్యక్తులు యీ సమరానికి దూరంగా వుండేవారో! ఎందుకంటే, ఝాన్సీ సంస్థానాన్ని ఆక్రమించుకొననంతవరకూ, ఆక్రమించుకొన్న పిదప కొంతకాలంవరకూ గూడ ఝాన్సీ లక్ష్మీబాయి ఆంగ్ల ప్రభుత్వంతో మంచిసంబంధాలనే పెట్టుకొన యత్నించింది. ఎప్పుడైతే ఆంగ్లసేనాని ఐన సర్ హ్యూరోజ్ లక్ష్మీబాయిని జైలులో వేసేందుకు ప్రయత్నించాడో,

ఎప్పుడైతే తన ఉనికికే భంగంవాటిల్లిన విపత్కర పరిస్థితులు వచ్చినవో, అప్పుడు ఆమె తిరుగుబాటు దార్లలో కలిసిందనే విషయం చరిత్ర చెప్పే సత్యం. ఇది గమనార్హం. పరిపాలనాధికారాన్ని, ఆదాయాన్ని పోగొట్టుకొని, ఊడగొట్టిన మంచంకోళ్ళలాగ తయారైన వివిధ సంస్థానాధిపతులు, ఫ్యూడల్ భూస్వామ్య వర్గం - వీరే పోరాటంలో ప్రధానపాత్ర వహించారు.

వీరు తమ నాయకుడుగా, తమ ఉత్సాహానికి కేంద్రంగా శిథిలమైపోయిన, సర్వశక్తులు ఉడిగిపోగా కీలుబొమ్మలా తయారైన 80 ఏళ్ళ బహదూర్ షాను - నాటి చివరి మొగల్ చక్రవర్తిని - యెంచుకొన్నారు. ఈ పాదుషానుగూర్చి కార్ల్ మార్క్స్ "న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్" అనే అమెరికన్ పత్రికకు 1858 లో వ్రాస్తూ యిలా అంటాడు:

"వారు (సంస్థానాధీశులు) ఎందుకైనా పనికివస్తే, తమ చక్రవర్తిత్వాన్ని అత్యంత హీనమైన, అపహాస్య పూరితమైన స్థాయిలో ప్రదర్శించుకోడానికే పనికి వస్తారు. ఉదాహరణకు తైమూర్ వంశానికిచెందిన మొగల్ చక్రవర్తినే తీసుకోండి (బహదూర్ షా-అను.) అతనికి ఏటా 1,20,000 పౌనులు యిస్తున్నారు. కాని అతని అధికారం అతని రాజభవన ప్రాకారాలను దాటి వెళ్లదు. అక్కడ బుద్ధిహీనులైన రాజవంశీకులు పనీ పాటా లేకుండా కుందేళ్లలా సంతానం కంటూ ఉంటారు. ఢిల్లీ పోలీసుశాఖ సహితం ఆంగ్లేయుల చేతుల్లోనే ఉంది; దానిమీద చక్రవర్తికి ఎట్టి పెత్తనం లేదు. అతడు ముడతలుపడి కుంచించుకుపోయి పాలి పోయిన శరీరంతో, బోగంపిల్లలు వేసుకొనే జిపుటా దుస్తులను పగటివేషగాడిలా వేసుకొని గద్దెమీద కూర్చుంటాడు."

ఇలాంటి దౌర్బల్యస్థితికి దిగజారి, దిగజార్చబడిన నాటి మొగల్ చక్రవర్తీ, అతనిచుట్టూ చేరిన వివిధ సంస్థానాధీశులూ నాయకత్వపాత్ర వహించిన ఈ సమరంలో ప్రజలు అధికంగా పాల్గొనలేదు. ఈ పోరాటంలో దక్షిణభారతావని దాదాపు పాల్గొన లేదనే చెప్పాలి. ఉత్తరదేశంలో గ్వాలియర్ రాజైన సింధియా, ఇండోర్ రాజైన జస్వంతరావు హోల్కార్, పంజాబులోని సిక్కులు, దక్షిణాన నైజాంనవాబు, మరికొంతమంది బ్రిటిషు సామ్రాజ్యవాదుల బడి తొత్తులు విప్లవాన్ని సమర్థించలేదు.

"ప్రధానంగా ఈ సమరం భూస్వామ్యవర్గానికి చెందిన ప్రధానవ్యక్తులూ, వారి అనుచరులూ నాయకత్వం వహించగా, దావానలంవలె వ్యాపించిన విదేశ వ్యతిరేకభావం (anti-foreign sentiment) వల్ల జరిగిన ఫ్యూడల్ భూస్వామ్య తిరుగుబాటు. అశక్తుడై, బలహీనుడై ముసలితనంలో వుండి, ఢిల్లీ ప్రాసాదంలో కూర్చొని, మొగల్ వంశ అవశేషంగా మిగిలిన బహదూర్ షావైపు ఈ వర్గం అనివార్యంగా నాయకత్వంకొరకు చూచింది. హిందువులు, ముస్లింలు ఈ పోరాటంలో పాల్గొన్నారు." (పండిట్ నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియా - పేజీ 324).

బ్రిటిష్ సామ్రాజ్య పాలనను తుదముట్టించేందుకు భారతదేశంలోని - ప్రధానంగా ఉత్తరభారతంలోని - ఫ్యూడల్ భూస్వామ్యవర్గం చివరిసారిగా చేసిన నిరాశాపూరితమగు ప్రయత్నమే 1857 సమరానికి ప్రధాన ప్రాతిపదిక. ఈ వర్గానికిచెందిన ప్రధాన వ్యక్తులపై ప్రజలకు ఆదరాభిమానాలు మెండుగా వున్నా, ఈ ప్రధాన వ్యక్తులలో పోరాటాన్ని జయప్రదంగా నడపగల శక్తిసామర్థ్యాలు లోపించాయి. అంతేగాదు; వారికట్టి ఆదర్శంలేదు. వీరికీ, భారతదేశంలోని అశేష ప్రజాసామాన్యానికీ ఒకే త్రాటిపై నడుపు జాతీయభావం నాడు లేదు. అలాంటి జాతీయ భావం, యింకా అభివృద్ధి కాలేదు.

"నాయకులలో జాతీయతగాని, ఐక్యతా భావం గాని లేదు. కేవలం విదేశీయులపట్ల ద్వేషం, తమ భూస్వామ్య సౌకర్యాలను నిలబెట్టుకోవాలనే కాంక్ష మాత్రమే జాతీయత, ఐక్యతా భావంయొక్క స్థాన మాక్రమించలేవు." (నెహ్రూ: డిస్కవరీ ఆఫ్ ఇండియా).

భారతదేశం వ్యవసాయదేశం. గ్రామసీమ భారతావనికి వెన్నుముకవంటిది. రైతు భారతజాతికి జీవగర్ర. అశేష సంఖ్యాబలం గలిగిన భారతీయ కర్షకుల అండదండలపై ఆధారపడని ఏ ఉద్యమమైనా నిఫలంకాక మానదని 1857 సమరం బల్లగుద్ది చెప్పింది. ఈ చారిత్రక సత్యాన్ని భారతదేశంలోని ప్రతివ్యక్తీ గుర్తించడం ఎంతో అవసరం. కారన్‌వాలిస్ ప్రవేశపెట్టిన పెర్మనెంట్ రివెన్యూ సెటిల్‌మెంట్ వల్ల దేశంలోని భూస్వామ్యవర్గంలో ఒకభాగం ధనవంతమైంది. తరతరాలనుండి తమను జలగల్లాగ పీల్చుకుతిన్న జమిందారీ, జాగీర్దారీ వర్గం చేసే తిరుగుబాటు జయమొందితే తమను యింకా పీడిస్తారనే భీతితో రైతులు పాల్గొనలేదు. (అశోక మెహతా).

"తరతరాలనుండి పీడింపబడిన రైతులను ఒకచోట చేర్చి వారి శక్తిని సమీకరించి నడుపు నాయకుడు లేక పోయాడు. కనుక, రైతుల శక్తిసామర్థ్యాలు దేశాని కుపయోగపడలేదు." (రజనీ పామీదత్తు.)

కాబట్టి, తరతరాల దాస్యంలో నికృష్టమగు బ్రతుకు గడిపిన భారతీయ కర్షకుడు, కూలి, సామాన్యుడు విప్లవానికి దూరంగానే ఉండిపోయాడు. తుపాకిలో తూటా లేకపోతే ఫలితం ఎలావుండదో, అలాగే భారతీయ విప్లవానికి మందుగుండు సామగ్రి లాంటి భారతీయకర్షకుడు, వ్యవసాయకూలీ దూరంగా వున్న విప్లవపోరాటం తప్పక అపజయం పొందుతుంది. అలాగే జరిగిందికూడా.

వారిలో ఆత్మవిశ్వాసాన్ని రగుల్కొలిపి సమరాంగణంలోకి తీసుకవచ్చే సమర్థవంతమగు నాయకత్వపు లేమి విప్లవపరాజయానికి తోడ్పడిన అత్యంత ప్రధాన కారణాలలో మొదటిది. ఝాన్సీ, నానా, తాంతియా, రాణాకుమార్ సింగ్ వంటి మహావీరులు సైనికులులేని సేనానులుగానే మిగిలిపోయారు. ఎప్పుడైతే, ఎక్కడైతే ఈ ప్రధానవ్యక్తులు పరాజయంపొంది రణరంగంనుండి నిష్క్రమించారో, అప్పుడే ప్రజల పోరాటశక్తి కూడా చల్లారిపోయింది. మరో 90 సంవత్సరాలవరకు భారతజాతి బానిసజాతిగా బ్రతుకవలసిన దౌర్భాగ్యస్థితి పట్టింది.

ఇక విప్లవ ఫలితాలనుగురించి చెప్పవలసి యుంది.

1. క్రీ. శ. 1600 లో స్థాపింపబడిన ఈస్టిండియా వర్తకసంఘం రద్దుచేయబడింది. భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ప్రకటింపబడింది.

2. నాటినుండి జమీందారులు, సంస్థానాధీశులు మొదలగు ఫ్యూడల్ భూస్వామ్యవర్గం బ్రిటిష్ ప్రభుత్వపు తొత్తులుగా, బ్రిటిష్ సామ్రాజ్య భవనానికి మూలస్తంభాలుగా, పరమఅభివృద్ధినిరోధకశక్తులుగా తయారయ్యారు. ఒకానొకనాడు - 1857 లో - ఒక సమరానికి నాయకత్వం వహించిన ఈ స్వదేశీసంస్థానాధిపతులు పచ్చిఅభివృద్ధినిరోధకశక్తులుగా తయారవడం చారిత్రకంగా సత్యం; ఐనా ఆశ్చర్యం మాత్రం కాదు. కారణం, ఆ అభివృద్ధినిరోధకతత్వం ఆ వర్గంయొక్క స్వభావంలోనే అంతర్గతమై వుంది. చరిత్రలో తమ పాత్రను నిర్వహించడం పూర్తయిన తరువాత ఆ వర్గం అభివృద్ధినిరోధక సమూహంలో ఏమాత్రం ఆశ్చర్యంలేదు.

3. ఏకగర్భ జనితులవలె పోరుసల్పిన హిందూ ముస్లిములలో - ప్రధానంగా హిందూ మహమ్మదీయ సిపాయిలలో - బ్రిటిష్ ప్రభుత్వం తంపులుపెట్టి - "విభజించి పాలించు" అనే కుటిలనీతి ద్వారా చిచ్చులు, కలహాలు తీసుకువచ్చింది.

"హిందూ ముస్లిములు కలసి మెలసి సాగించిన యీ సమిష్టి సమరమే మనలను (బ్రిటిషువారిని) యీ స్థితికి తీసుకువచ్చింది. ఈ రెండు జాతులలోనూ మన కెదురు తిరగనివారంటూ మచ్చుకైనా ఒక్కరూ లేరు." (కేయీ).

ఎన్ని ప్రధాన బలహీనతలు, లోపాలు వున్నా 1857 లో జరిగిన సమరం ప్రథమ భారత స్వాతంత్ర్య సమరమని అనుటలో ఎవ్వరికీ ఎలాంటి సందేహం ఉండనవసరంలేదు.

"నిరంతర జాగరూకతే స్వాతంత్ర్యానికి చెల్లించ వలసిన మూల్యం." (పెరిక్లస్).

సి. వరహాలరావు

బందరు.



# BIBLIOGRAPHY

(ఈ సంచిక ప్రచురణకు తోడ్పడిన గ్రంథాలు)


INDIAN WAR OF INDEPENDENCE ... V. D. Savarkar.

HISTORY OF THE FREEDOM MOVEMENT IN HYDERABAD (Vol. II) ... The Hyderabad State Committee appointed for the compilation of a History of the Freedom Movement in Hyderabad.

Do IN MADHYA PRADESH ... Madhya Pradesh State Committee

GLIMPES OF WORLD HISTORY ... Jawaharlal Nehru.

INDIA TO-DAY ... R. P. Dutt.

1857 – THE GREAT REBELLION ... Asok Mehta.

EMPIRE OF THE NABOBS ... Lester Hutchinson.

HISTORY OF THE INDIAN MUTINY ... Charles Ball.

THE INDIAN MUTINY OF 1857 ... G. B. Malleson.

RISE AND FALL OF THE EAST INDIA COMPANY ... R. K. Mukherjee.

INDIA IN THE VICTORIAN AGE ... R. C. Dutt.

RISE OF THE CHRISTIAN POWER IN INDIA ... Major B. D. Basu.

HISTORY OF THE MADRAS ARMY ... Lt. Col. Wilson.

JOURNAL OF INDIAN HISTORY (Trivendram) ... August 1956.

KRISHNA DISTRICT MANUAL ...

VIZAG DISTRICT GAZETEER ...

GODAVARI DISTRICT GAZETEER ...

MARX-ENGELS LETTERS ON THE INDIAN REVOLT ...

మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి ... ముదిగంటి జగ్గన్నశాస్త్రి.


స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-2.

# అమూల్యమైన మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథం

సోవియట్‌యూనియన్ విప్లవంలోనూ, సోషలిస్టు నిర్మాణంలోనూ అనుసరించిన మూలవిధానం సరియైనదేనా?

మార్క్సిజం - లెనినిజం కొరకు పోరాట్టంలో మేటి దిట్ట అనిపించుకున్న స్టాలిన్ తన జీవితంయొక్క చివరిభాగంలో చేసిన కొన్ని పొరపాట్లు దీర్ఘకాల స్వభావంగల తప్పిదాలుగా పరిణమించడానికీ, వాటిని అప్పటికప్పుడు సరిదిద్దలేక పోవడానికీ కారణ మేమిటి?

మార్క్సిస్టులంతా పిడివాదాన్నీ, మూలసూత్రాలను తలక్రిందులుచేసే ధోరణినీ ప్రతిఘటించవలసిన అవసర మేమిటి?

ప్రపంచదేశాల శ్రామిక ప్రజలమధ్య సమైక్యత ఎలా ఉండాలి?

ఈ ప్రశ్నలకు 'పీపుల్స్ డెయిలీ' పత్రిక (చైనా) సంపాదకవర్గం ఒక వ్యాస రూపంలో ప్రతిభావంతమైన సమాధానాలిచ్చింది. తప్పక చదవండి!

## మరొకసారి శ్రామిక నియంతృత్వంయొక్క చారిత్రకానుభవంగూర్చి పరిశీలన

వెల: 0-2-0.

★

ప్రజలకు సన్నిహితంగావుండే పంథా అంటే ఏమిటి? ప్రజాశక్తులన్నింటినీ ఒక్కతాటిమీదకి, తేవడం సాధ్యమా? ఎల్లాగ? దేశాన్ని సత్వరంగా అభివృద్ధి చేయవలసిన అవసరాన్నీ, దానికున్న అవకాశాల్నీ సమన్వయం చెయ్యడం ఎల్లాగ?

వీనికి చైనా ఇస్తున్న సమాధానం ఏమిటి?... చదవండి!

చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభకు సమర్పింపబడిన నివేదికలు:

| | | |
|---|---|---|
| పార్టీ నిర్మాణ సమస్యలు | —టెంగ్ సియావో-పింగ్ | 0-8-0 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక | —చౌ ఎన్ లై | 0-8-0 |
| రాజకీయ నివేదిక | —లీ షావ్ - చీ | 1-0-0 |

ప్రతులకు:

## విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2

Edited, Printed and Published by G. RADHAKRISHNA MURTY.
Printed at Swatantra Art Printers, Vijayawada.

# సందేశం

- తాత్త్విక
- ఐతిహాసిక
- అధ్యయన
- సంచిక

1879 ఆశ్వయుజం (అక్టోబరు 1957)

# సందేశం

(మార్క్సిస్టు సిద్ధాంత - రాజకీయ మాసపత్రిక)

## తాత్త్విక, ఐతిహాసిక అధ్యయన సంచిక

శాలివాహన శకం 1879, ఆశ్వయుజం

అక్టోబరు 1957

సంపుటి 4  సంచిక 9

సంపాదకవర్గం:

కంభంపాటి సత్యనారాయణ

మోటూరు హనుమంతరావు

దేవులపల్లి వెంకటేశ్వరరావు

# విషయసూచిక







వెల : రు. 1.25 నయాపైసలు

# స్వవిషయం

రెండువందల సంవత్సరాల బ్రిటిష్‌పాలన మన దేశాన్ని ఆర్థికంగానే కాద, రాజకీయంగానే కాదు, సాంస్కృతికంగా కూడ అధ్వాన్నస్థితికి తెచ్చింది. ప్రపంచంలో అత్యంత ప్రాచీన నాగరికతగల దేశాల్లో మన దొకటి. కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రాల్లో ప్రాచీన భారతదేశానికొక విశిష్ట స్థానముంది. కాని, సామ్రాజ్యవాద పాలకులు సాంస్కృతికంగా మన ప్రజల్ని అధోగతి పాల్జేయడానికి మన దేశ చరిత్రను వక్రంగా చిత్రించారు; భారతీయ తాత్విక ధోరణులను అపహాస్యం చేశారు; భారతీయ కళలను, సాహిత్యాన్ని చిన్నచూపు చూశారు.

ఈ విధానానికి వ్యతిరేకంగా పలువురు చారిత్రక వేత్తలు, తత్వశాస్త్రజ్ఞులు, కళాకారులు, సాహితీపరులు, శాస్త్రపరిశోధకులు — వేయేల అన్ని శాఖలకు చెందిన సంస్కృతిపరులు అపూర్వమైన పరిశోధనలు సాగించారు; మన ప్రాచీన సంస్కృతియొక్క ఔన్నత్యాన్ని ప్రపంచానికి చూపారు.

వారందరి దేశసేవా తత్పరతకు, పరిశోధనా కృషికి హృదయపూర్వకంగా అభివందన లందజేస్తున్నాం.

గతంనుంచి పుట్టింది వర్తమానం. భవిష్యత్తుకు యిది మార్గం చూపుతుంది. ప్రాచీన చరిత్రనుంచి ఆధునికులమైన మనం పాఠాలు నేర్చుకొని, ఉజ్వల భవిష్యత్తుకి రూపురేఖలు దిద్దవలసియుంది. ఈ విషయంలో, సామాజికాభివృద్ధికై పాటుబడే మేధావుల మీద గురుతర బాధ్యత ఉంది.

మన దేశంలో ప్రగతిశీలురైన విప్లవ మేధావులు వేర్వేరు రంగాలలో ప్రజాభ్యున్నతి కొరకు విశేష కృషి చేస్తున్నారు. కాని, భారతీయ తాత్విక ఇతిహాసాది విషయాల్లో వారికి తగినంత అభినివేశం లేదు. మన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికోద్యమాలలో యీ వెలితి తరచు గోచర మవుతోంది. వివిధ రంగాలలో ప్రజాఉద్యమం తగినంత బలంగ పుంజుకోలేక పోవడానికి యిదికూడా ఒక కారణం — ముఖ్యమైన కారణం — అని మా అభిప్రాయం.

ఈ పరిస్థితిని సరిదిద్దడానికి, శాస్త్రీయ దృక్పథంతో మన దేశ చరిత్రనూ, తత్వశాస్త్రాన్నీ అధ్యయనం చేసేలా యువకుల్ని ప్రోత్సహించేందుకు 'సందేశం' ఆధ్వర్యాన సెప్టెంబరు చివరివారంలో విజయవాడలో ఒక అధ్యయనగోష్ఠి ఏర్పాటు చేయబడింది

ఆ సమావేశంలో చదువబడిన వివిధ వ్యాసాలను యీ సంపుటిలో ప్రచురిస్తున్నాం. (సమయాభావంవల్ల కొన్నిటిని వదలివేయవలసి వచ్చింది.)

ఆంధ్రదేశంలో చారిత్రక, తాత్విక పరిశోధనలకు తగినన్ని అవకాశాలు లేకపోయి నప్పటికీ, తొలి ప్రయత్నంగా రచయితలు ఎంతో పరిశ్రమచేసి యీ అధ్యయన వ్యాసాలను వ్రాసి పంపినందుకు కృతజ్ఞత తెలియజేస్తున్నాం. ఈ ప్రయత్నం రచయితల పరిశోధనాభిలాషకు తార్కాణం.

ఈ అభిలాషను ప్రోదిచేసి, విస్తరింపజేసి, వృద్ధిచేయడం మనందరి కర్తవ్యం. పాఠకులు ఒక్కొక్క వ్యాసంపై తమ అభిప్రాయాలను విమర్శలరూపంలో, ప్రశ్నలు - అనుమానాలు, తదితర రూపాల్లో తెలియజేయవలసిందని కోరుతున్నాం. తద్వారా వ్యాసకర్తలు పునరాలోచించుకొనేందుకు, ఇంకా యెక్కువ పరిశోధనలు చేసేందుకు తోడ్పడ గోరుతున్నాం.

తాత్విక, చారిత్రక పరిశోధనారంగంలో విభిన్న ఆలోచనా ధోరణులమధ్య పోటీని ప్రోత్సహించడం మా అభిమతం. ఆ కృషిలో యీ ప్రత్యేకసంచిక ప్రచురణ ఒక సోపానంగా ఉండగలదని ఆశిస్తున్నాం.

— సంపాదకవర్గం.



# వర్ణవ్యవస్థ:

## దాని పుట్టుక, పరిణామము*

డాక్టరు ఉప్పల లక్ష్మణరావు, డి. ఎస్. సి.

మన పురాతన చరిత్రకి సంబంధించిన పరిశోధనలు చేసేటప్పుడు శాస్త్రీయమైన మార్క్సిస్టు దృష్టిని అవలంబించడం ఎంతైనా అవసరం. పూర్వాచారాలు, నమ్మకాలు, ప్రాచీన పురాణ గాథలు, వాఙ్మయం - వీటితోపాటు వర్ణవ్యవస్థని విమర్శనపూర్వకంగా పరీక్షించి విలువకట్టవలసిన బాధ్యత మార్క్సిస్టులమీద వుంది నేడు. అయితే విమర్శనాదృష్టితో విలువకట్టడం అంటే - "నిష్పాక్షికంగా" అని అర్థంకాదు. మార్క్సిస్టు దృక్పథాన్ని తీసుకున్నప్పుడూ, ప్రతి వ్యవస్థనీ ప్రతి సమస్యనీ వర్గసంఘర్షణదృష్ట్యానూ, సాంఘిక పరిణామం దృష్ట్యానూ విమర్శించినప్పుడూ మనం ఒక నిర్దిష్టమైనటువంటిన్నీ నిస్సందేహమైనటువంటిన్నీ నికరమైనటువంటిన్నీ స్థానాన్ని తీసుకుతీరాలి. వర్గసంఘర్షణే ప్రధాన సూత్రంగాగల సమాజంలో మనం జీవిస్తున్నాం కాబట్టి వర్గసంఘర్షణలేని మానవ సమాజం సాధించడమే మన పరమావధి అన్న స్థానం తీసుకుని, యీ వర్గసంఘర్షణ మానవ సమాజ పరిణామంలో అతి ముఖ్యమైన పాత్రని పొందిందనీ, ఇప్పటికీ యీతరవాత కూడా పొందగలదనీ స్థానం తీసుకుని విమర్శించడం మనకి తప్పనిసరి అవుతుంది.

### 1

పూర్వకాలంలో మనదేశం అంతటా వ్యాపించి వుండిన గ్రామ్యవ్యవస్థ - అంతకంటే అతి ప్రాచీన కాలంలో వుంటూ వుండిన ఆదిమసమాజంయొక్క చిహ్నాలని కలిగివుండినట్టు మార్క్స్ - ఎంగెల్సులు 1853 లోనే హిందూ దేశపు గ్రామ్య వ్యవస్థని గురించి రాస్తూ అన్నారు. (మార్క్స్ - ఎంగెల్సు ఉత్తరప్రత్యుత్తరాలు . 1 వ వాల్యూము. బెర్లిన 1949 పేజి 587) అన్ని ప్రాచీనసంఘాల్లోనూ - ఈజిప్ట్ మెసపొటేమియా, అస్సీరియా మొదలైన ప్రాచ్యదేశాల్లోనూ, దక్షిణఅమెరికాలో పెరూ మొదలైన పురాతన ఇండియను సంఘాలలోనూ (రూబెన్: 3) మొదటిదశల్లో పరిణామరీత్యా రూపొందిన బానిస వ్యవస్థే మనదేశంలో ప్రాచీనకాలంలో గ్రామ్య వ్యవస్థగా ఒక విశిష్టరూపాన్ని పొందిందని మనం అనుకోవచ్చు. ఈ గ్రామ్యవ్యవస్థే మన ప్రాచీన నిరంకుశరాజ్యపరిపాలనకి మూలవిరాట్టుగా వుండేది. (మార్క్స్: పైన చెప్పిన గ్రంథం. పుట 588) అసలు వర్ణవ్యవస్థ యెలా పుట్టిందో, ఆదిమసమాజంలో అది మొదట యేరూపాన్ని ధరించిందో, ఆ ఆదిమ సంఘ నిర్మాణం యెలాగుండేదో - తెలుసుకోవడానికి యెలాంటి చారిత్రక ఆధారాలు కాని నిదర్శనాలుకాని లేవు. అంతెందుకు - ప్రాచీన భారతచరిత్రకే నిర్దిష్టమైన మూలాధారాలు లేవు! మన పూర్వులు చరిత్రని రాసి అట్టేపెట్టలేదు. (రాజతరంగిణి క్రీ. శ. 12 వ శతాబ్దిదేకదా!) ఇందుకు కారణమేమిటి అని మనం ప్రశ్న వెయ్యాల్సివస్తుంది. నిరంకుశంగా రాజ్యంచేస్తూన్న ప్రభువులయొక్క సంపూర్ణాధికారం సాగడానికిగాను అవసరమైన మనస్తత్వాన్ని కల్పించి, అలాంటి మనస్తత్వాన్ని సామాన్యప్రజలలో వ్యాపింపజేయడం అగ్రవర్ణానికి చెందిన బ్రాహ్మణులకి ముఖ్యమైన విధిగా వుండేది. అలాంటి మనస్తత్వాన్ని కల్పించితే ప్రభువులయొక్క నిరంకుశాధికారం నిరాఘాటంగా సాగడానికి సావ

* ఈ వ్యాసం రాయడంలో ప్రొఫెసర్ వాల్టర్ రూబెన్‌గారి గ్రంథాలని మూలాధారంగా చేసుకున్నాను. వా గ్రంథాల్లోనుంచి కొన్ని ప్రకరణాలని ధారాళంగా ఉల్లేఖించుకున్నాను.

కాశం యేర్పడుతుంది. దానితోపాటు బ్రాహ్మణుల యొక్క అగ్రస్థానం, ప్రాముఖ్యత కూడా అవిచ్ఛిన్నంగా చిరస్థాయిగా నిరాఘాటంగా సాగుతూంటుంది. వర్ణవ్యవస్థ సామాజిక పరిణామంలో ఒక దశ కాదనీ, దానికి పుట్టుపూర్వోత్తరాలుఅంటూ లేక ఈశ్వరేచ్ఛవల్ల సృష్టింపబడినదని ("చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" అన్న గీతావాక్యం) - మానవసమాజం నిలిచివున్నంతకాలమూ వర్ణభేదం శాశ్వతంగా వుండితీరవలసిందే ననీ - దాన్ని మార్పు చేయ ప్రయత్నించడం ఘోరపాపం అనీ శాస్త్రాలూ సూత్రాలూ కల్పించేరు. ప్రకృతి మారదు - మానవ సమాజానికి ఆది అంటూ లేదు - ఇప్పుడు వున్నట్టే ఇక యెల్లప్పుడూ అది వుండితీరుతుంది - దాన్ని మార్చడానికి ప్రయత్నంచేయడం ఉత్తవ్యర్థం - ఆ ప్రయత్నమే హిందూధర్మానికీ ప్రభుభక్తికీ వ్యతిరేకం, పాపకారణం, శాశ్వత నరకప్రాప్తకం - అని శాసించిపారేశారు మన పూర్వులు. అంచేతే మన పురాతనచరిత్రకీ సాంఘిక శాస్త్రానికీ ఆధారాలు లేకుండా చేసేశారు మన పూర్వులు - చెయ్యాలనే, బుద్ధిపూర్వకంగానే. అంతేకాని మనవాళ్ళకి చారిత్రక దృష్టి లేకకాదు. ఇలాగు మనం అనుకోవలసి వస్తుంది మరి.

ఈ కారణం వల్లనే వర్ణవ్యవస్థ మనదేశంలో అనాదినుంచీ సర్వవ్యాపితంగానూ వస్తూందనీ - ప్రతీ వ్యక్తీ యేదో ఒక వర్ణానికి చెందినవాడై వుండితీరాలని సాధారణంగా ఇప్పటికికూడా నమ్మకం ఒకటి ప్రబలంగావుంది. అయితేహిందూదేశంలోసుమారు రెండు కోట్లనుంది ఆదిమజాతులవారున్నారు. అన్ని రాష్ట్రాల్లోనూ వీరు హిందూమతస్థులు కారు. వీరు హిందూసంఘంలో వున్నవారు కారు. వీరిలో వర్ణభేదం కాని కులభేదంకాని లేదు. వీరిమాట యేమిటి? వర్ణవ్యవస్థ పరిణామంలో ఈ జాతుల స్థానం యేమిటి? వీరు ఆదిమవాసుల సంతతివారని అందరూ అంగీకరిస్తారు. అంచేత ద్రావిడులకంటె పూర్వమే వీరు హిందూదేశంలో నివసిస్తుండేవారని అంగీకరించక తప్పదు. వీళ్ళలో కులభేదాలు లేకపోబట్టి ద్రావిడ ఆర్యసమూహాలు మనదేశానికి వలస వచ్చిన తరువాతే ఈ వర్ణభేదం కొన్ని కారణాల వల్ల యేర్పడి వుంటుంది అనుకోవచ్చు. ఈ కారణాలనీ - ఈ సాంఘిక చారిత్రక శక్తులనీ - వీటి మూలంగా కులభేదాలు యెలా యేర్పడినదీ-ఈ వర్ణవ్యవస్థ పరిణామ క్రమాన్నీ యీ ఆదిమజాతుల్లోనూ గిరిజనుల్లోనూ అటవీజనుల్లోనూ మనం ప్రత్యక్షంగా చూడొచ్చు.

మధ్యప్రదేశ్‌లో వున్న ఛోటా నాగపూర్ ప్రాంతాల్లో "తురి" అనే ఆదిమజాతివాళ్ళున్నారు. వీళ్ళందరూ మేదరవాళ్ళే. వీళ్ళలో మరో వృత్తి లేనేలేదు. "ఘంసీ" అని మరో కొండజాతివాళ్ళున్నారు. వీళ్ళందరూ మృదంగాలు తయారుచేస్తారు. వీళ్ళందరిదీ అదేవృత్తి. వీళ్లలో "వర్ణ"భేదం లేదు. అందరూ ఆదిమవాసులే. అందరూ "నలుపురంగు" వాళ్ళే. "జాతి"భేదం లేదు. అందరిదీ ఆదిమజాతే. వృత్తిభేదం లేదు. అందరిదీ ఒకటే వృత్తి. అయితే వీళ్లు హిందూసంఘం దరిదాపుల్లో నివసిస్తూ హిందూ సంఘంతో సంపర్కం వుండడంచేత రానురాను వీళ్ళూ హిందూమతాన్ని స్వీకరించి, యీ వేరువేరు వృత్తులుగల ఆదిమజాతులవారు వేరువేరు ప్రత్యేక "కులాలు"గా నేటికి యేర్పడి జీవిస్తూన్నారు. వీళ్లు నామమాత్రంగా హిందూమతస్థులైనా - తమ ఆచారలనీ, నమ్మకాలనీ వదిలిపెట్టలేదు. (కొంతమంది "కుల క్రైస్తవుల" లాగే!). వీళ్ళు యిలాగ హిందూ సంఘంలో విలీనం అయిపోయి కొత్త కులాలుగా తయారవుతూండగా - మానవసంఘ పరిణామంలో అట్టడుగు మెట్టుపైనే నేటికికూడా నిలిచివున్న "అసురులు" అనే మరొక ఆదిమజాతివారున్నారు. వీళ్ళందరూ కమ్మరివాళ్ళు. ఇనుపరాయిని కాల్చి యినుం తయారుచేసి కమ్మరంపని చేయడం యీ అసురులే మొట్టమొదటగా మనదేశంలో సుమారు క్రీ. పూ. 800 ప్రాంతంలో మొదలుపెట్టారు. అంతకు ముందు మనదేశంలో యినుం తెలియదు. ఇనుప లోహాన్ని మానవుడు క్రీ. పూ. 1000 ఆ ప్రాంతంలో కనుక్కున్నాడు. క్రీ. పూ. 3 సహస్రాబ్దికి ముందే మానవసంఘంలో రాగి, కంచు లోహాలని తయారు చెయ్యడం మానవుడు కనుక్కొన్నాడు. ఇది ఈజిప్ట్ ఆ ప్రాంతాల్లోనుంచి మనదేశంలోకి ఆ కాలంలోనే వచ్చివుంటుంది. హరప్ప - మహేంజదరో త్రవ్వకపు అవశేషాల్లో కనిపించిన పొయ్యిలు రాగి కంచు లోహాలని కరగబెట్టేటందుకు ఉపయోగించినవే (క్రీ. పూ. 2500 - 2000). ఆర్యులు మనదేశానికి వలసవచ్చిన తరువాత యీ యినుము ఉపయోగంలోకి వచ్చింది. యినుము పని ఆర్యులకంటే ఆదిమవాసులకే ముందు తెలిసివుండేది. అంచేత యినుం పని ఆర్యులు మన దేశానికి తీసుకువచ్చినట్టు కాదన్నమాట. ప్రపంచంలో

వివిధ ప్రాంతాల్లో నివసిస్తున్న మనుష్యు లందరూ ఇంచుమించు ఒకే నాగరికస్థాయిలో వుంటూ వుండడంచేత యెవరియటుకు వాళ్ళు స్వతంత్రంగా ఇనుముని కనిపెట్టడం సంభవించింది. ఈ వేళ వరకూ కమ్మరంవృత్తి చేసుకుంటూ జీవిస్తున్న అసురజాతి వాళ్ళు హిందూసంఘంలో విలీనం కాకుండానే మొట్ట మొదట నాగరికత పరిణామంలో యే అట్టడుగు మెట్టులో వుండేవారో - ఇప్పటికీ ఆ మెట్టులోనే వుండి అలాగే జీవిస్తున్నారు. (రూబెను: 4, పేజీ 198)

ఈ ఆదిమజాతులు హిందూసమాజంలో విలీనం అయినప్పుడు వృత్తులనుబట్టి కొత్త కులాలు సృష్టింప బడుతూండడం మన కళ్ళయెందర జరుగుతూంది. ఈ విధంగానే ఇన్నివేల కులాలూ - అన్నీ కాకపోతే కొన్ని అయినా - యేర్పడి వుంటాయని మనం నమ్మ వచ్చు. హిందూసంఘంలో విలీనం కాకముందు యీ వేరువేరు ఆదిమజాతులవాళ్లు ఏ జాతివారు ఆ జాతి లోనే పెళ్ళిళ్ళు చేసుకునేవారు. ఏ జాతివారు ఆ జాతి వాళ్ళతోనే భోజనాలు చేసేవారు. హిందూమతంలో చేరిన కొత్త కులాలుగా యేర్పడిన తరువాతకూడా యీ ఆచారాలనే పాటిస్తూవచ్చారు. (రూబెన్ : 1, పేజీలు 40 - 49)

వర్ణవ్యవస్థని గురించి తొలిసారిగా ఋగ్వేదంలో చెప్పారు. ఈ ఋగ్వేదంలో యీ శాఖ మొట్టమొదట వేదాలు రచించినప్పుడు కాకుండా దరిమిలానే-అనగా క్రీ. పూ. 800 కాలంలో రచింపబడినట్టు భారత శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అంచేత ఆర్యులు హిందూ దేశానికి వలసవచ్చి స్థిరపడిన తరువాతనే యీ వర్ణ భేదం వచ్చిందని మనం రూఢిగా చెప్పొచ్చు. (కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా: I; పుట 92).

ఆర్యులు హిందూదేశానికి వలస రాకముందు అనాగరికులు అని అనుకోవడం పొరపాటు. అప్పటికే ఆర్యులు ఆదిమసంఘ వ్యవస్థని దాటి కుటుంబ సమూహ వ్యవస్థ పతనావస్థలో వుంటూండేవారు. అప్పటికప్పుడే వాళ్లు వ్యవసాయం, అశ్వరక్షణ పశు సంరక్షణ అలవర చుకున్నారు. (ఎంగెల్సు: అంటీ-డ్యూరింగు; బెర్లిను 1948, పేజీ 393). కొన్ని కొన్ని కుటుంబాలు గణా లుగా యేర్పడి హిందూదేశానికి వలస వచ్చాయి. హిందూ దేశానికి రాకముందే ఆర్యుల్లో వేదాలు వున్నాయని కొందరు భారత శాస్త్రజ్ఞుల అభిప్రాయం కూడాను (ఓల్డెనుబర్గు: "దిరెలిగియోన్ డెస్ వేదా". స్టుట్ గార్ట్-బెర్లిను 1928, పుట 132). వేదాలకీ ఇరాను దేశస్థుల ఆదిమతగ్రంథం అయిన జరథూస్త్రీ చాలా దగ్గిర పోలికలు వున్నట్టూ, ఆనాటి ఇరాను దేశపు సంఘంలో యుద్ధవీరులనీ, పురోహితుల, సామాన్యప్రజలనీ తరగతులు వుండేవనీ వీరుగ్రామాల ముఖ్యంగా వ్యవసాయం పశుసంరక్షణ వృత్తులతో జీవిస్తుండేవారనీ, కుటుంబ సమూహాలుగా వుంట పలు ప్రాంతాలు తిరుగుతూ వుండేవారనీ చరిత్ర చెబుతూంది (అవడియేవ్ : పేజీ 410). అప్పటి ఆర్యుల్లో వర్ణభేదం లేదని రూఢిగా చెప్పొచ్చు. హిందూదేశం వచ్చి స్థిరపడిన తరువాత వేదాలని మ త్రాలుగా పఠించడం - అదివరకు నవగ్రహాల్లో ఒకడుగా పరిగణింపబడిన సూర్యుడు ఇప్పుడు "సవితర్" అన్న పేరుతో దేవుడుగా రూపొందడం విష్ణువు స్వర్గంలో యేలుతూన్న దేవాధిదేవుడిగానూ ద్వాదశాదిత్యుల్లో ఒకడైన పూషుడు గోసంరక్షకునిగా పూజింపబడిన దేవుడుగానూ - అష్టదిక్పాలకుల్లో ఒకడైన ఇంద్రుడు దేవేంద్రుడుగా, మూర్తీభవించడం మరొక అష్టదిక్పాలకుడైన వరుణుడు దేవునిగా పూజింప బడడం-ఈ మంత్రాలకే పామరులందరికీ తెలిసేటట్లు పైకి ఒక అర్థంవుండే, ప్రత్యేకంగా పురోహితులైన పండిత జనానికి మాత్రమే తెలిసేటట్టు మరొక అంత రార్థం వుండేటట్టుగా రచింపబడడం జరిగింది. (లూడర్సు: "వరుణ": వాల్యూము I : గోట్టింగెన్, 1951). రాజకీయంగా ఆర్యకుటుంబాలు కొన్ని కలసి గణాలుగాను, గణాలు కొన్ని కలసి ప్రత్యేక రాజ్యాలు గానూ యేర్పడి-శత్రువులని (అనగా ఆదిమవాసులని) యుద్ధాల్లో ఓడించి తమ వ్యవసాయాన్ని విస్తరింపచేసి గోగణాలని వృద్ధిచేసుకోడానికిగాను కొత్తప్రదేశాలని ఆక్రమించుకుంటూ ఒక విధమైన సైనిక సహిత ప్రజారాజ్యాలుగా రూపొందుతూ వచ్చాయి (డాంగే: "ఇండియా: ఫ్రమ్ ప్రిమిటివ్ కమ్యూ నిజమ్ టుస్లేవరీ:" బొంబాయి 1954) (డాంగే: "సమ్ ప్రాబ్లెమ్సు ఆఫ్ ఇండియన్ హిస్టరీ" "న్యూ ఏజ్ మంత్లీ. 1954. నెం. 9 - రూబెన్ : 2 లో డాంగేను పేర్కొంటూ రాసినది.)

ఆర్యుల గణసముదాయాల్లోనూ - గణాలని పరిపా లించే రాజుల్లోనూ - వారి సైనిక యేర్పాట్లలోనూ - పురాతన గ్రీసు రోము దేశాల రాజ్యాంగాలతో చాలా పోలికలు కలిగి వుండేవి. సాంఘికంగా వీళ్ళలో వృత్తివిభజన వృత్తిభేదాలు బాగా యేర్పడి పోయి వుండేవి. వ్యవసాయం చేసే కర్షకులూ గోగ

ణాలని కాచే గోపాలకులూ ప్రత్యేకశాఖలుగా ప్రత్యేకింపబడిపోయారు. చేతిపనులు చేసే వాళ్ళలో - కమ్మరులూ రథాలుచేసేవాళ్లు (వడ్రంగులు ?) ప్రత్యేక వృత్తులవారుగా యేర్పడిపోయారు (యీ సందర్భంలో ఆర్యులకీ ఇరానీయులకీ గల దగ్గరపోలికలు గురించి మార్క్స్ - ఎంగెల్సు: "సెలెక్టెడ్ వర్క్స్" జర్మనుకూర్పు: మాస్కో 1950. పేజీ 176 - 199). వీళ్లతోపాటు వర్తకం చేసుకునే వాళ్లుకూడా వేర్వేరు తరగతులుగా యేర్పడిపోయారు. సంఘంలో ఒకవిధమైన వర్గభేదంకూడా తలయెత్తసాగింది. అస్త్రశస్త్రాలను ధరించే రాజకుటుంబీకులూ - వీళ్లతో సరిసమానంగా యజ్ఞహోమాది కార్యాలను జరిపించే పురోహితులూ వేదపరాయణులూ అగ్రకులస్థులుగా యేర్పడ్డారు. చేతిపనులూ వ్యవసాయం చేసుకునేవారు కాయకష్టం ద్వారా ఉత్పత్తిచేసిన అదనపు విలువలో మాకు హెచ్చువంతు రావాలి అంటే మాకు హెచ్చువంతు రావాలి అని అగ్రకులాల వారిద్దరూ ఘర్షణలుపడుతూ వుండేవారు వాళ్లలో వాళ్లు. (రూబెన్: 1. పేజీ 86 - 89) ప్రప్రథమంలో వున్న ఆదిమమానవసంఘవ్యవస్థనుంచి సైనిక సహిత ప్రజారాజ్యాలుగా పరిణమించి - ఆ స్థాయినుంచి బానిసలను కలిగిన ప్రాచ్య నిరంకుశ రాజ్యాంగాలుగా రూపొందేయి. ఈమార్పులతోపాటు అతిముఖ్యమైన సాంఘికమార్పులు కూడా యేర్పడ్డాయి. ఆదిమవాసులపైన యుద్ధాలు మరింత ప్రబలం కాసాగేయి. అందుకుగాను సైనికవృత్తిని అవలంబించేవాళ్లు ఎక్కువై, వాళ్ల ప్రాముఖ్యం కూడా ప్రబలింది. అదివరకు రాజ్యవిస్తరణ అంటే పశుగణాలు మేయడానికి కొత్తబీడు ప్రదేశాలని ఆక్రమించడం అన్నమాట. ఇప్పుడు కొత్త బీళ్ళ ఆక్రమణతోపాటు అనార్యులు నివసించుతూండే గ్రామాలనికూడా ఆక్రమించి జయించడం కిందపరిణమించింది. అంతకుముందే వున్న ద్రవిడులు పల్లెటూరి ప్రజే కాకుండా పట్నవాస ప్రజ కూడాను (హరప్ప - మహెంజదరో - అరికమేడు). ఆర్యులు స్థిరనివాసాలు కలిగివుండినప్పటికీ, పల్లెప్రాంతపు గ్రామీణప్రజగానే జీవించుతూ వుండేవారు. ఈ క్రొత్తదశలో మాత్రం పెద్ద యుద్ధాలుచేసి ఆదిమవాసుల పట్నాలని జయించి ఆదిమవాసులని "దాస్యులు"గా చేసి వాళ్లచేత బానిస సేవను చేయించుకుంటూ బానిస వ్యవస్థతో కూడిన రాజ్యాంగ నిర్మాణంగల సంఘంలో పట్నవాస ప్రజలుగ తయారయారు ("బానిస వ్యవస్థగలరాజ్యాంగ నిర్మాణ సమాజము" అన్న పదం మొట్టమొదటిసారిగా సోవియట్ చరిత్రకారుడు స్త్రూవే ప్రయోగించాడు: స్త్రూవే - "ప్రాచీన ప్రపంచచరిత్ర" మాస్కో: 1949: జర్మను కూర్పు - 1954). ఆదిమజాతులవారిని దాస్యులుగాచేసి ఆర్య సంఘంలో దోపిడీకి లోనైన పీడిత బానిసవర్గంగా నిర్ణయింపబడినప్పుడే "వర్ణ" భేదం పునాదిగా గలిగిన వర్గభేదం హిందూదేశ చరిత్రలో ప్రప్రథమంగా యేర్పడింది.

దాస్యులని ఆర్యజనులు తమ వస్తూత్పత్తిలో రెండు విధాలుగా ఉపయోగించినట్టు కనపడుతుంది. ఆదిమవాసులని యుద్ధాల్లో ఓడించిన తరువాత వాళ్లని చంపేసి నాశనం చెయ్యకుండా - వాళ్లని ఖైదీలుగా పట్టుకొని బానిసలుగాచేసి వాళ్లచేత సేవ చేయించుకునేవారు. ముఖ్యంగాఅగ్రజాతుల ఇళ్లల్లోఇంటిపనులు చేయడానికి వినియోగించేవారు యీ బానిస"దాస్యు"లని. దీనికితోడు కొందరి దాస్యులని వర్తకుల క్రింద గుమాస్తాలుగానూ (దాసులుగా వుంటూనే),వంటవాళ్లుగానూ, రాజులదగ్గిర రాణుల దగ్గిర దాసదాసీజనంగానూ వేగులవాళ్లుగానూ నియమించి బానిసపని చేయించుకునే వారు, పట్టణాల్లో. గ్రామాల్లో వ్యవసాయం చేతిపనులు చేసుకుంటూ జీవిస్తూన్న ఆదిమవాసులని బానిసలుగాచేసి వారిని దాస్యులుగా పరిగణించినా - వాళ్లని గృహకృత్యాలు చేయించుకోడానికి నియమించకుండా - గ్రామాల్లోనే వుండనిచ్చి వాళ్లచేత వ్యవసాయం చేయనిస్తూ - వాళ్లదగ్గిరనుంచి గ్రామమొత్తం మీద పంట వస్తురూపేణా "కరము"(అనగా పన్ను) ("కరము" A Pallava Copper Plate Grant of Kandukuru by N. Ramesan: Hindu Sunday Supplement June 16, 1957) వసూలుచేస్తూ జీవించనిచ్చేవారు. ఈ విధంగా సంఘం యొక్క వస్తూత్పత్తి అధికం కాగానే - సంఘంలో కొత్తమార్పులకి దారితీసింది. ఇంతవరకూ తమ పశుగణాలతో వలస పోతూవుండిన ఆర్య సమూహాలు ఒకచోట స్థిరపడి పల్లెటూళ్లని కట్టుకుని అందులో స్థిరమైన స్థావరాలని యేర్పరచుకుని - తమ పశుగణాలని అభివృద్ధి చేసుకుంటూ జీవించసాగేరు. పాత వేదభాష వాడుకలోంచి అంతరించిపోయి కొత్త "సంస్కృత" భాష యేర్పడజొచ్చింది. పాత వేదభాష పోవడంతో ఇక వేదమంత్రాలని రచించడం ఆగిపోయింది. వేదభాష మృతభాష అయిపోగానే ఆ భాషలోనే మొదట క్రీ. పూ. సుమారు 1000 లో రచించిన

వేదాలు అంతరించి పోకుండా వుండడానికని యజ్ఞ కర్మలని చేయించే పురోహితులు వేదాలని కంఠస్థం చెయ్యడం మొదలుపెట్టారు. వేదభాష సంకరం కాకుండా వుండడానికని పురోహిత పండితులు పనస లనీ పంచాశత్తులనీ యేర్పరచారు. గోగణ విస్తరణమీద కాయధాన్యాల పంటమీద ఆధారపడిన జనం అవడం చేత - వర్షాలుపడే కార్తులగురించీ వాతావరణవిశేషాల గురించీ జ్యోతిశ్శాస్త్రం గురించీ తెలుసుకోడం అతి ముఖ్యమై - వేదాలని తమ స్వంత సొత్తుగా హస్త గతం (కంఠస్థం!) చేసుకున్న పురోహిత పండిత వర్గం యొక్క అధికారం అధికంగాజొచ్చింది. వేదపారాయణే విధిగా పాటించుతూ యజ్ఞయాగ హోమాదికర్మలు చేయించే ఋత్విక్కులూ హోతలూ ఉద్గాతలూ అగ్ని ధ్రులూ వీరితోపాటు ఆహితాగ్నులూ పాకయాజులూ హవిర్యాజులూ సోమయాజులూ - వీరంతా ప్రత్యేక "వర్గం"గా యేర్పడజొచ్చి సంఘంలో అగ్రస్థానాన్నీ అధికారాన్నీ పొందే అవకాశాన్ని కల్పించు కున్నారు. వేదభాష అంతరించిపోయినతరువాత వేదా లకి అర్థం చెప్పుకోవడానికిగాను వేదాలని రెండు ప్రధాన భాగాలుగా విడదీశారు. ఆది వేదభాషలో వున్న మంత్రాలకి సంహిత అనీ - అర్థం తెలిపే సంస్కృత మంత్రాలకి బ్రాహ్మణాలని (శతపథ తాండ్య గోపథ బ్రాహ్మణాలు) - పేర్పరచారు. ఈ బ్రాహ్మణాలు రచించిన కాలం సుమారు క్రీ. పూ. 500 అని భారత శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దాంతో వేదాలని తమ కైవశం చేసుకుని వేదకర్మలని నడిపించే అధికారాన్ని తమ చేతుల్లో వుంచుకుని యీ పురో హితులు "బ్రాహ్మణులుగా" అగ్రవర్గంగాయేర్పడ్డారు.

యుద్ధానికి బయలుదేరేముందు దేవతలకి మొక్కడం, విజయంకోసం ప్రార్థించడం, పూజలు చేయడం, అశ్వ మేధ నరమేధ యాగాలకీ యుద్ధాలకీ ముహూర్తాలని నిర్ణయించడం యీ బ్రాహ్మణ వర్గంవారికీ నిత్య విధులై - రాజులపైనీ, రాజ కార్యాల్లోనూ తమ పలుకుబడిని బాగా వినియోగించుకుంటూ - దానిని పెంపొందించుకోడానికి వైదిక కర్మలని వేద సంప్ర దాయాన్ని కల్పించి మంత్ర తంత్రాలతో కర్మకాం డని పెంచుతూ డాబుదర్పంతోనూ అట్టహాసంతోనూ జీవించుతూ - మిగతా కులాలవాళ్ళూ (వైశ్యులు), దాస్యులూ సృష్టించిన అదనపు ధనంలో - ప్రభువు లతోపాటు తాముకూడా పాలు పంచుకుని అనుభ విస్తూ - అగ్ర వర్గంగా యేర్పడ్డారు. రాజులు కూడా "క్షత్రియ" వర్గంగా యేర్పడి శ్రామికులూ, బానిస లైన దాస్యులూ, పల్లెటూళ్ళలో వున్న ఆదిమవాస గ్రామీణులూ ఉత్పత్తిచేసిన భాగ్యాన్ని దోపిడీచేస్తూ తమ కాలాన్ని రథాల పందేల్లోనూ పాచికలాట జూదాల్లోనూ విందులూ మద్యపానాల్లోనూ భోగ విలాసాల్లోనూ ప్రాచ్య నిరంకుశాధికార యుగవ్యవ స్థలో అథర్వ వేదంలో వర్ణించినట్లు (సరిగ్గా యీ విధంగానే హెరోడొటస్ పెరిష్యాదేశపు రాజవంశీకు లనీ - టాసిటస్ ఆది జర్మను రాజవంశీకులనీ వర్ణించి నట్టే) కాలం గడుపుతూండేవారు. (రూబెను: 1. పేజీ 68). బానిసలుగా చేయబడిన ఆదిమ జాతి దాస్యుల నందరినీ మూక ఉమ్మడిగా వ్యవసాయంలో పెట్టడానికి - వ్యవసాయం అప్పటికింకా చిన్నతరహా లోనే వుండి ప్రాథమిక దశలోనే వుండడంచేత - అందులోనూ వలసవచ్చిన ఆర్యుల సంఖ్య తక్కువ- అన్నీ అడవులే - వ్యవసాయపు పొలాలు తక్కువ కూడా గిట్టుబాటు కాకపోవడంవల్ల - ఆదిమ వాసులైన దాస్యుల గ్రామీణ వ్యవస్థని కదపకుండా అలాగే సాగించనిస్తూ - గాయగలు తిప్పడానికీ మద్యం తయారు చేయడానికీ - కొంతమందిని రాజుతాలూకు ధాన్యపు కొట్లలోనూ వెండి బంగారపు గనులలోనూ లోహపు కర్మాగారాల్లోనూ వినియోగిస్తూండేవారు. (యీ సందర్భంలో ఎంగెల్సు - అంటీడ్యూరింగు" ఇదివరకే పేర్కొబడినది: పేజీ 179). మధ్యధరా సముద్రపు కోస్తాలో కూడా వలసవున్న బానిస లను పంటకీ పంటకీ మధ్య వ్యవధిలో మద్యం తయారు చేయడానికి వినియోగించి బానిసల ఉపయోగం గిట్టుబాటుగా వుండేటట్టు చూచుకునేవారు. (మోరెన్ : స్లేవ్స్ అండ్ సెర్ఫ్స ఇన మోడర్న కార్టర్లీ III, 3, 1948. 42 పేజీలో రాసినట్టు రూబెన్ ఉదాహరణ 1, పేజీ 88).

"ఇనుము కనిపెట్టబడి ఉపయోగానికి రావడంతో కొత్త బీడు భూములని సాగులోకి తీసుకొచ్చి ఎన్నో అడవి బంజర్లని వ్యవసాయానికి లాయకుగా చేసింది యీ ఇనుము" అని ఎంగెల్సు అంటాడు. ("కుటుం బము, ఆస్తి, రాజ్యాంగయంత్రము" : బెర్లిన్ 1950, పేజీ 161 జర్మను కూర్పు) సరిగ్గా ఇదేకాలంలో - క్రీ. పూ. 800 లో - ఇనుం తయారు చెయ్యడం, కమ్మరంపని హిందూ దేశములో వాడుకలోకొచ్చింది. వేదకాలపు ఆర్యులకి వరిపంట పండించడం తెలియదు. వాళ్ళకి యెంతసేపూ పశువుల మందలని కాచుకుంటూ

పశు సంరక్షణకిగాను కొత్త పచ్చికబయళ్ళనీ భూము
లనీ ఆక్రమించుకోవడం కాయ ధాన్యాలని పండించు
కోడం ఇదేవాళ్ల వృత్తి. రాజులయొక్క ధనం
ఐశ్వర్యంఅంతా పశువుల సంఖ్యనిపట్టే వుండేది. ఆదిమ
జాతులకి మాత్రం వరిపంటను తగినట్టు భూమిని
సేద్యం చేయడం అందుకు కాలువలు తవ్వి నీరు
పారించుకుని వరిపంట పండించుకోవడం తెలుసు.
వ్యవసాయపు పనిముట్లుగా ఆదిమజాతులు కొయ్య
తోనూ చెట్ల కొమ్మలతోనూ సూదిగా చేసిన పనిముట్ల
తోనే భూమిని తవ్వి బాగుచేసుకుని పంటలు
పండించుకునేవారు. కాని ఈ కాలానికి - అనగా
క్రీ. పూ. 800 నాటికి - కొందరు ముండాజాతికి
చెందిన ఆదిమవాసుల తెగలలో ఒకరైన అసురులు
కమ్మరం తెలుసుకొన్నట్టు పైన చెప్పాం. కమ్మరం
తెలిసికొని వుండడంచేత కంచుయుగపు నాగ
రికత స్థాయిలోనే ఇంకావున్న ఆర్యులకంటె - ఇనుప
యుగంలోకి అప్పుడే ముందుకు సాగిపోయిన ముండా,
అసుర, ఆదిమజాతులు హెచ్చు నాగరిక స్థాయిలో
వుండేవారు. సింధునదీ తీరాన్నుంచి ("సప్తసింధు")
తూర్పుదిశగా వలస పోతున్న ఆర్యుల తాకిడికి ఈ
ఆదిమవాసులు తట్టుకోలేక అంతకంతకు తూర్పుదిశగా
వున్న అడవుల్లోకి పారిపోతూ అక్కడ అడవులనికొట్టి
పల్లె గ్రామాలనే కాకుండా చిన్నచిన్న "పురముల"ని
కూడాస్థాపించుకుని గ్రామీణవ్యవస్థలో నేజీవించుతూ,
వుండేవారు. అలాగు తూర్పుదిశగా వెనక్కి తగ్గుతూ
గంగానదీ తీరపు అడవులని చేరుకుని కమ్మరం తెలిసిన
వాళ్ళవడంచేత ఇనుప పనిముట్లని తయారు చేసుకుని,
అంతకుముందు వాడుకుంటూవున్న కొయ్య నాగలికి
ఇనుప ముల్లును బిగించి, విస్తృతంగా వ్యవసాయం
చెయ్యడం మొదలుపెట్టారు. ఈ కొత్త నాగళ్ళతోనూ,
కర్ర పిడి గల కొత్త ఇనుప పారలతోనూ గంగానది
వొడ్డున మొలుస్తూన్న అడవి ధాన్యపు మొక్కలని
నాటి' వరి పంట పండించడం తెలుసుకున్నారు.

ఈ కాలానికి - సుమారు క్రీ. పూ. 800 ప్రాంతం
నుంచి 500 ప్రాంతంలో - పడమటవున్న పంజాబు-
సప్తసింధుతీరం - నుంచి వలసవస్తూన్న కొన్ని ఆర్య
గణాలు ఆదిమవాసులతో తలపడ్డాయి. (ఇక్కడ ఒక
చిన్న విషయం చెప్పవలసివుంది. ఆర్యులు "సప్తసింధు"
చేరేటప్పటికే అక్కడ అప్పుడే ఆదిమ జాతివారితో
తలపడ్డం తటస్థించినట్టు ఋగ్వేదంలో వుంది. వెలుగు
బంట్లనీ దాస్యులనీ జయప్రదంగా ఎదుర్కొనవలసి
వుంటుందని యీ మంత్రంలో వుంది. దీన్ని
లూడర్సు - తన గ్రంథంలో 152వ పేజీలో
ఉదహరించాడు. రెండవవిషయం: ఆర్యులు సింధు
నదినీ, గంగానదినీ "సముద్రాలు"గా వర్ణించారు.
తూర్పున వారికి తగిన "సదానిర" అనే "సముద్రం"
గండకీనది! లూడర్సు: 135వ పేజీ; కేంబ్రిడ్జి హిస్టరీ
ఆఫ్ ఇండియా, I, పేజీ 122). ఆర్యులు కొత్త ప్రదే
శాలని ఆక్రమించుకోడంలో ఆదిమవాసుల దగ్గిర
నుంచి ఇనుపముల్లుగల నాగలిని వాడడం, వరిపంటను
పండించడం నేర్చుకున్నారు. అప్పటికే ఆర్యులకు
పత్తి పంట పండించడం, బట్టలను నేయడం బాగా
తెలుసును. ఇనుము తయారుచెయ్యడం-ఇనుప ఈటెలు,
బండి చక్రాలకి ఇనపవలయం బిగించడం, ఇనుప
మొనగల నాగలి, ఇనుప పార, ఇనుప గొడ్డలి - వీటి
నన్నిటినీ ఇప్పుడు నేర్చుకుని - అడవులను కొట్టి కొత్త
బీళ్లని సాగుచేయడం భారీగా సాగించారు. అప్పు
డున్న కంచుయుగానికి స్వస్తిచెప్పి ఇనుపయుగం
ప్రారంభమైంది అది మానవసంఘంలో కొత్త విప్లవాన్ని
తెచ్చింది. వ్యవసాయం, చేతిపనులు, వృత్తులు బాగా
అభివృద్ధి చెందసాగాయి. సంఘంలో అదివరకే వృత్తి
విభజన బాగా ప్రవేశించినదల్లా - ఇప్పుడు క్రొత్త
వృత్తులు అలవరచుకోడానికిఅదును యేర్పడింది. ఈవృత్తి
విభజన బాగా నాటుకొని - వృత్తి విశిష్టత యేర్పడి -
కొనకి "వృత్తిజాతులు" యేర్పడ్డం మొదలుపెట్టాయి.

## 2

ఆర్యులు గంగానదీ తీరం చేరుకున్న తరవాత
కాలంలో వేదాలకి బ్రాహ్మణాలు (అర్థాలుగల
గ్రంథాలు) రాశారనీ, ఇది సుమారు క్రీ. పూ. 500
ప్రాంతంలో - అనగా ఇనుపయుగం ప్రారంభంలో -
జరిగిందనీ పైన సూచించాను.

ఆర్యులు హిందూదేశానికి వలసవచ్చినప్పటికే
నాగరిక ప్రజలని మనకు తెలుసు. అంచేత ఆర్యుల
సంఘంలో అప్పటికే కొంత తరగతి - అంతర
భేదాలు వుండే వుంటాయని మనం ఊహించుకోవచ్చు
(కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా I. పేజీ 125).
కొత్త దేశానికి వలసవచ్చినప్పుడు కొత్త దేశంయొక్క
శీతోష్ణస్థితి, కాలమానం, ఋతువులు మొదలైన
జ్యోతిష పంచాంగ విషయాలు తెలుసుకోవడం అత్యా
వసరం అయి-ఆ విద్య తెలిసిన కుటుంబాలు సంఘంలో

పురోహితులూ పూజారులుగా యేర్పడి, కొంత పలుకుబడి, అధికారం, గౌరవం సంపాదించి రానురాను ఈ కొద్ది పురోహిత కుటుంబాలూ ప్రత్యేక అంతరంగానూ తరువాత ప్రత్యేక వర్గంగానూ ఏర్పడి వుండాలి. ఏది యెలాగున్నా వేదకాలంనాటి ఆర్యసంఘంలో మూడేమూడు అంతరాలు (తరగతులు) వుండేవి: ప్రభువులూ, పురోహితులూ, పామరులూ అని (మొట్టమొదట ఆర్యసంఘంలో కులభేదం లేకుండా వుండేదనడానికి ఇప్పటికికూడా ఆంధ్రలో కొన్ని శూద్రకులాలవారు జంధ్యాలు వేసుకుంటూ వుండడంఒక నిదర్శనమా?). ఈ పామరజనమే వ్యవసాయం చేతిపనులూ చేసుకుంటూ పొట్ట పోసుకుంటూండేవారు. తరువాత మహేంజదరో-హరప్ప మొదలైన ద్రావిడులతో-ఆదిమ నాగరిక జాతులతో తలపడడం - వారిని జయించి నాశనం చెయ్యడం జరిగివుంటుంది. ఈ విధముగా తమకంటె నాగరికతలో ఉన్నత స్థాయిలో వున్న ద్రావిడ - ఆదిమజాతులని "దాస్యులు" గా చేయడంతో బానిససంఘ వ్యవస్థ (హరప్ప - మహేంజదరో అవశేషాల్లో బైటపడిన లోహపు పనిచేసే పొయ్యిలూ, వడ్లుదంచే రోలుగుంటలూ - ధాన్యపు కొట్లూ - బీదవాళ్ళ గుడిసెలూ ఈ బానిస వ్యవస్థకి నిదర్శనాలు)-దానితోనే ప్రప్రథమంగా వర్ణ (రంగు) భేద జాతి (పుట్టుక) భేదంతో కూడుకొన్న వర్ణవ్యవస్థ ఆర్యసంఘంలో తలయెత్త సాగింది. దాస్యులు ఆర్యుల ఇళ్లలో భృత్యులుచేసే పనిని చేసేవారు. వంటచేయడం - స్నానం చేయించడం - ఇల్లూ సామానులూ - ధనం - పంటలూ - సరుకులూ మొదలైనవి కాపలా కాయడం చేస్తూండేవారు. ఇళ్ళలో భృత్యులతోపాటు వీళ్లుకూడా నౌఖరీపని చేస్తూ కొన్ని కుటుంబాలలో కుటుంబసభ్యులలాగే చూడబడుతూండేవారు. ఒక్కొక్కప్పుడు కఠినంగా నిర్దయతో చూడబడుతూ కొద్దితప్పులకే కఠిన శిక్షలనీ, ఉరికూడా అనుభవించుతూ వుండేవారు. పర్యవసానమేమంటే - వర్ణవ్యవస్థ కులభేదంవల్లకాక (అప్పటికి కులం అంటూ ఇంకా ఏర్పడనేలేదు) పూర్తిగా ఆర్థికమూలమైన యజమాని - బానిస, ఆర్య - అనార్య అనే వర్గభేదంగల సంబంధంగా యేర్పడింది.

సామాన్య ఆర్యప్రజలలోకూడా కొంత వృత్తి విభజన వుంటూ వుండేది. వ్యవసాయం చేసేవారు, కమ్మరులు, వడ్రంగులు, కంసాలులు, ఇత్తడి కంచు రాగి పనిచేసేవారు, రథాలు చేసేవారు, కుమ్మరులు - ఈవిధంగా వేరువేరు వృత్తి చేసుకునే కుటుంబాలు ఉండేవి. ఇంకా వ్యాపారం చేసేవారుకూడా వుండేవారు. అయితే వైశ్యులనీ, శూద్రులనీ భేదం యింకా వేదకాలంనాటికి లేదు. అందరూ వైశ్యులే. ఈ భేదాలన్నీ తరగతి అంతరాలేకాని వర్గభేదాలుగా ఆ వేదకాలంనాటికి రూపొందలేదని చెప్పొచ్చు (జి. ఎఫ్. ఇల్యిన్ : "శూద్రులు - బానిసలు" : 1952 రష్యనుకు జర్మను అనువాదం. సోవియటు విశన్ షాఫ్ట్. పేజి 291).

ఈ భేదం మొట్టమొదట బ్రాహ్మణాలు రచించిన కాలంలో పుట్టినట్టు కనిపిస్తుంది. ఆదిమవాసులతో దగ్గిర సంబంధాలు ఏర్పడిన ఫలితంగా ఇనుము ఉపయోగంలోకి రావడంతోపాటు - కొత్త వరి పంట పాత కాయధాన్యాల పంట - పత్తిపంట - వీటితోపాటు చేతిపనులుకూడ అభివృద్ధిచెందాయి. కులవృత్తులన్నింటినో-కొన్నిటిని ద్రావిడ ఆదిమవాసుల దగ్గర నేర్చుకున్నవి - ఆర్యులు అలవరచుకున్నారు. కంసాలులు, ముత్యాల పనివారు - (ఈ రెండు వృత్తులూ మహేంజదరో హరప్పలో బాగా ప్రబలి వుండేవి కదా!) మేదరులు, చర్మకారులు, చాకళ్ళు, తాళ్ళు మోకులు పేనేవారు, రంగరేజులు, రథాలు చేసేవారు, మంగళ్లు, సాలెవారు, విల్లు అమ్ములు చేసేవారు, కమ్మరులు, కుమ్మరులు - ఈ విధంగా బ్రాహ్మణ గ్రంథాల కాలంనాటి సంఘంలో వృత్తి విశిష్టత బాగా వ్యాపించింది. (కేంబ్రిడ్జి హిస్టరి I, పేజీ 137 : రూబెన్ I, పేజీ, 105). ఆర్యులచే జయింపబడ్డ ఆదిమవాసుల నుండి ధాన్యరూపంలో గ్రామ మొత్తంగా పన్నులు వసూలు చేయడంచేతనూ, ఇళ్లలో బానిసలచే పనులు చేయించుకోనడంచేతనూ వస్తువుల ఉత్పత్తి బాగా పెరిగింది. అంతవరకూ ఆర్యులకి పట్టణాలుకాని, రాజ్యాలుకాని లేవు. వేదకాలంనుంచి అప్పటి వరకూ స్థిరవాసాలు లేకుండా తిరుగుతున్న ఆర్యగణాలు ఇప్పుడు స్థిరపడి రాజ్యాలు స్థాపించుకోసాగేరు. (కోసల, కురు, పాంచాల, కాశీ రాజ్యాలు). ఇదివరలోవున్న సైనిక రాజ్యాంగం ఇప్పుడు ప్రాచ్య నిరంకుశ రాజ్యాంగంగా మార్పుచెందింది. ఉత్పత్తి విధానం - దానితోపాటు రాజ్యాంగ విధానంకూడా మారేసరికి సంఘ వ్యవస్థకూడా తప్పనిసరిగా మారవలసి వచ్చింది. చేతిపనుల విభజన మరింత స్థిరపడి వృత్తి విశిష్టత యేర్పడింది. అదివరకు పురోహితులుతప్ప మిగతా ప్రజలందరూ ఆయుధాలని ధరించేవారు. అటువంటిది - రాజ్యం విస్తృతం చెందేసరికల్లా ఆయు

ధాలు ధరించి యుద్ధం చేయడం ఒక్క రాజకుటుంబీకులకు అనగా క్షత్రియులకే పరిమితం చేయబడి చేతి పనులూ, వ్యవసాయం చేస్తూన్న ప్రజలకి నిషేధింపబడింది (రూబెను I, పేజీ నం. 107). ఇంతవరకూ వ్యవసాయం, పశు సంరక్షణ, చేతిపనులు చేస్తూండే పామర జనంలో కుటుంబ వృత్తులు యేర్పడి వ్యాపారం చేసే వైశ్యుల కుటుంబాలు వైశ్యకులంగా వేరుపడిపోయాయి. (మొదట బ్రాహ్మణులుకూడా వ్యాపారం, వ్యవసాయం చేస్తూండేటట్టు జాతక కథల్లో అనేకచోట్ల వుంది: రూబెన్ 2 అంటే జాతక కథలనాటికి వర్ణవ్యవస్థ బాగా గట్టిపడలేదు అన్న మాట.).

ఆదిమవాసులు అడవి గ్రామాల్లో వ్యవసాయం చేసుకుంటూ జీవిస్తూండేవారు. వీరు నివసించే ప్రాంతాలకి "నిషధదేశం" అనీ ("నిషిద్ధంఅయిన దేశమూ" నిషిద్ధంఅయిన ప్రజలూ అని అర్థం) వీరిని "నిషాదులు" అనీ బ్రాహ్మణాలలో చెప్పబడింది. వీరినే కిరాతులనికూడా అనేవారు. వ్యవసాయం చేసుకోవడం, నీటి కాలువలు తవ్వి చేలకి నీరు పారించడం మొదలైన పనులు వీరి దగ్గిరనుంచే ఆర్యులు నేర్చుకున్నారు. పట్నవాసస్థులైన బ్రాహ్మణుల ఇళ్ళలోనూ, రాజుల క్షత్రియుల ఇళ్ళల్లోనూ పనిచేస్తున్న దాస్యులని పోషించడానికీ, పట్నాల్లోను, రాజుదగ్గిర పనిచేస్తున్న కర్మకారులకీ భోజన సామగ్రి అవసరం కనక వ్యవసాయం అభివృద్ధి చేయడం అత్యవసరం అయింది. అందుకుగాను ఆర్య సంఘంలోకి ఈ నిషాదులని కొందరిని కలుపుకున్నారు. వీళ్ళే కొంతకాలానికి నాలుగోవర్ణం అయిన శూద్ర వర్ణంగా పరిణమించారు. వ్యవసాయవృత్తిని అవలంబించిన ఆర్య పామరజనంకూడా (వైశ్యులు) కాలక్రమేణా శూద్రవర్ణంలోకి దిగజారిపోయారు. కొంతమంది చరిత్రకారులు "దాస్యులే" లేక "బానిసలే" "శూద్రులుగా" నాలుగవ వర్ణంగా మార్పుచెందారని అభిప్రాయపడ్డారు. ఇది పొరపాటు అనీ - ఆర్యసంఘంలోకి కలుపుకోబడ్డ కొందరు నిషాదులూ - ఆర్యులై వుండి మొదటినుండీ వ్యవసాయమే చేస్తున్న తరగతులవారూ - ఆర్యులై వుండి చేతిపనులు వృత్తిగా చేస్తూ కులవృత్తులలో నుంచి బీదతనంవల్ల దిగజారిపోయి వ్యవసాయ వృత్తిని అవలంబించినవారూ - వీరందరూ కలిసి శూద్రకులంగా యేర్పడినట్లు ఆధునిక సాంఘిక శాస్త్రం చెబుతూంది (పైని ఉదహరించిన ఇల్యీను గ్రంథం).

బ్రాహ్మణాలు రచింపబడిన కాలంనాటి సంఘంలో ఆర్యులూ అనార్యులూ అన్న జాతి (పుట్టుక) దృష్ట్యా యేర్పడ్డ భేదమున్నూ - వర్ణం దృష్ట్యా వచ్చిన భేదమున్నూ ఆర్యులలోనే ఆర్యులు-దాస్యులు అనే అంతరాల దృష్ట్యా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులనీ - శూద్రుల్లోనే ఆర్యులు వైశ్యుల్లోంచి దిగజారిపోయి కుల వృత్తులు చేసుకుంటూనూ, చేతిపనులతోనూ జీవిస్తూ ఉన్నవారూ - చేతిపనులు పోగొట్టుకొని ఆర్యులుగానే వున్నా వ్యవసాయం చేసుకుంటూనూ, భృత్యవృత్తి చేసుకుంటూన్న శూద్రులున్నూ - నిషాదులై ఆదిమ జాతివారైనా వ్యవసాయం చేసుకుంటూ కొత్తగా ఆర్యసంఘంలో చేర్చుకోబడిన శూద్రులున్నూ - వీరు కాక ఐదవ తరగతికి చెందిన బానిసలుగా వున్న చండాలురున్నూ - ఈ విధమైన విభజనతో సంఘం యేర్పడింది. మొత్తంమీద క్షత్రియులు, బ్రాహ్మణులు యేకమయి మిగతా తరగతుల (అంతరాల) వారిని దోపిడీచేసుకుని వారిపైన పెత్తనం చెలాయిస్తూ జీవిస్తూండేవారు. విస్తరిస్తూన్న రాజ్యాం, విస్తృతం అవుతూన్న వ్యవసాయం - అభివృద్ధిచెందుతూన్న వస్తూత్పత్తి - దీనికంతటికీ అవసరమైన పటుత్వంగల సంఘం - యీ సంఘంలో పీడింపబడుతూన్నప్పటికీ అగ్రవర్ణాలమీద తిరగబడకుండా తమవిధిని నెరవేర్చడంద్వారా మానసికంగా తృప్తిపడిన సామాన్యజనం - ఇటువంటి సంఘాన్ని నిర్మించడం ఆనాడు అవసరం అయింది. ఇటువంటి సంఘాన్ని కట్టుదిట్టం చేయడానికి తగిన మానసికతత్వాన్ని సృష్టించడం - తద్వారా తమ స్వతస్థితినే మెరుగుచేసుకోవడానికిన్ని - రాజుల చేత, ప్రభువులచేత బ్రాహ్మణులు ప్రేరేపింపబడినవారై - బ్రాహ్మణమతాన్ని, అందుకు తగిన తత్వశాస్త్రాన్ని, కర్మసిద్ధాంతాన్ని, వర్ణవ్యవస్థ సిద్ధాంతాన్ని బ్రాహ్మణులు కల్పించి ప్రజలలో ప్రచారం చేయసాగేరు. చతుర్వర్ణాలూ దైవసృష్టి అనీ, యే కులంలో పుట్టినవాళ్ళు ఆ కులవృత్తులనే పాటించుతూ వుండటం కులధర్మమూ, విధాయకమూ అనీ కుల కట్టుబాట్లని అతిక్రమించకూడదనీ తన ఖర్మంతో తృప్తి పడి వుండాలనీ. తిరగబడడం సంఘంలో మార్పుతీసుకు రావడం పాపం అనీ, బ్రాహ్మణ - క్షత్రియ- వైశ్యులు అగ్రవర్ణాలనీ, దాన్లో మళ్ళీ బ్రాహ్మణులే ప్రథములనీ- వైశ్యులూ, శూద్రులూ అనగా కులవృత్తులూ, చేతి పనులూ చేసుకుంటూన్నవారందరూ రాజు వారికిచ్చే కూలిడబ్బులతో తృప్తిపడి పనులు చేసుకుంటూ జీవించుతూ వుండాలనీ, వ్యవసాయకులు రాజుకి పంటలో ఆరో భాగం చెల్లించాలనీ, అన్ని కులాలవారూ

కష్టించి పనిచేసి పొట్టపోసుకోవడం వారి విధిఅయినా బ్రాహ్మణులుమాత్రం పనిచేయ నవసరంలేదనీ-కర్మకాండని నడిపించుతూ - అశ్వమేధ నరమేధ రాజసూయాదియాగాలనీ క్రతువులనీ రాజులచేత చేయించుతూ రాజులచేత కూలిడబ్బులుకాక "దక్షిణ" ఇచ్చి సత్కరింపబడి పోషింపబడుతూ వుండాలనీ - యుద్ధాలుచేసి రాజ్యాలు సంపాదించడం రాజధర్మం కాగా జ్యోతిశ్శాస్త్ర మంత్రశాస్త్రాల ప్రకారం సుముహూర్తాలని నిర్ణయించి హోమకర్మాదులుచేసి రాజుకి యుద్ధంలో జయాన్ని సమకూర్చడం బ్రాహ్మణుల ధర్మమనీ, అందుకు తగినట్టు రాజు బ్రాహ్మణులని పురోహితులుగానూ, గురువులుగానూ, పండితులుగానూ పూజించాలనీ, రాజులు ప్రజయెడల తమ రాజధర్మాన్ని నెరవేరుస్తూ వుండాలనీ - ప్రజకూడా రాజు మరీ క్రూరుడైతేతప్ప అతనియెడల విధిగా భయభక్తులతో నా విష్ణు పృధివీపతిః అని అతనికి లొంగివుండాలనీ - అందరూ బ్రాహ్మణులయెడల భక్తివిధేయతలతో మెలగాలనీ - ఒక భావతత్వాన్ని కల్పించి మతంపేరిట బానిసవ్యవస్థ పునాదిగాగల నిరంకుశ రాజ్యాంగాన్ని నిలబెట్టడానికి జాతిభేదం - వర్ణభేదం - కులభేదం ఇదివరకే కలిగివున్న సంఘాన్ని వర్ణవ్యవస్థగలసంఘంగా ప్రచారంచేసి సుస్థిరం చేశారు.

వర్ణవ్యవస్థతో పాటు ఇదివరకే తరగతులుగా విభజింపబడిన సంఘంలో వర్గభేదాలుకూడా యేర్పడసాగేయి. ప్రతీవర్ణంలోనూ ధనికులు, బీదవారు వర్గాలుగా వేరుపడడం ప్రారంభం అయింది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాలురలోకూడ గొప్ప-బీద అనే భేదం యేర్పడి గొప్పవారు పెద్దకులాల వారుగానూ, బీదవారు తక్కువ కులాలవారుగానూ శాఖభేదాలు యేర్పడి వర్ణాంతర, కులాంతర, శాఖాంతర వివాహాల నిషేధం, సహపంక్తి భోజననిషేధం (బ్రాహ్మణులలో తప్ప) కూడా ఆచారంలోకి వచ్చింది. ఇలాగు వర్ణవ్యవస్థచేత వృత్తి ప్రత్యేకత, వృత్తివిశిష్టతచేత వస్తూత్పత్తి అభివృద్ధిచెంది రాజుకే లాభించింది. రెండవవైపు వర్గభేదం కారణంగా ప్రజలు అగ్రవర్ణాలయొక్క దోపిడీ తీవ్రంకావడంవల్లనూ పన్నులభారంవల్ల అధికం కావడంవల్లనూ వుత్పత్తి అధికంచేయబడడంవల్ల కాయకష్టం అధికంఅయి ప్రజలలో అసంతృప్తికలిగినా వర్ణవ్యవస్థచేత సంఘంయొక్క ఐక్యతచెడి శ్రామికులు కులభేదాలవల్ల చీలిపోవడంకూడా రాజుకే లాభించింది.

వర్ణవ్యవస్థగురించి రాస్తూ ప్రత్యేకప్రవృత్తి విభజన మూలంగా ప్రత్యేక కులాలెలా యేర్పడుతూంటాయో మార్క్స్ చెప్పారు. ఆయన యిలా వ్రాశారు: "కులకట్టుబాట్లకి వ్యతిరేకంగా కులవృత్తులని విడిచిపెట్టేటట్టు చారిత్రకశక్తుల వత్తిడివల్ల కొంతమంది కులస్థులు ప్రేరేపింపబడితే - ఆవిధంగా కులవృత్తులు చెడిపోకుండా వుండడానికని ఈ వృత్తులనే వంశపారంపర్యా అవలంబించవలసిన కులవృత్తులుగా నిర్ణయించి, వీటిని వృత్తిసంఘాలుగా స్థిరపరచేసి, వృత్తికులాలుగా స్తంభింపజేయడం ప్రాచీనసంఘాలు తమ మనుగడకి గాను సహజంగా అవలంబించే మార్గాలు. జంతుజాలాలు, వృక్షజాలాలు యెలాగైతే తమ మనుగడకోసం జాతులుగానూ, ఉపజాతులుగానూ ప్రకృతిసిద్ధాంతాన్ని అనుసరించి భిన్నభిన్నంగా యేర్పడుతాయో - సరిగ్గా అలాగే వర్ణభేదాలు వృత్తిసంఘాలుకూడా యేర్పడతాయి. అయితే, వర్ణభేదాలు వంశపారంపర్యా స్థిరపడడం - వృత్తిసంఘాలు ప్రత్యేకంగా తయారు అవడం - సంఘం ఒక పరిణామస్థితి నందున్న తరువాత సాంఘిక శాస్త్రసిద్ధాంతాల ననుసరించి జరుగుతుంది" (కాపిటల్ 1, పేజీ 385 : బెర్లిన్, జర్మనుకూర్పు 1947).

ఇంకా - 1857 లో తను రాసుకున్న లిఖితప్రతుల్లో వర్ణభేదం గురించి మార్క్స్ యిలా వివరించారు: "ప్రాచ్యరాజ్యాల్లో తరగతి (అంతర) భేదాలు కుటుంబాలనిపట్టీ, ప్రాంతాలనిపట్టీ యేర్పడతాయి. వంశంలోంచి మొదట కుటుంబాలు పుట్టి - కుటుంబాల్లోనుంచి శాఖలు వేరుపడతాయి. తరువాత ఈ కుటుంబాలే వివిధప్రాంతాల్లో స్థిరనివాసం యేర్పరచుకుంటూ ఆ వివిధప్రాంతాల్లో మళ్ళీ ప్రాంతీయశాఖలుగా చీలిపోతాయి. కాలక్రమేణా కుటుంబశాఖలు అంతరించిపోయి ప్రాంతీయశాఖలుగా స్థిరపడిపోతాయి. వర్ణభేదమే ఈ ప్రాంతీయ శాఖలుగా స్థిరపడడానికి ప్రశస్తమైన ఉదాహరణ. ఈ ప్రాంతీయశాఖలూ, ఉపశాఖలూ చివరికి ఒకదానినుంచి ఒకటి చీలిపోయి వివాహసంబంధాలు లేకుండా దేనిదాటు కదే వేరైపోయి, అతిక్రమించడానికి వీలులేనటువంటివీన్నీ, ప్రత్యేకమైన వృత్తిని అవలంబించుతూన్నటువంటివీన్నీ ప్రత్యేక భిన్నకులాలుగా పాతుకుపోతాయి" (రూబెన్ 1, పేజీ 110లో ఉదహరిస్తారు.) మనదేశంలో సరిగ్గా వేలకివేల కులాలూ ఉపకులాలూ ఇలాగే తయారయాయి!

ఆదిమసమాజంలో ప్రథమంలోవున్న వృత్తి విభజన - ఆర్యులు సింధునదీ తీరానికి వలసవచ్చి ఆదిమ వాసులతో తలపడిన మూలంగానూ రంగుభేదంవల్లనూ జాతి భేదంవల్లనూ ఆర్యులూ అనార్యులూ అన్న విభక్షత యేర్పడి, సాంఘికంగా యజమానులు - బానిసలు - అనగా ఆర్యులూ - దాస్యులూగా పరిణమించింది. (అసలు సంస్కృత "ఆర్య"పదం ప్రాచీన పెర్షియను భాషలోని "ఆరియ" పదంతో సమానం. "ఆరియ" అనే పదానికి "గొప్ప కుటుంబంవాడు"అనీ, పాలకవర్గంవాడు అని అర్థం. అంచేత "ఆర్య" పదం యొక్క వాడుక వర్గభేదాన్ని సూచిస్తున్నదని అవడీయవ్ అంటాడు: "ప్రాచీన ప్రాచ్యదేశాల చరిత్ర": జర్మను అనువాదం: బెర్లిన్ 1953 పేజీ. 438) అప్పటికే వృత్తి విభజన, వృత్తి ప్రత్యేకత బాగా అభివృద్ధి పొంది వుండడంచేత పురోహితులు- రాజులు- వైశ్యులు - అని మూడు ఆర్యవర్ణాలున్నూ, 'దాస్యులు' అనే మరియొక వర్గవిభజనాయేర్పడింది. వేదకాలందాటి బ్రాహ్మణాల నాటికి వచ్చేసరికి ఇనుము వాడుకలోకి వచ్చి వరిపంట, చేతిపనులు ప్రబలడంవల్ల వర్ణభేదం కరడుకట్టడం ప్రారంభించింది. అదివరకు ఋత్విక్కులుగా పురోహితులుగా గురువులుగా వున్నవారు బ్రాహ్మణులుగానూ, రాజులు క్షత్రియులుగానూ, వైశ్యులలో చేతిపనులుచేసేవారు అచ్చవైశ్యులుగానూ మిగిలిన వైశ్యులు "శూద్రులు"గానూ - ఆదిమ జాతి బానిసలు దాస్యులుగానూ పరిణామం చెందారు. నానాటికి యీ వృత్తులు కులవృత్తులుగా మారి - వృత్తి కులాలు యేర్పడి-ఇదివరకటి వలసప్రజ ఇప్పుడు వివిధ ప్రాంతాల్లో స్థిరవాసులుగా మారడంచేత - దేశంలో ఒకే వృత్తి అవలంబించుతున్నప్పటికీ వేరు వేరు ప్రదేశాల్లో వుండిపోవడంచేత వేరు వేరు ప్రత్యేక ఉపకులాలుగా తయారయారు. వేదకాలంనుంచి బ్రాహ్మణాలకాలం-అక్కడనుంచిఉపనిషత్తుల కాలం - అక్కడనుంచి కౌటిల్యుడి (క్రీ. పూ. 300) కాలానికల్లా - వృత్తి విభజనతోపాటు వర్గవిభజన కూడా సంఘంలో యేర్పడింది. అప్పటికి బ్రాహ్మణుల ప్రాబల్యం బాగా యేర్పడింది. బ్రాహ్మణులు, క్షత్రియులు మిగిలిన కులాలవారిపై అధికారం చలాయిస్తూ వారిని దోపిడీచేస్తూ జీవించుతున్నా, బ్రాహ్మణులు రాజగురువులుగా యేర్పడ్డంచేత సంఘంలో బ్రాహ్మణులదే పైచెయ్యి అయింది. ఇదివరకున్న సైనిక రాజ్యాంగం అల్లా ప్రాచ్యనిరంకుశ రాజ్యాంగంగా మారజొచ్చింది. ఈ నిరంకుశ రాజ్యాంగం ప్రజలకి అంగీకృతంగా వుండడానికీ, వాళ్లని విప్లవంలోకి దిగకుండా అదుపు ఆజ్ఞల్లో వుంచడానికీ తత్వశాస్త్రం అవసరం అయి బ్రాహ్మణమతం అల్లా ఉపనిషత్తుల్లో చెప్పబడిన వేదాంత తత్వశాస్త్రం కింద మారింది. దాంతో వర్ణవ్యవస్థనీ, ఉపరిభాగంగా రాజ్యాంగాన్నీ పటిష్ఠం చెయ్యడానికి బ్రాహ్మణ మతమూ వేదాంతమూ పునాదులుగా ఘనీభవించాయి. (రూబెన్: 1. పేజీ 115) ఆర్థికంగా బ్రాహ్మణుల యొక్క ప్రాధాన్యత యేర్పడ్డానికి బ్రాహ్మణులకి రాజులు "బ్రహ్మదేయం"గా అగ్రహారాలని దానం చెయ్యడం మొదలు పెట్టారు (కే. బ్రిడ్జి హిస్టరీ. I. పేజీ 129, 132) మనువు కాలం నాటికి (క్రీ. పూ. 270) బ్రాహ్మణుల ఆధిక్యత బాగా స్థిరపడిపోయి, యీ బ్రహ్మదేయాలే తరువాత కాలంలో తలయెత్తిన ఫ్యూడల్ వ్యవస్థకి మొదటి చిహ్నాలుగా పరిణమించాయేమో కూడా. (కేంబ్రిడ్జి హిస్టరీ, 1. పేజీ 131) మనువు కాలంనాటికే బ్రాహ్మణులు రాజగురువులుగాను, క్షత్రియులు అమాత్యులుగాను నియమింపబడడం జరిగి ఫ్యూడల్ వ్యవస్థకి మార్గం సుగమం చేయబడింది. "పదిగ్రామాలకి ఒక పన్నులు వసూలుచేసే ఉద్యోగి - అటువంటి 100 గ్రామాలమీద ఒక పెద్ద ఉద్యోగి - వెయ్యి గ్రామాల మీద అంతకంటె పెద్దఉద్యోగి-ఇలాగు పన్నులువసూలు చేసే ఉద్యోగులని నియమించాలని మనువు చెప్పాడని" అంటూ "ఈ విధంగా ఉద్యోగులకి అధికారాలు సమకూర్చి ఫ్యూడల్ వ్యవస్థలోకి ఈ అధికారులే ప్రధాన అంగాలుగా తయారయారు" అని మార్క్స అంటాడు (మార్క్స - ఎంగెల్స ఉత్తర ప్రత్యుత్తరాలు : I, పేజీ 589 : బెర్లిన్ 1949).

ఆపస్తంబ సూత్రాలు (క్రీ. పూ. 4వ శతాబ్ది), మను ధర్మశాస్త్రం (క్రీ. పూ. 3వ శతాబ్ది) నాటికి వర్ణవ్యవస్థబాగా వేళ్లుతన్ని గట్టిపడిపోయింది. అప్పటికే వర్ణాలలో వర్గభేదం, గొప్ప - బీద అనే భేదం సాంఘికంగా యేర్పడిపోయింది. సాంఘికంగా బ్రాహ్మణులలో భూకామందులూ, గొప్ప ధనవంతులూ వర్తక శిఖామణులూ వుండేవారనీన్నీ, వీరితోపాటు వ్యవసాయం చేసుకుని పొట్ట పోషించుకునే బ్రాహ్మణులూ, యాచనచేసి జీవించుతూన్న బ్రాహ్మణులూ వుండేవారనీన్నీ జాతక కథల్లో వర్ణింపబడింది. (రూబెన్. 2) శూద్రుల్లో కూడా అనేక పశువులుగల ధనవంతులు వుండేవారని

కూడా చెప్పడానికి నిదర్శనాలున్నాయి (వేబర్ : రూబెను ఉదహరిస్తాడు. I, పేజీ 107) అందుచేత వర్ణవ్యవస్థకి తోడు వర్గ విజభనకూడా బాగా స్థిరపడిపోయింది. వీటికి అదనంగా అసంపూర్ణమైన బానిస వ్యవస్థ, గ్రామ జీవనం, వస్తూత్పత్తి ప్రథమ దశలోనే స్తంభించిపోయి అలాగే వుండి పోవడం, గ్రామ స్వయం సంపూర్ణ విధానం ఆనాటికే బాగా పరిణతి చెందడం చేత ఫ్యూడల్ రాజ్యాంగం యేర్పడడానికి కావలసిన అంగాలన్నీ బాగా పరిపక్వం చెందేయి.

## 3

మొదట బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య అని మూడు వర్ణాలే వుండేవనీ- కాలక్రమేణా కులవృత్తుల భేదంతోపాటు వర్గభేదంకూడా యేర్పడ్డ తరువాత వైశ్య వర్ణంలోనుంచి వ్యవసాయదారులు వేరైపోయి శూద్రులుగా యేర్పడ్డారనీ చెప్పారు. "వైశ్య" పదానికి మూలం "విష్" ధాతువు. దీనికి "కుటుంబ సమూహము" "గ్రామము" అని అర్థం ("విషయము = గ్రామ సమూహము) ప్రాచీనస్లావ్ భాషలో "వెస్" (Wes) అనే పదానికి "గ్రామం" అని అర్థం. (అవ్ డియెవ్ : పేజీ 440). అంచేతే "విశ్వపతి" అనగా గ్రామ అధిపతి అని అర్థం. ఆర్య గ్రామాల్లో ధనికులైన వైశ్యులు పట్టణాల్లో నివాసం యేర్పరచుకుని వర్తకమే ప్రధానవృత్తిగా గల కులస్థులుగా తయారయ్యారు. బీదవైశ్యులు పల్లెలలోనే వుండిపోయి వ్యవసాయంవల్ల, చేతిపనులవల్ల జీవించుతూ శూద్రులుగా మారిపోయారు. నిషాదగ్రామాల్లో వున్న ఆదిమజాతుల సంపర్కం కలిగిన ఫలితంగా ఆర్య జాతికి చెందిన శూద్రులుకూడా ఆదిమజాతివారినుండి పల్లపువరిపంట (ఆర్యులకి సింధునదీతీరంలో వున్నప్పుడు మొరక వరిపంట ఒక్కటే తెలుసు. పల్లపు వరిపంట తెలియదు) నేర్చుకున్న తరువాత ఆర్యకర్షకులు పల్లె ప్రజలుగానూ, వ్యవసాయం చేతిపనులు ప్రధానవృత్తి గాగల శూద్రవర్ణంగానూ మారిపోయివుంటారు. ఈ పరిణామం సరిగా యిలాగే జరిగిందని నిర్ధారణగా చెప్పడానికి తగినన్ని నిదర్శనాలు లేవు. అయినా మనుధర్మశాస్త్రంలోనూ, కౌటిల్యుని అర్థశాస్త్రంలోనూ చెప్పబడిన విషయాలని మార్క్సిస్టు దృక్పథంతో విమర్శిస్తే, యీ విధంగానే జరిగివుంటుందని ఊహించుకోవచ్చు (రూబెన్ : 2. పేజీ 96). ఆర్యసంఘమూ, రాజ్యాంగమూ అభివృద్ధిచెందగానే యీ శూద్రవర్ణం వారే కొత్త బంజర్లని సాగులోకి తెచ్చి కొత్త గ్రామాల్లో స్థిరపడి రానురాను పల్లెల్లో వ్యవసాయ కులగానూ, పామరజనంగానూ యేర్పడ్డారు.

దాస్యులూ (బానిసలు) శూద్రులూ ఒకవర్ణంవారే అన్న అభిప్రాయం చరిత్రకారులలో సామాన్యంగా వుంది. ఆర్యులు (కౌటిల్యుని అర్థశాస్త్రంలో "ఆర్య ప్రాణా" = స్వేచ్ఛగా జీవించేవారు అని అర్థం) దాస్యులు ("ఉదరదాస" = పుట్టుకతోనే -జాతితోనే- దాస్యులైనవాడు బానిస అని అర్థం చెప్పుకోవచ్చు) అనే భేదం వెనక చెప్పినట్టు జాతిభేదకారణమైన పాలక - పీడిత వర్గభేదాన్ని సూచిస్తుంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర విభజన వర్ణ భేదాన్ని సూచిస్తున్నది. ఈ వర్ణభేదమూ వర్గభేదమూ రెండూ కాలక్రమేణా ఒకదానిపై ఒకటి ప్రభావం చూపిస్తూ ఫ్యూడల్ వ్యవస్థ స్థిరపడేటప్పటికల్లా ఒక దాంతో ఒకటి పెనవేసుకుని హైందవసంఘం యొక్క ప్రధాన రూపాన్ని సుస్థిరంచేశాయి. చివరికి యెలా తయారైందంటే: ఒక వర్ణంలోనే ధనికవర్గంవారు దరిద్రవర్గంవారుగానూ దరిద్రవర్గంవారు ధనికవర్గం గానూ మారడానికి అవకాశంవున్నా - వర్ణభేదం జన్మ వల్ల కలిగినది అనడంచేత ఒక వర్ణంలోంచి ఇంకొక వర్ణంలోకి మారడానికి యేమాత్రం అవకాశమూ లేకుండా చేసేశారు శాస్త్రకారులు. దీనితోపాటు అగ్రవర్ణాలవారు అధమ కులాలవారిని మతాచార దృష్ట్యాను సాంఘికఆర్థికదృష్ట్యాను దోపిడీచేసి పీడించుతూండడం భారతీయ సంఘవ్యవస్థలో శిష్టాచారం గానూ, ప్రధాన ఆర్థిక సూత్రంగానూ యేర్పడి పోయింది. శూద్రులూ దాస్యులూ ఒకరు కారని మాత్రం మార్క్సిస్టు సిద్ధాంతదృష్ట్యా నిర్ధారణగా చెప్పొచ్చు (ఇల్యిన : పే 278-293).

అయితే పంచమ వర్ణానికిచెందిన చండాలురు ఎవరు? అన్న ప్రశ్నవస్తుంది. ఈ అస్పృశ్యుల గురించి వేదాల్లో ఎక్కడా లేదు. అంచేత వేద కాలంలో అస్పృశ్యులు - పంచములు- లేరు. బానిస వ్యవస్థ వచ్చిన తరువాతకూడా జాతక కాలంలో "ఆర్య ప్రాణ" భృత్యులతోపాటు దాస్యులుకూడా అగ్ర కులాలవారి యిళ్ళల్లో వంట మొదలైన పనులను చేస్తూ అస్పృశ్యదోషం లేకుండా తిరుగుతూ వుండేవారు. తరువాత మనువు, కౌటిల్యుడు కాలంలోకల్లా శూద్ర

వర్ణం నాలుగోవర్ణంగా ఏర్పడ్డ తరువాత యిళ్ళలోనూ, సంఘంలోనూ నీచంగా పరిగణింపబడే పనులను చేయడానికే వీరు నియమింపబడి, అస్పృశ్యులుగానూ చూడబడి, పంచములుగా గ్రామం అవతల వెలివేయబడినవారై, వెనుక వారు బానిసలుగా అనుభవించిన స్థితి కంటె అధ్వాన్నంగా నికృష్టజీవితం గడుపుతూ సంఘంలో అట్టడుగున మ్రగ్గివున్న తరగతిగా చూడబడుతూ వచ్చారు (రూబెన్ : 2. పేజీ 98).

ఈ విధంగా వర్ణవ్యవస్థ పరిణామక్రమంలో - మొదట ఆర్యులు దాస్యులు అనే వర్గభేదంతో పుట్టి తరువాత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య అనే వృత్తిభేదమే ప్రధానంగాగల మూడు తరగతులుగా విభజన పొంది - ఆ తరువాత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే కులాలుగామారి - వృత్తి విభజన, వర్గభేదం, వర్ణవ్యవస్థ, బానిస సంఘవ్యవస్థ కరడు కట్టిన ఫలితంగా వర్ణవ్యవస్థసంఘంగా పరిణమించింది.

## 4

వర్ణవ్యవస్థ వర్గభేదంవల్ల బానిసవ్యవస్థని ప్రధాన ధర్మంగా కలిగి ఉత్పత్తి విధానంలో ప్రథమావస్థలోనే నిలిచిపోయిన స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థలో పరిణతి చెందిందని మార్క్సిస్టు దృక్పథంతో చూస్తే మనకి తేటతెల్లం అవుతుంది. అందుచేత వర్ణవ్యవస్థ అంతరించడానికి స్వయం సంపూర్ణ గ్రామవ్యవస్థ అంతరించడం - ప్రథమావస్థలోనే ఆగిపోయిన వస్తూత్పత్తి విధానం యంత్రసహాయంతో విస్తృతం కావడం అవసరం. ఇది జరిగిననాడు - పూర్తిగా భూస్వామ్య, ఫ్యూడల్ వ్యవస్థ అంతరించిన నాడు - వర్ణవ్యవస్థకూడా చారిత్రక శక్తుల బలంవల్ల నాశనం కాబడుతుంది.

బ్రిటిష్‌వారు మనదేశానికి వచ్చి మన చేతివృత్తులని నాశనం చెయ్యడంవల్ల గ్రామస్వయం సంపూర్ణ వ్యవస్థనీ, దానితో పెనవేసుకునివున్న వర్ణవ్యవస్థనీ నాశనం చేయడంవల్ల వాళ్లు దేశంలో ఒక విప్లవాన్ని తీసుకువచ్చి హిందూదేశానికి మహోపకారం చేశారు అని మార్క్స్ అప్పుడే అన్నారు. (మార్క్స్-ఎంగెల్స్‌ల ఉత్తరప్రత్యుత్తరాలు 1. పేజీ 587 బెర్లిను 1949).

దేశంలో యంత్రసహాయంతో వస్తూత్పత్తి విరివిగా జరగడం - రహదారీ రవాణాలూ బస్సులూ రైళ్లూ విస్తారం కావడం - ప్రజలస్థితి ఆర్థికంగా కొంత మెరుగుపడడం వల్ల వర్ణవ్యవస్థ ఇరవై ముప్పయ్యేళ్లై మన కళ్ళముందటే బాగా సడలడం కనిపిస్తోంది. భూస్వామ్యవ్యవస్థయొక్క అవశేషాలు పూర్తిగా అంతరింపజేసి ఫ్యాక్టరీ ఉత్పత్తి విధానాన్ని ప్రబలంచేసి పల్లెలలో నిరుద్యోగంవల్ల జీవనోపాధి లేక అలమటించుతూన్న జనం పట్నవాసాల్లో కార్మికులుగా గౌరవప్రదంగా జీవించడానికి ఉపాధి కలిగించిననాడు వర్ణవ్యవస్థ నామరూపాలు లేకుండా అంతరించిపోతుంది.

## ఈ వ్యాసరచనకు సహాయపడిన గ్రంథాలు


1. RUBEN : (1) Introduction to Indology, Berlin 1954 (German)
2. ,, (2) Position of Slaves in Ancient Indian Society, Berlin (German) 1956.
3. ,, (3) Tiahuanaco, Atakama and Araukan, Leipzig, 1952 (German)
4. ,, (4) Ironsmiths and Demons in India, Leiden 1939 (German)
5. ENGELS : Anti - Duhring, Berlin 1923 (German)
6. ,, The Origin of the Family, Property & State, Berlin, 1950 (German)
7. Marx-Engels : Correspondence. 4 Vols. Berlin 1949 (German)
8. ,, ,, Selected Writings, Moscow, 1950 (German)
9. Cambridge History of India. Ed. by Rapson. Cambridge 1925.
10. LUDERS : Varuna, Gottingen, 1951 (German)
11. Dange : India - From Slavery To Primitive Communism, Bombay 1954.
12. STRUWE, W. W., : History of The Old World, Berlin 1954, (Translated into German from the Russian edition 1949)
13. RAMESAN, N : A Pallava Copper Plate Grant, Hindu, June 16, 1937.
14. ILYN, G. K., : Sudras AND SLAVES IN ANCIENT INDIAN LAW CODES, Soviet Science, Section Social Sciences., 1952 (German Translation.)
15. The Great Soviet Encyclopaedia : Article on INDIA by A. M. Ossipov, K. A. Antonova. J. M. Reisner, & A. M. Djakov, 2nd Edition, Moscow 1953 (Russian)

# మౌర్య చంద్రగుప్తుని సామ్రాజ్యం

కె. వి. రమణారెడ్డి, ఎం. ఎ.

ముందు వెనుకల పసిపిల్ల లెక్కగలిగిన యిసుక తిన్నెలవంటి స్వల్పరాజ్యాలు. ఉన్నట్టుండి "నభూతో న భవిష్యతి," అనిపించగలిగిన అద్భుతమైన మహా శిఖరము వంటి సామ్రాజ్యము.

పౌరాణిక సామ్రాజ్యాలు కథావశిష్టాలై, భారతీయ జనత శతధా విభజితమై, దేశ చిత్రపటం ఖండితమై, శతాధిక స్వల్ప ప్రభువుల క్రింద వసుంధర ఛిన్నాభిన్నమై పోయిన దుర్ముహూర్తం. ఉన్నట్టుండి, సామ్రాజ్య మహా సౌధనిర్మాణదక్షులూ, అభినవ మయులూ, విశ్వకర్మలూ వంటి చంద్రగుప్త, కౌటిల్యుల అవతరణం.

అనాదిసిద్ధమైన గణతంత్రవ్యవస్థ అవ్యవస్థితమై అంతఃకలహకారణంగా దుర్బలంకాగా, దేశీయ విదేశీయ విజేతల వుక్కుమడిమల క్రింద అణగారిపోతున్న రోజులు. ఉన్నట్టుండి, పరిమితమై పరిమల పాలై యుండిన రాజాధికారం గరుత్మంతుని రెక్కలను విప్పుకొని, వర్షాకాలమేఘంవలె భారతదేశాకాశ తలాన్ని కప్పివేస్తున్న సమయం.

ఉమ్మడిసొత్తుగా వుండిన వసుంధర వ్యక్తులకు అమ్మకమై, చిటిపొటి క్షేత్రాలస్థానే మహాక్షేత్రాలు రూపొందిన రోజులు. మహాశక్తి సమపేతాలైయుండిన శ్రేణులు, సభలు, పూగములు రాజ్యాధికారమనే రాహువు గ్రసించిన పూర్ణచంద్ర బింబాలవుతున్న రోజులు. భూమి అసనమై ఆదాయము అదనము కాగా, వర్తక వాణిజ్యాలు బహుముఖంగా విస్తరించినప్పటికీ, ఆర్థిక కల్లోలాన్ని రాజాధికారం అదుపులో పెట్టజూచిన రోజులు.

పరిణామం చరిత్రకు ప్రాణం! మౌర్యసామ్రాజ్యావతరణ ముహూర్తం పరిణామాల డోలిక!

అదిగో వీడో మానవకల్పిత భూకంపం! వాయవ్య భారతం దద్దరిల్లిపోయింది. గ్రీసునుండి పర్షియా శిథిలాలమీదుగా విజేత అలకసుందరుడు రానూ వచ్చాడు, చావుదెబ్బలు కొట్టాడు, తృటిలోపోయాడు. అతనితో బాటు, ఆయుధశక్తి మీదుగా లేవగల సామ్రాజ్యాదర్శం భారతదేశాన్ని చొచ్చింది. అతని పాదాలవెంట, పర్షియా సామ్రాజ్య ధనకోశాలనుండి కొల్లగొట్టబడిన బంగారు ప్రవహించింది. అతని నిష్క్రమణతో బాటు, వాయవ్య భారత రాజకీయ వ్యవస్థ నిశ్శక్తమైపోయింది. అంభి రాజ్యం, పౌరవుని దర్పం, క్షుద్రక మల్లాది గణతంత్రాల ప్రాణం కొసకు వచ్చింది.

అనైక్యతను మించిన రాజకీయ గురువులేరు. పరాజయమనే పాఠశాలలో సంఘటన మనే గుణపాఠాన్ని నేర్చిన వారిలో మౌర్యచంద్రగుప్తుని, కౌటిల్యుని చేర్చవచ్చును. మహాగణ తంత్రాలకు పుట్టిల్లయిన తక్షశిలా ప్రాంతం, మహాసామ్రాజ్యాలకు జీవగర్రవంటి పాటలీపుత్ర ప్రాంతం ఒండొంటిని కౌగలించుకొన్నాయి. ఈ వుక్కు కౌగిలిలో నవనందుల హేయ రాజ్యాధికారం విగతప్రాణమైపోయింది. ఇందునుండి అంతస్థులంతస్థులుగా వేనవేల గదులతో ఒక మహాసామ్రాజ్యం స్వప్నసీమనుండి యథార్థరంగంమీదికి దిగివచ్చింది. కల చాణుక్యునిది. వాస్తవం చంద్రగుప్తునిది.

చతురంత మహాసామ్రాజ్యాదర్శం భారతీయులకు పరాయిది కాదు. కాని నిరంకుశ సామ్రాజ్యాధికారం కొత్తది. మునుపు రాజ్యాలు కొద్దిపాటి స్తంభాలమీద నిలిచినవి. కాని యిది వేయిస్తంభాల మీదనే కాని నిలువలేనంతటి సామ్రాజ్య మంటపం!

విస్తృతాధికార సమన్వితుడై, చార చక్షువై, భృత్య సహస్రము కొలువగా, పాలితుల జీవితరంగము లన్నిట ప్రవేశించు సహస్రాంశువై, మౌర్య సామ్రాట్టు దర్శనమిస్తున్నాడు. ప్రజల భుజాలమీదుగా సింహాసనానికి నడచి వచ్చి, యిప్పుడు ప్రజలకు యోజనాల దూరాన నిలిచాడు. విదేశీయ దాస్యకళంకాన్ని తుడిచివేసి, స్వీయాధికారాన్ని ప్రతిష్ఠించాడు. గంగానదీ గర్భంలో బంగరు రాసులు దాచిన నీచుడు ధననందుని వుక్కణచి, తాను కోశాలు నింపుకొన్నాడు. ఇతనికి ముగుదాడు వేయగలవా డెవడు? సంప్రదాయకము

లైన అంకుశాలేవీ లేవా యీ మదగజానికి? పరిధి లేదా యీ నిరవధికమవుతున్న అధికారానికి? భీష్మాచార్యులున్నాడు, కురువృద్ధుడు! అతని అభిప్రాయమేమిటి రాజాధికారం గురించి?

## సంప్రదాయిక రాజాధికారం

కృతయుగాన రాజనేవాడు లేడు. ప్రజలే ఒండొరులకు రక్షకులై యుండేవారు. కాని లోభము పెరిగింది. ధర్మము ఖండితమైంది. ప్రజలు అకార్యములకు దిగినారు. కొంత కాలానికి వారు తమలో తామొక ఒప్పుదల చేసికొన్నారు. క్రూరతను, చౌర్యమును, వ్యభిచారమును మాపక, వానిని సాగించు దుర్జనుని అందరును చేరి శిక్షించగలిగి కూడ తమందరిని అనుశాసించగల దండధారిని ఎన్నిక చేసికొన్నారు. తమ పశువులలో, పసిడిలో ఏబది యగు భాగమును, ధాన్యములో పదవ భాగమును భండారముగా గ్రహించి, శస్త్రోపజీవులను సమీకరించుకొని "దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనం బాచరింపు, మేమందఱము ననుసరించి నీ పనుపుం జేయగలవారము" అన్నారు. దండమునకు ప్రజల స్వచ్ఛందామోదమే మూలకందము. "రాజ్యస్య మూలకారణంబు ప్రజాసంరక్షయ". రాజ శాసనము రాజు చిత్తవృత్తులమీద ఆధారపడరాదు. "పరీక్షా విశుద్ధి పూర్వకము"గా వుండవలెను. కడుపులోని బిడ్డ బ్రతుకుకు అనురూపములైన ఆహారములను గర్భిణి సేవించేటట్లు, ధరణీప్రజల మనుగడకు తగినట్లు రాజు నడువవలెను.

"రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మగాన రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్"

దండము నాతికఠినము, నాతిసదయమూ కావాలి. వసంతర్తువులో సూర్యునివలె "తగియెడుపాటి"తో ధరణి ప్రజలను వుచిత వర్తనముల నొందించవలెను. మోటుతనమున బలప్రయోగమున పన్నులు తీసికొనుట పాడియావు పొదుగుకోయుట, చెట్లు నరికి మంట బెట్టుటవంటిది. కర్షకులు, వణిజులు, గోరక్షకులు రాజునకు ధనముబిన గూడేచోట్లు. కాబట్టి ధనములకు, ధాన్యములకు వుత్పత్తి స్థానములైనవానికి యించుకేని హానిరానీయక, జలగ నెత్తురులాగేటట్లుగా, అవసరానికి చాలినంతగా, సొమ్ములు తీసికొనదగును. ధనాపహారణమే వృత్తిగాగల రాజునకు శత్రువులచే కీడుమూడేముందు "తన ప్రజచేన చేటు మూడు"తుంది.

అర్థసమ్యగుపార్జన యొక్కటే రాజధర్మము కాదు. అర్థము ధర్మమునకు మూలము. ధర్మరక్షణ ప్రభు కర్తవ్యము. "రాజనంగ ధర్మదేవత యన వేఱె?" న్యాయపాలనమున రాజహృదయము త్రాసువంటిదై, ప్రజావివాదములపట్ల పక్షపాతములేక, "ధనవాంఛమై ధనికుల దెసప్రాలి తీర్పక," దండింప దగేచోట్ల, అనుగుణమైన దండమాచరింపవలెను. (మహాభారతము : శాంతిపర్వము) శాసన రూపకమైన దండం మూలం కాగా, పైకిలేచిన వృక్షం ధర్మపుష్పాలు రాలుస్తుందని కె. యల్. సర్కార్ అనే విద్వాంసుడు దండ ధర్మానుబంధాన్ని వివరిస్తున్నాడు. "దండము లేనిచో మాత్స్యన్యాయము పుట్టుచున్నది. దండధరుఁడు లేనపుడు బలవంతుడు దుర్బలుని భక్షించుచున్నాడు. దండధరునిచే రక్షింపబడి దుర్బలుడు బాగుపడుచున్నాడు." (కౌటిల్యుడు) రాజు ధర్మరక్షకుడేగాని ధర్మప్రవర్తకుడు కాడు. ఉన్నవానిని భద్రపరచడమే అతని విధికాని, నూతనమైన ధర్మాన్ని శాసనరూపేణా స్వతంత్రంగా కల్పించడము కాదు. న్యాయానికి జన్మస్థానాలు ముఖ్యంగా మూడు : ధర్మము, వ్యవహారము, చరిత్రము. సర్వకాల సర్వదేశాలలో విశ్వజనీనమైన నైతిక నిబంధనలే ధర్మమంటేను. మరి, వ్యవహారమనేది దేశ కాలానుగుణముగా వున్న సంప్రదాయము. చరిత్రమనేది శ్రుతి, స్మృతి, పురాణాదులలో నిక్షిప్తమైయున్న నైతిక నియమానుబంధనము. రాజు యీ మూడింటిని గౌరవించక తప్పదు. ధర్మాధర్మ నిర్ణయము వేదవేదాంగ విదులైన శిష్టులది. కాబట్టి రాజకీయాలకూ మతానికీ ఒద్దిక ఏర్పడింది. మతము పౌరజీవితానికీ, వ్యక్తి ప్రశస్తవకూ, రాజాధికారానికీ పరిమితులనుకూడ కల్పించగలిగింది. బ్రాహ్మణుని ధిక్కరించి తత్ఫలితంగా తన కుమారుని చేతనే హతుడైన వేనుడు నూటికి కోటికి ఒక్కడు కాగా, సాధారణంగా మిగతవారు మతాధీనులని అనక తప్పదు.

ఈ స్థితి ఎల్లకాలము సాగలేదు. పురోగతికి స్థితి అడ్డుతగిలినప్పుడు, ఘర్షణ జనిస్తుంది. ఆ ఘర్షణనుండి పూర్వస్థితికి భిన్నమైన క్రొత్తవ్యవస్థ ఏర్పడుతుంది. కాని అభిప్రాయాలలో వచ్చే మార్పులకు మూలకారణం ఉత్పత్తి శక్తుల సంబంధాలలో వచ్చిన మార్పులనక తప్పదు. ఈ మార్పులను పరిశీలించినప్పుడే వ్యవస్థా పరిణామం సుగ్రాహ్యమవుతుంది.

## భూమి: "మన" నుండి "నా" వరకు

అన్ని దేశాలలో వలెనే భారత దేశములో కూడ ఆదిమ నివాసులకు ఆహారోత్పత్తికంటె ఆహారాన్వేషణ పశుపోషణకు కనిపించిన ప్రథమ మార్గం. వేట వినోదం కాదు, అవసరం. కాని వేటాడడానికి అరణ్యాలు, జంతుజాలం కొంతకాలానికైనా పరిమితం కాక తప్పదు. తర్వాత ఆహార సేకరణ మీదుగా ఆహారోత్పత్తికి, అనగా వ్యవసాయానికి ఆదిమ సమాజాలు పయనించాయి. అరణ్యాలను నరికి, కాల్చిపూడ్చి, కొండలు దిగి బయళ్ళకు వచ్చారు మనుష్యులు. ఆర్యేతర గిరిజనుల ఆర్థిక జీవనాన్ని పరిశీలించినప్పుడు, ఋతుగతితోబాటు వ్యవసాయతలాన్ని మార్చి మార్చి ఆహారోత్పత్తి చేయడం పరిపాటిగా కన్పిస్తుంది. తక్షణావసరాలను తీర్చగలిగినంతవరకే వుత్పత్తి జరుగుతుంది. వ్యక్తికి భూస్థితిలేదు. మొదటగా ఆక్రమించిన తెగకే భూమి చెందుతుంది. కాని క్రమేణ గిరిజనులలో కూడ శిష్టులైనవారికి భూమి దాని అవుతుంది. ద్రావిడులు వచ్చేసరికే, యీ మార్పు తీవ్రరూపం ధరించింది. తమ రాజుగారి వుపయోగార్థం మంచి భూమిలో కేటాగా అట్టిపెట్టేవారు ద్రావిడులు. మిగత భూమి కుంటలుకుంటలుగా విభజితమయ్యేది. 'గ్రామోద్యోగాలు' నిర్వహించే కుటుంబాల కొరకు వంశపారంపర్య హక్కుగా మూడు కుంటలు కేటాగా పెట్టేవారు. ఆర్యుల రాకనాటికే భూమిమీద వ్యక్తుల అధికారం ఏర్పడింది. (The Village Community : G. L. Gomme).

భారతదేశం ప్రవేశించేసరికి, ఆర్యులు ముఖ్యంగా పశుపోషకులు. వారికి వ్యవసాయ క్షేత్రాల కంటె పచ్చిక బయళ్ళమీద మనసు. అయితే భుక్తి గడవడమెట్లాగు? ఓడిపోయిన జాతులవారున్నారు, అరణ్య నిర్మూలనకు, క్షేత్ర కల్పనకు, వ్యవసాయనిర్వహణకు. తమ దృష్టిలో వ్యవసాయము, వర్తకము తమకు తగని వృత్తులు. విజిత ప్రజలలో అధమాధములు ఆర్య గ్రామాలనుండి బహిష్కరింపబడినారు. వీరివి హీన వృత్తులు. వేటగాళ్లు, వలలుపన్నేవాళ్లు, కసాయిపని జేసేవాళ్లు, తోళ్లు నునుపుజేసేవాళ్లు – వీళ్లందరూ శ్వపచులు. కాని హిరణ్యకారుడు, కర్మకుడు, సాలెవాడు, వడ్రంగి – వైవారికంటె పైమెట్టు. వీరిరువురి నడుమ అహరహము పొలాలలో కష్టించేవాళ్ళు. వీరిరువురిమీద వైశ్యులు, క్షత్రియులు, బ్రాహ్మణులు – యీ విధంగా మెట్టుమెట్టుగా ఆర్య గ్రామీణ సమాజం ఎక్కిపోయింది. పశుపోషణమే ప్రధాన వృత్తిగా ఏ సమాజమూ చిరకాలం మనదు. అన్నదాత అయిన భూమి ఆర్యులనుకూడ ఆకర్షించింది. రాజ్యాధికారం ఆయుధోపజీవనులైన క్షత్రియుల భుజస్కంధాల మీద ఆధారపడట్టి, వారికి సంఘంలో ప్రాశస్త్యం యినుమడించింది. ఈ అతిశయానికి తగినట్లుగా భూమిపైకూడ వారి పెత్తనం పెరిగింది. రాజ్యవిస్తరణ కొరకు యుద్ధాలు పరంపరగా సాగేకొద్దీ, కొత్తభూముల నాక్రమించడం జరిగింది. ఈ కల్లోల పరిస్థితులలో కర్షకులైయుండిన వైశ్య శూద్రులనుండి భూమి క్షత్రియుల పరమైపోయింది. ఈ రాజన్యులకు శిరోమణి రాజు. సమాజంనుండి రాజు భూమిపై హక్కును సంక్రమింపజేసికొని, ముఖ్యానుచరులకు భూదానాలు, భృత్యదానాలు చేయసాగినాడు. స్వతంత్ర కర్షక సమాజంమీదుగా ఆయుధోపజీవన భూస్వామ్యవర్గం స్థిరపడింది. వైశ్యులు పాలికాపులయ్యారు. హక్కుదారులు క్షత్రియులు. అట్టడుగున శూద్రులు, వారి క్రింద పంచములు – "ఛండాలులు", "శ్వపచులు", "హీనశిల్పులు". అస్పృశ్యులస్థితి తొలిరోజులలో, బానిసల స్థితికంటె అధ్వాన్నంగావుండేది. యజమానికీ, బానిసకూ వ్యక్తిసంబంధమైనా కద్దు. కాని అస్పృశ్యత అనగా "సాముదాయిక బానిస యాజమాన్యం". వ్యక్తికి బదులు, గ్రామం యావత్తూ అస్పృశ్యుల కుటుంబాలను సాముదాయిక బానిసలుగా ఎంచేవారు. (Hindu society at the Cross Roads : K. M. Panikkar)

జనులందరికీ తిండిపెట్టగలది వ్యవసాయమే. కాని వ్యవసాయ ఫలితమిప్పుడు వ్యక్తుల స్వాధీనం కాసాగింది. అవసరాలకంటె అధనం వుత్పత్తి మరింత అధనానికి త్రోవతీస్తుంది. భూమివిలువ అతిశయిస్తుంది. "తిరుగుబోతు" (Nomadic) దశ అంతరించిన నాటినుండి, అనగా కర్షకవిధాన ప్రారంభ కాలం నుండి పారిశ్రామిక పెట్టుబడి ప్రారంభకాలంవరకు భూస్థితిని సంపాదించి పెంపొందించుకోవలెననే తృష్ణ ప్రధానాశయమవుతుంది." (Slave society in Imperial Rome : Karl kautsky .page 7). ఆర్యగ్రామాన్ని వర్ణిస్తూ జి. యల్. గోమ్ చూపిన విషయాలు ఆదిమార్య భూవిధానంమీద కొంత వెలుగును ప్రసరింపజేస్తాయి. ప్రప్రథమంగా ఆక్రమించుకొన్నవారికి, మొత్తం వ్యవసాయ యోగ్యమైన

భూమిలో నాలుగు పెద్ద భాగాలు కేటాయిస్తారు. ఒక్కొక్క భాగాన్ని 16 వాటాలుగా విభజిస్తారు. మొత్తం 64 వాటాలు. పెద్దభాగాన్ని గ్రామానుమతి లేకుండా విక్రయించడంలేదు. ఎందుకంటే అందులో అనేకుల వాటా లున్నాయి కాబట్టి. కాని విడి వాటాలు అమ్మవచ్చును. అవను మొదలైనవెంటనే, వ్యవసాయ యోగ్యమైన భూమిని వేర్వేరు వాటాదారు లకు కేటాయిస్తారు. తాటాకులమీద వాటాదారుని పేరు, వాటా పేరు వ్రాసి, ఒక పిల్లవానిచేత చెరి యొక ఆకును తీయిస్తారు. ఎవరెవరు ఏ యే వాటాలను సేద్యం చేయవలసింది యిలా నిర్ణయిస్తారు. ఈ భూమి వెలుపలిదంతా సమిష్టిగా వాడుకొంటారు. కాని యిందులో ఆచారం ప్రకారం దేవాలయాలకు, గ్రామోద్యోగులకు కొంత, దానం ప్రకారం పూజారు లకు కొంత కేటాయింపు వుంటుంది. బయళ్ళు గ్రామా ధీనాలు.

కాని యీ వాటాదారులే భూమిని సాగుచేసే వారా? కాదు. బానిసలు కొందరు, తమను తాము తాకట్టు పెట్టుకున్నవాళ్ళు కొందరు, కూలివాళ్లు కొందరు నిజమైన కర్షకులు. వారి శ్రమకు ప్రతిఫ లంగా ధాన్యం, గుడ్డ, పరికలు, కళ్ళం అడుగులు చూపేవారు. స్వేచ్ఛకంటె బానిసత్వమే యీస్థితిలో మెరుగనిపించేది. అర్థహీనులకు స్వేచ్ఛఅంటే నిస్సహా యత, నిత్య క్షామం, నికృష్ట జీవనం. ధనవంతుని యింటిపట్టున చేరితే తిండి, గుడ్డవంటి ముఖ్యావసరా లైనా గడచిపోగల వనిపిస్తుంది.

ఆర్యేతర గ్రామస్థులకు వ్యవసాయ యోగ్య భూమిలో వాటాలు లేవు. వారికి వేరే కేటాయింపు. అందుకుగాను ఆర్యగ్రామస్థులకు ఏదో ముడుపు. భూమి మీద వారికి హక్కులు లేవు. (G. L. Gomme: The Village Community). కాబట్టి ఆర్య గ్రామములో ఆర్యకుటుం బాలకే భూస్థితి పరిమితమై యుండేది. భూమి వారి ఉమ్మడిసొత్తు అయినమాట వ్యవసాయ కార్యా లలో మట్టుకు అనువర్తించదు. ఋగ్వేదయుగం నాటికే 'ఖిల్యస్' అనబడే సమిష్టి వాటాలతో బాటు, 'క్షేత్రా' లనబడే వ్యక్తిగత వాటాలూ వుండేవి. భూమితో బాటు, పశువులలోను, బంగారులోను, నగల లోను, బానిసలలోను యీ 'ఆస్తి' వుండేది. బానిసలు వ్యవసాయానికే కాక, గృహకార్యాలకు, గృహావసర వస్తూత్పత్తికి కూడ పనికివచ్చేవారు. కూలి మనుషుల కంటె బానిసచాకిరికే ఎక్కువగా యజమానులు మోజు పడేవారు. యజమాని మందలవుండి పనిచేయించి నంత వరకు బానిసలస్థితిగుడ్డిలో మెల్ల. ఆస్తి కొద్దిపాటి అయినంతవరకు యజమాని పని మందల వుంటాడు. కాని ఎల్లకాలము యీ స్థితి వుండదు. బ్రహ్మావర్త దేశంనుండి సప్తర్షి మండలానికి, అదీ చాలక యావత్ ఆర్యావర్తానికి విస్తరించుకొంటూ వుండిన కాలంలో, యిక్కడ కొంత, అక్కడ కొంత ఆస్తిమీద ఆస్తి పెరిగిపోయినప్పుడు, యజమాని పనికి దూరమై పోయాడు. అదనపు వుత్పత్తి, అధికతర భోగకారి యైనప్పుడు, అదనపు పని జరిపించే కోరిక పుట్టి బానిసలు పశుప్రాయులుగా కనుపించసాగుతారు. బానిసలకు అదనపు చాకిరిపట్ల వైముఖ్యమతిశయించే కొద్దికీ, వారిపైన ఆంక్షలు దండనలు ఎక్కు వౌతాయి. "పనిముట్టు నిర్జీవసాధనము; పసరము మూగసాధనము; బానిసీడు మాట్లాడగల సాధనము", అని పూర్వులు మరొకదేశంలో వర్ణించేవారు.

"The labourer here is, to use a striking expression of the ancients, distinguishable only as instrumentum vocale, from an animal as instrumentum semi vocale and from an implement as instrumentum mutum. But he himself takes care to let both beast and implement feel that he is none of them, but is a man ... by treating the one unmercifully and damaging the other con a more."

—Karl Marx : Quoted by Kautsky.

పనినుండి పారిపోయిన బానిసప్రాణానికి రక్షణ లేదు. శూద్రుడు "యధాకామవధ్యుడు". పాలికాపు యజమాని చిత్తానుసారం పీడింపబడవచ్చును. భూమి నుండి అతనిని రాజు తరిమివేయవచ్చును. శూద్రుల వృత్తి "స్వదారవృత్తి" అనగా యజమానుల యింటి పనులకే అంటిపెట్టుకొని వుండడము. బానిస దేహ పరిశ్రమకు విలువ పెరిగేకొద్దికీ, బానిసల జనసంఖ్యకూడ హెచ్చింది. మనుస్మృతి ప్రకారం దాసులు సప్త విధములుగా పరిగణింపబడేవారు: యుద్ధమందు ఓడి చేజిక్కిన 'ధ్వజాహృతుడు', తిండికొరకు దాసుడైన 'భుక్తదాసుడు,' వంశపారంపర్యంగా దాసుడైన 'గృహజుడు', యజమాని కొనుగోలుచేసిన 'కృతుడు',

కానుకగా యివ్వబడిన 'పత్రిముకుడు', పిత్రార్జితముతో బాటు సంక్రమించిన 'పైతృకుడు', అప్పుపడిన 'దండదాసుడు'. బానిసజన సంఖ్యాతిశయంతో బాటు ఆస్తి పెరుగుదలకూడ స్పష్టంగా కనిపిస్తుంది. [మామూలు క్షేత్రాలు సొంతదారుల కుటుంబం నిర్వహించుకొనగలంత చిన్నవి. అప్పుడప్పుడు కూలిమనిషి అవసరమయ్యేవాడు. బానిసకంటె యితనిస్థితి మరింత నికృష్టంగా వుండేది. ఆస్తులు హరించుకొనిపోతున్న కొద్దిపాటి కర్షకులు కూలివాలి చేసికొని పొట్టపోసికొనవలసిన దుస్థితి ఏర్పడింది. కౌలుదార్లు పంటలో 'అర్థిక' భాగాన్ని యజమానుల కిచ్చుకునేవారు. యజమాని విత్తనాలను తానే యిచ్చేవాడు.] 500 నాగళ్ళు దున్నగల మహా క్షేత్రాలు బౌద్ధయుగంలో వుండేవి. దృఢకాయులైన కర్షకులకు వట్టిగాదము మిగలగా, స్థితిపరుల పొలాలలో పనిజేయడానికి వెళ్లే దృశ్యాలు బౌద్ధ పరివ్రాజకుల కంటికి అలవాటుపడినవి. అనగా, కొద్దిపాటి రైతుల ఆస్తి కర్పూరమువలె హరించుకుపోసాగింది.

నీటి పారుదల వసతులులేక, వ్యవసాయాభివృద్ధికి ప్రాచ్యదేశాలలో మోక్షంలేదు. ఏడాదిపొడుగునా నీటి సరఫరా వుండదు. కాబట్టి వనరులను కృత్రిమంగా కల్పించుకోవడం అవసరమవుతుంది. ఇది ఒక్కనివల్ల, లేదా ఒక్క గ్రామంవల్ల మాత్రమే జరిగేపనికాదు. ఇటువంటి సామాజిక కార్యాలకు సామూహిక శ్రమ కావాలి. స్వచ్ఛందంగా సామూహిక శ్రమ జరిగే అవకాశాలు లేనప్పుడు, బలవంతాన జరిపించాలి. బానిస శ్రమలేకుండా యివి జరగవు. వీటికి ఆధ్వర్యం వహించగల సత్తా రాజుది. కర్షకుల జలావసరాన్ని రాజు స్వీయాధికార వృద్ధికి వినియోగించుకొన్నాడు. జనపతియై యుండినవాడు భూనాథుడు కాగలిగాడు. సాగుదారులు తనకు 'బలి' అర్పించాలి. (భూమినుండి రాజు రాబడి పెరగసాగింది. గాదం వద్దనే ముడిసరుకులో దశమభాగం, అవసర పరిస్థితులకు ముందు జాగ్రత్తగా ప్రభుత్వ ధాన్యాగారాలను నింపడానికి ప్రత్యేకమైన వసూళ్లు, తనసాగుపని విడిచిపెట్టి రాజుగారికి వేటలో జంతువులను కొట్టిపెట్టే నిర్బంధ శ్రమవంటివి మామూలు కాసాగాయి.) బాగా సాగు చేయనివారిని తాను తొలగించి, వేరే సాగుదారుల నేర్పాటు చేయగలడు. భూమి రాజుది; జీవితాంతంవరకు సాగుచేసికొనే హక్కు మాత్రమే కర్షకునిది. (యాజ్ఞవల్క్యస్మృతి) అటువంటి నిర్మూలన, నూతన గ్రామకల్పన, రాజాధికారాన్ని యినుమడింపజేశాయి. కాని గ్రామహక్కులు పూర్తిగా రూపుమాసిపోలేదు. అట్టి పరిస్థితిలో మౌర్యసామ్రాజ్యం ఏర్పాటయింది. అదివరకే మొదలైన ధోరణి యిప్పుడు తీవ్రించింది. భూమి, క్రయ, విక్రయ, దాన, ధర్మాది విషయాలలో చాల శతాబ్దాలనుంచి సమిష్టి అధికారం స్వతంత్రంగా నెరపుతూ వుండిన గ్రామాలిప్పుడు రాజాధికారానికి తలవొగ్గవలసి వచ్చింది. ప్రభుత్వమే భూస్వామిగా మారింది. రాజక్షేత్రాలలో వ్యవసాయ నిర్వహణకొరకు "సీతాధ్యక్షుడు" నియమింపబడినాడు. కర్షకులు పంటలో నాల్గవభాగం ప్రభుత్వోద్యోగులకు వేరుగా చెల్లించేవారు. ధనకోశము (Treasury) నిండనప్పుడు, సమాహర్తలు కర్షకులచే ఎండకాలమందు కూడ వ్యవసాయము చేయించాలి, అని కౌటిల్యుడన్నాడు. (అర్థశాస్త్రము: యోగవృత్తము, కోశాభిసంగ్రహణము). పైగా ఒక "ఉదకభాగం" చెల్లించేవారు. అడవులన్నీ రాజువి. ప్రభుత్వక్షేత్రాలలో కర్షకుడు మరణిస్తే, అతని భూమి వారసులకు సంక్రమించక, తిరిగి రాజాధీనమయ్యేది. నీటి వనరులకల్పనకు ప్రభుత్వం శ్రద్ధ కనపరచేది. తటాకంపూడిక తీయడానికి, జలాశయం నిర్మించడానికి, బాటలు వేయటానికి, సేతుబంధాన్ని కట్టడానికి జనులే పూనుకోవలెనని, ఉమ్మడిపనికి గైరుహాజరైనవారు మొత్తంఖర్చులోఒక భాగం యిచ్చుకోవలెనని కౌటిల్యుడు వ్రాశాడు. "సహోదకములును, ఆహార్యోదకములును నగు తటాకముల నిర్మించి యిట్టిపనులు చేయు నితరులకు భూమి మార్గ వృక్షోపకరణములతో సహాయము చేయవలెను ... గ్రామస్థులందఱు కలిసి సేతుబంధ మొనర్చునపుడు దందుల కిష్టపడనివాని కర్మకరులును, బలీవర్దములును నా పని నొనర్పవలయు." (అర్థశాస్త్రము : ద్వితీయాధికరణము). కాని యీ పనులకు ప్రభుత్వమే ఆధ్వర్యం వహించేది. ఉదాహరణకు, పాటలీపుత్రానికి రెండువేలమైళ్ళ దూరానగల గిరినగరంలో (కథియవాడ్ ద్వీపకల్పంలో ద్వారకవద్ద) రాజప్రతినిధి పుష్యగుప్తుడు "సుదర్శన" జలాశయాన్ని వ్యయప్రయాసలతో నిర్మింపజేశాడు. కాని యిలాంటి సామాజిక కార్యాలకు నిర్బంధశ్రమ (Forced Labour) వుండక తప్పదు.

రాజుగారి భూములు ఎలా సాగయ్యేవో తెలిస్తే, చిన్న భూస్వాముల గురించికూడ చెప్పక చెప్పినట్లవుతుంది. ఇవన్నీ సాగుదార్లకు యావజ్జీవ అనుభవం

పద్ధతిమీద యిచ్చేవాళ్ళు. కొంత భూవసతి గలిగినవారి నటుంచి, భూమి లేనేలేని పనివాళ్ళు సాగుదార్లయ్యేవారు. పంటలో నాల్గవభాగాన్ని చెల్లించుకొనేవారు. భూమిని వ్యవసాయయోగ్యంగా సిద్ధపరచినతరువాతనే కౌలుదార్లు సాగుకు ఉపక్రమించేవారు.

"అకృత క్షేత్రములనుండి సాగుచేసినవారిని తొలగింపరాదు. కృషిచేయనివారిని వారి భూములనుండి తొలగించి వాని నన్యులకు నియ్యవలెను; లేదా వానిని గ్రామభృతకులుగాని, వైదేహకులుగాని సాగుచేయవలెను. అట్లు చేయనిచో నష్టము నచ్చుకొనవలెను." (వైదేహకులంటే వృత్తిక్షీణించిన వర్తకులు). "కర్షణయంత్ర, ఉపకరణ, బలీవర్ధములను కర్మార కుట్టాక మేదక రజ్జువర్తక సర్పగ్రాహులయొక్క సహాయము తగు సమయములందు కర్షకుల కియ్యవలెను." వ్యవసాయానికై నీటిని గూడలువేసి చేతులతో యెత్తేవారు. ఫలితములో అయిదవభాగాన్ని భుజాలపై తీసికొనిపోయేవారు. నాల్గవభాగాన్ని నదులు, సరస్సులు, కూపములు, తటాకములనుండి ఏతములతో ఎత్తేవారు. నాల్గవభాగాన్ని ఉదకభాగమని యిచ్చుకోవాలి.

మహాక్షేత్రములు అవతరించేసరికి, బానిసల ప్రాముఖ్యం అతిశయించింది. కూలిమనుష్యులకంటే బానిసల చేత ఎక్కువపని చేయించవచ్చును. కాని బానిసల సంఖ్య పెరగాలంటే వాళ్ళు దిగుమతైనా కావాలి, కొత్త బానిసలకొరకు యుద్ధాలైనా చేయాలి. అటువంటి యుద్ధాలు మౌర్యయుగంలో లేవు. విదేశీయులు స్మృతియుగంలో కొల్లలుగావచ్చి నూతన శూద్రులయ్యేవారు. మౌర్యయుగంలో యీ ప్రవాహం కూడ మందగించింది. కాబట్టి బానిసశ్రమమీదనే ఆధారపడిన భూవ్యవస్థ అధోముఖం పట్టసాగింది. కాని స్వతంత్ర కర్షకవ్యవస్థ వుత్పన్నం కాలేదు. పెద్దపెద్దఖామందులు తమ తమ మహాక్షేత్రాల పరిత్యాగానికి సిద్ధపడలేదు. అందుచేత వాళ్లు కొద్దిపాటి రైతులను, భూమిలేనివారిని చేరదీసి, వారిని కౌలుదార్లుగా చేసికోవలసివచ్చింది. "చేసిన కృషికి తగినట్లు పాలకదాసకర్మకరులకు భక్తము నియ్యవలెను వారికి నెలకొకటింబావు పణముజీతము". అందుచేతనే బానిసల స్థితికూడ కొంత మెరుగుకాక తప్పలేదు. ఆర్యులనేకులు బానిసస్థితికి దిగజారిపోతుండిన ధోరణిని కౌటిల్యుడు గమనించాడు. బ్రతుకుతెరువులేని కుటుంబాలు తమ పిల్లలను తెగనమ్ముకుంటున్నాయి.

కనుకనే "నత్వేవార్యస్య దాసభావః" (ఆర్యుడెవడూ బానిసకాడు) అని శాసించాడు. పుట్టుబానిసకాని శూద్రుని, యుక్తవయస్సు లేనివానిని బంధువులు బానిసగా అమ్మినా, తాకట్టుపెట్టినా జరిమానాలు విధించాడు. తన తండ్రి హోదా ఏమైనా, అతడు బానిసైనాగాని, అతని కొడుకు ఆర్యుడేనన్నాడు. తనను తానుగా బానిసీడుగా అమ్ముకొన్నవానికుమారుడు, తన తండ్రికి కట్టినడబ్బు చెల్లించేటట్లయితే, తిరిగి ఆర్యుడు కావచ్చునని అనుమతించాడు. ఈ ధోరణులను మౌర్యసామ్రాజ్యంలో చూచినాడు కనుకనే, గ్రీకురాయబారి మెగస్తనీస్ యిలా వ్రాశాడు: "వారిలో ఎవ్వరూ ఏ పరిస్థితులలోనూ బానిసలు కారాదని, స్వేచ్ఛ ననుభవిస్తూ, యితరులు స్వేచ్ఛ ననుభవించే హక్కును గౌరవించాలని చట్టమొకటి వుంది." (Mcrindle: The Indica of Megasthenes). కాని యిది ఆర్యులకు మట్టుకే. మ్లేచ్ఛులు తమ బిడ్డలను బానిసలుగా అమ్ముకోవచ్చును.

"దాసులచే ప్రేతవిణ్మూత్రోచ్ఛిష్టముల గ్రహింపజేయుటయు, దాసుల నగ్నులుగ నుంచుటయు, శిక్షించుటయు, దాసస్త్రీల నతిక్రమించుటయు మూల్యనాశకరములు... అభిజాతుడగు నుపచారకునికి హాని గలిగించినచో అతడు స్వేచ్ఛగ తొలగిపోవచ్చును... దాసుడు గృహజాతుడైనను, దాయాగతుడయినను, క్రయమునకు గొనబడినవాడయినను లేక మరియొక విధముగ లభించినవాడయినను ఎనిమిది సంవత్సరముల కంటె తక్కువవయస్సుగలిగి నిబంధుడై యున్నచో అతని కిష్టములేని నీచకర్మలందు నియోగించువానికిని లేక విదేశమందు విక్రయాధానముల జేయువానికిని" శిక్షలు. దాసునికి తగిన నిష్క్రియము యిచ్చినపుడు వానికి ఆర్యత్వమునీయని యజమానికి శిక్ష. యజమాని వలన దాసికి సంతానము గలిగినచో దాసి, దాసీపుత్రుడు దాసీత్వమునుండి విముక్తులవుతారు." (అర్థశాస్త్రము : దాసకల్పము).

## వృత్తులు - శ్రేణులు

భారతదేశ గ్రామీణ వ్యవస్థలో వ్యవసాయమూ వృత్తులూ పెనవేసికొని పోయాయి. వ్యవసాయంలో వలెనే వృత్తులలో కూడ వుత్పత్తి అధిక భాగం మొదట వాడుకకోసమేకాని వ్యాపారంకోసంకాదు. గ్రామావసరాలకంటె అధికంగా ఉత్పత్తి జరిగినప్పుడే దానికి వ్యాపార స్వభావం చేకూరుతుంది. గృహ

బానిసలే వ్యవసాయపు పనుల నడుమనడుమ, గృహో
పకరణోత్పత్తికి వినియోగపడేవారేమో! కాని అవసర
వస్తూత్పత్తినుండి విలాస వస్తూత్పత్తికి అన్ని ప్రాచీన
సమాజాలవలెనే భారత సమాజంకూడా పయనించింది.
విలాస వస్తూత్పత్తికి నైపుణ్యమవసరం. అది బానిస
లకు లేదు. వాళ్ళు మార్గసాధనాలమీద, నిర్మాణసాధ
నాలమీదకూడ తమ ఆధిక్యాన్ని ప్రదర్శించి, మోటు
పనులకేగాని సున్నితమైనవానికి పనికివచ్చేవారుకాదు.
(Karl Kautsky : Slave Society in Imperial Rome). అదిన్నీగాక, యీ సేవ ఒకనినుండి
వేరొకనికి సంక్రమించాలి. విలాస వస్తూత్పత్తికి
అక్కర పెరగడమేగాని తరగడంలేనప్పుడు, వంశ
క్రమాగతమైన వృత్తులకు అనుకూల పరిస్థితులు ఏర్పడు
తాయి. అందుచేత వృత్తి విభజనలో హెచ్చు మార్పు
లుండేవికావు. ఒకొక్క శిల్పానికీ ఒకొక్క గ్రామం
అంటివేసిన చేయిగా పరిణమిస్తుంది. ఒక గ్రామం
ప్రత్యేక శిల్పంమీద మరొక గ్రామం ఆధారపడు
తుంది. విడి విడిగా చెల్లాచెదరుగావున్న యీ గ్రామా
లకు ఒక విశిష్టత ఒక స్వతంత్రసంఘటన ప్రాప్తిస్తుంది.
(Karl Marx : Articles on India). భూస్థితి
వల్లనే ఉదరపోషణ జరిగే పరిస్థితులలో యీ శిల్పులు
కూడ భూస్థితికోసం తాపత్రయపడుతారు. ద్రావిడ
గ్రామవ్యవస్థలో వీరికిగాను గ్రామభూమిలో కొంత
కేటాయించేవారని, లేదా వీరికి ధాన్యరూపంలో ప్రతి
ఫలం ముట్టజెప్పేవారని జి. యల్. గోమ్ వ్రాశాడు.

జన్మతః చతుర్థకులజులైనా, వృత్తివల్ల, వస్తువుల
అక్కరవల్ల, శిల్పులు సమాజంలో మాన్యులయ్యారు.
మనుస్మృతిలో శిల్పులు, కారువులు, యంత్రప్రవర్త
కులు శూద్రులకంటె అధికతరమైన హోదాకుచెందినట్లు
పేర్కొనబడినారు. లోహాలవాడుక ఎక్కువయ్యే
కొద్దికీ, విలాసవస్తువులకు అక్కర హెచ్చేకొద్దికీ, శిల్ప
లలో వైవిధ్యం, వృత్తులలో వైవిధ్యం అతిశయించింది.
ఋగ్వేదంలో వడ్రంగి (తక్షణ), కమ్మరి (కర్మార),
హిరణ్యకారుడు, సాలె (వాయ) వరకే వున్న వృత్తులు
యజుస్సామాథర్వ వేదకాలానికే పెచ్చు పెరిగి
పోయాయి. కర్మారుడు, రథకారుడు వంటివారు రాజ
పట్టాభిషేకోత్సవాలలో పురోహిత సేనానీ గ్రామ
ణులతోబాటు "రాజకర్తలు"గా పేర్కొనబడినారు.
వీరికి ధన, ధాన్య రూపాలలో వృత్తిఫలము చెల్లించే
వారని పాణిని వ్రాశాడు. ఈ కాలానికే బహువిధ
శిల్పులు 'శ్రేణులు' (Guilds) గా సంఘటితు
లయ్యారు. ఏ శ్రేణి ఆ శ్రేణికి కొన్ని నిబంధనలు
చేసికొనేది. వాటిని రాజు మన్నించేవాడు. గౌతమ
ధర్మశాస్త్రంలో, శిల్పులనుండి నెలలో ఒకరోజు పనిని
రాజు గ్రహించేవాడని చెప్పినారు. నారదస్మృతిలో
ప్రతిశ్రేణికి కొన్ని నిబంధనలు (స్థితి లేక సమయ)
వుండేవని, సభ్యులు వాటిని తలదాల్చవలెనని చెప్పి
నారు. అవి రాజుకుకూడ అనుల్లంఘ్యాలుగా వుండేవట.
శ్రేణి న్యాయస్థానంగాకూడ వ్యవహరించేది. ప్రభుత్వ
న్యాయస్థానాలలో ఒక విచారణీయాంశం గురించి
పత్రాలుగాని, సాక్ష్యంగాని ఛేదించినప్పుడు చుట్టు
ప్రక్కల గల శ్రేణుల మాటమీద ఎక్కువ గురి వుండే
దని వశిష్ఠుడు చెప్పాడు. బుద్ధ జాతక కథలలో
దాదాపు 18 శ్రేణులు ప్రస్తావింపబడినవి. ప్రతి
శ్రేణికి ఒక అధ్యక్షుడు (ప్రముఖ), కోశాధిపతి
(భాండాగారిక) వుండేవారు. పోను పోను, శిల్ప
వృత్తులు లాభసాటి కాసాగినవి. అందుచేత అగ్ర
వర్ణాలకు చెందినవారు కొందరు నీచవర్ణాల వృత్తులపట్ల
మోజు కనపరచ సాగినారు. వృత్తులమార్పు ఎక్కువ
కాసాగింది. పనివారు వృత్తులకంటిపెట్టుకొనక, పైకీ
క్రిందికీచలనం ఎక్కువయింది.(Mobility).[Radha Kumud Mukherji: Hindu Civilisation]

మౌర్య సామ్రాజ్యావతరణ నాటికి యీ ధోరణి
తీవ్రతరం కాసాగింది. దీనిని అదుపులో పెట్టనిదే
సంఘ కల్లోలం సంభవించగలదని గ్రహించిన కౌటి
ల్యుడు, శ్రేణులను నిరోధించే కొన్ని చర్యలు తీసు
కొన్నాడు. రాజ శాసనాలకూ శ్రేణుల స్వీయ నిబంధ
నలకూ వైరుధ్యం వుంటే, రాజశాసనం మాత్రమే
నిలుస్తుందన్నాడు. ఇక, శ్రేణుల స్వాతంత్ర్యం రాజ
తంత్రాధీనం కాకతప్పలేదు. ఒకప్రభుత్వోద్యోగి ప్రతి
శ్రేణిపేరు, దాని 'స్థితి', నిబంధనలు తన చిట్టాలోనికి
ఎక్కించుకొనేవాడు. స్థానిక సహకారశ్రేణులు తప్ప
ఆ యా గ్రామాలలోనికి యితర ప్రదేశాలనుండి
ఏ శ్రేణి వచ్చేందుకు వీలులేదు. కారుక, శిల్పిజన
'రక్షణ'కై ఏర్పాటయిన కేంద్ర ప్రభుత్వ శాఖకు
ప్రతి శ్రేణీ ఒక డిపాజిట్ కట్టాలి. పనికాలం, స్థలం,
పద్ధతుల గురించిన ప్రభుత్వాజ్ఞలను ఉల్లంఘించిన
శ్రేణులమీద జరిమానాలు. పని మొదలుచేసి ఎగ
బెట్టితే శిక్ష. పని పట్ల తాత్సారంగాని, అశ్రద్ధగాని
చూపినా, శ్రేణి 'స్థితి'ని ఉల్లంఘించినా, శ్రేణినుండి
పనివారిని తరుమకొట్టవచ్చును. (ప్రవాసం) మహాప
రాధాలు చేస్తే మరణ శిక్ష. నిర్దిష్టాలైన దేశ, కాల,

కర్మల ప్రకారం కారువులు పనిచేయాలి. దేశ కాల కర్మలు నిర్దేశింపబడలేదనే మిషతో కాలాతిక్రమం చేస్తే, రెండురెట్లు శిక్ష; వేతనంలో నాల్గవభాగమే ముట్టుతుంది. చెప్పినట్లు కాకుండా మరొక విధంగా చేస్తే వేతనం పోవడమేకాక, దానికి రెండురెట్లుకూడ యిచ్చుకోవాలి. నేయుటకిచ్చిన దారాన్ని పది, పదకొండు రెట్లు వృద్ధిచేయని సాలెవానికి, ఉతుకుటలో గుడ్డలు చెడగొట్టిన చాకలివానికి, చోరులనుండి కరగించిన వారినుండి సువర్ణరూప్యములు తీసుకొనిన కంసాలులకు దండనలుండేవి (అర్థశాస్త్రము: కంటకశోధనము).

శిల్పులకు, కారువులకు ప్రభుత్వం రక్షణలు కల్పించింది. చీని చీనాంబరాలు, వున్నిదుస్తులు, పత్తిగుడ్డలు చేసినవారికి ప్రత్యేకబహుమతులు. అదనపు పనికి, సెలవు పూటపనికి అదనపు వేతనాలు. బొక్కసంనుంచి వీరికి ప్రత్యేక భత్యాలిచ్చేవారని మెగస్తనీస్ వ్రాశాడు. ఎవరేగాని శిల్పివేలిని, కంటిని గాయపరిస్తే ఆ నేరానికి మరణదండనఅనికూడ చెప్పాడు. (Mcrindle: The Indica of Megasthenes). మౌర్య సామ్రాజ్యం శిల్పికారులపట్ల చూపిన శ్రద్ధకు సాటిలేని నిదర్శనం "కంటకశోధన" మనే ప్రత్యేక న్యాయస్థాపనం. శ్రీ గణపతిశాస్త్రిగారు ప్రచురించిన "అర్థశాస్త్రం"లో 'కంటకం' అనే పదానికి శిల్పి, కారువు అని అర్థం చెప్పబడింది. వివిధశ్రేణుల మధ్య వివాదా లుత్పత్తిల్లినప్పుడు అవి యిందులో విచారణకు వచ్చేవి. కారు, శిల్పశ్రేణుల హక్కులకు న్యాయస్థానం నిర్వచించిన మీదట, అది ప్రభుత్వానికికూడ శిరోధార్య మయ్యేది. మంత్రి పరిషత్తులో గణముఖ్యులకు, సంఘాధ్యక్షులకు కూడ స్థానమీయవలెనని కౌటిల్యు డన్నాడు Dr. M. V. Krishna Rao : Studies in Kautilya).

వేదయుగంనుండి గుప్తసామ్రాజ్యంవరకు నిరంతరాయంగా మన్నికగన్న యీ కారుశిల్పశ్రేణులకు అనూహ్యమైన రాజకీయ, ఆర్థికస్తోమత వుండేది. స్మృతికారులు విధించిన వర్ణనిబంధనలు యీ శ్రేణుల మూలాన నిర్వీర్యమైపోయాయి. వివిధప్రాంతాలకు చెందిన కారుకశిల్పశ్రేణి కట్టడ మటుంచి, వివిధ వర్ణాలకు చెందినవారుకూడ శ్రేణిగా రూపొందడంబట్టి పారిశ్రామికవృత్తుల నిర్మాణానికి సంబంధించినంత వరకు వర్ణవ్యవస్థ విఫలమయిందని చెప్పవచ్చును. (K. M. Panikkar : A Survey of Indian History)

## వర్తకం-వాణిజ్యం

పశుపోషకులుగా భారతదేశానికి దిగివచ్చిన ఆర్యులు వ్యవసాయిక సమాజాలతోటి ధాన్యవిషయాలలో బేరసారాలకు దిగకతప్పలేదు. పాలనుండి తయారయిన వస్తువులు, పశువులనుండి సంక్రమించే మాంసము, చర్మము, వున్ని, దుస్తులు అదనమైనవి వారికిచ్చి వారినుండి ఆహారధాన్యాలు తీసుకొనేవారు. క్రమక్రమంగా సమాజంలోనే భిన్నవృత్తులకు భిన్నవర్గాలు పూనుకొన్నాయి. తమ వస్తువులకు లోపలనుండీ, బయటనుండీ అక్కర మామూలైనప్పుడు, అక్కరను తీర్చగలంత సరఫరా జరుగుతున్నప్పుడు యీ విభజన గట్టిపడి, క్రమంగా ఉత్పత్తివిధానం లోనికి చొరబారి, సమిష్టి ఉత్పత్తిని క్షీణపరచి, తద్వారా సమిష్టి పంపిణీని దెబ్బతీస్తుంది. ఇదే వ్యక్తిపరమైన ఆస్తికల్పనకు దారితీస్తుంది. (S. A. Dange : India, From Primitive Communism to slavery). ఋగ్వేద యుగానికే భూమితోబాటు పశువులలోనూ, బంగారులోనూ, బానిసలలోనూ వ్యక్తి ఆస్తి జన్మించివుండినట్లు తెలుస్తుంది. నదీశిలాలనుండి మట్టుకే కాకుండా, భూగర్భంనుండి కూడ బంగారు తీయడంగురించి, హిరణ్యకారుని గురించి ప్రస్తావన వుంది. యజుస్సామాథర్వవేదయుగంలో లోహాలవాడుక అతిశయించింది. బంగరు (హిరణ్య), కంచు (అయస్), యినుము (శ్యామ), రాగి (లోహ), సీసము, తగరము (త్రపు), వెండి (రజత) నగలకే కాకుండా, ధనరూపంలో కూడ వాడుక కాసాగినవి. బంగారు తూనికలు శతమానం వంటివి వుండబట్టి నాణేల చలామణికూడ ప్రారంభమైనట్లు, వ్యాపారం వస్తుమార్పిడి (Barter) నుండి ద్రవ్యవిధానానికి (Money economy) చేరుకొన్నట్లు తెలుస్తుంది. లోహాలకుబంగారు రాజు. "నేరుగా వాడుకకోసం తయారైన వస్తువులను, బంగారు, మార్పిడిలోకి నెట్టి వ్యాపారవస్తువులు ( Commodities )గా చేస్తుంది. ఆ పైన వ్యాపారవస్తువూ, బంగారమూ కలిసి సమాజోత్పత్తిలో నిమగ్నమైయున్న సంఘాన్ని దెబ్బతీసి, సంఘానుబంధాలను ఒకటివెంబటి వేరొకటిగా త్రెంపి కడపటికి సంఘాన్ని విడివిడి వుత్పత్తిదారుల సమూహంగా విడగొట్టుతాయి. భారతదేశంలోవలె సమిష్టి వ్యవసాయం స్థానంలో వ్యక్తి వ్యవసాయాన్ని స్థాపిస్తాయి. తర్వాత, సమాజ భూములు వ్యక్తులకు క్రమానుబద్ధంగా పంపిణీ జరిగేపద్ధతిని

ధ్వంసంచేసి, ఆస్తిపై అధికారాన్ని పరమం చేస్తాయి. చివరకు, సమిష్టిపరమైన అడవిభూముల విభజనకు దారితీస్తాయి" (Engels : Anti - Duhring)

లోహాల అవతరణ రెండు అంచులూ పదునుగల కత్తి. వ్యాపార విస్తరణ, సమిష్టి హక్కుల విధ్వంసన కవల పిల్లలు. యజుస్సామాథర్వవేదయుగంలో లోహాల విస్తృతమైన వినియోగం, భూస్థితిలో వచ్చిన పరిణామం - వీటిసరసనే వ్యాపారాభివృద్ధి! శ్రేష్ఠివాణిజ్యంలో, వృద్ధివ్యాపారంలో 'కుశీది' అవతరించాడు, విజృంభించాడు. పాణిని వ్రాసిన "అష్టాధ్యాయి"లో, బదులిచ్చిన పది రూపాయలు ఏడాది తిరిగేసరికి పదకొండుగా పిల్లనుబెట్టి తిరిగిరావడం కనిపిస్తుంది. ధర్మశాస్త్రయుగంలో వడ్డీరేటు నూటికి 15 వంతులయింది. వర్ణాధిక్యతతోబాటు, అనగా భూస్థితి ఆధిక్యతతోబాటు యీ రేటు న్యాయంగా హెచ్చడం మటుంచి తగ్గుతుంది. "స్మృతి ననుసరించి వర్ణాల వరుసప్రకారం నూరింట రెండు, మూడు, నాలుగు, ఐదు వంతులు నెలసరివడ్డీ" అంటాడు వశిష్ఠుడు. మనుస్మృతికాలంలో సముద్రయానం చేయడానికి వైశ్యులపైవ ఆంక్షలు తొలగిపోయినవి. లాభాలు పెరుగుతున్నాయి. కాబట్టి రాజు రంగంలోకి వచ్చాడు. స్వతంత్ర వ్యాపారపద్ధతులు (Free Trade) క్షీణిస్తున్నాయి. వణిక్ప్రముఖులతో సంప్రదించినమీదట, ఆగమ (దిగుమతి), నిర్గమ (ఎగుమతి) ములను, పణ్యస్థానములో వస్తువుల నిలువ కాలాన్ని, అక్కర, సరఫరా మార్పులను దృష్టిలో వుంచుకొని, ప్రభువు సరుకుల ధరలను నిర్ణయిస్తున్నాడు. తప్పుడు తూనికలను, కొలతలను వాడేవారిపై జరిమానా విధిస్తున్నాడు. ప్రాచ్యసీమలోని ఏనుగుల, చీని చీనాంబరాల, పశ్చిమసీమలోని గుర్రాల, దక్షిణసీమలోని వెలగలరాళ్ల, ముత్యాల "యితర దేశాలలో మామూలుగా అరుదైన వస్తువుల" ఎగుమతిని నిషేధిస్తూ వుల్లంఘించినవారి ఆస్తిని జప్తుచేసికొంటున్నాడు. చక్రవడ్డీని, మామూలుకంటె (15%) మించిన వడ్డీని, అసలుతో సమానమైనవడ్డీని, వడ్డీకిబదులు సేవను నిషేధించి యీ ధోరణులను నిబంధిస్తున్నది. గనుల త్రవ్వకాల విషయంలోకూడ ప్రభుత్వం అధికతర శ్రద్ధ కనబరుస్తున్నది. గని తీతల లాభాలలో సగభాగం అర్థ సమాహర్త వసూలుచేస్తున్నాడు. గని త్రవ్వకాలకు రాజుగారి ఆమోదం (లైసెన్సు) అనివార్య మవుతున్నది. కాని యీ ఆరోగ్యకరమైన ధోరణికి రాజకీయ పరిణామాలు, యుద్ధాలు, దండయాత్రలు ఆటంకం కలిగించాయి. కల్లోల పరిస్థితులు వ్యాపారులకు అదనపు లాభాలు తెచ్చిపెట్టాయి. సరుకులు దాచడం, ధరలగురించి బేరాలాడడం మొదలయింది. వడ్డీవ్యాపారం అవిచ్ఛిన్నంగా నిర్నిబంధంగా మారింది. ఈ దశలో మౌర్య సామ్రాజ్యం అవతరించింది. తిరిగి ఆర్థిక రంగాన్ని సమన్వయపరచి, వ్యాపార వాణిజ్యాలను నిబంధించే ధోరణి (Mercantilist) ప్రస్ఫుటమయింది. వ్యాపారాభివృద్ధికి దోహదమిస్తూనే, మరొకవైపు వాటికి నిర్దిష్టపరిమితులను ఏర్పరచసాగింది. విపణివీధిని పణ్యాధ్యక్షుడు శాసించసాగినాడు. వర్తకులు కుమ్మక్కై వస్తువులకు నిరోధము కలిగిస్తే, వస్తువులను అల్ప అధిక ధరలకు క్రయ విక్రయాలు చేస్తే వేయి పణాలు జరిమానా విధించేవాడు. పణ్యాధ్యక్షుని అనుజ్ఞలేక ధాన్యాది సంగ్రహము చేయరాదు. చేస్తే ఆ పణ్యము అధ్యక్షుడు తీసికోవచ్చును. క్రయ విక్రయాలలో నిర్ణీతమూల్యముకంటె నూరు పణముల కొక్క అర్థ పణ మధికముగ అమ్మినప్పుడుకూడ ఐదు మొదలు రెండు వందల పణములవరకు దండము. "మూల్య వృద్ధియగుకొలదియు దండ వృద్ధియగుచుండవలెను." (అర్థశాస్త్రము: కంటక శోధనము). "స్వామీ! ఇది చంద్రగుప్త రాజ్యముగాని నంద రాజ్యముకాదుగదా! ద్రవ్యాసక్తిగల నందులకు మీయందరియందును ద్రవ్యసంబంధముచే ప్రీతి పుట్టుచుండెడిది. చంద్రగుప్తునకు మీ వలన క్లేశము కలుగకుండుటయే కోరికగాని యొండులేదు," అని 'ముద్రారాక్షస' నాటకములో చాణక్యుడు చెప్పినప్పుడు, మౌర్యసామ్రాజ్య ధోరణి బోధపడుతుంది.

నూటికి నెల ఒకటికి ఒకటింబావు పణము ధర్మ వృద్ధి (వడ్డీ), అయిదు పణములు వ్యావహారికవృద్ధి, అడవులలో నివసించేవారికి పది పణములు, ఓడ వర్తకులకు యిరవై పణములని కౌటిల్యుడు శాసించాడు. సమయాన్ని అతిక్రమించకుండా ఏటేటా చెల్లించాలి. లేని వడ్డీని సాధించేవాడికి, అసలుతో వడ్డీని కలిపి ఆ మొత్తమే అసలని వాదించేవాడికి కఠినశిక్షలు. (అర్థశాస్త్రము : ధర్మస్థీయము)

మౌర్యసామ్రాజ్యములో పణ్యాధ్యక్షుడు (Superintendent of the Market) చాలవిధులు నిర్వహించేవాడు. స్థానిక వ్యాపారవస్తువుల నిర్ణీతధరల మీద 5% లాభము, విదేశ వ్యాపారవస్తువుల ధరల మీద 10% లాభము మాత్రమే అనుమతించేవాడు.

తూనికలు, కొలతలు సరిచూచేవాడు. వ్యాపారవస్తువుల పంపిణీని క్రమానుబద్ధం, న్యాయానుగుణం చేసేవాడు. అవసర పరిస్థితులలో విక్రయాలను కేంద్రీకృత మొనర్చేవాడు. ప్రభుత్వ పరిశ్రమోత్పత్తి వస్తువిక్రయాలకు అనుకూలపరిస్థితులు ఏర్పరచేవాడు.

స్వభూమిజములగు రాజపణ్యములను ఏకముఖముగా చేసి వ్యవహారమును స్థాపించాలి. పరభూమిజాలైన వానిని అనేక ముఖములుగాచేసి వ్యవహరించాలి. "ఉభయ విధములగు నీ పణ్యములను ప్రజల కనుకూలమగునట్లు అమ్మించి ప్రజోపఘాతకరమగు నధిక లాభము ను వారింపవలెను. నిత్యము గావలసిన వస్తువులకు కాలోపరాధమును ఏకముఖ వ్యవహారమును కలిగింపరాదు." (అర్థశాస్త్రము : ద్వితీయాధికరణము)

అదనపు లాభాలమీద, అమ్మకాలమీద, కలంపాటలలో భవనాల క్రయవిక్రయాలమీద, కల్లుదుకాణాలమీద, ద్యూతమందిరాలమీద, వెలయాలైన రూపాజీవికలమీద, మాంసవిక్రేతలమీద పన్నులు! ఇవి చాలక, ప్రభుత్వమే ఒక గొప్ప వ్యాపారసంస్థగా పరిణమించింది. తానైతానో, విడివ్యాపారసంస్థలతో జతగానో, భూఖనులను, సముద్రఖనులను తీయించేది. మూలమని, భాగమని, 5% ముదరా (Premium) అని, పరిఘ (సర్వే) అని, లోహవస్తు నిర్మాణాలలో భాగమని, అత్యయశుల్కమని, ప్రభుత్వపు గుత్తహక్కును వుల్లంఘించినందుకు పరిహారమని, నాణేలమీద లాభాలని - అనేకరూపాలలో ప్రభుత్వం ధనం వసూలుచేసేది. ఉప్పు, సారాయం మొదలైనవి ప్రభుత్వపరాలు. విదేశాలనుండి తెచ్చిన వుప్పులో ఆరవవంతు, తక్కినభాగము అమ్మకాలలో నూటికి ఐదవవంతుతీసికోవాలి. విదేశలవణాన్ని కొనే రాజవ్యాపారానికి కలిగిన నష్టానికి తగిన వైధరణము (Compensation) యివ్వకోవాలి. లోహధ్యక్షుడు రాగి, సీసం, తగరం మొదలగు లోహాలతో చేసిన భాండాలను విక్రయం చేయించాలి. ఖనిజాలను దొంగిలించేవానిని, రాజాజ్ఞలేక ఆకరకర్మల (Mining Operations) చేయించేవారిని పట్టుకొని గనులలో పనిచేయించాలి. కరుగబెట్టిన నేయికి ముప్పదిరెండవ భాగం, తైలానికి అరవైనాల్గవభాగం, ద్రవపదార్థములకు ఏబయ్యవ వంతు యిచ్చుకోవాలి.

నూనెల ఉత్పత్తి విషయాలకు ఒక వుద్యోగి, బెస్తలనుండి, నావా ప్రయాణీకులనుండి, ముత్తైపుచిప్పలు తీసేవాళ్లనుండి, శంకులు అమ్మేవారినుండి డబ్బు వసూలుచేసేందుకు మరొక వుద్యోగి. విదేశ వస్తువుల మీద ద్వారాదాయమని, వర్తనమని పన్నులు. ఈవిధంగా ఆర్థికజీవనమంతా రాజాధీనమైపోయింది.

## దండధారి - అదండ్యుడు

రాజాధికారానికి గల పరిమితులను తొలుతనే పేర్కొన్నాను. ప్రాచీన భారతీయ ప్రభుత్వము అంకుశమే లేని మత్తగజమని ఒక అభిప్రాయం పాశ్చాత్యులలో ప్రబలివున్నది. వెస్టియా, మెసపొటేమియా సామ్రాజ్యాలను పరిశీలించినమీదట, ప్రాచ్యప్రభుత్వము ధనసేకరణకు మాత్రమే పాటుబడే సంస్థ అని మెయిన్ ఒక నిర్వచన మిచ్చినాడు. పాలితులపై బలాన్ని ప్రయోగించి, కొన్నికొన్ని వేళల కొన్ని ఆజ్ఞలు జారీచేయడం తప్పితే శాసనాలంటూ చట్టమంటూ విడిగాలేవని కూడా ఆయన సెలవిచ్చాడు. మెయిన్ రచించిన యీ స్థూలచిత్రాన్ని గ్రీన్ భారతీయ ప్రాచీన పరిస్థితులకు, అతికేటట్లుగా కొద్దిమార్పులు చేశాడు. (Some Aspects of Ancient Indian polity: K. V. Ranga Swami Iyengar). కాని ఆర్యరాజనీతి ననుసరించి, రాజు నిరంకుశుడూ బాధ్యతారహితుడూ కాడు. ధర్మాను బద్ధమైనంతవరకే రాజశాసనానికి మన్నన వుండేది. రాజత్వానికి మూలకారణము ప్రజాసంరక్షణమేనని; అర్థసర్వస్వగుపార్జనము ఒక విధియైనప్పటికిని, ధనాపహరణమే వృత్తిగాగల లుబ్ధప్రభువునకు శత్రువులు చేసేముందు తన ప్రజలచేతనే చేటుమూడుతుందని భీష్ముడు చెప్పినాడు (శాంతిపర్వము). ఈ వర్ణనలలో నిజమెంతపాలు అని నిర్ణయించేందుకు రాజోనర్చవలసిన విధులను, వాటిలో వచ్చిన పరిణామాన్ని గమనించాలి.

ఋగ్వేద యుగములో జనులకు రాజు గోపునివంటి వాడని భావింపబడేది. యుద్ధములలో మొనగాడై, తగవుల తీర్పరియై, శాసకుడై, పురోహితసేనానీ గ్రామణులు తోడుకాగా సమితితో చర్చించి వ్యవహారాలు నడిపేవాడు. 'సభ' అనే కులవృద్ధుల కూడిక, 'సమితి' అనే పౌరజానపదుల కూటమిద్వారా అతని అధికారానికి గిరి గీసినారు. పట్టాభిషేకోత్సవవేళ, రాజు ప్రమాణం స్వీకరించేవాడు. ఐతరేయ బ్రాహ్మణంలో యీ ప్రమాణం యిలా వుంది: "నేను మిమ్ము అణచి పెట్టేటట్లయితే, నేను పుట్టిన రాత్రి మొదలు చని

పోయే రాత్రిలోపల చేయగల మంచిపనులు నాపరమూ నాజీవితమూ, నాకుటుంబమూ నాశనమౌగాక !" పోనుపోను యుద్ధాలు ముమ్మరించి, రాజ్యాలు విస్తరించి, ప్రాముఖ్యం అతిశయించగా, అధికారం తొలిమితులు దాటిపోసాగింది. దండధారి అయినవాడు అదండ్యుడనే భావం తలఎత్తింది. పదవి వంశక్రమానుగతం కాసాగింది. పాలనాధికారం వ్యక్తి సొంతి ఆస్తిగా మారింది. కాని చింత చచ్చినా పులుసు చావలేదు. ప్రాచీన ప్రజాధికారం కర్మకాండలలో నిలిచిపోయింది. పట్టాభిషిక్తుడు కాబోయేరాజు, పృథ్వీజనుల ఆమోదాన్ని పొందవలసివుండేది. మాతాసుతులు ఒండొరులకు హానిచేయని విధంగా రాజు, ప్రజ మెలగవలెనని, దండధారి ధర్మ వ్యవహార నిర్ద్వంద్వ మసలుకోవలెనని, కృషిని క్షేమమును పోషణను కొనసాగించుటకై రాజు ధర్మకర్తమాత్రమేనని, రాజాధికారం శాసనోత్పత్తి స్థానంగాక, శాసన ప్రయోగ స్థానమేనని శతపథబ్రాహ్మణం సూచిస్తుంది. (Hindu Civilisation : Radhakumud Mukherji). ధర్మశాస్త్ర యుగానకూడ జనపద, జాతి, కుల, వర్ణాచారముల కనుగుణమైన శాసనములే రాజు చేయవలసి వుండేది. పట్టాభిషేక ప్రమాణానికి బద్ధుడై, శాస్త్రానుసారియై సచివసహాయుడైన రాజే దండనము కర్హుడు; నిరంకుశుడూ, దురాశాపరుడూ, మందుడూ, స్వీయచిత్తవృత్తుల ననుసరించే (Personally) వాడూ కాడని మనువు, నిరంకుశుడైన ప్రభువు రాజ్యవినాశకారి కనుక ప్రజలాతనిని త్యజించి, అతృప్తి అతిశయించగా, కుటుంబసమేతంగా అతనిని ధ్వంసింతురని శుక్రుడూ అన్నారు.

కాని మౌర్యసామ్రాజ్యావతరణ నాటికి రాజాధికారం చాలా విస్తరించినది. దేశక్షేమం దృష్ట్యా, ధర్మస్థితిదృష్ట్యా, కౌటిల్యుడు దీనిని సమర్థించాడు. సకలధర్మాలు రాజధర్మంలో లీనమైపోతాయని, సకల ప్రకృతులు "ఉద్యత దండు"డైన "స్వామి"లో కేంద్రీకరింపబడగలవని, (అమాత్యుడు, జనపదము, దుర్గము, కోశము, దండము, మిత్రులు - ఇవి ప్రకృతులు. పైనస్వామి) స్వామి ధర్మరక్షకుడేకాక, "ధర్మప్రవర్తకుడు" కూడానని కౌటిల్యుడన్నాడు. కుల, శ్రేణి, వర్ణాచారాలను యథాతథంగా మన్నించి తదనుగుణమైన శాసనాలు చేయడమే స్వామి కర్తవ్యం కావచ్చునీ, అవసరమైనప్పుడు వాటిని సంస్కరించడంకూడ కర్తవ్యమనీ చెప్పాడు. అమలమైన జీవితానికి గల అడ్డంకులకు అడ్డంకులు వేయడమే కాకుండా, అంటే నిరోధక చర్యలే (Preventive) కాకుండా, సంవర్ధక చర్యలను (Promotive) తీసికోవడం కూడ ప్రభుత్వ కర్తవ్యమైంది. (Beniprasad & Mazumdar : The Age of Imperial unity). ప్రభుత్వం పోలీసుజవాను వంటిదేకాదు, సంఘానికి వైద్యునివలె, సంస్కర్తవలె, ఆత్మవలెన్వవహరించాలి. (Dr M.V. Krishna Rao : Studies in Kautilya). ఈ విస్తృత బాధ్యతల గుర్తింపునుండి ప్రభుత్వం విస్తృతాధికారాలను చేబట్టింది. రాజశాసనానికి ప్రత్యేక స్తోమత ఏర్పడింది.

"ధర్మము, వ్యవహారము, చరిత్రము, రాజశాసనము - ఇవి దండమునకు నాలుగు కాళ్లు. వీటిలో వెనుకనున్నవి ముందున్నవానిని బాధింపగలిగియుండును.

"ధర్మము, సత్యము వ్యవహారమునకు సాక్షులు; చరిత్ర పురుష సంప్రదాయమును, శాసనము రాజాజ్ఞను ఆశ్రయించియుండును."

"చరిత్రమునకు ధర్మమునకుగాని, వ్యవహారమునకు ధర్మమునకుగాని విరోధము కలుగుపట్ల, ఆ అంశమును ధర్మానుసారముగా పరిష్కరించవలెను; కాని ధర్మన్యాయమునకు, రాజశాసనమునకు భేదము కలిగినపట్ల, రాజశాసనమే ప్రమాణము." మౌర్యసామ్రాట్టు ధర్మాన్ని కూడ శాసించగలంత అపూర్వాధికార సమన్వితుడు కాగలిగాడు. కాని ప్రజలపట్ల రాజునకు కొన్ని విధులున్న విషయం కౌటిల్యుడు విస్మరించలేదు. "ప్రజాసుఖమే రాజసుఖము; ప్రజాహితమే రాజహితము. స్వప్రియము రాజునకు హితముకాదు, ప్రజాప్రియమే హితము" అన్నాడు. మౌర్యచంద్రగుప్తుని గురించి మెగస్తనీస్ చేసిన వర్ణనలనుబట్టి రాజాధికారం బాధ్యతారహిత మయిందనే అభిప్రాయం అంకురించదు. ఇతర కార్యాలెన్ని వున్నా, తనవొళ్ళు పట్టించుకోవలసివున్నా, రాజు న్యాయపాలనలో మునిగి వుండేవాడట. "ఆస్థానగతుడై కార్యార్థులకు దర్శనమీయవలెను. రాజు దుర్దర్శనుడైనచో నాసన్నులు కార్యాకార్యవిపర్యాసమును చేయుదురు. దానిచే రాజు ప్రజాప్రకోపమునకును, శత్రువశమగుటకును పాత్రుడగుచున్నాడు...అత్యాసన్నమగుకార్యమును కాలాతిక్రమము కాకుండ నొనర్పవలయును ... రాజున కుత్థానమే వ్రతము; కార్యానుశాసనమే యజ్ఞము;

వృత్తిసామ్యమే దక్షిణావభృతస్నానములు" అంటాడు కౌటిల్యుడు.

"అర్థశాస్త్రం"లో రాజు ఎప్పుడెప్పుడేమే విధులు నిర్వర్తించవలసింది అతడు పట్టీవేసినాడు. ఆర్థిక విషయాలు, జాతీయ రక్షణ విషయాలు మొదట. తర్వాత న్యాయపాలనం. ఆ తర్వాత స్నాన భోజనాదికాలు. ఉదయం గడుస్తుంది. మధ్యాహ్నం సైనిక విషయాలు, వుద్యోగి నియామకాలు, కోశ వ్యవహారం. ప్రతివేదకుల వార్తాశ్రవణం. పగటిపూట రాజునకు నిద్రకూడదు. రాత్రి మూడుగంటలు మాత్రమే నిద్ర. కుటుంబాన్ని కూడ నమ్మరాదు. ఆయుధ ధారిణులైన స్త్రీల పహారాలో రాజు వుండాలి. మెగస్తనీసు వ్రాసిన ప్రకారం, విధానాలను స్థూలరూపంలో రాజే రూపొందించే వాడు; వుద్యోగులకొరకు, ప్రజలకొరకు శాసనాలను, ధర్మ నియమాలను జారీచేసేవాడు. ఈ వర్ణనలనుబట్టి మౌర్య సమ్రాట్టు నిరంకుశుడైనాగాని, యిది తండ్రి పెత్తనంవంటిదని, బాధ్యతా రహితమైనది కాదని చరిత్రకారులు అభిప్రాయాన్ని కల్పించినారు. (Paternal Culture State).

## వ్యక్తి - యంత్రం

ప్రాచీనకాలంలో రాజరికమనగా వ్యక్తి సమాశ్రితమే కాని మౌర్య సామ్రాజ్యంవలె మహా యంత్ర సన్నద్ధమైనది కాదు. ప్రభుత్వ వ్యవహారాలన్నీ వ్యక్తిని ఆశ్రయించుకొన్నంతవరకు, క్రమానుబద్ధతకు మారు అక్రమము, ఒక నిర్దిష్ట విధానానికి మారు సమయోచిత విధానము, శాసనబద్ధమైన న్యాయ పాలనకు మారు చిత్తవృత్తులనుబట్టి న్యాయపాలనము జరగక తప్పదు. ఇది దుష్పరిపాలనకు, బాధ్యతా రాహిత్యానికి, నిశ్చేష్టతకు, అసామర్థ్యానికి దారితీయక తప్పదు. ప్రజలకు సమర్థవంతమైన నిరంకుశత్వమే మేలనిపిస్తుంది. వ్యక్తి పరమైన ఆస్తిపాస్తులలోను, వ్యాపార పరిశ్రమాదిక ఆర్థిక జీవనంలోను, యితోధికాభివృద్ధి జరిగే యుగానికి అనుగుణమైన పరిపాలనాయంత్రం నిర్మింపబడింది. విధి విస్తరణతో బాటు కార్యవిభజన.

కాని యిది కాలక్రమేణా వృద్ధిచెందవలసిందే. ఋగ్వేదకాలంలో పురోహితుడు, సేనాని, గ్రామణులు సాహాయ్యకులుగా వుండినా మత, యుద్ధ, పాలనాది కాల బరువు రాజుమీదనే ఎక్కువపడేది. తర్వాత రాజభవనోద్యోగులు క్రమంగా రాజసచివులు కాసాగినారు. వీరి ఆమోద సహకారాలమీదనే రాజత్వం జయప్రదమయ్యేదని అథర్వవేదం, తైత్తిరీయ బ్రాహ్మణం సూచిస్తున్నాయి (Hindu Civilisation : Radhakumud Mukherji). రామాయణ, భారతకాలంనాటికి ఒక గ్రామణి, దశగ్రామి, వింశతిపతి, శతగ్రామి అనే స్థానికమండల పాలకబృందమొకటి కనిపిస్తుంది. మంత్రి పరిషత్తుకూడ ఏర్పడుతుంది. కాని వెనుకటి రాజ్యాలన్నీ ఒకయెత్తు; మౌర్యసామ్రాజ్యం మరొకయెత్తు.

"సహాయసాధ్యమ్ రాజత్వమ్
చక్రమేకమ్ నవర్తతే"

ఒక్కచక్రముతో రాజత్వరథము నడువలేదు; రాజత్వము సహాయముచేతనే సాధ్యము అన్నాడు కౌటిల్యుడు. ప్రభుశక్తికి మంత్రశక్తి తోడుకోవాలి. మంత్రి కాదగినవాడు దృఢచిత్తుడు, శీలవంతుడు, సంప్రియుడు, ప్రజ్ఞావంతుడు, దక్షుడు, మాటనేర్పరి అయివుండాలి. మంత్రీ, పురోహితుడూ తోడుకాగా రాజు తనకు కాబోయే అమాత్యుల గుణాలను పరీక్షించాలి; ఆశలు చూపాలి; అన్నీ నెగ్గిన అగ్గిపిడుగే అమాత్యుడు అవుతాడు. మంత్రిపరిషత్తు సమాలోచించి, చర్చించి నిర్ణయించనిదే ఏ రాజ్యకార్యమూ మొదలు కారాదు. "అమాత్యమూలాత్ సర్వారంభాః". పరిషత్తులో అందరికీ ఒకే హోదా కాదు. అధికతర ప్రాముఖ్యము కలిగినవారిలో మంత్రి, పురోహితుడు, సేనాని, యువరాజు వుండేవారు. ఇతరులలో దేవారికుడు, అంతర్వంశికుడు, ప్రశాస్త, సమాహర్త, ప్రదేష్ట, పౌరవ్యావహారికుడు ముఖ్యులు. వీరుకాక, కార్మాంతికుడు, దండపాలుడు, దుర్గపాలుడు, అంతపాలుడు, ఆటవికుడు - మొత్తం పద్ధెనిమిదిమంది వుద్యోగస్థులు ("తీర్థలు") వుండేవారు. సమాహర్త వుద్యోగము గురుభారముతో కూడినది. సర్వారంభములు కోశపూర్వకములు కాబట్టి కోశసంగ్రహణ పరిశోధకుడైన సమాహర్త, ఆదాయ శరీరమునకు అంగములైన దుర్గ, రాష్ట్ర, ఖని, సేతు, వన, వ్రజ, వణిక్పథముల మంచి స్థితియందుంచి, ఆదాయమును సుకరముగ వసూలుచేయుటకై జనపదములను నాలుగు భాగములుగను, ఒక్కొక్క భాగమును అనేక గ్రామ సముదాయములుగను విభజించి, పదిగ్రామములపై 'గోప'ని, వానిపై 'స్థానిక'ని, స్థానికులపై "ప్రదేష్ట"ను నియమించేవాడు.

గణముఖ్యులకు, సంఘాధ్యక్షులకుకూడ పరిషత్తులో ప్రాతినిధ్య ముండేది. పరిషత్తులో అధిక సంఖ్యాకుల

ఏకాభిప్రాయ ప్రకటనమే రాజశాసనముగా వెలువడేది. పరిషత్సభ్యు లొక్కొక్కరు యిద్దరు కార్యదర్శులతో ఒక్కొక్క ప్రభుత్వశాఖను నిర్వహించుకోవలసి వుండేది. వివిధశాఖలు అజాపజలు, విదేశ వ్యవహారాలవంటి సమస్యలను చర్చించడానికై తలలన్నీ జోడించేవారు. రాష్ట్ర పాలకులను, శాఖాధ్యక్షులను, వున్నతోద్యోగులను నియమించేవారు. పరిషత్తులో చర్చింపబడిన విషయాలను పరమ గోప్యంగా ఎంచాలి. లేకపోతే, బయటపెట్టిన వాడిని కనకండలుగా ఖండించాలంటాడు కౌటిల్యుడు. ఈ పరిషత్తుకూడ సంఖ్యాబాహుళ్యంచేత అత్యవసర పరిస్థితులకు తగిన అవసరచర్యలకు పనికిరాదని రాజు ముఖ్యులను సంప్రదించేవాడు. మంత్రులలో వివిధ శ్రేణులు, అమాత్యులలో శ్రద్ధాభక్తులను, విశ్వాసానికి, సేవానిరతికి పేరొందినవారిని మంత్రులుగా నియమించి, తలకొక 48,000 పణాలు ఏడాదికి జీతమిచ్చేవాడు. మంత్రి పరిషత్సభ్యులు 12,000 పణాలు పుచ్చుకొనేవారు.

నీటిలో తిరిగే చేపలు ఎవరికీ తెలియక నీరు త్రాగేటట్లు వుద్యోగులు ఎవరికీ తెలియక ధన మపహరిస్తారని కౌటిల్యుని విశ్వాసము. కాబట్టి లంచగొండితనము, రాజధనాపహరణములు నివారించుటకు, పెద్దజీతము లీయడమే కాక, పురుడు, జబ్బు, చావులు వచ్చినపుడు వుద్యోగులకు ధనసహాయము, రాజకార్యములుచేస్తూ చనిపోయినవారి ఆలుబిడ్డలకు 'భక్తవేతనములు', గొప్ప వుపకారముచేసిన అధ్యక్షులకు గొప్ప బహుమానములు యిచ్చేవారు. కొన్ని కొన్ని సందర్భాలలో ధనరూపంలోగాక, 'వుష్య పశుక్షేత్రముల' (జాగీర్లు) కూడ యిచ్చేవారు. (అర్థశాస్త్రము : యోగవృత్తము : ద్రవ్యభరణీయము).

వీరుకాకుండా, ఆజ్ఞాలేఖలు, ఉపగ్రహలేఖలు, పరిహార లేఖలు వ్రాసేందుకు లేఖకులు, ఆజ్ఞలను అందజేసేందుకు, ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వానికి చేరవేసేటందుకు ప్రతివేదకులు, యింకా క్రింది తరగతికి చెందిన భృత్యులు వుండేవారు.

ఇంత మహాసామ్రాజ్య నిర్వహణ ప్రాదేశిక విభాగాలమీద ఆధారపడక తప్పదు. చంద్రగుప్తుని హయాములో ఎన్నివుండేవో కాని, అశోకుని హయాములో అయిదు రాష్ట్రాలుండేవి. వాయవ్య రాష్ట్రానికి తక్షశిలానగరం, పశ్చిమ రాష్ట్రానికి ఉజ్జయినీనగరం, దక్షిణ రాష్ట్రానికి సువర్ణగిరి, కళింగరాష్ట్రానికి తోసలి, మధ్యరాష్ట్రానికి పాటలీపుత్రం కేంద్రాలు. రాష్ట్రపాలకులుగా రాజకుమారులే కాక, వున్నతోద్యోగులుండేవారని చంద్రగుప్తుని కాలంలో ఉజ్జయినీపాలకుడైన పుష్యగుప్తునిబట్టి చెప్పవచ్చును. రాష్ట్రపాలకులకు సహాయకులుగా, కేంద్రప్రభుత్వానికి లోబడి మహామాత్రులనే వుద్యోగులుండేవారు. వారినిసరిజూసేందుకు కేంద్రం ప్రత్యేకోద్యోగులను పంపేది. ప్రతి వేదకులు ఎప్పటికప్పుడు రాష్ట్రపాలనలో అవకతవకలను కేంద్రానికి చేరవేసేవారు. రాష్ట్ర మొక్కొక్కటి ఆహారమని, విషయమని, ప్రదేశమని విభజిత మయ్యేది. నగరాలలోనూ, మండల కేంద్రాలలోనూ పరిపాలనకు నగరాధ్యక్షు లుండేవారు. అన్ని శాఖలు చేసేపనులను పరిచూడడం అతని పని. నీటి పారుదల, సాగు, విద్య, జనోపయోగ కార్యాలు, అడవులు, గనులు, క్షామ నివారణాది అనేక కార్యాలమీద అతని చూపువుండేది. నగరాలలోనూ, యీ ప్రాదేశిక విభాగాలలోనూ సైనిక వ్యవహార నిర్వహణకుగాను భటాధ్యక్షులని మరొక రకపు వుద్యోగు లుండేవారు. తమ తమ విధి నిర్వహణలో యీ అధ్యక్షుల సహాయానికై ఐదైదుగురితోకూడిన ఆరుకూటాలుండేవి. ఈ కూటాలు (Boards) చేసే పనులను గురించి గ్రీకురాయబారి మెగస్తనీస్ పాటలీపుత్రానికి సంబంధించి చేసిన వర్ణన మౌర్యపాలనా పాటవాన్ని చాటుతుంది.

పాటలీపుత్ర పురపాలనకు 30 మంది సభ్యులతో ఒక సంఘ ముండేది. అది ఆరుకూటాలుగా ఐదైదుగురేసి సభ్యులతో విభజితమై యుండేది. పరిశ్రమలు, శిల్పాలు, వృత్తులు పర్యవేక్షిస్తూ, కూలిరేట్లు నిర్ణయిస్తూ కల్తీలేని మంచి సరుకులు వాడేటట్లుచూస్తూ మొదటి; వ్యాపారార్థమై నగరానికి యితర ప్రదేశాలనుండి యితర దేశాలనుండి వచ్చినవారికి గృహ, సహాయ వైద్యవసతులు కలుగజేస్తూ, వారి నడవడి గమనిస్తూ, చనిపోయిన అలాంటివారిని భూనిక్షిప్తం చేస్తూ వారి ఆస్తిపాస్తులను హక్కుదారులకు చేరవేస్తూ రెండవ; జనన మరణాల జాబితాను తయారుచేస్తూ మూడవ; వర్తక వాణిజ్యాలను పర్యవేక్షిస్తూ, విక్రయాలను నిబంధిస్తూ, రాజముద్రాంకితాలైన కొలమానాలను, తూకాలను వాడేటట్లుచూస్తూ, లైసెన్సు పన్నులాంటివి వసూలు చేస్తూ నాల్గవది; అదేవిధంగా పరిశ్రమలకు సంబంధించినది ఐదవది; విక్రయమైన వస్తువుల ఖిలువలో పదవ భాగాన్ని వసూలుచేస్తూ, పన్ను యెగబెట్టిన వారిని కఠిన దండనల పాలుచేస్తూ ఆరవది. ఈ ఆరూ కలిసి

సమిష్టిగా సమస్త నగరవ్యవహారాలను శాసిస్తూ విపణి వీథులను, దేవాలయాలను, నౌకాశ్రయాలను, యితర జనోపయోగకర వసతులను (బాటలు, కాలువలు, తటాకాలు, సేతుబంధాలు వంటివి) సుస్థితిలోవుంచేవి. పాటలీపుత్ర నగరపరిపాలన వంటిదే యితర నగరాలలో కూడ అమలుజరిగి వుంటుందని వూహించడంలో అపసవ్యమేమీ వుండదు. (Mcrindle : The Indica of Megasthenes).

నదీ జలమార్గాలు, నీటి పారుదల, భూమి కొలత, తణిఖీ, న్యాయవిచారణ, ధనసేకరణ, రాష్ట్ర, ప్రదేశ, గ్రామ పరిపాలన - ప్రతి విషయమూ సహస్రాక్షులైన ప్రభుత్వదృష్టికి రాకతప్పదు. మానవజీవితములో యే యొక్క భాగమూ ప్రభుత్వపు అజమాయిషీనుంచి తప్పిపోలేదు. ఈ అపూర్వ బాధ్యతావిస్తరణకు తగినట్లు కౌటిల్యుడు ముప్పైసుంది అధ్యక్షులను ప్రత్యేక శాఖాధిపతులుగా పేర్కొన్నాడు. వారి విధులను నిర్వచించాడు. వీరుకాక, శతాధితులైన వుద్యోగులుండేవారు. ముఖ్యోద్యోగులవలన ప్రభుత్వం చాల ఖర్చుపడేది.

| | | | |
|---|---|---|---|
| మంత్రులకు | సంవత్సరానికి | 48,000 | పణాలు |
| అమాత్యులకు | ,, | 12,000 | ,, |
| సమాహర్తకు | ,, | 24,000 | ,, |
| నగర పాలకునికి | ,, | 12,000 | ,, |
| అధ్యక్షులకు | ,, | 9,000 | ,, |
| చారులకు | ,, | 1,000 | ,, |
| భృత్యులకు | ,, | 60 | ,, |

పణమంటే దాదాపు పది అణాలు. గోపులు, స్థానీయులు, భిషక్కులు, వార్తాహరులు, యితర స్థానికోద్యోగులకు ధనం మారుగా భూమి, గృహవసతి కల్పించేవారు. కాని వీటిని వారు విక్రయించ వీలు లేదు. పురోహితునికి, యజ్ఞకర్తకు, యువరాజునకు, పట్టమహిషికి సంవత్సరానికి 48,000 పణాలుముట్టేవి.

ఇటువంటి విపుల బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని పాశ్చాత్య విమర్శకులవలె "Money - collecting institutions" ధనసేకరణమే పరమాశయముగాగల సంస్థలజాబితాలో చేర్చలేము. బాటలను మంచిస్థితిలో వుంచడానికి, ప్రయాణీకుల సౌకర్యాలకై విరామ గృహాలను ఎప్పటికప్పుడు సుస్థితిలో పెట్టడానికి కేంద్ర ప్రభుత్వంలో ప్రత్యేకించి ఒక శాఖ వుండేది. బాటలలో పలురకాలు-ఒక్కొక్కరకపు బాట యింతింత వెడల్పుతో వేయాలని నియమా లుండేవి. ప్రతి రెండు వేల గజాలకు చీలుబాటలు, దూరము తెలుపడానికి రాళ్ళు పాతేవారు. మామూలు బళ్ళబాటలు కాలిబాటలు నాలుగునుంచి ఆరడుగుల వెడల్పు; రథమార్గాలలో రాళ్ళు పరచేవారు; అవి 32 అడుగుల వెడల్పు; కొన్ని రాజమార్గాలు 64 అడుగుల వెడల్పున కూడా వుండేవి. పాటలీపుత్ర నగరాన్ని తక్షశిలతో కలిపే రాజపథం దాదాపు వేయిమైళ్ళు విస్తరించి వుండేది. కాశీ, ఉజ్జయినీపురాలగుండా పాటలీపుత్రాన్ని పశ్చిమ సముద్రతీర నగరాలతో కలిపే రాజపథం వేరొకటి. తీర వ్యాపారం కోసం, తామ్రలిప్తిరేవును పాటలీపుత్రంతో కలిపేది యింకొకటి. బాటల పట్లనేగాక, నీటి వనరులపట్లకూడ కేంద్ర ప్రభుత్వంచూపిన శ్రద్ధకు నిదర్శనంగా గిరినగరంలో రాజప్రతినిధి పుష్యగుప్తుడు నిర్మింపజేసిన సుదర్శన జలాశయాన్ని యీ వరకే పేర్కొన్నాము. దుర్భిక్ష కాలమున రాజు బీజములను కర్షకులకిచ్చి, లేదా తన వద్ద సంగ్రహించి యుంచిన ఆహారమునుకాని, దేశ మండలి ధనికుల నిక్షేపమునుగాని పంచిపెట్టవలెను.

మౌర్య సామ్రాజ్యావతరణకాలం నాటికి రాజశాసనానికి స్వతంత్రస్థితి, ప్రత్యేకమైన మన్నన కలుగడమే కాక, న్యాయానికి ఆధారభూతాలైన ధర్మ, వ్యవహార, చరిత్రాదులపై పైచేయి రావడంకూడ చూచాము. కాని న్యాయపాలనలో యిది వ్యక్తి నిరంకుశత్వానికి దారితీయలేదు. ధర్మస్థుడుగాని, ప్రదేష్టగాని న్యాయ విరుద్ధముగ జరిమానా విధించిన, దానికి రెండింతల దండము భరించాలి. న్యాయవిరుద్ధమైన శరీర దండాన్ని విధించిన, దానికి వారే పాత్రులు కావాలి. "దోషము నిరూపింపకయే యొకనిని బంధనాగారమందుంచిన బంధనాగారాధ్యక్షునికి యిరువది నాలుగు పణములు దండము. వానిపై బలాత్కారమును కావించిన యెడల ద్విగుణదండము. వానిని మఱియొకచోటికి పంపినను, వాని యన్నపానములకు నిరోధము కలిగించినను తొంబదియారు పణములు దండము. వానిని నాక్రోశపెట్టినను వానినుండి లంచము పుచ్చుకొనినను, వానిని కొట్టినను వేయి పణములు దండము" (అర్థశాస్త్రము : సర్వాధికరణ రక్షణము.)

గ్రామణీ, గ్రామవృద్ధులూ కలిసి చిన్న చిన్న వ్యవహారాలను పరిష్కరించేవారు. ఆపైన ద్వివిధ న్యాయస్థానా లుండేవి. ఒక్కొక్కదానిలో ఆర్గురు న్యాయాధిపతులు. వీరు గ్రామాలలోను, ప్రదేశ, రాష్ట్ర కేంద్రాలలోను పర్యటించి విచారణలు సలిపేవారు.

వారిలో ముగ్గురు శ్రుతి, స్మృతి పాఠాలలో నిష్ణాతులు; తతిమా ముగ్గురు స్థానికాచారాలెరిగినవారు. క్రింది శ్రేణి న్యాయస్థానాలు అప్పులు, చోరీలు, సరిహద్దు వివాదాలు, పంటనష్టాలకు సంబంధించిన విషయాలు, గృహకలహాలు తీర్చేవి. పై శ్రేణి న్యాయస్థానాలు కారుక, శిల్పి, వ్యాపారులకు సంబంధించిన విషయాలు చూస్తూ, క్షామనివారణచర్యలు తీసికొంటూ, నైతిక ప్రవర్తనను సరిదిద్దుతూ, మరణదండనశిక్ష గాగల నేరాల నన్నిటినీ పరిష్కరించేవి. అందరిపైన ప్రభువు. కేంద్రంలో ద్వివిధ న్యాయస్థానాలు. వ్యవహారానికి సంబంధించిన వున్నత న్యాయస్థానాలకు ధర్మస్థీయ న్యాయస్థానాలని, కేంద్ర మంత్రివర్గమే స్వయంగా కూర్చుని న్యాయవిదులతో (jurists) సంప్రదింపులు లేకుండా నేరుగా త్వరగా పరిష్కరించే న్యాయస్థానాలకు కంటకశోధనాలని పేర్లు. ముగ్గురు ప్రదేష్టలు గాని, ముగ్గురు అమాత్యులుగాని కంటకశోధనము చేయాలి. తప్పుడు తూనికలు, కొలతలు వాడిన వర్తకులు, లంచగొండి ఉద్యోగులు, వర్ణ, సంఘ, మతాచారాల నుల్లంఘించినవారు, మానాపహరణ చేసినవారు, ఒప్పందాల నతిక్రమించినవారు యీ న్యాయస్థానాలలో దండింపబడేవారు. గ్రీకుదేశీయుల వ్రాతలనుబట్టి, మౌర్యులశిక్షాస్మృతి కఠినంగా వుండేదని చెప్పవచ్చును. సాధారణ నేరాలకుకూడ కఠినశిక్ష. తప్పుడు సాక్ష్యం యిస్తేను, ప్రభుత్వపు పన్నులు ఎగవేస్తేను, శిల్పి, కారుకుల కెవరికేగాని గాయం కలిగిస్తేను, పవిత్ర వృక్షానికి ఘాత కలిగిస్తేను మరణదండన వుండేది. కాని కౌటిల్యుడు హెచ్చరిక చేశాడు. "తీక్ష్ణదండము ప్రాణుల కుద్వేజకము, మృదుదండము పరిభవకారి, యథార్హదండమే పూజ్యము. సువిజ్ఞాత ప్రణీతమగు దండము ప్రజలకు ధర్మార్థకామముల నొసగుచున్నది. కామక్రోధాజ్ఞానముల వలన ప్రణీతమగు దండము వానప్రస్థ పరివ్రాజకుల సహితము కోపింపజేయుచున్నది." (ప్రథమ అధికరణము)

భీష్మాచార్యుడుకూడ, "వసంతంబు భానునిచాడ్పునఁ దగిగొడుపాటితో ధరణిఁ ప్రజల నుచిత వర్తనముల నొందించునది. యిది రాజ ధర్మములకు రాజు" అన్నాడు.

మౌర్య సమ్రాట్టు విజిగీషువు. ఆయుధబలంమీద సైన్యసంపత్తిమీదనే సమ్రాట్టు కాగలిగినాడు. రాజ్యవిస్తరణం అన్ని రాజ్యాల పరమాశయం. చంద్రగుప్తుడు యుద్ధాలలో పుట్టి పెరిగినాడు. కౌటిల్యుడు యుద్ధతంత్రాన్ని, మండల సిద్ధాంతాన్ని ఒంటబట్టించినాడు. మౌర్యసామ్రాజ్యానికి యుద్ధం ప్రాణవాయువు వంటిది. మౌర్యుల సేనాబలాన్ని చూస్తే గుండెలవిసిపోగలవు. 60 లక్షలమందితో పదాతిదళము, ముప్పైవేల అశ్వబలము, తొమ్మిదివేల యుద్ధగజబలము, గొప్ప రథబలము! చతురంగబలము నటుంచి, భారత చరిత్రలో నౌకాబలపు విలువను సరిగా చూచి, చూచినదానిని నేర్పుమీరేటట్లు అమలు పరచిన వారిలో మౌర్యులను అగ్రగణ్యులుగా యెంచవచ్చును. ఈ మహాబలాలకు సరఫరాలను కూడ చాల కట్టుదిట్టమొనర్చినారు.

రక్షణావసరాల దృష్ట్యా, ఎనిమిదివందల గ్రామాల నడుమ 'స్థానీయము'ను, నాలుగువందల గ్రామాల నడుమ 'ద్రోణముఖము'ను, రెండువందల గ్రామాల నడుమ 'ఖార్వటికము'ను, పదిగ్రామాల నడుమ 'సంగ్రహణము'ను ఏర్పాటు చేయాలి. రాష్ట్ర సరిహద్దులలో 'అండపాలదుర్గములు' నిలిపి, జనపద ద్వారాలను అండపాలుని వశముచేయాలి. జనపద మధ్యప్రదేశాన్ని వాగురిక, శబర, పులింద, చండాల, ఆరణ్యచరులు రక్షించాలి. (అర్థశాస్త్రము : ద్వితీయాధికరణము : జనపద నివేశము).

మామూలుగా, సైన్యాలకు మొనగాడుగా సమ్రాట్టే పూనుకొనేవాడు. సెల్యూకసుతోటి యుద్ధంలో చంద్రగుప్తుడు, కళింగ యుద్ధంలో అశోకుడూ రణరంగంలో ప్రత్యక్షంగా వున్నట్లు తెలుస్తుంది. సైనికుల తక్షేయతను గురించి కౌటిల్యుడు విపులమైన నిబంధనలు చేశాడు. గాయపడినవారికి, జబ్బుపడినవారికి సైన్యంలో ప్రత్యేక వైద్యసహాయం అక్కడికక్కడే లభ్యమయ్యేది. శస్త్రవైద్యసాధనాలతోటి, సామగ్రితోటి, మందుల, తైలాలు, కట్లు మొదలైవాటితో శస్త్రవైద్యులు, వండిన భోజ్యాలతో చేసిన పానీయాలతో వైద్య[illegible]కలు సన్నిధిలోవుండి, సైనికులకు వుత్సాహం కలిగించాలని కౌటిల్యుడంటాడు.

యుద్ధరథాలను భారియెద్దులు లాగేవి. ఒకొక్క రథంలో యిద్దరు సైనికులు, చోదకుడు వుండేవారు. ఒకొక్క యుద్ధగజంమీద మావటీడు కాక, విలుగాండ్లు ముగ్గురు వుండేవారు. సైనికులకు, అశ్వాలకు, గజాలకు రక్షాకవచాలు ప్రభుత్వమే యిచ్చేది.

ఈ మహాసేనాబలాన్ని సక్రమంగా పాలించేందుకై యుద్ధశాఖ ఒకటి ప్రత్యేకంగా నిర్మింపబడింది. మొత్తం 30 మంది సభ్యులలో ఐదైదుగురు ఒకొక్క

కూటంగా యేర్పడి వేర్వేరు వ్యవహారాలు నిర్వహించేవారు. రవాణా, సరఫరాల కొక కూటమి, నౌకాబల వ్యవహారాలకు మరొకటి, కాల్బలానికి యింకొకటి, అశ్వబలానికి నాల్గవది, రథబలానికి ఐదవది, గజబలానికి ఆరవది నియమితమై వుండేది.

## ముగింపు

అడుగుమీద అడుగువేసికొంటూవచ్చిన భారతీయ ఆర్థిక, రాజకీయ వ్యవస్థలో మౌర్యచంద్రగుప్తుని సామ్రాజ్యం ఒక అంగవంటిది. కేంద్రీకృత రాజకీయ, ఆర్థిక అధికారాలు మొదటకీడుకంటె మేలునే హెచ్చు పాలులో కలిగించాయి. చిల్లర రాజ్యాలు, పరస్పరం ఘర్షించి లోపల లుకలుకలాడిపోయిన గణరాజ్యాలు అంతరించి, చతురంత మహీమండ లాదర్శంతో. వృత్తే జితమై గ్రామాలవరకూ తన కిరణాలను సహస్ర ముఖాలుగా ప్రసరింపజేసిన యీ సామ్రాజ్యభానుడు వ్యవసాయ, వ్యాపార, పరిశ్రమాది జీవపోషక, సౌఖ్యదాయక కార్యాలకు అపూర్వమైన అభివృద్ధిని కలిగించాడు. చారులమీద, ప్రతివేధకుల మీద, సైన్య బలంమీద ఆధారపడిన "పోలీసురాజ్యం" (A Survey of Indian History : K. M. Panikkar) అని దీనిని నిర్వర్ణించగలమా? కావచ్చును. కాని నాటి కాలంలో ప్రజలకు కావలసింది భద్రత. "మత్స్యన్యాయం"నుండి విముక్తి; ఆర్థిక అరాజకత్వంనుండి తప్పింపు. ఇవి మౌర్య సమ్రాట్టు కల్పించ గలిగాడు. అవ్యవస్థనుండీ వ్యవస్థను మలిచినాడు. అరాచకానికి వారసుడై రాజ్యాధికారాన్ని సర్వశక్తి సంపన్నం చేశాడు. విదేశ దండయాత్రలకు వారసుడై దాస్య కళంకాన్ని వాయవ్య భారతం నొసటినుండి తుడిచాడు. ప్రభుత్వాన్ని ఆర్థికంగా స్వయంసమృద్ధం చేయగలిగాడు. ఇంగ్లీషు చరిత్రలో ట్యూడరు రాజ వంశానికీ, మన చరిత్రలో మౌర్య వంశానికీ చాల పోలికలు కనిపిస్తాయి. చంద్రగుప్తుడు ఏడవ హెన్రీని తలదన్నగలిగితే, కౌటిల్యునిలో ఒక్కనిలో మార్టన్, ఫాక్స్, డడ్లీలు లీనమై పోగలరు.

కాని యిలాంటి వ్యవస్థ కాలావసరాలను మించి, మనినప్పుడు, రాజ నిరంకుశత్వానికి, పాలనాయంత్రపు అస్తవ్యస్తానికి, ప్రజా ధనాపహరణకు దారితీయక తప్పదు. పెచ్చుమీరిన రాజ్యాధికారం అవసరమైన చెడుగు. మార్పులేని వృత్తి విభజనకే అంటిపెట్టుకొని, మూఢ్యానికి కట్టుబడి, సంప్రదాయిక నిబంధనలకు లోబడి, భారత సమాజం స్వీయచారిత్రక సామర్థ్యాన్నీ, శక్తినీ కోల్పోయిందని మార్క్సు చేసిన వ్యాఖ్యలో నిజంలేక లేకపోలేదు. (Karl Marx : Articles on India) అవసరాన్ని మీరి నిరంకుశ రాజరికం మనినందుచేత, అవసరాన్ని మీరిన వర్ణాచార నియమాలను మతంపేరిట అమలుపరచినందుచేత ఎంతో కీడు వాటిల్లింది.

విషమపరిస్థితికి విరుగుడుగా మౌర్యసామ్రాజ్యం మొదలై, ప్రయోగదశలోనే అంతరించింది. ఈ క్షణ ప్రభ క్షణికం కావడంచేతనే యింత ఆశ్చర్యం! అది యిసుక తిన్నెలనడుమ మహాశిఖరం! కల్లోలజల నిధులనడుమ దీపసౌధం!



# బౌద్ధంలో గతితర్కం

ఏటుకూరు బలరామమూర్తి, బి. ఏ.,

తాత్విక చర్చలు, సిద్ధాంతాలు అత్యున్నతస్థాయి నందుకున్న దేశాలలో భారతదేశం ఒకటి. పాశ్చాత్య తత్వశాస్త్రానికి గ్రీకు తాత్వికులు మూలపురుషులు. ప్రాచ్యతాత్విక విజ్ఞానం, మొట్టమొదటగా భారత, చైనాదేశాలలో మొలకలెత్తింది.

తత్వశాస్త్ర పరిణామంలో ఒక నిర్దిష్టమైన చారిత్రకదశలో, జడాత్మకదృష్టి (Metaphysical view) తలయెత్తింది. అదేవిధంగా మరొక నిర్దిష్టమైన చారిత్రకదశలో గతితార్కికదృష్టి (Dialectical view) ఆవిర్భవించింది. భారతదేశంలో కూడా యిలాగే జరిగింది. క్రీ. పూ. 1000 నుండి ప్రారంభమైన ఉపనిషత్తుల రచనలో భారతీయ జడాత్మక దృష్టి రూపొందిందని చెప్పవచ్చు.

జడాత్మకదృష్టి అంటే ఏమిటి? స్థితి (Being), గతి (Becoming) యీ రెంటిలో స్థితి ప్రాథమికమనీ, వైరుధ్యం - ఏకత్వం యీ రెంటిలో, ఏకత్వం ప్రాథమికమనీ, జడాత్మకమనీ జడాత్మకదృష్టి తెలియజేస్తుంది. పరిసరాలనుండి ఘటనలను వేరుచేసి పరిశీలించినప్పుడే వస్తుసారం బోధపడుతుందనీ, ఒక ఘటనకు మరొక ఘటనకు మధ్య అభేద్యమైన అడ్డుగోడలున్నాయనీ కూడా జడాత్మకదృష్టి తెలియజేస్తుంది.

ఉపనిషత్తులలో ఇట్టి దృష్టి రూపొందటానికి కారణమేమిటి? అంతకుముందు భారతదేశంలో తత్వశాస్త్రం, మతం పెనవేసుకుని ఉండేవి. వైదిక వాఙ్మయంనిండా నాటి ప్రజల మత విశ్వాసాలు, నమ్మకాలు ఆనంద ఆవేశాలు, కర్మకాండ - బహుముఖాలుగా వ్యక్తం చేయబడ్డాయి. ఈ భావోద్రేకాలమధ్య, సందేహం, ఆలోచన, జిజ్ఞాస, తర్కం - అక్కడకూడ మెరుపులాగా ద్యోతకమౌతుంది.

భూగర్భంనుండి ముడి ఇనుమును త్రవ్వి, మూల ఖనిజాన్ని, ఇతర ఉప ఖనిజాలనుండి వేరుచేసి, దానికి సానపెట్టి నగిషీ చేయటం ఎలా అవసరమో, అలాగే, వైదిక వాఙ్మయంలో చెల్లా చెదురుగా ఉన్న తాత్విక భావాలను క్రోడీకరించి, వర్గీకరణచేసి, వానిలో మూల పదార్థమేదో తెలిసికోటానికి ఉపనిషత్కారులు కృషి చేయవలసి వచ్చింది. ఈ కృషి జరగకపోతే, భారతీయ తత్వశాస్త్రం ఒక ప్రత్యేక విజ్ఞానశాస్త్రంగా (Science) అభివృద్ధి అయ్యేదే కాదు. ఈ పరిశీలనా క్రమంలోనే జడాత్మక దృష్టి తల ఎత్తింది.

ప్రకృతిలోని ప్రతి వస్తువును దేవతగా పూజించే ధోరణిపై తిరుగుబాటుగా, ఈ దేవతలందరికీ మూలమైన ఆదిశక్తి ఏది అనే ప్రశ్న ఉదయించింది. ఈ ఆదిశక్తి సగుణమా, నిర్గుణమా? సాకారమా, నిరాకారమా? అను జిజ్ఞాస తల ఎత్తింది. ఈ ఆలోచనా క్రమం ఇలా కొనసాగి, ప్రగతిశీలమైన ప్రకృతికంతకూ మూలం, ఆద్యంత రహితమైన, మార్పు లేని, చలనంలేని శాశ్వత పరబ్రహ్మ అనీ, ఆ పరబ్రహ్మ జ్యోతి శకలమే జీవాత్మ అనీ, ఒక భావం ఏర్పడ్డది. ఉపనిషత్తులలోని భావవాద తత్వశాస్త్రానికంతా మూలం ఈ అద్వైత భావమే.

కనుక చారిత్రక పరిణామక్రమంలో జడాత్మక పద్ధతికి ఒక సాంఘిక ప్రయోజనం ఉన్నది; అంతకు పూర్వమున్న బహుదేవతా ధోరణిని, ప్రకృతిశక్తుల ఉపాసనను, కర్మప్రధానమైన మతాచారాలను నిరసించి అంతకంటె ఉన్నతమైన భావవాద తత్వవిచారణ రూపొందేందుకు ఎంతగానో ఉపకరించింది.

## గతితార్కిక పద్ధతి

జడాత్మక దృష్టికంటె ఉన్నతమైనది గతి తార్కిక దృష్టి.

పరిసరాలనుండి ఘటనలను వేరుచేసి పరిశీలించటం సరియైన పద్ధతి కాదు. అసలు ఘటనలనేవి, నిశ్చలమైనవీ మార్పులేనివీ కావు. ఎడతెగని చలనము, నిరంతర ప్రవాహము ఘటనలలోని సారాంశము. స్థితి, గతి ఈ రెంటిలో గతి ప్రాథమికము. ఘటనలలోగల ఆంతరంగిక వైరుధ్యాలు గతికిమూలం. ఒక ఘటనకు మరొక ఘటనకు మధ్య అభేద్యమైన అడ్డుగోడలేవీ లేవు. ప్రకృతిలోని ఘటనా పరంపర అంతా అన్యోన్య

సంబంధంగల ఒక గొలుసువంటిది. ప్రకృతినీ, ప్రకృతి పరిణామాన్నీ ఈ దృష్టితో పరిశీలించినపుడే, మనకు సమగ్రమైన, సమ్యక్ దృష్టి ఏర్పడుతుంది.

ఇట్టి సమ్యక్ దృష్టిని గతి తార్కిక ధోరణిని భారతదేశంలో మొట్టమొదటు ప్రతిపాదించినది తత్వవేత్త గౌతమబుద్ధుడు.

గౌతమబుద్ధుని జీవితాన్ని గురించి సమగ్రంగా పరిశోధించిన ఓల్డెన్‌బర్గ్ అను జర్మన్ తత్వవేత్త ఇలా అన్నారు: "Upanishads saw being in all becoming. Buddha saw becoming in all being" "దృశ్యమాన ప్రపంచంలోని గతికంతా స్థితి మూలమని ఉపనిషత్తులు భావించాయి. అందుకు విరుద్ధంగా బుద్ధుడు స్థితికంతా గతిమూలకమని తెలియజేశాడు" (బుద్ధునిజీవితం, 225 పేజి).

వారణాసి సమీపంలోని సారనాథ్‌వద్ద మృగదావంలో గౌతముడు మొట్టమొదటిసారిగా తన నూతన సిద్ధాంతాన్ని ప్రవచించాడు. ఈ ప్రసంగాన్నే "ధర్మచక్ర ప్రవర్తన" అని వ్యవహరిస్తున్నారు.

గౌతముడు ఇలా అన్నాడు:

"ప్రపంచానికి ఆది, అంతం - ఏవి అనే సమస్యను పక్కకుపెట్టండి. ఈ సమస్యలు నిరుపయోగమైనవి. పరిష్కరించ సాధ్యంకానివి (అవ్యక్తాని). నేను మీకు ధర్మాన్ని ఉపదేశిస్తున్నాను అది అలా ఏర్పడ్డది కాబట్టి, ఇది ఇలా ఉద్భవిస్తున్నది. అది లేకపోతే, ఇదికూడా లేదు. అది ఆగిపోతే ఇదీ ఆగిపోతుంది. ఇదే ధర్మం. ఈ ధర్మాన్ని ఆమోదించిన ప్రతిఒకరూ ప్రతీత్యసముత్పాదవాదాన్ని ఆమోదించినట్లే."

అది, ఇది - కార్యం, కారణం, ఈ రెంటికీ గల గతితార్కిక సంబంధం, జగత్పరిణామానికంతా మూలం. ప్రతిపనికీ ఒక కారణం ఉంటుంది; అకారణంగా ఏవీ ఏర్పడదు. ప్రతికార్యం తిరిగి కారణంగా మారుతుంది. ఈ రెంటికీ మధ్య అడ్డుగోడలులేవు. ఇదే భావాన్ని గౌతముడు, ధర్మపథంలో ఇలా వివరించారు:

"ఓ భిక్షువులారా! జీవించేది ప్రతిదీ మరణిస్తుందని తెలుసుకోండి. ప్రతిదానికి ఒక కారణం ఉంది. కారణం నశించగానే కార్యం కూడా నశిస్తుంది. పైకి స్థిరంగా కనపడే పదార్థాలన్నీ నిజానికి అస్థిరములైనవే. అవన్నీ నశించేవే. అత్యున్నతస్థాయి నందున్న ప్రతిదీ తిరిగి పతనం చెందవలసిందే. మొదలు ఉంటే, చివరకూడా ఉంటుంది. ఐక్యత ఉన్నచోట ఎడబాటుకూడా ఉంటుంది. ప్రాణం ఉన్నచోట మృత్యువు కూడా ఉంటుంది."

ప్రపంచంలో ప్రతిదీ వైరుధ్యాలతో కూడుకుని ఉన్నదన్న సత్యమే పై ఉపదేశాలలో తిరిగి తిరిగి ప్రతిధ్వనిస్తున్నది. గౌతముడు వాడిన 'ధర్మం' అనుమాట ఏ అర్థంలో వాడబడిందో కూడా తెలుసుకోవాలి.

బౌద్ధ తత్వశాస్త్రంలో, వస్తువు (Thing), ధర్మం (Process) అను రెండుమాటలు తరచు కనపడతాయి. ప్రవాహ సదృశ్యమైన జగత్పరిణామమే ధర్మం. ఆ అర్థంలోనే గౌతముడు తన తాత్విక చర్చలన్నిటిలోను ఆ మాటను ప్రయోగించాడు.

అంతకు పూర్వమున్న కార్యకారణ వాదానికి, సిద్ధార్థుడు ప్రతిపాదించిన ప్రతీత్య సముత్పాదవాదానికి గల వ్యత్యాసాన్ని వివరిస్తూ, మహాపండిత్ రాహుల్‌జీ ఇలా అంటున్నారు:-

"అణువులు, లేక పదార్థం, మార్పులేని మూల వస్తువులు అని భావించేవారు. ఆ వస్తువుల సంయోగవియోగాల ద్వారా సృష్టి జరుగుతుందని చెప్పేవారు. కాని బౌద్ధ తత్వశాస్త్రం అట్టి మార్పులేని మూలపదార్థాలను ఆమోదించలేదు. ప్రపంచంలో వస్తువులనేవి (Things) లేనేలేవు. ప్రతిదీ ధర్మమే (Process)".

కార్య, కారణ సంబంధాలలో కూడా, ఒకదాని నుండి మరొకదానికి అందించబడే మూల వస్తువేమీ లేదు. కనుకనే, కారణం నశించగానే కార్యం నశిస్తుంది. అనగా కార్యం, మరొక కారణంగా రూపొందుతుందన్న మాట. నిరంతర చలనం (Eternal flux) జగత్తుకుమూలం అనే భావం ప్రతీత్యసముత్పాదవాదానికి కీలకం.

## కారణ సముదాయం

గౌతమునికి పూర్వమున్న కార్యకారణవాదం యాంత్రికమైనది. ఉపనిషత్కర్తలు, చార్వాక ధోరణికి చెందిన భౌతికవాదులుకూడా ఆ వాదాన్ని అంగీకరించారు. బౌద్ధంలోని ప్రతీత్యసమత్పాదవాదం

అంతకంటె ఉన్నతమైన గతితార్కికదృష్టిని ప్రదర్శించింది.

ఒకే కారణంనుండి అనేక ఫలితాలు ఏర్పడ వచ్చునని ఉపనిషత్తులలోని భావవాదం తెలియజేస్తుంది. పరమాత్మ ఒక్కడే. అతనిలోనుండి చరాచర ప్రపంచం ఉద్భవిస్తున్నదని చెబుతుంది. ఇందుకు విరుద్ధంగా, చార్వాకులు పదార్థం ఒక్కటేననీ, అందులోనుండి ప్రపంచమంతా ఆవిర్భవిస్తుందనీ అన్నారు.

గౌతము డీధోరణిని తిరస్కరించాడు. ఒకే కారణం అనేక కార్యాలను కలిగించలేదు. అసలు అనేక కారణాలు కలిస్తే కాని ఒక ఫలితం కలగదు. ఈ కారణాలలో ఏ ఒక్కటి లేకపోయినా ఫలితం కలగదు! క్రీ. పూ. 200 ప్రాంతంలో పశ్చిమోత్తర రాష్ట్రాన్ని పరిపాలించిన గ్రీకురాజు మినాండార్‌తో బౌద్ధగురువైన నాగసేనుడు పై సూత్రాన్ని ఇలా వివరించాడు: "అనేకమైన భాగాలు, చక్రాలు, ఆసనము, గుర్రాలు, సారథి మొదలైనవన్నీ ఉంటేనే రథం ఏర్పడుతున్నది. అలాగే, 32 రకాలైన భౌతికవస్తువులు పంచభూతాలు కలిసి మానవాకారంఏర్పడినప్పుడే, నేను 'నాగసేనుడి'ని ఔతున్నాను. కనుక కారణ సముదాయంవలననే ఫలితం కలుగుతున్నది" (మిళింద పన్హా).

కార్య, కారణాలకు భిన్నత్వము, ఏకత్వము రెండూ ఉన్నవి. అనగా పరిణామక్రమంలో ఎప్పుడూ కొత్త విషయాలు ఉద్భవిస్తూంటాయి. పాతవి కొన్ని కొనసాగుతూ ఉంటాయి.

క్రీ. శ. 400 లో జీవించిన బౌద్ధ తాత్వికుడు బుద్ధఘోషుడు ఈ క్రింది ఉదాహరణ నిచ్చాడు :-

"తీయని పాలలోనుండి పుల్లని పెరుగు ఏర్పడుతున్నది. కార్యకారణాలమధ్య పూర్తి ఏకత్వమున్నా, లేక పూర్తి భిన్నత్వమున్నా ఇది సాధ్యంకాదుగదా."

పాత కొత్తల మేలుకలయిక పరిణామ స్వభావం.

ఈ భావాన్ని నాగసేనుడు, ఈ క్రింది ఉదాహరణలో తెలియజేస్తున్నాడు.

మిళిందపన్హాలోని ఈ క్రింది సంభాషణల గమనిద్దాం.

రాజు: నాగసేనా! జన్మించినవ్యక్తి యథాతథంగా ఉంటాడా, మారిపోతూ ఉంటాడా?

నాగసేనుడు : యథాతథంగాను ఉండడు; పూర్తిగా మారిపోనూ పోడు.

రాజు : ఒక ఉదాహరణ ఇవ్వగలవా ?

నాగసేనుడు : ఓరాజా! నీ వొకప్పుడు శిశువుగా ఉండేవాడవు. చిన్న ఆకారంలో, మృదువుగా ఉంటూ, క్రిందపడి దొర్లుతూ ఆడుకునేవాడివి. ఇప్పుడు నీవు పెరిగి పెద్దవాడవైనావు. నీవూ ఆ శిశువూ ఒకరా, వేర్వేరా ?

రాజు : ఆ శిశువువేరు, నేనువేరు.

నాగసేనుడు : ఆ శిశువూ నీవూ వేర్వేరైనట్లయితే, తల్లీ, తండ్రీ, గురువూ ఎవరూలేకుండానే నీవింతవాడవైనావా? ప్రతిరోజు మనలో కొత్తదనం ప్రవేశిస్తుంది అయితే ఇది పూర్తి కొత్తదనముకాదు. నిరంతరపరిణామం, తెగగొట్టటానికి వీలులేని క్రమపద్ధతి ఈ రెండూ కలిసేవున్నాయి. (There is Persistent Continuity as well as unceasing change).

నాగసేనుడు తన వాదాన్ని వివరించటానికి మరొక ఉదాహరణ ఇచ్చాడు.

ఉదయంనుంచి రాత్రివరకూ మండుతూ ఉండే కొవ్వువత్తిని ఉదాహరణగా యిచ్చి, మగధరాజుతో నాగసేనుడు ఇలా అంటున్నాడు: "ఓ రాజా, ఘటనల సముదాయం గొలుసువలె బంధించబడిఉంది. ఏదో ఒక్క కొత్తఘటన నిరంతరం ఆవిర్భవిస్తూ వుంటుంది. ఏదో ఒక ఘటన నశిస్తూ, కాలగర్భంలో కలిసిపోతూ వుంటుంది. ఆద్యంతాలు లేకుండా ఈ పరిణామం సాగుతూనే ఉంటుంది."

పై ఉదాహరణ లన్నింటినీ చూచినపుడు, ఆధునిక గతి తార్కిక సూత్రాలలోని ప్రధాన అంశాలను గౌతముడు ఆనాటికే ప్రతిపాదించాడని స్పష్టం కాగలదు. ప్రతిదీ ఒక ప్రవాహం వంటిది; పరిణామంలో గుణాత్మక మార్పులు జరిగి, కొత్త లక్షణాలు ఆవిర్భవిస్తూ ఉంటాయి. అనేక కారణాలు, లేక ఘటనలు కలిస్తేనే ఫలితం ఏర్పడుతుంది. కనుక ఏ ఒక్క ఘటనను, పరిసరాలనుండి విడదీసి పరిశీలించరాదనీ, స్థాణురూపంలో భావించరాదనీ, జరిగిన ఘటనలే ఎల్లప్పుడూ పునరావృతం జెందుతూ ఉంటాయనుకోవడం పొరపాటనీ పై బోధలు స్పష్టంచేస్తున్నాయి.

## సర్వం దుఃఖం దుఃఖం

అయితే ఈ మార్పుకంతకీ కారణమేమిటి? ఘటనల లోని ఆంతరంగిక వైరుధ్యాలే మార్పుకు కారణమన్న

గతి తార్కిక సూత్రాన్ని గౌతముడు ప్రతిపాదించాడా?

'సర్వం దుఃఖం, దుఃఖం,
సర్వం కష్టం, కష్టం,
సర్వం క్షణికం, క్షణికం,

అను వాక్యాలను గౌతముడు తరచు వాడాడు. బౌద్ధ ధర్మ మూల సూత్రాలుగా కూడా ఇవి ఏరి గణింపబడుతున్నాయి.

దుఃఖం అనుమాట, శోకం, విచారం అను లౌకికార్థంలోకాక, వైరుధ్యం, ఘర్షణ అను తాత్విక భావంతో గౌతముడు వాడినట్లు భావించవచ్చు. ఏమంటె శోకం, విచారం హెచ్చుగా ఉన్నదనేభావం 'కష్టం, కష్టం' అను మాటలలో ఉండనే ఉంది.

గౌతముడు ఉపదేశించిన నాలుగు "ఆర్య" సూత్రాలు (ఉదాత్తమైన సూత్రాలు) ఇవి:

(1) జీవితమంతా దుఃఖమయం.

(2) ఈ దుఃఖానికి కారణమున్నది.

(3) ఈ దుఃఖాన్ని నిరోధించవచ్చు.

(4) దుఃఖనిరోధ మార్గాన్ని, అనగా అష్టాంగ మార్గాన్ని అనుసరించాలి.

పై సూత్రాలలో 'దుఃఖం' అను మాటను వ్యక్తిపరంగాను, సమాజ పరంగాను గౌతముడు వ్యాఖ్యానించాడు. పుట్టుక, చావు, వ్యాధి, తృష్ణ - మొదలగునవి వ్యక్తిగత దుఃఖానికి కారణాలు. సమాజంలోని వ్యత్యాసాలు, రాజు-ప్రజ, ధనికుడు - పేద, అగ్రవర్ణస్థుడు - హీనవర్ణస్థుడు మొదలైనవి సామాజిక దుఃఖానికి కారణాలు. ఈ రెండేకాక ప్రకృతిలోని దృగ్విషయాలన్నిటిలోను విరుద్ధశక్తుల కలయిక, ఉన్నదని ఇదివరకే చూశాము.

సర్వవ్యాపితమైన ఈ వైరుధ్యాన్నే, గౌతముడు 'దుఃఖం' అని వాడినట్లు భావించవచ్చు. 1956 నవంబరులో ఢిల్లీలో జరిగిన బౌద్ధసంగీతి (విద్వద్గోష్ఠి)లో ప్రసంగిస్తూ సింహళ ప్రతినిధి, ప్రముఖ బౌద్ధ తత్వవేత్త ఐన జి. కి. మల్లాలశేఖర ఇల్లా అన్నారు:

"This conflict is called by Buddha dukkha, and it is universal" (ఈ వైరుధ్యాన్నే బుద్ధుడు దుఃఖం అని అన్నాడు. ఇది విశ్వవ్యాపితం).

మల్లాలశేఖర వెలిబుచ్చిన భావం పరిశీలనార్హమైన సూచనగా నేను భావిస్తున్నాను.

రెండువేల అయిదువందల సంవత్సరాల నాడు జన్మించిన గౌతముడు తాత్విక రంగంలో ఇంతటి ప్రగతిశీల దృక్పథాన్ని ప్రవేశపెట్టడం నిజంగా ప్రశంసనీయం. ఆధునిక యుగంలోని గతి తార్కిక పరిభాష గౌతముని కాలంనాటికి ఏర్పడటం అసంభవం. అలా ఏర్పడ లని ఆశించడంకూడా పొరపాటు. ఏమంటే తత్వశాస్త్రం సామాజిక పరిస్థితులను, శాస్త్రీయ విజ్ఞానాన్ని పూర్తిగా అధిగమించలేదు. కొంతవరకుమాత్రమే భవిష్యత్తులోకి తొంగిచూడగలదు.

## దేవుడు, ఆత్మ

ఈ గతితార్కిక దృక్పథంతోనే గౌతముడు దేవుడు, ఆత్మవంటి మతసమస్యలకుకూడ సమాధానం యిచ్చాడు.

దేవు డున్నాడాలేడా? ఉంటే ఎక్కడ ఎందుకున్నాడు? మొదలైన సమస్యలు ఆనాడు మేధావులను వేధిస్తూ ఉండేవి. ఈ సమస్యలను పరిష్కరించేందుకై కొందరు సన్యసించి, కఠినమైన హఠయోగాదులను అనుసరించేవారు. వీరు శ్రమణకులు. ఇట్టి వారానాడు వేల సంఖ్యలో ఉన్నట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. మరికొందరు వైదిక కర్మకాండను అంధప్రాయంగా అనుసరిస్తూండేవారు. మరికొందరు ఉపనిషత్తులలోని ఆత్మవాదాన్ని చిలుకపలుకులవలె ఉచ్చరించేవారు. ఈ ధోరణులన్నిటిపై తిరుగుబాటుగా చార్వాక ధోరణికి చెందిన భౌతికవాదులు దేవుని, ఆత్మను, కర్మకాండను, మూఢాచారాలను నిరసిస్తూ ప్రచారం చేసేవారు. మహావీరుని జైనమతంకూడా ఇదేకాలంలో ఏర్పడ్డది.

ఇన్ని విభిన్నధోరణులమధ్య ఘర్షణ జరుగుతున్న కాలంలో గౌతముడు తన ప్రచారం ప్రారంభించాడు. దేవుడున్నాడా లేడా అన్న నిరర్థక ప్రశ్ననుండి ప్రజలదృష్టిని మళ్ళించి సమాజంలోని దుఃఖం, దుఃఖ నివారణోపాయంవైపు కేంద్రీకరించడం సిద్ధార్థుడు తన ప్రథమ కర్తవ్యంగా భావించాడు,

గౌతముడు ఒక సందర్భంలో యిలా అన్నాడు:

"కొంతమంది ఆచార్యులు ఇంద్రుణ్ణీ, వరుణుణ్ణీ, ప్రజాపతిని పేరుపెట్టి పిలిచి ప్రార్థి

స్తారు. ఒక నదిని దాటదలచుకున్న వ్యక్తి యివతలి ఒడ్డున నిలబడి అవతలి తీరాన్ని వతలికి రమ్మని ప్రార్థిస్తే వస్తుందా? అప్పుడా మానవుడు ఏంచేస్తాడు? ఒక తెప్పకొయ్యను సంపాదించి, దాని ఆధారంతో సర్వ శక్తులూ కేంద్రీకరించి నదిని దాటుకుంటూ వెళ్తాడు."

కనుక జీవిత సమస్యల పరిష్కారానికి లోకాతీత శక్తులను ప్రార్థించటం, వాటిని గూర్చి అంతులేని చర్చలు చేయటం నిరుపయోగం. మానవుడు తన భావికి తానే అధినేత. స్వశక్తితో, విశ్వాసంతో మహోన్నత శిఖరాల నందుకోగలడు. అట్టి కృషికి ప్రజలను ప్రోత్సహించటమే గౌతముడు తన లక్ష్యంగా స్వీకరించాడు.

మరొక సందర్భంలో మాలుక్యపుత్రుడను భిక్షువుతో చర్చిస్తూ, గౌతము డిలా అన్నాడు: "ఒకని శరీరము నందు విషలిప్తమైన బాణము గుచ్చుకొన్నదనుకొనుము. అప్పుడు వైద్యుడు, 'ఈ బాణమువేసిన దెవరు? అతడు శూద్రుడా, బ్రాహ్మణుడా, నల్లనివాడా, ఎర్రనివాడా? వాని ధనువెట్టిది? అల్లెతా డెట్టిది? అను ప్రశ్నలతో కాలం గడుపుతాడనుకొమ్ము. ఓ మాలుక్యపుత్రా, అట్టివైద్యునితో రోగికి ఏమి ప్రయోజనం? అట్లే ఆత్మశాశ్వతమా కాదా? దేవుడున్నాడా లేడా? అను ప్రశ్నలు తేలువరకు నేను బ్రహ్మచర్యము స్వీకరించను అని ఒకడనుకొంటూ డనుకొందము." అందు వలన ప్రయోజన మేమి? దుఃఖం, దుఃఖకారణం, దుఃఖనిరోధం, దుఃఖనిరోధమార్గం - ఈ మార్గాన్ని చేబట్టవలెను."

పై ఉదాహరణలను గమనించినపుడు 'దేవుని' సమస్యకు గౌతముడు చాలా స్వల్ప ప్రాధాన్యత నిచ్చినట్లు స్పష్టం కాగలదు.

అయితే దీని అర్థం, బుద్ధుడు ఆ సమస్యకు సమాధానం చెప్పలేదని కాదు. సమాధానం ఇచ్చాడు. అంతేకాదు, గతితార్కిక దృష్టిని వర్తింపజేసి, 'దేవుని' అస్తిత్వాన్ని నిరాకరించాడు కూడా.

అనాథ పిండకునితో చర్చిస్తూ గౌతము డిలా అన్నాడు:

మనకు తెలిసినవాటి కన్నిటికీ ఏసంబంధంలేకుండా పరబ్రహ్మ (Absolute) ఉన్నాడు అని చెప్పినట్లయితే అతని ఉనికిని హేతువాదంద్వారా నిరూపించలేము. జగత్తు అంతా పరస్పరాధారమైనది. ఇందుకు భిన్నమైనది ఏ ఒక్కటీ లేదు. ఉండబోదు. పరబ్రహ్మమునకు ఏ లక్షణాలు లేనట్లయితే, అందులోనుండి ఉద్భవించే ప్రపంచాని కంతా ఏ లక్షణాలు ఉండకూడదు. కాని వాస్తవ మేమంటే ప్రతి వస్తువు ఏదో ఒక లక్షణాన్ని కలిగిఉంది. కనుక సృష్టికి కారణమని చెప్పబడే 'పరబ్రహ్మ' లేడు!...ఈశ్వరుడే సృష్టికర్త అయితే, ఇచ్ఛాపూర్వకంగానో, అనిచ్ఛాపూర్వకంగానో, సృష్టి సాగిస్తూ ఉండాలి. ఇచ్ఛాపూర్వకంగా చేస్తుంటే ఆయన పరిపూర్ణుడు కాదు. ఇచ్ఛ లోపపూర్తికేగదా ఉద్దేశించబడ్డది. అనిచ్ఛాపూర్వకంగా సాగిస్తే, అతడు ఉన్మాదిగానో, పసిబాలుడుగానో ఉండాలి." (బుద్ధచరిత).

ప్రతిదీ నశిస్తుంది. ఏదీ శాశ్వతంకాదు అను సూత్రాన్ని అనుసరించి బుద్ధుడు 'ఆత్మ'ను కూడా నిరాకరించాడు. మానవశరీరం నశించినపిమ్మట కూడా ఆత్మ శాశ్వతంగా ఉండగలదన్న వాదన హేతువాదానికి విరుద్ధమని ఖండించాడు.

బౌద్ధమత శాఖలన్నీ, 'అనాత్మవాద శాఖలు'. 'ఆత్మ' నిరాకరణకు బౌద్ధంలో విశేష ప్రాధాన్యత ఉన్నది.

జడాత్మక దృష్టికి పరాకాష్ఠ ఆత్మభావం. ప్రపంచంలో జరిగే మార్పులన్నీ తాత్కాలికమైనవి, పైపైవి. వీటన్నింటికి అతీతమైన మార్పులేని శాశ్వతపదార్థం ఆత్మ. ఆత్మ శరీరంలో ఉన్నప్పుడే ప్రాణం కలుగుతుంది. సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు శరీరానికేగాని, ఆత్మకుగావు. ఈ ఆత్మవాదం తార్కిక దృష్ట్యా లోపభూయిష్టమైనదేకాక, నైతిక, సాంఘిక దృష్ట్యా కూడా ఆనాడు తీవ్ర దుష్ఫలితాలను కలిగించింది.

పాపపుణ్యాలు శరీరానికి మాత్రమేగాని ఆత్మకు కావు. కనుక ప్రవర్తనలో నీతి అవినీతి అను విషయమై పట్టుదల అక్కరలేదు. భోగవిలాసాలను సమర్థించేందుకు ఆదర్శవాదం ఒక సాకుగా ఉపయోగపడేది.

'ఆత్మ' అంటె నేను; అహం. సమాజంతో పని ఏముంది? నేను నా సుఖదుఃఖాల విషయం చూసుకుంటేచాలు. సమాజంకంటె 'నేను' అధికుడిని. నాలో కూడా 'శరీరం' కంటే ఆత్మ ముఖ్యం. ఈ ధోరణివల్ల వ్యక్తిగత అహంకారం పెచ్చరిల్లి సామాజికదృష్టి లోపించేది.

కనుకనే గౌతముడు ఆత్మవాదాన్ని అతికఠినంగా ఖండించాడు. బౌద్ధశాఖ లన్నిటిలోను 'ఆత్మవాది'

అనుమాట ఒక కఠినమైన దూషణగా కూడ వ్యవహరించబడేది.

వ్యక్తికీ సమాజానికీ అవినాభావసంబంధముంది. ఇతరులకు కష్టం కలిగించకుండా వ్యక్తి జీవించడమే అష్టాంగమార్గంయొక్క మూలసూత్రం. కనుక సామాజిక దృక్పథం, వినయం బౌద్ధానికి ప్రాణసమానములు. వ్యక్తిగత అహంకారం, భోగలాలసత బద్ధశత్రువులు.

బౌద్ధంలో అనాత్మవాదానికి గల ప్రాధాన్యతను వివరిస్తూ, శ్రీ మల్లాలశేఖర ఇలా అంటున్నారు:

అనాత్మవాదాన్ని గురించిన బుద్ధుని బోధ ప్రపంచంలోని ఏ మతతాత్విక సిద్ధాంతాలలోనూ లేని విశిష్టలక్షణం అని చెప్పవచ్చు. శరీరం నశించినపిమ్మట కూడా 'ఆత్మ' జీవిస్తుందని చెప్పే వాదనను నిరాకరించటం మాత్రమే కాదు ఇక్కడ గమనించవలసింది. మానవచరిత్రలో నిరంతరం ఘర్షణలకు, వైరుధ్యాలకు స్రోతవతీస్తున్న 'వ్యక్తి దురహంకారాన్ని (Delusion of individuality) బుద్ధుడు నిరసించాడు.

వ్యక్తికి, సమాజానికి గల వైరుధ్యం అనాదిగా ఉన్నది. వర్గసమాజంలో ఇది మరింత తీవ్రరూపంలో ఉన్నది. వర్గరహిత సమాజం ఏర్పడిన పిమ్మటనే వ్యక్తికి, సమాజానికిగల వైరుధ్యం, ఘర్షణ రూపాన్ని త్యజించి, సుహృద్భావ పూరితమైన పోటీరూపాన్ని (Antogonism becomes competition) స్వీకరించగలదు. సుదూర భవిష్యత్తులో మాత్రమే మానవజాతి సాధించగల ఈ లక్ష్యాన్ని గౌతముడు లీలామాత్రంగా తన అనాత్మవాదంలో దర్శించాడా అనిపిస్తుంది.

## సమకాలిక ధోరణులు

అనాత్మవాదానికి బౌద్ధమతం ఇచ్చిన విశేషప్రాధాన్యతను గ్రహించాలంటే, బుద్ధునికాలంనాటి భారతదేశంలో వ్యాప్తిలో ఉన్న వివిధ తాత్విక ధోరణులను కూడా పరిశీలించడం అవసరం.

నాటి ధోరణు లన్నిటినీ రెండుగా విభజించవచ్చు. ఉపనిషత్తులలోని బోధలపై ఆధారపడిన భావ వాద ధోరణులు ఒకశాఖ. వానిపై తిరుగుబాటుగా తలఎత్తిన శ్రమణక, జీవక, చార్వాక, జైన - ధోరణులు మరొక శాఖ. ఈ రెండవ తెగలోని ధోరణులన్నిటిలోను ఏదో నిష్పత్తిలో భౌతికవాదంద్యోతకమౌతూనే ఉన్నది.

కాని ఆశ్చర్యమేమంటే, ఈ ధోరణులన్నిటిలోను జడాత్మకదృష్టి ప్రబలంగా ఉంది. తత్ఫలితంగా ఈ ధోరణులు మానవునిలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించి, తన భవిష్యత్తును తానే సుఖమయం చేసుకోవాలి అన్న పట్టుదలను కలిగించటానికి బదులు, ఏవో కొన్ని అతీత శక్తుల చేతులలో మానవుడు కీలుబొమ్మ అనేభావం కలిగించాయి.

మార్పు అస్థిరమని, స్థితి శాశ్వతమని బోధించే భావవాద జడాత్మక దృష్టి సాంఘిక వ్యత్యాసాలను, దౌర్జన్యాలను సమర్థించేందుకు సహించమని ప్రజలకు చెప్పేందుకు ఉపయోగపడ్డది. వర్ణవ్యవస్థ, రాచరికం, సాంఘిక వ్యత్యాసాలు అనాదిగా ఉన్నాయి. ఇప్పుడు పోవాలన్నా పోవు. పోయినట్లు కనబడ్డా తిరిగి అవే మరోరూపంలో ప్రత్యక్షమౌతాయి. కనుక సమాజ వ్యవస్థను మార్చటానికి యత్నించటం నిరర్థకమే. పైగా ఈ బాహ్య ప్రపంచమంతా అశాశ్వతం. ఆత్మ మాత్రమే శాశ్వతం. కనుక ఆత్మ జ్ఞానాన్ని పొందటానికి మానవుడు కృషిచేయాలి. ఇది జడాత్మక భావవాదం యొక్క సాంఘికబోధ. ఈ ధోరణి, సాంఘిక పురోగతిని అరికట్టే అభివృద్ధినిరోధక పాత్రను నిర్వహించిందని వేరే చెప్పనక్కరలేదు.

భౌతికవాద ధోరణులలోకూడా ఈ జడాత్మకదృష్టి ప్రబలంగా ఉండేది.

పూర్ణకాశ్యపుడు చార్వాకుని మతస్థులలో ఒకడు. ఇతడు వేదాలను, దేవుని, ఆత్మను, మోక్షాన్ని, పునర్జన్మను, కర్మకాండను-అన్నిటినీ నిరసించాడు. మంచిదే. అయితే ప్రజలకు అతడిచ్చిన సందేశం ఏమిటి? ఈ జన్మలో చేసిన కర్మలవలన మరొక జన్మలో పాప పుణ్యాలు సంక్రమిస్తాయన్న నమ్మకాన్ని విమర్శిస్తూ వా రిలా అన్నారు:

"ఒక డేమిచేసినను, చేయించినను పాపము లేదు. హత్య, దోపిడి, దొంగతనం, వ్యభిచారము, అసత్య భాషణము-వీనివలనకూడా పాపంలేదు. దానధర్మాలు, యజ్ఞయాగాదులవలన పుణ్యమూరాదు" - ఈ ధోరణి పేరు అక్రియావాదం.

మక్కలి గోశాలుడు మరొక భౌతికవాది. ఇతని వాదం 'నియతివాదం'.

"స్వతః సామర్థ్యములో ఏ పని కాదు. ప్రాణులు, సర్వభూతములు, ఇవన్నియు అవశములు, దుర్బలములు, నిర్వీర్యములు. ఇవి నియతి లేక స్వభావముచే పరిణతము లగును. ఈ సంసారమున సుఖదుఃఖములు పరిమిత ప్రమాణ ములలో ఉన్నవి. ఈ ప్రమాణము ముందే నిర్ణీతము." మానవుడు 'నియతి' అనబడు లోకాతీతశక్తికి బానిస. ఆశక్తిని ఎదిరించే శక్తిలేదు. (Theory of Pre-determination). అజితకేశకంబళుడు మరొక భౌతికవాది. ఇతనివాదం ఉచ్ఛేదవాదం.

"మనుష్యుడు నాలుగు భూతపదార్థముల సమ్మేళనం. మరణించినపుడు శరీరము పంచభూతాలలో కలుస్తుంది. ఇక మిగిలే దేమున్నది? ఆస్తికవాదము వ్యర్థం. శరీరము నాశనమైనపిదప మూర్ఖుడు, చతురుడు ఒకేరకముగా ఉచ్ఛేదం (వినాశం) పొందుదురు".

ప్రక్రుధ కాత్యాయనుడు అన్యోన్యవాది. "ఏడు పదార్థముల నెవ్వరూ చేయలేదు. చేయించలేదు. వానినిగురించి చెప్పువాడు, వినువాడు, తెలిసినవాడు లేడు."

సంజయ వేలట్టి పుత్ర "పరలోక మున్నదో, లేదో, స్వర్గ నరకము లున్నవో, లేవో తథాగతుడు మరణానంతర ముండునో లేదో వీనిలో ఏదీ నాకు తెలియదు". ఇది విక్షేపవాదం.

నిగంఠనాథపుత్రుడు "హింస, సత్యము, దొంగతనం చేయకపోవుట, దానం స్వీకరించకపోవుట మొదలైన నాలుగు మార్గములద్వారా పై సత్యమును సాధించవచ్చు". నిగంఠనాథ పుత్రుడే జైన మత ప్రవక్త మహావీరుడు.

పై వాదాల లన్నిటిలోను, జైన ధోరణి మినహా, మిగతావి మానవుని సత్క్రియాచరణకు ప్రోత్సహించునవి కాక, నిరాశ, నిస్పృహ, నిష్క్రియా ధోరణులవైపు త్రోసివేసేవే. జైనులు దేవుని నిరాకరించారు. కాని పిపీలికాది బ్రహ్మ పర్యంతం చరాచర జీవకోటిలో ప్రతిఒక్క వస్తువుకు ఒక ఆత్మ కలదని వీరి భావం. భౌతిక ప్రపంచం వాస్తవమన్నారు. పదార్థ పరిణామం వియుక్తశక్తుల ఘర్షణద్వారా జరుగుతుందని కూడా వివరించారు. పదార్థ పరిణామానికి సంబంధించినంతవరకు గతి తార్కిక ధోరణిని ప్రదర్శించినా, జైనుల సమగ్ర తాత్విక దృక్పథంలో జడాత్మక దృష్టి ప్రబలంగా ఉంది.

సమాజంలోని అన్యాయాన్ని మతమౌఢ్యాన్ని, ఛాందసాన్ని నిరసించినంత వరకూ ఈ భౌతికవాద ధోరణులు అభ్యుదయకర పాత్రనే వహించాయి. కాని జడాత్మక దృష్టి, యాంత్రిక ధోరణి ప్రబలంగా ఉన్నందున, కార్యాచరణను ప్రోత్సహించలేకపోయినవి. మానవుడు ఆత్మ చేతిలో కీలుబొమ్మ అని భావవాది అనగా, మానవుడు 'నియతి' చేతిలో కీలుబొమ్మ అని చార్వాక భౌతికవాది అన్నాడు. అంతే తేడా. పైపెచ్చు ఈ ధోరణులు కాలక్రమేణ వ్యక్తిగత అరాచకత్వాన్ని సమర్థించేవిగా తయారైనవి.

ఇట్టి జడాత్మక దృష్టిని ఖండించి, మానవునిలో ఆత్మవిశ్వాసాన్ని పూరించి, దుఃఖనివారణ మార్గాన్ని ప్రవచించేందుకు గౌతముడు దీక్షవహించాడు. బౌద్ధ గతితర్కం యొక్క సామాజిక ప్రయోజనం, అభ్యుదయకర ధోరణి ఇందులోనే ఉన్నది.

బుద్ధుని క్రియాశీల దృక్పథాన్ని వివరిస్తూ శ్రీ మల్లాలశేఖర ఇలా అంటున్నారు :

"వర్తమానం గతాన్నుండి ఉద్భవించినట్లే, వర్తమానంనుండి భవిష్యత్తు ఉద్భవిస్తుంది. గతంలోని కార్యాల ఫలితాలను వర్తమానంలో అనుభవిస్తున్నట్లు వర్తమానంలోని కార్యాల ఫలితాలను భవిష్యత్తులో అనుభవిస్తాము. గతమే వర్తమానమై వర్తమానంలో భవిష్యత్తు బీజాలు కూడా ఉన్నాయి. కనుక మనం వర్తమానకాలాన్ని గూర్చి శ్రద్ధవహించాలి. అదే మన కర్తవ్యము. వర్తమానంలోనే మనం భవిష్యత్తుకు రూపురేఖలు దిద్దుతున్నాం."

గౌతముని తత్వశాస్త్రానికంతా కీలకమైన సందేశం యిది.

## మధ్యేమార్గం

క్రియాశీలమైన ఈ దృక్పథాన్నే గౌతముడు మధ్యేమార్గమని వ్యవహరించాడు.

గౌతముడు ఇలా అన్నాడు :

"ప్రతిదీ ఉన్నది. ఇది ఒక విపరీత ధోరణి. ఏదీ లేదు. ఇది మరొక విపరీత ధోరణి. ఓ కచ్చాన ప్రతిదీ, ఉన్నది, లేదు అని నేను చెప్పుతున్నాను. ఇదే సత్యం. సత్యం మధ్యేమార్గంలో ఉంటుంది" (సంయుక్తనికాయం).

ఈ మధ్యేమార్గం బుద్ధునిబోధ లన్నిటిలోను ద్యోతకమౌతుంది. సుఖభోగాలలో మునిగిపోరాదు శరీరాన్ని అనవసరంగా కష్టపెట్టరాదు. మాంసా

హారాన్ని నిరుత్సాహ పరచాలి. కాని భిక్షువుకు ఏ గృహిణియైనా తాను తినే మాంసాహారాన్నే భిక్షగా ఇస్తే నిరాకరించరాదు. తాత్విక చర్చలు చేయాలి. కాని అదే పరమార్థమనుకొని కార్యాచరణను వదలరాదు. ఈ మధ్యేమార్గం బౌద్ధమత వ్యాప్తికి సహాయపడిన ప్రధాన కారణాలలో ఒకటి. బుద్ధుని వాస్తవిక దృష్టికి ఇది తార్కాణం.

## సాంఘిక ప్రయోజనం

క్రియాశీలమైన గౌతముని సందేశం, నాటి భారత దేశ పరిస్థితులలో అభ్యుదయకర పాత్ర వహించిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆనాటి సమాజం ఎలా ఉండేది ?

గంగా, యమునాతీరంలో అసంఖ్యాకమైన చిల్లర రాజ్యా లుండేవి. వీరిలో కొన్ని రాజ్యాలు లిచ్ఛావీ, శాక్య వంటి గణసత్తాకములు. వీనిలో గణసభ్యులు కానివారికి ఎట్టి హక్కులు లేవు. కాని, గణసభ్యులకు మాత్రం ప్రజాస్వామ్య హక్కులుండేవి. రాజును ప్రజలే ఎన్నుకునేవారు. గ్రీసులోని నగరరాజ్యములలోని ప్రజాస్వామ్యం వంటిది వీనిలో ఉండేది. అట్టి గణసత్తాక రాజ్యమైన శాక్య వంశంలో జన్మించిన గౌతముడు ఆ ప్రజాస్వామ్య భావాలను పూర్తిగా స్వీకరించాడు.

కాని ఈ గణసత్తాక రాజ్యాలు అన్యోన్యకలహాల ఫలితంగానూ, కోసల, మగధ, కాశీవంటి పెద్దరాజ్యాల తాకిడివల్లనూ క్షీణించసాగినవి. గణసత్తాక ప్రజాస్వామ్యంలో కొన్ని విపరీత ధోరణులు పొడగట్టినవి.

మగధరాజైన బింబిసారుడు, కోసలరాజైన ప్రసేనజిత్తు; ఇద్దరూ బలవంతులైన రాజులు. వీరిది నిరంకుశ రాచరికము. వీ రిద్దరూ ఆఖరుకు బుద్ధుని బోధలవైపు ఆకర్షింపబడ్డారు.

కోట్లకు పడగలెత్తిన వైశ్యులు, అనాథపిండకుడు, యాశుడు మొదలైనవా రున్నారు. ఏకనాలుడనే భూస్వామి 500 ఎకరాల భూమిని సాగుచేసేవాడు. వర్తకులవద్ద, భూస్వాములవద్ద, రాజులవద్ద వేల సంఖ్యలో బానిస లుండేవారు. నాలుగు రకాలుగా బానిసలను స్వీకరించేవారని విధుర పండితజాతకం తెలియజేస్తున్నది. (1) బానిసల సంతానం, (2) డబ్బుతో కొనుక్కొన్న బానిసలు, (3) దౌర్జన్యంగా బానిసలుగా చేయబడ్డవారు (4) పొట్టగడవక తమంతట తాము బానిసలైనవారు.

బానిస వ్యవస్థతోడు దారుణమైన వర్ణవ్యత్యాసా లుండనే ఉన్నాయి.

ఇట్టి సాంఘిక వ్యవస్థలో బుద్ధుడు బోధించిన సమానత్వమూ, స్వేచ్ఛ, ప్రేమ, శాంతి – సిద్ధాంతం అభ్యుదయకరపాత్ర వహించింది. ఏదీ శాశ్వతం కాదు, ప్రతిదీ మారుతుంటున్న బోధ, పాత సమాజం నశించి, కొత్త సమాజం ఉద్భవించడం తప్పదు, సహజం అన్న భావాన్ని కలిగించింది. సమాజంలో అట్టడుగున పడివున్న వ్యక్తులతో మొదలుపెట్టి క్రమంగా ధనికులు, వైశ్యులు, రాజులు బుద్ధమతాన్ని ఆదరించారు. 'బహుజన హితాయ, బహుజన సుఖాయ' అను బుద్ధుని సందేశం అన్ని వర్గాలవారిని క్రమంగా ఆకర్షించింది. మంగలి ఉపాలి, రథసారథి ఛన్నుడు, గోపాలకుడైన నందుడు, మత్స్యకారుని కుమారుడు సతి, చాప, పున్న, పున్నిక-మొదలైన బానిసపుత్రులు – సుమంగళీ మాత, సుభ మొదలైన స్త్రీలు-వీరంతా పీడిత ప్రజల నుండి బౌద్ధమతంవైపు ఆకర్షింపబడినవారు. థేరగాథ (భిక్షువులగాథలు), థేరిగాథ (భిక్షుణీగాథలు) లను పరిశీలించితే బౌద్ధభిక్షువులలో అత్యధిక సంఖ్యాకులు పేదప్రజలనుండి ఆకర్షింపబడినవారేనని బోధపడగలదు.

మేధావివర్గమునుండి పెక్కుమంది ఆకర్షింపబడ్డారు. రాజగృహంలో బుద్ధుడు నివసిస్తుండగా, శాలి పుత్ర, మొగ్గిలాన అను జైనశిష్యులు బుద్ధుని శిష్యుడైన అసాజీని కలుసుకొని, మీగురువుగారి ప్రధాన సిద్ధాంత మేమని ప్రశ్నించారట. అంతట భిక్షువు అసాజీ ఇలా అన్నాడు: "ప్రతిదానికీ ఒక కారణం ఉంది. సృష్టిఅంతా కార్యకారణమయం. ఇదే తథాగతుని సిద్ధాంతం". అంతట శాలిపుత్ర మొగ్గలానులు, రాజగృహంలోని జైన శిష్యులందరూ బుద్ధుని దర్శించి శిష్యులైనారట.

గతతార్కిక సూత్రమైన ప్రతీత్యసముత్పాదవాదం నాటి మేధావులను హెచ్చుగా ఆకర్షించిందనటానికి ఇది నిదర్శనం.

రాజుల మధ్య అనవసర కలహాలు అనేకం జరుగుతుండేవి. అవి దారుణ యుద్ధాలుగా పరిణమించేవి. శోణావతీనది నీటికొరకై శాక్యులు, కోలీయులు – ఇద్దరు ఇరుగు పొరుగు ప్రజలు యుద్ధానికి సన్నద్ధులు కాగా, బుద్ధుడు యుద్ధభూమిలోనికి వెళ్ళి ఉభయులను మందలించి శాంతిని చేకూర్చాడు. లిచ్ఛవీ రాజ్యాన్ని నాశనం చేయుటానికి మగధరాజైన అజాతశత్రు దండె

త్రిబోగా బుద్ధుడు వారించాడు. శాక్య దేశంపై ప్రసేనజిత్తు కుమారుడైన విధూధభుడు దండెత్తి, శాక్య స్త్రీ, పురుష. శిశువు లందరినీ దారుణంగా హత్యచేసి, రక్తపు టేరులను ప్రవహింపజేసిన వార్తను కుసినార ప్రాంతంలో ఉన్న గౌతముడు విని ఎంతో ఖేదించాడు. తానీ యుద్ధాన్ని ఆపలేకపోతినే అని క్లేశపడ్డాడు.

**శాంతి, ప్రేమ సూత్రాలు ఇట్టి ఆంతరంగిక కలహాలు ప్రజ్వరిల్లుతున్న సమయంలో అభ్యుదయపాత్ర వహించినవని భావించటానికి ఎట్టి సంకోచం అవసరంలేదు.**

అనాథ పిండకుడు, యాసుడు మొదలైన ధనికులు బుద్ధుని శిష్యులైనారంటే, బుద్ధుని బోధలు అన్నివర్గాలలోని ఉదారవాదులను సైతం ఎలా ఆకర్షించాయో బోధపడగలదు.

గణతంత్ర ప్రజాస్వామ్యంలోని కొన్ని అమానుష ఆచారాలను బుద్ధుడు అంతంచేశాడు. శ్రావస్తినగరంలో అంబపలి అను అపురూపసుందరి ఒక వైశ్య స్త్రీ ఉండేది. ఆమెను వివాహమాడటానికి పెక్కుమంది ముందుకు రాసాగారు. ఈ వివాదాన్ని పరిష్కరించలేక ఆమె తండ్రి వైశాలి పరిషత్తుకు నివేదించగా వారు అంబపలివంటి అపురూపసుందరి అందరికీ అందుబాటులో ఉండే 'గణిక'గా జీవించాలని శాసించారు. గణతంత్ర వివాహపద్ధతియొక్క అవశేషము ఎంత క్రూరంగా ఉండేదో ఈ ఉదాహరణ తెలియజేస్తుంది.

తన ఇష్టానికి వ్యతిరేకంగా అంబపలి వేశ్యాజీవనము గడపసాగింది. తన జీవితాన్ని ఉద్ధరించగలవాడు ఒక్క గౌతముడేనని ఎదురుచూడసాగింది. బుద్ధుడు వైశాలి నగరం చేరగానే, అంబపలి బుద్ధుని దర్శించి తన విషాదగాథ వెలిబుచ్చింది. బుద్ధుడు వెంటనే వైశాలీ పరిషత్తు పెద్దల నందరినీ సమావేశపరచి వారెంతటి క్రూర కార్యం చేశారో వివరించారు. వారు పశ్చాత్తాప పడ్డారు. అంబపలి బౌద్ధభిక్షుణి అయింది.

బౌద్ధమతంలో తొణికిసలాడే మానవత్వాం, కరుణ, ప్రేమలను ఉదహరించటానికి ఇట్టి గాథ లెన్నైనా చెప్పవచ్చు. అంగుళిమాలుని కథ మరొకటి.

మన దేశంలోనే గాక, బౌద్ధమతం వ్యాపించిన దేశాలన్నటిలోనూ ఇట్టి సామాజిక ప్రయోజనమే కలిగింది.

చైనాలో బౌద్ధమతం కలిగించిన ప్రభావాన్ని గురించి, చౌ పూ-చో అను రచయిత ఇలా వ్రాస్తున్నాడు :.

"బౌద్ధమతంచైనాదేశంలోకి క్రీస్తుకుపూర్వమే ప్రవేశించింది. ఆ రోజులలో చైనా ఆంతరంగిక కలహాలతో సతమత మవుతుండేది. ఆ స్థితిలో బుద్ధుని కార్య కారణవాదం, దుఃఖ నివారణమార్గం, . అపారమైన మానవప్రేమ, కరుణ, సర్వమానవ సౌభ్రాతృత్వం, ధనికులను, పేదలను - అందరినీ ఎంతో ఆకర్షించింది." (చైనా రీకన్‌స్ట్రక్స్ - ఏప్రిల్ 1956)

మంగోలియాలో బౌద్ధమతం కలిగించిన ప్రభావాన్ని గురించి, ఢిల్లీలో జరిగిన బౌద్ధ సంగీతికి హాజరైన నైదాని ఎల్ ధేంషెల్ లామా ఇలా అంటున్నారు:

బౌద్ధుని దుఃఖనివారణమార్గం, అపారమైన మానవ ప్రేమ కరుణలతో నిండి ఉన్నది. మానవతాదృష్టికి బుద్ధుని బోధలు పరాకాష్ట. బౌద్ధమతం మంగోలియాలో ప్రవేశించి, ప్రజల జీవితాన్ని ఎంతో మార్చింది. నైతిక దృక్పథాన్ని ఏర్పరచేందుకు కళ, విద్య, సంస్కృతి మొదలైనవాని అభివృద్ధికి ఇది ఎంతో తోడ్పడ్డది. ఆసియా ప్రజలందరికీ వెలుగు చూపినవాడు బుద్ధుడు."

బౌద్ధమత గ్రంథాలు శతాధికంగా, మంగోలియాలో వెలువడి, మంగోలియా భాషాపరిణామానికి తోడ్పడ్డాయనికూడా ఆయన పేర్కొన్నాడు.

బానిస సమాజంనుండి అర్ధబానిస సమాజంలోనికి భారతదేశం పరివర్తనచెందుతున్న సమయంలో బౌద్ధమతం తలఎత్తింది. చైనాలోకూడా దాదాపు అదే కాలంలో అదే రకమైన సామాజిక పరివర్తన సాగుతున్నది. చైనాలో క్రీ. పూ. 400 ప్రాంతంలో అర్ధబానిస విధానం తలఎత్త నారంభించిందని, ప్రసిద్ధ చారిత్రకుడు, కూ మో-జో అభిప్రాయపడుతున్నాడు.

ఈసంధి కాలంలో ఏర్పడిన బౌద్ధ మతంలోని, సమానత్వాం, స్వేచ్ఛ, ప్రేమ, శాంతి, కరుణ, సామాజిక పరిణామానికి దోహదంచేశాయి. పీడిత ప్రజలకు ఆశ, విశ్వాసము, ధనికవర్గాలకు ప్రేమ, కరుణ బోధించి, సామాజిక పరిణామానికి తోడ్పడ్డాయి. కనుకనే ఇలా అన్నారు:

**"సమాజ చరిత్ర ఒక దశనుండి మరొక దశకు మారే సంధియుగాలలో అప్పుడప్పుడు నూతన మతాలు తలఎత్తటం జరిగింది.**

క్రైస్తవమతము, ఇస్లాము, బౌద్ధమతము ఈ మూడింటి విషయాల్లోను పై సూత్రం వర్తిస్తుంది" (లిడ్విగ్ ఫ్యూర్ బా 45 వ పేజీ).

బౌద్ధ గతితర్కాన్ని గురించి ఎంగెల్సు ఇలా అన్నాడు:

"భావాలు ఎలా ఏర్పడతాయన్న జిజ్ఞాస ప్రారంభమైనమీదటనే గతితార్కిక దృష్టి ఏర్పడగలదు. మానవుల ఉన్నత నాగరికతాస్థాయికి చేరుకున్న మీదటనే ఇది జరగగలదు. (బౌద్ధ తాత్వికులు, గ్రీకు తాత్వికులు)" [ప్రకృతి- గతితర్కం 106 వ పేజీ].

## భావవాదమా? భౌతికవాదమా?

పరబ్రహ్మను, ఆత్మను, గౌతముడు నిరాకరించిన విషయం నిర్వివాదం. పరిణామ క్రమంలో భావమా, పదార్థమా ఏది ముందు అనే సమస్యకు గౌతముడు ఏ సమాధానం ఇచ్చాడో చూదాం?

సంయుక్త నికాయంలో ఇలా ఉంది:

"రెండు కట్టెపుల్లలు ఒకదానిపై ఒకటి ఆధారపడి నిలబడినట్లే, ఓ మిత్రుడా, చైతన్యం, పదార్థంలోనుంచి (నామరూపం) ఆవిర్భవిస్తుంది. పదార్థం, చైతన్యంలోనుండి ఆవిర్భవిస్తుంది. ఈ రెండూ పరస్పరాధారాలు. ఈ గొలుసు ఇలా సాగిపోతుంది."

పదార్థము ముందా, చైతన్యము ముందా అను ప్రశ్నకు బౌద్ధంలో సూటి సమాధానంలేదు. ఈ విషయంలోకూడా గౌతముడు మధ్యేమార్గ మవలంబించాడు.

ఈ విషయంలో చార్వాకుల భౌతికవాద స్థాయిని బుద్ధుడు అందుకోలేక పోయాడనేది స్పష్టం. పదార్థం ప్రాథమికం అని అంగీకరించడం అంటే, తిరిగి మరొక స్థిరవస్తువును (Unchanging category) ప్రపంచ పరిణామానికి మూలమని భావించటమే అవుతుందని గౌతముని భావం. పరబ్రహ్మ, ఆత్మ అను జడాత్మక భావాలను బుద్ధుడు ఎలా త్రోసిపుచ్చాడో పదార్థాన్ని కూడా అలాగే త్రోసిపుచ్చాడా అనిపిస్తుంది.

పదార్థము ప్రాథమికము అని అంగీకరించక పోయినా, పదార్థము వాస్తవము (Real) అని అంగీకరించుటలో బుద్ధునికే గాక, బౌద్ధధోరణుల కన్నింటికీ ఎట్టి సంకోచములేదు. పదార్థము, చైతన్యము రెండూ వాస్తవమేనని, పరస్పరాధారంగా ఇవి మార్పుచెందుతాయని వీరంటారు.

పదార్థ ప్రాథమికతను గురించిన ఈ అస్పష్టత, బుద్ధుని మరణానంతరం, వేర్వేరు తాత్విక ధోరణులకు త్రోవతీసింది. వైభాషిక, సౌత్రాంతిక ధోరణులు మరింతగా భౌతికవాదంవైపు మొగ్గాయి. మాధ్యమిక వాద, విజ్ఞానవాదములు భావవాదంవైపు మొగ్గాయి. బుద్ధుని అంతేవాసులలో ముఖ్యులైన శారిపుత్రి), మొగ్గలాను లిద్దరు వైభాషిక ధోరణికి చెందినవారే.

వైభాషికుల గ్రంథమైన అభిధమ్మకోశం ఇలా చెబుతున్నది. "రంగు, వాసన, రుచి, స్పర్శ ఈ నాలుగు లక్షణాలతో కూడుకున్నది పదార్థం. పదార్థంయొక్క అత్యల్పరూపం పరమాణువు. ఇది అవిభాజ్యం. కాని శాశ్వతంకాదు. ఇది ఒక క్షణికమైన మెరుపువంటిది."

పై నిర్వచనంపై వ్యాఖ్యానిస్తూ, రష్యన్ తత్వవేత్త చెర్ బట్ స్కీ ఇలా అన్నారు:

"పదార్థంయొక్క రూపాలు వాని కార్యాచరణ ద్వారా మాత్రమే వ్యక్తమౌతాయి. కనుక అవి వస్తువులు కావు, శక్తిరూపాలుమాత్రమే". (Not substances but energy).

వైభాషికుల సిద్ధాంతం భౌతికవాదం అని చెప్పటానికి సందేహం అక్కరలేదు. అలాగే సౌత్రాంతిక వాదంకూడా. కాని, మాధ్యమిక, యోగాచార వాదములు ఇందుకు విరుద్ధములు.

కర్మ, పునర్జన్మ, నిర్వాణం అను భావాలు కూడా గౌతముడు ఎలా వాడాడో గమనించాలి. బుద్ధుని దృష్టిలో కర్మ అంటే మత కర్మకాదు. వెనుకటి జన్మలోచేసిన కర్మ అని కూడా కాదు. వర్తమాన కాలంలో మానవుడు చేస్తున్నపని కర్మ. స్వయంకృషి ద్వారానే మానవుడు ఔన్నత్యాన్ని పొందగలడు అనే భావాన్ని బుద్ధుడు కర్మసిద్ధాంతంద్వారా వివరించాడు.

అయితే బుద్ధుని తర్వాత త్వరలోనే కర్మఅంటే వెనకటిజన్మలో చేసిన కర్మ అను అర్థం వ్యాపించింది.

నిర్వాణం అనుమాటను బుద్ధుడు, రాగద్వేష రహితమైన మానసికస్థితిని తెలియజేయుటకు వుపయోగించాడు. ప్రతివ్యక్తి అట్టిస్థితిని పొందుటకు కృషి చేయాలన్నాడు.

పునర్జన్మ భావం మొదట్లో బుద్ధుడు ప్రవచించలేదు. కాని ఆయన బోధలలోని అస్పష్టత అతిత్వరలోనే పునర్జన్మవాదానికి త్రోవతీసింది. పునర్జన్మ,

నిర్వాణం ఈ రెండు భావాలు క్రమంగా వృద్ధి చెంది, గతి తర్కానికి విరుద్ధమైన జడాత్మక ధోరణులను తిరిగి బౌద్ధమతంలో ప్రవేశపెట్టాయి.

కనుక గౌతముడు ప్రవచించిన ఆది బౌద్ధమతాన్ని, భావవాదమని కాని, భౌతికవాదమని నామకరణం చేయుట సరికాదు. ఈ రెంటికీ మధ్యేమార్గంలో, భౌతికవాదానికి సన్నిహితమైన గతితార్కిక హేతువాద ధోరణి (Dialectical rationalism) గా భావించవచ్చునని అనుకుంటాను.

## బుద్ధుని మహనీయత

గౌతముడు భారతదేశంలో ఉద్భవించిన మహాపురుషులలో అగ్రగణ్యుడు. గౌతముని బోధలలో వినయము, సౌశీల్యము, అణుకువ, అడుగడుగున వ్యక్తమౌతూ ఉంటాయి, ఏ ఒక్కదానినీ, చివరకు తన బోధలను సైతం అంధప్రాయంగా అనుసరించవద్దని బుద్ధుడు పదే పదే తన శిష్యులను హెచ్చరించాడు.

"ఎవరో గొప్పవారు చెప్పారని దేనినీ అంగీకరించవద్దు. సంప్రదాయ సిద్ధంగానూ, అనుశ్రుతంగానూ వస్తున్నంత మాత్రాన దేనినీ విశ్వసించవద్దు. గ్రంథస్థమై ఉన్నది కదా అని ఏ నిర్వచనాన్ని స్వీకరించవద్దు. నీ ఆచార్యుడు చెప్పినంత మాత్రాన అదంతా నిజమేనని అనుకోవద్దు. బౌద్ధులు చూపగలిగింది బాటమాత్రమే. ఎవరి సత్యసిద్ధి కోసం వారే శ్రమించాలి" అని ఒక సందర్భంలో బుద్ధుడు తెలియజేశాడు.

అన్ని విషయాలకు తాను సమాధానం చెప్పగలనని గౌతముడు ఎన్నడూ అనలేదు. తనకు తెలిసిన విషయాలేవో చెప్పుతున్నానని, మిగతా విషయాలకు సమాధానాలు కాలగర్భంలో ఇమిడి ఉన్నాయని ఆయన ఒక సందర్భంలో చెప్పాడు. "ఓ మాలుక్య పుత్రా, ఏవైతే బోధపడలేదో, వాటిని అలాగే బోధపడనట్లే ఉండనిమ్ము. ఏవైతే తెలిసినవో, వానినే స్వీకరించుము" (మధ్యమనికాయ).

తన పరినిర్వాణసమయంలో, శోకతప్తుడైన ఆనందుని చూసి గౌతముడు ఇలా అంటున్నాడు: "తథాగతుడు మరణిస్తున్నాడని విచారించకు ఆనందా? పుట్టినది ప్రతిదీ గిట్టక తప్పదుకదా. వెళ్ళి నీ ధర్మం ఆచరించు...ఇది వసంతకాలం. చుట్టూ ఆకులు అశేషంగా రాలుతున్నాయి. వీటిని లెక్కపెట్టటం సాధ్యమా? కాదు. అలాగే, ఆనందా నేను మీకు కొన్ని ధర్మాలను మాత్రమే తెలియజేశాను. ఇవిగాక ఇంకా కేలాది ధర్మాలు తెలుసుకోవలసినవి ఉన్నాయి. అవన్నీ మీరే తెలుసుకోవాలి. మీకు మీరే మార్గదర్శకులు కావాలి".

ఒకప్పుడు మానవ మేధస్సును ఉన్నత పథానికి కొనిపోయిన ఆలోచనా ధోరణులు, కాలక్రమేణ పిడివాదంగా రూపొంది సృజనాత్మక ధోరణిలోపించి, నిర్జీవమై పోవటం చరిత్రలో తరచు జరుగుతున్న వాస్తవవిషయం. బౌద్ధ గతి తర్కానికీ అదే అవస్థ ఏర్పడ్డది. నాగార్జునునివంటి కొందరు ఈ గతితార్కిక దృష్టిని భావవాదపరిధిలోనే ఐనప్పటికి, పెంపు చేశారు. కాని కాలక్రమేణ బౌద్ధతత్వశాస్త్రం కంటె బౌద్ధమతం పైచేయిని సంపాదించింది. ఆ మతంకూడా సాంప్రదాయకమైన కర్మకాండను పూజావిధులను అలవర్చుకున్నది. క్రీ.శ. 600 తర్వాత అనగా బుద్ధుని వాణి భారతదేశంలో వినిపించిన వేయిసంవత్సరాలకు, బౌద్ధమతం భారత దేశంలో దాదాపు అదృశ్యమైంది. కాని శాంతి, ప్రేమ, సహనం వంటి నైతికసూత్రాల, పరిణామశీలమైన జగత్తుకు అనుగుణ్యంగా ఎప్పటికప్పుడు సర్దుకుంటూ ఉండాలన్న జీవిత దృక్పథం - భారతీయ సంస్కృతిలో అంతర్భాగాలైనవి. బౌద్ధం భారత జాతికి చేసిన మహోపకారం ఇదే.



# మహాభారతం : భగవద్గీత

## ఆయా నాటి సామాజిక పరిస్థితులలో వ్యత్యాసం

జంబుల రామచంద్రా రెడ్డి

మహాభారత యుద్ధకాలానికి పూర్వం భారతదేశం సామూహిక జీవిత విధానాన్ని కల్గియుండేదనీ, దేశంలోని పలు ప్రదేశాలలోనూ, దేశపు ఉత్తర సరిహద్దులలోనూ సామూహిక జీవిత విధానాలు సాగుతూండేవనీ పాండురాజు (ఆదిపర్వం) కుంతీ మాద్రులకు తెలియజేశాడు. ఈ సామూహిక గణసంఘాలు రాజరికాలకంటే చాల బలీయమైనవిగా వున్నట్లు భీష్ముడు (శాంతిపర్వం) ధర్మరాజుకు తెలియజేశాడు

అయితే మహాభారత కాలానికిపూర్వం చాలకాలం క్రిందటే దేశంలో రాచరిక లేక క్షత్రియ పరిపాలనకు బీజము లేర్పడి, అవి క్రమక్రమంగా వృద్ధిపొందుచూ వచ్చినట్లు కారణాలతోసహా శాంతిపర్వమే వర్ణిస్తూంది. అంటే, దేశంలో ఒకవైపు ప్రాచ్యస్మృతి చిహ్నాలైన సామూహిక గణసంఘాలూ, మరొకవైపు రాచరిక పరిపాలనా వ్యవస్థలూ కొనసాగుతున్న కాలమే మహాభారత కాలమనేది స్పష్టం.

ఈ రాచరిక కుటుంబాలలో కురువంశంకూడా చాల దీర్ఘకాలంగా పరిపాలన సాగించినట్టిదే. భారత కథనానుసారం పురూరవ చక్రవర్తితో ప్రారంభమైన కురువంశంలో యయాతి, దుష్యంత, భరతాదులవంటి ప్రతిభావంతులుకాక అనేకమంది రాజ్యపాలన చేశారు. భారతకథకు సంబంధించినంతవరకు భీష్ముని బాహుబలంద్వారా కొంతవరకు పేరుప్రతిష్టలు, అధికారదర్పం సంతరించుకున్న కురువంశం పాండురాజుయొక్క నిర్విరామ తీవ్రకృషి ఫలితంగా చిన్న చిన్న రాచరికాలపై ఆధిపత్యాన్ని పొంది సువిశాలమైన సామ్రాజ్యంగా పరిణమించినట్లు ఆదిపర్వం తెలియజేస్తూంది.

అయితే రాచరిక వ్యవస్థయొక్క పునాదులు ఏమిటి ? రాచరిక వ్యవస్థానిర్మాణాన్ని మనుశాస్త్రం ఈ విధంగా తెలియజేస్తూంది. "ఒక్కొక్క గ్రామానికి ఒక్క రాజపురుషునీ, అలాంటి పదిగ్రామాలపైన ఒకనినీ, యిరువది గ్రామాలపైన మూడవవానినీ, నూరు గ్రామాలపైన నాల్గవవానినీ, వెయ్యి గ్రామాలపైన అయిదవవానినీ వారి వారి అధికారులతో రాజపురుషులను నియమించవలె. గ్రామాధిపతి మొదలుకొని ప్రతి అధికారి తన ప్రాంతానికి సంబంధించినంతవరకు న్యాయాన్యాయాలను పరిష్కరించాలి. ఆ పరిష్కార వివరణను క్రిందినుంచిపైకి క్రమంగా తెలియపరుస్తూ పోవాలి (మ॥ 7అ/116-117-120). అయితే ఈసూత్రాలను తెలియజేసేముందే ఒక ప్రాణిని హింసించటం ద్వారా (పలువిధముల) ఆ ప్రాణియొక్క శరీరం ఏవిధముగా కుషించి పోతున్నదో అదేవిధంగా రాజ్యానికి ప్రాణమైన ప్రజలను దుర్బలుల చేయటంద్వారా ఆ రాజ్యముయొక్క రాజు, అతని పరివారము, సంపత్తి వగైరా నష్టముల పాలవుతారు కాబట్టి, రాజు ప్రజాపాలనావిషయంలో అప్రమత్తుడుగా వ్యవహరించాలి" అంటూ అదే అధ్యాయంలో 110-111-112 శ్లోకాలు తెలియజేస్తున్నాయి.

మహాభారత కథనానుసారం కురువంశంయొక్క రాబడి వున్నతస్థాయికి చేరుకున్నట్లు యీసూక్తి తెలియజేస్తూవుంది. "దుర్యోధనుని దర్శనార్థంవచ్చేసామంతుల కిరీటములు రాపిడికల్గి, తద్వారా క్రిందరాలిన సువర్ణపు భస్మంరోజు1కి యిరువది బారువలబంగారముగా తయారయే" దట - యీ వర్ణనలో అలంకారమో, అతిశయోక్తో ఏదో ఒక టుండినప్పటికీ, కురువంశపు ఆధిపత్యాన్నీ, సామంతులద్వారావచ్చే రాబడులనూ యీ సూక్తి స్పష్టంచేస్తూంది. కానీ మనుశాస్త్రం ప్రకారం రాజ్యశ్రేయస్సుదృష్ట్యా ఉండవలసిన రాజ్యపాలనావ్యవస్థమాత్రం మనకు అగుపించదు. రాజ్యసభాసదులయొక్క అర్హతలనూ, రాజుయొక్క అర్హతలనూ, సభాసదుల అభిప్రాయాన్నీ రాజు జవదాటేం

దుకు వీలులేదనీ, సభాసదుల సలహాలను అక్షరాలా అమలుజరపాలనీ వగైరా విషయాలు ఏడవ అధ్యాయం ప్రారంభంలోనే తెలియజేయబడ్డాయి.

కురువంశపు రాజ్యౌన్నత్యాన్ని తెలియజేసేందుకు కావలసిన సమస్తమూ సంప్రాప్తమౌతూంది. కానీ, దుర్యోధనుని ఆధిపత్యంలో సభాసదుల అభిప్రాయాలకు భిన్నంగా వ్యవహరించటమే మనకు అగుపిస్తుంది. అంతేకాకుండా రాచరిక వ్యవస్థకు వుండవలసిన లక్షణాలే కేంద్ర వ్యవస్థలో అస్తవ్యస్తంగా తయారయిన విషయాన్ని కూడా మహాభారతం తెలియజేస్తుంది.

మనుశాస్త్రంలో తెలియజేసిన సుస్థిరరాజ్య వ్యవస్థ ఛిన్నాభిన్నమైపోయింది. గ్రామాధికారులూ, వారిపై అధికారులూ, వారికి సంబంధించినంతవరకు స్వతంత్రులైపోయారు. ప్రజాక్షేమం అవసరమైంది. రాబడుల కొరకు పీడన అధికమయింది. కేంద్రానికికూడా సంపత్తే ప్రధానమయింది. కేంద్రాన్ని సంతృప్తిపరచడమే క్రింది పాలకుల కర్తవ్యమైంది. ఈ విధంగా కురువంశరాజ్య వ్యవస్థ సుసంపన్నంగా చలామణీ అవసాగింది.

ఈ విధంగా ప్రజలు దోపిడీలకు గురిఅయి నిత్యమూ నూతన దారిద్ర్యపరిధుల్లోకి నెట్టబడుతున్న పరిస్థితులలో మహాభారతయుద్ధం సంప్రాప్తమయింది.

## యుద్ధ స్వరూప — స్వభావాలు

యుద్ధ సమయాలలో ప్రజలు పాలకులకు ఆర్థికంగానూ, సైనికంగానూ సహాయాన్నివ్వాలని మనుశాస్త్రం చెప్పింది. అయితే మనుశాస్త్రం పేర్కొన్న యుద్ధాలకూ, మహాభారత యుద్ధానికీ ఎక్కడా పోలికలే అగుపించవు. ఇరుగుపొరుగు రాచరికాలద్వారా ప్రమాద మేర్పడినపుడూ, ప్రాంతీయ హరణ ప్రయత్నాలలోనూ, లేదా స్వరాష్ట్రవిస్తరణ వగైరాలలో సామదానభేద దండోపాయముల నుపయోగించీ, తప్పనిసరి అయినపుడు యుద్ధ ప్రయత్నాలు తప్పు లేదని మనుశాస్త్రం అనుమతిస్తుంది. ఇలాంటి యుద్ధాల ప్రయోజనం ఏదోఒక రూపంలో ప్రజలకు సన్నిహితత్వాన్ని కల్గిఉంటుంది. అంతేకాకుండా, యిలాంటి యుద్ధాలలో విజయుడయిన రాజు సైనికుల సంపాదనలో పదహారవవంతు మాత్రమే తీసుకొని తతిమ్మా వస్తువులను సైనికులకే యిచ్చివేయవలెననీ, మరణించిన సైనికుల తల్లి లేక భార్యా లేక సంతానానికి ఆ వస్తువులనుచేర్చి వారి రక్షణభారం వహించవలెననీకూడా నిర్దేశించింది.

కాని మహాభారత యుద్ధానికి యీ ప్రయోజనాలు లేకపోయినప్పటికీ సైనిక సమీకరణ జరిగింది. యుద్ధం ముగిసింది. దేశం సర్వనాశనమైంది. ఈ యుద్ధములో పాల్గొన్నవారు రథచోదకులు, మావటీలతో కలిసి నలుబదిమూడు లక్షల పైచిలుకే అయినప్పటికీ నాటి దేశ జనసంఖ్యనుబట్టి యీ సంఖ్యను పెద్దమొత్తంగానే పరిగణించాల్సి వుంటుంది.

ఈ మహాయుద్ధంలో దేశంలోని రాచరికాలన్నీ అటు యిటు చాలావరకు కేంద్రీకరించబడ్డాయి. యుద్ధతంత్ర సూత్రాలప్రకారం యీ రాచరికాలకు సంబంధించిన ప్రాంతాలలోని యువకులందరూ యీ మారణహోమంలోకి లాగబడ్డారు. మహాభారత కథనానుసారం యీ యుద్ధంలో మరణించినవారు పోగా, అంగవికలులు, క్షతగాత్రులు మాత్రమే ఏ కొద్ది సంఖ్యలోనో మిగిలారు. వీరు మిగలటంఅనేది దేశానికి లేక వారి వారి కుటుంబాలకు అదనపుభారం అయింది.

కాయకష్టం చేయవలసిన యువకులు లేకపోవటంతోనూ, హతశేషులయిన నిర్భాగ్యులు తమ కుటుంబాలకు భారం కావటంతోనూ కుటుంబాలు విచ్ఛిన్నమయిపోయాయి. ప్రజాజీవితం దుర్భరమైపోయింది. సామంతుల దౌర్జన్యాలకు ఆక్రందనలు మినహా సువర్ణం సంప్రాప్తమయ్యేదశ దాటిపోయింది. ఖాళీ అయిన రాజబొక్కసమును తిరిగి నింపే అవకాశాలు కనుచూపుమేరలో అగుపించటంలేదు. కాన ధర్మరాజు తన రాజ్యాధికారాన్ని తిరిగి ప్రపంచంచేత గుర్తింపజేయాలంటే అశ్వమేధయాగం చేయాలి. ఛిన్నాభిన్నమయిన సామంతులందరినీ ఒక కొలికికి తేవాలి. పాలకుని ఔన్నత్యాన్ని దానధర్మాదులద్వారా ప్రపంచానికి చాటాలి. కాని చితికిపోయిన ప్రజాజీవితాన్ని ఏ విధంగా సరిదిద్దాలి? ప్రజాపరిపాలనను ఏవిధంగా సుస్థిరం చేయాలి? ప్రజల మనోబాధల నివృత్తికి మార్గాలేమిటి? వగైరా ప్రశ్నలు ధర్మరాజుకు పట్టలేదు. పట్టవలసిన అవుసరంకూడాలేదు! అది నిరంకుశ రాచరిక ప్రభావ ఫలితం.

ఎలాగైతేనేమి ధర్మరాజు ద్రవ్యాన్ని సంపాదించగల్గాడు. దిగ్విజయాలు సాధించాడు. అస్తవ్యస్తమైన సామంతకూటమిని పునః స్థాపితం చేశాడు. విరివిగా దానధర్మాలు చేశాడు. అంటే, అశ్వమేధయాగంద్వారా ప్రజలను రాచరికంవైపు ఆకర్షించేందుకు అవసరమైన ప్రయత్నమంతా చేశాడు.

కానీ యుద్ధఫలితాలు లొసంగిన భయానక బీభత్సాల నుంచి ప్రజలు యింకా తేరుకోనలేదు. వారి జీవిత స్థితిగతులు చక్కబడే మార్గం ధర్మరాజు ప్రయత్నంలోగానీ, మరొక విధంగాగానీ వారికి అగుపించటం లేదు. అట్టి ఆశనుకూడా వారు కోల్పోయారు. ఈ పరిస్థితులలో ధర్మరాజు ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరుచందమే అయినది. అంతేకాదు; ప్రజలలో ఆవరించిన జుగుప్స, నిరాశావాతావరణం యినుమడించింది. రాచరికంపై వీహ్యాభావం ద్విగుణీకృత మయింది. భక్తిప్రపత్తులు మటుమాయమయ్యాయి. యుద్ధఫలితాలగురించీ, ధర్మరాజుచర్యల్ని గురించీ బహిరంగంగానే ఆడిపోసుకోనటం ప్రారంభమైంది. ఈ వాతావరణం ఎంతవరకు వచ్చిందంటే, ధర్మరాజు రాజదర్పంలో కొలువుకూటమునకు వెళ్లుతున్న సమయంలో ఒక సాధారణ పౌరుడు (చార్వాకుడు) ప్రజల అభిమతంగా ధర్మరాజు సమక్షంలోకి వచ్చి, ధర్మరాజు చర్యల్ని నిశితంగా విమర్శించేటందుకు కూడా వెనుకాడలేదు (ఈ విషయాలను శాంతిపర్వం ప్రథమాశ్వాసం తెలియజేస్తూ వుంది). కానీ ధర్మరాజు ప్రజావాణిని ఆలకించేటందుకుగానీ, ఆలకించి ఏమైనా చేయగల పరిస్థితులలోగానీ లేడు. ప్రజావాణి అణచబడింది. పాలకవర్గ (బ్రాహ్మణ) ఆధిక్యత ముందుకొచ్చింది (శాంతిపర్వం ప్రథమాశ్వాసం).

మహాభారత యుద్ధానికిపూర్వం కురువంశం సంతరించుకొన్న పేరుప్రతిష్ఠలుగాని, కేంద్రీకృత సుస్థిర రాజ్య వ్యవస్థను పునఃస్థాపితం చేయటంగానీ యీ యుద్ధానంతరం కురువంశానికి సాధ్యంకాకపోయిందనే విషయాన్ని భారతం తెలియజేస్తూంది. తర్వాతకూడా అజాతశత్రువు, బింబిసారుడు లాంటి ప్రతిభాన్వితులైన రాజులు మనకు అగుపించినప్పటికీ, బుద్ధుని అనంతర కాలానికి చెందిన అశోకునివరకు విశాల సామ్రాజ్యాన్ని సువ్యవస్థారూపంలో స్థాపించినవారుమాత్రం అగుపించరు.

## తాత్విక సంవిధానం

వేద సాహిత్యానంతరం తాత్విక పరిశోధకులు జీవుని అస్తిత్వాన్నిగురించీ, మానవ చైతన్యంయొక్క మూలస్వభావాన్నిగురించీ తీవ్ర పరిశోధనలు చేశారు. ఫలితంగా ఉపనిషత్ సాహిత్యంయొక్క సృష్టికి పునాదులు నిర్మించి కొంతవరకు ముందుకుసాగారు. కానీ ఉపనిషత్ భావాలకు బదులు వేద వాఙ్మయం ప్రాతిపదికగాగల వైదిక కర్మకాండలకే పాలకులు ఎక్కువ ప్రాముఖ్యత నివ్వటంతో, సామాన్య ప్రజలలో కూడా వైదిక కర్మకాండలకు ప్రతిరూపకంగా పలువిధములైన కర్మకాండలు ప్రబలాయి. ఈ పరిస్థితులలో ఉపనిషత్‌లు చాలా దీర్ఘకాలం మూలపడిపోయినట్లు వుపనిషత్‌లలోని రాజయోగస్వరూపాన్ని తిరిగి శ్రీకృష్ణుడు అర్జునునికి బోధపరచినట్లు గీత 4 అ. 1-3 శ్లోకాలు పేర్కొంటున్నాయి. అయితే శ్రీకృష్ణుడు అర్జునునికి యీ రాజయోగసారాన్ని ఎందుకు బోధపరచాల్సివచ్చింది? పైగా మనంచూచిన కారణాలన్నింటిదృష్ట్యా సమాజంలో మితిలేని తాత్విక వైరుధ్యాలమధ్య సంఘర్షణా, ధర్మాధర్మ విచక్షణలేని ఆచరణా, సామాజిక నియమాల ఉల్లంఘనఫలితంగా అమాయకప్రజల జీవిత స్థితిగతులు తారుమారవటం వగైరా కారణాలే రచయితను గీతారహస్య సృష్టికి నిమిత్తమాత్రునిగా చేశాయి. గీతాసృష్టికి రచయిత యిచ్చిన సమాధానం అర్జునుని విషాదం. కాబట్టి అర్జునుని పాత్రనుకూడా మనం పరిశీలించాలిసి వుంది.

## అర్జునుని పాత్ర

ఉత్తమక్షత్రియునిలో వుండవలసిన సర్వలక్షణాలు అర్జునునిలో వున్నాయి. కానీ కాలక్రమంలో అభూత కల్పనలను యీ పాత్రకు తగిలిస్తూరావటంతో, పాత్రౌచిత్యంసడలి, సహజత్వాన్ని కోల్పోయింది. ఉ॥ ఊర్వశీశాపానికి సంబంధించిన గాథ ప్రక్షిప్తమని భారతమే మన ముందుంచింది. అలాగే ఉత్తరగోగ్రహణములాంటి వాటిని కొన్నింటిని వర్జిస్తే మానవ సహజ లక్షణాలన్నీ యీ పాత్రకు అన్వయిస్తాయి.

ఇకపోతే శ్రీకృష్ణుని యుద్ధతంత్ర కౌశల్యం ద్వారాగానీ, మరేకారణమువలనగానీ, మహాభారత యుద్ధంవరకు అర్జునుడు విజయాన్ని చేపట్టాడేగానీ, అపజయము, భయము ఎరిగినవాడు కాడు. (జరాసంధుని వధ శ్రీకృష్ణుని యుద్ధతంత్ర కౌశల్యములోనిదే). మహాభారత యుద్ధసందర్భంలో కూడా అనంత ధైర్యసాహసములతో కౌరవులను జయించాలన్న దీక్షతో ఏడక్షౌహిణులసైన్యాన్ని సమకూర్చుకొనివచ్చి యుద్ధరంగంలో నిల్చున్న అర్జునునికి గీతారహస్యం బోధించబడింది. ఎందుకు? తనసైన్యం ఏడక్షౌహిణులూ, దుర్యోధనుని సైన్యం పదకొండక్షౌహిణులున్నదనే భీతితో కాదు; యుద్ధంద్వారా ఘోర హింసాపాతకము సంభవిస్తున్న భీతివల్లాకాదు, హఠాత్ హృదయ పరివర్తనద్వారా కల్గిన శాంత్యభిలాషతోనూకాదు; వైరాగ్యంవల్ల

అంతకన్నా కాదు. అసలు అర్జునుని స్వభావమే యిలాంటివాటికి అతీతమైనది. అంతేకాకుండా అర్జునుని పాత్రకూ, తాత్విక చర్చలకూ ఎలాంటి సంబంధము లేదుకూడా. ఈ విషయం గీతలో అర్జునుని ప్రశ్నలే స్పష్టం చేస్తున్నాయి.

అర్జునునికి కొన్ని ధర్మసంకటములు మాత్రమే ఎదురయ్యాయి. వాటికి మూలం స్వజన పరజనములమీద ఆధారపడి వుంటుంది. యిరువైపులా యుద్ధంచేసి ప్రాణా లర్పించేందుకుగాను నలుబది మూడులక్షల పైచిలుకు ప్రజాసమూహము, ఇరువది మూడులక్షల అరువదివేల పైచిలుకు గజతురగములు యీ మారణ హోమంలో ఆహుతి కాబోతున్నారనే ఆందోళన అర్జునునిలో వుత్పన్నం కాలేదు. ఎందుకంటే అది వృత్తిరీత్యా క్షత్రియుని లక్షణంకాదు. అర్జునుని ధర్మ సంకటములకు కారణభూతమైనది కొద్దిమందిగావున్న దుర్యోధనాదులు, భీష్మద్రోణులలాంటి వృద్ధ పూజనీయులు, మామ, సోదరులు, పుత్రులు, పౌత్రులు, మిత్రులు మాత్రమేనన్న విషయాన్ని గీత అ 1-26 వ శ్లోకం నుంచి 36 వ శ్లోకం వరకు స్పష్టం చేస్తూంది.

ఇంకా ముందుకుసాగితే అర్జునుని ధర్మసంకటములకు కారణం యిదికూడా కాదని స్పష్టమవుతుంది. ఈ యుద్ధంద్వారా అటు దుర్యోధనాదులుగానీ, యిటు పాండవులుగాని సమూలంగా నాశనం కావలసియుంది. తద్వారా భర్తృహీనలయిన స్త్రీలు మిగిలిపోవటం జరుగుతుంది. ఫలితంగా కులస్త్రీలు అక్రమ చర్యలకు లోనై కులవంతులుకాని సంకరసంతానికి కారకులౌతారు. ఫలితంగా పిండోదకములిచ్చుటకు ఔరసులు లేకపోవటం జరిగి ఆ వంశస్థులైనవారికీ, వారి పితరులకూ కూడా సద్గతులు (స్వర్గప్రాప్తి) సం॥ప్రాప్తంకాకపోవటం జరుగుతుంది ("గీత అ॥ -1-37 వ శ్లో" నుంచీ 6 వ శ్లోకంవరకు). ఈ వాదాన్ననుసరించి అర్జునుని తాత్వికదృష్టి ఎలాంటిదో స్పష్టమవుతూ వుంది. అంతేకాకుండా యీ చర్చ మహాభారతాన్నుంచి (లేక రచయిత) గీతను సంపూర్ణంగా వేరుచేస్తూవుంది. మహాభారత రచయిత దృష్టిలో ప్రాచీన సంప్రదాయ అవశేషాలైన నియోగక్షేత్రజ సంతానాలలో నియోగ సంతానం కూడా విలువ వుంది. అలాంటిపాత్రలన్నింటికీ కూడా న్యాయాన్ని కల్గించాడు. కాని గీతాకారుని దృష్టిలో భర్తృహీనయైన కులవధువు సంతాన ప్రాప్తికి అర్హురాలు కాదు. ఒకవేళ అయితే అది సంకరముగా మాత్రమే పరిగణింపబడి పిండోదకాలిచ్చే అర్హతను కోల్పోతుంది. అంటే ఆ స్త్రీయొక్క భర్తకు సంబంధించిన ఆస్తిపాస్తులనుంచికూడా వంచితుడౌతున్నాడు. (సూత్రకారులలో ఆపస్తంబుడు యీ విధమైన నియమాలనే సృష్టించాడు.) దీన్నిబట్టి మహాభారత రచన కాలం నాటి కంటె గీతారచన కాలం నాటికి సమాజంలో కలిగిన మార్పులు - వర్ణవ్యవస్థ పటుతరమైనదిగా తయారుకావటము, కర్మకాండద్వారా స్వర్గ నరకములమీది ఆపేక్షా, వాటిపైన ప్రగాఢ విశ్వాసము ప్రదానస్థాన మాక్రమించాయి. వ్యక్తిగత సంపత్తి ప్రదానఫలితంగా స్త్రీ విలువ వారసుని సృష్టించేటంతటికే పరిమితం అయింది. సంపత్తి కారణంగా కుటుంబం విచ్ఛిన్నమయి ఒకరినొకరు హత్యలు చేసుకొనేటంతవరకు కుటుంబ సభ్యులు దిగజారిపోయారు. వీటన్నింటికీ కారణం లోభం అనేవిషయాన్ని అర్జునుడు తెలియజేస్తున్నాడు. "లోభముద్వారా ఎవని మనస్సు మలినమైపోతుందో వాడు కులనాశముద్వారా సంభవించే అనర్థాన్ని, మిత్రద్రోహముద్వారా లభించే పాపఫలితాన్నీ చూడజాలడు. కానీ కృష్ణా, కులనాశంద్వారా సంభవించు దోషస్వరూపాన్ని గుర్తెరింగిన మనము యీ పాప కార్యాన్నుంచి విముక్తులము కాలేమా?" (అ|శ్లో 38-39.)

గీతాకారుని దృష్టిలో కులం అన్నపదం కేవలం ఒక వంశీకులకు మాత్రమే వర్తిస్తుంది. అర్జునుని విషాదానికి లేక ధర్మసంకటానికి కూడా వంశప్రతిష్ట, వంశనాశనము అన్నవే ప్రధానం కానీ ఏకకుటుంబీకులైన దుర్యోధనాదుల చంపటమా మానటమా? అన్న ప్రశ్న కాదు. అది అప్పటికి అడుగున పడిపోయింది.

రాచరిక పాలనద్వారా సామూహిక జీవితవిధానం నశించి, కుటుంబవిధానం దృఢపడింది. కాలక్రమంలో వ్యక్తిగత సంపత్తి కేంద్రీకరణద్వారా కుటుంబ యాజమాన్యం తండ్రికి, తండ్రి అనంతరం జ్యేష్ట కుమారునికి దక్కింది. కానీ యిది చాలా కాలం నిలద్రొక్కుకోలేక పోయింది. యాజమాన్యం కొరకు కుటుంబంలో చీలిక లేర్పడి ఘర్షణలకు దారితీశాయి. ఈ ఘర్షణ కుటుంబ యాజమాన్యం కొరకు కాదు; సంపత్తిపై యాజమాన్యం కొరకు. ఈ విషయం శంతన, సత్యవతుల వివాహ సందర్భంలోనే ఋజువయింది. ఈ పరిస్థితులలో అర్జునుడుకూడా ఒక సామాజిక పాత్రగానే చలామణీ అవుతున్నాడు. కాబట్టి సామాజిక పరిస్థితులకు అతీతంగా స్వజన, పరజన లేక వంశ

ప్రతిష్ఠ, వంశనాశనం అన్న సూత్రాలను అతడు అంటి పెట్టుకొని కూర్చొనలేడు.

అందుచేత గీతాకారుని వుద్దేశం అర్జునుని నిమిత్త మాత్రునిగా వుంచుకొని సామాజికంగా మానవుని ప్రవర్తనకు సంబంధించిన తాత్విక, రాజకీయ, సాంఘిక విషయ సమస్యలకు ఒక స్వరూపాన్నిచ్చి పరిష్కరించాలనటమే గానీ మరొకటి కాదనేది స్పష్టమవుతూంది.

## తాత్విక వైవిధ్యాలు : విభూతియోగం

వైదిక కర్మకాండలో ప్రవేశంలేని యితర వర్ణస్థులు తమకు తోచిన పద్ధతులలో కర్మకాండను, తమకు గుణ్యమైన దేవతా స్వరూపాలను సృష్టించుకొని పూజించటం జరుగుతూ వచ్చిందనే విషయాన్ని చూశాము. ఈ సందర్భంలో ఆర్థికంగా చితికిపోయిన వైదికార్య బ్రాహ్మణులే యీ వైదికేతర కర్మకాండకు ప్రాతినిధ్యం వహిస్తూ వచ్చారు. ఈ ఆరాధనా తత్వం కల్పించిన విశ్వాసములకు పాత్రమై ఎవరిది ఎక్కువ? ఎవరిది తక్కువ? అన్న తర్జనభర్జనలకు దారి తీసింది. ఫలితంగా తాత్వికరంగంలోకూడా ప్రజలలో పరస్పర నిందాదూషణలకు, వైషమ్యాలకు కారణమైంది. ఈ సమస్యను అర్జునుడు యీ విధంగా చిత్రించాడు. సమాజములో దేవతలు పలువిధ స్వరూపాలతో చలామణీ అవుతున్నారు. ఇందులో యే దేవతను నీ స్వరూపంగా, గుర్తించి, ధ్యానించమంటావు ? (10 అ॥ 17). శ్రీకృష్ణుని జవాబు: "నా స్వస్వరూపములకు అంతుఅంటూ వుండబోదు" అని తెలియజేస్తూ అట్టి ఎనుబది ఎనిమిది స్వరూపముల పేర్లను వుదహరించటం జరిగింది (అ॥ 10 శ్లో॥ 10 నుంచి 41 వరకు). ఇందులో పశుపక్ష్యాదులు, చెట్లు, నదీజలాలు వగైరా ఆటవిక తెగలకు చెందిన ఆరాధ్య దైవతములనుకూడా కల్పుకొని రావటము వైదిక దైవతములైన యింద్ర, వరుణ, కుబేర, కార్తికేయాదులనుకూడా అదే స్థాయిలో పేర్కొనటం గమనార్హం.

ఈ విభూతియోగాన్ని సరిగా గ్రాహ్యంచేసుకొనేందుకు కావలసిన వివరణను ముందు అధ్యాయంలోనే యివ్వటం జరిగింది. మూడు వేదాల ననుసరించి ఫలప్రాప్తికొరకుగాను జరుపు కర్మకాండలో పలు విధములైన క్రియలు జరిపి సోమరసము సేవించి స్వర్గ ప్రాప్తిని కోరుదురు. వారు పుణ్యలోకమును పొంది, తత్ పుణ్యక్షయానంతరం తిరిగీ మర్త్యలోకంలో జనన మరణములను పొందుదురు (అ॥ 9/20-21). "ఎవరైతే యితర దైవతములను శ్రద్ధాపూర్వకముగా పూజిస్తున్నారో వారు నా స్వస్వరూపాన్ని గుర్తించలేకపోయినప్పటికీ, నన్నే భజిస్తున్నారు. దేవతలను పూజించువారు దేవలోకాన్నీ, పితరులను పూజించేవారు పితృలోకాన్నీ, భూత ప్రేతముల పూజించువారు ఆయా లోకములను పొందుదురు. నన్ను పూజించువారు నన్నే పొందగలరు" (అ। 9/23-25).

సమాజంలో ఒక దేవత సృష్టి అయి, దానిపైన విశ్వాసం స్థిరపడి, దాని ప్రభావం ప్రజలపై కొన్ని తరాలుగా పడుతూ వచ్చినపుడు ఆ విశ్వాసాన్ని వదలుకోనాలన్నప్పటికీ, ఆదేవతను వర్జించాలన్నప్పటికీ లేక ఆ దేవత స్థానే మరొక దేవతను ప్రతిష్టించాలన్నప్పటికీ ఆ ప్రజల అంగీకారం ఏమంత సులభ పద్ధతులలో లభ్యంకాబోదు. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొనే గీతాకారుడు విభూతియోగానికి పునాదులువేశాడు. ఏకత్వంలో అనేకత్వాన్ని, అనేకత్వంలో ఏకత్వాన్ని గుర్తింపజేస్తూ వారివారి యిష్టాపూర్తికొరకు వారి వారి ఆరాధ్య దైవతములను పూజించవచ్చు. కానీ ఆయా రూపాల్లోవున్న దేవతాస్వరూపముల ద్వారా ఫలితాన్ని పంపునదిమాత్రము తానే. ఎందుకంటే ఆ స్వరూపములన్నీ తానేకాబట్టి. అయితే అంతటితో ఆగక మానవుని అంతిమలక్ష్యమైన జీవరాహిత్యాన్నికూడా తానే ప్రసాదిస్తున్నాడు. అందుకు తనను ప్రత్యేకంగా భజించాలి. ఉపాసకునికి యిరువైపులా స్వాతంత్ర్యాన్నిస్తూనే తన అంతిమ లక్ష్యాన్ని సాధించటం అన్నది యీ ప్రతిపాదనలోని విశిష్ట లక్షణం.

ఈ ప్రతిపాదనను గుర్తించినపుడు ఏశాఖ తమ తమ భావాలను లేక తమ వుపాసనాదైవతములను యధాతథంగానే వుంచుకొనవచ్చు. కానీ వైషమ్యాలు కలిగివుండవలసిన అవసరము, అందుకు కారణమైన హెచ్చుతగ్గుల ప్రమేయము నశిస్తున్నాయి.

## కర్మయోగంలో భౌతికవాదం

గీతలోని పదునెనిమిది అధ్యాయములలోను కర్మల, మానవుని ఆచరణకు సంబంధించిన చర్చే ముప్పాతిక వంతులు మనకు అగుపిస్తుంది. పోతే మానవాచరణకూ, మానవుని అస్తిత్వానికీ పదార్థము లేక ప్రకృతి మూలాధారమని కర్మయోగం స్పష్టం చేస్తూంది.

"దేహస్థుడు వుపవాసములద్వారా అనాహారుడుగా వుంటున్నాడు. కానీ మూలతత్వమైన విషయ(రసము) స్వరూపము మాత్రము నశించిపోదు. రసమూలము ఈశ్వర సాక్షాత్కారముద్వారానే నివృత్తి అవుతుంది అంటూ సాంఖ్యయోగం 59 వ శ్లోకంలో వివరించిన పదార్థ ప్రాముఖ్యతను కర్మయోగంలో యింకా ముందుకు తీసుకెళ్ళుతున్నాడు. అన్న పదార్థము ద్వారా భూతకోటి వుత్పన్నమవుతున్నది. పదార్థము వర్షముద్వారా వుత్పన్నమవుతున్నది. వర్షము యజ్ఞము ద్వారానూ, యజ్ఞము కర్మముద్వారానూ ఉత్పన్నమవుతున్నది. (అ. 3-14) కర్మ అంటే ఏమిటి? అన్న ప్రశ్నకు 3 వ అధ్యా. 5 వ శ్లోకం యీ విధంగా తెలియజేస్తున్నది. "వాస్తవంలో ఎవడూ క్షణమాత్రం కూడా కర్మచేయకుండా వుండలేడు. (ఎందుకంటే) ప్రకృతి ప్రకృతిగుణ స్వభావమే కర్మ. ప్రకృతి అంశ మాత్రుడైన మానవుని ప్రకృతే కర్మకు ఆధీనుని చేస్తూ వుంది." కాబట్టి కర్మను ఆరంభించకుండా వుండినంత మాత్రంచేత వాడు నిష్కామకర్మ స్వభావాన్ని పొందజాలడు. బాహ్యకర్మను వర్జించినంతమాత్రంచేత మోక్ష ప్రాప్తి జరగదు. అంటూ కర్మయోగం 4 వ శ్లోకంలో నిర్వచనం చేశాడు.

ఈ విషయాలనే 13 వ అధ్యాయం యింకా సులభగ్రాహ్యము చేస్తోంది. ప్రకృతీ పురుషుడు అనాదిఅని తెలియుము. విషయ వికార (చైతన్య) గుణములు ప్రకృతిద్వారా వుత్పన్నమవుచున్నవి అని తెలియుము. కార్యకారణములకు హేతువుప్రకృతిఅని చెప్పబడుతూ వుంది. సుఖదుఃఖములు అనుభవించువాడు పురుషుడు. కాబట్టి కారణుడుగా చెప్పబడుతూ వున్నాడు. ప్రకృతిలో వుండునట్టి పురుషుడు ప్రకృతిద్వారా వుత్పన్నమయ్యే గుణములను అనుభవిస్తున్నాడు. అయితే యీ గుణములునుంచీ చెడుగా వుంటూ ఆయా జన్మలకు కారణ భూతము లౌతూన్నవి (అ. 13/20-21-22).

ఈ వివరణద్వారా బోధపడేది ఏమంటే; మానవుడు ప్రకృతి (పదార్థ) ద్వారా వుత్పన్నమవుతున్నాడు. పదార్థముద్వారా మానవుని చైతన్యం (విషయ) వికసిస్తోంది. ప్రకృతి స్వభావం కర్మ. కాబట్టి ప్రకృతిలో వున్నంతవరకు మానవుడు కర్మను ఆచరించకుండా వుండలేడు. ఆచరించాలి; అది స్వభావం అయితే స్వభావం అన్నదానికి మంచి చెడు అనే ప్రత్యేకతను కూడా చేర్చటం జరిగింది. కాబట్టి స్వభావం అంటే ఏమిటో చూడాల్సి వుంది.

"జ్ఞాని అయినవాడు తన స్వభావానుసారం కర్మను ఆచరిస్తాడు. ప్రకృతి స్వభావజన్యమైనది కర్మ కాబట్టి ప్రతిప్రాణీ తన స్వభావకర్మను ఆచరిస్తుంది. ఇందులో నిగ్రహం ఎందుకు? (అ. 3/33) అని ప్రశ్నిస్తున్నాడు.

ఇందులో స్వభావజన్యమైన కర్మనిగ్రహం కూడదు. అయితే జ్ఞాని అయినవాని స్వభావకర్మకు, యితర ప్రాణుల స్వభావకర్మకు ప్రత్యేకత వుంది. ఉదాహరణకు ఒక్రి గడ్డిని మేస్తూవుండగా దున్న దానిని పోద్రోలి, ఆస్థానాన్ని ఆక్రమిస్తుంది. అది దానిస్వభావకర్మ కానీ యీ సూత్రమే మానవునికికూడా వర్తిస్తుందా? వర్తించదనే విషయాన్ని తర్వాతి శ్లోకం స్పష్టం చేస్తూవుంది. విషయగ్రహణ సంబంధమైన యింద్రియాదులకు రాగద్వేషాదులు వుంటూ వుంటాయి. కానీ మానవుడు వాటికి వశుడు కాకూడదు. ఎందుకంటే మానవుని మార్గంలో అవి ప్రబలమైన శత్రువులు (3/34) అంటే యీ శత్రుసమూహం యింద్రియమున్న ప్రతిప్రాణికీ వుంటున్నది. కానీ పశుపక్ష్యాదులు యీ శత్రుసమూహాన్ని జయించలేవు. పైగా వాటికి ఆ అవసరంకూడా అంత ప్రధానం కాదు. కానీ, మానవుడు స్వవిషయజన్య కర్మకు గడంగేందుకు తన జీవితాన్ని ఒంటరిగాగడపలేడు. సంఘాన్ని సృష్టించుకున్నాడు. సంఘంలో ఒకభాగం మాత్రమే అయిపోయాడు. కాబట్టి మానవుని స్వభావకర్మకూడా సమాజ హితమైనదిగానే వుండాలి. దానిని యీ శ్లోకం స్పష్టం చేస్తూవుంది. "ఉత్తమ పురుషుడైనవాడు ఏ ఏ కర్మలనైతే ఆచరిస్తాడో, వాటినే యితరులుకూడా అనుకరిస్తారు. దేనినైతే ప్రామాణికమైన దానినిగా గుర్తిస్తాడో దానినే ప్రజలు అనుసరిస్తారు." కాబట్టి "జనకుడువగైరాలంతాకూడాకర్మద్వారానే మోక్షప్రాప్తులయ్యారు. లోకకళ్యాణాన్ని దృష్టిలో వుంచుకొని కర్మచేయుటే ఉచితమైనది" (అ.3/11-20).

"ఒకవేళ (లోకకళ్యాణార్థం)నేను కర్మను ఆచరించకుండా వుండిపోతే ఈ ప్రపంచం భ్రష్టమైపోతుంది. (ఫలితంగా) సమాజచక్రం అస్తవ్యస్తమై పోతుంది. (పర్యవసానరూపం) లోకనాశనానికి కారకుడనుగా వుంటున్నాను" (అ. 3/24 బ్రాకెట్లు నావి).

ఈ వివరణద్వారా మానవుడు కర్మఅనే రెండింటి మధ్యా లోకకళ్యాణంఅనేది గీటురాయిగానిలుస్తోంది.

## కర్మబుద్ధి సమన్వయం

లోకకళ్యాణార్థం (స్వప్రయోజనమే ప్రధాన లక్ష్యంకాక) కర్మను ఆచరించటంలోవున్న సాధక బాధకాలను దృష్టిలోవుంచుకొని అంతిమాధ్యాయమైన సన్యాసయోగంలో చర్చించ బడింది. ఈ కర్మను చేయటంద్వారా దేహాయాసము కలుగుతుందనిగాని, బాధలకు గురికావలసి వస్తుందనిగానీ, తాను చేయవలసిన (విధ్యుక్త) కర్మను త్యాగం చేసినట్లయితే అది రాజసమనబడుతుంది. నిష్ఫలమైనదిగా వుంటుంది (అ.18/8). కాబట్టి సన్యాసిఅయినవాడు లేక మోక్షగామి అయినవాడు కర్మను తప్పనిసరిగా ఆచరించాలి. అయితే బుద్ధి ధర్మా ధర్మములను, కార్యాకార్యములను తప్పుడుపద్ధతిలో నిర్ణయించటం రాజసబుద్ధి అనబడుతుంది. బుద్ధి అంధకారమయమైనపుడు అధర్మాన్నే ధర్మంగానూ, సమస్త కార్యార్థములను విపరీతార్థములలోనూ చూచునట్టిది తామస మనబడును (అ.18/31 32). కాబట్టి ఇలాంటివన్నీ త్యాజ్యములు.

"ప్రవృత్తి, నివృత్తులను, కార్యాకార్యములను, భయాభయములను, బంధమోక్ష తారతమ్యములను గుర్తెరుంగునది సాత్విక బుద్ధి." ఏకాగ్రచిత్త (బుద్ధి)ముతో మనుష్యుడు మనస్సు, ప్రాణము (అది భూతాలైన) ఇంద్రియముల క్రియలను సమత్వదృష్టితో చూడగల్గుచుండుటయు అది సాత్విక బుద్ధి అంటూ అ 18/30-33 శ్లోకాలు పేర్కొన్నాయి.

ధర్మాధర్మ, న్యాయా న్యాయములలో అక్రమ పద్ధతిని పయనించటం రాజస తామస గుణములు. అలాకాక సక్రమపద్ధతిలో పయనించటం సాత్విక గుణము. దీనినే మానవుడు అనుసరించాలి. అయితే యిది సక్రమము యిది అక్రమము అని గుర్తించటం ఎలా ? మానవుని సమస్తక్రియలకు యింద్రియములే ప్రధానములు. కాబట్టి యీ యింద్రియముల క్రియలను సమత్వదృష్టితో చూడాలి. అంటే! మనము నోటితో ఒక వాక్యాన్ని ఎదుటివానిపై ప్రయోగించినపుడు అదేవాక్యాన్ని ఎదుటివాడుకూడా మనపై ప్రయోగించినపుడు అందులో మనఃక్లేశమునకు దారితీసే విధానము వుండకూడదు. అలాగే ఎదుటివాడు మనపై దండప్రయోగం చేసినపుడు మనం మనోకాయములద్వారా బాధాక్లేశములకు గురి అగుచున్నాము. కాబట్టి అలాంటి చర్యను యితరులయెడల ఆచరించకూడదు.

ఇలా నిర్ణయం చేసి ఆచరించటంలో ధృఢ నిశ్చయుడుగా వుండవలె. అయితే, ఒక్కొక్క సందర్భంలో మనం చేసుకున్న నిర్ణయాలు అక్రమ పద్ధతులలో వుండవచ్చు. అలాంటపుడు పట్టువిడుపుల మెలకువను, కార్యము, అకార్యము అన్న విచక్షణను కలిగివుండి, అతి జాగ్రత్తగా వ్యవహరించాల్సి వుంటుంది. అన్నదే గీతాభిప్రాయం.

## స్వధర్మ ప్రతిష్టాపన

వృత్తి విభజనానంతరం వ్యక్తిగత సంపత్తికి భీజాలు పడనంతవరకు ఏ యే వృత్తికి నియోగించబడినవాడు వాని సంతతి ఆ వృత్తికి అంటిపెట్టుకొని వుండటం సాధ్యమయింది. అందులో వారికి నీచానీచములుగాని, లాభనష్టములుగాని తద్వారా ఆర్థికలేమి వున్నతి అన్న సమస్య లేకుండెడివి. కానీ, బానిస సమాజానికి పునాదులు పడటంతో వ్యక్తిగత సంపత్తికి క్రమక్రమంగా ప్రాముఖ్యత ఏర్పడింది. ఫలితంగా (బానిసలు మినహాయించి) ప్రతి ఒకరు తగినంత హెచ్చుమోతాదులలో సంపత్తి కేంద్రీకరణకు ప్రాకులాడడం ప్రారంభమైంది.

మహాభారతకాలంలో బానిసవ్యవస్థ వున్నట్లు ధర్మరాజు రాజసూయయాగం తెలియజేస్తూంది. తర్వాత కాలంలోకూడా యీ బానిసవ్యవస్థ కొనసాగినట్లు కౌటిల్యుని అర్థశాస్త్రం స్పష్టంచేసింది. అయితే యీ కాలంనాటికి కొన్ని పరిమితులు ఏర్పడ్డాయి.

మనుశాస్త్రం, ఉపనిషత్‌లలోని వర్ణవిభజన ననుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు (బానిస)లనుగా తానే (శ్రీకృష్ణుడు) వారి వారి గుణ కర్మ స్వభావాలనుబట్టి నిర్ణయించినట్లు తెలియజేశాడు. ఆయా గుణ కర్మలనుకూడా గీత అ. 18/40 నుంచి 44 వరకు 4/13 లోను స్పష్టంచేసింది. అయితే కాలక్రమంలో వ్యక్తిగత సంపత్తి కేంద్రీకరణ యీ వృత్తి వర్గవిభజనను తారుమారుచేసింది. వైదికార్యుడు బానిసగానూ, బానిసగా వున్నవాడు యజమానిగాను మారిపోయే అవకాశాలున్నట్లు కౌటిల్యుని అర్థశాస్త్రమే చెపుతూ వుంది. అంటే యీ పరివర్తన కౌటిల్యుని కంటే చాలాకాలం ముందునుంచే ప్రారంభమయింది అనే విషయాన్ని మనం విస్మరించరాదు.

గీతారచనకాలం కౌటిల్యుని కంటే ముందా ? వెనుకా ? అనే మీమాంసను కడగా వుంచినట్లయితే గీతారచన కాలంనాటికి యీ పరిస్థితులు సమాజంలో

వుత్పన్నమయి వుండినాయనేది నిస్సంశయం. ఎందుకంటే గీత స్వధర్మాన్ని గురించి ఎక్కువగా ప్రస్తావించటమేగాక చాలా తీవ్రంగా కూడా వుద్బోధిస్తూ వుంది. కృష్ణుడు అర్జునునితో "స్వధర్మమని తెలిసుండి కూడా నీవు వెనుక ముందాడటం వుచితంకాదు. క్షత్రియునికి యుద్ధంకంటే శ్రేయస్కరమైనది మరొకటేదీ లేదు..." భాగ్యశాలి అయిన సత్క్షత్రియునికే యుద్ధము సంప్రాప్తమౌతుంది. "ఒకవేళ నీవు యీ యుద్ధాన్ని చేయనియడల స్వధర్మాన్ని కీర్తి ప్రతిష్టలను కోల్పోయి పాపఫలము ననుభవించెదవు. అందరు నిన్ను నిందిస్తారు. నీవు అపకీర్తి పాలగుదువు......"భయమువల్ల పారిపోయిన పిరికి పందవంటారు... "నీ శత్రువులు పలువిధములైన. నిందావాక్యములు నిన్ను గురించి అనుకొనెదరు..." ("నీ స్వధర్మమైన) ధర్మయుద్ధములో నీవు మరణిస్తే స్వర్గాన్ని పొందగలవు. జయిస్తే రాజ్యాన్ని పాలించగలవు. కాబట్టి యుద్ధము చేయుము" అంటూ గీత అ. 2/31 నుంచీ 37 వరకు తెలియజేసింది. కర్మయోగములో "పరధర్మము సులభమైనదైనప్పటికీ వానికంటే స్వధర్మము హీనమైనదైనప్పటికీ అధిక శ్రేష్టమైనది. స్వధర్మంలో మరణం ఆసన్నమయినప్పటికీ శ్రేష్టమే కానీ పరధర్మము భయావహమైనది" అ. 3/53 ఇదే అభిప్రాయాలను అ. 18/45 నుంచీ 49వ శ్లోకం వరకు పునరుద్ఘాటిస్తూ స్వధర్మంలో మోక్షప్రాప్తిని కూడా సూచించాడు.

ఈ సమస్యను ఇంత ప్రధానంగా గీతాకారుడు తీసుకున్నాడంటే, సమాజంలో ఈ సమస్యకు ఏర్పడిన ప్రాముఖ్యతా, దానిక్లిష్ట స్వరూపమూ అర్థంఅవుతూంది. కానీ యీ విషయ సమస్యకు ఏర్పడిన పరిస్థితులు (పైన చూశాము) వాటిమూలము సామాజిక వ్యవస్థా నిర్మాణంతోనే ఇమిడినట్టివి. కాబట్టి అతి ప్రాచీనమైన మను శాస్త్రం మొదలుకొని సమస్త శాస్త్రాలు ఎంత తీవ్రంగా బోధించినప్పటికీ యీ విషయంలో నిష్ఫలములే అయ్యాయి. చరిత్రలో బానిసలు చక్రవర్తులు కావటము చక్రవర్తులు బానిసలు కావటములాంటి పరిస్థితులే వుత్పన్నమయి నిరాటంకంగా కొనసాగుతున్నప్పుడు యిక సామాన్యవృత్తులకున్న విలువ ఏపాటిది ?

# ధర్మస్థాపన

సాధుసజ్జనుల రక్షణకొరకు దుష్టుల సంహారణకొరకు గాను "ధర్మ సంస్థాపనార్థం ప్రతి యుగంలోనూ జన్మిస్తాను" అంటూ అ. 4/8 లో తెలియజేశాడు. అయితే అధ్యాయం ప్రారంభంలో తాను రాజయోగాన్ని చాలాకాలం పూర్వం సూర్యునికి బోధించినట్లు అది కొంతకాలం తర్వాత నష్టమైపోయినట్లు దానినే తిరిగి అర్జునునికి బోధిస్తున్నట్లు అ. 4/1 నుంచి 5 వరకు తెలియజేశాడు.

ఇక్కడ ధర్మసంస్థాపన అన్న పదానికి పునరుద్ధరణ చేస్తున్నట్లు గీతే అంగీకరిస్తూవుంది. అంటే శ్రీకృష్ణుడు లేక గీత చేసినది పాతభావాలను పునరుద్ధరించటమే గానీ, నూతన ధర్మాన్నికానీ, నూతన భావాలనుగానీ సృష్టించటం కాదనేది స్పష్టమే. ఈ సూత్రాన్ననుసరించే గీత ఉపనిషత్‌ల క్రోడీకరణమాత్రమే అని చెప్పటం సమంజసంగా తోస్తుంది.

ఏమైనప్పటికీ, గీతాకారుని ధర్మ సంస్థాపనోద్దేశం ఏమిటి ? అన్న ప్రశ్నకు గీత పూర్తి సమాధానాన్నే యిస్తూవుంది. దానినే కొంతవరకు సమీక్షించుకున్నాము. గీత అంతిమలక్ష్యం ఏమిటి ? ఎవరైతే ప్రతి ప్రాణియెడల ద్వేషరహితంగా కరుణ, దయ వగైరా గుణములుకల్గి ప్రవర్తిస్తూ స్వప్రయోజనాపరత్వమైన మమతారహితుడై, అహంకార రహితుడై, సుఖదుఃఖములయందు సమతాదృష్టి కలవాడై...వాడు నాకు ప్రియుడు" అంటూ అ. 12/13-14 తెలియజేశాయి.

మానవుని ప్రవర్తన స్వప్రయోజనముతో కూడినట్టిదై యుండకూడదనీ, వీలైనంతవరకు ప్రాణమాత్రులకు (లోకకళ్యాణార్థమై) శుశ్రూషాభావంతో కర్మాచరణకుగడంగుమనీ ఆదినుంచీ అంత్యం వరకు గీత హెచ్చరిస్తూనే వుంది. ఈ ప్రాతిపదికపైన గీతాకారుని సమకాలిక సమాజ పరిస్థితులను దృష్టిలో వుంచుకొని రాజకీయ ఆర్థిక సాంఘిక నైతిక విలువలను మానవుని ఆచరణకు సమన్వయంచేస్తూ తాత్విక జిజ్ఞాసను రేకెత్తించటము, తాత్వికరంగంలో వుత్పన్నమయిన వైషమ్యాలకు పరిష్కారమార్గాన్ని లేక రాజీమార్గాన్ని చూపెట్టటము - అంతిమలక్ష్యమైన ఆధ్యాత్మికవాదంవైపు ఆకర్షించటము- రచయిత యీ

పద్ధతులను సమన్వయం చేయటంలోనూ తేటతెల్లముగా విపులీకరించటంలోనూ ప్రదర్శించిన నైపుణ్యతకు ఒక ప్రత్యేకత వుంది.

నిష్కామకర్మ కర్మఫల పరిత్యాగములకు యిచ్చిన నిర్వచనము. వీటిపేరుతో సమాజంలో సోంబేరులుగా తయారయి ధూర్తులు చెలామణి అవుతున్న కపట సన్యాసులలాంటివారిని నిర్మొహమాటంగా విమర్శించటంలో కనపరచిన చారవా వ్యా రాలంతా అద్వితీయమైనవిగా వుంటున్నవి.

గీతా రహస్యాన్ని శ్రీకృష్ణుడు అర్జునునికిచెప్పగా సంజయుడు విని ధృతరాష్ట్రునికి చెప్పాడు. కానీ గీతను వ్రాసినది ఎవరు? అన్న ప్రశ్నకు గీత సమాధానం చెప్పకపోవటం గీతా రచయితను గురించి అనేక అపోహలకు దారితీసి, కాలము వ్యక్తి విషయంలో తర్జన భర్జనలు సాగుతూనే వున్నవి.

యత్కర్మ కుర్వతోఽస్యస్యాత్
పరితోషోఽంతరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత
విపరీతం తు వర్జయేత్॥

మను. అ. 4.

తెనుగు:

ఒరులేయవి యొనరించిన
నరవర! అప్రియంబు తన మనంబున కగుదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

— భారతం.



53

# తత్వశాస్త్రం - మానవ జీవితం

ఆవంత్స సోమసుందర్

తత్వశాస్త్రమను పదానికి - సంస్కృతభాషాను సారంగా 'దానికీ, నీకూ' గల సంబంధ స్వభావాన్ని తెలిపేదని అర్థము. అంటే ప్రకృతి-పురుషుల సంబంధాన్ని తెలిపేదన్న మాట. 'ప్రకృతి' అంటే-జననాంక మనీ, 'పురుషుడు' అంటే కర్మల నాచరించే 'కర్త' అనీ-అర్థము. ఈ రెంటి సంబంధాన్ని వివరించేదే తత్వశాస్త్రము. సృష్టి, స్థితి, లయముల నిగూఢ రహస్యాన్ని విశదీకరించేదని భావము. త - (దానికీ) ప్రకృతికీ, త్వం - (నీకు) పురుషునికీ గల సంబంధ విశదీకరణ శాస్త్రమే తత్వశాస్త్రము. పాశ్చాత్య భాషానుసారం Philosophy అనగా Love of wisdom అని పదానికి గల స్వాభావికార్థము. అంటే 'That which deals with ultimate reality' అని (Philo=Love of,Sophas=wise,Sophia=wisdom) అంటే మానవుని కార్మణిక జీవితాన్ని, నిర్ధరించే నియమాలనూ - ప్రకృతిసంబంధమైన లక్షణాలనూ విశదీకరించేశాస్త్రమని భావము.

మానవుడు ఆహార నిద్రా మైథునాలనే త్రిగుణాత్మకమైన ప్రాణికృత్యాలతో సంతృప్తి చెందలేక ఏదో మానసికా సంతృప్తితో మథనపడ నారంభించాడు. ఈ మథనంలోనే అతనికి ఆలోచన ఉదయమైంది; సృష్టి స్థితిలయములతోకూడిన చరాచర జగత్తును మానవుడు పరాత్మకంగా దర్శించ నారంభించాడు. ఈ పరిశీలనలో అతనికి కలిగిన శంక తీవ్రతరం కాజొచ్చింది. ఏడుస్తూ పుట్టిన పసిబిడ్డలనూ, నవ్వుతూ ఆడుకొనే బాలురనూ, యవ్వనాదిదశలు గడచి జీవిత కార్యక్రమాలకు నీరసులై గజగజ వణకే వృద్ధులనూ, వాళ్ళ వాళ్ళ మరణాన్నీ తిలకించాడు. పశు పక్ష్యాదులుకూడ జీవిస్తున్నాయి. అయితే మానవుని ప్రత్యేకత ఏమిటి? అతను ప్రశ్నించుకున్నాడు. ప్రకృతి క్రూరత్వాన్నీ, అట్టి ప్రకృతిని జయించజాలే మానవ ప్రయత్నాన్ని కూడ అవగాహన చేసుకున్నాడు. దానితో అతనిలో జిజ్ఞాస ప్రారంభమైంది. తన తెలివినంతటినీ ఒడ్డి పరిశోధన ప్రారంభించాడు.

## భూమి - మానవోదయము

ఆధునిక శాస్త్రజ్ఞుల ప్రకారము భూమి మండే సూర్యమండలంలోంచి విడివడి, 'లావా' వంటి ద్రవాత్మక జ్వలనశక్తిగా ఉండేదనీ, క్రమశః చల్లబడి ఘనీభవించిందనీ, జలాత్మకమైన విశ్వంలో ప్రాణికోటి వికసించగలిగే స్థితిగతులు ఏర్పడ్డాయనీ తెలుస్తున్నది. కణస్వరూపమైన ప్రోటోప్లాజమ్ నుంచి 'ఎమీబా' గాను, క్రమంగా జంతుజాలంగాను, క్రమంగా మానవుడుగాను జీవం పరిణామం పొందిందని నవీనశాస్త్రం చెబుతోంది. ఈ విషయాన్నే మహాభారతం - శాంతిపర్వంలో భీష్ముడు ఇలా చెబుతాడు:

"శబ్దరాగా చ్ఛ్రోత్రమస్య జాయతే భావితాత్మనః
రూపరాగాత్తథా చక్షుః ఘ్రాణం చైవదిఘృక్షయా!"

ప్రాణులకు శబ్దము వినవలెనన్న భావ ముత్పన్నమయ్యేనేని వీనులు, రూపము చూడవలెనన్న యిచ్ఛ కలిగినేని నేత్రములును, వాసన చూడవలెననే బుద్ధి కలిగినేని నాసికయున్నూ ఉత్పన్నమైనవి.

ఈ విషయమే 'సాంఖ్యం'లో కూడా చెప్పబడి వున్నది. కాని సాంఖ్యులవాదం ప్రకారం - త్వగింద్రియం ఉత్పన్నమైనను మూలప్రకృతి యందే కొండొక యింద్రియము ఉత్పన్న మయ్యేశక్తి లేనియెడల ఆ యింద్రియము కలుగనేరదు. అత్యంత సూక్ష్మ జంతువుయొక్క త్వగింద్రియముపై సూర్యరశ్మి యెంత సోకినను, దానికి "కన్నులు ఎట్లు పుట్టును?" అని అడుగుతున్నారు.

ఒక జంతువు నేత్రములు కలదిగను, వేరొకటి నేత్రరహితముగను నిర్మితమైన పిదప - జడసృష్టి అధికమైనపుడు నేత్రములుకల జీవులే చిరకాలముండుననీ, నేత్రములు లేనివి అచిరకాలంలోనే నశించుననీ - డార్విన్ మహాశయుని సిద్ధాంతము (Survival of

the fittest) ఏమైనా కొన్ని లక్షల సంవత్సరాల వయఃపరిమితిలో క్రమానుగత పరిణామం చెంది మానవుడుగాను, క్రమంగా మానవ సమాజంగాను రూపొందినది.

## సృష్టి వైచిత్ర్యం - మానవాధిష్టత

ఇట్లు ఉత్పన్నమైన మానవుడు - జంతువులు మొదలైన అనేక జీవులవలె భౌతిక అవసరాల సంతృప్తితో ఆగలేక పోయాడు. అతనికి అనంతమైన శంకలు, ప్రశ్నలు, సంశయాలు కలుగ నారంభించాయి. అట్టి వానికి సమాధానాలు చెప్పుకొని, తర్క-వితర్కాలతో పూర్వపక్షం చేసుకొని, వినూత్న సిద్ధాంతాలు రూపొందించుకొని, తద్వారా జ్ఞానసముపార్జనకు అగణితసోపానాలు అమర్చుకొన్నాడు. అరిస్టోటిల్ అన్నట్లుగా "మానవుడు విచక్షణా జీవి!" (Man is a rational animal) కనుక ప్రాథమికంగా మానవుడు జ్ఞాననేత్రుడు.

మానవుడు తనకు లభించిన తార్కిక విజ్ఞానంతో ప్రకృతి శక్తులను పరిశోధించాడు. అవగాహన చేసుకున్నాడు. దీనితో ప్రకృతి శక్తులను తన కుపయోగించునట్లు వశపరచుకొన్నాడు. సహజంగా ప్రకృతి బద్ధుడైన మానవుడు ఈ మేధాకృత్యంవల్ల స్వేచ్ఛనూ, (స్వ+ఇచ్ఛ) విముక్తినీపొంద నారంభించాడు. ఇదే మానవజాతి అవసర స్థితిలోనుంచి స్వేచ్ఛా స్థితిలోకి చేసిన విలంఘనము (It is humanity's, leap from realm of necessity into the realm of freedom - F. Engles - Anti Duhring P. 318). అయితే ఈ స్వేచ్ఛ అనేదానికర్థం - మానవుడు ప్రకృతి శక్తులను నిత్యవ్యవహారిక జీవితంలో ఉపయోగపడునట్లు మలుచుకోవడమే కాక, తత్సంబంధమైన జ్ఞానంతో కర్మల నాచరించడమేనని కూడ ఏంగిల్స్ మహాశయుడు చెబుతున్నాడు.

ఈ స్వేచ్ఛాసముపార్జనాయత్నం వేలాది సంవత్సరాలకాలంగా మానవుడీ భూమిపై కొనసాగిస్తున్నాడు. హెర్బర్టు కేర్సన్ అనునతడు (How to understand Human nature by Herbert karsan) ఈ విధంగా అన్నాడు: "మానవజాతి అగణితకాలాల నుంచీ ఈ భూమిపై లిఖితపూర్వకమైన చరిత్రలేకుండానే జీవిస్తూన్నది. మానవజాతి ఆయుఃప్రమాణాన్ని యిప్పటికి 12 గంటల కాలంగా మనం పోల్చుకున్నట్లయితే - 11-30 ని. లు. చరిత్రకందని పూర్వస్థితిలోనే గడచిపోయింది. అంటే బేకను మహాశయుడు (Bacon) శాస్త్రీయపద్ధతిని కనుగొని 2 నిముషాలు మాత్రమే అయిందన్నమాట. అలాగే వాట్ మహాశయుడు (watt) ఆవిరి యంత్రం కనిపెట్టి అరనిముషమే అయిందన్నమాట. ఈ నాటి యాంత్రికయుగం రూపొంది ముప్పయి సెకన్లు మాత్రమే గడచిందన్నమాట !... విజ్ఞానశాస్త్రం వయస్సు కొన్ని శతాబ్దాలు మాత్రమే కాగా, మానవజాతితోనే సహజన్ములయిన అనుభూతి, భావనామాత్రం అంత ప్రాచీనమైనవీను!" అని వివరించాడు.

కనుక మానవుని బుద్ధి అనవరతము యాత్రసాగిస్తున్నది. ఆధునికాంగ్ల రచయిత లారెన్సు అనినట్లుగా 'మానవుడు ఆలోచనా సాహసికుడు' (Man is a thought adventurer - D. H. Lawrence) అన్నది సత్యమే. కాన మానవుడు జన్మించినదాది తన ఆలోచనాత్మక శక్తికీ, బాహ్యావాస్తవికతలకూగల సంబంధాన్నిగూర్చి పరిశోధిస్తూనే వున్నాడు. కనుకనే క్షణక్షణమూ క్రొత్తక్రొత్త అన్వేషణలతో, తాత్త్వికనిర్ణయాలతో తాను పురోగమిస్తూనేవున్నాడు. సమాజాన్ని సహితము మరో అంగ ముందుకు తీసుకుపోతూనే వున్నాడు.

మానవునకు సంభవించే అరిష్టాలకు, ఈతిబాధలకూ కారణా లేమిటి? అతని అష్టకష్టాలకు మూల మేమిటి? —అని అనుభవిస్తున్నప్పుడూ, అనుభవం తర్వాతకూడా మానవుడు ఆలోచిస్తున్నాడు. అప్పుడు సామాజిక శాస్త్రాన్ని అవగాహన చేసుకోవలసివచ్చింది. మానవమహాచరిత్ర - యాత్రించే ప్రతి మజిలీలోనూ కొన్ని తక్షణలాభాలు కలిగాయి. ఆ లాభాలలోనే అంతర్బీజమైన కొన్ని నష్టాలూ కలిగాయి. ఈ రెండూ మరో మజిలీలో పరస్పరం సంఘర్షించి నూత్న వ్యవస్థకు ప్రాతిపదికలవుతూ వచ్చాయి. ఈ యాత్రలో క్రమక్రమ పరివర్తితమైన విజ్ఞాన ప్రగతి లభించింది. ఈ సమాజాభివృద్ధితోపాటు, తల్లితో లేగవలె వ్యక్తి వికాసముకూడ క్రొత్తరేకులు విచ్చుకో నారంభించింది.

## మానవమేధ - విజ్ఞాన పిపాస

మానవుని హృదయంపై ప్రకృతి శక్తుల మహాత్మ్యం ఎప్పుడూ జిజ్ఞాసను రేకెత్తిస్తూనే వచ్చింది. పుట్టుక ఏమిటి ? పుట్టుక పూర్వస్థితి ఏది ? జీవితవిధాన మెందుకిలా వుండాలి ? కామ, క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలకు జీవితంలో యింత స్థావర మెందుకు

కలగాలి ? ఆశ అన్నదానికి యింత బల మేలఉండాలి? మృత్యువేమిటి ? మృత్యువు తదనంతరం యింతటి మహా జీవశక్తి సర్వమూ నశించిపోవలసినదేనా ! - అనే ప్రశ్నలు అతని జ్ఞాన పిపాసను ద్విగుణీకృతం చేశాయి. జిజ్ఞాస అతని హృదయ కుహరంలో జ్ఞాన జ్యోతుల్ని వెలిగించ నారంభించింది.

ఈ పరిశోధనలో 'లోకోభిన్న రుచిః' అన్నట్లుగా అనేకమంది ద్రష్టలు అనేక భంగులుగా నిర్వచనాలు చేస్తూవచ్చారు. దాని ఫలితంగానే భారతీయ తత్వం లోని షడ్దర్శనాలు రూపొందాయి. వేదాలు, వేదాంగాలతో పాటు, ఈ షడ్దర్శనాలుకూడ తత్వశాస్త్రానికి మరింత పుష్టి కూర్చాయి. ఈ షడ్దర్శనాలలో షడ్దర్శనాలు - సాంఖ్య, న్యాయ, వైశేషిక, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, యోగ అనునవి ఆరున్నూ ఆస్తిక దర్శనాలు. తరువాత మూడున్నూ - చార్వాక, బౌద్ధ, జైన దర్శనాలు - నాస్తిక దర్శనాలు. ఆస్తిక దర్శనాలు వేద ప్రమాణాన్ని విశ్వసించేవి అనీ, వేద ప్రమాణంలో విశ్వాసంలేనివి నాస్తిక దర్శనాలనీ మాత్రమే అర్థం చేసుకోవాలి. అంతేకాని, ఈ ఆస్తిక, నాస్తిక పదాలతో ఈశ్వర, నిరీశ్వర వాదాలకు ప్రత్యక్ష సంబంధం లేదు. ఆస్తిక దర్శనాలలో నిరీశ్వర తత్వ బీజాలూ ఉన్నాయి. నాస్తిక దర్శనాలలో ఈశ్వరతత్వ బీజాలూ ఉన్నాయి. ఈ దర్శనాలలో ఒక్కొక్కటి ఒక్కొక్క స్వతంత్ర విధానంలో ప్రకృతి పురుషుల సంబంధాన్ని వివరించాయి.

వేదాంత శాస్త్రజ్ఞుల ప్రకారము ప్రకృతి పురుషులే కాక ఈ రెంటికీ అతీతమైన బ్రహ్మపదార్థము ఉన్నదని చెప్పబడుతున్నది. కాంటు అభిప్రాయం ప్రకారం 'వస్తుతత్వ మజ్ఞేయము: (Thing in itself - Cant) మూల ద్రవ్యము యింద్రియా గోచరమూ, అవ్యక్తమూనని భావము. నామ రూపాత్మకమైన జగత్తుకు అగోచరమైన మూల పదార్థమే' బ్రహ్మము (నేతి) అని భారతీయ తాత్వికుల అభిప్రాయము.

"యతోవాచో నివర్తంతే
అప్రాప్య మనసా సహ"

వాక్కుకూ, మనసుకూ అగోచరమైనది 'బ్రహ్మ'.

కణాదుడు పరమాణువుల సంయోగ వియోగాదుల వల్లనే సృష్టి జరుగుతోందని కార్యకారణ సిద్ధాన్తాన్ని ప్రతిపాదించాడు.

ఈ విధంగా ప్రాక్పశ్చిమదేశ తత్వజ్ఞులు అనేక మార్గాలలో అనేక విషయాలను వివరించారు. ప్రకృతి పురుషుల సంబంధాలపై తమ తమ సమాధానా లిచ్చు కున్నారు.

మార్క్సియులు-కాంటు చెప్పిన 'వస్తుతత్వమజ్ఞేయ' మన్న విషయాన్ని ఖండించి 'వస్తుతత్వంజ్ఞేయాత్మమే కాక మానవానుభుక్తముకూడ' - అన్నారు. (Thing in itself is a thing for ourself).

కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలకుకూడ గుణాత్మకమైన పరివర్తనలు కలుగుతూనే వచ్చాయి. ఆదిమ సమాజానికి నిబంధనలు లేనట్లే ఆదిమ మానవునికి ఈ అరిషడ్వర్గాల విషయంలోకూడ నిర్నిబద్ధంగానే కాలం గడచేది. ఆదిమదశనుంచి నాగరికదశకు సమాజం పరివర్తనమైనకొద్దీ సమాజ నిబంధనలతో పాటు కామాదులకు కూడ నిర్బంధాలు ఏర్పడ్డాయి.

"లోకే వ్యయామిషామద్య సేవానిత్యాస్తు
జంతోర్న హితత్ర బోధనా !
వ్యవస్థితేషు వివాహ యజ్ఞా
సురాగ్రహైరాసుని వృత్తిరిష్టా"-భాగవతం

లోకంలో మైథునము, మద్యపానము, మాంససేవనము చేయమని ఎవ్వరికీ బోధించనక్కరలేదు. వీనిని నరులు స్వభావసిద్ధముగానే అనుభవిస్తారు. ఈ మూడింటికి ఏదైనా వ్యవస్థను చేయవలయునని ఒకానొక కట్టుబాటు చేసి సమయములు ఏర్పరచవలెను. కావుననే వివాహము, సోమయాగము, సౌత్రాయణి యజ్ఞము అనునవి అనుక్రమముగా శాస్త్రకారులచే యోచన చేయబడినవి.

అంటే ప్రకృతిసిద్ధమైన మానవానుభూతులు (కామ క్రోధాదులు) సమాజాభివృద్ధితోపాటు క్రమబద్ధమవుతాయి. ఈ క్రమబద్ధతే నాగరికతాచిహ్నమవుతుంది. ఇట్టి క్రమబద్ధతను ఆత్మసంయమంతో సమాజ పూర్వ దశలలో కొంతమంది ఋషులుమాత్రమే అవలంబించ గలిగారు. అయితే నేటి నాగరికతకు మకుటాయమానమై, సామాజికయాత్రలో మహోన్నతస్థితి నందుకునే సామ్యవాద వ్యవస్థలో నరులందరూ యిట్టి ఆత్మ సంయమాన్ని ఐచ్ఛికంగానే అవలంబించే స్థితి ఏర్పడుతుంది.

## జాతస్య మరణం ధ్రువం

మహాచలనశక్తి సంయుతమైన జీవితాన్ని ఒక్కసారిగా అంతరింపచేసే మృత్యువు గురించిన జిజ్ఞాస అనేక

ఆలోచనలకు కారణమైంది. 'లోకస్యకాగతిః (లోక మేగతిని నడచును ?) అనీ, "ఏయం ప్రేతే విచికిత్సా మనుష్యే స్తీత్యేకే నాయమస్తీతిచైకే ?" (మరణానంతరం మానవు డేమగును ? అని కఠోపనిషత్తులో) వంటి అనేక ప్రశ్నలు, అనంత సందేహాలనుంచి మానవ మేధను ఆవిష్కరిస్తూ వచ్చాయి. ఈ సమస్యపై భగవద్గీతలో యిలా చెప్పబడింది :

"దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యవ్వనం జరా
తథా దేహాంతర ప్రాప్తిః
ధీరస్తత్ర నముహ్యతే !"

(అర్జునా ! మానవునకు ప్రథమంలో బాల్యం, అది పోయి యవ్వనము, అదీ పోయి కౌమారం, తుదపరి వృద్ధాప్యము ఎట్లు సంభవించునో అట్లే మరణముకూడ ప్రాప్తించును. ఈ విషయమై బుద్ధిమంతులు విచార పడరు.)

అందుచే మానవుని జనన మరణాల మధ్యస్థమైన జీవితంలో కర్తవ్యోన్ముఖుడు కావాలి. వ్యక్తిజీవితంలో నిన్న - నేడు - రేపు - అనునవి ప్రముఖమైన మూడు దశలు. అట్లే ఒక జాతి జీవితంకూడ త్రిదశాత్మకమైనదే! ఈ మూడు దశలకూమధ్యగల అవిభాజ్య సంబంధాన్ని ఆకళింపుకొని వ్యక్తి జీవితాన్ని పునీతంచేసుకోవాలి. జీవన వాహినిలో రూపొందిన దివ్యతరంగాల గూర్చి పూర్తి జ్ఞానాన్ని పొందాలి. కాని గత చరిత్రను అర్థంచేసుకోవడమంటే పాతల పాతరలో మునిగి వర్తమాన భావికాలాలపట్ల, సామాజికవ్యక్తిగా తనకుగల బాధ్యతలను విస్మరించడం కాగూడదు. వివేకానందుడు చెప్పినట్లుగా గత చరిత్రనుంచి జ్ఞాన బలమును పుంజుకొని శక్తివంతంగా ముందుకు సాగడానికి, గత కాలపు సువర్ణకాంతుల వెలుగులో వర్తమాన మందలి చీకటులను చీల్చి తేజోవంతమైన ఆగతాన్ని సృజించుకోవడానికి ప్రాచీన దివ్య స్మృతులు ఉపయోగపడాలి. (But out of the past is built the future. Look back, therefore, as far as you can, drink deep of the eternal fountains that are behind, and after that look forward, march forward, and make India brighter, greater, much higher than she ever was.) అన్న వాక్యమే నేటి మేధోజీవితానికి కరదీపమై ఉండాలి. నేటి మానవుడు కర్మయోగాన్ని అవగాహన చేసుకొని, కర్తవ్యోన్ముఖుడై, వర్తమాన జీవితమందలి దుశ్శక్తుల నంతరింపచేసుకోవాలి.

జీవితాన్ని సంపన్నం చేసేవి రెండే రెండు శక్తులు. హృదయము, మేధ అనునవి. మానవ విజ్ఞాన సముపార్జనాశక్తికీ, సమాజ పరిణామానికీ మూలకంద మవుతున్న శక్తులివే. సమాజంలోని సమస్త సుఖదుఃఖాలకూ, ప్రకృతిగతమైన సర్వవిషయాలకూ విచిత్రమైన అనుభూతులను సృష్టించుకొంటూ జీవితాన్ని కళామయంగా చేసుకుంటుంది. - హృదయం. నిత్యజీవితంలోని అసంతృప్తులకూ, కలలకూ, - కళలు ఆకారాన్ని కల్పించి, దౌర్బల్య కిల్బిషమనే ఖిలంనుంచి మానవతను కాపాడేందుకు హృదయానికి కళాయి పెడుతుంది ... మానవావగాహనకు అతీతమైన సర్వసమస్యలను విపులీకరించుకుంటూ, సర్వసందేహాలనూ తొలగించుకుంటూ గమనం సాగిస్తుంది - మానవ మస్తిష్కం ! ఇట్టి పరిశోధనాత్మకమైన విశదీకరణలోనే తత్వశాస్త్రం అభివృద్ధి చెందింది. ఈ రెండూ అవినాభావసంబంధం కలిగి 'ఓతప్రోతాల' వలె (పడుగుపేకలు) అల్లుకొని వుంటాయి. కనుక ఇట్టి శక్తులతో కూడిన మానవుడు జీవితంపట్ల పరమాస్తికుడై కర్తవ్యపథాన్ని సుసంఘటితం చేసుకోవలసి వున్నది. కాబట్టి, నెహ్రూపండితు డన్నట్లుగా,"వర్తమానకాలపు బాహ్యావాస్తవికతలతో, తాను జీవిస్తున్న సామాజిక సత్యాలతో వ్యక్తి జీవితానికి విడతీయలేని సంబంధం పెనగొనాలి." (It is not life unless we can find the vital link between it and the present - Discovery of India)

## విద్య - విజ్ఞానము

మానవుడు తన వ్యక్తిగత శీలతకేగాక సమాజ పరమైన ధర్మంగాకూడ యితర వ్యక్తులయెడల సమదృష్టిని మైత్రిని, కరుణను పెంపొందించుకోవాలి. తద్వారా సమాజవిహితాలైన ధర్మాలను నిర్వర్తించుకోవాలి.

" అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణీవచః
నిర్మమో నిరహంకార
స్సమదుఃఖ సుఖఃక్షమీ."

సర్వభూతములందూ, సర్వజీవులందూ కరుణా, మైత్రీ సమభావములను మానవుడు ప్రదర్శించాలి. నిరహంకార నిర్మమకారద్వంద్వాతీతుడగుటకు మానవుడు సాధనచేయాలి.

సహజంగా అరిషడ్వర్గాలచేత వ్యక్తి ప్రేరితుడౌతూనే వుంటాడు. కాని జ్ఞానసముపార్జనద్వారా వానిని జయించగలుగుతాడు. జ్ఞానమనునది విద్యాపరంగానే లభిస్తుంది. విద్య అనేది పాఠశాల విద్యమాత్రమే కాదు. "అధీతి బోధాచరణ ప్రచారణైః" అన్న వాక్యానుసారం విద్యకు నాలుగు దశలున్నాయి. మొదటిది - అధ్యయనము, రెండోది బోధపరచడము, మూడవది ఆచరించడము, నాల్గవది - అంతటితో ఆగక ఇతరులుకూడ ఆచరించునట్లు ప్రచారం చేయడం, ఈ నాల్గింటిలో ఏ అంగం కుంటుపడినా మన ప్రాచీనుల దృష్టిలో అది విద్య కానేరదు.

## సుఖ దుఃఖాలు

ఇట్టి విద్యద్వారా కలిగే జ్ఞానంవల్లనే వ్యక్తికి సుఖం ప్రాప్తిస్తుంది. న్యాయదర్శనం ప్రకారం - "అనుకూల వేదనీయం- సుఖం, ప్రతికూల వేదనీయం- దుఃఖం!" వేదనీయం అనగా జ్ఞానం.

సుఖదుఃఖాల గురించి భర్తృహరి యిలా అంటాడు - "ప్రతీకారో వ్యాధే సుఖమితి విపర్యస్యతిజనః" - వ్యాధి వగైరా ఈతిబాధలకు ప్రతీకారం కల్పించుకోవడమే సుఖం. కనుక నిత్యజీవితంలో కర్మయోగాన్ని అవగాహన చేసుకొని జీవితంపై విరుచుకపడే బాధలపై సచేతనమైన ప్రతీకారాన్ని చేయడం ద్వారానే సుఖం సిద్ధిస్తుంది. ఇట్టి సుఖాన్వేషణకు వ్యక్తిగా చేసిన ప్రతీకారమే 'కర్మ' అనీ, సమష్టి కర్మమే 'ఉద్యమ' మనీ మనం అవగాహనం చేసుకోవాలి. ఇట్టి కర్మఫలసిద్ధి భగవద్గీత ప్రకారం ఈ క్రింది ఐదు కారణాలవల్లనూ ఏర్పడుతుంది;-

"అధిష్టానం తథాకర్మాః
కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా
దైవం చైవాత్ర పంచమమ్."

ఒక కర్మఫలసిద్ధి పొందడానికి 5 కారణభూతాల ప్రభావం కలుగుతుంది. (1) అధిష్టానం (అనగా అప్పటికి లభించిన చారిత్రక భూమిక), (2) కర్త (అనగా ఆచరించగల పురుషుని శక్తి యుక్తు లు), (3) నానావిధములైన సాధనాలు (Currents), (4) అనేకములైన యితర కార్యములు (Cross currents - యితర శక్తులు), (5) సూర్యాది అధిదైవిక భౌగోళిక కారణాలు.

ఇట్టి కారణాల మధ్య తన వివ్యక్త ధర్మాన్ని నిర్ధరించుకొని తన గమ్యాన్ని చేరుకోనేందుకు ఉద్యమ రూపంలో అభివృద్ధిపొందాలి. ఒక్కొక్క పరిస్థితిలో వ్యక్తి శ్రేయస్సుకూ, సమాజ శ్రేయస్సుకూ అనుకూలత కలుగవచ్చును. అట్లు గాక వ్యక్తి శ్రేయస్సుకూ, సమాజ శ్రేయస్సుకూ వైరుధ్య మేర్పడినప్పుడూ, అలాగే ఒక సంఘ శ్రేయస్సుకూ, దేశ శ్రేయస్సుకూ వైరుధ్య మేర్పడినప్పుడూ, దేశశ్రేయస్సుకూ, విశ్వశ్రేయస్సుకూ వైరుధ్య మేర్పడినప్పుడూ క్రమానుగతంగా అల్ప ప్రయోజనాలను అధిక ప్రయోజనాలకోసం త్యాగం చేయాలి.

ఇలాంటి సమస్యలోనే మానవుడు నిర్వర్తించవలసిన పాత్రగురించి విదురుడు ధృతరాష్ట్రునితో ఇలా చెప్పాడు :

"త్యజేదేకం కులస్యార్థే
గ్రామ స్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే
ఆత్మార్థే పృథ్వీం త్యజేత్ !"

"సంఘంకోరకు వ్యక్తినీ, గ్రామంకోసం కుటుంబాన్ని (కులాన్ని), జనపదంకోసం గ్రామాన్ని, ఆత్మకోసం (conbictions) పృథ్వీని త్యజించుము!" అని అన్నాడు.

అంటే వ్యక్తి ఆత్మవిశ్వాసాలు (Convictions) విశ్వజన శ్రేయోదాయకంగా ఉండాలి. త్యాగశీలతతో నిండిన స్థితప్రజ్ఞుని జ్ఞానం విశ్వశ్రేయోదాయకంగా ఉంటుంది.

"ఉదార చరితానాంతు
వసుధైవ కుటుంబకమ్ !"

అనెడి మహోన్నతజ్ఞానస్థితిని అందుటకే మానవుడు ప్రకృతిపురుషుల తత్వసంబంధాలను తెలుసుకో ప్రారంభించాడు. అందుకే మానవుని కర్మలో తత్వశాస్త్రం, పాలలోని వెన్నవలె నిబిడీకృతమై ఉండాలి. అందుచే జ్ఞానసహిత కర్మలు కర్మయోగికి అవసరమ. జ్ఞాన, కర్మలనునవి (ఆలోచనా, ఆచరణా) ప్రాణదేహాలవలె అవిభాజ్యంగా రాణించాలి. జ్ఞానరహితమైన కర్మగాని, కర్మరహితమైన జ్ఞానముగాని సర్వతోముఖాభివృద్ధి నందుకోలేవు.



# ఆత్మవృత్తాంతం

## త్రిపురనేని వెంకటేశ్వరరావు

వైదికవాఙ్మయంలో సంహితా, బ్రాహ్మణముల రచన ముగిసి, ఉపనిషద్రచనారంభమునుండి నేటి వరకు భారత దార్శనికసాహిత్యం ఆత్మనుగూర్చి విశేషంగా చర్చిస్తూవచ్చింది. రానురాను అది భారత తత్వశాస్త్రానికి ఆయువుపట్టుగా, ముడిగా స్థానం సంపాదించింది. అది భారత ప్రతిభాద్యోతనకు పట్టిన అద్దంగా పరిగణన కెక్కింది. అందుచేత భారత తత్వశాస్త్రాన్ని చారిత్రికంగా శోధించే ఆధునికు లెవ్వరుగాని యీ చర్చలో తలదూర్చకుండా, స్వీయాభిప్రాయాలను వ్యక్తపరచకుండా తప్పించుకోజాలరు. అలా తప్పించుకొన జూడడమంటే పరిశోధనకే అపచారం ఘటించినట్లవుతుంది. ఈ పరిశోధనకు పుష్టిని, సమగ్రతను చేకూర్చడానికి వివిధ తెగల కీ విషయంలో గల నమ్మకాలనుగూర్చిన మానవ శాస్త్రాలనుండి, పాశ్చాత్య తాత్త్వికచరిత్రలనుండి సహాయాన్ని అపేక్షించడం అనుచితంకాదు సరిగదా, అత్యంత ప్రయోజనకారి అవుతుంది.

'ఆత్మభావా'నికి జన్మకారణం స్వాప్నికరూపాలని మానుషశాస్త్రం ఏకగ్రీవంగా ఉగ్గడిస్తోంది. అందులో రెండో అభిప్రాయమే లేదు. మానుష శాస్త్రంలోని యీ వినిశ్చయస్థితి ఎంతో వుత్సాహకరంగా వున్నది. ఇక్కడ "టైలర్" మహాశయుని వాక్యం వుదాహరించడం వలన విషయం చక్కబడుతుంది.

"My own view is that nothing but dreams and visions could ever put into men's minds such an idea as that of souls being ethereal images of bodies" Page 450, - Vol. I. E. B. Tylor.

ఇది ఆయన దృక్పథమేగాదు; 'ఫ్రేజరు' మొదలు మానుషశాస్త్ర వేత్తలందరి దృక్పథం కూడాను.

(2) 'దేహము - ఆత్మ' అనే ద్వైతభావం మానవుని మేధస్సులో అనాదిసిద్ధంగా పాదుకట్టుకొని వస్తూవుంది. అనగా ఆటవికస్థితి (Savagery) నాడే పాదుకొన్నదిగా వూహింపబూనడం సులభమే. అదీ నిజమే కాని ఆ వూహ ఆ లోతును మీరి చొచ్చుకుపోకుంటే, దాని నిజస్థితిని సమగ్రంగా ఆకళింపు చేసుకొన్నట్లు గాదు. మానవుడుగా పరిణతినందగల అంగనిర్మాణంలేని *'అరుగ్నేషియన్' వానరులకే (ఫ్రాన్సులో లభించిన జాతి) యీ ద్వైతభావం కుదిరివుంది. వారి గుహల్లో మృతకళేబరాలకు వొకమోస్తరు శిలాసమాధులు అమర్చబడినట్లు కానవచ్చింది. నరుడుగా పరిణతి పొందలేక నశించిపోయిన వానర మేధస్సుకే పట్టువడిన విశ్వాసమిది కాగా, మరణానంతర జీవితాన్ని ప్రతిపాదించి విశ్వసించని ఆటవిక తెగలు చెదురు, అపురూపము. అటువంటి విశ్వాసం కుదుర్చుకోని తెగలుకూడా ఆత్మలో విశ్వసిస్తూనే వున్నాయి. మరణానంతర జీవిత ప్రతిపాదనలేకుండా, ఆత్మలో విశ్వసించే తెగలు దేహంతో పాటే అదీ నశిస్తుందంటారు. ఇదొక విచిత్రవిషయం. ఉదాహరణకు కన్యా కొండవాళ్ళలో నివసించే తెగలు ఉత్తర నైగీరియాలో 'రోబా', ఉత్తర 'యుంగూర్' తెగలు అలాగే విశ్వసిస్తాయి. మరికొన్ని తెగలయితే నిరుపేదల, పాపకర్ములయొక్క ఆత్మలు దేహంతోటే నశించి ధనవంతుల, పుణ్యుల ఆత్మలకు మరణానంతర జీవితం వుంటుందని నమ్ముతాయి. మరికొన్ని యిందుకు విపర్యయమైన విశ్వాసంకూడా కుదుర్చుకొని వున్నాయి. మన దేశంలో మధ్యప్రదేశ్‌లో 'బింఝ్వార్' (Binghwar) అనే ద్రావిడతెగ పాపుల ఆత్మలు బ్రతికి, పుణ్యులవే నశిస్తాయని నమ్ముతుంది. దేహంతోపాటు వెంటనే ఆత్మ నశించదనే తెగలేవీ ఆత్మను అజరామరమని భావించవు. దేహంవలె ఆత్మ

* పురాతత్వ పరిశోధకులు ఫ్రాన్సులో యీ తెగను కనుగొని యిలా నామకరణం చేశారు. శవాల తలల క్రింద వొత్తుగా రాతి తలగడాలు అమర్చారు. చుట్టూరా, పైనా రాతిపేరుపు సమాధిగా పెట్టారు. చెచ్చురాళ్ల (Slake type) ఆయుధాలను, మాంసపు చట్టలను ప్రక్కన వుంచారు. వారి నుదురులు బాగా పల్లంగా వుండి, దవడలు ముందుకు సాగి పుర్రె ఆకృతి పశువులకు పోలివుంటుంది. శవాలను భద్రపరచడ ముంటే, ఆత్మభావం అనివార్యంగా వుండడమేగాక, ఆ భావం శుద్ధద్రవ్యమయంగా కూడా వుంటుంది.

కూడా మరణధర్మంగలది అంటారు. ఐతే దేహంపతనం మాత్రం ముందని, ఆ వెనుక మరొక కాలానికి ఆత్మ నశిస్తుందని అంటాయి. ఆత్మ శాశ్వతమనే భావం అనంతర కాలంలో భావనాభివృద్ధివలన ఏర్పడింది. ఇంతకూ చెప్పవచ్చినది - ఈ ద్వైత విశ్వాసం మానవావతరణతోనూ, వాస్తవముగా అంతకు ముందునుండే ప్రారంభమైనదని, పైగా అది సార్వజనీనమని భావం.

ఈ నిర్ణయం నేటివరకు మానవశాస్త్రంలో అధికాధికుల దృక్పథం. కాని ఆ శాస్త్రం గొంతులో జీగవలె మరో ప్రత్యామ్నాయ దృక్పథం లేకపోలేదు. ఈ సందర్భంలో శ్రీ ఎ.బి. కీత్ మహాశయుని వుదాహరించడం ఉచితం.

"It is impossible to suppose, as is now so often done, that the earliest or even the early form of religion was the belief in spirits which take up their abode from time to time in various forms. It cannot have been until long experience that the idea of a disembodied spirit can have been intelligible. Primitive man must long have regarded body and mind as one"—Introduction to Aitareya Aranyaka (By A. B. Keith.)

దేహంతో అవినాభావసంబంధంలేని ఆత్మవంటి భావం ఆదిమంగాదని, దేహేతరమైన ఆత్మభావం పూర్వమానవుని కర్థంగావడమన్నది దీర్ఘానుభవంమీదగాని సాధ్యపడదన్నదే పై వాక్యాల సారాంశం. తొట్టతొలుత మానవుడు మనోదేహాలను ఏకీకృతంగానే విశ్వసించాడన్నదే యీ వాదం. అసలు జడపదార్థాలను అర్థంచేసుకోనేలేదని, సర్వ విషయాలను కృపాకోపద్వేషాదులవంటి మానసిక లక్షణాలను గలవిగా చూశాడని తాత్పర్యం. జడ, చైతన్యాలు విభిన్నమనే 'ఉన్నత' జ్ఞానస్థాయిని దేహేతర ఆత్మభావం సూచిస్తుందని అనబడింది.

ఈ వాదన తార్కికంగా సవ్యమని స్ఫురింపబోయినప్పటికీ వాస్తవ పరిస్థితులను గమనికలోకి తైకొన్నట్లయితే సత్య సామీప్యత లోపిస్తోంది. నేడున్న ఆటవిక తెగలలో యిటువంటి నమ్మకం కానరావడం దృగ్గ్యం. పైగా కలలు జంతుజాలానికి సైతం వస్తాయని మానసిక శాస్త్రవేత్తల అనుభవం చెబుతోంది. అందుచేత వానరం మానవ మస్తిష్కాన్ని సంపాదించే సరికే స్వప్నానుభవం ఎంతో వుండగలదనడం స్పష్టం. ఏమాత్రం ఆలోచించడానికి అనుకూలించే అంగంగా వానరమస్తిష్కం వృద్ధిపొందినా యీ విశ్వాసం నెలకొనడం విశేషంగాదు. పైగా యీ ద్వైతభావానికి ముందు ఆత్మ, మనోవ్యాపారాలకు దేహంతోగల సంబంధమేమిటన్న సమస్యే తట్టడానికి వీలుగలస్థాయి అతని కెక్కడ లభిస్తుంది?

ఈ వివాద పర్యవసానం ఎలా తేలినప్పటికీ మన ప్రస్తుత పరిశీలనకు, నిర్ణయాలకు నిమిత్తం వుండదు. ద్వైతభావానికి ముందొక దశ వున్నదా, లేదా అన్నదే యిందులోని మీమాంస. కాని ప్రస్తుత అవలోకనమంతా ద్వైతం ఏర్పడ్డాక, ఆ ద్వైతంయొక్క స్వభావం ఎటువంటిదో కనుగోవడమేగదా!

(3) ఆటవికుల ఆత్మభావాలను అతి సూక్ష్మంగా అధ్యయనంచేసి మానవశాస్త్రం తత్స్వరూప నిర్మాణాలనుగూర్చి వొకానొక స్థూలాభిప్రాయాన్ని వెలువరించింది. దానిని టైలర్ మహాశయుని వాక్యాలలో కనుగొందాము.

"It is a thin unsubstantial huma[n] image, in its nature, a sort of vapour film or shadow".

"Among rude races, the origina[l] conception of the human soul seems t[o] have been that of ethereality or vapou[r] materiality, which has held so large place in human thought ever since." Page 457.

ఆత్మ మానవాకృతిలో వుందని, దాని స్వభావం సూక్ష్మవాయుకద్రవ్యత్వమని దీని భావం.

"As souls appear in dreams an[d] visions, they were thought to posse[ss] thin bodies to be visible, to b[e] moving, to be speaking".

దీనివల్ల ఆత్మలు సూక్ష్మశరీరములని సైతం తేల్చబడింది. ఆత్మకు, నీడకు (ఛాయకు)-ఆత్మకు, వూపిరికి అనేక భాషలలో వొకేవొక శబ్దం శ్లేషార్థాన్ని కలిగి వుండడాన్ని పుష్కలంగా గమనిస్తాము.

| | భాష | శబ్దం | అర్థాలు |
|---|---|---|---|
| 1. | అరవాక్ | 'యుఎజ' | ఛాయ, ప్రతిబింబం, ఆత్మ. |
| 2. | అబిపోన్స్ | 'లోయేకల్' | పై మూడుతో పాటు ప్రతిధ్వని అనే అదనపు అర్థం |
| 3. | జూలూస్ | 'టుంజి' | ఛాయ, ఆత్మ |
| 4. | బసూటోస్ | 'సెరిటి' | ,, ,, |
| 5. | 'క్విచే' | 'నటుబ్' | ,, ,, |
| 6. | 'అల్గాన్ క్విన్స్' | 'ఓటహెచుక్' | ,, ,, |
| 7. | పశ్చిమాస్ట్రేలియన్ | 'వంగ్' | ఊపిరి, ఆత్మ |
| 8. | 'నెటెలా' (కాలిఫోర్నియా) | 'పియుట్స్' | ,, ,, |
| 9. | 'జావానీస్' | 'ణవ' | ,, ,, |
| 10. | 'హిబ్రూ' | 'నెపెష్' | ,, ,, |
| 11. | అరబిక్ | 'నెఫ్స్', 'రుహ' | ,, ,, |
| *12. | గ్రీకు | 'సైక్', 'న్యుమ' | ,, ,, |
| *13. | లాటిన్ | 'యానిమస్', 'యానిమ' 'స్పిరిటస్' | ,, ,, |
| *14. | స్లావోనిక్ | 'దూచ్' | ,, ,, |
| *15. | జర్మన్ | 'జీస్ట్' | ఇవి ఆదిలో శ్వాసమనే అర్థాన్ని కలిగి వున్నాయని విజ్ఞులు తేల్చారు |
| 16. | ఇంగ్లీషు | 'ఘోస్టు' | |
| *17. | 'జిప్సీ' | 'దూక్' | ఊపిరి ఆత్మ |

ఆత్మను శ్వాసవాయువుగా భావించడం ప్రపంచంలో చాల హెచ్చు. అది పునాదిగా అనేక ఆచారాలు రూపుగొన్నాయి. చనిపోతున్న వారి ముఖంలో ముఖం పెట్టించి పసిపిల్లలచేత అతని శ్వాసాన్ని పీల్పించి తద్వారా పిల్లలలో ఆత్మ ప్రవేశించిందని సంతోషించే నమ్మకం ఫ్లోరిడా 'సెమినోకిల్సు' తెగ మొదలు నాగరిక రోమన్ జాతివరకు వుంది. మన దేశంలో తుమ్మినప్పుడు 'కృష్ణ' అంటారు. బౌద్ధ సాహిత్యంలో కూడా తత్ప్రసక్తి కద్దు. ఉపన్యసిస్తుండగా బుద్ధునికి తుమ్ము వచ్చింది. వింటున్న శ్రోతృలోకమంతా 'జీవ, జీవ' అని ఉపశాంతి పదాలు వుచ్చరించారు. బుద్ధుడదిచూసి ఆ అలవాటును, దాని వెనక వున్న నమ్మకాన్ని నిరసించి, వారించాడు. తన పరివ్రాజకులా అలవాటును లోను గారాదని విధించాడు. ఇదే అలవాటు రోమన్లకూ, గ్రీకులకూ వుండేవి. తుమ్ములో ఎక్కువశ్వాస పోవడమే అందుకు కారణం కావాలి.

(4) ఇంతవరకు మానుషశాస్త్రంలోని భావసరళి పరిచితమైంది. ఇక తత్త్వప్రపంచంలోని పరిస్థితిని పర్యాలోకిస్తాము. పాశ్చాత్య తత్త్వకుటుంబాన్ని మున్ముందుగా తీసికొందాము. 'ఎపిక్యురస్' మహాశయుడు పాశ్చాత్యులకు చార్వాకుడు. కర్తలేని భౌతికవాదిగా ఆయనకు ఎన్నిక వుంది. ఆత్మ భౌతిక విషయంగావడం అనివార్యం, ఆవశ్యకం అని వక్కాణించాడు.

"There who say the soul is incorporeal talk folly, for it could neither do not suffer anything were it such"

నాటికే ఆత్మను ద్రవ్యరహితమైన శుద్ధచైతన్యంగా సూత్రీకరించేస్థితి గ్రీకు దార్శనికజగత్తులో ఏర్పడిందని భావించాలి. విశుద్ధచైతన్యమైన ఆత్మ నిష్ప్రయోజకమవుతుందని 'ఎపిక్యురస్' విమర్శ. ఆ లోపనివారణకు ఆత్మ మూలపదార్థం గావలసివుంటుందని ప్రతిపాదించాడు. భౌతికవాదియైన యీయన ఆత్మ నంగీకరించాడన్నది ఆధునికుణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి గావించవచ్చు గాని, తత్ప్రతిపాదనానంతరం దానిని ద్రవ్యమయంగా వూహించాడని తెల్సుకోవడంలో విశేషం లేదు. ఆయన ఆత్మ శాశ్వతావాదాన్ని కూడా ఖండించాడు. మళ్ళీ ఆత్మ దేహంతో పాటుగా నశిస్తుందని అనలేదు. మరణానంతరం దైహికస్పర్శ ఆత్మకు కొరవడుతున్నందున ఆత్మాణువుల్లో అనుభూతి, సంజ్ఞ, జ్ఞానం కలుగనేరక చేతనారహిత మవుతుందన్నాడు. చేతనారహితమైనది లేనట్లే లెక్క. అగ్ని, శ్వాసల అణువుల కూడిక ఆత్మ. (శ్వాసవాయువుకన్నా భిన్నమంటాడు ఆయన). ఈ అణువులు దేహమంతటా పర్యాప్తమైవుంటా యన్నాడు

విశ్వపరిణతికి మూలద్రవ్యం వాయువని ప్రతిపాదించిన 'ఎనక్జమనీస్', ఆత్మను సూక్ష్మతమ వాయువన్నాడు. 'స్పిరిట్' (Spirit) అనే యింగ్లీషు శబ్దానికి అర్థం సూక్ష్మవాయువే. జగదాద్యపదార్థం 'అగ్ని' అని సూత్రీకరించిన 'హిరాక్లిటస్' ఆత్మను అత్యంత సూక్ష్మమైన అగ్ని అన్నాడు. ఇంగ్లీషు భాషలోని 'క్వింట్ ఎస్సెన్సు' (Quint Essence) అనే శబ్దంకూడా 'హిరాక్లిటస్' మహాశయుని భావ

* ఆర్య భాషలలో ముఖ్యంగా ఆత్మ శబ్దం శ్వాసం అనే అర్థాన్ని కూడా కలిగిఉండటం గమనార్హం.

వనే పొదవుకొన్నది. ఆ శబ్దం ఆత్మను ఐదవ సారాంశంగా సూచిస్తుంది. చతుస్సారాలు ఆకాశం మినహా తతిమ్మా చతుర్భూతాలుకాగా, పంచమసారం ఆత్మ - సూక్ష్మతమాగ్ని.

అమోనియన్ తాత్వికుల్లో గణితనిష్ణాతులై తత్త్వభావం తోను తత్త్వచింతనపై ప్రసరింపజేసుకొన్నవారు 'ఎనగ్జిమాండర్', 'పైథాగరస్' మహాశయులు. వీరు చతుర్భూతాలలో దేనినో ఎన్నికజేసి జగన్మూలద్రవ్యమని నామకరణంచేసే ధోరణికి వేరయ్యారు. గణిత స్వభావానికి తగ్గట్లుగా వస్తు నిర్దేశాన్ని విడనాడి ఒకానొక Abstraction ను ప్రవచించారు. అందులో వొకరు 'అనంతం' అన్నారు; వేరొకరు 'సంఖ్య' అన్నారు. ద్రవ్య నిర్దిష్టతకు దూరమయ్యే ధోరణిని ప్రవేశపెట్టిన వీరుకూడా ఆత్మను పాదార్థికంగానే వూహిస్తూ వచ్చారు. ఇందులో 'పైథాగరస్' మహాశయుడు పునర్జన్మలో విశ్వసించినవాడు. ఆయన ఆత్మను 'ఈథర్ఖండము' (Chip of Ether) గా వూహించాడు. ఆయన అవగాహనలో 'ఈథర్' అనగా ఆవిరి 'ఎంపెడోకిల్స్'కూడా పునర్జన్మను బోధించినవాడే. ఆత్మస్వభావం విషయంలో ఆయన భావన అక్షరాల 'పైథాగరస్'దేగాని భిన్నంకాదు. నాకు అజ్ఞత చాలకపోవచ్చునేమోగాని, ప్రాచీన గ్రీకు మహాదార్శనికులలో పేరెన్నికగన్న భౌతికవాదు లందరూ విడువకుండా ఆత్మభావంలో విశ్వాసమున్నవారేనని తీర్మానించడం సత్యసమ్మత మవుతుంది. బహుశా, దేహాతరంగా ఆత్మఅంటూ లేనేలేదన్నవారు ప్రాచీన గ్రీకుతత్త్వ ప్రపంచంలో లెక్కకొక్కరుకూడా లేరనవచ్చును.

మరోవిషయాన్ని పరికించుదాము. భావవాద చక్రవర్తి అనదగిన ప్లేటో మహాశయుడు కూడా ఆనాటికి ఆత్మను విశుద్ధచేతనంగా నిర్వచించలేకపోయాడు. "The soul is compounded of the indivisible - unchangeable and the divisible - changeable; it is a third and intermediate kind of essence" - Russel's Histroy of W. Philosophy. ఇక ఆత్మను, చైతన్యాన్ని విడదీయప్రారంభించినవాడు 'అరిస్టోటిల్' మహాశయుడు. ఆత్మ దేహంతో నశిస్తుంది. కాని ఆత్మలో ఒక భాగంలో సంస్థితమైన మనస్సు (Mind - చైతన్యం) మాత్రం మరణించదు. మనో వ్యాపారమేమంటే భావన. గణితాన్ని, తత్వశాస్త్రాన్ని సమాలోచించడం; అది అజరామరం. దేహంలోని చలనాలకు, యింద్రియగోచర విషయాలను పరిశీలించడానికి మాత్రమే అయితే అంతవనుక అందరూ భావించిన ఆత్మ సరిపడుతుంది; అది దేహంతో మరణించినా ప్రమాదం లేదు. పాదార్థికమైనది మరణించాలిగదా! అమృతత్వం గావాలంటే భావనాత్మక విషయం గావాలి అన్న తర్కమే 'అరిస్టోటిల్' దృష్టిలో యిమిడి వున్నది.

ఇక మధ్యయుగమంతా ప్లేటో, అరిస్టోటిల్ మహామహుల ఆత్మభావాలలోని మంచిచెడ్డల ఖండనమండనలతో యిరువాగులుగా తాత్వికులు చీలి సంకుల సమరం సాగించడంలో తెల్లవారింది. చైతన్యాన్ని, భావనను ఆత్మగారి సంరక్షకత్వంనుండి తప్పించబూనడం పదహారో శతాబ్దంనుండి సాగి, జయప్రదమైంది. ఒకవైపున 'డీకార్టే' ఆత్మను ద్రవ్యరహితమైనదానిగా పోతబోశాడు. నాటినుండి ద్వైతం స్థూల, సూక్ష్మ ద్రవ్యాల మధ్యగాకుండా విశుద్ధచేతనం, ద్రవ్యాలమధ్యకు రంగస్థలాన్ని మార్చుకొన్నది.

(5) పైవన్నీ ప్రాచీనతాత్త్వికుల అభిప్రాయాలు. ఆ ప్రాచీనుల భావజాలంపై అధునాతనులైన తత్త్వచరిత్ర శోధకుల కొలగారం నడచిన తీరుతో పరిచయం పొందడం శ్రేయస్కరం. ఈ సందర్భంలో ఉద్గ్రంథాలనుండి ఉదాహరించడానికి నాకు అవకాశం లేకుంది. కాని సంక్షిప్తమైన, సవిమర్శకమైన ఒక్కని రచన ఒకదానినుండి ప్రస్తుతం పొందుపరుస్తాను. 'రస్సెల్', 'లీవిస్' (Lewis, G. H,) 'బర్నెట్' వంటివారంతా యిదేధోరణినిఅవలంబించారని మాటగా చెప్పవలచాను.

" పూర్తిగా అధునాతనార్థంలో కాకపోవచ్చునుగాని, సోక్రటీసుకు మున్నటివారందరూ ప్రధానంగా భౌతికవాదులు. జీవద్ద్రవ్యానికి, నిర్జీవద్రవ్యానికి మధ్యవారెట్టి విస్పష్టమైన తేడాను చూడలేదు; కాని ఆత్మ ద్రవ్యమయ విషయంగానే విశ్వసించబడింది."- 26 వ పేజీ.

"గమనించవలసినవాటిలో రెండోవిషయ మేమంటే యీ గ్రీకులందరూ కూడ భౌతికవాదులే. ద్రవ్యరహిత దైవంగూర్చిగాని, ద్రవ్యరహితమైన ఆత్మ, శక్తులను గూర్చిగాని వారికొక అభిప్రాయమంటూ ఏర్పడనే లేదు." 20 వ పేజీ.

" ఆత్మలు, దేవతలతోసహా జగత్తుఅంతా కాల ప్రదేశగతమైవుండే వొకేవొక పదార్థం (Sub-

stance)తో నిర్మించబడివుంది. ఆ పదార్థం ద్రవ్యమయం (Material)". 22, 23 పేజీలు.

(From Philosophy for pleasure, by Hector Hawton.)

నాకు తెలిసినంతలో క్లుప్తమైన యీ అంచనాలు పాశ్చాత్యతత్వ చరిత్రకారులలో నిర్వివాదమైనవి. ఈ విషయంలో శ్రీ హాటన్ కొత్తదనంకై పరుగెత్తింది లేదు. * ఇంతటితో పాశ్చాత్య దార్శనికపరిశోధనా పరిశీలనను ముగించబోయేముందు ప్రస్తావించిన విషయ సారాంశాన్ని క్రోడీకరించుతాను. ఆత్మభావం జననములో, శైశవములో ద్రవ్యాత్మకంగా, ముగ్ధంగా ఊహించబడింది. బాల్యావస్థనుండి క్రమంగా యౌవన ప్రాగల్భ్యాన్ని పడసింది. ద్రవ్యరాహిత్యంతో ప్రౌఢిమను సంతరించుకొన్నది. ఈ ప్రౌఢిమకు మరపురాని మచ్చగా ద్రవ్యాత్మక దేహంతోడి సంబంధ, సంపర్కాలు అనివార్యమై మిగిలి కలవరపరుస్తుంటాయి. కాని, ఆ ప్రౌఢాత్మ తనలోప సకలాన్ని మరచి గురివెంద గింజలా నంగనాచి బ్రతుకును వెళ్ళమార్చడానికి సదా యత్నంలోనే వుంది.

## భారతీయ దృక్పథాలు

(6) ఇక నీ నేపథ్యభూమికను విరమించి, భారతీయ తాత్విక రంగస్థలంపైన యవనికను పైకెత్తుదాము. ముందుగా శ్రీ వివేకానందస్వామిని ప్రవేశపెట్టడం శుభారంభమవుతుంది. భారతప్రతిభ మూర్తీభూతమైన మహామహుడుగా యీయనకు చెల్లుబాటుకలిగింది. ఈయన అద్వైతప్రవక్త. పశ్చిమఖండాలకు ప్రయాణించగల్గినందుకు వారి భావనా వాహికల వొడ్డులపై నడమట తటస్థించినది. ఇది వీరి రచనా, ప్రసంగాల నుండి గ్రహించగలం. 'ఆత్మస్వభావం - దానిగమ్యం' (Nature of the soul and its goal - Vol. VI, works of Vivekananda.) అనేవొక వ్యాసాన్ని గమనించవలసివుంది. ఆవ్యాసంలో ఈజిప్షియన్, క్రిస్టియన్ ఆత్మభావాలుకూడా అవలోడన చేయబడ్డాయి ఈజిప్షియనులు దేహపతనానంతరం ఆత్మ కొంతకాలం మనుతుందని, దేహం గాయపడినా క్షతమైనా ఆత్మ అలాగే క్షతమవుతుందని విశ్వసిస్తారని అన్నారు. "ఇక ఆర్యభావనను గమనించుదాం. ఒక్కమారుగా మనకో పెద్ద తారతమ్యం కానవస్తుంది. ఇక్కడ కూడా ఈజిప్షియనుల ఆత్మవుంది, కాని అదొక భావనాత్మక శరీరంగా (Spiritual body) వుంటోంది." ఈ విధంగా భారతీయుడుగా ఆనవాయితీగా స్వాతిశయవచనాలు పదివిన తర్వాత వాస్తవ స్థితిని చిత్రిస్తారు.

"ఈజిప్షియనులలోవున్న ఆత్మభావనను అతి పురాతనయుగంలో ఆర్యులు తమంతతాముగానే కలిగి వుండడానికి, లేక, కలిగి వుండొచ్చుననడానికి బాగా అవకాశం వుంది. అత్యంత పురాతనమైన వారి ఆధారాలను అధ్యయనం చేసినట్లయితే ఈ అభిప్రాయముండడానికిగల అవకాశాన్ని పరికించగలం. మానవుడు మరణించినప్పుడీఆత్మ పితరుల మధ్య నివసించడానికి వెళ్ళిపోతుంది. అక్కడ పితరుల సుఖాలను అనుభవిస్తూ జీవిస్తుంటుంది."

"అనంతర మీ భావన ఉన్నతపథాల కందుకుంటుంది. అంతకుముందు వారు ఆత్మ అనుకొన్నది వాస్తవంగా ఆత్మకాదని తెల్సుకోసాగారు. ఈ తేజశ్శరీరం, సూక్ష్మశరీరం-ఎంత సూక్ష్మాతి సూక్ష్మమైన దైతేనేమి? అదీవొకశరీర (Body)మే. శరీరమన్న దిస్థూలమో సూక్ష్మమోగాని ద్రవ్యరాశితో తయారైందే కావాలి. స్వరూపమో, ఆకారమో గలదల్లా పరిమితమైనది గావాలి; శాశ్వతం గాజాలదు. స్వరూపమన్నదానిలో పరిణామం నైజధర్మంగా వుంటుంది. పరిణామశీలమైనది శాశ్వతమేలా కాగల్గుతుంది? ఈ ఆక్షేపణతో యీ తేజశ్శరీరాన్ని అలాగే వుంచి దానివెనక మానవుని నిజమైన ఆత్మను కనుగొన్నారు ... ఆ విధంగా అసలు ఆత్మభావన ప్రారంభమైంది." - 18వ పేజీ, వివేకానంద గ్రంథావళి, ఆరోసంపుటం.

ఆత్మభావాన్నిగూర్చి భారతావని మేధః ఫలకం మీద కొంత పరిణామ చరిత్ర చెక్కబడివుందని, అది భౌతిక విషయంగా ప్రారంభమై, చిన్మాత్రమైనదిగా పరిణమించినదని పై పంక్తులలో ప్రస్ఫుటంగా తేల్చి చెప్పారు. ఆర్యుల పురాతనాధారాలంటే వేదసంహితాలని గ్రహించడం కష్టతరంగాదు; వివాదగ్రస్తం గాదు కూడా! అనగా వైదిక సాహిత్యంలో ఆర్యుల ఆత్మభావన యింకా ద్రవ్యాత్మకంగావుందని వారి అభిప్రాయమన్నమాట. దానినే మున్ముందు పరామర్శ చేయవలసివుంది.

ఇక్కడొక ప్రస్తావనను పాఠకులు మన్నించవలసి వుంటుంది. పాశ్చాత్యపండితులు ఆత్మభావం భౌతిక

* మార్క్సిస్టుదార్శనికులు ప్లెఖనోవ్, బుఖారిన్ లుకూడా యిదే అభిప్రాయాన్ని అభివ్యంజనం చేశారు.

విషయంగా క్రియాత్వోకలి భావవాదవిషయంగా పరిణమించిందని నిరూపించడంలో మరో సూక్ష్మరహస్యం యిమిడివుంది. భౌతికమయమైన భావన మానవుని మేధస్సులో శైశవావస్థను సూచిస్తుందని, భావవాద సరళి మేధోవికాసనకు చిహ్నమని వీరు యీ పరిస్థితిపై తీర్పు యిస్తారు. ఇది సరికాదని, మానవుని ఆలోచన సహజంగా, స్వాభావికంగా, అజ్ఞాతంగానూ ద్రవ్యాత్మకంగానే వసుస్తుందని, మేధోవికసన కృతకమైన ధోరణిలో పడి, బుద్ధిజాడ్యమబ్బి భావవాద వీచికలలో వొయ్యారాలు పోతుందని భౌతికవాదు లనవలసి వుంటుంది. బుద్ధి వికాసం, నైశిత్యం మీరినకొలదీ భౌతికవాదం బలపడుతూ వుండడం, భావవాదం ఒక్కచిక్కడం యిందుకు తార్కాణం.

ప్రస్తావవశంగా వచ్చిన యీ విషయాన్ని ముగించి విడిచిన కథను పూర్తిచేయాలి. భారత విషయాలపై భారతీయుని తీర్పు కరపథ్యంగా ప్రీతిచేసినా, విదేశీ పండితుల అభిప్రాయాలనుకూడా అటలోకి తీసుకోవడం ఔచిత్య మనిపించుకొంటుంది. ఏ. బి. కీత్, మాక్డోనల్, ఋషిదేవిడ్సు మహాశయులు వైదికసాహితీ సాగరాన్ని మథించి, సాధించి వెలువరించిన మహత్తత్త్వాలలో ఆత్మవిషయంకూడా వివేకానందునివలెనే నిర్ధారణ చేశారు. అద్వైతపక్షపాతి అయిన మాక్సు ముల్లరు పండితుడుకూడా అలాగే వ్యక్తపరచాడు.

"ఆత్మ ద్రవ్యాత్మకమైనదనేదే ఆదిలోని అభిప్రాయమని నిస్సందేహంగా చెప్పొచ్చు. ఈ దృక్పథముయొక్క చాయలు చాలా అనంతరకాలంవరకూ వూపిరి పోసుకొంటూ నిలబడేవున్నాయి"

[" At first the conception may no doubt have been that it was material and traces of the view persist late..." Page 48, ఐతరేయారణ్యకం, ఎ. బి. కీత్.]

మాక్డొనల్ పండితుడు Vedic Mythology అనే గ్రంథంలో (పేజీ-116) అదే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. ఆయన వేద సంహితలనుగూర్చి సూటిగా చెప్పాడు. 'ఋషి డేవిడ్సు' తన 'Buddist India' అనే గ్రంథంలో (పేజీలు-251, 252) అదే విధంగా సూత్రీకరించాడు. ఆత్మభావం ఒక రకమైన ద్రవ్యమయ పురుషునిగా ('Some sort of Material Homunculus') ప్రారంభమైనదన్నాడు.

(7) 'మాక్సు ముల్లర్' పండితుడు 'ఆత్మ' అన్న శబ్దం ఏ ఏ అర్థాలనుపొంది మారిందో చెప్పడానికి యత్నించాడు.

"చాలచోట్ల ఆత్మ అంటే యింకా శ్వాసమనే అర్థం లభిస్తుంది" (Atman, in several places still means breath. 71 Page).

"ఆ తర్వాత ఆదిప్రాణం, జీవమనే అర్థంలోకి వచ్చింది." ('It then came to mean vital breath; life') "ప్రాణం తర్వాత ఆత్మ అనే వర్తమానార్థంలోకి రావడానికి ఎంతోలేదు, కాని అదికూడా వాస్తవికమైన దనడంకన్నా వ్యాకరణ సంబంధంవల్లనే ననాలి" (From soul there is but a small step to self and that step is often grammatical rather than real. ఇందుకు ఉదాహరణగా 'బలమ్ దధానః ఆత్మని (ix 113 - 1) అన్న వాక్యాన్ని యిచ్చారు. (71, 72 పేజీలు, 'Six Systems of Indian philosophy') ఋగ్వేదంలోనే గాక, యితర సంహితలలో కూడా ఆత్మ శబ్దం వాడుకలోవున్న భావవాదార్థాన్ని పరిగ్రహించలేదని 'ముల్లరు' తేల్చి చెప్పారు.

ఇక 'ఆత్మ' శబ్దం యొక్క వ్యుత్పత్తి అర్థాన్ని, తత్సంబంధమైన మీమాంసను సంగ్రహంగా తెలుసుకుందాం. పాశ్చాత్య పండితుల్లో అధికాధికులు 'అన్' అను ధాతువునుండి 'ఆత్మ' శబ్దం రూపొందిందంటున్నారు; కొందరు 'అత్' అను ధాతువు నుండి అని అంటున్నారు. 'అత్' అను ధాతువు సంచరించే వాయువును సూచిస్తుందని, లేక జన్మాంతరాలకు సంచరించే 'సాంసారికాత్మ' ను స్ఫురింప జేస్తుందని అంటారు. ఈ రెండింటిలో వేదసంహితలలో ఆత్మను, వాయు సదృశమైనదిగా విస్తారంగా చెప్పడంచేత, పునర్జన్మభావం అప్పటికి తలయెత్తకున్నందున మొదటి అర్థాన్నే స్వీకరిస్తున్నారు.

గీర్వాణభాషలోని 'ఆత్మన్', జర్మన్‌లోని 'ఆత్మెన్' (Athmen) తో వ్యుత్పత్తి సంబంధాన్ని కలిగి వుందంటున్నారు. ఈ రెండు శబ్దాలకు మూల ధాతువు 'అన్' అయివుంది. 'అన్' అనగా శ్వాసించుట. 'ఆత్మన్' అనగా శ్వాసము, ఊపిరి. ప్రాణశబ్దం కూడా 'అన్' ధాతుభవమన్నది సులభంగా గ్రహించవచ్చు (ప్ర + అన్). ఆవిధంగా 'ఆత్మన్', 'ప్రాణం' రెండు శబ్దాల వ్యుత్పత్తి

ఒక్కటి గావడం విశేషం, గమనించదగ్గది. [కీత్ మహాశయుడు యీ రెండింటిలో దేనితోను తృప్తి పడలేదు. వేదంలో 'త్మనా' అనేశబ్దం 'ఆత్మన్'కు మారుగా ప్రయోగింపబడింది. ఋక్సంహిత అంతటి లోనూ యీ రూపాంతరం 78 మార్లు ప్రయోగంలో వుంది. పై రెండు ధాతువులు 'త్మనా' రూపాంతరానికి వివరణ యివ్వజాలవు. ఈ వివరణ లభించే వరకు 'ఆత్మన్' వ్యుత్పత్తిని గనుగొనడం పూర్తి గాలే దంటాడు 'కీత్']. ఇదేసందర్భంలో గత విషయాన్ని గుర్తు చేస్తాను. ఆర్యభాషలలో ఆత్మకు తుల్యమైన శబ్దాలకు శ్వాసఅనే అర్థం వుందని గమనికలో పెట్టుకొమ్మని లోగడ చెప్పాను. 'అన్' అనే ధాత్వర్థం అందుకు సరిపోయింది. ఏమైనా ఈ రెండు ధాత్వర్థాలు భౌతికవాద ఫణితిలో నడిచాయని చూస్తున్నాం.

(8) అనంతరకాలంలో ఆత్మభావం ఆర్జించుకొన్న భావవాద లక్షణాలకు ఋక్సంహితలోనే ప్రాతిపదికలో, రూపురేఖలో ఏర్పడి వున్నాయని నిరూపించడానికి శ్రీ హెచ్. జి. నరహరి 'ఆత్మ' (Atman) అనే సద్గ్రంథంలో ప్రయత్నించారు. కాని వారి పరిశ్రమకు తగ్గ ఫలితాన్ని సాధించలేదు. ఆత్మను (పరమాత్మను) అద్వైతులు సచ్చిదానందమంటారు. అందుకు తగ్గట్లుగా సంహితలో ఛాయలున్నాయి చూడుమంటారు. శ్రీ నరహరి ఆనందరూపమనేందుకు సంహిత సర్వం గాలిస్తే ఆయనకు లభించింది వొకేవొక సందర్భం. అది "ఆత్మ ఏవశేవో దిధిశయ్యోభూత్". (1-73-2) కొండను త్రవ్వి దొరికించుకొన్న యీ 'ఎలుకను' పరిశీలిస్తే, అదికాస్తా ఎలుకకూడా కాకుండా పోతుంది. ఈ వాక్యార్థం ఆత్మ ఆనందానికి ఆశ్రయం, స్థానంఅనిగాని ఆనందస్వరూపం అన్నదేమీ కాదు. మన చేష్టలకు, చేతనకార్యాలకు కారణమైన వస్తువే, అనగా కర్త, కర్మ ఫలితాలను అనుభవించే స్థానం కాకుంటుందా ? సంతోషానికి స్థానమెంతో, దుఃఖానికీ అంతే. ఇంతేగాక, ప్రాతిపదికలను అన్వేషించడమంటే అర్థం కొన్ని లోపాలతో, పరిమితులతో ఆ భావం భూస్వల్పో దారంపటె కొన్ని స్థలాలలో, తరచుగా వాడుక కెక్కినదానో, కాదో చూడాలి. అంతే గాని, గుడ్డివాడు గూటిలోవేసిన రాయివంటి దొక యాదృచ్ఛిక ప్రయోగాన్ని పట్టుకొని ప్రయోజనం లేదు. దేహేంద్రియాలతో సంపర్కాన్ని కల్గివున్నప్పుడే. స్వయంగా జడమైన ఆత్మ (న్యాయ, వైశేషికాలు) సుఖదుఃఖాలకు స్థానమైవుంది. ఆనందానికి స్థానమంటే అది ప్రత్యగాత్మే గావాలి. ఇక 'ఆత్మ' శబ్దం చేతనార్థంలో (ప్రజ్ఞ-Intelligence) వాడబడినట్లు సందర్భాన్ని కనిపెట్టి లెక్కించారు. కాని దానికీ అంగవైకల్యం, వైకృతం వుండి నిలబడలేకుంది. "భూమ్యా అసురస్పృగాత్మా" (1-164-4) అనే దానిలో 'అసుః' కన్నా ఆత్మను వేరుగా భావించినప్పటికీ అది 'భావనామాత్రం' గా (Thinking principle) అర్థమివ్వడం లేదంటారు మాక్సు ముల్లరు పండితులు- "Where was the breath, the blood, the spirit of the world ?" Here Atma may be rendered by spirit or life. Page 72, Six Systems of Indian Philosophy.

మనోశబ్దంమాత్రం ఐదుమార్లు 10వ మండలంలో 'ప్రజ్ఞ', 'భావనామాత్రం' గా వాడుక చేయబడింది. 'త్మనా', 'జీవ', 'ప్రాణ', 'సుపర్ణ', 'అసు', 'అజోభాగ', 'పురుష' - అనే యీశబ్దాలు ఆత్మకు పర్యాయపదాలుగా సంహితలో వాడుక చేయబడ్డాయి. ఇందులో ఏ వొకటీ వొకతూరికూడా చిదానందలక్షణాలకు చేరువగా ప్రయోగింపబడినట్లు నరహరిగారే చెప్పలేదు.

9. వ్యుత్పత్తి, ఒకానొక శబ్దం ఆ ప్రత్యేక సందర్భంలో ఏ అర్థం సూచిస్తుందనే మీమాంస-ముఖ్యంగా రెండో ధోరణి - కొంగ్రొత్తలు ప్రవేశించడాన్ని పట్టుకోడానికి ప్రశస్తమైనదిగాదు. పాత అభిప్రాయాల స్థానే కొత్తవి ప్రవేశించేప్పుడు అంత నిశ్శబ్దంగా, ప్రచ్ఛన్నంగా, చడీచప్పుడు చేయని సంగిగా వుండవు. ముఖ్యంగా వైదికసాహిత్యంలో అంత అవసరం లేదు. ఆత్మను గూర్చి ప్రస్ఫుటంగా వెల్వడిన భావాలు - వ్యుత్పత్తి, ప్రయోగవిశేషాలలోనో చోటు చూసుకోనవసరం లేనివి - కొన్ని వున్నాయి. (A) ఆత్మవాయురూపకం, (B) భూసంబంధమైనది. (C) సూర్యసంబంధమైనది. - ఇవీ ఆ భావాలు.

(A) 'ఆత్మాతే వాతమ్' - 7 మం. 87 సూ. 2 ఋ.

ఈ ఏడోమండలం ఆదిమ సంహితాభాగంలోనిది. వరుణ సూక్తంలో యీ ప్రస్తావన వచ్చింది; 'వరుణ చోదితమైన వాయువే ఎల్లజీవుల్లోనూ ఆత్మగా వున్నది, అని అక్కడి తాత్పర్యం.

"ఆత్మా దేవానామ్, భువనస్యగర్భో, యథావశం చరతి దేవ ఏషః" - 10 మం. 168 సూ. 4 ఋ.

ఈ పదోమండలం ఆతర్వాతికాలపు కూర్పు. ఇందులోనే అనేకమంది కవీశానులు తమ తమ

బుద్ధి పాటవంతో నామరూపాత్మకతను (Phenomenology) గూర్చి, జగదాద్యవస్తువును గూర్చి సాహసించి తమ తమ ప్రతిపాదనలను తీర్చిదిద్దారు. ప్రస్తుత సూక్తకర్త అనండు ఆయన వాయువే ప్రపంచానికి రాజు (భువనస్యరాజా) అన్నాడు. ఆ వాయువెలా జనించిందనే ప్రశ్నకు సమాధానం దొరకదన్నాడు. ['ఖస్విజ్జాతః కుత ఆబభూవ' - 3 వ ఋక్కు]. ఈ వాయువే దేవతలయొక్క ఆత్మగా వుంది; జగత్తుకు మూలంగా వుంది అన్నదే లోలుత ఉదాహరించిన వాక్యానికి అర్థం. వాయువు దేవత లకే ఆత్మ అయితే మరేముంది? ఆత్మను వాయువుగా సంభావించడం వేదంలో తరచు. వ్యుత్పత్తిలో నే యీ అర్థం వుందిగదా! తొలి, తుదిభాగాలనుండి రెండు సందర్భాలను మచ్చుకు ఉదాహరించాను.

ఆత్మ వాయువుమన్న భావనాలవల్లిక ఛాందోగ్యోపనిషత్తుదాకా తీగసాగింది. 'మహావృష' రాజ సమ్మానితుడై, 'జానశ్రుతి'కి తత్త్వోపదేశికుడు అయిన 'రైక్యుడు' మళ్ళీ దానిని చెప్పాడు. వాయువే విశ్వమూలద్రవ్యమని, మానవుని ఆత్మఅనీ (ఛాం IV. 2. 5) ప్రవచించాడు.

(b) ఆత్మ భూసంబంధమైనది. మరణానంతరం ఆత్మలకు భూమే ఆవాసంగా వుంటుందనే దొకభావంగా సంహితలలో వుంది. 'సుబంధుడు' చనిపోగా, అతని ఆత్మను తిరిగి ఇమ్మని భూమినీ, దేహమిమ్మని సోమున్నీ ప్రార్థిస్తూ మంత్రం వుంది. (10 వ మం. 59 సూ. 7 ఋ)

" పునర్నో అసుం పృథివీదదాతు...
పునర్నో సోమ స్తన్వం దదాతు..."
8 అష్టక. 1 అ. 23 సూ. 2 ఋ.

ఇందులోకూడా సరిగా అదేభావం సువ్యక్తమైంది. 'అసు' శబ్దం ఆత్మకు పర్యాయపదమని ఇంతకుముందే జాబితా చూశారు. 'భూమ్యా అసురసృగాత్మా' అన్న వాక్యంలోనూ ఇదేభావం ధ్వనించింది.

(C) "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ"- (ఋగ్వే. 1-115-1) జంగమస్థావరమైన సమస్తానికి సూర్యుడే ఆత్మ అని యీ మంత్రార్థం. ఈ మంత్రపాఠం యథాతథంగా సంహితలోని పూర్వోత్తర భాగాలు రెండింటా పలుమార్లు పునరావృత్తమైవుంది. అందుచే సంహితలో దీనికంతో ప్రాధాన్యముందని గ్రహించడం అని వాక్యం.

'ప్రజాపతి సూక్తం'గా పొరపాటుగా వ్యవహారంలో వున్న సూక్తాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాల్సి వుంది. అది ప్రజాపతి సూక్తం కాజాలదనే 'మాక్సుముల్లర్' పండితునివాదం సత్యమైనది. అదే సూర్యపరంగా సమన్వయం పొందితే అందులోని క్లిష్టతలు వైదొలగిపోతాయి. అలాగయినప్పుడు సూర్యుణ్ణి 'ఆత్మద, బలద' అని రెండోమంత్రం (10-121) వర్ణించింది. ఆత్మను ప్రసాదించేవాడంది. మరిపురుష సూక్తాన్నికూడా నిజంగా సూర్యపరంగా చెప్పుకోవాల్సి వుంటుంది. ఆ సందర్భంలో అందులోనూ అదే అర్థ సిద్ధి వుంటుంది. పురుషుడు (సూర్యుడు) 'అమృతత్వస్యేశానో' అవుతాడు. (10-90-2)

వైదికార్యుడు అంగలార్చిన వొక ధ్యేయం మరణ రాహిత్యం. ఆత్మకు పరలోకంలో అమృతత్వ ప్రాప్తికి తవిరాదు. ఆ పరలోకం, అమృతత్వస్థానం ఏదో చూడాలి. అది సూర్యలోకమే.

'ఉపాంశునాసమ్ అమృతత్వమ్ ఆనట్' - (4-8-1) సూర్యకిరణం అమృతత్వం కల్గిస్తుందట. ఒకటోమండలం 109 వ సూక్తంలోని 7 వ మంత్రంకూడా ఇదే భావం యిస్తుంది. 'లోకయత్ర జ్యోతిష్మంతః తత్ర మామ్ అమృతమ్ కృధి'. 9-113-9. పితరులు వసించేలోకం సూర్యలోకమని యీ మంత్రభాగం స్పష్టీకరించింది. పూర్వమండలాలలో జమవచ్చే నాలుగోదానిలో 42 వ సూ. 9 వ మంత్రం దీనినే ధ్రువపరుస్తోంది. 'దక్షిణావంతాం దివి సూర్యాసః' (1-125-6) అంటూ దాన ధర్మాదికర్తలకు కూడా సూర్యలోకంలో అమరత్వం హామీ యిస్తోంది. ఇదే అభిప్రాయం పదోమండలంలో ప్రసక్తమయింది. [(10-107-2), (10-154-5), (1-85-20)]. 3 వ మండలంలో (55-12) వలన అసురుల ఆవాసాలనుకలిగి పూర్ణస్థానంలో విష్ణువు వెలుగొందుతున్నాడని తెలుస్తుంది. విష్ణువు సూర్యసంబంధమైన దేవత అన్నది సర్వపండిత సమ్మతం.

అందుచేతనే 'ఆత్మ, సూర్యుల తాదాత్మ్యత అన్నది బ్రాహ్మణీయ అద్వైతంలో వొకానొక పురారూపం' (The identity of the sun and the self, one of the oldest forms of Brahminical Monism - 215 వ పేజీ, ఐతరేయారణ్యకం) అని 'కీత్' నుడివాడు. మరో సమాచారం ప్రసంగవశాత్తుగా యిక్కడ యివ్వొచ్చు. పితరుల ఆత్మలే ఆకాశంలో తారకలుగా అందగించాయని వైదికార్యుని విశ్వాస -ని కొందరి పాశ్చాత్యపండితుల అభిప్రాయం. దానిని ఆమోదించిన దేశీయులు వెక్కు వున్నారు.

ఆత్మ సూర్యాంశ అన్న భావం ఐతరేయ ఆరణ్యకం నాడింకా సాగలుదిగింది. "స యశ్చాయం శరీరః ప్రజ్ఞాత్మా యశ్చాసావాదిత్య ఏకమ్ ఏతత్ ఇతి విద్యాత్" (III - 2, 3).

శరీరవిరహితమైన ప్రజ్ఞాత్మయు, ఆదిత్యుడు ఒక్కడే అయివున్నారు అని తాత్పర్యం. ఇది 'బాధ్వన్ని' దృక్పథం. ఆయన దృష్టిలో 'ఆత్మ' అప్పటికే అశరీరము, అమూర్తము (Incorporeal) కాగల్గింది. అయితే అశరీరకము, సశరీరకము ఒకటే నడడం విస్తారంగా వుండొచ్చు. ఐతరేయంలోని రెండో ఆరణ్యకమే సాంఖ్య సత్కార్యవాదాన్ని ప్రతిపాదించి వుంది. గుస గుస లాడింది శ్వాసమే; బిగ్గరగా ఆడింది మాట, శబ్దం; ప్రాణవాయువు అశరీరం, మాట ఉచ్చారణ-సశరీరం, ఇంతే తేడా. అశరీర, సశరీరాలమధ్య పరిమాణ తారతమ్యమేగాని, గుణాత్మక తారతమ్యం లేదట॥ ["తస్మై యదుపాంశు స ప్రాణోఽథ యదుచ్చైస్తచ్ఛరీరం, తస్మాత్ తత్తిర ఇవతిర ఇవహ్యశరీర మశరీరో హి ప్రాణోఽథ యదుచ్చైస్తచ్ఛరీరం, తస్మాత్ తదావిరా విర్హిశరీరమ్"- II - 3,6 ఐతరేయం]. అందుకే 'బాధ్వన్ని' అశరీర, సశరీరాలు వొక్కటే నన్నగల్గాడు. అశరీరి ఒక మిశ్రమపుట.

1). 'పురుష' శబ్దం ఆత్మస్థానంలో వ్యవహారంలో వుండడం విశేషం. కాని యీ విషయమై నా పరిశ్రమ తృప్తికరంగా సాగలేదు. కాని యీ శబ్దం ఆత్మను ఆదిలో వూహించిన తీరును స్ఫురింపజేస్తోందేమోనని నా అనుమానం. ఇది వుపనిషత్సాహిత్యంలోకూడా బహుళ ప్రయోగంలో వుంది. ఆత్మను హృదయగుహలో వసించే పురుషునిగా కఠ, తైత్తిరీయాలు రెండూ పేర్కొన్నాయి. 'సత్యకామజాబాలి' కనుపాపలో కనుపించే పురుషుడే (ప్రతిబింబం) ఆత్మ అని బోధించినాడన్నా (ఛాందో 4 ప్ర. పాఠకం, 14 వ ఖండ, ); అజాతశత్రువుగాని, ప్రజాపతిగాని అద్దంలో నీడను ఒకప్పుడు ఆత్మగా చూపినాగాని, ఉపనిషత్తులలోని స్వప్నచర్చను గమనించినా 'పురుష' శబ్దం ఆత్మకు సమానార్థకంగా వేదసంహితలో వాడుక చేయడానికి ప్రాధాన్యమివ్వకుండా మిన్నకుండలేము.

మృతదేహానికి అగ్నిసంస్కారాలు జరిపినప్పుడు, ఆ అగ్నివలన ఆత్మ (అజోభాగ) తేజోవంతమై ఊర్ధ్వలోకాలకు వెళ్తుందన్నారు (10-16-4 . పితృలోకంలో కూడా ఆత్మ సురుచిర దేహంగానే ('తన్వానువర్చః') వుండి సకల భోగరాగాలలోను భాగధేయాన్ని అనుభవిస్తుంది. (10.14.8), (10.15.) (10.16). "పురుషో ఇరామయం" (అన్నమయం), "అముష్మిల్లోకే సంభవతి హిరణమయః" - II - 1, 3 బి. ఆ. ఐతరేయం కూడా పై విధంగానే నుడివింది. కడకు 'కీత్' మహాశయుడొకటి చెప్పారు. "పితృలోకంలో పునర్మృతి కవకాశమున్నదని గుర్తింపబడింది" (The possibility of redeath in the world of Fathers has been recognised. - A.B.K. RPVU - Page 474.)

11. ద్రవ్యమయమైనదిగా తొలుత ప్రారంభమై, భావమయ విషయంగా పరిణతిపొందే క్రమం ఆరణ్యకాలలోనూ, ఉపనిషత్తులలోనూ చిత్రితమై వుంది. ఆ పరిణామం ఒక సుముహూర్తంలో, ఒక ధీశాలి చేతిలో పూర్తిఅయినది కాదు. సూటిగా, సరళరేఖ వలె నడక సాగలేదు. అది అనేక మెలికలు దిరిగిన కాలిబాట; అయితే అదంతా యథాలాపంగా జరుగలేదు. పెద్ద వాద ప్రతివాదాలతో ధ్వనించింది. ప్రాణవాదం - ప్రజ్ఞానాత్మవాదం అనే రెండు కక్షలుగా చీలి తాత్త్వికులు రెండు సేనా శిబిరాలలో విడిసిచేశారు. ఈ సమరకథనం ఐతరేయంలోని రెండో, మూడో ఆరణ్యకాలలో బాగావుంది. ద్వితీయమంతా ప్రాణాత్మవాదమే.

ఆరుణేయ, శార్కరాక్ష్య, ఐతరేయశాఖలు మూడూ ప్రాణవాదాన్నే బోధించాయట. "ప్రాణా ఉక్థ మిత్యేవ విద్యాత్" (II ఆ. 1-2) 'ప్రాణోహ్యేష య ఏష తపతి' (ప్రకాశించేవాడే ప్రాణం, సూర్యుడు.) 'ప్రాణః సహాయుః' - II - 3 - 3 వీరందరూ ప్రాణమే ఆత్మ అన్నప్పటికీ ఒకరది సూర్యాంశ అన్నారు; మరొకరు వాయ్వంశ అన్నారు. శరీరంలో ప్రాణం వసించే స్థానం గూర్చి భిన్నాభిప్రాయమే. శార్కరాక్ష్యులు ఉదరస్థానం చూపారట; 'ఆరుణేయులు' హృదయాన్ని చూపారట; ఆరణ్యక సంకలనకర్తలైన ఐతరేయులు శిరస్థానాన్ని చూపారట. చూపు, వినికిడి, మనస్సు, వాక్కు, వాసనవంటి ముఖ్య జ్ఞానాంగాలన్నీ వదనంలోనే వున్నాయిగదా అని 'దాఖలా' చూపారు. వాక్కు, ఆసనం, చెవులు రెండూ రెండుపార్శ్వాలు, కళ్ళు గుర్రాలు, మనస్సు సారథి, 'ప్రాణాత్మ' రథి అని రథంతో పోలిక పెట్టారు. ప్రాణంవేరు, మనస్సువేరని భావించిన వీరు మనస్సునే భావనా సూత్రంగా తలంచారు. 'మనసా ధ్యాతమ్' II-4-3 అనగా ప్రాణాత్మకు ఆలోచనాది చిదంశను నిరాకరించారన్న మాట.

ఉపనిషత్తులలో ప్రాణవాదం కౌషీతకం (II - 1) (II - 2) (III - 8) (IV - 20) లోను, ఛాందోగ్యంలో (IV. 10 - 5) (VI. 3 - 2) భాగాలలోను, బృహదారణ్యకంలో ఉపంబుని ద్వారా (IV - I 2) లోను, ఖండితమై (V-13,1) భాగంలోను గోచరిస్తుంది. పేర్లపట్టిక కూర్చకలెనంటే సురపిర మాండుకేయ, స్థవిరశాకల్య, మహీదాస, హ్రస్వమాండుకేయ, కాంతారవ్య, ప్రతార్దన, అజాతశత్రు, ఉద్దాలక, రైక్వ, ఉపంబులు - వీరు ప్రాణాత్మవాదులు.

ప్రాణ, ప్రజ్ఞలమధ్య ఘర్షణను ఐతరేయం, మూడో ఆరణ్యకం చిత్రించింది. బాభ్వ, శాండిల్యులు ప్రజ్ఞాత్మవాదులు. 'ప్రజ్ఞాత్మ' అన్నశబ్దం చిదాత్మకు బదులుగా తత్పూర్వం ప్రయోగంలో వుండేది. ఐతరేయోపనిషత్తులోని అంతిమాధ్యాయం యొక్క ప్రతిపాదన సర్వం ప్రజ్ఞాతవాదమే. బృహదారణ్యకంలో యాజ్ఞవల్క్యవాణిలో మళ్ళీ యీవాదం కిరీటం తొడుక్కొంది.

ఐ. ఉపనిషత్తులో చివరి అధ్యాయం ఎత్తుకోతే- అసలు 'ఆత్మఅని మనం దేనిని పిలుస్తాం ? అదేమిటి?' అనే మౌలిక మీమాంసా ప్రస్తావనగా వున్నది. సమాధానంగా యీ శ్లోకం చూపబడింది.

"సర్వం తత్ ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితమ్,
ప్రజ్ఞానేత్రోలోకః ప్రజ్ఞాప్రతిష్ఠా
ప్రజ్ఞానం బ్రహ్మేస ఏతే న ప్రజ్ఞానాత్మనాఽస్మాల్లోకాత్."

జ్ఞానరూపంలోనే తద్వారానే యీ లోకాన్ని తెల్సుకోవాల్సివున్నదన్నది జ్ఞానానికి, చైతన్యానికి స్వతంత్రమైన అస్తిత్వం వుందనడానికి కారణంగా యీనాటికీ వాడుకలో వున్నది.

మూడో అరణ్యకంలో ప్రాణవాద, ప్రజ్ఞానవాదాలమధ్యల సూక్ష్మతారతమ్యం చూడవలసినదే.

"ప్రాణో వంశ ఇతి స్థవిరః శాకల్యః"—
'తద్యథాశాలా వంశే సర్వే ఽ న్యేవంశాః సమాహితః
స్యురేవ మస్మిన్ ప్రాణో చక్షుః శ్రోత్రమ్ మనో వాగింద్రియాణి శరీరం సర్వఆత్మా సమాహితః'—
III- 2, 1. ఐ. ఆ.

చక్షుః శ్రోత్రమనోవాక్కుల మిశ్రమం-సశరీరం అయినది ఆత్మ

"చత్వారః పురుషా ఇతి బాభ్వః '—
'శరీర పురుష ఇతి యమవోచామ సయ ఏవా యమ్ దైహిక ఆత్మా తస్యయో ఽ యమ్ అశరీరః
ప్రజ్ఞాత్మా సరసః"—III- 2, 3 ఐ. ఆ.

బాభ్వుడు చెప్పే ప్రజ్ఞాత్మ 'అశరీరి' అయినా, మళ్లీ పైవంటి సమ్మిశ్రమమేనని లోగడే చూశాము. మిశ్రమాలు గావడంలో రెండు దృక్పథాలకు అంగీకారముంది. కాగా, అశరీర, సశరీరాలనిపించు కోవడంలోనూ, ప్రాణ ప్రజ్ఞలు కావడంలోనూ విభేదిస్తున్నాయి. అశరీర స్వభావంకూడా సత్కార్య దృష్టితో ద్రవ్యమయ విషయమే అవుతోంది. మౌలిక భేదం ప్రాణ, ప్రజ్ఞలమధ్యనే వుంది. ప్రాణవాదం చిరంతను మనస్సుకు కేటాయించి, తాను జడీయమను కొన్నది. ప్రజ్ఞాత్మ చేతనాంశను సర్వకాల సర్వావస్థలలోను విడనాడనంది. ద్రవ్యమయ విషయాంనుండి భావనా విషయంగా పరివర్తన పొందేపట్లు యిదొక రూపం.

నూతనంగా తలయెత్తిన ప్రజ్ఞా నాత్మవాదంలో కొంత పట్టువుందని తేలింది. చిరంతను లోపించరీయడం లోటుగా కానవచ్చింది. ప్రాణాత్మవాదం దాని వాక్ను తనలో యిముడ్చుకో దలచింది. ఇటువంటి యత్నంలో పేర్కొన వలసిన తత్త్వదేశికులు ప్రతార్దన, అజాతశత్రు మహారాజులు. భావన, చైతన్యం, ప్రజ్ఞ, అన్న ఇతరకు ప్రాకృతికము, నశ్వరము అయిన మనస్సుయొక్క ధర్మాలన్న వల్లా తెచ్చి ప్రాణంయొక్క ధర్మాలలో వొకటిగనో, ప్రాణంలో అంతర్భూతమైన హంశ అనో కొత్త తీర్మానం చేసుకోవలసివచ్చింది. అజాతశత్రువుపరలోని కత్తివలె, అరణిలోని అగ్నివలె ప్రజ్ఞానం ప్రాణంలో అంతర్నిహితమై వుందన్నాడు కౌషీతకంలో(IV-20). సమస్య అంతటితో పరిష్కారమైపోయింది. సుషుప్తిలోకూడా శ్వాసకార్యం వుంటున్నందున, మరణమాసన్నమయ్యే గడియల్లో ముమ్మందుగా జ్ఞానకార్యం, మానసిక వ్యాపారం సర్వం నిల్చిపోయి, కడవరకు మాత్రం శ్వాసక్రియ జరుగుతూ వుండడం వలన ప్రాణమే ఆత్మ అని సాక్ష్యాధారాలతో వాదించిన ప్రతార్దనుడు ప్రజ్ఞానంకూడా ప్రాణంయొక్క ధర్మాలలో వొకటి అన్నాడు. ఉద్దాలకుడు మరోవిధంగా ముగించాడు. ప్రాణం, మనస్సులకు సంధానం కుదిర్చాడు. ప్రాణం మనస్సుకు ఆయతనం, ఉపాశ్రయం;

మనస్సు ప్రాణానికి త్రాడుతో కట్టివేయబడిన పిట్ట అని ఉపమానం చెప్పాడు, ఉద్దాలకుడు. ఈ వాదనలను యాజ్ఞవల్క్య బృహదారణ్యకంలో (IV-4-45) తిరగవేసి తోడిగాడు. ప్రజ్ఞానాత్మవాదాన్ని పైకి తెచ్చాడు. ప్రాణం వాహనం, వాహనాన్ని అధిరోహించిన రౌతు ప్రజ్ఞానం - పొమ్మన్నాడు. యాజ్ఞవల్క్య కూడా ప్రాణాన్ని పూర్తిగా తిరస్కరించలేక పోయాడు. ఇంతకూ ప్రజ్ఞాత్మను మిశ్రమం గాకుండా మార్చలేక పోయాడు. "చక్షువు, శ్రోత్రమ్ భూమి, నీరు, వాయువు, ఆకాశం, తేజస్సు, తేజస్సు కానిది; వాంఛ, అవాంఛ; కోపం, కోపం కానిది; ధర్మం, అధర్మం' – అన్న యీ జాబితా దినుసులన్నీ సమ్మిళితమై ఆత్మగా తీరినాయట. ఇంకా 'ప్రతిదాని'తోనూ ఆత్మ చేయబడి వుందట. ఇందులో పంచభూతాలు కూడా మిశ్రమించే వున్నాయన్న మాట

ఇటువంటి పరివర్తనా రూపాలు బౌద్ధసాహిత్యంలో బ్రహ్మజాలసుత్తాలో కూడా కానవస్తాయి. మరణానంతరం ఆత్మ ప్రజ్ఞానమయంగా (సంజ్ఞ) వుంటుందన్న వారిలోకూడా కొందరా ప్రజ్ఞాత్మకు రూపం వుంటుందంటారు. కొందరది పరిమితమైనది (Finite) గా వుంటుందన్నారు. కొందరు దాని చైతన్యం మితంగా వుంటుందన్నారు. జడాత్మనురూపరహితం (అమూర్తం) అనేవారు; అనంతం, అపరిమేయం అనేవారు కూడా వున్నారట. ఆత్మకనేక స్థాయిలను వూహించడం కూడా యీ సంధికాల లక్షణంగానే గ్రహించ వచ్చును. ప్రోష్ఠపాదుడనే సంచారక తాత్వికుడు స్థాయీత్రయాన్ని సంభావించాడు. (i) ఓలారిక (భూతామ-స్థూల gross) ఆత్మ (2) మనోమయాత్మ (3) అరూప లేక సంజ్ఞామయాత్మ (Dialogues of Buddha, II - pages 244 – 264) అదే విధంగా తైత్తిరీయంలో స్థాయీపంచకాన్ని ప్రతిపాదించారు.

సంపూర్ణ భావవాదాన్ని సర్వాంగీణంగా అందుకోలేకుండా ప్రజ్ఞాత్మగా తేల్చి, రూపం, పరిమాణం, స్థావరం, స్థలం మున్నైన భౌతిక లక్షణాలను కల్గి వుంటూ సంభావితంగావడమే ఉపనిషత్సాహిత్యంలో సర్వసాధారణంగా చూస్తాము. అణువంతని, యవ ధాన్య మంతని, అంగుష్ఠమంతని, దశాంగుళ ప్రమాణమని వీకోలత లెవ్వరు చెప్పినా; పుండరీకమని, జ్యోతి అని, పురుషుడని తదితరా కృతులేవి చెప్పినా, స్థావరం హృదయమని చెప్పినా ఇవన్నీ భౌతికలక్షణాలే. ఇటువంటి ఆత్మవర్ణనలే వుపనిషత్తులలో నిండు. ఇక ఆత్మవిషయంలో సమగ్ర భావవాదానికి ఆకృతి కల్పించినది సాంఖ్యులు. చైతన్యాశ్రయం కాదని, శుద్ధ చిద్రూపమని నిర్వచించడమే ఈ పరిణామధ్యేయం.

ఒక వేపున భావవాదం యిలా కాకలుదేరి వస్తుంటే రెండోవేపున గట్టిభౌతిక వాదం ఆత్మపరంగా తయారవుతూ వచ్చింది. భావ వాదపరమైన ఆత్మభావనకు పితృమూర్తులన దగిన మహీదాస, యాజ్ఞవల్క్యలు ఉభయులూ శుద్ధభౌతికవాద రూపంలో ఆత్మను నిర్వచించడంకూడా వాస్తవమే. మహీదాసు ఐతరేయ, "పృథివీవాయురా కాశ ఆపో జ్యోతీం షీత్యేవ వా ఆత్మోక్షమ్ పంచవిధమ్" అన్నాడు. 'ఆత్మపంచ భూతాత్మకం; ఆ ఆత్మనుండే సర్వం వుత్పత్తిమై, ఆ ఆత్మలోనే లీనమవుతోంది' అన్నాడు (II-3.1) అనంతం నిరవధికమైన 'విజ్ఞానఘనం' పంచభూతాలలో నుండే వుత్పత్తిమై, వాటిలోనే నశిస్తుంది. (తాన్యేవాను వినశ్యతి) మరణానంతరం చైతన్యం వుండదు(న ప్రేత్యసంజ్ఞాఽస్తి) అని యాజ్ఞవల్క్య బృహదారణ్యకంలోనే సెలవిచ్చారు. బ్రహ్మజాల సుత్తాలో మరణానంతరం ఆత్మజడమై వుంటుందని (అరోగి అత్తా), అది మూర్తిమంతమని, పరిమితమైనదని ఒకరాశి తత్త్వవాదన లున్నాయని వచింపబడింది. ఆత్మ, దేహం మౌలికంగా వేరని, ఆత్మ చిద్రూపమై, కర్మకల్మషసంటనిదై, అసంగమై, సాక్షి మాత్రమై నెలకొన్న కొలంది, రెండోవేపున వ్యతిరేక దిశలో దేహానితో ఆత్మకు గరిష్ఠసంపర్కమును కూర్చే రీతులు పెచ్చరిల్లి కడకు దేహమే ఆత్మగాని, భిన్నంగా దనే చరమబిందు వాదన ఆకృతి వహించింది. అనగా ఆత్మకు నేరువునికి పోయింది. ఆత్మకు మరణం సంఘటిల్లింది. స్వచ్ఛతమ భౌతికవాదం ఉన్నతస్థాయికంగా వెల్వడింది. భావవాదంకూడా శ్రుతిమించిన రాగంలో పడి, జగన్మూల ద్రవ్యమే సచ్చిదానందమై, ఆత్మకు పరమాత్మయై వెలసి వైయక్తికాత్మను కాస్తా కడుపువ బెట్టుకొని నీళ్లు వోసుకుంది. వైయక్తికాత్మమిథ్యగా తేలింది. ఆ అర్థంలోకూడా ఆత్మకు మరణప్రాప్తే జరిగింది. స్థూలంగా ఆత్మకథ యిది.



# ప్రాచీన హైందవ రాజనీతిశాస్త్ర చరిత్ర

## (ప్రాక్పశ్చిమ అర్థశాస్త్ర సిద్ధాంతాలు: ఒక మార్క్సిస్టు పరిశీలన)

చిత్తజల్లు వరహాలరావు, ఎం. ఏ.

"ఏ దేశచరిత్ర చూచినా ఏ మున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం
నరజాతి చరిత్ర సమస్తం రణరక్తప్రవాహ సిక్తం
నరజాతి చరిత్ర సమస్తం దరిద్రులను కాల్చుకుతినడం
ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు దాచేస్తే దాగని సత్యం."

(మహాకవి శ్రీ శ్రీ — మహాప్రస్థానం)

**పా**శ్చాత్యవిద్యా వ్యామోహితులైన భారతీయ విద్యార్థులు ప్రాచీన హిందువులకు రాజ్యాన్ని లేక రాజ్యాంగ యంత్రాన్ని (State) గూర్చి నిశ్చితమైన దృక్పథంలేదని అంటూవుంటారు. పాశ్చాత్య రాజకీయ తత్వశాస్త్ర చరిత్రలో సోక్రటీస్, ప్లేటో, సెయింట్ థామస్, అరిస్టోటిల్, ఏక్వినాస్, మేకవెల్లి, జీన్ బోడిన్, గ్రోటియస్, థామస్ మూర్, థామస్ హాబ్స్, లాక్, రూసో, డేవిడ్ హ్యూమ్, హెగెల్, స్టూవర్ట్ మిల్, గ్రీన్, మార్క్స్ మున్నగు ప్రసిద్ధ శాస్త్రవేత్త లున్నట్లు ప్రాచీన హైందవ రాజకీయ తత్వశాస్త్ర చరిత్రలో లేరని ఒక అభిప్రాయం వెలిబుచ్చుతూంటారు. అంతదాకా ఎందుకు? అసలు ప్రాచీన హైందవులకు రాజకీయ తత్వశాస్త్రం (Political Philosophy) అంటూ ఉందాఅని కూడా ప్రశ్నిస్తారు. వారికసలు (ప్రాచీన హైందవులకు) రాజ్యాంగ యంత్రాన్నిగూర్చి నిశ్చితమైన దృక్పథమే లేదని వారు ఒక నిర్ణయానికి వచ్చారు. కాబట్టి యీ వ్యాసంలో రాజ్యాన్నిగూర్చి ప్రాచీన హైందవుల కున్న దృక్పథాన్ని, దాని స్వరూప స్వభావాలను, పరిణామక్రమాన్ని విశదీకరించేందుకు ప్రయత్నిస్తాను. అంతేగాదు; అతి ప్రాచీనకాలంలో ఎన్ని రకాల రాజ్యాలు (Kinds of States) ఉనికిలోకి వచ్చాయో, అందుకు ఏ యే నిర్దిష్ట ఆర్థిక, రాజకీయ, సామాజిక, ధార్మిక పరిస్థితులు దోహదంచేశాయో మున్నగు సమస్యలనుగూర్చి సూక్ష్మంగా పరిశీలించ ప్రయత్నిస్తాను.

రాజనీతిశాస్త్రం (Politics) లేక అర్థశాస్త్రం దేన్నిగూర్చి తెలుపుతుంది? రాజ్యాన్ని లేక రాజ్యాంగ యంత్రాన్ని గూర్చి వివరిస్తుంది గాబట్టి రాజనీతి శాస్త్రమనీ లేక అర్ధశాస్త్రమనీ పిలిచారు. ప్రాచీన హిందూ అర్థశాస్త్రవేత్తలు ఈ శాస్త్రాన్ని "దండనీతి" అనే పేరుతో మొట్టమొదట పిలిచారు.

ఐతే రాజ్యం (State) అంటే ఏమిటి? బూర్జువా రాజనీతి శాస్త్రకారులు ఒకవిధంగానూ, మార్క్సిస్టులు

మరో విధంగానూ దీన్ని నిర్వచించారు. ఒక నిర్ణీతమైన ప్రదేశాన్నీ, జనాభానీ, ప్రభుత్వాన్నీ, సార్వభౌమాధికారాన్నీ కలిగినదే రాజ్యం. ఈ రాజ్యం, దానియందు జీవించే ప్రజల యోగక్షేమాలను చూస్తూ అంతఃకలహాలనుండీ, శత్రుదండయాత్రలనుండీ ప్రజల్ని రక్షిస్తుంది - అని అంటారు బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు.

"దోపిడీవర్గం చేతుల్లోవున్న దోపిడీచేయు సాధనమే, రాజ్యం"(State is an instrument of exploitation) అని మార్క్సిస్టు పండితులు చెప్పారు. దాదాపు ఈ రెండు నిర్వచనాలూ పరస్పరవిరుద్ధంగా వున్నాయి. ఈ విషయాన్ని ప్రస్తుతానికి యిక్కడే వదలివేద్దాం.

ప్రభుత్వానికీ రాజ్యానికీ చాలా తేడావుంది. రాజ్యంయొక్క కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వం. రాజ్యాంగయంత్రమంటే (ప్రజాస్వామిక దేశాల్లో) అధ్యక్షుడు, పార్లమెంటు, మంత్రులు, సెక్రటేరియట్, కోర్టులు, జైళ్ళు, పోలీసుశాఖ, సైన్యం, ఉన్నతాధికారవర్గం, యిత్యాదివన్నీ వస్తాయి. రాజ్యాంగయంత్రంలో లేక రాజ్యంలో ప్రభుత్వం ఒకభాగం మాత్రమే. ప్రభుత్వం రాజ్యానికున్న నాలుగులక్షణాలలో ఒకటి. మార్క్సిస్టు సిద్ధాంతవేత్తయైన లెనిన్ రాజ్యాన్ని గూర్చి ఏం చెప్పాడో పరిశీలిద్దాం.

"బూర్జువా పండితులూ, రచయితలూ ఈసమస్యలో చిక్కులూ, తికమకలూ కలిగించారు. అందువల్ల శ్రద్ధగా స్వతంత్రంగా పరిశీలించి గ్రహించగోరే వారెవరైనా ఈ సమస్యతో అనేక మార్లు తలపడాలి; మరల మరల పరిశీలించాలి; అనేక కోణాలనుండి పరిశోధించాలి. అలా అయితేగాని ఈ సమస్యను స్పష్టంగానూ, నిర్దుష్టంగానూ గ్రహించడానికి వీలుపడదు. ఈ సమస్య రాజకీయాలన్నిటికీ ప్రధానసమస్య, పునాదిసమస్య కాబట్టి, మరల మరల పరిశీలింపవలసిరావడం కూడా ఒక వీలు." (క్రిందిగీతలు నావి - రచయిత.)

రాజ్యాంగ యంత్రసమస్యను గూర్చి బూర్జువా రాజనీతి శాస్త్రజ్ఞులు సృష్టించిన గందరగోళాన్ని వివరిస్తూ లెనిన్ యిలాగన్నాడు:

"ఈసమస్య ఈనాటివరకూ మత సమస్యలతో కలగాపులగం చేయబడుతూ వుంది. మత సిద్ధాంతకారులే యిలాచేస్తే అది వారికి సహజమని ఊరుకోవచ్చు. అయితే తమకు మత విషయికమైన ఆసక్తులేవీ లేవనుకునేవారుగూడా తరచు ప్రత్యేకమైన రాజ్యాంగయంత్ర సమస్యను మత సమస్యలతో కలగాపులగంచేసి ఒక సిద్ధాంతాన్ని అల్లడానికి యత్నిస్తున్నారు. ఇలా అల్లబడిన సిద్ధాంతం తాత్వికమై ప్రాతిపదిక వివరణల్లో తరచు క్లిష్టమై వుంటుంది. ఈ సిద్ధాంతం ప్రకారం: రాజ్యాంగ యంత్రమనేదేదో దైవికమనీ, ప్రకృతి కతీతమనీ, మానవకోటి జీవితానికి హేతుభూతమైన ఒకానొక శక్తియనీ, మానవునికి సంబంధించని ఒక వెలుపలి వస్తువును మానవునికి కూర్చిపెట్టే దైవాంశసంభూతమైన శక్తియనీ అంటారు......ఈ సమస్య యింతగా తికమకలు చేయబడ్డది." (లెనిన్)

"ఈ సమస్యను సాధ్యమైనంతవరకు శాస్త్రీయంగా పరిశీలించాలంటే రాజ్యాంగయంత్రంయొక్క పుట్టుకా, అభివృద్ధినీ గూర్చిన చరిత్రను దిఙ్మాత్రంగా పరిశీలించాలి......ఈనాడు యిది ఏ విధంగా పరిణమించిందీ? అని పరిశీలించాలి." (లెనిన్)

## ప్రాచీన హైందవులు : అర్థశాస్త్రఅధ్యయనం

క్రీ. శ. 1905 సం॥లో, మౌర్యచంద్రగుప్తుని మంత్రి కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్రం డాక్టరు శ్యామశాస్త్రిచే తంజావూరు సరస్వతీ మహల్‌లో కనుగొనబడింది. కౌటిలీయం కనుగొనబడేదాకా పాశ్చాత్య పండితులు మనకు సర్వసమగ్రమైన అర్థశాస్త్రమంటూ లేదని వాదించేవారు. కౌటిల్యుడు (లేక చాణక్యుడు) రచించిన ప్రపంచ ప్రఖ్యాత గ్రంథం - అర్థశాస్త్రం - నిరంకుశ రాచరిక యుగంనాటి హిందూ రాజనీతి శాస్త్రానికి ఒక మహోన్నతమైన భాండాగారం. ఈ గ్రంథం కాంతిలోకి రావడంతో పాశ్చాత్య పండితులు కళ్ళు తెరిచారు. అప్పటినుండీ ఆ గ్రంథాన్ని అధ్యయనం చేయడంతోపాటు, దానిని నీళ్ళుకార్చడానికి కూడా యత్నించారు. "కౌటిలీయం" ఒక వ్యక్తిచే వ్రాయబడింది కాదనీ, పలువురు వ్యక్తులు వ్రాశారనీ, కౌటిల్యుడనే వ్యక్తి వాస్తవిక చరిత్రకి సంబంధించినవాడు కాదనీ, పుక్కిటి పురాణానికి చెందిన అబద్ధపు వ్యక్తియేననీ ఏమేమో ఆడిపోసుకున్నారు. అథవా అలాంటి వాడెవడన్నా వుంటే, మౌర్య చంద్రగుప్తుని ఆస్థానంలోవున్న గ్రీకురాయబారి-మెగస్తనీస్ - కౌటిల్యుని నామాన్ని తన గ్రంథమైన "ఇండికా"లో పేర్కొనేవాడనీ, మెగస్తనీసు తన గ్రంథంలో కౌటిల్యుని నామాన్ని పేర్కొనలేదు గాబట్టి కౌటిల్యుడనే వ్యక్తే లేవనీ, ఎన్నో వితండ వాదనలూ, విచిత్ర వ్యాఖ్యానాలూ చేశారు! కాంతిని చూడ నిరాకరించే గుడ్లగూబ మనస్తత్వాన్ని ఈ పండితులు

బయటు పెట్టుకొన్నారు. ఈ వాదనలు చేసినవారిలో ముఖ్యులు: ప్రొఫెసర్ దన్నింగ్, ప్రొఫెసర్ వింటర్ నిట్జ్. ఐనా చరిత్ర ఏన తీర్పును పక్షపాతరహితం గానూ, హేతుబద్ధంగానూ యిచ్చింది.

1924 లో డాక్టర్ జయస్వాల్ "Hindu Polity" అనే సుప్రసిద్ధ గ్రంథం వ్రాశాడు. ఈ గ్రంథ ప్రచురణకు పూర్వం పాశ్చాత్య పండితులు మనకొక రాజనీతిశాస్త్రం వుందని విశ్వసించేవారు కారు. అథవా అలాంటి దేమన్నా వుంటే అది థియొలాజికల్, మెటఫిజికల్ ప్రభావాలకు లోనైనదేగాని స్వతంత్రమైన రాజనీతిశాస్త్రంగా (Science of Politics) అభివృద్ధిచెందలేదని మాక్స్‌ముల్లర్ పండితుని దగ్గరనుండి దన్నింగ్, వింటర్ నిట్జ్ దాకా పదే పదే వక్కాణిస్తూ వుండేవారు. ప్రాచీన హైందవ శాస్త్రవేత్తలు ధర్మాన్ని, మతాన్ని గూర్చి శాస్త్రాలు రచించి, అధ్యయనం చేశారుగాని, "పొలిటికల్ సైన్స్" గూర్చి అధ్యయనం చేయడంగానీ, దాన్ని అభివృద్ధి చేయడంగానీ జరగలేదని తేల్చిచెప్పారు.

అంతేగాదు; ఇంకా చిత్రమైన సిద్ధాంతాలను ప్రతిపాదించారు. ప్రాచీన హిందువులను గూర్చి, హైందవ సంస్కృతి సభ్యతలనుగూర్చి, వివిధ సంస్థలనుగూర్చి పాశ్చాత్య పండితులు చాలా చిత్రమైన భావాలను వెలిబుచ్చేవారు. మాక్స్‌ముల్లర్ పండితుడు ప్రాచీన హైందవులను గూర్చేగాక, భారతీయ హృదయాన్నిగూర్చి ఎంతో అధికారపూర్వకంగా మాట్లాడుతున్నాడు. చూడండి:

"The only sphere where the Indian mind found itself at liberty to act, to create and to worship was the sphere of religion and philosophy; and no where have religious and meta-physical ideas struck root so deep in the mind of a nation as in India. The Hindus were a nation of philosophers."

"భారతీయుల మేధస్సు ఒక రంగంలో మాత్రమే - అది మతవిషయిక, తాత్వికరంగం - కృషిసల్పగల, సృష్టింపగల, ఆరాధించగల శక్తిని కలిగియుంది. ఏ జాతియొక్క మేధస్సులోనూ నాటుకోనంత గాఢంగా భారతదేశంలో మతభావాలు, తాత్విక భావాలు నాటుకున్నాయి. హైందవులు తత్వశాస్త్రజ్ఞుల జాతి."

మాక్స్ ముల్లర్‌వంటి వానికి ప్రాచీన హైందవులంతా తత్త్వవేత్తల జాతిగా కనబడడంలో ఆశ్చర్యం లేదు. నాటి పాశ్చాత్యపండితుల దృష్టిలో మన దేశం ఒక బ్రహ్మాండమైన మతకేంద్రంగా, మతం తప్ప మరో వ్యాపకం మనకి లేనట్లుగా కన్పించేది. లేకపోతే ప్రాచీన హైందవులను "A Nation of philosophers" (తత్వశాస్త్రజ్ఞులజాతి) అని పిలుస్తాడా మాక్స్ ముల్లర్?

భారతదేశచరిత్ర ప్రారంభమైన నాటినుండీ మత సంస్థలు, మతగురువులే (Religious Institutions and Teachers) భారతీయుల జీవిత విధానాన్ని, అభివృద్ధినీ కంట్రోలుచేశారన్న దృక్పథంకూడా బాగా వాడుకలో వుండేది. దేవుడు, పరలోకం, జీవాత్మ, పరమాత్మ మున్నగు ఆధ్యాత్మిక సమస్యలను, మతవిషయాలను గూర్చిన వాగ్వాదాలలోనే ప్రాచీన హైందవులు తమ మేధాసంపత్తినీ, కాలాన్నీ వినియోగించారనీ, తత్ఫలితంగా వారు స్వతంత్రమైన రాజకీయ తత్త్వశాస్త్రాన్నిగాని, రాజ్యాన్నిగూర్చిన స్వతంత్ర సిద్ధాంత ప్రతిపాదనకుగాని ఉద్యమించలేదనీ నాటి పాశ్చాత్య పండితులు అభిప్రాయపడ్డారు. ప్రాచీన హైందవులు అర్థశాస్త్రాభివృద్ధికి ఏవిధంగానూ తోడ్పడలేదనీ, అందువల్ల ప్రపంచ రాజకీయ తత్త్వశాస్త్ర చరిత్రలో భారతదేశానికి స్థానమేలేదనీ వారి భావన.

ఇది పాక్షికసత్యమేగాని, పూర్ణసత్యం కాదు. ప్రాచీన హిందూ అర్థశాస్త్రవేత్తలంతా పురోహిత వర్గానికి చెందిన బ్రాహ్మణపండితులు. వేదశాస్త్ర పురాణాగమాది గ్రంథపఠనం వారి గుత్తసొమ్ముగానూ, యుద్ధవిద్య, రణకౌశలం మొదలగునవి క్షత్రియుల గుత్తసొమ్ముగానూ, హిందూసమాజ చరిత్రలోని ఒకానొక దశలో - ఉపనిషత్కాలం నాటికి - రూపొందాయి. అంటే చదువుసాములు బ్రాహ్మణ - క్షత్రియ పాలక వర్గం చేతిలో గుత్తసొమ్ములుగా తయారయ్యాయి. దీంతోపాటు సొంతఆస్తీ, వైశ్య - శూద్రుల బానిసత్వం సమాజంలోకి వచ్చాయి. బ్రాహ్మణ-క్షత్రియ వర్గం పీడకులుగానూ, వైశ్య-శూద్రులు పీడితులుగానూ సమాజంలో తయారయ్యారు. నాటినుండి పీడకవర్గం తమ స్వార్థప్రయోజనాలను రక్షించుకొనేందుకు, భోగభాగ్యాలనుభవించేందుకు, నిరాటంకంగా తమ దోపిడీని పీడితవర్గమైన వైశ్య - శూద్రులపై కొనసాగించింది. తమ పీడనని నిరాఘాటంగా కొనసాగించేందుకు మూఢ మతసిద్ధాంతాలను, మూఢ విశ్వాసాలను మేలు

ముసుగ్గా అడ్డంపెట్టుకొన్నారు. నాటినుండి మతంపేర, దేవునిపేర, పరలోకంపేర అత్యంత నిరంకుశమైన రాజ్యాధికారాన్ని సమర్థించి, మోసపు సిద్ధాంతాలను వైశ్యశూద్రులలో ప్రచారంచేసి, సమాజంలో బ్రాహ్మణ, క్షత్రియ వర్గదోపిడీకి పునాదులు వేశారు.

రాజ్యాన్నీ, రాజునీ, సమాజ చట్రాన్నీ, వివిధ సంస్థలనీ, ధర్మం, న్యాయం, నీతి, నియమం - సర్వాన్నీ, బ్రాహ్మణ పురోహిత వర్గ ప్రయోజనాలకి-తలొంచేట్లు లొంగదీశారు. ప్రాచీన రోమన్ సామ్రాజ్యంలో నాటి పురోహితవర్గమైన యూదులూ, మధ్య యుగాల్లోని క్లెర్జీ (మతాధిపతులు) ఏంచేశారో సరిగ్గా-ఆ పనినే ప్రాచీనకాలంలో బ్రాహ్మణ పురోహితవర్గం కూడా జేసింది.

ఈ దృష్ట్యా చూస్తే, ప్రాచీన హైందవుల జీవిత విధానాన్ని ఒకానొక దశలో కొంతవరకు మతగురువులు, మతసిద్ధాంతాలు కంట్రోల్ చేశాయని చెప్పవచ్చు.

సూర్యుని చుట్టూ భూమి తిరిగినట్లు మనమూ, మన జీవితవిధానం మతపరిధి చుట్టూ తిరుగుతుందనీ, మనవాళ్ళకి మతం తప్ప మరో వ్యాపకం లేదనీ బ్రిటిష్ చరిత్రకారులు అన్నారు. వెంటనే పాశ్చాత్య విద్యాధికులైన తిలక్, రెనడే, కుంతెన మొదలగు చరిత్ర పండితులకీ, జయస్వాల్, భండార్కర్, ఘోషాల్ మున్నగు అర్థశాస్త్ర పండితులకీ విపరీతంగా కోపం వచ్చింది. దాంతో ఈ బూర్జువా మేధావులంతా చరిత్ర గ్రంథాల, అర్థశాస్త్ర గ్రంథాల రచనకి సిద్ధపడ్డారు.

భారతప్రజలు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగిస్తోన్న స్వాతంత్ర్యోద్యమాన్ని నిలువంటా నీరు కార్చేవిధంగా ఫ్రేజర్, విన్సెంట్ స్మిత్, రాబర్ట్స్, గ్రాంట్ డఫ్, మోర్లాండ్ వంటి ఇంపీరియలిస్టు చరిత్రకారులు భారతదేశ చరిత్రకి తప్పుడు వ్యాఖ్యానాలు చేశారు. మన మెందుకూ పనికిరాని దద్దమ్మల జాతిగా చిత్రించారు. ఆ చరిత్రలను కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో మనకు బోధించారు. మన బానిసత్వానికి కారణం భారతదేశ భౌగోళిక వాతావరణ పరిస్థితులూ, సంస్కృతియేనని వీరు వ్రాశారు. మన జీవితాలు ఎల్లప్పుడూ విదేశీపాలకుల క్రింద పడివుండడానికే అలవడ్డాయన్నారు.

ఈ రకపువాదనలు భారతీయ పండితుల గుండెల్లో తుపాకి గుండ్లలా వచ్చి తగిలాయి. ఉద్రేకంవచ్చింది. మన పండితులు కూడా పరిశోధనలు గావించారు. చరిత్రగూర్చీ, రాజనీతిశాస్త్రాన్ని గూర్చీ గ్రంథాలు వ్రాశారు. వీ టన్నిటిలో తిలక్ వ్రాసిన "Arctic Home in the Vedas" అనే గ్రంథం, జయస్వాల్ రచించిన "Hindu Polity" అనే గ్రంథం చాలా ప్రసిద్ధికెక్కాయి.

బ్రిటిష చరిత్రకారులు ఉత్తరదిక్కుకెళ్ళి (North pole) చరిత్ర రచనచేయగా మన చరిత్ర పండితులు దక్షిణ దిక్కుకి (South pole) వెళ్ళి వాగించడం మొదలెట్టారు. బాలగంగాధరతిలక్ "వేదాలలోని ఆర్కిటిక్ ప్రాంతం" అన్న తన గ్రంథలో నేడు భారతావనిలో జీవిస్తున్న ఆర్యులు ఆర్కిటిక్ ప్రాంతంనుండి ప్రపంచం నాలుగు దిక్కులకీ విస్తరించిన ఆర్యులేననీ, హైందవార్యులు సాధించిన మహాకార్యాలు "నభూతో నభవిష్యతి" అనీ అన్నాడు. ఇదే వరసలో వాదించారు, రాజనీతిశాస్త్రంపై వ్రాసిన గ్రంథకర్తలు కూడా. "Hindu Polity" రచయిత జయస్వాలూ, "Some Aspects of Ancient Hindu Polity" రచయిత భండార్కరూ, "A History of Hindu Political Theories" రచయిత ఘోషాల్ - వదిలరులూ ప్రాచీన హిందూ రాజనీతి శాస్త్రంలో యూరపియన్ శాస్త్రకారులైన హాబ్స్, లాక్, రూసో, స్పెన్సర్‌ల సిద్ధాంతాలను ఏనాడో మన ఆర్య ఋషులు ప్రతిపాదించారని, కాకపోతే వీసమెత్తు "తేడా" వుంటే వుండవొచ్చనీ వ్రాశారు. ఇంగ్లండులో పార్లమెంటుకూ, రాజుకూ జరిగిన అంతర్యుద్ధం (1642-46) లాంటిది మన దేశంలో జరగకపోయినా, 1688 లో గ్లోరియస్ రివల్యూషన్ వంటిది (రక్తరహిత విప్లవం) మనకి తెలియకపోయినా, 1789 లో జరిగిన ప్రపంచ ప్రఖ్యాత ఫ్రెంచివిప్లవం వంటి బూర్జువా ప్రజాస్వామిక విప్లవం మన చరిత్రలో లేకపోయినా, మన ఋషులు హాబ్స్, లాక్, రూసోల సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతాలనూ, స్పెన్సర్ ప్రతిపాదించిన "ఆర్గానిక్ థీరీ ఆఫ్ స్టేట్"నీ (రాజ్యాన్ని గూర్చిన ఆర్గానిక్ సిద్ధాంతం) నేటి అధునాతన పెట్టుబడిదారీ వ్యవస్థలో మాత్రమే ఉత్పన్నంకాగల "స్టేట్ కేపిటలిజాన్ని" చాణక్యుడు ప్రతిపాదించాడనీ వ్రాశారు. వీరు ప్రదర్శించిన వివేకాన్ని కాకపోయినా, ధైర్యసాహసాలను మనం మెచ్చుకోవాలి! ఐతే వారు ఇంతటితో ఆగితే బాగుండును. నేటి ప్రపంచంలో నాగరికమైన ప్రతీదీ, సైన్స్, ఫిలాసఫీ, పొలిటిక్స్, విమానాలు, ఆటంబాంబు, టెలిపతీ (దివ్యదృష్టి) ఒకటేమిటి అన్నీ

మన ఋగ్వేదంలో, ఉపనిషత్తుల్లో, అథర్వణవేదంలో, ఇతిహాసాల్లో, కౌటిలీయంలో వున్నాయని వీరు వాదిం చారు. ఇవన్నీ అప్పటికే వుంటే, యిప్పుడేమైనయి? అలెగ్జాండర్ వెంటవచ్చిన గ్రీకుపండితులూ, జర్మన్ సంస్కృత పండితులూ యీ విజ్ఞానసంపత్తి నంతటినీ తమ తమ దేశాలకి తరలించుకపొయ్యారని చెప్పారు. ఇట్టి వారి అసహాయపరిస్థితికి నవ్వూ, జాలీ వస్తుంది.

ఇంగ్లీషువాడు పచ్చిమాంసం తిని, జంతుచర్మాన్ని ధరించి, కొండల్లో, అడవుల్లో, గుహల్లో పశుప్రాయమైన అనాగరిక జీవితాన్ని గడపిన దినాల్లో ప్రాచీన హైందవులు, "ఉత్తమోత్తమమైన" ఆర్యసభ్యతా సంస్కృతులను సృష్టించారనీ, క్రీ. పూ. 3000 సంవత్సరాలనాటికే భారతదేశంలో మహెంజోదారో-హరప్పాలలో అత్యుత్తమ నాగరికత సృష్టింపబడిందనీ చెప్పారు. ఇలాంటి రచనలు, ప్రతిపాదనలు మరణించిన గతాన్ని ప్రేమించమని చెప్తాయి; మహోజ్వలమైన బంగారు భవిష్యత్తును మన చేతి కందకుండా దొంగిలిస్తాయి. దీన్నిబట్టి మన మాతృభూమినీ, దాని ఉత్తమ చరిత్రనీ తక్కువగా అంచనా వేస్తున్నాననిమాత్రం అర్థంచేసుకోకూడదు. మనదీ గొప్పదేశమే. ఎవరూ కాదనరు. "అతి ప్రాచీన యుగాలలో మానవ నాగరికతకు కేంద్రాలైన దేశాలలో భారతదేశ మొకటి. ప్రపంచంలో మొట్టమొదట్ల తిండిమొక్కలు పుట్టిన యేడు దేశాల్లో యిది ఒకటి. మానవుడు యీ తిండిమొక్కలను యేరి, పెంచి, ప్రపంచమంతటికీ విస్తరింపజేసినది యీ యేడు దేశాల నుండే" (డాంగే-భారతదేశం-ఆదిమ కమ్యూనిజంనుండి బానిస సమాజంవరకు పేజీ-1). అతి ప్రాచీనమైన నాగరికతకు కేంద్రమై విలసిల్లిన భూమి భారతదేశం. ఆ దృష్ట్యా మనదేశ చరిత్రనుగూర్చి గిలాంచవలసిన పని లేదు. ఐతే వాస్తవచరిత్ర ఏమిటి-అనేది ఎంతకి ప్రధానం. లేనిపోని డాబులకీ, దర్పాలకీ చరిత్రలో, శాస్త్ర సిద్ధాంత ప్రతిపాదనల్లో తావులేదు; వుండరాదు.

20 వ శతాబ్ద ప్రారంభం వరకూ ప్రాచీన హైందవులకు స్వతంత్రమైన అర్థశాస్త్రం లేదనీ, తదధ్యయనం లేదనీ చెప్పే కట్టుకథలోని బండారం 1905 లో కౌటిలీయం కనుగొనబడడంతో బైటపడ్డది. ప్రాచీన హైందవులు మతం తత్వశాస్త్రంతోపాటు, రాజనీతిశాస్త్రాన్ని కూడా అధ్యయనం చేశారనే విషయం కౌటిలీయంవల్ల రుజువైంది. ఈ గ్రంథం నిరంకుశ రాచరిక యుగం నాటి హైందవ రాజ్యపాలనా విషయాలకు సంబం ధించిన సూక్ష్మాతిసూక్ష్మమైన వివరాలను సైతం చర్చిం చింది.

కౌటిల్యుని కాలంలో ప్రాచీన భారతీయులు మానవ విజ్ఞానాన్ని నాలుగు భాగాలుగా విభజించారు. 1. ఆన్వీక్షకి(తత్వశాస్త్రం), 2. త్రయీ(Theology), 3. వార్తా (అర్థశాస్త్రం), 4. దండనీతి (రాజనీతిశాస్త్రం (The Science of Politics). ఈ విభజనను బట్టి నాటి హిందువులు తత్త్వ, మత, ఆర్థిక శాస్త్రాలనుండి రాజనీతిశాస్త్రాన్ని విడదీసి, స్వతంత్రమైన శాస్త్రంగా దానిని రూపొందించి అధ్యయనం చేశారనేది తేటతెల్ల మవుతుంది.

అంతేగాదు; బార్హస్పత్యులూ, ఔశానసులూ మతం, తత్వశాస్త్రం - రాజనీతిశాస్త్రానికి లొంగి వుండాలనే సిద్ధాంతాన్ని కూడా ప్రతిపాదించారు. తత్వశాస్త్రం, మతం - యిత్యాదివిషయాలు మోస పూరితమైనవి కాబట్టి అవి అర్థశాస్త్రానికి లొంగి వుండాలనేంతదాకా బార్హస్పత్యులు పోయారు. దీన్ని బట్టి తేలే విషయమేమిటి ? అర్థశాస్త్రం మతసిద్ధాంతాలకీ, తాత్విక సూత్రాలకీ, ధర్మ నిర్వచనాలకీ లొంగివుండాలని నాటి శాస్త్రకారులు భావించారనడం భావన తప్ప వాస్తవంకాదు. ఈ సందర్భంలో భండార్కర్ పండితుడు యిలాగన్నాడు :

"It will now be absuard to affirm that the Indians had for ever subordinated the study of the science of politics as that of Theology and Philosophy and had never developed it as an independent branch of knowledge." (D- R. Bhandarkar - some Aspects of Ancient Hindu polity - Page - 5.)

"భారతీయులు ఎల్లప్పుడూ రాజనీతిశాస్త్రంయొక్క అధ్యయనాన్ని మతంయొక్క, తత్వశాస్త్రంయొక్క అధ్యయనానికి లోబడి వుండేటట్లు చూచారనడం, దాన్నొక స్వతంత్ర విజ్ఞానశాస్త్రంగా అభివృద్ధిచేయ లేదనడం - అర్థంలేనిమాట." (డి. ఆర్. భండార్కర్ "ప్రాచీన హిందూరాజనీతి యొక్క కొన్ని ధోరణులు" పేజీ 5).

## ప్రాచీన అర్థశాస్త్ర రచనలు

ప్రస్తుతం, ప్రాచీన హిందూ అర్థశాస్త్రంయొక్క పుట్టుపూర్వోత్తరాలనూ, దాని స్వరూప స్వభావాలనూ పరిశీలించుదాం.

ప్రజాపతి ఐన బ్రహ్మ ప్రజాయోగ క్షేమార్థం ధర్మ, అర్థ, కామములను సంపాదించేందుకు ఒక లక్ష అధ్యాయాలతోకూడిన బృహత్ (Colossal and Stupendous) గ్రంథాన్ని రాశాడట. ధర్మానికి సంబంధించిన అధ్యాయాలను ఆ గ్రంథంనుండి వేరు చేసి మనువు ప్రత్యేకమైన ధర్మశాస్త్రంగా రచించాడట. అర్థానికి సంబంధించిన అధ్యాయాలను బృహస్పతి వేరుచేసి స్వతంత్ర అర్థశాస్త్రంగా రచన చేశాడట. కామానికి సంబంధించిన అధ్యాయాలను నందుడు వేరుచేసి, ప్రత్యేక కామశాస్త్రంగా విరచించాడట. లక్ష అధ్యాయాలు కలిగిన ఆ బృహత్ గ్రంథంలో "దండనీతి"కి (The Science of Politics) చెందిన భాగం చాలా పెద్దదిగా వుండడం వల్ల, దాన్ని విశాలాక్షుడు 10 వేల అధ్యాయాలకి కుదించాడట. అప్పటికీ పెద్దదిగా వున్నందువల్ల బాహుదంతుడు 5 వేల అధ్యాయాలకి సంక్షిప్త పరచాడట. పిదప బృహస్పతి ఆ గ్రంథాన్ని 3 వేల అధ్యాయాలకి కుదించాడు. తరువాత ఉశనాసుడు (శుక్రుడు) వెయ్యి అధ్యాయాలతో గూడిన గ్రంథంగా రచించాడు. అర్థశాస్త్రం పుట్టుకనుగూర్చిన యీ రెండవ దృక్పథం శాంతిపర్వం (మహాభారతం) లోని 59 వ అధ్యాయంవల్ల తెలుస్తోంది. వాత్స్యాయనుడు "కామసూత్రాల" లో వెలిబుచ్చిన దృక్పథాన్నుండీ, శాంతి పర్వ మందలి దృక్పథాన్నుండీ మనం రెండు నిర్ధారణలకు రావచ్చు:

1. రాజ్యం, తత్ సంబంధమైన విషయాలతోకూడిన సర్వ సమగ్రమైన ఒక బృహత్ గ్రంథం "దండనీతి" అను పేరుతో వుండేదనీ, ఆ గ్రంథం మరీ బృహత్ రూపంలో (Colossal and Stupendous) వుండడంవల్ల, తర్వాతవచ్చిన శాస్త్రవేత్తలు దానిని బాగా సంక్షిప్తంచేశారనీ గుర్తించవచ్చు.

2. "దండనీతి" అనే బృహత్ గ్రంథంలో అర్థశాస్త్రం ఒక భాగమనే విషయంకూడా మనం తెలుసుకోగలం.

ఇక అర్థశాస్త్ర గ్రంథాలను, వాటి రచయితలను గురించి పరిశీలించేందుకు ప్రయత్నిద్దాం.

మన అర్థశాస్త్రవేత్తలు రచించిన గ్రంథాల్లో ఒక్క "అర్థశాస్త్రం" (కౌటిలీయం) తప్ప, మిగతావన్నీ చెదపురుగులకి విందుభోజనమైపోయాయి. తరువాతకాలంలో అర్థశాస్త్రం, రాజనీతిశాస్త్రం, రాజన్యాయశాస్త్రం మొదలగు పేర్లతో రచింపబడ్డ గ్రంథాలలోనూ, వాటికి రాయబడిన వ్యాఖ్యానాలలోనూ అతి ప్రాచీనమైన రచయితల పేర్లూ, వారి గ్రంథాలూ ఉటంకింపబడ్డాయి. ఉదాహరణకి, కామందకుడు తన "నీతిసారం"లో కౌటిల్యుని నిరుపమాన ప్రతిభావిశేషాలను స్తుతించాడు.

అర్థశాస్త్ర గ్రంథాలకి రాయబడిన వ్యాఖ్యానాల ఆధారంతో మనం నాటి రచయితలనీ, గ్రంథాలనూ తెలుసుకోగలుగుతాం. కౌటిల్యుడు తన గ్రంథంలో 18 మంది శాస్త్రవేత్తల పేర్లను తెలియజేశాడు. మహాభారతంలోని శాంతిపర్వంలో, ప్రాచీన హైందవ రాజ్యాన్ని గూర్చిన వివిధ సిద్ధాంతాలు పేర్కొనబడ్డాయి.

వాస్తవానికి, కౌటిల్యునికి పూర్వమే దండనీతి లేక అర్థశాస్త్రం స్వతంత్రమైన శాస్త్రంగా పరిగణింపబడి, అధ్యయనం చేయబడేది. అప్పుడు స్వతంత్రమైన నాలుగు రాజనీతి ధోరణులు వుండేవి.

1. మానవులు, 2. పారాశరులు, 3. బార్హస్పత్యులు, 4. ఔశానసులు. ఇవే గాకుండా, ఈ శాస్త్రంపై రచింపబడ్డ ఎనిమిది ప్రామాణిక గ్రంథాలను కౌటిలీయం పేర్కొన్నది. వీటిని రచించినవారు - 1. భారద్వాజుడు, 2. విశాలాక్షుడు, 3. పరాశరుడు, 4. పారాశరుడు, 5. నారదుడు (పిశునుడు), 6. భీష్ముడు (కౌనపదంతుడు), 7. వాతవ్యాధి. 8. బాహుదంతుడు. కౌటిలీయమేగాక, మహాభారతేతిహాసంలోని శాంతిపర్వం కూడా పై అర్థశాస్త్రకారుల పేర్లతోపాటు, మరోశాస్త్రవేత్త-గౌరశిరసుని-కూడా పేర్కొన్నది. దీన్నిబట్టి క్రీ. పూ. 650 నాటికే రాజ్యాన్ని గూర్చిన చింతన, జిజ్ఞాస, ప్రాచీన హైందవ అర్థశాస్త్ర వేత్తలలో ఉదయించిందనీ, రాజకీయ తత్త్వశాస్త్రాన్ని సమగ్రమూ, స్వతంత్రమూ ఐన శాస్త్రంగా పరిగణించి, అధ్యయనం చేశారనీ సులభంగా తెలుసుకోవచ్చు.

కౌటిల్యునికి పూర్వమున్న ప్రామాణిక గ్రంథాలు శ్లోకాలరూపంలో రచింపబడ్డవని శాంతిపర్వం చెపుతోంది. ఈసత్యాన్ని కౌటిలీయంకూడా బలపరుస్తోంది. శాంతిపర్వంలో అర్థశాస్త్ర సంబంధమైన విషయాలు సంభాషణల రూపంలో వివరించబడ్డాయి. దీనిలోని 68 వ అధ్యాయంలో కోసలరాజైన వసుమనాసునికీ, బృహస్పతీకీమధ్య శాస్త్రసంబంధమైన విషయాలను గూర్చి క్రింది విధంగా ఒక సంభాషణ జరిగింది.

"ఎవరివల్ల జీవులు అభివృద్ధి చెందుతాయి? ఎవరివల్ల నాశనం చేయబడతాయి? ఎవరిద్వారా నిత్యానందాన్ని పొందగలుగుతాయి?" అని కోసలరాజు అడుగుతాడు. "రాజ్యాధిపతి (రాజు) యొక్క పరమావసరాన్ని ప్రజలు గుర్తించినపుడు," పై మూడు పనులూ జరుగుతాయని బృహస్పతి జవాబిస్తాడు. అలాగే, శాంతి పర్వంలోని 140 వ అధ్యాయంలో సౌవీర ప్రభువైన శత్రుంజయునికీ, భారద్వాజునికీ మధ్య అర్థశాస్త్రానికి సంబంధించిన విశేషాలను గూర్చి మరో సంభాషణ జరుగుతుంది. శత్రుంజయుడు వేసిన ప్రశ్నకి జవాబుగా "దండాన్ని" సర్వకాల సర్వావస్థలలోనూ సిద్ధంగా వుంచడంలో" గల ప్రాముఖ్యాన్ని భారద్వాజుడు వివరీకరిస్తాడు. దీన్నిబట్టి బృహస్పతి, భారద్వాజుడు, పిశునుడు మొదలగు ఆదిమ హిందూఋషులు రాచరిక వ్యవస్థకు సంబంధించిన ప్రథమ అర్థశాస్త్ర వేత్తలని మనం గ్రహించాలి.

గౌతమబుద్ధుని పుట్టుకకి పూర్వమే రచింపబడ్డాయని భావింపబడుతోన్న "జాతక కథలు", రాజ్య పరిపాలనా వ్యవహారాలలో మంత్రులకూ, రాజనీతి కోవిదులకూ ఉపయుక్తంగా ఉండేందుకు అర్థశాస్త్రం ఒక ప్రత్యేక శాస్త్రంగా రచింపబడి అధ్యయనం చేయబడేదన్న సత్యాన్ని వక్కాణిస్తున్నాయి. ఔశనసుడు తన గ్రంథానికి "దండనీతి" అనీ, బృహస్పతి అర్థశాస్త్రమనీ పేర్లు పెట్టారు. ఈ రెండు పేర్లనే తరువాత వచ్చిన గ్రంథకర్తలుకూడ తమ తమ రచనలకి పెట్టారు. "రాజశాస్త్రం", "రాజధర్మశాస్త్రం" అను పేర్లతోకూడా యీ గ్రంథాలు వ్రాయబడ్డాయి.

క్రీ. శ. 4, 5 శతాబ్దాలలో రచింపబడిన గ్రంథాలకు "రాజనీతి", "రాజ న్యాయ" అనే పేర్లు పెట్టబడ్డాయి. కామందకుడు శ్లోకాల రూపంలో రచించిన "కామందకనీతిసారం" క్రీ. శ. 500 లో రచింపబడ్డదే. కామందకీయానికి పూర్వమే వ్రాయబడ్డ "శుక్రనీతిసారం"అనేదానికి "నీతిసారం" అని పేరుండడం గమనార్హం. రాజకుమారులకోరకూ, భవిష్యత్ రాజనీతి కోవిదులకోరకూ చిన్న చిన్న కథలరూపంలో రచింపబడ్డ "పంచతంత్రానికి" న్యాయశాస్త్రమనే పేరుపెట్టబడింది.

పురాణాల్లోకూడా అర్థశాస్త్రాన్నిగూర్చిన పరిశీలనలు కన్పిస్తాయి. ఐతే ఆ భాగాలు ఏ ప్రామాణిక గ్రంథంనుండో మక్కికి మక్కీగా తీసుకోబడి పురాణాల్లో కెక్కాయి. పుష్కరుడనే అర్థశాస్త్రవేత్త అభిప్రాయాలు అగ్నిపురాణంలోకి ప్రవేశించాయి. వివిధ ధర్మశాస్త్రాలలో (మనుస్మృతి, నారదస్మృతి, పరాశరస్మృతి) రాజధర్మాన్నిగూర్చి వివరించిన అధ్యాయాలూ, రాజ్యాన్నిగూర్చి నాటి హిందూ శాస్త్రకారులు వెల్లడించిన భావాలూ, దృక్పథాలూ వివరించబడ్డాయి. ప్రత్యేకంగా మనువు రాజ్యాన్నిగూర్చి స్వతంత్రమూ, నిర్దిష్టమూ ఐన కొన్ని సిద్ధాంతాలను ప్రతిపాదించాడు.

క్రీ. శ. 10 వ శతాబ్దంలో సోమదేవసూరి అను జైన పండితుడు రాజకుమారుల అధ్యయనంకోరకు "నీతివాక్యామృతం" అను గ్రంథం రచించాడు. నీతి సూత్రాలనూ, అర్థశాస్త్ర సూత్రాలనూ కలిపి క్రోడీకరించి రాసిన మిశ్రమగ్రంథం యిది. ఈ గ్రంథానికి ఒక అజ్ఞాత వ్యాఖ్యాత క్రీ. శ. 10 వ శతాబ్దంలో వ్యాఖ్యానం వ్రాశాడు. దానిలో ఎంతోమంది అర్థశాస్త్రకారుల నామాలను పేర్కొన్నాడు. వారి పేర్లు యివి-భాగురి, భృగు, రాజపుత్ర, రైభ్య, జైమిని, నారద, గౌతమ, గార్గ, కౌశిక, ఋషిపుత్ర, హారిత, వర్గ, చారాయణ, పరాశర.

సోమదేవసూరికి పిదప ఈ శాస్త్రానికి సంబంధించిన రచనల్లో సొంత ఆలోచన, నూత్న సిద్ధాంత ప్రతిపాదన చచ్చిపోయాయని చెప్పవచ్చు. వాస్తవానికి కౌటిల్యునితోనే స్వతంత్ర సిద్ధాంతాల ప్రతిపాదన అడుగంటింది. ఐనా 10 వ శతాబ్దం పిదపకూడా శాస్త్రరచన ఆగిపోలేదు. రాజనీతిశాస్త్రం యొక్క సంకలనాలు (Digests) రచింపబడడం ప్రారంభమైంది. అలాంటి వాటిలో మొట్టమొదటిది "రాజనీతి కల్పతరువు". 12 వ శతాబ్దంలో కన్యాకుబ్జం, కాశీ రాజ్యాలను పాలించిన గోవింద చంద్రగహడవాలుని వద్ద మంత్రిగావున్న లక్ష్మీధరభట్టు ఈ"కల్పతరువు"ను రచించాడు. గోపాలమంత్రి "రాజనీతి కామధేను" అను గ్రంథం రచించాడు. చండేశ్వరుడు "రాజనీతి రత్నాకర" మును వ్రాశాడు.

11 వ శతాబ్దంపిదప ఉత్తరభారతం విదేశీయులైన మహమ్మదీయ సుల్తానుల చేతుల్లోకి వెళ్ళిన తర్వాత కూడా క్రీ. శ. 14 - 18 శతాబ్దాలవరకూ ధర్మశాస్త్రంవలెనే అర్థశాస్త్రంకూడా అధ్యయనం చేయబడుతూ వుండేది. ఐతే బృహస్పతి, భారద్వాజుడు, శుక్రుడు, కౌటిల్యుడు, కామందకుడు మున్నగు శాస్త్రవేత్తలలో కన్పించే ప్రతిభ, స్వతంత్ర సిద్ధాంతాల ప్రతిపాదన వీరిలో కన్పించదు. 14-18 శతాబ్దాలమధ్య

జీవించిన చండేశ్వరుడు, వాచస్పతి, మిత్రమిశ్రుడు, నీలకంఠుడు మొదలగు నిబంధకారులు రాజనీతి శాస్త్రాన్ని గూర్చి గ్రంథాలు వ్రాశారు. ఈ కాలం నాటివే "వీరమిత్రోదయరాజనీతి", "రాజనీతి మయూఖ" అను రచనలు. ఈ కాలంలోనే సూత్రాల రూపంలో "బృహస్పతి సూత్రాలు" అను గ్రంథం రచింపబడింది. మధ్యయుగాలలో రచింపబడ్డ ఈ గ్రంథాలు ప్రధానంగా రాజనీతి శాస్త్రంయొక్క సంకలనాలు. మను స్మృతి, నారదస్మృతి వంటి గ్రంథాలలో ప్రతిపాదింపబడిన ధర్మసూత్రాలను ఆధారంగా చేసికొని యివన్నీ వ్రాయబడ్డాయి.

## కౌటిల్యుని "అర్థశాస్త్రం"

ప్రస్తుతం ప్రాచీన భారతీయ అర్థశాస్త్ర చరిత్రలో కౌటిల్యునికున్న మహోన్నతస్థానం పరిశీలించుదాం.

"అర్థశాస్త్రం" అనే పేరుతో రాజధర్మాన్ని విపులంగా వివరించే గ్రంథరాజాన్ని వ్రాయడం, శాస్త్రీయసిద్ధాంతాల ననుసరించి దిగంతవిశ్రాంతమైన మౌర్యసామ్రాజ్యాన్ని చంద్రగుప్తుని సహాయంతో స్థాపించడం - యీ రెండు కారణాలవల్ల కౌటిల్యుడు ప్రాచీనహైందవ అర్థశాస్త్ర చరిత్రలో అగ్రగణ్యుడైన శాస్త్రవేత్తగానూ, భారతదేశ చరిత్రలో ఒక మహా మహుడుగానూ పరిగణింపబడుతున్నాడు. శాస్త్రీయ సిద్ధాంతాలను ప్రతిపాదించడంలోనే గాకుండా వాటి మంచిచెడ్డలను ఆచరణలో నిర్ధారణ చేయడంలోకూడ కౌటిల్యుడు అసమానమూ, అపూర్వమూ అయిన ప్రజ్ఞను ప్రదర్శించాడు. శాస్త్రవేత్తల సూత్రాలను ఆయన కొంతవరకు అంగీకరించాడు. కొన్ని సందర్భాలలో ఆ మూలసిద్ధాంతాలలో కొన్ని తీవ్రమైన సంస్కరణలుచేశాడు. మరికొన్ని సందర్భాలలో మూల సిద్ధాంతములను విచ్ఛిత్తిచేసి, సంపూర్ణమైన స్వతంత్ర సిద్ధాంతాల ప్రతిపాదనకు ఉద్యమించాడు.

కౌటిల్యునికి పూర్వమున్న శాస్త్రవేత్తలు ప్రతిపాదించిన సూత్రాలు ధర్మమనే ఉక్కు చట్రంలో బంధింపబడ్డాయి. పూర్వ శాస్త్రకారులు 'అర్థం' కంటె ధర్మాన్నిగూర్చి అధికంగాచెప్పారు. ధర్మశాస్త్ర నియమాలకి అర్థశాస్త్ర సూత్రాలు కట్టుబడివుండాలని చెప్పారు. కాలచక్రం గిర్రున తిరిగింది. పరిస్థితులు మారిపోయాయి. పూర్వం చెప్పబడిన ధర్మసూత్రాలు కాలానుగుణ్యంగా, మారుతున్న పరిస్థితుల కనుకూలంగా మారక యాంత్రికంగా తయారయ్యాయి. అలాంటి పరిస్థితుల్లో కాలానుగుణ్యంగా అర్థశాస్త్ర సూత్రాలను కొన్నిచోట్ల సంస్కరించాడు; కొన్ని విషయాల్లో మూలసిద్ధాంతాల్నే మార్చాడు.

ఉదాహరణకి - కౌటిల్యునికి పూర్వం ధర్మశాస్త్ర కారులు విధవావివాహాలనుగానీ, వివాహబంధ విమోచనాన్నిగానీ అంగీకరించలేదు. కాని, కౌటిల్యుడు కాలానుగుణంగా వివాహబంధవిమోచనము, ప్రోషిత భర్తృకలకూ, మృతభర్తృకలకూపునర్వివాహము, ఋతుమతికి స్వయంవరణము - యిత్యాది తీవ్ర సాంఘిక సంస్కరణలను అతి ధైర్యంగా ప్రవేశపెట్టాడు. దైనందిన రాజ్యపాలనలో కాకలుతీరిన రాజనీతిజ్ఞుడుగా వ్యవహరించాడు.

రాజ్యపరిపాలనా రంగంలోకూడా ఆయన మార్పులను ప్రవేశపెట్టాడు. రాజులు తమ రాజ్యాలలో గూఢచారి దళాలను ఏర్పరచాలనీ, భేదోపాయాలచే శత్రువును మోసగించి తెగటార్చవలెననీ, శత్రురాజులకి వ్యతిరేకంగా ఆ రాజ్యాల ప్రజలలో ద్వేషం కలుగ జేయాలనీ చెప్పాడు. ఈ "కుటిల" మార్గాలు, పరంపరానుగతంగావస్తున్న ధర్మసూత్రాలను నిలువునా ఖూనీచేస్తాయని పూర్వపండితులు తలచి, ఆయనపై కత్తులు నూరారు. కౌటిల్యుడు రాజ్యపాలనా సౌష్ఠవాన్ని పటిష్ఠం చేసేందుకు ప్రవేశపెట్టినసంస్కరణలు, సూచించిన నూత్నమార్గాలు, ప్రాచీనధర్మశాస్త్రకారుల యాంత్రిక సూత్రాలకి వ్యతిరేకంగా తయారయ్యాయి. కరువు కాటకాలను నివారించేందుకూ, రాజ్యంలో హఠాత్తుగా విప్లవం, శత్రుదండయాత్ర మొదలగు అత్యవసర పరిస్థితులు సంభవించినప్పుడూ ప్రభుత్వ కోశంలో ధనంలేకపోతే సంపన్నులనుండి బలవంతంగా డబ్బు గుంజడం, దుర్మార్గుల పొలాలను బలప్రయోగంతో స్వాధీనం చేసికోవడం, ప్రజల మూఢమత విశ్వాసాలను ఆసరగా తీసికొని అధర్మమార్గాల ద్వారానైనా ధనం సంపాదించడం - ఇవి రాజ్యం యొక్క శాంతి భద్రతల దృష్ట్యా, సుస్థిరత దృష్ట్యా అత్యవసరమని కౌటిలీయంలో స్పష్టంగా ప్రతిపాదించాడు. కాని నాటి ధర్మశాస్త్రకారులు కౌటిల్యునిపై విరుచుకుపడ్డారు. ధర్మగ్లాని కలుగుతుందని కారాలు మిరియాలు నూరారు. ఐనా వారి విమర్శలకీ, ఆవేశ ఆగ్రహాలకీ యిసుమంతైనా సరకుచేయక నల్లేరుపై బండిన తోలినట్లు తన దోవలో తాను పయనించాడు.

వాస్తవిక రాజకీయరంగంలో అధికారదాహంతో వుండేవారు ఎలా వ్యవహరిస్తారో, ప్రవర్తిస్తారో

అతడు విశదీకరించాడు. ఈ ప్రవర్తన న్యాయబద్ధమా, ధర్మబద్ధమా అనే మీమాంసకి అతడెట్టి ప్రాధాన్యం ఇవ్వలేదు. శత్రువులను ఓడించడంలో, మోసం, అసత్యప్రచారం, కుట్రలు, కుహకాలు - యివన్నీ ఉపయోగింపదగిన సాధనాలనియే అతని అభిప్రాయం.

ఉత్తమ లక్ష్యమును, ఫలమును పొందేందుకు వక్రమార్గాన్నైనా అనుసరించాలని అతని మతం. రాజ్య భద్రత, సుస్థిరతకే ఘోర విపత్తు వాటిల్లినపుడు, శత్రువును గెలుచుకొనుటకు డబ్బు అవసరమైతే, అధర్మమూ, వక్రమూ, దౌర్జన్యమూ ఐన మార్గాలద్వారా సంపాదించినా ఫరవాలేదు అని అంటాడు. దీనికొక ఉదాహరణ యిచ్చాడు. ఒక గోవును వేటకాడు తరుముకొని వచ్చాడు. ఆ ఆవు పారిపోయివచ్చి ఒక పరమ సత్యవ్రతుని ఆశ్రమంలో దాక్కొన్నది. వేటకాడు పరుగెత్తికొని వచ్చి "ఆవు యీ దారిన పోయినదా?" అని అడిగితే, సత్యాన్ని చెప్పి, గోవును కసాయికత్తికి ఒప్పగించవలెనా? లేక అసత్యం పలికి ఆవును రక్షించవలెనా? ఆ సమయంలో, ఎంతటి సత్యవతుడైనా, అబద్ధమాడైనా ఆవును రక్షించడం ధర్మం, న్యాయం అంటాడు కౌటిల్యుడు. నూరు అబద్ధాలాడియైనా ఒక పెళ్ళి చేయమనే సామెత అన్నమాట. ఉత్తమసాధ్యాలను అయుక్తసాధనాల ద్వారానైనా పొందవచ్చును; పొందాలి అని చెప్పాడు. ఈ ప్రతిపాదనని ఆచరణలో చేసి చూపినవాడు, 19వ శతాబ్దంలో జీవించి, జర్మన్ సామ్రాజ్యవాదానికి పునాదులను వేసిన అఘటన ఘటనా సమర్థుడు బిస్మార్క్. అంతకుపూర్వం క్రీ. పూ. 4వ శతాబ్దంలోనే అతి చిన్న రాజ్యాన్ని తన యుక్తిచే సువిశాల, మౌర్య సామ్రాజ్యంగా విస్తరింపజేసిన మహోన్నత ప్రతిభాశాలి కౌటిల్యుడు.

సాధ్యాలు సాధనాలను సమర్థిస్తాయి అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన మరో రాజకీయతత్త్వవేత్త - ఇటాలియన్ దేశీయుడైన మేకవెల్లి. ఇతడు "ప్రిన్స్" (Prince) అనే ప్రపంచ ప్రఖ్యాత గ్రంథం వ్రాశాడు. రాజులు తమ గమ్యాన్ని చేరుటకు, తాము వాంఛించిన ఫలాన్ని పొందేందుకు ఎలాంటి కుట్రలనైనా చేయవచ్చుననీ, మోసాలు, అసత్యాలు, దుర్మార్గాలు కూడా చేపట్టవచ్చుననీ అతి నగ్నంగా ప్రతిపాదించాడు. ఈమార్గాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నాటిరాజులు, మతగురువులు, రాజనీతివేత్తలు అనుసరిస్తున్నప్పటికీ వారు తా మేకవెల్లి సిద్ధాంతాలను నోరారా తిట్టి, కారాలు మిరియాలు నూరారు. వీరు రహస్యంగా ఆచరణలో పెడుతున్న దాన్ని సిద్ధాంతరీత్యా సమర్థించి ప్రచారం చేయుటమే మేకవెల్లి చేసిన "బ్రహ్మాండమైన నేరం" అందుకని నాటి క్రిస్టియన్ నీతిశాస్త్రవేత్తలు, మతాధిపతులు ఆయనమీద ఒక్కుమ్మడిని విరుచుకపడ్డారు.

కౌటిల్యుని కాలంనాటికి భారతదేశంలో, ప్రధానంగా ఉత్తర భారతంలో చిన్నచిన్న రాజ్యాలు లెక్కకు మిక్కిలిగా వుండేవి. నిరంతర అంతఃకలహాలలో యీ రాజ్యాలు కుతికలదాకా కూరుకు పోయాయి. అలాంటి పరిస్థితులలో భారత దేశాన్నంతటినీ ఏవిధంగానైనా ఐక్యం చేసే అతని ఏకైక లక్ష్యం. అందుకొరకే అతడు ఈ శాస్త్ర రచనకు ఉపక్రమించాడు. దానిని ఆచరణలో పెట్టి సఫలీకృతుడయ్యాడు.

మానవస్వభావంలో అధికారదాహం అంతర్భూతంగా వుందంటాడు కౌటిల్యుడు. అందలి కౌటిల్యాన్నీ, వంచననీ, అసూయనూ, కుట్రనూ న్నవి ఉన్నట్లుగా అతడు పరిశీలించి వివరించాడు. కౌటిల్యునికి పూర్వమున్న ధర్మశాస్త్రవేత్తల దృక్పథం యిందుకు భిన్నమైనది. అది ఆదర్శాలపుట్ట; ఆచరణకి దూరం. ధర్మశాస్త్రవేత్త రాజ్య ఆదర్శాలనూ, వాటిని పొందవలసిన మార్గాలనూ వివరించాడు. కౌటిల్యుడు దీనితో భేదించాడు. ఆదర్శప్రాయమగు రాజ్యాన్ని స్వర్గలోకంలో సృష్టించిన ప్లేటోతో ఆయన శిష్యుడు అరిస్టోటిల్ ఎలా అంగీకరించలేదో, అలాగే పూర్వ ధర్మశాస్త్రవేత్తల జడప్రాయమైన, ఆదర్శయుక్తమైన, కేవల ధర్మబద్ధమైన సూత్రాలనుండి కౌటిల్యుడు భేదించి, ఆచరణయోగ్యమైన, మారుతోన్న సమకాల పరిస్థితుల కనుగుణ్యమైన మార్గాన పయనించాడు. ఈ శాస్త్ర గమ్యాన్ని మరో మార్గంవైపు మళ్ళించి ధర్మ శాస్త్రానికి తలవొంచని స్వతంత్రశాస్త్రంగా నిర్మించాడు. ఇదే అతని ప్రతిభాశేముషికి ఎదురులేని తార్కాణము. అందువల్లనే యితడు ప్రాచీన హైందవ అర్థశాస్త్ర చరిత్రలో అజరామరుడయ్యాడు. నాటి పండితలోకంలో అర్థశాస్త్ర అధ్యయనాన్ని పురికొల్పి, మరణావశిష్టంగావున్న శాస్త్రానికి తిరిగి జీవం పోశాడు కౌటిల్యుడు. అందుకనే కామందకుడు తన "నీతిసారం"లో కౌటిల్యుణ్ణి అవతారపురుషుడుగా ప్రశంసించాడు.

లక్ష అధ్యాయాలున్న దండనీతి అనే ప్రత్యేక శాస్త్రం, క్రమంగా 10 వేలు, 5 వేలు, 3 వేలు, చివరికి వెయ్యి అధ్యాయాలకి విశాలాక్ష, బాహుదంత, బృహస్పతి, ఉశనాకులవల్ల సంక్షిప్తం చేయబడిందంటే, ఆ శాస్త్ర అధ్యయనాన్ని గూర్చిన ఆకాంక్ష, రాహువు నోటబడ్డ చంద్రబింబంవలె క్రమంగా క్షీణిస్తూ వచ్చిందని మనం గ్రహించవచ్చు. అట్టి విపద్దశనుండి ఆ శాస్త్రాన్ని కాచి కాపాడిన ఖ్యాతి మౌర్య సామ్రాజ్య నిర్మాత, జగద్విఖ్యాత రాజనీతి శాస్త్ర వేత్త, సుప్రసిద్ధ అర్థశాస్త్ర గ్రంథకర్త ఐన కౌటిల్యునికి దక్కింది. ధర్మశాస్త్రకారుల మెదడు మెలికలలోనూ, ప్రాచీన తాళపత్ర గ్రంథసంచయంలోనూ వున్న అర్థశాస్త్రాన్ని అతడు బైటికి తీసి పండితులలో, ధర్మ శాస్త్రంతో సమానమైన గౌరవాన్ని సంపాదింప గలిగాడు. అందుకనే, ప్రాచీన హైందవ అర్థ శాస్త్రాన్ని గురించి అధ్యయనంచేసే ప్రతి విద్యార్థి ఆయనకెంతో ఋణపడివున్నాడు. మరుగున పడి పోతున్న శాస్త్రాన్ని తాను కాపాడానని కౌటిల్యుడే తన గ్రంథం చివరిభాగంలో చెప్పుకొన్నాడు.

తన కాలంనాటికి అర్థశాస్త్రాలు ఎన్నివున్నాయో, ఎన్ని ఆలోచనా ధోరణులు ఉన్నవో, వాటన్నిటినీ సంక్షిప్తపరచి అతి జాగరూకతతో క్రోడీకరించి ఒక సంహృత్యగా (Compendium) రచించానని కౌటిల్యుడే చెప్పాడు.

అందువల్లనే కౌటిలీయంలోని జీవశక్తిని కాలం తన సమ్మెటపోటులతో చంపలేకపోయింది! తన గ్రంథంలో ఎన్నోచోట్ల కౌటిల్యుడు గురువులతోనూ, పూర్వశాస్త్రకారుల పెక్కు సిద్ధాంతాలతోనూ తాను ఏకీభవించడంలేదని చెప్పాడు.

అంతేగాదు; ఆయన ఒక స్వతంత్రమైన రాజనీతి ధోరణికి ప్రారంభకుడయ్యాడు. "Kautilya had a definite set of views on all the important points of policy and administration . views sufficiently numerous and characteristic to go to form a different school of polity" ("Some Aspects of Ancient Hindu polity"- D. R. Bhandarkar - Page - 23).

కౌటిల్యుని తర్వాత అర్థశాస్త్రం ఏ విధమైన అభ్యుదయాన్నీ సాధించలేకపోయింది. క్రీ. శ. 4 వ శతాబ్దంలో కామందకుడు రచించిన "నీతిసారం", 10 వ శతాబ్దంలో సోమనాథసూరి రచించిన "నీతి వాక్యామృతం" మినహా మిగతా గ్రంథాలన్నీ అతుకుల బొంతలూ, అనుకరణలూను. ప్రాచీనశాస్త్ర సూత్రాలను ప్రాతిపదికగానో, సంక్షిప్తంగానో వ్రాయబడిన అర్థ శాస్త్ర సంకలనలు కొల్లలుగా పుట్టాయి. కామందకుని తోనే అర్థశాస్త్రం పూర్తిగా క్షీణదశలో పడింది.

అశోకుడు అనుసరించిన అహింసా విధానంవల్ల మౌర్యసైన్యం శక్తి క్షీణించడం, తత్ఫలితంగా దేశరక్షణ కుంటుపడడం జరిగింది. అశోకుని మరణానంతరం శకులు, పహ్లావులు, కుషానులు, హూణులు, ఘూర్జరుల- మొదలగు విదేశీజాతులు భారత దేశంలోనికి ప్రవేశించి రాజ్యాధికారాన్ని క్రమంగా హస్తగతం చేసి కొన్నాయి. మహమ్మదీయ సుల్తానుల పరిపాలన ప్రారంభమయ్యేదాకా ఈ వివిధమైన విదేశ జాతులే రాజ్యాధికారాన్ని దేశంలో చలాయించాయి. (శుంగులు, కణ్వులు, గుప్తులు తప్ప) మహమ్మదీయ సుల్తానుల పాలన ప్రారంభం కావడంతో ప్రాచీన హైందవ ప్రతిభ క్షీణించిపోయింది. ప్రాచీన భారతంలో ఉద్దండులైన పండితులచే, మహామహులైన శాస్త్రవేత్తలచే పెంచి పోషింపబడి, మూడు పూలూ ఆరు కాయలూ కాసిన హిందూ అర్థశాస్త్రం, తదధ్యయనం క్రమంగా క్షీణించి నాశనమైపోయింది. కోటి సూర్యుల తేజస్సుతో వర్ధిల్లి ప్రకాశించిన ప్రాచీన అర్థశాస్త్రం, కౌటిలీయాన్ని అవశేషంగా వదిలి పోయింది.

ఇంత చర్చ జరిగిన పిదప తేలే సారాంశం ఏమిటి? మనకీ ఒక అర్థశాస్త్రం వుంది; దానికొక చరిత్రవుంది. ఆ శాస్త్రాన్నీ, ఆ ప్రాచీన చరిత్రనీ, కవిలికట్టల్లో నుండి, మసిలిమీద చెదపురుగులకి ఆహుతై పోతున్న వివిధ తాళపత్ర గ్రంథాలనుండి, ప్రాచీన పుస్తక భాండాగారాలనుండి తవ్వి తలకెత్తాలి. ఆనాడే మనం ప్రాచీన హైందవ అర్థశాస్త్రాన్ని సర్వసమగ్రంగా కాంతిలోకి తెచ్చి, ప్రపంచం ముందు పెట్టగలం.

కాబట్టి వేదసాహిత్యం, జైన, బౌద్ధ సాహిత్యాలు పౌరాణికసాహిత్య, మహాభారత ఇతిహాసంలోని "శాంతిపర్వం", క్రీ. పూ. 350 నాటి కౌటిలీయం, కౌటిల్యుని అర్థశాస్త్రంలో పేర్కొనబడ్డ వివిధ అర్థ శాస్త్రవేత్తల పేర్లూ, ఆనాటి నాలుగు ఆలోచనా ధోరణులూ, కామందకుని నీతిసారం, బార్హస్పత్యం, శుక్రనీతిసారం, రాజనీతిసారం, నారదనీతి, పంచ తంత్రం, మనుధర్మశాస్త్రం, మధ్యయుగాల్లోని నిబంధ

కారులు రచించిన వివిధ వ్యాఖ్యాన గ్రంథాలూ-యివన్నీ కలసి సన కళ్ళెదుట ప్రాచీన హైందవ రాజనీతిశాస్త్రాన్ని ఉంచుతున్నాయి. వీ టన్నిటిని జాగ్రత్తగా పరిశీలించి; శ్రద్ధగా అధ్యయనంచేస్తే, అతి పురాతనకాలంలోవున్న ఆదిమ కమ్యూనిస్టు గణ తంత్రాల నుండి వీకచ్ఛత్రాధిపత్యంక్రింద భారత దేశాన్ని పరిపాలించిన రాచరిక వ్యవస్థ కాదానాడు వునికిలోవున్న వివిధ రాజ్యాలస్వరూప స్వభావాలను మనం అర్థంచేసుకో గల్గుతాం.

## అర్థశాస్త్ర నిర్వచనం

కౌటిల్యుడు అర్థశాస్త్రాన్ని యిలా నిర్వచించాడు: "అర్థ" అంటే ప్రజలతోకూడిన ఒక ప్రత్యేక భూభాగం (జనపదం). ప్రజలతోకూడిన ఒక ప్రత్యేక భూభాగాన్ని సంపాదించి, దాన్ని తామరతంపరగా అభివృద్ధిచేయుటకు అనువైన వివిధ మార్గాలను పరిశీలించు శాస్త్రమే అర్థశాస్త్రం.

"మానవులకు ప్రతికేంద్రకు మూలాధారం అర్థం. అర్థం అంటే ప్రజలతోకూడిన భూభాగం. కాబట్టి ఆ భూభాగాన్ని ఎలా సంపాదించాలో, ఎలా భద్ర పరచాలో వివరించు శాస్త్రమే - అర్థశాస్త్రం." (అర్థ శాస్త్రం : పేజీ 426)

రాజదండాన్ని నిరంతరం సమర్థతతో ఉపయోగించడమే దండనీతి అని నిర్వచించాడు కౌటిల్యుడు. ఈ నీతిలో నాలుగు ప్రధాన విషయాలు గర్భితమై వున్నాయి :

1. ఏదైతే లభ్యంకాలేదో దాన్ని సంపాదించడం (అలబ్ద లాభార్థం)

2. ఏదైతే లబ్ధమైనదో (సంపాదింపబడిందో) దాన్ని భద్రపరచడం. (లబ్ధపరి రక్షణి).

3. అలా భద్రపరచబడిన దానిని వృద్ధిచేయడం (రక్షిత వివర్ధన).

4. అలావృద్ధిచేయబడినదాన్ని తగినవారికి-అర్హులకి-పంచిపెట్టడం.

కౌటిల్యుడే కాదు యిలాంటి నిర్వచనం (వృద్ధశ్య తీర్థేషు ప్రతిపాదని) చేసింది. మనువుకూడా తన ధర్మశాస్త్రంలో వైవిధంగానేచెప్పాడు. భూభాగాన్ని దండం (సైన్యం) యొక్క సహాయంతో సంపాదించాలని వక్కాణించాడు. భూభాగం (సంపాదనతో) సంబంధించినదే దండనీతి లేక అర్థశాస్త్రం అని మనువు నిర్వచనం.

## రాజ్యంపుట్టుకను గూర్చిన వివిధ సిద్ధాంతాలు

ప్రాచీన హైందవులు రాజ్యంపుట్టుకను గూర్చి ప్రతిపాదించిన వివిధ సిద్ధాంతాలను పరిశీలించబోయే ముందు ఒక విషయం చెప్పాలి. యురపియన్ పొలిటికల్ ఫిలాసఫీలో 1. సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతం; 2. డివైన్ ఆరిజిన్ సిద్ధాంతం; (రాజత్వం దైవదత్తమనే సిద్ధాంతం) ఫోర్స్ సిద్ధాంతం (బల ప్రయోగ సిద్ధాంతం, 4. మాతృస్వామిక సిద్ధాంతం (Matriarchal theory) 5. పితృస్వామిక సిద్ధాంతం (Patriarchal theory) 6. పరిణామాత్మక సిద్ధాంతం (Evolutionarytheory) - అనే ఆరు సిద్ధాంతా లున్నాయి. హైందవరాజనీతిశాస్త్రంలో యిలాంటి సిద్ధాంతా లున్నవా లేవా అనే మీమాంస, ప్రస్తుతం అప్రధానం.

యూరప్ ఖండంలో తలెత్తిన వివిధ సామాజిక, రాజకీయ, ఆర్థిక, ధార్మిక పరిస్థితులవల్లనూ, వివిధమైన సంస్థల (Institutions) సంఘటనలవల్లనూ ఆ ఖండంలో అలాంటి సిద్ధాంతాలుద్భవించాయి. ఇంగ్లండులోఅతి పురాతన కాలంనుండి విటన్(విజ్ఞానుల సభ) వుండేది. ఈ విటన్ కీ, ఋగ్వేద కాలంలో వున్న "సమితి"కీ కొన్ని పోలికలున్నాయి. విటన్ (విజ్ఞానుల సభ) క్రమంగా రాజ్యమహాసమితి (The Great Council of the Realm)) గా మారి, తరువాత ఎన్నో వందల సంవత్సరాల పరిణామంవల్ల ఆంగ్ల జాతీయ ప్రయోజనాలని ప్రతిబింబించే ప్రధాన సంస్థగా పరిణతి చెందింది. ఈ శతాబ్దాల క్రమ పరిణామం, వికాసం వెనకాల ఎంతో సుదీర్ఘ చరిత్ర వుంది. పార్లమెంటు, తన హక్కుల కొరకు భీకరమైన అంతర్యుద్ధానికే సిద్ధపడి, దాన్ని కొనసాగించి విజయాన్ని పొందడం; యుద్ధానంతరం మొదటి ఛార్లెసువంటి పరమ నిరంకుశుడు ఉరితీయబడ్డం; పార్లమెంటు ప్రతినిధిగా ఆలివర్ క్రాంవెల్ వంటి సామాన్య కుటుంబీకుడు రాజ్యంచేయడం; పిదప రెండవ ఛార్లెస్ కాలంలో పార్లమెంటులో హెబియస్ కార్పస్ చట్టంలాంటిదాన్ని పాస్ చేసి1679లో వ్యక్తిస్వాతంత్ర్యం రాచరిక నిరంకుశత్వానికి బలిపోకుండా పరిరక్షింప గలగడం; 1688 లో రెండవ జేమ్సును సింహాసన భ్రష్టునిగా జేసి రక్తరహిత విప్లవాన్ని జయప్రదంగా

కొనసాగించడంలాంటి సంఘటనలు ఎన్నో ఆంగ్లచరిత్రలో వున్నాయి. యివన్నీ బ్రిటిష్ పార్లమెంటుయొక్క నేటిస్థితికీ, వికాసానికీ, పరిణతికీ కారణభూతాలు. ఈ చరిత్రనంతా మరచిపోయి, బ్రిటన్‌కి పార్లమెంటూ, ప్రజాస్వామ్యవ్యవస్థ వున్నాయే- మనకి లేవే అని కించపడడం అనవసరం, అవివేకం.

అలాగే 18 వ శతాబ్దంలో యూరప్‌లో స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రుత్వం వంటి ఉత్తమ మానవాదర్శాలను ప్రచారం చేసిన ఫ్రెంచి విప్లవం జాన్ జాక్విస్ రూసోయొక్క విప్లవ తాత్త్విక సిద్ధాంతాలను ప్రచారంలోకి తెచ్చి, పీడిత ప్రజాసామాన్యంలో అపూర్వమూ, వినూత్నమూ అయిన భావసంచలనాన్ని కలుగజేసింది. "మానవుడు స్వేచ్ఛతోను, సమానత్వంతోను జన్మించా"డని రూసో, తన "కాంట్రాక్ట్ సోషల్" అనే ప్రఖ్యాత గ్రంథంలో వ్రాశాడు. 1688 లో జరిగిన రక్తరహిత విప్లవమును తాత్త్వికంగా సమర్థించేందుకు, జాన్‌లాక్ "Two Treatises of Government" (1690) అను గ్రంథం వ్రాశాడు. 1642-51 వరకూ, మొదటి ఛార్లెస్‌కీ, బ్రిటిష్ పార్లమెంటుకీ మధ్య జరిగిన భీకర అంతర్యుద్ధం, ఫలితాలు, 'హాబ్స్'ను, "లెవియాథాన్" (1651) రచనకి పురికొల్పాయి.

16 వ శతాబ్దంనాటి యూరప్ పరిస్థితులూ, ప్రత్యేకంగా ఇటాలియన్ రాజకీయ, సాంఘిక నైతిక పరిస్థితులూ మేకవెల్లీని "The Prince" (1513 రచనకు ప్రోద్బలమిచ్చాయి.

బ్రిటన్‌లోపుట్టిన విటన్ (విజ్ఞానుల సభ) వంటిది ఋగ్వేద కాలంలోవున్నా, అక్కడి విటన్‌లా మన "సమితి" క్రమ వికాసాన్ని పొందలేదు. ఫ్రెంచి విప్లవం, రష్యన్ విప్లవంలాంటి ప్రజా విప్లవాలు మన దేశంలోరాలేదు. అలాంటపుడు ప్రాచీన హైందవ అర్థశాస్త్ర చరిత్రలో సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతంగానీ, రూసో మహాశయుని వుత్తమ ప్రవచనాలుగానీ, లాక్ ప్రతిపాదించిన చట్టబద్ధ రాచరికంగానీ, థామస్ పెయిన్ వ్రాసిన "మానవస్వత్వాలు" గానీ సహజంగా కన్పించవు. అందుచేత అవి లేవని చింతించడం అనవసరం.

మన అర్థశాస్త్ర సిద్ధాంతాలకి లేని పోని వితండ వ్యాఖ్యానాలుచేసి, హాబ్స్, లాక్,రూసోల సిద్ధాంతాలను బలవంతంగా మన సిద్ధాంతాలలో చూపేందుకు వ్యర్థ ప్రయత్నాలు చేయకూడదు.

ఈ సందర్భంలో ఒకటిమాత్రం చెప్పాలి. మన దేశంలో కొందరు పండితులు ఒక విచిత్రమైన విషయం చెపుతుంటారు. మన ప్రాచీన తాళపత్ర గ్రంథాలలో ప్రతిపాదింపబడిన సిద్ధాంతాలనూ, విజ్ఞాన సంపత్తినీ అలెగ్జాండరువెంట వచ్చిన గ్రీకు పండితులూ, వెంటవెళ్ళిన హిందూ శాస్త్రి వేత్తలూ, పిదప జర్మన్ సంస్కృతి పండితులూ యింకా యెవరెవరో విదేశాలకి తీసుక వెళ్ళారని తలంచడం భారతీయ పండితుల ఛాందసాన్నీ, ఇంగితజ్ఞాన శూన్యతనీ నిరూపిస్తుంది. ఇలాంటి వాదన చారిత్రక సత్యాన్ని వెలికి తీయదు.

మన సిద్ధాంతాల ప్రత్యేకతలు మనకున్నాయి. పాశ్చాత్య సిద్ధాంతాల ప్రత్యేకతలు వాటికున్నాయి; ఈ విధమగు విశాల దృక్పథంతో మన అర్థశాస్త్ర సిద్ధాంతాలను పరిశీలిద్దాం.

ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడైన కౌటిల్యుడు రాజ్యం (State) యొక్క పుట్టుకను వివరిస్తూ - "రాజే రాజ్యం" అన్నాడు. (రాజా రాజ్యం ఇతి ప్రకృతి సంక్షేపః : అనగా రాజ్యంయొక్క అన్ని ప్రకృతుల లేక లక్షణాల సారాంశం రాజే రాజ్యం అనునది) రాజ్యానికి అతి ప్రధానభాగమూ, రాజ్యశరీరానికీ ఆత్మ ఐన రాజే రాజ్యాని కంతటికీ ప్రాతినిధ్యం వహిస్తాడంటాడు కౌటిల్యుడు. "రాజే రాజ్యం" అన్న కౌటిల్యుని సూత్రానికీ "I am the State" (నేనే రాజ్యం) అని పలికిన ఫ్రెంచిరాజు పదునాల్గవ లూయీ దృక్పథానికీ పూర్తియైన సారూప్యత వుంది.

ప్రాచీన హైందవ అర్థశాస్త్రకారులు ప్రజాస్వామ్య ప్రభుత్వానికి సంబంధించిన రాజనీతి సూత్రాలను ప్రతిపాదించలేదు. సొంత ఆస్తి, శూద్రబానిసత్వం, సమాజంలో వేరూనడంతోనే నెలకొన్న రాచరిక వ్యవస్థ ప్రతి అర్థశాస్త్రవేత్తకూడా ప్రతిపాదించాడు.

రాజ్యంయొక్క పుట్టు పూర్వోత్తరాలనుగూర్చి కౌటిలీయం పెద్దగా ఏ సమాచారాన్నీ యివ్వలేదు. ప్రాచీన బౌద్ధవాఙ్మయ గ్రంథాలు, ఐతరేయ బ్రాహ్మణం వంటి బ్రాహ్మణాలు, మను ధర్మశాస్త్రం వంటి ధర్మశాస్త్ర గ్రంథాలు, అగ్నిపురాణం, విష్ణుపురాణంవంటి పురాణాలు, మహాభారతేతిహాసంలోని శాంతిపర్వం రాజ్యం పుట్టుకనుగూర్చిన సమాచారాన్ని తెలియజేస్తున్నాయి.

రాజ్యం, దాని పుట్టుకనుగూర్చిన చర్చ ప్రథమంగా బ్రాహ్మణాలలో కన్పిస్తోంది. ఈ పరిశీలన ఇంద్రుని సార్వభౌమాధికారంగూర్చి జరుగుతుంది. ఆదిమమానవుడు తాను చేసేపనుల్ని, సృష్టించే ఆకారాన్ని దైవానికి ఆపాదించడం మామూలని ప్రాచీన చరిత్ర నొక్కి వక్కాణిస్తోంది. ఇంద్రుని సార్వభౌమాధికారాన్ని గూర్చి జరిగిన పరిశీలనవల్ల, భారతదేశంలో అతిప్రాచీనకాలంలో వున్న రాజ్యం, దాని పుట్టుక మనం గ్రహించవచ్చు. ఐతరేయబ్రాహ్మణం పైవిషయాన్ని గురించి యిలా చెప్తోంది :

## ఐతరేయ బ్రాహ్మణంలోనిగాథ

ప్రజాపతి నాయకత్వాన దేవతలాంతా సమావేశమై యీవిధంగా ఒకరికొకరు చెప్పుకొన్నారట : "దేవతలందరికంటె అత్యంత సమర్థుడూ, బలవంతుడూ, ధైర్యశాలీ, ఉత్తముడూ, ఏకార్యాన్నైనా అతి చాకచక్యంగా నిర్వర్తించగలవాడూ అయిన ఇంద్రుని రాజుగా చేద్దాం" అనుకొని ఇంద్రునికి మహాభిషేకం చేశారట. ఈవిధంగా ప్రజాపతి నాయకత్వాన దేవతలంతా ఇంద్రుణ్ణి తమరాజుగా ఎన్నుకొని, అతనికి సార్వభౌమాధికారాన్ని అప్పగించారట. ఈఎన్నిక ఫలితంగా ఇంద్రునికి రాజ్యపదవి వచ్చింది. రాజ్యం ఏర్పడింది. ఆదిమ మానవసమాజాల్లో ఎన్నిక ద్వారా రాజును ఏర్పరచుకొనే సాంప్రదాయం యితరదేశాలతోపాటు మనదేశంలోకూడా కన్పిస్తోంది.

హాబ్స్‌సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతానికీ, పైన ఉదహరించిన ఇంద్రుని ఎన్నికకీ ఏమైనా సామ్యం వుందా అనేది పరిశీలిద్దాం. హాబ్స్, తాను ప్రతిపాదించిన సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతంలో మొట్టమొదట ప్రకృతిదశను (State of Nature) గూర్చి చెప్తూ యిలా అన్నాడు :

ఆదిమ మానవుడు పశుప్రాయమైన జీవితాన్ని గడుపుతున్న రోజుల్లో, తనభద్రతగూర్చి తనకి కావలసిన అధికారాన్ని గూర్చి ఆతనికున్న స్వార్థపూరిత మనస్తత్వమే ఈప్రకృతిదశకి మూలకారణం. ఈ దశలో ప్రతివ్యక్తి యితరవ్యక్తులందరితో సంఘర్షించేవాడు. ఒక నిరంతరమైన సంఘర్షణ నాటి ప్రకృతి దశలో జరిగింది. ఇట్టిస్థితి నాగరకతకీ భద్రతకీ, మానవ జీవితానికీ ఆస్తికీ అపాయకరంగా తయారైంది. అట్టి దశలోనాటి మానవులు తమ ధన ప్రాణ మాన రక్షణలకు యోగ్యమైన ఒక సివిల్ సొసైటీని స్థాపించుకొన్నారు. వ్యక్తులంతా కలసి ఒక ఒడంబడికకు రావడం జరిగింది. ఈ ఒడంబడికను చేసికొన్న వ్యక్తులు తమకున్న సహజ హక్కులన్నిటిని (Natural Rights) ఒక వ్యక్తికో లేక వ్యక్తుల పరిషత్తుకో (ప్రభుత్వం) ధారాదత్తం (Surrender) చేశారు. తత్ఫలితంగా రాజ్యం ఆవిర్భవించింది. దీన్నే హాబ్స్ "లా ఆఫ్ నేచర్" అని పిలిచాడు.

హాబ్స్ ప్రతిపాదించిన ప్రకృతి దశలోని వ్యక్తులు తమ క్షేమంకొరకు ఎలా ఒడంబడిక చేసికొని ఒకపాలకుని ఉనికిలోకి తెచ్చారో, ఆ విధంగానే దేవతలలో ఒకరూ దేవతలందరిలోకీ సమర్థుడూ ఐన ఇంద్రుణ్ణి తమ పాలకునిగా ఎన్నుకొన్నారని ఐతరేయ బ్రాహ్మణం తెలుపుతోంది. ఐతే హాబ్స్ ప్రతిపాదించిన ప్రకృతి దశలోని వ్యక్తులు స్వార్థబుద్ధితో ప్రవర్తించినట్లు దేవతలు ప్రవర్తించారని మాత్రం పై గ్రంథం చెప్పడం లేదు. దేవతల మధ్య స్వార్థం బలిసిపోగా నిరంతర సంఘర్షణ ఏర్పడిందనీ, అందుకని దేవతమధ్య శాంతి భద్రతలు స్థాపించుకొనేందుకు దేవేంద్రుని రాజుగా ఎన్నుకొన్నారని కూడా చెప్పలేదు. "దేవతలందరికంటే సమర్థుడూ బలవంతుడూ, ధైర్యశాలి, కార్యదీక్షా తత్పరుడూ ఐన ఇంద్రుణ్ణి రాజుగా ఎన్నుకొందాం" అనుకున్నారు. దేవతలకీ, దేవతలకీ మధ్యనే ఒడంబడిక జరిగిందిగాని, దేవతలకీ ఇంద్రునికీ మధ్య జరగలేదు. కాబట్టి దేవతలు యింద్రుని ఎన్నుకొనడానికీ, హాబ్స్ ప్రతిపాదించిన ప్రకృతి దశలోని వ్యక్తులు ఒక పాలకుని ఎన్నుకొనడానికీ నామమాత్రమైన సామ్యంవుందేమోగాని, సహజసామ్యంలేదు.

దేవతలు ఏ అవసరాల కొరకు, ఏ కారణాలను పురస్కరించుకొని ఇంద్రుని రాజుగా ఎన్నుకొన్నారో ఐతరేయ బ్రాహ్మణం స్పష్టంగా చెప్పడంలేదు. ఐనా దేవతలకి వ్యతిరేకంగా దానవులు దండయాత్ర ప్రారంభించినపుడు ఇంద్రుడు దేవతల ప్రాణమానాలను సంరక్షించిన వాడుగా పురాణాల్లో చెప్పబడ్డాడు.

ఇంతకీ ఈ దేవతలెవరు? ఈ ఇంద్రుడెవరు? ఏ కారణాల కొరకు దేవతలు ఇంద్రుణ్ణి తమ పెద్దగా యెన్నుకొన్నారు? ఇలాంటి ప్రశ్నలు ఉదయిస్తున్నాయి. దేవతలంతా మానవమాత్రులే! దేవతలు కూడా మానవులేనన్న విషయాన్ని, అథర్వణవేదం (11-5-19, 4-11-6) ఏమాత్రం దాపరికం లేకుండా

చెప్తోంది. అలాగే శతపథ బ్రాహ్మణంలో వారు ఒక తెగకు చెందిన మానవులని చెప్పబడింది. ఇంద్రుడూ, అగ్నీ ప్రజాపతీకూడా మానవమాత్రులే నని ఐతరేయ బ్రాహ్మణం తెలిపింది. దేవతలలో మూడుగణాలుండేవి. వసు, రుద్ర, ఆదిత్య గణాలు. మధ్య ఆసియాలో మొదటి ఆర్యగణ సమాజం చీలి ఒక శాఖతూర్పుకు వలససాగించింది. వెనుకవచ్చిన ఆర్యులు ఒక్కొక్కప్పుడు వారికన్నా ముందువచ్చి వలస ఏర్పరచుకొన్న ఆర్యులతో (అసురులు) పోరాడవలసి వచ్చింది. "సాధారణంగా ఆర్యులందరకూ నాయకు డనబడే ఇంద్రుడు ఒక ఆర్యగణానికి వ్యతిరేకంగా మరో ఆర్యగణానికి సహాయం చేయమని కోరబడడం యిందువల్లనే ననాలి" (డాంగే - భారతదేశం-227) దిగువమాద్రులకూ ఎగువ మాద్రులకూ వ్యాపార రీత్యా వచ్చిన తగవు ముదిరింది. పోరాటందాకా వెళ్ళింది. అప్పుడు ఎగువమాద్రులు, పురువులు (ఆర్య గణాలు) కలసి, దిగువమాద్రులూ, పర్శులపై (ఆర్య గణాలు) యుద్ధాన్ని సాగించేందుకు ఒక వ్యక్తిని (పురుహూతుణ్ణి) తమ సమిష్టి సేనానాయకుడుగా ఎన్నుకొన్నారు. అతనికి "ఇంద్ర" పదవి నిచ్చారు. ఈవిధంగా పురుహూతుడు ప్రథమ ఇంద్రుడయ్యాడని రాహుల్ సాంకృత్యాయన్ తన "వోల్గాసే గంగా" అను గ్రంథంలో (పేజీ 79 - తెలుగు అనువాదం) చెప్పాడు. కాబట్టి ఇంద్రుడంటే, ఒక ముఠాకి చెందిన ఆర్యగణాలను మరో ముఠాకి చెందిన ఆర్య గణాలపై యుద్ధంలో నడిపే సేనాధిపతి అనేది స్పష్టం.

## దిఘనికాయంలోని గాధ

జాన్‌లాక్ ప్రతిపాదించిన సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతం, "దిఘనికాయ" అనే బౌద్ధ గ్రంథంలో రాజ్యం పుట్టుకను (Origin of the state) గూర్చి చెప్పబడినదానికి చాలా దగ్గరగా వుందని భండార్‌కర్ యొక్క అభిప్రాయం. దురదృష్టవశాత్తూ యిది వాస్తవం కాదు. ఏదో నామమాత్రపు సామ్యమున్నంత మాత్రాన, మనకుకూడా లాక్ ప్రతిపాదించిన సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతం వుందని అనుకోవడం పొరపాటు. జాన్‌లాక్ ఇంగ్లండులో చట్టబద్ధ రాచరికాన్ని ప్రతిష్ఠించే ప్రయత్నాన్ని సమర్థించేందుకు తన సోషల్ కంట్రాక్టు సిద్ధాంతాన్ని ప్రచారం చేశాడు. భండార్‌కర్ దీన్ని మరిచిపోయి అనవసరంగా యీ రెంటినీ పోలుస్తున్నాడు.

దక్షిణాది బౌద్ధుల ప్రామాణిక గ్రంథమైన "దిఘనికాయం" రాజుయొక్క పుట్టు పూర్వోత్తరాలను గూర్చి యీ విధంగా చెప్పింది (దాదాపు ఈ రకమైన గాథనే ఉత్తరాది బౌద్ధుల గ్రంథమైన "మహావస్తు" కూడా వర్ణించింది.)

మానవులు బుద్ధితో (Mind) సృష్టింపబడి, స్వయంప్రకాశంగా వుండేవారు. హాయిగా బ్రతుకుతూ, ఆనందంగా గాలిలో విహరిస్తూ వుండేవారు. ఇలా కొంతకాలం గడిచింది. కొద్దికాలం పిదప నీటిపై రుచికరమైన భూమి వుద్భవించింది. ఆభూమికి రంగు, రుచి, వాసన ఉండేవి. అప్పుడు మానవులు భూమిపై పనిచేయడం ప్రారంభించి, భూమినుండి అధికంగా పంటలు పండించి భోజనంచేయడం మొదలుపెట్టారు. ఈవిధంగా మనుషులు ఎప్పుడైతే చేయ ప్రారంభించారో అప్పుడు వారి స్వయంప్రకాశత్వం అదృశ్యమైంది. సూర్య చంద్రాదులు, కోట్లాది నక్షత్రాలు, రాత్రింబగళ్లు, నెలలు, ఋతువులు, వాయువులు ఉనికిలోకి వచ్చాయి. మానవులు తరు లతా గుల్మాలను పుష్పించే సస్యశ్యామలమైన భూమిని అనుభవించారు. కొద్దికాలం తరువాత దుష్టమైన అవినీతికర సాంప్రదాయాలు మానవులలో వ్యాపించాయి. తత్ఫలితంగా సస్యశ్యామల సంభరితమైన భూమండలం అదృశ్యమైపోయింది.

చివరికి పొట్టూ, తవుడూ లేని బియ్యం వచ్చాయి. ఆ బియ్యాన్ని వారు ప్రతి సాయంత్రం స్వీకరించేవారు. మళ్ళీ మరుసటిదినం ప్రాతఃకాలానికే వరి మొక్కలు బియ్యపుగింజలతో నిండివుండేవి. క్రమేణా మానవులలో నానాటికీ వృద్ధిఅవుతూన్న దుర్మార్గం, అవినీతికర సాంప్రదాయాల ఫలితంగా బియ్యపుగింజల చుట్టూ తవుడూ, పొట్టూ వ్యాపించాయి. ఇంతకు పూర్వంవలె ప్రతిరోజూ సాయంత్రం బియ్యపుగింజలు కోసుకొంటే, మరుసటి ప్రొద్దుటకే మళ్ళీ బియ్యపు గింజలు వరిమొక్కల కంకులకు మొలచిన విధంగా యిప్పుడు మొలవడం లేదు. ఆ విధంగా బియ్యపు కరువు వచ్చింది. అప్పుడు వారు వరిపొలాలను భూఖండాలుగా విభజించుకొని ఒకదానికీ మరొకదానికీమధ్య సరిహద్దులను ఏర్పరచుకొన్నారు. వారిలో కొంతమంది లోభులు తమ భూఖండాలను యితరుల చేతుల్లోకి పోకుండా కాపాడుకొంటూనే యితరుల

భూఖండాలను దొంగిలించి వాటిని ఉపయోగించ ప్రారంభించారు. ఈవిధంగా దొంగిలించి, లోభులుగా ప్రవర్తించిన వ్యక్తులను తదితరులు పట్టి దూషించారు. ఐనప్పటికీ ఫలితం లేకపోయింది.

అప్పుడు ఆ లోభుల్ని తదితర వ్యక్తులందరూ చేతులతో గుద్ది, గుంజలతో కర్రలతో బాదారు. ఈవిధంగా దొంగతనం, అబద్ధం, నింద, తన్నుకోవడం సమాజంలో (ఆదిమ కమ్యూనిస్టు గణసమాజం) ప్రవేశించాయి. అప్పుడు ఆ వ్యక్తులంతా ఒకచోట సమావేశమై ఒక నిర్దిష్టమగు నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయానుసారం, తమలో అత్యధిక సౌందర్యవంతుడూ, సమర్థుడూ అయిన వ్యక్తిని ఎన్నుకొని అతన్ని యీ విధంగా సంబోధించారు: "ఓ ఉత్తముడా, యిప్పుడురా! ఎవరైతే శిక్షార్హులో, దూషణకి పాత్రులో, దేశబహిష్కరణకి తగినవారో అలాంటివారిని శిక్షించు; దూషించు; దేశ (గణసమాజం నుండి) బహిష్కృతులను గావించు; మేము మా ధాన్యంలో కొంతభాగాన్ని నీకు యిస్తాము" అని అన్నారు. అతడు దాని కంగీకరించి ఆవిధంగా ప్రవర్తించ నారంభించాడు. వారు ఒప్పుకొన్న ప్రకారం అతనికి వారివారి ధాన్యంలో కొంత భాగాన్ని యిచ్చారు. "మహాజన సమ్మతము" వల్ల ఎన్నికైనవాడు గాబట్టి అతను "మహాసమ్మతు" డను పేర పిలువబడ్డాడు. పంట పొలాలున్న భూమి కంతటికీ అతడు అధిపతికాబట్టి (పాలీభాషలో ఖెత్తానం పతీతి; సంస్కృతంలో క్షేత్రంపతి) అతడు క్షత్రియుడను పేర పిలువబడ్డాడు! స్థాపింపబడిన శాసనాన్ని అమలుపరచి ప్రజలను రంజింపచేసినవాడు కాబట్టి (సంస్కృతంలో ధర్మేణ పరిరంజితేతి; పాళిభాషలో ధమ్మేన పరి రన్ జేతేతి) అతడు రాజన్ అను పేరిట పిలువబడ్డాడు.

ఈ సిద్ధాంతంలోవున్న మూడు ప్రధాన లక్షణాలను పరిశీలిద్దాం: 1. ప్రజలకీ రాజుకీ మధ్య జరిగిన ఒడంబడిక; 2. రాజ్యం (State of Society) ఆవిర్భవించడం; 3. రాజ్యం ఆవిర్భవించక పూర్వమున్న ప్రకృతి దశ (State of Nature).

దిఘనికాయంలో చెప్పబడిన దాని ప్రకారం "మహా సమ్మతుని"కీ, ప్రజలకీ మధ్య ఒక ప్రభుత్వ ఒడంబడిక జరిగింది. మహాసమ్మతుడు లేక రాజన్, ఎవరైతే శిక్షార్హులో అట్టివారిని శిక్షించి దేశ బహిష్కృతులను గావించాలి. ఈ కార్యం నిర్వర్తించేందుకు తమ ధాన్యంలో కొంత భాగాన్ని పన్నుగా చెల్లిస్తామని వారు వాగ్దానం చేశారు. ఈ విధంగా జరిగిన ఒడంబడిక ఒక వైపునుండే జరగలేదు (Not a one-sided compact). ఎందుకంటే ప్రజలు రాజన్‌కి కొన్ని బాధ్యతలను యిచ్చారు. ప్రజలు తన కిచ్చిన బాధ్యతలను నిర్వర్తించేందుకు వారిచ్చే ధాన్యభాగాన్ని తాను అంగీకరించాడు. ఆ దృష్ట్యా ప్రజలు ఒక పార్టీ, మహా సమ్మతుడు మరో పార్టీ. ఈ రెండు పార్టీల మధ్య జరిగిన ఒడంబడికయే యిది. అందుకని మనం దీన్ని ప్రభుత్వ ఒడంబడికగా పరిగణించవచ్చు. దీన్ని గూర్చి భండార్‌కర్ యీ విధంగా అంటాడు:

"అయితే, దిఘని కాయంలోని కథ ఒక విషయాన్ని సూచిస్తుంది. అదేమంటే: ఎన్నుకోబడ్డ రాజున్, అంటే మహా సమ్మతునికీ, ప్రజలకూ మధ్య యీ ఒడంబడిక జరిగింది." ("హైందవ రాజనీతిశాస్త్రంలో కొన్ని వైఖరులు": పేజి 134).

ఐతే, ప్రభుత్వ ఒడంబడికకు పూర్వం - అంటే ప్రజలు అధికారాన్ని మహాసమ్మతునికి ఒప్పగించక పూర్వం — నాటి ప్రజల స్థితిగతులనుగూర్చి ఎట్టి వివరాలనూ ఈబౌద్ధగ్రంథం యివ్వలేదు. ప్రజలంతా కలసి సమిష్టిగా జీవిస్తున్నారని మాత్రం చెప్పింది. అప్పటికి వారు తమ జీవిత భద్రతకొరకు ఏవైనా న్యాయసూత్రాలను (Code of laws) నిర్మించు కొన్నారో లేదో కూడా చెప్పలేదు. ఒకవ్యక్తికి చెందిన భూ ఖండానికీ, మరో వ్యక్తికిచెందిన భూ ఖండానికీ మధ్య సరిహద్దు లేర్పరచు కొన్నారని మాత్రం అది ఖచ్చితంగా చెపుతోంది. అలా సరిహద్దు లేర్పరచు కొన్నప్పటికీ ఒక వ్యక్తి మరొకని భూ ఖండాన్ని దురుద్దేశంతో ఆక్రమించు కోవడానికి (Encroch) ప్రయత్నించడంవల్ల, ఆవ్యక్తిని మొదటదూషించి, పిదప అదేపనిని కొనసాగిస్తున్నందువల్ల వానిని బంధించి బాగా బాదడం జరిగింది. ఈ విధంగా ఎవరన్నా ప్రవర్తిస్తే అలాంటి వ్యక్తిని శిక్షించేందుకు నాటిజనులు నిర్ణీతమైన న్యాయసూత్రాలను నిర్మించుకొన్నారనేందుకు ఎలాంటి ఆధారాలూ కన్పించవు.

లాక్ సిద్ధాంతానికీ, దిఘనికాయంలో చెప్పబడిన దానికీ చాల కొద్దిగా నామమాత్రమైన పోలికలు కన్పిస్తున్నాయి అంతే. లాక్ సిద్ధాంతంలో ప్రజలూ

ప్రజలూ కలసి ఒడంబడిక చేసుకుంటారు. ఇది మొదటి ఒడంబడిక. దీని ఫలితంగా సివిల్ సమాజ నిర్మాణమూ, రాజ్యం ఏర్పడ్డమూ జరిగాయి. వ్యక్తులందరూ కలసి తమలోతాము స్వీయభద్రతకోరకూ, హేతుబద్ధమైనశాసనాన్ని (Law of Reason) నిష్పక్షపాత బుద్ధితో అమలు పరచుటకు ఈ ఒడంబడిక చేసికొన్నారు. దీని పిదప, వ్యక్తులతోకూడిన సమాజమూ, ప్రభుత్వమూ యీరెంటిమధ్యా రెండవ ఒడంబడిక జరిగింది. మొదటి ఒడంబడిక సోషల్ కాంపాక్ట్ నీ (సామాజిక ఒడంబడిక), రెండవ దానిని ప్రభుత్వ ఒడంబడిక (Governmental compact) అనీ లాక్ పిలిచాడు. పైన చెప్పిన సోషల్ కాంపాక్టులాంటిది జరిగినట్లు దిఘనికాయం చెప్పలేదు. ఈ విషయం దగ్గరే ప్రధానంగా దిఘనికాయం భేదిస్తోంది. ఏది ఏమైనా, లాక్ ప్రతిపాదించిన సోషల్ కాంపాక్టుకీ, దిఘనికాయంలో చెప్పబడినదానికీ ప్రధాన విషయాల్లోనే భేదాలుండగా, రెంటికీ పోలిక లున్నవనడం సాహసమే.

ఐతే దిఘనికాయంలో చెప్పబడిన విషయాన్ని శాస్త్రీయ దృక్పథంతో అవగాహన చేసికొంటే ఏ విషయాలు తెలుస్తాయి? భారతదేశానికి వచ్చిన ఆదిమ ఆర్యగణాలు ప్రాచీనకాలంలో ఆదిమ కమ్యూనిస్టు సమాజ వ్యవస్థలో జీవించాయి. వీరు సమిష్టిగా ఉత్పత్తిచేసి, సమిష్టిగానే అనుభవించారు. కాలక్రమేణా ఉత్పత్తి సాధనాలు అభివృద్ధి గావడం, అగ్నిని కనిపెట్టి పశువులను మచ్చికచేయడం ప్రారంభమయ్యాక, ఆ గణాల జీవితంలో అపూర్వమూ, విప్లవాత్మకమూ అయిన ఒక మార్పువచ్చింది. ఉత్పత్తి పరికరాలు అభివృద్ధి కావడంతో, అవసరమైన దానికన్నా అధికంగా ఉత్పత్తి చేయడం, దాన్ని మారకం చేయడం ప్రారంభమైంది. దాంతో శ్రమవిభజనా, వర్ణాలూ, ప్రైవేటు ఆస్తీ సమాజంలోకి ప్రవేశించాయి. మాతృస్వామిక సమాజంపోయి పితృస్వామిక సమాజం వచ్చింది. సొంత ఆస్తిని కాపాడుటకూ, దోపిడీవర్గ ప్రయోజనాలను రక్షించేందుకూ, బానిస విధానాన్ని కొనసాగించేందుకూ వర్గ రాజ్యాంగయంత్రం (Class State) అమల్లోకి వచ్చింది.

ఆదిమ మానవులు ప్రథమంలో సమిష్టిగా కృషిచేసి సమిష్టిగా అనుభవించారనీ, ఎంతోఆనందదాయకమగు జీవితాలను గడపినారనీ దిఘనికాయం చెప్తోంది. అపుడు ప్రభుత్వం యొక్క, రాజన్ యొక్క అవసరం వారికి కలుగలేదు. శాంతి సౌమనస్యాలు, స్వేచ్ఛా సమానత్వాలతో సంతోషకరమైన జీవితాలు గడిపారు. ఏనాడు ఉత్పత్తిశక్తులలో మార్పువచ్చిందో నాడే ఉత్పత్తి సంబంధాలలోకూడ మార్పువచ్చి, సొంతఆస్తీ, శూద్ర బానిసత్వం అమల్లోకి వచ్చాయి. పీడకవర్గప్రయోజనాలను రక్షించే కాపలా కుక్కలాగా "మహాసమ్మతుడు", లేక "క్షత్రియుడు", లేక "రాజన్" వ్యవహరించనారంభించాడు. అప్పటినుండే ధాన్యంలో కొంత భాగాన్ని పన్నుగా ప్రజలు రాజుకు కట్టేందుకు బలవంతపెట్టబడ్డారు. ఆదిమ కమ్యూనిస్టుసమాజంలో సమిష్టి ఉత్పత్తీ, సమిష్టి ఆస్తీ, సమిష్టి వినిమయం (పంపకం) వుండేవి. ప్రభుత్వం లేదు. పన్నుల్లేవు. కాని రాచరికసమాజంలో వ్యక్తిగత ఉత్పత్తీ, ప్రైవేటు ఆస్తీ, వ్యక్తిగతపంపకం అమల్లోకి వచ్చాయి. రాజ్యాంగయంత్రాన్ని ప్రతిబింబించే "రాజన్", పన్నులవిధానం, బానిసవ్యవస్థ, పితృస్వామికం ఇవన్నీ అమల్లోకివచ్చాయి. వీటి నన్నిటినీ దిఘనికాయం అతి స్పష్టంగా ప్రాతఃకాలంనాటి సూర్యకాంతిలా విశదీకరించింది. బౌద్ధమతంయొక్క సిద్ధాంతాలను ప్రచారంచేసేందుకు దిఘనికాయం కొన్ని వందల సంవత్సరాలక్రితం వ్రాయబడింది.

1688 లో ఇంగ్లండులో జరిగిన రక్తరహితవిప్లవాన్ని (గ్లోరియస్ రెవల్యూషన్) తాత్వికంగా సమర్థించి, చట్టబద్ధమైన రాచరిక వ్యవస్థను ప్రతిష్ఠించేందుకు వ్రాయబడ్డది లాక్ గ్రంథం. ఈ రెండిటికీ చాల కొద్ది పోలికలే ఉన్నాయి. వాటి నాధారంచేసికొని మనకీ (ప్రాచీన హిందువులకి) లాక్ సిద్ధాంతం వుందని చెప్పడం హాస్యాస్పదమైన విషయం.

## మహాభారతం :

## రాజ్యంయొక్క పుట్టు పూర్వోత్తరాలు

ఈ సమస్యపై మహాభారతంలో ఏం చెప్పబడిందో పరిశీలిద్దాం. శాంతిపర్వంలోని 67 వ అధ్యాయంలో రాజ్యంయొక్క పుట్టుపూర్వోత్తరాలను గూర్చి యిలా చెప్పబడింది :

"ఇతయోప మయా ధీరః సప్న మేత బలీయని
ఇంద్రాయ స ప్రణామతి నమతి యో బలీయసి."

అన్న భారద్వాజునిమాట మహాభారతంలో ఉటంకించ బడ్డది. పై శ్లోకభావాన్ని పరిశీలిద్దాం. రాజు లేనందువల్ల మానవులంతా వినాశస్థితికి వచ్చారట. నీటిలోని చేపలవలె ఒకరినొకరు మింగేయడం ప్రారం

భించారట. అప్పుడు మానవులంతా ఒకచోట సమావేశమై, అన్ని తరగతులకి చెందిన ప్రజలలో విశ్వాసాన్ని కలుగజేసేందుకు కొన్ని ఒడంబడికలను (సమయాః) చేసికొని కొంతకాలం జీవించారట. ఇలా జరిగినప్పటికీ భరించ శక్యంకాని జీవితాలను గడిపినారట. వారంతా కలసికట్టుగా బ్రహ్మవద్దకి బయలుదేరి వెళ్ళి యిలా ప్రార్థించారట :

"ఓ దేవా! రాజు లేనందువల్ల మేమంతా నాశనమైపోయేస్థితికి వచ్చాము. మాకు రాజుగా ఎవరినైనా నియమించు. మేమంతా అతనిని పూజిస్తాము; మమ్మల్ని అతడు రక్షిస్తాడు."

ఈ విధంగా ప్రజలచే ప్రార్థింపబడిన బ్రహ్మ మనువును చూపించాడట. కాని మనువు యీ సూచనకి అంగీకరించక యీ విధంగా చెప్పాడట :

"మానవులుచేసే సర్వ పాపకార్యాలనుగూర్చి నేను భయపడుతున్నాను. అసలు రాజ్యాన్ని పరిపాలించడమే దుస్సాధ్యం. మానవులు ఎల్లప్పుడూ కుటిలురుగానూ, మోసకారులుగానూ ప్రవర్తిస్తారు. కాబట్టి మానవులతోకూడిన రాజ్యాన్ని పాలించడం మరీ కష్టసాధ్యం."

ఈ విధంగా మనువు పలుకగా, మానవులు ఆయనకి యీ విధంగా బదులుచెప్పారట :

"భయపడవద్దు; ఏ వ్యక్తులైతే పాపాలుచేస్తారో, వారికే అవి వెంటాడుతవి. నీ బొక్కసాన్ని నింపేందుకు మా పశు, ఖనిజసంపదల్లో 50వ భాగాన్నీ, ధాన్యంలో 10వ భాగాన్నీ యిస్తాం. నీ రక్షణక్రింద మేము పొందే ప్రయోజనాల్లో నాల్గవభాగాన్ని నీకిస్తాం. నీవు మాద్వారా ఎంతో సులభంగా సంపాదింపగలిగిన యీ ప్రయోజనాలవల్లా, సామర్థ్యంవల్లా, అధిక శక్తివంతుడవై, ఇంద్రుడు దేవతలను ఎలా రక్షిస్తున్నాడో అలాగే మమ్మల్నికూడా రక్షించు."

అందుకు మనువు అంగీకరించి, భూమండలమంతా ఒకసారి చుట్టివచ్చి, పాపాలన్నిటినీ పరిహరించి, మానవులంతా తమ తమ విధులను నిర్వర్తించునట్లు చేశాడట. సుఖంగా జీవితాన్ని గడుప సిద్ధమైన మానవులు రాజును ఎన్నుకొని సర్వజన క్షేమంకోరకు మనువుకు కిరీటం యిచ్చి రాజుగా చేశారట.

కాని యిది తాత్కాలికమే. వెంటనే నానా గందరగోళం చెలరేగింది. అప్పుడు శాంతిభద్రతలను కాపాడేందుకు రాజుకీ, ప్రజలకీ మధ్య ఒక ఒడంబడిక జరిగింది. తత్ఫలితంగా రాజ్యం ఏర్పడింది.

భారతంలో పేర్కొనబడ్డ భారద్వాజుని సిద్ధాంతనికీ, హాబ్సుయొక్క సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతాని చాల కొద్దిగా పోలిక లున్నాయి. తేడాలుకూడా వున్నాయి. హాబ్సుసిద్ధాంతంలో దైవప్రసక్తిగానీ దేవుడు సమర్థుడైన వ్యక్తిని పరిపాలకుడుగా సూచించడంగానీ కనబడదు. కాని భారద్వాజుడు చెప్పినదాని ప్రకారం బ్రహ్మదేవుడు మనువును పాలకునిగా సూచిస్తాడు (నియమించకపోయినా). మనువు మొట్టమొదట అంగీకరించకపోయినా, పిదప రాజుగా వుండేందుకు ఒప్పుకొన్నాడు. దేవుడు ప్రత్యక్షంగా మనువును నియమించకపోయినా దైవ ప్రసక్తి ఎంతో కొంత వుంది. దీన్నిబట్టి పోలికలకంటే, తేడాలే అధికంగా కన్పిస్తున్నాయి.

## కౌటిల్యుని "అర్థశాస్త్రం" - రాజ్యం పుట్టు పూర్వోత్తరాలు

కౌటిల్యుడు "రాజత్వం దైవదత్తం" లేక డివైన్ ఆరిజన్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. "నా విష్ణుః పృథివీపతి" అనేదే కౌటిల్యుని సిద్ధాంత సారాంశం. ఐతే, సోషల్ కాంట్రాక్టులోని ప్రభుత్వ ఒడంబడిక కూడా కొంత ఈ సిద్ధాంతంలో వుంది.

పెద్దచేప చిన్న చేపనుమింగునట్లు (మత్స్యన్యాయం) బలవంతులు బలహీనులను బాధపెట్టుతూ నాశనం చేయ సిద్ధపడ్డారు. తత్ఫలితంగా ప్రజలు అరాచకం పాలయ్యారు. అప్పుడు వారు, వైవస్వతుని పుత్రుడగు మనువును తమ రాజుగా ఎన్నుకొని తాము పండించు ధాన్యంలో ఆరవ భాగాన్నీ, సంపదలో పదవభాగాన్నీ యిచ్చేందుకు ఒప్పుకొన్నారు. ఈ ఆదాయాన్ని ఆధారంచేసుకొని, రాజు ప్రజలకి పరమావసరమైన శాంతి భద్రతలను ప్రసాదించ వీలు కలిగింది. ప్రజలతోపాటు ఋషులుకూడా తమ ఆశ్రమాలను రక్షించే రాజుకి తాముపండించు ధాన్యంలో ఆరవభాగాన్ని యివ్వడానికి అంగీకరించారు. అని కౌటిల్యుడు తన "అర్థశాస్త్రం"లో చెప్పాడు.

శిష్టుల్ని రక్షించి, వారికి తగిన బహుమతులను ప్రదానం చేసి దుష్టుల్ని శిక్షించే రాజు యొక్క హృదయంలో న్యాయాన్ని ప్రసాదించే యముడూ, భోగభాగ్యాల్ని ప్రసాదించే ఇంద్రుడూ నివసిస్తారు. రాజుకు హాని తలపెట్టిన వానిని దేవతలు కఠినంగా దండిస్తారు. కాబట్టి కౌటిల్యుని సిద్ధాంతం ప్రకారం, రాజు దైవాంశ సంభూతుడు. (ఈ కారణంవల్లనే,

క్రీస్తు పూర్వం రాజు "దేవనాం ప్రియుడు" అని పిలువబడ్డాడు—ఉదా: అశోకుడు; సముద్రగుప్తుడు.)

ఈ దృక్పథాన్ని మనం Superhuman origin or Divine origin of Kingship (రాజు మానవాతీత శక్తులద్వారా ఉద్భవించాడు, దేవునివల్ల ఉద్భవించాడు—అన్న సిద్ధాంతాలు) అని పిలువ వచ్చు. ఐతే ఈ రెండుపేర్లకూ పెద్దగా భేదంలేదు. రాజు మానవాతీతుడు, దైవాంశసంభూతుడు అనే దృక్పథం క్రమేణా మరి కొంతముందుకు నడచింది. రాజు "దైవాంశభూతుడే" కాదు, "ప్రత్యక్ష దైవం" అన్న దృక్పథం బాగా ప్రబలింది. శాంతి పర్వ మందలి 68వ అధ్యాయంలో వున్న సంభాషణవల్ల మనకు ఈ క్రింది సమాచారం తెలుస్తోంది:

కోసల ప్రభువైన వసుమనాకునికీ బృహస్పతికీ మధ్య ఒక సంభాషణ జరుగుతుంది. ఈ సంభాషణ యొక్క సారాంశాన్నీ వివరాలనీ భీష్ముడు ధర్మరాజు ప్రశ్నలకి సమాధానంగా చెప్పుతాడు.

"మానవులకు ప్రభువైన రాజును బ్రాహ్మణులు దేవుడని ఎందుకు పిలిచారు?" అని ధర్మరాజు భీష్ముణ్ణి ప్రశ్నిస్తాడు. అప్పుడు భీష్ముడు, వసుమ నాకునికీ బృహస్పతికీ మధ్య జరిగిన సంభాషణని క్లుప్తంగా వివరిస్తాడు. రాజులేకపోతే ఎలాంటి దారుణ కృత్యాలు జరుగుతవో, అరాచకం దేశాన్ని ఎలా పరిపాలిస్తుందో వర్ణిస్తాడు. రాజభీతి వల్లనే మానవులు ఒకరి నొకరు చంపుకోరనీ, శాంతి భద్రతలు ఉంటాయనీ బృహస్పతి కోసలరాజుకు వివరించిన దంతా భీష్ముడు ధర్మరాజుకి చెప్తాడు. ఆ తరువాత రాజ్యంలో రాజుయొక్క ప్రాధాన్యతను యీ విధంగా చెప్పాడు: "రాజు అస్తిత్వంమీదనే ప్రజల భద్రత ఆధారపడి వుందనీ, రాజు నాశనమైతే ప్రజలుకూడా నాశనమై పోతారనీ, కాబట్టి రాజును దేవునిలా పూజించవలెననీ, అలా పూజించని వాడెవడుంటాడనీ" అంటాడు. కాబట్టి, రాజును వ్యతిరేకించితే అరాచకం ప్రబలి మానవులకు శాంతి భద్రతలు లేకుండా పోతవని చెబుతాడు బృహస్పతి. అంతేగాదు. ఎవరైనా తన మనస్సులో రాజుకి వ్యతిరేకంగా హానిని తలపెట్టితే అట్టివాడు నరకానికి వెళ్తాడని కూడా బృహస్పతి చెప్పాడు!

మానవాకారంలో వున్న దేవుడే రాజు కాబట్టి రాజును మనిషిగా పరిగణించి అగౌరవ పరచరాదని బృహస్పతి చెప్పాడు. చూడండి ఈ శ్లోకం:

"నజాత్వ మంతవ్యో మనుష్య యితి భూమిపః
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్టతి."

అంతే గాదట. రాజు అయిదువిధాలైన పరిస్థితులలో ఐదు రకాల ఆకారాలను ధరిస్తాడట. అగ్ని, ఆదిత్యుడు (సూర్యుడు) మృత్యువు, కుబేరుడు, యముడుగా రాజు ఆయా సందర్భాలనుబట్టి వ్యవహరిస్తాడు.

రాజు అబద్ధీకులచే మోసగింప బడినపుడు అగ్ని రూపం దాల్చి తనభీకర క్రోధాగ్నిలో ఆ నేరస్తుని దగ్ధం చేస్తాడు.

ప్రజాశ్రేయస్సు కొరకు వ్యక్తుల కార్యకలాపాలను తనగూఢచారుల ద్వారా పరిశీలించినపుడు ఆదిత్యుని రూపం ధరిస్తాడు.

దుర్మార్గులను పుత్రమిత్ర సహితంగా మట్టుపెట్టు నపుడు మృత్యురూపాన్ని ధరిస్తాడు.

దుష్టులకి భయంకరమైన శిక్షలు విధించి, తద్వారా వారిఆటలు కట్టించునపుడూ, శిష్టులను రక్షించి బహుమతులను యిచ్చేటప్పుడూ యముని రూపం ధరిస్తాడు.

నిరుపమానమైన సేవను చేసినవారికి ధన కనక వస్తు వాహనాలను దానంచేస్తూ, నేరంచేయుట ద్వారా తనను కించపరచిన వాని ఆస్తిపాస్తు లన్నిటినీ ఆక్రమించుకొనునపుడు కుబేరరూపం ధరిస్తాడు.

దీన్నిబట్టి హైందవ రాజనీతి శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన డివైన్ ఆరిజిన్ సిద్ధాంతం (రాజు దైవాంశ సంభూతుడన్న సిద్ధాంతం) పాశ్చాత్య సిద్ధాంతంకంటె మూడు ఆకులు ఎక్కువే చదివింది. రాజే దేవుడు-అని నాటి బ్రాహ్మణులు ఎందుకు ప్రచారం చేశారని ధర్మరాజు ప్రశ్నించగా, భీష్ముడు పైసమాధానం యిచ్చాడు. ఈవిధంగా పీడకవర్గమైన బ్రాహ్మణ, క్షత్రియ వర్గాల దోపిడీకి ఏకైకప్రతినిధియైన నాటి హైందవ రాజుయొక్క దారుణమైన నిరంకుశాధికారం హిమాలయోన్నత శిఖరాన్ని తాకివుంటుం దనేది సత్యం.

## మనుధర్మ శాస్త్రం: డివైన్ ఆరిజిన్ సిద్ధాంతం

మనువు తనధర్మశాస్త్రంలో రాజు మానవాకారంలో వున్న దేవుడని సిద్ధాంతీకరించాడు. భగవంతుడే మానవుల రక్షణార్థం రాజును సృష్టించాడని వ్రాశాడు.

ప్రాచీన హైందవ రాజనీతిశాస్త్ర చరిత్రలో మనువుఒక్కడే రాజత్వానికి దైవత్వం ఆపాదించాడు.

ఐతే ఈ దృక్పథాన్ని మరింత ముందుకు తీసుకు వెళ్ళ గలిగింది శాంతిపర్వంలోని 59 వ అధ్యాయం. మనువు చెప్పిన దానిప్రకారం ఇంద్రుడు, యముడు, కుబేరుడు, అగ్ని మాదిరిగా రాజు ఒక దేవత (Diety) మాత్రం కాడు; భగవంతుని సృష్టి ఫలితం అతడు.

నారాయణదేవుడు (విష్ణువు) ఒకరాజును సృష్టించా డట. అతనికి తన దివ్యతేజస్సును ప్రసాదించాడట. ఆరాజుచేత - ఫృదువైన్యునిచేత - ఋషులు, దేవతలూ ఒట్టు పెట్టించుకొన్నారట!! "నేనెప్పుడూ ధర్మాన్ని పాటిస్తాను. బ్రాహ్మణులను దండించేందుకు నాకు అర్హత లేదు. వర్ణ సాంకర్యంనుండి ప్రపంచాన్ని రక్షిస్తాను," అని ఫృదువైన్యుడు ఒట్టు పెట్టుకొన్నాడట. పిదప విష్ణువు, దేవతలు, ఋషులు, దిక్పాలకులు వీరంతా ఫృదువైన్యుడికి రాజ్యాభిషేకం చేశారట. పైన చెప్పిన మతుల ప్రకారం, ప్రజలందర్నీ (బ్రాహ్మణ క్షత్రియుల్ని) రంజింపజేశాడు గాబట్టి "రాజన్" అనిపిలువబడ్డాడట. క్షతగాత్రులుగాకుండా బ్రాహ్మణుల్ని కాపాడినాడు గాబట్టి (క్షత త్రాణత్) "క్షత్రియ" అను పేరు వచ్చిందట!! అప్పటినుండి రాజన్ ప్రజల్ని రంజింపజేసి, రక్షించాడట.

చివరికి రాజ్యంపుట్టుకను గూర్చి హైందవ నిరంకుశ రాచరిక వాదుల దృక్పథం ఎంతదాకా పోయిందో క్రీ. శ. 5వ శతాబ్దంలో రచింపబడ్డ "నారద స్మృతి" వల్ల తెలుస్తోంది: "బలహీనుడైన భర్తను అతని భార్యలు ఎలా నిరంతరం పూజించాలో, అలాగే పాలకుడు ఎంతటి వ్యర్థుడైనా, పనికిమాలిన వాడైనా, ప్రజలు అతణ్ణి గౌరవ ప్రపత్తులతో పూజించాలి," అని ఈ స్మృతి కారుడు చెప్పాడు.

రాజు దైవాంశ సంభూతుడనే దృక్పథం మన దేశంలోనే కాక, ఈజిప్ట్, గ్రీస్, చైనా, జపాన్ వంటి అతి ప్రాచీన చరిత్రగల దేశాలలో కూడా వ్యాప్తిలో వుండేది.

పైన వివరింపబడ్డవే రాజు, రాజ్యంయొక్క పుట్టు పూర్వోత్తరాలను గూర్చిన వివిధ సిద్ధాంతాలు.

ఆదిమ కమ్యూనిస్టు గణ సమాజం విచ్ఛిన్నమైన నాటినుండి నిరంకుశ రాచరికం శిఖరాగ్రాన్ని అందు కున్నంతవరకూ రాజు ఏయే దశలను దాటివచ్చాడో పై గ్రంథాలు విశదీకరిస్తున్నాయి. "మహాజన సమ్మ తుడు" అని పిలువబడి, ప్రజలచే ఎన్నికైన రాజు క్రమంగా దైవాంశ సంభూతుడై, చివరికి మనువు చెప్పినట్లు దేవుడుగా మారి, క్రీ. శ. 4, 5 శతాబ్దాలలో అత్యంత దుర్మార్గుడుగా మారాడు. రా[illegible] ఎంత పనికిమాలినవాడైనా ప్రజలు భక్తి శ్రద్ధలతో పూజించాలని నగ్నంగా, సిగ్గూ బిడియం లేకుండా "నారద స్మృతి" చెప్పింది.

పైన పేర్కొనబడ్డ గ్రంథాలన్నీ రాచరికవ్యవ[illegible] అమల్లోకి వచ్చిన తర్వాత వ్రాయబడ్డాయనే విషయ[illegible] స్పష్టం.

## ప్రాచీన అర్థశాస్త్ర గ్రంథాల బోధనలు

ఈ గ్రంథాలు (కౌటిలీయం; మనుస్మృతి; శాం[తి] పర్వం; నారదస్మృతి). ప్రచారంచేయ దలుచుకొన్నదీ చేసిందీ ఏమిటి? రాజు మానవాతీతుడన్నా, దైవాంశ సంభూతుడన్నా, పీడిత ప్రజాసామాన్యమైన వైశ్య శూద్రులను మోసగించేందుకూ, అతిక్రూరంగా అణచి వేసేందుకూ అనేది లోకవిదితం. అయితే సిద్ధాంతరీత్యా; ప్రజా శత్రువులైన నిరంకుశరాజులను పదచ్యుతుల చేసేందుకు ప్రజలకు హక్కున్నదని "శుక్రనీతిసారం", "శాంతిపర్వం" చెప్పాయి. రాజెప్పుడు "నిరంకుశుడౌ" తాడు? బ్రాహ్మణ - క్షత్రియ దోపిడీవర్గ ప్రయోజ నాలను రక్షించకుండా, వర్ణాశ్రమధర్మాన్ని కాపాడ కుండా వుంటే అప్పుడు రాజు "నిరంకుశు" డయ్యా డని, నాటి హిందూ బ్రాహ్మణ పురోహితవర్గం నగ్నంగా ప్రచారంచేసింది.

"విశా ప్రజాతంత్ర పక్షపాతిగా మారిన ఒక రాజు బ్రాహ్మణ - క్షత్రియులకు వ్యతిరేకంగా పోరా టాన్ని నడిపాడు. ఇతడే వేనరాజు. ఈ పోరాటంలో వేనుడికి సలహాసంపత్తి నిచ్చినది అతని భార్య సునీత. మాతృస్వామికమూ, స్త్రీ ప్రజాతంత్రమూ అణగ ద్రొక్కబడడంవల్ల ఈమె క్రోధపూరితయై యుంటుంది. కాని సునీతా, వేను లెంత గొప్పవా ళ్ళయినప్పటికీ, నూతన యుగంలోకి వచ్చిన సామాజిక శక్తులను అదిమి గణ సమాజయుగంలోకి వెనుకడుగు వేయించజాలరు." (డాంగే - భారతదేశం - పేజి 244) "వేనుడు ఓడి పోయినాడు. బ్రాహ్మణు లతనిని హత్యచేశారు. వేనుడికి సహాయంగా బయటనుండి వచ్చిన గణాలూ తెగలూ కూడ అణచివేయబడినవి." (డాంగే - భారతదేశం.)

నాటినుండీ దౌర్జన్య ప్రయోగం - దండం - ప్రపంచాన్ని శాసిస్తూ వచ్చిందని "హైందవ రాజ్యాంగనీతి" చెపుతోంది. ఈవిషయాన్ని మహా భారతమందలి శాంతిపర్వం - 58 వ అధ్యాయం యిలా చెబుతోంది:

" అపండయామే ద్విజాశ్చేతి ప్రతిజానీష్వ చాధిభో
లోకం చ । సంకరాత్ కృత్స్నం త్రాతాస్మీతిపరంతప"

వైదికధర్మాన్నీ, వర్ణవ్యవస్థనీ, బ్రాహ్మణాధిక్యతనీ వ్యతిరేకించిన వాడు "నిరంకుశుడు," పాషండుడు, దైవద్రోహి, పరమచండాలుడు. అలాంటి వాణ్ణి నిరంకుశునిగా, ప్రజాశత్రువుగా చిత్రించి, సింహాసన భ్రష్టుణ్ణిచేసి, వీలైనప్పుడు నిలువునా ఖూనీ చేసి వేశారు. అలాంటి వారు - హైహయుడు, నహుషుడు, వైతహవ్యుడు - ప్రాచీన హైందవ చరిత్రలో చాలా మంది వున్నారు.

- హైందవ రాజనీతి శాస్త్రజ్ఞులు చెప్పినదాని ప్రకారం రాజన్ ప్రజల్ని ఎప్పుడు రంజింపజేస్తాడు? (ఈ శాస్త్రజ్ఞుల నిఘంటువులో ప్రజలంటే పీడకవర్గమని అర్థం.) బ్రాహ్మణులు ఎలాంటి దారుణ నేరాలను చేసినా వారిని శిక్షించనని వాగ్దానం చేసినప్పుడూ; క్రిందివర్ణాలు అగ్రవర్ణాలతో పెళ్లి పేరంటాల రూపంలో ఎలాంటి సంబంధాలూ పెట్టుకోకుండా అణుమాత్రమైన వర్ణసాంకర్యం జరగకుండా, కోటి కళ్లతో చూస్తూ అలాంటి దేమన్నా జరిగితే ఉక్కు నాడాలతో అతిక్రూరంగా త్రొక్కేసి నిరంతరం వైశ్య శూద్రులు బ్రాహ్మణ క్షత్రియులకి అడ్డమైన ఊడిగంచేస్తూ బానిసీల్లవలె బతికేట్లు చేసినప్పుడూ; ప్రజాశ్రేయస్సు పేరట, బ్రాహ్మణపురోహితవర్గ శ్రేయస్సుకొరకు పరిపాలిస్తున్నప్పుడూ - అతడు రంజింపచేస్తాడు. క్షత్రియవర్ణంనుండి ఒక కీలుబొమ్మను తీసుకొచ్చి, రాజుపేరట ఆ తోలుబొమ్మకు కిరీటం పెట్టి, ఆ బొమ్మవెనకాల హిందూపురోహితవర్గం ఆడిన నాటకాన్ని భారతంలోని వేనుని హత్య విశదీకరిస్తోంది. "వందల ఎకరాల విస్తీర్ణంలో పశువులు గణాలూ, శిష్యకోటి, వైశ్యశూద్ర అనుచరులూ, అమూల్యమైన సంపదను ఉత్పత్తి చేస్తుండగా వృద్ధియైన బ్రాహ్మణాశ్రమాల చరిత్రచూస్తే, బ్రాహ్మణులు భిక్షాటన జీవులనీ, దరిద్రులనీ, సత్యవర్తనులనీ చెప్పే కథలన్నీ గాలిబుడగల్లాగ పటాపంచలైపోతాయి" (డాంగే-247)

"రాజన్" పేరట సృష్టింపబడిన కీలు బొమ్మ వెనుక వుండి హిందూ పురోహితవర్గం వైశ్య శూద్రులపై సాగించిన తరతరాల దౌర్జన్యం, నరనరాలనూ బాధించిన దారుణ హింసాకాండ, హిమాలయన్ శిఖరాలను తలదన్నిన అధికారం చరిత్రనుండి చెరగలేదు; వీరు యూరపియన్ యూదులకంటె క్రూరంగానూ, ఈజిప్షియన్ ఫేరోలకంటె నిరంకుశంగానూ, రోమన్ నీరోలకంటే హృదయ విదారకంగానూ ప్రవర్తించారు. కోటాను కోట్ల వైశ్య శూద్ర బానిసీండ్ల ఆర్తనాదాలకీ, హాహాకారాలకీ, ఆకలిచావులకీ రక్తపు చారలకీ ప్రధాన బాధ్యతవహించారు. రాను రాను ఈ అధికారం ఎంతో వికృతాకారం దాల్చింది. కాలక్రమేణా రాజన్ ఎందుకూ పనికిరాని వాడయ్యాడు. క్షత్రియుడు పేరుకు పరిపాలించినా, వాస్తవిక అధికారమంతా హిందూ బ్రాహ్మణ పురోహితుని హస్తాలలోనే చిక్కుకొంది. బ్రాహ్మణ ఋషి అంటే ప్రత్యక్ష దేవతయే. చివరికి దేవుడు కూడా బ్రాహ్మణుని కబంధ హస్తాల్లో చిక్కుకుపొయ్యాడు.

మధ్య యుగాలనాటి యూరప్‌లో కూడా పేరుకు రాజు పాలకుడైనా, వాస్తవానికి క్లర్జీయే (పురోహిత వర్గం) యూరప్‌ను పాలించింది.

ప్రధానంగా పైన వివరింపబడ్డవే ప్రాచీనహైందవ రాజనీతి శాస్త్రంలో ప్రతిపాదింపబడిన వివిధ సిద్ధాంతాలు. యూరపియన్ పొలిటికల్ ఫిలాసఫీలో హాబ్స్, లాక్, రూసోలు ప్రతిపాదించిన సిద్ధాంతాలకి ఒక సమగ్రత, తాత్విక ప్రాతిపదిక వున్నాయి. మన సిద్ధాంతాలకి (రాచరిక వ్యవస్థను గూర్చిన వాటికే) అలాంటి ప్రాతిపదిక లోపించింది.

ఇంతటితో ఈ విషయాన్ని ముగించి మరో విషయానికి వద్దాం.

జయస్వాల్, భండార్కర్, ఘోషాల్ వంటి భారతీయ బూర్జువా పండితులు ప్రాచీన, హిందూ సిద్ధాంతాలలో హాబ్స్, లాక్, రూసోల సిద్ధాంతాల నెందుకు చూడ యత్నించారు? దిఘనికాయం, శాంతి పర్వం, అగ్ని పురాణం, ఐతరేయ బ్రాహ్మణం, కౌటిలీయం వంటి గ్రంథాలలోవున్న సిద్ధాంతాలకు విపరీత వ్యాఖ్యానాలు చేసి, మనకూ సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతం వుందని ఎందుకు చెప్పారు? ఈ ప్రయత్నం వెనుక ఏమైనా సాంఘిక ప్రయోజనమున్నదా - అనేది ప్రధాన విషయం.

జయస్వాల్ గొప్ప పండితుడు. ఆయన "హిందూ పాలిటీ" అనే సుప్రసిద్ధ గ్రంథం రచించి, ప్రాచీన భారతదేశంలో "స్వపరిపాలిత ప్రజాతంత్రాలు" వుండేవని రుజువుచేయ యత్నించాడు. ఏ ప్రయోజనాన్ని ఆశించి ఈపని చేశాడు? భారతదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలులేవనీ, రాజకీయ వ్యవస్థలు అంతకంటే మృగ్యమనీ, అందుకని మనకు

ప్రజాతంత్ర వ్యవస్థలను పరిపాలించే తెలివి లేదనీ బ్రిటిష్ పాలక వర్గాలుచేసే నిర్ధారణలను ఖండించ డానికే ఆగ్రంథం వ్రాశాడు. జయస్వాల్, భండార్ కర్ వంటి మేధావులు యెవరి ప్రతినిధులు? తమ రచనలద్వారా వీరు ఏవర్గానికి మనో దారుఢ్యాన్నీ ఆత్మ విశ్వాసాన్నీ కలుగజేశారు? 20వ శతాబ్దం ప్రారంభ దశలో నాటి మితవాద బూర్జువావర్గం వారి చరిత్ర గ్రంథాలలో అధినివేశ ప్రతిపత్తి (Dominion Status) కొరకు కార్యక్రమ ప్రణాళికలను రూపొం దించారు. "అంటే సామ్రాజ్యవాద పాలకవర్గాల ఆర్థిక విధానం, పార్లమెంటరీ ప్రజాస్వామికం మొదలైన వాటికొరకూ, వారితో సమానమైన పాలక వర్గ హోదాలకొరకూ తమకు గల హక్కులను అర్హతలను ప్రతిపాదిస్తున్నారన్న మాట." (డాంగే-భారతదేశం పేజి 14)

భండార్ కర్, జయస్వాల్ వంటి భారతీయబూర్జువా మేధావుల తప్పు వ్యాఖ్యానాలు, వారు చూపెట్టిన నామమాత్రపు పోలికలు చరిత్రనూ వాస్తవిక సంఘటన లనూ రాజ్యం (State) యొక్క పుట్టు పూర్వోత్త రాలనూ మరుగు పరుస్తున్నాయి.

## ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ

మార్క్సిజం ప్రతిపాదించే చారిత్రక భౌతికవాద సూత్రాలను భారతదేశ చరిత్రకి - ప్రత్యేకంగా హైందవార్యుల జీవిత చరిత్రకు అనువర్తింపజేసి, తద్వారా ఆదిమ కమ్యూనిస్టు సమాజంనుండి హిందూ రాజ్యాంగ యంత్రం పుట్టుకదాకా వివిధ చారిత్రక దశలను పరిశీలించి, రాజ్యం పుట్టుకను శాస్త్రీయ దృక్పథం ప్రకారం వివరిస్తాను.

ఆర్యుల నివాస భూమి ఏదో, ఎక్కడనుండి వారు నేల నాలుగు చెరగులకు విస్తరించారో చరిత్రకారులు నేటికీ నిశ్చితంగా చెప్పలేకపోతున్నారు. తిలక్ వంటి భారతీయ పండితుడు ఆర్యుల ప్రథమ నివాసం సైబీరియాలోని ఉత్తర ధ్రువమని (Arctic Home) అంటున్నాడు. మహాపండిత రాహుల్ సాంకృత్యా యన్ వంటి మార్క్సిస్టు పండితుడు కాస్పియన్ సముద్రప్రాంతంలోని ఓల్గానది ఒడ్డు అంటున్నాడు. మరికొందరు యూరపియన్ చరిత్రకారులు యూరప్ అనీ,మాక్స్ముల్లర్ మధ్య ఆసియా అనీ వాదించారు.ఏది ఏమైనా, ఆర్యుల ప్రథమ నివాస భూమి యిదేనని ఖచ్చితంగా యిదమిద్ధంగా చెప్పలేము.

హిమజల ప్రళయాల వల్లనూ, జనాభా పెరుగుదల మూలంగా ఏర్పడిన ఆహార కొరత వల్లనూ ఆర్యులు పశువులను మేపుకొనేందుకు పచ్చిక బయళ్ళను వెతుక్కుంటూ సారవంతమైన గంగా సింధు మైదాన ప్రాంతాలకి సైనిక వీరుల తెగలుగా గణాలుగా వచ్చి నివాసం ఏర్పరచుకొన్నారు. (ఆర్యులు బైటనుండి భారతదేశానికి వలస వచ్చారు అంటే నమ్మకుండా పిడివాదనలుచేసే ఛాందస హిందూ పండితులు నేటికీ కొందరు మన దేశంలో వున్నారు)

ఐతే, ఆర్యుల రాకకు పూర్వం భారతదేశానికి ఒక చరిత్రవుంది. మొదట మంగోళ్ళు తెగ అనే అనాగరికులుండేవారు. వీరిని ద్రావిడులు తరిమివేశారు. ద్రావిడులను క్రొత్తగా వచ్చిన ఆర్యులు వోడించి తూర్పు దక్షిణాలకి తరిమివేశారు. వీరందరికంటే పూర్వం క్రీ. పూ. 5000 - 8000 సంవత్సరాలనాడు భారత దేశంలో మొహంజెదారో - హరప్పా నాగరికత విలసిల్లింది.

హిందూ ఆర్యుల అతిప్రాచీన సాంఘిక జీవిత స్మృతులనూ, జీవన విధానాలనూ ఋగ్వేదాది వేద మంత్రాల ద్వారా, రామాయణ భారతేతి హాసాల ద్వారా, సూత్రాల స్మృతులవల్ల మనం తెలిసికో వచ్చు. ఆదిమార్యుల ఆదిమ కమ్యూనిస్టు సమాజ దశ నాటి వివరాలను తెలుసుకోవడానికి ప్రధానంగా తోడ్పడేవి వేదాలూ (ఋగ్వేద మంత్రాలు), బ్రాహ్మ ణాలూ, మహాభారతం.

ఆదిమార్యులు క్రీ. పూ. 2500 నాటికి మనదేశానికి వచ్చారు. దేశంలో స్థిరపడుటకు వారికి 1500 సం॥ పట్టింది. ఈ దీర్ఘకాలంలో వారి జీవితం ఎలావుండేది? కళ్ళు పొడుచుకొన్నా కనుపించని కటిక చీకటి; మెదిలితే మీద పడే మృగాలు; కదిలితే కాళ్ళని చీరేసే ముళ్ళపొదలు; నాటి ఆదిమార్యుని జీవితమే ఇబ్బందుల పుట్టగా యిక్కట్టుల గుట్టగా వుండేది. విపరీత విప త్కర పరిస్థితుల మధ్య నాటిమానవుడు జీవించాడు. తిండి లేక, తలదాచుకోడానికి గూడు లేక క్రూర జంతువుల నుండీ, వానా వరదా లాంటి ప్రకృతివైప రీత్యాల నుండీ, కరువు కాటకాల నుండీ, శత్రుగణాల తెగల భయంకర దాడుల నుండీ, కటిక చీకటి గొడ్డు చలి మండుటెండల నుండీ నాటి మానవుడు బాధ పడ్డాడు. ఈ విధంగా 1500 సంవత్సరాలు గడిపాడు.

క్రమేణా అతడు పశువులను మచ్చికచేయడం నేర్చుకొన్నాడు. నిప్పును కనిపెట్టాడు. పశువుల పెంపకం, నిప్పును కనిపెట్టడం - యీ రెండూ మానవ సమాజ నిర్మాణంలోనూ, దైనందిన జీవితంలోనూ అపూర్వమైన విప్లవాన్ని గొనివచ్చాయి. ఏ నాడు హైందవార్యుడు నిప్పును కనిపెట్టాడో అప్పటి నుండే పశువుల పెంపకం సులభమైంది. పశువులను మచ్చికచేసి పెంపడం వల్ల మాంసం, పాలు యిత్యాది ఆహారపదార్థాలు లభించాయి. ఈ రెంటిని నాటివారు ఆహారంగా వుపయోగించారు. పశువుల నుండి వచ్చిన చర్మంతోను ఉన్నితోను వెచ్చని దుస్తులు చేశారు. ఆటవిక దశపోయి, అంతకంటె మెరుగైన మరో వున్నత దశలోకి జీవితం ప్రవేశించింది. ఆదిమార్యులు యీ విధంగా తమ నూతన జీవితాన్ని పశు పెంపకం, అగ్ని అనే నూతన ఉత్పత్తి పరికరాల (ఉత్పత్తి శక్తులు) సహాయంతో నిర్మించారు.

ఈ నూతన ఉత్పత్తి విధానానికి ప్రాచీన హైందవార్యుడు పెట్టిన పేరు యజ్ఞం. ఈ నూతన సామాజిక వ్యవస్థకి అతడు పెట్టిన పేరు గణం లేక గణ గోత్రం-బ్రహ్మ. ఇంతకిపూర్వం సంచార స్థితిలో వున్న ఆర్యుడు నేడు "విమన్ లేక వ్రజన్" అనుపేర జనపద నిర్మాణాన్ని చేసి, స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. సృష్టికర్తయైన బ్రహ్మ త్రేతాయుగంలో యజ్ఞాన్ని ఉత్తిమోత్తమ వరంగా మానవుడికి ప్రసాదించాడని శాంతిపర్వం చెబుతోంది.

అగ్నిని కనిపెట్టడంవల్ల హైందవార్యుల సమాజానికి లభించిన నూత్న ఉత్పత్తివిధానమే యజ్ఞము. "ఆర్య గణానికి బ్రహ్మ అని పేరు. ఆ బ్రహ్మ యొక్క వుత్పత్తి విధానమే యజ్ఞము. బ్రహ్మ అంటే సమిష్టి ఉత్పత్తి విధానంగల ఆర్యుల ఆదిమ కమ్యూనిస్టుగణం. ఈ ఉత్పత్తి విధానాన్ని గూర్చి, ఆదిమ కమ్యూనిస్టు గణజీవితాన్ని గూర్చి తెలిపే జ్ఞానమే వేదాలు." (డాంగే - భారతదేశం పేజి 77.)

సత్రయజ్ఞం, క్రతుయజ్ఞం అనేవి అతిప్రాచీనమైన యజ్ఞాలు. ఇవి ఆదిమార్యుల ఉత్పత్తివిధానం ఎలా కొనసాగింపబడేదో అతిస్పష్టంగా విశదీకరిస్తున్నాయి. "దేవతలు చేసిన సత్రయజ్ఞము ఆదిమార్యుల సమిష్టి శ్రమవిధానం యొక్క నిర్దిష్టస్వరూపం." సత్రయజ్ఞంలో పాల్గొనేవారంతా ఋత్విజులే - అంటే యజమానులే. ఇది సంపూర్ణంగా సమిష్టిగా చేయబడేది. ఆ సమిష్టిశ్రమలో శ్రమవిభజన లేదు. సమిష్టి శ్రమవల్ల వచ్చినదాన్ని (యజ్ఞఫలాన్ని) సమిష్టిమీద అంతా పంచుకొని అనుభవించేవారు. ఈ యజ్ఞంలో పాల్గొనే వారంతా రక్తబంధువులే; ఒకే గోత్రీయులన్నమాట. స్త్రీ పురుష భేదం లేకుండా గణ మండలి రక్తబంధువు లంతా సమిష్టిగా శ్రమించి, ఆసమిష్టి శ్రమవల్ల వచ్చిన యజ్ఞఫలాన్ని సమిష్టిగా పంచుకొని అనుభవించడమే యజ్ఞం. ఇదే ప్రాచీన హైందవ ఆర్యుల సమిష్టి ఉత్పత్తివిధానం.

ప్రతి వుదయమూ హోత దేవతల్నీ, మనుషుల్నీ (ఆర్యులను) సమావేశానికి రమ్మని పిలిచేవాడు. వారంతావచ్చిన తరువాత, ఎవరు ఏయే పనులు చేయాలో నిర్ణయించి ఆయా పనుల్ని వారికి అప్పగించేవాడు- అందరూకలిసి ఎన్నుకొన్న గృహపతి స్త్రీ పురుషుల్ని వివిధరకాలైన పనులలో నియోగించి వారిచే ఆయా పనులను చేయించేవాడు. నాటి అతి కఠినమైన శ్రమను సులభంగా, సునాయాసంగా చేసేందుకు కావలసిన హుషారుకోసం అందరూ కలిసి సమిష్టిగా గానం చేసేవారు. ఈపాటలను పాడటంలో సూత్రధారుడై నడిపేవాడు ఉద్గాత. అప్పుడప్పుడు (శ్రమను మరచిపోయేందుకు వారు స్త్రీ పురుష భేదంలేకుండా సోమరసాన్ని తాగేవారు. ఈవిధంగా సమిష్టిగా ఉత్పత్తి చేసిన దాని సంతతినీ గణ-గోత్రమండలి సభ్యులంతా (బహ్మ) సమిష్టిగా అనుభవించేందుకు దాన్ని మహావేది వద్దకు తెచ్చేవారు. దేవ, పితృభాగమైన హవిస్సును అర్పించి పిదప మిగిలిన దాన్ని - హుతశేషాన్ని - సమిష్టిగా భుజించేవారు. మాంసాన్నే తృప్తిగా తినేవారు. "బాగాతిని, మస్తుగా తాగి స్త్రీ పురుషులు జంటలు జంటలుగా అగ్ని చుట్టూ నిద్రపోయేవారు. ............ఈవిధంగా గణం (బ్రహ్మ) బ్రతుకు సాగించింది; శ్రమించింది; సుఖించింది; అభివృద్ధి చెందింది." (డాంగే- భారతదేశం - పేజి 87.)

## గణగోత్ర విచ్ఛిత్తి - దాని పరిణామం

కాలం గడచిన కొలదీ ప్రతిగణ సమాజం అభివృద్ధి పొందుతూవచ్చింది. గణసమాజసభ్యుల సంఖ్య పెరిగినప్పటికీ ఉత్పత్తిసాధనాలు మొరటుగావుండేవి కాబట్టి, ఉత్పత్తి మాత్రం అలాగేవుండేది. అందుకని ఆర్థిక పరిస్థితుల వల్లా బంధుత్వ నియమాలవల్లా గణగోత్రం చీలిపోయి ముఠాలుగా యేర్పడి, పచ్చిక బీళ్ళూ సారవంతమైన ప్రదేశాలూ వెతుక్కుంటూ వలసపోయేవారు. ఇలా వెళ్ళేటప్పుడు కొత్త ప్రదేశాలలో జీవితం ప్రారంభిం

చేందుకు ఆవుల్నీ, ఎద్దుల్నీ, మేకల్నీ తదితర అవసర పరికరాలనూ తీసుకు వెళ్ళేవారు. గణాలు అవసర పరిస్థితులలో ప్రాణ సంపదలను రక్షించుకోనేందుకు విరోధి గణాలతో పోరాడవలసివచ్చేది. నిర్మాణాత్మకంగా యుద్ధాన్ని నడపడం, కొల్లగొట్టిన సంపదను వినియోగించడం ఆర్య గణజీవితంలో ప్రధాన భాగంగా తయారైంది.

ఈ విధంగా నూత్న నివాస స్థలం కొరకూ, పచ్చిక బయళ్ళకొరకూ వెతుక్కుంటూ వెళ్ళేటప్పుడు రోగాల వలనా, శత్రువుల (రాక్షసుల) వలనా గణంలోని కొందరుగానీ, గణమంతాగానీ పూర్తిగా తుడిచి పెట్టుకపోయేది. అప్పుడు యితర గణాలకి చెందిన వ్యక్తులను తమ గణంలో కలుపుకోవడమో, లేక వేరే ఒక గణాన్ని మొత్తంగా కలిపేసుకోవడమో జరిగేది. ఒక గణంలో కొత్త వ్యక్తులనుగానీ, ముఠాలనుగానీ చేర్చుకోవడాన్ని యజ్ఞకర్మ ప్రకారం – "ప్రత్యష్టోమము" అంటారు. రక్త బంధువులు కానట్టి విరోధి గణానికి చెందిన వ్యక్తులు చేజిక్కితే జంకూ గొంకూ లేకుండా నరికివేయడం, అగ్నిలోవేసి బూడిదచేయడం వాడు ఆచారం. కాని గణంలోని వ్యక్తులంతా రక్త బంధువులు కాబట్టి వారు ఏకగర్భ జనితులైన సోదరులుగా పరిగణింపబడేవారు. సోదరులను చంపడం మహానేరంగా పాపంగా భావింపబడేది.

గణయుద్ధాలు, "దేవ-దానవ" యుద్ధాల పేరిట ఋగ్వేదంలో కన్పిస్తాయి. మాతృస్వామికం అమల్లో వున్నపుడు అదితి – దితి – రుద్ర – దౌస్ – మొదలగు గోత్రమాతల పేరిటనే యుద్ధాల్లో పాల్గొన్న వివిధ గణాలు పేర్కొనబడ్డాయి. కాని ఋగ్వేదకాలంలో రాజులయుద్ధాలను (సుదస్, దివోదస్ వంశీయులైన పదిమంది రాజులయుద్ధాలు) గోత్రజనకులు నడిపారు. ఇవి బహుశా మాతృస్వామికం అంతరించి పితృస్వామికమూ, సొంతఆస్తీ, బానిసవిధానమూ వర్గపోరాటాలూ అమల్లోకివస్తున్న పరిణామదశకు చెందినవి కావచ్చు". (డాంగే – భారతదేశం – పేజి 150) పితృస్వామికం అమల్లోకి వచ్చినతర్వాతకూడా సమిష్టిగా గణమంతా మరో శత్రుగణంమీద పోరాడింది. "యుద్ధంచేసే విధానమూ, యుద్ధంలో కొల్లగొట్టిన సంపదను వినియోగించే విధానమూకూడ గణసమాజ (సమిష్టి)విధానమే. అంటే ఒక వర్గం పైరివేటుగా అపహరించడంగానీ వర్గరాజ్యాంగ యంత్రంలోవలె జీతాలుపుచ్చుకొనే స్థాయీసైన్యంచేత యుద్ధం చేయించడంగానీ, అలాంటి సైనిక నాయకత్వం యేర్పాటుగావడంగానీ లేదు." (డాంగే-)

## గణాలమధ్య అంతర్యుద్ధాలు : సొంతఆస్తికి బీజాలు

ఋగ్వేదంలో ఉదహరింపబడిన ఒక గాథ ప్రకారం ఫణులు (ఒకగణం) దేవగణాలకి చెందిన పశువుల మందలను దొంగిలించగా దేవతలు (ఆర్యగణాలలో ఒక తెగకు చెందిన మానవులు – అథర్వణవేదం – 11-5-19; 4-11-6) "శరమా" అనే గోత్రజనని నాయకత్వంక్రింద ఫణులను ఎదుర్కొని యుద్ధం చేస్తారు. దీన్నిబట్టి ఏం తెలుస్తోంది? ఒక గణానికి చెందిన పశుసంపదను మరోగణానికి చెందినవారు దొంగిలించేవారనీ అందువల్ల గణాలమధ్య తీవ్రమైన అంతఃకలహాలు ప్రారంభమయ్యాయనీ స్పష్టమవుతుంది. సొంతఆస్తి పుట్టుకకీ, సమిష్టిఆస్తి ఉనికికీ మధ్యవున్న సంధికాలంలోకి ఆర్యగణాలు ప్రవేశించాయి. సమిష్టిగా జీవించే ఆదిమ కమ్యూనిస్టు గణగర్భంలోనుండి నూత్న పరిస్థితులవల్ల సొంతఆస్తి పుట్టుకొస్తోంది.

నాటి గణసమాజం యుద్ధనాయకుణ్ణి యెన్నుకొని అతణ్ణి బ్రహ్మణస్పతి, బృహస్పతి, గణపతి అని పేర్లుపెట్టి పిలిచారు. గణ సమాజం తమ సమిష్టి సంపాదనలో నుంచి, గణనాయకుని భాగమైన హవిస్సును తీసి యిచ్చి శత్రువును నాశనం చేసి తనకు సంపదల నివ్వమని గణనాయకుని ప్రార్థించేది. విరోధిగణాల మధ్య పోరాటం జరిగిన తర్వాత ఓడిపోయిన గణంయొక్క పశువుల్నీ వస్తుసంపదనీ స్త్రీలనీ బిడ్డల్నీ వశపరచుకొని పురుషులను ఖైదీలుగా బంధించి గణ నివాసానికి తెచ్చేవారు. యుద్ధంలో కొల్లగొట్టింది సొంత ఆస్తి కాదు; అది గణం యొక్క ఉమ్మడి ఆస్తి. పిదప పెద్ద విందు జరిగేది. విందు అనంతరం గణం పురుష మేధం, బ్రహ్మమేధం అనే రెండు విధులు నిర్వర్తించేది. బ్రహ్మమేధమంటే యుద్ధంలో మరణించిన గణ సభ్యులను పూజచేయడం. పురుష మేధం అనగా శత్రుగణానికిచెంది, ఎందుకూ పనికిరాని వారుగా పరిగణింపబడిన యుద్ధఖైదీలను అగ్నికి ఆహుతివ్వడం.

ఆర్యగణం అతి మొరటైన పరికరాలతో చాలా తక్కువగానే ఉత్పత్తిచేయగలిగేది. తాను తినేదే చాలక నిరంతరం కరువు కాటకాలతో, ఆకలి బాధలతో అల

మటిస్తుండగా, విరోధిగణానికి చెందిన యుద్ధ ఖైదీలను బానిసలుగా చేసికొని, వారిని మేపడానికి కావలసినంత తిండియేది? లేదు; కాబట్టి యుద్ధంలో చేజిక్కిన వారిని సఫాచేసివేయడం; మిగిలిన పనికిరాని సరకును అగ్నిదేవునికి ఆహుతిచేయడం పరిష్కారమార్గం.

కాని, తరువాత గణ సమాజం యొక్క ఉత్పత్తి నైపుణ్యం అభివృద్ధిఐంది. మానవుని శ్రమ అదనంగా ఉత్పత్తి చేయగలిగిన స్థితికి వచ్చిన తర్వాత మనుష్యుని యజమాని (బానిస యజమాని) ఐనవాడు అగ్నికి బలిచేయకుండా అట్టి పెట్టుకోవడం లాభసాటిగా కన్పించింది. తరువాత దశలో. యుద్ధఖైదీలు బానిసలుగా మార్చివేయబడ్డారు. స్వేచ్ఛా సమానత్వాలు గల ఆదిమగణ విధాన శిథిలాలమీద బానిస విధానంగల సమాజ వ్యవస్థ నిర్మాణమైంది.

## శ్రమ విభజన: వర్ణాల పుట్టుక

పశువుల పెంపకానికి ఆసియా పుట్టినిల్లు. ఈఖండంలోని ఆర్యులు పశువులను మచ్చికచేయడం ప్రధాన వృత్తిగా పెట్టుకొన్నారు. తరువాత వాటినిమేపి బాగా అభివృద్ధిచేశారు. ఈవిధంగా పశులకాపరి తెగలు మిగిలిన అనాగరికుల నుండి వేరుపడ్డాయి. ఇదే మొట్టమొదటి శ్రమ విభజన.

ఆయుధాల్నీ పనిముట్లనీ ఉపయోగించడానికి నైపుణ్యం అవసరం కావడంవల్ల, తాత్కాలికమైన శ్రమ విభజన అవసరమైంది. అది జరిగిందికూడా. శ్రమ విభజన ఏర్పడటానికీ, వర్ణాలు అమల్లోకి రావటానికీ ముందు జనసంఖ్య, జన సాంద్రతా పెరగాలి. వర్ణాలు ఏర్పడటానికి ముందు పశుసంపదను ప్రాతిపదికగా చేసుకొని పాలు, మాంసం, చర్మాలు, ఉన్ని, మేక బొచ్చు, నేతదుస్తులూ లాంటి వివిధ వస్తువులను తయారు చేయడం, వాటిని గణంలోని సభ్యులు తమలోకూడ మారకం వేసికోవడం తద్వారా గణ సభ్యులసంఖ్య తగినంతగా వృద్ధికావడం, యిత్యాది పనులు జరగాలి. అప్పుడే శ్రమ విభజనకీ తద్వారా వర్ణ వ్యవస్థ ఏర్పడటానికీ వీలుంటుంది. అలా జరిగింది. ఆర్యుల పశువులపెంపకమే తర్వాత దశల్లో సామాజిక శ్రమ విభజనకీ, వర్ణ వ్యవస్థకీ ప్రాతిపదికను ఏర్పరచింది. అందువల్ల హైందవార్యుల సమాజంలో చారిత్రక పరిణామక్రమం యొక్క ఒకానొక నిశ్చితదశలో వర్ణ విభాగం ఏర్పడింది.

వర్ణ వ్యవస్థ చారిత్రక పరిణామక్రమంలో ఏర్పడ్డదేనని హిందూ ఋషులుకూడా చెప్పారు. భృగుమహర్షి ఏం చెప్పాడో చూడండి—

"న విశేషోస్తి వర్ణానాం సర్వం బ్రహ్మమిదంజగత్
బ్రాహ్మణాః పూర్వ సృష్టాహి కర్మ భిర్వర్ణ
నాంగతాః"

అంటే మొదట అంతా బ్రహ్మమే. తరువాత తాము చేసే కర్మలనుబట్టీ, పనులనుబట్టీ బ్రాహ్మణులనే వర్ణం యేర్పడింది - అంటాడు భృగుమహర్షి. దీంతో పాటు "చాతుర్వర్ణం మయాసృష్ట గుణకర్మ విభాగశః" అని భగవద్గీత చెప్పింది.

ఆర్యగణాలు వివిధ వస్తువుల్ని వుత్పత్తి చేయగలగడం వల్ల ఆంతరంగికంగా శ్రమ విభజన ప్రారంభమైంది. ఏకంగావున్న గణంలో యీవిధంగా భాగాలేర్పడి, ఆయాపనులకి కట్టుబడిపోయే వర్ణాలు రూపొందాయి. ఐతే ఈ వర్ణాలు మొదటిదశలో విరోధి వర్గాలుగా చీలలేదు. క్రమేణా మారకం కొరకు ఉత్పత్తి ప్రారంభం గావడంతో సొంతఆస్తి ఆమల్లోకి వచ్చింది. సొంతఆస్తి అమల్లోకి రావడంవల్లా, ఉత్పత్తి సాధనాలు వ్యష్టి యాజమాన్యంలోకి రావడంవల్లా తరువాత దశలో యీవర్ణాలు పీడక పీడిత వర్గాలుగా, బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు దోపిడీ వర్గంగానూ వైశ్య శూద్రులు దోపిడీ చేయబడే వర్గంగానూ చీలిపోయాయి.

"కాని శ్రమ విభజన నెమ్మదిగా ఉత్పత్తి క్రమం యొక్క నరనరానికి పాకిపోతుంది. ఇందువల్ల సమిష్టి ఉత్పత్తి వినియోగాలు భగ్నమౌతాయి. వ్యక్తిగతమైన అనుభవమే సర్వ సాధారణంగా ఆచరించబడే సూత్రంగా పైకి వస్తుంది. దీంతో వ్యక్తులమధ్య మారకం జరగడం ప్రారంభమౌతుంది." (ఎంగెల్స్). "ఈదశకుచేరిన తర్వాత సమాజంలో సొంతఆస్తీ, వర్గాలు యేర్పడతాయి. వర్ణాలే పరస్పర విరోధవర్గాలుగా రూపొంది అంతర్యుద్ధాలకూ వర్గపోరాటానికి దారితీస్తాయి. ఆదిమ గణసమాజం నశిస్తుంది."

(డాంగే – భారతదేశం – పేజి 172:)

మొదట మూడువర్ణాలే ఉండేవి తర్వాత పరాయి గణాలనుండి గెలిచి తెచ్చుకోబడిన యుద్ధ ఖైదీలు బానిసలుగా చేయబడ్డారు. ఈ శూద్ర బానిసలు నాల్గవ వర్ణంగా తయారయ్యారు.

(మిగతా పేజీలో)

జిజ్ఞాస

# శంకరుని మాయావాదం

డాక్టరు కుప్పా వెంకటరామ శాస్త్రి, ఎం. బి., బి. ఎస్.

## అవతారిక

"బ్రహ్మసత్యమ్ జగన్మిథ్య జీవో బ్రహ్మైవనాపరః" (బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మయే కాని వేరుకాదు) అనే వాక్యం అద్వైత సిద్ధాంత సారము. ఈ వాక్యం లోని మొదటిభాగాన్ని గూర్చి విచారణ చేయడం ఈ రచన ఉద్దేశ్యం. ఈ విచారణలో వాద ప్రతివాదాలను స్పష్టంగా, నిశితంగా చూపి, జిజ్ఞాసకు తోడ్పడే విధంగా భావ సంఘర్షణను ప్రదర్శించాలనే ఉద్దేశ్యంతో, బౌద్ధ తాత్విక గ్రంథాలలోను, శంకర భాష్యం లోను ఉపయోగింపబడిన భాష్యశైలిలో ఈ రచన సాగింది. అద్వైతి సిద్ధాంతి. పూర్వపక్షి విమర్శకుడు. శాస్త్రవేత్త ఆధునికుడు. వీరి భావాల సంఘర్షణద్వారా అద్వైత స్వరూపాన్ని ఇదిగో దర్శించండి:

పూర్వపక్షి: దైనందిన జీవితానుభవానికి విరుద్ధంగా, జగత్తు వాస్తవికతను కాదనడం అర్థరహితం కాదా అని నా ప్రశ్న.

అద్వైతి: ఈ జగత్తు ఉనికిని నిరాకరించడం శంకరుని మతంకాదు. కుందేటికొమ్ము, గొడ్రాలి బిడ్డ, ఆకాశపుష్పంవంటిది జగత్తు కాదని శంకరుడు స్పష్టం చేశాడు. "నహిమృగతృష్ణాదయోపి నిరాస్పదా భవంతి" అని.

పూర్వపక్షి: కుందేటి కొమ్ముకన్నా ఈ జగత్తు అధిక సత్యమని తమరు ప్రత్యేకంగా ఎత్తిచూపడం వృథాశ్రమ. బుద్ధిగత విజ్ఞానంకంటె భిన్నమయిన బాహ్యార్థము (External reality) యొక్క వాస్తవికతను మీరు అంగీకరిస్తారా అనేది మొదటి ప్రశ్న.

అద్వైతి: బౌద్ధంలో ప్రధానశాఖ అయిన విజ్ఞాన వాదాన్ని (Subjective idealism) శంకరుడు తీవ్రంగా ఖండించాడు. తెలుసుకొనుట అనే వ్యవహారమంతా ఆంతరంగికమయి బుద్ధిగతమవుతూంది గనుక, ఈ విజ్ఞానానికి అతిరిక్తమయిన బాహ్యార్థము లను (External objects) అంగీకరింప నవసరం లేదని ఈవిజ్ఞానవాదుల అభిప్రాయం. సూత్రభాష్యంలో శంకరుడు ఈ వాదాన్ని నిరాకరించిన విధానం, తీవ్రఖండన చూస్తే, బాహ్యార్థముల వాస్తవికతను శంకరుడు నిరాకరించలేదని స్పష్టమవుతుంది. "నాభావ ఉపలబ్ధేః" (పంచభూతాత్మకమగు అర్థప్రపంచముయొక్క అభావము అనగా శూన్యత్వము "న" అనగా సంభవింపదు. ఏలనన - ఉపలబ్ధేః - ప్రత్యక్ష ప్రమాణముచే అది లభ్యమగుచుండుటవలన - అనేది సూత్రానికి శంకరుడిచ్చిన అర్థం. ఈ అర్థాన్ని భాష్యంలో ఇలా వివరించారు.

"బాహ్యార్థములు లేవన వీలులేదు. అవి ప్రత్యక్షముగ ఉపలబ్ధమగుచున్నవి. బాహ్యమున ఉపలబ్ధమగునది లేదన తగదు. భోజనముచేసి, భోజన కర్మ సాధ్యమగు తృప్తిని అనుభవించుచు నేను భోజనము చేయలేదు- నాకు తృప్తికలుగలేదు అను వానివలె బాహ్య విషయములతో ఇంద్రియ సంనికర్షచే, స్వయముగ తెలియవచ్చుచున్న బాహ్యవిషయము నాకు తెలియుట లేదు. ఆ వస్తువులేదు అని పలుకువానిమాట ఎట్లు అంగీకారమగును ?..."

శాస్త్రవేత్త: అయితే మీరుకూడ ప్రత్యక్షముగ ఉపలబ్ధమగుచున్న అన ... న్ని అంగీకరించి, బాహ్యార్థ

మును వాస్తవికతగా అంగీకరిస్తారన్న మాట! నేను ఇలా అనుకోలేను సుమండీ.

అద్వైతి: "లోకములో అందరూ స్తంభ, కుడ్యాదులను ఉపలబ్ధజ్ఞాన విషయములుగా తెలిసికొనుచున్నారు. బాహ్యార్థముల నంగీకరింపని వారు కూడ ఆంతరంగికంగా తెలియవచ్చుచున్న రూపమేది కలదో అది బాహ్యమున కూడా భాసించుచున్నదని పలుకుచున్నారు. బాహ్యమున అవభాసించుచున్న విషయజ్ఞానము కలిగియున్నను, దానిని నిరాకరించు కోర్కెచే, బాహ్యమున ఉన్న దానివలె కాన్పించుచున్నదని వీరు 'వలె' శబ్దమును ప్రయోగించుచున్నారు. బాహ్యవస్తువున్నటుల వారంగీకరింపనిచో 'బాహ్యవస్తువువలె' అని బాహ్యవస్తువు పోలికనెట్లు చెప్పగలరు? విష్ణుగుప్తుడు వంధ్యాపుత్రునివలె (గొడ్రాలిబిడ్డ) కాన్పించుచున్నాడని ఎవరూ చెప్పరు. అందువలన యదార్థము కూడా ఏవిధముగా అనుభూతమగుచున్నదో ఆ విధముననే అంగీకరించి బాహ్య వస్తువే భాసించుచున్నదని యొప్పుకొనుట యుక్తము కాని, బాహ్య వస్తువులవలె నున్నదనుట యుక్తముకాదు...ప్రత్యక్షాది ప్రమాణములలో ఏ ప్రమాణముననయినను ఉపలబ్ధముకాని వస్తువును లేదనవచ్చును. బాహ్యార్థములన్నియూ వాని వాని స్వభావానుసారముగ ప్రత్యక్షాది ప్రమాణములలో నేదో యొకదానిచే ఉపలబ్ధమగుచున్నవి...సహోపలబ్ధిచే (Simultaneous experience) అర్థజ్ఞానములకు అభేదము కలుగుటలేదు. ఘట (కుండ) జ్ఞానము, పట (వస్త్రము) జ్ఞానము అను వ్యవహారమున జ్ఞానమునకు విశేషములగు ఘట పటములు భిన్నములు – జ్ఞానము భిన్నములగు బాహ్యార్థముల కంటె భిన్నమని, బాహ్యార్థముల వలన తెలియుచున్నది...విజ్ఞానము, విజ్ఞానము అని కలవరించు మీరు స్తంభము, కుడ్యము మొదలగు బాహ్య వస్తువుల నేల అంగీకరింపరో తెలియకున్నది. విజ్ఞానము అనుభవ సిద్ధమంటిరేని, బాహ్యార్థము కూడ అనుభవసిద్ధమని అంగీకరించుట యుక్తము. బాహ్యార్థము లేనిచో దానిజ్ఞానము స్వయముగ అనుభూతము కానేరదు. తన క్రియకు తాను విషయమగుట సాధ్యం కాదు."

ఇంత స్పష్టంగా బాహ్యార్థముల వాస్తవికతనుగూర్చి శంకరుడు ఘోషిస్తూంటే, జగత్తు వాస్తవికతను శంకరుని అద్వైతం నిరాకరిస్తున్నదని అనుకోవడం న్యాయమా? చెప్పండి.

## మిథ్య అంటే?

పూర్వపక్షి: అయితే జగత్తు మిథ్య అనే దానిలో 'మిథ్య' అనే దానికి ఏమి అర్థమిస్తారో స్పష్టంగా చెప్పవలసివుంది. మిథ్య అంటే స్వాప్నికజ్ఞానము వంటిదనా ఉద్దేశ్యం?

అద్వైతి: స్వాప్నిక జ్ఞానమువలెనే జాగరితమందలి స్తంభకుడ్యాది జ్ఞానమునకు ఆశ్రయం లేకుండ నుండకూడదా?-అనే విజ్ఞానవాది శంకకు, "వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్" అనే సూత్రంలో శంకరులు ఇలా జవాబు చెప్పారు.

"జాగరిత జ్ఞానములు స్వాప్నిక జ్ఞానములవలె నిరాలంబనములు కావు. ఎందువలననంటే రెంటికి స్వభావభేదము కలదు... స్వప్నమునందు ఉపలబ్ధమైన వస్తువు మేల్కాంచిన తరువాత బాధితమగుచున్నది (Contradicted) ... ఈ విధముగనే ఇంద్రజాలము... జాగరితమందుపలబ్ధమగుచున్న స్తంభాది జ్ఞానమునకు ఎట్టి అవస్థయందు బాధ కలుగుటలేదు ... జాగరిత జ్ఞానము సాక్షాదనుభవము. విషయము దగ్గరవున్నపుడు ప్రత్యక్ష జ్ఞానము, దగ్గరలేనపుడు స్మృతి అగుచున్నది. వైధర్మ్య మిటులుండ, జాగ్రత్స్వప్న జ్ఞానములకు కల భేదమును స్వయముగ అనుభవించుచు, జాగరిత జ్ఞానము స్వాప్నిక జ్ఞానమువలె మిథ్య అని ఎవరికిని చెప్పశక్యముకాదు. అనుభవమునకు విరుద్ధమగుటచేత, జాగరిత జ్ఞానము స్వయముగ నిరాధారమని చెప్పలేక, స్వాప్నికజ్ఞానముయొక్క పోలికచే నటుల సిద్ధాంతము చేయకోరుతున్నారు, విజ్ఞానవాదులు. స్వయముగ లేని ధర్మము పోలికచే సంభవింపదు. ఉదకసామ్యముచే అగ్నికి శైత్యము కల్పింపలేము."

పూర్వపక్షి: కృష్ణుడి కన్నా గోవిందుడు కాస్త నయం అన్నట్లు స్వాప్నిక జ్ఞానం కంటె వ్యావహారిక జ్ఞానం కొంత మెరుగంటారు. అంతేనా?

అద్వైతి: బాహ్యార్థముల వాస్తవికతను స్పష్టంగా శంకరుడు అంగీకరించిన విషయం మనవిచేశానుగా? శంకరుడు వ్యావహారికసత్యాన్ని (Practical reality) అంగీకరించాడు. స్వాప్నికజ్ఞానమునుండి జాగరిత జ్ఞానమును వేరుచేసి కొంత మెరుగుగా చూపినంత మాత్రాన జగత్తు వాస్తవికతను అంగీకరించినట్లు కాదని మీరు సూచిస్తున్నారు. ఈ వాదనకు సరే జవాబు అనవసరం. బాహ్యార్థముల వాస్తవికతను గూర్చి శంకరుని స్పష్టమైన అభిప్రాయాలు చర్విత చర్వణం చేయనవసరం లేదనుకుంటాను.

పూర్వపక్షి: శంకరుడు వ్యావహారిక సత్యాన్ని అంగీకరించాడని పోనీ వాదనకు ఒప్పుకుంటాను. పారమార్థిక సత్యమైన (Fundamental reality) బ్రహ్మకన్నా హీనసత్యంగా ఈ వ్యవహారిక సత్యాన్ని చెప్పాన్నాడు కదా?

అద్వైతి: ఈ సందర్భంలో శంకరుడిచ్చిన ఉదాహరణను అర్థం చేసుకోవడం అవసరం. మృత్తు (మట్టి) పారమార్థిక సత్యం. ఘటాదులు (కుండలు) వ్యావహారిక సత్యం... మృత్తుకు అతిరిక్తమయిన, దానికంటె స్వతంత్రమయిన సత్యత్వం ఘటాదులకు లేదు. ఘటాదులు మృత్తుకంటె అన్యమయినవికావు. ఏకైకమయిన మృత్తు విభిన్నమైన నామరూపాలతో వ్యావహారికంలో గోచరిస్తూంది. పారమార్థిక సత్యం పూర్ణసత్యం (Absolute truth). వ్యావహారిక సత్యం పరిచ్ఛిన్న సత్యం (Relative truth). ఏకైకమయినది దేశకాలాలచే పరిచ్ఛిన్నం చేయబడి నానాత్వంగా గోచరిస్తూంది. ఏకత్వం మూలసత్యం (Fundamental deeper reality). నానాత్వం పరిచ్ఛిన్న సత్యం. (Limited reality). జగత్తుయొక్క వాస్తవ ఉనికి సత్యాంశ. అపరిచ్ఛిన్నమైనది పరిచ్ఛిన్నమైనదిగా అనుభవం కావడం అసత్యాంశ. సత్ అసత్‌ల సమ్మేళనమే మిథ్య అనే పదంచేత సూచితమవుతూంది.

శాస్త్రవేత్త: మీ దృష్టికీ, ఆధునిక శాస్త్ర దృష్టికీ పోలిక కనిపిస్తూంది. బల్లలు, కుర్చీలు, చెట్లు జంతువులు, మనుష్యులు వీటి సత్యత్వాన్ని భౌతిక శాస్త్రం కాదనడంలేదు కాని శాస్త్రదృష్టితో ఇవన్నీ పదార్థం, శక్తియొక్క రూపాలు. పదార్థం (Matter) శక్తి (Energy) ఒకదానిలోఒకటి మారతాయి అని ఐన్‌స్టీన్ నిరూపించిన తర్వాత శాస్త్రదృష్టిలో మూల సత్యం ఒకటే. వ్యవహారములోకి వచ్చేటప్పటికి ఈ సత్యం యొక్క వివిధనామరూపాలను అందరిలాగానే మేమూ వాస్తవికంగా స్వీకరిస్తాము. శాస్త్ర కార్యకలాపాలలో వీటినన్నిటిని పదార్థశక్తి సంపుటిగా మాత్రమే చూస్తాము. వ్యవహారిక సత్యంకంటె మూల సత్యం పరిపూర్ణమైనదని, లోతైన (deeper) దృష్టి అని అనక తప్పదు. ఇలా అనడం వ్యవహారిక సత్యాన్ని నిరాకరించడం ఎలా కాగలదు?

పూర్వపక్షి: పరిచ్ఛిన్న సత్యం - పూర్ణసత్యం అనే దశల విభాగం సమంజసంకాదని ఎవరూ అనరు. కాని శంకరుడిచ్చిన రజ్జుసర్ప దృష్టాంతాన్నిబట్టి జగత్తు భ్రాంతిగా చిత్రించబడి ఊహామాత్రమైన సర్పంవలె సత్యత్వం లేనిదవుతూంది. దీనిని ఆధునిక శాస్త్ర దృష్టితో పోల్చడం అసందర్భం.

అద్వైతి: ఉదాహరణలు ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని ఆశించి బయలుదేరతాయి. వాటి ఉపయోగం అంతవరకే. ఏకైకమయిన మూలసత్యం లేక పారమార్థికసత్యాన్ని శంకరుడు బ్రహ్మ అన్నాడు. ఈ మూలసత్యము నామరూపాత్మక జగత్తుకు ఉపాదాన కారణము (Material cause) నిమిత్త కారణము (Efficient cause) కూడా. బ్రహ్మ మూలసత్యం (Reality). మనకు గోచరమవుతున్న దాని స్వరూపం (appearance) జగత్తు. వీనిరెంటికి గల సంబంధం ఎట్టిది అనేది ప్రశ్న. మూలసత్యం జగత్తుగా పరిణామం చెందుతూందా? లేక మూలసత్యంగానే వుంటూ జగత్తుగా భాసిస్తూన్నదా? అనేదానికి మనం జవాబు చెప్పాలి.

శాస్త్రవేత్త: ఇది క్లిష్టమైన విషయమేమీకాదు: మూల సత్యమైన పదార్థ, శక్తి సంపుటి బల్లలు కుర్చీలుగా మార్పు, పరిణామం చెందుతూందా? పదార్థ శక్తి సంపుటిగానేవుంటూ బల్లలు కుర్చీలుగా వ్యవహారంలో గోచరిస్తున్నదా అని అడిగితే పదార్థ శక్తి సంపుటి బల్లలు కుర్చీలుగా పరిణామం చెందుతూందని నేను అనగలను.

అద్వైతి: స్వరూప హానినిపొందే మార్పు పరిణామం - లేక ఆరంభం. స్వరూప హాని లేకుండా కనిపించే మార్పు వివర్త పరిణామం. ఇది మా వేదాంత పరిభాష.

మృత్తిక ఘటానికి ఉపాదాన కారణం. కుమ్మరి నిమిత్త కారణం. ఈ జగత్తుకు బ్రహ్మయే నిమిత్త ఉపాదాన కారణమగుచున్నాడు.

పూర్వపక్షి: అయితే, అద్వైతం పరిణామాన్ని నిరాకరిస్తున్నదన్న మాటేగా?

అద్వైతి: ఇక్కడ మనం చర్చిస్తున్నది మూల సత్యమునకు దాని గోచర స్వరూపానికి గల సంబంధం. ఈ సంబంధం ఎట్టిది అన్నపుడు ఇది పరిణామం కాదని అద్వైతం అంటున్నమాట నిజమే. నామరూపాత్మక వ్యవహారిక సత్యంలో గోచరించే వైవిధ్యాల అంతరంగిక సంబంధములు వేరే విషయం. అది అప్రస్తుతం. మూలసత్యానికి దాని గోచర స్వరూపానికి గల సంబంధం పరిణామం కాదనీ, వివర్తమే ననీ చూపడానికి మాత్రమే రజ్జు సర్పదృష్టాంత మీయబడినది. తాడును చూసి పాము అనుకున్న మనిషి వణకి

భయంతో పరుగెత్తుతాడు. అది పాము కాదు అని గ్రహించినపుడు భయంతొలగి పరుగెత్తడం మానేస్తాడు. సర్పభ్రాంతి వున్నపుడూ, అది తొలగినపుడూ కూడ త్రాడు ఒకేలాగు వుంది దానిలో ఎట్టి మార్పులేదు.

అలాగే నానాత్వపరిచ్ఛిన్నదృష్టి వున్నపుడు, అది తొలగిపోయినప్పుడు కూడ మూలసత్యముయొక్క ఏకత్వానికి అపరిచ్ఛిన్నతకు భంగం కలుగలేదు. ఇది తాడు, ఇది సర్పం అనుకున్నపుడుకూడ ఇది అనేది తాడనే పరమసత్యమే. అట్లే ఇది ఏకైకం - ఇది నానాత్వం అనుకున్నపుడుకూడ 'ఇది' ఏకైక పరమ సత్యమే. దృష్టాంతం ఇంతవరకే. ఇంతకన్నా దృష్టాంతాన్ని సాగదీయడం దృష్టాంతప్రయోజనాన్ని విస్మరించడమవుతుంది. లేనిపోని గందరగోళానికి అపార్థాలకు దారితీయడమవుతుంది. భ్రాంతి సర్పంవలె జగత్తు శూన్యమనేది అద్వైతవిరుద్ధవాదానికి దారి తీస్తుంది. భ్రాంతిరూపమయిన సర్పం శూన్యంలో నుంచి బయలుదేరలేదు. వాస్తవికమైన పూర్వదృష్టమయిన సర్పజ్ఞానం అసందర్భంగా త్రాడు అనే వాస్తవమైన అధిష్టానంలో ఆరోపితమయింది. సర్పభ్రాంతి తొలగినపుడు భ్రాంతి సర్పం శూన్యంలో లయంకాలేదు. వాస్తవమైన రజ్జులో లయమైంది. అదేవిధంగా ఏకైకమయిన, అపరిచ్ఛిన్న మయిన పరమ సత్యం (బ్రహ్మశబ్దనిర్దేశితం.) నామరూపాదులతో, దేశకాలాలతో పరిచ్ఛిన్నమయిన జగత్తుగా గోచరిస్తుంది. ఇక్కడ నామరూపాలు, పరిచ్ఛిన్నత పూర్వానుభవమైన సాపేక్షసత్యం. అనుభవసిద్ధమైన ఈ సాపేక్ష సత్యం సందర్భ రహితంగా పరమ సత్యంలో ఆరోపించ బడుతూంది. జ్ఞానోదయంకాగానే వ్యావహారిక సత్యమైన జగత్తు తిరిగి ఏకైక మయిన, అపరిచ్ఛిన్నమైన బ్రహ్మగా భాసిస్తూంది. అంటే జగత్తు 'ఉఫ్' అని శూన్యంలోకి అదృశ్య మయిందని కాని, నాశన మయిందని గాని అర్థంకాదు. జగత్తు ఇంకొక రకంగా ఏకత్వంగా అపరిచ్ఛిన్నంగా అవగతమయింది. అంతే. శంకరుడు జీవన్ముక్తిని అంగీకరించాడు. జీవన్ముక్తుని ఎదుట ఉన్న జగత్తు నాశనం కాలేదే. వచ్చిన మార్పల్లా అతని దృష్టిలో భేదం - పరమ సత్యంయొక్క స్వరూపగోచరంలో మార్పు. జగత్తులోని ప్రతి వస్తువూ పరమ సత్యమైన బ్రహ్మగా భాసిస్తుంది. జగత్తు నిరాస్పదమైన శూన్యమయితే, జీవితంలో సాధనద్వారా జ్ఞానోదయం - ధర్మాధర్మ విచక్షణ అనేది వుండకేవుండవు. ఈ విషయాన్ని మాండూక్యోపనిషత్తు భాష్యంలో శంకరులు వివరించారు.

పూర్వపక్షి: భ్రాంతి, వివర్త మనునవి ఎట్టి పరిస్థితులలోను సమాన ధర్మాలుగల రెండు సగుణాల మధ్యనే సాధ్యం. సన్నగా, పొడవుగా వుండడం, నేలను కరచుకొని వుండడం - తాడు సర్పం అనే రెండు సగుణ స్వతంత్ర పదార్థాలమధ్య సామాన్య ధర్మాలు. నిర్గుణమైన, ఏకైకమయిన మీ బ్రహ్మకూ సగుణమయిన స్వతంత్ర సత్తాలేని జగత్తుకూ మధ్య అధ్యాస (Erroneus perception) ఎలాసాధ్యం?

అద్వైతి: పరిచ్ఛిన్నత అనేది మానవుని యొక్క నైసర్గికమైన సదసద్రూపమైన వ్యవహారానుభవం. ఈ వ్యావహారికసత్యాన్ని పరమ సత్యంలో అధ్యాసచేయడం జరుగుతూంది. అనేకాక, పూర్వభ్రాంతి నుండి, ఉత్తరోత్తరభ్రాంతి సాధ్యమని శంకరులు చూపారు కదా.

పూర్వపక్షి: పరమసత్యము దృష్టముగాని విషయం. పూర్వదృష్టము కాని వస్తువులో అధ్యాస ఎట్లు సంభవం?

అద్వైతి: సత్యమనేది ఒకటున్నదని అందరం అంగీకరిస్తున్నాము. ఈ విశ్వం సత్య మను కొన్నప్పుడు ఇంద్రియాలద్వారా దీనిని గూర్చిన మన గ్రహణ సాపేక్ష మయినదే గాని పూర్ణము కాదు అనే ప్రత్యక్ష అనుభవంనుంచి పూర్ణసత్యాన్ని అనుమానం ద్వారా (inference) గ్రహిస్తున్నాము. ఇక్కడ ప్రత్యక్షంగా పూర్వదృష్టంకాని, పరోక్ష సత్యంలో ప్రత్యక్ష సత్యాన్ని అధ్యాస చేస్తున్నాము. ప్రత్యక్ష సత్యం కాకుండా అనుమానం ద్వారా గ్రహించిన ఆకాశంలో నీలిరంగును అధ్యాస చేయడం మనం చూస్తున్నాము. కాబట్టి కల్లకు కనిపించని బ్రహ్మలో జగత్తును ఆరోపించడం అసంభవం అనే వాదంలో పసలేదు.

## మాయ లేక అవిద్య

పూర్వపక్షి: వాదానికి వివర్తాన్ని అంగీకరించినా వివర్తానికి కారణమేమిటనే ప్రశ్న మిగులుతుందికదా? ఏకైక మయిన అపరిచ్ఛిన్న పరమసత్యం తాను మారకుండా నానాత్వంగా, పరిచ్ఛిన్నంగా గోచరిస్తుందని మీరంటారు. ఇది ఎలా సాధ్యం?

అద్వైతి: మాయ లేక అవిద్యవల్ల ఇది సాధ్యమౌతున్నదని శంకరుడు స్పష్టంచేశారు. సత్యాన్ని మరుగు

నిరాకరణ దృక్పథ విజృంభణకు దోహదం చేసింది.

అనన్యత్వాన్ని సమానత్వంగా చూచి, కార్యకారణ సంబంధంలో కార్యాన్ని మిథ్యగా నిర్వచించడం జడాత్మక దృక్పథ విజృంభణకు దోహదం చేసింది.

పరమ సత్యంతో మానవునికి ఐక్యతను కల్పించి, మానవుని పూర్ణవికాసానికి గల అవకాశాలను చూపి విశాల దృష్టిని చైతన్యాన్ని పెంపొందించ సమర్థమైన జీవ బ్రహ్మైక్యవాదం రెండవ స్థానంలో అణుగుస పడి జగన్మిథ్యా సిద్ధాంతం అపార్థాలకు నెత్తికెక్కడంవలన భారత జాతికి కలిగి నష్టం అపారం.

[illegible]



# భారత జాతీయ పునరుజ్జీవన

## ఒక సింహావలోకనం

పాములపర్తి సదాశివరావు

భారత జాతీయ పునరుజ్జీవనను మనమొక "ఆర్థిక - రాజకీయ - సిద్ధాంత" క్రమంగా గుర్తించవలసి యుంటుంది. జాతీయ జీవితంలో ఒక విప్లవానికి "రంగ భూమి" యైన పునరుజ్జీవనలో ఈ మూడు పార్శ్వాల్లోను సంచలనం అనివార్యమే ఔతుంది. ఈ మూడు పార్శ్వాలలో పరివర్తనమే పునరుజ్జీవనకు ప్రేరణ; కనుక ఈ అన్ని రంగాలలోను పునరుజ్జీవన యొక్క పరిశీలన కొనసాగవలసి యుంటుంది.

### ఈస్టిండియా కంపెనీ : ప్రజా ప్రతిఘటన

1850 నాటికి భారతదేశం ఎలాంటి స్థితిలో ఉంది? భారతదేశంలో మధ్యయుగీన భూస్వామ్యం కూలిపోతూ ఉంది. అదివరకే ధనికస్వామ్య దుంశలో వివశమైపోయిన బ్రిటిష్ వర్తకుల "తూర్పు ఇండియా కంపెనీ" ఉక్కు కౌగిలిలో దేశం దురాక్రమణకు గురియైయుంది.

భారతదేశంలో శిథిలీభూతమై పోతూఉన్న భూస్వామ్యాన్ని కంపెనీ అణచివేసింది. ఆచరిత్ర దారుణమైనది. బ్రిటిష్‌వారు భారతదేశాన్ని ఎలాంటి భేద దండోపాయాలతో ఆక్రమించారు? ఆర్కాట్ లో మహ్మదలీని చీలదీసి చందాసాహెబును మట్టు బెట్టారు. మీర్‌జాఫర్‌ను చీలదీసి ప్లాసీలో సిరాజుద్దౌలాను అణచివేశారు. బాక్సార్ యుద్ధంలో మీర్ ఖాసింను ఊరకనే ఊడబెరికారు. టిప్పుసుల్తానును వధియించారు; దేశంలో ఒక్కొక్క భాగాన్ని మదరాసు - బొంబాయి - మహారాష్ట్ర ప్రాంతాలు ఇందూర్, గ్వాలియర్, నాగపూర్ - అలాగే సూరత్, తంజావూర్, అవధ్, ధూనాలు ఒక్కొక్క ప్రాంతాన్ని చేజిక్కించుకున్నారు......"దుడ్డుగలవానిదే బర్రె" అంటూ, ఎంతో రక్తపాతంతో గాని తమ "పారమౌంట్సీ" అనిర్వచనీయాధిక్యతను నెలకొల్పుకోలేదు. తుదకు పిల్లలులేని సంస్థానాధిపతు లందరి రాజ్యాలూ మావేనని 'వారసత్వ హక్కులు' కూడా పుట్టించుకున్నారు. ఇదంతా ఏ "స్టంట్ పిక్చరు" కు తీసి పోతుంది!

ఐతే, ఈదురాక్రమణ నిరాఘాటంగా సాగిపోయిందనుకోరాదు. ప్లాసీ (1757) యుద్ధానంతరం భారతదేశంలో చెదురు బెదురుగా బ్రిటిష్ ప్రతికూల ప్రతిఘటన లనేకం సాగుతూనే ఉన్నాయి. 1763 లో బంకింబాబు 'ఆనందమఠం'లో చిత్రించిన సన్యాసుల తిరుగుబాటు జరిగింది. వారిసాహసాన్ని స్వయంగా వారెన్ హేస్టింగ్సే శ్లాఘిస్తూ 'వారు శక్తివంతులూ, ఉత్సాహవంతులూ, ధైర్యవంతులూ' నని వ్రాశాడు. 1772, 1778 లలో వంగరైతాంగం తిరుగుబాటు చేసి కంపెనీ ధాన్యంవసూళ్ళ నరికట్టగా వారిని అణచివేయుటానికి నాలుగు సైనిక బటాలియన్లను కంపెనీవారు వినియోగించాల్సి వచ్చింది. 1783 లో జనవ్వరి లో విప్లవకారులు కంపెనీ ఖజానా దోచుకొని 1500 మంది బ్రిటిష్ సైనికులను తుడిచిపెట్టారు. 1810 లో బీర్‌భూం, బంకూరా జిల్లాలు లార్డ్ కార్న్‌వాలిస్‌గారిని నిద్రపోనీయలేదు.......దీనికి లార్డ్ మింటో "ఈనాడు స్వతంత్ర రిపబ్లిక్కు కొరకు ఫ్రెంచి విప్లవదళాలలాంటి భయోత్పాతాలు కల్గిస్తున్నారో, భారతదేశ విప్లవదళాలూ అంతేననీ; ఆ దళాలను ప్రజలుకూడ తమ సర్కారుగా గుర్తిస్తున్నార"నీ వ్రాశాడు. మరోవంక పిండారీలు; వారిపైకి లక్షా యిరవైవేల సాయుధపటాలాల్ని ఉపయోగించాల్సి వచ్చింది. 1830 లో వహాబీ నాయకుడు సయ్యద్ అహ్మద్ రాయ్ బరేలీ పెషావరును ఆక్రమించాడు. మెట్కాఫ్‌గారు "భారతదేశం మన వినాశానికి నిరీక్షిస్తూ ఉంది; మనల్ని తుదముట్టిస్తే భారతీయులకు హాయి" అంటూ 1825 లోనే వ్రాశాడు. 1816 బరేలీ విప్లవం. 1831 - 32 లలో కోల్ తిరుగుబాటు. 1831 లో వంగప్రాంత ప్రతిఘటనోద్యమాలు. 1847 లో ఫరీద్‌పూర్ విప్లవం. 1849 - 52 లలో కేరళ తిరుగుబాట్లు. ఇవన్నీ బ్రిటిష్ సామ్రాజ్యవాద సింహాసనం అదుగున ప్రేలిన అగ్నిపర్వతాలే......

ఆపై 1857 లో దేశవ్యాప్త సాయుధ విప్లవం, 1863 లో వాహాబీలు, 1870 లో సంతాలులు, 1874 లో దక్షిణాది రైతాంగం, ఇలా భారతీయుల రక్తతర్పణాలతో చరిత్ర పుటలు నిరంతరం నిండిపోతూనే ఉన్నాయి. కనుక కంపెనీ పరిపాలన ఒక కన్నులబోను మాత్రమే.

ఇలాంటి సంఘర్షణలో ఈస్టిండియా కంపెనీ దురాక్రమణ కొనసాగింది. ఇక ఆర్థికరంగంలో జరిగిందేమిటి ?

## అమానుష దోపిడీ విధానం

1853 లో కార్ల్‌మార్క్స్ వ్రాసినట్లు కంపెనీ చేతి రాట్నం - చేమగ్గాలను విరిచి మూలబడేసింది. భారతీయ వస్తు ఎగుమతులను దిగ్బంధన చేసింది. బ్రిటిష్‌వారి ఆవిరి యంత్రాలూ స్వేచ్ఛా వాణిజ్యసత్తా భారతీయసనాతన గ్రామార్థిక వ్యవస్థనూ, పద్ధతినీ సమూలంగా కూల్చివేశాయి. గథే మహాకవి అన్నట్లు వేలాది మానవుల్ని హతమారుస్తూ స్వాతిశయాన్ని ప్రకటించుకొనే తైమూరుగాథలాంటిదే కంపెనీ పరిపాలన అని మార్క్స్ ఒకవ్యాసంలో పేర్కొన్నారు. ఇంకా, ఇంగ్లాండులో కూర్చొనే కంపెనీ డైరెక్టర్లు యేటా 4,00,000 పౌనులు హరించే ఉన్నతోద్యోగులను ఇండియాకు పంపుతున్నారనీ - కంపెనీ సిబ్బందీ క్రింద లెడెన్‌హాల్ వీధిలోనూ, కాననూర్‌లలో ఇండియా ప్రజల 1,60,000 పౌనులు యేటా ఖర్చు జరుగుతూఉందనీ; బ్రిటిష్ ఉద్యోగ బృందం ప్రభువర్గం కర్తలూ కలసి ఇండియాను యుద్ధాల్లో ఇరికించడం ద్వారా తమ పిల్లల నిరుద్యోగ సమస్యను నివారించుకొంటున్నారనీ, కంపెనీ ఉద్యోగబృందం పనులు చేసే బదులు పనులు తెగకుండా చేసేందుకు కాగితాల బేళ్లు ఖరాబుచేస్తూ తమ పదవులు స్థిరపరచుకుంటున్నారనీ కార్ల్‌మార్క్స్ 1853 లో విమర్శిస్తూ వ్రాశారు.

భారతదేశంలో మధ్య యుగంలో రాజులు, మహారాజులుగా ఉండిన స్వదేశ సంస్థానాధిపతులను ప్రస్తావిస్తూ మార్క్స్ శాసనబద్ధరాచరికం పేరుతో స్వదేశంలో రాచరిక అధికారానికి సున్నాచుట్టిన బ్రిటిష్ ధనికవర్గం ఇండియాలో 6,99,961 చదరపుమైళ్ళ వైశాల్యంగల భూభాగాన్ని తమ కీలుబొమ్మలైన స్వదేశ సంస్థానాధిపతుల చేతుల్లో ఉంచుతూ వారి నుండి నగదు రొక్కాన్నో సైనికపటాలాల సరఫరానో పొందుతూ ఉందనీ, దత్తపుత్రులపేర కొందరు దిక్కిపడతరాజుల కని 24,68,960 పౌన్లు ఇండియా రివెన్యూ నుండి (పన్నులు) చెల్లిస్తూ ఉందని తీవ్రంగా విమర్శిస్తూ వ్రాశారు. తైమూర్ లేన్ సంతతి వారైన మొగల్ చక్రవర్తి 1853లో 1,20,000 భరణంపొందే ఒక బొమ్మ అనీ ఆ చక్రవర్తి అధికారం అతని భవనం నాలుగోడలు దాటేదికాదనీ, ఢిల్లీలో పోలీసు సంస్థ కూడ చక్రవర్తి ఆదేశాలను లెక్కచేయదనీ కూడా పేర్కొన్నారు.

ఇలా ఈస్టిండియా కంపెనీ సంస్థానాధిపతుల పొత్తుతో, భారతదేశ మధ్యయుగార్థిక వ్యవస్థను నాశనం చేసి అమానుషమైన దోపిడీ విధానంతో సామ్రాజ్య పరిపాలన కొనసాగిస్తూ ఉంది.

బ్రిటిషువారి దోపిడీనికూడ కార్ల్‌మార్క్స్ 1853లో విమర్శించాడు. 1818 నుండి 1836 కు మధ్య 18ఏండ్లలో ఇండియాకు లంకషైర్ నూలు ఎగుమతులు 1 నుండి 5,200 రెట్లు పెరిగాయి 1824 లో 60,00,000 గజాలైతే 1837 నాటికి బ్రిటీషువస్త్ర ఎగుమతి 6,40,00,00 గజాలుగా వందరెట్లు పెరిగింది. మరియు ఇంగ్లాండుకి ఢాకావస్త్రం దిగుమతి 1,50,000 నుంచి 20,000 కు పడిపోయింది - అని వివరించారు. ఇదీ బ్రిటిషు దోపిడీ స్వరూపం.

ఇక భారతదేశపు వ్యవసాయ రంగం. వంగ్రాం సెటిల్‌మెంటు పద్ధతిని గూర్చి ప్రొఫెసర్ హైరిక్ 1772 కు పిదప బ్రిటిషు ప్రభువులు రైతులనుండి పన్నులనేకాక భూములనే ఊడలాగుకున్నారనీ, ఇలాంటి దారుణం ప్రపంచ చరిత్రలో మరెక్కడా ఎన్నడూ కని విన లేదనీ వ్రాశాడు. అంటే లార్డ్ కార్న్‌వాలిస్ భారతీయ రైతాంగాన్ని వ్యవసాయ కూలీలుగా మార్చాడన్నమాట ! ఐతే రైత్వారి సెటిల్‌మెంటుక్రింద కొంత స్వంతభూమి కల్గిన రైతాంగం యేర్పడటం జరిగింది; ఇది కీడులో మేలన్నమాట

కంపెనీ అధికార్లూ, వారి తాబేదార్లయిన భూస్వాములు ఏంచేసేవారు ? కొరడా దెబ్బలతో పన్ను లేకాక మిగులు పంటలుకూడా ఊడ్చివేయటం ఆ రోజుల్లో మామూలు. ఈ పరిస్థితులను కంపెనీ అధికార్ల దృష్టికి తెస్తూ 1762 లో మీర్‌జాఫర్ ఒక లేఖద్వారా "కంపెనీ కంట్రాక్టర్లు గ్రామాల్లో తాము కొనే సరుకులకు రూపాయికి పావలా మాత్రమే చెల్లిస్తూన్నారనీ, తాము అమ్మే సరుకులకు రూపాయికి ఐదు రూపాయిలు లాగుకుంటున్నారనీ" వ్రాశాడు. ఇదీ కంపెనీ వ్యాపారస్వేచ్ఛ ! కనుక బెంగాలు నేత పారి

ప్రాపికులు అల్లాడిపోయారు. 1857-80 ల మధ్య బెంగాలునుండి ఇంగ్లాడుకు రు 50,00,00,000 (ఇప్పటి 400,00,00,000 రూపాయలు) తరలి పోయాయి. ఐతే, ఆంగ్లేయుల ఈ అధికలాభాల వ్యామోహం భారత దేశంలో ఎంత దారుణమైన నిరుద్యోగ ప్రమాదంలో ముంచెత్తిందో గమనార్హం.

## ప్రజా జీవిత సంక్షోభం

పైగా భారతదేశం ఈ దుర్భరదశలో గన చిరకాల జాడ్యమైన కరువుల ప్రమాదాన్ని కూడ తట్టుకొనే శక్తిని కోల్పోయింది. 50 యేండ్లలో 24 సార్లు కరువులు వచ్చి 20,00,000 జనం ఆకలికి ఆహుతియై పోయారు. (1850-1900). ఈ దీనావస్థలో తల్లులకు కన్న పిల్లలు బరువై దేశంలో ధనికుల ఇండ్లలో అమ్ముకోబడిన 5?,00,000 బానిస లేర్పడ్డారు. ఎందరో తల్లి దండ్రులు తమ సంతానాన్ని గంగానదిలో పడ వేసేవారుకూడా. కుటుంబంలో స్త్రీల బ్రదుకు దుర్భరమైనది. దేశంలో దారి దోపిళ్ళుచేసే థగ్గులు ప్రబలి పోయారు; వీళ్ళ జేబుగుడ్డలతో బాటసార్లను ఉరితీసే పైశాచిక మనస్తత్వానికి లోనైనారు. ఇలా భారత దేశంలో యుద్ధాల భయం, దాడులభయం, కరువుల భయం, దారిద్ర్యభయం, ఒక్కుమ్మడిగా ముంచెత్తాయి. ఐతే బ్రిటిష్ స్వేచ్ఛా వర్తక దోపిడీదారు పన్నులు రు. 19,300,000 వసూలు చేశాడు; కాని నూటికి ఒక్క పాలుకూడా ప్రజలకోసం వినియోగపరచేలేదు.

ఇక ఆనాటి భారతదేశంలో సాంఘిక పరిస్థితు లెట్లున్నాయి? సామాన్యప్రజలు మధ్యతరగతికీ, మధ్యతరగతి భూస్వామ్య ధనికతరగతులకూ లోబడియుండే వారు. చదువుసంధ్యలు పైతరగతులవారికి మాత్రమే. ఆ చదువులుకూడా ఏమిటి? కొందరు వేదాంతం నేర్చుకొనేవారు. మరికొందరు కర్మకాండా, జ్యోతిషమూ, లేక వేదమూ వల్లించేవారు ఇది బ్రాహ్మణుల విద్య. కొందరు బ్రాహ్మణులూ, తదితరవర్ణాల ధనికులూ సాహిత్యం, అలంకార శాస్త్రంకూడ నేర్చుకునే వారు. ప్రాథమిక గణితం, సంస్కృతం, లేక పార్సీ భాష, దానితో బాటు ప్రాంతీయభాషకూడ నేర్పబడేవి. మతంయొక్క అధికారం చాలా బలమై యుండేది. పైతరగతుల్లో స్త్రీలకు ఘోషాపద్ధతి, ఇంటింటా వితంతువులు, బహుభార్యలు, వారితో బాటు ఉంపుడుకత్తెలుకూడా ఉండేవారు. ఒక్క కలకత్తాలోనే మొత్తం 500 వరకు సహగమనాలు జరిగేవి. ఒకవంక ఛాందసాచారాలూ, మరోవంక అన్యాయాలూ కలిసియున్న యాంత్రిక ఆచారదాస్యం జీవితాన్ని శాసించేది. సామాన్యప్రజల జీవితప్రమాణం చాలా మన్నలమై యుండేది. గంజీ - అంబలీ త్రాగి బ్రదికే పేదలే సామాన్యప్రజలు. త్రాగుబోతుతనం కూడ అధికమే. స్వేచ్ఛగా ఆలోచించటం, ఆచారాలను మార్చటం, మానవ వ్యక్తిత్వాన్ని గుర్తించడం మున్నగు అవకాశాలు కేవలం మతాచార్యులూ, సంస్థానాధీశులూ, సేనానులూ, కోటీశులవరకే పరిమితం. సామాన్యప్రజల్లో అదృష్టంపై గ్రుడ్డినమ్మకం, దేవతలూ దయ్యాలూ, చేత బళ్ళుమూర్చిన మూఢ నమ్మకాలూ, బలులూ, కొలుపులూ, తందనాలు మున్నగు దురాచారాలు బలంగా ఉండేవి. పై తరగతుల్లో భోగలాలసత్వం మరహంకారం తాండవిస్తూ ఉండేవి. రహదార్లూ, రాకపోకల సౌకర్యాలుకూడ ప్రమాద భరితమైనవే.

మరి ఇలాంటి ప్రజలు ఈస్టిండియా కంపెనీని ఎలా ప్రతిఘటించారని ఒక సందేహం వస్తుంది. నిజమే ఐతే 1800 కు లోపు జరిగిన బ్రిటిష్ వ్యతిరేక ప్రతిఘటనలు రాజకీయ చైతన్యంతో సువ్యవస్థితమైన ఉద్యమాల రూపంలో లేవు. అవి కంపెనీ దౌర్జన్య చర్యలకు గురియైన సంస్థానాధీశులూ, లేక రైతాంగమూ కుటీర పారిశ్రామికులూ తమ ఆగ్రహావేశాలను పట్టలేక బ్రిటిషు పాలకులపై జరిపిన ప్రతీకార చర్యలే. ఆ కారణంవల్లనే ఆనాటి ప్రతిఘటనలు కంపెనీ దౌర్జన్యాలను జయప్రదంగా తిప్పికొట్టలేకపోయాయి. పైగా ఆనాటి బ్రిటిషు వ్యతిరేక పోరాటానికి ముఖ్య సారథి భూస్వామియే. ఆ సంస్థానాధిపతుల్లోను సంకుచిత వ్యక్తి స్వార్థం, ముఠాఅధికారదర్పం, పగ, అనైక్యత విపరీతం. దానికితోడు బ్రిటిషుఆక్రమణదార్ల ఆయుధ సంపత్తి, సైన్యతంత్రమూ రాజ్యాంగ చైతన్యమూ, నౌకా సంపదా ఉచ్చతర పరిణతి గలవని కూడ సువిదితమే.

ఐతే ఇక్కడే 1857 నాటి దేశవ్యాప్త బ్రిటిష్ ప్రతిఘటన మహాపోరాటం వస్తుంది. ఈ పోరాటం భారతీయ స్వాతంత్ర్య మహోద్యమానికి ప్రగాఢమైన పునాదులువేసి ఝాన్సీ లక్ష్మి, తాంతియాతోపే, అయోధ్య బేగం, నానాసాహెబ్, కుమార్ సింగ్ లాంటి అమరజీవులనూ, కుంపిణీ బాంధవులు నిజాం, జంగ్ బహద్దర్, గ్వాలియర్ సినకర్ రావులనూ దరి

త్రలో అవి స్మరణీయులు నోనర్చినవి. ఆ ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర 'సందేశం' పాఠకులకు సుపరిచితమైనదే.

## నిర్మాణాత్మక పార్శ్వం

ఈస్టిండియా కంపెనీ పరిపాలన దారుణమైనదే. కనుక 1784లో డికెన్సన్ "ఇండియాను వదలిపెట్టినా బ్రిటిష్ సామ్రాజ్యం నాశనమౌతుంది. పోనీ దాన్ని ఇలాగే అట్టిపెట్టుకున్నా మనల్ని ఆర్థికంగా క్రుంగదీసి అంతం చేస్తుంది." అని తన వ్యథ వెళ్ళబుచ్చుకున్నాడు. దేశంలో కంపెనీ స్థిరపడిపోవాలి - కాని అందుకు "దోపిడీ దొంగల" మనస్తత్వం నిరుపయోగమే ఔతుందని ఆయన భావం. నిజమే, ఏ ఆశ్రయమూ లేకుండా విదేశీయ వర్తకులైన కంపెనీ పాలకులీ దేశంలో కాలూని నిల్చేదెట్లాగ అన్నదీ సరైన సందేహమే... కనుక ఇక మనం ఆపార్శ్వాన్ని విలోకిద్దాము.

మార్క్స్ 1853 లో వ్రాసింది గమనార్హం. ఆయన "ఇంగ్లాండు భారతదేశంలో ఒక మహోన్నతమైన సాంఘిక విప్లవం కొనసాగిస్తూ ఉంది; కాని అలా చేయడంలో ఉద్దేశాలుమాత్రం శోచనీయమైనవే" అన్నారు. ఐతే ఇంగ్లాండు భారతదేశంలో కొనసాగించిన సాంఘిక విప్లవం ఏమిటి ?

మార్క్స్ టెలిగ్రాఫ్ యంత్రం భారతదేశైక్యతకు పునాదులు వేసిందని వ్రాశారు. క్రైస్తవ ఫాదరీలే ప్రారంభించినప్పటికీ భారతదేశంలో పత్రికలు కొన్ని వెలువడసాగాయి. రైత్వారీ సెటిల్ మెంటులో గ్రామాల్లో భూమి హక్కు గల్గిన రైతులు ఉదయించారు. ఆవిరి యంత్రం రవాణా సౌకర్యాలలో విప్లవం కొని తెచ్చిందని కూడ మార్క్స్ పేర్కొన్నారు. కంపెనీ పరిపాలనక్రింద భారతదేశంలో స్వేచ్ఛా వ్యాపారపు చైతన్యం ప్రసరణైనది. రోడ్లు, రైల్వే లైనులు వెలసినవి. ఫాదిరీలుకూడ దేశంలో నూతన విజ్ఞానభావాలు ప్రసారం చేశారు... దేశంలో క్రమంగా ఆధునిక విద్యాధికులైన యువకులు విస్తరణ జెందుతూ పరిపాలనా యంత్రాంగంలో భాగస్వాములు కాజొచ్చారు.

ఒక ఉదాహరణగా విద్యాసమస్యను తీసుకుందాం. 1781 లో వారెన్ హేస్టింగ్స్ కలకత్తాలో ఒక సంస్కృత పాఠశాల పెట్టించాడు. 1792 లో బనారస్‌లో అలాంటిదే మరొకటి వెలసింది. 1813 లో మరొక మత - నైతిక పాఠశాలకు బ్రిటిష్ పార్లమెంటు అనుమతించింది. ఐతే ఆ పాఠశాలలో పాతకాలపు సంస్కృత వ్యాకరణ, తర్క, వేదాంత అలంకార శాస్త్రాలకు బదులు ఆంగ్లభాషాబోధనకూ, ఆధునిక విద్యకూ అవకాశాలు కల్గించాలని రాజా రామమోహన రాయ్ పోరాడారు. ఆ నాటి విద్యావేత్తల్లో ఆంగ్ల విద్యను ప్రోత్సహించాలనేవారూ, సనాతన సంస్కృత విధానాన్ని అనుసరించాలనేవారూ (Anglicist and orientalists) రెండు తెగలు. ఆంగ్ల విద్య అన్నా, విదేశయానం అన్నా, సంస్కరణ భావలన్నా సమాజంలో వ్యతిరేకత తీవ్రం. కనుక ఆంగ్ల విద్య గడింప సాహసించే విద్యార్థుల సంఖ్య చాల స్వల్పం. ఐనా, ఆంగ్ల విద్య గడించేవారి సంఖ్య స్వల్పమైనప్పటికీ, ఆ విద్యా విధానం దేశభాషల ద్వారా త్వరలోనే ప్రజల్లో ప్రసరణ చెందుతుందని రాజా రామమోహనరాయలు వాదించారు. ఈవాదనను "ఫిల్ట్రేషన్ థియరీ" అంటూ మెకాలే ప్రభృతి విద్యావేత్తలు బలపరిచారు. క్రైస్తవ [illegible]తో తోడ్పాటుకూడా దొరికింది. దీనిఫలితంగా కలకత్తా ప్రభుత్వ విద్యాలయానికి గల లక్ష రూపాయల గ్రాంటులోనుండే కొంత ఆంగ్ల విద్యా ప్రచారానికి వినియోగించుకోవచ్చని ప్రభుత్వం ఆమోదించింది. ఇలా ఆధునిక విద్యా ప్రసరణకు పునాదులు పడ్డాయి.

1800 లో ఆవిరియంత్రం ఆవిష్కరణై, పారిశ్రామిక విప్లవానికి దార్లువేసింది; త్వరలోనే 1818 లో కలకత్తాలోను, 1854 లో బొంబాయిలోను, 1877 లో నాగపూర్‌లోను, అహ్మదాబాద్ షోలాపూర్‌లలోను వస్త్రం మిల్లులకు శంకుస్థాపన జరిగింది. ఇవి 1900 నాటికి 193 వరకు పెరిగాయి.

దీనిఫలితంగా పాలకు ఇంగ్లాండుకు ఇష్టమున్నా లేకున్నా 1879 లో నూటికి 8 వంతులు మాత్రమే ఉన్న భారత ఎగుమతులు 1890 లో నూటికి 28 వంతులు హెచ్చి బ్రిటిష్ దిగుమతులు నూటికి 65 నుండి 53కు పడిపోయాయి.

పారిశ్రామికరంగంలో బ్రిటిష్ పెట్టుబడులకూ, జాతీయ పెట్టుబడులకూ వైరుధ్యం 1857 నాటికే రూపొందింది. ఐతే పిదపటి జాతీయోద్యమంలో స్వదేశీ పెట్టుబడుల ప్రాధాన్యం సర్వోపరియైనది. ఈ ప్రాధాన్యత పోరాటంలోను, పునరుజ్జీవనంలోను ప్రత్యక్షంగా నేమి, పరోక్షంగా నేమి ప్రసరణ చెందితీరినది. ఈ అభివృద్ధి ప్రేరణయే రాజా రామమోహనరాయలనాటి ఏకైక ఆంగ్లవిద్యాలయ కృషిని 1857 నాటికల్లా కలకత్తా విశ్వవిద్యాలయం, 1887 లో

బొంబాయి యూనివర్శిటీ మున్నగు పెక్కు విద్యా విజ్ఞాన మందిరాల ప్రసరణగా విస్తృతపరచినది. ప్రభుత్వోద్యోగ నిర్వహణ ఆవశ్యకతకూడ క్రమ క్రమంగా పెరిగినది. కొందరు ఫాదరీలతో వుడ్ కమిటీ స్థాపనై ఉన్నతవిద్యా ప్రణాళిక రూపొందినది. క్రమంగా విద్యాశాలలు, న్యాయస్థానాలు, ఆస్పత్రులు, ఇతర ప్రభుత్వకార్యాలయాలు స్థిరస్వరూపంలో విస్తరించసాగాయి.

## జాతీయ చైతన్య వికాసం

1857 పోరాటం వృథాకాలేదు. అది ఈస్టిండియా కంపెనీని తుడిచిపెట్టింది. 1858 లో రాణిగారి ప్రకటన వెలువడటం, ఆ ప్రకటన భారత జాతీయతను సామరస్యపూర్వకంగా గుర్తించటం, 1875 లో ఇంగ్లాండురాణి భారతదేశ రాణిగా అవతరించి 1876 నుండి భారతీయ ప్రముఖులకు బిరుదప్రదానాలు చేయసాగడం జరిగినది. క్రమంగా దేశంలో ప్రముఖ పారిశ్రామికులు, బ్యాంకర్లు - వర్తకులు, లాయర్లు, ఆఫీసర్లు, ఇంజనీర్లు మున్నగు పురోగామశక్తుల విస్తృతి హెచ్చి సమాజంలో భావవిప్లవావరోధం తొలగినది.

దీనంతటి పర్యవసానంగా 1885 నాటికి భారత జాతీయ కాంగ్రెసురూపొందటమూ, 1882 లో దీనికి నాందిగా బ్రిటిష్ పార్లమెంటు భారతీయ పత్తి దిగుమతులపై సుంకాలు తొలగించటాన్ని రజనీపామిదత్ తన 'ఇండియా టుడే' గ్రంథంలో పేర్కొన్నారు.

1850-1900 లకు మధ్య పునరుజ్జీవన శరవేగంతో పురోగమించినది. సమాజంలో తీవ్ర అసమాభివృద్ధి జరిగినది. పట్టణాలలోని వర్తకులు (బ్యాంకర్లు-పారిశ్రామికులు) పల్లెటూరి చైతాంగాన్ని విపరీతంగా దోచుకునేవారు. డబ్బు చెలామణీ, జీవితావశ్యక వస్తువుల ధరలూ పదిరెట్లు హెచ్చినవి. ధనవంతులూ, లిటిగెంటులూ న్యాయాలయాలను, ప్రభుత్వ కార్యాలయాలను వినియోగపరచుకొని రెండు చేతులా డబ్బు గడించేవారు. దొంగసాక్ష్యాలూ, పక్షపాతాలు ఎత్తుగడలు ఆఫీసు వ్యవహారాల్లో నిరాఘటమైనవి. ఈ సాధనాలద్వారా చేతికైనవారు పరుల ఆస్తులనూ, భూములనూ ఊడలాగుకొనే అవకాశం హెచ్చినది. షాహుకార్ల వడ్డీలు పేదలకు ప్రాణసంకట మైనాయి. జమీందార్లు, ధనవంతులు దురహంకారులుగాను, భోగలాలసులుగాను, వేశ్యలు, త్రాగుడు, జూదం మున్నగు వ్యసనాలకు లోనైనవారుగాను ఉండేవారు.

పల్లెలంగడిని పట్నం దుకాణమూ, పట్నం దుకాణాన్ని దానికంటె పెద్దదైన హోల్ సేల్ షాపూ ఇలా చిన్నచేపను పెద్దచేప మ్రింగివేసే "వర్తకపోటీ" కొనసాగి, తుదకు గుత్తపెట్టుబళ్లలో ధనరాసులు పేరుకొనిపోయే పెట్టుబడిదారీ అనుక్రమం వర్ధిల్లింది. దాదాపు ఇలాంటి సామాజిక పరిస్థితుల్లో ధనిక - మధ్యతరగతి చైతన్యంతో జాతీయోద్యమంలో పనిచేసినవారే ఆకాలపు సమాజ సంస్కర్త లంతా. నాటి సంస్కరణోద్యమపు ఆంధ్ర వైతాళికులు కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారి నిక్కడమనం విస్మరింపలేము.

జాతీయ పునరుజ్జీవనలో "సంస్కరణోద్యమ"మే ప్రథమ సోపానం. క్రైస్తవ ఫాదరీలు దేశంలో నూతన భావాలను ప్రవేశపెట్టారు. ఆ భావాలు యువకశక్తులలో బలమైన ప్రభావం వేశాయి. ఐతే పరిణతతర దశలో అవి ప్రతి ప్రభావంగాకూడ పనిచేయసాగినవి. ఫాదరీల ఉద్దేశం భారత జాతీయతను పెంపొందించాలని కాకపోవచ్చు. కాని క్రైస్తవ మిషనులు దేశీయాభిమానం గల్గిన పలు సంస్కరణ సంస్థలకు దారి చూపటంమాత్రం జరిగినది. ఐతే, ఈ అంశాన్ని ఆధారాలతో నిరూపించే అగత్యముండదనుకుంటాను.

## సంఘ సంస్కరణోద్యమం

1828 లో వంగ ప్రాంతంలో బ్రహ్మ సమాజం స్థాపింపబడింది. మరికొంత కాలానికే దయానంద సరస్వతి పంజాబు ప్రాంతంలో ఆర్యసమాజం స్థాపించాడు. అలాగే తొలి ముస్లిం మతసంస్కర్త సర్ సయ్యద్ అహ్మద్ కూడ కృషిసాగించాడు. కాలక్రమంలో ఈ మూడు సంస్థలూ వేసిన సిద్ధాంత బీజాలు కాంగ్రెసు, హిందూమహాసభ, ముస్లింలీగు రాజకీయాలుగా పరిణతి చెందాయేమో ననిపిస్తుంది! మరొకవంక రామకృష్ణ మఠం, బిసెంటమ్మ థియొసఫికల్ సొసైటీ పని చేశాయి. మహారాష్ట్రలో రనడే ప్రార్థన సమాజం రూపొందినది. ఈ సంస్థల కృషినీ, దాని ప్రభావాన్నీ స్థూలంగా ఇక్కడ గమనిద్దాము.

బ్రహ్మ సమాజం: వంగ ప్రాంతంలో చైతన్యప్రభు 'ప్రేమ - భక్తి' సిద్ధాంత ఆధారాన్ని బ్రహ్మ సమాజం అనుసరించింది. 'హిందూ - క్రైస్తవ మతాల మౌలికాశయం మానవోద్ధరణయే' గనుక, ఈ రెంటిలోని మంచినీ సమన్వయింపబూనుకుంది. మత భేదాల పేరిట ద్వేషాలు, సంకుచితత్వాలు కూడదని వాదిం

చింది. సమిష్టి ప్రార్థనలను ప్రవేశపెట్టింది. ఈ నూతనోద్యమం ద్వారా హిందూ సమాజంలో గల కర్మకలాపాలు, మూఢాచారాలు, విగ్రహారాధనలూ, బలులూ మున్నగువాటిని బ్రహ్మసమాజం నిరోధించింది.

సాంఘికంగా బాల్యవివాహాలను, బహుభార్యాత్వాన్ని, సహగమనాన్ని ఖండిస్తూ హిందూకుటుంబ సంస్కరణను ప్రబోధించింది. ఐతే కులతత్వాన్ని (వర్ణవ్యవస్థ) బ్రహ్మసమాజం ఖండనచేయలేదు. కనుక అది ఉన్నతవర్గాలకు కే సీమితమైనప్పటికీ, సమాజంలో బలమైన భావవిప్లవం కల్గించినది. బ్రహ్మసమాజం దేశభక్తిని ప్రబోధం చేస్తూ సంఘంపట్ల వ్యక్తి కర్తవ్యాన్ని జాగరితం చేసినది.

ఆ కాలంలో సముద్రయానం బహిష్కారానికి గురి అయ్యేది! రాజా రామమోహనరాయలు భారతీయ స్వయం రాయబారిగా ఇంగ్లాండుకు ప్రయాణమైనాడు. ఆయన దేశభక్తి, ఆత్మాభిమానమూ ఎలాంటివంటే, తన ప్రయాణంలో ఆయన ఫ్రెంచివిప్లవ సానుభూతి సూచకంగా ఒక ఫ్రెంచి నౌకలోనే ప్రయాణం చేశారు. ఆయన 1833లో ఇంగ్లాండులో మరణించారు.

పిదప బ్రహ్మసమాజానికి వంగప్రాంత ప్రముఖ బ్యాంకర్ మహర్షి దేవేంద్రనాథఠాగోర్ నాయకత్వం వహించాడు. ఈయన మహానిర్వాణ తంత్రమని ఒక సిద్ధాంతం లేవదీసి, తత్వబోధినీ పత్రిక నడిపారు. పిదప అక్షయకుమారదత్త నాయకత్వం చేబట్టారు. ఈయన వైదిక మతాన్ని తీవ్రంగా ఖండిస్తూ ఉపనిషత్ సిద్ధాంతాలను ప్రచారంచేశారు. ఆపైన కేశవచంద్రసేన్ ఆచార్యుడైనాడు. ఈయన నూతన బ్రాహ్మణత్వ (Neo Brahmin) మని ఒక సిద్ధాంతం చేశారు. ఈయనను అనుయాయులు ఆదర్శపురుషుడుగా దైవంవలె ఆరాధించేవారు. ఈయన కాలంలో బ్రహ్మసమాజానికి 52 శాఖ లేర్పడ్డాయి. బ్రహ్మ సమాజ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా కేశవచంద్రుడు తన కూతురు కూచ్‌బీహార్ మహారాజా కిచ్చి బాల్యవివాహం జరిపించాడు. ఈ నియమోల్లంఘన బ్రహ్మసమాజాన్ని బ్రద్దలుచేసి, సద్ధర్మ బ్రహ్మసమాజమని ఒక క్రొత్తశాఖకు దారితీసింది. ఐతే యీ సంఘటన ద్రావిడకజగంలో రామస్వామి నాయకర్ వృద్ధవివాహంవల్ల కల్గిన పేచీలాంటిదే.

బ్రహ్మసమాజం మహిళోద్ధరణంలోను కృషిచేసింది. వితంతు వివాహాలు, నాచ్ గానాల నిరోధం, పరదా పద్ధతి తొలగింపు, స్త్రీ విద్య, బాల్యవివాహ నిషేధం, పతితస్త్రీల పునరావాసం మున్నగు కార్యక్రమాలననుసరించినది.

## ఇతర ఉద్యమాలు

రామకృష్ణ పరమహంస ఆధ్యాత్మిక బోధ హిందూ సమాజ సంస్కరణను మరొక దృక్పథంతో చూచినది. బ్రహ్మసమాజంవలెనే రామకృష్ణమిషన్ కూడ మత సామరస్యాన్ని ప్రబోధించినది. కాని ఎవరెవరి కుల మతాలను వారు అనుసరించాలని, ఔరంగజేబు దాడులకూ ఫాదరీల తాకిడికీ తట్టుకొని నిల్చిన హిందూధర్మం విశ్వ మహామతములలో మహోత్తమమైనదనీ రామకృష్ణ మిషన్ భావిస్తుంది. విగ్రహారాధననూ, సాత్విక పూజా పునస్కారాలనూ, యోగమార్గాలనూ అవి చిత్తైకాగ్రతసాధనకూ, భావ పరిణామానికీ సాధనలంటూ సమర్థిస్తుంది. అద్వైత ప్రచారానికై ఆత్మశక్తి జాగరణకై, వివేకానందుడు బహు గ్రంథాలు వ్రాశారు. చికాగో మత సమ్మేళన సభలో ప్రాచ్యాని గంభీరంగా ఉపన్యసించారు. విదేశాల్లో పర్యటించారు. ఐతే రామకృష్ణమఠం ఆర్తులకూ, బాధితులకూ శక్తికొలది దానధర్మాలద్వారా తోడ్పడుతుంది.

ఆర్యసమాజం : తీవ్ర సంస్కరణ శీలమైన బ్రహ్మసమాజమూ, మతవాదయుతమగు రామకృష్ణ మఠమూ కంటె ఆర్యసమాజం వేరేమార్గం త్రొక్కినది. ఋషి దయానందుడు "కృణ్వంతో విశ్వమార్యమ్" అంటూ జాతి నినాదం తీశాడు. జర్మనీలో జాన్ హస్‌వలె ఈయన వేదాలను సంస్కరించి భాష్యం వ్రాశారు. వేదాన్నీ, వైదిక ఆచారాన్నీ ఈయన ప్రమాణంగా తీసుకున్నాడు.

ఈయన 'సత్యార్థ ప్రకాశిక' అని ఒక గ్రంథం వ్రాసి పార్శీక, బౌద్ధ, జైన, సిక్కు, క్రైస్తవ, ఇస్లాం మతగ్రంథాలను తీవ్రంగా ఖండించారు. ఆర్యసమాజం జంతుబలులనూ, విగ్రహారాధననూ, మద్య మాంసాహారాలనూ, గోహత్యలనూ తీవ్రంగా ఖండిస్తుంది. దయానందుడు "శుద్ధికార్యక్రమాన్ని" ప్రవేశపెట్టాడు. అంటే అన్ని కులాలవారికీ, మతాంతరులకూ, స్త్రీలకూ సంధ్యావందన కర్మలు విధించడంద్వారా ఇటు సనాతన బ్రాహ్మణులనూ, అటు క్రైస్తవ ఫాదరీలనూ ఎదుర్కొన్నాడు. ఈయన అనంతరం శ్రద్ధానందుడు, లాలా లజపతిరాయ్, లాలా హంసరాజ్, పండిత గురుదత్ ఆర్యసమాజప్రచారం కావించారు. కాంగ్రె

మున్నగు గురుకులాలు నెలకొల్పారు. అన్ని మతాలనూ, సిద్ధాంతాలనూ బహిరంగ శాస్త్రార్థ సభల్లో సవాలుచేసి ఎదిరించిన ఆర్యసమాజ పండితుల నైతిక సాహసం ప్రశంసనీయమైనది.

పై సంస్థలతోపాటు మదరాసులో 1886 లో స్థాపనైన దివ్యజ్ఞాన సమాజం కూడ ఒక పెద్ద సంస్థయే. దీనికి నాయకురాలు అనీబిసెంట్. థియోసఫిస్టులు ఆధ్యాత్మిక సిద్ధులపై నమ్మకం గలవారు. సమాజం దక్షిణ ప్రాంతంలో అనేక శాఖలు నెలకొల్పింది. మరియు మదరాసు నగరంలో అడయార్‌లోగల ఈ సంస్థ కార్యాలయంలో అనీబిసెంట్ ప్రశంసాపాత్రమైన ప్రాచ్యతాళపత్ర గ్రంథాలయాన్ని నెలకొల్పింది. ఈ సొసైటీలో గోపాలకృష్ణగోఖలే కూడ పనిచేశారు.

బ్రహ్మసమాజంవలెనే జస్టిస్ రనడే మహారాష్ట్రములో ప్రార్థన సమాజం నెలకొల్పారు. పిదప సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ నెలకొల్పారు. ఆంధ్రలో కందుకూరి వీరేశలింగంగారు బ్రహ్మసమాజాన్ని నెలకొల్పారు. ఇంకా ఇలాగే అనేక చిన్న పెద్ద సంస్కరణ సంఘాలు ఆ కాలంలో ఆయా ప్రాంతాల్లో రూపొందాయి. ఈ సాంఘిక ధార్మిక సంస్థలు పలురంగాల్లో పనిచేశాయి. యువకులకూ, మహిళలకూ ఉద్యమాలు నిర్మించారు. ఈ సంస్థలు సమాజ శీలతనూ, పౌరస్వత్వ చైతన్యాన్ని, ఆత్మ విమర్శనూ, స్వయంనిర్ణయ సత్తానూ దేశంలో మేలుకొల్పసాగినవి. సనాతన సంకుచితత్వాన్నెదిరించిన బ్రహ్మసమాజమూ, కులమత వ్యవస్థను సవాలుచేసిన ఆర్యసమాజమూ, విశ్వప్రేమను ఉత్తేజపరచిన రామకృష్ణమిషన్, ఆత్మజిజ్ఞాసను పురికొల్పిన దివ్యజ్ఞాన సమాజం భారత జాతీయ స్వావలంబనోద్యమంలో ఉదయించినవే. కాని అప్పటి కవి ఇంకా క్రొత్త. కనుక ఈ సంస్థల చైతన్య పరిణతిలో భావ అసమగ్రతలూ, తికమకలూ ఉన్నా; అలా ఉండటం సహజమే కూడ. బ్రహ్మ సమాజంలో ప్రార్థనల మోజేమి, ఆర్య సమాజంలో హవనాలూ, జంధ్యాల వ్యామోహమేమి, థియోసఫిస్టులలో తపశ్చర్య భ్రాంతియేమి - ఇవి చాద స్తాలే. ఐనా ఈ సంస్కరణోద్యమాలు భారత ప్రజల్లో ఆలోచనను రేకెత్తించాయి. జాతిని మేల్కొల్పినవి. వ్యక్తి వికాసానికి దారులు వేసినవి ఆశావాదాన్ని నెలకొల్పినవి. ఈ అన్ని ఉద్యమాల లక్ష్యమూ బ్రిటిష్ పాలకుల ఆధిక్యతను సవాలు చేయుటమే; కనుక అవి జాతిలో నూతన స్వావలంబ నిర్మాణశక్తిని జాగరితం చేశాయి.

అది వైతాళికుల యుగం. ఆకాలంలో సాహిత్యరంగములో ప్రకాశమానులైన మధుసూధనదత్ (బెంగాల్), గాలిబ్ (యు. పి.), నర్మత్ (గుజరాత్), శివప్రసాద్ (బనారస్), చిప్లంకర్ (మహారాష్ట్ర), అజిత్‌సింగ్ (పంజాబీ) రాధానాధరాయ్ (అసాం) స్వామినాథ అయ్యర్ (తమిళం) వీరేశలింగం (ఆంధ్ర) రాజరాజవర్మ (కేరళ) మున్నగు మహాకవులు దేశంలో నూతన జీవితసౌందర్య నిర్మాణానికు రూపురేఖలు తీర్చారు. ఈ వైతాళికుల సూచికలో మనం గెటే, మాక్స్‌ముల్లర్, బ్రౌన్, స్మిత్, జోన్స్‌లను కూడ చేర్చటం సమంజసమే కాగలదు. క్రైస్తవ పాదరీలవలెనే వీరికృషికూడ జాతీయ సంస్కృతీ పునర్నిర్మాణానికి బ్రహ్మాండమైన ప్రోత్సాహం కల్గించింది.

పై సంస్కరణోద్యమ పునర్జీవన ప్రభావం విజ్ఞాన, కళా రంగాల్లోకూడ అనేక ఉత్తమ సంస్థలకు దారి చూపినది. 1884 లో పూనాలో స్థాపితమైన దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ, 1910 లో స్థాపనైన ఇతిహాస పరిశోధకమండలీ, 1888 లో బొంబాయిలో వెలసిన బొంబాయి ఆర్ట్స సొసైటీ, 1905 లో స్థాపనైన సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ, భండార్కర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, అనేక మహిళా సదనాలు మున్నగువాటిని మన మిక్కడ ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. ఆత్మ సంస్కరణకు గురియౌతున్న ఆనాటి విదేశ ప్రభుత్వ యంత్రంకూడ ఈ అభివృద్ధికి దోహదం చేసినది...

## రాజకీయ చైతన్యావతరణ

సంఘసంస్కరణోద్యమాలు తమ తొలిదశలో రాజకీయ పోరాటం లేకుండానే, కేవలం ప్రజల స్వయంసహాయ - స్వావలంబనలద్వారానే జాతీయ సమస్యలు నివారణ కాగలవని భ్రమపడ్డాయి. కాని "ప్రజలే ప్రజలను బాగుపరచే" సాంఘిక సంస్కరణ జాతీయవిమోచనకు తరుణోపాయం కాదనికూడ త్వరలో అనుభవక్షేత్రం గుర్తింపజేసింది. ఫలితంగా రాజకీయ చైతన్యం ఉద్గతమైనది. దానిఫలితమే 1885 నుండి దేశస్వాతంత్ర్య సాధనవరకూ భారత ప్రజల రాజకీయపోరాటానికి కార్యక్షేత్రమైన జాతీయ కాంగ్రెస్ చారిత్రిక అవతరణ. ఐతే

ఆనాటి ప్రముఖ దేశ సంస్కరణవాదు లందరికీ "కాంగ్రెస్ వేదిక" సమిష్టి ఆయుధంగా రూపొందిన దనేదే సువిదితమే.

ఇలా మనం జాతీయ పునరుజ్జీవనలో ఉత్తరదశలో కాలు మోపుతాము.

రాజకీయ చైతన్యావతరణలో భారత జాతీయ పునరుజ్జీవన ద్వితీయ దశకు చేరుకుంది ప్రాచీనసమాజ చరితను పునరుద్ఘాటితం చేయదలచిన (Revivalist) మత సంస్కరణలూ, వ్యక్తుల మహనీయతపై గుడ్డి నమ్మకం (Hero worship) వ్యాకతిశీల వీకపక్షవాదం మున్నగు ధోరణులు క్రమంగా వెనుకబట్టినవి. రాజ్యాంగ చైతన్యంతో సమిష్టి కృషి ద్వారా జాతీయ విమోచనకొరకై కృషి ప్రారంభమైనది....

## కాంగ్రెస్ అవతరణ

భారత జాతీయ కాంగ్రెస్ ఎలా అవతరించింది? బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పరిపాలనపై దేశంలోగల అసంతుష్టి నివారణకొక ఉపసన్మతి యంత్రం (Safety valve) గా ఉండాలని, ఒక పబ్లిక్ రిలేషన్స్ కార్యాలయం లాంటిదిగా ఉపయోగపడాలని ప్రభుత్వాశయం. ఈ దృష్టితో ఒక రిటైర్డుఆఫీసర్ హ్యూమ్ కాంగ్రెసును స్థాపించాడు. ఐతే జాతీయ స్థాయిపై ఒక రాజకీయ సంస్థ ఆవశ్యకతను ప్రజలుకూడ గుర్తించారు. తన ఉద్యోగం విషయంలో ప్రభుత్వ అక్రమానికి గురియైన సురేంద్రనాథ్ బెనర్జీ "భారతీయ సంఘాన్ని" నెలకొల్పి ఆగ్రా, లాహోర్, అమృతసర్, మీరట్, అలహాబాద్, ఢిల్లీ, కాన్పూర్, బనారస్, అలీగఢ్, లక్నో నగరాల్లో అదివరకే సింహగర్జనలు చేశాడు. బెనర్జీ కృషి బ్రిటిష్ పాలకుల హృదయాలను కంపింపజేసింది. ఫలితమే, జాతీయ కాంగ్రెస్ అవతరణ. 1887 లోను 1888 లోను కాంగ్రెస్ ప్రతినిధులకు గవర్నర్లు విందులు చేసేవారు. కాని ఆ విందులు త్వరలోనే ఎదురు తిరిగాయి. పేచీ మొదలైనది. "కాంగ్రెస్‌లోని ఈ కతిపయ ఉన్నతవర్గ విద్యాధికులు భారత ప్రజానీకానికి ప్రతినిధులు కారని" ప్రభుత్వమూ, "ఐతే జీతంరాళ్లకోసం పనిచేసే ప్రభుత్వోద్యోగులు భారత ప్రజలకు ఎలా ప్రతినిధులౌతార"ని కాంగ్రెస్ నాయకులూ (రమేశచంద్రమిత్ర) వాదులాడసాగారు. ఫలితంగా కాంగ్రెస్‌లో "ప్రభుత్వాధికార్లు పాల్గొనరాదనీ, ఆ సంస్థతో సహకరింపకూడదనీ" ప్రభుత్వ తాఖీదు...కాంగ్రెస్ మహాసభలో పాల్గొన్నందుకు ఒక ప్రతినిధిని రు 20,000 ధరావతు కట్టాలని కలెక్టర్ నిర్బంధించాడని అనీబిసెంట్ (How India wrought for freedom) అను గ్రంథంలో వ్రాసింది. ఐతే ఈ తగవులమధ్య రాజీ సూత్రం కూడా సాగుతూనే ఉంది; ఫలితంగా 1892 నాటికి కేంద్రంలోను ముఖ్యరాష్ట్రాలలోను ఎన్నికైన భారతీయ ప్రతినిధులకు సలహా కౌన్సిళ్ళలో ప్రవేశమిస్తానని ప్రభుత్వం అంగీకరించింది. ఈ కౌన్సిళ్ళకు రమేశచంద్రదత్తు తన "భారతీయార్థిక చరిత్ర" పీఠికలో స్వాగతమిస్తూ ఉన్నతోద్యోగాలలోకూడ భారతీయులకు అధిక ప్రాతినిధ్యాన్ని వాంఛించాడు."

మరోదిశన 1900 నాటికల్లా ప్రజా ఉద్యమాలు బలపడసాగాయి. వంగప్రాంతంలో బిపిన్ చంద్రపాల్ అరవిందుడు, మహారాష్ట్రలో తిలక్, గనడె పంజాబులో లాలాలజపతిరాయ్, మదరాసురాష్ట్రంలో అనీబిసెంట్ జాతీయ విమోచనకై తీవ్రంగా కృషి సల్పారు. ఈ ఆందోళన ఫలితంగా 1905 నాటికల్లా స్వదేశీ - స్వరాజ్య నినాదాలు రూపొంది, విదేశవస్తు బహిష్కార పోరాటం కొనసాగింది. 1908 లో ప్రభుత్వం తిలక్‌ను అరెస్టుచేసింది. ఆ అరెస్టుకు బొంబాయి, కలకత్తానగరాల కార్మికులూ, విద్యార్థులూ "సమ్మె" ల- ప్రదర్శనల ద్వారా తమ నిరసనను ప్రకటించి వేలాది సంఖ్యలో ప్రభుత్వ నిర్బంధాలను-హింసలను ఎదిరించారు. ఆయేడు పంజాబ్ రైతాంగం కూడ నిర్బంధాలకు గురియైనది.

## ప్రజా ఉద్యమమూ - నాయకత్వమూ

1916 లో తిలక్, బిసెంట్, సి. ఆర్. దాసులు హోమ్‌రూల్ నినాదమిచ్చారు. లక్షల సంఖ్యలో ప్రజావాహిని కదలింది. మరోదిశన గదర్‌వీరులు పంజాబులో సైనిక విప్లవాన్ని చవిజూపారు. 1918లో రౌలట్ బిల్లులు వచ్చాయి. బొంబాయి కార్మికవర్గం 1,25,000 సంఖ్యలో కదలి సమ్మెకట్టినది. నిరసనలూ సభలూ, ప్రదర్శనలతో దేశం అట్టుడికింది. 1919 లో డయ్యర్ జలియన్‌వాలాబాగ్‌లో నిరాయుధ దేశభక్తులను సైనికులతో కాల్పించాడు. 379 మంది మరణించి 1200 మంది గాయపడ్డారు. 1920 లో ఉద్రిక్తత హెచ్చి 50,00,000 మంది కార్మికులు సమ్మె చేశారు. 1921లో "స్వరాజ్యనినాదం" పిలుపిచ్చినది. అస్సాం, బెంగాల్ రైల్వే స్తంభించింది. మిడ్నపూర్ రైతుల పన్నులు నిల్చిపోయాయి.

మాస్టారె తులు తిరగబడ్డారు. పంజాబులో అకాలీలు విజృంభించారు. కలకత్తాలో విద్యార్థులు - కార్మికులు - కార్యకర్తలు లాఠీచార్జీల నెదుర్కొన్నారు. 30,000 మంది దేశభక్తులతో జైళ్లు నిండిపోవటమే గాక, ప్రభుత్వపన్నులు స్తంభించిపోయే ముప్పుకూడ తోడై ప్రభుత్వాన్ని కలవరపెట్టింది. దీనికి బొంబాయి గవర్నర్ 1922 లో "మనం ఇలాగే ప్రజలను ఎల్లకాలమూ అరెస్టులు చేస్తూ పోలేము తెలుసా ? అదీ వాళ్లు 31,90,00,000 మంది ఉన్నప్పుడు మరి" అని ఒక రిపోర్టులో వ్రాసుకున్నాడు. నిజమే. 1921 - 22 సంవత్సరం జాతీయ విమోచన పోరాటం వెనుకగల ప్రజానుసరణశక్తిని బహిర్గతం చేసింది.

కాని చౌరీ చౌరా అనే ఒక గ్రామంలో ప్రజలు తిరుగుబాటు చేశారనీ, కాంగ్రెస్ వాలంటీర్లు ఒక పోలీసు ఠాణాను ఆక్రమించారనీ గాంధీజీ పోరాటం విరమించారు. దీని ఫలితంగా కాంగ్రెస్‌లోని తీవ్రవాదులు సంస్థనుండి నిర్గమించి - మరో మూడేండ్లు (1925) నాటికల్లా ఆ సంస్థను తిరిగి స్వాధీన పరచుకొనటం జరిగినది...ఈసారి తీవ్రవాదులకు బదులు గాంధేయ నిర్మాణ కార్యకర్తలే విడిపోయారు. ఐతే, ఈ నిర్మాణ కార్యకర్తలు నాటినుండి నేటివరకూ ఇంచుమించు నగణ్యమైన నిర్మాణాత్మక ఫలితంగల కార్యక్రమాలు కొన్ని సాగిస్తూనే ఉన్న అంశం విదితమే...

భారత జాతీయ పోరాటంలో 1924 నుండి 1934 వరకు రెండు ధోరణులు గోచరమౌతాయి. ఒకటి ప్రజా ఉద్యమం ముందంజ; రెండవది రాజీబేరం. ఈ రెండు ధోరణుల మధ్య తీవ్రమైన సంఘర్షణఉంది. ఇది వామ పక్షశక్తుల, గాంధేయుల మధ్య గల వైరుధ్యమే నన్నమాట.

## కార్మికవర్గ చైతన్యం

1924 లో కాన్పూర్ కుట్రకేసు జరిగింది. కార్మికోద్యమ నిర్మాతలు డాంగే, షౌకత్ ఉస్మానీ, దాసుగుప్త, ముజఫర్ అహ్మద్‌లు నాల్గేండ్ల నిర్బంధానికి గురియైనారు. 1928 లో కార్మికుల సమ్మెలు 31,647,000 పని రోజులు స్తంభింపజేశారు. ఆ యేడే కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో 20,000 జన ప్రదర్శనతో వామపక్ష శక్తులు ఉపన్యాస వేదిక నాక్రమించి తీవ్ర విమర్శలతో మితవాద నాయకుల నిరుత్తరుల చేశారు. 1929 లో మీరట్ లో విచారణ జరిగి దేశంలోని కార్మిక నాయకులంతా నాల్గేండ్లు కస్టడీలో ఉంచబడ్డారు. 1930 లో కాంగ్రెస్ మళ్ళీ పూర్ణ స్వరాజ్య నినాదంతో శాసనోల్లంఘన పోరాటం ప్రారంభించింది. కాని ఏం జరిగింది ? చిటగాంగ్ ప్రజలు సాయుధ దాడి జరిపారు. పెషావర్ లో ప్రజలు ప్రభుత్వాన్ని స్తంభింప జేశారు. ప్రజలపైకి కాల్పులు సాగించటానికి నిరాకరించి, సైనిక వీరులు తీవ్ర నిర్బంధాల నెదుర్కొన్నారు. షోలాపూర్ లో ప్రజలు ప్రభుత్వ కార్యాలయాలను ఆక్రమణ జేశారు. 1930 పోరాటంలో 90,000 మంది దేశభక్తులు జైలుశిక్షల నాహ్వానించారు. ఆ యేడు బొంబాయి గవర్నర్ బొంబాయి నగరం విషయంలో "సైనికులూ, సాయుధ పోలీసు బలగాలే లేకుంటే ప్రజల వీరగ్రీవా మోదంతో బొంబాయి పరిపాలనను భారత ప్రజలు 42 గంటల్లో ఆక్రమించుకో గల్గేవా"రని రిపోర్టు వ్రాశాడు.

1933 లో పోరాటం సాగుతూనే ఉంది. దేశంలో 1,20,000 అరెస్టులైనాయి. 146 సమ్మెలు జరిగి 1,64,938 మంది పాల్గొని 21,68,961 పని దినాలు స్తంభించాయి. పోలీసుదాడులు, లాఠీఛార్జీలు, నిర్బంధాలు, సాముదాయక జుల్మానాలు, ఆస్తి జప్తులమధ్య 1934 లో 2,20,808 సమ్మెలుసాగి 47,75,559 పని దినాలు కోతపడ్డాయి. భారతీయ కార్మికోద్యమం యిలా విజృంభించినది.

ఒకవంక సామ్రాజ్యవాదంతో తీవ్రమైన పోరాటం, మరోవంక రాజీబేరం ఈ రెండు ధోరణులూ 1934 లో పోటీపడుతున్నాయి. కాంగ్రెస్ బాధ్యతాయుత పరిపాలనకు ఆయత్తమైనది. ఐనా, ఉభయ శక్తులకూ కేంద్రమైన కాంగ్రెసుసంస్థ సభ్యత్వం బ్రహ్మాండంగా పెరిగిపోతూఉంది. (1936 లో 6,36,000, 1937 లో 30,00,000, '38 లో 31,02,000, '39 లో 50,00,000 సభ్యత్వం). తీవ్రవాదుల నాయకత్వాన్నే ప్రజలూ, కాంగ్రెసు ప్రతినిధులు అభిమానిస్తున్నారు. (సుభాష్ చంద్రబోసు విజయాలు) ప్రజలు ముందుకూ, ప్రజా మంత్రులు వెనుకకూ పెనగులాడుతూ ఉన్నారు. ఈ స్థితిలో ద్వితీయ ప్రపంచ సంగ్రామం సాకుతో వైస్రాయి కాంగ్రెసుతో సంప్రతించకుండా దేశాన్ని యుద్ధంలోకి యీడ్చాడు; దీనికి నిరసనగా కాంగ్రెసు మంత్రులు రాజీనామా చేశారు. ఇలా మితవాదుల పదవుల పంపకం సమస్య తీరిపోయింది.

## సంస్కృతీ రంగంలో....

ఈ జాతీయోద్యమ భూమికలో సాంస్కృతిక పునరుజ్జీవన ఎలా సాగినది ?

1900 నాటికి నవచైతన్యంతో పునరుజ్జీవన ఉద్గమిస్తూ ఉంది. విద్యా,విజ్ఞాన, సంస్కృతీరంగాలలో బ్రహ్మాండమైన పురోగమనం కొనసాగుతూంది. ఒక ప్రముఖ విమర్శకుడు నిరూపించినట్లుగా (1) సాంఘిక విమర్శ, సంస్కరణ, స్వేచ్ఛాయుతవిశ్లేషణ, (2) ప్రాచీన - అధునాతన, ప్రాచ్య - పాశ్చాత్య చరిత్రల వాస్తవిక శోధన (3) మరియు ప్రస్ఫుటమూ విలక్షణమూ వాస్తవికమూఐన నూతననిర్మాణసంయోజనఅను ప్రధాన ధోరణులతో పునరుజ్జీవన పురోగమించినది. ఐతే ఈ పురోగమనానికి ప్రజల సానుభూతి బ్రహ్మాండమైన శ్రీరామ రక్షగా దోహదంచేస్తూ ఉంది.

జాతీయోద్యమనాయకులు స్వయంగా మేధావులు. వారు గ్రంథ ప్రకాశనద్వారా నూతన భావాలను ప్రసరింపజేశారు. వీరేశలింగం పంతులు (ఆంధ్ర), అమ్మవవలార్ (తమిళం), లక్ష్మీనాథ జేబ్ బారువా (అస్సామ్), బంకించంద్ర (వంగ), నర్మదా శంకర్ (గుజరాత్), భారతేందు హరిశ్చంద్ర (హిందీ), తిలక్-రనడేలు (మహారాష్ట్ర), భాయ్ వీరసింగ్ (పంజాబీ), దయారాంగిడ్మల్ (సింధి), రాధానాథరాయ్ (ఒరియా) ఇక్బాల్ (ఉర్దూ), మధుసూధనదత్ (ఆంగ్లం) మున్నగు సాహిత్య సంస్కృతీ వైతాళికులు పునరుజ్జీవన మహోద్యమానికి సారథ్యం వహించారు. ఇతిహాసాలు, చరిత్రలు, విజ్ఞానశాస్త్రాలు, పురాతత్వ పరిశోధలు, సాహిత్యరంగంలో నవలలు,జీవిత చరిత్రలు, నాటకాలు, కావ్యాలు అసంఖ్యాకంగా వెలువడసాగాయి. ఈ విజ్ఞాన, సాహితీ పురోగమనం మధ్యయుగపు యాంత్రిక ఆవరణలను అధిగమించి నూతన భావాలను ప్రేరేపించినది. ప్రచురణ సంస్థలు,గ్రంథాలయోద్యమం, సాహిత్య కళాసంఘాలు, సేవాసంస్థలు మున్నగు ఉద్యమాలు ఉద్గమనం చేశాయి. భాష జన బాహుళ్యానికి సన్నిహితమైన స్వభావ స్వరూపాలను నిర్మాణం చేసికొని భాషారాష్ట్ర భావనకుపునాదులు వేసింది.

మహిళారంగంలో డాక్టర్ కార్వే, శాస్త్రరంగంలో సి. వి. రామన్, జగదీశచంద్ర బోసు, గణిత శాస్త్రంలో రామానుజం, చిత్రకళారంగంలో రవివర్మ, అవనీంద్రులు, సాహిత్యరంగంలో రవీంద్ర శరచ్చంద్రులు, సంగీత కళలో భాత్ఖండే, ఓంకారనాథ్‌లు, నాటకరంగంలో బాలగంధర్వ, నాట్యకళలో ఉదయశంకర్, రామగోపాల్‌లు, వ్యాయామరంగంలో కోడి రామమూర్తి, గామాలు, తత్వజిజ్ఞాసలో అరవింద రామతీర్థలు, పరిశోధనరంగంలో భండార్కర్, చరిత్ర రచనలో పణిక్కర్ దాసుగుప్తలు మున్నగు మహా వ్యక్తులను జగద్విఖ్యాతులుగా చేసినది యీ పునరుజ్జీవన వెల్లువయే.

ఐతే తిలక్, సావర్కర్, నెహ్రూ మున్నగు జాతీయ నాయకుల నిర్బంధాలు కూడ వారి అమూల్య రచనలకు అవకాశాలైనవని మనం గమనించాలి. ఇలా కార్యక్షేత్రంలో కత్తిబట్టినవారూ, కలంబూనిన వారూ పునరుజ్జీవనలో తమతమ రంగాలలో అపారమైనకృషి చేశారు.

జాతీయ పునరుజ్జీవనలో పెడమార్గాలు త్రొక్కిన వారుకూడ కొందరు లేకపోలేదు. భారతరాజకీయాల్లో 1920_34 మధ్య సాంఘిక సమాలోచనలు ఇరుశాఖలైనవని మనం గమనించాము. అందులో ఒకటి గాంధీవాదం, మరొకటి తీవ్రస్వభావంగల సామ్యవాదశిబిరం.

## వర్గభేద సంకోచాలు

ఈ విభేదం భారతీయ సమాలోచకులను ముఖ్యంగా మధ్యతరగతిని రెండుతెగలుగా చీల్చింది. ఒకటి ధనిక వర్గ వ్యతిరేకతనూ, మరొకటి ధనిక వర్గంతో రాజీని ఆశ్రయించే ధోరణి. ఈ శాఖలకు చెందిన మేధావులలో గాంధేయులైన కృపలాని, జే. సి. కుమారప్ప, మహాదేవదేశాయ్, మష్రువాలా, మినూ మసాని, కే. యం. మున్షీ, పట్టాభిసీతారామయ్య మున్నగువారినీ సామ్యవాద శిబిరంలో హరీంద్రనాథ చటోపాధ్యాయ, ముల్కరాజ్ ఆనంద్, భవానిభట్టాచార్య, అబ్బాస్, రాహుల్ సాంకృత్యాయన్ --కృషన్ చందర్ మున్నగు వారినీ మన మిక్కడ పేర్కొనవచ్చు.

ఐతే సామ్యవాదశిబిరంలో మళ్ళీ రెండుశాఖలున్నాయి. ఒకటి కార్మికవర్గ చైతన్యం ఆధారంగాగల మార్క్సిస్టు దృక్పథం, మరొకటి మధ్యతరగతి మనస్తత్వంతో సాగే ప్రజాస్వామ్య సోషలిస్టుమార్గం. ఈ రెండు శాఖలకు ప్రతినిధులుగా మేధావులు చీలికైనారు. వీటికి ప్రతినిధులుగా మనం డాంగే, జయప్రకాశ్‌లను పేర్కొనవచ్చు. ప్రజాస్వామ్య సోషలిస్టులు గాంధీవాదానికి సన్నిహితులే.

వీటితోబాటు ఇక్కడ మనం హిందూమహాసభ, రాష్ట్రీయ స్వయంసేవకసంఘ ఉద్యమాలనుకూడా పేర్కొనవలసి యుంటుంది. ఇవి జాతి - మతవాద సిద్ధాంతాలు. వర్గచైతన్యాన్ని నరకుచేయకున్నా ఇవి ధనికవర్గ అనుయాయపంథాలే...ఐతే ఇవి తమ ఆకర్షణను త్వరలోనే కోల్పోసాగాయి...

1934 నాటికి జాతీయ పునరుజ్జీవనలో ఇలా విభిన్న సాంఘికశక్తుల ప్రభావం ప్రస్ఫుటంగా బహిర్గతమైన దన్నమాట. నాటినుండీ భారతీయసమాజంలో ఈ సాంఘికశక్తులన్నీ సంఘర్షణపస్తూ సిద్ధాంతక్షేత్రంలో ప్రసరించియే ఉన్నాయి.

ఈ దశలో రాజకీయాలకు అతీతమైన 'సాంస్కృతిక' వాదాలు అడుగున పడిపోయాయి. బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, దివ్యజ్ఞాన సమాజం, సేవాసదనాలు, గ్రంథాలయోద్యమం, సాహిత్య ప్రచురణలు, నాటక ప్రదర్శనలు మున్నగు సాంఘికోద్యమాల పురోగమనం స్తబ్ధమైపోయింది. సాహితీ సంస్కృతీ రంగాల్లోను నానావిధాలైన అక్షేపణ, నిరాశావాద ధోరణులు అలముకొన్నాయి. చాలమంది మేధావులు తమ "రాజకీయార్థిక అతీతత్వం" మూలాన జాతీయజీవితం నుండి వేరుపడి సాంఘిక శీలతనూ, పురోగాముకాంక్షనూ కోల్పోయి విభిన్న వ్యక్తివాద విభ్రాంతులలో పడిపోయారు. మధ్యతరగతి సమాజంలో ప్రతిభావులకు అవకాశాలు మృగ్యమై వారు తుప్పుపట్టిపోవలసిన పరిస్థితులు కరడుకట్టసాగాయి. దీనికి భారత సమాజంలో 1900 నుండి 1950 వరకు, 50 యేండ్లు గుత్తపెట్టుబడిదారీ విజృంభణ మూలకమైన అసమాభివృద్ధియే ప్రధాన కారణం. మధ్యతరగతి వైభవం క్షీణించటమేగాక, దానిముందు ఇటు కార్మికవర్గ ఆలంబననో, అటు ధనికవర్గావలంబననో, ఇటో అటో తేల్చుకోవలసిన సంక్లిష్టత ప్రారంభమైనది. ఔను. ఇటు స్వతంత్ర జీవనాభివృద్ధి అవకాశాలూ, అటు ఉద్యోగ విస్తరణావకాశాలూ రెండూ సంక్షోభంలో పడిపోయినప్పుడు వేరే గత్యంతరమేమిటి? పైగా జీవితప్రమాణమూ, ఆస్తి విభాగాలూ క్రమంగా పెరిగిపోతున్నాయి. ఇదే మధ్యతరగతి ప్రశ్న, మధ్యతరగతి సాంస్కృతిక జీవిత సమస్యకూడ.

కనుక మధ్యతరగతి సరదాలు మందగించాయి. పుస్తక ప్రకాశన, నాటక ప్రదర్శనలు, సాహిత్య గోష్టులూ - అవధానాలు ఇవి ఆకర్షణ గోల్పోయాయి. ఉన్నతాదర్శాల ఆసక్తి, వ్యక్తిగత హోదా (కీవి) ప్రదర్శన, ఆడంబరాలూ, దుబారాలు క్రమంగా అంతరించ సాగాయి. ఇలా మధ్యతరగతి "ఎవరికి వారే యమునాతీరే" ఐపోయి కొంత శ్మశాన వైరాగ్యానికి గురికాసాగింది...ఐతే మరోవంక గుత్తపెట్టుబడులక్రింద దిన పత్రికలూ, ప్రచురణలూ, సినిమాలూ, మరియు రేడియోల లాభసాటి విజ్ఞాన వ్యాపారాలు మాత్రం నిరాఘాటంగా విస్తరిల్లుతూ ఉన్నాయి. ఒకదిశ కార్మిక వర్గంకూడ తన వాణిని తాను నిర్మాణం చేసికొంటూనే ఉంది.

ఐతే, ఇంకొక్క అంశాన్ని మన మిక్కడ గమనించాలి. సాహితీ సంస్కృతీరంగాలలో గాంధీవాదులు (తమ నైతిక సంకోచాలవల్ల కాబోలు) సృజనాత్మక దిశకు అట్టే ప్రాధాన్యత నియలేదు. మధ్య తరగతి సాహిత్యం "అగాధం" లో పడిపోయింది. గుత్తపెట్టుబడిదార్లు కృతకమైన సాహిత్య స్వరూపాలను ప్రోత్సహించారు. ఈ దశలో భారతీయ సాహితీ సంస్కృతీ రంగాలలో సృజనాత్మకంగాను, వాస్తవికంగాను, సమస్యాత్మకంగాను, ప్రభావవంతంగాను మేలిబాటలు రూపొందించే కర్తవ్యాన్ని అభ్యుదయ రచయితలే ఆదర్శప్రాయంగా నిర్వహింపబూనారన్నది నిర్వివాద అంశం...

## ద్వితీయ ప్రపంచ యుద్ధం

1939 లో హిట్లరు ఫాసిస్టు దురాక్రమణ ప్రారంభమైంది. ఇటు తూర్పున జపాన్ సేనలుకూడ విజృంభిస్తున్నాయి. అటు యూరపు ఖండమూ ఇటు ఆసియా ఖండమూ రెండూ చావు బ్రతుకుల సమస్యలో ఇరుక్కొని పోయాయి. అయితే భారతదేశ స్వతంత్ర ప్రతిపత్తికై పోరాటం అలాగే ఉంది. తక్షణం స్వాతంత్ర్య ప్రదానం చేస్తేనే యుద్ధంలో సహకరిస్తామని కాంగ్రెసూ, యుద్ధానంతరం డొమినియన్ స్టేటసునిస్తామని బ్రిటిష్ ప్రభుత్వమూ రాజీబేరాలు జరుపుకొంటున్నాయి. ఈ రాయబారాల్లో మరోవంక ముస్లింలీగ్ పేచీపెట్టూ వుంది. 1942 లో క్రిప్సు రాయబారం వచ్చింది. విఫలమైపోయింది. "భారతదేశ స్వతంత్ర ప్రతిపత్తిని తక్షణం అంగీకరించాలనీ, లేకపోతే అ సహకార ఉద్యమం సాగిస్తామనీ" '42ఆగస్టులో కాంగ్రెసు తీర్మానించింది. మరునాడే ప్రభుత్వం కాంగ్రెసు నాయకులను నిర్బంధించింది. ప్రజలు రెచ్చిపోయారు. 18000 మంది నిర్బంధింపబడ్డారు. 60229 మంది అరెస్టయినారు.

940 మంది కాల్పుల్లో మరణించారు. 1630 మంది గాయపడ్డారు. ఇదే ఆగస్టు పోరాటం. ఈ పోరాటం జాతీయోద్యమాన్ని గందరగోళంలో పడవేసింది.

యుద్ధకాలంలో సుభాష్ చంద్రబోసు ఫాసిస్టు శిబిరంలో పడిపోయాడు. కాంగ్రెస్ జైలు పాలయింది. ఆ దశలో ధైర్యంగా ఫాసిస్టు వ్యతిరేక నినాదమిచ్చి ప్రజలకు అండగా నిల్చినదల్లా ఒక్క కమ్యూనిస్టు పార్టీయే. యుద్ధం 1945 లో ముగిసింది. మళ్ళీ సంప్రదింపులు సాగాయి. తుదకు 1947 లో భారతదేశం విభాగమై రెండు డొమినియన్లు రూపొందే నీతి ఫలించింది. ఐతే ఇక్కడ మనం చరిత్రాత్మకమైన 1946 ఫిబ్రవరి 18 నాటి నావిక విప్లవాన్ని విస్మరించరాదు; ఆ మరునాడే అట్లీ కాబినెట్ మిషన్‌ను పంపుతానని వాగ్దానం చేశాడు. (చూ. ఇండియా టుడే, పుట 542) ఈ నావిక విప్లవంలో హిందూ, ముస్లిం ప్రజానీకం ఆదర్శమైన ఐక్యతను ప్రదర్శించి ప్రజలను ఆకర్షించింది...ఎలాగైనా 1947లో జాతీయ కాంగ్రెసు రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించింది.

భారతదేశ స్వాతంత్ర్య ప్రాప్తినాటికి దేశంలో రాజకీయ చైతన్యం పరిణత రూపందాల్చి యుంది. క్యాబినెట్ మిషన్, వేవెల్ సంప్రదింపులు, తుదకు మౌంట్‌బాటన్ రాయబారం దారుణాతిదారుణ హత్యాకాండకు పునాదులువేసి దేశాన్ని విభజించటాన్ని ప్రజాభిప్రాయం తీవ్రంగా నిరసించింది...

ఈ దశలో భారతీయ సాంస్కృతిక చైతన్యం కూడ తన పరిపక్వదశను ప్రదర్శించినది.

1942 బెంగాలు కరువును వాస్తవికంగా చిత్రించిన భవాని భట్టాచార్య నవల ఆకలి, దేశ విభజనయొక్క పైశాచిక మతవాద హత్యాకాండను చిత్రించిన ఖాజా మహ్మద్ దీర్ఘకథా పరంపర, ఆహార సంక్షోభాన్నీ కంట్రోళ్ళనూ రేషనుకొట్లను సజీవ సాహిత్యంద్వారా చిత్రించిన కృష్ణచందర్ కథలు, కార్మికోద్యమ భూమికపై వెలువడ్డ ముల్కరాజ్ ఆనంద్ నవలలు, తెలంగాణ (1948) పోరాటభూమికపై వెలువడ్డ రామమోహన్ నవలలు అపూర్వమూ మహోన్నతమూ ఐన నూతన సాహిత్యవిలువలను సృష్టించాయి...

ఇలా బ్రహ్మ సమాజంతో ఆవిష్కరణైన జాతీయ పునరుజ్జీవన భారతీయ జీవితంలో క్రమ క్రమంగా పరిపక్వ సామాజిక చైతన్యాన్ని కరగతం కావించు కొని వాస్తవికంగా 'చరిత్ర' కు గుర్తులు వేయ సాగింది...

## స్వతంత్ర భారతం - ఆర్థిక చైతన్యం

స్వతంత్రభారత రాజ్యాంగం రూపొందింది. జనరల్ ఎన్నికలు సాగాయి. కాంగ్రెస్ పాలనలో ఒక పంచవర్ష ప్రణాళిక ముగిసి, రెండవ ప్రణాళిక వచ్చింది.

ఆర్థిక రంగంలో సంచలనం ప్రారంభమైనది. ఇతర వాదులుకూడా "సామ్యవాద నినాదాన్ని" అనివార్యంగా గుర్తించారు. అంతర్జాతీయ రాజకీయాల్లో భారత ప్రజలు శాంతి శిబిరంలో భాగస్వాములవుతున్నారు. ప్రక్కన పాకిస్తాన్ యుద్ధోన్మాదుల వలలో చిక్కింది...

మహత్తరమైన సామ్యవాదసమాజ నిర్మాణకృషిలోను, ప్రపంచశాంతి సాధనోద్యమంలోను, జాతీయ అంతర్జాతీయ రంగాల్లోను సమగ్రతర ఆర్థిక, రాజకీయ పరిణతితో భారతీయప్రజల జీవితాన్ని (వర్గ సంఘర్షణను) వాస్తవికంగా ప్రతిబింబించటమే జాతీయ పునరుజ్జీవనయొక్క నేటి ప్రధాన లక్ష్యం. అందుకై నవసంస్కృతీ నిర్మాణానికి నేటి జాతీయ విజ్ఞాన, విద్యా, సాంస్కృతిక ఉద్యమాల నిరంతరకృషితో పురోగామిశీల భారతీయులంతా ఏకముఖంగా విభిన్న పార్శ్వాలలో ముందుకు సాగుతున్నారు. వాస్తవానికీ అవగాహనకూ, స్థితికీ, భావానికీ, జీవితగమనంలోగల గతితార్కిక సమ్మేళనను ప్రతిబింబించే ప్రస్ఫుట చైతన్యం అతివేగంగా పరిణతిగాంచుతూ, క్రమంగా ఉన్నతోన్నత స్తరాలను నెలకొల్పుకుంటూ ఉంది. ఈ పురోగమనంలో అడ్డుపడే అవరోధాలూ - భ్రాంతులు ఓసరిల్లి పోతున్నాయి...కేవల విజయంకై నూతన సోపానాన్ని నెలకొల్పింది. స్వతంత్రభారత ప్రజలు తమ ఆర్థిక పారతంత్ర్యవిమోచనకై తామే భావినిర్మాతలయ్యే ఘనావకాశాలను కనుచూపుమేరలో కనుగొనసాగారు.

కనుక, భారతజాతీయ పునరుజ్జీవనకు భావి నిర్మాతలు భారతీయప్రజలే నన్నది నిస్సందేహం. ఇలా గత 200 యేండ్ల మన జాతీయ పునరుజ్జీవనయొక్క కొన్ని ఘట్టాల మన స్థూలసింహావలోకనం 'శుభాంత పరిణామంగా' సమాప్తమౌతుంది.



# మనుస్మృతి
## తత్కాలీన సామాజిక పరిస్థితులు

## మహీధర రామమోహన్ రావు

స్మృతి అంటే ధర్మ శాస్త్రం. ధర్మం అంటే ఆచారం. ఆచారం పారంపర్య క్రమాగతం. అలాంటప్పుడే అది సదాచారం. అదే పరమధర్మం. దాన్ని ప్రవచించేది స్మృతి.

మనువు వ్రాసింది మనుస్మృతి. మన ప్రాచీన సంస్కృత గ్రంథాలు చెక్కువానిలాగే మను స్మృతి కూడా అజ్ఞాత ధర్మవేత్తల చేర్పులూ, కూర్పులతో చాలా రూపాంతరం పొందింది. మనువు చెప్పేడంటూ ఇతర స్మృతికారు ఉదాహరించిన శ్లోకాలూ, శ్లోక భాగాలూ ఇప్పుడు లభిస్తున్న పుస్తకంలో కనబడవు. అయినా మొత్తంమీద మనుస్మృతి చదువుతూంటే ఆనాటి సామాజిక పరిస్థితీ, ఆచారాలూ, సమకాలీన ధర్మవేత్తల అభిప్రాయాల పరిణామాలూ మనకు రేఖా మాత్రంగా గోచరిస్తుంటాయి.

ధర్మశాస్త్రం యొక్క ఏ క్రోడీకరణం అయినా ఆనాటి సామాజిక పరిస్థితుల్ని ప్రతిబింబిస్తూంటుంది. అలాగే మను ధర్మశాస్త్రం నిరంకుశ రాజరికాలు అభివృద్ధిఅవుతూ, గణసమాజం క్షయించిపోతున్న దశలో ఆనాటికింకా కొనవూపిరితో మిగిలివున్న కొద్దిపాటి గణరాజ్యాలు ఆత్మరక్షణకోసం ఆఖరు ప్రయత్నాలు చేస్తున్న పరిస్థితుల్ని చూపుతూంది.

క్రీస్తుపూర్వం 7-5 శతాబ్దాల మధ్యకాలంలో ఉత్తర భారతదేశంలోని సమాజం ఒక సంధియుగాన్ని గడుస్తూంది. ఒక వేపున మగధ, కోసల, అంగ, కాశీ వగైరా రాజ్యాలు విస్తరించడానికి ప్రయత్నిస్తున్న దశ అది. ఆర్యగణసమాజాలు కూడా క్రమంగా పరిసరాల బలవత్తర ప్రభావంతో మారుతున్నాయి. ఆ దశలో ఈ స్మృతి వ్రాయబడివుండాలి.

మనుస్మృతి కాలంనాటికే సమాజంలో వర్ణ (జాతి) భేదాలు స్థిరపడిపోయాయి. ఈ వర్ణాలు (జాతులు) నాలుగు. - బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. వీనిలో అంతర వర్ణాలు వేరే వున్నాయి.

ప్రధానమైన ఈ నాలుగు వర్ణాలకు సమాజంలో బాధ్యతలు ఈ దిగువవిధంగా విభజించబడ్డాయి.

1. బ్రాహ్మణుడు.

చదువుకోవడం, చదువు చెప్పడం. యజ్ఞంచేయడం, యజ్ఞం చేయించడం, ఒకరి కివ్వడం, ఒకరిస్తే పుచ్చుకోవడమూ.

అధ్యాపన మధ్యయనం
యజనం యాజనంతథా ।
దానం ప్రతిగ్రహంచైవ: ...88-1 అ॥

2. క్షత్రియుడు.

ప్రజల్ని రక్షించడం, ఒకరికి ఇంత ఇవ్వడం, చదువుకోవడం, బ్రహ్మచర్య ధర్మాలను నిర్వర్తించడం, భోగాల యందనాసక్తిను.

ప్రజానాం రక్షణం దాన
మిజ్యాఽధ్యయన మేవచ
విషయేష్వప్రసక్తిశ్చ... 89 - 1 అ॥

3. వైశ్యుడు.

పశురక్షణం, దానం, బ్రహ్మచర్య విధుల నిర్వర్తనం, అధ్యయనం, వ్యాపారం, వడ్డీవ్యాపారము, వ్యవసాయమున్నూ.

పశూనాం రక్షణం దాన
మిజ్యాఽధ్యయన మేవచ ।
వణిక్పథం, కుశీదం చ
వైశ్యస్య కృషిమేవచ॥ 90-1 అ॥

4. ఇహ నాలుగోది శూద్రజాతి. వీరిపని—

ఏ తేషామేవ వర్ణానాం
శుశ్రూషా మనసూయయా॥ 91-1 అ॥

అనూయ పడకుండా ఈ పై మూడువర్ణాలకూ సేవ చేసుకోవడం ఒక్కటే ఈ వర్ణానికి పని.

ఈ పనుల విభజనను గమనిస్తే మొదటి రెండు వర్ణాలూ ఉత్పత్తి రంగానికి పూర్తిగా దూరమయ్యేరు. అది కనబడుతూనే వుంది. సామాజికోత్పత్తి బాధ్యత అంతా వైశ్య, శూద్రజాతులది.

ఇక్కడ ఒక ముఖ్యమైన అంశం గురించి ఆలోచించవలసివుంది. మనుస్మృతికారుడు వర్ణమూ, జాతీ అనే వానిని పర్యాయ పదాలుగా ఉపయోగించేడు.

వర్ణము అనేది రంగును సూచిస్తుంది. జాతి అనేది పుట్టుకను సూచిస్తుంది.

ఆర్యులు గౌరవర్ణులు. వాళ్ళు భారతదేశంలోకి వచ్చేసరికి ఇక్కడున్న ప్రజలు శ్యామలాంగులు. ఆర్యులు ఇక్కడి ఆదిమవాసులైన ప్రజల్ని ఓడించేరు. వారిని దాసులనుగా పట్టుకొని చాకిరీకి పెట్టేరు. వారందరినీ శూద్రవర్ణంగా పిలిచేరు.

అప్పటికే పాలకవర్గంగా వున్న ఆర్యగణాలలో ప్రజలు పురోహితులనీ, యోధులనీ, పశుపాలకులనీ విభజింపబడి వున్నారు. వీరే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు. వీరిదొక వర్ణం. పట్టుబడిదాసులు చేయబడిన ఆదివాసి ప్రజల దొక వర్ణం. ఆర్యగణాలలోని వై విభజన కేవలం సౌకర్యం కోసమే ప్రారంభమయింది. ప్రథమంలో ఆ విభజన నామమాత్రమే కూడా.

ఈ దేశానికి వచ్చేసరికి ఆర్యగణాలు పితృస్వామిక సమాజదశలో వున్నారు.

ఆదశలో వున్నాయంటే రెండు సంగతులు స్పష్టం. మొదటిది పశుసంపద బాగా పెరిగింది. గణం ఉమ్మడి అవసరాలకు మించి వుత్పత్తి అవుతూంది. గణసభ్యుల నిర్ణయాలననుసరించి ఈ పశుసంపద కుటుంబాలకు (కులాలు) పంచుతున్నారు. అల్లాంటి పరిస్థితులు ఏర్పడగల అవకాశాలు వున్నప్పుడే సమాజం మాతృస్వామిక దశనుంచి పితృస్వామిక దశకు మళ్ళేటందుకు అవసరం కనబడుతుంది.

తన ఆస్తిని తన ఔరసునికి సంక్రమింప చేయాలనే వాంఛయే ప్రధానంగా ఈ మార్పు రావడానికి కారణం. ఆయా పనులను నిర్వహించడంలో తన అనుభవంద్వారా సంపాదించిన మెలకువలను తన సంతానానికే అందచేయాలనే కోరికా, ప్రయత్నమూ వలన వేరువేరు పనులు వేరువేరు కుటుంబాల ప్రత్యేక సొత్తుగా పరిణమించడం సహజంగానే వచ్చేపరిణామం. అన్ని దేశాలలోను, అన్ని కాలాలలోనూ కనిపిస్తున్న ఈ పరిణామం మనదేశంలో చాల విపరీత పరిస్థితులకు దారితీయడం గమనించవలసి వుంది. దీనికి కారణం ఆర్యగణాలు అడుగుపెట్టిన భారతదేశంలోని ప్రత్యేక పరిస్థితులే తోడ్పడి వుండాలి.

ఆర్యగణాలు పరాయిదేశంలోకి చొచ్చుకొని రావడంలో వున్న ప్రత్యేక పరిస్థితులలో వారి గణాలు పని అవసరాలనుపట్టి మూడు విభాగాలయినాయి. యుద్ధోప జీవులు, పశుపోషకులు, పురోహితులు. కాని అదిలో వారిమధ్య అంతరం వుండడం సాధ్యంకాదు. ఒకరుదోపిడి చేసేందుకూ, మరొకరు దోపిడి చేయబడేందుకూ అంటూ ఏర్పడిన అంతరాలు కావివి.

కాని, ఇక్కడికి వచ్చేక ఆర్యగణాలకు యుద్ధంలో జయించి పట్టుకొన్న శత్రు గ్రామాల ప్రజలు బానిసలుగా లభించేరు. ఈ బానిసప్రజ విజేతలకన్న ఉన్నత నాగరికస్థితిలో వున్నారు. వారికి వ్యవసాయాదికం తెలుసు. వారి ఉపయోగాన్ని ఆర్యగణాలు పొందాలంటే ఈ బానిసలు గణం మొత్తానికి బానిసలుగా వుండడమే అవసరం. అదివరకు సామాజికోత్పత్తి విధానం నిర్వహిస్తున్న పశుపాలకులే ఈ నూతనోత్పత్తి రంగానికికూడా నియమించబడ్డారు. ఆర్యగణాలలో పశుపాలకులుగావున్న వైశ్యులూ, యుద్ధవిజితులైన దాసులూ సామాజికోత్పత్తిని నిర్వహిస్తున్నారు.

యుద్ధవ్యవసాయులుగా జీవిస్తున్న క్షత్రియులు ఈ సామాజిక సంపదకుసంరక్షకులయ్యేరు. ఆవిధంగా దానిలో వాటా సంపాదిస్తున్నారు.

గణసమాజంలో పురోహితుల దొక ప్రత్యేకస్థానం. గణంచేసే యుద్ధాలకు, ఇతరపనులకు దైవప్రీతిని సంపాదించడంతో ప్రారంభమయ్యే వారిబాధ్యతలు వారు గణంలో మేధావులుగా వృద్ధిపొందేటందుకు తోడ్పడతాయి. వారిబుద్ధి వికసనోన్ముఖంకావచ్చు. కాని, ఉత్పత్తిరంగానికి దూరం అయ్యేకొద్దీ గణంమీద సమిష్టిగా బ్రతకవలసిన స్థితే వుంటుంది. ఏ ఉంఛవృత్తితోనో జీవించాలిసిందే. దరిద్రం వాళ్ళ యింటిదేవత అవుతుంది. బ్రాహ్మణుడు ఉంఛవృత్తితో జీవించడం వుత్తమం. మూడుపూటలకు మించి ఆహారం సేకరించరాదు అని దారిద్ర్యాన్ని ఒక సహజోత్తమ గుణంగా చెప్పుకోవడం ఆ వర్ణంయొక్క నిజపరిస్థితిని తెల్పడమే నంటాను.

క్షత్రియుడికి చేతిలో కత్తివుంది. ఆ విధంగా ఉమ్మడి ఆస్తిలో వాటా తీసుకొంటున్నాడు. క్షత్రియునిలాగే ఉత్పత్తిరంగానికి దూరం అయివున్న బ్రాహ్మణుడు తన జీవితాన్ని వెళ్ళమార్చుకొనేటందుకై తనవద్దనున్న చదువు నుపయోగించుకోడానికి

ప్రయత్నించేడు. ఆ ప్రయత్నంలో ప్రజానీకానికి తనయందు విశ్వాసం, గౌరవం కలిగించుకోనేటందుకై ఒక నైతిక (Code) వ్యవహారానుక్రమణికను ఏర్పరచుకొన్నాడు. దేవతలను సంతృప్తిపరచే కర్మకాండను విస్తరింపచేసేడు. ఈ క్రమంలో వర్ణవ్యవస్థ స్థిరపడిపోవడం సులభమూ, సహజమూ కూడ. ఈ విభజన ప్రథమంలో ఆర్యగణాలకు మాత్రమే పరిమితం అయి వుండేది. ఆ రూపంలో వర్ణవ్యవస్థగా పిలువబడింది.

కాని, ఈస్థితి అలాగే వుండిపోలేదు. ఆర్యుల దండయాత్రనాటికే ఇక్కడి ఆదివాసీ ప్రజలు ఉన్నత నాగరిక స్థితిలో వున్నారు. వారు నగరాలను నిర్మించుకొన్నారు. సాగు తెలుసు. వ్యాపారం ఎరుగుదురు. పంజాబులో తవ్వితీసిన హరప్ప, సింధులో తవ్వితీసిన మొహెంజోదారో పట్టణాలు ఆనాటి ప్రజల అభివృద్ధికి నిదర్శనాలు. ఋగ్వేదం 6 వ మండలంలో ఇంద్రుడు నిర్మూలించినట్లు వర్ణించిన దస్యునగరం "హరియుపియ" హరప్పయే కావచ్చుననీ, ఋగ్వేదం ఒకటవ మండలంలో అగ్నిధ్వంసమయినట్లు పేర్కొన్న నార్మిని మొహెంజోదారోయే కావచ్చుననీ పరిశోధకులు భావిస్తున్నారు.

అక్కడి ప్రజలేమయ్యేరు? వారికి ఆర్యులు దస్యులనీ దాసులనీ పేరు పెట్టారు. విజేతలు విజితుల్ని చేసినట్లే వారిచేత పనులు చేయించేరు. సామాజికోత్పత్తి సంబంధాలలో వారిని శూద్రవర్ణంగా పరిగణించేరు. వారిలో పురోహితులున్నారు. సంపన్న కుటుంబాలున్నాయి. బానిసలున్నారు వీరంతా ఆర్యులచేత దాసులుగా పరిగణించబడుతున్నారు. వారు బానిసలు కారు. శూద్రవర్ణంగా పరిగణించబడడంలోనే వారు స్వతంత్రులుగా వున్నట్లు వూహించవచ్చును. కాని ఆ స్వాతంత్ర్యం పరిమితం. బహుశా సంకుచితమే కూడా కావచ్చు. కాని, వారిలోంచి కొందరు ఆర్యగణ సమాజవ్యవస్థలోకి ప్రవేశం సంపాదించ కలిగేరంటేను ఆర్యగణసమాజ వ్యవస్థలో మార్పులు తీసుకొచ్చేటంత అధికంగా ప్రవేశించేరంటేనూ ఈదాసులు కేవలం బానిసలుగారనీ, వారుకొంత స్వాతంత్ర్యాన్నే కలిగివుండే వారనీ చెప్పవచ్చు. ఆ స్వాతంత్ర్యం ఎల్లా వుండేది?- అనే విషయం వేరు.

భిన్న సామాజిక స్థితులకు చెందిన ఆర్య, ఆదివాసి ప్రజలు క్రమంగా కలిసిపోయేరు. ఇది అన్నిస్థాయిలలోనూ జరిగి వుండాలి. ఒక నూతన సమాజం ఏర్పడింది. దీనికి పునాది వర్ణభేదం కాదు. ఈ స్థితిని ఊహించడానికి మనకు కొన్ని ఆధారాలు లేకపోలేదు. వైదిక ఋషులలోకి కొందరు ఆర్యేతరులు వచ్చి చేరుకొన్నట్లు చెప్పడానికి ఉదాహరణ లున్నాయి.

దీర్ఘ తమస్సు అనే ఋషి మమత అనే దాసికొడుకు. ఋగ్వేద ఋషులు తండ్రిపేరటనే పేర్కొబడటం పరిపాటి. అది ఆర్యగణాలు పితృస్వామిక సమాజ వ్యవస్థలో వున్నట్లు తెలుపుతూంది. కాని దీర్ఘతమస్సు తల్లిపేరట పేర్కొబడ్డాడు. అగస్త్యుడు కుంభోద్భవుడు. ద్రోణుడు దొప్పలో పుట్టేడు. కుంభం, ద్రోణి యోని సూచకాలు.

ఋగ్వేద ఋషి కవస ఐలూషుణ్ణి దాస్యాః పుత్రుడని తిట్టేరు. బయటకు నెట్టేసేరు. ఆయన, ఆయన చదివిన మంత్రానికి వశీకృతయై సరస్వతీ నదీ ఎడారుల్లోకి పోయేరట.

వత్సుడు, మేధాతిథి కణ్వుని కొడుకులు. సవతి అన్నదమ్ములు. మేధాతిథి వత్సునిని దాసి కొడుకని నిందించినట్లూ, తన పుట్టుకలో మచ్చలేమిని నిరూపించుకొనేటందుకు వత్సుడు నిప్పుల గుండం తొక్కినట్లూ కథలున్నవి.

ఇవీ ఇల్లాంటి కథలూ ఆర్య, ఆది వాసి సమాజాల లోని వివిధ తరగతులు మిశ్రం అవుతూ నూతన సామాజిక విభజనలు జరుగుతున్నట్లు చూపిస్తున్నాయి. క్రమంగా ఈ విభజనలు స్థిరపడిపోయినాయి. అంతవరకు రంగుభేదంతో వున్నవి జనభరద్దయింది. పుట్టుకతోనే విభజన ఏర్పడింది. దానికో తాత్విక నిర్వచనం కూడా ఇచ్చేసేరు.

యం తు కర్మణి యస్మిన్ స
న్యయుంక్త ప్రథమం ప్రభుః
స తదేవ స్వయం భేజే
సృజ్యమానః పునః పునః ॥

కర్మల ననుసరించి దేవుడు పుట్టుకలను విధించేడు. అయితే వృత్తుల్లో హెచ్చుతగ్గుల్లేవు. ప్రాణి కర్మసాపేక్షమేగాని అంటాడు.

దానినే మరికాస్త వివరిస్తూ

యద్యస్య సో దధాఽత్సర్గే
తత్తదిస్య స్వయ మావిశత్ ॥

గుణాగుణాలు కర్మసాపేక్షంగా సృష్టిలోనే కేటాయింపు అయిపోయేయి. అవి జన్మతోనే సహజంగా వచ్చేస్తా యంటాడు.

యథార్తు లింగాన్యృతవః
స్వయమేవర్తు పర్యయే ।
స్వాని స్వాన్యభి పద్యంతే
తథా కర్మణి దేహినః ॥

ఈ విధంగా వర్ణభేదం జాతిభేదంగా పరిణతి పొంది రెండూ ఒకదాని కొకటి పర్యాయ పదాలయేయి. ఈ మార్పు మనుస్మృతి కాలానికే జరిగిపోయింది.

కాని, సమాజంలో ఇంకా అనేక విధాలయిన విభజన లున్నాయి. వారు వారు చేస్తున్న వృత్తుల్ని పట్టి జరిగిన విభజన లవి. వృత్తిపనులు అన్నప్పుడు కాయికశ్రమను తెలుపుతాయి. కాయికశ్రమ బ్రాహ్మణ క్షత్రియ జాతులకు ముఖ్యంగా బ్రాహ్మణులకు పరిహార్యం. అందుచేత ఆ విభజన అంతా మిగిలిన వర్గాలలోనే అయివుండాలి.

మనువు బ్రాహ్మణునికి ఏ వృత్తులు భోజన బాహ్యాలో చెప్తూ వివరించేడు.

చోరులు, గాయకులు, తక్ష (వడ్రంగి), వార్ధుషిక (వడ్డీవ్యాపారి), చికిత్సక, మృగయు, శైలూష, తున్నవాయ (కసాయి), కర్మార (కమ్మరి), నిషాద, రంగావతరక, సువర్ణకార, వేణ (పిల్లనగ్రోవులు చేసేవాడు), శస్త్రవిక్రయీ, శ్వవాన్ (కుక్కలు పెంచేవాడు), శౌండిక (కల్లంగడివాడు), చేల నిర్ణేజక (రేతిగాడు), రంజక (రంగులు వేసేవాడు), చర్మోపకర్తక, కారుక (మేదర) - వీరి ఇళ్ళల్లో అన్నం తినవద్దని చెప్తూంటాడు. ముఖ్యంగా మళ్ళీ నలుగురిని కేటాయించి గట్టిగా నిందిస్తాడు

పూయం చికిత్సకస్యాన్నం
పుంశ్చల్యాస్త్వన్న మింద్రియం
విష్ఠా వార్ధుషికస్యాన్నం
శస్త్రవిక్రయిణోమలం ॥

అంటూ చికిత్సక, పుంశ్చలీ (వ్యభిచారిణి), వార్ధుషిక (వడ్డీవ్యాపారి), శస్త్రవిక్రేతల అన్నాన్ని మలాదికంతో పోల్చడం గమనించ తగివుంది. ఈ భోజన భాజనాలు ఇంకా తీవ్రమైన నిషేధానికి గురికాలేదనేది ఒకటి. చోర, గాయక, వార్ధుషిక, శస్త్రవిక్రయం, వ్యభిచార వృత్తులమీద జీవనాలు, తక్ష, చికిత్సక, కర్మార, చేలనిర్ణేజక, రంజక, సువర్ణకారాది వృత్తిజీవనాలనూ మనుస్మృతి కారుడు కలగా పులగం చేసేడు. దీనిని పట్టిచూస్తే వృత్తి రీత్యావిభజన అనేది సమాజంలో ఇంకా స్థిరపడిపోలేదని వూహించడానికీ అవకాశం ఏర్పడుతూంది.

ఆనాటికి ఆర్యగణాలు (ముఖ్యంగా మనుస్మృతి కారుడు అభిమానించే గణాలు) పశుపోషణకే అధిక ప్రాముఖ్యతను ఇస్తున్నాయి. సుస్థిర వ్యవసాయ ఏర్పడలేదు.

స్థాణుచ్ఛేదస్య కేదారం
ఆహు శ్శల్యవతో మృగం అ॥9॥

అన్న శ్లోకపాదం ఆర్యగణాలు పోడుకొట్టి వ్యవసాయం సాగుచేసే దశనింకా దాటిపోలేదని చూపుతూంది.

మరోచోట పశుపోషణ విషయమై ఆర్యగణాలు ఎంత ప్రాముఖ్యం చూపుతున్నాయో తెలిపే శ్లోకం వొకటుంది. వైశ్యుడు పశువుల రక్షణభారం వహించనంటే ఎల్లాగ? తప్పేదా యేమన్నానా? ఏదో విధంగా చెయ్యాలిగాని — అంటాడు.

న చ వైశ్యస్య కామస్స్యా
న్నరక్షేయం పశూ నితి।
వైశ్యే చేచ్ఛతి నాన్యేన
రక్షితవ్యాః కథంచన అ. 9।

వైశ్యుడు పశుపోషణ యందు విముఖత్వం చూపడం అనేమాట ఆనాటి సామాజిక పరిస్థితుల పరిణామాన్ని సూచిస్తూందని నా అభిప్రాయం. పైన చెప్పిన శ్లోకం ధోరణి వైశ్యుణ్ణి పశుపాలన విషయమై అశ్రద్ధ చేస్తే ఎల్లాగని ప్రాధేయ పడుతున్నట్లుండడం కూడా ఇక్కడ గమనార్హం.

ఇంతవరకూ ఆర్యుల ప్రధాన జీవనం పశుపోషణం. వ్యవసాయం అనేది వేడినీళ్లకు చన్నీళ్లుతోడు. పశువుల మందలకు అనువైన బీళ్లు వెతుక్కుంటూ నిత్య నూతన ప్రాంతాలకు తిరుగుతూండేవారు. నిత్యం ఎవరితోనో ఘర్షణపడుతూ యుద్ధవ్యవసాయులుగా జీవించేవారు.

ఈ ప్రత్యేక పరిస్థితులలో జీవించే గణాలలో సహజంగా కనబడే విభజనే ఆది ఆర్యగణాలలోనూ వుంది. గణసమాజంలో పురోహితునిది చాల ప్రముఖస్థానం. యుద్ధవ్యవసాయులయిన ప్రజలలో యోధులకుండే ప్రాముఖ్యతను వివరించ నక్కర్లేదు. మంత్రాలూ, తంత్రాలతో యుద్ధవిజయాలకూ, తెగల క్షేమానికీ కృషిచేసే పురోహితుడు, ఆయుధజీవియై గణాన్ని రక్షించే యోధుడువుంటే తెల్లవారదు. వాళ్లకి ఆహారాన్నిచ్చే సంపద పశుసంపద. దాని రక్షణకు కొందరుండాలి. ఈవిధంగా సహజంగానే పని విభజన జరిగింది. అలాగే సాగుతూంది. పశుసంపద గణానిది. దానిని పరిచూచే బాధ్యత కొందరిది (వైశ్యులది). గణక్షేమంకోసం యుద్ధవిజయాలకు పురోహితు

చేతిలో క్రమంగా మంత్రతంత్రాల తతంగం పెరిగి పోతూంది.

ఋషియజ్ఞం దేవయజ్ఞం
భూతయజ్ఞంతు సర్వదా ।
నృయజ్ఞం పితృ యజ్ఞంచ
యథా శక్తి నహాపయేత్ ॥ 2-4 ॥

అయిదురకాల యజ్ఞాలు యథాశక్తి సాగించాలి.

సస్యాంతే నవసస్యేష్ట్యా
తథర్త్వంతే ద్విజోఽధ్వరైః ।
పశునాత్వయనస్యాఽదౌ
సమాంతే సౌమికైర్మఖైః ।

పంటలైపోతే, కొత్తపంట వస్తే, ఋతువు మారుతే, అయనం మారుతే, సంవత్సరం మారుతే యజ్ఞాలు చెయ్యాలి. పశువుల్ని చంపాలి.

నానిష్ట్వా నవసస్యేష్ట్యా
పశునాచాగ్నిమాన్ ద్విజః ।
నవాన్నమద్యాన్మాంసం వా!

పశువును చంపి కొత్తపంటల కాలంలో యజ్ఞం చేయకుండా కొత్తబియ్యం తినకూడదు. మాంసం ముట్టుకో కూడదు.

అనేక రూపాలలో పురోహితుల కర్మకాండ పెరిగి పోయింది.

వైశ్యుడు పెంచుతున్న పందల్ని నలుగురూ నాలుగు వేళ్లతో కోసుకు తినేస్తున్నారు.

క్రమంగా గణాలు స్థిరపడిపోయి వ్యవసాయం పుంజుకొంటున్నా సమాజంలో వెనకటిస్థితి మారడం లేదు. ఆర్యగణాలు యుద్ధ జీవులుగావుంటూ వచ్చిన రోజులు పోయేయనీ, అటువంటి జీవితాన్ని సగర్వంగా చెప్పుకొనే దశకూడా మనుస్మృతి కాలంనాటికి లేదనీ చెప్పవచ్చు.

రాజునుంచి దానం పట్టడంలోవున్న అభ్యంతరాన్ని ఎంత భయంకరంగా వర్ణిస్తాడో చూడండి.

దశసూనా సమంచక్రం
దశచక్ర సమో ధ్వజః ।
దశధ్వజ సమో వేశః
దశవేశ సమో నృపః ॥

పది కసాయికాణాలు నడుపుతున్న వానితో ఒక్క తైలికుడు సమానం. పదిమంది తైలికులతో ఒక కల్లంగడి పెద్దమనిషి. పదిమంది కల్లంగడి వాళ్ళతో ఒక వేశ్యాగృహ నిర్వాహకుడు. అటువంటివాళ్ళు పదిమందితో సమానుడు రాజు.

ఎందుచేత?

దశసూనా సహస్రాణి
యో వాహయతి సౌనికః ।
తేన తుల్య స్స్మృతో రాజా
ఘోర స్తస్య ప్రతిగ్రహః ।

సౌనికుడు అన్న శబ్దానికి ఉత్పత్త్యర్థం వధోపజీవి. పదివేల హత్యలుచేసిన సౌనికుడితో రాజు సమానం. అందుచేత అతనివద్ద ఏమీ తీసుకోవద్దు అన్నాడు.

అలాగే భోజనం చెయ్యకూడని ఇళ్ళల్లో శస్త్రవిక్రేత దొంగటని పైనచెప్పేను. వానియింటి అన్నం మలంతో సమాన మన్నంత వ్యతిరేకత ప్రకటించేడు.

అలాగని మనుస్మృతి అహింసను బలపరుస్తుందనీ, దండనం కూడదన్నదనీ అనుకోవద్దు.

సర్వో దండ జితో లోకః
దండస్య హి భయా త్సర్వం
జగద్భోగాయ కల్పతే॥
దేవదానవ గంధర్వా
రక్షాంసి పతగోరగాః।
తేఽపి భోగాయ కల్పంతే
దండేనైవ నిపీడితాః।
దుష్యేయు స్సర్వవర్ణాశ్చ
భిద్యేరన్ సర్వసేతవః।
సర్వలోక ప్రకోపశ్చ
భవేద్దండస్య విభ్రమాత్॥
దండోహి సు మహత్తేజో
దుర్ధర శ్చాకృతాత్మభిః।
ధర్మా ద్విచలితం హంతి
నృపమేవ సబాంధవం॥7 అ॥

ఈ ప్రపంచం యావత్తూ దండనం వల్లనే అణగి వుంది. దండభయం చేతనే ఈ ప్రపంచంలో ఇంత తినగలుగుతున్నాం॥ దెబ్బకి దయ్యాలుకూడా జడుస్తాయి॥ దండం లోపిస్తే వర్ణసంకరం అయిపోతుంది. అదుపు, ఆజ్ఞ వుండవు. లోకమే తల్లక్రిందు లయిపోతుంది। దండం మూలపెట్టి లేక ధర్మం నిర్వహించని రాజు సకుటుంబ బంధుమిత్రంగా నాశనమైపోతాడు.

దండనంమీద ఇంత విశ్వాసం వుంది మనువుకి. దండవిధిమీద ఇంతవిశ్వాసం, శస్త్రజీవనంమీద అంత వ్యతిరేకత — ఇది గణాలు స్థిరజీవనానికి అలవాటు పడిపోవడాన్ని సూచిస్తూందని నా అభిప్రాయం.

స్థిర జీవితం అలవాటు పడినప్పుడే వ్యవసాయం, వర్తక వ్యాపారాలూ వృద్ధి పొందుతాయి. కాని,

రెండోవేపున సమాజంలో వర్ణభేదాలు బాగా ఎక్కువై వైరుధ్యాలు నిశితం అవుతాయి. నూతనోత్పత్తి విధానాల అభివృద్ధికి దేశం ప్రశాంతంగా వుండాలి. యుద్ధాలు కూడదు. కాని అంతర్వైరుధ్యాల నణచడానికి దండనీతి దృఢతరం కావాలి. మనుస్మృతికారుని రచనలోని వైరుధ్యానికి కీలకం అది.

కాని, ఈ యుద్ధ వ్యతిరేకతలో ఆ నాటి సమాజం యొక్క అవసరం ప్రతిబింబిస్తూందే కాని వాస్తవానికి అటువంటి పరిస్థితి దేశంలోలేదు. భిన్నభిన్న రాజ్యాల మధ్య, గణరాజ్యాలమధ్య కలహాలుండనే వున్నాయి.

స్థిరజీవితంతో వ్యవసాయం ఇంకా వృద్ధిపొందుతుంది. సమాజంలో ప్రధానాహారం ధాన్యం అవుతుంది. పశువులమాదిరిగాగాక పొలాలు వ్యక్తిగత ఆస్తిగా స్థిరపడిపోతాయి. అదివరలో పశువులుకూడా గణంలోని కుటుంబాలమధ్య పంపకం అవుతున్నా ప్రధానంగా గణాల ఆస్తిగా చలామణీ అయ్యేవి. పురోహితులు గణక్షేమంకోసం అంటూ సాగిస్తున్న అనంతములయిన యజ్ఞాలూ, ఇష్టిలూ సాగాలంటే పశువులుకావాలి. ఈ యజ్ఞాలూ, ఇష్టులూ లేకపోతే బ్రాహ్మడి కన్నంలేదు. అందుచేత పశుపోషణమీద ఆధారపడ్డ సామాజికస్థితి బ్రాహ్మణుడి కవసరం. తాను పెంచిన సంపదనంతా మరొకరికి వప్పచెప్పవలసిన పరిస్థితినుంచి బయటపడాలని వైశ్యుడు తప్పక ఆలోచిస్తాడు. వ్యవసాయం వృద్ధిపొంది క్షేత్రాలు స్వతఆస్తిగా పరిణతిపొందడం జరగేక ఆతనికి మరో మార్గం లభిస్తూంది. పశుపోషణకు ప్రాధాన్యత నివ్వడు. మరి బ్రాహ్మణుడి జీవయాత్ర ఎల్లాగ?

అందుచేతనే వైశ్యుణ్ణి ప్రాధేయపడడం. నువ్వు పశువుల్ని పెంచనంటే ఎల్లాగరా నాయనా! అంటూనే రెండోవేపున తనకు రాజదండాన్ని సహాయం తెచ్చుకోనేటందుకు ప్రయత్నం చేసేరు.

నా బ్రహ్మ క్షత్ర మృధ్నోతి
నా క్షత్రం బ్రహ్మవర్ధతే।
బ్రహ్మక్షత్రంచ సంపృక్తం
ఇహ చాఽముత్ర వర్ధతే।

బ్రాహ్మణుడు లేనిదే క్షత్రియుడు వృద్ధిపొందడు. క్షత్రియుడు లేనిదే బ్రాహ్మణుడికి వృద్ధిలేదు. ఈ ఇద్దరూ కలిస్తేనే ఇహమూ, పరమూ వుంటుంది.

ఈదృష్టిలోనే మనువు దండవిధిని సమర్థించడం కూడా.

అయితే ఈ పరిణామాల స్వరూపాన్ని గురించి ఇక్కడ కొంతవరకూ చెప్పవలసి వుంటుంది.

ఆర్యగణాలు తాము ఓడించిన ఆదివాసి సమాజాన్ని తమతో చేర్చుకొంటూ, వాతో చేరిపోతూ క్రమంగా తూర్పుగా ప్రయాణించేయి. ఆ ప్రయాణంలో సమాజం అనేక కొత్త అంశాలను సేకరించింది. సమాజంలో అదివరకు స్థిరపడి వుండని నాలుగు వర్ణాలు జాతులుగా స్థిరపడిపోయేయి. వాళ్ళకి వుండని కొత్త వృత్తులు, కొత్త వ్యాపారాలు వచ్చేయి. కొత్త కొత్త జంతువులు (ఉదా॥ దున్నపోతు, పందులు, కోళ్ళు, యుద్ధావసరాలకు ఏనుగులు) మచ్చికచేసుకొన్నారు. వ్యవసాయం చేయడం ప్రధానమయింది. ఈ విధంగా సమాజం వృద్ధిపొందింది.

అదివరకు గణాలలో ఎరికిలేని వడ్డీవ్యాపారం ఒకటి వచ్చింది. అంతకుపూర్వం 'ఋణం' అనేదివున్నా వడ్డీ వ్యాపారంలేదు. ఇప్పుడు వడ్డీఅన్న దొకటి వచ్చింది. ఇది వర్తక, వ్యాపారాల ఉనికికి మూలకందంగా భావించవచ్చును.

అంటే గణ సమాజానికి అంతక్రితం ఎరికలేని వ్యవసాయం, వర్తక వ్యాపారాలూ సాగుతున్నాయి. అవి ప్రధాన స్థితికి వస్తున్నాయికూడా.

ఈ పరిణామాలు వస్తున్న తర్వాత పాత సామాజిక సంబంధాలు యధాతథంగా నిలువడలేవు. అవి అలాగే వుంటే ఉత్పత్తిశక్తులలో వచ్చిన, వస్తున్న అభివృద్ధి కొనసాగదు.

నూతన ఉత్పత్తిశక్తుల అభివృద్ధి సమాజ సంబంధాల ఔచిత్యాన్ని ప్రశ్నించడం ప్రారంభమయింది. వేదాల అపౌరుషేయత్వం, యజ్ఞాది కర్మకాండల ప్రాధాన్యత, చతుర్వర్ణ సుస్థిరతమీద ఆధారపడినవి సమాజ సంబంధాలు. వానిని హేతువాదంతో శంకించేవారూ, ప్రశ్నించేవారూ సమాజంలో బలపడ్డారు. సమాజానికి పట్టుకొమ్మగావున్న తత్వశాస్త్రాన్ని ప్రశ్నించి ఖండిస్తున్న నూతన హేతువాదుల్ని మనుస్మృతికాలపు సమాజం అణచివేసేస్థితిలో లేదు. ఇంక చిన్న పిల్లలను కోపంవస్తే మాట్లాడ్డం మానేసినట్లు వాళ్లతో మాట్లాడవద్దంటుంది.

పాషండినో వికర్మస్థాన్
బైడాల వ్రతకాన్ శఠాన్।
హైతుకా న్బకవృత్తీంశ్చ
వాఙ్మాత్రేణాఽపి నార్చయేత్॥

రెండోవేపున పశువుల్ని పోషించకపోతే ఎల్లాగని వైశ్యుల్ని ప్రాధేయపడడం, మనం ఇద్దరం కలిసివుండకపోతే ఇహపరాలకు చెడతాము సుమాయని క్షత్రియులకు విజ్ఞప్తిచేయడమూ చూస్తే సమాజ పరిణామక శక్తులు వారి స్వాధీనం తప్పినట్లే కనబడుతుంది.

వ్యాపారం, వాణిజ్యం పెరగడం, వ్యవసాయం వృద్ధిపొందడం ఇవి వ్యక్తిగత ఆస్తి హక్కులు ఏర్పడ్డంతో ముడిపడివున్నాయి. వ్యక్తిగత ఆస్తి హక్కు అనేది గణసమాజ పరిధుల్లోనే ప్రభవించినా ఆ పరిధులు విధ్వంసం అయితేతప్ప వ్యవసాయం, వాణిజ్యం పెరగడం సాధ్యంకాదు. ఏమంటే గణసమాజంలో గణంఆస్తికీ, గణసభ్యుల ఆస్తికీ తప్ప పరిగణన వుండదు. ఒకగణంలోని వారికి - ప్రత్యేకమైన ఒప్పందా లున్నవారు తప్ప - మిగిలిన వారంతా పరాయివాళ్ళే. మనుస్మృతి ప్రకారం వికర్ములు.

గణసభ్యులు, పైవాళ్ళు అనే భేదం లేకుండా అందరి ఆస్తులకూ రక్షణ వున్నప్పుడే వర్తక వాణిజ్యాలు వృద్ధిపొందుతాయి. నూతనఆస్తి హక్కుల్ని అంగీకరించే రాజు, తమకు రక్షణఇచ్చే రాజు కావాలి. ఆతడు క్షత్రియుడైనా సరే, కాకపోయినా సరే. కాకపోయినా సరే ననడంలో అప్పుడే ఆర్యగణ సాంప్రదాయాలకు వైరుధ్యం ఏర్పడుతూంది.

అటువంటి పరిస్థితిని మనుస్మృతి పెద్ద ఎబ్బెట్టు లేకుండానే అంగీకరించడంవల్ల క్షత్రియేతర రాజరికం ఆ నాటికి పరిపాటిగా వున్నట్లే వూహించడానికి అవకాశం వుంది.

నరాజ్ఞః ప్రతిగృహ్ణీయా
దరాజన్య ప్రసూతితః ॥

క్షత్రియుడు కాని రాజునుంచి దానంపట్ట వద్దని బ్రాహ్మణుని మనువు నిషేధిస్తున్నాడు.

మరొకటివుంది. యజ్ఞాది కర్మకాండ గణాలు పశుపాలకములుగా వున్న దశలో వృద్ధి పొందింది. పశుగణం గణంయొక్క సమిష్టి ఆస్తిగా వుండేవి. ఇప్పుడవి వ్యక్తి ఆస్తులవుతున్నాయి. వ్యవసాయం ఒకటి వచ్చింది. పశుహననం (చంపడం) వ్యవసాయానికి పెద్దదెబ్బ.

మరొకటి. యజ్ఞం పరమార్థం యుద్ధవిజిగీష. యుద్ధాలు సమాజంలో వినాశాన్నీ, అస్థిరత్వాన్నీ తెచ్చిపెడతాయి. అందుచేత సామాజిక శక్తులు అభివృద్ధి పొందాలంటే ప్రజానాశకరములయిన యుద్ధాలు నిలిచిపోవాలి. పశుహననం నిలపాలి. అంటే వైదిక కర్మకాండ ఆగిపోవడం సమాజాభివృద్ధికి అవసరం.

ఈ నూతనావసరాన్ని సూచించేదే అహింసా సిద్ధాంతం.

పార్శ్వతీర్థంకరుడు (జైనమత ప్రవక్త) మొదలు బుద్ధునివరకు అనేకమంది అహింసా ప్రవక్తలు బయలుదేరేరు. 'అహింస' అనేది అటు యుద్ధాలనూ, ఇటు యజ్ఞయాగాలనూ కూడ ప్రతిరోధించింది.

ఈ నూతన సిద్ధాంతాల ఒత్తిడి చాల తీవ్రంగా ఉండివుండాలి. వైదిక సమాజానికీ, కర్మకాండకూ మూలసిద్ధాంత మనదగిన "దైవనిర్ణయ" వాదం (Pre-determination) గురించి మనువు వివరించడంతో సంతృప్తిపడలేదు. అహింస - హింస గురించి పెద్దగా వివరించి, వేదవిహితమైన హింస అహింసే నన్నాడు.

యా వేద విహితా హింసా
నియతాఽస్మిన్ చరాచరే।
అహింసామేవతాం విద్యాత్ ॥

బౌద్ధులు (బహుశా అంతకు పూర్వం ఈ మాదిరి అభిప్రాయాలుగలవారు ఇతరులుకూడా ఉండివుండొచ్చును.) హింసను వ్యతిరేకిస్తారు. కాని, మాంసం తినడం వాళ్ళకి అభ్యంతరకరంకాదు. ఆ పద్ధతిని మనుస్మృతి కారుడు హేళనచేసేడు.

నాఽకృత్వా ప్రాణినాం హింసాం
మాంసముత్పద్యతే క్వచిత్ ।
నచప్రాణి వధ స్స్వర్గ్య
స్తస్మాన్మాంసం వివర్జయేత్ ॥

అంటూ అహింసావాదులకే ఒకపాఠం చెప్పడానికి ప్రయత్నించేడు.

బుద్ధుడు జన్మించేనాటికి గంగానదీ ప్రాంతంలో భిన్న భిన్న పరిణామదశలలోవున్న సమాజాలు ఒకదానిప్రక్కనొకటి సహజీవనం చేస్తున్నాయి. వంగదేశం అంతా నిబిడారణ్యం. నేటి బీహార్, ఉత్తరప్రదేశ్ లలో చాల భాగంలో జనావాసాలే చాల తక్కువగా వున్నాయి. అక్కడి ప్రజలకి ఆర్యభాషలతోగాని, ఆర్యులతోగాని విశేషసంబంధాలులేవు. వారి దిగువన నాగ జాతులు నివసిస్తున్నాయి. వీరికి ఆర్య తెగలతో నిరంతరం రంధాగొండి నడుస్తూంది. వారికి పైభాగంలో గంగా యమునల తీరానే ఆర్య తెగలు నివసిస్తున్నాయి. అయితే ఈ తెగలవారుకూడా అందరూ ఒకే తరహాగా లేరు. వీనిలో కొన్ని వైదిక మంత్రతంత్ర కర్మ

కాండను అనుసరిస్తున్నాయి. కొన్ని ఆ తంతును అనుసరించడంలేదు. వర్తక వ్యాపారాలు ఒకవేపున సాగుతూనే వున్నా రెండోవేపున ఈ చిన్నచిన్న రాజ్యాలు తన్నుకొంటూ కొట్టుకొంటూనే వున్నాయి. ఆర్య, ఆర్యేతర రాజ్యాలు, ఆర్యరాజ్యాలలోనే ఆర్య రాజ్యాలు పరస్పరం కలహిస్తున్నాయి.

## బలమైన పెద్దరాజ్యాలు

క్రమంగా ఈ రాజ్యాలు కలసిపోయి బలమైన పెద్ద రాజ్యాలు ఏర్పడ్డం సాగింది. బుద్ధుడికాలంనాటికి మగధ ఒకబలమైన రాజ్యం అయింది. అంగరాజ్యం దానిలో విలీనం, అయిపోయింది. కాశీ, కోసల రాజ్యాలు (కోసలం నేటి యు. పి. లోని గోండా బహ్రియాకి జిల్లాలు) ఏకమై పోయేయి. అనాటి రాజ్యాలలో కోసలం చాలా పెద్దది. బుద్ధుడికాలం నాటికి కోసలరాజు ప్రసేనజిత్తు. ఆయన మాతంగ కులీనుడు. ఆయన సోదరి మగధరాజైన బింబిసారుడి భార్య. మగధరాజ వంశంకూడా వైదిక ఆర్యవర్ణాలచేత క్షత్రియులుగా అంగీకరించబడలేదు. వారిని నిరసనగా "క్షత్రబంధువు" లంటూ ఈసడిస్తూ వచ్చేరు.

మగధ, కోసలరాజ్యాలు పరస్పర విజిగీషతో కలహించుకొంటూ వుండేవి. రెండోవేపున చిన్నచిన్న రాజ్యాలను ఆక్రమించేందుకు ఎత్తులు వేస్తుండేవి.

ఈ ప్రత్యేక పరిస్థితులలో అవశేషాలుగా వున్న ఆర్యగణ రాజ్యాలు ఏకమై ఆత్మరక్షణకు పూనుకొనేటందుకు చేసిన ప్రయత్నం మనకు మనుస్మృతిలో గోచరిస్తుంది.

మనుస్మృతికారుడు వైదిక ధర్మానుష్ఠాన యోగ్యమైన దేశం బ్రహ్మావర్తం అని పేర్కొన్నాడు.

సరస్వతీ దృషద్వత్యో
ర్దేవ నద్యో ర్యదంతరం।
తం దేవ నిర్మితం దేశం
బ్రహ్మావర్తం ప్రచక్ష్యతే॥

అక్కడ పారంపర్యంగా వస్తున్నదే సదాచారమనీ, దానిని వర్ణాలూ, అంతర వర్ణాలూ ఆచరించతగునని అంటాడు.

సింధు ఒకప్పుడు సప్తసింధువుగా వర్ణించబడేది. కాని ఇప్పుడది పంచ సింధువు మాత్రమే. మిగిలిన రెండు ఉపనదులూ ఇప్పుడు లేవు. వాటి పేరే సరస్వతీ, దృషద్వతీయున్నూ. సరస్వతి దృషద్వతిలో నికీ, రెండూ కలిసి సింధులోనికీ ప్రవహించేవి. ఇప్పు దృషద్వతి (గోగ్రా) అసలు లేదు. సరస్వతి చిన్న వాగులా తూర్పు పంజాబ్‌లో ప్రవహిస్తూ ఎడారి భూముల్లో అంతర్ధానం అవుతూంది.

ఈ రెండు నదులమధ్యనున్న దేశం బ్రహ్మావర్తం.

కురు, మత్స్య, పాంచాల, శూరసేన దేశాలు బ్రహ్మావర్తం తర్వాత చెప్పబడిన రాజ్యాలట. ఈ నాలుగూ బుద్ధుని కాలంనాటికి ఆర్యగణ రాజ్యాలుగా వుండేవి. శూరసేన రాజధాని మధుర. కోల్లండవనీ, దుమ్ము ఎక్కువనీ, కుక్కలు కరుస్తాయనీ, స్త్రీలు యక్షులంటారనీ, భైక్ష్యం దొరకదనీ బుద్ధుడు అనుగుప్తె వుండని రాజ్యం ఇది. మత్స్యదేశం ఈనాటి భరత్పూర్ ప్రాంతం. కురుదేశం ఢిల్లీ - మీరట్ ప్రాంతంలో వుండేది.

ఏతాన్ ద్విజాతయో దేశాన్।
సంశ్రయేరన్ ప్రయత్నతః॥

## గణసమాజాన్ని కాపాడ్డానికి చేసిన క్షీణప్రయత్నం

ఈదేశాలకు బ్రాహ్మణులంతా చేరుకోమన్నాడు. శూద్రరాజ్యాల్ని, అధార్మిక జనావృతములైన వానిని పాషండగణాక్రాంతమైన వాటిని వదలిలేసి రమ్మన్నాడు. వికర్ముల్ని దేశంనుంచి పంపెయ్యమంటాడు.

బ్రహ్మావర్తంలోవున్న రాజ్యాలేమిటో చెప్పడు. కాని బుద్ధుడి కాలంనాటికి ఆర్యగణరాజ్యాలుగా మిగిలి వున్నట్లు తెలుస్తున్న నాలుగింటినీ మనుస్మృతికారుడు పేర్కొంటున్నాడు. వీటి ప్రాముఖ్యత బ్రహ్మావర్తం తర్వాతనే అంటాడు. (మధ్యదేశ, ఆర్యావర్తాలను వివరిస్తూ మనుస్మృతిలో మరో రెండు మూడు శ్లోకాలు కనిపిస్తున్నాయి. ప్రస్తానఢోణిచూస్తే అవి మధ్యలో చేరివున్నాయని అర్థం అవుతుంది) శూద్ర, పాషండ, అధార్మిక రాజ్యాలను విడిచి ద్విజాతులందర్నీ చేరుకోమంటాడు. ఇదంతాచూస్తే వైదిక కర్మకాండలమీద ఆధారపడివున్న గణసమాజ వ్యవస్థను కాపాడడానికై చేసిన క్షీణప్రయత్నమని పిస్తూంది.

క్షీణ ప్రయత్నం అనడంలో నాకో వుద్దేశంవుంది. ఆత్మరక్షణకోసం చేస్తున్న ప్రయత్నాలకన్న మనుస్మృతిలో ఆత్మహననానికి పాల్పడడం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

ఇరుగుపొరుగు చిన్నరాజ్యాలనూ, పెద్దరాజ్యాలనూ ఆక్రమించడానికి భేదోపాయం చాల గొప్ప ఆయుధం తయారుచేసేడు చాణక్యుడు తన అర్థశాస్త్రంలో.

అర్థశాస్త్రం 11 వ అధ్యాయంలో చాణక్యుడు విస్పష్టమైన రూపంతో ఆ భేదవిధానాన్ని వర్ణించేడు.

"కాంభోజ, సౌరాష్ట్ర మొదలయిన దేశాలలోని క్షత్రియశ్రేణి పశుపాలకులుగా, యుద్ధోపజీవులుగా వున్నారు. లిచ్ఛవిక, వ్రజ్జిక, మల్లక, మద్రక, కుకుర, కురు, పాంచాలాలలో పెత్తందార్ల (Oligarchy) పాలనం సాగుతూంది. ఈ తెగలన్నింటిలోకీ చారుల్ని పంపాలి. వారిలో అసూయ, ద్వేష, శత్రుత్వాలు ఏలా కలిగించవచ్చునో తెలుసుకోవాలి. ఘర్షణకు బీజాల్ని నాటాలి. ... పైస్థితిలో వున్నవారు దిగువ స్థితిలో వున్నవారితో భోజన ప్రతిభోజనాలు చేయకుండానూ, పిల్లల్ని ఇచ్చిపుచ్చుకోకుండానూ నిరుత్సాహ పరచాలి. రెండోవేపున క్రిందిస్థితిలో వున్నవారిని పైస్థితిలో వున్నవారితో భోజన ప్రతిభోజనాలకూ, ఇచ్చిపుచ్చుకోవడాలకూ ప్రోత్సహించాలి. కుటుంబ గౌరవాలకోసం, అధికార హోదాలకోసం, ప్రదేశం మార్పుకోసం పేచీ పెట్టేటట్లు దిగువవాళ్ళని ప్రోత్సహించాలి. నలుగురుచేసిన నిర్ణయాలూ, తెగల ఆచారాలూ వ్యతిరేకించేటట్లు ప్రోత్సహించి సాగకుండా చేయాలి."

ఈమాదిరి భేదవిధానాలకు చాణక్యుడు వ్రాతరూపం ఇచ్చేడంటే అప్పటికే అవిబాగా అమలు జరుగుతున్నాయని చెప్పవచ్చును. ఈ భేదనీతిని దైవాదిష్ట ధర్మంగా మనువు ప్రచారం చేసేడు.

మొట్టమొదట్లోనే తాను కలుపుకోనదలచిన వాళ్ళ తన తర్వాత చెప్పుకోదగ్గ వాళ్ళేగాని కనీసం సమానులుగా కూడా చెప్పకపోవడం...ప్రథమకబళే మక్షికాపాతమే.

ఫలానావాళ్ళతో భోజనం చెయ్యి, ఫలానావాళ్ళతో చెయ్యవద్దంటూ నియమ నిషేధాలను ఏలా విధిస్తున్నాడో పైన చెప్పేను. నియమ నిషేధాలను పట్టి భోజన ప్రతిభోజనాలు అంతవగకు నిషిద్ధాలు కావనీ అప్పుడప్పుడే అవి తల ఎత్తుతున్నాయనీ వూహించవలసి వుంటుంది.

చాణక్యునివంటివాళ్ళ చిన్నపుచ్చుకోకుండా వివాహాది విషయాల్నిగురించి మనుస్మృతికారుని సూచనలు చూడండి.

ఉత్తమై రుత్తమైర్నిత్యం
సంబంధా నాచరేత్సహ।
నినీషుః కులముత్కర్షం
అధమా నధమా స్త్యజేత్ ॥
ఉత్తమానుత్తమాన్ గచ్ఛన్
హీనాన్ హీనాంశ్చ వర్జయన్।
బ్రాహ్మణ శ్శ్రేష్ఠతామేతి
ప్రత్యవాయేన శూద్రతాం ॥4॥

గణసభ్యులలో వుండే సమాన ప్రతిపత్తిని మనుస్మృతికారుడే భంగిస్తున్నాడు. ఆ గణాలను కట్టివుంచే బంధం ఏమి మిగులుతుంది? ఉత్పత్తిసాధనా లదివరకే గణపరిమిల్ని దాటేయి. ఉత్పత్తి సంబంధాలు బయటపడడానికి వెనుగులాడుతున్నాయి. వాటి విధ్వంసానికి స్మృతికారుడు "శుద్ధవైదికం"గా తోడ్పడ్డాడు.

అదివరకే గణసమాజంలో కాలూనుకున్న చతుర్జాతి విభజనం భిన్న భిన్న వృత్తుల, వ్యాపారాల విభజనలకు కూడా పాకిపోవడానికీ, వారిమధ్య భోజన ప్రతిభోజన, వివాహాది విషయాలలో అడ్డుగోడలు ఆకాశం ఎత్తునలేచి పోవడానికీ స్మృతి కారుడి "శుద్ధవైదీకమూ," రాజ్యాధికారుల 'కూటనీతీ' బాగా తోడ్పడ్డాయి. ఒకదాని కొకటి అగ్నికి వాయువులా తోడయేయి. వృత్తులకే కాదు. ప్రాంతాలకుకూడా గోడలు లేచిపోయాయి. తెలుగుదేశంలోని వేగినాటి, వెలనాటి, తెలగనాటి బ్రాహ్మణభేదాలు ఈమాదిరివే. ఉపయోగించే పనిముట్లను పట్టి కొన్నిగోడలు - మోటాటి, గూడాటి రెడ్లలో విభేదాలు. గంపకమ్మ, కావడికమ్మ తేడాలు ఇట్లాంటివే.

వీరంతా ఎవరికి వారే ఉత్తములు. తాము తప్ప మిగిలినవాళ్ళంతా అధములు.

చాణక్యునివంటి వాళ్ళ రాజనీతీ, మనువులాంటి వాళ్ళ శుద్ధ వైదిక అమాయిక బలహీనతలూ భారత దేశంలో ప్రజల నరనరాలకూ పాకిపోయినాయి. అనుక్షణమూ నేటికీ మన ఐక్యతకు అడ్డుగోడల్లా నిలుస్తున్నాయి.

మనుస్మృతి ఏకాలంనాటి సామాజిక పరిస్థితుల్ని ప్రతిబింబిస్తూంది - అనే విషయాన్ని చర్చకు తేవడమే ఇక్కడ నా వుద్దేశం. దానికి సంబంధించినంతవరకు స్థూలంగా విషయ పరిశీలన చేసేను.

---

[నాకు తోడ్పడిన పుస్తకాలు:
మనుస్మృతీ:
An introduction to the study of Indian History. —'by D. D. Kosambi
ఆ రివీను.]

# ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్ర చరిత్ర

( 92 వ పేజీ తరువాయి )

"సామాజిక శ్రమ విభాగమూ మారకమూ పరస్పర ప్రభావం కలవి. రెండూ కలసి ఉత్పత్తిని అభివృద్ధి చేశాయి. ఈ దశలో రెండు కొత్త ఉత్పత్తి విధానాలు కనిపెట్టబడ్డాయి. 1. వ్యవసాయం ; 2. లోహాలను కరిగించడం, మగ్గంమీద నేత నేయడం. ఋగ్వేదం లోహాలను కరిగించేవాళ్ళని అయః స్కారులనీ, నేత పనివాళ్ళని తంతు వాయులనీ పేర్కొన్నది. దీనితో పాటు పశువులకొరకు పెంచబడిన ధాన్యం మనుషులకి కూడా వుపయోగపడ్డాయి. అప్పటినుండి వ్యవసాయభూమి గణ సమాజానికి కొత్త ఉత్పత్తి సాధనంగా వుపకరించింది. లోహాలను కరగబోసి కంచు యినుములతో పనిముట్లూ, ఆయుధాలూ తయారు చేశారు. ఆభరణాలకి వెండి బంగారం వుపయోగపడ్డాయి. వ్యవసాయంతో పాటు వృత్తి పనులు అభివృద్ధిలోకి వచ్చాయి. వ్యవసాయం, వృత్తి పనులూ ఒకే వ్యక్తి చేయలేడు గాబట్టి దీనివల్ల రెండవ శ్రమ విభజన అత్యంత విశాలప్రాతి పదికమీద జరిగింది.

"వృత్తి పనులు వ్యవసాయంనుండి వేరుపడ్డాయి. ఉత్పత్తి యీ విధంగా రెండు ప్రధాన శాఖలుగా చీలడంతో నేరుగా మారకం కొరకే ఉత్పత్తి జరగడం ప్రారంభమైంది. మారకంతో వర్తకం, వర్తకం పెరుగుదలతో వెండి బంగారాలవంటి విలువగల లోహాలకు ప్రాధాన్యం యేర్పడింది. డబ్బు సర్వ సాధారణమైన వర్తకపు సరుకుగా (కమోడిటీ) అమల్లోకి వచ్చింది."
(డాంగే - భారతదేశం - పేజి 177. )

ఈ విధంగా నూత్న ఉత్పత్తి శక్తులు గణ సమాజ సంబంధాలలో బ్రహ్మాండమైన విప్లవాన్ని కలిగించాయి. వర్ణ వ్యవస్థ యేర్పడడంతో సమిష్టి ఉత్పత్తి భగ్నమై, వ్యక్తిగత వుత్పత్తి వచ్చింది. ఇంతకి పూర్వం సమిష్టి అగ్ని - త్రేతాగ్ని. ఇప్పుడు కుటుంబీకుని వ్యక్తిగత అగ్ని - గృహాగ్ని. అది త్రేతాగ్ని యొక్క స్థానాన్ని ఆక్రమించింది. వ్యక్తిగత ఉత్పత్తి వల్ల వ్యక్తిగత ఆస్తి, ఆ ఆస్తితో తరతమ భేదాలు వచ్చాయి. ధనికులూ, బీదలూ; దోపిడీ చేసేవారూ దోపిడీ చేయబడేవారూ; బానిస యజమానులూ, బానిసలూ; బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలూ వైశ్య శూద్ర వర్ణాలూ - సమాజంలో విరోధ వర్గాలుగా అవతరించాయి.

ఆస్తిగల బ్రాహ్మణ క్షత్రియులు ఒకవేపునా, శ్రమజీవులై పశులకాపరి వృత్తితో జీవితం గడిపే వైశ్య శూద్రులు మరోవైపునా చీలిపోయారు. క్రమంగా అగ్రవర్ణాలు ధనధాన్య హిరణ్య గోసంపదకీ, బానిసలకీ తామే యజమానులమని చెప్పుకొన్నారు. ఈ విధముగా అమల్లోకి వచ్చింది బానిస యజమాన సాంఘిక వ్యవస్థ. శూద్రులు ఆనాడు ప్రధానమైన బానిస వర్గంగా పరిగణింపబడి అడ్డమైన చాకిరీ చేసేవారు. కాలక్రమేణా ఈ బానిసవర్గ పరిధిలోకి వ్యవసాయ, పశుపాలక, వర్తకాలనుచేసే ఆర్యవైశ్యులుకూడా బలవంతంగా యీడ్వబడ్డారు. ఈ విధంగా శ్రమ విభజనా, వ్యక్తిగత ఉత్పత్తీ, మారకం, సొంత ఆస్తి - వర్ణవ్యవస్థకీ, బానిస విధానానికీ మూలకారణాలైనవి.

"పూర్వం బానిసను పురుష మేధాగ్నిలో ఒక్కుమ్మడిగా కాల్చి చంపివేసేవారు. నేడు అతని ప్రాణం పోకుండా అట్టిపెట్టి, ఆర్యద్విజుల దోపిడీ అనే సన్నసెగలో అనుక్షణమూ కాగుతూండటానికి అవకాశం కల్పించారు............బానిసకు ప్రాణం వచ్చింది; బానిస యజమానికి సంపద వచ్చింది. ఇప్పుడు వ్యవసాయమూ, వృత్తిపనులూ మారకమూ, సొంత ఆస్తి, వర్ణాలూ వచ్చాయి. వీటివల్ల అనేక సంఘటనా పరంపరలు సంభవించాయి. వర్గపోరాటమూ, వర్గరాజ్యాంగ యంత్రమూ (STATE) అమల్లోకి వచ్చాయి."
(డాంగే - భారతదేశం - 183 వ పేజీ.)

దోపిడీ చేయబడుతున్న వర్గాలు తమ బానిసత్వాన్ని రూపుమాపుకొన యత్నించినపుడు వారిని భీకర దౌర్జన్యంతో, అత్యంతదారుణమైన వర్గనియంతృత్వంతో అణచివేసేందుకు వీలుగా పీడకవర్గం అదుపులోకి తెచ్చిన అత్యంత శక్తివంతమైన సాధన మే రాజ్యాంగ యంత్రం.

## రాచరిక వ్యవస్థ : రాజ్య దృక్పథము

రాజ్యం పుట్టుకనుగూర్చి ప్రాచీన హిందూ రాజనీతి శాస్త్రజ్ఞులు ఏయే సిద్ధాంతాలను ప్రతిపాదించారో యింతకుముందే పరిశీలించాము. ప్రస్తుతం రాజ్యాంగ యంత్రం (State) యొక్క వివిధలక్షణాలనుగూర్చి వారి దృక్పథం ఏమిటో పరామర్శిద్దాం. శాస్త్రవేత్తలు రాజ్యానికి ఏడు లక్షణాలు లేక ప్రకృతులు వున్నాయని చెప్పారు. అవియివి—1 స్వామిన్; 2. అమాత్యులు (రాజాధికారులు) 3. జనపదము 4. దుర్గము 5. కోశము 6. దండము (సైన్యము) 7. మిత్రులు. ఈయేడింటిని "రాజ్య ప్రకృతులు" అని పిలిచారు.

కౌటిల్యుడు తన "అర్థశాస్త్రం"లోనూ, కామందకుడు తన "నీతిసారం"లోనూ, ఈయేడు ప్రకృతులనూ అతి విపులంగా వర్ణించారు. ప్రస్తుతం ఒక్కొక్క ప్రకృతినిగూర్చి కౌటిల్యుడు ఏమని చెప్పాడో చూద్దాం.

### స్వామిన్

స్వామిన్ (రాజు) రాజ్యంయొక్క అత్యంత ప్రధానమైన లక్షణం, లేక భాగం అనిఅంటాడు కౌటిల్యుడు. స్వామిన్ అంటే రాజు లేక సార్వభౌమాధికారి. ఈ సార్వభౌమాధికారం ఒకనియందు గానీ పెక్కుమందిలోగానీ వుండవచ్చు. సార్వభౌమాధికారి ఒకవ్యక్తిగావచ్చు. వ్యక్తుల సమూహముగావచ్చునని చెప్పిన హాబ్స్ సిద్ధాంతమును పై విషయం జ్ఞాపకానికి తెస్తుంది. ఈ స్వామిన్‌కి ప్రధానంగా వుండవలసిన లక్షణాలు యివి:

ప్రజల్ని ఆకర్షించి, వారు తన నాయకత్వాన్ని అనుసరించునట్లు చేసుకోగలగాలి. (అభిగామిక స్వభావం.)

ప్రజల్ని అర్థం చేసికోగలగాలి (ప్రజ్ఞా).

శక్తివంతుడై వుండాలి (ఉత్సాహ).

ఆత్మసంపద కలిగినవాడై వుండాలి (ఆత్మసంపద).

శక్యసామంతుడై వుండాలి (తనచుట్టూ వుండే వ్యక్తులను కంట్రోలు చేయగలిగివుండాలి).

క్షుద్రులుగాని మంత్రిమండలిని కలిగివుండాలి.

యుద్ధం చేయడానికీ, సంధి చేసికోవడానికీ తగిన సందర్భాల్ని గుర్తించగలిగిన చాకచక్యం వుండాలి.

పైన చెప్పబడిన లక్షణాలను నిశితంగా పరిశీలిస్తే, స్వామిన్ అంటే సామంతరాజు (Feudatory chieftain) కాదనీ, అంతర్గత బహిర్గత సార్వభౌమాధికారాలను చలాయిస్తూ, ఏ విదేశ రాజ్యాధికారానికీ, పరిసర రాజ్యాధికారానికీ లొంగని సార్వభౌమాధికారి అనీ బోధపడుతుంది.

### అమాత్యులు :

సాధారణంగా అమాత్యుడంటే రాజమంత్రి అని అర్థం. కాని కౌటిలీయంలోని ప్రథమ అధ్యాయాలను జాగ్రత్తగా పరిశీలిస్తే అమాత్యపదానికి అర్థం రాజ మంత్రి కాదనీ, ఏవిధమైన రాజ ఉన్నతాధికారైనా కావచ్చునని స్పష్టంగా బోధపడుతుంది. అమాత్యుడు జనపదానికి చెందినవాడై వుండాలనీ, రాజ్యంపై అధికంగా భక్తిశ్రద్ధలను కలిగి వుండాలని కౌటిల్యుడు చెప్పాడు.

### జనపదం :

ఈపదాన్ని జనులు - పదము - అని రెండు భాగాలుగా విభజించాలి. పాశ్చాత్య రాజనీతిశాస్త్రంలో జనులూ, భూభాగం అనేవి స్టేట్ యొక్క రెండు లక్షణాలు. కాని మన అర్థశాస్త్రజ్ఞులు ఈరెంటినీ ఒకే పదంలో యిమిడ్చి జనపదం అనే పేరును వ్యాప్తిలోకి తెచ్చారు. జనపదాన్ని కౌటిల్యుడు అత్యంత ప్రతిభావంతంగా నిర్వచించాడు.

భూభాగమున్న చోటనే జనులు నివసిస్తారు కాబట్టీ, జనులు భూభాగమందే నివసిస్తారు కాబట్టి ఈరెంటినీ (జన - పద) ఒకటిగానే చూచి "జనపదం" అను పేరును వ్యాప్తిలోకి తెచ్చారు. ప్రాచీన హిందూ రాజనీతి శాస్త్రజ్ఞుల ప్రతిభకు యిది తార్కాణం. పాశ్చాత్యుల దృష్టిలో భూభాగమూ, జనులూ వేర్వేరు లక్షణాలు. ఇది యాంత్రికదృక్పథం. జనులు భూభాగమున్నచోటనే నివాస యోగ్యమగు ప్రదేశాలను సృష్టించు కొనగలరు. ఐతే కౌటిల్యుడు "రాచ్చు ప్రాంతాలు, పర్వతప్రదేశాలు, పెద్దపులులవంటి వన్యమృగాలుండే భీకరారణ్యాలు లేని ప్రదేశం, ఉత్తమ జనపదం" అన్నాడు. సస్యశ్యామలమై, ఫలవంతమైన ఉత్తమక్షేత్రాలూ, ఏనుగులూ, పేరుకలపలతో నిండిన

అరణ్యాలూ జనపదంలో వుండాలి. ఇదంతా భూభాగమును గూర్చిన లక్షణాలవర్ణన.

ఇక జనులను గూర్చి ఏం చెప్పాడో చూద్దాం:

1. శత్రుద్వేషం; 2. శక్యసామంతత; 3. కర్మశీలకర్షక; 4. భక్తిశుచిత్వం - యీనాలుగు లక్షణాలను గలిగినవారై జనులుండాలి.

1 ప్రజలు శత్రువులను ద్వేషించువారై దేశభక్తులై రాజ్య స్వాతంత్ర్యాన్ని పరిరక్షించ దీక్షాకంకణులై వుండాలి. (శత్రుద్వేషం.)

2. పరిసర రాజ్యాలను యుద్ధరంగమందు ఎదిర్చే శక్తిస్తోమతులు గలవారై వుండాలి. (శక్యసామంత)

3. రాత్రింబవళ్ళూ కష్టించి భూమిని దున్ని దేశాన్ని సంపన్నత చేయగలిగి కర్మశీలత కలిగిన కర్షకులతో నిండి వుండాలి. (కర్మశీలకర్షక.)

4. రాజ్యం (State) యొక్క భక్తి ప్రపత్తులను ప్రకటిస్తూ, శుచిగల హృదయాలను కలిగివుండాలి. (భక్తశుచి మనుష్య.)

## దుర్గం:

నాలుగు రాజ్యమండలి నాలుగు దిక్కులలోనూ, యుద్ధావసరాలకొరకూ, శత్రువిధ్వంసంకొరకూ దుర్గాలను నిర్మించాలి. ఏ రాజు ప్రకృతిసిద్ధమైన దుర్గాలను నిర్మిస్తాడో, అతడు శత్రురాజులను సునాయాసంగా నిర్జించగలడు. జలదుర్గం, గిరిదుర్గం, ఎడారిదుర్గం, అటవీదుర్గం వంటి నాలుగు రకాల దుర్గాలను నిర్మించాలని చెప్పాడు.

## కోశము:

వెండి బంగారాలతో రాజ్యకోశం నిండియుండాలి. బంగారు, వెండినాణాలతోనూ, వజ్ర, వైడూర్య, మరకత, గోమేధిక పుష్యరాగంవంటి అమూల్య రత్న సంచయంతోను బొక్కసం నిరంతరమూ ఘల్లు ఘల్లుమంటూ వుండాలి. ఈవిధంగా వుండినపుడే విపరీత విపత్కర పరిస్థితులనుండి రాజ్యం రక్షింపబడుతుంది. ఈ అమూల్య సంపదనంతటినీ రాజుగానీ, ఆతని తండ్రి తాతలుగానీ ధర్మబద్ధమైన మార్గాలద్వారా సంపాదించాలంటాడు కౌటిల్యుడు. రాజ్య సంరక్షణ, సామ్రాజ్య విస్తరణ, కరువుకాటకాల నిర్మూలన, అంతఃకలహ పరిహారణ, వర్తకవాణిజ్యాల అభివృద్ధి లాంటి సర్వవ్యవహారాలూ రాజ్యకోశము మీదనే ప్రధానంగా ఆధారపడివుంటా యంటాడు. కాబట్టి కోశాభివృద్ధికి నిరుపమానమగు జాగ్రత్తను వహించాలంటాడు.

బొక్కసం ఖాళీగా వున్నప్పుడు శత్రు దండయాత్ర జరిగితే అధర్మమార్గాల ద్వారానైనా రాజు ద్రవ్యాన్ని సేకరించాలి అంటాడు.

ఫలవంతాలైన భూములపై అధికంగా పన్ను విధించడం; సంపన్నులైన వణిక్ ప్రముఖులు అమ్మే సరుకులపై విపరీతంగా ప్రభుత్వ సుంకాన్ని వసూలు చేయడం; రాజు పేరట అప్పులను వసూలు చేయడం (Forced Loans and Benevolences); ప్రజలమూఢవిశ్వాసాలనూ, మత నమ్మకాలనూ ఉపయోగించి రాజ్య ప్రయోజనాలకొరకు డబ్బు దారుణంగా గుంజడం; ద్రోహులూ, నేరస్థులూ ఐన వ్యక్తుల భూములను దాక్షిణ్యరహితంగా స్వాధీన పరచుకోవడం వంటి వివిధ మార్గాలద్వారా ప్రభుత్వ కోశాన్ని అవసర సమయాల్లో త్వరగా పూరించాలని కౌటిల్యుడు నొక్కి వక్కాణించాడు. సమకాలీన ధర్మసూత్రాల అనుసరణకంటే, రాజ్య భద్రతయే ప్రధాన లక్ష్యమనీ, దానికొరకు ధర్మోల్లంఘనం జరిగినా జరుగవచ్చునీ, దైనందిన పరిపాలనా నిర్వహణలో అలాంటి ఉల్లంఘన అనివార్యమనీ అన్నాడు.

## దండం లేక బలం (సైన్యం):

రాజు సైన్యసహాయంతోనే శత్రువును ఎదురుదెబ్బ కొట్టగలడు; రాజ్యమందు శాంతిభద్రతలను స్థాపించగలడు. కౌటిల్యుడు ఆరు విధములైన సైనికులను వర్ణించాడు.

1. మౌల (సాంప్రదాయసిద్ధమైన రాజ సైన్యం).
2. భృతక (కిరాయికి వచ్చే సైనికులు).
3. శ్రేణి (యుద్ధాలుచేసే సంఘల సైనికులు).
4. మిత్రుడగు రాజుకు చెందిన సైన్యం.
5. శత్రురాజుకి చెందిన సైన్యం.
6. ఆటవీ బలం (చెంచు, కోయ, నిషాద మొదలగు జాతులకు చెందినది) ఇవీ, సైనికులనుగూర్చి, కౌటిల్యుని వరుసక్రమం.

కౌటిల్యుని గురువర్యులు, మరో వరుస క్రమంలో పై దానికి భిన్నంగా చెప్పారు. కౌటిల్యుని గురువు వర్ణించిన వరుసక్రమము.

1. బ్రాహ్మణ సైనికులు; 2. క్షత్రియ సైనికులు; 3. వైశ్య సైనికులు; 4. శూద్ర సైనికులు.

బ్రాహ్మణ సైనికులు మిగతా వర్ణాల సైనికులందరికంటే, ఎందుకు అధికులనగా, వారియొక్క కాంతి (Luster) తగ్గనేనట! దీనికి కౌటిల్యుడు ఒప్పుకోలేదు. తన అనంగీకారానికి యీ క్రింది కారణాలు యిచ్చాడు. బ్రాహ్మణ సైన్యానికి, సాష్టాంగ దండ ప్రణామము చేయుటద్వారా శత్రురాజు బ్రాహ్మణ సైనికుల్ని లొంగదీయవచ్చు. యుద్ధకౌశలంలో నైపుణ్యాన్ని సంపాదించిన క్షత్రియువీరులు బ్రాహ్మణ వీరులకంటె అధికులు. ఆ విధంగానే వైశ్య, శూద్ర సైనికులుకూడా బ్రాహ్మణ సైనికులకంటె అధికులంటాడు. తండ్రితాతల దగ్గరనుండీ సైనికవృత్తినే జీవనాధారంగా స్వీకరించి ఎలాంటి విపత్కరమైన దీర్ఘ దండయాత్రనైనా సహించి భరించి, కత్తికట్టి కదనరంగంలో శత్రువును ముక్కముక్కలుగా చెయ్యగల క్షత్రియసైన్యమే ఆదర్శమైన సైన్యమని కౌటిల్యుడు సిద్ధాంతీకరించాడు.

కౌటిల్యుడు తన గురువుగారి వాదనను ఎందుకు తిరస్కరించాడు? వర్ణద్వేషం, బ్రాహ్మణాధిక్యతయే చాణక్యుని గురువుయొక్క సైనిక వరుసక్రమానికి ప్రాతిపదిక. ఈ వరుసక్రమంవల్ల రాజ్య సుస్థిరతకు భంగం వాటిల్లుతుందని కౌటిల్యుడు పూర్తిగానమ్మాడు.

## మిత్ర :

మిత్రులలో రెండు రకాలు — 1. సహజమిత్రుడు; 2. కృత్రిమ మిత్రుడు. కృత్రిమ మిత్రునికంటే సహజ మిత్రుడే అన్నివిధాలా శ్రేయస్సును కోరుతాడని చెప్పాడు.

సూక్ష్మంగా పైన చెప్పిన ఏడు లక్షణాలు లేక భాగాలు హైందవ రాజ్యాంగ యంత్రానికి సంబంధించిన ఏడు అంగాలని ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రవేత్తల దృక్పథం.

## గణసంఘాలు : అంతర్గత నిర్మాణము :

ఆదిమార్య గణాలు శత్రు దండయాత్రలకీ అంతర్యుద్ధాలకీ గురియై చరిత్రలో తుడిచిపెట్టుకొనిపోయి, నాశనంగాక పూర్వం వాటిలో ఏయే రకాల రాజ్యాంగాలు లేక ప్రజాతంత్రాలు అమల్లో వుండేవో, వాటి విధి విధానాలేమిటో పరిశీలిద్దాం.

అలెగ్జాండరు దండయాత్ర జరుగునాటికి, దేశంలో 1500 నగరాలున్నాయని స్ట్రాబో (Strabo) వ్రాశాడు. అలెగ్జాండరు స్వయంగా 15 గణ సంఘ రాజ్యాలను చూచాడు. మౌర్య చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయబారి ఐన మెగస్తనీసు 118 రాజ్యాలను పేర్కొన్నాడు. వీటిలో కొన్ని రాచరిక వ్యవస్థలు; కొన్ని సైనిక ప్రజా తంత్రాలు. ఇతడు వ్రాసిన "ఇండికా" గ్రంథం పట్టిచూస్తే, నగరాలలో రాచరికముపోయి, సైనిక ప్రజాతంత్రాలు వ్యాపిస్తున్నవనే దుకు సాక్ష్యాలు, నిదర్శనాలు కన్పిస్తున్నాయి. (జనకుడు పాలించిన విదేహ, తిరిగి ప్రజాతంత్రంగా రూపొందిందని మహాభారతం చెప్తోంది. వజ్జియగణ సమాఖ్యలో విదేహ ఒక భాగం.)

ఏరియన్ అనే గ్రీకు రచయిత — "స్వపరిపాలన అనుభవించే ప్రజలూ, ప్రజాతంత్ర రాజ్యాలను అనుభవించు నగరాలూ," అని పేర్కొన్నాడు.

రాచరిక నిరంకుశత్వాన్ని బేషరతుగా సమర్థించిన పాణినీ, కౌటిల్యుడూ యీగణాలు అరాజకంలో జీవించాయని వర్ణించారు.

"అరాజకగణ" సంఘ నిర్మాణమంటే, కట్టుబాటు లేని గందరగోళ పరిస్థితిగా తప్పునిర్వచనాలు చేశారు. భారతదేశ చరిత్రలో గణసంఘాలకీ, వాటి యందలి ప్రజాస్వామ్య వ్యవస్థలకీ అధికతర ప్రాముఖ్యాన్నిచ్చేందుకు "Hindu Polity" అనే గ్రంథం రచించిన జయస్వాల్ కూడా ఈ గణవ్యవస్థను శాస్త్రీయ దృక్పథంతో అర్థం చేసికోలేకపోవడం దురదృష్టకరం.

ఆచారాంగ జైనసూత్రాలలో ఈక్రింది విధమైన 6 గణాలు నాటికాలంలో వుండేవని పేర్కొనబడింది: 1. అరాయణి; 2. గణరాయణి; 3. జువరాయణి; 4. దోరజ్జిని; 5. వేరజ్జిని; 6 విరుద్ధరజ్జిని.

## అరాజక గణాలు

ఈ ఆరుగణాల్లో మొదటిది అరాయణి అంటే అరాజకగణ మన్నమాట. పైరివేటుఆస్తి, వర్గాలూ, శాసన విధానం, దోపిడీ మున్నగు వర్గరాజ్యాంగ యంత్రం లక్షణాలు లేనిగణమని అర్థం.

ఇలాంటి ఒక అరాజక గణాన్ని అథర్వణవేదం యిలా వర్ణించింది:

"మీరొక్కడికి పరస్పర సహకారులై, పరస్పర ప్రియభాషులై ఒక కాడికింద వచ్చారు. మీరు ఒకే మధురరసమును త్రాగుదురుగాక. మీరు సమిష్టిగా భుజింతురుగాక. మిమ్ములను ఒకేబాటలో ఒకే కాడికి కట్టుచున్నాను."

ఇలాంటి "అరాజక" గణాన్నే జైనయాత్రికుడు దక్షిణభారతంలో చూచాడు. గ్రీకు రచయితలు కూడా

యిలాంటి గణాలు దేశంలో వుండేవని తగిన సాక్ష్యాలతో వ్రాశారు. గ్రీకులు వీరిని "ముచికనులు" అని పేర్కొన్నారు. ఇదే ముచికర్ణిక గణమని గుర్తించబడింది.

## వైరాజ్య గణాలు

అరాజక గణాల తరువాత ప్రధానంగా పేర్కొన దగ్గవి "వైరాజ్య" గణాలు. వీటిలోకూడా వర్గ రాజ్యాంగ యంత్రం, రాజరికం లాంటివి లేవు. ఐతే వర్ణవిభాగ రూపమైన శ్రమవిభజనా, ఆస్తికి సంబంధించిన తారతమ్యాలూ, పితృస్వామిక బానిసత్వం వున్నాయి. ఇలాంటి గణాలను ఐతరేయ బ్రాహ్మణం, యజుర్వేదం పేర్కొన్నాయి.

ఈ గణాల్లో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ధనికులు శూద్ర బానిసల్లపై అధికారాన్ని చలాయించే రాజ్యాంగ యంత్రాన్ని సృష్టించేందుకు ప్రథమంగా ప్రయత్నాలు చేశారు. కాలక్రమేణా ఈగణ ప్రజాస్వామికాన్ని భాగ్యవంతులైన ప్రభువర్గాలు చేజిక్కించుకొని, ఆర్యవైశ్యుల్ని కూడా శూద్రబానిసల్లోకి గెంటివేశారు.

## స్వారాజ్య గణాలు

స్వరాజ్య గణసంఘాలు పశ్చిమ భారత దేశంలో వున్నాయని ఐతరేయ బ్రాహ్మణంవల్ల తెలుస్తోంది. "ఇలాంటి నిర్మాణం కలిగిన గణం కాలక్రమేణా పని చేయడానికి వీల్లేనంత పెద్దదిగా పెరిగిపోవడంవల్ల సభయొక్క (గణసమాజసభ) సమిష్టి కార్యకలాపాలను నడిపించడానికి, ఒక చిన్న కౌన్సిలును యెన్నుకొనే వారు. ఈకౌన్సిళ్ళలోని పెద్దలవంశాలు కాలం గడిచిన కొలదీ వారసత్వం ద్వారా ప్రభువర్గాలుగా మారిపోయాయి................స్వారాజ్య మంటే స్వపరిపాలన కానేకాదు. గణంయొక్క వ్యవహారాలను నడపడానికై యెన్నుకొనబడి న్యాయ శాస్త్రరీత్యా ధికార మీయబడిన నాయకత్వమని అర్థం. ఈ నాయకత్వానికి యెన్నుకొనేవారితో నిమిత్తం లేకుండానే స్వతంత్రించి పనిచేసే హక్కున్నది. ఇది "పెద్దల" నాయకత్వము (కులపెద్దలు; సంఘముఖ్యులు). ఇది వరకు యెన్నుకోబడ్డ "స్వరాట్" గణసభ్యులతో సరిసమాన హోదాలోనే వుండేవాడు. ఇప్పుడు అతడు "పెద్ద"యై అందరికీ పైవాడయ్యాడు.

## గణనాయకుని నుండి పారంపర్య రాజరికం

గణం చిన్నదిగావున్న ప్రాథమిక దశలో గణ సభ్యులంతా చేరి యుద్ధ నాయకుణ్ణి యెన్నుకొనేవారు. అప్పుడు "సమితి" లేక "సదస్సు" అనే గణ సమాజ సభ్యుల సర్వసభ్య సమావేశం అమల్లో వుండేది. కాని క్రమేణ ఈ సమితి స్థానాన్ని "సభ" ఆక్రమించింది. ఎన్నుకోబడ్డ నాయకత్వం (ప్రధానంగా సైనిక నాయకత్వం) ప్రత్యేక హక్కులు కలిగిన ప్రభువుల వర్గంగా - అరిస్టోక్రసీగా మారింది. క్రమేణా ప్రైవేటుఆస్తి అవతరించడంతో గణసంఘం రాజ్యంగా మారింది. ఎన్నుకోబడ్డ సైనిక నాయకులు రాజులైనారు. ప్రభువుల కులాలు (వంశాలు) రాజవంశాలుగా మారిపోయాయి. ఫలితం? పీడిత ప్రజాసామాన్యంపై (వైశ్య, శూద్ర బానిసలపై) రాజుపేరిట వర్గ రాజ్యాంగ యంత్రం తిష్టవేసింది. ఈ రాజ కులాలవారు (సంఘముఖ్యులు - కుల లేక తెగ పెద్దలు.) వంశ పారంపర్యంగా రాజులయ్యారు. పూర్వం గణ సభ్యులంతా చేరి తాము యెన్నుకొన్న నాయకులకు చేసే అధికార ప్రదానవిధి యిప్పుడు పట్టాభిషేక మహోత్సవంగా పరిణమించింది "సభ" లో ఆస్తికి అధికారులైన భాగ్యవంతులే (సంఘ ముఖ్యులు) యెన్నుకోబడేవారు.

ఆనాటి కాలంలో, కొన్ని గణ సంఘాలు కలిసి గణ సమాఖ్యలుగా ఏకమయ్యేవి. శత్రు దండయాత్రలనుండి రక్షించుకొనేందుకూ, వ్యాపారం వ్యవసాయం వంటి వాటిని పరస్పర సహాయంతో పెంపొందించుకొనేందుకూ, వివిధ గణ సమాఖ్యలు ఏర్పడ్డాయి. పంజాబునుండి సింధుదేశం వరకూ యివి వ్యాపించి వుండేవని పాణిని వ్రాశాడు. వాటిని అతడు రెండుగా విభజించాడు :

1. ఆయుధ జీవి సంఘాలు.

2. రాజ శబ్దోపజీవి సంఘాలు లేక వార్తా - శస్త్రోపజీవి సంఘాలు. ఈ సంఘాలనే కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో "శస్త్రోపజీవి సంఘాలు" అని పిలిచాడు.

## 1. ఆయుధజీవి సంఘాలు :

వీటిలో యింకా శాశ్వతమైన వర్గ విభాగమూ వర్ణ విభాగమూ, వర్గపరిపాలనా యేర్పడలేదు. ఈ సంఘాలకి యెన్నుకోబడ్డ నాయకత్వం యింకా ప్రత్యేక సాయుధ, వంశానుగత ప్రభువుల వర్గంగా మారలేదు. ఇది సైనిక ప్రజాతంత్రం. ఆస్తి తారతమ్యాలూ, పితృస్వామిక బానిసత్వమూ దీనిలోకి ప్రవేశించాయి. కాని వర్గవైరుధ్యాలు అత్యంత తీవ్ర రూపం దాల్చలేదు. ఒక్క శూద్రబానిసల్ని తప్ప సంఘంలోని అందరూ ఆయుధాలు ధరించేవారు.

క్రీ. పూ. 300 నాటికి దేశంలోవున్న వివిధ శస్త్రోప జీవి సంఘాల పేర్లివి : 1. వృక 2. దమని 3. కౌండోప రథ 4. దాండకి 5. క్రౌష్టకి 6. జాలమాని 7. బ్రహ్మ గుప్త 8 జానకి (3-8 వరకూవున్న ఆరు సంఘాలుకలిసి సమాఖ్యగా ఏర్పడ్డాయి.) 9. యౌధేయ 10. పార్శ్వ 11. క్షుద్రకులు 12. మాళవులు 13. కఠ 14. సౌభూతి 15. శిబి 16. పాటల 17. భాగేల 18. కాంభోజ 19. సౌరాష్ట్ర 20. క్షత్రియ 21. శ్రేణి 22. బ్రాహ్మణిక 23. అంబష్ట.

## 2. రాజశబ్దోపజీవి సంఘాలు :

ఈ సంఘాలలో ఆస్తి తారతమ్యాలు, యుద్ధ నైపుణ్యమూ చాల ఉచ్ఛస్థితి నందుకొన్నాయి. గణ ప్రజాస్వామికం చాల బలహీనంగా వుండేది. గణసంఘ కార్యకలాపాలను నిర్వహించేందుకు ప్రభువర్గాలకీ వంశాలకీ చెందినవారు—"సంఘ ముఖ్యులు"—పరిపాలనా సంఘాల కెన్నికోబడే అర్హతను కలిగివుండేవారు. "రాజన్యులు" అని వీరు పిలువబడేవారు. 1. లిచ్ఛవి 2. మల్ల 3. మౌర్య 4. కుకర 5. కురు 6. పాంచాల మొదలైనవి రాజశబ్దోప జీవి సంఘాలుగా పరిగణింప బడ్డాయి.

క్రీ. పూ. 6 వ శతాబ్దంనాటికి కాబూలులోయవద్ద నుండి గోదావరీ తీరంవరకూ 16జనపదాలు వ్యాప్తిలో వుండినట్లు బౌద్ధ వాఙ్మయానికి చెందిన గ్రంథాలు తెలుపుతున్నాయి. ఆ 16 జనపదములయొక్క పేర్లివి : 1. అంగ 2. మగధ 3. కాశి 4. కోసల 5. వజ్జియనులు 6. మల్ల 7. చేది 8. వత్స 9. కురు 10. పాంచాల 11. మత్స్య 12. శూరసేన 13. అశ్మక 14. అవంతి 15 గాంధార 16. కాంభోజ. వైశాలికి చెందిన లిచ్ఛవీ గణ సంఘమూ, మిథిలి యందలి విదేహగణ సంఘమూ (లిచ్ఛవులు, విదేహులు) వీరిపై వజ్జియ గణసమాఖ్యగా రూపొందాయి. ఈ సమాఖ్యలో మరో ఐదు గణసంఘాలుకూడా వుండేవి. అవి యివి :

(1) జనత్రికులు (2) భోగులు (3) ఇక్ష్వాకులు (4) కౌరవులు (5) ఉగ్రులు. వజ్జియనుల గణ సమాఖ్యలో వైశాలికి చెందిన లిచ్ఛవులు అత్యంత శక్తి వంతులు. గుప్తచక్రవర్తులలోని వాడైన సముద్ర గుప్తుడు లిచ్ఛవీ దౌహిత్రుడనేది సమనాహ్వం

వీరేగాక మరో ఎనిమిది గణసంఘాలు కూడా నాడు వున్నవి. అవి యివి :

(1) కపిలవస్తు యందలి శాక్యులు (2) సుంసుమార పర్వతమందలి భర్గులు (3) అల్లకప్ప యందలి భులులు (4) కేశపుత్ర యందలి కాలాములు (5) రామగ్రామ మందలి కోలీయులు (6) కుశినార మల్లులు (7) పావా మల్లులు (8) పిప్పలి వనమందలి మోరీయులు.

## కపిలవస్తు యందలి శాక్యగణ సంఘము :

సుప్రసిద్ధ బౌద్ధచరిత్రవేత్తయైన బుద్ధఘోషుని వ్రాతల వల్ల, గౌతమబుద్ధుని తండ్రివైపు ఎనభైవేల కుటుంబాలూ, తల్లివైపున ఎనభైవేల కుటుంబాలూ శాక్యగణ సంఘంలో వుండేవని తెలుస్తోంది. కుటుంబానికి ఆరుగురు సభ్యులచొప్పున లెక్కవేసినా, శాక్యగణ తంత్రంలో దాదాపు పదిలక్షలమంది జనాభా వుండి వుండాలని "బుద్ధిస్ట్ ఇండియా"లో రైస్ డేవిడ్స్ వ్రాశాడు. బౌద్ధగ్రంథాలైన "మహావస్తు" "లలిత విస్తార్" అనే వాటిలో శాక్యపరిషత్తులో యెన్నికైన సభ్యుల సంఖ్య 500 అని తెలుస్తోంది. శాక్యులది ప్రజా తంత్రము. ప్రత్యేక హక్కులు గలిగిన ప్రభువర్గం పరిపాలనా వ్యవహారాలను చూచేది. భాగ్యవంతులైన శాక్యులనుండి నాయకులు లేక పెద్దలు యెన్నికయే వారు. వీరే పరిపాలకులు. శాక్యపరిషత్తు కపిలవస్తులో వుండి అవసరమైన శాసనాలను అమలుపరిచేది. శాక్య గణతంత్రానికి వంశక్రమానుగతమగు రాజు లేడు. గౌతమబుద్ధుని తండ్రి, శాక్యుల నాయకుడూ ఐన శుద్ధోదనుడు యిలాంటి "తెగనాయకుడే." కపిలవస్తు లోని శాక్యగణ సంఘంలో రక్తసంబంధత్వం గలిగిన వారే సభ్యులుగా వుండేవారు.

శాక్యులలో ప్రైవేటు ఆస్తి, కలవారూ లేనివారూ అనే భేదం, పితృస్వామిక యాజమాన్యం, బానిస విధానం ప్రవేశించాయి. ఐనప్పటికీ ఈ గణసంఘంలో చెప్పుకోతగినంత ఐక్యత కన్పిస్తోంది.

## కుశినార, పావానగర మల్లులు :

కుశినార మల్లులకీ, పావామల్లులకీ గణసంఘా లుండేవి. గౌతమబుద్ధుని కాలంనాటికి ఈ రెండు సంఘాలూ ప్రసిద్ధికెక్కాయి. "కుశినార" లోనే గౌతమబుద్ధుడు మహాపరి నిర్వాణం చెందాడు.

గణనాయకుని గానీ, సేనానిని గానీ, ఉపసేనా పతిని గాని యెన్నుకోవాలంటే, మల్లులందరూ "శాంతాగారం" లేక సంస్థాగారంలో సమావేశ మయ్యేవారు.

విపరీతమైన కష్టనష్టాలకోర్చి, విశేష శ్రమతో ప్రాచీన భారతదేశ చరిత్రను శాస్త్రీయ దృక్పథం ప్రకారం పరిశోధన చేసిన సుప్రసిద్ధ మార్క్సిస్టు

పండితుడు - రాహుల్ సాంకృత్యాయన్ "ఓల్గా - సే గంగా" అనే గ్రంథంలో నాటి గణసమాజ పరిషత్తులోని ఎన్నికల వివరాలను కూలంకషంగా యిచ్చాడు.

సమ్మతిని తీసుకొనుట (ఓటింగు) యిలా జరిగేది: చువ్వలు పంచువారు ఓట్లున్న కర్రచువ్వలను తీసికొని సభ్యుల దగ్గరకు వచ్చేవారు. వారికి ఒక చేతిసంచిలో ఎరుపు చువ్వలుండేవి. రెండవ చేతిసంచిలో నలుపు చువ్వలుండేవి. తీర్మానాన్ని ఎవరు అంగీకరించరో వారు నలుపు చువ్వలను తీసుకోవాలనీ, అంగీకరించేవారు ఎరుపు చువ్వలను తీసుకోవాలనీ, గణ సంఘ నాయకుడు చెప్పేవాడు. చువ్వలను పంచేవాళ్ళు ఒట్లతో వున్న చువ్వలను తీసుకొని ఒక్కొక్క సభ్యుని దగ్గరికి వెళ్ళేవారు. అందరూ తమతమ ఇచ్ఛానుసారం ఒక్కొక్క చువ్వను తీసుకొనేవారు. పంచినవారు తిరిగి రాగానే సంచుల్లో యింకా మిగిలిన చువ్వలను అధ్యక్షుడు లెక్కించేవాడు. ఎరుపవో లేక నలుపువో ఎక్కువవుండేవి. నలుపు చువ్వలు లెక్కువగా వుంటే, నలుపు చువ్వలనే సభ్యులు అధికంగా తీసుకొన్నారని అర్థం. అప్పుడు అధ్యక్షుడు యిలా ప్రకటించేవా… "పూజ్య స…

స్తోంది. మగధ పాలకుడైన అజాతశత్రుని ఉక్కు పాదాల క్రింద ఇతర గణతంత్రాలతో పాటు విదేహ కూడా నలిగి నశించింది.

## వైశాలీ లిచ్ఛవులు

వైశాలికి చెందిన లిచ్ఛవి గణసంఘం బౌద్ధుల కాలంలో అత్యంత శక్తివంతమైనదిగా వుండేది. 8 గణ సంఘాలు కలసి ఏర్పడిన వజ్జియ గణసమాఖ్యలో యీ లిచ్ఛవులు ప్రధానస్థానం ఆక్రమించారు. జైన మత స్థాపకుడైన వర్ధమాన మహావీరుని జన్మస్థలం వైశాలియే. గౌతమబుద్ధుని కాలంనాటికి వైశాలీనగరం సకలంపదల … స్వర్గసామ్రాజ్యాన్ని తల దన్ను వైభవ … సిల్లిందని "లలితవిస్తార" చెపుతోంది. … వంశక్రమానుగతమైన రాజరిక … గ్రజాతంత్రమే. గణస … తాగారం" … "

తలో పోరుసల్పుతారో, రాజకీయ వ్యవహారాలను చక్కదిద్దుకొంటారో అంతదాకా వారికి వృద్ధియే గాని హానికలుగదు," అని అన్నాడు.

## మహాభారతం : గణసంఘాలు

క్రీ. పూ. 1500 లో మహాభారత యుద్ధం జరిగింది. నాటికి భారతదేశంలో ఉత్తరాన 28 గణసంఘాలున్నట్లు తెలుస్తోంది. వాటిలో ముఖ్యమైనవి : 1. శూరసేన 2. భద్రకార 3. బోధ 4. శాల్వ పటచ్చర 5 సుస్థల 6. ముకుంద 7. కుళింద 8. కు తి 9. శాల్యాయన.

ఇవేగాక, "అంధకవృ[illegible] అనే సమాఖ్య కూడా నామువుంది. ఈ[illegible] 1. అంధకులు 2. వృష్ణి 3. యా[illegible] భోజ అనే ఐదు తెగలు లేక[illegible]

ఈ స[illegible] సంఘ ముఖ్య[illegible]

సంఘాలను నాశనం చేయడానికి ఎందరు సంవత్సరాలు నిరంతర పోరాడవలసివచ్చింది.

## ప్రాచీన గణ సమాజాలు : ప్రజాస్వామిక విధానం

ప్రాచీన గణసంఘాలలో పరిపాలనావిధులు ఎలా అసలు జరుపబడేవో తెలుసుకొనేందుకైన, బౌద్ధ మతాల పుట్టుకకు పూర్వమే రచింపబడినట్లు పరిగణింపబడుతోన్న (Pre-Buddhist) పంచగామ జాతకం, ఏకపన్న జాతకం, ఊలూక జాతకం వంటి "జాతక కథలూ," మహాపరినిబ్బాణ సూత్తం లాంటి సూత్తాలూ, మనకి ప్రధానంగా తోడ్పడతాయి.

## ఎన్నిక పద్ధతులు

హిమాలయ పర్వతంమీద ఒకసారి పెద్ద రాతి చదునుపై పశువులన్నీ నియుక్తి (ఎన్నిక) కొరకు సమావేశమయ్యాయట. అవి తమలో తాము యిలా అనుకొన్నవట: "మానవులు తమలో ఒకనిని రాజుగా [illegible]న్నుకొన్నారు. మృగాలు మృగరాజుగా సింహాన్ని [illegible]న్నుకొన్నాయి. మనంమాత్రం యెందుకు యెన్ను[illegible] [illegible]లు సహితం అనందుడను

నడిపేందుకు ఒక నాయకుణ్ణి సభ్యులంతా చేరి ఎన్నుకొనేవారు. (2) ఆ సంఘముఖ్యుడు లేక నాయకుడు సుందరుడూ (బంగారుబొమ్మ) శక్తివంతుడూ బహుజన ప్రియుడూ సద్గుణుడూ అయి వుండాలి.

లిచ్ఛవీ, శాక్య, గణసంఘాలలో నాడు అమలులో వున్న వివిధ నియమాలనూ, కార్యకలాపాలనూ మహావీరుడూ, బుద్ధుడూ తమ జైన, బౌద్ధమత సంఘాలలోకి ప్రవేశపెట్టారు. కాబట్టి నాటి బౌద్ధసంఘ నియమాలను పరిశీలిస్తే, ఈ మత సంఘ విధివిధానాలయొక్క నియమాలయొక్క నిండు ప్రతిబింబమైన నాటి గణసంఘ నియమాలను మనం తెలుసుకోవచ్చును.

"చుళ్ళవగ్గ" అనే అతిప్రాచీనబౌద్ధగ్రంథం, నాటి మతసంఘ నియమాలను ఈవిధంగా తెలుపుతోంది: గౌతమబుద్ధుడు ఆనందుని పిలిచి రాజగృహ సమీపమున వున్న భిక్షువులందరినీ సమావేశపరచమని కోరాడు. భిక్షువులు సమావేశమైన తర్వాత బుద్ధుడు వారికీవిధంగా బోధించాడు. "భిక్షువులారా, మీరంతా ఒకచోట సమావేశమై, సభలను జరుపుకొన్నంత వరకూ అభివృద్ధినే పొందుదురుగాని వినాశం కలుగదు. మీరంతా మీమీ అభివృద్ధినిగూర్చీ, సంఘ కార్యనిర్వహణనుగూర్చీ, చర్చలు జరుపుచున్నంతవరకూ వృద్ధికలుగును. భిక్షువులు తమ సంఘానికి బద్ధులై యున్నంతవరకూ వృద్ధికలుగును. బౌద్ధసంఘ నియమాలను పాటించునంతవరకూ మీకు వృద్ధియే గాని, హాని కలుగదు."

ఆనాడు గణపరిషత్తులో చర్చించవలసిన అంశాలను మరొక వ్యక్తి సభ్యులముందు వుంచుతాడు. ఏ తీర్మానాన్ని అతడు ప్రతిపాదించబోతున్నాడో ముందుగా ప్రకటిస్తాడు. ఈ ప్రకటనను "జ్ఞప్తి"అని పిలిచేవారు. ఈ ప్రకటనను మూడుసార్లు చదివేవారు. మూడుసార్లు చదివిన తరువాతకూడా సభ్యులలో ఎవ్వరూ మాట్లాడకుండా నిశ్శబ్దంగా వూరుకుంటే, ప్రవేశపెట్టబడిన తీర్మానం సభ్యులచే అంగీకరింపబడిందని అర్థం చేసుకోవాలి.

తీర్మానానికి ప్రతికూలంగా వున్నవారు లేచి తమ అసంగీకారానికి కారణాలు వివరించేవారు. వాదప్రతివాదాలు జరిగినపిదప, బహుమతానుసారం (మెజారిటీ) నిర్ణయం తీసుకోబడేది.

"కోరమ్" పద్ధతికూడా వుండేది. నాటి బౌద్ధసంఘ సమావేశానికి కనీసం 20 మంది సభ్యులు హాజరు కావాలి. కోరమ్ పూర్తికాకపోతే తీర్మానం అంగీకరించబడదు. ఒకవేళ అంగీకరించబడ్డా, దానిని సంఘ సమ్మతమైనదాన్నిగా పరిగణించకూడదని బుద్ధుడు స్పష్టంగా చెప్పాడు.

ఓటుపేరు "ఛంద"; అంటే కోరిక లేక అభీష్టము. ఛందకు మరోపేరు "స్వతంత్ర"; అంటే Free will : ఓటుచేసేందుకు యిచ్చేదాన్ని "శలాక" (బ్యాలట్ పేపరువంటిది) అనేవారు. ఓట్లు తీసుకొనే వాణ్ణి "శలాక గ్రాహక" అనేవారు. ఇతని నియామకానికి కఠినమైన షరతులుండేవి. శలాకలను తీసుకొనేందుకు త్రివిధ మార్గాలను అనుసరించేవారు.

గూఢక : (Secret Ballot.) ఎన్ని పక్షాలు కలవో, అన్ని పక్షాలకీ వేర్వేరు రంగులు కల పత్రాలుండేవి. భిక్షువు ఆ పత్రాల వివరాల్ని తెలిపి, సభ్యుని యిష్టం వచ్చిన పత్రాన్ని తీసుకోవచ్చునని, అది రహస్యంగా వుంచవలెనని చెప్పేవాడు.

2. సకర్ణ జల్పకము : (చెవిలో పేరు చెప్పుట) శలాకను యిచ్చే భిక్షువుడు శలాకగ్రాహకుని చెవిలో తన శలాకను యెవరికిచ్చేదీ చెప్పేవాడు.

3. వివృతక్ : (పేరు బైటికి చెప్పుట) శలాకను యిచ్చేవారి పేరును స్పష్టంగా చెప్పేవిధానాన్ని (బైటికి) "వివృతకవిధి" అనేవారు.

లేఖకులు : సంఘసమావేశాల్లో జరిగే కార్యక్రమాన్ని, యివ్వబడే ఉపన్యాసాలనూ వ్రాసేందుకు లేఖకు లుండేవారు.

ఈ విధివిధానాలకీ, అత్యున్నతమైన ప్రజాస్వామ్య సాంప్రదాయాలకీ, నియమాలకీ నాటి గణసంఘ నిర్మాణాల సాంప్రదాయాలే ఆధారాలూ, పునాదులూ అనేది వివాదరహితం.

ఐతే ఒక ప్రధాన విషయంమాత్రం మనం విస్మరించరాదు.

2,500 సంవత్సరాలక్రితం అత్యున్నతమైన ప్రజాతంత్ర నియమాలు భారతదేశంలో వున్నవనేమాట నిజమేగాని, అవి ఏ గణసంఘాల్లో అమల్లో వుండేవనేది ప్రధాన ప్రశ్న. ప్రైవేటు ఆస్తి, వర్గభేదాలూ, బానిసవిధానం, పితృస్వామికం - యిలాంటి అవలక్షణాలన్నీ నాటి గణసంఘాలలోకి ప్రవేశించాయన్న విషయం మనం ఎన్నటికీ మరువరాదు.

గణసమాజ వ్యవహారాలన్నీ సంపన్నవర్గానికి చెందినవారి ప్రయోజనాలకి అనుగుణంగానే నిర్ణయింపబడేవి.

పరిపుష్టులకూ, వాటి నియమ నిబంధనలకూ ఉన్న వర్గ పరిమితులు, వర్గస్వభావం ఉంటనే వున్నాయి. ఐనప్పటికీ, రెండువేల ఐదువందల సంవత్సరాల క్రితమే అనునాతన పార్లమెంటరీ ప్రజాస్వామిక విధానాలనూ, సాంప్రదాయాలనూ పోలిన వాటిని నాటి భారతీయులు కొద్దో గొప్పో తేడాలతో అనుసరించా రనేది అహంకారంతో కూడిన అతిశయోక్తి మాత్రం కాదు. ఐతే ఈ దృక్పథంతో శ్రీ డాంగే దురదృష్టవశాత్తూ అంగీకరించడంలేదు. శ్రీ డాంగే యిలా అన్నారు :

"ఐతే, ఋగ్వేదకాలంలో బ్యాంకులూ, వడ్డీరేట్లూ వున్నవనీ, బుద్ధ విహారాలలో పార్లమెంటరీ ఓటింగు పద్ధతి వున్నదనీ, చాణుక్యుని కాలంలో కార్టెల్సూ, కంబైన్సూ లాంటి వ్యాపార సంస్థ లున్నాయనీ ఇత్యాది విషయాలనేకం "కనిపెట్టి" యత్నించిన సాహసవంతులగు ప్రొఫెసర్లు లేకపోలేదు. కాని సామాజిక రాజకీయ వాస్తవికత దృష్ట్యా, యిలాంటి ప్రయత్నాలన్నీ అపహాస్యాస్పదమైనవి." (డాంగే-భారతదేశం-పేజి 22.)

దిఘనికాయం, మహావస్తు, లలితవిస్తారం, జాతక కథలూ వంటి అత్యంత ప్రాచీన గ్రంథాలలో కన్పించే నిదర్శనాల దృష్ట్యా డాంగేయొక్క పై అభిప్రాయంతో ఏకీభవించలేము.

## గణసంఘాలు : బంధుయుద్ధాలు

ఆదిమార్య గణసమాజం బహుచిన్నది. శ్రమ వైవిధ్యమూ, శ్రమవిభజనా, మారకమూ, పీడించేవారూ పీడింపబడేవాళ్ళూ, వర్గసంఘర్షణ ఆ గణంలో లేకనే మనం చూశాం. అందువల్ల రాజ్యాంగ యంత్రంగాని, సైన్యమూ, దారుణ నియంతృత్వానికి మూలసాధనమైన గూఢచారి పోలీసుగానీ, పన్నులు వసూలుచేయడంగాని లేవు.

ప్రైవేటు ఆస్తీ, దోపిడీ, నిరంతర భోగలాలసత్వం, నిత్యం పస్తులు-యిం వున్నలింపగానే గణానికీ గణానికీ మధ్య అంతర్యుద్ధాలకుతోడు గణంలోనే అంతర్యుద్ధాలు దావానలంలా చెలరేగాయి. బానిసలకొరకు, పశువులకొరకు, సంపదకొరకు ఒకగణం మరో గణంతో పోరాడింది.

ప్రైవేటుఆస్తీ, వర్గరాజ్యాంగయంత్రం అమల్లోకి వచ్చాక ప్రజల జీవితం ఎలాగుంది? ఋగ్వేదకవి యిలా విలపించాడు. "దేవుడు మానవునికి విధించిన శిక్ష క్షుద్బాధయేనా? క్షుధతో ఆకలితో చావాలని దేవుడి యిచ్చినితే మరి భాగ్యవంతులు ఎందుకు చిరంజీవులుగా వుండడంలేదు? ఆస్తిగల బుద్ధిహీనుడి చేతిలో ఆహారమంతా చేరిపోవడ వల్ల మిగిలినవాళ్ళకేమీ ప్రయోజనం లేదు. తనకు తాను తింటాడు. మిత్రులకు పెట్టడు. అతడు నిందలపాలౌతాడు" (ఋగ్వేదం—10-117)

"సమిష్టి ఉత్పత్తీ, శాంతి సౌమనస్యాలకీ నిలయమైన గణసమాజ గర్భంలోనుండి అపూర్వమూ, బ్రహ్మాండమూ ఐన వర్గసంఘర్షణలు పెరిగి బలవంతంగా బద్దలయ్యాయి. అసంఖ్యాకులైన వ్యవసాయదారుల ప్రజాస్వామికమూ ("విశా" ప్రజాసామాన్యం), శూద్రులూ వుత్పత్తిచేసిన సంపదపై పెత్తనం చలాయించడానికి ఆర్థిక ప్రాబల్యం గల వర్గంలోని రెండు శక్తివంతమైన ముఠాలు (బ్రాహ్మణ క్షత్రియులు) దౌర్జన్యయుక్తమైన భీకరసంఘర్షణలోకి దిగాయి. దోపిడీలో మిగిలే హక్కుకొరకు వారిలోవారు కలహించుకొంటూనే, ప్రాచీన సంప్రదాయమైన గణజీవితం కొరకూ ధర్మం నీతి నియమాలకొరకూ, ఆర్థిక నిర్మాణవిధానాలకొరకూ యింకా పోరాడుతుండే ప్రజా సామాన్యాన్నైనా మాత్రం కలిసి దాడిచేశారు. .........ప్రాబల్యం గల వర్ణాలయొక్క, వర్గాలయొక్క వ్యక్తిగత ప్రయోజనాలకు అవిభక్త ప్రాణ (గణం) లొంగక ప్రతిఘటించింది. అంతర్యుద్ధం ప్రారంభమైంది. ఈ అంతర్యుద్ధం చరిత్రలో అనేక సంవత్సరాలు నడిచిందని వేదాలూ, యితిహాసాలూ తెలుపుతున్నవి." (డాంగే-భారతదేశం పేజి 189)

కృష్ణయజుర్వేదంలో, తైత్తిరీయారణ్యకం (5-1) యొక్క ఆధ్యాయికలో విష్ణువుకూ దేవతలకూ మధ్య అంతర్యుద్ధం జరిగినట్లు వర్ణింపబడిన గాథ యిలాంటిదే. యజ్ఞ ఫలితాన్ని (సామాజిక శ్రమ ఫలితాన్ని) తన స్వంతానికి కాజేయ ప్రయత్నించిన గణాధిపతికి (విష్ణువుకు) వ్యతిరేకంగా సత్రయజ్ఞ విధాయకమైన హక్కులకొరకు గణసభ్యులైన దేవతలు సాగించిన పోరాటమే అది.

"జనాభా సాంద్రత యొక్క పైకొలదీ, తెగ లోపలగానీ బయటగానీ సన్నిహితమైన ఐక్యత వుంటేగాని కార్యసాధన జరగదు. ప్రతిచోటా సంబంధం కలిగిన తెగలు సమాఖ్యగా యేర్పడడం అవసరమౌతుంది. త్వరలోనే ఆ తెగలు కలిసిపోతాయి. దానివల్ల అయా తెగలు నివసించే ప్రదేశాలుకూడా కలసిపోయి ఒక జాతి రాజ్యమౌతుంది (Territory).

ప్రజల సైనిక నాయకుడు-రెక్స (రాజన్) వదల్చుకోరాని శాశ్వతోద్యోగి ఔతాడు. ఇదివర కొక రూపం లేని ప్రజా సమూహానికి యిప్పు డొక రూప మేర్పడుతుంది. మిలిటరీ నాయకుడు (రాజన్) కౌన్సిల్ (సభ) ప్రజల ఎసెంబ్లీ (విడత) యివి సైనిక ప్రజాతంత్రంగా అభివృద్ధిచెందిన గణసమాజంయొక్క నిర్మాణ శాఖలు. యుద్ధమూ, యుద్ధాని కవసరమైన నిర్మాణమూ జాతి జీవనంలో నిత్యవిధు లౌతాయి కాబట్టి దాన్ని సైనిక ప్రజాతంత్రం (Military Aristocracy) అని అంటారు. ఈపాటికే సంపదను పోగుచేసుకోవడం ప్రధాన జీవితాశయాల్లో ఒకటిగా చూస్తున్న జాతుల్లో, పొరుగు జాతి సంపదను చూస్తే కన్నెర్రపుట్టుంది. వారి దృష్టికి కష్టార్జితంకన్నా కొల్లగొట్టి సంపాదించడం ఎక్కువ సులభంగానూ, వాస్తవానికి అధిక గౌరవ ప్రదానంగానూ కనిపిస్తుంది. వారు అనాగరికులు. ఇదివరకు పగతీర్చుకోడానికో, వుండడానికి చోటుచాలక విస్తరించడానికో యుద్ధాలు జరిగేవి. ఇప్పుడు కొల్లగొట్టడానికి మాత్రమే యుద్ధం జరుగుతోంది............. ఇలా కొల్లగొట్టడానికి జరిగే యుద్ధాలవల్ల సర్వసేనాని అధికారమేగాక ఉపసేనానుల అధికారం కూడా అధికమైంది. వారి తరువాత అధికారం వహించవలసినవారిని, వారి కుటుంబాలనుండే యెన్నుకొనే ఆచారం, క్రమేణా ముఖ్యంగా పితృహక్కు వచ్చింతర్వాత పారంపర్య వారసత్వంగా మారిపోయింది. మొదట ఈ మార్పును ఉదాసీనంగా పోనిచ్చారు తరువాత అదే హక్కుగా కోరబడింది. ఆ తరువాత, చివరకు ధర్మవిరుద్ధంగా దురాక్రమింపబడింది. ఇలావంశానుగతమైనరాజరికానికి పునాది యేర్పడింది. గణసంఘ నిర్మాణశాఖలు యీ విధంగా ప్రజాబాహుళ్యంనుండీ గణంనుండీ తెగనుండీ, విడివడిపోయాయి. చివరకు గణవ్యవస్థానిర్మాణం తనకు వ్యతిరేకమైన వ్యవస్థగా మారిపోయింది! స్వంత కార్యకలాపాలను యిచ్ఛాపూర్వకమైన ప్రశమవిధానంలో నడుపుకోడానికి ఏర్పడిన తెగల నిర్మాణం పొరుగు వారిని కొల్లగొట్టడానికీ అణగద్రొక్కడానికీ పనికివచ్చే నిర్మాణంగా మారిపోతుంది. ఇందు కనుగుణంగానే దాని నిర్మాణశాఖలు పూర్వం ప్రజాభిప్రాయాన్ని అమలు జరిపే శాఖలుగా వుండినవల్లా, ప్రజల నెత్తినెక్కి అణగద్రొక్కడానికి వుపయోగపడే శాఖలుగా మారిపోయాయి." (ఎంగెల్సు.)

భారతదేశంలో మొదటి బానిస యజమాని పరిపాలనాచట్టాన్ని "విశాలాక్ష" అని పిలిచారు. ఈ విశాలాక్షరాజ్యాంగచట్టం బాహుదంతుడు, బృహస్పతి మున్నగువారి చేతుల్లో అనేకమార్పులు పొందిందని మహాభారతేతిహాసం చెప్తోంది. ఈ రాజ్యాంగ చట్టం అమల్లోకి వచ్చిన వెంటనే ఘర్షణలు ప్రారంభమయ్యాయి. దోపిడీవర్గాలైన బ్రాహ్మణ క్షత్రియులకి వ్యతిరేకంగా పీడిత ప్రజాసామాన్యం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకూ మాతృస్వామికం కొరకూ పోరాడారు. అత్యంత హృదయ విదారకమగు నియంతృత్వంతో ఈ పోరాటాన్ని దోపిడీదారులు అణచివేశారు. వేనుడూ అతని భార్య సునీతా నడపిన పోరాటం యిలాంటిదే.

ఈ పోరాటం ఓడిపోయిన తర్వాత, బానిస యజమానుల పీడనా అధికారాభివృద్ధీ విపరీతంగా పెరిగిపోయాయి. శూద్రబానిసల సహాయంతో భూములు వ్యవసాయంలోకి తేబడ్డాయి. చరిత్రలో రాజ్యాలకు మొట్టమొదటిసారిగా నిశ్చితమైన యెల్లలు ఏర్పడ్డాయి. ఈ యెల్లలలోపల ఆర్యులతో పాటు అనార్యులుకూడా నివసించసాగారు.

"పూర్వం ప్రజలు సరియైన మార్గంలో నడిచేట్టు దిద్దుబాటు చేయాలంటే ఒకమాట సరిపోయేది. ప్రజాభిప్రాయమూ, బహిరంగంగా మందలించడమూ (దిగ్దండ) జరిగేది. కాని యిప్పుడో! ప్రజలు దోపిడీని సహించేట్లు, రాజభక్తులై వుండేట్లూ, పాలించే ఆస్తిదారు వర్గాలయెడ గౌరవం కలిగివుండేటట్లూ చేయాలంటే రాజ్యాంగయంత్రమూ, సైన్యమూ, పోలీసుబలగాలూ కావలసివచ్చాయి. ఇవీ చాలకపోతే మరణమే (వధదండ) చివరిశిక్ష. కొత్తరాజ్యాంగయంత్రం పుట్టిన తర్వాత హిందూ వాఙ్మయం ఈ కొత్త దౌర్జన్య యంత్రాన్ని గొప్పగా కీర్తించడం ప్రారంభించింది. దౌర్జన్యం లేకపోతే అరాజకం (అంటే రాజ్యాంగ యంత్రంలేని సమాజం) మరల స్థాపించబడుతుందనీ, ప్రైవేటు ఆస్తీ, కుటుంబమూ మతమూ ఒకటేమిటి ప్రపంచమే నశిస్తుందనీ వ్రాయసాగారు. ఆస్తి పేరిట, మతం పేరిట, కుటుంబం పేరిట పాలకవర్గాలు కష్టజీవులైన విశాల ప్రజాసామాన్యం యొక్క, శూద్రబానిసల యొక్క స్వాతంత్ర్యాన్నీ, ఆస్తినీ, కుటుంబాన్నీ అణగద్రొక్కారు.

"చివరకు కొత్తసమాజంలో కొత్త ఉత్పత్తిశక్తులూ కొత్త విప్లవశక్తులూ వుద్భవించేంతవరకూ యిలాగే జరి

గింది. బ్రాహ్మణ, క్షత్రియ వర్గాలు కష్టజీవులపైన యుద్ధాలు సాగిస్తూనే మరోవైపున వైశ్యులనూ, శూద్రులనూ దోపిడీచేసి సంపాదించిన సంపదలను యెవరికివారే రెండవవారికి లేకుండా దొంగిలించాలన్న దురాశతో వారిలోవారు పోరాడుకోవడం ప్రారంభించారు. ఈ పాలకవర్గాల మధ్య జరిగిన అంతర్యుద్ధ గాథలను హిందూపురాణాలు వివరిస్తున్నాయి. పరశురాముడు (బ్రాహ్మణుడు) శ్రీరామునిపై చేసిన దండయాత్రలవంటివి యిలాంటి అంతర్యుద్ధ గాథలే."

(డాంగే-భారతదేశం-పేజి 245-246.)

## భారతీయ సామ్రాజ్య స్థాపన : గణసమాజాల నిర్మూలన

బానిస విధానపు పునాదులమీద హస్తినాపుర కౌరవ సామ్రాజ్యమూ, పాటలీపుత్రమండలి మౌర్య సామ్రాజ్యమూ, మగధ సామ్రాజ్యమూ పెరిగి పెద్దవయ్యాయి.

హస్తినాపురానికి చెందిన పురువంశరాజులు పరిసర ప్రాంతాలలోవున్న రాజ్యాలనూ, సైనిక ప్రజాతంత్రాలనూ, వివిధ గణసమాజాలనూ కబళించివేసి, విశాల సామ్రాజ్యాన్ని స్థాపింప విశ్వప్రయత్నాలు చేశారు. ఈ ప్రయత్నాల పర్యవసానంగా మహాభీకరమైన భారతయుద్ధం (క్రీ.పూ. 1500) జరిగింది. ఆ యుద్ధంతో ప్రాచీన భారతదేశం విస్పష్టమైన మరో నిర్దిష్ట చారిత్రిక ఘట్టంలోకి ప్రవేశించింది.

కౌరవ, పాండవుల మధ్య చెలరేగిన ఈఘర్షణ బ్రహ్మాండమైన మానవ మారణహోమానికి దారితీసింది. గణసంఘాలు, సైనిక ప్రజాతంత్రాలు, ధనవంతుల కులసంఘాలు, బానిస రాజ్యాంగాలూ అన్నీ దారుణ అగ్నిగుండంలో దూకి శలభాల్లా మాడిపోయాయి.

"పూర్వ ప్రపంచానికిచెందిన గణాలకూ, వాటి విలువలకూ, నీతినియమాలకూ, ఆర్థికవిధానాలకూ, సాంఘిక సంబంధాలకూ సర్వానికీ ఈయుద్ధం వినాశనఘట్టం (డాంగే). గెలిచినవారూ, ఓడిపోయినవారూ యిద్దరూ తీవ్రంగా నష్టపడ్డారు.

ఆర్య విశ్వామిత్రుడు కడుపు కక్కుర్తితో కుక్కమాంసం తింటానికి సిద్ధపడగా, బానిసఅయిన చండాలుడు ఆ మాంసం తినతగదని బోధిస్తాడు! శ్రీకృష్ణుడు యాదవ గణసంఘముఖ్యుడు. అతని మాటనే చివరికి యాదవులు ఖాతరు చేయలేదంటే బానిస సమాజం సర్వత్రా పతనావస్థకి వచ్చిందని తెలుసుకోవచ్చు (మహాభారతం). యాదవ గణసంఘంలో ధనిక కుటుంబాలమధ్య స్పర్ధలు పెరిగి అత్యంత భయంకరమైన అంతర్యుద్ధంగా - యాదవకులంలో ముసలం - పరిణమించి, ఆ గణసంఘమే తుడిచిపెట్టుకుపోయింది.

తరువాత చరిత్ర కొంతకాలం వరకూ అంధకారంగా వుంది. మళ్ళీ గంగానదీ లోయలో పెద్ద పెద్ద రాజ్యాలు తలెత్తాయి. ఈ రాజ్యాలకి ఊపిరి పోసింది మగధలోని పాటలీపుత్రం. చరిత్ర రథచక్రాలు కొంత ముందుకు నడిచాయి. మళ్లీ బానిస రాజ్యాంగాలు పునర్నిర్మాణమయ్యాయి. వాటిలో అత్యంత శక్తివంతమైన రాజ్యంగా తయారైంది మగధ. మగధను చివరికాలంలో "నవనందులు" అను నందవంశానికి చెందినవారు పాలించారు. నందులలో ఒకనికి పుట్టిన చంద్రగుప్తుడు, కౌటిల్యుని సహాయంతో నందరాజ్యాన్ని, నందవంశాన్ని దుంపనాశనంచేసి మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించాడు. (క్రీ. పూ. 322)



# మహాభారతంలో వారసత్వ సమస్య

## ఒక ఐతిహాసిక పరిశీలన

మాడభూషి భావనాచార్యులు

వ్యాసకృత మహాభారతం భారతీయ వాఙ్మయంలో విజ్ఞాన సర్వస్వంగా పరిగణింపబడుతూ ఉన్నది. కేవల ఆధ్యాత్మిక జ్ఞాన సముపార్జనకూ, పుణ్యఫల సిద్ధికి మాత్రమే కాక లౌకిక జీవనతంత్రానికి, బహుభంగుల ఉపయుక్తమగుతూన్నట్లు అనేక నిదర్శనాలున్నాయి. వేయి సంవత్సరముల క్రితమే పంచమవేదమును ఆంధ్రీకరిస్తూ నన్నయభట్టారకుడు యిలా అన్నాడు:

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని,
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
పరమపౌరాణికుల్ బహుపురాణ స
ముచ్చయంబని మహిఁగొనియాడుచుండ

ఆ॥ వివిధ తత్త్వవేది వేదవ్యాసు
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుమండ జేసె భారతంబు.

ఇట్టి అతిప్రధానమైన గ్రంథాన్ని సమ్యక్ పరిశీలనా దృష్టితో పరిశోధించాలి. ముఖ్యంగా ప్రాచీన గ్రంథాధ్యయన విషయంలో మూడు విభిన్నదృష్టులు మనకు గోచరమవుతున్నాయి.

ప్రాచీనమైనది ఏదైనప్పటికీ, అట్టి గ్రంథములు కేవల దైవదత్తములని, వాటి అస్తిత్వ ప్రయోజనాల విషయం ప్రశ్నించే అధికారం మానవమాత్రులమైన మనకు లేదని, వాటిని క్షుణ్ణంగా పఠించి పూజిస్తూండాలని మొదటి తెగవారు భావిస్తారు. అట్టివారు దేనినైనప్పటికీ సందర్భోచిత దృష్టితో అవగాహన చేసుకోవడంమాని, మూఢభక్తితో ఆరాధన చేస్తారు. కాలీనమైన పరిస్థితులను, తత్ప్రతిబింబాలైన వైజ్ఞానిక సూక్తులను అన్వయపరచుకొని, మార్పుచెందే సమకాలీన యుగానికి, సమాజానికి దార్శనికులు కాలేరు. పైగా క్రాంతి ప్రవాహానికి అడ్డుగా, గుదిబండలుగా తయారవుతారు. ఇట్టివారే ఛాందసవాదులు.

మరోవర్గం పురాణశాస్త్రాదులు శుష్కప్రయోజనాలని, అసందర్భ ప్రలాపాలని భావిస్తారు. వాటి పుట్టుకే కేవలం అసంబద్ధమనికూడ వాదిస్తారు. అట్టివానిని ప్రతివారు అత్యంతం తిరస్కరించాలని బోధిస్తారు. ఇట్టి అభిప్రాయాలను కలిగినవారిని పాశ్చాత్య దేశాలలో నిహిలిస్టులంటారు. ఇట్టివారిని మనం యాంత్రిక భౌతికవాదులుగా పరిగణించవచ్చును. పూర్వయుగాలలో మనదేశంలో వ్యాపించిన చార్వాక మతస్థులు కొంతవరకు యిట్టివారే అనుకోవచ్చును.

మూడవ వర్గం వితండవాదన ప్రధానులై శాస్త్ర విహితములైన దానిని పూర్వపక్షం చేయడమే తమ విధిగా పెట్టుకొంటారు. వీరు ప్రతి యుగమందలి ధర్మశాస్త్రాది సమస్త స్థితులను ఆర్థిక పరిస్థితులే నిర్ణయిస్తాయని వాదిస్తారు. వీరు మానవ సమాజపు ఏ యితర పరిస్థితిని, హృదయసంబంధమైన అనుభూతులకు గల ప్రభావాన్ని గుర్తించరు. ఇట్టి వితండ వాదనాపరులను ఎకనమిక్ డిటర్మినిస్టులు అంటారు.

కనుక యీపై మూడు విధములైన వాదాలు కూడ మూడు విధాలుగా దోషభూయిష్టాలయినవే.

చరిత్రలు, ఉపదేశాలు, సకల కళా సాహిత్యాది విషయాలు సమాజానికి, వ్యక్తికి ఆత్మ సంస్కారాన్ని చేయుటకే నిర్దిష్టమైనవి. సత్ప్రవర్తన ప్రవర్ధమానమయే నిమిత్తం తద్వ్యాపార యుగధర్మాన్ని, సమాజధర్మాన్ని స్పష్టీకరంగా అవగాహన చేసుకొనే నిమిత్తం అవి ఏర్పడినవి.

“పురాణమిత్యేవన సాధు సర్వం” అనే సూక్తిని అనుసరించి పాతదైనంతలో కేవలము శిరోధార్యమనిగాని, తిరస్కారార్హమనిగాని భావించక విచక్షణాదృష్టితో, ఐతిహాసిక పరిశీలనతో దాని ప్రామాఖ్యతను గుర్తించవలసి వున్నది.

## కాలనిర్ధారణ

మహాభారత రచనను వ్యాసుడు కురుక్షేత్రయుద్ధం జరిగిన మూడు సంవత్సరాలకు చేసేడని విజ్ఞులు అభిప్రాయపడుతూన్నారు. మహాభారత రచనా కాలం నిర్ణయించడానికి కురుక్షేత్ర యుద్ధ కాలం నిర్ణయం కావలసియున్నది. పంచాంగ కర్తలు, క్రీ. పూ. 31 వందల సంవత్సరములని అంటున్నారు. లోకమాన్య గంగాధరతిలక్ క్రీ. పూ. 14 వ శతాబ్దమని అంటున్నారు. విల్సన్, ప్రాట్ మున్నగు పాశ్చాత్య పండితులు కూడా యించుమించు క్రీ. పూ. 14 వ శతాబ్దమే అని అంగీకరించారు. కనుక మహాభారత రచన బహుజనాభిప్రాయంగాయిప్పటికి3400సంవత్సరముల వెనుక జరిగినట్లు భావించవచ్చును.

## భూమిక

కురుక్షేత్రయుద్ధ చరిత్రకు సంబంధించిన పూర్వాపరాలను పరిశోధించవలసి వచ్చినప్పుడు, కురుపాండవ రాజ్యాధికార సంబంధాల నన్నింటిని సమగ్రంగా తెలిపే మహాభారత గ్రంధాన్నే భూమికగా స్వీకరించవలసివుంది. కురుక్షేత్ర సంగ్రామానికి తత్వశాస్త్ర పరమైన ఆత్మబలాన్ని ప్రసాదించినది భగవద్గీత; కనుక ఆనాటి మానవుల కార్మికజీవితం కురుక్షేత్ర సంగ్రామ భూమిలో ఎట్లు వికాసమొందినదో విచక్షణతో పరిశీలించవలసివుంది.

కురుక్షేత్ర సంగ్రామం రెండు విభిన్న లోకధర్మాలమధ్య సాగిన సంఘర్షణ. స్థూలంగా కుటుంబ జీవితంలో ఆస్తిహక్కుల తగాదాగా కనిపించినప్పటికీ పూర్వధర్మానుయాయులైన కౌరవులకు,యుగధర్మాన్ని ప్రతిష్ఠింపతలచుకొన్న పాండవులకు మధ్య సాగిన మానుషకర్మప్రధానమైన సమరంగా మనం దాన్ని పరిగణించాలి. కురుక్షేత్రంలో పాండవులు ఓడి కౌరవులే విజయం సాధించడం తటస్థిస్తే నాటినుంచి యిటీవలి వరకు కుటుంబంలోని వ్యక్తిగత హక్కుల స్వరూపమే విభిన్నంగా ఉండేడిది. దఫదఫాలుగా అనేక కురుక్షేత్ర సంగ్రామాలు జరగవలసి వచ్చేవి. అందువల్లనే యుగీనమైన ధర్మాన్ని ప్రతిష్టాపించడానికి, ఉద్యుక్తుడైన బుద్ధిబాహుబల సంపన్నుడైన శ్రీకృష్ణుడు అవతారపురుషు డవడానికి కూడా కారణభూతమైంది. అట్టి కురుక్షేత్రయుద్ధానికి ప్రాతిపదికలైన విభిన్నధర్మాలేమిటో, పాండవులకు గల వారసత్వపు హక్కు ఎట్టిదో పరిశీలిద్దాం.

## రాజు - రాజ్యము

సమాజ వ్యవస్థలో రాజులు, రాజ్యాలు, వాని అస్థిరత్వమూ కురుక్షేత్ర సంగ్రామకాలమునాటికి ఏరూపములో ఉన్నాయో వివరిస్తూ, ఆ రూపం తత్పూర్వస్థితికి విభిన్నమైనదని, సమాజ వ్యవస్థ సంరక్షణార్థం రాజరికం ఏర్పరచబడినదని వ్యవస్థల పరిణామశీలతను గురించి స్పష్టంగా వ్యాఖ్యానించిన ఉదాహరణలు మహాభారతమునందేకాక ప్రాచీన భారతీయ వాఙ్మయంలో అనేకంగా లభ్యమవుతాయి. ఉదాహరణకు శాంతిపర్వంలోని రాజధర్మప్రకరణంలో యీ విషయం స్పష్టపరచబడింది.

కురుక్షేత్ర సంగ్రామానంతరం ధర్మరాజు నిరాశావృతుడై తను కావించిన బంధు జన హత్యాపాపానికి పశ్చాత్తప్తు డగుచున్నాడు. శంకాయత్తచిత్తుడై రాజ్యంకోసం బంధుజనాలను హతమార్చడం పాపమా? కాదా? అనే సంశయాత్మలో విచికిత్స పొందుతున్నాడు. అనేకమంది ఋషులు, అర్జునుడు, శ్రీకృష్ణాదులు వ్యధోపశమనానికి శతధా యత్నాలు గావించారు. అతను తృప్తి చెందలేదు. అప్పటికి భీష్ముడు అంపశయ్యపై ఉన్నాడు. ధర్మరాజు భీష్ముని దర్శించి తన సందేహాలను వివరించాడు. నివృత్తి కావించనున్నాడు. రాజనీతి, సాంఘికధర్మం మున్నగు సమస్యల వివరణ కోరాడు. అప్పుడు భీష్ముడు యిలా చెప్పేడు :

“ఓ ధర్మరాజా! కృతయుగపు ఆదిమదశలో రాజ్యమే విధంగా సముత్పన్నమైనదో కూలంకషంగా చెబుతాను. శ్రద్ధగా విను.

ఆదిలో రాజ్యములేదు. రాజులేదు. దండనా లేదు. దండితుడూ లేదు. ప్రజలే ధర్మయుతంగా నడచు

కొని, పరస్పరం రక్షించుకొనెడివారు.. ఆ విధంగా పరస్పర ధర్మ రక్షణతో స్వపరిపాలన జరుగుతూ ఉండేది. కాని క్రమంగా నరులలో దుఃఖభాజనత్వం పెరిగినది. తద్వారా దుర్మోహం ఆవరించింది...ఏ మార్గమున నడవాలో, ఏది కూడదో, ఏది మాట్లాడాలో, ఏది మాట్లాడకూడదో, ఏది భుజించాలో, ఏది కూడదో, దోషమేదో, దోష రహితమేదో అన్న విచక్షణను నరులు సంపూర్ణముగా త్యజించిరి... రాజేంద్రా! అట్టి పరిస్థితులలో దండనీతి, దండనాయుడు ఏర్పడవలసి వచ్చినది.

(చూ. సంస్కృత భారతం, శాంతి పర్వం)

సమాజంలో ఉత్పత్తివిధానము అభివృద్ధిపొందుతూ న్నపుడు, దాని పర్యవసానంగానే సమాజంలో కుల గుణవిభాగం వ్యవస్థీకరించబడింది. ఈ ఉత్పత్తి విధానాన్ని అనుసరించే, ఫలితాలలో మంచి చెడుగులు కూడ సంక్రమిస్తూ వచ్చేయి. లోకమునందలి అత్యధిక సంఖ్యాకులకు అత్యధిక శ్రేయస్సును చేకూర్చేదే లోకహితంగా పరిగణింపబడినది. ఇట్టి లోకహితార్థమే నూరువేల అధ్యాయములతో నీతిశాస్త్రము (నాటి సమాజమునకు రాజ్యాంగము వంటిది) రచింపబడింది. ఈ నీతిశాస్త్రమును తొలుదొల్త విరూపాక్షుడనువాడు రచించినట్లున్నా, దానినే తరువాత విశాలాక్ష నామధేయుడు 10 వేల అధ్యాయాలుగను, అమరేంద్రుడనువాడు 5 వేల అధ్యాయాలుగను ఆయా కాలాలకు అనుకూలంగా క్రోడీకరిస్తూ వచ్చేరు. అట్లే శుక్రుడు, బృహస్పతి అను మునులు వెయ్యి అధ్యాయములుగా సంక్షిప్తపరిచారు.

క్రమశః ఆర్షప్రోక్తమైన నీతిశాస్త్రము రూపొందింది. దానిని అమలు పరచేందుకు శక్తివంతుడైన రాజును ఏర్పరచవలసి వచ్చినది. అట్టిరాజే విరజుడు. ఇతనే తొలిరాజు. తరువాత అతని కుమారుడు నీతి క్రమంగా పరిపాలించాడు. ఈ నీతి రాజుకు సునీథయందు పుట్టినవాడే వేనుడు. ఈ వేనుడు ఆర్షప్రోక్తమైన నీతి శాస్త్రాన్ని సనాతన ధర్మాన్ని తిరస్కరించాడు. బ్రాహ్మణులకు విరుద్ధమైన నూతన నీతిని నిర్వచించాడు.

వేనుడు రాజుకాగానే ప్రజాసభను ఏర్పరచాడు. నాటినుంచి తాను చెప్పినదే ధర్మముగా అమలు జరగాలని తత్పూర్వమైన ఏ యితర ధర్మములు చెల్లనేరవని ఘంటాపథముగా శాసించాడు. తన సూక్తులే పరమ ప్రమాణంగల ధర్మశాస్త్రాలని, వానినే ప్రజలు శిరసావహించాలని శాసించాడు. యజ్ఞములు చేయరాదని, బ్రాహ్మణ పూజ దోషమని, ప్రజలందరూ తన శాసనాలకు బద్ధులు కావాలని అన్నాడు. అప్పుడు ఆర్ష ధర్మానుయాయులలో అసంతృప్తి చెలరేగింది. దీనికి ఒక రూపం కల్పించే ఉద్దేశ్యంతో మరీచి ప్రభృతి మునులు రాజుకడకు రాయబారులుగా వెళ్ళేరు. తాము నూరు సంవత్సరములు ఏకదీక్షగా యాగం చేయ తలపెట్టితిమనీ, పూర్వాచారమును, పూర్వ ధర్మములను ధిక్కరించు యిట్టి శాసనములు యుక్తము కావనీ, ఆ శాసనములను రద్దు చేయవలె నని కోరారు. వేనరాజు మునులపై కోపించాడు. "భూనాథుని అంతికంటె వేరొక ధర్మమున్నదా? యజ్ఞములందు మీ రెవ్వరిని పూజించెదరు? నాకంటె పూజార్హుడింకెవరున్నారు?" అని అసాంప్రదాయికంగా మునులను తూలనాడెను. మునులు వేనుని మాటలు పాటించక, యజ్ఞము చేయ తలపెట్టేరు. అట్టి వారి నందరినీ వేనుడు బాధించాడు. దీనితో బ్రాహ్మణులంతా ఏకమై వేనుణ్ణి నరికివేశారు. అని ఈ విధంగా నీతిశాస్త్ర విధులను రాజధర్మాలను భీష్మాచార్యుడు ధర్మరాజునకు సవివరంగా తెలియజేశాడు.

కం॥ తను తాన తొలుత గెలువన్
మనుజపతికి వలయు పిదప మార్తుర గెలువన్
మనమున తలంచు నది మును
తను గెలువని పతికి - గెలువ నగమే పగరన్

రాజు అరిషడ్ వర్గాలనుంచి తన్ను తాను గెలుచుట ప్రధాన కర్తవ్యమని, అట్టివాడే శత్రువర్గాలను జయించగల్గుతాడని భీష్ముని ఉపదేశం. ధర్మమనునది కాలీనమైన సమాజ గమనసూత్రము. ఇది దేశకాలానుగతమైనదని భీష్ముడు అభివర్ణించాడు. ధర్మమన్నది బహుముఖమైనది. ఉదహరణకు మహాభారతంలో!

తర్కం చంచలం. శ్రుతి (వేదం) బహువిధమైనది. ఒకానొక ఋషి వచనమైనంత మాత్రమున ధర్మశాస్త్రము సర్వప్రమాణమనుటకు వీలులేదు. పూర్వఋషి వచనములలో కూడ భిన్న విభిన్నతలు గోచరించుచున్నవి. ధర్మశాస్త్ర స్వభావం నిగూఢమై అవగాహనకు కష్టసాధ్యము అగుచున్నది. కావున మహాజన సందోహము ఏమార్గమున సంచరించునో అదే కాలాగతమైన ధర్మమార్గమయి ఉన్నది.

"ధర్మము" అను శబ్దమునకు అర్థమును వ్యుత్పత్తి చూచిన "ధరింపబడినది." (ధృ = ధారణ - ధాతుజన్యము.) ప్రజలందరు దేనిని ధరింతురో అనగా ఎగ్గులగుదురో అదే ధర్మము అని నిశ్చయముగా చెప్పబడుచున్నది.

కనుక ధర్మము కాలానుగుణమైనదని దానికి శాశ్వత స్థితికాక, పరిణామశీలతే ప్రధాన లక్షణమని అర్థమగుచున్నది.

## ధర్మం కాలానుగుణం

కనుక వ్యవస్థలతో రాజతత్వాలు, వానితోపాటు ధర్మములు మార్పుచెందుతూ వచ్చాయి. మార్పులు పొడసూపిన సంధికాలంలో సాంప్రదాయకధర్మాలకు, ఆగత ధర్మాలకు మధ్య సంఘర్షణ కొంచెము స్థాయీ భేదములో తప్పనిసరి అవుతూనే ఉన్నది. స్థితిధర్మ రక్షకులుగా ఒక పక్షం, నవీన ధర్మస్థాపనార్థమై ఒక పక్షం నిమిత్తమాత్రులవడం కూడ తథ్యమే. ప్రతి కాలంలోనూ ఆగతధర్మ ప్రోక్తకులు సాధారణంగా ఋషులు, పండితులు, వీరులు, వైతాళికులు అవుతారు. ఈ విషయాన్ని ధృవపరుస్తూ భారతంలోనే సుభద్ర గర్భవతియై నమస్కరించిన సందర్భంలో కుంతి— "నీవు శూరులనుగాని, పండితుల్నిగాని కనవద్దు భాగ్య రేఖ కలిగినవారిని మాత్రమే కనుము. సుభద్రా! శూరులు, పండితులు అయిన నా కుమారులు అడవుల పాలై అష్టకష్టాలు అనుభవించ వలసి వచ్చింది" అన్నది. దీనిని బట్టి నవీనధర్మ ప్రతిపాదకులై ఆ సదాశయాలకోసం జీవితాలను అంకితం చేసిన పాండవులు కేవలం శూరులేకాక విద్యావంతులు కూడా అని వేటతెల్లమగుచున్నది. దీనిని సమర్థిస్తూనే వేరొకచోట శాంతిపర్వంలో "జ్ఞానేన కురుతేయత్నం యత్నేన ప్రాప్యతే మహత్॥" అని చెప్పబడింది. జ్ఞానమువలన ప్రయత్నమున్నూ, ప్రయత్నమువల్ల మహత్తున్నూ పొందుచున్నాడు అని చెప్పుడుటచేత జ్ఞానమే సమస్త ప్రయత్నాలకు నాందిగా ప్రవచింపబడుతోంది. కర్మక్షేత్రమైన కురుక్షేత్ర సంగ్రామంలో సకలజన, బంధుజన క్షయమైనతర్వాత నాటి వివిధ సంఘటనలన్నీ ధర్మరాజునకు హృదయక్లేశం కలిగించాయి. అట్టి రక్తాన్నాన్ని భుజించడంలో పారమార్థికత ఏమున్నదని మళ్ళీ అతనికి నిస్పృహ జనించింది. తన రాజ్యకాంక్షే యీ సర్వనాశనానికి కారణమైందని విషాద నిమగ్నుడయాడు. సమస్త ధర్మజ్ఞుడైన భీష్మునివలన తనసంశయనివృత్తి కావించుకొని, హృదయశాంతిని పొందగోరేడు. అప్పుడు భీష్ముడు పైన పేర్కొన్న యుగీనమైన ధర్మాలను సమాజ వ్యవస్థలోని గమనశీలతను వివరించేడు. కౌరవులు సాంప్రదాయక ధర్మాని రక్షింప పూనుకొన్నవారు. పాండవులు నవీన ధర్మ ప్రతిష్ఠాపకులు. కురుక్షేత్ర సమరం నవీన ధర్మానికే విజయం చేకూర్చింది. అట్టి యుగధర్మ సంస్థాపకులైన పాండవులలో ముఖ్యంగా ధర్మరాజులో ఇట్టి వైరాగ్యం తలెగదని భీష్ముడు సహేతుకంగా వివరించాడు. ధర్మరాజుని ఉపశాంతునిగా చేసేడు. దుర్యోధనాదులు తమ తండ్రికి జ్యేష్ఠకుమారుడైన వానికే రాజ్యాధికారమని తక్కిన అనుజన్ములు "పరపిండోప జీవు" లని, రాజ్యము అవిభాజ్యమని, నీతిశాస్త్ర సంప్రదాయాన్ని సంరక్షింప పూనుకొన్నారు. తండ్రికి పుట్టిన కుమారులందరికీ రాజ్యంలోగాని, పితృదత్తమైన ఆస్తిలోగాని సమాన భాగములు ఉండవలెనని నాటి సంప్రదాయమునకు భిన్నమైన, నవీన ధర్మాన్ని ధర్మరాజాదులు ప్రతిపాదించారు. ఈ రెండు ధర్మాలకు సాగిన సంఘర్షణలో కురుక్షేత్రం పాండవ ప్రతిపాదిత ధర్మానికి విజయం చేకూర్చింది.

పాండవ కౌరవులమధ్య యేర్పడిన రాజ్యాధికార వివాదమునకు పూర్వము ధర్మశాస్త్ర విధానములు అనేకరూపాలు పొందుతూ వచ్చాయి.

మహాభారతం ఆదిపర్వంలో అన్నదమ్ముల మధ్య వచ్చిన భ్రాతృ సమాధికారానికై యేర్పడిన తగాయిదాను ఒక ఉపాఖ్యానంలో వివరిస్తూ యిలా చెప్పారు.

తల్లి దాస్యము నివృత్తిచేయ గరుత్మంతుడు అమృతముకై వెడుతూ తనకు కలుగుతున్న మహత్తర క్షుద్బాధ నివారణకు మార్గము చెప్పుమని తన తండ్రి కశ్యపుని అడిగాడు. అంతట కశ్యపుడు కొండొకచోట ఘోరసంగ్రామం జరుపుతూన్న 'గజ కచ్ఛపము'లను ఆహారంగా స్వీకరించమన్నాడు. వాని పూర్వ వైర కారణాలు ఈ విధంగా చెప్పాడు.

"అనల విభుండు విభావసు
డను విప్రుడు నియమవంతు దర్థార్థుండై
తనరి సుఖమున్న నాతని
యనుజన్ముడు సుప్రతీకుడను వాడతనిన్".

"మన పితృవర్గము వడసిన
ధనము యిమ్ము...ధర్మస్థితి నా
కనియడుగం బోయిన న
య్యనుజునకు విభావసుండ హంకారమునన్".

"తానలిగియిచ్చె శాపం
బేనుగవై యుండుమని సహింపక వాడున్
మాను, కూర్మమవగుమని
వానికి ప్రతిశాపమిచ్చె వసులోభమునన్."

తండ్రినుంచి సంక్రమించిన ఆస్తిలో తనకు వాటా యడుగగా అది ధర్మ వ్యతిరేకమగుటచే తమ్మునికి ఏనుగవు కమ్మని శాప మిచ్చాడు. దానికి అగతిధర్మ పరుడైన తమ్ముడు (సుప్రతీకుడు) 'ధనలోభము'చేత కూర్మముకమ్మని ప్రతిశాప మిచ్చాడు.

ఈ ఉదంతంవల్ల భ్రాతృ సమజీవనముకై పాండవ వివాదమునకు పూర్వమే ఈ నవధర్మ ప్రస్తావన జరుగుతున్నదని మనకు తెలుస్తుంది.

కురుపాండవులకు ప్రపితామహుడైన శంతనుడు - దాశరాజకుమార్తె మత్స్యగంధి(సత్యవతి)ని వివాహ మాడుట కుద్యుక్తుడైన సందర్భంలో దాశరాజు సత్యవతి పుత్రులకు రాజ్యాధికార మిచ్చిన తనకు వివాహం జరిపించుటకు అభ్యంతరం లేదన్నాడు. అప్పటికే భీష్ముడు ప్రాజ్ఞత పొందివున్నాడు. తండ్రి చింతానివృత్త్యర్థం ఘోరమైన బ్రహ్మచర్య దీక్షకు శపథంచేశాడు. అంటే యీ శంతనుని కాలంవరకూ కూడ జ్యేష్ఠాధికారమే ధర్మంగా ప్రవర్తించుతూ న్నట్లుగా మనము అర్థంచేసుకోవాలి. శంతనునకు చాలా కాలము పూర్వమే రాజ్యమేలిన యయాతి నాటికి తండ్రి తన కుమారులలో తన కిష్టంవచ్చినవానికి రాజ్యాధికారమును అప్పగించు ధర్మముండినది. ఆనాటి ధర్మమును తెల్పుతున్న యీ క్రింది పద్యాన్ని గమనించాలి.

"తనయుండు తల్లిదండ్రులు
పనిచిన పని సేయడేని బలుకెడలో తే
కొనడేని వాడు తనయుం
డనఁబడునే పితృ ధనమున కర్హుండగునే ?"

అన్న ఆనాటి ధర్మమునుంచి శంతనుని కాలం నాటికి జ్యేష్ఠునికే అధికార మియ్యబడుట ధర్మమైనది. ఈ విషయమే మను ధర్మశాస్త్రంలోకూడ యిలా చెప్పబడింది: "ఆస్తి యంతయు పెద్దవానికే తండ్రి యనంతరము సంక్రమించవలెను. మిగతావారు పెద్దవానిని అనుసరించుకొని యుండవలెను" అని...ఈ మను ధర్మశాస్త్రము భారతమునకు పూర్వ రచనమేనని నిర్ధారింపబడింది. మను ధర్మశాస్త్రం తదుపరి ఉద్భూతమైన 'యాజ్ఞ వల్క్య స్మృతి'లో "పుత్రులందరూ ఆస్తిని పంచుకోవలెనని, జ్యేష్ఠునకుమాత్రము కొంత అధికంగా యివ్వాలని" చెప్పబడింది. దీనితరువాత వచ్చిన 'నారద-బృహస్పతి' స్మృతులలో' అన్నదమ్ములందరూ సమానంగానే ఆస్తికి హక్కుదారులవాలని చెప్పబడినది. కురుపాండవుల దాయ భాగ వివాద కాలంనాటికి యీ ధర్మాలు కాల క్రమానుగుణంగా మార్పులు చెందుతూ వచ్చినట్లున్నా, యీ మార్పులను దుర్యోధనాదులు గమనించక పాండవుల దాయ భాగాన్ని తిరస్కరించారు. పురోగత ధర్మ ప్రవర్తకులైన పాండవులు-స్థితధర్మ వ్యవస్థాపకులైన కౌరవులతో కురుక్షేత్రంలో సంగ్రామం చేయవలసి వచ్చింది. కురుక్షేత్ర సంగ్రామానంతరమే నారద బృహస్పతి స్మృతులు అవతరించి పాండవులు సాధించిన నవధర్మమునకు సుస్థిర స్థితిని చేకూర్చాయి.

అట్టి విజయానికి కారణభూతమైన నవీన యుగ ధర్మానికి బలమిచ్చిన ఆర్థిక కారణాలను పరిశీలించవలసి ఉన్నది.

## ధర్మరాజు యౌవరాజ్య పట్టాభిషేకం

ధర్మరాజుకు ధృతరాష్ట్రుడు ఇంద్రప్రస్థరాజ్య మిచ్చి యౌవరాజ్య పట్టాభిషేకం గావించాడు. ధర్మరాజుని గుణసంపదకు లోకుల హృదయములు సమాకర్షణమైయున్నవి (అంతశ్శత్రువులను జయించి రాజ్యాధికారానికి సహజంగా అర్హతను పొందిన అజాతశత్రువు ధర్మరాజు). కనుక అతనే రాజుగా ఉండాలి అని ప్రజలు కోరుతూన్నారు. అట్టి లోకుల అనుకంపను చూరగొనుటకు, తన స్థిర సుహృద్భావాన్ని వెల్లడించుకొనుటకు ధర్మజుని యువరాజుగా ధృతరాష్ట్రుడు ప్రకటించెనని మూలమున ఉన్నది.

## దుర్యోధనుని వాదన

పట్టాభిషేకానంతరం ధర్మరాజు రాజసూయ యాగం గావించాడు. ఆసందర్భంలో దుర్యోధనుడు హస్తినాపురం వెళ్ళడం, మయసభలో అవమానితుడవడం తటస్థించింది. అప్పుడు దుర్యోధనుడు తన ఆత్మీయులను సమావేశపరచి కార్యక్రమం ఆలోచించేడు.

అప్పుడు కణికుడనే నీతిశాస్త్రకోవిదుడు యిలా చెప్పేడు.

క॥ గురుకొని కార్యాకార్యము
లెరుగక దుశ్చరిత్రుడై యహితుడగు నేనిన్
మరువక గురువైనను జను
లెరుగగ శాసించునది మహీశుడు బుద్ధిన్.

ఈ విషయమే మనుధర్మశాస్త్రములలో కూడ యీక్రింది విధముగా ప్రస్తావించబడింది.

శ్లో॥ గురోరప్య వలిప్తస్య కార్యాకార్య మజానతః।
ఉత్పథం ప్రతిపన్నస్య న్యాయం భవతి శాసనం।

ధృతరాష్ట్రుడు ధర్మరాజును యువరాజ్య పట్టాభిషేకము చేయ సంకల్పించినపుడు తన జ్యేష్ఠకుమారుడైన దుర్యోధనునితో సంప్రదించలేదు. తండ్రి తనతో సమానుడైన జ్యేష్ఠునితో విచారించకుండా ఏకార్యమైన తలపెట్టడం శాస్త్రవిరుద్ధమవుతుంది. కనుక అట్టి న్యాయశాస్త్ర విరుద్ధమైన చర్యను తండ్రి చేసినప్పటికిన్నీ దానిని ఖండించే అధికారం జ్యేష్ఠునికి ఉంది. అంతే కాక ధర్మరాజుపట్టాభిషేకానంతరం దుఃఖితుడైన దుర్యోధనుడు సాంప్రదాయక నీతిశాస్త్రాన్ని, రాజ్యార్హతలను, ధృతరాష్ట్రునితో చర్చించిన విషయాలు చాలముఖ్యమైనవి. ఈ సందర్భంలోనే ధర్మరాజు పట్టాభిషేకం తాను అంగీకరించేయడల కలుగబోయే శాశ్వతారిష్టాల గూర్చి అతని అభిప్రాయాలు కూడా గమనార్హమైనవే.

"తండ్రినుండి రాజ్యమును తన సుగుణాలచే పాండురాజు పొందాడు. నీవు (ధృతరాష్ట్రుడు) పుట్టంధుడగుటచేత నీ రాజ్యానికి నీవే అధికారివి కాలేకపోయావు. ఈ ధర్మరాజు పాండురాజు దాయభాగాన్ని పొందినట్లయితే అతని పుత్ర, పౌత్ర పర్యంతము రాజ్యాధికారానికి తప్పక అర్హత ఒనగూడుతుంది. అలాంటప్పుడు మేము మా పుత్ర పౌత్ర పర్యంతము రాజ్యాధికారవిహీనులమై శాశ్వతంగా మా భవిష్యత్తు నరకప్రాయ మవుతుంది. పరపిండానికి ఆశపడి బ్రతకాల్సిన దుర్గతిపడుతుంది. (సాంప్రదాయకమైన) నీతిశాస్త్రాన్ని దృష్టిలో ఉంచుకొని ఉచితమైన రీతిలో నీవు ఆజ్ఞ విధించినట్లయితే మాకు, మా తరాలకు ఆ దుర్విధి తొలగుతుంది. ఈ రాజ్యమును నీవును, నీ పుత్రులమైన మేమును అప్రయత్నంగా పొందగలుగుతాం. న్యాయశాస్త్రవిహితమైన రాజాజ్ఞను ఉల్లంఘించుటకు ఏ ప్రజలకు హక్కుండదు. (చూ. సంస్కృతభారతం, ఆదిపర్వం)

దుర్యోధనుడు పైతృకమైన రాజ్యం అవిభాజ్యమని వాదించాడు. ఏకచ్ఛత్రాధిపత్యంకొరకే వాంఛించాడు.

పాండవులను లక్కయింటిలో పెట్టి దహనంచేయాలి అనే కుటిలయత్నమునకు పురోచనుని నియమించుతూన్న సమయంలో దుర్యోధను డిలా అంటాడు:

"ఓ పురోచనా యీ భూమి ధనముతో నిండినది. అట్టి దీనిని, సంరక్షించవలసిన బాధ్యతకు అర్హుడవైన నీవు యీ కార్యమునకు పూనుకొమ్ము" యీ అభిప్రాయమే ఆంధ్ర భారతంలో యింతకన్న నిశితంగా యీ క్రింది పద్యంలో చెప్పబడింది.

కం॥ ఈ కార్యసిద్ధి యగుడును,
నీ కతమున నఖిల ధారుణీ రాజ్యము నా
కే కాధిష్ఠిత మగునిది,
నీకును నిత్యోపభోగ నిలయముకాదే.

ఏకచ్ఛత్రాధిపత్య సంప్రదాయాన్ని పునఃస్థాపించాలనే ఆకాంక్షతో దుర్యోధనుడుతండ్రిమొదలగు పెద్దలు చేసిన నిర్ణయాన్ని పూర్తిగా ఖండించ పూనుకొన్నాడు. అతడు మయసభలో పరాభవం అనుభవించి వివర్ణుడై, చిక్కి శల్యమవుతూన్నాడు. అట్టి కుమారుని చూచి, ధృతరాష్ట్రుడు కారణ మేమిటని ప్రశ్నిస్తాడు. జ్యేష్ఠునకు హీనత కలిగించి కనిష్ఠునకు వృద్ధిని కలుగజేయుటయే తన దుఃఖమునకు కారణమనీ పెద్దలు ధర్మహీనత చెందేరనీ, నియమం, విధియోగములను పాటించక కనిష్ఠుడైన పాండుపుత్రునకు పట్టం కట్టడం నీతిశాస్త్ర విరుద్ధమనీ స్పష్టపరిచాడు.

అతను యింకా యిలా అన్నాడు: పాండవులు హరిశ్చంద్రు డంతటి భాగ్యమును అనుభవిస్తున్నారు. వారి సంపదనుచూచి నాకు శ్రేయస్సు ఎలా కల్గుతుంది. "రాజా! చూచావా! ఈ యుగం అంఘుల అధికారంతో అస్తవ్యస్థ మవుతోంది" అని దుర్యోధనుడు సాంప్రదాయక నీతికోసమని యుగధర్మాన్ని అనుసరించి నిర్ణయించిన ఆచార్యులను సహితం తూలనాడేడు.

ధర్మరాజాదులు వారణావతమునకు పంపబడ్డారు. లాక్షాగృహదహనం జరిగింది. వారణావతంలోని ప్రజలందరూ పాండవుల దుర్మరణానికి విలపిల్లేరు. ధార్తరాష్ట్రుల రాజ్యాధికారంపై కుపితులై యిలా వర్తమానం పంపేరు.

"ధృతరాష్ట్రా! నీ కోరిక ఫలించింది. పాండవులను దగ్ధంచేశావు. కోరికతీర కొడుకులతో యీ రాజ్యాన్ని అనుభవించు."

అయితే వారణావతం ప్రజలు భావించినట్లుగాని, దుర్యోధనాదులు భ్రమించినట్లుగాని, పాండవులు లాక్షాగృహంలో నాశనంకాలేదు.

దుర్యోధనాదులను సన్మార్గానువర్తులుగా చేయ ప్రయత్నించినపుడెల్ల భీష్మ, ద్రోణ, విదురులు ప్రజలందరూ పాండవ పక్షపాతులై ఉన్నారని నొక్కి వక్కాణించేవారు. ఉదాహరణకి యీ విదురవాక్యం గమనార్హం. రాజా! పురములలోను, గ్రామములలోను నివసించుచున్న యావత్ప్రజానీకమూ, పాండవులు సజీవులై బయటపడిరన్న వార్త విని వారి బలప్రదర్శ

నమునకు హృదయపూర్వకంగా సంతోషించారు. అట్టి ప్రజానీకానికి ప్రియమును చేకూర్చడమే మన విధి.

లాక్షా గృహదహనానంతరం దుర్యోధనాదులకు అపకీర్తి, పాండవులకు ప్రఖ్యాతి లభించాయి. అంతే కాక, మహావీరులైన పాంచాలురతో సంబంధంకూడ పాండవులకు లభించింది. ఆ హేతువుచేతనే వారి అర్ధరాజ్యము వారికి, వెనువెంటనే ఇచ్చివేయబడింది. కాని సనాతన ధర్మబద్ధుడూ మాత్సర్య సహితుడు అయిన దుర్యోధనుడు, మాయా ద్యూతములో రాజ్యమును అపహరించాడు. ఆ సమయంలో పాండవులను, ద్రౌపదిని పరాభవించాడు. ఈ అలౌకిక చర్యవలన, జనాగ్రహాన్ని మిక్కుటంగా చూరగొన్నాడు. దుష్ఫలితాల నుంచి, తమ్ము తాము రక్షించుకొనే నిమిత్తం, వారి అర్ధరాజ్యమును వారికి మరల యిచ్చి ధృతరాష్ట్రుడు తన ఉదారతను ప్రకటించుకొన్నాడు.

దుర్యోధనాదులు అనాలోచితంగా చేసిన యీ అలౌకిక చర్యవలన, తా మాశించిన ఫలితం లభ్యం కాలేదు. తత్ఫలితంగా తెలివితెచ్చుకొని, మరొకమారు మాయా ద్యూతమును ఏర్పరచారు. యీమారు నిర్దిష్టమైన నిబంధనలు విధించారు. (12 సం॥ లు అరణ్యవాసం 1 సం॥ అజ్ఞాతవాసం.)

పాండవులు విధియుక్తంగా అరణ్య అజ్ఞాతవాసాలు చేస్తూన్న కాలంలో పాండవులవలె జనరంజకత్వమును పొందటంకోసం దుర్యోధనుడు తనపరిపాలనలో ప్రజానుకూల ధోరణిని అవలంబించాడు.

ద్వైతవనమునందున్న ధర్మరాజుతో అతనిదూత దుర్యోధనని రాజ్యపరిపాలనను ప్రశంసించినట్లుగా భారవి మహాకవి "కిరాతార్జునీయం"లో యీక్రింది శ్లోకం ద్వారా తెలియపరుస్తాడు.

"నిరత్యయం సామ నదానవర్జితం
నభూరిదానం విరహయ్య సత్క్రియామ్
ప్రవర్తతేఽస్య విశేషశాలినీ
గుణానురోధేన వినా న సత్క్రియా"

దుర్యోధనుడు ప్రజలందరికీ, వారికి కావలసిన ధనాదుల యిచ్చుచున్నాడు. మంచిమాటలతో జనాన్ని స్వాధీనపరచుకొను చున్నాడు. నిర్బాధకమైన సామవాదాన్ని అనుసరిస్తూ, ఉచితమైన దానోపాయాన్ని, వర్జించడంలేదు ఈదానంలో కూడ గుణోచిత, పాత్రోచిత జ్ఞానమునే అవలంబిస్తున్నాడు.

"వసూని వాఞ్ఛన్ న వశీ న మన్యునా
స్వధర్మ ఇత్యేవ నివృత్తకారణః
గురూపదిష్టేన రిపౌ సుతేఽపి వా
నిహంతి దండేన స ధర్మవిప్లవం"

దుర్యోధనుడు యింద్రియ నిగ్రహం కలవాడు. అతను ధనవాంఛతో ఎవరినీ శిక్షించుటలేదు. క్రోధంలోనూ శిక్షించుటలేదు. తన విధ్యుక్తధర్మాను సారం, ధర్మాతిక్రమణ చేసినవారిని శత్రువైనా, పుత్రుడైనా గురూపదేశాను సారం శిక్షించేవాడు.

కాని ఆస్తి విభాగ ధర్మనిర్ణయాలలో లోకులు ధర్మ రాజాదులకే అనుకూలురగుటచేతనూ సనాతన నీతి శాస్త్రాన్ని దాయభాగ సమస్యలో ప్రజలు వ్యతిరేకిస్తూండుటచేతనూ దుర్యోధనుని యత్నం తాను కాంక్షించిన ఫలితాన్ని యివ్వలేకపోయింది.

పాండవులు అరణ్యవాసమును, అజ్ఞాతవాసమును పూర్తిచేసి, తమ అర్ధరాజ్యాన్ని తమకు యివ్వవలసినదిగా కోరారు. దానికి దుర్యోధనుడు - రాజ్యం అవిభాజ్యమని జ్యేష్ఠుడే సర్వాధికారిఅని పునరుద్ఘాటించాడు. అంతేకాక, తన పరిస్థితిలో సనాతన నీతి శాస్త్ర విరుద్ధంగా, తన తండ్రి దుర్మంత్రాలకు లోబడి ధర్మరాజునకు అర్ధరాజ్యమిచ్చాడు. అప్పుడు తాను అభ్యంతరం చెప్పలేకపోవడానికి కారణం తన అంగీకారం కాదని బాల్యంచేత, అజ్ఞానంచేత, భయంచేత వ్యతిరేకించలేకపోయేనని ఉద్యోగపర్వంలో దుర్యోధనుడే చెప్పుకొన్నాడు.

ఈ విధంగా దుర్యోధనాదులు సనాతన నీతి శాస్త్రాన్ని పునఃప్రతిష్ఠించడానికి యుగధర్మానికి వ్యతిరేకులై జీవితాంతం పోరాడేరు.

## పాండవులవాదన

పాండవులు ఆద్యంతమూ, తమ తండ్రి దాయ భాగమైన అర్ధరాజ్యముకొరకే వాదించారు. పితృప్రాధిపత్యమునూ ఆత్ పూర్వ కాలాల నీతిశాస్త్ర విషయాలను వాంఛించలేదు. పుట్టంధుడైన ధృతరాష్ట్రుడు జ్యేష్ఠుడైనప్పటికీ, రాజ్య పరిపాలనకు అనర్హుడు కావడంవల్ల పాండురాజు పరిపాలించాడు. ఆ కారణం పురస్కరించుకొని తమకే రాజ్యం యావత్తు సంక్రమించవలెనని వారు కోరలేదు. సరిగదా, ధృతరాష్ట్రుడు జాత్యంధుడైనంతమాత్రాన, రాజ్యానికిహక్కుదారు కాడు అనే వాదాన్ని కూడ పాండవులు ఖండించారు. కనుక నే కురురాజ్యంలో ధృతరాష్ట్రునికి అర్ధరాజ్యం, పాండురాజుకి అర్ధభాగమూ అని ప్రతిపాదించారు. తమతండ్రి

దాయ భాగంకోసం మాత్రమే యెన్ని త్యాగాలకైనా వెనుతీయక చివరవరకు పోరాడేరు.

కౌరవసభలో దుర్యోధనుడు రాజ్యం అవిభాజ్యమని, అది పైతృకమని పాండవులకు అర్ధరాజ్య మియ్యడం అధర్మమని వాదించిన సందర్భంలో భీష్మాచార్యులు అతనికి బుద్ధిచెప్పే ఉద్దేశ్యంతో యిలా అన్నాడు:

నాయనా! దుర్యోధనా! ఈ రాజ్యము నీపైతృకమని నీవు యెట్లు తలపోయుచున్నావో, అట్లే తమ పైతృకమని పాండవులుకూడ భావిస్తూన్నారు. ఈ రాజ్యము పాండవులకు ప్రాప్తించదని నీవు అన్న యెడల నీకుమాత్రము ఎట్లు ప్రాప్తించును? నీవు ఆలోచించుకోవలసి ఉన్నది. ఏ ధర్మముచేత నీకు రాజ్యప్రాప్తి కలిగినదో! ఆ ధర్మానుసారము వారికినీ కలుగుచున్నది.

అంతేకాక కీర్తిశాలురైన పాండవులు యీ రాజ్యములో తమ పైతృకమైన భాగమును పొందకపోతే ఏ భారతీయుడునూ పైతృకమును పొంద అర్హుడు కాదనే స్పష్టమవుతోంది. జ్యేష్ఠన్యాయంచేత రాజ్యాన్ని నీవు పొందడమేననే ధర్మాన్ని ప్రతిపాదిస్తున్నావు. కాని అజ్యేష్ఠన్యాయమే పాండవుల దాయభాగ విషయంలో కూడా అన్వయింపబడుతూంది. పూర్వస్థితిలో తండ్రి తన రాజ్యాన్ని తనకు యిష్టమైనవానికి యిచ్చివేసే అధికారం ఉండేది. ఉదాహరణకు యయాతి చక్రవర్తి తన కుమారులలో జ్యేష్ఠుడు కాకపోయినా తనకు ప్రియతముడు కావడంవల్ల పురూరవునకు తన రాజ్యాన్ని యిచ్చివేశాడు. కాని క్రమశః తండ్రి తన కిష్టమైన రీతిలో రాజ్యాన్ని యిచ్చుటకు వీలులేదని, జ్యేష్ఠునకే యివ్వాలని నీతి ఏర్పడింది. ఈ నీతి ఏర్పడినప్పుడే జ్యేష్ఠునితో కూడా కనిష్ఠునకు సహితం తన పైతృకముపై అధికారమున్నదని బీజప్రాయంగా అంగీకారం పొందింది. కనుక పాండవులుకూడ యీ రాజ్యములో అర్ధభాగమునకు అధికారులై ఉన్నారని తనబుద్ధికి తోచెనని భీష్ముడు చెప్పేడు.

భీష్ముడు ఇచ్చిన యీ వివరములతో ద్రోణాచార్యులు ఏకీభవించారు. అంతేకాక ధృతరాష్ట్రుడు సహితం సూత్రప్రాయంగా ఆమోదించాడు. అతను ఇలా అన్నాడు "అవును. ఈ రాజ్యము నా పుత్రులకు ఎట్టి హక్కు అయి ఉన్నదో అట్లే పాండవులకునూ హక్కు అయి ఉన్నది. ఇందులో సంశయంలేదు".

శ్రీకృష్ణుడు రాయబారానికి వచ్చేడు. విదురుని యింట విడిసేడు. అప్పుడు కౌరవుల పేరోలగంలో యిలా అన్నాడు. "పాండవులకు అర్ధరాజ్యం యివ్వండి. గొప్పదైన సంపదను పొందండి. పాండవులతో స్నేహము సుహృద్భావం, పెంచుకోవడం మీకు శ్రేయస్కరం. హితులమైన మా అందరికీ ఆనందదాయకం". కృష్ణుడు పాండవుల ధర్మతత్వాన్ని వివరిస్తూ, వారు అధర్మయుతముగా యావత్ రాజ్యము పట్టంకట్టినా తీసుకోరు. చివరికి సరిపడవిని యిచ్చినా ఒల్లరు. వారికి ఏకచ్ఛత్రాధిపత్యం అక్కర్లేదు.

అంతేకాక దుర్యోధనుని తన విడిదికి రావించి జనాంతికంగా యిలా చెప్పేడు.

దుర్యోధనా! నా మాట విని పాండవులతో సంధికి యిచ్ఛగించు. వారి అర్ధరాజ్యాన్ని వారి కియ్యి. అలా కావనే పక్షంలో వారి అయిదుగురికి 5 గ్రామాలు అయినా ఇయ్యి ఆ అయిదు గ్రామాలు ఏమిటంటావా? ఇంద్రప్రస్థము, యమప్రస్థము, అవంతి, వారణావతి, హస్తినాపురం యీ గ్రామాలను వారు కోరుతున్నారు అని సూచన చేసేడు.

ఈ సూచనలో సిద్ధాంతపరమైన కీలకం ఒకటుంది. ఏకచ్ఛత్రాధిపత్యాన్ని శాస్త్రరీత్యా కోరుతూన్న దుర్యోధనుడు దేహీ అని అడుగుతూన్న వారికి ఉదారత చూపినట్లయినా కనీసం అయిదు గ్రామాలు యివ్వడం తటస్థిస్తే దుర్యోధనుడు చెప్తూన్న శాస్త్రమే వీగిపోతుంది. దుర్యోధనుడు నిర్దేశించిన ధర్మశాస్త్ర ప్రకారము పరపిండోపజీవులు కావలసిన పాండవులు అయిదు గ్రామాలకు అధికార్లు అవుతారు. తద్వారా పాండవులకు నైతికవిజయం ఏర్పడ్డమే కాక, ప్రజలలోని అన్ని వర్గాలవారి సహకారము సాధించగలుగుతారు. తద్వారా ఆగతధర్మ ప్రతిపాదకులైన పాండవుల వాదనకు సుస్థిరత్వం కలుగుతుంది.

దానికి దుర్యోధనుడు అంతకన్న తెలివిగా యిలా జవాబు చెప్పేడు:

"ఇంద్రప్రస్థంగురువైన ద్రోణాచార్యులకు, యమప్రస్థం కృపాచార్యులకు ఇదివరకే యిచ్చేశాను. అలాగే అవంతి కర్ణుడికి, భీష్మునికి వారణావతికూడ దత్తం చేసేను. హస్తినాపురం నా కుండాలికదా! ఈ విధంగా అయిదు గ్రామాలు అన్యాక్రాంతం అయాయి. కనుక ఓ దేవకీనందనా! పాండవులకు యివ్వవలసినది నిశితమైన సూదిమొన నిలిపే అంతభూమికూడా లేదు. పోతే యుద్ధంలేకుండా నేను వాళ్లకు ఏమీ యివ్వను."

కర్ణుడు, తాను తప్ప పైన పేర్కొన్న అయిదు గ్రామాలు యివ్వబడినవారంతా పాండవ పక్షపాతులే. కనుక యీ చర్యవల్ల అట్టివారిని కట్టుకోవడమూ అవు

తుంది. పాండవులకు లేదూ అని చెప్పడము అవుతుంది అది దుర్యోధనుని పథకం.

## సంజయ రాయబారము

ఉత్తర దక్షిణ గోగ్రహణాలు జరిగినతరువాత ధృతరాష్ట్రుడు సంజయుని పాండవులవద్దకు రాయబారం పంపించేడు. రాయబారిగా సంజయుడు అవలంబించిన వైఖరి లౌకిక విషయ పరిజ్ఞానానికి పరాకాష్ట అని చెప్పవచ్చును. కృష్ణుని రాయబార సరళి తీసికట్టు కాకపోయినా నిర్దిష్టమైన ప్రతిపాదనలకు కట్టుబడి వుంది. ముందుగ అర్థరాజ్యాన్ని ఇమ్మని తరువాత కనీసం అయిదుగురికి అయిదు గ్రామాలైన ఇవ్వాల్సిందని కోరాడు. కాని సంజయుడు ఏవిధమైన ప్రతిపాదనలూ చేయలేదు. పాండవుల వ్యక్తిగత గుణగణాలను వర్ణించాడు. పాండవులకు తుచ్ఛమైన, అశాశ్వతమైనరాజ్యం ఎందుకని ధర్మబోధ చేశాడు. పైగా అర్ధరాజ్య కాంక్షను పూర్తిగా త్యజించమని కోరాడు. ధర్మశాస్త్ర రీత్యా ఏకచ్ఛత్రాధిపత్యము న్యాయసమ్మతంకనుక దానికోసం తమ కౌరవపక్షం యుద్ధానికి సంసిద్ధమేనని అన్నాడు. అంటూనే యీ దాయభాగ సమస్యకోసం పాండవులే హింసకు పూనుకొంటున్నారని ఆరోపణచేశాడు. యుద్ధాన్ని కాంక్షించడం వారికే శ్రేయస్కరం కాదని కౌరవులు తమ సహజ దుశ్శీలతవల్ల చెడుబుద్ధికి లోనై మీకు అర్ధరాజ్యం యివ్వకపోయినప్పటికి రక్తప్లావితమైన రాజ్యాన్ని మీరు పొందేకంటే మీ ధర్మ ప్రవృత్తికి అనుకూలమైన భిక్షాటనం అంధకార రాజ్యంలోను, యాదవ రాజ్యంలోనూ చేసుకోవడం చాలా శ్రేయస్కరమని హితవు చెప్పేడు.

కనుక కరుణాకరుడైన ఓ ధర్మరాజా నీలోని అసూయను విడచి క్రోధ శాంతిని పొందుము. నిన్ను ప్రార్థిస్తున్నాను. అని మహా లౌక్యంతోటి చెప్పినమాటలలో కౌరవుల రాజ్యవైభవానికి మీరు కేవలము ఈర్ష్యాళువు లగుతున్నారని క్రోధంతో విజృంభిస్తున్నారని అట్టి క్రోధము ఆత్మశత్రు వవుతుందని ధ్వనింపజేసేడు. అల్పమైనవాళ్ళకి క్రోధాన్ని అణచుకోడం, శక్తికిమించిన పనిగాని శంకరుడు హాలాహలాన్ని మ్రింగినట్లుగా ధర్మజుడు క్రోధాన్ని దిగమ్రింగి శాంతచిత్తుడై సెయ్యానికి ఉపక్రమించగలడని తానాశించుతూన్నట్లుగా ఉత్ప్రేక్షించాడు. దానికి ధర్మరాజు పైకి ధర్మముగా కనుపించేది అంతా అన్నివేళలా ధర్మంకానేరదని స్థూలదృష్టికి అధర్మంగా కనుపించినప్పటికీ చరమాశయాన్ని అనుసరించి కొన్నికర్మములు ధర్మములే అవుతాయని వ్యాఖ్యానించాడు. చివరకు ధర్మరాజు అహింసనుగురించి, అధిక ప్రసంగం చేయుచున్న సంజయునితో యిట్లు అన్నాడు. "అహింసయ యుత్తమగు ధర్మంబగు, నట్లయినను వంశదూషకులను లోకకంటకులను నగు పాపాత్ములను నిర్మూలంబుగా జేయుకుట ధర్మంబని పెద్దలచే విందు" (ఉద్యోగపర్వ ప్రథమాశ్వాసం)

సంజయ రాయబార సారాంశం యిలా స్పష్టీకరించవచ్చును. "పాండవులకు అర్థభాగమును కౌరవులు యివ్వరు. వారు యుద్ధానికి సంసిద్ధులుగా నున్నారు. కాని పాండవులు హింసకుపూని యుద్ధానికి ప్రయత్నించడం చాలా అసమంజసం, పాండవులు బిచ్చమెత్తుకొని జీవించడం వారియోగ్యతకు తగిఉన్నది. ఈ అభిప్రాయాలనే యింకా మెరుగు పెడుతూ ప్రతిపక్షంపై అలవికాని అభాండాలను వేశాడు.

తనరాయబారం ముగిస్తూ సంజయుడు యిలా అన్నాడు. "అక్కడ కౌరవులు తమకు అనుభుక్తమగుతున్న సర్వసంపదలను సుస్థిరం కావించుకోనేందుకు పుత్ర మిత్ర బంధుజన సహితంగా సమరంలో నిర్లక్ష్యంగా ప్రాణాలను విడవడానికైనా సంసిద్ధులుగా ఉండాలమని త్రికరణశుద్ధిగా నమ్ముతున్నారు.

పాండవులారా! మీరు కోరుతున్న అర్థరాజ్యం (దాయభాగంకోసం) తద్వారా సమజీవనం పొందుటకోసం సర్వత్యాగాలకు వెనుతీయక బంధు, మిత్ర, పుత్ర సహితంగా కౌరవులను యుద్ధంలో నిర్జించాలని నిశ్చలదీక్షతో ఉన్నారు.

## ముగింపు

పంచమవేదమైన మహాభారతంలో రెండు విభిన్న యుగ ధర్మాలమధ్య సంఘర్షణలకు కర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో ఫలప్రాప్తి సిద్ధించింది ఆకురుక్షేత్రమే ధర్మక్షేత్రమై నాటికి ఆగత ధర్మానికి స్వాగతం పలికింది. సమాజంలోని ఆస్తి విభాగనీతిశాస్త్రానికి కొత్త ప్రకరణం చేర్చింది. సుయోధనుని సాంప్రదాయిక ధర్మవాదమైన అవిభాజ్యత్వము, జ్యేష్ఠ న్యాయమువంటి వానికి తిరుగులేని ఓటమిని చేకూర్చింది. భ్రాతృ సమజీవనమనే నూతన న్యాయానికి విజయం సాధించింది.



# పుస్తక సమీక్ష

## 1857 తిరుగుబాటు

ప్రథమ భారత స్వాతంత్ర్య సమర శత వార్షికోత్సవ సందర్భంలో పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్ వారు ఆంగ్లంలో ప్రచురించిన స్మారక సంపుటి '1857 తిరుగుబాటు'.

ఇది మొత్తం 855 పేజీలు; వెల హోలు ప్రతి రు. 12; సాదా ప్రతి రు. 8. ప్రచురణ కర్తలు: పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్, ఆసఫాలీరోడ్, న్యూఢిల్లీ.

100 సంవత్సరాల క్రిందట జరిగిన 1857 పోరాటం స్వాతంత్ర్య సమరమని యీనాడు అన్ని దేశభక్తియుత పార్టీలు, శక్తులు స్థూలంగా అంగీకరిస్తున్నప్పటికీ, ఆ సంగ్రామంలో వివిధ వర్గాల ప్రయోజనాలు, వాటి పాత్ర మొదలైన కీలక సమస్యలపై యింకా భేదాభిప్రాయాలున్నాయి. కనుకనే యీ గ్రంథం అనేక స్వతంత్ర వ్యాసాల సంపుటిగా ప్రచురితమైంది.

భారత స్వాతంత్ర్య సమరంయొక్క కారణాలను, స్వభావాన్నీ, ఫలితాలను శాస్త్రీయ దృక్పథంతో తెలుసుకొనేందుకు జరిగిన సమిష్టి ప్రయత్నం యిది.

ఈ గ్రంథం 3 భాగాలుగా విభజింపబడింది. ప్రథమభాగంలో 1857 తిరుగుబాటుకు కారణాలను, దాని స్వభావాన్ని, ఫలితాలను గురించి వ్రాసిన వ్యాసాలున్నాయి. రెండవభాగం హిందీ, బెంగాలీ, ఉర్దూ సాహిత్యంపై దాని ప్రభావమెట్టిదో తెలియజేసే వ్యాసాలున్నాయి. చివరిభాగంలో బ్రిటన్, చైనా, రష్యా, ఫ్రాన్స్, ఇటలీ దేశాల ప్రజలపై దాని ప్రభావం తెలిపే వ్యాసాలున్నాయి.

"మహాపోరాటం" అనే శీర్షికతో తాల్మిజ్ ఖాల్దున్ రచించిన వ్యాసమూ, "మన చరిత్రలో 1857" అను శీర్షిక క్రింద పి సి జోషి వ్రాసిన వ్యాసమూ వివాదగ్రస్తమైన కొన్ని కీలక సమస్యలను పాఠకుని ముందుంచాయి. వాటిపై రచయితలు తమ అభిప్రాయాలను తెలియజేశారు.

పోరాటం కొనసాగుతూన్న కాలంలో విప్లవకారులు కేంద్రంలోను, విముక్త ప్రాంతాల్లోను నెలకొల్పిన రాజ్యాంగ యంత్రాన్ని గురించి తాల్మిజ్ ఖాల్దున్ రచించిన వ్యాసభాగం చదివితే, సిపాయిల నాయకత్వం క్రింద స్థాపింపబడ్డ పరిపాలనా సంస్థలు ప్రధానంగా ప్రజాస్వామ్య స్వభావం కలిగియుండేవని తెలుసుకోవచ్చు. దాన్ని నిరూపించడానికాయన ఎన్నో చారిత్రక ఆధారాలు చూపారు. ఢిల్లీలోని మిలిటరీకోర్టు (దీని ఆధీనంక్రిందనే కేంద్ర ప్రభుత్వం ఉండేది.) సామాన్య ప్రజల్ని పన్నులభారం నుంచి మినహాయించిందనీ, "జమీందారీ విధానాన్ని రద్దుచేసి దున్నేవానికి భూమిపై యాజమాన్య హక్కు యిస్తూ ఉత్తరువు జారీచేసిం"దనీ రుజువు చేసేందుకాయన ఒక పెర్షియన్ చారిత్రక పత్రాన్ని పేర్కొన్నారు. దీన్నిబట్టి, 1857 విప్లవం జయించియుంటే భారత దేశంలో నిరంకుశ రాచరిక వ్యవస్థ తిరిగి నెలకొల్పబడేదంటూ కొందరు చారిత్రకవేత్తలు చేసేవాదన సరియైనదేనా అన్న అనుమానం కలుగకమానదు. అయితే "తిరుగుబాటు దేశీయ భూస్వామ్య విధానానికీ, విదేశీ సామ్రాజ్య వాదానికీ వ్యతిరేకంగా రైతాంగ యుద్ధంగా అంతమయిం"దనడంమాత్రం అతిశయోక్తి అని నా ఉద్దేశం. పోరాటం చివరిరోజుల్లో అనేకమంది జమీందార్లు, జాగీర్దార్లు పరాయి ప్రభుత్వానికి దాసోహం చేసినమాట నిజమే. అట్టివారందరినీ రైతులు ప్రతిఘటించారనడానికి ఆధారాలు కనబడవు. అప్పటికింకా ఫ్యూడల్ భూస్వామ్య సాంప్రదాయాలు రైతాంగంమీదఎంతో ప్రభావం కలిగియుండేవనడానికి నిదర్శనలు చాలా ఉన్నాయి. అంతేకాక బ్రిటిషు ప్రభుత్వానికి కావలికుక్కలుగా పనిచేసిన పెద్ద సంస్థానాలలో రైతులు తిరుగుబాటు చేయలేదన్న విషయం అందరికీ తెలిసినదే. ఒకవైపు రచయిత రైతాంగంయొక్క చైతన్యాన్ని వైవిధంగా ఎక్కువ అంచనా వేశాడు; రెండోవైపున పోరాటం జయించివుంటే "నూతన ప్రభుత్వం తిరిగి పాత రాచరిక వ్యవస్థలోకి దిగజారియుండే"దని వైదానికి విరుద్ధమైన నిర్ధారణకు వచ్చాడు.

ఇట్టి లోపాలు శ్రీ జోషీ వ్యాసంలో కనిపించవు. పోరాటంయొక్క వివిధదశల్లో ఫ్యూడల్ శక్తుల పాత్రను ఆయన వాస్తవిక దృష్టితో చిత్రించారు.

"1857 పోరాటంలో ఒక తరగతికి చెందిన భారత ఫ్యూడల్ భూస్వాముల ప్రయోజనాలూ, జాతీయ ప్రయోజనాలూ ఒకటయ్యాయి. వారు బ్రిటిషు పాలనను వ్యతిరేకించారు. జాతీయ సమరంలో వారు ప్రత్యక్షంగా పాల్గొన్నారు. అయితే దీని అర్థం వారిలో తీవ్రమైన లోపాలు, ప్రమాదకరమైన పరిమితులు లేవని కాదు. అట్టి లోపాల, పరిమితులవల్ల జాతీయసమరం చాల నష్టపోయింది." (Rebellion 1857 : పేజీ 167 )

పోరాటంలో పాల్గొన్న ఫ్యూడల్ వర్గం యొక్క పాత్ర ద్వంద్వ స్వభావంగలదని వివరిస్తూ శ్రీ జోషీ యీ క్రిందివిధంగా తెలియజేశారు:

"విప్లవ వెల్లువ అంతకంతకు ఉధృతమౌతున్న కాలంలో వీరు (ఫ్యూడల్ వర్గంలోని ఒక తరగతి) ప్రజల ఒత్తిడివల్లనూ, విదేశీపాలనపట్లగల ద్వేషంతోనూ దేశభక్తియుత పాత్ర నిర్వహించారు. కాని ఆ వెల్లువ తగ్గిపోతున్నప్పుడు, విప్లవ ప్రజాశక్తులు విచ్ఛిన్నమౌతున్నప్పుడు వారి వర్గస్వభావంలో ఉన్న నిజమైన బలహీనత బయటపడింది. వారు పిరికిపందలుగా, దేశద్రోహులుగా వ్యవహరించారు." (Rebellion 1857 : పేజీ 170)

విప్లవానికి నాయకత్వం వహించినది రైతువర్గం నుంచి వచ్చిన సిపాయిలని శ్రీ జోషీ సహేతుకంగా వాదించారు. అయితే "రాజకీయ - సిద్ధాంత నాయకత్వం యింకా ఫ్యూడల్ పాలకవర్గానిదే" నని నిరూపించారు.

ఈ సందర్భంలో, భారత ప్రభుత్వం తరఫున 1857 తిరుగుబాటునుగూర్చి శ్రీ సేన్ రచించిన గ్రంథంలోని పొరపాటు అంచనాను శ్రీ జోషీ ఖండించారు. శ్రీ సేన్ తన గ్రంథంలో బ్రిటిష్ పాలకులు లౌకిక సామాజిక విప్లవాన్ని తీసుకొచ్చారనీ, మానవులమధ్య సమాన హోదా నెలకొల్పడానికి ప్రయత్నించారనీ "రైతుల యొక్క, అర్థబానిసలయొక్క స్థితిగతులను బాగు పరచడానికి ప్రయత్నించా"రనీ వ్రాశారు. అందుచేత విప్లవనాయకులు "కాలచక్రాన్ని వెనక్కు మళ్ళించేందుకు కృషిచేసి యుండేవార"నీ, "విప్లవ ప్రతీఘాతం" వారి అభిమతమనీ వ్రాశారు. ఈ సిద్ధాంతాన్ని శ్రీ జోషీ సమర్థవంతంగా ఖండించారు :

"1857 జాతీయ మహాసంగ్రామంలో ప్రజాశక్తులు చురుగ్గానే పనిచేశాయి; ప్రజల వాంఛలు సక్యమైనవే; వారి ఆలోచనా విధానంకూడ సరియైనదే. అంతవల్ల భారతదేశంలో అభివృద్ధి నిరోధకమైన ఫ్యూడల్ వ్యవస్థ తిరిగి తలయెత్తకుండా చేసే శక్తి వారికు[illegible]." (Rebellion 1857 : పేజీ 182)

అయితే శ్రీ జోషీ ఒకటి రెండు విషయాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలు సరియైనవి కావేమో అని పిస్తుంది. ఉదాహరణకు, 1857 తిరుగుబాటు ఓడి[illegible] తప్పదని ఆయన అభిప్రాయం.

"1857 తిరుగుబాటూ, దాని వైఫల్యమూ [illegible] త్రక అనివార్యాలు" (Rebellion 1857 : పేజీ 151).

విప్లవంలో కొన్ని వర్గాలు ప్రదర్శించిన విద్రోహ పాత్ర, సైనిక శాస్త్రంలో విప్లవకారుల వెనుకబాటుతనం మొదలైన విషయాలు సహజంగా విప్లవ వైఫల్యానికి కారణాలు. అట్టిలోపాలను ఒక్కొక్కటే పేర్కొనడం వేరు, అవి అనివార్యమని ఖండితంగా తీర్చి చెప్పడం వేరు, ప్రపంచ చరిత్రలో అన్ని విప్లవాలూ జయించలేదు. అలాంటి వాటిలో 1857 తిరుగుబాటు ఒకటి. అది విఫలమవడానికిగల కారణాలను శాస్త్రీయ పద్ధతిలో తెలియజేయవచ్చు; లోపాలు జరిగియుండకపోతే పోరాటం జయించి యుండేదని వివరించవచ్చు. అంతేగాని, విఫలమవడం అనివార్యమని తీర్చి చెప్పడం శాస్త్రీయ పద్ధతి కాదనిపిస్తుంది.

రెండవది 1857 తర్వాత జరిగిన పరిణామాల విషయం. బ్రిటిష్ పాలకులు స్వార్థ ప్రయోజనంకోసం "చదువుకొన్న మధ్యతరగతి వర్గాన్ని" సృష్టించారని, ఆ వర్గమే భారతదేశంయొక్క విప్లవప్రగతిశీల మేధావి వర్గంగా రూపొందిందనీ, జాతీయోద్యమంలో వారు నాయకత్వపాత్ర వహించా"రనీ శ్రీ జోషీ తెలియజేశారు. (Rebellion 1857 : పేజీ 218). [illegible] అతిశయోక్తిగా కనిపిస్తుంది. 1857 తర్వాత భారత దేశంలో మేధావివర్గం అభ్యుదయకరమైన పాత్ర నిర్వహించిందనడంలో సందేహం లేదుగాని, ఆ వర్గం నాయకత్వపాత్ర వహించిందనడం సమగ్రమైన సత్యం కాదు; కాంగ్రెసు ఉద్యమాలలో చదువుకున్న మధ్యతరగతి. స్థానికంగా అనేకచోట్ల నాయకత్వం వహించినప్పటికీ, అఖిలభారత కాంగ్రెసు విధానాలను రూపొందించినది పారిశ్రామిక పెట్టుబడిదా[illegible]

వర్గం. కేంద్రంనుంచి నాయకత్వం వహించిన వర్గం యిదే.

మొత్తంమీద, భారత స్వాతంత్ర్య సమరాన్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశోధించి అంచనా వేయడానికి జరిగిన తొలి ప్రయత్నం యిది. ఆ చారిత్రక ఆధారాలతో నిండియున్న యీ సంపుటి స్వాతంత్ర్య ప్రియుల, దేశాభిమానుల, శాస్త్ర పరిశోధకుల మన్నన లందుకొంటుందని ఆశిస్తున్నాను.

కంభంపాటి సత్యనారాయణ



# నాట్యకళ

శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారి సంపాదకత్వాన విజయవాడనుంచి వెలువడుతున్న త్రైమాస పత్రిక ఈ నాట్యకళ.

తెలుగులో ప్రత్యేకంగా వివిధకళారంగాలకు సంబంధించిన పత్రికలు ఎన్నో లేవు. మధ్యమధ్య ఒకటీ అరా ఉత్సాహపరుల పట్టుదలతో బయలుదేరినా తగినంత ఆదరణ లభించక ఆగిపోతున్నాయి. నాట్యరంగానికి సంబంధించి ఇదే పేరుతో మద్రాసునుంచి కొంతకాలం శ్రీ నీలంరాజు శేషయ్యగారు ఒక త్రైమాస పత్రికను నిర్వహించేరు. కొద్దికాలం తర్వాత అది ఆగిపోయింది. అయితే అది జరిగి 20 ఏళ్లు దాటిపోయింది. ఈలోగా తెలుగు దేశం చాలా అభివృద్ధి చెందింది. ఈమారు వెనకటిలాగ కాక 'నాట్యకళ'ను పోషించుకో గలదని ఆశిస్తున్నాము.

శ్రీ చక్రవర్తిగారికి నాట్యకళ మీద గల ప్రత్యేకాభిమానం అభినందనీయం. ఆ అభిమానమే మొదలుగా వారీ నాట్యకళను ఆరంభించేరు తెలుగు పాఠకులు వారికి చేయూత నిస్తారు. సందేహం లేదు.

ఇందులో-

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, విశ్వనాథ, కవిరాజు, కొప్పరపు సుబ్బారావు, రామచంద్ర కాశ్యప, ఆనందమోహన్, మఖ, బందా కనక లింగేశ్వర రావు గార్ల రచనలున్నాయి. కే. శే. బళ్ళారి రాఘవ ముఖచిత్రంతో సుందరంగా తీసుకురాబడింది.

వెల 50 నయాపైసలు.

ప్రతులకు:

సంపాదకుడు

నాట్యకళ, విజయవాడ-2.



# సంపాదక లేఖలు

ఆర్యా !

"సందేశం" జూలై సంచికలో వరకట్నం, కమ్యూనిస్టుల కర్తవ్యం అను వ్యాసం చదివాను. ఆ వ్యాసం ప్రస్తుత పరిస్థితులలో పార్టీకి యెంతో వుపయోగకారి కాగలదని ఆశిస్తున్నాను.

శ్రీ కంభంపాటి వ్యాసంలో పార్టీ కార్యకర్తలు భయపడాల్సిన లేదా వ్యతిరేకించవలసిన విషయాలుగాని, పార్టీ ప్రతిష్ఠ దెబ్బతింటుందనే భయముగాని యెచ్చట వెదకినా కానరాదు. పోతే "పార్టీ సాంప్రదాయాలను కాపాడవలసిన ఆవశ్యకత" అన్న ఉపశీర్షిక 2 వ పేరాలో "కమ్యూనిస్టు పార్టీలో అధిక సంఖ్యాకులు యీ దుష్ట పిశాచానికి లోబడిపోయారని నా అభిప్రాయం కాదు" అని కంభంపాటిగారు వ్రాయడంలో కొంచెం వెనుకంజ వేస్తున్నారేమోనని నా అభిప్రాయం.

ఈ నాటి పరిస్థితులకు అనేక కారణాలు వుండవచ్చు. ఎన్ని కారణాలున్నా, ముఖ్యమైన కారణాలు రెండున్నాయి. మొదటిది, 42 నుంచి 47 వరకు వరకట్నాలు, బాల్య వివాహాలు, వితంతు వివాహాలమీద పార్టీ తీసుకున్న కార్యక్రమాన్ని, తర్వాత పార్టీచే గాలికి వదలివేయబడింది. '55 తర్వాత పార్టీ పూర్తిగా ప్రతిష్టంభనలో పడిపోయి, నిరుత్సాహ వాతావరణం ఆవరించి అనేక వికృత రూపాలు ధరించింది. వరకట్నాలు తీసుకోవడం, యిచ్చుకోవడం, సామాన్య ప్రజల్లోవలె పార్టీ కార్యకర్తల్లో కూడా సంప్రదాయంగా తయారయింది. రెండవ కారణం అందరూ చెప్పే ప్రేమానురాగాలు ముందుకు రాకపోవడం. స్వార్థపరత్వం యెప్పుడయితే ప్రబలుతుందో అప్పుడే ప్రేమానురాగాలకు తావుండదు. ప్రేమకు, ధనకాంక్షకు ఒకదానికొకటి వ్యతిరేకం. అందువలన అర్థిక ఒత్తిడి ముందు ప్రేమ నిలువలేదు.

19[illegible]2 నుంచి 19[illegible]7 వరకు మధ్యకాలములో వరకట్నాలపైనా, బాల్యవివాహాలపైనా, వితంతు వివాహాలపైనా, కులాంతర వివాహాలపైనా పార్టీ పెద్ద వుద్యమాన్ని నిర్మించి అత్యధిక ప్రజాభిమానాన్ని పొందగలిగి, ఆదర్శప్రాయంగా నిలబడగల్గింది. అదేవిధంగా యిప్పుడు కూడా పార్టీ అలాంటి కార్యక్రమాన్ని తీసుకొని పెద్ద వుద్యమాన్ని లేవదీయగలిగినపుడే, వరకట్నాల సమస్యను అరికట్టడం సాధ్యపడుతుంది. కేవలం వ్యాసాలు వ్రాసినంతమాత్రాన, చట్టాలు చేసినంతమాత్రాన ఈ అనర్థాలను అరికట్టడం సాధ్యంగాదని విజ్ఞప్తి చేస్తున్నాను.

అంతేగాదు; ఇంకా కొంతమంది ముఖ్యంగా మేము ఆస్తిపై స్త్రీకి హక్కు కలిగినప్పుడు వరకట్నాల సమస్య దానంతటదే పోతుందని చిత్రిస్తున్నారు. ఈ వాదన ఎంతమాత్రం అంగీకారయోగ్యమైందిగాదు. ఇది ఒకరకంగా వరకట్నాలను సమర్థించడమే కాగలదు.

అంతేగాదు. రాబోయే మార్గమంటూ వరంగల్ జిల్లా కమ్యూనిస్టు కమిటీ సభ్యుడు వ్రాసిన వ్యాసం చూచినప్పటికి తేలేదేమిటంటే, వరుని పేరుతో కట్నం క్రింద చదివించేదానికంటే వధువు పేరుతో పసుపు కుంకుమ క్రింద చదివించడం మంచిదంటున్నారు. ఏ విధంగా చదివించినా బలవంతంగా వధువు తండ్రి దగ్గర వసూలుచేసిన మొత్తమేగదా! పేరు మార్చినంత మాత్రాన వరకట్న గుణం మారిందా? వధువుయొక్క తండ్రి వరకట్న పిశాచి బారినుండి తప్పుకోగల్గాడా?

ఇవన్నీ వరకట్నానికి మారురూపాలే. స్త్రీ ఆస్తిపై హక్కు కలిగితే వరకట్నాల బెడద తగ్గుతుందనుకోవడం పొరబాటే కాగలదు. కారణం స్త్రీలందరికీ ఆస్తిహక్కు వచ్చినా, అందరి స్త్రీలకు ఎంతో కొంత ఆస్తి సంక్రమించగలదు? వరుడుకోరిన ఆస్తివుంటే గదా ఆ స్త్రీని వరుడు పెండ్లిచేసుకోడం? వరుడు కోరిన ఆస్తి ఆ స్త్రీదగ్గర లేకపోతే యింకొక ఆస్తిగల స్త్రీని చేసుకోవడం జరుగుతుందేగాని ఆస్తిలేని స్త్రీల మాటేమిటి? కాబట్టి వరకట్నాల స్థానములో ప్రేమానురాగాలకు స్థానమిచ్చి, వరకట్నాలకు వ్యతిరేకంగా పెద్ద వుద్యమాన్ని లేవదీసి దానిని అరికట్టగలిగినపుడే ప్రేమకు తావివ్వడం సాధ్యపడుతుంది.

సెప్టెంబరు సంచికలో "కట్నాలు తీసుకోదగిన సందర్భాలుంటవి" అను హెడ్డింగు క్రింద బాపట్ల తాలూకా కమ్యూనిస్టు కమిటీ సభ్యులు "సంజీవి" వ్రాసిన వ్యాసంలో, నే నర్థంచేసుకోగలిగిన దేమంటే వధువుతండ్రి కలవాడయితే పీడించైనా కట్నం

తీసుకోవడంలో తప్పులేదనే. ఇది యెంత తప్పుడు వాదమో చెప్పనక్కరలేదు. కట్నాలివ్వలేని వధువు కొరకు యెవరు ప్రయత్నిస్తారు? ఈ పద్ధతిలో గూడా ఆచరణలో ప్రేమానురాగాలను వెనుకకునెట్టి వరకట్న జాడ్యం ముందుకు రాగలదు.

ఈ కామ్రేడ్ అంతటితో ఆగక "రాజకీయ ఆర్థిక వుద్యమాల స్థాయిలోనే వరకట్నాలపై వుద్యమాన్ని నడిపించడం సాధ్యమౌతూందంటున్నాడు. 1942-47 మధ్య పార్టీ బాల్యదశలో వున్నపుడు కూడా వరకట్నాల వుద్యమాన్ని బ్రహ్మాండంగా నడిపి ప్రజలకు ఆదర్శప్రాయంగా నిలబడగల్గింది. ఈనాడు రాజకీయ చైతన్యం కలిగిన యీ దశలో ఐశ్వగలిగిన వారివద్ద తీసుకున్నా ఫర్వాలేదనే పరిస్థితిలో పడిపోయామంటే పార్టీ ఎంత ప్రమాదావస్థలో వున్నదో అర్థం అవుతుంది. ఎంత స్వార్థతత్వం కలిగివుందో అర్థం అవుతుంది. ఈ సిద్ధాంతం వలన కట్నం యివ్వలేని, యివ్వగలిగిన వధువులిద్దరికీ న్యాయం యేవిధంగా చేకూరుతుందో నాకర్థం కావడంలేదు.

అలా అంటే స్త్రీకి ఆస్తిపై హక్కును వ్యతిరేకిస్తూన్నట్లు భావించరాదు. స్త్రీ ఆస్తిపై హక్కును కలిగియుండుటకు కమ్యూనిస్టుపార్టీ ఆందోళనచేసి ఆ హక్కును సంపాదించవలసిందే. వరకట్నాల వ్యతిరేకోద్యమానికి స్త్రీకి రావలసిన ఆస్తి హక్కుపై నిర్మించే వుద్యమాన్ని జోడించి ప్రచారం చేయాల్సిందే. అప్పుడే స్త్రీకి సమాజములో విలువ వుంటుంది. కాని స్త్రీకి ఆస్తిపై హక్కు ఏర్పడినంత మాత్రాన వరకట్నాల బాధ తప్పిపోతుందనుకోరాదు. అందువలన వరకట్నాల వ్యతిరేకోద్యమాన్ని తీవ్రతరం చేయాల్సిన అవసరమెంతేని కలదు.

సెప్టెంబరు "సందేశం"లోనే విజయవాడనుంచి శ్రీ కుమార్ గారు "లాభంకన్న నష్టంయెక్కువ" అన్న హెడ్డింగుతో వ్రాసిన లేఖను చూసి ఆశ్చర్యపోయాను. ఆయన ఒకవైపు వరకట్నాలకు పూర్తి వ్యతిరేకి నంటున్నారు. మరియొకవైపు వరకట్నాల విషయం ప్రస్తుత పరిస్థితులలో పార్టీ తీసుకోవడం వలన లాభంకన్నా నష్టం ఎక్కువవుతుందంటున్నారు. ఇది యేవిధంగా సమర్థనీయమో అర్థం కాకుండా వున్నది. వరకట్నాల జాడ్యం అందరిలో వున్నట్లుగా కమ్యూనిస్టులలో లేదంటూ ఆ వున్న లోపాలను మీరు పత్రికలో వేసి ఒక తుఫాను లేవదీయాల్సినంత అవసరంలేదనీ, ఆ విధంగా పేపరులో వేయుటవలన శత్రువు దానిని వుపయోగించుకొని పార్టీని దెబ్బకొట్టడానికి ప్రయత్నించవచ్చునే తన భయాన్ని వెలిబుచ్చుతున్నారు.

కమ్యూనిస్టుపార్టీనిర్మాణ సూత్రాలలో ముఖ్యమైనది విమర్శ - ఆత్మ విమర్శన. ఈ సూత్రం ద్వారానే కమ్యూనిస్టుపార్టీ యెప్పటి కప్పుడు తప్పులు కడిగివేసుకుంటూ గట్టి పునాదులతో దినదినాభివృద్ధి చెందుతూంది. కాని కమ్యూనిస్టుపార్టీలోని లోపాలను బయట పెట్టుకోవడం ద్వారా శత్రువుకు అవకాశం దొరుకుతుందని, లోపాలను బయట పెట్టుకోవడం మంచిది కాదంటారు శ్రీ కుమార్ గారు. ఇది యెంత పొరబాటు దృక్పథమో ఆలోచించక పోవడం విచారకరం. మన లోపాలను ఎత్తిచూపుకొని సవరించుకోవడంలోనే వుంది, కమ్యూనిస్టుపార్టీ యొక్క విశిష్టత. కాని యితర పార్టీలకు ఆ దమ్ములు లేవు. అందువలననే వారి లోపాలను బయటపెట్టుకోడానికి భయపడతారు. కాబట్టే యితర పార్టీలలో స్వార్థపరత్వంతో కూడిన నీచభావాలు నిండిపోయి వాటిని బయట పెట్టుకోలేక పైకి ఒకటిగా కనబడినా లోపల లుకలుకలు కనిపిస్తున్నాయి. మన లోపాలను బయట పెట్టుకుంటే శత్రువుకు అవకాశం దొరుకుతుందనే వాదన పిరికివాదం తప్ప మరేమీ కాదు.

అంతటితో ఆగక ఏ చిన్న లోపాన్నయినా సవరించుకొనుటకు సమయాసమయాలు కావాలంటున్నారు. శ్రామిక ప్రభుత్వం యేర్పడిన తర్వాత యే చిన్న లోపమున్నా కడిగివేయవలసిందే గాని యీ పరిస్థితిలో నైతిక ప్రవర్తనలకు సంబంధించిన విషయాలలో కట్టుబాట్లు పనికిరావంటున్నారు. ఒక రాష్ట్రంలో కమ్యూనిస్టు ప్రభుత్వం యేర్పడిన తర్వాత విపరీతంగా పార్టీ పలుకుబడి పెరిగిన ఫలితంగానూ, కమ్యూనిస్టు పార్టీని "ప్రజాపార్టీగా" విస్తృత పరచాలనే సమయంలో అందర్నీ పార్టీలో నిముడ్చుకోవలసిన పరిస్థితులలో యీ నైతిక ప్రమాణాలను అడ్డుపెడితే పార్టీ యేవిధంగా విస్తృత మౌతుందనే సందేహాన్ని వెలిబుచ్చుతున్నారు. ఈ వాదనలో ఏమాత్రం అర్థం లేదు. పార్టీ అనేకరకాలయిన వారిని యిముడ్చుకోడానికి కవాటాలు తెరిచివుంచదు. ప్రజాపార్టీగా రూపొంద వలసిన యీ పరిస్థితులలో పార్టీ సభ్యుల కుండవలసిన కొన్ని అర్హతలను తగ్గించటం జరుగుతుందేగాని ఏ అర్హతలూ లేకుండా ఎవర్నంటే వారిని తీసుకోవడం

జరుగుతుందనుకోవడం పొరబాటు. నైతిక ప్రవర్తన విషయంలో కూడా కొన్ని కట్టుబాట్లుంటాయి.

స్వార్థపరత్వంలో పడిపోయిన కాంగ్రెసుదున్నలూ, వరకట్నాల కలవాటుపడిన కాంగ్రెసుదొన్నలూ వారి లోపాలను ఎత్తిచూపినంతమాత్రాన పార్టీనుంచి వెళ్ళిపోతారనే భయముతో పాపం కుమార్‌గారు విమర్శించసాగితే గుర్రం ఎగిరిపోయి జీను మిగులుతుందంటున్నారు. ఆవిధంగా భావించుటచేతనే యితర పార్టీలు విమర్శనకు పూనుకోవు. కాని కమ్యూనిస్టుపార్టీ పద్ధతి అదిగాదు. ఒరపిడి పెట్టేకొద్దీ వజ్రానికి మెరుగు వస్తుంది.

పోతే కామ్రేడ్ కంభంపాటిగారు ఈ వ్యాసాన్ని వ్రాయుటలో చాలా ప్రత్యేకతవుంది. కారణం కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్టంభననుండి బయటపడుటకు పార్టీ నిర్మాణములో మార్పులు తీసుకరావడం అవసరమని భావించి పార్టీ పునర్నిర్మాణం గావించే యీ పరిస్థితుల్లో నిర్మాణంలో మార్పులతోపాటు సాంఘిక విషయాల్లో కమ్యూనిస్టుపార్టీ అవలంబించుచున్న ఉదాసీనతను ఖండిస్తూ కమ్యూనిస్టుపార్టీ కండ్లు తెరపించడానికి ప్రయత్నించినందుకు అభివందనీయులు.

అంతేగాదు ఇంకా వరకట్నాలపైనా, బాల్య వివాహాలపైనా, వర్ణాంతర వివాహాలపైనా స్త్రీల ఆస్తి హక్కుపైనాకూడా విరివిగా వ్యాసాలు రావాలి.

ఆలా తీసుకరావడమేగాక పై సమస్యలపైన కమ్యూనిస్టుపార్టీ యూనిట్లకు కార్యక్రమమిచ్చి ఉద్యమాలను నిర్మించి బ్రహ్మాండమైన ఆందోళన సాగించాలి.

చాగంరెడ్డి నరసింహా రెడ్డి,
నెల్లూరుజిల్లా కమ్యూనిస్టు కమిటీ మెంబరు,
నేరేడుపల్లె – కనిగిరి తాలూకా.



## ఇక్కడి కిది ఆపుదాం

వరకట్నాల సమస్యపై తమ అనుకూల, వ్యతిరేకాభిప్రాయాలను తెలుపుతూ లేఖలు వ్రాసిన మిత్రులందరికీ అభివందనములు. ఇంతటితో ఈ సమస్యపై లేఖలు నిలుపుచేస్తున్నాం.

ఇల్లాగే ఇకముందుకూడా 'సందేశం' పత్రికలో వచ్చే వ్యాసాలమీద పాఠకులు తమ అభిప్రాయాలను తెలుపుతూ లేఖలు వ్రాస్తూండాలని మా కోరిక.

—సంపాదక వర్గం.

ఆర్యా,

'సందేశం' పత్రికలో పలువురు సోదరులు వరకట్న నిర్మూలనాభిలాష చూపుట చూచి చాల ఆనందించితిమి. ముఖ్యముగా 'సందేశం' సంపాదకులు వరకట్న సమస్యపై సంచలనం తీసికొనివచ్చినందుల కెంతయో అభివందనీయులు.

మేము రెండు సంవత్సరముల క్రితం 'తెలుగు స్వతంత్ర' పత్రికలో స్నేహలత శీర్షిక క్రింద వరకట్నాలను గూర్చి చర్చించితిమి. అనేకమంది వరకట్నాలు నశించాలని వాదించారు. కాని చాలమంది ఆచరణలో వెనుకంజ వేశారని తెల్పుటకు విచారించుచున్నాము. 'సందేశం'లో వ్రాస్తున్నవారు, ముఖ్యముగా కమ్యూనిస్టు సోదరులు అట్టివారెన్నటికీ కారని మా దృఢ విశ్వాసము.

విజయవాడలో వరకట్న నిషేధ సంఘం స్థాపించి రెండు సంవత్సరములైనది. నాటినుండియు పలుచోట్ల సభలు, సమావేశాలు ఏర్పాటుచేసి ప్రచారము చేయుచుంటిమి. అనేకమంది యువకులు ముందుకు వచ్చినారు. మేము వివాహసంబంధముల ఇన్‌ఫర్మేషన్ బ్యూరో గూడ నడుపుచున్నాము. తద్వారా ముందుకు వచ్చిన ఆదర్శయువకులకు కట్నాలివ్వలేక బాధపడుచున్న కన్యాదాతలు తమ పిల్లలనిచ్చి వివాహములు చేయుచుండిరి. అనేక కష్టనష్టాలకోర్చి ఆశయములను ఆచరణలోపెట్టి ఆదర్శవంతులైన యువకులు అనుసరించవలసిన బాధ్యత ఆంధ్రయువకలోకంపై ఎంతైనా కలదు.

సెప్టెంబరులో ఆంధ్రరాష్ట్ర శాసన సభలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు వరకట్న నిషేధ బిల్లు ప్రవేశపెట్టిరి. శాసనసభవారు ప్రజాభిప్రాయం

సేకరించగా అత్యంత అనుకూలముగా యున్నది. బిల్లును తక్షణమే శాసనం చెయ్యాలని కోరుతూ పది వేలమంది సంతకములు చేసిన ఒక మహాజరును మేము శాసనసభవారికి సమర్పించితిమి. బిల్లుపై సెలెక్టు కమిటీని వేయాలని ది 17-8-57 న శాసనసభలో తీర్మానించి శ్రీ నీలం సంజీవరెడ్డిగారి అధ్యక్షతన 15 గురు సభ్యులతో కమిటీ వేయబడినది. సదరు కమిటీ ది 14-9-57 న విజయవాడలో సమావేశమైనప్పుడు మహిళా సంఘాలవారు, తదితర సంస్థలవారు బిల్లును శాసనం చేయవలసినదిగా కోరుచూ మహాజర్లు సమర్పించారు. సెలెక్టు కమిటీవారుకూడ బిల్లులో కొద్ది మార్పులను సూచించినమా బిల్లును శాసనం చేయాలని శాసనసభవారికి సూచించిరి కాని ఇంతవరకూ బిల్లు శాసనం కాలేదు.

బిల్లు ప్రవేశపెట్టి రెండు సంవత్సరములు నిండినది. ప్రజాభిప్రాయం అత్యంత అనుకూలముగా నున్నా ఈ బిల్లు విషయములో జాగువహించుట ప్రజా ప్రభుత్వమునకు తగదు. ఏదైనా ప్రజాందోళన యుంటేనేగాని ప్రభుత్వం కండ్లు తెరవదు. కాబట్టి ప్రజలు యింకా ఆందోళన సాగించాలి. ఊరూరా సభలు, సమావేశాలు ఏర్పాటు చేయాలి. ఇంకా అమిత సంఖ్యలో సంతకాలు సేకరించాలి. తక్షణమే వరకట్న నిషేధ శాసనం చేయవలసినదిగా తీర్మానాలు చేసి ప్రభుత్వానికి పంపాలి. ఈ విషయంలో సందేశం పాఠకులందరూ సహకరిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు,

తలగడదీవి శ్రీరామారావు,

కార్యదర్శి,

స్నేహలతా వరకట్న నిషేధసంఘము,

గాంధీనగర్ - విజయవాడ-2.



ఆర్యా !

"సందేశం" పత్రికను సమర్థవంతంగా నిర్వహిస్తున్నందుకు సంపాదకవర్గానికి నా అభినందనలు.

సెప్టెంబరు సంచిక చదివాను. మొత్తంమీద వ్యాసాలు బాగా వున్నాయి. "చైనాలో అదృశ్య మౌతున్న ధనికరైతు వ్యవస్థ" అను వ్యాసం బాగా వుంది. సహకార వ్యవసాయం అభివృద్ధి అయ్యేకొలదీ ధనికరైతు వ్యవస్థ ఎలా నిర్మూలనమైపోతుందో

## విజ్ఞప్తి

కొంతమంది మిత్రులు వ్రాసే లేఖలు ప్రచురణకు ఉద్దేశింపబడినవో, వ్యక్తిగత స్వభావం కలిగినవో తెలియడం లేదు. వ్యక్తిగత స్వభావం గలిగిన కొన్ని లేఖలు పొరపాటున పత్రికలో ప్రచురింపబడ్డాయి (ఉదా : సెప్టెంబరు సంచికలో ప్రచురింపబడ్డ శ్రీ లావు బాల గంగాధరరావుగారి లేఖ). ఇక ముందు అలా జరక్కుండా చూచేందుకుగాను పాఠకులు ప్రచురణకు ఉద్దేశించిన లేఖల మీద "ప్రచురణార్థం" అని వ్రాయ గోరుతున్నాం.

—సంపాదకవర్గం.

తెలుసుకోవడానికి యీ వ్యాసం ఎంతగానో తోడ్పడుతుంది.

పోతే "పోలెండులో సహకార వ్యవసాయపద్ధతి: ఇటీవలి పరిణామాలు" అను వ్యాసం పాఠకులను కొంత కలవరపెట్టి వుంటుందని భావిస్తాను. చైనా సహకార వ్యవసాయంవైపు పురోగమిస్తుంటే, పోలెండు దానికి విరుద్ధంగా నడుస్తున్నది. ఈ రెండూ సోషలిస్టు దేశాలేకదా

గతంలో సహకార వ్యవసాయ నిర్మాణపద్ధతిలో కొన్ని లోపాలు జరిగాయనీ, యిష్టములేని వారంతా సహకార వ్యవసాయంనుండి విడిపోవచ్చుననీ పోలెండు నాయకత్వం నిర్ణయించినందువల్ల 10,000 సహకార వ్యవసాయ క్షేత్రాలలో 8000 లు రద్దయినాయి. ఏవో కొన్ని పొరపాట్లు జరిగినందువల్ల సహకార వ్యవసాయ పద్ధతినే (ప్రస్తుతానికి) రద్దు గావించే నిర్ణయం చేయుట సరియైన పద్ధతా ?

చైనా రైతాంగం సహకార వ్యవసాయం వైపు పురోగమిస్తుంటే, పోలెండు రైతాంగం వ్యక్తిగత వ్యవసాయం వైపుతిరోగమిస్తోంది. ఈ రెండు సోషలిస్టు దేశాలు

పరస్పర విరుద్ధమైన పద్ధతిలో ప్రయాణంచేస్తూ గమ్యం మాత్రం ఒకటేనని చెప్పుతున్నాయి. పోలెండు సహకార వ్యవసాయాన్ని రద్దుచేస్తూ భవిష్యత్తులో వాటిని నిర్మిస్తానని చెప్తోంది. అదే తనలక్ష్యమని చెపుతూంది. వ్యక్తిగత వ్యవసాయంలో స్థిరపడిపోయిన రైతులు సహకార వ్యవసాయంలో అంత సులభంగా చేరుతారా! సహకార వ్యవసాయం వలన లాభంకంటే నష్టమే ఎక్కువ కలిగింది అని భావించే పోలెండు రైతులు భవిష్యత్తులో అంత తేలికగా సహకార వ్యవసాయాన్ని వరిస్తారని భావించటానికి ఆస్కారమేమీ కనుపించుటలేదు ఏదిఎట్లున్నా పోలెండునాయకత్వం యీ నిర్ణయాన్ని చాలా త్వరపడి చేసిందని నావ్యక్తిగతాభిప్రాయం.

కోడె కోటేశ్వరరావు,
కావూరు లింగంగుంట్ల
నర్సారావుపేట తాలూకా.

* * *

ఆర్యా,

ఆగస్టు సందేశం సంచికలోనున్న వ్యాసములన్నియు సకాలములో వచ్చి సమగ్రమైనవిగా ఉన్నవి. అన్ని వ్యాసాలు నన్ను బాగా ఆకర్షించాయి. "మార్క్సిజం-నైతిక విలువలు" అన్నశీర్షికతో ఉన్న వ్యాసం కమ్యూనిస్టేతరులకు కమ్యూనిస్టులమీద ఉన్నటువంటి సాధారణ దురభిప్రాయాన్ని పోగొట్టుతుంది. ఈ వ్యాసాన్ని యింకా ఎక్కువగా ఉదాహరణలిచ్చి పెంచిన మరింత బాగుండేది.

"కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో నెహ్రూ సాధించినదేమిటి" అనే వ్యాసం మనం కామన్వెల్తులో ఉంటే లాభంలేకపోగా నష్టాలు ఏవిధముగాకలుగునో సోదాహరణముగా కెన్యాను, సైప్రస్, సూయజ్, కాశ్మీరు, స్టెర్లింగ్ నిల్వలు, వీటిమీద సామ్రాజ్యవాదుల పాశం, ఇదంతా కామన్వెల్తులో ఉంటే మనకు ఒరిగేది ఏమీలేదని తెలియజేస్తున్నది. పైగా దానిలో ఉంటే మనంకూడ ఆ దురాక్రమణను బలపరచినట్లు కాగలదు. లూ టింగ్-యీ వ్యాసము చక్కని గుణపాఠాలు నేర్పుచున్నది. ఈ విధంగా సందేశము అన్నివిషయాలలోను సాధారణ పాఠకుల కుపయోగముగ నున్నది.

కోడాలి పట్టాభిరామయ్య,
మచిలీపట్నం.

* * *

ఆర్యా!

ఆగస్టు సంచికలో కంభంపాటి సత్యనారాయణ గారు వ్రాసిన "మార్క్సిజం- నైతిక విలువలు" అను వ్యాసం సమంజసంగాను, చాలా అనివార్యముగాను యున్నది. మార్క్సిజం యెడల ప్రజలలో కొందరికి గల పొరపాటు అభిప్రాయాలకు చక్కని సమాధానం ఈవ్యాసంలో దొరుకుతుంది. ఇలాంటి వ్యాసాలవలన మార్క్సిజం యెడల కమ్యూనిస్టుపార్టీ మీదగల దురభిప్రాయాలకు తావులేకుండా ప్రజలకు చక్కని సామరస్య పూర్వకమైన భావాలకు మార్గదర్శక మవుతుంది. ఇట్లు మార్క్సిజాన్ని గురించి సరియైన వ్యాసాలు వెలువడినట్లయితే మీ పత్రిక పేరు సార్థకమగును. దీని యొక్క ఆశయము, ధ్యేయముకూడ నెరవేరుతుంది.

తుమ్మల ప్రద్యుమ్నారావు,
గుడివాడ.





# సందేశం

(మార్క్సిస్టు సిద్ధాంత - రాజకీయ మాసపత్రిక)

## అద్వైత సంచిక

శాలివాహన శకం 1879 ఫాల్గుణం.

మార్చి 1958

సంపుటి 5. * సంచిక 2, 3



సంపాదకవర్గం :

కంభంపాటి సత్యనారాయణ

మోటూరు హనుమంతరావు

దేవులపల్లి వెంకటేశ్వరరావు

1574

# విషయసూచిక



(వెల : 1-8-0 — రూపాయి 50 నయాపైసలు)

# స్వవిషయం

ఈ సంవత్సరం జనవరి 3 వ వారంలో తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురంలో అద్వైతాన్ని గురించి జరిగిన గోష్ఠిలో చదువబడిన ప్రసంగ వ్యాసాలను యీ ప్రత్యేక సంచిక ద్వారా పాఠకుల ముందుంచుతున్నాం.

మన దేశంలోని తాత్వికధోరణుల్లో అద్వైతానికి గణనీయమైన వ్యాప్తీ, ప్రతిష్ఠా ఉన్నాయి. మార్క్సిస్టులుగాని, యితరులుగాని భారతీయ తాత్విక ధోరణులను అధ్యయనం చేయదలచుకున్నవారు అద్వైతాన్ని పరిశీలించకుండా సిద్ధాంతరంగంలో ముందుకు అడుగు వేయలేరు.

అద్వైతం భావవాదధోరణి; గతితార్కిక భౌతికవాదం భౌతికవాదధోరణి. ప్రపంచంలో విభిన్న భావవాద, భౌతికవాద ధోరణులమధ్య అనేక శతాబ్దాలు జరిగిన సంఘర్షణ ఫలితమే ఆధునిక గతితార్కిక భౌతికవాదం. ఈ విషయాన్ని చారిత్రకంగా, శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి అర్థం చేసుకోడం మన మేధావుల కర్తవ్యం. అలా అర్థం చేసుకోగల్గితే గతితార్కిక భౌతికవాదాన్నికూడ మరింత పరిపుష్ట మొనర్చగల్గుతాం.

విభిన్న ఆలోచనా ధోరణులమధ్య సంఘర్షణను ప్రోత్సహించడం ద్వారానే ప్రపంచంలో తత్వశాస్త్రం అభివృద్ధి చెందింది, చెందుతుంది అన్న విషయాన్ని సూత్రప్రాయంగా గుర్తించడంతోబాటు, అట్టి సంఘర్షణలో అభ్యుదయకాముకులు ప్రత్యక్షంగా పాల్గొంటారు కూడా.

భారతీయ తాత్త్వికధోరణులలోని మంచిచెడ్డలను అంచనా కట్టాలంటే, ముందు ఆ ధోరణులను గురించి తెలుసుకోవాలి; అధ్యయనం చేయాలి; చర్చించాలి.

ఏ తాత్త్విక ధోరణినైనా నిలబడ్డపాటున మార్క్సిస్టు దృక్పథంనుంచి విలువ తేల్చి చెప్పడం వీలుకాదు. ఈ సంచికలో మార్క్సిస్టు రచయితలు చేసిన పరిశీలనలే యిందుకు తార్కాణం. ఒక వస్తువు లేదా వ్యవస్థ లేదా ధోరణియొక్క విలువను తేల్చాలంటే సమ్యక్‌దృష్టి కావాలి. ముందే ఒక నిర్ణయానికివచ్చి తదనుగుణంగా వాదనలను సమకూర్చుకునేటట్లుకాక, నిండు మనస్సుతో పరిశీలనలు జరపాలి. దానికి గోష్ఠులు, చర్చలు తోడ్పడతాయి.

ఈ దృష్టితోనే, గత జనవరిలో అద్వైతం గూర్చి అధ్యయనం చేసిన, చేస్తున్న కొందరిని పెద్దాపురం గోష్ఠికి ఆహ్వానించి, తమ వివరణలను ప్రజల కందించే అవకాశం కలుగజేయవలసిందిగా 'సందేశం' తరఫున తాత్త్విక ఐతిహాసిక అధ్యయన ఉపసంఘం కోరింది. ప్రాచీనప్రామాణిక ధోరణిలో వివరించ గలవారినీ, ఆధునిక మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలనలు జరుపుతున్నవారినీ, తదితర దృక్పథాలవారినీ అర్థించింది. వారంతా సహృదయంతో తమ తమ అభిప్రాయాలను వ్యాసాల రూపంలో వివరించారు. వాటిని ఈ సంచిక ద్వారా మీ ముందుంచుతున్నాం.

గత సెప్టెంబరు మాసంలో విజయవాడలో జరిగిన తాత్త్విక ఐతిహాసిక అధ్యయన సదస్సుతో ప్రారంభమైన యీ మా కృషి యికముందుకూడా పాఠకుల ఆదరణను పొందగలదని విశ్వసిస్తున్నాం.

- సంపాదకవర్గం.



# జగజ్జీవేశ్వరుల తత్త్వము : అద్వైతము

## శ్రీవిద్యాశంకర భారతీస్వామి
(అద్వైత సభా ప్రతిష్ఠాపకులు, గాయత్రీ పీఠాధిపతులు)

[ ఇది ప్రాచీన పారంపర్య పంథాలో అద్వైతంగురించి వ్రాసిన వ్యాసం. గాయత్రీ పీఠాధిపతులు, అద్వైత సభా ప్రతిష్ఠాపకులుగా రచయితను పరిచయం చేయడంతప్ప ఇక్కడ మా ప్రసక్తి వేరేమీ లేదు. మా కోరికను మన్నించి గోష్ఠికోసం దీనిని వ్రాయించి యిచ్చిన శ్రీ స్వామివారికి మా వందనాలు. ]

ఆస్తికుడైన ప్రతిమానవుడు జీవుడగు తానొకడున్నాడనిన్నీ, తన కెదురుగా కనపడు జగత్తు ఉన్నదనిన్నీ, సృష్టికర్తయగు ఈశ్వరుడు ఉన్నాడనిన్నీ విశ్వసించును. ఈ మూడింటికిగల పరస్పర సంబంధమును గురించి వేర్వేరు విధముల సిద్ధాంతీకరింపుచూ వివిధ మతములు బయలువెడలినవి. ఈ మతములన్నిటిని ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అను మూడు విధములుగ విభజింపవచ్చును.

### ద్వైతము

జగత్తు సత్యమనియు, జీవుడు ఈశ్వరుడు భిన్నమనియు ఒక జీవునికిని ఇంకొక జీవునికిని భేదము గలదనియు, ఈశ్వరునికిని జగత్తునకును భేదము గలదనియు, జగత్తులో నొక వస్తువునకును ఇంకొక వస్తువునకును భేదము కలదనిన్ని, జీవునికిని జగత్తునకును భేదము కలదనిన్ని ఇట్లు ప్రత్యక్షముగా ప్రతి మానవునికిని గోచరించు అయిదుభేదములను చెప్పునది ద్వైతమతము. జీవులు భక్తిచేత భగవంతుని లోకమును సామీప్యమునచేరి అచ్చట భగవత్సేవచేయుచు ముక్తులగుచుందురని యద్వైతుల సిద్ధాంతము. ప్రపంచములోని క్రీస్తు మతము, మహమ్మదీయ మతము మున్నగు మతములన్నియు ఈ ద్వైత సిద్ధాంతము క్రిందికి వచ్చును. మనదేశములో మధ్వాచార్యులచే స్థాపింపబడినది ఈద్వైతమతమే.

### విశిష్టాద్వైతము

శ్రీ రామానుజాచార్యులవారిచే స్థాపింపబడినది విశిష్టాద్వైతము. ఈ మతముప్రకారము జగత్తుయు జీవులును భగవంతునకు శరీరస్థానములో నుండుననియు, జీవేశ్వరులకు గల సంబంధము అంశాంశి సంబంధము లేక అవయవ అవయవి సంబంధము అనియు, భక్తిచేత జీవులు భగవంతునిచేరి సామాన్యస్థితిలోనుండి ముక్తులగుదురనియు వారి సిద్ధాంతము. నానావిధ పత్రి పుష్ప ఫలాదులతో నొప్పారుచున్నను వృక్షము మాత్రము ఒక్కటిమాత్రమేయని చెప్పబడుచున్నట్లు నానావిధ జీవులతోను సత్యమైన జగత్తుతోను విశిష్టుడయియున్న ఆ భగవంతుడు ఒక్కడుగా నేయున్నాడు అనుటచేత వీరి సిద్ధాంతమునకు విశిష్టాద్వైతమని పేరువచ్చినది.

### అద్వైతము

అద్వైతమనునది పైచెప్పినవాని కన్నింటికి విలక్షణమై విరాజిల్లుచున్నది. భగవంతుడు లేక బ్రహ్మ యనునది ఒక్కటిమాత్రమే సత్యమై అనంతమై

జ్ఞానానంద స్వరూపమైనదనిన్నీ, జగత్తు మిథ్య అనిన్నీ జీవుడు తాత్వికముగ బ్రహ్మయేఅనిన్నీ వీరి సిద్ధాంతము. ఇదియే శ్లోకార్థములో 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః' అని వక్కాణించబడినది. జగజ్జీవ బ్రహ్మలకుగల పరస్పరసంబంధముద్వైతాద్వైతవిశిష్టాద్వైత సిద్ధాంతములలో నేసిద్ధాంతాను సారముగ శ్రుతియుక్తి అనుభూతులవల్ల నిర్ణయింప వీలగునో పరిశీలింతము. శ్రుతి(అనగా గ్రంథ)ప్రమాణము నను సరించియు, యుక్తినిబట్టియు, అనుభవమునుబట్టియు తేలిన సిద్ధాంతమే సరియైన సిద్ధాంతమగును కాని అన్యము కానేరదు గదా. గ్రంథ ప్రమాణము అనగా సంస్కృత వాఙ్మయములో వేదములు, పురాణములు, ఇతిహాసములు, సూత్రములు, కావ్యములు మున్నగు నవిన్నీ, యితర భాషలలో బైబిలు, ఖురాను మున్నగు నవిన్నీ అయ్యున్నవి. యుక్తి అనగా సామాన్యముగ తర్క పరిశీలనమే కాక పాశ్చాత్య విజ్ఞానములో 'Science' అను పేరిట విరాజిల్లుచున్న విజ్ఞాన పరిశోధనయును చేరును. అనుభవము అనగా గ్రంథస్థములయిన మహాపురుషుల అనుభవమున్నూ, గ్రంథస్థము కాక పోయినను మనకు గోచరించుచున్న మహాపురుషులయొక్కయు ఇతరమున్ను అగుఅనుభవమున్ను చేరును. ముందు సంస్కృత వాఙ్మయమును పరిశీలింతము.

## సంస్కృత వాఙ్మయము - వేదములు

వేదములు అనంతములు. వానిలో ముఖ్యమయిన భాగమును వేదవ్యాస భగవానుడు ఋక్, యజు, స్సామ, అథర్వణము లనువిధములుగా నాలుగు భాగములుగా విభజించి మహోపకారము గావించెను. అట్లు విభజించుటచేతనే 'వ్యాసః'అను పేరు వచ్చినది (వ్యాసః = విభజన కర్త). వేదములు ఎవరిచేత రచింపబడినవి కాకపోవుటేకాక, ఆ పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములు అనిన్నీ, అవి నిత్యమైనవనిన్నీ, ఉచ్ఛ్వాస నిశ్వాసలకు ఎవరును ఎట్లు కర్తలు కారో అట్లే పరమేశ్వరుడును ఆ వేదములకు కర్త కాడనిన్నీ, పరమేశ్వరునివల్ల ఆ వేదములు అభివ్యక్తమైనవనిన్నీ, అందుచేత అవి అ పౌరుషేయములు నిత్యములు అనాదియనిన్నీ, ఆ పరమేశ్వరుని యొద్దనుంచి చతుర్ముఖబ్రహ్మ వినుట చేతను, వానియొద్దనుంచి మహర్షులు వినుటచేతను వానికి శ్రుతులు అనే పేరు వచ్చినదనిన్నీ, మహర్షుల యొద్దనుంచి అవిచ్ఛిన్న గురుపరంపరగా నేటికిని అవి మనభారతదేశములో విరాజిల్లుచున్నవనిన్నీ అవి పరమ ప్రమాణములనిన్నీ, మానవులకు ప్రత్యక్ష ప్రమాణము చేతగాని అనుమాన ప్రమాణము చేతగాని తెలిసికొనుటకు సాధ్యముకాని విషయములను వేదము తెలియచేయును కనుక దానికి 'వేదము' (వేదయతీ వివేదః) అను పేరు వచ్చినదనిన్నీ వేదములోని అంతరంగిక సాక్ష్యమును బట్టిన్నీ, వేదేతర ప్రాచీన గ్రంథములగు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, కావ్యములు మున్నగు సంస్కృత వాఙ్మయసంతతిలోని సాక్ష్యమును బట్టిన్ని స్పష్టమగుచున్నది. ఇట్టి ప్రబల సాక్ష్యమునకు భిన్నముగా క్రీ. పూ. 3000 లో వేదములు రచింపబడి యుండవచ్చునను పాశ్చాత్యుల ఊహాగానమును అంగీకరించుట బుద్ధిమంతుల లక్షణము కానేరదు గదా. అట్టి వేదములయొక్క సారము ఉపనిషత్తులలో గాననగు. ఆ యుపనిషత్తుల సారమే భగవద్గీతలోను, బ్రహ్మసూత్రములలోను విరాజిల్లుచున్నది. అందుచేతనే మన వేదమతమునకు లేక హిందూమతమునకు ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మ సూత్రములు అనునవి మూడు ప్రస్థానములుగా ప్రఖ్యాతిని గాంచినవి. ఆ మూడింటిలోను జగజ్జీవేశ్వరులతత్త్వము ఎట్లు వర్ణింపబడినదో పరిశీలించుట మన ముఖ్య కర్తవ్యమై యున్నది. ఆ మూడిటిలోను భగవద్గీత ఎక్కువ ప్రఖ్యాతిని గాంచి యుండుటచేత, ముమ్ముందుగా భగవద్గీతను పరిశీలించి చూచుదము.

## భగవద్గీత సందేశము

భగవద్గీతయొక్క సందేశమేమి? కర్మానుష్ఠానమా? భక్తిప్రబోధమా? జ్ఞానప్రబోధమా? జ్ఞానమే అయినచో ద్వైతజ్ఞానమా, విశిష్టాద్వైత జ్ఞానమా, లేక అద్వైతజ్ఞానమా అను రెండు విషయములు విచారణీయములు అయ్యున్నవి.

అర్జునుడు యుద్ధముచేయుటకై యుద్ధభూమిలోనికి వచ్చి గురువులను, బంధువులను చూచి వీరందరు యుద్ధము జరిగినచో మరణింతురేయను జాలి, విషాదము కలిగి యుద్ధముచేయననిన్ని, ఇట్టి ఘోర యుద్ధము చేయుటకంటె భిక్షాటనముచేయుట మంచిదనిన్ని నిశ్చయించుకొనగా, శ్రీకృష్ణుడు అతనికి గీతను బోధించెను. అంతట విషాదముపోయి అర్జునుడు యుద్ధముచేసెను.

ఇప్పుడు మనము విచారింపవలసినది అర్జునునికి విషాదకారణ మేమి, దానికి శ్రీకృష్ణుడు చేసిన చికిత్స యేమి అను విషయము. రోగనిదానము సరిగా తెలిసినగాని సరియైన చికిత్సచేయుట సాధ్యము కానేరదు. అర్జునునికి విషాదకారణము యుద్ధములో అందరూ చనిపోవుదురనియే కదా. అనగా దేహములు నశించిన ఆత్మలుకూడా నశించును అను భావముమీదనే ఇట్టి విషాదము కలుగును. కనుక విషాదకారణము దేహాత్మభ్రాంతియని తెలినది. ఈ భ్రాంతిని అనుసరించి స్వధర్మమైన యుద్ధమునుమాని పరధర్మమైన భిక్షాటనము చేయుటకు సంసిద్ధుడైనాడు. ఇది రెండవదోషము. ఈ రెండు దోషములకు శ్రీకృష్ణుడు రెండు చికిత్సలను చేసినాడు. మొదటి దోషనివారణకు దేహము వేరు, ఆత్మ వేరు అనిన్ని, దేహము అనిత్యము ఆత్మనిత్యము అనిన్ని గీత 2 వ అధ్యాయములో 11 వ శ్లోకము మొదలు 39 వ శ్లోకము వరకు చెప్పి, ఆపైని నిష్కామముగా స్వధర్మానుష్ఠానమే ఇట్టి జ్ఞానోదయమునకు సాధనమని బోధించెను. మిగతా అధ్యాయములలో నీ భావములే విశదీకరింపబడినవి. రెండవ దోషమునకు చికిత్స
...గా స్వధర్మమును ఆచరించుట
మొదటి దోషమునకు ఆత్మనిత్య
నిత్యత్వమును బోధించు జ్ఞాన
ప్రధానముగ గీతలో బోధింప
...గము ప్రధానము; దీనికి
గీత 3 వ అధ్యాయము
...ద్వివిధానిష్ఠా పురాప్రోక్త
...ంఖ్యానాం కర్మయోగేన
...యమును స్పష్టము చేయు
...భక్తి, ప్రపత్తి, వైరా
...ము అనునవి అన్నియు
...లే అయియున్నవి. కర్మ
...ష్ఠానమే గీతయొక్క ప్రధాన
...యము లేదనిన్ని తిలక్ మున్నగు
అభిప్రాయపడినారు. కాని ఆభావము సరియైనదికాదని గీతలోని శ్లోకములవల్లనే స్పష్టపడగలదు. అదెట్లనగా - 4 వ అధ్యాయము 33 వ శ్లోకములో 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' కర్మానుష్ఠాన ఫలితము జ్ఞానోదయమగుటయే అని శ్రీకృష్ణుడు అర్జునునికి బోధించెను. కర్మవాదులు తమ వాదమునకు అనుకూలముగా చెప్పునదేమనగా, యుద్ధకర్మను చేయుటకు వచ్చిన అర్జునుడు యుద్ధము చేయననగా శ్రీకృష్ణుడు గీతను బోధించి అతనిచేత ఆ యుద్ధకర్మనే చేయించినాడు కనుక గీతాసందేశము కర్మానుష్ఠానమేఅని వారు చెప్పుదురు. ఈ వాదము పైకి చాలా యుక్తముగానే ఉన్నట్లు గోచరించును. కాని లోతుగా విమర్శించినచో ఈ వాదము నిలువనేరదు. ఎట్లనగా - ఇంట్లో కూర్చొనియున్న అర్జునుని శ్రీకృష్ణుడు యుద్ధము చేయుము అని బోధించి యుద్ధభూమికి తీసికొనిరాలేదు. యుద్ధము చేయుటకు తానే నిశ్చయించుకొని శ్రీకృష్ణుని సారథిగా రమ్మని ప్రార్థించి తెచ్చుకొని యుద్ధభూమికి వచ్చినాడు. అంతరిని చూడగానే దేహములు నశించినచో ఆత్మలు కూడా నశించును అను అజ్ఞానమోహము అతనికి ఆవరించినది. అంతట యుద్ధము చేయను అని ఆగిపోయినాడు. ఇప్పుడు శ్రీకృష్ణుడు గీతాబోధవల్ల ఆ మబ్బుగావచ్చిన అజ్ఞానమోహమును పోగొట్టినాడు. ఆ మోహము పోగానే యుద్ధముచేయుటకే సిద్ధపడివచ్చిన అర్జునుడుయుద్ధము తనంతట తనే చేసినాడు. కనుక గీతాబోధయొక్క ఫలిత మేమనగా, అర్జునునికి ఆవరించిన మోహమును పోగొట్టుటే.

నీటిపంపులో ఒకరాయి అడ్డుపడినప్పుడు నీటిప్రవాహము ఆగిపోవును. అప్పుడు మనము చేయునది ఆ అడ్డుపడిన రాతిని తీసివేయుటే గాని, నీటిని ప్రవహించునట్లు చేయుట కాదుగదా. ఆ అడ్డును తొలగించగానే నీరు దానంతట అది సహజముగ ప్రవహించును. అటులనే అర్జునునికి గీతాబోధవల్ల అజ్ఞానమనే అడ్డుపోగానే తనంతట తాను యుద్ధముచేసెను. కనుక తిలక్ మున్నగువారి వాదము నిస్సారము. గీతా శ్లోకములవల్లనే పైవిషయము స్పష్టము కాగలదు. అర్జునుడు విషాదాంతమున 2 వ అధ్యాయము 7 వ శ్లోకములో 'కార్పణ్య దోషోపహత స్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః। యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేహం శాధిమాం ప్రపన్నం' అని శ్రీకృష్ణుని ప్రార్థించుటలో తనకు అజ్ఞానము ఆవరించుటచేత ధర్మమేదియో అధర్మమేదియో తెలియక మూఢత్వము (మోహముయొక్క కార్యము) కలిగినదనిన్ని, అదిపోవునట్లు శాసించి బోధింపుమనిన్ని కోరినాడు. కనుక ప్రప్రథమముననే అర్జునుడు తనకు మోహము ఆవరించినదని చెప్పుకొన్నాడు. గీతాబోధ విన్న తరువాత చివరకు 'నష్టోమోహః స్మృతిర్లబ్ధ

త్వత్ప్రసాదాన్మయాచ్యుత' (18 వ అధ్యాయము 73 వ శ్లోకము). అనగా శ్రీకృష్ణుని బోధవల్ల తనకు వచ్చినమోహము పోయినదనిన్ని తనకు ఆత్మజ్ఞానము కలిగినదనిన్ని స్పష్టము చేసినాడు. అజ్ఞానమోహమును పోగొట్టునది జ్ఞానబోధయే కాని ఇంకొకటి కాదుగదా. కనుక అర్జునుని నోటిమీదుగానే గీతాసందేశము కర్మ కాదనిన్ని అజ్ఞానమోహమును పోగొట్టి ఆత్మస్మృతిని కలుగచేయు జ్ఞానబోధయే అనిన్ని స్పష్టమగుచున్నది. ఇంతియేకాదు. శ్రీకృష్ణుఁడుకూడ తాను చేసిన బోధ జ్ఞానమే యని స్వయముగా 18 వ అధ్యాయము 63 వ శ్లోకములో 'ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాత్ గుహ్యాతరం మయా। విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు' అనగా తాను గుహ్యాతి గుహ్యమైన జ్ఞానము ఉపదేశించినాఁడనిన్ని, దానిని విమర్శించి అర్జునుడు తనకు ఇష్టమువచ్చినట్లు ప్రవర్తింప వచ్చుననిన్ని స్పష్టీకరించినాడు. ఈ చివరిబోధలో కూడ 'నీ యిష్టమువచ్చి'నట్లు అనగా యుద్ధము చేయుటో, లేక భిక్షాటనము చేయుటో, ఈ బోధ విన్న తరువాత నీకు ఏది యుక్తమని తోస్తే దానిని ఆచరింపుము' అని చెప్పినాడే కాని యుద్ధమే చేయుము అని ఆదేశించలేదు. అంతట అర్జునుడు తనంతట తానే యుద్ధమును చేసినాడు. పరధర్మమైన భిక్షాటనము తప్పు అనిన్ని, స్వధర్మమైన యుద్ధమే శ్రేయస్కరమనిన్ని శ్రీకృష్ణుని జ్ఞానబోధవల్ల అర్జునుడు నిశ్చయించుకొని యుద్ధము చేసినాడు. ఇంకను 18 వ అధ్యాయం 72 వ శ్లోకములో 'కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ' అని శ్రీకృష్ణుడు అర్జునుని 'నీకు అజ్ఞానమువల్ల కలిగిన మోహము పోయినదా' అని అడుగగా, అర్జునుడు 'నష్టోమోహః స్మృతిర్లబ్ధా' నా మోహము పోయినది, ఆత్మజ్ఞానము కలిగినది అని జవాబు ఇచ్చినాడు. కనుక అర్జునుని మాటలవల్లను కృష్ణుని మాటలవల్లను కూడా గీతాసందేశము జ్ఞానబోధయేకాని కర్మబోధకాదు అని తేలుచున్నది.

## గీత భక్తి ప్రబోధమేనా?

భక్తివాదులు (ద్వైతులు, విశిష్టాద్వైతులు) గీతాసందేశము భక్తిప్రబోధమేకాని జ్ఞానముకాదు అని వాదింతురు. దీనినికూడ విమర్శించుదము. భక్తికిని, జ్ఞానమునకును సంబంధమును తెలియజేయు శ్లోకములలో ముఖ్యమైనవి రెండు కలవు. అందు మొదటిది 10 వ అధ్యాయములో 10 వ శ్లోకము. అంతకు పూర్వపు శ్లోకములో భక్తులు ఎట్లు ప్రవర్తించెదరో వర్ణించి

'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం। దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥' అను 10 వ శ్లోకములో 'అట్టి ప్రీతిపూర్వకముగ ఎల్లపుడు నన్ను భక్తిచేత సేవించువారికి నేను జ్ఞానయోగము ప్రసాదించుచున్నాను. అట్టి జ్ఞానయోగమువల్ల వారు నన్ను పొందుదురు' అని శ్రీకృష్ణుడు చెప్పుటవల్ల భక్తియొక్క ఫలము జ్ఞానోదయమేకాని సాక్షాత్తు మోక్షము కాదనియు, జ్ఞానముచేతనే భగవత్ప్రాప్తి అను మోక్షము లభించుననియు స్పష్టపడుచున్నది. ఇటులనే 18 వ అధ్యాయము 55 వ శ్లోకములో 'భక్త్యామా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః' 'భక్తివల్ల నా స్వరూపమును ప్రభావమును తాత్త్వికంగా తెలిసికొందురు' అని చెప్పుటవల్లకూడా జ్ఞానమునకు భక్తిసాధనయని తేలుచున్నది.

పైనచెప్పినదానినిబట్టి కర్మయును, భక్తియును జ్ఞానమునకు సాధనములనియు, గీతాసందేశము జ్ఞానమే యనియు జ్ఞానమువల్లనే మోక్షప్రాప్తి యనియు స్పష్టమగుచున్నది. గీతను గురించి విచా[illegible] విషయములలో మొదటిది తేలిన[illegible] గీతలో చెప్పబడిన జ్ఞానము[illegible] ద్వైతజ్ఞానమా, లేక అద్వైత[illegible] వలసియున్నది.

గీతలోని 18 వ అధ్యా[illegible] భక్తిషట్కము, జ్ఞానషట్కము అని మూ[illegible]లుగా నొక విభాగము కలదు. మొదటి ఆరు అధ్యాయములును కర్మయోగమును గురించియు, 2 వ ఆరు అధ్యాయములు అనగా 7 వ అధ్యాయము మొదలు 12 వ అధ్యాయము ఆఖరువరకు భక్తియోగమును గురించియు, చివర ఆరు అధ్యాయములు అనగా 13 వ అధ్యాయము మొదలు 18 వ అధ్యాయము ఆఖరువరకు జ్ఞానమునుగురించియు బోధించును. ఇంకొక విభాగము ప్రకారం మొదటి షట్కము జీవుని స్వరూపమును, రెండవ షట్కము ఈశ్వరుని స్వరూపమును, మూడవ షట్కము జీవేశ్వరుల సంబంధమును బోధించును. ఈ రెండు రకముల విభాగములకును అన్యోన్య సంబంధము కలదు. మొదటిషట్కములోని జీవుడు ఆ షట్కములో చెప్పబడిన నిష్కామకర్మానుష్ఠానము వలన

చిత్తశుద్ధికలవాడై సంస్కృతు డగును. అంతట అట్టి సంస్కృత జీవుడు రెండవషట్కములోని ఈశ్వరుని అనుట్కములో చెప్పబడిన భక్తిచేత సేవించి ఈశ్వరానుగ్రహమునకు పాత్రుడగును. అంతట అతడు 3 వ షట్కములో చెప్పబడిన జ్ఞానయోగముచేత 'క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి' అను శ్లోకం ప్రకారము అట్టి సంస్కృతజీవుడు బ్రహ్మయే కాని భిన్నుడు కాడు అను సర్వాత్మ భావమును జీవబ్రహ్మైక్యమును సాక్షాత్కరించుకొని ముక్తుడగును. ఇట్టి జీవబ్రహ్మల కభేదమును బోధించు జ్ఞానము అద్వైతమే కదా.

ఇక గీతలో బోధింపబడిన జ్ఞానముయొక్క స్వరూప స్వభావములను తెలిసికొనుటకై గీతలోని శ్లోకములనే విమర్శించి పరిశీలించుదము. అర్జునునికి శ్రీకృష్ణుని బోధ 2 వ అధ్యాయంలో 11 వ శ్లోకము నుంచి ప్రారంభము. 'నత్వేవాహం జాతునాసం...' 'నజాయతే మ్రియతేవా...' 'నైనం ఛిందంతి శస్త్రాణి...' 'దేహీ నిత్యమవధ్యోయం...' 'వేదాఽవినాశినం నిత్యం...' ఈ మొదలగు శ్లోకములలో జీవుడు నిజముగా జన్మమరణములులేని నిత్యుడు అని బోధింపబడినది. అట్టి నిత్యమైన జీవుడు ఆయా ఉపాధులనుబట్టి అనేకులుగా కనపడుచున్నాడే కాని వాస్తవములో ఒక్కడే. 'అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాః శరీరిణః...' 'దేహీ నిత్య మవధ్యోయం దేహే సర్వస్య...' మున్నగు శ్లోకములలో దేహి అయిన జీవుడు నిత్యుడనిన్ని, అట్టి నిత్యుడయి ఒక్కడైన జీవునికే యీ నానావిధములగు దేహములువున్నవనిన్ని, అట్టి దేహములన్నియు అనిత్యములనిన్ని చెప్పబడనది. ఇట్లు ఈ శ్లోకములలో జీవుని యొక్క నిత్యత్వమును ఏకత్వమును ప్రతిపాదించి, 7 నుంచి 12 అధ్యాయములలో ఈశ్వరునియొక్క ఏకత్వమును నిత్యత్వమును ప్రతిపాదించి 13 వ అధ్యాయములో గీత ఆ యిద్దరికి అభేదమును లేక ఐక్యమును బోధించినది. ఇంకను 2 వ అధ్యాయము 11 వ శ్లోకము మొదలు 39 వ శ్లోకమువరకు జీవునియొక్క ఏకత్వ నిత్యత్వములను గీత బోధించి, 39 వ శ్లోకములో 'ఏషాతేఽభిహితా సాంఖ్యే బుద్ధిః...' అని శ్రీకృష్ణుడు అర్జునునికి సాంఖ్యోపదేశమును అనగా ఆత్మజ్ఞానోపదేశమును పూర్తి చేసినాడు. 'సాంఖ్యం' అనగా 'సమ్యక్ ఖ్యాయతే అనేన ఆత్మతత్త్వం' ఆత్మజ్ఞానమని యర్థము. ఇట్లు ఈశ్వరుని సంగతి ఏమియు బోధింపకుండగనే 2 వ అధ్యాయములో శ్రీకృష్ణుడు జ్ఞానోపదేశ ఉపన్యాసమును ముగించి [illegible] చెప్పవలసినదంతను చెప్పినాను అనుటలో శ్రీకృష్ణని భావమేమి ? జీవతత్త్వము ఏకము,నిత్యము అని తె[illegible] కొన్నంతమాత్రమున మోక్షములభించునా ? ఈశ తత్త్వమునకూడ తెలిసికొని రెంటిని అభేదము దర్శించినప్పుడేకదా మోక్షము! దీనిలోని రహస్యమేమన— ఉపనిషత్తులలో బ్రహ్మజ్ఞానము మోక్షమువచ్చును అని చెప్పబడినది. ఆ బ్రహ్మ[illegible] వాదనగా 'ఏకమేవాద్వితీయం' అని 'నిత్యం' [illegible] కొన్నివిధములుగా వర్ణింపబడినది. ఇప్పుడు బ్ర[illegible] యొక్క తత్త్వము ఏకత్వము, నిత్యత్వము కలది అని జీవునియొక్క తత్త్వము, ఏకత్వము నిత్యత్వ[illegible] కలది అనిన్ని తేలినది. ఇట్లు ఏకత్వ నిత్యత్వము గల వస్తువులు రెండు ఉండనేరవుకదా. రెం[illegible] వుండగానే, దేనికిని ఏకత్వము సిద్ధించదు[illegible]. ఇంకను రెండువస్తువులుఉన్నచో రెండును పరిచ్ఛిన్నములు అగునుకనుక రెండును నశ్వరములై అనిత్యములగును కాని నిత్యములు కానేరవు. కనుక ఏక నిత్యత్వ లక్షణములుగల వస్తువు ఒక్కటే ఉ[illegible] వలెను. ఈ లక్షణములు జీవునికిన్ని చెప్పుటచే[illegible] బ్రహ్మకు ఇట్టిలక్షణములు ఉన్నవని అందరకును [illegible] సినవిషయమే కనుకను, ఈ విధముగా జీవబ్రహ్మ[illegible] ఐక్యమును, లేక అభేదమును చెప్పకుండానే [illegible] నట్లుఅయినది. ఇంకను 'యేన భూతాన్యశేషేణ [illegible] స్యాత్మన్యథోమయి...' 'సర్వభూతస్థ మాత్మానం..' 'యోమాం పశ్యతి సర్వత్ర...', 'జ్ఞానాత్వాత్మైవ..' మున్నగు శ్లోకములుకూడా జీవబ్రహ్మల కభేదమ[illegible] బోధించుచున్నవి. ఈ విధముగాకూడా గీతలోని [illegible] బోధ అద్వైతమే అని తేలుచున్నది.

జీవేశ్వరుల సంబంధము పైనచెప్పిన చో[illegible] అద్వైతమని తేలినది.

## జగత్తు మిథ్య

ఇకను జగత్తుయొక్క స్వరూపము సత్యమా, [illegible] మిథ్యయా అనునది తేలవలసియున్నది. ఈ విషయ[illegible] గీత ఏమని బోధించుచున్నదో పరిశీలింతము. [illegible] చెప్పిన ప్రకారము 2 వ అధ్యాయములో గీత [illegible] యొక్క ఏకత్వము నిత్యత్వమును ని[illegible]పించి [illegible] ఆత్మను 'సత్' అని వర్ణించినది. ఇకను దేహాదుల కూడియున్న జగత్తును 'మాత్రా స్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః । ఆగమాపాయినోఽనిత్యా[illegible]

త్రాం స్తితిక్షస్వ భారత' ॥ 'అంతవంత ఇమే దేహాః' మున్నగు శ్లోకములలో అనిత్యముగ వర్ణించి దీనిని 'అసత్' అని అన్నది. ఇట్టి 'సత్', 'అసత్' లకు అన్యోన్య సంబంధము 16 వ శ్లోకము 'నాऽసతో విద్యతే భావః' । నాऽభావో విద్యతే సతః । ఉభయోరపి దృష్టోऽన్తః త్వ నయోః తత్త్వదర్శిభిః।' లో నిర్ణయింపబడినది. ఆ నిర్ణయమేమనగా—'సత్' కు అభావములేదు, 'అసత్' కు భావములేదు. అనగా 'సత్' ఎప్పుడు సత్తే; అసత్ ఎప్పుడు అసత్తే. అనగా ఉన్నవస్తువు ఎప్పుడూ ఉంటుంది; లేనివస్తువు ఎప్పుడూ లేనేలేదు. అనగా ఉన్నవస్తువుకు ఎప్పుడూ లేమిలేదు; లేని వస్తువుకు ఎప్పుడూ ఉనికి లేదు. 'సత్' అంటే ఆత్మ, 'అసత్' అంటే జగత్. కనుక ఆ శ్లోకభావమేమనగా, ఆత్మకు ఎప్పుడును నాశములేదు; జగత్తుకు ఎప్పుడూ ఉనికిలేదు, అని తేలినది. ఇక్కడ ఒక సంశయము కలుగవచ్చును. ఉన్నవస్తువు ఎప్పుడూ ఉంటుంది, లేనివస్తువు ఎప్పుడూ ఉండదు అని అందరికిని తెలిసిన విషయమును శ్రీకృష్ణుడంతటివాడు అర్జునునికి బోధించవలెనా? అట్లు బోధించుటలో భావమేమి? నిషేధము ఎప్పుడును ప్రసక్తమైన దానికే చేయవలెను కాని అప్రసక్త ప్రతిషేధము కూడదు గదా! ఇప్పుడు శ్రీకృష్ణుడు ఆ శ్లోకములో ఆత్మకు అభావము లేదనిన్ని, జగత్తుకు భావము లేదనిన్ని నిషేధించుటలో అట్లు నిషేధించవలసిన అవసరమేమి కలిగినది అను ప్రశ్న పుట్టును. ఉదాహరణకు, ఎవరైన మన యింట్లోకి రాదలచినట్లు కనపడితే, అతనిని రానిచ్చుట యిష్టములేనిచో రావద్దు అని నిషేధింతుము. అంతేకాని అతను త్రోవవెంట వెళ్ళుచూ మన యింటిలోకి వచ్చే సూచనలే కనపడనప్పుడు అతనిని రావద్దు అని నిషేధించము కదా. అట్లే ఆత్మ జగత్తుల విషయంలో ఆ శ్లోకోక్త నిషేధమునకు ప్రసక్తి ఏమి అనగా, ఆత్మ 'సత్' అనగా భూతభవిష్యద్వర్తమాన కాలము లన్నింటిలోను మారకుండా నిత్యముగ నుండేది అని బోధించినను కంటికి కనపడుటలేదు కనుక, ఒకవేళ లేదేమో యని భ్రమపడుటకు అవకాశమున్నది కనుక, అట్టి భ్రమను పొందకుండా నుండగలందులకై కనపడకపోయినను ఆత్మకు ఎప్పుడునూ అభావములేదు—అని చెప్పవలసివచ్చినది. ఇక జగత్తు కనపడుచున్నది కనుక సత్యమైనది అని భ్రమపడుటకు అవకాశమున్నది కనుక కనపడుచున్నంత మాత్రమున జగత్తుకు ఉనికి అనగా వస్తుత్వము లేదుఅని బోధింపవలసివచ్చినది. 'అసత్'అంటే కుందేటి కొమ్మువలె శూన్యమని యిక్కడ అర్థము కాదు. ఎందుచేతననగా, జగత్తు కనపడుచున్నది కనుకను, కుందేటి కొమ్ము ఎవరికిని ఎప్పుడూ కనపడనే కనపడదు కనుకను, అట్టి దానిని గురించి ఎవరును ఉన్నదేమో అని భ్రమపడరు కనుకను శ్రీకృష్ణుని బోధ అట్టి వస్తువు విషయమై అవసరమేలేదు. కనుక ఇప్పుడు శ్రీకృష్ణుని బోధ ఆ శ్లోకములో జగత్తు కనపడుచున్నప్పటికి దానికి సత్యత్వములేదు అనిన్ని, ఆత్మ కనపడకపోయినప్పటికి దానికి అభావములేదనిన్ని స్పష్టపడుచున్నది. దీనివల్ల జగత్తుయొక్క స్వరూపము ఏమని తేలినదనగా—'సచ్చేన్న బాధ్యేత, అసచ్చేన్న ప్రతీయేత, తస్మాత్ జగత్ సదస ద్విలక్షణం అనిర్వచనీయం' అనగా కనపడుచున్నది కనుక సత్ అనగా ఉన్నవస్తువా అంటే లేదంటున్నారు. కనుక సత్ కాదు. పోనీ, శశశృంగమువలె అసత్ లేని వస్తువా అంటే కనపడుచున్నది కనుక 'అసత్'కాదు అన్నారు. కనుక జగత్ సత్తుకాదు, అసత్తుకాదు అని తేలినది. ఇట్టి లక్షణమునే అనిర్వచనీయమనిన్ని మిథ్య అనిన్ని అంటారు. కనుక జగత్ మిథ్య అని తేలినది. 'మిథ్య' అనగా లేదని అర్థముకాదు; ఉన్నదని కాని, లేదని కాని నిర్వచించుటకు సాధ్యముకానిది అని అర్థము. ఏది అయితే వస్తుత్వములేకుండా కంటికి కనపడునో అదంతయు మిథ్య అని చెప్పబడును. త్రాడును చూచి పాము అని భ్రమపడినపుడు వస్తుత్వములేని పాము కనపడుచున్నది. కనుక ఆ పాము మిథ్య. ఇటులనే స్వప్నములో కనపడుచున్న దృశ్యమునకు వస్తుత్వము లేదు కనుక ఆ దృశ్యమంతయు మిథ్యయే. ఇట్టి భ్రాంతి స్థలములలో ఒకవస్తువు ఇంకొక వస్తువుగా కనపడును. అసలు వస్తువు అధిష్ఠానమందురు; ఇంకొకటిగా కనబడిన వస్తువు ఆరోపితమందురు. అసలు వస్తువు ఎప్పుడును ఎట్టిమార్పును పొందకుండా నిర్వికారముగానే ఉండును. అట్లు మారకుండానే ఇంకొక వస్తువుగా కనపడును. భ్రాంతి పోగానే, అనగా అసలు వస్తువుయొక్క జ్ఞానము కలుగగానే ఆరోపితము నశించును. జగత్తుమిథ్య అని అన్నప్పుడు జగత్తు ఆరోపితము; దీనికి అధిష్ఠానము బ్రహ్మ. బ్రహ్మ ఎట్టి మార్పును ఎన్నడూ పొందకుండా నిర్వికారముగ ఉంటూనే జగత్తుగా భాసించుచున్నది. అధిష్ఠానమైన బ్రహ్మయొక్క జ్ఞానము కలుగగానే, జగత్తు జగత్తుగా కనపడక

బ్రహ్మగానే కనపడును. త్రాడు పాముగా కనపడి నపుడు త్రాడు అని ఒక వస్తువు, పాము అని ఇంకొక వస్తువు ఇట్లు రెండు వస్తువులు ఎప్పుడూలేవు. భ్రాంతి ఉన్నంతకాలము పాము ఒక్కటే కనపడినది. భ్రాంతి పోగానే ఏది పాముగా కనపడినదో అదే త్రాడుగా తేలినది. అనగా భ్రాంతికాలములో అనగా అజ్ఞాన దశలో పాము మాత్రమే ఉన్నది; జ్ఞానదశలో త్రాడు మాత్రమేఉన్నది.అలాగేఅజ్ఞానదశలో జగత్తుమాత్రమే ఉన్నది; జ్ఞానదశలో యీ జగత్తుగాకనపడేదే బ్రహ్మగా తేలి బ్రహ్మ ఒక్కటే ఉన్నది. అసలు వస్తువు ఎట్టి మార్పును పొందకుండా యింకొక వస్తువుగా కనపడు టను 'వివర్తము' అని అందురు. అసలు వస్తువు యింకొక వస్తువుగా వాస్తవంలో మారినపుడు, అనగా పాలు పెరుగుగా మారినపుడు, దానిని 'పరిణామము' అందురు. ఇప్పుడు జగత్తుకును, బ్రహ్మ లేక ఈశ్వరు నకును ఉన్న సంబంధము వివర్తము కాని పరి ణామము కాదు. ఇట్టి వివర్త దృష్టితోనే ఆరోపిత వస్తువును 'మిథ్య' అని అందురు. ఈ విషయము 'యుక్తి' అను శీర్షికక్రింద యింకను విశదీకరింప బడును. ప్రస్తుతము గ్రంథప్రమాణమును గురించి పరిశీలించుచున్నాము కనుకను, యీ పరిశీలనలోకూడ 'మిథ్య' అను శబ్దము వచ్చి అది అద్వైత సిద్ధాంత మును బోధించు విలక్షణమైన శబ్దముగా ఉన్నది కనుకను దానిని గురించి యింతవరకు విచారణ గావింపబడినది.

ఇక జగత్తుయొక్క మిథ్యాత్వమును బోధించు శ్లోకములు పైన చెప్పిన ప్రకారము 2 వ అధ్యాయ ములోనే కాక ఇతర అధ్యాయములలో కూడ ఉన్నవి. వానిలో 9 వ అధ్యాయములోని 4, 5 శ్లోకములు ముఖ్యములు.

అవేవనగా :

శ్లో॥ "మయాతత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్ స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః॥"

శ్లో॥ "నచ మత్ స్థాని భూతాని ।
పశ్యమే యోగ మైశ్వరం॥"

వీని అర్థ మేమనగా : ఈ జగత్తు అంతయు అవ్యక్త రూపముగ నున్న నాచేత వ్యాప్తమై యున్నది.

ఈ భూతములన్నియు నాయందే ఉన్నవి.

నేను ఆ భూతములలో లేను.

ఆ భూతములున్ను నాలో లేవు.

ఇట్టి నాకు సంబంధించిన యోగశక్తిని చూడుము.

పరస్పర విరుద్ధములుగా కనపడు యీ వాక్యము భావమేమి? ఈ జగత్తు అంతయు నాచేత వ్యాప్తమై యున్నది అను వాక్యము బోధపడుటకు అవకాశ మున్నది. కాని 'ఈ భూతములన్నియు నాయందే ఉన్నవి, నేను ఆ భూతములలో లేను. ఆ భూతము లున్ను నాలో లేవు' అను వాక్యములు కేవలము పరస్పర విరుద్ధములుగా నున్నవే. వీటి సమన్వయ మెట్లా? అను ప్రశ్న పుట్టును. దీనికి జవాబు రజ్జు సర్పదృష్టాంతముమీదగాని ఇంకొక విధముగా రాదు. రజ్జు సర్పదృష్టాంతములో పాము త్రాడుమీద ఉండనూఉన్నది; త్రాడు పాములో లేనూలేదు; పామున్ను త్రాడులో లేదు. ఈ వాక్యము పైన 2, 3, 4 వాక్యములకు సరిపోవును. 'త్రాడు' అను అధిష్ఠానం ఉన్నప్పుడేగదా 'పాము' అను ఆరోపము కలిగినది. కనుక పాము త్రాడులోఉన్నది అంటే అర్థము అట్లు తెలిసికొనవలెను. ఇకను త్రాడు వాస్తవంలో పాముగ మారలేదు కనుక 'త్రాడు పాములో లేదు' అని చెప్పబడినది. వాస్తవంలో పాము కూడ త్రాడులో లేదు కనుక 'పామున్ను త్రాడులో లేదు' అనిన్ని చెప్పబడినది. దార్ష్టాంతికమైన జగత్ బ్రహ్మ లలో, బ్రహ్మ అను అధిష్ఠానంమీద జగత్తు అను సర్ప ఆరోపితమైనది కనుకను, అధిష్ఠానం లేకపోతే ఆరో పము ఉండనేరదు కనుకను' పై శ్లోకభావమైన 5 వాక్యములలో 2 వ వాక్యమును అట్లు అర్థము చేసికోవలెను. వాస్తవంలో సచ్చిదానందమైన బ్రహ్మ అన్నృత జడదుఃఖాత్మకమైన యీ జగత్తులో ఉండు టకు వీలులేదు కనుక 3 వ వాక్యమును అట్లు అర్థము చేసికోవలెను. ఇకను యథార్థస్థితిలో పాముకూడ త్రాడులో లేనట్లు యీ జగత్తుకూడ బ్రహ్మలో లేదు కనుక 4 వ వాక్యమును అట్లు గ్రహించవలెను. ఇట్టి అత్యాశ్చర్యకరమైన లక్షణములన్నియు నా యోగశక్తి అనగా మాయాశక్తివల్ల కలిగినవి అని తెలిసికొనుము- అని 5 వ వాక్యములో శ్రీకృష్ణుడు అర్జునునికి బోధ చేయుచున్నాడు. దీనివల్ల గీతలో బోధింపబడిన జ్ఞానము 'బ్రహ్మ ఒక్కటే సత్యమైనది, జగత్తు మిథ్య, జీవుడు వాస్తవంలో బ్రహ్మయే' అను అద్వైతజ్ఞాన మని స్పష్టమగుచున్నది.

## "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం"

గీతలోని యింకొక విలక్షణమైన బోధవల్లకూడా

గీతలో బోధింపబడిన జ్ఞానము అద్వైతమే యని ధృవ పడును. ఆ బోధ ఏమనగా - ఏ ఒక్కదానిని గురించి తెలిసికొంటే సర్వము తెలియబడునో అట్టి బోధ. దీనిని సంస్కృతములో 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం' అని అంటారు. ఇట్టిబోధ ఛాందోగ్య ఉపనిషత్తులోను, ముండకోపనిషత్తులోను స్పష్టీకరింపబడి గీతలో 7 వ అధ్యాయము 2 వ శ్లోకములో 'యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే' అని ప్రశంసింప బడినది. ఈ శ్లోకమునకు పూర్వపు శ్లోకములో అనగా అధ్యాయప్రథమ శ్లోకములో 'అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు' నాస్వరూప మును సంపూర్తిగ యెట్టి సంశయము లేకుండా నీవు ఏ విధముగ తెలిసికొనగలుగుదువో ఆ విధముగు చెప్పుచున్నాను అని చెప్పి శ్రీకృష్ణుడు 2 వ శ్లోక ములో 'ఏ వస్తువును తెలిసికొంటే సర్వము తెలుస్తుందో ఆ వస్తువును గురించి చెప్పెదన'ని వాగ్దానముచేసి 'మత్తఃపరేతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ' నాకంటె వేరుగ ఏమీలేదు అని బోధించి నాడు. దీని భావమేమో పరిశీలించుదము :

ఏ వస్తువునుగురించి తెలిస్తే సర్వము తెలుస్తుందో అని చెప్పుటలోని భావమును విమర్శించుటకు అసలు ఉన్న వస్తువులు యెన్ని అని ముందుగా విచారించ వలెను. ఉన్న వస్తువులు మూడు అనిన్ని, అవి జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అనిన్ని ఈ వ్యాసము నకు శీర్షికనుబట్టిన్ని ప్రారంభవాక్యాలను బట్టిన్ని, స్పష్టమైనదిగదా! ఈ మూటిలోను యే ఒక్క వస్తువును గురించి తెలిసినను మిగతా రెండును తెలియవలెనన్న, ఆ మూటికిని పరస్పర సంబంధ మెట్లుండవలెను? ఆ మూడును స్వతంత్రమైన వస్తు వులే అయినచో దేనిని గురించి తెలిసికొంటే అదే తెలుస్తుంది కాని మిగతావి తెలియనేరవు. అనగా ఈశ్వరుడు లేక బ్రహ్మ గురించి తెలిసికొనిన బ్రహ్మయే తెలియబడును కాని జీవజగత్తులు తెలియ బడ నేరవు. అటైనచో శ్రీకృష్ణుని 'ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ' నెరవేరనేరదు. ఆ ప్రతిజ్ఞ నెరవేరవలెనన్న, బ్రహ్మను గురించి తెలిసికొంటే జీవ జగత్తులను గురించి ప్రత్యేకంగా తెలిసికొనవలసిన అవసరంలేకుండా పోవలె. అదెట్లాగు సంభవించు ననగా, మన్నుకును, కుండకును ఉన్న సంబంధము బ్రహ్మకును జగత్తుకును ఉంటే, అట్టిది సంభవించును.

మన్నుతో చేయబడిన కుండలు, మూకుళ్ళు, పిడతలు మొదలైనవన్నియును మన్నుకంటె భిన్నములుకావు కనుకను, అవన్నియు మన్నుయొక్క వివిధ వికారములే కనుకను వాటికి మన్నుకంటె పృథక్ సత్తాలేదు; కుండ, మూకుడు అనునవి వాస్తవంగా ప్రత్యేకించి వస్తువులుకావు. వాటి అన్నింటిలోను ఉన్న వస్తువు ఒక్కటున్నే. అవన్నియు ఊరక నామము, రూపము కలవే కాని, వస్తుత్వము కలవికావు. 'కారణేన అనన్య త్వాత్ కార్యస్య' అను న్యాయము ప్రకారము అవ న్నియు కారణమైన మన్నుకంటె అన్యములు కావు. అట్లేజగత్తులో వస్తువులుగా కనపడునవన్నియు వాటి వాటికారణములకంటె అన్యములుకావు, అనగా పంచ భూతములకంటె అన్యములుకావు; ఆ పంచభూతము లును బ్రహ్మయొక్క కార్యములు కనుక బ్రహ్మకంటె అన్యములుకావు. ఇట్లు జగత్తు అంతయు బ్రహ్మ యొక్క కార్యముకనుక బ్రహ్మకంటె అన్యము కాదు అని తేలినది; అనగా జగత్తుకు బ్రహ్మకంటె వేరైన వస్తుత్వము లేదని తేలినది; దీనినే మిథ్యాత్వ మంటారు.

కనుక జగత్తు మిథ్య అని ఈ విధముగాకూడా తేలి నది. ఇది అద్వైత సిద్ధాంతమేకదా. ఇంకను, జీవుడు కూడ బ్రహ్మకంటె భిన్నుడైనచో బ్రహ్మను గురించి తెలిసికొన్నచో జీవుని గురించి తెలియబడనేరదు. అట్లయినచో 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ' నెర వేరనేరదు. ఆ ప్రతిజ్ఞ నెరవేరవలెననిన జీవుడు బ్రహ్మకంటె భిన్నుడుకాకుండా ఉండాలె. వాస్త వంలో బ్రహ్మయే ఆయా ఉపాధుల సంబంధము కలిగే టప్పటికి జీవుడు అని పిలువబడుచున్నాడుకాని, జీవుడు వేరే లేడని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఘటాకాశము మహాకాశముకంటె భిన్నముకానట్లు జీవు డును బ్రహ్మకంటె భిన్నుడుకాడు అని తేలు చున్నది. అట్టి పరిస్థితులలోనే బ్రహ్మను తెలిసికొంటే, జీవుడు వేరేవస్తువుకాదు కనుక, జీవునిగురించి వేరే తెలిసికొనవలసిన అవసరము లేకుండా జీవుడుకూడా తెలియబడును. ఇట్లు గీతలో చేయబడిన 'ఏక విజ్ఞా నేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ' వల్లకూడ గీతలోని జ్ఞాన బోధ అద్వైతమే యని స్పష్టమగుచున్నది.

## జీవన్ముక్తి

ఇంకొక విలక్షణమైన బోధవల్లకూడా గీతలో అద్వైత జ్ఞానమే బోధింపబడినదని స్పష్టమగును. అది

జీవన్ముక్తినిగురించిన బోధ. జీవన్ముక్తి యనగా జీవించి యుండగానే ముక్తిని అనుభవించుట. మామూలుగా ముక్తిఅనగా దేహము నశించినతరువాత జీవుడుపొందు స్థితి అని ద్వైత విశిష్టాద్వైత మతములవారి సిద్ధాంతము. అద్వైతసిద్ధాంతముప్రకారం మాత్రము మానవుడు ఈ భౌతిక దేహములో ఉండగానే ముక్తుడు కావచ్చును. ఈ జీవన్ముక్తి సిద్ధాంతము ఒక్క అద్వైత మతములోనే ఉన్నదికాని ఇతర మతములలో లేనే లేదు. అట్టి సిద్ధాంతమును గీత అనేకచోట్ల స్పష్టముగా వ్యక్తపరచినది.

'ఇహైవ తైర్జితస్సర్గః యేషాం సామ్యేస్థితం మనః' ('ఇహ' అనగా ఈ శరీరములోనుండగనే అని అర్థము.) 'శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్', 'అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనాం', 'యదా భూత పృథగ్భావం ఏకస్థ మనుపశ్యతి । తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా' ఈ మొదలైన శ్లోకములు జీవన్ముక్తిని స్పష్టముగ బోధించుచున్నవి. జీవన్ముక్తుడనగా ఈ శరీరములో జీవించియుండగానే, బ్రహ్మసాక్షాత్కారంపొంది ముక్తిని పొందినవాడు అని గదా అర్థము.

అట్టి వానినే 'తత్త్వదర్శి' అనిన్ని గీత వర్ణించినది. 'తత్త్వదర్శి' అనగా తత్త్వమును సాక్షాత్కరించినవాడు అని అర్థము. అట్టివారే గురువులుగ నుండదగినవారు. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా । ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః" అను శ్లోకములో గురువులు అనగా జ్ఞానులు, తత్త్వదర్శులు అని వక్కాణింపబడినది. జ్ఞానులు అనగా శాస్త్ర జన్య తత్త్వ జ్ఞానంకలవారు అని అర్థము. తత్త్వదర్శులు అనగా తత్త్వ సాక్షాత్కారం అంటే అనుభవజ్ఞానం కలవారు అని అర్థము. గురువుగా ఉండవలసినవానికి శాస్త్ర జన్య జ్ఞానము ఉండాలె, అనుభవజ్ఞానము ఉండాలె. ఎందుకనగా—శాస్త్రజ్ఞానము లేకపోయిన యెడల శిష్యులకు బోధచేయలేడు. అనుభవజ్ఞానము లేకపోయిన యెడల తత్త్వమే సరిగా తెలిసికొనలేడు. ఎవరికివారు తరించేటందుకు అనుభవజ్ఞానము, అనగా ఆత్మసాక్షాత్కారము చాలును.

కాని ఇతరులకు బోధచేయు గురువుగా ఉండవలెనంటే శాస్త్రజన్య జ్ఞానముకూడా ఉంటేనేకాని బోధచేయు సామర్థ్యము ఉండనేరదు. అందుకని గీత పై శ్లోకములో ఆ రెండులక్షణములను పేర్కొన్నది. కనుక గీతా సిద్ధాంతము ప్రకారం అద్వైతులే గురువులుగా నుండతగినవారు కాని, ద్వైత విశిష్టాద్వైతులు గురువులుగానుండ నర్హులుకారని తెలుచున్నది. ఎందుకనగా వారి సిద్ధాంతము ప్రకారం దేహము నశించిన తర్వాత ముక్తియేకాని జీవన్ముక్తి లేదుగనుక. పాశ్చాత్యులలో కూడా వేదాంతజ్ఞానము కలవారిని 'Thinkers' అనగా బుద్ధికుశలతకలవారు అని అంటారేకాని, మన అద్వైతులలో వలె 'Seers' తత్త్వదర్శులు అని అనరు. కనుక లోకమునకంతటను ఆధ్యాత్మిక విషయములలో గురువుగా నుండతగినవాడు ఒక్క అద్వైతి మాత్రమే; ఇతరు లెవరును కాజాలరు అని స్పష్టపడుచున్నది. బ్రహ్మ ఒక్కటే సత్యమైన వస్తువు. జీవుడు బ్రహ్మకంటే భిన్నుడుకాడు, జగత్తు బ్రహ్మకంటే అన్యంకాదు అను అద్వైత సిద్ధాంతములో జీవుడు సర్వవ్యాపకమైన బ్రహ్మే కనుక యీ జీవన్ముక్తి సాధ్యపడును; మిగతా మతములలో అట్టిది లేనేలేదు. అట్టి జీవన్ముక్తిని గీత బోధించుటవల్ల గీతలోని జ్ఞానసిద్ధాంతము అద్వైతమే అని నిర్ధారితమగుచున్నది. ఇట్లు భగవద్గీతా సందేశము జ్ఞానమే కాని కర్మ, భక్తి కాదనిన్ని, ఆ జ్ఞానము అద్వైతాత్మజ్ఞానమే కాని ద్వైత, విశిష్టాద్వైత జ్ఞానము కాదనిన్ని, అట్టి జ్ఞానోదయమునకు నిష్కామ స్వధర్మానుష్ఠాన కర్మ, అనన్యభక్తి సాధనములనిన్ని తేలినది.

## ఉపనిషత్తులు

జగజ్జీవేశ్వరుల తత్త్వము భగవద్గీతలో ఎట్లు నిర్ధారణగావింపబడినదో మనము పరిశీలించాము. ఆ తత్త్వము ఉపనిషత్తులలో నెట్లు వర్ణింపబడినదో ఇకను చూడవలసియున్నది. ఉపనిషత్తులు అనగా వేదములకు అంతిమభాగములు; కనుకనే వానిని వేదాంతములనిన్ని అందురు. వేదశబ్దార్థము 'వేదయతీతి వేదః' అనగా తెలియచేయునది కనుక వేదము అని తేలుచున్నది. తెలియచేయునదనగా దేనిని? మానవునికి ప్రత్యక్ష ప్రమాణముచేతగాని, అనుమాన ప్రమాణముచేతగాని తెలిసికొనుటకు సాధ్యముకాని విషయములను తెలియచేయును కనుక వేదము అని అర్థము. ఇట్టి వేదమునకు స్వరూపస్వభావములేమి అని విచారించినచో వేదము అపౌరుషేయము-అనాదినిత్యముఅనిచెప్పబడుచున్నది. అపౌరుషేయమనగా పురుషునిచేత రచింపబడినదికాదు అని అర్థము. కనుక వేదము పురుషనిర్మితము కానందున కర్త లేదనిన్నీ, అనాది అగుటచేత ఫలానికాలంలో

పుట్టినది అనుటకు వీలుకానిదిన్ని, నిత్యమగుటచేత మాయనదికాని నశించునదికాని కాక సర్వకాలములకు సర్వులకు నిత్యమైన ప్రమాణగ్రంథరాజమనిన్ని తేలుచున్నది. ఇట్లు చెప్పుటకు ప్రమాణమేమి అని మీమాంస జేయుదము. ఏగ్రంథమునకైనను కర్తను గురించి కాలమునుగురించి స్వరూపస్వభావములను గురించి విచారణ చేయవలెననిన, పాశ్చాత్య విమర్శనా పద్ధతులప్రకారము కూడ, ఆ గ్రంథములోని విషయ పరిశీలనము ఒకటిన్ని, ఇతర ప్రాచీనతమ గ్రంథముల లోని విషయపరిశీలనము రెండవదిన్ని అను రెండువిధములుగ నున్నది. అట్టి పద్ధతుల నవలంబించి చూచినచో వేదములోని మంత్రభాగములున్ను, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, సూత్రములు మున్నగు సంస్కృత వాఙ్మయమంతయున్ను, వేదములు ఆ పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములనిన్ని, వానికి కర్త లేకపోవుటేకాక పరమేశ్వరుడుకూడా కర్త లేక అభివ్యంజకుడు మాత్రమే యనిన్ని, అవిఅనాదులు నిత్యములు అనిన్ని, పరమేశ్వరుడు బ్రహ్మదేవుని పుట్టించి సృష్టిని చేయమని ఆజ్ఞాపింపగా, 'దేనినిబట్టి ఏ విధముగా చేయను' అని బ్రహ్మ అడుగగా అతనికి ఆ పరమేశ్వరుడు తనలోనున్న వేదరాశిని శ్రుతపరిచాడనిన్ని, అంతట అట్టి వేదముల సహాయమువల్ల బ్రహ్మదేవుడు సృష్టిచేసినాడనిన్ని స్పష్టమగుచున్నది. దీనివలన వేదములు సృష్టికిని, సృష్టికర్తయైన బ్రహ్మదేవునికికూడ పూర్వమే ఆ పరమేశ్వరునిలో ఉన్నవని తేలుచున్నది. ఎవనికైనను ఉచ్ఛ్వాసనిశ్వాస అనునది సహజమే కాని పురుషనిర్మితము కాదుగదా! కనుకనే పరమేశ్వరుని నిశ్వాసమైన వేదమున్ను పరమేశ్వర కర్తృకముకూడ కాక పరమేశ్వరునితోపాటు నిత్యముగా నుండునది అని స్పష్టమగుచున్నది. ఇంకను వేదములోని విషయములను పరిశీలించినయెడల అవి మానవమాత్రునికి ఏ ప్రమాణముచేతను, ఎప్పటికిని తెలియుటకు వీలులేని స్వభావముకలవి అగుటచేతనుకూడ ఏ మానవుడును ఎప్పుడును రచించుటకు వీలులేదనిన్ని స్పష్టమగును. అట్టి విషయము లేమనగా, పైన ఏడు లోకములున్నవనిన్ని, క్రింద ఏడు లోకములు ఉన్నవనిన్ని ఆ యా లోకములలో ఫలాని విధమగు జీవులు ఉన్నారనిన్ని, వారి చరిత్రలను గురించిన వయనములు, సృష్టికి పూర్వపు పరిస్థితులు, సృష్టిపుట్టిన విధానము, జీవులు పుట్టినవిధానము, ఈశ్వరస్వరూపము, జీవునిస్వరూపము జగత్స్వరూప, గర్భస్థశిశువు భావించు విషయములు, చనిపోవు సమయములో జీవునియొక్క అనుభవములు, దేవతలలో ఎవరికి ఎవరు పురోహితులైనది, వారిలో వారి పరస్పర సంబంధము, పక్షులకు రాత్రిళ్ళు భూమి ఎట్లు కనపడగల విషయాలు మున్నగు ననేక విషయములు మానవుడు తెలిసికొనుటకు ఎన్నటికిని సాధ్యముకానివై యున్నవి.

ఇట్టి పరిస్థితులలో 3000 బి. సి. ప్రాంతముల బుద్ధిమంతులు వేదములను వ్రాసియుండవచ్చుననిన్ని, ఆ వేదములలోకూడ ముందు మంత్ర భాగమే పుట్టినదనిన్ని, ఆ తరువాత కొంతకాలమునకు బ్రాహ్మణ భాగము, ఆ తరువాత ఆరణ్యక భాగము, ఆ తరువాత 1500 బి. సి. ప్రాంతముల ఉపనిషత్తులు పుట్టినవనిన్ని, ఈ విధముగా మన భారతీయ ఆస్తైదిక సంప్రదాయమును ఎరుగని పాశ్చాత్యులు ఊహాగానము చేయగా, మన భారతీయ నవనాగరికులు పైన చెప్పిన ప్రకారము సంస్కృత వాఙ్మయమంతటిలోను దేదీప్యమానముగ విరాజిల్లుచున్న ప్రమాణములను త్రోసిపుచ్చి పాశ్చాత్యుల ఊహాగానమును ప్రధానముగా చేసికొని విశ్వసించి వ్యక్తపరుచుట చాల శోచనీయము కాదా!

ఇంకను మంత్ర బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషత్తులన్నియుకలసి వేదమని గ్రంథములన్నియు ఘోషించుచుండగా, ఒకదాని తరువాత ఒకటి పుట్టినదని వానికి వివిధ కాలములను నిర్ణయించుట ఎంతటి అవివేకము। ఎంతటి సాహసము! వ్యాసభగవానుడు వేదములన్నింటిని ఒకేరాశిగ నుండగా ఋగ్యజుస్సామాథర్వములుగా విభజించినాడనిన్ని అందుకనే 'వ్యాసః' అని బిరుదము యివ్వబడినదనిన్ని, (వ్యాసః అనగా విభాగమును చేసినవాడు) ఇట్లు మన ప్రాచీన గ్రంథములు చాటుచుండగా, ఒకభాగము తరువాత ఒక భాగము కాలాంతరములో పుట్టినదని భావించుట బుద్ధిమంతుని లక్షణమా? ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతప్రవక్తలగు త్రిమతాచార్యులును వేదములు అపౌరుషేయములు, నిత్యములు అని వక్కాణించుచుండగా పాశ్చాత్యుల ఊహాలకు బానిసలగుట ఏటి వివేకము! ఇంకను పాశ్చాత్యులు వేదములు 3000 బి.సి.లో రచింపబడి యుండవచ్చును అని తమఊహాను వెలిబుచ్చగా, మన ఆధునికులు అప్పుడు పుట్టినవి అని నిశ్చయించుచున్నారే, ఏమి ఆశ్చర్యము!

వేదము గ్రంథము కనుక ఎవరో ఒకరు వ్రాయకుండా ఎట్లు ఏర్పడును అని ప్రశ్న పుట్టును. వేదము రచింపబడిన గ్రంథము అని మన సిద్ధాంతమే కాదు. అది శ్రుతి; అనగా వినబడిన శబ్దరాశి. పరమేశ్వరుని ద్వారా వచ్చిన శబ్దరాశిని బ్రహ్మదేవుడు విన్నాడు. ఆయన తిరిగి ఆ శబ్దరాశిని ధారణచేసి మహర్షులకు శ్రుతపరిచినాడు. మహర్షులయొద్ద నుండి నేటి వరకును యీ పవిత్ర భారతదేశములో ఈ శబ్దరాశి దేదీప్యమానముగ గురు శిష్య పరంపరలో విరాజిల్లు చున్నది. కనుక మన భారతీయ సంప్రదాయాను సారముగ వేదములు అపౌరుషేయములు, నిత్యములు అని ధృవపడుచున్నది. అట్టి వేదములు అనంతములు. వాని చివరభాగములు ఉపనిషత్తులు. 'ఉపనిషత్తు' అను శబ్దమునకు అజ్ఞానమును పోగొట్టు బ్రహ్మ విద్య అని అర్థము. ఇంకను 'ఉప' అనగా గురుని సమీపములో కూర్చుని ఆంతరంగికముగా తెలిసికొనదగిన రహస్యమైన విద్య అనియు ఆ శబ్దార్థము. జీవుని జనన మరణ ప్రవాహములోనుండి లేవనెత్తి జన్మ రాహిత్యమును చేసి ముక్తినిచ్చు పవిత్రతమ గ్రంథ మగుటచేత ఉపనిషత్తులకు ప్రపంచములో నఖండ ప్రశస్తి వచ్చినది. పాశ్చాత్య విజ్ఞానతేజోరాశులగు 'స్కోపెన్‌హోర్' మున్నగువారు ప్రపంచములో ఉపనిషత్తులవంటి ఉత్తేజకరమగు గ్రంథ మింకొకటి లేదనిన్ని దానిలోనున్న విజ్ఞానము ఏ యితర గ్రంథములలోను లేదనిన్ని అవి అత్యుత్తమమైన విజ్ఞాన పేటికలనిన్ని ఎంతయో ప్రశంసించి, ఆ ఉపనిషత్తులను చదువకుండా రాత్రిళ్ళు ఎన్నడూ నిద్రపోలేదనిన్ని నుడివినారు.

అట్టి మహోత్కృష్టమైన ఉపనిషత్తులు నాలుగు వేదములలోను కలసి 1180 (ఋగ్వేదములో 21, యజుర్వేదములో 109, సామవేదములో 1000, అథర్వణవేదములో 50) ఉన్నవనిన్ని, వానిలోనుంచి శ్రీరామచంద్రమూర్తి తన ముఖ్యభక్తుడున్న శిష్యుడున్న అయినహనుమంతునికి 108ని ఏరిఉపదేశించినాడనిన్ని, అందుచేత ఆ 108 ఉపనిషత్తులు ఇప్పుడు అమలులో నున్నవనిన్ని మన సాంప్రదాయము. ఈ 108 లోను 10 ఋగ్వేదమునకు సంబంధించినవి, 19 శుక్ల యజుర్వేదమునకు చెందినవి, 32 కృష్ణ యజుర్వేదమునకు చెందినవి, 16 సామవేదమునకు చెందినవిన్ని, 31 అథర్వణవేదమునకు సంబంధించినవిన్ని అయ్యున్నవి. 108 లోను ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యములను పదియును ముఖ్యముగ పరిగణింపబడి త్రిమతాచార్యులచే రచింపబడిన భాష్యములచే నొప్పారుచున్నవి. ఈ పది ఉపనిషత్తుల లోను ఐతరేయము ఒక్కటే ఋగ్వేదమునకు చెందినదిన్ని, ఈశావాస్య బృహదారణ్యకములు రెండున్ను శుక్ల యజుర్వేదమునకు చెందినవిన్ని, కఠ తైత్తిరీయములు రెండున్ను కృష్ణ యజుర్వేదమునకు చెందినవిన్ని, కేన, ఛాందోగ్యములు రెండున్ను సామవేదమునకు చెందినవిన్ని, ప్రశ్న, ముండక, మాండూక్యములను మూడున్ను అథర్వణవేదమునకు చెందినవిని అయ్యున్నవి.

ప్రతి ఉపనిషత్తులోను మామూలు వాక్యములతోడుగ కొన్ని మహావాక్యము లున్నవి. 108 ఉపనిషత్తులలోనుంచి శ్రీరామచంద్రమూర్తి తన పట్టాభిషేకములో తనకు మహోపకారము గావించిన హనుమంతునికి 1008 మహావాక్యములను ఏరి ఒక మారుగా ఉపదేశించి యిచ్చినాడు అని తెలియుచున్నది. ఈ 108 ఉపనిషత్తులనుగాని, 1008 మహావాక్యములనుగాని చదువుటకు ఓపికలేనివారికి వాటి అన్నిటికి సారభూతమగు నాలుగు మహావాక్యములను నాలుగు వేదములనుంచి ఏరి మనయందుండు అత్యంత దయతో మనకు అందించినారు.

జగజ్జీవేశ్వరుల తత్త్వనిర్ణయమునకై ముందు మహావాక్య విచారణచేసి ఆతరువాత ఇతర వాక్య విచారణ చేయుదము.

## మహావాక్య విచారణ

మహావాక్యములనగా జీవునికిని, బ్రహ్మమునకుగల సంబంధమును, జగత్స్వరూపమున్ను అనగా జగజ్జీవేశ్వరుల అన్యోన్య సంబంధమును తెలియుచేయునవి అయ్యున్నది. 1008 మహా వాక్యములలోను 3 మహావాక్యములు జీవునికిని బ్రహ్మమునకుగల సంబంధము అభేదమని తెలియుచేయును. 33 మహా వాక్యములు జగత్తుయొక్క మిథ్యాత్వమును బోధచేయును; 3 మహావాక్యములు బ్రహ్మ యొక్కటే సత్యమైనదని బోధించును. మిగతా వాక్యములు బంధ మోక్షములను గురించి జీవన్ముక్తిని గురించి, మననమును గురించి, ఈ మొదలగు విషయములను గురించి బోధించునవై యున్నవి. అన్ని వేదముల సారముగ నాలుగు మహావాక్యములను నాలుగు వేదములలోనుంచి మనకు అనుగ్రహించినారు. కనుక ఆ నాలుగు మహావాక్య

ముల విచారణ గావించుదము. ఈ నాలుగు మహా వాక్యములున్ను జీవబ్రహ్మల కభేద్యమునుబోధించునవై యున్నవి. అవెవ్వి యనగా:

తత్త్వమసి (సామవేదము)
అయమాత్మా బ్రహ్మ (అధర్వణవేదము)
అహం బ్రహ్మాస్మి (యజుర్వేదము)
ప్రజ్ఞానం బ్రహ్మ (ఋగ్వేదము)

ఈ నాలుగున్ను యతీశ్వరులకు ఉపదేశింపబడు నవైయున్నవి. ఈ నాలుగున్ను ప్రత్యేక ప్రత్యేక ముగాకూడ మోక్షమును ప్రసాదించునవే అయ్యున్నవి. అయినను వీనిలో నొక క్రమముకూడ ఉన్నట్లు గోచరించుచున్నది. మొదటి మహావాక్యము 'తత్త్వమసి' అయినది. 'నీవు బ్రహ్మము' అని గురువు శిష్యునికి బోధచేయునదై యున్నది. ముముక్షువు అయిన శిష్యుడు తరించుటకుగాను శ్రవణ,మనన,ధ్యానములను సాధనములను చెప్పినారు. కనుక అట్టి శిష్యుడు గురువు యొద్ద మొదట ఈ మహావాక్యమును శ్రవణము చేయును. కనుక ఈ మహావాక్యము శ్రవణమహా వాక్యము. ఇట్లు శ్రవణము చేసిన తరువాత, దీని భావమును మననము చేయవలెను కనుక, 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యముతో ఆ ముముక్షువు తన హృదయాకాశములోనున్న ఆత్మను తన చేతితో చూపుచూగాని లేక భావనచేయుచూగాని'అయమాత్మా' ఈ ఆత్మయే, 'బ్రహ్మ, బ్రహ్మము' అని మననము జేయును. కనుక ఇది 'మనన మహావాక్యము' ఇట్టి మననమువలన విషయము నిశ్చితమగును కనుక, అట్టి నిశ్చితభావమును 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మనే' అని ధ్యానముచేయును. కనుక ఇది 'ధ్యాన మహా వాక్యము'. ఇట్లు ధ్యానములో పరినిష్టుడుకాగానే, తన వ్యక్తిత్వముపోయి, తనలోనున్న చైతన్యము మాత్రమే బ్రహ్మకాదు, సర్వత్రవున్న 'చైతన్య మంతయు బ్రహ్మయే' అను సమష్టి భావము కలిగి సత్య జ్ఞానానంతమై సర్వ వ్యాపకమైన బ్రహ్మాను భవము కలిగి తరించును; కనుక 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనునది అనుభవ మహావాక్యము. ఈ మహావాక్యము నకు అర్థము చైతన్యమంతయు బ్రహ్మయే అని.

ఇట్లు గురువు 'నీవు బ్రహ్మవు' అని శిష్యునికి బోధచేయగా, 'ఈ ఆత్మ బ్రహ్మ' అని తనలో తను మననముచేసికొని, నిశ్చయించుకొని, 'నేను బ్రహ్మనే' అని విజాతీయ ప్రత్యయము లేకుండా అవిచ్ఛిన్నముగా ధ్యానంచేసిన మీదట, నాలోని చైతన్యమేకాదు, సర్వత్రఉన్న చైతన్యమంతయు బ్రహ్మయే అని సర్వాత్మభావ అనుభవముకలిగి ముక్తుడగుట అని తెలుచున్నది. ఇంకను ఇంకొక స్వారస్యమున్ను కలదు. మొదటి శ్రవణమహావాక్యము 'తత్త్వమసి' అనునది మధ్యమపురుష (Second person) లో నున్నది. 'అయమాత్మా బ్రహ్మ' అను మనన మహావాక్యము ప్రథమ పురుష (Third person) లో నున్నది. 'అహం బ్రహ్మాస్మి' అను ధ్యానమహావాక్యము ఉత్తమ పురుష (First person) లో నున్నది. ఇకను 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను అనుభవ మహావాక్యము ఏ పురుషలోను లేకుండా (Impersonal) సామాన్య వాచకముగా సర్వమునకు సంబంధించియున్నది. ఇట్లు మహావాక్యములన్నియు జీవబ్రహ్మైక్యమును బోధించుటచేత అద్వైతమునే ఉపనిషత్తులు బోధించుచున్నవని తేలుచున్నది. ఇంకను 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య, జీవో బ్రహ్మైవనాపరః' అను అద్వైత సిద్ధాంతములో (1) బ్రహ్మ ఒక్కటే సత్యమైనది, (2) జగత్తు మిథ్య,(3)జీవుడు వాస్తవముగా బ్రహ్మయే అను మూడు లక్షణములలోను, ఏ ఒక్కటి రుజువు అయినను మిగతా రెండును రుజువు అయినట్లె తేలును. ఒక్క జగన్మిథ్యత్వము తేలినను, ఒక్క జీవ బ్రహ్మైక్యము తేలినను, ఒక్క బ్రహ్మ సత్యత్వము తేలినను, మిగతావి అన్ని తేలి అద్వైత సిద్ధాంతము నిర్ధారితమగుచున్నది.

## ఉపనిషత్తులలోని ఇతర వాక్యముల విచారణ

(1) ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ :

జగజ్జీవేశ్వరులలో ఏ ఒకదాని తత్త్వము తెలిసినను మిగతా రెండును తెలియబడును అను సిద్ధాంతము విషయమై భగవద్గీతను గురించిన మీమాంసలో మనము పరిశీలించినాము. ఈ సిద్ధాంతము ఉపనిషత్తులలో విపులముగ ప్రశంసింపబడినది.

ఛాందోగ్యోపనిషత్తులో—

'యేన శ్రుతం శ్రుతం భవతి, అమతం మతం,
అవిజ్ఞాతం విజ్ఞాతం' అనిన్ని,

ముండకోపనిషత్తులో—

'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం
విజ్ఞాతం భవతి' అనిన్ని,

బృహదారణ్యకోపనిషత్తులో—

'ఆత్మనోవా అరే దర్శనేన శ్రవణేన
మత్యా విజ్ఞానేన ఇదం సర్వం విజ్ఞాతం' అనిన్ని

ఈ సిద్ధాంతము స్పష్టీకరింపబడినది.

ఈ సిద్ధాంతము అద్వైతములో తప్ప మిగతా ద్వైత విశిష్టాద్వైతములలో కుదరనేరదని యిదివరలోనే నిర్ధారణ చేయబడియున్నది గదా.

(2) జీవన్ముక్తి :

ఉపనిషత్తులలో జీవన్ముక్తిని తెలియజేయు వాక్యములు 119 వున్నవి. జీవన్ముక్తి కూడ ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములలో లేదనియు, అద్వైతములో మాత్రమే కుదురుననియు లోగడనే నిర్ణయింపబడియున్నదిగదా.

(3) జగన్మిథ్యావాక్యములు.

ఈ వాక్యములు ఉపనిషత్తులలో 33 గలవు. వీనిలో ముఖ్యమైనవి దిగువ నుదాహరింపబడుచున్నవి.

'యత్ర హి ద్వైత మివ భవతి'

'మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి'

'నాన్యత్కించనమిషత్'

'వాచారంభణం వికారో నామధేయం'

'సర్వం వికారజాతం మాయామాత్రం'

'సర్వత్ర హి నహ్యస్తి ద్వైతసిద్ధిః'

'మాయామాత్ర మిదం ద్వైతం అద్వైతం పరమార్థతః'

'జ్ఞాతే ద్వైతం నవిద్యతే'

'ద్వితీయకారణాఽభావాత్ అనుత్పన్న మిదం జగత్'

'చిత్తం ప్రపంచ ఇత్యాహుః నాస్తి నాస్త్యేవ సర్వదా'

ఈ వాక్యములకు తోడుగ ఉపనిషత్తులలో సృష్టి ఒక్కసారే అయినదని ఒకచోట, క్రమముగాఆకాశము మొదలుకొని అయినదని ఒకచోట, తేజస్సు మొదలు కొని అయినదని ఒకచోట యుండుటచేత శ్రుతికి సృష్టి యథార్థముకాదని బోధించుటే తాత్పర్యమని తేలుచున్నది.

4. జీవబ్రహ్మైక్య వాక్యములు.

ఈ వాక్యములు 38 ఉన్నవి. వీనిలో మహావాక్యములు నాలుగున్ను లోగడనే ఉదాహరింపబడినవి. మిగతా వానిలో ముఖ్యమైనవి దిగువ నుదాహరింపబడుచున్నవి.

'స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః'

'సత్యమాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవా త్రైవ :

విచికిత్స్యం ?'

'త్వం బ్రహ్మాసి'

'త్వమేవాహం అహమేవ త్వం'

'ఘటే నష్టే యథావ్యోమ వ్యోమైవ భవతి స్వయం

తద్వదేవోపాధి విలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్ స్వయం'

'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి'

5. బ్రహ్మస్వరూప వాక్యములు.

ఈ వాక్యములు 93 ఉన్నవి. వానిలో ముఖ్యమైనవి దిగువ నుదాహరింపబడుచున్నవి.

'సర్వం ఖల్విదం బ్రహ్మ'

'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'

'విజ్ఞాన మానందం బ్రహ్మ'

'ఏకమేవాద్వితీయం బ్రహ్మ'

'ఆదిమధ్యాంతశూన్యం బ్రహ్మ'

'మాయాతీతం గుణాతీతం బ్రహ్మ'

'సచ్చిదానంద స్వప్రకాశం బ్రహ్మ'

'అద్వైతం అనిర్వాచ్యం బ్రహ్మం'

'బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠం'

'తదేవ నిష్కలం బ్రహ్మ నిర్వికల్పం నిరంజనం'

'పరంబ్రహ్మ పరం తత్త్వం సచ్చిదానందలక్షణం'

'అక్షరం పరమం బ్రహ్మ నిర్విశేషం నిరంజనం'

'బ్రహ్మణోన్యత్ పరం నాస్తి। బ్రహ్మణోన్యత్ జగన్నచ। బ్రహ్మణోన్య దహం నాస్తి। బ్రహ్మణోన్యత్ ఫలం నహి॥'

'సర్వం హ్యేతత్ బ్రహ్మ'

'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్'

'నాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నో భయతః

ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్ట

మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య

మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం

ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం

మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥

ఈ విధముగా ఉపనిషత్తులలో అద్వైత బోధక వాక్యములు అనేకములు గలవు. ఉపనిషత్తులలో ద్వైత విశిష్టాద్వైత సూచకములగు వాక్యములున్నను అవన్నియు మంద మాధ్యమాధికారులకు గూర్చి చెప్పబడినవగుటచేత అద్వైత సిద్ధాంతమునకు విరోధములుకావు. కాని ఉపనిషత్తులలోని అద్వైత వాక్య

ములు ద్వైతవిశిష్టాద్వైత సిద్ధాంతములకు వివిధముగాను సమన్వయము కానేరవు. కనుక ఉపనిషత్తులలోని సిద్ధాంతము అద్వైతమే యని తేలినది.

## బ్రహ్మసూత్రములు

బ్రహ్మసూత్రములు అనునవి ఉత్తరమీమాంసా, వేదాంతమీమాంసా అని కూడ తెలియబడుచున్నవి. ఇవి 555 ఉన్నవి. వీనిని వ్యాసమహర్షి ఉపనిషత్తుల సారముగా రచించినాడు. ఈ 555 సూత్రములను 4 అధ్యాయములుగను, 16 పాదములుగను 192 అధికరణములుగను విభజింపబడినవి. వీనిలో బోధింపబడినది ద్వైతమా, విశిష్టాద్వైతమా, అద్వైతమా అను విషయమును తేల్చుటకు నాలుగు పద్ధతులున్నవి. అవేవన—

(1) ఈ సూత్రములను వ్యాసులవారు ఉపనిషత్తుల సారముగ రచించుటచేతను, ఉపనిషత్తులలోని జ్ఞానము అద్వైతమే యని పైన నిర్ణయింపబడియుండుటచేతను, యీ బ్రహ్మసూత్రములు కూడ అద్వైతపరములే.

(2) ఈ సూత్రములు రచించిన వ్యాసులవారు అష్టాదశపురాణములను గూడ రచించుటచేతను, ఆ పురాణములలో అద్వైతము కంఠోక్తిగ అనేక ప్రదేశములలో బోధింపబడయుండుటచేతను, అట్టి పురాణకర్తయగు వ్యాసులవారు బ్రహ్మసూత్రములను గూడ అద్వైతపరముగానే వ్రాసియుండవలెను.

(3) ఆస్తిక దర్శనములగు న్యాయ వైశేషిక సాంఖ్య యోగ పూర్వోత్తర మీమాంసలను ఆరింటిలో, వ్యాసులచే రచింపబడిన ఉత్తరమీమాంస కాక మిగతా ఐదింటి కర్తలగు కపిల కణాదాదులు తమతమ గ్రంథములలో వేదాంతము, అనగా అద్వైతము అనివారందరు గ్రహించి ఖండించిరి కనుకను, వ్యాసులవారు తమ సూత్రములలో ఆ అయిదు మతములను, వారి వారి ఖండనలను ఖడించి అద్వైతమును స్థాపించినారు కనుకను, ఆ కపిల కణాదాదుల ప్రబల సాక్ష్యమువల్ల వేదాంతమనగా అద్వైతమని తేలినది. కనుక ద్వైత వేదాంతము, విశిష్టాద్వైత వేదాంతము అనునవి అసందర్భపు శబ్దములు. కనుక వ్యాస సూత్రముల సిద్ధాంత మద్వైతమే.

4. ఇకను 4వ పద్ధతి సూత్రముల భావమునుబట్టియే బ్రహ్మ సూత్రములు అద్వైతపరములని తేలును. అదెట్లనగా.

1. మొదటి సూత్రము 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అనుదాని అర్థము సాధన చతుష్టయ సంపత్త్యనంతరము, అట్టి సంపత్తి ఉన్నది కనుక ఫలీభూతమైన బ్రహ్మ జ్ఞానము కొరకు బ్రహ్మ విచారణ అనగా వేదాంత వాక్య విచారణ చేయవలయును అని తేలుచున్నది. అట్టి విచారణయొక్క ఫలితమే మనగా 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' 'బ్రహ్మవిత్ ఆప్నోతి పరం' 'తరతి శోకమాత్మవిత్' అను ఉపనిషద్వాక్యములు అట్టి బ్రహ్మ జ్ఞానముకల జీవుడు శోకమును దాటి బ్రహ్మయే అగును అని బోధించుచున్నవి. కనుక మొదటి సూత్రార్థము ప్రకారము బ్రహ్మ విచారణయొక్క ఫలితములు రెండు—

(1) దుఃఖమును దాటుట

(2) బ్రహ్మయే అగుట

అని తేలుచున్నది.

1. బ్రహ్మ జ్ఞానముగల జీవుడుదుఃఖమునుదాటును అని చెప్పుటవల్ల దుఃఖము లేక దుఃఖమునకు కారణమైన దేహములు ఈ జగత్తు బ్రహ్మ జ్ఞానముచేత నశింపచేయతగినది అని తేలుచున్నది. జ్ఞానముచేత నశించునది అజ్ఞానమేకదా! కనుక దుఃఖము, దేహాదులు ఈ జగత్తుఅంతా అజ్ఞానకార్యము లేక ఆధ్యాసికము అని తేలుచున్నది. అజ్ఞానకార్య మనగా మిథ్యయేకదా! కనుక మొదటి సూత్రములోనే జగన్మిథ్యాత్వము బోధింపబడినది. ఈ భావము 2 వ అధ్యాయము, 3 వ పాదము, 29 వ సూత్రము 'తద్గుణసారత్వాత్ తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్' అను దానిలోను, "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" (2-1-14) అను సూత్రములోను స్పష్టీకరింపబడినది.

2. ఇకను బ్రహ్మజ్ఞానముగల జీవుడు బ్రహ్మయే అగును అని చెప్పుటవల్ల వాస్తవంగా జీవుడు బ్రహ్మయే అని ఉభయులకు అభేదము బోధింపబడినది. ఈ భావము 'శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్' (1-1-30), 'ఆత్మేతూపగచ్ఛంతి గ్రాహయంతి చ' (4-1-3) మున్నగు సూత్రములలో స్పష్టీకరింపబడినది. కనుక బ్రహ్మసూత్రములు గూడ జగన్మిథ్యాత్వమును జీవబ్రహ్మల కభేదమును బోధించుచున్నవి కనుక అద్వైతపరములేయని తేలుచున్నది.

# పురాణములు, పురాణముల తత్త్వము

వ్యాసులవారు 18 పురాణములను, 18 ఉపపురాణములను, మహాభారతమును రచించెను. ఈ పురాణములలో కొన్ని శివుడు గొప్పవాడు అనియు, కొన్ని విష్ణువు గొప్పవాడు అనియు, కొన్ని దేవి గొప్పదనియు, కొన్ని గణపతి గొప్పవాడు అనియు ఇట్లు వర్ణించుచున్నవి. ఇవన్నియు పైకి పరస్పర విరుద్ధములుగ గన్పడును. ఇట్టి విరుద్ధ భావములను వ్రాసిన వ్యాసులవారు పిచ్చివారా? ఆయన నారాయణ అవతారమని అందరు అంగీకరించెదరు. అట్టి అవతారమూర్తి ఇట్టి పరస్పర విరుద్ధములగు భావములతో నేల వ్రాయును? ఇట్లు వ్రాయుటలో ఆ మహానుభావుని భావమేమి? అని విచారించినచో వ్యాసుని భావము ఆ పరమేశ్వరుడు అసలు నిర్గుణుడు, నిరాకారుడునై ఎట్టి నామరూపములు లేనివాడు కనుక జీవుల రుచిభేదమునుబట్టి శివుడు అని కాని, విష్ణువు అనికాని, దేవి అనికాని, గణపతి అనికాని ఇట్లు ఏదు నామముల రూపమును కల్పించినను తగాదా ఉండనేరదు అనే భావమేకాని అన్యము కానేరదు. జన్మాంతర సంస్కారమునుబట్టి ఒక జీవునికి శంఖచక్రములతో గరుడవాహనుడైన విష్ణువుయొక్క రూపము, నామము ఆకర్షించును; ఇంకొకనికి జటాజూటములతోను, త్రిశూలముతోను, విభూది, రుద్రాక్షలతోను, వృషభవాహనముతోను ఒప్పారు శివుని రూపము, నామము ఆకర్షించును. మరియొకనికి స్త్రీ ఆకారము జగజ్జననిగా ఆకర్షించును. అందరును ఒకేవిధమైన సంస్కారములు గలవారుగ ఎప్పుడును ఉండనేరరు కదా! అట్టి పరిస్థితులలో ఆభగవానుడు కేవలము శివునిగానో, విష్ణువుగానో, దేవినిగానో వర్ణించినచో, అట్టి రూపమునందు అభిరుచిలేని మిగతావారందరికి తరుణోపాయము ఉండనేరదు. అందుకనే దయాసముద్రుడగు ఆవ్యాస భగవానుడు వివిధ విధముల సంస్కారముగల వారినికూడ తరింపచేయు ఉత్తమ సంకల్పముతో నామ రూపములులేని ఆ నిర్గుణ నిరాకార తత్త్వమును అనేక నామ రూపములతో ఆయా పురాణములలో వర్ణించియున్నాడు. ఒకేవ్యక్తి నాటకములో రాజు వేషము వేయవచ్చును. స్త్రీ పాత్ర ధరించవచ్చును. నౌకరు వేషము వేయవచ్చును. ఇట్లు ఎన్ని వేషములువేసినను ఆ వ్యక్తియొక్క నిజస్వరూపము ఏ విధముగను ఎట్టి మార్పును చెందనేరదుగదా! ఈ వేషములన్నియు కల్పితములే కనుక ఆయన అసలు రూపమును భంగించనేరవు. అటులనే ఆ పరమేశ్వరతత్త్వము నిర్గుణ నిరాకార నామరూపరహితమైనదగుటచేత ఆయనకు ఎన్ని నామరూపములను కల్పించినను ఆ అసలు తత్త్వము ఎట్టి మార్పులు పొందక నిర్వికారముగాను అసంగముగాను ఉండును. అందుకనే 'ఉపాసకానాం క్షేమార్థం బ్రహ్మణో రూపకల్పనా'.

'నిర్విశేషం పరంబ్రహ్మ
సాక్షాత్కర్తుం మునీశ్వరాః
యే మందాః తేఽనుకంప్యంతే
సవిశేష నిరూపణైః ॥

— అను ప్రమాణములు అభేద జ్ఞానమునకు అనర్హులగు మంద ప్రజ్ఞులను అనుగ్రహించుటకు నిర్గుణ నిరాకార బ్రహ్మమునకు రూపకల్పన చేయబడినదని స్పష్టీకరించుచున్నవి. కనుక వ్యాసులవారు వివిధ దేవతల ప్రాధాన్యతతో వివిధ పురాణముల రచించుటను బట్టి వ్యాసులవారి ఉద్దేశానుసారము పురాణముల తత్త్వము నిర్గుణ నిరాకార నామరూపరహిత పరబ్రహ్మను బోధించు అద్వైతమేయని తేలుచున్నది.

పురాణములలో బోధింపబడిన విషయములను చూచినను పురాణములు అద్వైతపరములే యని స్పష్టపడగలదు. వ్యాసులవారు అన్నిరుచులవారిని తరింపచేయవలెనను అత్యంత ఉదారాశయముతో పురాణములలో కొన్నింటిని శివపరముగాను, కొన్నింటిని విష్ణుపరముగాను, కొన్నింటిని దేవీపరముగాను యిట్లు వివిధ దేవతల ఉత్కర్షను ఆ యా పురాణములలో వ్యక్తముచేయుటలో ఆయా దేవతల ఉత్కర్షను స్తుతించుటయందే తాత్పర్యము కాని తదితర దేవతల నిందించుటయందు తాత్పర్యము కాదు. మీమాంసా శాస్త్రములో 'న హి నిందానింద్యం నిందితుం ప్రవృత్తా హి తు స్తవ్యం స్తోతుం' అని న్యాయము కలదు. ఆ న్యాయానుసారముగ విష్ణు పురాణములో శివనింద కనపడినచో, ఆ నింద శివుని నిందించుటకుగాను ప్రవృత్తమైనది కాదనియు విష్ణువు యొక్క గొప్పతనమును స్తుతించుటకై మాత్రమే ప్రవృత్తమైనదనియు స్పష్టపడుచున్నది. అటులనే శివ పురాణములలోని విష్ణునిందను, దేవీపురాణములోని శివకేశవుల నిందను గ్రహించవలసియున్నది. ఇది అద్వైతులగు స్మార్తులుచేయు సమన్వయము. ఇకను వైష్ణవులు,

వైష్ణవ పురాణములు మాత్రమే ప్రమాణములనిన్ని, మిగతా పురాణములు అప్రమాణములనిన్ని, శైవులు శివపురాణములు మాత్రమే ప్రమాణములు, ఇతరములు అప్రమాణములనిన్ని వాదించుచుందురు. అన్ని పురాణములను రచించినది ఒక్క వ్యాసుడే అయ్యుండగాను, ఆ వ్యాసుడు నారాయణ అవతారమని అంగీకరించుచుండగను, ఆయన వ్రాసిన కొన్ని పురాణములు ప్రమాణములు, కొన్ని అప్రమాణములు అనుట బుద్ధిమంతుని లక్షణముకానేరదుగదా ? ఈ వివిధ పురాణములలోను, స్కాందపురాణములోను దానిలోని సూతసంహితలో ముఖ్యముగాను అద్వైతమే ప్రతిపాదింపబడియున్నది. శంకరభగవత్పాదులు అద్వైతభాష్యమును వ్రాయుటకు సూతసంహిత ఒకవిధమైన మాతృకగా నుండెనని ఒక ప్రథయును గలదు. మిగిలిన పురాణములలోగూడ అద్వైత ప్రతిపాదన స్పష్టముగ విశదీకరింపబడి యున్నది. ద్వైత విశిష్టాద్వైతులగు వైష్ణవులు శైవపురాణములను అప్రమాణమని వాదించుచున్నారు కనుక 'తుష్యతు దుర్జనః' అను న్యాయము చొప్పున వాదనకొరకు వారి అభిప్రాయమును అంగీకరించినను అట్టి వైష్ణవులు ప్రమాణ మూర్ధన్యముగ ప్రశంసించు విష్ణుపురాణమును, శ్రీమద్భాగవతమును పరిశీలించినను వానిలో గూడ అద్వైతమే ప్రతిపాదింపబడినదని దిగువ ప్రమాణములవల్ల స్పష్టపడును.

## విష్ణుపురాణము

దీనిలోని జడభరతోపాఖ్యానములో ఒకరాజు జ్ఞాన సంపాదనార్థమై గురువును అన్వేషించుకొనుటకు పల్లకిలో బోవుచుండగా ఆ పల్లకిని మోయు బోయీలు త్రోవలో కనపడిన జడ భరతుని తమ సహాయార్థమై తెచ్చి అతనిచేతకూడ మోయించుచుండిరి. ఆ జడ భరతుడు ఎల్లపుడు దేహభావము ప్రపంచ భావము లేకుండా బ్రహ్మనిష్ఠలో నుండుటచేత అతను సరిగా మోయనందున రాజుగారికి కోపమువచ్చి అతనితో

'కి మాయాస సహో నత్వం పీవానసి నిరీక్ష్యసే'

నీవు బలిసియున్నావు; ఆయాసమును సహించలేవు కాబోలు అని పరిహాసముగా అనగా జడభరతుడు అందుకు —

'ఆత్మాశుద్ధః అక్షర శ్శాంతః నిర్గుణః
ప్రకృతేః పరః ప్రవృద్ధ్య పచయా
నాస్యైకస్యాఖిల వస్తుషు ।
యదానోపచయ స్తస్య నైవ
చా పచయోనృప ! తదా పీవానసే
త్యేవం కయా యుక్త్యా త్వయోదితం'॥

'ఆత్మ నిర్మలుడు నాశ రహితుడు శాంతుడు నిర్గుణుడు ప్రకృతి విలక్షణుడు సకల వస్తువులయం దాత్మ యొక్కడే. అట్టి యాత్మకు బలియుట, చిక్కుటలు లేవు. నీవు బలిసియున్నావు అని నీవు నన్ను అంటివి. ఇది యేయుక్తిచేత సంభవించును ?' అని జవాబిచ్చెను. అంతట ఆ రాజు ఆధ్యాత్మవిద్యకొరకై వెళ్ళుచున్నవాడుకనుక ఈ జవాబునకు అత్యాశ్చర్యము కలిగి పల్లకి దిగి ఆ జడ భరతునికి నమస్కరించి ఆయనయొద్ద శిష్యునిగాచేరి బోధింపుమనగా, అద్వైత సిద్ధాంతమును బోధించి ఆ రాజును కృతకృత్యునిగా చేసెను. గ్రంథవిస్తర భీతిచే ఆ సంభాషణను వ్రాయలేదు.

ఇంకొక ఘట్టములో :

'విభేదజనకే అజ్ఞానే నాశ మాత్యంతికం గతే
ఆత్మనో బ్రహ్మణో భేద మసంతః కః కరిష్యతి'

జీవేశ్వరులకు భేదమును కలిగించెడి అజ్ఞానము నశించగా, ఆత్మకును బ్రహ్మకును లేనట్టి భేదమును ఎవరు కలిగించగలడు అని జీవేశ్వరుల ఐక్యస్థితి బోధింపబడెను.

## శ్రీమద్భాగవతము

ఈ భాగవతములో మొట్టమొదటి ధ్యాన శ్లోకములోనే 'సత్యం పరం ధీమహి' అని శ్రీ గాయత్రీ మంత్ర ప్రతిపాదకమైన నిర్గుణ పరబ్రహ్మను ధ్యానించి, ఆ శ్లోకములోనే జగత్తు మిథ్య అని స్పష్టీకరించెను. చిట్టచివరి శ్లోకములో గూడ నిటులనే 'సత్యం పరం ధీమహి' అని ముగించెను. ఇట్లు ఉపక్రమోపసంహారముల వల్లనే వ్యాసమహర్షి భాగవతము అద్వైత జ్ఞానబోధకము అని వ్యక్తపరిచెను. ఇంకను మధ్యభాగములలో

'సత్యం పూర్ణ మనాద్యంతం నిర్గుణం
నిత్య మద్వయం'
'ఆత్మ మాయావృతే రాజన్ పరస్యాను
భవాత్మనః । న ఘటేతార్థ సంబంధః
స్వప్నద్రష్టు ర్యథాంజసా॥'

(స్వప్నము చూచువానికి యథార్థముగా అర్థ సంబంధము లేనట్లు జాగ్రద్దశయందు గూడ అనుభవ

స్వరూపమగు నాత్మను ప్రపంచముతో సంబంధము లేదు.)

'ఆత్మనశ్చ పరస్యాపి యః కరోత్యంతరోదరం।
తస్య భిన్నదృశో మృత్యు ర్విదధే భయ ముల్బణం'

(జీవేశ్వరులకు యెవడు ఇంచుకైనను భేదమును చేయుచున్నాడో వానికి మృత్యువు తీక్ష్ణమైన భయమును కలుగచేయును.)

'ఘటే భిన్నే యథాకాశః ఆకాశస్స్యాత్ యథాపురా।
ఏవం దేహే మృతే జీవో బ్రహ్మ సంపద్యతే పునః'

'అహం బ్రహ్మ పరంధామ బ్రహ్మాహం పరమం పదం'

'నిర్గుణే కేవలే సాక్షాత్ ఆత్మనో య ద్విపర్యయః।
సైషా భగవతో మాయా యతేనం నిర్మమే విభుః'

ఇట్లు ప్రతి స్కంధములోను జీవబ్రహ్మైక్యమును జగన్మిథ్యాత్వమును బ్రహ్మయొక్క సత్యత్వమును బోధించు అద్వైత బోధక భాగములు అనేకములు కలవు. దశమస్కంధములోని శ్రీకృష్ణలీలలో శ్రీకృష్ణుడు తల్లికి విశ్వరూపమును చూపించినపుడు, విశ్వయంత్రమును, శ్రీకృష్ణ యశోదలుకూడా ఆ చిన్ని ముఖములో ప్రత్యక్షముగా కనపడినారు. ఇంకను బ్రహ్మ ఆవుదూడలను గోపబాలురను చూచినపుడు, ఆ దూడలు బాలురు ఎట్లుండిరో అట్లే అన్ని ఆకారములను కృష్ణుడు ధరించి ఒక సంవత్సరము కాలము గడిపెను. ఇట్టి కృష్ణలీల లన్నియును, చతుశ్శ్లోకీ భాగవతము, బ్రహ్మస్తవము, శ్రుతిగీతలు మున్నగు భాగములును జగన్మిథ్యాత్వ లక్షణమగు అద్వైతబోధకములే.

## స్కాందపురాణము

'నజీవో జీవకత్ భాతి సాక్షాత్ బ్రహ్మైవకేవలం'
'అధ్యస్తం హి సదాద్వైతం దృశ్యత్వాత్
శుక్తిరూప్యవత్ । దృశ్యత్వం ద్వైత
జాలస్య సమ్మతం సర్వదేహినాం ।
అద్వైతం సర్వదా సత్యం భేదాభావాత్ కథంచన'

మున్నగు అనేక శ్లోకములు జగన్మిథ్యాత్వమును జీవేశ్వరుల అభేదమును నిరూపించుచున్నవి. యోగవాసిష్ఠము త్రిపురారహస్యము మున్నగునవి కేవల అద్వైతబోధకములే. గ్రంథవిస్తరభీతిచే నింతటితో ముగించనైనది.

ఇట్లు పురాణకర్తయైన వ్యాసులవారు పురాణములలో అద్వైతమును బోధించియుండగ ఈ వ్యాసుల వారిచే రచింపబడిన బ్రహ్మసూత్రములలో అద్వైతముకాక ఇంకేముండును ?

ఈవిధముగా విచారించి చూచినచో కావ్యముల లోను సంస్కృత వాఙ్మయ సంతతిలోను అద్వైత సిద్ధాంతమే బోధింపబడినదని స్పష్టపడగలదు.

## మహమ్మదీయుల మతగ్రంథము 'ఖురాన్'

ఈ గ్రంథములో భగవంతుడు (అల్లా) ఈ విధముగ వర్ణింపబడినాడు :

ఖురాన్‌యొక్క ఆంగ్లేయ అనువాదములనుంచి

'There is no deity but He, the Living, the Self Subsistent, the Mighty, the Wise, the Supreme, the Peaceful, the Great etc.'

భగవంతుడు ఒక్కడే అనిన్ని, ఆయనకంటె వేరె దేవతలు లేరనిన్నీ, ఆయన నిత్యుడు, స్వప్రతిష్ఠితుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వోత్కృష్టుడు, శాంతుడు అని ఈ విధంగా వర్ణించి,

'He Allah is one ! Allah the Self Sufficient; He begets not and is not begotten ! And there is not one like Him'.

ఆ భగవంతుడు ఒక్కడే స్వప్రతిష్ఠితుడు (అనగా ఆయనకు ఇంకొక ఆధారము లేదు అని) ఆయనలో నుంచి ఏమి పుట్టలేదు; ఆయన దేనిలోనుంచి పుట్టలేదు. ఆయనవంటివాడు ఇంకొకడు లేడు అని ఉన్నది. ఈ వాక్యములలో 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ', 'సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ', 'నిరాకారం బ్రహ్మ', 'శాంతం బ్రహ్మ' ఇట్టి ఉపనిషత్ సిద్ధాంతములన్నియు ప్రతిబింబించుచున్నవి. ఇంకొక విశేషమేమనగా, భగవంతుడు దేనిలో నుంచి పుట్టలేదని (అజత్వము) వర్ణించుచూ భగవంతునిలోనుంచియును ఏమియు పుట్టలేదు అని కూడా వర్ణింపబడినది; భగవంతునిలో నుంచి ఏమియు పుట్టకపోయినచో మన కంటికి ప్రత్యక్షముగ కనపడుచున్న జగత్తు ఎలా పుట్టినది, జీవుడు ఎలా పుట్టినాడు అను ప్రశ్నలు ఉదయించును. ఈ ప్రశ్నలకు సమాధానముగా జగత్తున్ను, జీవులున్ను ఏదియు భగవంతునిలో నుండి పుట్టలేదు అని ఖురాన్ చెప్పుచున్నది కనుకను, అవి ప్రత్యక్షముగా కనపడుచున్నవి కనుకను, జగత్తు కనపడుచున్నను దేవునికంటె

భిన్నముగా లేదనిన్ని, అనగా జగత్తునకు పృథక్ వస్తుత్వము లేదనిన్ని, అనగా మిథ్య అనిన్నీ, జీవులు వేరువేరుగా కన్పడుచున్నను, భగవంతునిలో నుంచి కాక ఇంకెక్కడి నుంచి పుట్టుటకు వీలులేదు కనుకను, భగవంతుడు కూడ పుట్టించలేడని స్పష్టముగ ఉన్నందునను, ఆ దేవుడే ఈ శరీరములను ఉపాధులలో జీవులుగా వ్యక్తమగుచున్నారు కనుకను, జీవుడు వాస్తవంగా దేవుడే అను జీవేశ్వర ఐక్యమున్ను సిద్ధించుచున్నది. ఇట్లు మహమ్మదీయుల 'ఖురాన్' కూడ అద్వైతమునే బోధించుచున్నది. కాని మహమ్మదీయులకు ఈ విధమైన అద్వైత భావములు సామాన్యులకు లేకపోవుటచేత ఇట్టి ఉన్నతమైన భావములను వారు గ్రహించ లేకున్నారు. కాని వారిలో సూఫీలు (sufis) అను తెగవారు కేవల అద్వైతమునే పరమ సిద్ధాంతముగా అంగీకరించుచున్నారు.

## క్రిస్టియనుల మతగ్రంథము 'బైబిలు'

ఈ గ్రంథములో అనేక భాగములు కేవల అద్వైతమును బోధించును.

### జీవేశ్వర అభేదవాక్యములు

1. 'I and the father are one. The father is in me and I in the father.'

(నేనున్ను దేవుడున్ను ఒకటే. దేవుడు నాలో వున్నాడు; నేను దేవునిలో నున్నాను)

2. 'He that is joined unto the Lord is one spirit.'

(భగవంతుని చేరినవాడు భగవంతుడే)

3. 'Man shall not see me and live'

(జీవుడు నన్ను (అనగ దేవుని) చూచినతరువాత జీవుడుగా నుండడు)

4. 'God became man that man might be made god.'

(దేవుడు జీవుడైనాడు ; ఎందుకంటే జీవుడు తిరిగి దేవుడు కాగలందుకు)

5. 'Thou shalt love thy neighbour as thyself.'

(ఒక జీవుడు ఇంకొక జీవుని తనవలెనే ప్రేమించవలెను. దీనిభావ మేమనగా - ప్రతివానికిని తన యందే తనకు ఉత్కృష్టమైన ప్రేమ ఉండును; ఎందుకనగా ఆత్మ ఆనందస్వరూపము కనుక ప్రతివానికిని తన ఆత్మయందే ఉత్కృష్టమైన ప్రేమ ఉండుట సహజము. ఇంకొకనినికూడ తనవలెనే ప్రేమించుమని బోధించుటలో అట్లు ప్రేమించుట ఎప్పుడు కుదురు ననగా, ఆ ఇతరుడు అని అనుకొన్నవాడుకూడ తానే అయినప్పుడే కుదురును కాని, స్వపరభేద మున్నపుడు కుదరనేరదు. కనుక ఈ వాక్యము ఆత్మైకత్వమును సర్వాత్మభావమును బోధించుచున్నది.)

### జగన్మిథ్యాత్వ బోధకవాక్యములు

1. 'I beheld the other things below thee and I perceived that they neither alltogether are, nor all together are not; for they are since they are from thee; but are not, because they are not what Thou art.'

(దేవా, నీ క్రింది భాగమగు ఈ జగత్తును నేను చూడగా, ఈ జగత్తు దానిలోని వివిధ వస్తువులు ఉన్నవి అనుటకు వీలుకాకున్నది, లేవు అనుటకును వీలుకాకున్నది; అవి ఉన్నవని యెందుకు అనుకొంటున్నానంటే నీవు కారణముగా అవి ఉన్నవికనుక; లేవు అని ఎందుకు అనుకుంటున్నానంటే, నీ లక్షణములు, నిత్యత్వాదులు ఏమియూ వానిలో లేవు కనుక.)

ఈ విషయమే అద్వైత విచారణలో విశదీకరింపబడినది. జగత్తు ఉన్నదనుటకు వీలులేదు. బ్రహ్మవలె నిత్యముకాక మారుచున్నది కనుక; లేదనిచెప్పుటకును వీలులేదు, కనబడుచున్నది కనుక. ఇట్లు ఉన్నదనికాని లేదనికాని చెప్పుటకు వీలులేనట్టిదానినే అనిర్వచనీయ మనిన్నీ, మిథ్య అనిన్నీ అందురు. కనుక బైబిలులోని ఈ వాక్యములో జగన్మిథ్యాత్వము బోధింపబడినది. ఇంకను ఈశ్వరుడు ఎట్టి మార్పులు లేని నిర్వికారుడు అనిన్ని సూచింపబడినది.

2. 'There is neither Greek nor Jew, neither circumcision nor uncircumcision, neither bondage nor freedom, neither male nor female, for all are one in God, who is not only in all but also is all.

(గ్రీకు అని జ్యూ అని అనువార లెవరూ లేరు; కర్మ కాని కర్మభావముకాని లేదు, బంధముకాని మోక్షముకాని లేదు. పురుషుడు కాని స్త్రీ కాని లేదు. అంతా దేవునిలోనే వున్నది, అంతా దేవుడే.) మాండూక్యోపనిషత్తులోని గౌడపాద కారికలలో

'న నిరోధో నచోత్పత్తిః నబద్ధో నచ సాధకః ।
నముముక్షుర్నవై ముక్తః ఇత్యేషా పరమార్థతా॥'

అను శ్లోకములో పై భావము ఉండియున్నది. ఉన్నది ఒక్క దేవుడే తప్ప ఇంకేమీ లేదు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'నేహనా నాస్తి కించన' అను ఉపనిషత్తుల భావము పై వాక్యములో వ్యక్తము చేయబడినది. కనుక జగత్తుగా కనపడునది వాస్తవంగాలేదు అనిన్ని, ఈ దేవుడే ఇలా కనపడుచున్నాడనిన్ని తెలియుచున్నది.)

3. 'Love is unique; because it makes of the twain – you and me – one new man and so gives the lie to the dualism of the world as real in itself.'

(ప్రేమ అనునది విలక్షణమైనది. ఎందుకనగా, నీవు నేను అను భేదబుద్ధిని ఆ ప్రేమ తీసివేసి ఉభయులను ఏకము చేయుచున్నది; దీనిచేత ప్రపంచములో కనపడుచున్న ద్వైతము వాస్తవము కాదని తేలుచున్నది).

4. 'I am the root and offspring; the cause and the effect; the creator and the created'

(మూలము దాని సంతానము నేనే; కారణము కార్యము నేనే; సృష్టికర్త, సృష్టి నేనే.)

ఇట్లు కార్యకారణములు వేరుగా కన్పడినను సృష్టి, సృష్టికర్త వేరుగా కన్పడుచున్నను, ఆ రెండును నేనే అని అనుటవల్ల సృష్టికర్తయైన భగవంతునికంటె సృష్టి లేక జగత్తు వేరుగా లేదనిన్ని మనకు వేరుగా కన్పడు జగత్తు వాస్తవంగా భగవంతుడే అనిన్ని తెల్పుచున్నందున జగత్తు మిథ్య అని సూచింపబడుచున్నది.

5. 'God made foolish the wisdom of the world, because it is of the image.'

(ప్రపంచములోని విజ్ఞానసంతతియు అజ్ఞానమే కాని జ్ఞానముకాదు; ఎందుకనగా ప్రపంచమే అజ్ఞాన కార్యమైన ప్రతిబింబము కనుక).

ఈ వాక్యములో జగత్తు మిథ్య అనిన్ని, ఈ జగత్తులోని వివిధ విషయములకు సంబంధించిన విజ్ఞానసంతతియు అవిద్యారూపమే యనిన్ని అద్వైత సిద్ధాంతమున స్పష్టీకరింపబడింది.

6. 'God is the only Reality; and we are only real in so far as we are in His order and He in us'.

(భగవంతుడు ఒక్కడే సత్యమైన వస్తువు. మనము ఆయన సృష్టిలో నున్నాము కనుకను, ఆయన మనలో ఉన్నాడు కనుకను, మనముకూడ ఉన్నట్లుగా అనుకొనుచున్నాము.)

7. 'If any man thinketh that he knoweth any thing, he knoweth not'

(ఎవరైనను తనకు తెలుసును అనుకునేయెడ వాడు తెలియనివాడే.)

ఈ వాక్యము కేనోపనిషత్తులోని 'మతం యస్య నవేదసః' 'అవిజ్ఞాతం విజానతాం' యని 'మన్యసే సు వేదేతినో నవేదేతి' అను వాక్యముల భావమై యున్నది. తెలుసును, అని అనుకునేవాడు తెలియనివాడే అని ఎందుకు చెప్పబడినదనగా, ఇప్పుడు తెలియబడే విజ్ఞానసంతతియు ప్రపంచమునకు చెందినదేకాని భగవంతునికి చెందినది కాదుకనుకను, ప్రపంచము సత్యమైనది కాదుకనుకను అందుకు సంబంధించిన విజ్ఞానము అవిద్యయే కనుకను ఆత్మ తెలియబడేది కాదు కనుకను అట్టివాడు తెలియనివాడే; అనగా ఆత్మజ్ఞానమే జ్ఞానము కాని అన్యముకాదని ఆ వాక్య తాత్పర్యము.

8. 'To be absent from the body is to be at home with the Lord'

(జీవుడు దేహములో లేనప్పుడు దేవునిలో ఉన్నాడు. అనగా దేహమే నేను అనుభావము పోయినపుడు ఆత్మ సాక్షాత్కారమగును.)

దేహమే నేనను అధ్యాసచేతనే యీ సంసారము దుఃఖము సంభవించినదనియు, ఆ అధ్యాస పోగానే జ్ఞానోదయమై ఆత్మసాక్షాత్కారమయి జీవన్ముక్తుడగుననిన్ని చెప్పు అద్వైతభావమే యీ వాక్యములో స్పష్టీకరింపబడినది. ఇట్లు 'బైబిలులోకూడ అద్వైత భావము లుండుటచేత, బైబిలు ప్రకారం కూడ జగజ్జీవేశ్వరుల తత్త్వము అద్వైతమే అని తేలుచున్నది.

## యుక్తివిచారణ

ఇంతవరకు గ్రంథప్రమాణము ననుసరించి, ఆ యా గ్రంథములు బోధించు విషయముల విమర్శించి ఆ యా గ్రంథములన్నియు జగజ్జీవేశ్వరుల తత్త్వమును అద్వైత సిద్ధాంతానుసారముగనే బోధింపుచున్నవని నిరూపింపబడినది. ఇకను గ్రంథప్రమాణ సంబంధము లేకాకుండా కేవల యుక్తిమీద జగజ్జీవేశ్వరుల తత్త్వము ఏమయి యుండుననను విషయము విచారింపబడును.

1. ఆస్తికమతములన్నియు దేవుడు ఉన్నాడు అని ఒప్పుకొనుచు అట్టి దేవుడు ఒక్కడే అనియు, ఆయన పుట్టుక నాశము లేని నిత్యుడనియు, సర్వజ్ఞుడు, సర్వశక్తి గలవాడు, సర్వవ్యాపకుడు (omniscient, omnipotent, and omnipresent) అనియు అంగీకరించుచున్నవి. ఇట్లు దేవుడు సర్వవ్యాపకుడు కాక పరిచ్ఛిన్నుడే అయినను, పుట్టుకకలవాడు అయినను, అవయవములు కలవాడు అయినను, అట్టి వస్తువులు అన్నియు నశించుచున్నట్లు అందరు అంగీకరించుచున్న విషయమే కనుక, దేవుడును నశించువాడగును. అట్లు దేవుడు నశించువాడనుటకు ఎవరును ఒప్పుకొనరుగదా? ఇంకను నశించే దేవుని ఆశ్రయించినచో మనకుమాత్ర మేమి ప్రయోజనముండును? కనుక దేవుడు నశించని నిత్యుడై యుండవలెను. అట్టి నిత్యత్వము దేవునికి ఉండవలెనన్న, ఆయన పరిచ్ఛిన్నుడు కాక అపరిచ్ఛిన్నుడు సర్వవ్యాపకుడుగాను పుట్టుక కలవాడుకాక పుట్టుకలేనివాడుగాను, అవయవములు కలవాడుగాక నిరవయవుడుగాను ఉండవలెను. ఇంకను జడపదార్థములు నశించుచున్నవి కనుక దేవుడు నశించకుండా ఉండవలెనని జ్ఞానస్వరూపుడుగా నుండవలెను. ఇంకను దుఃఖమును పోగొట్టుకొనుటకు ప్రతివాడును ప్రయత్నించును కనుకను, ఆనందమును వాంఛించును కనుకను భగవంతుడు అట్టి ఆనందస్వరూపుడైతేనే ఆయనను భజించిన జీవుడుకూడ ఆనందరూపుడై తరించును.

ఇట్టి లక్షణములు గలవాడు భగవంతుడు అని తేలుచున్నది. ఇట్లు దేవుడు నిత్యుడై అపరిచ్ఛిన్నుడై సర్వవ్యాపకుడే అయినచో ఆయనలేనికాలము లేదనియు, ఆయనలేని ప్రదేశము లేదనియు. ఆయనలేని వస్తువు లేదనియు తేలుచున్నది.

Two things cannot occupy the same place at one and the same time. అనగా ఒకే ప్రదేశమును ఒకే కాలములో రెండు వస్తువులు ఆక్రమించనేరవు అను న్యాయము ననుసరించి, దేవుడు సర్వత్ర నిండియున్నాడు కనుకను, దేవుడు లేని ప్రదేశమే లేదు కనుకను జగత్తు ప్రత్యేక వస్తువు అయి నిత్యమైనదయినచో అది ఎక్కడ నిలుచుటకు అవకాశమున్నది? జగత్తు ఉండుటకు వేరే ప్రదేశమే లేదుకదా! పోనీ జగత్తు లేదని అందామా అంటే, ప్రత్యక్షముగ కనపడుచున్నదిగదా! ఎట్లులేదనగలము? పోనీ ప్రత్యేకవస్తువుగా ఉన్నది అని అనుటకు, అది ఉండుటకు వేరే ప్రదేశమే లేదు. కనుక దేవుడు ఉన్నచోటనే జగత్తు ఉన్నది అని అనవలెను, అప్పుడు రెండును సత్యవస్తువులు అయినచో అట్లు రెండును ఒకేచోట ఒకేకాలములో వుండుట అసంభవము కనుకను, దేవుడు నిత్యుడైన వస్తువుకనుకను, జగత్తు సత్యవస్తువుకాకుండా ఉండవలెను. అట్టి సత్యవస్తువు కాకుండా కనపడుదానినే మిథ్య అని అందురు. కనుక ఈవిధముగాను జగన్మిథ్యాత్వము సిద్ధించినది.

2. కనపడునదంతయు నశించుచున్నట్లు మనకందరికిని అనుభవములోనున్నది. స్వప్నమిందుకు దృష్టాంతము. దేవుడు కనపడేవాడైనచో దేవుడుకూడ నశించవలసి వచ్చును. కాని దేవుడు నశించువాడని ఎవ్వరును ఒప్పుకొనరు. అట్లు దేవుడు నశించనివాడే అయినచో కనపడు దృశ్యకోటిలో పడకూడదు. ఎవరైనను మేము దేవుని చూచినామని చెప్పినచో అట్లు వారికి కనపడినది వారి మనఃకల్పిత వస్తువే కాని దేవుడు కాడని నిశ్చయింపవచ్చును. కనుక అట్టి దృశ్యముకాని దేవుడు దృక్కుగా నుండవలెను. దృక్కు అనగా చూచేవాడు. ఎవరికి వారు 'మేము చూచుచున్నాము' అనునపుడు చూచునది, గ్రహించునది ఈ దేహము ఇంద్రియములు మనస్సుకాక, ఆత్మయేకదా. కనక దేవుడు ప్రతి జీవునిలోని ఆత్మయే అని తేలుచున్నది. ఇట్లు జీవ బ్రహ్మలకు అభేదము సిద్ధించి అద్వైతము తేలినది.

3. దేవునిలోనుంచి జీవులు కాని జగత్తు కాని పుట్టేయెడల, దేవుడు అవయవములు గలవాడుగా నుండవలెను. దేవునిలోనుంచి కొంత భాగము విడిపోవలెను. ఇట్లు దేవుడు పరిచ్ఛిన్నుడు, అవయవములు కలవాడు అయినచో దేవుడు నశించును కనుక దేవుని లోనుంచి జీవులు కాని జగత్తు కాని పుట్టనే లేదని తేలుచున్నది. పుట్టనిచో జీవులు, జగత్తు కనపడుచున్నవే అంటే, జగత్తు వస్తుత్వము లేకుండా భాసించు మిథ్యా పదార్థమని చెప్పుకొన్నాముగదా ఇకను జీవుని విషయమై ఆలోచింపవలసియున్నది. జీవుడు చైతన్యము కలవాడు కనుక జడమైన జగత్తువలె నిశ్చయించుటకు వీలులేదు. ఇకను జీవుని స్వరూప స్వభావములను గురించి విచారించినచో, దేవుడు చైతన్య స్వరూపుడై సర్వవ్యాపకుడయి అన్నింటిలోను ఉన్నాడు కనుక, అట్టి దేవుడు యీ జీవునిలోకూడా ఉన్నాడని తేలుచున్నది. ఈ జీవునిలో లేకపోయినచో ఆ దేవుని

సర్వవ్యాపకత్వమునకు భంగమువచ్చి దేవుడుకూడ పరిచ్ఛిన్నుడై నశించిపోవలసివచ్చును. కనుక దేవుడు జీవునిలోకూడ నున్నాడని ఒప్పుకొనితీరవలెను. కనుక జీవునిలోని చైతన్యము దేవుడే అని తేలుచున్నది. అనగా జీవుడు=లోపలి చైతన్యము+దేహము, రెండును కలిసికదా. దేహము జగత్తులోని జడమైన భాగము కనుకను, జగత్తు మిథ్య అని తేలినది కనుకను, దేహమున్నూ వస్తువు కాక మిథ్యయే అయినది కనుకను, జీవునిలోని చైతన్యము, అనగా జీవుడు వాస్తవస్థితిలో ఆ దేవుడే అని అద్వైతభావము వ్యక్తమగుచున్నది.

4. ఇకను ఆ దేవుడు సగుణుడా, లేక నిర్గుణుడా. అద్వైతులు మాత్రము నిర్గుణుడు అని అందురు? ద్వైత, విశిష్టాద్వైతులు సగుణుడందురు. దేవుడు సగుణుడే అయినచో సగుణశబ్దార్థ మేమి? సగుణుడు అనగా గుణముతో కూడుకొన్నవాడు అని అర్థము. ఇంటితో కూడుకొన్నవాడు, ఇల్లుతానుకాక వేరుగా నున్నట్లుగాను, చొక్కాతోకూడుకొన్నవాడు తాను చొక్కాకాక వేరుగానున్నట్లుగాను, గుణముతో కూడుకొన్న దేవుడు తాను గుణముకాక గుణముకంటె వేరుగ నున్నాడని స్పష్టమగు చున్నది. గుణముకంటె భిన్నముగనున్నాడనగా గుణములేని నిర్గుణుడు అనియే కదా అర్థము. కనుక దేవుని అసలు స్వరూపము నిర్గుణమే అని తేలుచున్నది. ఇంకను గుణము నిర్గుణ వస్తువును ఎప్పుడును అంటలేదు కనుకను (బురద ఆకాశమును అంటలేనట్లు) ఆ నిర్గుణదేవుడు ఎప్పుడును అసంగుడే కనుకను, ఏగుణము ఎప్పుడును ఆ నిర్గుణ రూపదేవుని అంటనేరదు. అనగా ఆయన ఎన్నటికిని ఏవిధముగాను సగుణుడు కానేరడు. అయితే గ్రంథములలో దేవుడు సగుణుడుగా కూడా వర్ణింపబడి యున్నాడే అని అంటే అట్టివర్ణన మందమధ్యమాధికారుల కొరకై కల్పించబడినదే కాని వాస్తవము కానేరదు. కనుక దేవుడు నిర్గుణుడు అను అద్వైత సిద్ధాంతమే యుక్తిసహమగు చున్నది.

5. ద్వైతమను శబ్దముకూడ యుక్తికి నిలవనేరదు. అదెట్లనగా- ద్వైతమనగా రెండుగా నుండుట. రెండు వస్తువులు ఉంటే ద్వైతము అని అందురు. వస్తువులు రెండుగా నున్నవని ఎప్పుడు అంటాము అంటే, ఆ రెంటికిని ఏ కొంచెమో భేదము ఉన్నపుడే. భేదము ఎప్పుడు ఉండునుఅంటే, రెండు వస్తువులుఉన్నపుడే. అనగా భేదము అనుశబ్దమే రెండువస్తువులు ఉన్నపుడు ప్రయోగింపబడును కాని లేనపుడుకాదు. కనుక భేదము ఉంటేనే కాని రెండుతనము (అనగాద్వైతము) లేదు. రెండుతనము (ద్వైతము) ఉంటేనే కాని భేదము లేదు. ఇట్లు ఆ రెంటికిని అన్యోన్యాశ్రయాదోషము పట్టునది కనుక ద్వైతము అను శబ్దమే యుక్తిమీద వి[illegible]కను నిలువనేరదు. కనుక అద్వైతమే సిద్ధాంతము

6. ద్వైత, విశిష్టాద్వైతమతములవారు జగత్తు సత్యమని అందురు; ఇంకను జీవులలో నానాత్వము సత్యమనియు అందురు. పైన చూపిన యుక్తులప్రకారము జగత్తు, జీవులు సత్యమే అయినచో, దేవునివలె సత్య వస్తువు కనుక దేవుడు పరిచ్ఛిన్నుడు కావలసి వచ్చును; అట్టి దేవుడు నశించిపోవలసి వచ్చును. కనుక జగత్తు జీవులు సత్యమను సిద్ధాంతము దేవుని నిత్యత్వమునకు భంగకరమగుచున్నది కనుక సరియైనది కాదు. ఇంకను ద్వైతమతాచార్యులగు శ్రీమధ్వాచార్యులు చెప్పినట్లు దేవునికిని జీవునికిని భేదము, జీవునికిని దేవునికిని భేదము, ఒక వస్తువునకు యింకొక వస్తువునకును భేదము, జీవునికిని జగత్తునకు భేదము, దేవునికిని జగత్తునకును భేదము అను పంచ భేదములు ఏమాత్రముకూడ చదువురాని వెర్రివానికిని విదితమైయున్నవి. ఇట్లు ఆబాలగోపాలమునకు స్పష్టముగా కన్పడు విషయమై ఉపనిషత్తులు, వేదములు, శాస్త్రములు, అవతారపురుషులు, ఆప్తపురుషులు బోధింప నవసరమే ఉండనేరదుగదా! సామాన్యముగ జీవునికి తెలియని విషయాలను బోధించుటకయ్యే శాస్త్రము, గురువు కావలసివచ్చును. కనుక అద్వైత సిద్ధాంతము తప్ప యితర సిద్ధాంతములు యుక్తికి నిలువనేరవు.

7. ఇక ముక్తిని గురించి విచారించినను ద్వైతులకు ముక్తిసాలోక్యము, సామీప్యము; అనగా ముక్తుడైన జీవుడు ఆ భగవంతుని లోకములోను, ఆ భగవంతుని సమీపములోను ఉండి, ఆయనను సేవించుచుండును. విశిష్టాద్వైతులకు ముక్తియనగా ఆ భగవంతుడగు మహా విష్ణువుయొక్క సారూప్యము పొందుట. అనగా విష్ణువుయొక్క రూపముకలిగి ముక్తుడైనవాడు ఆయనను సేవించుచూ ఆనందించును. అద్వైత ముక్తియనగా సాయుజ్యము, కైవల్యము; దీని ప్రకారము ముక్తుడైన జీవుడు ఆ బ్రహ్మయే అగును. అజ్ఞాన దశలో తాను బ్రహ్మకంటె భిన్నుడు అని అనుకొన్న జీవుడు జ్ఞానోదయముకాగానే తాను ఆ బ్రహ్మయే అని అభేదమును సాక్షాత్కరించుకొనును. బ్రహ్మ సచ్చిదానంద స్వరూపుడు కనుక అద్వైతముక్తు

డున్న సచ్చిదానంద స్వరూపుడు అగును. కాని ద్వైత, విశిష్టాద్వైతముల ప్రకారము ముక్తులైన వారలు ఆ మహా విష్ణువుకంటె భిన్నులుగనుందురు కనుకను, వీరికంటె ఆ మహా విష్ణువు ఉత్కృష్టతగలవాడు కనుకను, వీరలకు అభయస్థితి కలుగనేరదు. మనకంటె గొప్పవానిని చూచినపుడు మనకు భయము కలుగుట సహజముకదా. ఈ భావమునే 'ద్వితీయాద్వై భయం భవతి' అని ఉపనిషత్తున్ను చెప్పుచున్నది. ఇది యుక్తినిబట్టికూడ తేలుచున్నది గదా. కనుక ముక్తి స్థితియందుగూడ భయమునకు అవకాశమున్నచో ఆ స్థితిని ముక్తి, మోక్షము అని ఎట్లు వర్ణింపవీలగును? మోక్షమనగ అభయస్థితియే. అట్టి అభయస్థితి తన కంటె వేరేవస్తువు లేకుండా తాను సర్వవ్యాపకుడైన సచ్చిదానంద వస్తువు అయితేనే కలుగును. కాని అన్యథా కలుగనేరదు. కనుక ముక్తి స్వరూపస్వభావ మును పరిశీలించినను అద్వైతమే సిద్ధాంతమని తేలుచున్నది.

8. స్వప్నదృష్టాంతమును బట్టి జగత్తు మిథ్యయని తేలుచున్నది. అదెట్లనగా - స్వప్నములో దృక్కు, దృశ్యము, అనగా చూచేవాడు, చూడబడునది అనునవి ఉన్నవి. జాగ్రద్దశలోకూడ చూచేవాడు, చూడబడు నది అనునవి ఉన్నవి. ఈరెంటిలో స్వప్నములోని దృశ్యమంతయు మిథ్యయని అందరకును తెలిసిన విషయమే. ఏలనగా, జాగ్రద్దశలోనికి వచ్చేటప్పటికి ఆ స్వప్నదృశ్యమునకు సత్యత్వములేదని స్పష్టమైనది కనుక. ఇప్పుడు జాగ్రద్దృశ్యమగు జగత్తు మిథ్యయా సత్యమా అను మీమాంస వచ్చినపుడు, 'జగత్ మిథ్యా దృశ్యత్వాత్, స్వప్నదృశ్యవత్' అని అనుమాన (inference) ప్రమాణముచేత సిద్ధించుచున్నది. దృశ్యత్వము అనునది హేతువుగ గ్రహింపబడినది. కనబడునదంతయు మిథ్యయే; ఎందుకనగా, కనబడు చున్నది అను హేతువునుబట్టి; దీనికి దృష్టాంతమేమి? స్వప్నమే దృష్టాంతము; స్వప్నములో కనపడిన దంతయు మిథ్యయని తేలినదికనుక. మనకు రెండు విధములగు దృశ్యములున్నవి. జాగ్రద్దృశ్యమైన ఈ జగత్తు; రెండవది స్వప్నదృశ్యమైన స్వాప్నిక జగత్తు. ఈ రెండువిధముల దృశ్యములుకంటె ఇంకొక దృశ్యములేదు. మనకు కనపడుపదార్థము లన్నియు జాగ్రత్ ప్రపంచములోనివే కనుక జాగ్రద్దృశ్యము క్రిందికేవచ్చును. జాగ్రద్దృశ్యమైన జగత్తు సత్యమా మిథ్యయా యను తగాదా వచ్చినపుడు, తగాదా విషయమునకు సంబంధించనివాడు సాక్షిగా వచ్చి సాక్ష్యము చెప్పవలెనేకాని ఇతరుడు పనికిరాడుకదా. జగత్తులోనివారందరు విచారణీయమైన సారాంశము లోని (issue) వారేకనుక వారి సాక్ష్యముపనికి రాదు. ఇకను ఈ జాగ్రత్ ప్రపంచమునకు సంబం ధించని సాక్ష్యము ఏది యనగా స్వాప్నిక ప్రపంచ సాక్ష్యమే. అట్టి సాక్ష్యము దృశ్యమైనదంతయు మిథ్యయేకాని సత్యముకాదని నిరూపించుచున్నది. అందుకు భిన్నమైన సాక్ష్యమింకొకటిలేదు. కనుక ఆ నిర్దుష్టమైన సాక్ష్యముమీద జగత్ మిథ్యయేయని తీర్మానించవలసి యున్నది. ఇంకొక త్రోవలేదు.

9. ఇంకొక యుక్తిచేతనుగూడ జగన్మిథ్యాత్వము సిద్ధ మగును. జాగ్రదవస్థలో జీవునియొక్క మనస్సు ఇంద్రి యములు పనిచేయుచున్నకాలములోనే ఈ జాగ్రత్ జగత్ కనపడుచున్నది. స్వప్నములో ఇంద్రియములు పనిచేయకపోయినను మనస్సు పనిచేయున్నది కనుక స్వాప్నిక జగత్తు కనపడుచున్నది. కాని సుషుప్తిలో మనస్సు పనిచేయుటలేదు. అప్పుడు జగత్తు కనపడుట లేదు. దీనినిబట్టి మనస్సు ఉన్నప్పుడే జగత్తు కనపడు చున్నది; మనస్సు లేనపుడు జగత్తు కనపడుటలేదు. అని తేలుచున్నది. 'యత్ సత్త్వే యత్సత్త్వం యద భావే యదభావః' అను న్యాయమునుబట్టి జగత్తు అంతయు మనఃకల్పితమని తేలుచున్నది. మనఃకల్పిత మంతయు మిథ్యయే కదా; అట్టి దెప్పుడును సత్యము కానేరదు.

10. ఇంకను జీవునికి జాగ్రదవస్థలో గనపడు ప్రపంచము స్వప్నంలో కనపడుటలేదు; స్వప్నములో కనపడు ప్రపంచము జాగ్రదవస్థలో కనపడుటలేదు. ఈ రెండురకముల ప్రపంచములు సుషుప్తిలో కనపడుట లేదు. సుషుప్తిలో జీవుడు స్వపితి = స్వం అపీతో భవతి, అనగా తన స్వస్వరూపములో నుంటాడు. అను లక్షణమునుబట్టి, సుషుప్తి జీవునికి స్వస్థానము. దానిలోనున్నపుడు ఈ జగత్తు అతనికి భాసించుటలేదు. జీవుడు సుషుప్తిలో లేడా అంటే, మెలకువ చెందిన తరువాత 'హాయిగా నిద్రించినాను' అను స్వానుభవమును ప్రకటించుట చేత తాను ఉన్నాడనిన్ని, తన నిజస్వ రూపముఆనందమేకనుక, అట్టిఆనందమును అనుభవించు చున్నాడనిన్ని స్పష్టమగుచున్నది. ఇంకను జీవుడు రాత్రి దీపములన్నింటిని తీసివేసి నిద్రించిన కాలములో స్వప్నమురాగా ఆ స్వప్నములో వెలుతురు కన పడుచూ అట్టి వెలుతురు సహాయమున దేశదేశములను.

తిరిగి వ్యవహరించుచున్నారు. అప్పుడు ఆ జీవునికి స్వప్నములో కన్పడిన వెలుతురు బాహ్యవెలుతురు కాదు కనుక ఆంతరంగికమైన ఆత్మతేజస్సే అని తెలుచున్నది. ఇట్లు ఆత్మ స్వయంప్రకాశుడై సుషుప్తిలో ఆత్మానందమును అనుభవించుచూవున్న కాలములో యీ జాగ్రత్ ప్రపంచము కనుపించుటలేదు. సుషుప్తిలో కనపడక, జాగ్రదవస్థలో కనపడి, తిరిగి సుషుప్తిలో కనపడని జగత్తు ఎట్టిదనగా, 'ఆదావంతేచ యన్నాస్తి వర్తమానేపి తత్తథా' అను న్యాయమునుబట్టి ఆదియందు, అంతమందు లేక మధ్యకాలములో మాత్రమే భాసించు వస్తువు మధ్యకాలములో కూడ వాస్తవంగా లేనిదే అనిన్ని వస్తుత్వము లేకుండా భాసించు స్వాప్నిక జగత్తువంటిదే అనిన్ని, అందుచేత మిథ్యయనిన్ని తెలుచున్నది.

11. ఇట్టి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడున్ను సమాధిలో కనపడుటలేదు. సుషుప్తిలో జీవునికి కారణశరీరము అను అవిద్యావరణ ఉన్నది. అదెట్లు తెలుసును అనగా నిద్రలో 'హాయిగ నిద్రించినాను' అను సుఖానుభవముతోపాటు, 'ఏమి తెలియలేదు' అను అజ్ఞానానుభవముకూడా ఉన్నదికదా. జాగ్రదవస్థలో జాగ్రత్ ప్రపంచము దృశ్యమైతే, స్వప్నావస్థలో స్వాప్నిక ప్రపంచము దృశ్యమైతే, సుషుప్తిలో అజ్ఞానము దృశ్యమైనది. అందుకనే అట్టి అజ్ఞానానుభవమును జీవుడు వ్యక్తం చేయుచున్నాడు. కాని ఈ మూడు రకముల దృశ్యములను తురీయావస్థలో సమాధి స్థితిలో కనపడక జీవుడు తన నిజస్వరూపము అయిన సచ్చిదానంద స్థితిలో వుంటున్నాడు. అట్టి జీవుడు యీ నాలుగు అవస్థలలోను నిర్వికారుడుగ నున్నాడు. కాని ఈ అవస్థలు మారుచున్నవి. ఇట్టి మారునవన్నియు సత్యములు కాక మిథ్యలనిన్ని, ఎట్టి మార్పులులేకుండా త్రికాలములలోను సత్యముగా భాసించునది ఆత్మయొక్కటే అనిన్ని దీనివల్ల స్పష్టపడుచున్నది. అట్లు త్రికాలములలో మారక సచ్చిదానంద రూపముగునది బ్రహ్మయేకదా. ఇప్పుడు ఆత్మకూడా అట్టి నిర్వికార నిత్య సచ్చిదానందరూపుడని తేలినది కనుకను, అట్టి నిత్యత్వము గలిగిన వస్తువులు రెండు ఉండుటకు వీలులేదు గనుకను (ఉండినచో రెండును పరిచ్ఛిన్నములై అనిత్యములగును) ఈ జీవుని వాస్తవ స్వరూపము బ్రహ్మయే అని తేలుచున్నది. ఈ విధముగాను 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః' అను అద్వైత సిద్ధాంతము రుజువు అగుచున్నది.

12. ఇంకను జీవుని వాంఛలనుబట్టియే [illegible] వాస్తవంగా సచ్చిదానందస్వరూపుడు అని [illegible]. అదెట్లనగా—ఏ మానవుడును చనిపోవుటకు [illegible]రింపడుకదా; ఎల్లప్పుడును జీవించియే యుండవలె[illegible] వాంఛ ప్రతి మానవునికిని దృఢముగానున్నది. ఆ [illegible] చేత నవగా జీవునియొక్క వాస్తవమైన స్వరూపము చావులేని నిత్యమైన సత్యస్వరూపము కనుక. [illegible] జీవునికి ప్రతి వస్తువును గురించియు సర్వమును తెలిసికొనవలెనను వాంఛయును ఉన్నది. ఇదెందుచేత నవగా జీవుడు వాస్తవముగా జ్ఞానస్వరూపుడు [illegible]. ఇదియునుకాక ప్రతిమానవుడును దుఃఖమును [illegible] కొనుటకును, సుఖము లేక ఆనందమును పొంద [illegible] వాంఛించును. ఇదెందుచేత ననగా జీవుని వాస్తవ స్వరూపము ఆనందమే కనుక. ఇట్లు ప్రతి జీవుని వాంఛలనుబట్టి ప్రతి జీవుడును వాస్తవముగా సచ్చిదానంద స్వరూపుడేయని స్పష్టమగుచున్నది. ఈశ్వరుడు లేక బ్రహ్మ సచ్చిదానంద స్వరూపుడే అయ్యుండవలెను అని పైన మనము తీర్మానించియున్నాము కనుకను, అట్టి సచ్చిదానంద [illegible] గల వస్తువులు రెండు ఉండనేరవు కనుక, జీవబ్రహ్మైక్యము యీ విధముగా కూడా సిద్ధించి అద్వైతమే తత్త్వమని తేలినది.

13. జగత్తు పుట్టినచో స్వయముగ పుట్టినదా, లేక మరియొకదానిలోనుండి పుట్టినదా ? అను [illegible] విచారింపబడుచున్నవి. జగత్తు పుట్టుటకు స్వభావము కారణమని యందురు. స్వభావము అను శబ్దమునకు అర్థమేమి? 'స్వస్మాత్ భావః స్వభావః' అనియా ? లేక 'స్వస్యభావః స్వభావః' అనియా ? 'స్వస్మాత్ భావః' అనినచో, జగత్తు దానిలోనుంచియే అది పుట్టినదని చెప్పవలసియుండును. దానిలోనుంచి [illegible] పుట్టుట అసంగతము. కుండలోనుంచికుండ పుట్ట నేరదు గదా. అట్లు పుట్టినదన్నచో కర్మకర్తృ విరోధము వచ్చును; అనగా కర్త కర్మ రెండు ఒకటే కావలసివచ్చును. ఇది అసంగతము కనుక దానిలో నుంచియే అది పుట్టదు; ఏ వస్తువైనను పుట్టక పూర్వము అది ఏలాగు ఉండును? పుట్టిన తరువాతనే దాని స్వరూపము వ్యక్తమగును. కనుక దానిలోనుంచి అదే పుట్టుట కుదరదు.

'స్వస్య భావః స్వభావః' అనినచో, [illegible] అదే అట్లు అడుగును అనినచో, కారణము లేకుండా కార్యము పుట్టినదని చెప్పవలసి యున్నది. ఇట్లు

కారణము లేకుండా కార్యము పుట్టుటకు దృష్టాంతమే యెక్కడనులేదు. కనుక ఈ పద్ధతిని అంగీకరింపవీలులేదు. కనుక జగత్తు స్వయముగా పుట్టలేదని స్పష్టమగుచున్నది. ఇకను మరియొక దానిలోనుండి పుట్టినచో, దేనిలోనుంచి పుట్టినదో, అది ఇంకొకదానిలోనుంచి, అది మరియొకదానిలోనుంచి అని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పినచో అనవస్థాదోషము పుట్టును కనుక అట్లు చెప్పరాదు. జగత్తు దేనిలోనుంచి పుట్టిందో ఆ వస్తువు పుట్టుకలేని వస్తువు అని చెప్పినచో పుట్టుకలేని వస్తువు నిరవయవము అపరిచ్ఛిన్నము అయి యుండవలెను కనుక అట్టిదానిలోనుంచి జగత్తుకాని ఇంకేమికాని పుట్టుటకే అవకాశములేదు అందుకు దృష్టాంతములేదు. ఆ పదార్థము ఇంకను సత్తు అయినను కావలెను, లేక అసత్తు అయినను కావలెను. లేక సదసత్తు అయినను కావలెను. ఈ మూడుకంటె ఇంకొక వికల్పములేదు. కాని ఈ మూడును కుదరవు. ఏలనగా – సత్తు అనునది నిర్వికారముకనుక దానిలోనుంచి జగత్తుపుట్టుటకువీలులేదు. అది అసత్తు అయినచో, అట్టి శూన్యములోనుంచి దృశ్యమానమగు జగత్తు పుట్టనేరదు. ఇక్కడ కేవలము సత్తుకాకుండా, అసత్తుకాకుండా రెండునుకలసి సదసత్తు అను వస్తువు అసలే వుండనేరదు; ఏలననగా సత్తుయును అసత్తుయును పరస్పరము విరుద్ధస్వభావములు కలవి కనుక. ఈ విధముగా ఆలోచించినచో జగత్తు స్వయముగాను పుట్టలేదు, ఇంకొకదానిలోనుంచి పుట్టలేదనిన్ని, తేలుచున్నది. పోనీ, పుట్టలేదు కనుక 'సత్' కాకూడదా అంటే వికారమును, కార్యమును అగుటవలనను, జడమును దృశ్యమును అగుటవలనను, జగత్తు సత్తుకాదు. పోనిండు సత్తుయా అంటే కనపడుచున్నది కనుక అసత్తునూకాదు. కనుక మిథ్య అని అనవలసియున్నది. ఈ విధముగాను జగత్తు మిథ్య అని తేలుచున్నది.

14. జగత్తు పుట్టినచో, ఉన్నవస్తువు పుట్టుచున్నదా, లేక, లేనిది పుట్టుచున్నదా? అను ఇంకొక ప్రశ్న ఉన్నది. సాంఖ్యులు ఉన్నవస్తువే పుట్టుచున్నదని అందురు. ఈవాదము సత్కార్యవాదము. ఇకను తార్కికులు ఉన్నవస్తువు ఉండనే యుండెను. అది పుట్టుటేమిటి అని ఆక్షేపించి అంతకు పూర్వము లేని వస్తువేపుట్టుచున్నదని అందురు – ఇది అసత్కార్యవాదము. లేనివస్తువు ఎప్పుడును లేనేలేదు; అట్టి శూన్యములోనుంచి ఎట్లు జగత్తు పుట్టుతుంది అని సాంఖ్యులు ఆక్షేపించి, నువ్వులలోనుంచి నూనె పుట్టుచున్నది కాని, ఇసుకలోనుంచి పుట్టుటలేదు అనియు, నువ్వులలో అంతకుపూర్వం నూనె ఉండియే అభివ్యక్తమగుచున్నదనియు, అదే పుట్టుక అనియు చెప్పుదురు. ఇట్లు ఉభయులు యుక్తులచేత తర్కించుకొనగా, ఏమీ తేలదు. ఇకను వీనికి సమన్వయమేమనగా, జగత్తు అసలు పుట్టనేలేదనిన్ని, పుట్టునట్లు మాత్రము రజ్జుసర్పమువలె కనపడుచున్నదనిన్ని, పుట్టినపక్షంలో, ఉండి పుట్టినదా, లేకుండా పుట్టినదా అను ప్రశ్నలు పుట్టుకొని, అసలేపుట్టనపుడు అట్టి ప్రశ్నలకే తావులేదనిన్ని, అద్వైతుల సమాధానము, సమన్వయము. త్రాడునుచూచి పాము అనుకొన్నపుడు, ఆ పాము పుట్టినదనుటకు వీలులేదు. పుట్టలేదనుటకు వీలులేదు; ఉండి పుట్టినదా, లేక పుట్టినదా అనుటకును వీలులేదు; ఎందుచేతననగా, వాస్తవంలో దానికి వస్తుత్వములేదు కనుక, కార్యకారణభావముకూడ వాస్తవంలో యుక్తికి నిలువదు. యేదైనా ఒక వస్తువు, సత్తు అయినను కావలెను; లేక అసత్తు అయినను కావలెను. ఈ రెంటిలోనుంచి నాలుగు వికల్పములు పుట్టును.

(1) సత్తులోనుంచి సత్తు పుట్టునా? ఇది అసంభవము; సత్ అనగా నిర్వికారము కనుక.

(2) సత్తులోనుంచి అసత్తు పుట్టునా? ఇదియును అసంభవమేకదా.

(3) అసత్తులోనుంచి అసత్తు పుట్టునా? ఇది అంతకంటె అసంభవము. శూన్యములోనుంచి వస్తువు పుట్టనేరదు కనుక.

(4) అసత్తులోనుంచి అసత్తు పుట్టునా? ఇదియును కుదరదు. శూన్యములోనుంచి శూన్యము ఎట్లు పుట్టును?

కనుక, కార్యకారణభావమే కుదరనపుడు జగత్తు మిథ్య అగుటకంటే గత్యంతరములేదు అని స్పష్టపడుచున్నది.

15. జగత్తును మిథ్య అనుటవల్ల అద్వైతులు ప్రచ్ఛన్నబౌద్ధులు అని ఒక ఆక్షేపణకలదు. ఇది కేవలము నిరాధారము. బౌద్ధులు జగత్తును భ్రాంతిఅని అన్నను, యీ భ్రాంతికి అధిష్ఠానమును దేనిని అంగీకరింపరు. అట్టి నిరధిష్ఠానమైన భ్రాంతి యెప్పుడును కలుగనేరదు. త్రాడునుచూచి పాము అని భ్రాంతి చెందునుకాని, త్రాడే లేనపుడు పాము అను భ్రాంతి ఎట్లు కలుగును? బౌద్ధుల మతములో జగత్తు శూన్యము;

అద్వైతుల మతములో జగత్తు మిథ్య; అనగా అధిష్ఠానముగా సత్యమైన బ్రహ్మ ఉన్నదనిన్ని, భ్రాంతిచేత అట్టి బ్రహ్మను జగత్తుగా చూచుచున్నాడనిన్ని, ఆ భ్రాంతి పోగానే బ్రహ్మ సాక్షాత్కారమై ముక్తిని పొందుననిన్ని అద్వైతుల సిద్ధాంతము. బౌద్ధుల సిద్ధాంతము ప్రకారము భ్రాంతిపోగానే శూన్యమే మిగులును. బౌద్ధుల జగత్తును లేదు అని అంటారు; అద్వైతులు జగత్తును కాదు అని అంటారు; అనగా జగత్తు వాస్తవంగా జగత్తుకాదు, బ్రహ్మయే అని వారి సిద్ధాంతము. కనుకనే బౌద్ధులది శూన్యమతము, అద్వైతులది ఆస్తికమతము. ఈ రెంటికిని తూర్పు పడమరలవలె అత్యంతభేద మున్నది. కనుక అద్వైతము ప్రచ్ఛన్న బౌద్ధమతము కాదు.

'దృక్' అయిన ఆత్మకును, దృశ్యమైన జగత్తుకును సంబంధమేమి? దృశ్యమైన ప్రపంచములో దీపము వున్నపుడు అక్కడవున్న కుండ కనపడుచున్నది. దీపము అనుదానికిని దానిచేత ప్రకాశింపచేయబడు కుండకును ఉన్న సంబంధము సంయోగ సంబంధము. దీపము, కుండ అను రెండును దృశ్యకోటిలోనివి కనుక, ఆ రెంటికి గల సంయోగ సంబంధముకూడ దృశ్యమే. ఇట్లు యివన్నియు సజాతీయములే. ఇంకను ఆత్మ, జగత్తుల విషయములో. ఆత్మ దృక్కు, జగత్తు దృశ్యము. ఈ రెండును విజాతీయములు. ఇదియును కాక, ఆత్మ ఉంటేనే జగత్తు వున్నది, ఆత్మ లేకపోతే జగత్తులేదు. దీపము వుంటేనే వెలుతురు వున్నది. దీపము లేకపోతే వెలుతురు లేదు. ఇట్టివాని విషయములో సంబంధము అనన్య సంబంధముకాని సంయోగము కానేరదు. అనన్యమనగా, అన్యముకానిది అని అర్థము. కనుక దీపంకంటె వెలుతురు అన్యముకాదు; అలాగుననే ఆత్మకంటె దృశ్యమైన జగత్తు అన్యము కాదు. ఆత్మ దృక్కు కనుక, జగత్తుకూడా ఆత్మకంటె అన్యముకానిది, అనగా ఆత్మయే. దీనినే తాదాత్మ్యమని కూడా అంటారు. కనుక జగత్తు వాస్తవంలో ఆత్మయే, అన్యముకాదు; అన్యమని భావించుట భ్రాంతియే. కనుక జగత్తు పృథక్కుగా వున్నదంటే అట్టి జగత్తు మిథ్య అని తేలినది. ఈ విధంగాకూడా అద్వైతమే జగజ్జీవేశ్వరుల తత్త్వమని యుక్తిమీద నిర్ధారితమగుచున్నది.

# పదార్థ విజ్ఞానము
## (SCIENCE)

ప్రాచీనకాలములో 'న్యూటన్' మున్నగు ప్రఖ్యాత పదార్థ విజ్ఞానవేత్తలు కాలము, దేశము (Time & Space) నిత్యము (Absolute) అని నిర్వచించినారు. కాని ఆధునిక శాస్త్రజ్ఞులగు సర్ జేమ్సు జీన్సు (Sir James Geans), డాక్టర్ మాక్సుప్లాంకు (Dr. Max Plank) ఈన్‌స్టీన్ (Prof. Einstein) మున్నగువారి పరిశోధనల ప్రకారం కాలము, దేశము కూడ నిత్యము కావనిన్ని, ప్రపంచములో దేనికిని నిత్యత్వము లేదనిన్ని, నిత్యముగా కనపడు వస్తువులకుకూడ ఆపేక్షిక నిత్యత్వమేకాని అసలు నిత్యత్వము లేదనిన్ని తీర్మానింపబడినది. ఇంకను పదార్థము (Matter), శక్తి (Energy) అను రెండును వేరు పదార్థములు అను పూర్వపు సిద్ధాంతము మారి ఆ రెండును ఒకే వస్తువుయొక్క అవస్థాభేదములనిన్ని ప్రపంచములో నున్నది ఒక శక్తియే (Energy) అనిన్ని ఆ శక్తియొక్క అవస్థాంతరము, అనగా ఘనీభవించిన స్థితియే పదార్థము అనిన్ని, పదార్థముయొక్క యొక్క సూక్ష్మస్థితియే శక్తి అనిన్ని ఈ విధముగ సిద్ధాంతీకరింపబడినది. దీనినిబట్టి జగత్తులో నేదియు నిత్యముకాదనిన్ని, అంతయు మార్పుకు లోబడి యున్నదనిన్ని, అనుటవల్ల ఒకవిధముగ జగన్మిథ్యాత్వము సూచింపబడినది. ఇంకను జగత్తంతయు శక్తివల్ల నడుచుచున్నదనుటవల్ల జగత్తు మాయాశక్తియొక్క కార్యము అను అద్వైతసిద్ధాంతముకూడ వ్యక్తము చేయబడినది. ఇకను బ్రహ్మ ఒక్కటే సత్యము అను విషయమును వారింకను శోధించి యుండలేదు. ఇంకను ఈన్‌స్టీన్‌గారి (Einstein) ఆపేక్షికజ్ఞాన సిద్ధాంతము (General theory of Relativity) ప్రకారం ప్రపంచములోని మానవుని విజ్ఞానమంతయు ఆపేక్షిక యాథార్థ్యము కలదేకాని వాస్తవమైనదని చెప్పుటకు వీలులేదని తేలుచున్నది. ప్రపంచము మిథ్యకనుక ప్రపంచములోని పదార్థములకు సంబంధించిన విజ్ఞానమంతయు ఆపేక్షిక సత్యత్వముకలదైన అజ్ఞానజన్యమేకాని పారమార్థిక జ్ఞానముకాదు- అను అద్వైత సిద్ధాంతము ఈ విధముగ కూడ బలపడుచున్నది. కనుక పదార్థ విజ్ఞానశాస్త్రము (Science) ప్రకారముకూడ జగన్మిథ్యాత్వమే సూచింపబడి అద్వైతమే తత్త్వమని దృఢపడుచున్నది. ఇంకను

పాశ్చాత్యులలో విజ్ఞానవేత్తలలో చాలామంది తమ తమ గ్రంథములలో అద్వైతభావములను వ్యక్తము చేసి శ్రీ శంకరభగవత్పాదులను ఎంతో గొప్పగను అసదృశమైన మేధావిగను ప్రశంసించియున్నారు.

## అనుభవములు

ఉపనిషత్తులు మున్నగు గ్రంథములలో బ్రహ్మజ్ఞానులగు మహాపురుషుల అనుభవములు అచ్చటచ్చట ఉదాహరింపబడినవి. భృగువల్లిలో 'అహమన్న మహమన్నం। అహమన్నా దోఽహ మన్నాదః' అనునది బ్రహ్మ సాక్షాత్కారమును పొందిన భృగువుయొక్క అనుభవము. దాని భావమేమన అట్టి జ్ఞాని సర్వాత్మకుడు అగుచున్నాడు. కనుక అతనికి జగత్తు వేరే లేకపోవుటయే కాక, ఈశ్వరుడును వేరే లేడు; తానే సర్వము నిండి ఏకమై నిత్యమై స్వయం ప్రకాశమై ఆనందరూపుడై యున్నాడని తన అనుభవమును ప్రకటించినాడు. ఇటులనే వామదేవుడును 'అహంమనుః అహంసూర్యః' ఇత్యాదిగా తనసర్వాత్మభావమును వ్యక్తపరిచియున్నాడు. ఇట్టి అనుభవములు అన్నియు జీవన్ముక్తుల అనుభవములే కనుకను, జీవన్ముక్తి అనునది ద్వైత విశిష్టాద్వైతములలో లేక అద్వైతములో మాత్రమే యుండుటచేతను, ఈ అనుభవములు గూడ అద్వైతమే తత్త్వమని స్పష్టము చేయుచున్నవి. ఆధునికులలో గూడ సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతీ, చంద్రశేఖర భారతీ, బ్రహ్మానంద తీర్థ మున్నగు జీవన్ముక్తులు తమ సర్వాత్మ భావములను ప్రకటించి యున్నారు. గ్రంథవిస్తర భీతిచే అవియన్నములను వ్రాయలేదు. ఇదియునుకాక సామాన్యజనుల కందరికిని సుషుప్త్యనుభవములో, తాను ఒక్కడే భాసించుటయు, జగత్తు భాసించకపోవుటయు అను అనుభవమున్ను స్వప్నానుభవమున్నుకూడ జగన్మిథ్యాత్వమును ఆత్మనిత్యత్వమును సూచింపుచూ అద్వైతమే తత్త్వమని ధ్రువపరుచుచున్నవి. ఇంకను పాశ్చాత్య కవులలో కొంతమంది తమ అనుభవములను యిట్లు వర్ణించి యున్నారు:

Shakepeare :

'We are such stuff as dreams are made of and our little life is sounded with asleep?

(మన మందరము అనగా మన జగత్తు స్వప్నతుల్యమైనది. మన జీవితము అజ్ఞాన నిద్రచే ఆవరింపబడినది.)

The whole world is a stage.

(జగత్తంతయు ఒక నాటకమే.)

Emerson :

'If the red slayer thinks he slays or if the slain think he is slain They know not well the subtle ways.

(చంపినవాడు తాను చంపినానని అనుకొన్నను, చంపబడినవాడు తాను చంపబడినవాడు అని అనుకొన్నను, ఉభయులును సూక్ష్మమైన తత్త్వము తెలియనివారే.)

ఈ భావమే భగవద్గీతలో 'య ఏవం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం। ఉభౌ తేన విజానీతో నాయం హన్తి న హన్యతే?' అను శ్లోకములోని భావమును సూచించుచున్నది.

'The soul is not a compensation but a Life, The soul is. Elude all this fleating sea of circumstance whose waters ebb and flow with perfect balance lies the aboriginal abyss of Real Being. Essence of God is not a relation or part, but the whole. Being is the vast affirmative excluding negative self balanced, and swallownig up all relations, parts and times within Itself.'

(ఆత్మ ద్వంద్వములలో చేరినది కాక, సత్తామాత్రము. ఆత్మ సత్ పదార్థము. ఈపరిదృశ్యమానమై అనిత్యమైన ప్రపంచమునకు అధిష్ఠానము ఈ సత్ పదార్థమే. దేవుని తత్త్వము పరిచ్ఛిన్నమైనది కాకుండాను; ఇంకొకదానితో సంబంధము కలదికాకుండాను, సంపూర్ణమైనదై యున్నది. ఈ సత్ పదార్థము 'అసత్' కాక నిత్యమైన ఉనికిగలదిన్ని, స్వప్రతిష్ఠమైనదిన్ని అయ్యుండి పరిచ్ఛిన్నత్వమును, సంబంధత్వమును, కాలమునుకూడ మ్రింగివేయునదై యున్నది.

'Language cannot paint the pur nature of the soul.'

(భాష ఆత్మయొక్క తత్త్వమును వ్యక్తముచేయజాలదు.) 'యతో వాచో నివర్తన్తే' అను శ్రుతియొక్క భావము.

'Ineffable is the union of man and God. The simplest person who in his integrity worships God becomes God.'

(జీవుడు దేవునితో చేరు సాయుజ్యము వర్ణనాతీతము. అమాయకుడైన మానవుడు సంపూర్ణమైన భక్తితో దేవుని భజించెనేని అతడు దేవుడే యగును.)

'Being passes into Appearance, and unity into variety. The universe is the externalisation of the soul'.

(సత్ పదార్థమే దృశ్యప్రపంచమైనది; ఏకమైన సత్ యే నానాగా అయినది. ఈ జగత్తు అంతయు ఆ ఆత్మయొక్క బాహ్యాభివ్యక్తియే.) ఏకమైన ఆత్మ 'బహుస్యాం' అని యీ నానాత్వము ల ... స్తుగా వ్యక్తమైనది అనిశ్రుతియొక్క భావము.

Thomas Moore :

'The world is all a fleet ng show for man's illusion given.'

(ఈ జగత్తంతయు మానవుని ... మైనట్టిన్ని, ప్రతినిముషము మారునట్టిన్ని ... .) ఇట్టి అనుభవములింకను అనేకములు కల ... . ... విస్తర భీతిచేత నింతటితో విరమించబడమై ... .

ఇట్లు ఆ యా మతగ్రంథములలోని ... మా ... ల వల్లను, యుక్తి విచారణవల్లను, పాశ్చా... దా... శాస్త్ర విజ్ఞాన విచారణవల్లను, ప్రాచ్య పాశ్చా... మహాపురుషుల అనుభవములవల్లను ... తత్త్వము అద్వైతమే యని స్పష్టపడుచున్న .

# అద్వైత భావవాదం: ఒక విమర్శ

శ్రీ ఏటుకూరు బలరామమూర్తి, బి. ఏ.

పదార్థ, భావం, రెండూ వాస్తవములని అనాది సిద్ధములని ఈ రెంటి సంయోగ, వియోగ పరిణామంవల్ల ప్రాపంచిక వ్యవహారం సాగుతున్నదని తెలియజేసే భారతీయ తాత్విక ధోరణి సాంఖ్యం. ఈ ధోరణిని ఖండిస్తూ, పదార్థం మిథ్య అని భావం మాత్రమే సత్యమని శంకరాచార్యులు (8 వ శతాబ్దం) వాదించారు. కనుక శంకరుని సిద్ధాంతం అద్వైతమని వ్యవహరించబడుతున్నది. (అద్వైతం అనగా రెండు కాదు. ఒకటి) వేద ప్రామాణ్యం అంగీకరించే హిందూమతవాదులలో మాత్రమేకాక తర్క ప్రమాణాన్ని మాత్రం అంగీకరించే భావవాదులలోకూడా అద్వైతానికి గొప్ప ఆదరణ ఉన్నది. కనుక అద్వైత సిద్ధాంతంయొక్క గుణదోష విచారణ, సత్యాన్వేషి ఐన ప్రతి ఒక్కరికీ అత్యవసరం.

శంకరులు క్రీ. శ. 788 ప్రాంతంలో కేరళరాష్ట్రంలోని కాలడి గ్రామంలో నంబూద్రి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. బాల్యంలోనే సన్యసించి, మధ్యప్రదేశ్‌లోని మాహిష్మతీపురంలో నివసిస్తున్న గోవిందుడను గురువువద్ద అద్వైత సిద్ధాంతాన్ని అధ్యయనం చేశారు. దేశం నలుమూలలా మతప్రచారం చేస్తూ సంచరించి, శృంగేరి, ద్వారక, బదరీనాథ్, పూరీ - క్షేత్రాలలో అనగా భారతదేశానికి దక్షిణ, పశ్చిమ, ఉత్తర, తూర్పు దిశలలో నాలుగు మఠాలను స్థాపించి, తన 32 వ ఏట బదరీనాథ్‌లో మరణించారు.

అద్వైత ధోరణి శంకరునికి పూర్వమే ఉన్నది. షడ్దర్శనాలలో ఆరవదైన ఉత్తరమీమాంసాసూత్రాలు బ్రహ్మమాత్రమే సత్యమని, పదార్థం అవాస్తవమని ప్రతిపాదించాయి. ఈ సూత్రాలకు కర్త బాదరాయణుడు. వీనినే బ్రహ్మసూత్రాలంటారు. గోవిందుని గురువు, అనగా శంకరుని పరమ గురువైన గౌడపాదుడు, అద్వైత సిద్ధాంతాన్ని విపులీకరించారు. శంకరుడు దానిని మరింత పరిపుష్టం చేశారు.

తానొక నూతన మతాన్ని స్థాపించటంలేదని, బ్రహ్మసూత్రాలకు, ఉపనిషత్తులకు భాష్యంమాత్రం చెప్పి, అద్వైతవాదాన్ని పునరుద్ధరిస్తున్నానని శంకరాచార్యులు పదేపదే చెప్పుకున్నారు. బాదరాయణుని బ్రహ్మసూత్రాలను, భాష్య సహాయంలేనిదే అర్థం చేసుకోవడం కష్టం. గౌడపాదుని రచనలకు విశేష వ్యాప్తి రాలేదు. కనుక శంకరుని రచనలే అద్వైత ధోరణికి ప్రాతిపదికలుగా ఎంచబడుతున్నాయి. శంకరుడు బ్రహ్మసూత్రాలకు, భగవద్గీతకు, ముఖ్యమైన పదకొండు ఉపనిషత్తులకు భాష్యాలు వ్రాశారు.

శంకరుడు జీవించిన కాలంనాటికి భారతదేశంలో, పూర్వమీమాంస, బౌద్ధ విజ్ఞానవాద ధోరణులు, మేధావులలోను, కాపాలిక, శాక్తేయాది మతాలు ప్రజాసామాన్యంలోను వ్యాప్తిలో ఉన్నాయి.

## సమకాలీన తాత్విక ధోరణులు

వేదాలలోని కర్మకాండ సంతతిని యథావిధిగా ఆచరించుటద్వారానే మోక్షం లభిస్తుందని పూర్వ మీమాంసకుల నమ్మకం. మంత్రోచ్చారణలో ఒక

నిగూఢశక్తి ఉన్నదని, కనుక తెలిసికాని, తెలియక కాని వైదికకర్మల నాచరించి నట్లయితే ఆ కర్మల ఫలితం వ్యక్తి తప్పక పొందుతాడని వారి భావం. ఏదో ఒక దేవుని అగ్ని, వరుణుడు, ఇంద్రుడు-ఆవాహనచేస్తూ మంత్రాలు చదవవలసి ఉన్నందున, మనం ఆ దేవుని ఊహిస్తున్నామే కాని, అసలు ప్రాధాన్యత మంత్రాలదేనని, దేవునిది కాదని వీరి వాదన. ప్రపంచం వాస్తవమైనదని, దేవుడు నిమిత్త మాత్రుడని, మంత్రశక్తి అపారమని భావించినందున ఈమార్గం కర్మమార్గం అని ఆనాడు వ్యవహరించబడ్డది.

వేదప్రామాణ్యాన్ని అంగీకరించే హిందువులలో ముఖ్యంగా బ్రాహ్మణ, క్షత్రియులలో పూర్వ మీమాంసకు యెక్కువ ఆదరం ఉండేది. ఈ ధోరణిని ప్రచారంచేసిన కుమారిలభట్టు, ప్రభాకర పండితులు (క్రీ. శ. 700) ఆంధ్రులు; గురుశిష్యులు. వీరి ప్రోత్సాహఫలితంగానే ఆనాటి హిందూరాజులు, యజ్ఞయాగాదులను విశేషంగా చేయసాగారు.

శంకరుడు వీరిని ఖండించాడు. వేదాలసారం, ఉపనిషత్తులు. ఉపనిషత్తులలోని జ్ఞానాన్ని గ్రహించినపుడే మోక్షం లభిస్తుంది. జ్ఞానరహితమైన కర్మ నిష్ప్రయోజనం. కర్మమార్గం సామాన్యులకు కొంత వరకు అవసరంకావచ్చు. కాని అది ఉన్నతమైనది మాత్రంకాదు. జ్ఞానమార్గమే ఉన్నతమైనది. ఈధోరణిలో శంకరుడు పూర్వ మీమాంసకులను, విమర్శించాడు.

మేధావులలో ప్రబలంగా ఉన్న మరొకధోరణి బౌద్ధవిజ్ఞానవాదం. విజ్ఞానవాద బౌద్ధానికి ఆదిబౌద్ధానికి హస్తిమశకాంతరం ఉంది. ఆదిబౌద్ధం ప్రపంచం వాస్తవమని అంగీకరించింది. విజ్ఞానవాద బౌద్ధం ప్రపంచ వాస్తవికతను నిరాకరించింది. ప్రతివస్తువు ఉనికి క్షణికమని, మరుక్షణంలో అది రూపాంతరం చెందుతుందని ఆదిబౌద్ధం తెలియచేస్తుంది. విజ్ఞానవాదులు పై వాదనలో మొదటిభాగాన్ని మాత్రం స్వీకరించి క్షణికమైన బాహ్యవస్తువులకు ఉనికి అసాధ్యమని త్రోసివేశారు. బాహ్యవస్తువులు మానసిక ప్రవృత్తులకు ప్రతిబింబాలు మాత్రమే నన్నారు. ఈమానసిక ప్రవృత్తుల కలయికకు వీరు ఆలయవిజ్ఞానం, అఖండ విజ్ఞానం (absolute spirit) అని పేరు పెట్టారు.

వీరు బాహ్యప్రపంచపు ఉనికిని పూర్తిగా నిరాకరించే ఆత్మాశ్రయ భావవాదులు (subjective Idealists). బౌద్ధులైన వీరు వేదప్రామాణ్యం అంగీకరించరు.

శంకరులు వీరి వాదనలను తర్కాన్ని ఆధారంగాచేసుకుని విమర్శించారు. బాహ్యవస్తువులు కేవలం స్వాప్నిక సత్యములని త్రోసిపుచ్చుటసరికాదన్నారు. అన్నం తిన్నప్పుడు కడుపు నిండుతున్నది. గోడ తలకు తగిలినపుడు దెబ్బతగులుతున్నది. కనుక అన్నం తినటం, గోడకు ఢీకొనడం, స్వాప్నిక సత్యాలు కాగలవు. వీనికి శంకరులు వ్యావహారిక సత్యం అని ఒక కొత్తమాటను వాడారు. అటు స్వాప్నిక సత్యానికి (dream truth) ఇటు పారమార్థిక సత్యానికి (absolute truth) ఇది మధ్యేమార్గం.

బౌద్ధ విజ్ఞానవాదులను విమర్శించే సందర్భంలో శంకరుడు బాహ్య ప్రపంచ వాస్తవికతను అంగీకరిస్తున్నాడా అనిపిస్తుంది. కాని వ్యావహారిక సత్యానికి, 'మిథ్య' అని శంకరుడు పెట్టినపేరు, దానికి-ఉన్న నిర్వచనం చూసినపుడు యీ భ్రమ తొలగిపోతుంది. వేద ప్రామాణ్యాన్ని నిరాకరించిన బౌద్ధులను విమర్శించుటకు మాత్రమే, స్వాప్నిక సత్యంకంటె భిన్నమైన వ్యావహారిక సత్యాన్ని శంకరుడు ఒక వాదనగా ప్రతిపాదించాడు తప్ప, ఆ పని ముగిసిన వెంటనే, దానిని 'మిథ్య' అని త్రోసిపుచ్చాడు. అనగా మూలంలో బౌద్ధవిజ్ఞానవాదుల వలెనే, శంకరుడుకూడా ఆత్మాశ్రయ భావవాదాన్నే ప్రతిపాదించాడని భావించాలి.

శంకరుని కాలంనాటికి ప్రజాసామాన్యంలో కాపాలిక, శాక్తేయాది క్రూర మతాచారులు వ్యాప్తిలో ఉండేవి. జంతుబలులు, నరబలులు సర్వసామాన్యం. మద్యపానం, వ్యభిచారం, మతంపేరుతో సాగుతూండేవి. బౌద్ధంలో వజ్రయాన శాఖ తలెత్తింది. శాక్తేయులు శక్తిని పూజించినట్లే, వజ్రయాన బౌద్ధులు తారాదేవిని హీనమైన పద్ధతులలో పూజించేవారు. మతకలహాలు స్పర్థలు, ద్వేషాలు సమాజంలో కల్లోలాలను కలిగించేవి. వీనికితోడు శైవ, వైష్ణవ ద్వేషాలు కూడ ఏర్పడ్డాయి.

శంకరుడు ఈ క్రూర మతాచారాలన్నిటినీ ఖండించాడు. కాపాలికులను అణచివేయుటకు సుధన్వుడను రాజు యొక్క సైనిక బలాన్నికూడా ఉపయోగించుకున్నట్లు శంకర విజయం తెలియజేస్తున్నది. ఆనాడు దక్షిణదేశాన్ని పల్లవరాజులు, ఆంధ్రదేశాన్ని చాళుక్యులు, పరిపాలించేవారు. కర్కోట వంశస్థుడైన అవంతి

వర్మ, కాశ్మీర్‌లోను, పాల, సేనరాజులు బెంగాల్‌ను, అహోంరాజులు అస్సాంలోను, రాథోడ్, చౌహాన్, సోలంకి, పరమార రాజులు రాజస్థాన్‌లోను, ప్రతీహారులు గుజరాతులోను పరిపాలిస్తున్న యుగమది. హర్షసామ్రాజ్యం ఏనాడో అస్తమించింది. ముస్లిం దండయాత్ర కొద్దికాలంలో రానున్నది. హిందూ రాజులు తమలో తాము కలహించుకుంటూ ముస్లిం దండయాత్ర విజయానికి అనువైన పరిస్థితులను కల్పిస్తున్నకాలం.

రాజకీయ కలహాలు ఒకవైపున, క్రూరమతాచారాల ఫలితంగా సామాజిక కల్లోలం మరొకవైపున, పూర్వ మీమాంస కర్మకాండ ఫలితంగా ఏర్పడిన మూఢాచారాలు మరొకవైపునా, దేశాన్ని కలవరపెడుతున్న ఆ కాలంలో జ్ఞానమార్గ విశిష్టతను శంకరుడు ఎలుగెత్తి చాటాడు. మేధావివర్గంలో తాత్విక జిజ్ఞాసను హేయమైన నిర్జీవమైన కర్మకాండపట్ల నిరసనను కలిగించిన శంకరుని యీ జ్ఞానమార్గం నాటి పరిస్థితులలో తాత్విక పురోగతికి తోడ్పడ్డదని చెప్పవచ్చు.

## జ్ఞానమార్గ విశిష్టత

శంకరుడు ప్రతిపాదించిన జ్ఞానమార్గంలో మరొక విశిష్టతకూడా ఉంది.

ప్రకృతిశక్తులలో ప్రతిఒక్కదానిని దేవతా భావంతో ఉపాసించిన వైదికార్యుల భక్తిభావంలో వాస్తవికత ఉన్నది. భక్తి, ఆవేశం ఉన్నాయి. కాని జిజ్ఞాస తక్కువ. జిజ్ఞాస జ్ఞానానికి మూలం. మానవ మేధస్సును ఉన్నత పథాలకు తీసుకువెళ్ళి, ప్రకృతి రహస్యాలన్నిటినీ ఛేదింపచేసింది జిజ్ఞాసయే. జిజ్ఞాస వృద్ధి కావాలంటే భక్తి, భయం, రెండూ వెనకడుగు వేయాలి. ఉపనిషత్తులలోని భావవాద అద్వైతంలో ఈ ధోరణిమనకు ద్యోతకమౌతుంది.

కాని ఉపనిషత్తులలోని అద్వైతానికి గల పునాది తర్క సమ్మతంకాదు. శాస్త్ర విజ్ఞానంపైన, వాస్తవ ప్రపంచ అవగాహనపైన ఆధారపడి జిజ్ఞాస కొనసాగాలి. కాని పక్షంలో జిజ్ఞాస గాలిమేడల నిర్మాణం అవుతుంది. ఉపనిషత్తులలో అదే జరిగింది. దీనిపై తిరుగుబాటుగా చార్వాకుల నాస్తిక మతం, బౌద్ధుల గతి తార్కిక దృక్పథం, జైనుల నిరీశ్వరవాదం, సాంఖ్య, వైశేషిక, శాస్త్రాలలో ద్యోతక మయ్యే ద్వైత ధోరణులు ఇవన్నీ తలయెత్తాయి. ఉపనిషత్తుల లోని భావవాద అద్వైతాన్ని ఖండించి భౌతికవాద వాస్తవికవాద ధోరణులను ఇవి ప్రతిపాదించాయి.

అయితే ఇక్కడ ఒక విషయం గమనించాలి. జ్ఞాత, జ్ఞేయం (Subject, Object) అను రెంటిలో ఆనాటి వాస్తవికవాద, భౌతికవాద ధోరణులన్నీ జ్ఞేయాన్ని గురించి విశేషంగా చర్చించాయి. జ్ఞాతను గురించి యెక్కువగా చర్చించలేదు. బౌద్ధులు ఆత్మను నిరాకరించారు. వైశేషికుల ఆత్మకు, శరీరంతో కలిసి ఉన్నప్పుడు మాత్రమే వ్యక్తిత్వం ఉంటుంది. లేక పోతే అది గుడ్డిది. సాంఖ్యుల ఆత్మకు చైతన్యం ఉన్నది కాని కదలికలేదు; కుంటిది. ప్రకృతి గుడ్డిది. గుడ్డివాని భుజాలపై కుంటివాడు కూర్చుని యిద్దరూ పయనించినట్లు ప్రకృతి, పురుషులు కలసి యాత్ర సాగిస్తారు.

శరీరం నశించిన తర్వాతకూడా 'ఆత్మ' వస్తువు శాశ్వతంగా వుంటుందన్న, జడాత్మక భావవాద మత దృష్టినిఖండించుటకు పై వాదనలలోని 'ఆత్మ'భావ నిరసన ఉపయోగపడ్డది. ఆ మేరకుఆభావనలన్నీ సరియైనవి. ఉపయోగకరమైనవికూడా. కానికాలక్రమేణ 'ఆత్మ'కు ఒక కొత్త అర్థం, కర్త, లేక చైతన్యసహితమైన మానవ కృషి అనే అర్థంవచ్చింది. 'ఆత్మను' ఆవహించిన మతభావం వెనుకకుపట్టి, సృజనాత్మక, కర్తృత్వభావం పైకి రాసాగింది. ఆత్మ, 'అహం' అయింది. 'ఆత్మ'ను నిరాకరించడం అంటే, పురుషుని లేక వ్యక్తి కర్తృత్వాన్ని శక్తిసామర్థ్యాలను సృజనాత్మకకృషిని నిరాకరించటం లేక కించపరచడంగా పరిణమించింది. పాశ్చాత్య దేశంలోని యాంత్రిక భౌతికవాద ధోరణుల వలనే భారతీయ వాస్తవికవాద, భౌతికవాద ధోరణులు కూడా శంకరుని కాలం నాటికి, వ్యక్తి కర్తృత్వ పాత్రను తక్కువ అంచనావేసేధోరణికి త్రోవతీశాయి.

తాత్వికరంగంలో వస్తున్న ఈ మార్పులను గమనించి, భగవద్గీతాకారుడు (క్రీ. శ. 300) కర్మ, భక్తి జ్ఞానమార్గాలను సమన్వయపరుస్తూ వ్యక్తికర్తృత్వ పాత్రకు ప్రాధాన్యతనిచ్చే మహత్తర సందేశాన్ని ఇచ్చాడు. భారతీయ తత్వశాస్త్రంలో గీతకు గల ప్రత్యేక స్థానానికిదే కారణం.

శంకరాచార్యుడు కూడా ఈ విషయాన్ని గమనించాడు. ఆత్మపదాన్ని శాశ్వత బ్రహ్మపదార్థం అను పారమార్థిక అర్థంతోపాటు పురుషకర్తృత్వం అను లౌకికార్థంలో కూడా వాడాడు. ఈ రెండవ

అంశాన్ని స్వీకరించే వివేకానందునివంటి వారలు అద్వైతానికి ఖండాంతరఖ్యాతిని తెచ్చిపెట్టారు.

బాహ్య ప్రపంచం వాస్తవంకావచ్చు, కాకపోవచ్చు, ఒకవేళ వాస్తవమైనా నీవుదానిని తెలుసుకోనట్లయితే నీకు సంబంధించి నంతవరకు అది లేనట్లేకదా ? అను వాదన శాస్త్రీయంగా పొరపాటే. ఏమంటే ఒకవ్యక్తి లేక మానవ సమాజం పుట్టినప్పుడు కూడా ప్రకృతి ఉన్నది, ఇక ముందూ ఉంటుంది. కాని ఈ వాదన వ్యక్తియొక్క జ్ఞాన తృష్ణను ప్రకోపింప జేసెందు కుపయోగపడినమాట మాత్రం నిజం.

కనుకనే, శంకరుని జ్ఞానమార్గ ప్రబోధం బౌద్ధ వైశేషికుల తర్కంకంటె తక్కువ స్థాయిలో ఉండి కూడా అవాస్తవమైనదై కూడా ఆ నిర్దిష్ట చారిత్రక పరిస్థితులలో మేధావివర్గంలో జ్ఞాన తృష్ణను ప్రకోపింపజేసేందు కుపయోగపడ్డది.

జ్ఞాన సంపాదనలో దశలు, తరతమ స్థాయీభేదాలుంటాయని భౌతికవాదం, విజ్ఞానశాస్త్రం సైతం అంగీకరిస్తుంది. పంచేంద్రియాల ద్వారా గ్రహించే జ్ఞానం ఇంద్రియజ్ఞానం. ఈ యింద్రియజ్ఞానాన్ని పూర్వానుభవం, సమన్వయం (Synthesis), విశ్లేషణ (Analysis) పోలిక(Comparison) విసర్జన (Elimination) లతో కూడుకున్న ఆలోచనతో మేళవించినపుడు తార్కికజ్ఞానం (Rational knowledge) ఏర్పడుతుంది. తార్కికజ్ఞానం, ఇంద్రియజ్ఞానంకంటె ఉన్నతమైంది. కేవలం ఇంద్రియజ్ఞానాన్నే పరమ ప్రమాణంగా భావించేవారు అనుభవవాదులు (Empiricists) గతితార్కిక భౌతికవాదులు తార్కిక జ్ఞాన విశిష్టతను గుర్తిస్తారు.

శంకరుని సిద్ధాంతంలోకూడా ఒకరకమైన దశల విభజన ఉన్నది. అధికారి భేదాన్ననుసరించి, అనగా జ్ఞాతలేక తెలుసుకునే వ్యక్తియొక్క సామర్థ్యాన్ననుసరించి, అతను గ్రహించే జ్ఞానం ఆధారపడి ఉంటుందని శంకరునివాదన. ఇది వాస్తవమే. విజ్ఞులు, అజ్ఞులు అను స్థాయీ భేదముండటం, ఒకేవ్యక్తి అజ్ఞతనుండి విజ్ఞతను పొందటానికి కృషిచేయటం గమనిస్తూనే ఉన్నాం.

అయితేవ్యక్తులు గ్రహించినా, గ్రహించకపోయినా స్వతస్సిద్ధ వాస్తవికత ఉండనే ఉంటుంది. జ్ఞానం యొక్క, స్వతస్సిద్ధత (objectivtiy) ఒకవిషయం, వ్యక్తి దానిని గ్రహించటం మరొక విషయం (Subjective perception) ఈ రెంటిని కలగా పులగం చేసి శంకరుడు రెండవదానికి విపరీత ప్రాధాన్యాన్నిస్తూ స్వతస్సిద్ధతను నిరాకరించే స్థితికి దిగజారాడు. ఇది శంకరుని వాదనలోని ముఖ్యమైన లోపం.

శంకరునివాదనలో ప్రధానమైనఇతర బలహీనతలుకూడా ఉన్నాయి. వాస్తవికత, జ్ఞాన సంపాదనా మార్గాలు, వస్తువుకుదాని గుణములకు గల సంబంధం, పరిణామం అను ప్రధాన తాత్విక సమస్యలవిషయంలో శంకరుడు అశాస్త్రీయమైన జడాత్మక, అవాస్తవిక దృష్టిని ప్రదర్శించాడు.

## వాస్తవికత అంటే ఏమిటి ?

మార్పు, చలనం, నాశం, వైరుధ్యంలేనిది వాస్తవిక సత్యం అని శంకరుని నిర్వచనం. కంటికి కనపడే ప్రతివస్తువుకదులుతున్నది.రూపాంతరంచెందుతున్నది నశిస్తున్నది. కనుక దృశ్యమాన ప్రపంచంలోని ప్రతి వస్తువు అసత్యమే. శంకరుని వాదననుసరించి, కుండ కూజా - ఈరెండుఒకేవస్తువైన మట్టితోచేయబడ్డాయి కనుక కుండ, కూజా ఈ రెండు అవాస్తవికములు అసత్యములు. మట్టిమాత్రమే సత్యం. నిజానికి మట్టి ఇతర పంచభూతాలవలెనే అనేక అణువుల కలయిక వలన ఏర్పడ్డది. అదే అణువుల మరొక కలయికవల మట్టికంటె భిన్నమైన వస్తువు నీరు ఏర్పడుతున్నది. కనుక మట్టికూడా సత్యంకాదు. ఇక ప్రత్యేక ధర్మాలన్నిటినీ (Particular qualitie ) విసర్జించుకుంటూ పోతే, సాకార, సగుణ ప్రపంచా కంతా మూలం, నిరాకార నిర్గుణవస్తువు అనితేలుతుం . వస్తువులుమిథ్య, కాని వాని ఉనికిమాత్రం సత్య . (Things are unreal but their existence real) కనుక ఆ నిర్గుణ వస్తువొకటె సత్యం. మిగ వన్నీ అసత్యాలు.

అయితే ఇవి పూర్తి అసత్యాలుకావు. వ్యావహారిక దృష్టిలో యివి సత్యాలే. పారమార్థిక సత్యం మాత్రం కాదు. కనుక జగత్తంతా వ్యావహారిక సత్యం లేక మిథ్య. నిర్గుణవస్తు వొక్కటే సత్యం. ఈ భావాన్నే శంకరుడు 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య' అను సూత్రంలో వెలిబుచ్చాడు.

ఈ వాదన పూర్తిగా తప్పు. మార్పు, కదలిక, నాశం కలిగిన, వస్తువు, అవాస్తవికం అనే శంకరుని ప్రాథమిక ప్రతిపాదనే పొరపాటు. ఏమంటె, ఇంద్రియగోచరమైన ప్రతి వస్తువు కదులుతున్నది,

మార్పు చెందుతున్నది, నశిస్తున్నది. రూపాంతరం చెందుతున్నది. ప్రగతిశీలమైన, ప్రవాహసదృశమైన యీ బాహ్య ప్రపంచాన్నంతా వాస్తవమని, శంకరునికి పూర్వమున్న బౌద్ధ, జైన, సాంఖ్య, వైశేషికాది ధోరణులన్నీ అంగీకరించాయి.

శంకరుడు తనకంటె ప్రాచీనమైన ధోరణులలోని వాస్తవికతనంతను విసర్జించాడు.

## ప్రత్యేక ధర్మము సామాన్య ధర్మము

ప్రత్యేక వస్తువులలో ఇమిడివున్న సామాన్య ధర్మాన్ని తెలుసుకోటానికి యత్నించడం సరియైనదే. అయితే సామాన్య ధర్మాన్ని మాత్రమే గుర్తించి ప్రత్యేక ధర్మాలను నిరాకరించడం అశాస్త్రీయ దృష్టికి చిహ్నం. ఒక వస్తువుయొక్క ప్రత్యేక, సామాన్య ధర్మాలకు గల సంబంధంగతి తార్కిక సంబంధం. ఒక దానినుండి మరొక దానిని విడదీయుట సాధ్యం కాదు.

శంకరునికి పూర్వీకులైన వైశేషికులు ఈ క్రింది ఉదాహరణద్వారా ప్రత్యేక సామాన్యధర్మాల సంబంధాన్ని నిరూపించారు.

ఆవు, మేక, గొర్రె, గుర్రం, మొదలైనవన్నీ నాలుగు కాళ్ళ జంతువులు. ఈ జంతువు లన్నిటికీ సామాన్యధర్మం, అవి నాలుగుకాళ్ళను కలిగిఉండటం. మిగతా లక్షణాలన్నీ, ఆవు పాలనిస్తుంది, గుర్రం స్వారీ కుపయోగపడుతుంది మొదలైనవన్నీ, ప్రత్యేక ధర్మాలు. కొన్ని ప్రత్యేక ధర్మాలు కలిగిన వస్తువుల నొకచోటచేర్చి పోల్చి పరిశీలించినపుడే వానిలోని సామాన్యధర్మం ద్యోతకమౌతుంది. అంతేకాదు. ప్రత్యేక ధర్మాలతో పాటు ఏదో ఒకటీ లేక కొన్ని సామాన్యధర్మాలు ఉండడం వలననే అసలు పోలిక సాధ్యమౌతుంది. ఇలాకాక అన్నీ ప్రత్యేక ధర్మాలే అయి వాటిమధ్య సామాన్యధర్మాలు లేకపోయినా,అన్నీ సామాన్యధర్మాలేఉండి వైవిధ్యం, ప్రత్యేకత లేకపోయిన పోలిక సాధ్యమేకాదు. కనుక ప్రత్యేక ధర్మాలు, సామాన్య ధర్మాలు (Particular+general) ఈ రెంటిని విడదీయటం సాధ్యంకాదు. వీనిలో ఒకటిమాత్రం వాస్తవం. రెండవది అవాస్తవం అని భావించటం సరికాదు. ఈ రెంటికిగల సంబంధం సమవాయి సంబంధం. ఈ రెండు అయుత సిద్ధ శక్తులు (Polar opposites).

వైశేషికులు యింకా యీ క్రింది ఉదాహరణ లిచ్చారు. దారాలన్నీ కలిస్తే వాటిలో వస్త్రత్వం ఏర్పడుతున్నది. గులాబీకి ఎరుపురంగు, వస్తువుకు చలనం, - ఈ మొదలైనవన్నీ యిట్టి విడదీయ వీలులేని సంబంధాలే.

ఆధునిక గతితర్కం కూడా ప్రత్యేక సామాన్య ధర్మాలను గురించి యిదే వైఖరిని అవలంబిస్తుంది. మావో 'వైరుధ్యాలు' అను గ్రంథంలో యిలా వ్రాశాడు. "ప్రత్యేక ధర్మాల నాశ్రయించు కొని సామాన్యధర్మం ఉంటుంది. అన్ని ప్రత్యేక ధర్మాలను తొలగిస్తే ఇక సామాన్య ధర్మం ఏముంటుంది?...... ప్రత్యేకధర్మాలకు సామాన్య ధర్మాలకు గల సంబంధాన్ని గ్రహించటమే వస్తు సారంలోని వైరుధ్యాలను అధ్యయనం చేయటం. దీనిని వదలివేస్తే గతి తర్కాన్నే వదలివేసినట్లవుతుంది" (వైరుధ్యాలు ఇంగ్లీషు కాపీ 39-40 పేజీలు).

కనుక ప్రత్యేక, సామాన్య ధర్మములను విడదీసి, ఒకటి వాస్తవం, మరొకటి అవాస్తవం అని నిర్ణయించ బూనడం అశాస్త్రీయమైన జడాత్మక దృష్టికి చిహ్నమని స్పష్టం. శంకరుని పొరపాటు ఇది.

## వైరుధ్యం వాస్తవికతకు మూలం

శంకరునిలోని జడాత్మక దృష్టికి మరికొన్ని ఉదాహరణలు గమనిద్దాం.

"నాసతో విద్యతే భావః, నా భావో విద్యతే సతః"

మొదటినుండీ ఏ దైతే ఉన్నదో దానికి అభావం లేదు. మొదటినుండీ ఏదైతే లేదో దానికి ఉనికిలేదు"

ఈ భావంకూడా తప్పు. సృష్టిలో ఇంతకుపూర్వమున్న వస్తువులు నశించి కొత్తవి పుడుతున్నట్లు, మనం నిత్యం చూస్తున్నాము. ఇదే భావాన్ని ఆది బౌద్ధులు ఇలా తెలియజేశారు :

"ఘటనల సముదాయం గొలుసువలె బంధించబడి ఉంది. ఏదో ఒక కొత్తఘటన నిరంతరం ఆవిర్భవిస్తూ ఉంటుంది. ఏదో ఒక ఘటన నశిస్తూ కాల గర్భంలో కలిసిపోతూ ఉంటుంది. ఆద్యంతాలు లేకుండా ఈ పరిణామం ఇలా సాగుతూనే ఉంటుంది." (నాగసేనుడు మిలింద పన్హా).

"జీవించేది ప్రతిదీ మరణిస్తుంది. పైకి స్థిరంగా కనపడే పదార్థాలన్నీ నిజానికి అస్థిరములైనవే. ఐక్యత ఉన్నచోట ఎడబాటుకూడా వుంటుంది ప్రాణం

వున్నచోట మృత్యువుకూడా ఉంటుంది" (బుద్ధుడు ధర్మచక్ర ప్రవర్తన).

ఆధునిక గతితర్కం యీ విషయమై యిలా తెలియజేస్తుంది :

"చిన్న నలుసునుండి పెద్ద వస్తువువరకు, యిసుక రేణువు మొదలుకొని సూర్యబింబమువరకు ప్రొటిస్టా మొదలుకొని మానవునివరకు ఉనికిలోనికి వచ్చుట, ఉనికినుండి బయటకు పోవుట అనే నిరంతర ప్రవాహమే, ఎడతెగని చలనమే, పరిణామస్థితియే, ప్రకృతి అంతా" (గతితార్కిక చారిత్రక భౌతికవాదం - స్టాలిన్ 8 వ పేజీ).

వైరుధ్యం, మార్పు, కదలిక వాస్తవ ప్రపంచానికి లక్షణమని బౌద్ధుల ప్రాథమిక గతితర్కం, శాస్త్రీయ ఆధునిక గతితర్కం - శాస్త్రీయ విజ్ఞానం కంఠోక్తిగా తెలియజేస్తున్నాయి. మార్పు, కదలిక నాశంలేనిదే వాస్తవికత అని శంకరుడు చేసిన ప్రతిపాదన అశాస్త్రీయం.

## వస్తువు - గుణములు

వస్తువుకు దాని గుణములకు గల సంబంధాన్ని తెలుసుకొనుట కూడా తత్వశాస్త్రంలోని ప్రధాన సమస్యలలో ఒకటి.

శంకరుడు యిలా వాదిస్తాడు. నేను చూస్తున్నాను నేను వింటున్నాను, నేను నడుస్తున్నాను - అని అంటాం. నేను బాగా నిద్రపోయినాను. నేను మంచి కలగన్నాను అని అంటాం. అనగా, జాగ్రదవస్థ, నిద్రావస్థ, స్వప్నావస్థ లన్నిటికీ అతీతమైన 'నేను' ఒకటి ఉన్నదన్నమాటేగదా. ఆ 'నేను' ఆత్మ. అదే శాశ్వతం. మిగతావన్నీ అశాశ్వతం. ఆ నేను 'నిర్గుణం'.

అలాగే మరొక వాదన. నీరు, ఆవిరి, మంచు మూడు రూపాంతరములున్నవి. ఈ మూటికి మూలం ఏది? కొందరు నీరనవచ్చు, కొందరు మంచనవచ్చు, మరికొందరు ఆవిరనవచ్చు. అది వారి దృష్టి భేదము ననుసరించి ఉంటుంది. కనుక అది అనిర్వచనీయం. అనిర్వచనీయ జ్ఞానాన్ని బోధాతీత జ్ఞానంద్వారా మాత్రమే తెలుసుకొనగలము.

ఇందులో మొదటి వాదనను పరిశీలిద్దాం. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, నిద్రావస్థలలో జీవించివున్న వ్యక్తి ఒకడున్నాడు. ఆ జీవించిఉన్న వ్యక్తియే 'నేను', 'నేను'కు నా కార్యములకుగల సంబంధం అవయవి-అవయవములకుగల సంబధం (Whole and Parts).

ఇది ఒక గతితార్కిక సంబంధం. . క్రీ. 200 నాటి బౌద్ధ భిక్షువు నాగసేనుడు ఈ సంబంధాన్ని ఇలా వివరించాడు.

"అనేకమైన భాగాలు, చక్రాలు, ఆసనము, గుర్రాలు, సారధి మొదలైనవన్నీ కలిసివున్నప్పుడే రథం ఏర్పడుతున్నది. అలాగే 32 రకాలైన భౌతిక వస్తువులు పంచభూతాలు కలిసి మానవ శరీరం ఏర్పడి నపుడే నేను నాగసేనుడ్ని జీవిస్తున్నాను. కనుక కారణసముదాయంవలన ఫలితం కలుగుతున్నది." అవయవములన్నీ నశిస్తే, అవయవికూడా లేదు.

వస్తువును దాని గుణములనుండి వేరుచేసి, దానికి భిన్నమైన ప్రత్యేక సత్తాను ఆపాదించడం ఆధునిక శాస్త్రీయ దృష్టికికూడా విరుద్ధం. పదార్థము, శక్తి విడదీయ వీలులేనివని విజ్ఞానశాస్త్రం చెబుతున్నది. అనగా వస్తువుకు - దాని గుణమునకు వినాభావమైన గతితార్కిక సంబంధమున్నది.

శంకరుడు యీ వాస్తవిక సత్యాన్ని నిరాకరించి యాంత్రికమైన జడాత్మక దృష్టిని ప్రదర్శించాడు.

## సాపేక్షక సత్యం
## అఖండ సత్యం

దృష్టి భేదమునుబట్టి సత్యం ఆధారపడి ఉంటుందని అసలు సత్యం అనిర్వచనీయమని శంకరుని వాదన. మనదృష్టి, తర్కం, పరిచ్ఛిన్నమని (Limited) జ్ఞానం అపరిచ్ఛిన్నమని (Unlimited) పరిచ్ఛిన్న బుద్ధితో అపరిచ్ఛిన్న జ్ఞానాన్ని సంపాదించడం తర్కంద్వారా సాధ్యంకాదనికూడా శంకరుడు వాదిస్తాడు. ఇదికూడా పొరపాటే.

ఈ సమస్యకు ఆధునిక గతితర్కం ఇలా సమాధానమిస్తుంది. దృష్టి భేదాన్నిబట్టి, అధికారి సామర్థ్యాన్నిబట్టి వ్యక్తి గ్రహించే జ్ఞానానికి పరిమితులున్నమాట నిజం. దీనినే సాపేక్షక సత్యం. (Relative truth) అంటాము. విశ్వజ్ఞానం అఖండమనే మాటకూడా వాస్తవమే (Absolute truth) అయితే మనకు గల పరిచ్ఛిన్న, పరిమిత బుద్ధితోనేఅఖండ జ్ఞానాన్ని తెలుసుకోగలం అఖండ జ్ఞానానికి, సాపేక్షజ్ఞానమే కొలతబద్ద మరొక మార్గంలేదు. కనుక సాపేక్షక జ్ఞానాన్ని నిరసించి, అఖండ జ్ఞానం అనిర్వచనీయం అని చెప్పటం శాస్త్రీయదృష్టికి చిహ్నంకాదు.

అఖండజ్ఞానానికి, సాపేక్షజ్ఞానానికి గల సంబంధాన్ని మావో తన ఆచరణ అను గ్రంథంలో ఇలా వివరించాడు.

"అఖండ జ్ఞానం అనేది ఒక మహాప్రవంతి. అందులో ఒక ప్రత్యేక పరిణామాన్ని గురించి ఒక దశలో మానవుడు ప్రతిపాదించే జ్ఞానం సాపేక్షక జ్ఞానం. సాపేక్షక జ్ఞాన సముదాయంయొక్క సమాహారమే అఖండజ్ఞానం" (ఆచరణ ఇంగ్లీషు కాపీ పేజీ. 21).

సాపేక్షకజ్ఞానం అంటే శంకరుడు భావించినట్లు సంశయజ్ఞానం కాదు. అఖండజ్ఞానం అనిర్వచనీయం కాదు. సాపేక్షకజ్ఞానం, అఖండజ్ఞానం రెండూ కూడా రూఢిజ్ఞానాలే.

శంకరుని వ్యావహారిక సత్తును, ఆధునిక పరిభాష లోని సాపేక్షక జ్ఞానంతో పోల్చడం యీ కారణం వలననే సరికాదు. ఆధునిక విజ్ఞానంలోని సాపేక్ష జ్ఞానం, పరిమితజ్ఞానమైనప్పటికీ రూఢిజ్ఞానం. శంకరుని వ్యావహారికసత్యం మిథ్య. పారమార్థిక సత్యాన్ని గ్రహించటానికి ఒక మెట్టు మాత్రమే. ఆ స్థాయిని చేరుకున్న తర్వాత అది నశిస్తుంది.

## వ్యావహారికసత్తు, పారమార్థికసత్తు

సత్యాన్ని ప్రాతిభాసికసత్తు, వ్యావహారికసత్తు, పారమార్థికసత్తు అని మూడురకాలుగా శంకరుడు విభజించాడు. కలలో కనపడేది ప్రాతిభాసికసత్తు. జగత్తు వ్యావహారిక సత్తు. బ్రహ్మ పారమార్థికసత్తు.

ఈ రకమైన విభజనకు పునాది వేసినవాడు శంకరుడు కాదు. నాగార్జునుడు. క్రీ. శ. 200 ప్రాంతంలో జీవించిన నాగార్జునుడు, కార్యకారణ బద్ధమైన ప్రపంచాన్నంతా సంవృత్తి సత్యమని పేర్కొని అందుకు అతీతమైన సత్తు ఒకటి కలదని అదే పారమార్థిక సత్యం అని అన్నాడు.

"రెండు సత్యాలున్నాయి. బుద్ధుని బోధనలు ఈ రెంటిమీద ఆధారపడి ఉన్నాయి. ఒకటి దృశ్యమాన ప్రపంచానికి చెందిన సత్యం సంవృత్తి సత్యం, ఇది సామాన్యప్రజల కుద్దేశింపబడ్డది.

రెండవది. లోకాతీతమైన అఖండ సత్యం. ఈ రెంటికిగల తేడాను గుర్తించలేనివారు బుద్ధుని బోధలలోని గొప్పతనాన్ని గుర్తించలేరు" మాధ్యమిక శాస్త్రం (24 అధ్యాయం, 8, 9 కారికలు)

నాగార్జునుని విభజన బుద్ధుని కార్యకారణ వాదాన్ని ఒకమెట్టు క్రిందికి దించింది. నిర్వాణం అనేది బుద్ధుని దృష్టిలో ఒక మానసికస్థాయి మాత్రమే. నాగార్జునుడు దానికొక తాత్వికార్థం కల్పించి, నిర్వాణంచెందిన వ్యక్తి సంవృతసత్యం కంటె అతీతమైన, పారమార్థిక సత్యాన్ని గ్రహిస్తాడని అన్నాడు. బుద్ధుని గతితార్కిక దృష్టి నాగార్జునుని చేతిలో యీ విధంగా బలహీనపడ్డది.

ఇక్కడ మరొక పొరపాటుకూడా ఉంది. ప్రపంచ స్వరూపాన్ని తెలుసుకోవటమే జ్ఞానం. ఇది జ్ఞాతజ్ఞేయముల పరస్పర సంబంధంవలన ఏర్పడుతుంది. (Subject, object interaction) అనగా చారిత్రక పరిణామంలో ప్రకృతి రహస్యాలను మానవుడు ఛేదించినకొద్దీ జ్ఞానం పెరుగుతుంటుంది. జ్ఞాతయొక్క దృష్టి అధికాధికంగా పరిణతికావటం, ప్రకృతిని గురించిన విజ్ఞానం వృద్ధికావటం రెండూ అవసరం. ఈ రెంటిలో ఏ ఒక్కదానిని ఉపేక్షించినా పొరపాటే.

బుద్ధుని కార్యకారణ సూత్రం బాహ్యప్రపంచ స్వభావాన్ని తెలియజేస్తుంది. దీనినే నాగార్జునుడు శూన్యత అన్నాడు. అంతవరకు తప్పులేదు. కాని దృష్టి పరిణతివలన కలిగే అవగాహన, లేక జ్ఞానం, భౌతికమైన కార్యకారణ సూత్రాన్ని లేక శూన్యతను అధిగమించగలదని, అదే పారమార్థిక సత్యమని నాగార్జునుడు నిర్వచించటం పొరపాటు. ఏమంటే కర్తయొక్క దృష్టి భౌతికవాస్తవికతను నిరాకరించటం అసాధ్యం (Subject contradicts the object) వాస్తవికతకు అనుగుణ్యమైనదే సత్యం (Truth is the correspondence with reality). వాస్తవికతకు విరుద్ధమైనది జ్ఞానంకాదు. మత సంబంధమైనమాయ (Trance).

నాగార్జునుడు చేసిన పొరపాటే శంకరుడు మరింత హెచ్చుగాచేశాడు. పారమార్థికదృష్టి అలవరచుకొన్న వ్యక్తికి జగత్తు మిథ్య, అవాస్తవం లేనేలేదు. పురుష కర్తృత్వానికి తగినంత ప్రాధాన్యత నివ్వకపోవటం యాంత్రిక భౌతికవాదంయొక్క బలహీనత ఐతే పురుష కర్తృత్వానికి విపరీతమైనశక్తిని ఊహించి వాస్తవిక ప్రపంచం అంతా మిథ్యఅని త్రోసిపుచ్చటం శంకరుని జడాత్మక భావవాదంలోని బలహీనత.

## వివర్తవాదం

జగత్తు మిథ్య అని అంగీకరించిన శంకరుడు పరిణామాన్ని నూతన వస్తూత్పత్తిని ఎలా అంగీకరించగలడు. కనుక అసలుమార్పు పరిణామమేలేదు. అంతా వివర్తం మాత్రమే అనగా భ్రాంతిమాత్రమేనని శంకరుని వాదన.

త్రాడును చీకట్లో పాము అని భ్రమిస్తున్నాము. వెలుతురురాగానే అది త్రాడు అని తెలుసుకుంటున్నాము. ఇప్పుడు త్రాడు త్రాడుగానే ఉంది. పాముగా మారలేదు. కాని మన అజ్ఞానం, అవిద్యవలన అది పాముగా భావిస్తున్నాము. ఇది భ్రాంతి లేక వివర్తము.

శంకరుని వాదన సాధారణ తర్కందృష్ట్యాకూడా లోపభూయిష్టం. ఏమంటే, త్రాడును, పామును అంతకుపూర్వం చూచివుంటేనే, చీకట్లో అట్టి భ్రాంతి కలుగుతుంది. జగత్తు (పాము) ఈశ్వరుడు (త్రాడు) అని పోల్చినపుడు ఈశ్వరుని అంతకుముందు చూసి వుండాలిగదా? కాని ఈశ్వరుని ఎవరూ చూడలేదు కదా. కనుక రజ్జు సర్ప భ్రాంతిద్వారా, జగత్తుమిథ్య. బ్రహ్మ సత్యం అని నిరూపించటానికి శంకరుడుచేసిన యత్నం వాదానికి నిలవదు.

బౌద్ధులు ప్రతీత్యసముత్పాద వాదంలోమార్పును, నూతనత్వాన్ని అంగీకరించారు. ఆద్యంతములులేని మార్పు జగత్ స్వభావం అన్నారు. ఇది ఆనాటికి అత్యున్నతమైన కార్యకారణవాదం.

వైశేషికులు ఒక అడుగు క్రిందికి దిగి ఆరంభ వాదం ప్రతిపాదించారు. మార్పు, నూతన గుణావిర్భావం, అన్నీ ఉంటాయి. కాని ఈపరిణామానికి ఆరంభం లేక మొదలు ఈశ్వరుడు. అన్నారు.

సాంఖ్యులు ఇంకా కిందికిజారి సత్కార్యవాదం చేశారు. ఇంతకుపూర్వంలేనిది కొత్తది పుట్టలేదు. కనుక కొత్తదిగా కనబడేది ఇంతకుపూర్వం నిగూఢంగా ఉన్న దే అయి ఉండాలి. నూనెగింజలుపిండితే నూనె వస్తుంది. నూనె అంతకుముందే గింజలలో నిగూఢంగా ఉన్న దే. కొత్తది పుట్టటంలేదు. పాతదే ఆవిష్కరింపబడుతుంది.

శంకరుడు యింకొక అడుగు క్రిందికి దిగాడు. అసలు మార్పేలేదు. అంతా భ్రాంతి మాత్రమే. ఏదో కొత్తది ఏర్పడుతున్నదనుకుంటాము. అది వివర్తం మాత్రమే. గొల్లవాడు రాజువేషం, స్త్రీ వేషం వేసి ప్రేక్షకులను రంజింపచేసినట్లు ఆ పరబ్రహ్మ, జగత్తు రూపంలో మనలకు కనుపిస్తున్నాడు. ఇదంతా 'మాయ' వలన కలుగుతున్న భ్రాంతి. భ్రాంతి నివారణే జ్ఞానం. అవిద్య విచ్ఛేదనమై పారమార్థిక సత్యం గ్రహించినపుడు, ఆత్మ పరమాత్మలో లీనమై జీవన్ముక్తి పొందుతుంది. ఇదీ శంకరుని వాదన.

బుద్ధునికాలంనాటి వాస్తవికదృష్టి శంకరుని కాలం నాటికి, ఒక వేయి సంవత్సరాలలో, యెలా దిగజారిందో, పై వివరణ తెలియజేయగలదు.

ఇంద్రియజ్ఞానం వాస్తవంకాదని అసత్యం, భ్రాంతి కారకమని శంకరుని భావన. కనుక పారమార్థిక సత్యం తర్కంద్వారా గాక, తపస్సు (Intuition) ద్వారా మాత్రమే లభిస్తుందని అన్నాడు.

పంచేంద్రియజ్ఞానాన్ని నిరాకరించటం పొరపాటు. ఏకాగ్రతను, చిత్తస్థైర్యాన్ని కలిగించుటకు తపస్సు, యోగం ఒక మార్గం కావచ్చు. కాని అది తార్కిక జ్ఞానసూత్రాలన్నిటికంటె అతీతమైన, ఉన్నతమైన జ్ఞానమార్గమని ఎంచటంమాత్రం అశాస్త్రీయం.

## ఆధునిక పరిశోధనలు - అద్వైతం

భావమా, పదార్థమా ఏది ప్రకృతికి మూలం అనేది తత్వశాస్త్రంలో కీలక సమస్య. భావం మూలం అన్నవారు భావవాదులు కాగా, పదార్థం మూలమన్నవారు భౌతికవాదులు.

ఆధునిక పరిశోధనలు పదార్థం శక్తియొక్క రూపాంతరమేనని తెలియజేస్తున్నాయి. కను భావవాదానికి, భౌతికవాదానికి ఏదో పెద్ద భేదం ఉన్నదనుకోనడం పొరపాటుకాదా అని ఒక ప్రశ్న కలగవచ్చు.

ఆధునిక శాస్త్రజ్ఞులు వాడే శక్తి అను పదమును, భావవాద తాత్వికుల భావం అను దానికి ఏ పోలిక లేదు. ప్రపంచమంతా యేదో ఉద్దేశపూర్వకంగా చైతన్యసహితంగా ఈశ్వరకల్పిత నియమాల ప్రకారం నడుస్తుందని భావవాదుల వాదన. నియమాలు ఒకరు కల్పించినవికావని ప్రకృతిలో అంతర్గతములేనని భౌతికవాదులవాదన. పరిణామం ఉద్దేశపూర్వకంగా జరుగటం లేదని, మానవుడు భూమిపై ఆవిర్భవించక పూర్వం, కోట్లకొలది సంవత్సరాలు నడిచాయని, మానవుడు పుట్టినమీదటనే చైతన్యసహిత పరిణామానికి యత్నం జరుగుతున్నదని భౌతికవాదుల వాదు.

జడం, శక్తిరూపాంతరములేనని నిరూపించే ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనలు విరుద్ధ [illegible] యొక్క సంబంధం ఉండదని, అభేద్యమైన అడ్డుగోడలుంటాయని భావించే ద్వంద్వాత్మకదృష్టి తప్పు అని నిరూపిస్తున్నాయి. మార్పు, చలనం వైరుధ్యాలద్వారా పరిణామం జరుగుతుందని నిరూపించి భౌతిక దృష్టి ప్రాశస్త్యాన్ని చాటుతాయి. శంకరుని మాయా

చిన చలనం, కదలికలేని నిరాకార నిర్గుణ చైతన్యానికి, కదలిక మార్పు, పరిణామం సహజలక్షణాలైన పదార్థం లేక శక్తి అను ఆధునికభావానికి యెట్టి సంబంధంలేదు. ఒకటి సంపూర్ణమైన జడాత్మకదృష్టి. రెండవది గతితార్కిక దృష్టి.

## అద్వైతానికిగల ఆకర్షణ

ప్రకృతి పరిణామానికంతా కీలకమైన సూత్రం తెలుసుకోవలెనని అనాదిగా మానవమేధస్సు శ్రమిస్తున్నది.

ఈశ్వరుడు దీనికి కీలకమని ప్రాచీనకాలంలో, వైదికార్యులు భావించారు. ఆ భావం, నేటిదృష్టిలో ఎంత అశాస్త్రీయమైనప్పటికి, వారికి గొప్ప ఉత్సాహాన్ని ఆవేశాన్ని కలిగించింది. పురుష సూక్తంలో వ్యక్తమయ్యే వైదికార్యుల కవితావేశం ఈనాటికీ ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది.

“మానవునికి వేయిశిరస్సులున్నాయి. వేయికండ్లున్నాయి. అతడు భూమినంతా అన్నిదిశలా ఆవరించి ఆపైనకూడా విస్తరించాడు.

“వర్తమానం, భవిష్యత్తు అంతా మానవుడే. అమరత్వానికి కూడా మానవుడే అధిష్ఠాన దేవత”—

ఉపనిషత్తుల నాటికి సగుణ బ్రహ్మపట్ల, పురుషుని పట్ల ఈ కవితావేశం తగ్గి జిజ్ఞాసహెచ్చి, నిరాకార నిర్గుణ బ్రహ్మ సృష్టికంతా మూలం అనుభావం ఏర్పడ్డది.

సర్వం ఖల్విదం బ్రహ్మ — ఇదంతా బ్రహ్మమయం
తత్వమసి — నీవు అదీ ఒకటి
ప్రజ్ఞానం బ్రహ్మ — జ్ఞానమే బ్రహ్మ
అహం బ్రహ్మాస్మి — నేనే బ్రహ్మను

వైదికార్యుల భావనకంటె, ఉపనిషత్కారుల భావన ఉన్నతమైనది; కాని వారి బ్రహ్మ అచలుడు. “అచలోయం సనాతనః”

గౌతమ బుద్ధుడు ఇంతకంటె ఉన్నతమైన తాత్విక ధోరణిని, ‘ప్రవాహ సదృశమైన గతి ప్రకృతికంతా మూలం’ అనువాదాన్ని ప్రతిపాదించాడు. ప్రఖ్యాత జర్మన్ తత్వవేత్త (Oldenberg) చెప్పినట్లు “గతికంతా స్థితి మూలమని ఉపనిషత్తులు చెప్పాయి' స్థితికంతా గతిమూలమని బుద్ధుడు చెప్పాడు.”

సగుణ బ్రహ్మ భావన మతదృష్టికి, నిర్గుణ బ్రహ్మ భావన జడాత్మక దృష్టికి, ప్రవాహ సదృశమైన గతి భావన, ప్రాథమికమైన గతితార్కికదృష్టికి చిహ్నాలు. ఈ మూడు ప్రాపంచిక దృక్పథాలు కూడా ఆయా యుగాలలో గొప్ప ఆకర్షణలను కలిగించాయి.

శంకరుడు ఉపనిషత్తులలోని అద్వైతభావనాదాన్ని పునరుద్ధరించాడు. రాధాకృష్ణ చెప్పినట్లు :

“అత్యున్నతమైన కవితాదృష్టికి మతదృష్టికి శంకరుని అద్వైతం ఆకర్షణీయంగా ఉంటుంది. ఆ దశలో మానవుడు, హేతువాదాన్ని కొంచెం పక్కకునెట్టి ఆత్మజ్ఞానంవైపు మొగ్గుచూపుదామా అని అనికుంటాడు.” (భారతీయ తత్వశాస్త్రం ఇంగ్లీషు కాపీ 657 పేజి)

శాస్త్రీయ విజ్ఞానఫలితంగా ఏర్పడిన తార్కిక దృష్టిని మేళవించుకుని మానవునికి అత్యున్నతమైన ఆకర్షణీయమైన ప్రాపంచిక దృక్పథాన్నిచ్చేది గతితార్కిక భౌతికవాదమే. గతి తర్కధోరణి ప్రాశస్త్యాన్ని వివరిస్తూ ఎంగెల్సు ఇలా అన్నారు : “ప్రకృతిని గురించిన ఈ కొత్త దృక్పథంలో ఘనీభవించిన పాత భావాలన్నీ ద్రవీకరించాయి. శాశ్వతమని భావించబడిన ప్రత్యేకతలన్నీ అశాశ్వతములని క్షణికములని రుజువైనవి. ప్రకృతి అంతా నిరతం రచలనంలో వస్తులయానంలో అనంతంగా ముందుకు సాగిపోతుంది.”

(ప్రకృతి గతితర్కం - పీఠిక - 43 వ పేజీ)

“ఇదొక నిరంతరాయమైన వస్తులయానం. ఈ యానాన్ని కొలవటానికి భౌగోళిక కాలపరిమితులుపయోగపడకపోవచ్చు కూడా. ఈ మహాయానంలో పదార్థంయొక్క అత్యున్నతరూపం సైతం - సూర్య మండలం సైతం ఒకప్పుడు నశించవలసిందే - ఈ వస్తుల పరిభ్రమణం ఎంతకాలం జరిగినప్పటికి ఒకటిమాత్రం తథ్యం. పదార్థం దాని పరిణామాలు - అవిమాత్రం మారవు. ఈ గోళంలో ఏనాటికైనా మానవజాతి అంతరిస్తే, అనివార్యమైన ఆ సూత్రాన్ననుసరించే మరొక సమయంలో మరొక గోళంలో మానవజాతి ఆవిర్భవిస్తుందని కూడా రూఢిగా చెప్పవచ్చు.”

(అదే పుస్తకం 57 వ పేజీ)

# శంకరుని మాయావాదం

డాక్టరు కుప్పా వెంకటరామ శాస్త్రి, ఎం. బి., బి. ఎస్.

## అవతారిక

"బ్రహ్మసత్యమ్ జగన్మిథ్య జీవో బ్రహ్మైవనాపరః" (బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మయే కాని వేరుకాదు) అనే వాక్యం అద్వైత సిద్ధాంతసారము. ఈ వాక్యంలోని మొదటిభాగాన్ని గూర్చి విచారణ చేయడం ఈ రచన ఉద్దేశ్యం. ఈ విచారణలో వాద ప్రతివాదాలను స్పష్టంగా, నిశితంగా చూపి, జిజ్ఞాసకు తోడ్పడే విధంగా భావసంఘర్షణను ప్రదర్శించాలనే ఉద్దేశ్యంతో, బౌద్ధ తాత్విక గ్రంథాలలోను, శంకర భాష్యాలలోను ఉపయోగింపబడిన భాష్యశైలిలో ఈ రచన సాగింది. అద్వైతి సిద్ధాంతి. పూర్వపక్షి విమర్శకుడు. శాస్త్రవేత్త ఆధునికుడు. వీరి భావాల సంఘర్షణ ద్వారా అద్వైత స్వరూపాన్ని ఇదిగో దర్శించండి:

పూర్వపక్షి: దైనందిన జీవితానుభవానికి విరుద్ధంగా, జగత్తు వాస్తవికతను కాదనడం అర్థరహితం కాదా అని నా ప్రశ్న.

అద్వైతి: ఈ జగత్తు ఉనికిని నిరాకరించడం శంకరుని మతంకాదు. కుందేటికొమ్ము, గొడ్రాలి బిడ్డ, ఆకాశపుష్పంవంటిది జగత్తు కాదని శంకరుడు స్పష్టం చేశాడు. "నహి మృగ తృష్ణాదయోఽపి నిరాస్పదా భవంతి" అని.

పూర్వపక్షి: కుందేటి కొమ్ముకన్నా ఈ జగత్తు అధిక సత్యమని తమరు ప్రత్యేకంగా ఎత్తిచూపడం వృధాశ్రమ. బుద్ధిగతవిజ్ఞానంకంటె భిన్నమయిన బాహ్యార్థము (External reality) యొక్క వాస్తవికతను మీరు అంగీకరిస్తారా అనేది మొదటి ప్రశ్న.

అద్వైతి: బౌద్ధంలో ప్రధానశాఖ అయిన విజ్ఞానవాదాన్ని (Subjective idealism) శంకరుడు తీవ్రంగా ఖండించాడు. తెలుసుకొనుట అనే వ్యవహారమంతా ఆంతరంగికమయి బుద్ధిగతమవుతూంది గనుక, ఈ విజ్ఞానానికి అతిరిక్తమయిన బాహ్యార్థములను (External objects) అంగీకరింప నవసరం లేదని ఈవిజ్ఞానవాదుల అభిప్రాయం. సూత్రభాష్యంలో శంకరుడు ఈ వాదాన్ని నిరాకరించిన విధానం, తీవ్రఖండన చూస్తే, బాహ్యార్థముల వాస్తవికతను శంకరుడు నిరాకరించలేదని స్పష్టమవుతుంది. "నాభావ ఉపలబ్ధేః" (పంచమహాభూతాత్మకమగు అర్థ ప్రపంచముయొక్క అభావము అనగా శూన్యత్వము "న" అనగా సంభవింపదు. ఏలనన - ఉపలబ్ధేః - ప్రత్యక్ష ప్రమాణముచే అది లభ్యమగుచుండుటవలన - అనే సూత్రానికి శంకరుడిచ్చిన అర్థం. ఈ అర్థాన్ని భాష్యంలో ఇలా వివరించారు:

"బాహ్యార్థములు లేవన వీలులేదు. అవి ప్రత్యక్షముగ ఉపలబ్ధమగుచున్నవి. బాహ్యమున ఉపలబ్ధమగునది లేదన తగదు. భోజనముచేసి, భోజన కార్య సాధ్యమగు తృప్తిని అనుభవించుచు నేను భోజనము చేయలేదు - నాకు తృప్తి కలుగలేదు అను వానివలె బాహ్యవిషయములతో ఇంద్రియ సంనికర్షచే, స్వయముగ తెలియవచ్చుచున్న బాహ్యవిషయము నాకు తెలియుటలేదు. ఆ వస్తువులేదు అని పలుకువాని మాట లెట్లు అంగీకారమగును?..."

శాస్త్రవేత్త: అయితే మీరుకూడా ప్రత్యక్షముగ ఉపలబ్ధమగుచున్న అనుభవాన్ని అంగీకరించి, బాహ్యార్థ

మును వాస్తవికతగా అంగీకరిస్తారన్నమాట! నేను ఇలా అనుకోలేదు సుమండీ.

అద్వైతి: "లోకములో అందరూ స్తంభ కుడ్యాదులను ఉపలబ్ధజ్ఞాన విషయములుగా తెలిసికొనుచున్నారు. బాహ్యార్థముల నంగీకరింపని వారుకూడ అంతరంగికంగా తెలియవచ్చుచున్న రూపమేది కలదో అది బాహ్యమునకూడా భాసించుచున్నదని పలుకుచున్నారు. బాహ్యమున అవభాసించుచున్న విషయజ్ఞానము కలిగియున్నను, దానిని నిరాకరించుకోర్కెచే, బాహ్యమున ఉన్నదానివలే కాన్పించుచున్నదని వీరు 'వలె' శబ్దమును ప్రయోగించుచున్నారు. బాహ్యవస్తువున్నటుల వారంగీకరింపనిచో 'బాహ్య వస్తువువలె' అని బాహ్యవస్తువు పోలికనెట్లు చెప్పగలరు? విష్ణుగుప్తుడు వంధ్యా పుత్రునివలె (గొడ్రాలిబిడ్డ) కాన్పించుచున్నాడని యెవరూ చెప్పరు. అందువలన యథార్థముకూడా యేవిధముగా అనుభూతమగుచున్నదో, ఆ విధమున నే అంగీకరించి బాహ్య వస్తువే భాసించుచున్నదని యొప్పుకొనుట యుక్తము కాని, బాహ్య వస్తువులవలె నున్నదనుట యుక్తముకాదు......ప్రత్యక్షాది ప్రమాణములలో ఏ ప్రమాణమున కయినను ఉపలబ్ధముకాని వస్తువును లేదనవచ్చును. బాహ్యార్థములన్నియూ వాని వాని స్వభావాను సారముగ ప్రత్యక్షాది ప్రమాణములలో నేదో యొకదానిచే ఉపలబ్ధమగుచున్నవి...సహోపలబ్ధిచే (Simultaneous experience) అర్థజ్ఞానములకు అభేదము కలుగుటలేదు. ఘట(కుండ) జ్ఞానము, పట(వస్త్రము) జ్ఞానముఅను వ్యవహారమున జ్ఞానమునకు విశేషములగు ఘట పటములు భిన్నములు - జ్ఞానము భిన్నములగు బాహ్యార్థముల కంటె భిన్నమని, బాహ్యార్థముల వలన తెలియుచున్నది...విజ్ఞానము, విజ్ఞానము అని కలవరించు మీరు స్తంభము, కుడ్యము మొదలగు బాహ్య వస్తువుల నేల అంగీకరింపరో తెలియకున్నది. విజ్ఞానము అనుభవసిద్ధ మంటిరేని, బాహ్యార్థము కూడ అనుభవసిద్ధమని అంగీకరించుట యుక్తము. బాహ్యార్థము లేనిచో దాని జ్ఞానము స్వయముగ అనుభూతము కానేరదు. తన క్రియకు తాను విషయమగుట సాధ్యంకాదు."

ఇంత స్పష్టంగా బాహ్యార్థముల వాస్తవికతనుగూర్చి శంకరు డుద్ఘాటిస్తూంటే, జగత్తు వాస్తవికతను శంకరుని అద్వైతం నిరాకరిస్తున్నదని అనుకోవడం న్యాయమా? చెప్పండి.

## మిథ్య అంటే?

పూర్వపక్షి: అయితే జగత్తు మిథ్య అనే దానిలో 'మిథ్య' అనే దానికి ఏమి అర్థమిస్తారో స్పష్టంగా చెప్పవలసివుంది. మిథ్య అంటే స్వాప్నికజ్ఞానము వంటిదనా ఉద్దేశ్యం?

అద్వైతి: స్వాప్నిక జ్ఞానమువలెనే జాగరితమందలి స్తంభకుడ్యాది జ్ఞానమునకు ఆశ్రయం లేకుండ నుండకూడదా?- అనేవిజ్ఞానవాదిశంకకు "వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్" అనే సూత్రంలో శంకరులు ఇలా జవాబు చెప్పారు.

"జాగరిత జ్ఞానములు స్వాప్నిక జ్ఞానములవలె నిరాలంబనములు కావు. ఎందువల్లనంటే రెంటికి స్వభావభేదము కలదు...స్వప్నమునందు ఉపలబ్ధమైన వస్తువు మేల్కాంచిన తరువాత బాధితమగుచున్నది. (Contradicted) ... ఈ విధముగనే ఇంద్రజాలము... జాగరితమందుపలబ్ధమగుచున్న స్తంభాది జ్ఞానమునకు ఎట్టి అవస్థయందు బాధ కలుగుటలేదు ... జాగరిత జ్ఞానము సాక్షాదనుభవము. విషయము దగ్గరవున్నపుడు ప్రత్యక్ష జ్ఞానము, దగ్గరలేనపుడు స్మృతి అగుచున్నది. వైధర్మ్య మిటులుండ, జాగ్రత్స్వప్న జ్ఞానములకు కల భేదమును స్వయముగ అనుభవించుచు, జాగరిత జ్ఞానము స్వాప్నిక జ్ఞానమువలే మిథ్య అని ఎవరికిని చెప్పశక్యముకాదు. అనుభవమునకు విరుద్ధమగుటచేత, జాగరిత జ్ఞానము స్వయముగ నిరాధారమని చెప్ప చేత కాక, స్వాప్నికజ్ఞానముయొక్క పోలికచే నటుల సిద్ధాంతముచేయగోరుతున్నారు, విజ్ఞానవాదులు. స్వయముగ లేనిధర్మము పోలికచే సంభవింపదు; ఉదకసామ్యముచే అగ్నికి శైత్యము కల్పింపలేము."

పూర్వపక్షి: కృష్ణుడికన్నా గోవిందుడు కాస్తంత నయం అన్నట్లు స్వాప్నిక జ్ఞానం కంటె వ్యావహారిక జ్ఞానం కొంత మెరుగంటారు. అంతేనా?

అద్వైతి: బాహ్యార్థముల వాస్తవికతను స్పష్టంగా శంకరుడు అంగీకరించిన విషయం మనవిచేశానుగా? శంకరుడు వ్యావహారికసత్యాన్ని (Practical reality) అంగీకరించాడు. స్వాప్నికజ్ఞానమునుండి జాగరిత జ్ఞానమును వేరుచేసి కొంత మెరుగుగా చూపినంత మాత్రాన జగత్తు వాస్తవికతను అంగీకరించినట్లు కావని మీరు సూచిస్తున్నారు. ఈ వాదనకు వేరే జవాబు అనవసరం. బాహ్యార్థముల వాస్తవికతను గూర్చి శంకరుని స్పష్టమైన అభిప్రాయాలు చర్వితచర్వణం చేయనవసరం లేదనుకుంటాను.

పూర్వపక్షి : శంకరుడు వ్యావహారిక సత్యాన్ని అంగీకరించాడని పోనీ వాదనకు ఒప్పుకుంటాను. పారమార్థిక సత్యమైన (Fundamental reality) బ్రహ్మకన్నా హీనసత్యంగా ఈవ్యావహారికసత్యాన్ని పేర్కొన్నాడు కదా ?

అద్వైతి : ఈ సందర్భంలో శంకరుడిచ్చిన ఉదాహరణను అర్థం చేసుకోవడం అవసరం. మృత్తు (మట్టి) పారమార్థికసత్యం. ఘటాదులు (కుండలు) వ్యావహారిక సత్యం...మృత్తుకు అతిరిక్తమయిన, దానికంటె స్వతంత్రమయిన సత్యత్వం ఘటాదులకు లేదు. ఘటాదులు మృత్తుకంటె అన్యమయినవి కావు. ఏకైకమయిన మృత్తు విభిన్నమైన నామరూపాలతో వ్యావహారికంలో గోచరిస్తుంది. పారమార్థిక సత్యం పూర్ణసత్యం (Absolute truth). వ్యావహారిక సత్యం పరిచ్ఛిన్న సత్యం (Relative truth). ఏకైకమయినది దేశకాలాలచే పరిచ్ఛిన్నం చేయబడి నానాత్వంగా గోచరిస్తుంది. ఏకత్వం మూలసత్యం (Fundamental deeper reality). నానాత్వం పరిచ్ఛిన్న సత్యం. (Limited reality) జగత్తుయొక్క వాస్తవ ఉనికి సత్యాంశ. అపరిచ్ఛిన్నమైనది పరిచ్ఛిన్నమైనదిగా అనుభవం కావడం అసత్యాంశ. సత్ అసత్ ల సమ్మేళనమే మిథ్య అనే పదంచేత సూచితమవుతుంది.

శాస్త్రవేత్త : మీ దృష్టికీ, ఆధునిక శాస్త్ర దృష్టికీ పోలిక కనిపిస్తుంది. బల్లలు, కుర్చీలు, చెట్లు, జంతువులు, మనుష్యులు వీటి సత్యత్వాన్ని భౌతికశాస్త్రం కాదనడంలేదు కాని శాస్త్రదృష్టిలో ఇవన్నీ పదార్థం, శక్తియొక్క రూపాలు. పదార్థం (Matter), శక్తి (Energy) ఒకదానిలోకొకటి మారతాయి అని ఐన్‌స్టీన్ నిరూపించిన తర్వాత శాస్త్రదృష్టిలో మూల సత్యం ఒకటే. వ్యవహారములోకి వచ్చేటప్పటికి ఈ సత్యం యొక్క వివిధనామరూపాలను అందరిలాగానే మేమూ వాస్తవికతగా స్వీకరిస్తాము. శాస్త్ర కార్యకలాపాలలో వీటినన్నిటిని పదార్థశక్తి సంపుటిగా మాత్రమేచూస్తాము. వ్యావహారిక సత్యంకంటె మూల సత్యం పరిపూర్ణమైనదని, లోతైన (Deeper) దృష్టి అని అనకతప్పదు. ఇలా అనడం వ్యావహారికసత్యాన్ని నిరాకరించడం ఎలా కాగలదు ?

పూర్వపక్షి : పరిచ్ఛిన్న సత్యం - పూర్ణసత్యం అనే దశల విభాగం సమంజసంకాదని ఎవరూ అనరు. కాని శంకరుడిచ్చిన రజ్జుసర్ప దృష్టాంతాన్ని బట్టి జగత్తు భ్రాంతిగా చిత్రించబడి ఊహామాత్రమైన సర్పంవలె సత్యత్వం లేనిదవుతుంది. దీనిని ఆధునిక శాస్త్ర దృష్టితో పోల్చడం అసందర్భం.

అద్వైతి : ఉదాహరణలు ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని ఆశించి బయలుదేరతాయి. వాటి ఉపయోగం అంతవరకే. ఏకైకమయిన మూలసత్యాన్ని లేక పారమార్థికసత్యాన్ని శంకరుడు బ్రహ్మ అన్నాడు. ఈ మూలసత్యము నామరూపాత్మక జగత్తుకు ఉపాదాన కారణము (Material cause), నిమిత్త కారణము (Efficient cause) కూడా. బ్రహ్మ మూలసత్యం (Reality). మనకు గోచరమవుతూన్న దాని స్వరూపం (Appearance) జగత్తు. వీనిరెంటికి గల సంబంధం ఎట్టిది అనేది ప్రశ్న. మూలసత్యం జగత్తుగా పరిణామం చెందుతుందా ? లేక మూలసత్యంగానే వుంటూ జగత్తుగా భాసిస్తూన్నదా ? అనేదానికి మనం జవాబు చెప్పాలి.

శాస్త్రవేత్త : ఇది క్లిష్టమైన విషయమేమీ కాదు. మూల సత్యమైన పదార్థ, శక్తి సంపుటి బల్లలు, కుర్చీలుగా మార్పు, పరిణామం చెందుతుందా ? లేకపదార్థ శక్తి సంపుటిగానే వుంటూ బల్లలు కుర్చీలుగా వ్యవహారంలో గోచరిస్తున్నదా అని అడిగితే పదార్థ, శక్తి సంపుటి బల్లలు కుర్చీలుగా పరిణామం చెందుతుందని నేను అనగలను.

అద్వైతి : స్వరూప హానినిపొందే మార్పు పరిణామం - లేక ఆరంభం. స్వరూప హాని లేకుండా కనిపించే మార్పు వివర్త పరిణామం. ఇది మా వేదాంత పరిభాష.

మృత్తిక ఘటానికి ఉపాదాన కారణం. కుమ్మరి నిమిత్త కారణం. ఈ జగత్తుకు బ్రహ్మయే నిమిత్త ఉపాదాన కారణమగుచున్నాడు.

పూర్వపక్షి : అయితే, అద్వైతం పరిణామాన్ని నిరాకరిస్తున్నదన్న మాటేగా ?

అద్వైతి : ఇక్కడ మనం చెప్తున్నది మూల సత్యమునకూ దాని గోచర స్వరూపానికీ గలసంబంధం. ఈ సంబంధం ఎట్టిది అన్నపుడు ఇది పరిణామంకాదని అద్వైతం అంటున్నమాట నిజమే. నామరూపాత్మక వ్యావహారిక సత్యంలో గోచరించే వైవిధ్యాల అంతరంగిక సంబంధములు వేరే విషయం. అది అప్రస్తుతం. మూలసత్యానికీ దాని గోచర స్వరూపానికీ గల సంబంధం పరిణామం కాదనీ, వివర్తమే నని చూడానికి మాత్రమే రజ్జు సర్పదృష్టాంత మీయబడినది తాడును చూసి పాము అనుకున్న మనిషి వణ

భయంతో పరుగెత్తుతాడు. అది పాము కాదు అని గ్రహించినపుడు భయంతొలగి పరుగెత్తడం మానేస్తాడు. సర్పభ్రాంతి వున్నపుడూ, అది తొలగినపుడూ కూడ త్రాడు ఒకేలాగుంది. దానిలో ఎట్టిమార్పులేదు.

అలాగే నానాత్వపరిచ్ఛిన్నదృష్టి వున్నపుడు, అది తొలగిపోయినప్పుడు కూడ మూలసత్యముయొక్క ఏకత్వానికి అపరిచ్ఛిన్నతకు భంగం కలుగలేదు. ఇది తాడు, ఇది సర్పం అనుకున్నపుడుకూడ ఇది అనేది తాడనే పరమసత్యమే. అట్లే ఇది ఏకైకం - ఇది నానాత్వం అనుకున్నపుడుకూడ 'ఇది' ఏకైక పరమ సత్యమే. దృష్టాంతం ఇంతవరకే. ఇంతకన్నా దృష్టాంతాన్ని సాగతీయడం దృష్టాంతప్రయోజనాన్ని విస్మరించడమవుతుంది. లేనిపోని గందరగోళానికి అపార్థాలకు దారితీయడమవుతుంది. భ్రాంతి సర్పం వలె జగత్తు శూన్యమనేది అద్వైతవిరుద్ధవాదానికి దారి తీస్తుంది. భ్రాంతిరూపమైన సర్పం శూన్యంలో నుంచి బయలుదేరలేదు. వాస్తవికమైన పూర్వదృష్ట మయిన సర్పజ్ఞానం అసందర్భంగా త్రాడు అనే వాస్తవమైన అధిష్టానంలో ఆరోపితమయింది. సర్పభ్రాంతి తొలగినపుడు భ్రాంతి సర్పం శూన్యంలో లయంకాలేదు. వాస్తవమైన రజ్జులో లయమైంది. అదేవిధంగా ఏకైకమయిన, అపరిచ్ఛిన్నమయిన పరమ సత్యం (బ్రహ్మశబ్దనిర్దేశితం.) నామరూపాదులలో, దేశకాలాలతో పరిచ్ఛిన్నమయిన జగత్తుగా గోచరిస్తుంది. ఇక్కడ నామరూపాలు, పరిచ్ఛిన్నత పూర్వానుభవమైన సాపేక్షసత్యం. అనుభవసిద్ధమైన యీ సాపేక్ష సత్యం సందర్భ రహితంగా పరమ సత్యంలో ఆరోపించ బడుతూంది. జ్ఞానోదయంకాగానే వ్యావహారిక సత్యమైన జగత్తు తిరిగి ఏకైక మయిన, అపరిచ్ఛిన్నమైన బ్రహ్మగా భాసిస్తూంది. అంటే జగత్తు 'ఉఫ్' అని శూన్యంలోకి అదృశ్య మయిందని కాని, నాశన మయిందని గాని అర్థంకాదు. జగత్తు యింకొక రకంగా ఏకత్వంగా అపరిచ్ఛిన్నంగా అవగతమయింది. అంతే. శంకరుడు జీవన్ముక్తిని అంగీకరించాడు. జీవన్ముక్తుని ఎదుట ఉన్న జగత్తు నాశనం కాలేదే. వచ్చిన మార్పల్లా అతని దృష్టిలో భేదం - పరమ సత్యంయొక్క స్వరూపగోచరంలో మార్పు. జగత్తులోని ప్రతి వస్తువూ పరమ సత్యమైన బ్రహ్మగా భాసిస్తుంది. జగత్తు నిరాస్పదమైన శూన్యమయితే, జీవితంలో సాధనద్వారా జ్ఞానోదయం - ధర్మాధర్మ విచక్షణ అనేది వుండనేవుండదు. ఈ విషయాన్ని మాండూక్యోపనిషత్తు భాష్యంలో శంకరులు వివరించారు.

పూర్వపక్షి: భ్రాంతి, వివర్త మనునవి ఎట్టి పరిస్థితులలోను సమాన ధర్మాలుగల రెండు సగుణాల మధ్యనే సాధ్యం. సన్నగా, పొడవుగా వుండడం, నేలను కరచుకొని వుండడం - తాడు సర్పం అనే రెండు సగుణ స్వతంత్ర పదార్థాలమధ్య సామాన్య ధర్మాలు. నిర్గుణమైన, ఏకైకమయిన మీ బ్రహ్మకూ సగుణమయిన స్వతంత్ర సత్తాలేని జగత్తుకూ మధ్య అధ్యాస (Erroneus perception) ఎలాసాధ్యం?

అద్వైతి: పరిచ్ఛిన్నత అనేది మానవుని యొక్క నైసర్గికమైన సదసద్రూపమైన వ్యవహారానుభవం. ఈ వ్యావహారికసత్యాన్ని పరమ సత్యంలో అధ్యాస చేయడం జరుగుతూంది. అదీగాక పూర్వభ్రాంతినుండి ఉత్తరోత్తరభ్రాంతిసాధ్యమనిశంకరులుచూపారుకదా.

పూర్వపక్షి: పరమసత్యము దృష్టముగానివిషయం. పూర్వదృష్టము కాని వస్తువులో అధ్యాస ఎట్లు సంభవం?

అద్వైతి: సత్యమనేది ఒకటున్నదని అందరం అంగీకరిస్తున్నాము. ఈ విశ్వం సత్యమనుకొన్నప్పుడు ఇంద్రియాలద్వారా దీనిని గూర్చిన మన గ్రహణ సాపేక్ష మయినదే గాని పూర్ణము కాదు అనే ప్రత్యక్ష అనుభవంనుంచి పూర్ణసత్యాన్ని అనుమానం ద్వారా (Inference) గ్రహిస్తున్నాము. ఇక్కడ ప్రత్యక్షంగా పూర్వదృష్టంకాని పరోక్ష సత్యంలో ప్రత్యక్ష సత్యాన్ని అధ్యాస చేస్తున్నాము. ప్రత్యక్ష సత్యం కాకుండా అనుమానం ద్వారా గ్రహించిన ఆకాశంలో నీలిరంగును అధ్యాస చేయడం మనం చూస్తున్నాము. కాబట్టి కళ్ళకు కనిపించని బ్రహ్మలో జగత్తును ఆరోపించడం అసంభవం అనే వాదంలో పసలేదు.

## మాయ లేక అవిద్య

పూర్వపక్షి: వాదానికి వివర్తాన్ని అంగీకరించినా వివర్తానికి కారణమేమిటనే ప్రశ్న మిగులుతుందికదా? ఏకైకమయిన అపరిచ్ఛిన్న పరమసత్యం తాను మారకుండా నానాత్వంగా, పరిచ్ఛిన్నంగా గోచరిస్తుందని మీరంటారు. ఇది ఎలా సాధ్యం?

అద్వైతి: మాయ లేక అవిద్యవల్ల ఇది సాధ్యమౌతున్నదని శంకరుడు స్పష్టంచేశారు. సత్యాన్ని మరుగుపర్చి, ఇంకొక రకంగా చూపే ఆవరణ విక్షేపశక్తి మాయ (Covering and distorting force).

పూర్వపక్షి : ఈ మాయయొక్క స్థావర మెక్కడని మీ అభిప్రాయం ?

అద్వైతి : మాయ బ్రహ్మకంటె వేరయినది కాదు. సూర్యుడు తన కాంతిచే వస్తువులను ప్రకాశింపచేస్తూనే, మన దృష్టినుండి నక్షత్రమండలాన్ని, తన స్వరూపాన్ని మరుగుపరుస్తున్నాడు. ఆవరణశక్తి, ప్రకాశం రెండూ సూర్యునికే చెందినట్లు మాయ, ప్రకాశం రెండూ బ్రహ్మకు చెందినవే. దీనినే ఇంకొకవిధంగా మనం చెప్పవచ్చును. సూర్యకాంతిని ఛేదించుకుని చూడలేకపోవడం మన దృష్టియొక్క పరిమితి శక్తివలన అని కూడా చెప్పవచ్చును. అనంతమయిన బ్రహ్మను దేశకాలములచే పరిచ్ఛిన్నంచేసి గ్రహించడం - ఏకైక బ్రహ్మను నామరూపాలతో వివిధముగా గ్రహించడం మన పరిచ్ఛిన్నతవల్ల అని అనుకోవచ్చును. ఏకైక సత్యమును భిన్నఖండాలుగా, అనంతమైన దానిని పరిచ్ఛిన్న ఖండాలుగా గ్రహించే వ్యక్తిగత స్వభావాన్ని శంకరుడు అవిద్య అనే పేరుతో నిర్దేశించాడు. వ్యక్తిపరమైన అవిద్యా, విశ్వవ్యాప్త బ్రహ్మపరమైన మాయా రెండూ ఒకేశక్తిని గూర్చిన భిన్ననిర్వచనాలు. వ్యవహారసత్యమయిన జగత్తునుండ పరమసత్యమయిన బ్రహ్మను దర్శించుటకు మార్గము అవిద్యా నివృత్తియే. అనగా పరిచ్ఛిన్నతను, ద్వైతదృష్టిని అధిగమించడమే.

పూర్వపక్షి : మాయ బ్రహ్మలోవుంటే మీ బ్రహ్మయొక్క నిరవయవత్వానికి, నిర్గుణత్వానికి భంగంకాదా?

అద్వైతి : మాయ ద్రవ్యంకాదు. ఏకైక పరమసత్యాన్ని నానాత్వంగా గోచరించేటట్లుచేసి, అపరిచ్ఛిన్న సత్యాన్ని పరిచ్ఛిన్న ఖండాలుగా విభజించి రూపరహితవస్తువునుండి రూపాలనుసృష్టించే అనిర్వచనీయ వ్యాపారం మాయాశబ్దంచే సూచితమవుతుంది. మాయ బ్రహ్మకంటె అతిరిక్తమైనసత్యంకాదు. బ్రహ్మ అద్వితీయుడు కనుక, బ్రహ్మతోచేరని ఇంకొక సత్యంలోని భాగంకాదు మాయ. మాయ సత్తూ కాదు; అసత్తూ కాదు. నామరూప జగత్తును సృష్టించినంతవరకు మాయకు సత్యత్వంవుంది. బ్రహ్మకు పరిమితి నేర్పరచగలిగినంత సత్యంలేదు. బ్రహ్మవలె సత్యమూ కాదు. ఆకాశ కుసుమంవలే అసత్యమూ కాదు. అందుకనే మాయ అనిర్వచనీయం. మాయ బ్రహ్మతో ముడిపెట్టబడేటప్పటికి నిర్గుణబ్రహ్మ సగుణుడైన ఈశ్వరుడుగా మారిపోతుంది. మాయ ఈశ్వరుని శక్తిగా భాసించి సృష్టికి కారణభూత మవుతుంది. ఈశ్వరుడు మాయచే స్పృష్టంకాడు.

పూర్వపక్షి : మీరెంత చెప్పినా బ్రహ్మ - మాయలకుగల సంబంధాన్ని నిర్వచించడంలో విఫలమయారనేది స్పష్టంగా కనిపిస్తూంది.

అద్వైతి : బ్రహ్మతో దాని సంబంధం నిర్వచనీయమైతే అది మాయ అని అనిపించుకునే అనిపించుకోదు.

శాస్త్రవేత్త : సాపేక్ష సత్యాలైన దేశం, కాలం, కార్యకారణ నామరూప సంబంధాలతో మూల సత్యాన్ని విభజించడంవలన సత్యం ఏలా వున్న దానికి భిన్నంగా మనకు గోచరస్తుందో ఆధునిక శాస్త్రజ్ఞానంవలన మనం చూడవచ్చు. ఈ విధంగా సత్యాన్ని పరిచ్ఛిన్నం చేసి, మరుగుపర్చగల శక్తుల వ్యాపారాన్ని మాయ అనవచ్చునేమో?

పూర్వపక్షి : ఈనాటి విమానాలు, అటంబాంబులు అన్నీ యిదివరకే మనవాళ్ళకు తెలుసు అనే ధోరణిలో భావవాదమైన అద్వైతాన్ని శాస్త్రవిజ్ఞానంతో ముడిపెట్టడం సమంజసం కాదేమో?

శాస్త్రవేత్త : మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. ఆధునిక శాస్త్ర విజ్ఞానానుభవం - శంకరుని కొన్ని సూత్రీకరణలను అర్థం చేసుకోడంలో తోడ్పడుతుందేమోనని నా ఆశ. అందుకే ఈ ప్రస్తావన. ఈనాడు తత్వశాస్త్రాన్నీ శాస్త్రవిజ్ఞానాన్నీ (Science) విడదీయలేము............

అద్వైతి : మన ద్వైతకుటుంబంలోనుంచి అద్వైతం స్థిరపడడం అంత తేలికైన పనికాదు. కనుక చర్చను నేటికి చాలిద్దాం.

# ఉపసంహారము

అద్వైతం భావవాదమయినప్పటికీ, ఆ బిళ్ళ తగిలించి దానిని చెత్తగా త్రోసివేయడం సరికాదు. "భావవాద తాత్విక దృష్టిని చెత్తగా యాంత్రిక భౌతికవాదం మాత్రమే భావిస్తుంది. బహుముఖమైన జ్ఞానంలో ఒక ముఖాన్ని గోరంతను కొండంతలుచేసి వికృత

రూపం కల్పించడం భావవాద తాత్త్వికదృష్టి లోని లోపం" అన్న లెనిన్ వాక్యాలు జ్ఞాపకం చేసుకో తగ్గవి. హెగెల్ పట్ల మార్క్స్ అవలంబించిన వైఖరివలెనే, అస త్యాంశను విమర్శిస్తూ సత్యాంశను స్వీక రిస్తూ, పాతను అధిగమిస్తూ కొత్తను చేరుతూ పరమసత్యం వైపు పురోగమించడమే సరి యైన పద్ధతి.

తత్త్వశాస్త్ర వికాసంలో ద్వైతం నుంచి అద్వైతానికి వేసిన గంతు చాలా ప్రధాన మైన మార్పు. అఖండసత్యంలోనుంచి ఖండ సత్యాలను విడదీసి (Abstraction) వానికి స్వతంత్ర సత్తాను కల్పించడం ద్వైతదృష్టికి కారణం. పదార్థం - చైతన్యం అన్యోన్య ఆశ్రయాలు. ఒకటి లేకపోతే రెండవదానికి ఉనికి లేదు. ఈ రెంటి సంపుటీ అఖండసత్యము. పదార్థం, చైతన్యం ప్రక్కప్రక్కనే దేనికది వుంటూ ప్యాకెట్టుగా కట్టబడిన ఐక్యత కాదిది. పదార్థం - చైతన్యం అనే ఖండాలు తార్కి కంగా తప్ప వాస్తవంగా విడదీయ వీలు లేనివి. పదార్థ చైతన్యాల అఖండ సంపుటి అభివ్యక్తిని (Manifestation) బట్టి జడంగా, నిర్జీవంగా, జీవంగా, మనస్సుగా మనం ఈనాడు ఊహించలేని అనేక యితర రూపా లలో భాసిస్తుంది. పదార్థ - చైతన్య సంపుటి అభివ్యక్తిలో అనంతమైన అవకాశా లున్నాయి. పదార్థ - చైతన్యాల ఐక్యతను రెండు విభిన్నాల ప్యాకెట్టుగా చూడడం మన లోని యాంత్రికదృష్టియొక్క అవశేషం.

అఖండమైన యీ సంపుటినుండి ఖండా లుగా పదార్థాన్ని, చైతన్యాన్ని వేరుచేసి వానికి స్వతంత్రసత్తా కల్పించేభావవాదమూ, భౌతికవాదమూ, వానిమధ్య సంఘర్షణా ఈ అఖండదృష్టిలో అవాస్తవికమూ, అర్థరహి తమూ. భావవాదం, భౌతికవాదం రెంటి లోనూ సత్యాంశా వుంది - అసత్యాంశా వుంది. చైతన్యంలేని జడపదార్థం అంటూ ఒకటున్నదని అనుకోవడం యాంత్రిక భౌతిక వాదంలోని పొరపాటు. పదార్థ ఆశ్రయం లేని చైతన్యం వుంటుం దనుకోవడం భావ వాదంలోని పొరపాటు.

చేతన కారణవాదాన్ని ప్రతిపాదిస్తూ శంక రుడు ఇలా వివరించారు: "చేతనాచేతసత్వము అభివ్యక్తి భేదముచే కలుగుచున్నది. చైత న్యము కార్యమునందు కనపడకపోవచ్చు. జీవులయందు కూడ నిద్ర, మూర్ఛ మొద లగు అవస్థలయందు చైతన్యము కనపడుట లేదు. అదేవిధముగా కాష్టలోష్టాదులయందు (కొయ్య, రాయి) కూడ కాన్పించుట లేదు. చేతనము అన్నింటియందునూ సమానత్వమే అయినను కొన్నిటియందు గోచరమగు చున్నది. మరికొన్నిటియందు గోచరమగుట లేదు. అందువలన రూపాది భేదము కలుగు చున్నది" అద్వైత దృష్టిలో జడమనేది లేదు. జడమనేది కూడ చేతనముయొక్క అభివ్యక్తి భేదమువలన కలిగినదే. పదార్థ చైతన్యాలనే తార్కిక ఖండ సత్యాలకు చేతనమనే పరమ సత్యంలో ఐక్యతను చూచాడు, శంకరుడు. ఈ రెండు ఖండసత్యాలకు పదార్థమనే పరమ సత్యంలో ఐక్యతను చూస్తుంది, గతితార్కిక భౌతికవాదం. పరమ సత్యంలోని ఖండ సత్యాలను తార్కికంగాతప్ప విడదీయ లేనప్పుడు, సత్యం అఖండమని అంగీకరించి నపుడు చేతన కారణంలో పదార్థ మున్నట్లే, పదార్థ కారణంలో చేతన మున్నట్లు అంగీక రించాలి. శంకరుడు చేతనకారణాన్ని నిర్గుణం,

నిరవయవం అన్నాడు. అఖండ సత్యాన్ని అంగీకరించినప్పుడు నిరవయవత్వాన్ని అంగీకరించక తప్పదు. అవయవ భేదం తార్కిక విభజనే కాని వాస్తవం కాజాలదు. కాని నిర్గుణం అంటే శూన్యంఅని శంకరుని ఉద్దేశ్యం కాదు. పదార్థ రహితమని అనుకోవలసి వస్తుంది. పదార్థ రహితమైతే జడంగా భాసించే దానికి ఎలా కారణమౌతుంది? కార్యం కారణంలో లేనిది కాదనే సత్కార్య వాదానికి అంగీకరించాడుగా శంకరుడు. ఈ ఇబ్బందిని తప్పించుకునేందుకు కార్యం మిథ్య అన్నాడు. ఇది వాస్తవ నిరాకరణ. కార్యం కారణంకంటె అన్యమైనది కాదనే దృక్పథాని కిది దారితీసింది. కార్యం కారణం కంటె అన్యమైంది.

కాని కార్యం, కారణం ఒకటి కావు. అనన్యత్వాన్ని (Non-difference) సమానత్వంగా (Identity) చూడడంవలన ఏర్పడిన గందరగోళం ఇది. శంకరుని అద్వైతంలో విరుద్ధాల ఐక్యత సాధ్యమనే గతితార్కికదృష్టి కొరవడినందువల్లనే ఈ ఇబ్బంది ఏర్పడింది. అనన్యంగా వుంటూ, సమానంకాని విభిన్నత్వం గతితార్కిక దృష్టిలోనే సాధ్యం. ఒక విధంగా పరమసత్యానికి నిర్గుణత్వం సాధ్యమౌతుంది. గుణం అనేది పరస్పర సంబంధంలోనే వ్యక్తమౌతుంది. ఇతర వస్తువుల సంబంధంలో గుణాలు వ్యక్తమౌతాయి. ఎన్ని సంబంధాలుంటే అన్నిగుణాలు వ్యక్తమౌతున్నాయి. అందువలన పరస్పర సంబంధాలనుబట్టి వ్యావహారిక ఖండ దృష్టిలో గుణాలు అనంతంగా వుంటాయి. అఖండ సత్యదృష్టిలో అది అద్వితీయమైనపుడు దేనితో సంబంధం? సంబంధం కలగడానికి రెండవది లేనప్పుడు గుణం ఎక్కడిది? అందువలన సత్యానికి అఖండ దృష్టిలో నిర్గుణత్వం – ఖండ దృష్టిలో సగుణత్వం ఏర్పడుతుందని అనుకోవచ్చు. శంకరుని అభిప్రాయం ఇదేనా అనేది నిర్ణయించడంలో అవునవడానికి అవకాశంవుంది – పరిచ్ఛిన్న వ్యాపారాన్ని మాయగా నిర్దేశించాడు కాబట్టి.

ఏమైనా పదార్థానికీ శక్తికీ అన్యోన్యాశ్రయత్వం కల్పించిన ఐన్‌స్టీన్ పరిశోధనలకు భౌతికశాస్త్రంలోగల ప్రాముఖ్యత అద్వైతానికి తత్వశాస్త్రంలో వుంటుంది. ఇది మనం గుర్తించవలసిన విషయం. ద్వైతం నుంచి అద్వైతానికి మార్పుకూడా చాలా ప్రాముఖ్యత గలదిగా అంగీకరించాలి, గతితార్కిక భౌతికవాదులం. మనం అద్వైతంలో పదార్థానికి చైతన్యానికి పదార్థమనే పరమసత్యంలో ఐక్యత కుదిర్చాం. కాని జడపదార్థంనుంచి జీవపదార్థం బయలుదేరింది. కాబట్టి భౌతికవాదం అంగీకారయోగ్యమనే వాదన గందరగోళానికి దారితీస్తుంది. జడపదార్థమనేది గతిరూప చైతన్యం లేనిదికాదు. జడం జీవం– మొదలైనవి పదార్థ చైతన్య సంపుటియొక్క భిన్నవ్యక్తీకరణలు. పదార్థ చైతన్యసంపుటియైన గతితార్కిక సత్యం యొక్క అభివ్యక్తిని జడంనుంచి చేతనానికి ఎందుకు పరిమితంచేయాలి? ఈ అభివ్యక్తి శంఖావర్తంవలె (Spiral) చక్ర క్రమంలో సాగుతున్నప్పుడు – ఈ చక్రంలో జడ జీవ పరిణామం మనకు వ్యక్తమయిన ఒక చాపం (Arc)మాత్రమే. ఇలాగతితార్కికక్రమంలో జడ – జీవ పరిణామాన్ని పరమసత్యంగా కాక సాపేక్ష సత్యంగా మాత్రమే స్వీకరించాలి. ఇట్టి సాపేక్ష సత్యంపై గతితార్కిక

భౌతికవాదం ఆధారపడడానికిబదులు పదార్థ చైతన్యాల్లోని ఆ భేదంపై ఆధారపడవలసి వుంటుంది. పదార్థం, చైతన్యం భిన్నంగా వుంటూ ముడివేయబడిన ప్యాకెట్టుగా సత్యాన్ని చూడడమనే యాంత్రికవాద అవశేషాన్ని భౌతికవాదం విసర్జించాలి.

అద్వైతం పరమసత్యమనీ - ద్వైతం వ్యావహారిక సత్యమనీ నిర్వచించిపారమార్థిక (Absolute)వ్యావహారిక(RelativePractical)సత్యాల మధ్యగలసంబంధాన్ని వివరించడంలో అద్వైతం తత్వశాస్త్రాభివృద్ధిలో ఒక ముందడుగు వేసింది. అంతకుముందుబౌద్ధులు కూడా ఈ దశలను విభాగించేసినా, ఈ దశల సంబంధవివరణకు వారుపూనుకోలేదు. పరమ సత్యానికీ వ్యావహారిక సత్యానికీ మధ్యగల సాపేక్షతను గుర్తించి, పరిచ్ఛిన్నతనునానాత్వాన్ని అధిగమించడంవల్లన మనదృష్టి సంబంధం రెండు విభిన్నశక్తులమధ్య సంబంధం వంటిదికాదని, సత్యానికీ, దాని గోచరత్వానికీగల సంబంధం కనుక ఇక్కడ పరిణామవాదం వర్తించదనీ, ఏకైకం నానాత్వంగా, అపరిచ్ఛిన్నం పరిచ్ఛిన్నంగా గోచరించడమనేది వివర్తపరిణామంవల్లనే సాధ్యమవుతుందనేది - ప్రాముఖ్యతగల సాహసోపేతమైన సూత్రీకరణ. వ్యావహారిక సత్యంయొక్క పూర్ణత్వాన్ని సాధించుకొంటూ పరమ సత్యాన్ని చేరగలమనే సూత్రీకరణ సత్యాన్వేషణలో మనం చేసే కృషిలో పదునైన ఆయుధంగా వినియోగపడగలదు. ఐన్‌స్టీన్ ఈ ఆయుధాన్ని చక్కగా ఉపయోగించడంవలన గొప్ప ఫలితాలను సాధించాడు.

శక్తివంతమైన (Dynamic)బౌద్ధం క్షీణించింది. తాత్విక చర్చను నిరాకరించి తత్వప్రకాశశూన్యమయిన కర్మకాండలో మునిగి తేలే ఛాందస పూర్వ మీమాంసాపద్ధతి ప్రభుత్వ ఆసరంతో ప్రబలుతున్న రోజులవి. హేయమైన నరబలులు మొదలగు వానితో సూఢ్యాన్ని పెంపొందిస్తున్న శాక్తేయ కాపాలిక మతాలు విచ్చలవిడిగా పెంపొందుతున్న రోజులవి. అట్టి సాంఘిక పరిస్థితులలో ఉపనిషత్తులలోని నిగూఢమైన తాత్విక చర్చల పైకి దృష్టిని మరల్చి తత్వశాస్త్ర పునరుజ్జీవనానికి విజ్ఞాన దృష్టిని పెంపొందించడం శంకరుడు సాధించినఅభివృద్ధికరమైనమార్పు. స్థాయీభేదాలను అంగీకరించే విశాల ఉదార దృష్టితో మతతాత్విక రంగాలలో సహన ధోరణిని పెంపొందించుటకు శంకరుడు అద్వైతం ద్వారా నిర్వహించిన పాత్ర అభ్యుదయకరమైనది.

వ్యవహార సత్యంయొక్క సాపేక్షతను అతిగా నొక్కిచెప్పడంవలన సాపేక్ష సత్యానికి మిథ్య అని నామకరణం చేయడం - ఏకత్వాన్ని నానాత్వంగా, అఖండాన్ని ఖండాలుగా చూపి పరిచ్ఛిన్న బుద్ధిగత వ్యాపారానికి మాయ అని పేరుపెట్టడం, దానికి ద్రవ్యంవలె ఉనికినికల్పించి, వేరు చేసి, దాని సంబంధాల గూర్చిన అవాస్తవిక చర్చతో గందరగోళం కలిగించడంవలన - జగత్తు వాస్తవికతను నిరాకరించే మెట్టవేదాంతమూ, నిరాశాదృక్పథమూ ప్రబలి ప్రమాదకరమైన పరిణామాలకు దారితీసింది. వ్యావహారిక సత్యంగా అంగీకరింపబడిన సగుణ జగత్తులోని ఆంతరంగిక సంబంధాలనునిర్వచించే పరిణామవాదాన్ని వ్యావహారిక సత్యంలో భాగంగా గుర్తించ నిరాకరించడం. ఇక్కడ కూడా వివర్త పరిణామాన్నే స్వీకరించడం -

నిరాకరణ దృక్పథ విజృంభణకు దోహదం చేసింది.

అనన్యత్వాన్ని సమానత్వంగా చూచి, కార్యకారణ సంబంధంలో కార్యాన్ని మిథ్యగా నిర్వచించడం జడాత్మక దృక్పథ విజృంభణకు దోహదం చేసింది.

పరమ సత్యంతో మానవునికి ఐక్యతను కల్పించి, మానవుని పూర్ణవికాసానికి గల అవకాశాలను చూపి విశాలదృష్టిని చైతన్యాన్ని పెంపొందించ సమర్థమయిన జీవ బ్రహ్మైక్యవాదం రెండవ స్థానంలో అడుగున పడి జగన్మిథ్యా సిద్ధాంతం అపార్థాలతో నెత్తికెక్కడంవలన భారత జాతికి కలిగిన నష్టం అపారం.

(ఈ వ్యాసం 1957 అక్టోబరులో వెలువడిన తాత్విక ఐతిహాసిక అధ్యయనసంచిక -సందేశం-లో ముద్రింపబడింది. లోగడ అద్వైతగోష్ఠిలో అదికూడ చర్చింపబడినందున యితర వ్యాసాలతోబాటు దానినికూడా యిచ్చట ప్రచురిస్తున్నాం. —సం.)



# శంకరాద్వైతం

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు

నేడు మనం చదివే అద్వైతానికి గోత్రప్రవర్తకుడు గౌడపాదుడు. స్వీయప్రతిభతో దేశం నలుమూలలా తిరిగి శంకరుడు దానిని వాద ప్రతివాదాలతో, భాష్యాలతో ప్రాచుర్యంలోకి తెచ్చాడు. శాస్త్రపరిశీలనవల్ల నిద్ర, జ్ఞాపకం, భ్రాంతి, స్వప్నాల అనుభవంలో అద్వైతుల ఆత్మభావనకు ఆలంబం లేదన్నారు రచయిత. శంకరుని అధ్యాసభాష్యానికి వుపపత్తి లేదన్నారు. తద్వారా మాయావాదం బ్రహ్మభావనతో పొసగనిదని ఆక్షేపణలు చూపారు. శంకరునిలో స్వీయాత్మక ధోరణి (Subjective Idealism), బాహ్యార్థవాద ధోరణి (Objective Idealism) రెండూవున్నాయని నిరూపించారు. పరమసత్యం, వ్యవహార సత్యం అనే అద్వైత విభజన నేటి విజ్ఞానశాస్త్రంలోని పూర్ణ, సాపేక్ష్యసత్యాలతో సమ్మతించేది కాదన్నారు. మూలసత్యం వివర్తం చెందడం అనే అభిప్రాయానికి సైన్సులో తావులేదన్నారు. "శంకరుని మాయావాదం" అనే వ్యాసంలోని అన్నిహంశాలకు యీ వ్యాసంలో పలుతావుల్లో సమాధానా లున్నాయి.

ప్రకృతిలో సామాన్యాంశ కెంత స్థానముందో, విశేషాంశకు కూడా అంతే స్థానం వుంది. రెండూ సమ సత్యాలే. ప్రత్యేకత లేకుండా సామాన్యాంశ లేదు. అవి రెండూ అన్యోన్యాపేక్ష్యాలు. ఇందులో ఏ అంశను వుపేక్షించినా, ఆ లోకి నైకొనక పోయినా సమగ్రతకు భంగం వాటిల్లుతుంది; పాక్షిక సత్యమే కాగల్గుతుంది. అనుకోకుండా అటువంటి తత్వ చర్చలో పడుతున్నాము. అందులోనూ పరామర్శించ బోయేది అద్వైత వేదాంతాన్ని. అందుకని ముందే విస్పష్టమైన వివాదంతో విషయ ప్రారంభం చెయ్యడ మెందుకు? మరోవిధంగా ప్రస్తావన చేయొచ్చు.

వ్యక్తిత్వం మేధోధర్మం. మేధస్సునైన అంతస్తులలో అడుగుమోపేకొలదీ మానవునిలో అవ్యాకృతంగా, ఛాయగా దాగుండే స్వయంవ్యక్తి పూర్ణబింబంగా, ప్రస్ఫుటంగా అభివ్యక్తి పొందుతుంది. నిలువెల్ల మెదడు ప్రవహించే మహా మేధావులకది నిసర్గశోభ. మేధావి ప్రమ్యులకదొక పెట్టని ముత్యాలు. అది వారు కనుపాపలా కాపాడుకునే తాపత్రయంతో వెగటు కలిగిస్తుంది. వ్యక్తిత్వం కళాతపస్వికి పొందిన వర మయితే, తత్వవేత్తకది అందుకోమని వచ్చిన కానుక. అతనిది వ్యక్తి వైభవం.

వ్యక్తి ముద్ర పడగూడదని, వ్యక్తి నీడ ఆరరాదని అతిభద్రత నుపలక్షించేవి మతం, విజ్ఞానశాస్త్రాలు. విజ్ఞానశాస్త్ర ఫలితాలను ఆహార పానీయాలుగా సేవించి జీవిక సాగించే తత్వశాస్త్రం చరిత్రలో చాలా యిటీవలిది. భారతదేశం దానినింకా ఆకళింపు జేసుకోనేలేదు. ఇక వుపనిషత్తులనాడు దీని వూసెక్క డుంటుంది? నాడున్నదంతా వూహాప్రధానమైన తత్వ చింతనే. మరి వూహ అంటే కటునివంటి వ్యక్తిత్వా ఆకాశంలో అంతంతై ఎదిగిపోయేందుకు అనుకూల వాతవరణమున్నమాట. అటువంటప్పుడు ఆ వూహాత్మక తత్వచింతన (Speculative Philosophy) లో వ్యక్తిని మెసలనివ్వకుండా, అడకట్టి అంతర్ధానం గావిస్తుంటే సత్యాన్వేషణే మాయ మవుతుంటుంది. ఉపనిషత్తులలోని అన్ని ప్రకరణాలు తీరలేని గొంతు కతో ఒకేమాట నుచ్చరిస్తున్నాయనడంతో వూరు కోక, అన్ని వుపనిషత్తులూ కలిసి బృందగానంలో

వరుసగా నిలబడి వొకే పల్లవిని ఆలపిస్తున్నాయంటే న్యాయం, నిరంకారమనుకోవడం సహజం.

కాని అటువంటి అన్యాయానికి వొడిగట్టిందే వేదాంతశాఖ. ఆ శాఖలో పలురకాల ద్వైతాద్వైతం, రకరకాల అద్వైతం, కడకు ద్వైతంకూడా వున్నాయి. ఇన్ని కోవలూ వుపనిషత్తులన్నీ యీమూలనుండి ఆ మూలవరకు తమన్నే సమర్థిస్తున్నాయంటాయి. అనగా వుపనిషత్తులలోని తత్త్వవేత్తల వ్యక్తిత్వాలు జావగా పోవాలన్నమాట. పూర్వుల వ్యక్తిత్వాలను తెరమరుగుకు త్రొక్కివేసే సాంకేతిక విధానమే భాష్యపద్ధతి. అనగా, అక్షరాలను మార్చకుండా అర్థాలను మార్చి తమ అభిమతాన్ని ప్రాచీనత, సంప్రదాయం పేర చెలామణీ చేసే సాధనవిశేషం.

ఉపనిషత్తులలోని తత్త్వవేత్తలంతా ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చారని చెప్పడమే 'వేదాంతసూత్రం' పుట్టుకకు కారణం. దానికి కర్త బాదరాయణుడు. వుపనిషత్తులలో ఏకాభిప్రాయం ముందని బయల్దేరిన వారిలో యీయన మొదటివాడుగాడు. ఆయనకు ముందు అనేకులున్నారని ఆయనవల్లనే తెలుస్తుంది. ఆశ్మరథ్యుడు, ఔడులోమి, కాశకృత్స్నుడు, కార్ష్ణాజిని, బాదరి అన్నవారు కూడా బాదరాయణునివలెనే సూత్రకర్తలైయున్నారు. వారి రచనలు కాలగర్భంలో కలిసిపోయాయి. అల్పాక్షరాలలో సర్వవాదాల సారాన్ని సమగ్రంగా అసందిగ్ధంగా యిముడ్చగలనని శపథం పూనినదే సూత్రరూపం. అల్పాక్షరాలు పాటించాయేగాని అసందిగ్ధతను ఆనవాలుకుకూడా సాధించలేకపోయాయి. అందువల్ల లక్ష్యమే విఫలమయ్యింది.*

ఇక తర్వాతకాలంలో సూత్రాలకు, వుపనిషత్తులకు వాక్యాలు, వృత్తులు, కారికలు, కడకు భాష్యాలు వెలువడ్డాయి. సూత్రకర్తలవలెనే వుపనిషదర్థాన్ని యథాతథంగా వొకచోట స్పష్టంగా క్రోడీకరించడం మినహా స్వీయభావాలను చొప్పించటమనే 'పాపానికి' వొడికట్టుకోవడం మా ప్రయత్నం కాదనిమాత్రం యివి చెప్పాయి. కాని, వారనుకోని ఫలితాలే కలిగాయి; అదంతా అజ్ఞాతంగానే జరిగిందంటే నమ్మకం కలగనేరదు. 'వేదాంత సూత్రా'లకు వుపవర్ష, బోధాయనులు వృత్తులు వ్రాశారని ద్రమిడ, శంకాచార్యులు భాష్యాలు చేశారని తెలుస్తోంది. బృహదారణ్యకోపనిషత్తుకు 'భర్తృప్రపంచ'మనే ఆయన భాష్యాన్ని, మాండూక్యానికి గౌడపాదులు కారికలు వ్రాశారు. సుందరపాండ్య, గుహదేవ, భారుచి, బ్రహ్మదత్తుల పేర్లు కూడా ఈ సంప్రదాయంలో వినవస్తున్నాయి. అందుచే భాష్య పద్ధతి ఆనాటి యుగలక్షణమనడం అతిశయోక్తి కానేరదు. కాగా, శంకరుడూ సాంప్రదాయికాభ్యాసానికి వారసుడు; కాకుంటే తలయొగ్గవలసినవాడు.

భాష్యకర్తలయితే ప్రవాహణజైవాలి, అశ్వపతి, అజాతశత్రు, చిత్రగార్గ్యాయన ప్రతార్దన, యాజ్ఞవల్క్య, రైక్వ, వుద్దాలక, గౌతములవంటి మహామహుల వ్యక్తిత్వాలను (వారి ప్రత్యేక భావశ్రేణిని గుర్తుకు రానివ్వకుండా) మైనపు బొమ్మలమాదిరిగా కరిగించివేసి వొకముద్దగా చేయగల్గారు. కాని తమ తమ శాఖలలో ఉపశాఖలను ప్రత్యేక భావాలను తలెత్తే అవకాశం కలుగకుండా చేయలేకపోయారు. నిజానికి భాష్యపద్ధతి మత తత్వానికి చెందినది. అయినా మేధో వ్యక్తిత్వాన్ని చెరిపివేయడం ఎవరితరం? శంకరుడు గీచిన గిరి దాటకుండా ఆయన అనుయాయులు నిలవలేదు. ఆయన శిష్యులు వుపశాఖలు నెలకొల్పారు. మండనమిశ్రుడు, సురేశ్వరుడు, పద్మపాదుడు అన్న ముగ్గురు శంకరుని శిష్యులే. గురు మరణంతో వారు ముగ్గురూ మూడు త్రోవలు త్రొక్కారు. ఆతర్వాత మరికొంతకాలానికి 'వాచస్పతి' నాలుగో త్రోవొకటి తీశాడు. ♦ మతరూపం పొందిన అద్వైతం సైతం వ్యక్తిత్వాలను - ఆ యా తత్త్వజ్ఞుల స్వతంత్ర భావనను అరికట్టజాలక పోయిందని తేలింది. ఇక నిటువంటి పూర్వాపరాలతో శంకర భాష్యం మాతృకలకు ప్రతినిధి కాగల్గుతుందని ఆశించడం అనవసరం. అది గీటురాయిగా దాని మంచి చెడ్డలను నిర్ణయించడం నిరర్థకం. అది మతావేశపరులపని. సాంప్రదాయానికి అధికారదండ మప్పగించేవారికి దాన్ని విడుద్దాం.

---

* అధికరణ విభాగంలోగాని, ఏది పూర్వపక్ష సూత్రమో ఏది సిద్ధాంత సూత్రమో నిశ్చయించడానికిగాని, ఏయే వుపనిషత్తులకు, స్మృతులకు సూత్రం క్రోడీకరణమో నిర్దేశించడంలోగాని ఒక సంప్రదాయము, నిశ్చయము లేదు. ఒక సూత్రమే రెండుగా తెగగలదు. విభిన్నార్థాలు ఇవ్వగలదు. సూత్ర సాహిత్యానికి సంప్రదాయం ప్రాణం. కాని అది ఎలా నశించిందో నశించింది. దానితో వేదాంతసూత్రం అడిగిన అర్థమిచ్చిన కామధేనువయ్యింది.

♦ఈ వుపశాఖల అభిప్రాయాలు ప్రస్తావనామాత్రంగా ముందు మాయావాద పరామర్శలో వస్తాయి.

అసలు వుపనిషద్యుగం వొక తిరుగుబాటుయుగం. గొడ్డుబోయిన యజ్ఞకర్మ తంత్రంపై కచ్చ గట్టిన కాలం. మేధస్సు ఆనాడు కళ్లెంలేని గుర్రం. మేధోబలంకొద్దీ ఎంతదూరంగా ఎంత విశృంఖలంగా యోచించినా పట్టింపులేదు. పడికట్టు లేదు. తలకొకవూహ. ఆ వూహలో సాహసం కన్నా దుస్సాహసం జూలు దులిపి నిలుస్తుంది. అదొక స్వర్ణ కల్పం. ఒకొక్క రొక్కొక్క భావాన్ని, కాదు కవుల భావాలను కూడా కని లోకం మొకాన పడవేశారు. కాని లోకం బిడ్డలందర్నీ సమదృష్టితో సాకడం చేతగానిది. తొలిచూలుబిడ్డ, కడగొట్టుబిడ్డ అనే విచక్షణ విడనాడలేదు. పలు తరగతుల భౌతికవాద ప్రతిపాదనలు, అనేక ఛాయల అద్వైత అన్వేషణలు, ఈశ్వరవాదం, సర్వ దైవాంశవాదం అన్నవన్నింటికీ వుపనిషత్తులు పురుడు పోశాయి. కాని తత్త్వశాస్త్రమంతా వేదాంత మనిపించుకోవలసి వచ్చింది. మళ్లీ ఆ వేదాంతమంటే అద్వైత మనిపించుకుంటోంది.

## గౌడపాదుడు - అద్వైతం

అద్వితీయ పరబ్రహ్మం- నిర్గుణ చైతన్యం అన్నది వుపనిషత్తులలో వొక ప్రతిపాదన. దానికి అద్వైత వాదంగా సమగ్రాకృతి నిచ్చినది చరిత్ర కందినంతలో గౌడపాదుడు. ఆచార్య గౌడపాదులు లేకుండా నేటి అద్వైతశాఖ లేదు. ఆయన అద్వైత సిద్ధాంత మాతృక. శంకరుడాయన వరప్రసాదం. అద్వైత సిద్ధాంతంలో గౌడపాదునినాటి లోపాలను సరిదిద్దినట్లుగాని, ఆయన వేసిన తర్కపునాది బీటలువారే స్థితి ఏర్పడి నూతన తర్కసామగ్రితో నిలబెట్టిన దాఖలాగాని కనిపించదు.

'మా వుపనిషత్సాహిత్యం దేవుడు చెప్పగా విన్న శ్రుతి; అపరోక్షానుభవం యొక్క సమాచార సేకరణ. అది అపౌరుషేయం. అంతకన్నా ఆప్తవచనం మరొకటి లేదు. అందుచే అందరం నమ్మాలి' అని నిర్బంధిస్తే మానవుని తర్కబుద్ధి, హేతువృష్టి ఎదురు తిరుగుతుంది. పైగా, 'ఇది తత్త్వశాస్త్రం కాదు, మూఢ విశ్వాసాల కాలవాలమైన మతదృక్పథం; మతాన్ని తత్త్వ విచారంగా పులిమి పుచ్చ జూడడమే' అని జాలుగూడులిపి తన దారిన తాను స్వతంత్రంగా తత్త్వ చింతనలో నిమగ్న మవుతుంది. మానవుని హేతు బుద్ధిని తృప్తిపరచకుంటే కార్యం తీరదని గ్రహించాడు గౌడపాదుడు. అందుచే వేదాన్ని నమ్మమనే కన్నా వేదాన్ని నచ్చజెప్ప బూనుకున్నాడు. అనగా అద్వైతానికి తార్కికోప పత్తి కల్పించ బూనుకున్నాడు. అతీంద్రియ విషయముందని ఇంద్రియ గమ్యమైన తర్కం నిరూపిస్తుంది, వేదంలో తర్కముందన్నాడు. ప్రత్యక్షానుమాన ప్రమాణాలను పురస్కరించుకునే, మరొక ప్రమాణం వుందని వేదం నిర్ణయిస్తోంది. అది 'అపరోక్షానుభవం.'(Intuition). దానికీ ఇంద్రియ ప్రమాణాలకూ తగాదాలేదు. దేని పని దానిదే. వొకదానితో వొకటి జోక్యం కల్పించుకోవు. అందుచే వేదంలో ప్రత్యక్షం పరమ ప్రమాణంకాదు. తర్కసమ్మతమైన వేదభాగమే గ్రాహ్యం. యుక్తియుక్తం కాని దానినితీసి తుంగలో తొక్కొచ్చు. అంతమాట వేదవిశ్వాసుల్ని నొప్పిస్తే, ఆభాగాలు గౌణం, వర్ణనలు మాత్రమేనని సున్నితంగాచెప్పొచ్చు. దీనినే "నిశ్చితమ్ యుక్తి యుక్తంచ యత్తద్భవతి నేతరమ్" అని కారికలలో అద్వైత ప్రకరణంలో (III - 23) చెప్పాడు. వేద విశ్వాసమున్నవారికి వేద ప్రమాణంతోనూ, తర్కబుద్ధులకు తర్కసహాయంగానూ, సవ్యసాచిత్వంతో పని నిర్వహించాడు. ఆయన మాండూక్య కారికలను నాలుగుఅధ్యాయాలుగా విభజించాడు. తొలిప్రకరణంపేరే ఆగమప్రకరణం.అందులో మాండూక్యాగమార్థాన్ని వివరించాడు. ఈ ప్రకరణంలోని వుపనిషదర్థాన్ని తక్కిన మూడు ప్రకరణాలలోను తర్కరీత్యా సమర్థించి నిరూపించడం ఆపుస్తక పథకం. వైతథ్య ప్రకరణంలో నానాత్వమంతా సత్యమనుకోవడానికి వీలులేదని, అద్వైతప్రకరణంలో నిర్గుణ చైతన్యమే ఏకసత్యమని, 'అలాత శాంతి' లో పరమత ఖండనం - ఇదంతా తర్క సహాయంతో జరిపాడు. [ఈఅభిప్రాయం శంకరుడే కారికాభాష్యంలో నాలుగో ప్రకరణం ఆరంభ వాక్యాలలో తెలిపాడు.]

మాయావాదం శంకరాద్వైతం యొక్క ప్రత్యేకత అని ప్రతీతి. అదే ఆయన్ను లోకం ప్రచ్ఛన్న బౌద్ధుడనడానికి కారణభూతమయ్యింది. మహాయాన బౌద్ధంనుండి వేదాంతశాఖలోకి తొట్ట తొలిసారిగా మాయావాదాన్ని చొప్పించినవాడు, ♦ ఆ మాయా

♦ భర్తృహరికికూడా ఇందులో పాలుంది. జగత్తును బ్రహ్మవివర్తమన్నాడు. వుపనిషత్తులలో సహజ పరిణామంగా మాయావాదం రూపొందే వీలుండవచ్చుగాని, మహాయాన బౌద్ధంతో సంపర్కంగాని, పరిచయంగాని వున్న అద్వైతాచార్యులే మాయావాదానికి కర్తలయ్యారు. భర్తృహరికా సంబంధం అధికం. అందుచే మాయావాదం వేదాంత శాఖలో ప్రవేశించడానికి బౌద్ధం స్పష్టంగా తోడ్పడింది.

వాదానికి వుపనిషత్తులలో గల ఆధారాలను ప్రయాస పడి చూపి హిందూ భావవాదాన్ని తృప్తిపరచదలచిన వాడు గౌడపాదుడే. ['సంఘాతాః స్వప్నవత్ సర్వే ఆత్మమాయయా విసృజితాః' (III - 10), "అనిశ్చితా యథారజ్జురంధకారే వికల్పితా, సర్పధారాదిభిర్భావైస్తద్వదాత్మా వికల్పితః", "స్వప్నమాయే యథాదృష్టే గంధర్వ నగరం యథా, యథావిశ్వమిదం దృష్టం వేదాంతేషు విచక్షణైః" - II - 17, 31 కారికలు.] ఈ కారికలను పరిశీలించినట్లయితే శంకరుని వేదాంత సూత్ర భాష్యావతారికలోనే అధ్యాస భాష్యమంతా గౌడపాదునిపై కారికల ప్రతిధ్వని అని తెలుసుకోవడం సులభమే. వివర్తవాదంలోని భ్రాంతి అనుభవాన్ని, ఇంద్రజాలంలోని గంధర్వ నగరాన్ని, జాగ్రదవస్థలో అనుభూతమయ్యే బాహ్య ప్రపంచం పరమార్థ సత్యం కాదని చక్కగా చూపగల 'మాయాహస్తి' దృష్టాంతాన్ని (4-44), స్వప్నానుభవాన్ని గూర్చి కావాల్సిన తర్క సామగ్రిని ఆయన శంకరునికి అప్పగించిపెట్టి వెళ్ళాడనిపిస్తుంది. త్రాడును పాముగా భ్రాంతిచెందుతున్నామంటే, త్రాడు ప్రత్యక్షంగా మన కళ్ళ ముందుంటోంది. కాని, పరబ్రహ్మం ప్రత్యక్షం కానందున అందులో జగత్తువుందని భ్రాంతిపడడం సంభవం కాదన్న దొక ఆక్షేపణ. దానికి శంకరునికి ముందే ఆయన జవాబిచ్చాడు. ఆకాశం కళ్ళకు కనిపించదు. అయినా దానిలో మాలిన్యాన్ని, నీలిమను ఆరోపిస్తున్నాం. అలాగే పరబ్రహ్మంలోనూ సంభవమే అన్నాడు. ("యథా భవతి బాలానాం గగనం మలినం మలైః, యథా భవత్యబుద్ధానామాత్మాఽపి మలినో మలైః" - III - 8) శంకరుడు అధ్యాస భాష్యంలో ఇందులోని శబ్దాలనుసైతం గైకొని యిదే సమాధానం యిచ్చాడు. జీవాత్మ పరమాత్మలకు ఐక్యతను చెప్పడానికి 'మహాకాశం - ఘటాకాశం' అనే దృష్టాంతాన్నే ఈనాటికీ అద్వైతం వాడుకోవల్సివుంది. లాక్షణికమైన యీ వుదాహరణను 'అద్వైత ప్రకరణం'లో (3-7) కారికలలో చక్కగా నిర్వహించాడు.

తర్కంతోపాటు అద్వైత భాష్యపద్ధతికి కూడా దారిచూపాడు. ప్రధాన విషయాలను స్వయంగా సాధించిచూపాడు. ఉపనిషత్తులలో సృష్టివాదంతోపాటు సృష్టివాద నిరసనకూడా వుందన్నాడు. ఈశావాస్యంలో 'సంభూతిని ఆరాధించేవారు విశేషమైన అంధకారంలో ప్రవేశిస్తారు'ని వుంది. సంభూతి అనగా హిరణ్యగర్భుడు - జగదుత్పత్తిలో అతడే మొదటివాడు. అందుచే, యీ వాక్యంద్వారా సృష్టి వాదాన్ని శ్రుతినిరసిస్తోందన్నాడు. (III - 25). అసలు మాయావాదం శ్రుతిలోవుందంటూ, 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' అన్న ఋగ్వేద వాక్యం బృహదారణ్యకంలో ప్రస్తావించిన దాన్ని పట్టుకుని ఎత్తిచూపాడు ('నేహ నానేతి చామ్నాయాదింద్రో మాయాభిరిత్యపి' - III - 24) ఇందులోనే 'నేహ నానాస్తి కించన' ('ఆత్మలో నానాత్వ మింత మాత్రములేదు) అన్న కాఠక వాక్యాన్ని, 'నేతి నేతి' వర్ణను ఎత్తి (III - 26) నిర్గుణబ్రహ్మాన్ని, సృష్టి కాయాః పిండాలను విస్ఫులింగాలు అంతటంగా ఆత్మలో ఏకత్వాన్ని బోధించడానికి (III - 15) తెచ్చిన దృష్టాంతాలేనని భేదాభేదాన్ని నిరసించాడు. వర్ణాశ్రమ ధర్మాలు శ్రుతి చెప్పిందంటే అవంతా వ్యావహారిక దృష్టితోనేగాని పారమార్థిక సత్యస్థాయిలోగాదు. పైగా అటువంటి భాగాలు కర్మకాండకు చెందిన భాగాల్లో వున్నాయిగాని, అసలు వుపనిషదుపదేశ భాగాల్లో లేవని చూపాడు.

నిర్గుణబ్రహ్మ, జీవబ్రహ్మైక్యం, జగన్మిథ్యాత్వం, జ్ఞానయోగం (అస్పర్శయోగం), జ్ఞాని ముక్తిరూపుడు ఇవీ అద్వైతంలోని అంశాలు. ఇవన్నీ గౌడపాదుడు సాధించాడు. వీటన్నింటినీ శ్రుతిపేర చెప్పడానికి వలసిన 'టెక్నిక్', అద్వైత భాష్యంలో మెలకువలు చూపాడు. పారమార్థిక వ్యావహారిక సత్యాలన్న విభజన తెచ్చాడు. కార్యకారణత్వం హేతు సమ్మతం గాదని వితర్కించాడు.

ఆ విధంగా గౌడపాదుడు అద్వైతానికి వలసిన హంగులన్నీ ఏర్పరచాడు. గౌడపాదుని శిష్యుడు గోవిందుడు. గోవిందుని శిష్యుడు శంకరనంబూద్రి. గురుపరంపరాగతమైన గౌడపాదీయాద్వైతాన్ని కరతలామలకం చేసుకున్నాడు. అది నరనరాన జీర్ణించింది. గౌడపాదుని సిద్ధాంతము ప్రజ్ఞావంతుని కందింది. అందుకాయన అదృష్టవంతుడు. గౌడపాదీయాద్వైతాన్ని వాద ప్రతివాదాలలో నెగ్గించి ప్రాచుర్యంలోకి దెచ్చాడు. గౌడపాదుడు బదరికావనం దాటలేదు. శంకరుడు కాలడి మొదలు కాశ్మీరు వరకు కాలినడకన ప్రచారంచేసి విజయుడయ్యాడు. అద్వైత భాష్యానికి మార్గదర్శనం గురువు ద్వారా లభించింది. ఆగమ ప్రకరణం, అద్వైత ప్రకరణం అందుకు నమూనాలు. ఒరవడిలో భాష్యసాహిత్యం

కుప్పతెప్పలుగా సృజించాడు. గౌడపాదుని స్థానాన్ని చక్కగా గుర్తించాడు. ఇలా చెప్పాడు: "సర్వ వేదాంత శాస్త్రార్థ సారము కారికా సహితమైన (మాండూక్య) ఉపనిషత్తులోనే వుంది." అంతకు ముందే అద్వైతానికి మాండూక్యోపనిషత్తొకటే చాలునది 'ముక్తికం'. దానికి కారిక జోడించబడింది; దానితో శంకరుని తత్త్వబుభుక్ష చల్లబడింది. గౌడ పాదీయాద్వైతాన్ని సూత్ర, గీతా సమ్మతముని చూపబూను కున్నాడు. కారికలకు కూడా భాష్యం వ్రాశాడు. ఉపనిషత్తులకు, సూత్రాలకు, గీతకు కాక యింక మరొకదానికి భాష్యం చెప్పిందల్లా వొక్క కారికకు మాత్రమే. అంటే శంకరుని దృష్టిలో దాని కెంత ప్రాధాన్యముందో తెలుస్తుంది. మాండూక్య కారికా భాష్యరచన వేదాంత సూత్ర భాష్యానికన్నా ముందటిది కాకపోవచ్చుగాని, కారికల నప్పటికే అధ్యయనం చేశాడన్న నిదర్శనం వుంది. సూత్ర భాష్యమే అందుకు సాక్ష్యం. వే. సూ. లలో రెండో అధ్యాయంలో ప్రథమ పాదంలో 9 వ సూత్రానికి వ్రాసిన భాష్యంలో "వేదాంతార్థ సంప్రదాయ విదులైన ఆచార్యులు" గౌడపాదులు "అనాది మాయయా సుప్తోయదాజీవః ప్రబుధ్యతే" "అజమనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదే, (కారికలు 1-16) అన్నారని వుదాహరించాడు. అందులో విశేషణ రూపంలో ఆయనయెడగల గౌరవ ప్రపత్తులను వెల్లడించాడు.

ఉపనిషత్తులలో గాని (బాదరాయణుని అభేదవాదిగానే తలంచినా), వేదాంత సూత్రాలలోగాని లభించే అద్వైతం కన్నా విలక్షణమైనదానికి గౌడపాదుడాచార్యుడు. నేను అంగాంగ సంయోగ్యతతో మన కందిన అద్వైతానికి స్వరూపసిద్ధి యీయన చేతిలోను, దాని సుస్థిర ప్రతిష్ఠాపన, వున్నతి శంకరుని పరంగాను జరిగింది.

వేదాంతశాఖలో మాయావాదరూపకమైన వివర్త వాదం, పరిణామవాదం అన్నవి రెండున్నాయి. పరిణామం ఆధారంగా అనేకమైన ద్వైతాద్వైతాలు, విశిష్టాద్వైతం, శుద్ధాద్వైతం ఆకారం వహించాయి. పరిణామ దృక్పథానికి భిన్నమైన పోకడలు, ధోరణులు వుపనిషత్తులలో వుండొచ్చుగాని, అవి వొకవాదంగా రూపొందలేదు. ఆ పని మహాయాన బౌద్ధం యొక్క ప్రభావంలో పూర్తయింది. అదే గౌడపాదీయాద్వైతం. దీనికి వేదాంత సూత్రాలలో [illegible]స్థానం సంపాదించదలచాడు. అందుకు వేదాంత సూత్రాలపై మాయావాదాద్వైతాన్ని అంటుగట్టదన్నమాట. శంకరుని సూత్రభాష్యం అతకినట్లుగా వుంటుంది. శంకరాద్వైతాన్ని సమర్థించేవారు • దానిని సమర్థింపకున్నా వేదాంత శాఖలలోకల్లా శంకరాద్వైతం మకుటాయమానమైనదని తీర్పుయిచ్చే పరిశోధకులుగాని అనేకులు వేదాంత సూత్రాలకన్నా శంకరుడు వుపనిషత్తులకు సన్నిహితుడంటారు. మొత్తంమీద అధికాధికులు సూత్రాలకు శంకరుడు దర్పణం గాడనటం నిజం. జగత్తు వాస్తవికతను కించపరచకుండా నడిచే సూత్ర ధోరణిని దివస్వాపచట్రంలో బిగించేయత్నంలో వెలువడే రచన ఏవిధంగా వుంటుందో స్వయంగా వూహించవచ్చు. గౌడపాదుని సిద్ధాంతం వేరు; బాదరాయణునిది వేరు. దీనికి విప్రతిపత్తి లేదు. ఈ రెండు విభిన్నధోరణులకూ శంకరుడు భాష్యం చెప్పాడు. ఇందులో గౌడపాదునితో వీసమెత్తు భేదించినట్లుగా * కారికా భాష్యంలో కానరాదు. కాని వేదాంత సూత్రభాష్యంలో సూత్రకార ధోరణికి భిన్నంగా నడుస్తున్నట్లు ఆ భాష్యమే సాక్ష్యమవుతుంది. సూత్రాలకన్నా సూత్రభాష్యం గౌడపాదునికి దగ్గరగా వుందని జాగ్రత్తగా గమనిస్తే తెలుస్తుంది. అయినా సూత్రభాష్యాన్నే శంకరుని భావాలకు ఆధారంగా గ్రహించడం సంప్రదాయమై వుంది. తదితర తత్త్వశాఖా ప్రవర్తకులు వేదాంతభాష్య ముఖంగా స్వీయమత స్థాపన జరిపివుండడంవల్ల, ఆ సామ్యంవల్ల శంకరుని సూత్రభాష్య మా స్థానం వహించింది. శంకరుని అనుయాయులుకూడా దీనినే అధి

---

• "అందరి భాష్యాలు సూత్రాలకు దర్పణంగావు. ఒక్క శంకరుడ్నే అనడం సమంజసంకాదు." అని మాత్రం కలపమంటారు భారతీయ అద్వైతపండితులు. (బ్రహ్మసూత్ర, By విశ్వేశ్వరానంద - రాధాకృష్ణన్, పుట 470, సం 2. ఇండియన్ ఫిలాసఫీ.) అంతేగాని సూత్రకారునితో శంకరుడు భేదించలేదన్నవారు లేరు. సూత్రకారుడు జగత్తు వాస్తవికతకు అధికస్థాన మిచ్చాడనడంలోను వీరికి తగాదాలేదు.

* శ్రీ రాధాకృష్ణన్‌గారే అట్టి అభిప్రాయభేదమొకటుందన్నారు. (Page 457, Indian Philosophy, Vol. II) ఆ విషయం జగత్తుయొక్క సత్యత్వాన్ని పరిశీలించే సందర్భంలో ముందు పర్యాలోకన చేస్తాను.

కంగా గ్రహించడంవల్ల అదలా నిల్చిపోయింది. కాని దీని సవ్యతను శంకించవలసివుంది.

అయినప్పటికీ సంప్రదాయ పద్ధతినే ప్రస్తుతం అనుసరించడం మంచిది. కారికాభాష్యం మినహా తక్కిన భాష్యాల్ని దృష్టిలో వుంచుకొని శంకరాద్వైతాన్ని గ్రహించవచ్చు. కారికాభావాలు మిగతా సాహిత్యంలో మరీ కానరాకుండా అదృశ్యం కావు గదా!

నిర్గుణ పరబ్రహ్మం - మాయావాదం - జ్ఞాన యోగం - జీవన్ముక్తి ఇవి నాలుగూ శంకరాద్వైతానికి ప్రత్యేకతలు. వీటిని వివరిస్తే అద్వైత వివరణ మవుతుంది. ఇందులో తాత్త్విక ప్రాధాన్యంకలిగి నిల్చేవి నిర్గుణబ్రహ్మవాదం - మాయావాదం మాత్రమే. తక్కినవి మతసంబంధాంశాలకు సమీపాలు. అందుచే మొదటి రెండింటినే పరిశీలించుదాము. 'జీవన్ముక్తి' విషయాన్ని జగత్తుయొక్క సత్యత్వమీమాంస సందర్భంలో అవసరమైనంతమేరకు ప్రస్తావిస్తాను. జ్ఞాన యోగాన్ని పూర్తిగా విడిచిపుచ్చుతాను.

## ఆత్మ - పరమాత్మ - చైతన్యం

అస్తిత్వానికి-ఆలోచనకు, జగత్తుకు-జ్ఞానానికి గల సంబంధాన్ని విచారించడమే తత్త్వశాస్త్రం. ఆచార్య శంకరులీ సమస్యను సూటిగా పరిశీలించారు. వేదాంత సూత్ర భాష్యంలో అవతారిక వ్రాస్తూ దానిని ప్రారంభించడమే సమస్యను కల్పిస్తూ ప్రారంభించారు. తెలుసుకునేది - తెలుసుకోబడేది (విషయి-విషయము; జ్ఞాత - జ్ఞేయం; ద్రష్ట - దృశ్యం) అన్న విభాగం వుంది. ఇవి రెంటూ పరస్పర విరుద్ధాలు. వెలుగు చీకటులంతగా పూర్తి విరుద్ధాంశాలు. ఈ రెండింటిలో వొకదానిని మరొకటిగా భ్రమించడం సాధ్యంకాదు. వాటికి సంబంధం పొసగదు. ఇది పూర్వపక్ష వాదన. దానికి సమాధానమే అధ్యాస భాష్యం. కథా ప్రారంభ విధాన మిది.

అద్వైతం నిర్గుణ చైతన్యాన్ని నెలకొల్పడానికి జ్ఞాన విధానాన్ని, 'స్మృతి', అభిజ్ఞ (గుర్తుపట్టుట - Recognition), కల-మెలకువ-నిద్రలవంటి ప్రాణి అవస్థలను పర్యాలోకన చేస్తుంది. ఈ పరిశీలనద్వారా తన నిర్ణయాలను నిరూపించడం అద్వైతంయొక్క పద్ధతి.

'నేను నీ వ్యాసాన్ని చూస్తున్నాను', 'నేను గోడను చూస్తున్నాను' అనే వాక్య పద్ధతిలో మన జ్ఞాన కార్యకలాపాన్ని వ్యక్తపరుస్తుంటాము. ఇందులో తెల్సుకొనేది-తెల్సుకోబడేది-తెలివి (జ్ఞాత-జ్ఞేయం-జ్ఞానం) అన్నవి మూడు యిమిడివున్నాయి. ఈ మూడు జ్ఞాన కార్యంయొక్క అంగాలు. ఇందులో నేనే గోడను, వ్యాసాన్ని, ఇంకెన్నో విషయాలను చూస్తున్నాను, ఈ భిన్న భిన్న విషయాల జ్ఞానంకూడా భిన్నంగానే వుంటోంది. జ్ఞేయం, జ్ఞానం మారుతున్నాయి. మారే వీటన్నింటినీ మారని 'నేను' చూస్తున్నాను. మన జ్ఞానానుభవం సకలంలోను మారని అంశం నేనన్న జ్ఞాత మాత్రమే. జ్ఞాత నిత్యుడు. ఆ జ్ఞాత లేకుండా జ్ఞానం లభ్యంకాదు. దీనినే శంకరుడు వేరుమాటలలో చెప్పాడు: "ప్రమాతృత్వము లేనప్పుడు ప్రమాణాలకు ప్రవృత్తి కలుగదు. ఇంద్రియాలు వ్యవహరించనిదే ప్రత్యక్షాద్యనుమాన ప్రమాణాలు వుపయోగంకావు". (ప్రమాత అంటే జ్ఞాత; ప్రమాణాలంటే జ్ఞానేంద్రియాలు; ప్రమితి అంటే జ్ఞానం.) [వే. సూ. భాష్యావతారిక.] నిత్యమైన జ్ఞాతనే ఆత్మ అంటారు.

"ఇప్పుడు వర్తమానంగావున్న వస్తువును తెలుసుకొంటున్నాను. నేనే గడచినదాన్ని, అంతకంటె పూర్వమున్నదాన్ని తెల్సుకొన్నాను. నేనే ముందు రాబోయేదాన్ని, ఆ పైదాన్ని తెల్సుకొంటాను" అని అతీతం, వర్తమానం, భవిష్యత్తు భావాలచేత తెల్సుకోదగిన విషయం మారుతున్నప్పటికీ వాటిని తెల్సుకొనేవాని స్వరూపం మారడంలేదు. ఆ రూపం నిత్యంగానే వుంటోంది. [వర్తమానం వర్త్స్యహ మేవాతీతమతీతరం...వర్తమాన స్వభావత్వాత్ అన్యథా స్వభావత్వం వా న సంభావయితుం శక్యం. 2-3-7, వే. సూ. భా.]

తెల్సుకోవడంతోపాటు, తెల్సుకున్న దానిని జ్ఞాపకం పెట్టుకోవడమంటూ వొకటుంది. దానిని స్మృతి అంటాము. ఇంతేగాక వెనక ఎప్పుడో చూసినవ్యక్తిని, వస్తువును మళ్లీ ఎదురైనా, తటస్థపడినా ఫలానా అని గుర్తించడం అన్నదొకటుంది. దానిని 'అభిజ్ఞ' (Recognition) అంటాం. 'స్మృతి', 'అభిజ్ఞ'ల మూలంగా గతానుభవం వర్తమానంలోకి, భవిష్యత్తులోకి నిలుస్తోంది. అనగా, దీనివలన త్రికాలాలలోను నిలిచే జ్ఞాత వున్నాడని సిద్ధిస్తోంది. పూర్వం చూచినవాడు, వర్తమానంలో స్మరించినవాడు వొకే వొక్కడు గాకుండా స్మృతి, అభిజ్ఞలు సంభవంగావు. జ్ఞాత నిత్యుడుగాడు, అతడు క్షణికవిజ్ఞాన ప్రవాహం; జ్ఞానావస్థాపరంపర అని బౌద్ధశాఖలు వాదించాయి.

దానిని 'అనుస్మృతేశ్చ' అనే సూత్రముఖంగా ఖండించారు. దానికి శంకరుని భాష్యం పై విషయాన్ని (2-2-25 వే. సూ. భా.) వివరిస్తున్నది.

నేనన్న పదంచేత సూచించబడే 'ఆత్మ', 'జ్ఞాత' ముందుగా వుండబట్టే చూడడంవంటి జ్ఞానక్రియ, జ్ఞానం సాధ్యం. అనగా మన నిత్యానుభవంలో జ్ఞాన లబ్ధికిముందే జ్ఞాత వుంటోందని తెలుస్తోంది. జ్ఞానానికే ఆధారమది. కాగా, అది జ్ఞానంచేత తెల్సుకోబడేది గాదన్నమాట. కాని, ప్రత్యక్షం, అనుమానాలన్నవి జ్ఞానపూర్వకాలు, దాని పరిధిలోనివి. అందుచేత విధిగా ఆత్మ యీ ప్రమాణాల కందరానిది గావాలి. కాని ఆత్మ అన్నది వుంటోంది. ప్రమాణాలవల్ల తెల్సుకోబడే దానిని సాధ్యవస్తువు అంటారు. ప్రమాణాలకు తెలియరాని అస్తిత్వంకలదానిని సిద్ధవస్తువు అంటారు. అందుచే ఆత్మ 'స్వయంసిద్ధ'ము; అదే 'స్వతఃప్రమాణ'మంటారు. అదే అప్రమేయంకూడాను. 'ప్రమాణ వ్యవహారాలు ఆత్మ నాశ్రయించి వున్నాయి. కనుక అది ప్రమాణాలకు ముందే సిద్ధమైవుండాలి. సిద్ధవస్తువును నిరాకరించడం శక్యంగానిపని. 'ఎవడు నిరాకరిస్తాడో అతడే అతని రూపం' ('ఆత్మాతు ప్రమాణాది వ్యవహారాశ్రయత్వాత్ ప్రాగేవ...య ఏవ హి నిరాకర్తా తదేవ తస్య స్వరూపం' (2-3-7 వే. సూ. భా.) 'నేను లేను' అని ఎవ్వరూ అనడు. (ననాహమ్ అస్మీతి—1-1-1.)

ఆత్మ నిత్యత్వాన్ని, స్వతఃసిద్ధత్వాన్ని తెల్సుకున్నాం. ఇదంతా జాగ్రదవస్థలో కలిగే జ్ఞాన రూపాన్ని వివేచించడంవల్ల తేలిన విషయం. మానవునికి జాగ్రదవస్థే సర్వస్వంగాదు. నిద్రాస్వప్నాలు కూడా వున్నాయి. ఆ అవస్థలలోని అనుభవాన్ని కూడా అంచనాకే దీసుకోవాలి. ఈ త్రివిధావస్థల జ్ఞానానుభవాన్ని సమన్వయం చేసుకోవాలి. అప్పుడే సమగ్రత కల్గుతుంది.

ముందుగా కలను పరిశీలించుదాం. చిమ్మచీకటి రాత్రిలో, నక్షత్రాలను మాటుగణచిన మేఘావృతాకాశం క్రింద కళ్ళుమూసుకొని కలగంటాము. కలలో అన్నిదృశ్యాలూ కనిపిస్తుంటాయి. మేల్కొని కళ్ళు పొడుచుకున్నా ఎక్కడేముందో కానరాదు. మెలకువలో చూపు అసాధ్యం కాగా, కలలో దృశ్యమానమైన వొక ప్రపంచానికి ప్రపంచమే కనిపిస్తుంది. మెలకువలో వస్తువులు కనబడడానికి సూర్యచంద్రుల కాంతి సహాయముంది. కలలోగల కాంతి ఎవరిది? కలలో జ్ఞానేంద్రియాలు విశ్రాంతి తీసుకుంటాయి. మనస్సే డ్యూటీలో వుంటుంది. మనస్సుకూడా సాధనమే. సాధనానికి కాంతితో ప్రమేయంలేదు. ఇక కలలోని కాంతిఅంతా ఆత్మదే కావాల్సి వుంటుంది. మరొకరిది గావడానికి మరొక రెవ్వరూలేరు. అందుచేత ఆత్మ 'స్వయంజ్యోతి', 'స్వతఃప్రకాశం' అనిపించుకుంటుంది. "పుట్టంధునకుగాని లేక కళ్ళుతీసివేసిన వానికిగాని స్వప్నంలో దృష్టి వుంటోంది. స్వప్నంలో ఎవ్వరూ అంధులుగారు." ఇది గమనిస్తే ఆత్మస్వయం జ్యోతి అని ఖాయపడుతుంది. (బృహదారణ్యక భాష్యం 4-3-9,23.)

స్వప్నంలోని దృశ్యాలు, ప్రపంచం మిథ్యాభూతమని జాగ్రదనుభవంవల్ల తేలుతుంది. ఈ మిథ్యాసృష్టి పంచేంద్రియాలు పనిచేయని సమయంలో మనస్సు ద్వారా ఆత్మయే సృజించింది కావాలి. ఎందుకంటే అంతకన్నా మరెవ్వరూలేరు గాబట్టి. ఇప్పటికి దీన్ని యింతవరకే గ్రహిస్తే, ఇది ముందు కుపయోగపడుతుంది.

ఇప్పటి కాత్మ నిత్యమని, స్వతఃప్రమాణం, స్వయం ప్రకాశం అని తేలింది. నిద్రావస్థనుకూడా పరిశీలిస్తే యింకా విషయాలు తెలుస్తాయి. ఇప్పటికే తేలినవి ధ్రువపడతాయి. మెలకువలో తేలినవి యిప్పటికీ కలలోకూడా ధ్రువపడ్డాయి. కలలోనూ జ్ఞాత వున్నాడు. జ్ఞాన, జ్ఞేయ ద్వైవిధ్యానికి వేరుగానూ వున్నాడు. అందుచే నిత్యత్వమూ, స్వతఃప్రామాణ్యత నిరూపితమయ్యాయి.

నిద్రను 'సుషుప్తి', 'స్వాప'ము' అని వ్యవహరిస్తారు. నిద్రలో పంచేంద్రియాలేగాక, మనస్సుకూడా పని మానుకుని సెలవు పుచ్చుకుంటుంది. ఇంద్రియ మనస్సులు జ్ఞాన సాధనాలు. నిద్రలో జ్ఞానసాధనా విరహితంగా ఆత్మ నిరామయంగా మిగుల్తుందన్న మాట. ఈ నిరామయ స్థితిలో కల, మెలకువల్లోగల దృశ్య ప్రపంచం కానరాదు. అలలు అణగారిన మహాసముద్రంలా నిద్రాస్థితి వుంటుంది. జ్ఞేయ వస్తువులు లేవు. జ్ఞాన ద్వైవిధ్యంలేదు. కాని, జ్ఞాన ముందా, లేదా? అనగా, యిలా ప్రశ్నించామంటే జ్ఞేయ విషయాలు లేకుండా జ్ఞాన ముండగలదా అని అడుగుతున్నామన్నమాట. అంటే 'నిర్విషయ జ్ఞానం' సంభవమేమో కనుగొనదలుస్తున్నామన్నమాట. చాలా పెద్ద ప్రశ్న వేసుకున్నాము.

నిద్రలో జ్ఞానం వున్నదీ, లేనిదీ నిద్రావస్థలో తెలియదు. నిద్రావస్థ జాగరితానికి తెలియాలి. కల కలగా కలను తెలియదు. జాగరితానికే అది కల అయ్యింది. కలలోని అనుభవాలు మిథ్యాభూతాలే. కాని, కల మొత్తం వొక అనుభవంగా యథార్థమే. ఆ స్మృతి జాగ్రత్తుకే వుంది. కల, నిద్రలను మళ్ళీ జాగ్రత్తు ముఖంగానే తెల్సుకుంటున్నాం – వాటిని గూర్చి తెల్సుకుందుకు సాధనంకూడా జాగరిత దశే. అందుకే మాండూక్యోపనిషత్తు జాగ్రదవస్థలో ఆత్మను (వైశ్వానరాత్మ) ప్రథమపాద మన్నదని శంకరుడు భాష్యంలో విప్పిచెప్పాడు.

కాగా నిద్రనుగూర్చి జాగరితమేమి చెబుతున్నదో అడగాలి. "హాయిగా నిద్రించాను. (సంప్రసాదం – ఛాందోగ్యం) బాధా, బావరబందీలేదు. నాకేమీ తెలియలేదు. మైమరచాను. నేనేమైనదీ – ప్రపంచమేమైనదీ స్పృహలేదు. నన్ను నేనే మరచాను. మెలకువలోని బాధలన్నీ, మనోవ్యథ అంతా నశించి నట్లయింది." ఈ ధోరణిలో నిద్రను వర్ణిస్తాము.

నిద్రనుగూర్చి ఏమి వర్ణించినా, అది ఆ అవస్థలో లభించిన జ్ఞానమే. నిద్రలో జ్ఞానం లేదు అంటున్నామంటే నిద్రలోని అజ్ఞానంగూర్చిన జ్ఞానమున్నదన్నమాట. కాబట్టి జ్ఞేయం లేకున్నా విషయాపేక్షలేని జ్ఞానం వుండవచ్చు. దానినే 'నిర్విషయ చైతన్యం' అంటారు. శూన్యచిత్తంగా 'శూన్యచైతన్యం' అనీ పిలుస్తుంటారు.

కలగాంచినది నేను, నిద్రించినది నేను, ఆ విషయాన్ని జాగరితంలో చెబుతున్నది నేను. ఈ త్రివిధావస్థలలోను 'నే' నిత్యుడను. ఈమూడవస్థలకు సాక్షిని నేను. ఆ మూడింటి అనుభూతి నాది. 'నేను' అన్న ప్రత్యయంచేత సూచింపబడే ద్రష్ట యీ అవస్థలకన్నా స్వతంత్రుడను. వీటికన్నా వేరైన స్థితి, స్వతంత్రమైన అస్తిత్వం అనివున్నదన్నమాట.

త్రివిధావస్థలలోనూ 'నేను' అన్నపదం సంప్రదాయాన్నే పొందివుందేమో గమనించాలి. కాని నిద్రావస్థలోని జ్ఞాతను సూచించే 'నేను', తక్కిన రెండవస్థలకన్నా విశిష్టమైనది. నిద్రావస్థలో "నన్నూ, ప్రపంచాన్నీ ఎరగకుండా పడివుండా"నంటున్నాము. అంటే యిక్కడ బుద్ధి ధర్మమైన 'అహంత' మరుగున బడింది. నిద్రలోని జ్ఞాత అహంకారం (I–ness) నశించినవాడన్నమాట. కల, మెలకువలలో జ్ఞాత అహంకార సహితుడు. నిద్రలో బుద్ధి విరమించే సరికి తద్ధర్మమైన అహంత కూడా విరమించింది. అహంకారము లేకుండానే జ్ఞాతత్వం కనిపిస్తోంది. ఇదీ శుద్ధ జ్ఞాతృత్వం. ఇదీ నిత్యమైంది. అంతేగాని అహంతాపూర్వకమైన 'నేను' నిత్యంగాదు. అందుచేతనే 'ఆత్మ'ను అహంప్రత్యయంచేత సూచించబడేది, లక్షింపబడేది అంటారుగాని, అహమే ఆత్మ అనిగాని, దాని ధర్మమనిగాని అద్వైత వేదాంతం అనదు. అందుకే శంకరుడు ఆత్మను 'అస్మత్ప్రత్యయగోచరః' అని చెప్పాడు. నేనన్నది పృథగ్భావం నిద్రలో అనుభూతంకానప్పటి జ్ఞానం, చైతన్యం విశ్వచైతన్యం (Universal consciousness) అవుతుంది గాని నీ చైతన్యం, నా చైతన్యం అనే సవిశేష చైతన్యం కాజాలదు. అందుచేత నిద్రాజ్ఞానం నిర్విషయ జ్ఞానమే గాకుండా, నిర్విశేష జ్ఞానం కూడా అవుతోంది. నిద్రలోని యీ నిర్విషయ, నిర్విశేష చైతన్యంయొక్క జ్ఞానం విచిత్రమైనది. ఇది మనం సర్వసాధారణంగా భావించే చైతన్యంగాదు. ఎందుకంటే ఈ జ్ఞానానికి జ్ఞేయాలులేవు. మరో వేపున నీ, నా అన్న వైయక్తిక చైతన్యమూ కాదు. అలాగని కేవల జడమని మనం భావించే రాయిరప్పల అచేతనత్వమూ గాదు. ఈ రెండింటికన్నా విలక్షణమైన అతీత చైతన్యం.

దీనినే శంకరుడు ఆత్మ అహంకారంకన్నా పూర్వమే అస్తిత్వంలో వుందని తార్కికంగా చెప్పాడు. "ఉపలబ్ధి (జ్ఞానం) ఆత్మను చెందింది. ఆత్మ నిత్యోపలబ్ధి స్వరూపం. అహంకారంకూడా ఆత్మను లభించే జ్ఞానరూప మవుతోంది." ['నిత్యోపలబ్ధి స్వరూపత్వాత్...అహంకారస్య ప్రత్యగాత్మలభ్యమానత్వాత్' – 2-3-40. వే. సూ. భా.] 'నేను' అన్న స్ఫూర్తికూడా ఆత్మ కనుభూతంగా వుంటోంది. ఆత్మను జ్ఞానంగా లభించేది ఆత్మకంటే అన్యమైంది గావాలి. కర్తృత్వం నేనన్న దానితో ముడిపడి వున్నది. నేనన్న విశిష్టత (Individuation) ఆత్మధర్మమైంది గాదు. అందుచేత ఆత్మకు కర్తృత్వం లేదు.

విషయం (object), విశేషం (Distinction) లేని చైతన్యస్థితే అద్వైత సిద్ధాంతంయొక్క అవసరం. దాని వుపపత్తిక్రమాన్ని కనుగొన్నాము. అందుచే వారు ఆత్మను కేవల చైతన్య స్వరూపమంటారు; నిర్విశేష చిన్మాత్ర మంటారు. ఇప్పటికైన చర్చను క్రోడీకరిస్తే, ఆత్మనిత్యము, స్వయంసిద్ధము,

స్వయంప్రకాశము, నిర్విషయము, నిర్విశేషము అయిన చైతన్యస్వరూపం లేక జ్ఞానస్వరూపం అని తేలింది.

అద్వైతానికి నిద్రావివేచన ఎంత ఆయువుపట్టో గ్రహించివుంటారు. నిద్రనుగూర్చి యింకా మనం గుర్తించవలసిన మరికొన్ని విశేషాలు ఉన్నాయి. అవి కూడా తెల్సుకుంటేనే మంచిది.

1. నిద్రను గూర్చిన జ్ఞానం జాగ్రదవస్థలో యెలా తెలుస్తోందో వినాలి. స్మృతిశక్తివలన సంక్రమిస్తోందని సమాధానం యిస్తారు. కాని బుద్ధి, మనస్సు, అహంత, పంచేంద్రియాలన్న జ్ఞాన యంత్రాంగమంతా సెలవు తీసుకున్నప్పటి అనుభవం మెలకువలో తెలుస్తోంది. ఈ యంత్రాంగం పనిచేస్తేనే ప్రత్యక్షానుమాన ప్రమాణాలు ప్రవర్తిస్తాయి. అది పనిచేయనందున నిద్రానుభవం ప్రత్యక్షానికి, అనుమానానికి అతీతంగావున్న దన్నమాట. ప్రమాణాలద్వారానే గాక మరొకవిధంగా సత్యాన్ని తెల్సుకునే అవకాశం వుందన్నమాట. ఆత్మ అప్రమేయం - కాని అనుభూతమే; ఆత్మ అప్రత్యక్షం కాని అపరోక్షం. ఆ ప్రమాణాంతరానికి అపరోక్షానుభూతి (Intuition) అని పేరిచ్చారు. నిద్రవలన ఇంద్రియాతీత సత్యం వుందని, దానిని తెల్సుకునే సాధనం అలౌకికానుభూతిగా వుందని నిరూపితమయింది.

2. మనలో జ్ఞానం యెల్ల క్షణాల్లోనూ, అన్ని అవస్థలలోనూ వుంది. అది లేని క్షణంలేదు. కాని ఇది మనం గ్రహించడంలేదు. బహిర్వస్తువులు ఇంద్రియ సన్నికర్షచేత తెల్సుకోబడుతున్నప్పుడే జ్ఞానం మనలో వుంటుందనుకుంటున్నాం. లేకుంటే, ఆలోచిస్తున్నప్పుడే జ్ఞానం వుందనుకుంటున్నాం. ఇది పొరపాటు. ఆత్మచేతనజ్యోతి బుద్ధిలో ప్రతిబింబించగా ఇంద్రియాలు సేకరించిన సమాచారాన్ని బుద్ధి గ్రహిస్తోంది గాని, బుద్ధికి గ్రహణశక్తి లేదు.

3. మనం చైతన్యాన్ని మానసిక కార్యంగా భావిస్తాం. మనస్సు, ఆలోచనలు - బాహ్యమైన జడ ప్రపంచానికీ పోటీపెడతాము. అద్వైతం దృష్టిలో బాహ్యజగత్తూ, మానసిక జగత్తూ రెండూ ఒక రాశివే, వొక కుదురులోవే. ఈ రెండూ కూడా బాహ్యానికి చెందినవే. అధిచైతన్యానికి - బాహ్య, మానసిక ప్రపంచానికి పోటి నూహిస్తుంది అద్వైతం. ఈ శాఖ నధ్యయనం చేయవలసివచ్చేవారు యీ తారతమ్యాన్ని మనసులో వుంచుకోకపోతే చాలా నష్టం వాటిల్లుతుంది.

నిద్రావస్థ జడస్థితికి, చైతన్యస్థితికి సంధిస్థాన మనుకున్నారు. కల, మెలకువల కన్నా చాలా విలక్షణమైనస్థితి అనుకున్నారు. కల మెలకువతో సారూప్యం గలిగింది. దృశ్యమాన జగత్తు వొక్క నిద్రలోనే లేకుంటోంది. దృశ్యమైనదంతా అనిత్యం, సత్యంకాదు. 'యద్దృశ్యమ్ తన్నాశ్యమ్' అని శంకరుడూ అన్నాడు. జగత్తును మిథ్యాభూతంగా చెప్పాలంటే నిద్రాస్థితికి ప్రాధాన్యమివ్వక తప్పదు. దృశ్యంలేని స్థితిగా దీనికి పారమార్థికసత్తా ఏర్పడింది. మరొక సౌలభ్యంవుంది. కల మెలకువల్లో దృశ్యప్రపంచం సామాన్యాంశం గావడంవలన, కలలోని జ్ఞానం మెలకువ దానితో పోలికకునిల్చి బాధింపబడుతోంది. నిద్రకు - తక్కిన అవస్థలకు దృశ్యవిషయంలో పెద్ద తేడావుంది. అలా సామ్యంలేనందున నిద్రానుభవం తక్కిన ఉభయావస్థలచేత బాధితం గావడంలేదు. ఆ బాధితానుభవం దీనిదే. అందు కది సత్యం. 'నబోధో విషయాద్భిన్నో న బోధాత్స్వప్న బోధవత్', 'ఉద్భేదోత్ త్రయోః స్వం విదేక రూపా నభిద్యతే [వే. పంచదశి, ప్రత్యక్తత్త్వ వివేకం, 6, 4 శ్లోకపాదాలు.] జాగ్రదవస్థ వ్యావహారిక స్థాయికి దిగిపోయింది.

నిద్రను 'స్వరూపావస్థ' అన్నాడు శంకరుడు. అదే 'బ్రహ్మలోకం', 'పరమగతి', 'పరమసంపత్', 'పరమలోకం', 'పరమానందం' అన్నది (4-3-32) బృహదారణ్యకోపనిషత్తు. దీనినే యాజ్ఞవల్క్య జనకరాజుకు, అజాతశత్రువు బాలాకికి బోధించారు. ఈ బృహదారణ్యక భాష్యంలో నిద్రనేపారమార్థికావస్థగా చెప్పుతుంది. మాండూక్యం నిద్రావస్థ అంతిమంగాదనీ, తురీయం వేరే అవస్థ అనీ, అదొక అతీతనిద్ర అనీ భాష్యకారునిచేత అంగీకరింప జేసింది. నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నా ప్రజ్ఞమ్...అవ్యపదేశ్యమవ్యవహార్యమ్... ...చతుర్థమ్ మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః !!

7 వ శ్లోకం.

ఛాందోగ్యోపనిషత్తులో ఇంద్రవైరోచనుల గాథలో తురీయావస్థవుంది. వే.మూ. భాష్యంకూడా తురీయాన్ని గుర్తించింది. శంకరుడీ ద్వంద్వస్థితిని తప్పించలేకపోయాడు.

ఇప్పటికి వ్యష్టిలోగల ఆత్మవిషయం అవలోకించాం. చరాచరమైన జడచేతన జగత్తంతా చైతన్యాధారమని చూపితే పరమాత్మభావనకు చేరుకుంటాం. సరే అదీ నెరవేర్చాలి.

మానవుడు నిద్రిస్తున్నాడు. చెదురుగా మూర్ఛకు గురౌతున్నాడు. మూర్ఛానిద్రలలో మానవుడు చైతన్యం తప్పుతున్నాడు. దీనినిబట్టి చైతన్యానికి అవస్థాంతరాలున్నాయని, కొన్ని అవస్థలలో అది ప్రస్ఫుటంగా అభివ్యక్తమవుతుంది, కొన్నింట వ్యక్తంగాక మరుగున పడుతుందని అనుకోవాల్సి వుంది. ఈ పరిస్థితిని మనసులో వుంచుకుని, 'మట్టిలోను, కట్టెలోను' చైతన్యం లేదనడంకన్నా, అది అవ్యక్తస్థితిలో కానరావటంలేదని చెప్పొచ్చు. జడమన్నది కేవల జడం గాదని, అవ్యక్త చైతన్యమని స్వీకరించడం న్యాయం. జగత్తంతా చైతన్యమయం, దాని విభూతి, వైచిత్రి, వైవిధ్యం అంతా ఏకైక చైతన్యరాశియొక్క అవస్థాంతరాలు (2-1-4. వే.సూ.భా.). చైతన్యంకన్నా జడం ఎంతో విలక్షణంగా వుంటుండగా అవస్థాంతరాల పేర విలక్షణతను దాటవేస్తున్నామేమో అని సంశయించవచ్చు. కార్యకారణాలకు విలక్షణత మన అనుభవంలో వుంటోంది. జడచేతనాల మధ్య నొక అగత్త తత్వే వ్యక్పథం అనుభవ విరుద్ధం. ఈ రెండూ పరస్పరం మారుతున్నాయి. ఆవుపేడ జడపదార్థం - అందులోనుండి తేళ్ళు, పురుగులవంటి చేతనాలు జనిస్తున్నాయి. చెమటనుండి పేలు కలుగుతాయి. వీటినే 'స్వేదజా' లంటారు. పురుషుడు చేతనుడు; కాని జడమైన జుత్తూ, గోళ్ళూ అతనిలోనే జనిస్తున్నాయి. అందువేత చైతన్యం జడంగా కన్పించవచ్చు. జుత్తుకు కారణమైన పురుషుడుగాని, పేడకు కార్యమైన తేలుగాని కేవల చేతనాలు గావు - జడదేహం, చేతనాత్మల సంపుటి. జడమైన జుత్తు, పేడ ప్రాణుల జడదేహానికే కారణ, కార్యాలవుతున్నాయని అనుకోవాలి అని సాంఖ్యవాదం ఆక్షేపించింది. శంకరుడు దాన్ని కాదనకుండా వెనుదిరిగాడు. పేడకన్నా తేలుదేహం, పురుషదేహంకన్నా జుత్తు విలక్షణాలు. అందుచే కార్యకారణాలకు వైలక్షణ్యముండడం సహజం. జడంలోచూసే వైవిధ్యమే చైతన్యంలోనూ వుంటుందనుకోవాలన్నాడు శంకరుడు. 'దృశ్యతేతు' అన్న (2-1-6) సూత్రభాష్యం చాలా కృతకమైంది. [చైతన్యపరిణామానికిగాని, వివర్తానికిగాని జడపరిణామాన్ని, జడసహిత చేతనంయొక్క వివర్తాన్నిగాని, ఉదహరించడమేగాని, కేవల చైతన్యరాశియొక్క వైకృతి దృష్టాంతాలు లేవు. ఇదొక బలహీనతగాను - అపసవ్యతగాను అద్వైతం గమనించదు. దృష్టాంత* వైషమ్యమొక లోపంగాదని చెప్పి దాటేసుకు పోతుంది. 'అశ్మాదివచ్చ తదనుపపత్తిః' అన్న సూత్ర భాష్యమూ అంతే. అద్వైతాని కీ విషయంలో ఆక్షేపణలేని దృష్టాంతమే లేదు.] కార్యకారణ వైలక్షణ్యం గ్రహిస్తున్నాం; అందుచే చైతన్యంయొక్క అవస్థాంతరాలు గ్రాహ్యమే అని పర్యవసానం.

అందుచే ప్రపంచమెల్లెడల పరమాత్మ వుంది. ఆత్మకు ముందు చెప్పిన లక్షణాలకు అదనంగా యిప్పుడు ఆ చైతన్యం సర్వవ్యాప్యం (అనంతం - భూమం), సర్వగతం (అంతర్యామి) అని తెలిసింది. ఇందాక నిద్రలో ప్రసన్నత - అదే ఆనందం అనుభూతమయిందన్నాము. అందుచే ఆత్మ, పరబ్రహ్మం ఆనందం కూడాను. ప్రధాన విషయాలను చెప్పడానికి గాను, 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని తైత్తిరీయం నిర్వచించింది. ఛాందోగ్యం ఆనందాన్ని చేర్చింది. ఈ రెండింటిని కలిపి 'సచ్చిదానంద బ్రహ్మ' అని నిర్వచనం తెచ్చారు. ఇది నిజానికి నిర్వచనం గాదు. బ్రహ్మన్ని నిర్వచించవీలులేదు. అది తర్కబుద్ధిని తృప్తిపరచడానికని స్థూలారుంధతీ న్యాయంగా వర్ణించారు. అలౌకికానుభవైకవేద్యమైనదానికి నిర్వచనం సంభవంకాదు. స్థూలంగా పరమాత్మ విషయంలో అద్వైత కథనం - ఉపపత్తి యిది.

విమర్శ: నిద్రను ఒక పద్ధతిలో వివరంగా పరిశీలించి తెలుసుకున్న నిర్ణయమిది. నిద్రను అద్వైతమే పరిశీలించాలనిలేదు. విశిష్టాద్వైతం కూడా పరిశీలించిందే. ఆ శాఖవారూ అనుభవపూర్వకంగానే నిర్విశేష చైతన్యం మాత్రం అనుభవసిద్ధం కాదన్నారు. 'నేడు విజ్ఞాన శాస్త్రము - అందులో శారీరక శాస్త్రం (Physiology) నిద్రనీ, స్మృతినీ, అతీతనిద్ర, సమాధి స్థితులనూ అధ్యయనం చేస్తోంది. అద్వైతులు పరికరాపేక్ష లేకుండా తర్కించి నిద్రను వివేచిస్తే, నిరూపణా సాధ్యంగా స్వీయాత్మ స్వీయాత్మకంగా గాక బాహ్యవస్తు పరిశీలనాపద్ధతిలో సూక్ష్మంగా అధ్యయనం చేస్తోంది. ఏదేమైనా అద్వైత పరిశీలనకన్నా విశేష పరిశ్రమ, సూక్ష్మతమ పరిశీలన ఇందులో వుందన్నది సుస్పష్టం. ఈ పరిశోధనా ఫలితాల ముందీ అద్వైత వివేచన సరిపడేదీ, నిరాకరింపబడేదీ చూడవలసి వుంటుంది.

---

* అనగా యిది పూర్వంనుండీ వివాదగ్రస్తమైన విషయంగానే వుంటూవచ్చిందన్నమాట.

నిద్రలో అజ్ఞానం మాత్రమే అనుభూతమై జ్ఞాన వ్యాపారం ఆనవాలుకూడా లేకుండా కట్టుబడుం దంటున్నారు. ఈ అజ్ఞానస్థితి అనుభవం జ్ఞానానుభవం కన్నా బాగా భిన్నమైందని, రెండింటికీ పోలికే లేదని అంటున్నారు. అజ్ఞానానుభవం నిజమే కాని అది పూర్తిగా విలక్షణం, అలౌకికం అనడం అవాస్తవికం. అజ్ఞానమూ ప్రాపంచికమేనని శాస్త్ర పరిశోధన వాదిస్తోంది. ఇందుకనేక దృష్టాంతాలు నిత్యానుభవంలో కానవస్తాయి.

మిల్లులలో నిద్రించేవాళ్లలో ఒక విచిత్రం కానవస్తుంటుంది. మిల్లు యంత్రం పనిచేస్తున్నంతసేపూ హాయిగా సుషుప్తి చెందుతారు. ఏ యే పరీక్షలను నిలబడితే నిద్రను సుషుప్తి అంటూమో ఆ షరతులన్నీ చెల్లామణీ అయ్యే స్థితిలోనే వాళ్ళు నిద్రిస్తారు. ఇంతలో ఒకప్పుడు యంత్రం ఆగిపోతుంది. తక్షణమే దిగ్గున మేల్కొంటారు. యంత్రం నిల్చిపోవడమే వాళ్ళ మెలకువకు కారణం. సుషుప్తిలోకూడా యంత్రం పనిచేయడంపైన ఒక కన్ను వుందన్నమాట. సైనికుడు యుద్ధరంగంలో ప్రేలుడు శబ్దాల మధ్య సుషుప్తి గాంచుతాడు. ప్రేలుడువల్ల కాని నిద్రాభంగం అతని కమాండరు చిన్న బిగిలూదినా, పీలగా పిల్చినా కల్గుతుంది. పసిబిడ్డ తల్లిలో కూడా యీ సన్నివేశం చూడొచ్చు. ఉరుములకు తెలియని తల్లినిద్ర పక్కలో పసికూన కూనిరాగానికో, కదలికకో భంగపడుతుంటుంది. స్వారీగుర్రం వెన్నుమీద జీనులో సుఖనిద్ర అనుభవించే రౌతు, గుర్రం దౌడుమాని నిలిస్తే ఏద తెలుసుకుంటాడు. ఈ అనుభవాలను పురస్కరించుకొని శాస్త్రజ్ఞులీ నిద్రాస్థితిని పరిశీలించుతారు. కుక్క, తదితరమైన జంతువులమీద వారు పరిశోధనలు చేశారు. పై అనుభవాలవల్ల నిద్రలోకూడా జాగ్రదంశ వుందనీ, పరిసరాన్ని ఏదో ఒకవిధంగా గమనిస్తున్న జ్ఞానకార్యం వుంటూనే వుందని తేల్చవలసివుంది. జ్ఞాన ప్రకోపన (Excitation)తో పాటు ఏకకాలంలో జ్ఞాననిరోధం (Inhibition) కూడా మెదడులో - ముఖ్యంగా మజ్జాముఖం (Cerebral cortex) లో - ఏర్పడుతుంటుందనీ, అలా ఏర్పడక 'పరిశీలన' అంటూ వుండదనీ, ఇందులో నిరోధకవ్యాపారం క్రమంగా మజ్జాముఖమంతా వ్యాపించడమే నిద్ర అనీ, అట్టి నిద్రలో నిరోధం మజ్జాముఖమంతా సంపూర్తిగా ఆవరించక కొన్ని స్థానాలను స్పృశించదని పరిశోధకులు కనుగొన్నారు. మజ్జాముఖంలోని ఆ తావులకి 'ఖాయిదా స్థానాలు' (Watch or guard points) అని నామకరణం చేశారు. జాగ్రద్వ్యాపారానికి జవాబుదారీవహించే మజ్జాముఖంలోని యీ తావులు పనిలో వుంటున్నందునే నిద్రలో మన అజ్ఞానావస్థ కూడా అనుభూతమవుతోంది. అదే తావు పరంపరంతో ముడిపడి నిద్రిస్తే దాని జ్ఞానానికికూడా బాధ్యత వహిస్తోంది. ప్రాపంచిక జ్ఞానాన్ని పొందగలిగిందే నిద్రలో పనిచేస్తోంది గాని, అదేమీ అలౌకికాంశ కాదు.

ప్రకోపన, నిరోధం అన్నవి పరస్పరాపేక్ష్యాలనీ, అవి జ్ఞానవ్యాపారంలో ఒకే నాణెంయొక్క రెండు ముఖాలనీ గ్రహించాల్సివుంది. అంటే నిద్రా జాగ్రత్తులు ఒకే ఒరలో యిముడని కత్తులవంటి విరుద్ధ విషయాలు కావన్నమాట. ఇంకా స్పష్టంగా చెప్పుకుంటే ఒకరిపొడ ఒకరికి గిట్టనివిగాక, రెండవ్వలూ ఏదో ఒక రూపంలో సదా సమ్మిళితమయ్యే వుంటున్నాయి. ఇదీ నేటి శాస్త్రం తేల్చే పర్యవసానం.

ఇదేవిధంగా స్వప్నానుభవంకూడా శాస్త్రీయంగా వివరించబడుతోంది. జాగ్రత్తులోకూడా దీనిఛాయలుంటున్నాయి. తీరికగా కూర్చుంటాం. ఏదో యథాలాపంగా ఆలోచన ఏకుమండి దారంలా సాగిపోతుంటుంది. ఎక్కడ ప్రారంభించి ఎక్కడ తేల్తామో తమాషాగా వుంటుంది. తార్కికంగా సవ్యంగాని పద్ధతిలో అస్పష్టంగా తేలిపోతూ పోలికలేని దూరవిషయాలకు చేరతాము. కలలో దృశ్యగమనంకూడా ఇలా అస్పష్టంగా గౌణసామ్యాలతో సాగిపోతుంటుంది. మజ్జాముఖం యొక్క 'పరిశీలనకు', శ్రద్ధాపూర్వక జ్ఞానసాధనకు గురిగాక అస్పష్టంగా వుపలబ్ధమవుతున్న స్థితి ఒకటుంది. ఆయా వస్తువులంటూ గోచరమయ్యాయనిపించుకొని, అదే సమయంలో స్పష్టంగా తెల్సుకోబడని వున్నాయి. అంటే మన కనుచూపు మేరంత పరిధిలోనే వున్న వస్తువులన్నీ వుపలబ్ధిలో సమప్రాధాన్యం పొందడంలేదు. ఇది నిత్యానుభవం. అస్పష్టోపలబ్ధి మాదిరి స్వభావమే కలలోని వస్తువులకూ వుంటోంది. ఇంకా మరోవిధంగా వివరణ లేకుండా చెప్పుకోవలసివస్తే మజ్జామూలం పొందుతుండే ప్రోటోపథిక్ అనుభూతిలోని అస్పష్టతే కల్లో వుంటుంది.

నిద్రలో మజ్జాముఖంలోని మండలాలు శరీరాంతర్గతస్థితిని పురస్కరించుకొనో, బహిర్వాతావరణాన్ని బట్టో ప్రకోపనకు గురిఅవుతుంటాయి. నిద్రలో

పడుతున్న పద్ధతినిబట్టో, మూత్రపుసంచి నిండడంవల్లో, గుండె పనిచేయడంలోనో, ఊపిరి పీల్చడంలోనో సంభవించే మార్పులనుబట్టో మజ్జాముఖంలోని ప్రకోపనామండలాలు (Zones of excitation) కదుల్తాయి. బయటి ప్రభావాలుకూడా నిద్రలో పని చేస్తాయి. పడకగది ప్రక్కనున్న నీటికుళాయిలో నీరు ధారగా కారిపోతూ శబ్దంకలుగుతున్నందున నియతంగా ఏ నదినిగూర్చో, జలపాతాన్నిగూర్చో కలలు రేకెత్తినట్లు కనుగొబడింది. అరికాళ్ళకు కొంచెం వేడిమి తగుల్తున్నట్లు ఏర్పాటుచేస్తే ఏ ఎడారిలోనో, సముద్రపువొడ్డునో యిసుకలో కాళ్ళు కాలుతూ తిరుగాడుతున్నట్లు కలగాయడం కనుగొన్నారు. ఈ విధంగా జాగ్రదంశ యిందులోనూ వుంటున్నందునే కలలు సాధ్యమవుతున్నాయి. అవి జ్ఞాపకమూ వుంటున్నాయి. నిద్రాస్వప్న జాగరితాలకున్న సంబంధం ఇటువంటిది. ఇదంతా ప్రాపంచికమనీ, ప్రతి అవస్థా వొకానొక మజ్జాస్థితిగా తెలియబడుతోంది.

అనుభవముంటే, వుపలబ్ధి వుంటే దానికి సంబంధించి స్మృతి నియతంగా ఏర్పడాలంటుంది అద్వైతం. కాని ఇది వారన్న రీతిలో నిజంకాదు. నిద్రావస్థనే చూడొచ్చు. వారి అభిప్రాయంలో నిద్రావస్థ చేష్టారహితం కాని సుషుప్తిలో చేతనచర్య లుంటాయి. నల్లి కుడుతుంది. దాన్ని చేత్తో తోసివేస్తాము. నిద్రాభంగం కలగదు. నిద్ర తెలిశాక నల్లిని తోసివేసినట్టు జ్ఞాపకమే వుండదు. ఇదే అసంకల్పిత ప్రతిక్రియ (Unconditioned Reflex). దీనికి కర్త వెన్నుబాము. ఈ చేష్టలు జరిగినట్టు మెదడులో నమోదుకాలేదు.

స్మృతికికూడా అంతస్తు లున్నాయి. జాగ్రత్తులో జ్ఞాపకంరాని అనుభవం మెదడులో అసలే విధంగానూ రికార్డు కాదనుకో నక్కరలేదు. మెలకువలో వుండే అజ్ఞాతోపలబ్ధి (Unconcious Perception) వూనకంవంటి (Hypnotic Trance) మానసికావస్థలలోనో, కలలోనో మళ్లీ అది బహిర్గతమవుతూంటుంది. అంటే అదొక 'అజ్ఞాతస్మృతి' అన్నమాట. పరిశీలనాపూర్వకమైన అనుభవంకూడా మెలకువస్మృతిగా ఎల్లప్పుడూ జీవించాలని ఎక్కడా లేదు. వ్యక్తులు జ్ఞాపకశక్తిని కోల్పోవడం ఎరిగిందే. కొందరైతే తమ జీవితంలో వొకానొక భాగాన్ని పూర్తిగా మరిచేపోతారు. అది తిరిగి లభ్యమేకాదు. స్మృతి నశించిపోయినందున, లేదా మెలకువ స్మృతి కానరానందున గత జీవితం, భూతకాలం ఎగిరి పోయిందంటామా? స్మృతిని చైతన్యం యొక్క అనవచ్ఛిన్నతకు తిరుగులేని సాక్ష్యంగా గ్రహించడం సమగ్ర దృష్టికాదు.

జాగ్రత్తులోకూడా అసంకల్పిత క్రియాకలాపం బోలెడంతవుంది. నృత్యంలోనూ, క్రికెట్ ఆటలోనూ ప్రదర్శించే అంగ విన్యాసమంతా సంకల్పితంగాదు. ఆయాభంగిమల్లోని ప్రతికండరం వదులూ, కదలికా వివరించమంటే వివరించలేరు. మళ్లీ ఆయాభంగిమలు కావాలంటే వేయగలరు. హిస్టీరియా వచ్చేవారినే చూదాం. అందులో ప్రలాపిస్తారు. ప్రశ్నిస్తారు. ప్రశ్నలకు సమాధాన మిస్తారు. ఎవరితో మాట్లాడుతోందీ గుర్తిస్తారు. మధ్యలోవస్తే మనల్ని పరామర్శ చేస్తారు. అప్పుల్ని అప్పుల్నిగాను, విరోధుల్ని విరోధుల్నిగాను గ్రహించే సంభాషణ సాగిస్తారు. అంతలో నిద్రలోవుంచి లేచినట్లుగా స్వస్థపడతారు. హిస్టీరియాలో సంభాషించిన మనల్నే మళ్ళీ సరికొత్తగా యెప్పుడొచ్చారని అడుగుతారు. మన మంతవరకూ సాగించిన సంభాషణను విడచిన దగ్గిరనుండీ కొనసాగించబోతే సందర్భం వూహించలేక కలతపడతారు. జరిగిన సంభాషణను జ్ఞాపకం చేసినా గుర్తులేదంటారు. ఇందులో ప్రలాపంలేకుండా నిద్రపోయే రకంకూడా వుంటుంది. హిస్టీరియా నిద్రకూ, సంభాషణకూ, చేష్టలకూ స్మృతిస్థాపనలేదు. అది మెలకువలోకి సంక్రమించదు. కాని జాగ్రత్తులోని స్మృతి హిస్టీరియాలో పనిచేస్తుంటుంది. మెలకువలో జ్ఞాపకంరాని యీ సంభాషణను, చర్యలను మిథ్య, న్యూనసత్యం అనవలసిందేనా? స్మృతిరహితమయిందన్నా భూతకాలంలోని తన అస్తిత్వాన్ని వొదులుకు పోవాల్సిందేనా? అద్వైత తర్కంప్రకారం మాత్రమంతే.

కర్మలంటూవుంటే వాటికి కర్తకూడా వుండాలి. కర్తృత్వమన్నది అహంకారపూర్వకం; అంటే నేనన్న స్ఫూర్తి కలిగినది. అహంకారశబ్దం వ్యక్తిత్వాన్ని విశేషతను తెలియజేస్తుంది. నిద్రలో కర్తృత్వంలేదు అహం ప్రత్యయం అదృశ్యమయింది అని అంటుంది అద్వైతం. అయితే నిద్రలోవుండే అసంకల్పితచేష్టలు కర్తృత్వంలేకుండానే ప్రవర్తిల్లుతున్నాయని అద్వైతి అనవలసివుంది. అలాగని అన్నాడా, కర్మ కర్తృత్వపూర్వకమని చెప్పడం విరమించుకోవాలి. విరమిస్తే అసంబద్ధప్రలాప మవుతుంది. నిద్రలో జ్ఞానపూర్వక కర్మలు లేవంటే అనుభవాన్నే తిరస్కరించి అబద్ధానికి పూనుకోవడమవుతుంది. అద్వైతి యిలా చిక్కులో

పడతాడు. ఇదేవిధంగా హిస్టీరియాలోవున్న సంభావ నాధికం కూడా అకర్తృకం, అహంతా రహితం కావాల్సి వుంటుంది. ఇది సరికాదు.

ఈ పరిశోధనవల్ల తేలిన పర్యవసానం ఏమిటో స్పష్టపరుద్దాం. జ్ఞానం విశిష్టమైంది; అజ్ఞానంకూడా బహిస్సత్వాన్ని విడవదు. నిద్రలో బహిరంతరాలు రెండూ వున్నాయి. వ్యక్తిగతమైన జ్ఞాత - జ్ఞాతతో తెల్సుకోబడే బాహ్య జగత్తూ విడదీయరాకుండా పెన వడివున్నారు. అంటే వైయక్తికమైన జ్ఞాతా, జగత్తూ రెండూ సత్యాలే.

ఈ జ్ఞాతయే శాస్త్రపరిశోధనలోదిగి తన జ్ఞాతృత్వం యిటీవలే సంభవించింది, ఒకప్పుడు జ్ఞాతలేదు అంటోంది. జీవి నివసించ వీల్లేనిస్థితి వొకటుంది అంటోంది. జడంనుండే చైతన్యం కలిగింది అంటోంది. అందుచే ద్రవ్యం ఆద్య మవుతుంది.

## అధ్యాసవాదం

నిత్యమైన నిర్విషయ చైతన్యం విషయ చైతన్యం గానూ, దృశ్యమాన జగత్తుగానూ, జడంగానూ-ఏకత్వం నానాత్వంగానూ కానరావడం ఏవిధంగా సాధ్యమో అద్వైతి యింకా మనకు చెప్పవలసే వున్నాడు. ఈ ప్రశ్నకు పరిష్కారం చూపడంతోనే శంకరుడు సూత్రభాష్యాన్ని ప్రారంభం చేస్తాడు. ఆ భాష్య పీఠికకు అధ్యాస ప్రకరణం అంటారు. అధ్యారోపం, వివర్తం అన్నవి అధ్యాసకు మారుపేర్లు. ఇంతకూ వీటన్నింటినీ భ్రాంతి - భ్రమ అని అర్థంచేసుకుంటే చాలు.

జగత్తుకు మూలకారణం పరబ్రహ్మం. అది నిర్విషయ జ్ఞానస్వరూపం. కాని మనం దాన్ని ఆ రూపంలో తెల్సుకోవడంలేదు. చిన్మాత్రాన్ని జడంగా చూస్తున్నాం. ఒకదానిని మరొకదాన్నిగా గ్రహిస్తున్నాం. మన పరిస్థితి యిలావుంది అంటాడు అద్వైతి. ఒకానొక విషయం వేరొకటిగా స్ఫురించడమే భ్రాంతి. త్రాడుని పామనుకుంటాం. ఎండమావుల్ని నీరనుకుంటాం. ఆకాశానికిరంగు, ఆకారాలు ఆపాదిస్తాం. అందుచేత యిదేవిధంగా జగత్తు భ్రాంతి మూలకం, అదొక ఆభాసం అనుకోవాల్సివుంది అంటాడు అద్వైతి. కళ్ళకు కన్పించే వొకానొక వస్తువుని మరోవస్తువుగా భావిస్తున్నాంగాని, అసలు వస్తువే, విషయమేకాని దాన్ని వస్తువుగా భావించడం ఎక్కడాలేదు. భ్రాంతిలో జరిగేదింతేగాని నిరాకార బ్రహ్మాన్ని సాకారజగత్తుగా పొరపడే అవకాశం భ్రాంతి అనుభవంలోలేదు. జ్ఞాత జ్ఞేయంగా గోచరించడం అసంభవం. ఆ రెండు ధర్మాలూ బద్ధవిరుద్ధాలు. వెలుగుచీకట్లు లాంటివి. అందుచేత నిరాకారం సాకారంగా దృగ్గోచరం గావడం భ్రాంతివల్ల సాధ్యం గాదు. ఇదొక పెద్ద ధర్మసందేహం; పేచీ. ఆదిలోనే యీ చిక్కు వదిలించుకోకపోతే అద్వైతి ముందు అడుగు వెయ్యలేడు. అంచేతే ఇది అద్వైతానికి ఆయువుపట్టు. ఈ పునాది అవుకని తేలితే అద్వైతం పేకముక్కల మేడలాగా కూలిపోతుంది. "అధ్యాసము సుస్థముగానిది దానిమీద నిర్మింపబడిన అద్వైత సిద్ధాంత సౌధము సుప్రతిష్ఠముకాదు." అందుకే సూత్రభాష్యం అనుసుతొక్కేముందే, ప్రత్యేకించి యీ విషయం తేల్చుకోదలచాడు శంకరుడు. వేదాంత సూత్రంలోలేని అవతారికను అధ్యాసవాదపరంగా స్వకపోలకల్పన చేశాడు. శంకరుడి ప్రతిష్ఠ దీనిమీదంతో ఆధారపడింది. ఇప్పటికి అధ్యాసవాదం యొక్క ప్రాధాన్యం తెలిసివుంటుం దనుకుంటాను.

## నిర్వచనం మంచిచెడ్డలు

త్రాడు పాముగా కన్పించినట్లుగానే బ్రహ్మం ప్రపంచంగా భాసిస్తోంది. ఇలా భాసించే విధానాన్ని సూత్రబద్ధం చేదాం. పామును పూర్వ మొకప్పుడు కళ్లారా చూశాం. దాని రూపవిశేషం మనసుకు పట్టింది. పాము సుఖ్లీ మన కళ్ళముందు లేకపోయినా దాని ఆకారం వగైరాలు మనం జ్ఞాపకం చేసుకోగలం. అనగా పాము పూర్వం చూడబడింది; దానిరూపం స్మృతిలో నిల్చివుంది. ఇంతలో చీకటిలో తాడొకటి తారసిల్లింది. అదటుగా చూశాం. వెంటనే అది పామని తట్టింది. పామును చూసినట్లే అయ్యింది. కుదటబడి పరిశీలనగా చూస్తాం. దానితో పాముకాదని తేలుతుంది. పామును మరొక దానిలో చూశామన్న మాట. పూర్వం చూసిన వస్తువుయొక్క స్మృతి రూపాన్ని అన్యత్రా చూస్తున్నామన్న మాట. ('స్మృతిరూపః పరత్రపూర్వ దృష్టావభాసః' అని శంకరుడు నిర్వచించాడు అధ్యాసను.) ఇందులో త్రాడు అధిష్ఠానం, పాము ఆరోపితం. భ్రాంతి సమయంలో త్రాడు యథార్థంగావుంది. వాస్తవమైన పాములేదు; దాని స్మృతి రూపం మాత్రమే వుంది. అంచేత ఆరోపితవస్తువు అధిష్ఠానమంత యథార్థంకాదు. అధిష్ఠానంలో అసలు లేనిదల్లా వున్నట్లనిపిస్తోంది. భ్రాంతి వివేచన యింతే.

శంకరు డిచ్చిన యీ నిర్వచనం సరికాదు. ఎందు కంటే భ్రాంతికిచెందిన సకలానుభవాన్నీ యీ నిర్వచనం ఆలోకి తీసుకోలేదు. ఆయన స్వీకరించిం దొక శకలం, వొక అంశ. భ్రాంతి మూలాన్ని గమనించ లేదు. భ్రాంతి కలగడానికి వొకానొక వస్తువును పూర్వం చూసి, తదనుభవాన్ని స్మృతిరూపంలో నిల్వచేసుకోవలసిన అవసరం సర్వత్రాలేదు. భ్రాంతికి కాలవిభాగంగాని, స్థలవిభాగంగాని అవసరంలేదు. ఏకకాలంలోనే వొకే స్థలంలోనే చూపుపారేమేర లోనే రెండువిభిన్న వస్తువుల్ని వొకేజాతి వస్తువులుగా గ్రహిస్తుంటాం. రోల్డుగోల్డు వస్తువునీ, మేలిమి బంగారు వస్తువునీ వొకదానిప్రక్క నొకదాన్ని వుంచితే, చూచీ చూడడంతోటే రెండింటినీ విడదీయలేము; రెండూ బంగారంగానో, రోల్డుగోల్డుగానో గ్రహిస్తాం. సూక్ష్మంగా పరిశీలించినా, కావుంటే వొరపిడిరాయిమీద పెట్టినా రెండింటినీ విచక్షించగలం. దంతాన్నీ, కణుజు కొమ్ములో లోపలి భాగాన్ని, ప్లాస్టిక్‌నూ కలిపి వొకే దగ్గిరుంచితే ప్రధమతః వాటిని విచక్షించలేము. వెండీ, సత్తునూ కూడా అలాగే విడదీయజాలక భ్రమలోపడతాం. రాత్రివేళ ని ుమైన పామూ, దానిప్రక్క నొకతాడూ పడివుంటే రెండింటినీ త్రాళ్ళనో, పాములనో పొరపడుతాము. ఆ తర్వాత పరీక్షిస్తే దేనికదివేరని కనుగొంటాం. రాత్రిదూరంగా మిణుగురులతోలు, దివ్వెలూ కూడా వున్న సందర్భంలో చూచీచూడగానే రెండింటినీ వొకరాశివిగానే భ్రమసజెందుతాం. ఎడారిలో ఎండమావుల్లో పాటుగా జలాశయంవున్నా రెండింటినీ వెంటనే విడదీయలేము. ఈ వుదాహరణలతో విరమించి సూత్రీకరణవు పూనుకోవచ్చు.

సారూప్యంగల రెండువిభిన్నవస్తువులు కళ్ళముందర వొకే సమయంలో, వొకే స్థలంలో ప్రత్యక్షంగా వుంటున్నప్పుడుసైతం భ్రాంతి, పరస్పరమైన అధ్యాస సంభవిస్తుంటుంది. ఏకకాలంలో ప్రత్యక్షంగా వుండే రెండువిషయాలమధ్య అధ్యాస సంభవంగాబట్టే, వొకానొకప్పుడు ప్రత్యక్షంగా కనబడి దాని రూపాన్ని మనమనస్సుపై ముద్రించిన పూర్వదృశ్యానికి, ప్రస్తుతం జ్ఞేయంగా లభించేవాని మధ్యా భ్రాంతికి అవకాశం కుదురుతోంది. అంతేగాని లోగడ చూసినదాని జ్ఞాపకానికీ, వర్తమాన జ్ఞేయానికీ మధ్య అధ్యాస మూలంగాదు; అది తూలం మాత్రమే. ఈ అనుభవం ప్రకారం శంకరుని నిర్వచనం తప్పని సిద్ధిస్తోంది. ఇలా తప్పుగా సూత్రీకరించడంచేత స్మృతిరూపాన్ని, అంటే పామును న్యూన సత్యం లేక అసత్యంగా చూచి, త్రాడును (అధిష్ఠానాన్ని) అధికసత్యంగా తారతమ్యంఎంచాడు. సత్యత్వంలో అంతస్థులు చూశాడు. ఏకకాలిక జ్ఞేయాలు రెండింటిమధ్య భ్రాంతి కలగడం అసలు మూలవిషయమునేసరికి, స్మృతియొక్క వాస్తవ చిత్రణను త్రోసిపుచ్చనూ వీల్లేదు; పరస్పరా ధ్యాస పొందే విషయాలు సత్యత్వంలో సమహోదా కల్గివుండాలని పర్యవసిస్తుంది.

భ్రాంతిని మరికొంత వివేచన చేదాం. ఒక వస్తువును మరొక వస్తువుగా పొరపడాలంటే, ఆ రెండువస్తువుల్లో కొన్ని సమధర్మాలుండాలి. పాముకూ త్రాడుకూ మధ్య పొడవుగా, వంపులు దిరిగి, నేలను కరచుకొని పడివుండటమనే సమానగుణం వుంది. విలక్షణతను పురస్కరించుకొనిగాని, గుణ రాహిత్యాన్ని పురస్కరించుకొని భ్రాంతి ఏర్పడదు. నామరూప సామ్యాన్ని బట్టే భ్రాంతి జనిస్తుంది. అనగా రెండు సగుణాలమధ్యే భ్రాంతిగాని, నిర్గుణ సగుణాల మధ్య గాదు. సగుణ ప్రకృతి పరిధికి లోబడే వుంటుంది. భ్రమ; అంతే గాని భ్రమ ప్రకృతి పరిధిని వుల్లంఘించ డానికి వీల్లేదు. సరిహద్దులు దాటరాదని నిషేధాజ్ఞలు జారీచేసి వుంచింది; అందువల్ల నిర్గుణబ్రహ్మానికి, సగుణ ప్రకృతికి అధ్యాస అసంభవం.

స్మృతి రూపానికీ, వర్తమాన జ్ఞేయానికీ అధ్యాస వుంటుందని శంకరుడన్న మేరలోకూడా, అధిష్ఠానం-ఆరోపితవస్తువు స్వతంత్రమైన సమసత్యాలు గావడానికి వీల్లేదు. స్మృతికి మాతృకఅయిన నిజమైన పాము, త్రాడూ సమసత్తాకాలే గావాలి. శంకరుని నిర్వచనాన్ని సాగలాగితే ఇలా తేలుతుందని ఆయన తర్వాత కాలంలోని అద్వైతాచార్యులు గ్రహించారు. శంకరునిలో అజ్ఞాతంగా మిగిలిన యీ బలహీనతను సరిదిద్దడానికి బూనుకన్నారు. "ఆరోపిత వస్తువును యథార్థంగా లోగడ చూసివుండాలి (పూర్వదృష్టం), చూసినదానికి మానసికరూపం (స్మృతి రూపం) వుండాలి అని విధించిన మతులు అనుకోకుండా' అన్యథాఖ్యాతివాదంతో చేరుస్తాయని ఆ మతుల్ని కత్తిరించ నారంభించారు. వాచస్పతి మిశ్రుడు యీ రెంటినీ గాక, వేరొకచోట (పరత్ర) అన్నదానిని కూడా ఎత్తివేశాడు. అవభాసించటమే అధ్యాస పొమ్మన్నాడు. తదితరులు వేరొకచోట

అవభాసించడం అధ్యాస అని పరత్రశబ్దాన్ని ఎత్తి వేయరాదన్నారు. అనంతరకాలంలోని యీ నవరణల్ని చూస్తే, భ్రాంతికి గురట్యే రెండు వస్తువులు ఎక్కడ సమసత్తా లవాల్సివస్తుందోనని జాగ్రత్తపడుతున్నారని తెల్లమవుతుంది. సమగ్రమైన అధ్యాసానుభవాన్ని ముందే చూశాం. అంచేత యీ నవరణల్ని గమనించ నవసరంలేదు. *

ఎప్పుడైతే ఏకకాలిక జ్ఞేయాలైన రెండింటిమధ్య అధ్యాస వుందన్నామో అధిష్ఠానం ఆరోపితవస్తువుకు 'వుపాదానకారణం' కాదు. [వుపాదానకారణమంటే వస్తుత్వకారణం. కుండకు మట్టి వుపాదానం. నగలకు బంగారం వస్తుత్వం.] పాముకు త్రాడు వుపాదాన కారణం కాదు. త్రాడు తన గుణధర్మాలవల్ల నిమిత్త కారణమైంది. ఇదొక పగటికల. నిద్రలో నీటి కుళాయి కారే శబ్దం ప్రేరణగా పనిచేసే ప్రవాహాన్ని, నదిని చూస్తున్నట్లు కలగంటామని వెనక చూసినట్లే జాగ్రదవస్థలోని స్వప్నంలాంటి స్మృతిరూపమైన భ్రాంతి. త్రాడు పాము కనబడటానికి నిమిత్త కారణమైతే, జగత్తుకు బ్రహ్మం నిమిత్తమే కాగల్గుతుంది గాని, నిమిత్తోపాదన కారణాలు రెండూ కాజాలవని తేటపడుతుంది.

## అధ్యాస - ఆకాశదృష్టాంతం

ఆచార్య శంకరులు కొన్ని ఆక్షేపణలు తన వాదంపై రాగలవని తానే వూహించి సమాధానాలుకూడా యిచ్చివుంచారు. అందులో యిదొకటి చాలా ప్రముఖమైంది. ఈ ఆక్షేపణ, సమాధానం గౌడపాదులే నిర్వహించి వుంచారు. శంకరుడు పునరుద్ఘాటించాడు. 'పరబ్రహ్మం ప్రత్యక్ష ప్రమాణగోచరం గాదు. కాని, అది త్రాడుమాదిరిగానే అధిష్ఠాన మన్నప్పుడు ప్రత్యక్షవిషయమై వుండాలి. ప్రత్యక్షం కానిదాంట్లో అధ్యాస అసాధ్యం' అన్న ఆక్షేపణ రావొచ్చును కున్నారు. దీనికిలా సమాధానం యిచ్చారు:

"అధిష్ఠానం నియతంగా ప్రత్యక్షంగా వుండాలని లేదు. పరోక్షవిషయాల్లోకూడా అధ్యాస సంభవమే. ఆకాశముంది. అది ప్రత్యక్షంగాదు; అది అనుమాన ప్రమాణ గమ్యం మాత్రమే. కాని ఆకాశం నీలిగా వుంది; మలీ మసంగావుంది అంటాము. ఆకాశానికి రంగు నాపాదిస్తాం. కాని వాస్తవంలో దానికి రంగు లేదు. అలాగే అప్రత్యక్షమైన బ్రహ్మంలో అధ్యాస సాధ్యమే." ఇదీ అద్వైత కథనం.

ఆకాశం అప్రత్యక్షమే గావచ్చుగాని అనుమాన ప్రమాణంవల్ల తెలుస్తోంది. పరబ్రహ్మ మంటామా అనుమానానికికూడా అతీతం. ప్రమాణాలకు అందనిది పరబ్రహ్మం. * ప్రమాణానికి తెలిసేది ఆకాశం. ఇందులో వొకటి అప్రమేయం, మరొకటి ప్రమేయం. ఈరెండూ పూర్తిగా భిన్నరాసులకు చెందిన సత్తాలు. అందుచే సమధర్మం, పోలిక కుదరడానికి వీల్లేదు. అనుమానం అప్రత్యక్షమే కావచ్చుగాని అపరోక్షం గాదు. అపరోక్షం అప్రత్యక్షం ఒకటికాదు. అవి అత్యంత విభిన్నాలు. పరబ్రహ్మానికి విషయాంశ చెప్పవలసివస్తే అది అపరోక్షం ♦ అని చూపడం, అది విషయం కాదనాల్సివస్తే 'అప్రత్యక్షం' అని చెప్పరావడం సమంజసంకాదు. అనుమానం ప్రత్యక్షాన్ని అనుసరిస్తుంది. ఆకాశం అంటే ప్రదేశం (Space). ధ్వని తరంగాలను వ్యాపింపచేయడం దాని స్వభావం అన్నారు మన పూర్వులు. ఈనాడాకాశానికి వక్రతువ ఆకారం (Curvature) వుందని ఐన్‌స్టీన్ అన్నాడు. ఆ ఆకాశం పరిమితం, పరివ్యాపనాశీలమైంది అన్నాడు. విశ్వంలోని ద్రవ్య భారంపైనే దాని పరిమాణం ఆధారపడి వుందంటున్నాడు. ఈ విధంగా గుణధర్మాలు కలిగినది (పూర్వుల దృష్టిలోనూ, ఆధునికుని దృష్టిలోనూ) గాబట్టే నీలిమ ఆకాశసంబంధమైంది గాకున్నా,

---

*[అయితే యిక్కడొక జాగ్రత్త తీసుకోవాలి. నవరణ కర్తలకన్నా శంకరునిలో వాస్తవికత అధికంగా వుందని గ్రహించడానికీ విషయాన్ని చూపడానికి యత్నిస్తే, వేగిరపాటు అవుతుంది. ఎందుకంటే వాచస్పతియే శంకరానుయాయుల్లో వాస్తవిక దృష్టిని అధికంగా పోషించాడు.]

* శాస్త్రిగారు బ్రహ్మం అనుమానసాధ్యమని వ్రాశారు. అది సరిగాదు.

♦ కె. వి. శాస్త్రిగారు అనుమాన గమ్యంలో ప్రత్యక్షాన్ని ఆరోపించవచ్చన్న దానితో తృప్తి పడ్డారు. 'కళ్ళకు కనిపించని బ్రహ్మంలో జగత్తును ఆరోపించడం అసంభవంఅనే వాదంలో పసలేదు' అన్నారు నిజమే. బ్రహ్మం కళ్ళకు కనపడడంలేదని కంప్లెయింట్ చేసిన వాళ్ళతోనే వారి పేచీ అయితే అంతే.

దానికీ, నీలిమకూ సంబంధం అంటగట్టడం సాధ్య మైంది.

పైగా ఆకాశాన్ని నీలాకాశమనే అంటున్నాం గాని ఆకాశమే లేదనడంలేదు. నీలాకాశమనే అధ్యాస రజ్జుసర్పభ్రాంతి, శుక్తిరజతభ్రాంతి వంటిది మాత్రం గాదు. పాము భాసించినంతసేపూ త్రాడన్న స్ఫూర్తి లవలేశంకూడాలేదు. నీలాకాశమనడంలో అధిష్ఠానం, ఆరోపిత వస్తువు రెండూ ఏకకాలికంగా వున్నాయి. రెండూ వొకేసారి అనుభూతమవుతున్నాయి. ఇక్కడ రెండు నిజవస్తువులమధ్య లేని సంబంధాన్ని ఆరో పిస్తున్నాం. రజ్జు సర్ప భ్రాంతిలో సంబంధ విష యంలో గాకుండా వొక శాస్త్రీకి బదులుగా మరొక శాస్త్రీని ఆరోపిస్తున్నాం. త్రాడని గ్రహించాక పాము అదృశ్యమైనట్లుగా, నీలిమఆకాశానిది కాదని తెలుసు కున్నాక నీలిమ అంతర్ధానం గావడంలేదు. ఈ దృష్టాం తంలో శంకరుని అధ్యాసానిర్వచనంలోని షరతులేవీ వర్తించడంలేదు. ఎందుకంటే నీలిమ ఆకాశం రెండూ వర్తమానసత్యాలే; యుగపద్జ్ఞేయమానాలే.

## దృష్టాంతం - దాని విలువ

అనుపమానం, అప్రమేయమయిందీ, నిర్గుణమన్నదీ ప్రమేయంగానూ, సగుణంగానూ అధ్యాసించబడు తున్నట్లుగా లెక్కకొక్క దృష్టాంతం చూపితేనే అద్వైతం నిలుస్తుంది. కాని దృష్టాంత మసంభవం. దృష్టాంతం చూపలేకుండా వాదించడం దోషం. గుర్తు దెబ్బకొగ్గితే గాడపాదుడు ప్రతిపక్షవాదానికైనా దృష్టాంతముందేమో చూపించుమని అంటూ పరుగు తోలాడు. జననంలేనికారణం నుండి, కార్యం జనిస్తు న్నట్లు దృష్టాంతమేలేదు పొమ్మని ఎదటిపక్షాన్ని నోరుమూయించబోయాడు. ['అజాద్వైజాయతే యస్య దృష్టాంతస్య నాస్తివై' - IV. 13 కారికలు] అలాగే శంకరుడూ దృష్టాంతాలు తెండని పరపక్షుల్ని దొక్కాడు. కార్యగుణాలవల్ల కారణం కలుషితమవుతుందనేందుకు ప్రతిపక్షానికి దృష్టాంతంలేదు అన్నాడు. [త్వత్పక్ష స్యతు న కశ్చిత్ దృష్టాంతోఽస్తి' - వే. సూ. భా. (2.1.9)] తనకొక్క దృష్టాంతముందంటే తనవాదం నిలబడినట్లు లెక్క. (నతుదృష్టాంత భావాత్-వే. సూ. భా. (2.1.)*

* ఇంత సూటిగా దృష్టాంతాలు కోరిన వీరు తాము నిర్గుణంలో సగుణం అధ్యాసించబడుతోందనడానికి సూటి దృష్టాంతం ఎత్తిచూపలేకపోయారు. అందుకు మారుగా పక్కదారులుపట్టి గందరగోళం సృజించారు.

అసలు దృష్టాంతబలంమీదే పూర్వం వాదాల నిలు వడం, కూలడం అంటూవుంది. తనవాదనకు దన్నుగా తామిచ్చిన దృష్టాంతం సహేతుకమో కాదో స్వతంత్రంగా పరీక్షచేసి నిర్ణయించడం పరిపాటి, ఆచారమున్నూ. సాంఖ్యులు పురుషునికి కర్తృత్వం అంటకపోయినా అతని సన్నిధానంలో ప్రకృతికి ప్రవృత్తి కలుగు తుం దని చెప్పడానికి సూదంటురాయి కదలకుండానే ఇనుప రజాన్ని కదుపుతుందనీ, గుడ్డివాని మీదెక్కిన కుంటి వాడు దారిచూపుతాడనీ దృష్టాంతాలిచ్చారు. ఈ దృష్టాం తాల్లో అయస్కాంతానికీ, కుంటివానికీ కర్తృత్వం, వికారం తప్పక సిద్ధిస్తుంది; దృష్టాంతంవల్ల వారంగీక రించిన దాన్నే విడచిపెడుతున్నవాళ్ళవుతున్నారు; అలావిడవడం 'అభ్యుపేతహానం' అనేదోషం అంటూ 'పురుషాశ్మవదితి చేత్తథాపి' అన్న (2-3-7 వే.సూ.) సూత్రంలోనూ, దాని భాష్యంలోనూ విమర్శించారు. అందుచేతే దృష్టాంతం చూపవలసిందిగానూ, దృష్టాం తాన్ని విమర్శలో నెగ్గించవలసిందిగానూ [illegible] కోరవల్సివుంది.

కాని మనములా దృష్టాంతాలతో వివేచన ప్రారం భించేసరికల్లా అద్వైతులు అడ్డువస్తారు. ఉపమానాన్ని కావ్యంలోవలె చూడమంటారు. అదేమంటే శంకరుడు దృష్టాంతాన్ని సాగలాగొద్దన్నాడు; దృష్టాంతానికి దృష్టాంతంగానే విలువగాని ప్రమాణంగా విలువగా దన్నాడన్నట్లు మాట్లాడుతారు. ♦ ఉపమానం [illegible] వొకానొక లక్షణాన్ని పురస్కరించుకొనేగాని [illegible] విషయాల్లోనూ కాదని సూత్రభాష్యంలో (3-2-[illegible]) శంకరుడన్నాడు. ఆ శంకరుడే బృహదారణ్యక భాష్యంలో మరోవిధంగా చెప్పాడని చూపుతా[illegible]. ప్రాపంచిక వస్తువులకు స్థూలమైనవో సూక్ష్మమైనవో కొన్ని స్థిరమైన ధర్మాలుంటాయి. శ్రుతులు వాటిని దృష్టాంతాలుగా ఎత్తిచూపి, వాటికివిరుద్ధంగానివిధం [illegible] మరోవిషయాన్ని బోధించయత్నిస్తాయి. ఐహికానుభవా నికి విరుద్ధమైన విషయాలను బోధించడమే వాటివుద్దేశ మైతే అవిఅనుభవంనుండి వొక్కదృష్టాంతాన్నైనా ఎత్తిచూపవు" అని చెప్పాడు. (2-1-20 బృ. భా.). ఆ విధంగా శంకరుడికి శంకరునితోనే సమాధానం చెప్పించవచ్చు. దీనంతటికన్నా ఆయన ప్రతిపక్షితో ప్రవర్తించిన తీరు ముఖ్యం. ప్రకటన కన్నా ఆచరణ అంచులోకి రావాలి.

♦ శ్రీ రాధాకృష్ణన్

'పూర్వమీమాంస' వుపమానం ఒక ప్రమాణమంది. శంకరుడు దాన్ని కాదనలేదు. ఆ మీమాంసలోకి దిగలేదు. కాని అద్వైతశాఖ నేటికీ దానిని ప్రమాణంగానే భావిస్తుంది. 'వేదాంత పరిభాష' విస్పష్టంగా దాన్ని ప్రమాణంగా తేల్చి చెప్పింది. ఇదంతా, ఏమైనప్పటికీ అధ్యాసానుభవాన్ని వుపమానం మాత్రంగానే శంకరుడు గ్రహించలేదు. రజ్జు సర్ప భ్రాంతి మొదలైన సకల భ్రమలను క్రోడీకరించి అధ్యాసను సూత్రబద్ధంగా నిర్వచించారు. అది దృష్టాంతం కాదు; అది సమగ్రరూపం పొందిన వాదన; భ్రాంతి అనుభవాన్ని పురస్కరించుకొని నిర్మించిన సిద్ధాంతం. (Inductive Theorisation).

గౌడపాదుణ్ణే తీసుకోండి. ఆద్యంతాల్లో లేనిది మధ్యలోవున్నది కానేరదు అన్నదొకటి ఆయన చెప్పిన కీలకసిద్ధాంతం. ఆయన యీ సిద్ధాంతానికి చూపిన వుపపత్తి మరేమోకాదు, భ్రాంతి అనుభవాన్నే. త్రాడులో పాము భ్రాంతిక్షణంలోనే వుంటోంది. కాని అంతకు ముందూ, అంతకు వెనకా లేదు. భ్రాంతిసర్పం వాస్తవము కాదని తెలుసు. అంటే భ్రాంతి సర్పానికి అస్తిత్వం లేదు. భ్రాంతియొక్క యీ అనుభవాన్ని సూత్రీకరిస్తేనే పై సిద్ధాంతానికి సిద్ధివుంది. ['ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా, వితథైః సదృశాః సన్తో వితథా ఇవ లక్షితాః'- II - 6. గౌ. కా. 30.]. ఇదేమైనా వుపమాలంకారమా? లేకపోతే ఇండక్టివ్ తర్కానికి ఆధారభూతమైన విషయమా? అందుచేతే దీన్ని విమర్శించడం సమంజసం, అవసరం. అందుచేతే శంకరుడు యినుము - సూదంటురాయి కథను విమర్శించి సాంఖ్యాన్ని త్రోసిపుచ్చాడు. అందుచేతే వుపనిషత్తులలోనూ, వేదాంత సూత్రాలలోనూ లేని తన మాయావాదానికవసరమైన భ్రాంతిస్థాయిలోని ఉదాహరణల్ని శంకరుడాశ్రయించాడు.

## మాయావాదం

అధ్యాస విషయం ముగిసింది. ఇక మిగిలింది మాయావాదం. అధ్యాసవాదం పునాది - దానిపై లేచే భవంతి మాయావాదం. పునాదిలోని పట్టు తెలిసింది. భవంతియొక్క ఆకృతితోపాటు బలంకూడా తెలుస్తుందిప్పుడు.

త్రాడులో లేనిపాము వున్నట్లుగా అగుపడుతోంది. అదేమాదిరిగా సర్వగతమైన పరబ్రహ్మంలో యథార్థంగాలేని జగత్తు వున్నాదనిపిస్తోంది. త్రాడును, పామును భ్రమాత్మకంగా చూడడానికి అంతకన్నా వేరుగా ఒక ద్రష్ట వున్నాడు. పరబ్రహ్మాన్ని, జగత్తును చూడడానికి వేరుగా యెవరున్నారు? ఎవ్వరూ వుండడానికి వీల్లేదు. వుంటే ప్రమాదం. 'అద్వైతం' అభాస మవుతుంది. అలా కాకుండా కాపాడుకోవాలి. వేరే మరో ద్రష్టలేకుండా కార్యం వొడ్డెక్కించాలి. అలా చేయడంలోనే దాని సాఫల్య వైఫల్యాలు ముడిపడి వున్నాయి.

చూచేవాని భ్రాంతబుద్ధివలన త్రాడు పాముగా అగపడింది. పరబ్రహ్మంలో భ్రాంతబుద్ధివంటి దొకటి వుండనాలి. భ్రాంతి విజ్ఞానంకాదు; విద్యకాదు. అదొక అవిద్య. పరబ్రహ్మంలోనూ అట్టి అవిద్య వుండనాలి. అవిద్యకే మరోపేరు మాయ. ప్రపంచం మాయగాదు, దాని కర్మాగారంలో తయారైన వస్తువిశేషం. పాము భ్రాంతబుద్ధికాదు; దానిచే తయారైన సరుకు. ఇది మనకు తెలియందికాదు. నిద్రలో మనకు తెలియని స్థితి అంటూ తెలుసుకోబడుతోందే, అదే మాయ. నిద్రలోని అజ్ఞానమే అవిద్య.

మాయకుగల స్వభావ మేమిటి? భ్రాంతబుద్ధికి వున్నదేదో అదికాస్తా మాయకూ వున్నదని చెప్పాలి. భ్రాంతబుద్ధి మొదటి అంచెలో చేసిన ఘనకార్యం త్రాటిని కప్పిపుచ్చడం; రెండో అంచెలో లేని పామును కల్పించడం. అంటే వున్న వాస్తవాన్ని మూసి, లేని అవాస్తవాన్ని విప్పడం దాని వుద్యోగం. మాయకు యీ ద్విముఖవ్యాపారం వుంది. పరిభాషలో వీటినే ఆవరణశక్తి, విక్షేపశక్తి మాయ కున్నాయంటారు. వున్నదాన్ని లేదనిచెప్పి వూరుకోదు. వున్నది మరొకటనిచెప్పి తప్పుదారిని పెడుతుంది. తనకు తెలియంది తెలియనట్టు వూరుకోదు; తెలిసినట్టు నటించి ప్రమాదం తెస్తుంది.

పరబ్రహ్మం అద్వితీయుడు, ఏకాకి. మాయ బ్రహ్మంతోనే ఏవిధంగానైనా సంబంధం కలిగి వుండాలి. అది మరెవ్వరికీ చెందడానికి వీల్లేదు. తనకు తాను స్వతంత్రంగా వున్నది కావడానికీ వీల్లేదు. పరబ్రహ్మంతో దానికి వుండగల సంబంధాన్ని నిర్వచించడానికి యత్నించుదాం.

మాయ పరబ్రహ్మంయొక్క స్వభావం, గుణధర్మం (Quality) అని అందామా అంటే వీలులేకుండా వుంది. స్వభావమైనా స్వధర్మమైనా అదినిత్యం, నియతం కావాల్నివుంటుంది. వేడిమి అగ్నికి స్వభావం; ప్రకాశం

సూర్యుని స్వధర్మం. వేడిమిలేని అగ్నిగాని, ప్రకాశం లేని సూర్యుడుగాని లేడు. ఇదే 'ధర్మ' 'ధర్మి' సంబంధం. ఇందులో ధర్మంనుండి ధర్మికి ముక్తిలేదు. పరబ్రహ్మం యీ సంబంధం ప్రకారం మాయతో అంటు వొదుల్చుకోలేనిదవుతుంది. అంతేగాదు; ఇంకా ప్రమాదిస్తుంది. మాయాపరబ్రహ్మలలో ఎవరి అధీనంలో ఎవరున్నారని చెప్పాలోకూడా ఇదమిత్థం కాకుండాపోతుంది. అద్వైతం వేదాంతమేగాదు, మతంకూడాను. మోక్షభావానికి అవకాశంలేకపోతే అది అంగీకరించదు. మాయనుండి విముక్తి కావాలంటే అది పరబ్రహ్మంతో ధర్మ ధర్మి సంబంధం కుదుర్చుకో రాదు. ["తస్మాన్నాత్మ ధర్మో అవిద్యా, నహి స్వాభావికస్యోచ్ఛిత్తిః కదాచి దప్యుపపద్యతే, సవితు రివౌష్ణ్య ప్రకాశయోః" 4-3-20 వే. సూ. భా.]

ఇక నిత్యధర్మం అనడానికి మారుగా ఆగంతుక ధర్మమనగూడదేమోకూడా కనుగొందాం. ఆగంతుక ధర్మానికి వృద్ధిక్షయ వినాశాలు వుండేమాట నిజమే. మాయ నివృత్తిగావాల్సి వుంటున్నందువల్ల, యిలా భావించడం అనుకూలమైనదే. ఆగంతుక ధర్మం సంయోగజన్యం. సంయోగమన్నది రెండు స్వతంత్ర వస్తువులమధ్య సంభవం. అద్వైత సిద్ధాంతావసరాలు బ్రహ్మంకన్నా భిన్నసత్యాన్ని అంగీకరించనివ్వవు. అందుచేత మాయ పరబ్రహ్మనికి ఆగంతుక ధర్మమూ కాగూడదు.

గుణధర్మభావాన్ని పూర్తిగా విడిచి, మాయకు బ్రహ్మం కర్త అని, ఆరెంటికీ కర్తృ కర్మ సంబంధం కుదిర్చితే వీలేమో? అంటే అదీ ఆక్షేపణకు గురౌతుంది. బ్రహ్మ కర్తగాడు. కర్తృభావం అహంకారానిదేగాని ఆయనది కాదని ఆదిలోనే తెల్సుకున్నాం.

ఇదొక గడ్డుసమస్య. దీనికి నిర్వచనం దుర్లభం. మాయా పర బ్రహ్మలకు సంబంధం అనూహ్యంగా వుంది. అయినా సత్యానికీ అసత్యానికీ నిజమైన సంబంధం ఎలా పొసగుతుంది? అసంభవం. ("నహిసదసతోః సంబంధః" అని మాండూక్యోపనిషత్తు రెండో అధ్యాయానికి ప్రవేశికలో శంకరుడన్నాడు.) సత్యానికీ అసత్యానికీ సంబంధంకూడా అసత్యం. అందుచే ఆ రెండింటి సంబంధం అనిర్వచనీయం' అన్నాడు శంకరుడు. *

* "A relation between the real and unreal cannot be expressed by words because such relation is, itself, non-existent."

తాడుకు, దానిలోకన్పించే పాముకుగల సంబంధం కూడా అనిర్వచనీయమే నంటారు. ఆ సంబంధం మా కేమిగాని, పామెలా నిజంగా లేదని తేలుతుందో, మాయకూడా అదేమాదిరిగా నివృత్తిగావాలి.

ఇదీ అద్వైతి అంతఃస్వభావం. ఇక్కడతడెంతో ప్రయాస తీసుకున్నాడు. నిరాశచేసుకోవలసినచో నిలదొక్కుకొని ఏదో సమాధానమంటూ చెప్పాడు. దాని సవ్యాపసవ్యాలు తర్వాత విషయం. సవ్యాసవ్యాల ప్రసక్తి తెస్తే వూరుకోడు. అక్కడా ఆయకోక వాదనవుంది. అసలలా విచారించే అవకాశా లేవంటాడు. ఇది వినేముందుగా మరొకటి గమనించుదాం.

ఈ సంకటస్థితిని శంకరుని మాటలలోనే వివరించిది. "పరబ్రహ్మనికి సంబంధంలేని గుణధర్మా పరబ్రహ్మంలో అధ్యారోపింపబడటం లేదని మే: లేదు. తనవికాని యీ నామరూపాలను తనలో అధ్యారోపించుకొనే కారణంగాని, యీ అవిద్యకు కర్తగా పరబ్రహ్మం కారాదన్నదే మావాదన"అని పూర్వప అంటాడు. 'దానికి శంకరుని సమాధానం యిది: "స మీరన్నట్టే కానివ్వండి; బ్రహ్మం అవిద్య కర్తగాని, అవిద్యవల్ల భ్రాంతికి గురిగావడం గాని కాదు. కాని దానికి కర్తగాగాని, దాని భ్రాంతిలోనుగావడానికి గాని పరబ్రహ్మం కన్న అన్యమైన చేతనారూపం మరొకటి లేదుగదా." ఇలా చెప్పి తృప్తిపడటంకన్నా మరోదారి లేదన్నాడన్నమా. ["భవత్యేవమ్, నా విద్యాకర్తృభ్రాంతంచ బ్రహ్మ, కింతునైవా బ్రహ్మవిద్యాకర్తా చేతనో భ్రాంతో అ యిష్యతే" అనిఅన్నాడు.] తేటతెల్లంగా మరి చెప్పాలంటే, అనంతము, సర్వవ్యాప్తమూ అయిన బ్రహ్మనికి వెలుపలఎక్కడో మాయవుండటానికి ఆస్కా చిక్కడంలేదు అనిచెప్పాలి. ఇక మాయఅన్నది ఎక్కడ వుందని ఎందుకు సిద్ధాంతీకరించాలంటే, జగత్తొక గారడీవొకటి కళ్ళకు కన్పించి నందున వివరణ యిక్కడ విధిలేదింటున్నందున. బృహదారణ్యక భాష్యంలో (4- -20) (1-4-10) చూడడం యుక్తం.

ఇక్కడికి మాయాబ్రహ్మలకున్న సంబంధం గురించి పూర్తయ్యింది. ఇక దాని సత్యత్వహానోగారవగైరాలు చూడాలి. దాని స్వరూపమేమిటి? అది ద్రవ్యమా (matter)? వీటికి జవాబులు కనుగోడానికి రజ్జు సర్పాలవద్దకు వెళ్దాం. త్రాడులో సర్పాన్ని కల్పించేది భ్రాంతబుద్ధి. అనగా ఆరోపణ బుద్ధి వ్యాపారమన్నమాట. దీనికి నకలుగా మాయకూడా

ఒకానొక బుద్ధివ్యాపారంవంటిదే గావాలి. అంచేత నేటి మన వాడుకలోవున్న అర్థంలో మాయ జడం గాదు. కాని భావన, మనస్సు అద్వైతికీ, సాంఖ్యునికీ ప్రకృతిపరమైనవే. ప్రపంచం జడరూపం. బుద్ధివ్యాపారమైన మాయ జడజనకం. మాయను 'అజ్ఞానరూపిణి' అన్నాడు. అజ్ఞానం జడంకన్నా భిన్నమైనది. దీనినే మరోవిధంగా' 'తమోరూపిణి' అన్నాడు. 'మాయాచ తమోరూపా'. అందుచేత నిది ఆధునికార్థంలోవలె అచేతన ద్రవ్యంకాదు.

సత్యత్వంలో దీని స్థాయిని పరీక్షిద్దాం. నిత్యమయిందే సత్యం అని అంటుంది అద్వైతం. మాయ నిత్యం కాదు. దానికీ నివృత్తి వుంది. అందుచేత అది సత్యంగాదు. పరబ్రహ్మంతో జీవాత్మ లీనం అయినప్పుడు మాయ వుండదు, కానరాదు. పారమార్థిక సత్తా దానికిలేదు. మళ్ళీ మరోవేపు పూర్తిగా 'అసత్తు' గాదు. అసత్తుకు ఎట్టి క్రియాసామర్థ్యం వుండదు. గొడ్రాలి బిడ్డ, కుందేటి కొమ్ము, ఆకాశపుష్పం అన్నవి అందుకు ఉదాహరణలు. అవి పేర్లేగాని దృష్టి గోచరాలు గావు. మాయ మరి విశ్వరూపాన్ని దృష్టి గోచరం చేస్తుంది. ఇది క్రియాశాలి. క్రియాశాలి 'అసత్తు'కాలేదు. అంచేత వ్యవహార దృష్టినుండి'అసత్తు' గాదు. అనగా ఇది సత్యమూకాదు; అసత్యమూ కాదు. ఇదొక చిత్రమైన స్థితి. సత్యాసత్యాలు కానిదికావడంచేత దీని సత్యత్వహోదాకూడా అనిర్వచనీయమేనంటారు; అదేమిథ్య. దానిహోదా అనిర్వచనీయం; బ్రహ్మంతో దానిసంబంధం అనిర్వచనీయం. బ్రహ్మానుభవం అనిర్వచనీయం. అద్వైతికంతా అనిర్వచనీయమే. అద్వైతమే అనిర్వచనీయవాదం.

మాయాకార్యమైన జగత్తు ఇంద్రియ ప్రమాణ గోచరం. కాని మాయమాత్రం ప్రమాణగోచరంగాదు. గాఢనిద్రలో ఇంద్రియాలేగాక మనస్సుకూడా పని చేయనప్పుడు 'అజ్ఞానం'గా అది అనుభూతమవుతోంది.

## మిథ్యా - విరుద్ధాంశల కలయిక

సత్యమూ, అసత్యమూకాని మాయ మిథ్య. దాని కార్యమైన జగత్తు మిథ్య. కాని మిథ్య సదసత్తులన్న విరుద్ధాంశల సమావేశాన్ని తెలియజేస్తుందని అంటున్నారు. మాయావాదం విరుద్ధాంశల సమావేశాన్ని బోధించిన గతితర్కం అని పొరపడుతున్నారు. 'వ్యవహార ప్రపంచం వైరుధ్యదూషితం; అందుచే తనది సత్యంకాదు; వైరుధ్యరహితం సత్యం' అని శంకరుని భావం అంటున్నారు. అందుచేత దీన్ని సవివరంగా పరిశీలించాల్సి వచ్చింది.

మిథ్య అంటే లేనిది వున్నట్లుగా కానరావడం. త్రాడులో లేనిపాము వున్నట్లుగా స్ఫురిస్తోందిగదా అంటారు. దృష్టాంతం ఇందులో లేనిది వుంటున్నట్లు అనిపిస్తే పారమార్థికంగా లేకపోయి, వ్యవహారంలో వుండడమన్నమాట. అంతేగాని వుండడం, లేకపోవడం అన్న విరుద్ధాంశలు ఒకేవొక స్థాయిలోనీ, వ్యవహార జగత్తులోనీ కావు. గతితర్కంలో విరుద్ధాంశలు రెండూ సత్యత్వంలో సమహోదా కల్గివుంటాయి. ఈ విషయాన్ని గుర్తించకపోతే గతితర్కాన్ని అర్థం చేసుకోలేరు.

మిథ్య సత్తూగాదు, అసత్తూగాదనడంతోపాటుగా సదసత్తుకూడాకాదని అద్వైతమే చాటి చెప్తోంది. సదసత్తులలో మాయ ఏ వొకటీగాక పోవడమే గాకుండా జంటగాకూడా గాదని 'వాచస్పతి' చెప్పనే చెప్పాడు. * బౌద్ధులు, మరికొందరూ 'చతుష్కోటి' లోకి చేరేవంతా నిర్వచనీయమన్నారు. (చతుష్కోటి అనగా సత్, అసత్, సదసత్, సదిసద్విలక్షణం అన్న నాలుగు శ్రేణులు.) అద్వైతం ప్రకారం మిథ్యాభూతమైనది మొదటి మూడంటికన్నా భిన్నమైనదనే విషయం సుస్పష్టం. అది సదసద్వి లక్షణంకూడా కాదేమో నిశ్చయించడానికి వీలు కలగడంలేదు. బహుశా అది కూడా కాకపోవాలి. అప్పుడే అనిర్వచనీయమవుతుంది. విద్యమానం కానందునే మాయ అవిద్య అనిపించుకుంటోంది.

ఇంతేకాదు. గౌడపాద శంకరులిద్దరూ 'సదసత్తు'నొకకోటిగా గుర్తించ నిరాకరించారు. విరుద్ధాంశల సమాగమం అసంభవమన్నారు. సత్తుగాని,అసత్తుగాని, సదసత్తుగాని జనన మొందట మంటూలేదు అన్నారు గౌడపాదులు. ['సదసత్సద సద్వాఽపి న కించిద్వస్తు జాయతే'- కారిక IV-22.] శంకరుడు దీని భాష్యంలో

---

* 1. "సదసదుభయానుభయాది ప్రకారైః అనిర్వచనీయత్వమ్, ఏవహి అవిద్యానామ్ అవిద్యాత్వమ్"— బ్రహ్మతత్వసమీక్ష.

2. 'నా సద్రూపా న సద్రూపా మాయానైవోభయాత్మికా సదసదభ్యాం. అనిర్వచనీయా మిథ్యాభూతా సనాతనీ" - ఆదిత్య పురాణంనుంచి శ్రీ రాధాక్రిష్ణన్ వులేఖించిన పాఠం.

విషయాన్ని విప్పి చెప్పాడు. * "ఉనికి లేములు రెండూ గల వస్తువుకు పుట్టుకనేది సంభవం కాదు. ఎందుచేతనంటే అటువంటి విరుద్ధ లక్షణాలు వొకే వస్తువుకు వుండనేరవు గనుక." అంతేగాక సదసత్తులకు సంబంధమే పొసగదన్నాడని ముందే చూశాం.

వేదాంత సూత్ర భాష్యంలో కూడా యిదే వ్యక్తమయింది. జైనమతం సదసత్సమావేశాన్ని ప్రతిపాదిస్తుందని తెలుసుగదా! ఆ అనేకాంత వాదాన్ని 'నైకస్మిన్న సంభవాత్' (2-2-33) అనే సూత్ర భాష్యంలో తిరస్కరించాడు. వేదాంత శాఖలలోని ద్వైతా ద్వైతాన్ని ఈ కారణంచేతే తిరస్కరించాడు. (2-1-14) సూత్రానికి వ్రాసిన భాష్యం గమనించవలసివుంది. "వొకేమారు అనేక స్థలాలలో వుంటున్నట్లయితే అనేకత్వ ప్రసక్తి సంభవిస్తుంది"అన్నాడు. ["యుగపదనేకత్ర వృత్తావనేకత్వ ప్రసంగాత్'— 2-1-18. వే. సూ. భా.] దృశ్యప్రపంచం వైరుధ్య కలుషితం గావున అది హీనసత్య మనలేదు. దృశ్యమయిందంతా నశించేది. నశించేది పరమ సత్యం కాజాలదు. ఇంతే శంకరుని దృష్టి. నశ్వరమైనందుకే అది హీనసత్యం. దృశ్యంయొక్క లోతుపాతులు ఆయనకంతగా పట్టలేదు.

శంకరుడు లోకవ్యవహారం సత్యానృతాల జోడింపు అన్న సందర్భాలున్నాయి. "సత్యానృతే మిథునీకృత్యాహమిదం మమేదమితి నైసర్గికోఽయం లోకవ్యవహారః"- అధ్యాస భాష్యం. — "సత్యానృత వ్యవహారో లౌకికో.........."(2-1-14 వే.సూ.భా.) బహుశా యీ సందర్భాలు పై విధంగా పొరపడడానికి దోహదం చేసినవికావచ్చు.

కాని అనృతం అంటే అసత్తుకాదు. అనృతం మిథ్యకు పర్యాయపదం. మిథ్య అసత్తుకాదని తెలుసుకున్నాము. మట్టి - కుండ, మూకుడు దృష్టాంతంలో కుండ, చట్టి, మూకుడువంటి నామమాత్రపు వికారజాతమంతా అనృతాలుగా పిలవబడ్డాయి. ('వాచారంభణ శబ్దేన చ వికారజాత స్యానృతత్వాభిధానాత్' 2-1-14 వే. సూ. భా.) అభిన్న నిమిత్తోపాదాన కారణంగా పరబ్రహ్మ సత్యమై జగత్తులో అంతర్భూతమైవుంది. జగత్తు నామరూప వికారజాతంగా అనృతం, మిథ్య. మిథ్యాసత్యాలు జగత్తులో సమావేశమై వున్నాయి. శంకరుల అభిప్రాయం ఇంతేగాని అన్యంకాదు.

## మాయావాద విమర్శ

లేకుండా వున్నాననిపించేదొక సత్యం వుందంటుంది అద్వైతం; ఇందుకు దాఖలా అధ్యాసానుభవం అంటుంది. అధ్యాస పరామర్శ పూర్తిజేశాం. అధ్యాస రెండు సమసత్తాకాల మధ్యనే జరుగుతుందని చూశాం. అందుచేత మిథ్యాత్వమొక కోటీగా స్థానంపొందడమే అసంభవం; అనుభవవిరుద్ధం. ఏదైనా 'సత్తు' గావాలి; లేదా 'అసత్తు' గావాలి; కాకుంటే 'సదసత్తు' గావాలి. ఈ త్రివిధతత్వానికి భిన్నమైనదానికి తావు లేదు. అది అసంబద్ధము.

లేనిదై కూడా కార్యకారి కాగలిగినదంటూ వొకటుండడం చిన్మాత్రబ్రహ్మ ప్రతిపాదనానంతరం అద్వైత సిద్ధాంతావసరం. మన సిద్ధాంత తర్కావసరాలకు కట్టుబడి వుండమంటే ప్రకృతి మొగమోటపడుతుందా? ప్రకృతిరీతి కనుగుణంగా మన సిద్ధాంతాలను మలచుకోవడమే మనవిధి, విజ్ఞత.

అద్వైతం మిథ్యారాశిని అనుభవ విషయంగా చూపబూనడంలో వొక గందరగోళముంది. బాహ్య సత్యాన్ని, దాన్ని మనం గ్రహించే జ్ఞానక్షణాల్ని (Moments of knowledge) కలగాపులగం చేస్తోంది. త్రాడునీ, దాన్ని తెలుసుకోబోవడంలో వొక అంచెగా తటస్థమైన పామన్న జ్ఞానరూపాన్నీ వొకే త్రాసులో పెడుతోంది. బాహ్యసత్యం భ్రాంతి గోచరమైన పామువంటి "సాపేక్ష" సత్యంకాదు. బాహ్యసత్యంయొక్క సాపేక్ష్యత యిటువంటిదిగాదు. బాహ్యసత్యంలో సాపేక్ష్యత అవయవి, అవయవాల సంబంధానికి చెందింది. భాగాలు, వాటి సముచ్చయంగా వుంటుంది. దీన్ని అలక్ష్యం చేయడం విచక్షణను విడవడమవుతుంది.

పరబ్రహ్మం ఏకైకసత్యం. అది స్వయంప్రకాశం. వేడిమి అగ్నికి ఎంత నైసర్గికధర్మమో, స్వయంప్రకాశం బ్రహ్మని కంత స్వాభావికధర్మం. అది నిత్యం. ఇటువంటి స్వయంప్రకాశం మాయచేత మరుగుపడుతోందంటారు అద్వైతులు. ఈ మాయ పరబ్రహ్మనికి కనీసం ఆగంతుకధర్మంకూడా కాదు. ఎలాగో బ్రహ్మన్ని ఆశ్రయంగా చేసుకొని వుంటోంది. ఒకానొక వస్తువు

* 'If things be both existent and non-existent, there also it cannot be born For, such contradictory ideas cannot be associated with a thing'- Nikhilananda's translation of M. K.

యొక్క స్వాభావికధర్మం, దాని స్వరూపం, ఆ వస్తువుతో న్యాసంబంధంగల దానివల్ల మరుగునబడడం విరుద్ధంకాదా? స్వాభావిక ధర్మమైన స్వయంప్రకాశం ఎట్టి 'గౌరహాని'కి గురికారాదు; అప్పుడే అది స్వరూపమనిపించుకో గల్గుతుంది. అందువల్ల మాయచేత పరబ్రహ్మం ఆవృతం కావడం అసంభవం.

మాయవలన సర్వజ్ఞుడు భ్రాంతికి గురి అవుతున్నాడన్నమాట. భ్రాంతికి లోనయ్యేవాడు సర్వజ్ఞుడెలాగవుతాడు? కాని భ్రాంతుడు కాకుంటే జగద్రచన అసంభవమైపోతుంది. సర్వజ్ఞుడు కాకుంటే సృష్టికి శక్తిలేనివాడవుతాడు. అద్వైతంలో యీ వైరుధ్యానికి పరిష్కారం లేదు.

మాయ పరబ్రహ్మంలో వుందంటే, జ్ఞానమే అజ్ఞానానికి ఆశ్రయం కాక తప్పదు. ప్రకాశ స్వరూపమైన సూర్యునిలోనే చీకటీ వుంటుందన్నమాట!

మాయ 'అనాది'గావాలిగాని అనంతం కారాదట. కాని ఆద్యంతాలకు ఎడబాటు అనూహ్యం. ఒకటున్న పక్షంలో రెండోది వుండాలి. అంతమువుండి ఆదిలేనిది అనుభవంలోనే లేదు.

మనలోని జ్ఞాత బ్రహ్మం కాదంటుంది అద్వైతం. పరబ్రహ్మ ప్రకాశంవలన కాంతిల్లేబుద్ధి జ్ఞానానికి కర్త అవుతోందట. కాని యిది వారి వాదం ప్రకారం నిజంగా అసంభవం. మాయా, బ్రహ్మలు రెండూ 'అత్యంత అసంకీర్ణాలు'. రెండూ రెండు విరుద్ధ శ్రేణీయ విషయాలు. వాటిమధ్య సంబంధంవుండనే వీల్లేదు. సాంఖ్యంలోని ప్రకృతి - పురుషులమధ్య సంబంధానికి ఎటువంటి ఆక్షేపణను అద్వైతం తెచ్చిందో దాన్ని వీరూ తప్పించుకోలేరు. అద్వైతంలోని విపర్యాసమిదే.

మాయ పరబ్రహ్మంలో సర్వత్రా వ్యాపించివుందో లేక వొకానొక తావులోనే వుపస్థితమయిందోకూడా శంకరుడు నిర్వచించలేదు. కాని, విద్యారణ్యులు విప్పి చెప్పారు. ఏకదేశస్థమై వుందని పంచదశిలో [2 అ - 78 శ్లో॥] చెప్పారు. ఇలాచెప్పడం ఎలా సాధ్యమైందో? ఇక మాయ తెలియబడేదా? తెలియబడందా - ఏమనాలో అర్థంగాకుండావుంది!

అప్రమేయమనే పరబ్రహ్మన్నీ, దాని స్వభావాన్నీ తెల్సుకోగలం, కాని అనుమాన ప్రమాణసిద్ధమనే మాయయొక్క నిజస్వభావాన్ని తెల్సుకోజాలమంటుంది అద్వైతం! మాయలో భాగంగా వుంటున్నంతసేపూ మనం ఆ మాయ స్వభావాన్ని కనుగోలేమట. బ్రహ్మానుభవంపొందిన సమయాన యీ సమస్యేరాదట. అందుచే దాని అనిర్వచనీయతకు భంగం వాటిల్లదంటున్నారు. ఇది నిజస్థితిగాదని భావిస్తాను.

మాయలేని క్షణం పరబ్రహ్మంలోలేదు. జగత్తు, సృష్టి అన్నది మాయయొక్క వ్యక్తస్థితి. మాయ అవ్యక్తస్థితిలో వుండగలదుకూడా. సృష్టికి పూర్వస్థితిని ప్రాగవస్థ అంటారు. అప్పుడీమాయ అవ్యాకృతంగా పరబ్రహ్మంలో వుందంటారు. సాంఖ్యుల సత్కార్యవాదాన్ని అద్వైతం అంగీకరించినంతలో యిలా వుందనకతప్పదు. కార్యం కారణంలో సూక్ష్మరూపంలో వుంటూ వచ్చేదేగాని, సరికొత్తగాదు. ['ఇదమేవ వ్యాకృతం నామరూపవిభిన్నం జగత్ప్రాగవస్థాయాం పరిత్యక్త వ్యాకృతనామరూపం బీజశక్త్యవస్థ మవ్యక్త శబ్దయోగ్యం దర్శయతి.' 1-4-2 వే. సూ. భా.] పరబ్రహ్మం అవ్యక్తాన్ని వొదుల్చుకుంటే సృష్టిశక్తిని కోల్పోతాడు. అశక్తుడవుతాడు. పరబ్రహ్మం 'దృక్', 'సాక్షి'. అవ్యక్తమాయను యీ పరబ్రహ్మం గ్రహించకపోతే దాని సాక్షిత్వం, దృక్శక్తి వ్యర్థంకావాలి. ముక్తుడు పరబ్రహ్మే అవుతాడు. ముక్తదశలో యీ సమస్య ఎదుర్కొనక తప్పదు. అలాగయితే 'అనిర్వాచ్యం', 'అజ్ఞేయం' కారాదు.

విద్యవల్ల అవిద్యానివృత్తి కలుగుతుం దంటారు. ఒకానొకవ్యక్తి జ్ఞానియై బ్రహ్మభావం పొందితే విశ్వమాయ మొత్తంగా నశించవలసి వుంటుంది. ఇది జరగడంలేదు. అనేకులు జగద్గురువులు సిద్ధిపొందినా విశ్వమాయాలీల సాగుతూనేవుంది. అలాకాక వ్యక్తియొక్క అవిద్యమాత్రమే నశిస్తే మూలావిద్యను మాయను తరించడం జరగదు. ముక్తి అసాధ్యం.

అనుభవానికి యెదురీదబోతే అంతా విరుద్ధంగానే వుంటుంది. అద్వైతంలో మాయావాదం యొక్క ప్రత్యేకత ఎంతో, దాని బలహీనతకూడా అంతే ప్రత్యేకత. శంకరుని అనంతరం అద్వైతంలో శాఖాంతరభేదా లేర్పడ్డాయని చదివాము. ఆ విభేదాలన్నీ మాయావాదంవల్ల వుత్పన్నమయ్యే సమస్యలతోనే తలెత్తాయి. అంతేగాని నిర్విశేషబ్రహ్మ భావంలో యేకాభిప్రాయం కుదరకకాదు. మాయావాదం తెచ్చిపెట్టిన చీలికల్ని చూద్దాం.

'జీవాత్మ' మాయయొక్క కార్యమంటారు. ఇక ఆ కార్య మెలా జరిగిందోనన్నదొక పెద్ద

వివాదం. చంద్రుడు నీటిలో ప్రతిబింబిస్తున్నాడు. నీటిలోని నీడ చంద్రుడికన్నా వేరుగా అగుపిస్తుంది. అలాగే పరబ్రహ్మం మాయలో ప్రతిబింబించి జీవాత్మ రూపం తీసుకుంటున్నాడు. దీనిని బింబ ప్రతిబింబ వాద మంటారు. [దీనికీ శంకరుడే ఆధారం. బృహదారణ్యక భాష్యం (2-1-19)]. బింబ ప్రతిబింబభావన రెండు స్వతంత్రసత్తాల్ని అపేక్షిస్తుంది. చంద్రుడు-జలం; దృశ్యం - దర్పణం - యివి తప్పనివి. ఇది అద్వైతానికి విరుద్ధం. ఈ బాధానివారణకు 'అవచ్ఛేదవాదం' వెలువడింది. దీనికీ శంకరుని ప్రతిపాదన వుంది. నిజానికి యీ వాదానికి కర్త గౌడపాదుడు. ఆకాశం కుండచేత పరిమితమై ఘటాకాశ మనిపించుకుంటుంది; వడగళ్లురూపంలో కట్టుబడి కరకాకాశ మవుతుంది; అంటే వుపాధి వైవిధ్యంచేత భిన్నరూపాలుగా వ్యవహారం పొందుతోంది. అదేమాదిరిగా పరబ్రహ్మం స్వయంపరిచ్ఛేదనా వ్యాపారంవల్ల జీవజగత్తులేర్పడుతున్నాయి. ఇదీ అవచ్ఛేదవాదం; కాని దీనికి వచ్చే ఆక్షేపణా యథాపూర్వమే. ఆకాశం నానా వస్తు రూపాల్లో పరిమితంకావాలంటే, ఆయా వస్తువులు ముందే వుంటున్నవికావాలి. అవే లేకపోతే ఆకాశానికి పరిమితత్వం లభించనే లభించదు. ఇందులో అద్వైతం ఆభాసమవుతుంది. ఈ వంకరను దీర్చ బోయారు మరొకరు. అందుకొక కథ చెప్పారు. 'కర్ణుడు కుంతీపుత్రుడు. కాని సూతునియింట పెరిగాడు. రాధ పెంచింది. దానితో రాధేయుణ్ణి అనుకున్నాడు. అదేవిధంగా పరబ్రహ్మం తన్ను తానే అన్యంగా, వ్యావహారికార్థంగా భ్రాంతుడవుతాడు' అని చెప్తారు. దీనికీ శంకరుడే ఆలంబన. దీనినే రాకుమారుడు హీనకులస్థుడియింట పెరగడంగా ఆయన చెప్పాడు. అది ఆయన సొంతకథగాదు. 'వేదాంతదేశికు' లొక రీవిధంగా చెప్పారని సాంప్రదాయిక కథను బృహదారణ్యకంలో (2-1-20) ఉటంకించారు.

ఏకజీవ, అనేక జీవవాదాలు మళ్ళీ వివదించాయి. పరబ్రహ్మము ఏకైకమై, మాయకూడా ఏకైకమైతే మాయాబద్ధమైన జీవు డొకేవొక్కడు అవుతాడు. ఇందువల్ల ప్రపంచంలో వొక్కడు మోక్షం పొందితే అందరూ మోక్షం పొందాల్సి వుంటుంది. అందుచే మాయలోనే వైవిధ్యం వుందన్నారు. అనేకమైన అవిద్యలచేత అనేకులు జీవు లేర్పడుతున్నారన్నారు కొందరు.

జగద్రచనలో మాయకున్న పాత్రేమిటి అన్నదానినిగూర్చి వివాదంవుంది. పరబ్రహ్మమే కారణంగాని మాయకు కారణప్రతిపత్తి ఏమీ లేదని వొకశాఖ- ఇందుకు విరుద్ధంగా మరో చివరకు లాగి, కారణత్వమంతా మాయకు కట్టబెట్టింది వేరొకశాఖ. మాయాబ్రహ్మలు రెండూ కలిసి కారణం ('అవిద్యాసహితబ్రహ్మోపాదానం') అవుతున్నాయన్నారొకరు. ఈ రాశివారిలో కొందరు వివర్తకారణం బ్రహ్మం, ఉపాదానకారణం మాయ అన్నారు; మరికొందరు బ్రహ్మమే ఉపాదానకారణం గాని, అందుకు మాయ సహకారి కారణం మాత్రమే అన్నారు.

మాయలో ప్రతిఫలించిన పరమాత్మ ఈశ్వరుడు. ఆ ఈశ్వరుడు జీవుల్నీ, జగత్తునీ సృజించాడు అన్నారు కొందరు. కాదు, జీవులుమాత్రమే ఈశ్వర సృష్టి; అలా సృజింపబడ్డ జీవులే తమ అవిద్యా సహాయంతో జగద్దృశ్యాన్ని కల్పిస్తున్నారు అన్నారు వేరొకరు. ముక్తి విషయంలోనూ, అవిద్యా వినాశం విషయంలోనూ మరెన్నో భిన్నపృథక్పథా లున్నాయి.

సామాన్య పాఠకుల కిదంతా గందరగోళంగా కనిపిస్తుంది. ఈ గందరగోళాని కంతకూ కారణం మాయావాదం తార్కికంగా సువ్యవస్థితం కాకపోవడమే. అద్వైతంలో దానికి జీవత్సమన్వయం అనుసంధానం చేయ వీలులేనందునే యీ పరిస్థితి ఏర్పడుతోంది. ఆధునికాద్వైతుల్లో కొందరు యిదంతా గమనించారు. ఇలావివరంగా వెళ్ళినకొలదీచిక్కు తెగడం లేదు; పైగా పెరుగుతోంది. అందుచేత వీరు శంకరుని దగ్గిరే ఆగమంటున్నారు; మాయయొక్క స్వభావం, బ్రహ్మతో దాని సంబంధం, దాని కార్యకలాపం 'అనిర్వచనీయం' అనే బిళ్ళక్రిందే వుంచడం మంచిది అంటున్నారు. ఇదిసమస్యలకు సమాధానం చెప్పకొనే బాధ్యతను విడనాడడమే గాని మరొకటి కాదు. 'అనిర్వచనీయత' వొక గడ్డిదుబ్బు. దానిచాటున అద్వైతం అనే చేప ఎండదు, చనిపోదు.

## శంకరుడు జగత్తు కిచ్చిన హోదా

"శంకరుడు బాహ్యజగత్తుయొక్క వాస్తవికతను నిరాకరించలేదు. పైగా తన యుక్తినొడ్డి సమర్థించాడు. ఈ విషయం పాఠకుల, విమర్శకుల దృష్టినంతగా ఆకర్షించలేదు. అందుచే యీ అంశాన్ని అధికంగా ప్రాముఖ్యంలో పెట్టాలి" అనుకొంటున్నారు నేటి అద్వైత వేదాంతులు. అందులోనూ పాశ్చాత్య సంపర్కంచేతా,

విజ్ఞాన శాస్త్రాభివృద్ధిచేతా ఆధ్యాత్మికవాదంయొక్క పొరలు కదిలి భౌతికవాదం మనసులకెక్కుతున్న రోజులుగా భావించి, శంకరాద్వైతానికి వాస్తవికతా రూపాన్ని వీలైనంతవరకూ సంతరించి నిలబెట్టి జూస్తున్నారు. వీరు శంకరునివాదాన్ని ఏకత్వప్రతిపాదకమని (Monism) చెప్పరాదని, సత్యా ద్వైతం కాదన్నంతవరకేగాని అద్వైతమంటే ఏకత్వంకాదని నొక్కిచెబుతున్నారు. శంకరుని యెడ యీ విపరీతాభిప్రాయం కలగడానికి ఆయన అనంతరం అద్వైతం విజ్ఞానవాదీయ వాసనలతో నడిచిందంటున్నారు. యోగవాశిష్ఠం, దృష్టి సృష్టి వాదం మాత్రమే అట్టివి. కాని వాచస్పతి, పంచపాదికా వివరణశాఖ, విద్యారణ్యులు మొదలైన ప్రసిద్ధులంతా సుబోధంగా చెప్పి పోషించినదంతా వాస్తవికతా పార్శ్వాన్నే. వీటికే బహుళ ప్రచారం వుంది. అందుకని నేడు వెలువడే ప్రతి అద్వైత వ్యాసంలోనూ, గ్రంథంలోనూ, యిందునిమిత్తం ప్రత్యేకించి ఒక శీర్షిక, ఒక అధ్యాయం తప్పనిసరిగా వుంటోంది. శంకరుడు జగత్తును కేవలం 'అసత్తు'గా చెప్పాడను కొన్నవారికి యీ ప్రయత్నాలవల్ల పునరాలోచన కలగవచ్చునేమో. అది మనసుకెక్కి మరో మోతాదులో పనిచేసినా వింతకాదు. దీని పరిణామప్రభావాలెలా వున్నప్పటికీ యథార్థ విషయాలను అంజలోకి తీసుకోవాలి.

ప్రతి ఆధ్యాత్మికవాద సిద్ధాంతమూ అనివార్యంగా జగత్తుయొక్క హోదాను తక్కువచూపు చూడవలసిందేనా అనే ప్రశ్నను ముందుగా పరిశీలించుకోవాలి. అటువంటి అగత్యంలేదనే సమాధానం చెప్పుకోవాల్సి వుంటుంది.

బాహ్యజగత్తు జ్ఞాతయొక్క బుద్ధి విశేషాన్నిబట్టి వునికి ననుభవిస్తోందని అంటుంది విజ్ఞానవాదం. బాహ్య జగత్తు ద్రష్టయొక్క చిత్తవృత్తివల్ల వున్నట్లనిపిస్తోందంటుంది. ఆధ్యాత్మికవాదమంటే యిటువంటి విజ్ఞానవాదం మాత్రమేకాదు. జ్ఞాతయొక్క అస్తిత్వంతోనూ, అతని చిత్తవృత్తితోనూ నిమిత్తం లేకుండానే జగత్తు స్వతంత్ర హోదాను కలిగివుందనిచెప్పే ఆధ్యాత్మిక ధోరణులే చరిత్రలో ఎక్కువ.అవి బాహ్యాస్తిత్వబోధక భావవాదాలు (Objective Idealisms) అనబడతాయి. శంకరుడిందులో ఏ శ్రేణిలోకి వస్తాడో తెల్సుకోవడం మన ప్రస్తుతాంశం.

బహుశా బాహ్యజగత్తు యొక్క అస్తిత్వాన్ని బోధించిన ఆధ్యాత్మికవేత్తగావచ్చు ననుకొందాం. కాని అంత మాత్రంతో మన సమస్య ముగియదు. ఇందులోనూ మరోవిధంగా జగత్తు సత్యత్వస్థాయిని కించపరిచిన కోవలున్నాయి. గౌరవించినవీ వున్నాయి. అలా గౌరవించిన వాటిలోనూ శ్రేణీభేదాలున్నాయి. బాహ్యజగత్తును జడపదార్థంగానే చెప్పినవారున్నారు. రామానుజుడు, భాస్కరుడు, వల్లభుడు యిందుకు వుదాహరణలు. "సృష్టివాదు" లంతా బాహ్యప్రపంచాన్ని ద్రవ్యమయంగా వూహించేవారే. ఇందుకు భిన్నంగా బాహ్యజగత్తును భావపదార్థంగా ( Thought substance) గ్రహించే దొక శ్రేణివుంది. ప్రపంచమంతా దేవుడి తలలోని వూహ అంటారు వీరు. కాకుంటే ప్రపంచమంతా దేవునితో నిమిత్తంలేని వొక వూహమాత్రమే నంటారు. బాహ్యజగత్తు యొక్క ద్రవ్యత్వాన్ని, జడత్వాన్ని మాత్రమే వీరు తిరస్కరిస్తారు; కాని దాని స్వతంత్రసత్తాను గుర్తిస్తారు. ప్రపంచం 'అఖండభావం యొక్క అభివ్యక్తి' ( Expression of the Absolute Idea ) అన్న 'హెగెల్' యిందుకొక వుదాహరణ; 'దేవుని వూహ' (Thought of God) అన్న 'బిషప్ బెర్కులే' మరో వుదాహరణ. "నా కళ్ళతో చూసి, చేతుల్తో తాకే వస్తువులకు అస్తిత్వం యథార్థంగా వుందనే విషయాన్ని ఎంతమాత్రమూ శంకించను. 'తత్త్వవేత్తలు' ద్రవ్యం, మూర్తపదార్థంఅనేపేర పిల్చే దాని అస్తిత్వాన్ని మట్టుకే నిరాకరిస్తున్నాం" *"బాహ్యం నుండి మనమీద ప్రభావం పడుతోంది కాబట్టి, మీ భౌతికవాదుల్తో పాటుగా నేనూ మనకన్నా వేరైన వొకానొక అస్తిత్వంలో, బాహ్యతలంలో శక్తులున్నాయనక తప్పదు...కాని యీ గొప్ప అస్తిత్వం యొక్క స్వభావమేమిటా అనే విషయంలో మనం విభేదిస్తాం. దాన్ని నేను అధ్యాత్మం అంటాను,

* "That the things I see with my eyes and touch with my hands do exist, really exist, I make not the least question. The only thing whose existence we deny is that which Philosophers call Matter or corporeal substance."

నువ్వు భౌతికద్రవ్యమంటావు"† అని అన్నాడు 'బెర్కులే' మహాశయుడు. బాహ్యజగత్తునే భావమన్నాడు. అంతకంటే మరో పరమార్థసత్యం వుందనలేదు; దీన్నొక హీనసత్యంగానూ చేయలేదు. ద్వంద్వ సత్యాలను ఆయన భావించలేదు.

ఇక నిప్పుడు శంకరుడివేపు దృష్టి సారించవచ్చు. శంకరుడు 'జడా'న్ని, 'ద్రవ్యత్వా'న్ని గుర్తించలేదు. జడమనేది అవ్యక్త చైతన్యమేగాని వేరు గాదన్నాడు. ఉన్నదంతా నిర్గుణ చైతన్యం. మాయ నిర్గుణ చైతన్యం కాదు. కాని అదీ 'జడం' కాదు; ద్రవ్యంకాదు. శంకరుని భావనలో అదొక మానసిక లక్షణం; అజ్ఞాన రూపిణి. అంతే. ఇది ఆ పాశ్చాత్యుల నే భావపదార్థం కావంటే కావనొచ్చు; కాని వారి వూహాలోవలే అది జడద్రవ్యంకన్నా భిన్నమనేది నిశ్చయం. [అయితే పాశ్చాత్యుల భావం నిర్గుణ చైతన్యంతో తుల్యమయింది కాదు. అదే సమయంలో అద్వైత వేదాంతంలో జడజగత్తుతోపాటుగా ఆలోచన, భావం, అహంత, అజ్ఞానం, విజ్ఞానం చేతనంకన్నా అన్యమైనవిగా లెక్కకొస్తాయని గమనించాలి.] కాని పాశ్చాత్యుల భావరూపాలు పరమార్థ సత్యాలు. కాని శంకరుని మాయ, ద్దాని కార్యమైన ప్రపంచమూ మిథ్యాభూతాలు, వ్యవహార సత్యాలే అవుతున్నాయి. ఇందుచేత ఆధ్యాత్మికంగా జగత్తు హోదాకు గౌరవహాని కలిగించడం అనివార్యంకాదు. కాకపోగా, శంకరుడలా న్యూనపరిచాడు. ఇలా న్యూనపరచిన ఆధ్యాత్మిక వేత్తలు చరిత్రకు సుపరిచితులైన వారింకా వున్నారు. గ్రీకుల్లో ప్లేటో మహాశయుడు, 'ఇలియాటిక్ శాఖ' మొత్తంగానూ, జగత్తును వ్యవహారసత్యంగా చెప్పారు. పరమసత్యం, వ్యవహారసత్యం అనే రెండు ఫాయిల్నివా రూహించారు. మనదేశంలో నాగార్జునాచార్యుడూ వూహించాడు.

కాబట్టి శంకరుడు బాహ్యాస్తిత్వవాది అవునా కాదా అన్న మీమాంసే ఏకైక విషయం గాదు. ఒకవేళ భావరూప బాహ్యాస్తిత్వవాదియే అయితే అందుమల్లీ ఆయన స్థానమెక్కడ అన్నది కూడా తే[illegible] రావాలి.

## అద్వైతంలో సత్యత్వానికి ఎల్లలు

ఈ స్పష్టీకరణను తలకట్టుగాపెట్టి సూటిగా శంకరునికి సంబంధించిన వివరాల్లోకి వెళ్ళవచ్చు. శం[illegible] ద్వైతాన్ని వొక సముద్రంగా వూహిస్తే దాని[illegible] వేపులా రెండు చెలియలికట్టలుంటాయి. [illegible]నా సముద్రం మీరగూడదు. జగత్తు ఆకాశపుష్పం, శశవిషాణం మాదిరిగా 'అలీకం', 'అసత్తూ' కారాదు. ఇదొక కట్ట. జగత్తు పరబ్రహ్మంయొక్క అధీనతను తప్పి స్వతంత్రించరాదు; అదో స్వతంత్ర సత్[illegible] కారాదు. ఇది రెండో కట్ట. దీన్ని శంకరుడి మా[illegible]ల్లోనే వినొచ్చు: "సృష్టికి పూర్వం జగత్తుకొ[illegible]మైన స్వతంత్రావస్థ వున్నట్లు మేమంగీకరిస్తే, అవశ్య[illegible]

మేము ప్రధాన కారణవాదాన్ని (సాంఖ్య ప్రకృతి వాదాన్ని) అంగీకరించినట్లవుతుంది. జగ[illegible] పూర్వావస్థ స్వతంత్రంకాదనీ, పరమేశ్వరాధీనమనీ మా వాదన. అటువంటి అధీనావస్థ నంగీకరించడం ప్రయోజనకరం". "తదధీనత్వాదర్థవత్" అనే సూత్రానికి (1-4-3 వే. సూ. భా) భాష్యం గమనించాలి. ఈ రెండుకట్టల మధ్యా కావలసినంత ఆటస్థలం వుంది. చాలాలంకలుంటాయి. అవిద్యాజగత్తుల హోదాకు కనిష్ఠ, గరిష్ఠ పరిమితుల నిర్వచనం యిది.

విజ్ఞానవాదం ప్రకారంకూడా జగత్తు దుందేటి కొమ్ము వంటి సత్యంకాదు. అది వ్యక్తిగతంగా ద్రష్ట వుంటేనే దృశ్యమాన జగత్తు వుంటుందంటుంది. అసత్తంటే ద్రష్టవున్నా దృశ్యస్ఫూర్తికూడా వుండ కాదుగదా! అందుచేత విజ్ఞానవాదంకూడా అద్వైతంలో తననీడ చూసుకుని సంతోషించే అవకాశంలేకపోలేదు. అందుచేతే 'ప్రకాశాత్ముడు' దృష్టిసృష్టివాదానికి (వ్యక్తి యొక్క దృష్టి సారింపుతోనే సృష్టి జరుగుతుందనేవాదం) కర్త అయ్యాడు. యోగవాసిష్ఠం అద్వైతం కాగల్గింది. మండన మిశ్రుడు డీ విజ్ఞానవాదీయ ప్రతిధ్వనులకు బీజావాపన చేశాడు.

శంకరుడు బ్రహ్మమే నిమిత్త, ఉపాదాన కారణాలుగా వుంటోందన్నాడు. కాని అలాగే కట్టుబడ నవసరంలేదు. బ్రహ్మంయొక్క అదుపును మీరిపోనంత వరకూ మాయ కొంత స్వేచ్ఛను వాడుకోవచ్చు. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని పద్మపాదుడు (పంచ

† "I assert as well as you (Materialists) that, since we are affected from without, we must allow Powers to be without, in a Being distinct from ourselves......But then we differ as to the kind of this Powerful being. I will have it to be Spirit, You Matter......"

పాదికా) వివరణశాఖను ప్రారంభించాడు. జగత్తుకు మాయ వుపాదానకారణం అన్నాడు. అద్వైతశాఖల్లో వాస్తవికతకోసం చేసిన ప్రయత్నంయొక్క చరమ స్థానం యిది.

ఈ రెండూ-అంటే విజ్ఞానవాదం, బాహ్యార్థవాదం-శంకరునిలో నేవున్నా అద్వైతం, అద్వైతం అనిపించుకోడానికిఅభ్యంతరముండకూడదు. ఈ రెండింటికీశంకరునిలో స్థాన మున్నట్లు తేల్చి చెప్పగల్గితే వ్యక్తిగా శంకరునికి దెబ్బతగుల్తుంది. విజ్ఞానవాదంనుండి బాహ్యార్థ వాదానికి మారిన భావ పరిణామం శంకరునిలో వుందనాల్సి రావచ్చు. ఆయనలో పరిణామం చూపాలంటే ఆయన రచనలకి కాల నిర్ణయ పట్టిక తయారు చేయాలి. అలా చేసేందు కవకాశాలు అంతగా లేవనుకుంటాను. ఆయన జీవితకాలం ముప్పైరెండేళ్ళకావడమే నిజమయితేమంద కొడిగా నడచిన ఆయనకాలంలో అల్ప వ్యవధిలోనే పరిణామమంటే అదొక విశేష మనుకొంటాను. పరిణామ మనడానికంత రుజువు లభించకపోతే ఆయనది ద్వంద్వ వ్యక్తిత్వం అవుతుంది. భావాలు పూర్తిగా నిశ్చయ రూపాన్ని పొందలే దనాలి.

## శంకరునిలో బాహ్యార్థవాదం

వేదాంత సూత్రంలో బాదరాయణుడే తనకుతానై విజ్ఞానవాదాన్ని సూత్రముఖంగా ఖండించాడు. అంతే గాక ఆయన పెనగులాటంతా నిరీశ్వరసాంఖ్యంతోనే. ఉపనిషత్తులు ప్రకృతికారణవాదాన్ని చెప్పడంలేదు, పరబ్రహ్మాన్నే చెబుతున్నాయని తాను చెప్పాలి. ప్రకృతి - పురుషులనే ద్వైత సత్యం లేదు అనాలి. అనంతకోటి పురుషుల్ని వొకేవొక పురుషునిగాచేసి, పురుషునికన్నా స్వాతంత్ర్యం ప్రకృతికి లేదని, దాని స్వేచ్ఛను అపహరిస్తే ఇకలభించేది అద్వైతం. బాదరాయణుడు దీన్ని భాష్యరూపంలోనూ, యుక్తిరూపంలోనూ యీ పనిచేయడాన్నే లక్షించాడు. ప్రకృతిని స్వతంత్రసత్యంనుండి పరాధీనసత్యంగా మార్చి వూరుకున్నాడు. అందుచేత తప్పనిసరిగా బాహ్యార్థ వాదాన్ని బాదరాయణులు వరించాల్సి వచ్చింది. సాంప్రదాయసిద్ధమైన హిందూలోకంలో సాంఖ్యానికి గొప్పస్థానం వుంది. దానివల్ల ఏర్పడ్డ వాస్తవిక దృక్పథాన్ని పాషండమతంగా చూడబడే బౌద్ధంలోని విజ్ఞానవాద పక్షపాతంతో విడనాడడం ఆయనకు సాధ్యంగానిపని. అందుకే 'తదధీనత్వాత్, అర్థవత్' అన్నాడు వొకవేపున; రెండోవేపున 'నా భావ ఉపలబ్ధేః' (2-2-28) అని అన్నాడు. మొదటిసూత్రం యిందాకే చూశాం. రెండోది ప్రస్తుతం చూద్దాం.

"జ్ఞానవిషయాలైన (objects of knowledge) స్తంభం, కుడ్యం, ఘటం, పటం మొదలైన బాహ్య విషయాలు ఉపలబ్ధ మవుతున్నాయి. బాహ్యంలో వుపలబ్ధమయ్యేదానిని లేదనగూడదు."

1. "ఉపలబ్ధ జ్ఞానంవల్లనే బాహ్యార్థాలు వుపలబ్ధి కన్నా భిన్నంగా వుంటున్నాయని అంగీకరించక తప్పదు. ఉపలబ్ధిజ్ఞానం మాత్రం స్తంభం, కుడ్యం అని అనుకోవడంలేదు. లోకంలో అందరూ స్తంభ కుడ్యాలను జ్ఞానానికి విషయాలుగానే తెలుసుకుంటున్నారు."

"అంతరంగిక జ్ఞానం, బాహ్య విషయాల వునికీ వొకేమారు సంభవిస్తున్నాయన్న నియమం వల్లనే జ్ఞానం కలుగుతోంది. ఇదే సహోపలంభనియమం. ఈ సహోపలబ్ధివల్లకూడా జ్ఞానానికి, బాహ్యార్థానికి అభేదం కలగడంలేదు".

2. "ఘటజ్ఞానం, పటజ్ఞానం అనే వ్యవహారంలో జ్ఞానం వొకేవొకటి. కాని యీ ఏకరూప జ్ఞానానికి ఘటపటాలు విశేషణాలు. అందుచే భిన్నాలు. ఏక రూపమగు జ్ఞానం భిన్నభిన్నాలైన బాహ్యార్థాలకన్నా భిన్నమని తెలియడం బాహ్యార్థాల వల్లనే. బాహ్యార్థాలు జ్ఞానంకన్నా భిన్నాలని అభిన్నమగు జ్ఞానం వలన తెలుస్తోంది."

శంకరుడు గట్టి బాహ్యార్థవాది అని అంటానికిదొక గొప్పదాఖలా. వాదంలో చక్కని లాఘవంవుంది. శంకరుని భావవాదంలోనుండి భౌతికవాదిగ్రహించి, తనలో యిముడ్చుకోవాల్సిన మంచి యిదొకటి. ఈ వాదనా సరళి భౌతికవాదానికి అనుకూలమైన ధోరణే. నాచుట్టుకు నా కిది వుత్సాహాకరమైన విషయమే. కాని యీ వుత్సాహాని కింతలోనే అంతరాయం కలుగబోతోంది. బృహదారణ్యక భాష్యంలో శంకరుడు నన్ను ప్రకుంగదీశాడు. ఈ వాదనా సరళిని అందులో మరో అంతస్తు కెక్కించాడు. అదే దాని బలహీనతనుకూడా బైటికి దెచ్చింది. మెలకువలో చూచే బాహ్యజగత్తు విషయంలోనే గాక స్వప్నావస్థలో కనిపించే దృశ్యాలుకూడా బాహ్యార్థాలని రుజువయ్యేందుకు యీ తర్కం ఉపయోగపడుతుంది. ఈ విషయాన్ని పరిశీలించవలసివుంది.

## విజ్ఞానవాది

"కలలో మనం చూస్తున్నది చిత్తరూపాల్నే గాని అన్యంగాదు. అందుచేత బాహ్యప్రపంచం వుందనడం తప్పు."

## సిద్ధాంతి సమాధానం

"అలాకాదు; స్వప్నంలో బాహ్యవస్తువులు లేక పోయినా, జ్ఞానంకన్నా అవి భిన్నంగా వుంటున్నా యని నిరూపించవచ్చు. కలలో ఘట పటాది జ్ఞానం యధార్థంగా కలుగుతోందని అంగీకరిస్తావు. కాని అంతలోనే అ జ్ఞానంకన్నా వేరుగా ఘటపటాదులు లేవంటావు!" - స్వప్నదృశ్యాల విషయాల్లో కూడా ఆ దృశ్యాలు జ్ఞానంకన్నా భిన్నాలని అభిన్నమగు జ్ఞానంవల్ల తెలుస్తోంది; లోకంలో అందరూ దృశ్యా లను జ్ఞానానికి విషయాలుగానే గ్రహిస్తారు గాని, జ్ఞానరూపాలుగా నే గ్రహించరు. ఇంతకూ స్వప్న దృశ్యాలు దృశ్యజ్ఞానంకన్నా భిన్నాలు అని తేలు తుంది. స్వప్నంలోనే యిలా తేలితే, జాగ్రదవస్థలోని బాహ్యార్థాలు జ్ఞానభిన్నాలని తేలడం వొక లెక్క గాదు అంటాడు శంకరుడు. (బృహ. 4-3-7)

జ్ఞానం, జ్ఞేయం విభిన్నాలని మాత్రమే యీ తర్కం తేల్చగలదు. దాని కంతకన్నా లోతులేదు. జాగ్రదవస్థ లోని బాహ్యజగత్తుతోపాటుగా స్వప్నదృశ్యాలు అంటే మనఃకల్పితాలుకూడా జ్ఞేయరాశికిందికి వస్తాయీ అంటే నిషేధించలేదీ తర్కం. అదనంగా మరో ముఖంనుండి స్వప్నజాగ్రత్తుల్ని విడతియ్యాలి. స్వప్న సృష్టి జీవాత్మయొక్క కల్పనా వ్యాపారం అంటుంది అద్వైతం. ఇది బుద్ధి కల్పన. తనకల్పన తనమీద, తన జ్ఞానంమీద ఆధారపడవలసినదల్లా తన జ్ఞానంకన్నా భిన్నంగా కన్పించగలుగుతున్నాయన్న మాట.ఇందులో వైరుధ్యం యిమిడివుందనా అనాలి. లేకుంటే విజ్ఞాన వాదాన్ని అంగీకరించాలి.

## శంకరునిలో విజ్ఞానవాదం

మాండూక్యం మొత్తం వుపనిషద్భాష్యమంతా విజ్ఞానవాద ఛాయల్తో నింపాడు శంకరుడు. ఆభాష్య స్వభావం ప్రత్యేకం.

"జాగ్రదవస్థలో జ్ఞానం మనస్సుతోపాటు పంచేం ద్రియాలతో కూడా సంపర్కంకల్గివుంటుంది. బాహ్య వస్తువులు చిత్తవికారాలేగాని వేరుగావు. అయినప్పటికీ బాహ్యవస్తువు లనిపించేవాటిని గూర్చిన జ్ఞానంగా భాసిస్తూ తత్సంబంధమైన వాసనా సంస్కారాలను మనస్సులో ముద్రిస్తుంది యీ జాగ్రత్ జ్ఞానం". (నాల్గవశ్లోక భాష్యం)

"నిద్రను అదేవిధంగా ఏకీభూతమని పిలుస్తారు. అంటే సమస్తానుభవం ఏకీకృతమయ్యేస్థితి అన్నమాట. జాగ్రత్స్వప్నావస్థలు రెండింటా అనుభూతమయ్యే ద్వైత దృశ్యవిషయాలు కేవలంచిత్తకల్పనామాత్రాలు. ఈ కల్పితద్వైత విషయజాతమంతా అవిభాగస్థితిని, విచక్షణారహితస్థితిని పొందుతుంది." (5 వ శ్లోక భాష్యం)

ఈ విషయమిలా వుండగా జాగ్రత్స్వప్నాలమధ్య విభేదాన్ని నిర్లక్ష్యం చేయనూ చేస్తాడు. వేదాంత సూత్రంలో 'వైధర్మ్యాచ్చ స్వప్నాదివత్' (2-2-29) అన్న సూత్రంయొక్క భాష్యంలో కలకన్నా మెలకు వకు అధికృత యిచ్చి వాస్తవికతాదృష్టి ప్రదర్శించా డనుకొన్నదానికి విరుద్ధంగా యిలా చెప్పాడు:

"స్వప్న జాగరితావస్థలు యధార్థంగా జ్ఞాన స్వరూపం వుపాదానంగా కలిగివున్నాయి. ఈ కారణంచేత ఉభయావస్థలూ అభిన్నాలు. అయినప్ప టికీకూడా త్రాడు నధిష్ఠానంగా కలిగిన పాము, జల ధార వగైరా భ్రాంతిరూపాలు వొకదానినుండి వొకదానిలోనికి మారుతున్నట్లుగా కన్పిస్తున్నట్లూ, యివీ మారుతున్నాయి." (7 వ శ్లోక భాష్యంలో రెండో ఆక్షేపణకు సమాధానంగా.)

బౌద్ధుల విజ్ఞానవాదంలో ప్రతిపాదించినట్లుగా క్షణికమైన విజ్ఞానస్కంధం వొక్కటే చాలదని, దాని కార్యవ్యాపారంతోపాటుగా అదికూడా హీనరాశి సత్యమనీ, అంతకన్నా అతీతసత్యం వేరొకటుండడం అవసరమనీ, అదే పరమాత్మ అని నిరూపించి వూరుకుంటే చాలు అద్వైతరూపం వస్తుంది. జగత్తు జీవాత్మయొక్క అవిద్యాకల్పితమా, పరమాత్మయొక్క మాయాకల్పితమా అన్న వివాదం యొక్క పర్యవసానం ఎటు తేలినా అద్వైతానికి హాని లేదు. జగత్తు వ్యక్తియొక్క బుద్ధి కల్పితమా, మాయా కల్పితమా అన్నది వివరాలకు సంబంధించిన సమస్య.

అందుచేతే శంకరునిలో యీ ద్వంద్వస్థితి వుండ డానికి వీలు కలిగింది. ఆయన తర్వాత యీ ద్వివిధాభి ప్రాయాలు రెండు ఉపశాఖలుగా రూపుగొని నిల్చాయి. వ్యక్తి బుద్ధే జగత్తును కల్పిస్తున్నదనే భావం కొన

సాగేంతవరకూ అది బౌద్ధులు అద్వైతంవేపు మొగ్గ డానికి, దీనిలో లీనంగావడానికి దోహదభూతం అయివుండవచ్చు.

వివరాలను సంబంధించిన యీ హంశంకన్నా ముఖ్యమయింది వొకే వొకటి; అది పరమసత్యం, వ్యవహారసత్యం అనే మౌలిక విభాగం. ఈ కీలకాంశాన్ని మరుగున బెట్టి వడ్ల గింజలా, బియ్యపుగింజలా అనే చర్చకు అగ్రస్థానం యివ్వడం అన్యాయమవుతుంది. అంచేత దీనికే ప్రాధాన్యమిచ్చి, వ్యవహార సత్యానికి అద్వైతమిచ్చే స్థానమేమిటో, దాని ప్రయోజన మేమిటో గ్రహించాల్సి వుంటుంది.

వ్యవహారసత్యమైన ప్రపంచం పరబ్రహ్మంయొక్క సృష్టిగావాలి. ఉపనిషత్తులలో యీ సృష్టియొక్క వర్ణన వొకరకంగా లేదు. పరస్పర విరుద్ధంగా చిత్రించబడివుంది. అందువల్ల అద్వైతానికి ముంచుకొచ్చిన ప్రమాదం ఏమీలేదు. ఎందుకంటే, ఆ సృష్టి వాస్తవం కాదుగనక అన్నాడు శంకరుడు. వాస్తవం కానిదాన్ని గూర్చి ఏ వైరుధ్యం వుంటేనేమి? గౌడపాదుడు సృష్టిలేదనిచెప్పే 'అజాతివాది'. శంకరుడూ దాన్ని అంగీకరించినవాడే.

పరబ్రహ్మం లక్ష్యం; ఆయన్నందుకోనేందుకు బాహ్యప్రపంచం వొకసాధనం. పరిభాషలో పరబ్రహ్మం ఉపేయం, ప్రపంచం వుపాయం.

ఛాందోగ్యంలో శంకరుడిలా గన్నాడు. "సృష్టిని వర్ణించుటయందు శ్రుతులకు తాత్పర్యంలేదు. సృష్టికర్త అయిన బ్రహ్మాన్ని వర్ణించుటే వాటి వుద్దేశం. సృష్టి అంతా స్వప్నతుల్యం. స్వప్నంలో సృష్టి అంతా వొక్కమారు కన్పించవచ్చు." (6-2).

ఐతరేయంలో యిలాగన్నాడు:- "ఇక్కడ పరమాత్మను బోధించడమే పరమోద్దేశం. తక్కినదంతా కేవలం ఆలంకారికం. ఇదేమీ దోషంకాదు. సర్వశక్తి యుతుడు, సర్వజ్ఞుడు అయిన పరమేశ్వరుడు ఇంద్రజాలికునివలె తన మాయను ప్రదర్శించడంలో తనను సులభంగా అవగతంజేసుకోవడానికి, తననుగూర్చి సులభ వివరణకు అవకాశం కలిగించడానికి వుద్దేశించాడని చెప్పడం హేతుబద్ధంగావుంటుంది. సృష్టికథనాలు అసత్యమైనా అందరూ చేసుకోగల్గుతారు. (తద్వారా తాను సులభవేద్యుడవుతాడు). సృష్టికథనాలవల్ల అందుకోదగ్గ పరమార్థం ఏమీలేదని విదితమే. పరమాత్మయొక్క ఏకత్వభావంవల్ల పొందదగింది మోక్షమేనని సర్వోపనిషత్తులలోను నిరూపించబడి వుంది."

సృష్టి వర్ణనలు తటస్థించిన ప్రతిచోటా యివే ప్రకటనలు నియతంగా వుంటాయి. అందుచే యివేమీ చెదురువిషయాలుగావు. ఈ విషయాలకు ప్రాధాన్యం యివ్వకుండా వుండలేము. కాబట్టి జగత్తు కెంత విలువ యిచ్చాడో తేటతెల్లమయింది.

* * *

అసలు జగత్తును వ్యవహార సత్యంగా చెప్పిన వారిలో పలువురు గతితర్కాన్ని చక్కగా గమనించినవా రున్నారు. వారు జగత్తుయొక్క సత్యత్వాన్ని ప్రశ్నించడానికి కారణమే దాని గతితర్కాన్ని తృణ్ణంగా అవగతం జేసుకోవడం. జగత్తూ, గతీ విరుద్ధాంశల సమావేశం అని గుర్తించారు. ఈ విరుద్ధాంశల యుగపత్తు హేతువాదానికి విరుద్ధం; సహేతుకం కానిది సత్యంకాదు. వారు అనుభవంకన్నా తర్కబుద్ధికి ప్రాధాన్య మిచ్చారు. వైరుధ్యరాహిత్యమే సత్యం; వైరుధ్య దూషితమైన ప్రపంచం సత్యం కాదన్నారు. ఈ కారణంవల్లనే గ్రీకు ఇలియాటిక్ శాఖీయులు జీనో, పార్మినైడస్లు ప్రపంచాన్ని వ్యవహార సత్యం అన్నారు.

ఇక మన నాగార్జునాచార్యులమాట: విశ్వంలో ప్రతిదీ పరస్పరం ఆధారపడివుంటోంది. ప్రపంచం సంబంధాత్మకంగా వుంది. ఒకానొక వస్తువునీ, ఘటననీ నిర్వచించాలంటే సమస్త విశ్వంతోనూ అది పెనగొన్నందున ఆ సమస్తంయొక్క పరంగా వివరణ యివ్వాలి. అంచేత దేనికీ 'స్వభావం', 'స్వలక్షణం' లేదు. శూన్యతఅంటే స్వభావ రాహిత్యం. ఈ ప్రపంచం శూన్యం, భ్రాంతిఅని ఆయనా దీన్ని హీనసత్యం చేశాడు. కాని ఆయన విశ్వంయొక్క తరహాను బోధపరచుకుని చేశాడు.

శంకరుడుచెప్పే కారణాల కింత లోతులేదు. ఆయన విశ్వతత్వాన్ని అంతగా ఆకళింపుజేసుకోలేదు, విశ్వం లోని వస్తుజాతం శాశ్వతంకానందుకే ఆయనవిసుగుజెందాడు. దృశ్యమయింది నశిస్తుంది. 'యద్దృశ్యం తన్నాశ్యం'. ఆద్యంతాల్లో లేనిది మధ్యలోనూ లేనిదేకావాలి. భూత భవిష్యత్తుల్లో లేనిది వర్తమానంలోనూ వుండరాదు. ఈ వాదనతో ఇదంతా అశాశ్వతం, అశాశ్వతం సత్యంగాదుఅన్నాడు. మరికొందరివలె విరుద్ధాంశల సన్నివేశాన్ని గాని, ప్రపంచం సంబంధాత్మకతను

గాని, క్షణికతనుగాని పట్టించుకోలేము. ప్లేటో, జీనో, నాగార్జునులవల్ల గతితర్కాన్ని, ప్రపంచ తత్వాన్ని కనీసం నేర్చుకోగలమన్న తృప్తి వుంటుంది. శంకరుని చూచి అలా తృప్తిపడలేము. ప్రపంచంయొక్క అని త్యత్వాన్ని అతి సామాన్యంగానే గుర్తించాడు.

## సమగ్ర సత్యం - సాపేక్ష్య సత్యం

నేటి విజ్ఞానశాస్త్ర జగత్తులోనూ, మన నిత్యానుభవం లోనూ పాక్షికజ్ఞానంనుండి పరిపూర్ణజ్ఞానంవేపు సాగి పోతుంటాము. ప్రకృతిలో వొకానొక భాగంనుండి మరింత విశాలమైన భాగాన్ని పరిశీలిస్తూపరిశీలనా క్షేత్రాన్ని విస్తృతపరచుకొంటూ పోతుంటాము. అందులోనూ యిటీవల విజ్ఞానశాస్త్రం మన జ్ఞానం యొక్క సాపేక్ష్యతను ఎలుగెత్తి చాటుతోంది. దానితో సాపేక్ష్య, సమగ్రసత్యాల మీమాంస పైకి వచ్చింది. ఈ నేపథ్యభూమికలోనుంచి అద్వైత వేదాంతంలోకి ప్రవేశించి అందులోని వ్యవహార, పరమార్థసత్యాల ప్రసక్తి వినేసరికి కొందరి నవ్యులకు విజ్ఞానశాస్త్రంలోని సాపేక్ష్య - సమగ్రసత్యాలన్న విభాగమేనని భ్రమించుతున్న సందర్భం వొకటుంది.

అద్వైతం బోధించే పరమార్థ వ్యవహారసత్యాల మధ్యగల సంబంధం వివర్తసంబంధం. వివర్తమంటే కారణం కారణరూపాన్ని విడనాడకుండా కార్యంగా గోచరత్వం బొందడం. దేన్ని మనం మూలసత్యం అని అనుకుంటామో అది దాని మూలస్వరూప స్వభావాలకు నష్టం జరగకుండా, అందుకు భిన్నంగా మాత్రం కానరావడం. ఈ భావం శాస్త్ర జగత్తులో వర్తిస్తుందా, అన్నదే ప్రశ్న.

నేడు శాస్త్రం 'ఎలెక్ట్రాన్'ను జగన్మూలరూపంగా చెబుతోంది. అదే మట్టినుండి మానవునివరకూ గల సమస్త రూపాలలోనూ దృశ్యమాన మవుతోంది. ఈ అనంతకోటి రూపాల్లోనూ ఎలెక్ట్రాన్ ఎలెక్ట్రాన్‌గానే స్వధర్మ స్వరూపాలను కాపాడుకుంటూనే వస్తోందా, లేదా అని మనం ప్రశ్నించుకుంటే సరిపోతుంది. ప్రోటాన్, న్యూట్రాన్, పరమాణువులనే ఆ తర్వాత కట్టడా లన్నింటికి యిటుక ఎలెక్ట్రాన్. అవన్నీ వొక్కొక్కటీ యిన్నేసి ఎలెక్ట్రాన్లకట్టె అని చెప్ప డానికి వీలుందేమో కనుక్కోవాలి.

ప్రోటాన్ బరువు 1850 ఎలెక్ట్రాన్ల తూగుతుంది. ఈ రెండూ కలిస్తే 1851 ఎలెక్ట్రాన్ల బరువు తూగాలి. ప్రోటాన్, ఎలెక్ట్రాన్ కలిస్తే న్యూట్రాన్లు ఏర్పడు తాయి. కాని యీ న్యూట్రాన్ బరువు ప్రోటాన్ బరువుకన్నా తగ్గిపోతోంది. ఉదాహరణకు : హీలియంను తీసుకొందాం. దాని కేంద్రకంలో (Nucleus) రెండు న్యూట్రాన్లు, రెండు ప్రోటాన్లు వుంటాయి. అందుచే దాని బరువు నాలుగు ప్రోటాన్ల రెండు ఎలెక్ట్రాన్లంత వుండాలి. కాని అలా వుండడం లేదు. ప్రోటాన్ బరువు వొక యూనిట్ అనుకుంటే హీలియం కేంద్రకం నాలుగు పైన తూగాలి. కాని అది 3.94 యూనిట్లు మాత్రమే తూగుతోంది. ఇది చాలా వింతగా వుంటోంది. అందుచేత మనమేమనుకోవాలి? ప్రోటాన్ ఎలెక్ట్రాన్ సమ్మేళనంగా యేర్పడే న్యూట్రాన్‌లో ఎలక్ట్రాన్ వుందే అనుకున్నప్పటికీ, (అలా గనుకోనవసరంలేదు) అది తన పూర్వధర్మాలను విడ నాడకుండానే వుందనగలమా? ఎలెక్ట్రాన్ తన బరువును కోల్పోవడమే గాకుండా యీ సమ్మేళనంలో ప్రోటాన్ బరువునుకూడా ఎంతో నష్టపరిచింది. ఇందు చేత ఎలెక్ట్రానుకు-స్వరూపస్వభావనష్టం జరిగిందనాలి.

ఇంతేగాదు, పరమాణువులోని కేంద్రకం చుట్టూ వివిధకక్ష్యలలో ఎలెక్ట్రానులు ప్రదక్షిణం చేస్తుం టాయి. అందులో అవివొక కక్ష్యనుండి మరోకక్ష్య లోకి దూకుతుంటాయి. దూకినప్పుడల్లా ఎలెక్ట్రాన్‌కు శక్తి నష్టమవుతుంటుంది. అదలా దూకుడులో కోల్పోయే శక్తినే కాంతి అంటున్నాం. అందుచేత మూలస్వరూపానికి హాని జరగని స్థితి లేదన్నమాట. ఇందుచేత వివర్తానికి శాస్త్రజగత్తులో చోటులేదన్న మాట.

వివర్తం అంటూ వుందనడానికి పరిణామజగత్తులో సూక్ష్మంగా చూస్తే అద్వైతికి వుదాహరణే సహేతుక మైంది లభించదు. అదేమంటే నిరాకార పరబ్రహ్మం సాకారజగత్తుగా భాసించడంవరకే వివర్తంయొక్క కార్యక్షేత్రం, ఆపైన సూది మొనమోపేంత మేరకూడా వివర్తం అమల్లోకిరాదు అని చెప్పగలనంటాడు అద్వైతి. అక్కడా చెల్లేదీ, చెల్లనిదీ యిందాకే చూశాం. తనచుట్టూ అలా బిగిసుకున్నది విజ్ఞాన శాస్త్రం ప్రసక్తేతేరాదు. ఎందుకంటే విజ్ఞానశాస్త్రం యొక్క వస్తుపటదర్శినిలోనూ, దుర్భిణిలోనూ, నిరాకార నిర్వికార విషయాలు, అవాఙ్మానసగోచరాలూ నిలవడం లేదు. పరబ్రహ్మం ఎలెక్ట్రాన్‌వంటి మూలసత్యం గాదు. ఇందులో వొకటి నిర్గుణం- రెండవది సగుణం; వొకటి నిష్కలం - వేరొకటి సకలం; వొకటి సర్వ వ్యాప్తం - వేరొకటి కణతరంగఖండం; వొకటి

నిష్క్రియం - వేరొకటి సక్రియం; వొకదానికిస్థితి - వేరొకదానికి గతి; వొకటి నిర్వికారం - వేరొకటి వికృతిగలది; (గమనవేగంతో బరువు పెరుగుతుంది) ఇక నిక్కడేమివివర్తం? విజ్ఞానశాస్త్రం ఏనాడైనా పరబ్రహ్మంవంటి నిర్గుణాన్ని కనుగొంటుందా? అది అసంభవం. గోచరత్వంలేని విషయం శాస్త్రప్రేషితం కాజాలదు.

అందుచే సత్యానికీ దాని గోచరత్వానికీ గల సంబంధం విషయంలో పరిణామం వర్తించదనీ, ఏకైకం నానాత్వంగా, అపరిచ్ఛిన్నం పరిచ్ఛిన్నంగా గోచరించడమనేది వివర్తపరిణామంవల్లనే సాధ్యమవుతుంది అని అనుకున్నదానికీ, విజ్ఞానశాస్త్రం విశ్వసత్యాన్నిగూర్చి చెబుతున్నదానికీ ఎక్కడా అందికా పొందికాలేదని గ్రహించాలి.

* * *

ఇక సాపేక్ష్య సమగ్ర సత్యాలను గూర్చి: న్యూటన్ మహాశయుడు గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. మనసౌరమండలాన్ని దాటి అవతలకు బోయి విశ్వవిషయాలను వివరించవలసివచ్చేసరికి గురుత్వాకర్షణ సిద్ధాంతం విఫలమవుతోంది. అందుకు నూతన సిద్ధాంతం, నూతన గణితం కావలసినచ్చింది. దానితో 'అయిన్‌స్టీన్' సాపేక్ష్య సిద్ధాంతపరంగా ఆ అవసరంతీర్చాడు. సౌరమండలంకన్నా ఇంకా విశాలమైన విశ్వాన్ని వివరించే ఈ సూత్రం సౌరమండలాన్ని వివరించడం మానదు. ఈ మండలంలోని వాస్తవికాంశాలను సాపేక్ష్యతా దృక్కోణంనుండి వివరించాల్సి వుంటుంది. సాపేక్ష్యసిద్ధాంతం దృష్టిలో సౌరమండలం, దానిజ్ఞానం "ఉపశమించడం" అంటూ వుండదు. సౌరమండలం బహిస్సత్యంగా విశ్వరూపంలో న్యూనసత్యం కాదు. విశ్వభాండంలో అదొక భాగం, వొకఅంగం, వొకఖండం. ఆ పరిమితక్షేత్రాలకే కట్టుబడితే న్యూటన్‌గణితం నేడూ చెల్లుతుంది. శాస్త్ర జగత్తులో ఖండసత్యానికీ, పూర్ణసత్యానికీ అంగ, అంగిసంబంధం, ఖండసంఘాత సంబంధము మాత్రమే వుంటుంది. ఎలెక్ట్రాన్ పరమాణువుకు అంగం. విశ్వంలో సౌరమండలం వొక అవయవం. ఇటువంటి అంగాంగి సంబంధం ప్రపంచానికి పరబ్రహ్మానికి లేదు. అందుచేనూ పరమార్థజ్ఞానం లభించినప్పుడు ప్రపంచం 'ఉపశమించాలి', లేదా భ్రాంతిలోవలె అదృశ్యంకావాలి. ఈవిధంగా విజ్ఞానశాస్త్రం యొక్క క్షేత్రంలో అవాఙ్మానస గోచరవిషయాలతో నిమిత్తంలేదని తేలుతోంది. ఇదివరలో శాస్త్రజగత్తు వేరు, అది నామరూపాలతోనే తగుల్కొని వుంటుంది; ఆ నామరూపాలకు అవతలివొడ్డును చూస్తుంది వేదాంత తత్త్వశాస్త్రం అనేవారు. ఇప్పుడా విభజనరేఖను వుల్లంఘించి, శాస్త్రాన్ని తమ కనుకూలంగా భాష్యం చెప్పుకోవాలని యత్నిస్తోంది ఆధ్యాత్మికవాదం. ఈ యత్నం ఫలప్రదం కానేరదని చూశాం.

అసలు నిజం మాట్లాడితే, విజ్ఞానశాస్త్రం మూలకారణం గురించి మాట్లాడడంలేదు. అలా పూర్వం మాట్లాడింది. ద్రవ్యంయొక్క ఆద్యరూపం పరమాణువు అని చెప్పింది. 'యాటం' అనే గ్రీకుశబ్దం యొక్క అర్థం ఇంకా 'విభజింప వీలులేనిది' అని. నేటికా పరమాణువు పగిలి ముక్కలైంది. ఎలెక్ట్రాన్ నేటికి తెలిసిన మూలరూపం. ఇదే మూలరూపంగా ఎప్పటికీ నిలుస్తుందని చెప్పడంలేదు. విశ్వంయొక్క మూలస్థితిని కనుగొన్నామని సంతోషపడడం లేదు. బహుశా మూలస్థితి వుంటుందనే భావాన్నే విజ్ఞానశాస్త్రం ఎత్తివేసుకొంటోంది. 'ప్రాగవస్థ', 'మూలకారణం' అంటూవుండవు.

ఇప్పటికి కనుగొన్న ఎలెక్ట్రాన్ కణతరంగం కావడంవలన 'విరుద్ధాంశలకు సమావేశం' వుందన్న ప్రతిపాదన బలపడింది. ద్రవ్యం ద్వంద్వాత్మకంగా వుంది. ఇది గతితర్కంయొక్క సవ్యతకు దాఖలా అవుతుంది.

## సత్కార్యవాదం - అద్వైతం

సత్కార్యవాదం సాంఖ్యులది. దాన్నే గుణ పరిణామవాదం అంటారు. దీనిప్రకారం కార్యం కారణవస్తువులో సూక్ష్మరూపంలో వున్నదికావాలి. నువ్వులలో నూనె వున్నదే. అది పిండగా వ్యక్తరూపం పొందుతోంది. మనం గుర్తించలేకపోవచ్చుగాని కార్యం తప్పనిసరిగా కారణంలో వుంటుంది. కార్యం కారణానికి ఎరగని మొహం కారాదు. ఇంతవరకూ అద్వైతంకూడా ఆమోదిస్తుంది. పరబ్రహ్మంలో నామరూపశక్తి అవ్యాకృతంగా పరమార్థంలోకూడా వుండే వుంటుందని చెప్పి అట్టేపెట్టింది.

సత్కార్యవాదంలో మరోషరతు వుంది. కార్యం కారణం రెండూ సమసత్యాలు గావాలంటుంది. అందుచే దానికి కార్యకారణ సమసత్తాకవాదం అని పేరుకూడా కద్దు. అద్వైతం యీ షరతు అంగీకరించదు. కారణం సత్యం; కార్యం సత్యం కాక

పోవచ్చు అంటుంది. నామరూపవికారాలను వివరించే వాదాన్ని అద్వైతంలో వివర్తం అంటారు. దానికే 'కార్యమిథ్యాత్వవాద' మనికూడా పేరు.

మట్టి, కుండ వున్నవనుకోండి. ఇందులో మట్టి కారణం - కుండకార్యం అనిపించుకుంటాయి. మట్టీ కుండా రెండూ సమాన సత్యాలంటుంది సత్కార్య వాదం. మట్టిమాత్రమే సత్యమై, కుండ మిథ్య, అనృతం అవుతుందంటుంది వివర్తం. మట్టీ కుండలు రెండూ ప్రత్యక్ష ప్రమాణ గోచరాలే. అయినప్పటికీ వొకటి సత్యం, మరొకటి మిథ్య ఎందుకవుతుందో కనుగొనాలి.

మట్టికీ కుండకూ గల సంబంధం నిర్వచనం చేయడానికి వీల్లేకుండావుంది. అంటే కార్యకారణ సంబంధం నిర్వచించలేక పోతున్నాం. అందుచేత కార్యాన్ని మిథ్య అనక తప్పదు, అంటాడు అద్వైతి. తర్కావసరంకోసమూ యుక్తియుక్తత కొరకూ ఇలా అనాలంటాడు.

మట్టిని విడిచిన కుండరూపం వుండజాలదు. వొకే మట్టి కుండా, మూకుడు వగైరా రూపాలను వహిస్తుంది. మట్టి యీ రూపాల్లేకుండానే వుండగలదు; కాని ఆ రూపాలుమాత్రం మట్టిని ఆశ్రయించుకొనే వుంటాయి. అందుచే కార్యం కారణంతో 'అనన్యం'గా వుంటుంది అంటారు. సూక్ష్మరూపంలో వుండనీ, స్థూలరూపంలో వుండనీ కార్యానికి కారణం కంటే భిన్నంగా స్వతంత్రంగా వునికి లేదు. అంటే స్వయంగా 'సత్తా' లేదన్నమాట. అనగా 'సత్తు' కాదు. కారణంలో కార్యం అసలు లేదాఅంటే లేదనడానికివీల్లేదు. సూక్ష్మరూపంలోనైనా వుంటోంది. అసలుకు లేనిది వున్నది కావడం అసంభవం. అందుచే కార్యం కారణంలో 'అసత్తు' కూడా కాదు. అంటే కార్య కారణాల సంబంధం సదసత్తులకు భిన్నంగా వుంది. అటువంటిదానికి నిర్వచనం లేదు. అదేమిథ్య; హీనసత్యం.

మట్టీకుండల దృష్టాంతంలో కారణం కార్యం రెండూ దృష్టిగోచర మవుతున్నాయి. కాని కార్య కారణ సంబంధంలో కార్యకారణాలు రెండూ వొకే సారి విడవకుండా కన్పడేవి కావాలని లేదు. త్రాడులో పాము భ్రమిస్తాం. పాము త్రాడును విడిచి వేరే స్వతంత్ర సత్తా కలిగిలేదు. కాని త్రాడులో లేదంటామా, లేనిది ఎక్కడనుండి వస్తుంది? అందుచే భ్రాంతులూ మిథ్యాభూతాలే. హీనసత్యానికి గీటురాయి దాని కార్యకారణ బంధం అనిర్వచనీయం గావడమే. కార్యకారణాల యుగపద్గోచరత్వం ప్రధానం కాదు. మనకు కొన్ని భ్రాంతి అని తెలిసినై; కొన్ని తెలియకుండా వున్నై. ఇంతే విషయం మరేమీ లేదు. అద్వైతంయొక్క వివరణ యిది.

దీని మంచిచెడ్డల్ని మనంగా వితర్కించి చెప్పడం వృథాప్రయాస. శంకరుని మాటలు శంకరుని కప్పగిస్తే సరిపోతుంది. మట్టీకుండలలో కుండ హీనసత్య మనిపించుకోవడం ఎలాగో యీ దిగువ విషయం వింటే వీలుపడదని తెల్సుకోగలం.

## విజ్ఞానవాది

"బాహ్యార్థం అసంభవం గాబట్టి బాహ్యావస్తువులాగా భాసిస్తోందంటున్నాము." (అంతేగాని వాస్తవంగా లేదు.)

## సిద్ధాంతి

"వస్తువు వున్నదీ లేనిదీ ప్రమాణంయొక్క ఉనికి లేముల్నిబట్టి నిశ్చయించాలిగాని, వస్తువుయొక్క ఉనికి లేముల్నిబట్టి ప్రమాణంయొక్క ఉనికి లేముల్ని నిశ్చయించ వీల్లేదు. ప్రమాణంవల్ల ఉపలబ్ధిగలదానికి అస్తిత్వ మున్నట్లు; ప్రమాణోపలబ్ధి లేనిది లేనిదే అవుతుంది. అవి (పరమాణువులకన్నా) భిన్నమైనవా, అభిన్నమైనవా అనే తర్కవికల్పంచేత సంభవాలు కావనడానికి వీలులేదు. (2-2-28 వే. సూ. భా.)

ప్రమాణగోచర మయ్యే కుండ ఆకారం మట్టివలె సత్యం కాజాలదని అనవచ్చునా? కుండ ఆకారం మట్టిని గాకుంటే కొయ్య నాశ్రయిస్తుంది; బంగారాన్నాశ్రయిస్తుంది. కుండ ఆకారం వొకటిగా వుంటూ, అనేక వుపాదానాలు వుండవచ్చు. రూపవికారాలు వుపాదానంవలె సత్యాలు గాకపోవడమేమిటి? భ్రాంతిలో త్రాడుతోపాటే కనిపించని పాము, మట్టితో కనిపించే కుండను తర్కాన్ని ఆధారంచేసుకుని సమానస్థాయిలో పెట్టడం అందుచే సవ్యం కాజాలదు. అలాచేయడం ప్రమాణాల విలువను కించపరచడమేగాని అన్యంగాదు.

ఆపైన రజ్జు సర్పాలవంటి భ్రాంతి అనుభవాలను దృష్టాంతంగా వుపనిషత్తులు చెప్పలేదు. వేదాంత సూత్రాలు చెప్పలేదు. అద్వైతంలో ఆ దృష్టాంతాలు గౌడపాద శంకరులద్వారానే ప్రవేశపెట్టబడ్డాయి. ఇటివంటిభ్రాంతి వుదాహరణలులేకుండానే విషయాలు

నడిచాయి వారికిముందు. నామరూప వికారాలు సత్యం గావనేందుకు ఛాందోగ్యోపనిషత్తు యిలా చెప్పింది. "మట్టియొక్క ఆకారవికారాలను తెలియజేసే కుండ, మూకుడు అనేపేర్లు నామమాత్ర వికారాలవుతున్నాయి. అసలిందులో మట్టే సత్యమవుతోంది" (6-1-1). నామరూపాలు, పరిణామవికారాలు నామమాత్రంఅని చెప్పేందుకు వుపనిషత్కర్తలు, సత్యద్రష్టలు వాస్తవికాలను, ప్రమాణగోచరాలను వుదాహరించి సరిపుచ్చారు. అద్వైతాన్ని అదివరకెన్నడూ లేని భ్రాంతి అనుభవాల వుదాహరణతో వివరించవలసిన పనేమిటి? భ్రాంతి వుదాహరణలు బౌద్ధులవి. ఈ చెప్పకూ, చొప్పింపుకూ ప్రాధాన్యం లేవనడానికి వీలులేదు. బాదరాయణ్ణి శాండిల్య భక్తి సూత్రాలు (30 వది) అభేదవాదిగానే పేర్కొంది; కావచ్చు. కాని ఆయనసైతం వికారజాతాన్ని నామమాత్రమని అన్నప్పటికీ జలం - తరంగాలు, నురుగు; భూమీ, కాంస్యలోహాలు అనే వాస్తవిక దృష్టాంతలే యిస్తూ వచ్చాడు. ఈ పూర్వస్థితిని లెక్కలోకి తీసుకునిచూస్తే నూతనరాశి వుదాహరణలను ప్రవేశపెట్టడానికి వొకానొక విశిష్టదృక్పథం కారణమని గ్రహించకపోతే చారిత్రకదృష్టి లోపించడమవుతుంది. ఉపనిషద్ద్రష్టలకన్నా, బాదరాయణునికన్నా శంకరుడు జగత్తును న్యూనపరచాడన్నది స్పష్టం.

మాయయొక్కా, జగత్తుయొక్కా అనిర్వచనీయతను పదేపదేనొక్కి చెప్పినంతగా బ్రహ్మయొక్క అనిర్వచనీయతను ఉద్ఘాటించటం మానివేశాడు శంకరుడు. సచ్చిదానందమనేదాన్ని పరబ్రహ్మయొక్క నిర్వచనంగా దాదాపు చేసివేశాడు. గౌడపాదశంకరులు తెచ్చిన యీ మార్పుకూడా జగత్సత్యత్వాన్ని క్రిందికి దింపడానికే తార్కాణమవుతుంది.

## భ్రాంతి, స్వప్నం, జాగరితం

" 'కలలోని దృశ్యాలకన్నా మెలకువలో కానవచ్చే 'దృశ్యాలు' అధిక సత్యాలు. భ్రాంతి దృశ్యంకన్నా మెలకువదృశ్యం ఇతోధిక సత్యమే. ఈ మూడు స్థాయిలకీ తారతమ్యం వుంది. ఇవన్నీ 'వ్యవహార సత్యాలే కావచ్చు' అన్నాడు శంకరుడు. "ఈ విషయాన్ని గమనికలోకి తీసుకోనందున శంకరునికన్యాయం జరిగింది" అంటారు నేటి అద్వైతులు. ఇదే వారి వాదన అయితే శూన్యవాదంకూడా యిలా వాదించలేకపోదు. విజ్ఞానవాదానికీ ఈ సామర్థ్య ముండకపోదు.

నాగార్జునుడూ 'అసత్తు'ను తక్కిన స్థాయిలనుండి వేరుపరిచే మాట్లాడాడు. కుందేటి కొమ్మువంటి యీ అసత్యాలు 'అవిద్యమానాలు' అన్నాడు. దీనికన్నా ప్రపంచం పైఅంచెలోదే అన్నాడు. ప్రపంచం విద్యమానం. ప్రపంచాన్ని అద్వైతం వ్యవహార సత్యమంటే, మారుపేరులో యీయన 'సంవృతి' సత్యమన్నాడు. సంవృతి, ఆవృతి, ఆవరణం - ఆవరించే సత్యం. పరమసత్యాన్ని (Absolute) కప్పే 'అవిద్య', అజ్ఞానానికి సంబంధించినది అని తాత్పర్యం. దానికే 'లోకసత్యం' అని మరొక పేరిచ్చాడు. మళ్ళీ యీ సంవృతిలో రెండువిభాగాలున్నాయన్నాడు. అందులో వొకటి 'తథ్యసంవృతి' - రెండోది 'మిథ్యాసంవృతి'. భ్రాంతి అనుభవం, స్వప్నం, ఇంద్రజాలం వగైరా అనుభవాలు మిథ్యాసంవృతి సత్యాలలో జమ అవుతాయి. ఇవి మన వ్యవహారానుభవంలోనే సత్యాలుగావని తెలుస్తాయి. అందుకే అవి మిథ్యాసంవృతులు. దీనికే పర్యాయపదం 'అలోకసంవృతి'. ఇక మిగిలిందల్లా జాగ్రదవస్థలో కానవచ్చే వ్యవహార జగత్తు. అదే 'తథ్య సంవృతి'. ఈవిధంగా శూన్యవాదమూ యీ మాత్రం విచక్షణను ప్రదర్శించేవుంది. ఈ విచక్షణ శంకరుని సొత్తుగాదు.

శంకరుడు భ్రాంతిస్వప్నాలను ప్రాతిభాసికసత్యము అని నామకరణంచేశాడు. దానిపై మెట్టు మెలకువలోని ప్రపంచం. అది వ్యవహారసత్య అన్నాడు. దీనిసత్యాంశ అధికం. విజ్ఞానవాదంకూడా పరతంత్ర సత్యం, పరికల్పిత సత్యంఅని వ్యవహారానుభవాన్ని విభాగించి వుంచింది. స్వప్నంలోవలె బాహ్యసత్యం కూడా బుద్ధికల్పితం అన్నంతవరకూ సమానం, కాని ఆరెండింటిలోనూ మళ్ళీ తారతమ్యం వుందనేఅన్నారు. ఈ మూడు శాఖలూ యీ విషయంలో తుల్యస్థితిలోనే వున్నాయి. కాని యిందులో శంకరుణ్ణి బాహ్యార్థవాది అని అనుకుందాం; విజ్ఞానవాదంలో బాహ్యార్థాలు సత్యంగావు. అంతస్సే సత్యం; ఇక శూన్యవాది బహిరంతరాలు రెండూ శూన్యమే, వ్యవహారాలే అన్నాడు. కాబట్టి వాస్తవికత, అవాస్తవికతలను నిర్ణయించడం కల, మెలకువ, భ్రాంతుల తరతమ స్థాయిల గుర్తింపువల్ల కాదని గ్రహించాలి. అదొక కొలబద్ద కారాదు.

భారత తత్త్వప్రపంచంలో ఏవాదంకూడా జగత్తును కుందేటి కొమ్మంత మహాసత్యమని చెప్పేంత పుణ్యం

కట్టుకోలేదు. అందుచేత యిక్కడ అద్వైతంయొక్క ప్రత్యేకత ఏమీలేదు. అదేమాదిరిగా భ్రాంతి స్వప్నాలనుండి జాగరితానికి తేడావుందని చెప్పి, జాగరితానికొక సత్యాంశ ఎక్కువ వుందని చూపడంలోనో, వొకమిథ్యాంశను తక్కువ చూపడంలోనో వెనకడుగు వేసిన తత్త్వశాఖకూడా మచ్చుకు దొరకదు. ఇటువంటి పరిస్థితులలో కల, మెలకువలకు, అసత్తు - మిథ్యలకు - మిథ్యలో వుపతరగతులకు విభేదాలనెంచి జగత్సత్యానికి శంకరుడన్యాయం ఏమీ చేయలేదని చెప్పబోవడం సమంజసంగాదు. అలా చేయడమంటే పనిషితో తల పడడానికిమారుగా నీడతో పోట్లాడి గెల్చానని తృప్తి పడే చర్యే అవుతుందిగాని అన్యం కాదు.

కలా మెలకువలకు గౌడపాదుడు చూడని వ్యత్యాసం శంకరుడు చూశాడు. గౌడపాదుడు బాహ్యార్థాలు వ్యక్తియొక్క బుద్ధిచేత కల్పించబడుతాయంటే, కారికా భాష్యంలో ఆభావం తనదికానట్లు 'ఆచార్యుడు విజ్ఞానవాదీయ హంశాలతో ఏకీభవిస్తారు' అని వ్రాసి, అందులో తన అనంగీకారాన్ని ధ్వని మాత్రంగా చూపాడు. ఇలాగన్నది శ్రీ రాధాక్రిష్ణన్. ఇది సరికాదని భావిస్తాను.

కారిక నాల్గో ప్రకరణంలో 26, 27 శ్లోకాలకు విజ్ఞానవాద సంపర్కంవుంది. అంటే అవి బాహ్యార్థాల అస్తిత్వాన్ని తిరస్కరిస్తాయి. అవన్నీ అయిపోయాక పుస్తకంచివరలో 87 వ శ్లోకంలో కలా మెలకువల వ్యత్యాసం స్పష్టీకరించాడు. వస్తువులుంటూ, వాటితో జ్ఞానసంపర్కం పొందినట్లుండేది మెలకువ, వస్తువులు లేకుండా వాటితో జ్ఞానసంపర్కం పొందుతున్నట్లు వుండేది కలఅని అన్నాడు. (సవస్తుసోప లంభం........., అవస్తుసోప లంభం .........IV.87). మెలకువలో విచక్షణ కోల్పోయి తమస్వభావమిదని నిర్వచించడానికి వీల్లేని భ్రాంతి దృశ్యాలను చూస్తున్నట్లే, కలలోకూడా కలలో తప్ప యితరత్రా అస్తిత్వం కలిగివుండని వస్తువుల్ని చూస్తాడు అని 4-41 లో అన్నాడు. భ్రాంతినీ, కలనీ ఏకరాశిగా చూపాడు; భ్రాంతి జగత్తులోని ప్రమాదావస్థ అన్నాడు. అలా ఆ రెండింటినీ విడదీశాడు. కలా మెలకువల సారూప్యాన్ని చెప్పే సమయంలో కూడా (2-14 లో కూడా) ఆ రెండింటికీగల వ్యత్యాసాన్ని గుర్తించకపోలేదు.

ఇంతేగాదు. 'బాహ్యజగత్తు పరమార్థ స్థితినుండి మిథ్య లెమ్మని చెప్పి అంతటితో విరమించకుండా వుపలబ్ధ జ్ఞానానికి బాహ్యమైన కారణం ఉండడం తార్కికంగా అవసరం; అయితే పరమార్థ స్థితినుండి చూస్తే అదొక కారణం కాజాలదు.' అనికూడా అన్నాడు.

> ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వ మిష్యతే యుక్తిదర్శనాత్,
> నిమిత్తస్యా నిమిత్తత్వమ్ ఇష్యతే భూతదర్శనాత్!!
> (IV – 25.)

శంకరు డింతకన్నా అదనంగా చెప్పిందేముంది? అనంతమైన బాహ్యవస్తుజాతంతో (సంఘాతంతో) పాటుగా జీవుడుకూడా పరమాత్మలో మాయాకల్పిత విషయాలేగాని, బాహ్యవస్తువులు జీవాత్మయొక్క అవిద్యచే కల్పింపబడ్డ విషయాలు గావని (II–16, 19; III-10) అసందిగ్ధంగా చెప్పేశాడు. విజ్ఞానవాదం నుండి భిన్నంగా ఆలోచించాడని చెప్పడానికివే ప్రబల తార్కాణాలు. కాగా బాహ్యార్థాలు పరమ సత్యాలంటేమాత్రం కాదు; అవి వ్యవహార సత్యాలు అని చెప్పాడు. [నాలుగో ప్రకరణం యిరవై నాలుగో శ్లోకానికి ఇరవై అయిదోది సమాధానం అనుకోవచ్చు.]

అదే ప్రకరణంలో 26, 27 శ్లోకాల్లో విజ్ఞానవాది వాదన యిచ్చాడు. దాన్ని ఆమోదిస్తూనే, అదే సరళి తర్కంతో దాన్నే కూలుస్తాడు. పరాయివాని కళ్ళను ఆ పరాయివాని వేళ్ళతోనే పొడిచినట్లు చమత్కారంగా చేశాడు. ఆ సందర్భంలో శంకరులు విజ్ఞానవాద తర్కంతో ఏకీభవిస్తారనడంలో అభిప్రాయ భేదాలను పసికట్టగలమా? గౌడపాదుని బాహ్యార్థవాద దృష్టిని పైనే చూశాం. అంతేగాక, శంకరునిలో విజ్ఞానవాదచ్ఛాయ లేకుండావుంటేగదా యీ పొరపుల్ని సృష్టించాలి. మొత్తం ఒకఉపనిషత్తు భాష్యం మీద విజ్ఞానవాదపు నీడ వ్రాలింది. కారికాభాష్యం అనర్గళం, సహజం అనిపిస్తుంది. చూసికొన్నంటే కాల్చివచ్చేంత చొరవతో నడుస్తుంది. సూత్రభాష్యం కృతకం, కుంటినడక. ఇటువంటి సందర్భంలో అభిప్రాయభేదాలు కూపీతీయడం కూడనిపని. శంకరునిలో వాస్తవికతను చూపడానికని గౌడపాదుడికి అన్యాయం జరగరాదు. ఒకరికోసం వొకర్ని బలిచేయరాదు. ఈ మలుపుదారులు మాని రాజమార్గంలో నడవాలి. తల్లివేళ్ళతో పెనగులాడక పిల్లవేళ్ళతో పెనగితే కార్యంతీరదు. సత్యత్వంయొక్క స్థాయీ విభాగమే అసలు సమస్య.

# జీవన్ముక్తి - జగత్సత్యం

జ్ఞానయోగానికి అద్వైతశాఖలో ప్రత్యేకస్థానం వుంది. తదితర వేదాంతశాఖలేవీ యీ వాదాన్ని ఆమోదించవు. వేదాంత శాఖలకు వెలుపల సాంఖ్య వాదమే దీన్ని ఆమోదించింది; నిజానికి ప్రారంభం దానిదేననాలి. జ్ఞానయోగంయొక్క తార్కిక పర్యవసానం జీవన్ముక్తిభావం. కర్మలకన్నా జ్ఞానం అధికమైంది. కర్మలన్నవి దేహమున్నంతవరకూ మనల్ని విడనాడవు. ఇష్టంవున్నా, లేకున్నా ప్రకృతిధర్మమైన ప్రవృత్తిని తప్పించుకోలేము. కర్మరాహిత్యం సజీవునికి సాధ్యంగాదు. జ్ఞానంసజీవునికే సాధ్యం. జ్ఞానోదయం జన్మలోనేగావాలి. జ్ఞానంవల్ల కర్మలు నశిస్తాయన్నా, కర్మలు స్పృశించవన్నా చాలు, జీవన్ముక్తి కల్గినట్లే. కర్మలు కర్మల్ని నశింపు చేయలేవు అని చెప్పి, జ్ఞానమే అందుకు సామర్థ్యంకలదని అనుకుంటే సరిపోతుంది. జ్ఞానం కలిగీ కలగడం తోటే ముక్తి కలుగుతుందని అనడంవల్ల దీన్ని 'సద్యోముక్తి' అని కూడా అంటారు. ఇతర వేదాంతశాఖలు 'క్రమముక్తి'ని విశ్వసిస్తాయి.

సజీవముక్తినొందిన అద్వైతి జగత్తులో దేహయాత్ర సాగిస్తాడు. ప్రపంచాన్ని అతను లెక్కలోకే దీసుకుంటాడుగాని విడిచిపుచ్చడు. ప్రపంచాన్ని మిథ్య అని తెల్సుకున్నందునే ముక్తుడవుతాడు; ముక్తుడై జగత్తుతో వ్యవహరిస్తాడు. అందుచేతకూడా జగత్తుశూన్యం కాదు; కుందేటికొమ్మంత అసత్యంకాదు అంటున్నారు. దానికీ కొంత సత్తా వుందంటున్నారు. అద్వైతంలో వాస్తవికతను చెప్పేందుకుగాను జీవన్ముక్తిని లోకయాత్రకూడా వొకదాఖలా అయిపోయింది. రాధాకృష్ణన్‌గారినుండి యీ వాదనాంశం వస్తూనే వుంది.

జీవన్ముక్తునికి 'విదేహముక్తి' వుంటుంది. అది చావు పిమ్మట లభిస్తుంది. జ్ఞానోదయంతోనే విదేహముక్తి లభించదు. కొంతవ్యవధి కావాలి. ప్రతి కర్మకు ఫలితం వుంటుంది. గత జన్మలోని కర్మల ఫలీకరణం చెందుతుంటాయి;అందుచే పున అనుభవంలో అదృష్టం వుంది. ఫలీకరణం ప్రారంభమైన వాటిని ప్రారబ్ధకర్మలంటారు. ఫలీకరణానికి రానివాటిని సంచితకర్మలంటారు. జ్ఞానఖడ్గం సంచితకర్మల్ని నరుకుతుంది, ప్రారబ్ధకర్మల్ని నరకడానికి పదును చాలదంటారు. ప్రారబ్ధం పూర్తయ్యేవరకూ నిట్టూరుస్తూ అనుభవించాల్సిందే నంటారు.

దీనిని కొన్ని దృష్టాంతాలతో నిరూపిస్తారు. కుమ్మరివాని సారె తిరగడంవల్లనే కుండ తయారవుతుంది; కాని కుండ తయారుకాగానే సారె తిరగడం టక్కున ఆగిపోదు. దేహయాత్రవల్లే జ్ఞానం ఏర్పడింది. జ్ఞానోదయం కాగానే పైమాదిరిగా దేహయాత్ర కట్టుబడనవసరంలేదు. కళ్ళజబ్బు కలవాడికి చంద్రుడు రెండు బింబాలుగా కనిపిస్తాడు. ఆ రోగి ఇతరులవల్ల చంద్రుడొక్కడే, నీకు రోగంవల్ల యిద్దరుగా కనిపిస్తున్నారని తెల్సుకోవచ్చు. అందుచే రెండుగా చూస్తున్నందుకు చలించడం మానేస్తాడు. కాని రోగం వున్నంతసేపూ రెండు బింబాలు కన్పించడం మానేయవు. (ఛాందోగ్యం, VI. 12. 3; వే. సూ. భా. IV 1. 15, 19.) నేత్రరోగి చంద్రుడొక్కడేయని మనసులో తెలిసినా, ఇద్దరూ కన్పించినట్లే, జీవన్ముక్తుడికి ద్వైతానుభవం వుంటూనే వుంటుంది. అందుచేత జగత్తు హోదాకు భంగం కలగనీయలేదు అంటారు.

సాంఖ్యయోగశాఖలూ ఇలాగే జీవన్ముక్తునిగూర్చి భావిస్తాయి. కాని వారు ఆత్మతోపాటు ప్రకృతిని సమాన సత్యం అన్నారు. భౌతికజగత్తును కించపరచని వాదాలైన వాటి స్థితి యిలానేవుంది. బాహ్యజగత్తు సత్యమనే హీనయాన బౌద్ధంకూడా 'అర్హత' సిద్ధాంతంద్వారా జీవన్ముక్తి నంగీకరించింది. జగత్తు శూన్యంఅనే నాగార్జునుడు బోధిసత్వ సిద్ధాంత రూపంలో జీవన్ముక్తి నంగీకరించి, అతనికి ప్రపంచానుభవాన్ని చెప్పింది. అసలు బాహ్యార్థాలకు సత్యత్వంలేదు. అవి బుద్ధికల్పితాలనే విజ్ఞానవాదంకూడా బోధిసత్వుణ్ణి ఆమోదించింది. ఇక అద్వైతంలోనే జగత్తుయొక్క సత్యత్వాన్ని ప్రశ్నించిన మండన మిశ్రుడు, దృష్టిసృష్టివాదం, యోగవాసిష్ఠం కూడా జీవన్ముక్తునికి ద్వైతానుభవాన్ని, ప్రారబ్ధ కర్మానుభవాన్ని చెప్పే వున్నాయిగాని వ్యవహార వర్తనం లేదనలేదు. ఈ హంశంలో వాస్తవికవాదాలు, అవాస్తవిక వాదాలు ఇన్నీ ఏకీభవిస్తున్నాయి.

ఈ పరిస్థితిని గుర్తిస్తే ఏమనుకోవాలి? ప్రపంచం యొక్క సత్యత్వాం గోతును, అసత్యం యొక్క స్థాయిన్ని తెల్సుకోడానికి జీవన్ముక్తివాదం కొలబద్దకాదు. గీటురాయికాదు. ఇరవయ్యో శతాబ్దంలో శంకరునికి వాస్తవికతా దృక్పథం అనే ఉడుపుల్ని

తొడిగి ఆకర్షణీయంగా నిలబెట్టే యత్నంలోని ఆదుర్దా, వుద్వేగాలవల్ల విచక్షణను, తరతమబుద్ధిని వెనకబెట్టడం మంచిదిగాదు.

జీవన్ముక్తుడు పుణ్యపాపాల అనుభవానికి అతీతుడు. జ్ఞానికి పాపపంకం అంటుకోదు. (4–1–13). ఆయనకు స్వేచ్ఛ. ఇది సంఘానికి హానిచేసే సిద్ధాంతం. అందుకు అద్వైత ప్రవక్త యాజ్ఞవల్క్యే నిదర్శనం. ఆయనొక జీవన్ముక్తుడు. శాకల్యుణ్ణి వాదనలో కోపందెచ్చుకొని శాపదగ్ధుణ్ణి చేశాడు. నిజంగా శాపం చాటునున్న విషయం ఖూనీ ప్రకమాయింపేగాని మరేమీ గాదు. గార్గిని స్త్రీ అనే విచక్షణను విడనాతల తెగిపడుతుందని భయపెట్టాడు. జీవన్ముక్తుడు జ్ఞాని, వివేకంతోనే వర్తిస్తాడుగాని విచ్చలవిడికాడని చెప్పితే సరిపోదు. పాపంనుండి రక్షణ యివ్వడమే పొరపాటు. విద్యారణ్యుని జీవన్ముక్తి వివేకం యాజ్ఞవల్క్యునీ, తదితరుల్నీ సమర్థించింది. ఇదే నైతిక నిర్బాధ్యత.



# బుద్ధుని, శంకరుని బోధలు: ఆధునిక యుగంలో వాటి ప్రాధాన్యం

శ్రీ సారా రామచంద్రరావు

అనాదియగు కాలమును వేద, సూత్ర, పురాణ యుగములుగా చరిత్రకారులు విభజించినారు. అందు నొక్కొక్క యుగమునకు దశోపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీతయనునవి ముఖ్యములై తత్త్వమును గూర్చి ప్రబోధించు గ్రంథములై యున్నవి. వాటినే "ప్రస్థానత్రయ" మందురు. వాటిపై ఆస్తికులగు మతోద్ధారకు లందరును భాష్యములను వ్రాయుట బట్టి వాటి ప్రాముఖ్యత దెలియుచున్నది. శ్రీ కృష్ణ నిర్యాణానంతరము కలియుగము ప్రవేశించినదాది ప్రజలలో విద్యాసక్తులు క్రమముగా క్షీణించ నారంభించెను. చెడుగునుండి మంచి, మంచినుండి చెడుగు చీకటి వెలుతురులవలె పుట్టుట సృష్టిధర్మమైయున్నది. సిద్ధాంతభాగములో ప్రతి మతమునందు జ్ఞానము, భక్తి, కర్మ యను మూడుయోగములుగా నుండును. సాముదాయికముగా ప్రజలు మతోద్ధారకుల యొక్కొక్క యోగమునకు, దేశకాలపాత్రల ననుసరించి ప్రాధాన్యత నిచ్చుచుండిరి. తదితరయోగముల యొక్క సమీకరణలేని ప్రత్యేకయోగము చెడుగునకే దారితీసినటుల చరిత్ర ఋజువు చేయుచున్నది. భూత కాలముయొక్క సింహావలోకమునుబట్టి వర్తమాన భవిష్యత్తులు నిర్ణయించుటకు యాధారము గలుగు చుండును.

ఇప్పటికి 2,500 సంవత్సరములకు పూర్వము దేశస్థితి యీక్రింది విధముగా నుండెను. సచ్చిదానంద స్వరూపుడు, శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపుడగు దేవునికి రూపములు, ఆలయములు, భోగములు, భాగ్యములు ఆపాదించబడుటయేగాక యజ్ఞయాగాది జీవహింసలు మొదలగు కర్మలే ప్రధానముగా దేవునిపేర చెయ్యరాని పనులను ప్రజలు చేయుచుండెడివారు. మూడు ప్రస్థానములలో నుద్భవించిన తత్త్వశాస్త్రములకు తత్వార్థములు పోయి, స్వార్థములు గేర్పడినవి. అందు కనుగుణ్యముగా ప్రజలు గూడ భిన్నభిన్న మానవ స్వభావములకు భిన్నభిన్న దేవుళ్ళను సృష్టించుకొనిరి. అందువలన మత యుద్ధములు, నరబలులు, జంతుబలులు, మధుపానములు మొదలగు నీచకార్యములు దేవునిపేర కర్మ ప్రాధాన్యముగా చేయబడుచుండెను.

ఎప్పుడెప్పుడు ధర్మమునకు గ్లాని సంభవించి అధర్మము బలియునో అప్పుడప్పుడు నే నవతరించి శిష్టులను రక్షించుటయు, దుష్టులను శిక్షించుటయు జేయుచుందునని భగవంతునిచే జెప్పబడిన గీతా వాక్యానుసారము అప్పుడు బుద్ధభగవానులుపుట్టినారు. వారు అహింసత్వము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము మొదలగు సుగుణములుగల ధర్మ స్వరూపమైన జ్ఞానప్రాధాన్యము గల మతమును బోధించినారు. దేవునిపేర చెయ్యరాని తప్పులు చేయుచున్న యా రోజుల ననుసరించి ఆయన దేవుని పేరెత్త లేదు. వేద ప్రాముఖ్యమును దీసుకొనలేదు. అందరూ బౌద్ధులైరి. ఈ దేశమేకాదు; చీనా, జపాను, టిబెట్టు, మంగోలియా, సింహళము మొదలగు చుట్టునున్న దేశములన్నియు బౌద్ధమతముతో నిండెను. ప్రపంచములో నున్న మూడువంతులలో రెండువంతుల జనాభాలో నీ మతము వ్యాపించెను. 1000 సంవత్సరములు దిగ్విజయముగా సాగెను. అప్పటిరోజులలో మన దేశమునకు చైనా, ఇటలీ మొదలైన దేశములనుండి యాత్రికులుగా వచ్చిన హ్యూవాన్‌సాంగ్, ఫాహియాన్ మున్నగువారిచే వర్ణింపబడిన వ్రాతలనుబట్టి మన దేశముయొక్క నైతికస్థితి, ఆర్థికస్థితి యెటులున్నవో తెలియుచున్నది. దేశమునందు మధువిక్రయ శాలలుగాని, మాంసవిక్రయశాలలుగాని, అన్న విక్రయశాలలుగాని లేవనియు, వడ్డీకి ధనమును అప్పుగాయిచ్చు పద్ధతి లేదనియు, ద్వారములకు గొళ్లెములు, తాళములు లేవనియు వ్రాసియున్నారు. దానిని బట్టి వ్యభిచారము, దొంగతనము మొదలైన వ్యసనములు లేవనిగదా తెలియుచున్నది! దేశముయొక్క నైతికస్థితి ఎంత ఔన్నత్యములో నున్నదో యూహించుడు. దేశము ఆర్థికముగా బీదగా యున్నదేమో యనిన, కోటీశ్వరులు వందలకొలది యుండిరనియు,

నవరత్నములు అపరాల రాసులవలె పోసి యమ్మిరి. అంగళ్ళు కలవనియు, ఆడపిల్లలు రత్నములతో నచ్చన గంగ్లు యాడుకొనుచుండి రనియు - దేశముయొక్క భాగ్యమును వర్ణించియున్నారు.

ప్రజలు బుద్ధదేవుని దశావతారములలో యిప్పటికిని సన్నిహితమైన తొమ్మిదవ యవతారముగా పూజించుకొనుచుండిరి. కలికాల ప్రభావముచే విద్య క్రమముగా క్షీణించి ప్రజలు నీతిని మరచినారు. ధర్మప్రవర్తన యందు ఆలోచనలేదు సరిగదా, దేవుడులేడనియు, వేదములు ప్రామాణ్యములు గావనియు నాస్తికులై, పతితులై భ్రష్టులైరి. దైవాస్తిక బుద్ధితోచేయు పాపమువేరు; నాస్తిక బుద్ధితో స్వార్థమునకై చేయు పాపమువేరు. బుద్ధుడు పుట్టకముందు దేశమునకు పట్టిన దురవస్థవేరు; యిప్పటి దురవస్థ వేరు. బుద్ధుని శిష్యులు నలుగురకు బుద్ధుని బోధలు వారి వారి మనస్తత్వములనుబట్టి నాలుగు విధములుగా యర్థమయినవి. ఆయావిధములుగా వారు బోధించసాగినారు. అందువలన యనేకములగు యసందర్భాభిప్రాయములు మతములో జొరబడినవి. ధర్మగుణములకు వ్యతిరేకములగు రుచులను స్వార్థముతో ననుభవించుటకు ధర్మముపేర చెయ్యరాని తప్పులను ప్రజలు చేయసాగిరి.

అట్టితరి క్రీస్తుశకము 500 తరువాత శ్రీ శంకరాచార్యులవారు పుట్టినారు. ఆ మతమును సంస్కరించినారు. బుద్ధుని ప్రధాన సిద్ధాంతముల జోలికి ఆయన పోలేదు. ఆ కాలపు బౌద్ధాచారములను మాత్రమే ఖండించినారు. శంకరునకు అపర బౌద్ధావతారమని పేరు. బుద్ధుడే తన మతము 1000 సంవత్సరములు దిగ్విజయముగా ప్రబలి క్షీణించగా, శంకరుడై పుట్టి తన మతమును సంస్కరించుకున్నాడు. బుద్ధుని పునర్జన్మ సిద్ధాంతము, కర్మసిద్ధాంతము, జీవేశ్వర జగన్మిథ్యా సిద్ధాంతము, క్షణిక విజ్ఞానవాద సిద్ధాంతము మొదలగు జ్ఞాన ప్రాధాన్యములను శంకరాచార్యులవారు తీసుకొన్నారు. బౌద్ధమతమునకే ఆస్తిక్యము, వేద ప్రామాణ్యము నిచ్చి అద్వైతముగా మార్చినారు. బౌద్ధులంతా యద్వైతులైరి.

500 సంవత్సరములు బాగుగా సాగినది. తర్వాత విద్యాక్షీణతవలన, వైవిధముగానే మంచిలోనుండి చెడుగు పుట్టినది. అద్వైతములో నీతి చెడి, విధి నిషేధములు నశించినవి. వేదాంతులకు గంజాయిచేగ్గులు, వేదాంతినులకు గర్భములచే గర్వులు, సన్యాసులకు స్వపరభేద శూన్యతచే సంకెళ్ళు, బ్రహ్మచారిణులకు శిశు హత్యలచే ప్రాణపు పోకడలు — అని ఆ స్థితిని ఒక కవి వర్ణించినారు. ఆఖరికి "వేదాంతులు వచ్చినారు చెంబుమంత జాగ్రత్త పరచు"మను స్థితికి వచ్చినది. తిరిగి ప్రజలు మహాదురవస్థలో బడ్డారు.

తరువాత శ్రీ రామానుజాచార్యులవారు బుట్టి హృదయస్థమగు. భక్తికి ప్రాధాన్యమిచ్చి సర్వమానవ సౌభ్రాతృత్వమగు విశిష్టాద్వైతమును బోధించినారు. జ్ఞానము భక్తికి అంగముగా చేసుకొన్నారు. ముక్తికి భక్తియే ప్రాధాన్యమనిరి. అందరూ భాగవతోత్తములే. బాగుగాసాగెను. వారు పరమపదించిరి. వెనుకటి విధంగానే మంచిలో చెడుగు బుట్టినది. మానవ సౌభ్రాతృత్వములో బుట్టిన మతము విద్యావిహీనులగు యన్ని జాతులలోను వ్యాపించుటవలన ఆఖరికి రామానుజ మతమనగా త్రాగుబోతు మతమయినది. భక్తి ప్రపత్తి మారినది. విధి నిషేధములు నశించి వైదిక కర్మ యడుగంటినది.

తరువాత ద్వైత మతోద్ధారకులుగా శ్రీ మధ్వాచార్యులవారు పుట్టి కర్మ ప్రాధాన్యమును గూర్చి బోధించినారు. మొదట వేదవిహితకర్మ చేయవలయును. అటుపై భక్తిజ్ఞానము లంకురించుననిరి. స్వాత్వికాహారాది నియమములచే, దుర్వ్యసన దూరతచే, ప్రాణాయామాది సాధనసంపత్తిచే శరీరపాటవమును సంపాదించుకొని మీరు తరించి యితరులను తరింపచేయుడనిరి. వీరి తరువాతివారు దేశమును యెంతవరకు ధ్వంసము చేయుటకు వీలగునో యంతవరకు ధ్వంసము చేసినారు. పరిశుద్ధస్నానమాచరించుట పంది గుంటలో బడుట. పైకెగురుట, పంగ్లువిరుగునటుల క్రిందబడుట ప్రకృతికి మర్యాదయై యున్నది. ఆది స్థితివలెనే ప్రజలు దేవునిపేర చెయ్యరాని తప్పులు కష్టు ప్రధానముగా చేయుచున్నారు.

అందుచేతనే యీ గాంధీయుగములో జ్ఞానమునకు ప్రధానమగు సత్యము, అహింస, అస్తేయము, బ్రహ్మచర్యాది ధర్మగుణములకు ప్రాధాన్య మిచ్చినారు. పూర్వపు బౌద్ధయుగ చిహ్నమయిన ధర్మచక్రము మన జండాపై నెగురుచున్నది. బౌద్ధ జయంతులు జరుపుకొనుచున్నాము. కాని కరుడుకట్టిన మతకాంక్షవలన మనజాతిపితను గోల్పోయినాము.

గతించిన చరిత్రను సింహావలోకనము చేసుకొని జ్ఞానము, భక్తి, కర్మలను త్రికరణములద్వారా సమన్వయము చేసుకొని యాచరించు బుద్ధి భగవానుడగు అపరబౌద్ధుడగు శంకరుడు మనకెల్లరకు ప్రసాదించుగాక.

★

# శంకరాచార్యుడు ప్రచ్ఛన్న బౌద్ధుడేకాదు; ప్రత్యక్ష బౌద్ధుడు

ఆచార్య బోధిభాస్కర

శంకరాచార్యుడు ప్రత్యక్ష బౌద్ధుడేనని నిరూపించడానికి రచయిత పూర్వపక్షం, సిద్ధాంతం (విమర్శ - జవాబు) అను ప్రాచీన తాత్విక చర్చల పద్ధతిలో యీ వ్యాసం రచించారు.

## 1 వ పూర్వపక్షం :

శంకరాచార్యుడు బౌద్ధులనందరినీ సుధన్వరాజు సహాయంతో చిత్రవధ చేయించాడనీ, బౌద్ధమతాన్ని కూకటివ్రేళ్ళతో పెకలించాడనీ అంటారుగదా! మీది చాల విపరీతవాదంగా ఉందే!

## సిద్ధాంతం :

బాధ్యతగల వాళ్లెవ్వరూ ప్రవాదలనుబట్టి నిర్ణయాలకురారు. మీరుచెప్పిన ప్రవాదంఉన్నమాటయథార్థం. అయితే దాని కాధారం 'శంకరవిజయం'లో ఎక్కడా లభించదు. కుమారిలభట్టు జైనులను హింసించాడని మాత్రమే శంకరవిజయంలో వ్రాయబడి ఉంది. కుమారిలభట్టుకీ, శంకరాచార్యుడికీ మూడ్నాల మూషిక సంబంధం తప్ప ఇంకేమీలేదు. కుమారిలభట్టు కర్మకాండను ఆజన్మాంతం జరుపుతూనే ఉండాలనే పూర్వమీమాంసకుడు. శంకరాచార్యుడు కర్మకాండ జీవన్ముక్తి కొకమెట్టుమాత్రమేనని వాదించే ఉత్తర మీమాంసకుడు. శంకర విజయంలోని ప్రధానఘట్టం శంకరాచార్యుడు, కుమారిలభట్టు శిష్యుడైన మండన మిశ్రుడికి ముండనం చేయించటమే నన్నసంగతి గమనించాలి. ఇక శంకరాచార్యుడు బౌద్ధులను చిత్రవధ చేయించలేదనిడానికి రాహుల్ సాంకృత్యాయన వంటి మహాపండితుని అభిప్రాయమే ప్రమాణంనాకు.

## 2 వ పూర్వపక్షం :

శంకరాచార్యుడు క్షణికవాదాన్ని ఖండించాడు కదా ?

## సిద్ధాంతం :

క్షణికవాదాన్ని ఖండించిన శంకరాచార్యుడు జీవితం క్షణభంగురం అనీ, అందుచేత శాశ్వతమైన ఆత్మవస్తువుని దర్శించాలనీ ఉద్బోధించాడు. ఆ క్షణిక వాదమే యీ క్షణభంగురత్వవాదం.

జగత్తులో చిక్కుపడ్డప్పుడు ఆత్మను జీవుడని శంకరుడు వ్యవహరించాడు. (జీవుడు నిత్యుడని రామానుజుడంటాడు కాని శంకరు డంగీకరించడు). "జీవో బ్రహ్మైవనాపరః" అనేది పరమార్థసత్యం మాత్రమే. వ్యవహారంలో భేద మున్నది. వ్యవహారంలో జీవుడు క్షణికుడే. బుద్ధుని అనాత్మవాదానికీ, శంకరుని నిత్యాత్మవాదానికీ పరిభాషలో భేదం తప్ప పరమార్థంలో భేదంలేదు. బుద్ధుడు శిష్యుని యొక్క ప్రాథమికదశలోఉన్న ఆత్మ (శంకరుని భాషలో జీవుడు) అనిత్యమంటే, శంకరుడు జీవన్ముక్త దశలోఆత్మనిత్యమైనం దంటాడు. అవి రెండూ ఒకటే. నిర్వాణం అనిత్యమైనదని బుద్ధుడెక్కడా అనలేదు. అట్లా అంటే సాధనతో పనిలేదు. శంకరుడు జీవో బ్రహ్మైవనాపరః అని వ్యవహారంలో ప్రయోగించలేదు. అట్లా అంటే సాధనతో పనిలేదు. ఇద్దరూ సాధన కావాలన్నారు. ఇద్దరూ సన్యాసమార్గీయులే. మాండూక్య కారికాభాష్యంలో బుద్ధుడిది జ్ఞాన మార్గమేనని శంకరుడు స్పష్టంగా వ్రాశాడు.

## 3 వ పూర్వపక్షం :

శంకరాచార్యు డొకవేళ ప్రచ్ఛన్న బౌద్ధుడని

అంగీకరించినా అంగీకరించవచ్చును గాని, ప్రత్యక్ష బౌద్ధుడే ననడం సాహసం మాత్రమే.

## సిద్ధాంతం :

ప్రచ్ఛన్న బౌద్ధుడని అంగీకరించడానికి మీరు సిద్ధపడ్డప్పుడు ప్రత్యక్షబౌద్ధు డనడానికి సందేహించ నక్కరలేదు. అట్లా వెనకాడటం యుక్తియుక్తం కాదు. ఎందుకంటారా? ప్రచ్ఛన్న బౌద్ధుడనే నింద తాత్త్వికమైన గీటురాయి మూలంగా శంకరాచార్యుడికి వచ్చిపడింది.

వేదోఽనృతో బుద్ధకృతాగమోఽనృతః
ప్రామాణ్యమేతస్య చ తస్యచాఽనృతం
బోద్ధానృతే బుద్ధిఫలే తథానృతే
యూయంచ బౌద్ధాశ్చ సమానసంసదః॥

"మీరు వేదం అబద్ధం. బౌద్ధులకు బుద్ధ ప్రవచన భరితమైన ఆగమం అబద్ధం. మీకు వేదం ప్రమాణం కాదు. వారికి ఆగమం ప్రమాణంకాదు. గురువూ అబద్ధమే, జ్ఞానంవలన లాభమూ సున్న అయినందున మీరూ బౌద్ధులూ ఏకగోత్రీకులే" అని పరాయశ దాస వ్యాసుడనే విశిష్టాద్వైతి నిందించాడు. ఇదీ తాత్త్వికంగా విలువలను కొస్తేరేతి. అంతేగాని, ఇంగ్లీషు చరిత్ర కారులు వ్రాసిపెట్టిన బోడ్డసలనుబట్టికాదు.

## 4 వ పూర్వపక్షం :

వేద ప్రామాణ్యం కస్యచి త్కర్తృవాదః
స్నానే ధర్మేచ్ఛా జాతివాదావలేపః
సంతాపారంభః పాపహానాయ చేతి
ధ్వస్తప్రజ్ఞానాం పంచలింగాని జాడ్యే.
—ఆచార్య ధర్మకీర్తి

"వేదం ప్రమాణం అనటమూ, ఎవడో ఒక కర్త ఉండాలనటమూ, స్నానంచేసినంత మాత్రాన ధర్మ సాధనం జరుగుతుందని ఆశించటం, పుటుకతో ఆధిక్యతను ముడిపెట్టటం, పాప పరిహారార్థం తపస్సులు చేయటం - అనేవి అయిదూ మతిపోయినవాళ్ళకు పట్టిన అయిదుజాడ్యాలు," అని బౌద్ధులు వారిస్తూ ఉండేవారు కదా! మరి శంకరుడు వేదప్రమాణ్యాన్ని స్థాపించాడే!

## సిద్ధాంతం :

దీనికి ప్రధానకారణం పూర్వమీమాంసకులకూ బౌద్ధులకూ జరుగుతున్న సంఘర్షణమే. పూర్వ మీమాంసకులకు పట్టిన జబ్బులే పై చెప్పబడిన అయిదూను. ఈ అయిదింటినీ శంకరాచార్యుడు గర్హించాడు.

భగవద్గీతా కించి దధీతా
గంగాజల లవకణికాపీతా।
సకృదపి యేనమురారి సమర్చా
క్రియతే తస్య యమోపి నచర్చా ॥భజగోవిందం॥

"భగవద్గీత కొంచెం అధ్యయనం చేసినా, స్నాన గంగాజలం ఒక్కబొట్టు ఆస్వాదించినా, శ్రీ మహా విష్ణువు కప్పుడప్పుడైనా నమస్కరించినా - వాణ్ణి యముడుకూడా కన్నెత్తి చూడలేడు" అని గీతా ప్రామాణ్యం బోధించాడు. ఎందుకని అంటే, వేద శిరస్సులైన ఉపనిషత్తు లన్నింటియొక్క సారమే భగవద్గీత గనుక అన్నాడు. వేదమంటే బ్రాహ్మణములు కాదు ఉపనిషత్తులు అన్నాడు. ఉపనిషత్తుల ప్రామాణ్యాన్ని స్థాపించటమే ఆయన దిగ్విజయానికి మూలస్తంభం. దాని ఫలితం పూర్వమీమాంసకుల కోరలు లాగటమే. అంతులేని, అర్థంలేని కర్మకాండలను పెంచుతూ బ్రాహ్మణులే వేదములని బుకాయిస్తూండే పూర్వ మీమాంసకులలో అగ్రగామి యయిన మండనమిశ్రుణ్ణి ముండనం చేయించటంతో ఆ పని సఫలమయింది. వైదికులకూ బౌద్ధులకూ ఉన్న భేదంకాస్తా మాయమయింది. దీనికంతటకీ కారకుడైన శంకరాచార్యుడు ప్రత్యక్ష బౌద్ధుడనటంలో సందేహ మెందుకు?

ఇక ధర్మకీర్తి శ్లోకంలోని రెండవ శ్లోకం "కస్యచిత్కర్తృ వాదః" అనేది. "సృష్టికర్త ఎవడో ఒకడు ఉండిఉండాలి. లేనిదే యిదంతా ఎట్లా తయారయింది?" అని నైయాయికులు వాదిస్తూండేవారు. నైయాయికుల నందరినీ పరాస్తంచేయటమేకదా శంకరాచార్యుడి ప్రజ్ఞ! గౌడపాదకారికలకు శంకరభాష్యం చదవండి. సృష్టి సిద్ధాంతాలన్నీ వట్టి మూర్ఖత్వం అని తేల్చిచెప్పాడు. ఇక శంకర భక్తులమని చెప్పుకునే యిప్పటి బ్రాహ్మణ శబ్దోపజీవులు నిరక్షరకుక్షులు. వాళ్ళనిచూచి మీరు ఖంగారుపడకూడదు. ఈవిధంగా శంకరునికీ బౌద్ధులకూ సృష్టికర్త లేడనేది స్పష్టమే కదా!

ఇక "స్నానే ధర్మేచ్ఛ" అనే జాడ్యం విషయం చూద్దాం. భజగోవింద శ్లోకాల్లో శంకరాచార్యుడి ఎదుట ఆయన శిష్యుడు చెప్పినది యీ శ్లోకం.

కురుతే గంగా సాగరగమనం
వ్రత పరిపాలన మథవా దానం
జ్ఞాన విహీనస్సర్వ మతేన
ముక్తిం నభజతి జన్మశతేన॥

"గంగాస్నానం చేసినా, సముద్రస్నానం చేసినా, వ్రతాలు పట్టినా, దానాలుచేసినా జ్ఞానంలేనిదే ఏమతంలోను మోక్షం లేదు". ఇందులోనూ శంకరాచార్యుడికీ బౌద్ధులకీ ఏమీ తేడాలేదు.

ఇక "జాతివాదావ లేపః" అనే జాడ్యం విషయం చూద్దాం. శంకరాచార్యుడు 'దిగ్విజయానంతరం' నాటి బ్రాహ్మణశబ్ద వాచ్యులకు బుద్ధివచ్చేటట్లుగా కాశీ క్షేత్రంలో మనీషా పంచకం చెప్పాడు. ఒక చండాలుని దూరంగా పొమ్మన్నమీదట ఆ చండాలుడు "కోఽయం విభేదః భ్రమః?" అని అడిగాడట. అప్పుడు శంకరుడు ఆతనికాళ్ళమీద పడి జాతిభేద విషయంలో తనమతాన్ని చాటాడు. "చండాలోస్తు సతుద్విజోస్తుగురురిత్యేషా మనీషామమ" అనే మకుటంతో అయిదు నిర్వచనా లిచ్చాడు. వీటినే సాధన పంచకం అని కూడా మేం అంటాం. "చండాలుడైనా సరే ద్విజుడైనా సరే నాకు గురువేనని భావిస్తాను" అని వాటితాత్పర్యం. మహానాబ్రాహ్మణులు శంకరాచార్యుణ్ణి నడిగుడ్డలతో గొంతుపిసికి చంపివేశారని ఒకప్రతీతి ఉంది. 32 ఏళ్ళకు అకారణంగా మృత్యువాత పడ్డాడేమని అడిగితే శంకర విజయకర్తలు శివుడైక్యమైపోయినాడు పొమ్మని బుకాయించారు. ఇది సర్వాబద్ధం. ఆయన ముఖ్యానుచరులే ఆయన్ని చంపేసి ఉండాలి. ఆ చంపటానికి కారణం ఈ మనీషాపంచక ప్రవచనమే అయిఉండాలి. ఒకవేళ యిది నిజమయినా కాకపోయినా మనీషాపంచకం శంకరుడు చెప్పాడన్నది నిజమే. అందువలన బౌద్ధులకూ శంకరునికీ ఇందులోనూ భేదంలేదు.

ఇక "సంతాపారంభః పాపహానాయ" అనే జాడ్యం సంగతి. పాపపరిహారం కొరకు తపస్సు చేయడం ఒక జబ్బు అన్నాడు బుద్ధుడు. శంకరుడేమన్నాడో చూడండి. సర్వకర్మలూ ప్రారబ్ధం, సంచితం, ఆగామి అని మూడురకాలన్నాడు. ఇందులో ప్రారబ్ధం అనుభవించక తప్పదన్నాడు. సంచితం జయించగలిగితే ఆగామికర్మపోతుందన్నాడు. అంటే చేసిన పాపానికి పరిహారంలేదనే బౌద్ధులవాదం శంకరుని కంగీకారమేకదా!

## 5 వ పూర్వపక్షం:

మీరు కేవలం యుక్తివాదం చేస్తున్నారు. శంకరుడు తన నోటితో బుద్ధుణ్ణి ఎక్కడైనా ప్రశంసించాడా? బుద్ధుని మతమే తన మతమని చెప్పాడా?

## సిద్ధాంతం:

శృతి, యుక్తి, అనుభవం అనేవి మూడూ అనివార్యమైన ప్రమాణాలు. ఇవి అందరికీ సమ్మతమైనవే. అందుచేత యుక్తివాదం నిషిద్ధంకాదు. ఇక నా యుక్తి శృతికి విరుద్ధంగా ఉంటే త్రోసేయవలసిందే. కాని శృతికూడా ఆయన ప్రచ్ఛన్న బౌద్ధుడనే కదా! శృతి అంటే వేదం అన్న అర్థంలో అయితే నాటి బ్రాహ్మణులు చెప్పే కర్మకాండలు వేదం కావుగదా, శంకరుని దృష్టిలో. ఇక అనుభవంలో శంకరునికీ, బుద్ధునికీ వేషభాషల్లో కాని, బిరుదలాంఛనాల్లో కాని తేడాలేదని అందరికీ తెలిసిందే. ఇరువురూ ముండకులే. ఇరువురూ కాషాయాంబరధారులే. ఇద్దరూ భగవాన్ బిరుదధారులే. ఇరువురూ బ్రాహ్మణులే. ఇరువురూ స్త్రీలకు సన్యాసమిచ్చారు.

శంకరుడు తన భాష్యంలో ఎక్కడ బుద్ధుని ప్రసక్తి వచ్చినా భగవాన్ బుద్ధ అని తప్ప వ్రాయలేదు. అంతేకాదు. బుద్ధుని శంకరుడు స్తోత్రంచేశాడు:

ధరాబద్ధ పద్మాసన స్థాంఘ్రి యష్టిః
నియమ్యానిలం న్యస్తనాసాగ్ర దృష్టిః
య ఆస్తే కలేయోగినాం చక్రవర్తీ
సబుద్ధః ప్రబుద్ధోఽస్తు మచ్చిత్తవర్తీ॥

"పద్మాసనంలో పాదములను బిగించి ప్రాణాయామం చేస్తూ నాసాగ్రదృష్టితో కూర్చున్నటువంటి కలియుగ యోగులందరికీ చక్రవర్తియైన ఆ బుద్ధుడు ప్రబుద్ధుడు నా చిత్తమున నిలచుగాక!"

ఇంతకంటె బుద్ధునిపట్ల భక్తి శ్రద్ధలకు తార్కాణం ఏమికావాలి? బుద్ధుని మతమే నా మతమని వేరే అననక్కర్లేదు. శంకరునిది అద్వైతమతమని అందరూ అంగీకరిస్తారు. కాని ఆ అద్వైతమతమును స్థాపించిన వాడు ఆయన కాదు. బుద్ధుడు.

షడభిజ్ఞోదశబలో <u>అద్వయవాదీ</u> వినాయకః — అమరకోశం. బుద్ధునికి అద్వైతి అనే బిరుదు ఉందని అమరకోశం చెబుతున్నది. అమరసింహుణ్ణి ప్రామాణికుడుగా శంకరాచార్య డామోదించాడని కామకోటి పీఠాధిపతి ఇటీవలనే ఉపన్యసించినట్లు 'హిందూ'

పత్రికలో పడ్డది. బుద్ధుడు అద్వైత మతస్థాపనాచార్యుడు; శంకరుడు అద్వైతమత పునరుద్ధారకుడు. నా కులగురువు జగద్గురు శంకర భగవత్పాదులే!

## 6 వ పూర్వపక్షం :

బుద్ధుణ్ణి నాస్తికుడని బ్రాహ్మణులంతా చెపుతూంటే మీరెన్ని చెప్పినా వితండవాదమనే అనిపిస్తుంది. దీనికి మీరేమంటారు?

## సిద్ధాంతం :

నాస్తిక మతస్థాపకుడు బృహస్పతికాని బుద్ధుడు కాదని వేదాంత పంచదశి చెపుతుంది. బృహస్పతి దేవపురోహితుడు. పురోహితులే నాస్తికులు. కాని బుద్ధుడుకాడు. అసలు పురోహితులు బ్రాహ్మణులు కారని భగవద్గీత ఉద్ఘోషిస్తున్నది.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః"
కామాత్మానస్స్వర్గ పరా జన్మ కర్మ ఫలప్రదాం
క్రియా విశేష బహులాం భోగైశ్వర్య గతిం ప్రతి॥

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసా
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే॥
శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధావచలా బుద్ధి స్తదాపి శ మనుపశ్యతి॥

యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥
దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగాద్ధనంజయ
బుద్ధేశరణం గచ్ఛ కృపణాః ఫలహేతవః॥

కనుక బుద్ధుణ్ని నాస్తికుడనే పురోహితులు బ్రాహ్మణులుకారు! రారిక వాదులబంట్లని బుద్ధుడు నిందించాడు ఈ రాజపురోహితులను.

## 7 వ పూర్వపక్షం :

మీరు మాటలనుబట్టి ఊగులాడుతున్నారు. పురోహితులు బ్రాహ్మణులని లోకులంటున్నారు. వారు చెప్పేమతం హిందూమతం అనీ, దానికి బౌద్ధమతం వ్యతిరేకమనీ మేధావులంతా అంటున్నారు. కనుక మీరు చెప్పేవాదం నిలవదు.

## సిద్ధాంతం :

నా వాదం నిలవటమూ, నిలవకపోవటమూ అనేది శ్రోతల దృక్పథంమీద ఆధారపడియుంటుంది. శ్రోతలకు సంఘాన్ని చారిత్రక పునాదులమీద పునర్నిర్మించాలని ఉంటే, నా వాదాన్ని శ్రద్ధగా పరిశీలించవలసి యుంటుంది.

పురోహితుల తప్పుడు సిద్ధాంతాల ఆచరణను బ్రాహ్మణుల కంటగట్టి పురోహితులను బ్రాహ్మణులని పిలవటం న్యాయంకాదు. పురోహితమతం బ్రాహ్మణమతంకాదు. పురోహితులు భట్టారకులు. రాజా భట్టారకో దేవః అని అమరకోశకారుని వచనం. భట్టారకులు బ్రాహ్మణులు కారు.

పౌరోహిత్యం రజనిచరితం
గ్రామణిత్వం నియోగో
మాఠాపత్యం త్వనృతవచనం
సాక్షివాదః పరాన్నః।

బ్రహ్మద్వేషః ఖలజనరతిః
ప్రాణినాం నిర్దయత్వం
మాభూత్ దేవో మమ పశుపతే
జన్మ జన్మాంతరేషు॥

అని బ్రాహ్మణుడు నిరంతరం ప్రార్థిస్తూవుంటాడు. హిందూమతం అనేది ఏదీ అసలు లేనేలేదు. శృతి స్మృతి పురాణాల్లో కానీ, శంకర రామానుజ మధ్వ భాష్యాల్లో కాని' న్యాయ వైశేషిక సాంఖ్యాది షడ్దర్శన గ్రంథాల్లో కాని, వ్యాఖ్యానాల్లో గాని ఎక్కడా హిందూమతం అనే పేరులేదు. గ్రీకులు సింధు శబ్దం నోరు తిరక్క "ఇందుస్" అని వాళ్ళపుస్తకాల్లో వ్రాసుకొంటే, అరబ్బులు, యూరోపియన్లు ఆ పుస్తకాలే చదువుకొని మనమీద దండెత్తివచ్చి పరిపాలకులై మనకు బొడ్డుకోసి పేరుపెట్టారు, "హిందువులు" అని. 800 సంవత్సరాల విదేశ దాస్యంవలన మన స్వరూపం మనకు తెలియకుండాపోయి, మనం యీనాడు "హిందువుల"మనీ, "హిందూదేశం" అనీ చెప్పుకొనే దుస్థితికి దిగజారిపోయినాం. "హిందూ" అంటే "దొంగ" అని అరబ్బీ నిఘంటువులో వ్రాసుకున్నారట. అది చూచి అయినా సిగ్గుతెచ్చుకోవాలి మనం. 7 వ శతాబ్దంలో ఇత్సింగ్ అను చైనా రాయబారి ఇండియాకు వచ్చాడు. అతడు మన దేశానికి విదేశాల్లో "ఇండ్" అనే పేరు వ్యవహారంలో ఉందనీ, యీ దేశంలో మాత్ర మలాంటి దెక్కడా లేదనీ వ్రాశాడు. నెహ్రూ తన "డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో యీ విషయాన్ని ఎత్తిచూపాడు. కనుక "హిందూదేశం" అనే పేరు,

"హిందూమతం" అనేపేరు మనవి కావనుకుంటే సగంబాధ వదులుతుంది. ఎందుకంటే, అప్పుడే మనం లేబుల్స్‌ను లక్ష్యం చేయడం మాని తాత్విక విలువల వైపు మొగ్గుతాం.

ఇక మేధావులు హిందూమతం, బౌద్ధమతం వేరు వేరు అనటంసంగతి. మేధావులు వర్గములుగా ఏర్పడి వుంటారు. వారు పరాన్నభుక్కులు; ఎవరినో ఒకరిని ఆశ్రయించి ఉంటారు. మేధావులలో సామ్రాజ్య దాస్య వర్గం ఒకటి. పురోహితవర్గం రెండవది. బ్రాహ్మణ ద్వేషులది ఒక వర్గం. మార్క్స్ వర్గం మరొకటి. ఇట్లా మేధావులు రకరకాలుగా ఉంటారు. వాళ్ళవాళ్ళ ఆశయాలనుబట్టి వాళ్ళ వ్రాతలుంటాయి. చారిత్రక పురోగతి వాదం చేబట్టేవాళ్ళకు మాత్రమే నా వాదం నచ్చుతుంది. అయినా, నిలబడదంటారా? అవును! అవకాశవాదం ఒక్కటే నిలబడుతుంది!

## 8 వ పూర్వపక్షం :

మీరు మతద్వేషంతో మాట్లాడుతున్నట్లు తోస్తుంది. ఇది అభివృద్ధి నిరోధకమయిన పంథా అవుతుంది.

## సిద్ధాంతం :

అద్వైతమతం అంటే ద్వేషం పెట్టుకొన్న వాళ్ళు మాత్రమే యీ అపనిందకు దిగుతారు. మొగుణ్ణి కొట్టి మొఱ్ఱో అన్నట్లుగా ఉంటుంది యిది. అయినా, పురోహితుల కులద్వేషాలకన్న మతభేదాలే మెరుగంటాను. ఎందుకంటే సిద్ధాంత చర్చల్లో వ్యక్తిద్వేషాలకు తావులేదు. కులద్వేషాలూ, పార్టీద్వేషాలూ వ్యక్తిదూషణలకు, వ్యక్తిహత్యలకూ దారితీస్తయి. "సిద్ధాంత ద్వేషాలు" అనే మాటయే తప్పు. సిద్ధాంతభేదాలు అని మాత్రమే వ్యవహరించాలి. మతమంటే సిద్ధాంతబద్ధమైన అభిప్రాయమన్నమాట. మతభేదాలు సిద్ధాంత పరిశీలనకు త్రోవదీస్తయి. కులద్వేషాలు సంఘవిచ్ఛిన్నతకు దారితీస్తయి. సిద్ధాంత చర్చలు, మతభేదాలు లేకుండా ఏపార్టీ అయినా పురోగమించ గలుగుతుందా? అయితే మీరన్నట్లు మతభేదాలు సంఘవిచ్ఛిన్నతకు దారితీయకుండా జాగ్రత్త వహించాలిసిన మాట నిజం. ఇది ప్రజాతంత్రానికి మూలసూత్రం.

ఇక నాకు మతద్వేషం ఉన్నదన్న ఆక్షేపణ తీసుకొనే అద్వైతికి మత సమన్వయ దృష్టి తప్ప మతద్వేషం ఉండటానికి ఆస్కారంలేదు. అది చెప్పి విమర్శనాత్మక వైఖరిని విడచిపెట్టి అంధప్రాయంగా అన్నీ రైటేననటం వెట్టివేదాంతంకాని, అసలు వేదాంతంకాదు. శివుడూ, విష్ణువూ, వినాయకుడూ, దుర్గ, సూర్యుడు పేర్లతో ముఠాలుపడి మేధావులందరూ కొట్టుకుచస్తూ కులద్వేషాలను తెచ్చిపెట్టుకొంటే శంకరుడు పంచాయతన పూజను నెలకొల్పి మేధావులలో ఐకమత్యాన్ని చేకూర్చాడు. వివిధ ప్రాంతీయులకు భోజనాలు, వివాహాదులు, నిషేధించి ఏలేశ్వరోపాధ్యాయుడనే పురోహితుడు నాడు భేదాలు తెచ్చిపెట్టి మేధావులలోని ఐక్యతను విచ్ఛిన్నం చేశాడు. ఇది పురోహిత మతంలో జీర్ణించిపోయిన జబ్బు. ఈ జబ్బుతాలూకు సూక్ష్మజీవులు మనందరి రక్తంలోనికెళ్ళి కణాలకంటె ఎక్కువై నాడువ్యాధిగ్రస్తులను జేసేసింది. ఈనాడుభేద వ్యాధికి మందు సూచిస్తున్నాను నేను. అంతే. నాకు మతద్వేషం ఉండటానికి ఆస్కారమేలేదు.

## 9 వ పూర్వపక్షం :

శంకరునిది శైవమతంకాదా? బౌద్ధమతానికీ దానికీ పొత్తే లేదుకదా! మీరు శంకరుడు ప్రత్యక్ష బౌద్ధుడనుట సాహసం కాదా:

## సిద్ధాంతం :

శంకరునిది శైవమతమంటున్నారు. మీ హిందూమతం ఏమైంది? కాని మంచిదే. వాదనకోసమైనా హిందూమతం అనే పేరు వదలివేశారు. సరేకాని, శైవమతం వైష్ణవమతం వేరుగా భావించి, ఒకరిముఖా లొకరు చూచుకొన్నా సచేలస్నానం చేయాలని నేటికి కూడా నమ్మే బ్రాహ్మణ శబ్దవాచ్యులున్నారని మీకు తెలుసా? అయినా అవి రెండూ కలిపి హిందూమతమని చరిత్రకారులు వ్యవహరిస్తున్నారా లేదా? అట్లాగే బౌద్ధమతం, శైవమతం వేరనుకొనేవాళ్ళు ఉన్నా, వివేకవంతులైన చరిత్రకారులు అవి రెండూ వేర్వేరు అని ప్రచారం చేయకూడదు.

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్యహృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః ॥

అనే ఉపదేశం శంకరాచార్యులవారిదే. ఒక విష్ణువు దశావతారా లెత్తాడనేది జగద్విదితమే కదా! అందులో కలియుగానికి బుద్ధావతారమే శరణ్యమని పురాణ సంప్రదాయం చెబుతూంది.

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధశ్చ కల్కి రేవచ ॥

ఈ పదీ విష్ణువుయొక్క అవతారములే. అందులో మనమున్న కలియుగంలో బుద్ధావతారమే శరణ్యం. పురోహితులు దీన్ని మధ్యపెట్టి కృష్ణుణ్ణి అవతారమని బుకాయిస్తున్నారు. కృష్ణుడు సాక్షాత్తు శ్రీ మహావిష్ణువేకాని అవతారంకాదు. "విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః" అని నామలింగానుశాసనం.

ఈవిధంగా బుద్ధుడూ శివుడూ విష్ణువూ ఒక పరమాత్మకే వివిధ నామములని తేలిపోయినప్పుడు బౌద్ధమతం ఎలా వేరవుతుంది? శంకరుడు శివమతస్థుడే. నిజమే. అయితే అసలు శివమతం ఎక్కడనుంచి ఊడిపడ్డది? దానికి వేదప్రాముఖ్యం లేదే! ఇక్కడ మరొక విషయంగుర్తుంచుకోవాలి. బుద్ధుడుశివవిద్య తనకు తెలుసునని బ్రహ్మజాతసూత్రంలో చెప్పాడు. బుద్ధుని శిష్యసంఘం కాలక్రమేణా ఏన్నో చీలికలైన విషయం అందరూ ఎరిగిందే. ఆ చీలికలలో కెల్లా ముఖ్యమైనవి సిద్ధయానం, మహాయానం, మంత్రయానం, వజ్రయానం అని పిలువబడతాయి. మహాయానులచే సిద్ధయానం హీనయానమని నిందింపబడింది. సిద్ధయానమే శివమతంగా వ్యవహారంలోకి వచ్చింది. సిద్ధిపొందినవాడే శివుడని సిద్ధాంతం. అందుకనే "ఓం నమశ్శివాయ సిద్ధం నమః" అని అక్షరాభ్యాసంనాడే దిద్దిపెట్టటం. ఈ విధంగా మతరీత్యాను, తాత్వికంగాను కూడా శైవమతం బుద్ధ సంఘంలోని ఒక చీలికయే తప్ప వేరుమతం కానేకాదు. అందువలననే కాశీ, కార్లా, నాగార్జునకొండ, బుద్ధగయ మొదలైన బౌద్ధక్షేత్రాలన్నీ శంకరమతం అధీనంలో ఉండటం. ఈనాటికీ శంకర మతస్థులు వేనవేలు శివరాత్రినాడు కార్లా గుహలలోని చైత్యానికి పోయి అక్కడి బుద్ధస్తూపానికి నమస్కారం చేసివస్తారని యిటీవల 'హిందూ'పత్రికలో ఒకప్రత్యేక వ్యాసంలో పేర్కొనబడింది. అయితే చరిత్రకారుల మేధలో ఒక తప్పుడు మెలిక ఉంది. వారందరూ అది బుద్ధుని స్తూపమని తెలియకనే పూజిస్తున్నారని వాళ్ళ ఉద్దేశం. కాని యిది వట్టి పండితమూర్ఖత్వం. బుద్ధస్తూపమే శివలింగాకారం. పానువట్టం స్తూపమే. శివలింగం స్తూపంపైనున్న ఆయకస్తూపం. ఆరుబయట స్తూపనిర్మాణంకంటె ఆలయ ప్రాకారంలో దాన్ని ఉంచడం శ్రేయస్కరమని ఈ సిద్ధయానంవాళ్ళ అభిప్రాయం. అందుచేతనే బౌద్ధారామాలు శైవారామాలుగా పిలువబడ్డాయి. శైవారామాల్లో శివాలయాలు నిర్మింపబడ్డాయి. ఈ ఆలయాలు బౌద్ధగుహల అనుకరణమాత్రమేనని చరిత్ర పరిశోధకులందరికీ తెలుసు. కనుక శైవమతం, బౌద్ధమతం, వైష్ణవమతం వేర్వేరుఅనేభావం నిరాధారం. అసలు మహాదేవుడనేవాడు ఆంధ్రలో అమరావతిని కేంద్రంగా చేసికొని బౌద్ధధర్మాన్ని ప్రచారం చేసిన సిద్ధుడు, బౌద్ధభిక్షువు.

## 10 వ పూర్వపక్షం :

అయితే బౌద్ధులలోని వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు అని నాలుగు విభాగాలుగా పేర్కొనబడుతోందే భాష్యాలలో! వాటిని ఖండించారే శంకరభగవత్పాదులు! దానికేమంటారు మీరు?

## సిద్ధాంతం :

అవును. ఈ నాలుగు మతభేదాలను శంకరాచార్యుడు ఖండించినమాట నిజమే. అయితే విమర్శించినంతమాత్రాన మహమ్మదీయమతం లాగా వేరైపోతుందా? ఆ నలుగురూ ఒకరినొకరు విమర్శించుకోలేదా? అయినా ఆ నలుగురినీ బౌద్ధశాఖలని అంటున్నారేం? అల్లాగే శంకరుడుకూడా మరోశాఖకు చెందినవాడేగాని అన్యమతస్థుడుకాడు.

## 11 వ పూర్వపక్షం :

బుద్ధుడు వేదములను అప్రమాణం అన్నాడాలేదా? అయినప్పుడు వైదిక మతస్థుడైన శంకరుడూ, వేదవిరుద్ధుడైన బుద్ధుడూ ఒకే మతంలోని వారనటంఎలా?

## సిద్ధాంతం:

వేదములంటే ఏవి? మంత్రసంహితలే వేదములని ఆర్యసమాజం అంటుంది. బ్రాహ్మణములే వేదములని భట్టారక పురోహితు లంటారు. ఉపనిషత్తులే వేదములని వేదాంతు లంటారు. ఈ విషయం మీకు తెలుసా? తెలియదు. తెలుసుకోవాలని ఉందా? లేదు. ఎందుకని? ఆవడి సోషలిజం మంచిదా, కాలడి సోషలిజం మంచిదా - అని చర్చించడానికే సరిపోతున్నది మీ కాలం. మీ ప్రాచీన చరిత్రని, తత్వశాస్త్రాన్ని తెలుసుకోడానికి తీరికలేదు. ఇప్పుడు తెలుసుకుంటాం అంటున్నారు. బాగుంది. కాని పాత

వాసనలను వదిలిపెట్టితేగాని విషయం అవగతం కాదు. మన చరిత్ర, మన తత్వశాస్త్రం అనేవి రెండు పాల కడవలు. ఆ రెంటినీ సామ్రాజ్యవాద చరిత్రకారులు రెండు క్లోరోఫారం బొట్లు పడవేశారు. ఆ పాలను తాగుతుంటే మైకంగమ్ముతుందే కాని వివేకం పెరగదు. ఆ సామ్రాజ్యవాదులు హిందూ మతం, బౌద్ధమతం అని బొమ్మకోసి రెండుపేళ్ల పెట్టి ఆసియా సమైక్యతకు అడ్డుగోడలు నిర్మించారు. వాస్తవానికి హిందూమతం లేదు బౌద్ధమతం లేదు. ఒకటే మతం. అది తత్త్వం. తత్ అంటే అది; త్వం అంటే నీవు. "అది ఏమిటి నీవు ఏమిటి?" అనే విచారణయే ఉన్నది. అంటే ఆ కనబడేదంతా ఏమిటి? నీవు ఏమిటి? అనే విచారణ అన్నమాట. ఆ విచారణలో అనేక మేధావులు అనేక మతాలు అంటే అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఆ అభిప్రాయాలు పరస్పరాశ్రయం కలవి. "తార్కిక గతికి" పూర్వపక్షం, సిద్ధాంతం, సమన్వయం అని మూడు అభిప్రాయాలు ఆధారం. అంతేకాని క్రిస్టియన్ చరిత్రకారుల మతాకోరీవాదాలు, పరస్పర హత్యాబుద్ధీ ఆధారం కాదు. సామ్రాజ్యవాదుల విభజించి పాలించే నీతిసూత్రాలు కాదు ఆధారం. తత్వవిచారణ ఒక అవిచ్ఛిన్న స్రోతంలా ప్రవహిస్తూంటుంది. ఎప్పటికప్పుడు పూర్వపక్ష సిద్ధాంతాల సమన్వయం చేసుకుంటూ సమాజం ముందుకుపోవాలి. అంతేకాని పూర్వపక్షం ఒక పార్టీగా, సిద్ధాంతం ఒకపార్టీగా భావించి ముఠాలు కట్టి వీరవైష్ణవం వీరశైవంలాగా కొట్టుకోగూడదు. ఈసత్యాన్ని విస్మరించినందువల్లనే మన దేశపు మేధావుల్లో ఇన్ని కులాలు ఏర్పడ్డాయి. కులం అంటే సమూహం అని అర్థం. అంటే పార్టీ అన్నమాటే! పార్టీకక్షలు ప్రగతికి ఆటంకమేకాని దోహదంచేయవు.

ఇక బుద్ధుడు వేద విరోధియని మీ కెవరు చెప్పారు; 5 వ తరగతి పుస్తకమా? లేక ఎం. ఏ. హిస్టరీ ప్రొఫెసరా? లేక మీ పురోహితుడా? అవి ఒకదానికొకటి కాపీలు మాత్రమే. చిన్నప్పటినుండీ యీ విధంగా ద్వేషాలు నూరిపోస్తూంటే మీకలా అనుపించటంలో ఆశ్చర్యంలేదు. బుద్ధుడు వైదిక ఋషులైన అష్టక వామక వాసుదేవ విశ్వామిత్ర అంగిరస భరద్వాజ కశ్యప భృగువులను శిరోధార్యులన్నాడు. సమకాలీన పురోహితులను రాజరికవాదుల బంట్లని నిందించాడు. సర్వజ్ఞుడనాలా? లేక త్రైవిద్యుడనాలా? అని సూటిగా అడిగితే నన్ను త్రైవిద్యుడనే అనమన్నాడు. త్రైవిద్యుడంటే వైదికుడనే అర్థం. సంస్కృతభాషలోని పర్యాయపదాలన్నీ పార్టీలుగా మారిపోతే మన దేశానికి నిష్కృతిలేదు. ఆవడి సోషలిజం రాదు. కాలడి సోషలిజం రాదు. ఇది నా సౌజన్యపూర్వకమైన హెచ్చరిక. బుద్ధుడు తానొక స్వంతమతం స్థాపిస్తున్నానని అనలేదు. తాను చెప్పేది ఆర్యమతం అన్నాడు. సనాతనధర్మం అన్నాడు. ఇవి విస్మరించరాని సత్యాలు. మరో దుస్థితి విశేషం ఏమిటంటే ఆయన యోగమార్గ స్థాపకుడు. యోగమార్గం అన్నా, ధ్యానమార్గం అన్నా పర్యాయపదాలే. యోగమార్గానికి పతంజలి సూత్రకారుడే కాని, స్థాపకుడు గాడు. ధ్యానమార్గానికి గీతాప్రమాణం ఉన్నది. ఉండటమే కాదు. అది సర్వోత్కృష్ట మార్గమని ఉద్ఘాటిస్తున్నది.

"శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే" - భక్తియోగం.

బుద్ధునికి ధ్యానబుద్ధ అనేది జగమెరిగిన బిరుదు. ధ్యానమార్గం చైనాలో ఛాన్ మార్గం అయింది. జపాన్‌లో జెన్ మార్గం అనబడుతున్న ధ్యానమార్గం వేద సమ్మతమయిందేకాని, వేద విరుద్ధంకాదు. అయితే కర్మ, జ్ఞాన, భక్తిమార్గాలు పనికిరావా అంటే అవి ధ్యానానికి అంగాలేకాని అవి స్వతంత్రమార్గాలు కావు. అందుకొరకే బుద్ధుడు అష్టాంగమార్గం స్థాపించాడు. అష్టాంగమార్గానికి ధ్యానమే మకుటం. అందులో కర్మ జ్ఞాన భక్తులు మూడూ అంగాలుగా పేర్కొనబడిఉన్నాయి.

కనుక బుద్ధుడూ వైదికుడే. శంకరుడూ బౌద్ధుడే. బుద్ధుడు మొదటి వేదాంతి. శంకరుడు రెండవ వేదాంతి. బుద్ధుడూ బౌద్ధుడే. శంకరుడూ బౌద్ధుడే. ఈ సమన్వయ భావంతో పనిచేస్తేనే మన కేదైనా నిష్కృతి. ఇది నా నిశ్చిత మతం.

## 12 వ పూర్వపక్షం :

మీ మతం ప్రకారం దేశంలోని మూఢమతాచారాలన్నీ సమంజసమని ఒప్పుకోవాలిసొస్తుంది. మతవాదుల చేతుల్లో దేశపురోగతి సాధ్యమా? అని సందేహం.

## సిద్ధాంతం :

మతాచారాలేవీ మూఢంకాదు. మన చరిత్ర అంతా ఆ మతాచారాల్లో వ్రాయబడి ఉంది. చారిత్రక

గ్రంధాలులేనిలోటు ఇవి తీరుస్తాయి. అవి ముందు ముందుకూడా ఆచరించాలా? అంటే అక్కరలేదు. ఎందుకంటే ఇప్పుడు చరిత్ర రచన, అధ్యయనం అలవాటైంది కదా! అయినప్పటికీ నేటి రాజకీయ పార్టీలుగూడా కొన్ని ఆచారాలను పాటిస్తూనే ఉన్నవి. ప్రభలు గట్టటం, ఊరేగింపులు, ముగ్గులు ఉపయోగిస్తూనే ఉన్నవి కదా! ఈ రకమయిన ప్రచారసాధనాలు దేశంలో నిరక్షరాస్యులు ఉన్నంత కాలం వద్దన్నా పోవు. నిరక్షరాస్యతా నిర్మూలనం ఒక్కటే మతాచారాల నిర్మూలనానికి త్రోవ. ప్రతి దేశమూ స్వాతంత్ర్యసాధన తరువాత నిరక్షరాస్యతా నిర్మూలనానికి పూనుకుంటే మనదేశంలో వోట్ల సీజనులోతప్ప ప్రజలదగ్గరకు రానక్కరలేదని సరి పెట్టుకోవటం జరుగుతున్నది. ఇది యెలా సంభవ మయింది? అయినా యీ ప్రశ్నతో నాకంత సంబంధంలేదు.

## 13 వ పూర్వపక్షం :

బుద్ధుడికీ, శంకరుడికీ మధ్య 1200 సంవత్సరాల అంతరం వుండే, యీ యిద్దరిదీ ఒకటే మతం అనడం ఏలా పొసగుతుంది?

## సిద్ధాంతం :

బుద్ధుడు స్తూపారాధనకు నాందీప్రస్తావన చేశాడు. ఆయన అనుచరులు జాతక కథలద్వారా అవతారాల సిద్ధాంతం ప్రవేశపెట్టారు. కనిష్కుడు గుహాలయాలను, బుద్ధవిగ్రహ స్థాపన చేశాడు. గుప్తరాజులు 33 కోట్ల దేవతలకు రూపకల్పన చేయించారు. అజంతా, ఎల్లో రాలు పక్క పక్కనే విలసిల్లినాయి. ఇక్ష్వాకులు' విష్ణుకుండినులు, చాళుక్యులు, చోళులు, విజయనగరం రాజులు విష్ణ్వాలయాలను, శివాలయాలను పెంపొం దించారు. అవి విద్యాలయాలుగా ఉపయోగపడ్డాయి. అందుచేత ఆ సంస్థల పోషణ అనివార్యమయింది. ఆగమశాస్త్రం వేదంకంటె ప్రధానమయింది. పురాణ సంప్రదాయం దశావతార సిద్ధాంతం మన మతానికి పట్టుకొమ్మయింది. పునర్జన్మ సిద్ధాంతం వేదంలో, మంత్రసంహితల్లో లేదు. బుద్ధుడు పునర్జన్మ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అదికూడా మన మతంలో ఒక అంతర్భాగమయింది. వీటన్నిటినీ శంకరుడు సమర్థించాడు. వీటన్నింటికి బుద్ధుడు స్థాపకుడయితే శంకరుడు సమర్థకుడు. కాగా శంకరుని పాత్ర ఏమి టంటే కుమారిలభట్టు నాయకత్వాన ఆర్యావర్తంలో తిరిగి తలయెత్తసాగిన పురోహిత వాదాన్ని అరికట్టి బుద్ధుని వేదాంతమతాన్ని కొనసాగించటమే.

## 14 వ పూర్వపక్షం :

పునర్జన్మ సిద్ధాంతాన్ని బుద్ధుడు స్థాపించాడంటు న్నారు. ఉపనిషత్తుల్లో కూడా జన్మవాదం ఉన్నది కదా. ఉపనిషత్తులు బుద్ధుడికంటె ముందువి కాదా?

## సిద్ధాంతం :

ఉపనిషత్తుల మొత్తంసంఖ్య 1128 అని ముక్తకోప నిషత్తులో రాముడు హనుమంతునికి చెప్పినట్లుగా వ్రాయబడి వున్నది. శంకరాచార్యుడి నాటికి 16 ఉపనిషత్తులు మాత్రమే ప్రసిద్ధమైనవి. అందులోను 10 ఉపనిషత్తులకు మాత్రమే ప్రాచీనత వుంది. అవియైనా బుద్ధుడికి ముందే ఉన్నవనడానికి హిందూ మతం గొప్పదనే భ్రాంతివలన జన్యాభిమానమే ఆధారం. త్రిపిటకములలో ఛందోగ, ఛందావా, ఐతరేయ, తైత్తిరీయ బ్రాహ్మణులనబడేవారి శిష్యులు బుద్ధుని దగ్గరకు పరిష్కారానికి వచ్చినట్లు పేర్కొన బడింది. ఆ బ్రాహ్మణులు వ్రాసినవే బ్రాహ్మణములు. వాటినే బుద్ధభగవానుడు నిశితంగా ఖండించాడు. అందుచేత ఉపనిషత్తులన్నీ బుద్ధభగవానుని తర్వాతివే గాని ముందుకాలానివి కాజాలవు. అంతేగాక ఉపనిషత్తులలో బ్రాహ్మణులు క్షత్రియులవద్దకువచ్చి నేర్చుకొన్నట్లు పేర్కొనబడింది. బుద్ధునికి ముంద బ్రాహ్మణులపై తిరుగుబాటుచేసిన క్షత్రియుడు లేడ సుప్రసిద్ధం. కనుక ఉపనిషత్తులు బుద్ధుని తరవాత గాని ముందువికావు. అదీగాక ఉపనిషత్తులు పుట్టి తరవాత వ్యాసుడు, శంకరుడువంటి మహామేధావు గూడా అగస్త్యభ్రాతలై పోయినారు. ఎవరి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. వేద వ్యాఖ్యాతలుగా పేరుపొందారు. అందుచేత బుద్ధుడుకూడా ఉప పత్తుల తరువాతివాడైతే బుద్ధునికి స్వతంత్ర జగ ద్గురుత్వం సాధ్యమయేదికాదు. కనుకనే పునర్జన్మ సిద్ధాంతం స్థాపించినవాడు బుద్ధుడేనని నేనంటాను.

## 15 వ పూర్వపక్షం :

అయితే యిన్నాళ్లూ బుద్ధుడు అభ్యుదయవాది అని మేం అనుకొంటున్నాం. ఇప్పుడు మీ వాదాన్ని బట్టి పునర్జన్మ సిద్ధాంతాన్ని స్థాపించినవాడే బుద్ధుడయితే బుద్ధునివలన మన కొఱిగేదేమీ లేదనుకోవలసివస్తుంది. పునర్జన్మసిద్ధాంతం భారతీయుల పతనానికి కారణ

మయిందనే విషయంలో రెండభిప్రాయాల కాస్కారం లేదుగదా!

## సిద్ధాంతం :

ఐన్‌స్టీన్ యొక్క రెలిటివిటీ సిద్ధాంతం మూలంగానే అమెరికా యీనాడు పిచ్చెక్కిన కుక్కవలె ప్రవర్తిస్తూంది. దానికదే సర్వనాశ హేతువు. ఆ దోషం అమెరికాది కాని, ఐన్‌స్టీన్‌ది కాదే. అట్లాగే పునర్జన్మసిద్ధాంతం స్థాపించిన బుద్ధుడిదికాదు దోషం. దాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నించకుండా గుడ్డిగా వల్లెవేయటం మన దోషం. పునర్జన్మసిద్ధాంతం బుద్ధుని ప్రత్యేక సిద్ధాంతం. అదే జాతక కథల కూర్పుకు దోహదంచేసింది. జాతక కథలే అవతార సిద్ధాంతానికి పునాది.

ఐతే పునర్జన్మ సిద్ధాంతానికి పామరపండితులు, పండితపామరులు, పండితబ్రువులు, పండితమ్మన్యులు చెబుతున్న అర్థాలన్నీ తప్పులతడకలే. ప్రతీత్య సముత్పాత చక్రం అర్థమైతేగాని పునర్జన్మ అర్థం కాదు. ఆ ధర్మచక్రంలో అవిద్యవలన సంస్కారం, సంస్కారంవలన విజ్ఞానం, విజ్ఞానంవలన నామం, నామంవలన రూపం, రూపంవలన తృష్ణ, తృష్ణవలన ఉపాదానం, ఉపాదానంవలన భావం, భావం వలన జన్మ, జన్మవలన దుఃఖం కలుగుతుందని నిర్వచింపబడింది. ఈ జన్మవలన దుఃఖం అనే దానికి అర్థం ఏమిటి? స్థూల శరీర జన్మవలన అనా? ఎన్నటికీకాదు. కోరిక జన్మించటంచేత కోరిక ఎన్నిమాట్లు జన్మిస్తే మనిషి అన్ని జన్మలెత్తినట్లన్నమాట. ఎన్ని కోరికలు పుడితే అంత దుఃఖం అన్నమాట. అంతేగాని స్థూల శరీరంతో యీ జన్మలకు ముడిపెట్టటం కేవలం అవివేకం, అవిద్య. ఈ అవిద్యయే దుఃఖానికిమూలం అని బుద్ధభగవానుడు చెప్పనే చెప్పాడు. ఈ అవిద్యా నిర్మూలనానికి కృషిచేయకపోవటం మన లోపమే. బుద్ధభగవానుడిదికాదు.

## 16 వ పూర్వపక్షం :

అందుకే బౌద్ధమతం నాస్తికమతం అన్నారు. పరలోకంలేదంటారు గనక నాస్తికులనే నిర్వచనం ఒకటి ఉంది. దాని ప్రకారం బౌద్ధులు నాస్తికులే. హిందూమతంలో ఒక శరీరం చచ్చిపోయింతరువాత జీవుడు మరొక శరీరంలో ప్రవేశిస్తాడనే పండిత పామరులందరూ ఏకగ్రీవంగా విశ్వసిస్తారు. కనుక హిందూమతంవేరు, బౌద్ధమతంవేరు.

## సిద్ధాంతం :

బౌద్ధమతంలో పరలోకం లేదనేది ఒక అంధనింద. స్థూల శరీరం చచ్చిన తరవాతనే పరలోకం ప్రవేశిస్తారనేవాదం బౌద్ధులంగీకరించరు. అంతేగాని పరలోకం లేదని బౌద్ధులనరు. పరలోకం ఒక పారిభాషికపదం. దాని అర్థం మీకు తెలుసుకోవాలని కుతూహలం వుంటేతప్ప చెప్పవలసినపనిలేదు. స్థూలంగా "తన సంతోషమె స్వర్గము। తన దుఃఖమే నరకమండ్రు తథ్యముసుమతీ".

ఇంక హిందూమతంలో ఒక శరీరం చచ్చిపోయింతరువాత జీవుడు మరొక శరీరంలో ప్రవేశిస్తాడనేందుకు ప్రమాణంలేదు. అటువంటి ప్రచారంచేసేవాళ్ళు నిజంగా పండిత పామరులే!

## 17 వ పూర్వపక్షం :

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

— భగవద్గీత.

చిరిగిపోయిన గుడ్డలను విడిచిపెట్టి కొత్తవాటిని తొడుక్కున్నట్టుగానే జీవుడు చివికిపోయిన శరీరాలను విడిచిపెట్టి కొత్తశరీరాలను ధరించుతుందని భగవద్గీత చెపుతూంది కదా!

## సిద్ధాంతం :

నిజమే. అవి ఏ శరీరాలో తరచి చూసేరా? ఆ గొడవ మా కక్కరలేదంటారా? మీరు హిందూ మతంలో వేలుపెట్టకండి. హిందూమతం కావాలంటారా, సూక్ష్మశరీరాలనేవి వున్నాయని మీరు అంగీకరించాలి. వాటి కొక పారిభాషికార్థం ఉన్నది. అది మీకు తెలుసుకోవాలి.

దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిః
ధీరస్తత్ర నముహ్యతి॥

ఈ స్థూలదేహంలో కౌమారం, యౌవనమూ, వార్ధక్యమూ ఎలా వరసగా వస్తాయో, అట్లాగే దేహికి

(సూక్ష్మ) శరీరాలు వరసగా ప్రాప్తిస్తాయి. బుద్ధి ఉన్నవా డెవడూ యిందులో పొరపాటు పడడు అని భగవద్గీత వైభావాన్ని విశదంచేస్తుంది.

ఈశ్లోకంలో స్థూలశరీరం ఉపమానంగా పేర్కొనబడింది. ఉపమేయమైన మారే దేహాలు స్థూలదేహాలు కావని మీరు బోధపడకపోతే గీతాకారుడి తప్పా? జాగ్రత్తకోసమే "బుద్ధి ఉన్నవాడెవడూ పొరపాటు పడడ"ని హెచ్చరించాడు. "పండిత పామరులు" కువ్యాఖ్యానాలు చేస్తే హిందూమతాని కదే ప్రమాణమా? కాదు. వానివి కువ్యాఖ్యానాలు కనకనే దేశం 800 సంవత్సరాల క్రిందటే పతనమయి విదేశ దాస్యంలోకి పోయింది. అదిచాలు వారి బుద్ధిహీనతకు తార్కాణం. కనక పునర్జన్మ సిద్ధాంతం బుద్ధుడే స్థాపించాడు. అది హిందూమతంలో ఒక ముఖ్యాంశంగా తీసుకోబడ్డది. దానికి హిందువులు తప్పుడర్థాలు చెప్పారు. దేశం నాశనమయింది. అంతేగాని హిందూ మతం వేరు, బుద్ధమతం వేరుకాదు.

## 18 వ పూర్వపక్షం :

జగన్మిథ్యావాది శంకరాచార్యుడూ, నిరంతర ప్రవాహవాది బుద్ధుడూ ఒక మతమే ప్రతిపాదించారనడం యెలా పొసుగుతుంది?

## సిద్ధాంతం :

సర్వశూన్యవాది నాగార్జునుడు నిరంతర ప్రవాహవాది బుద్ధునికి శిష్యుడని ఎలా అంగీకరించగలిగారూ? ఇద్దరినీ ఇంగ్లీషువాళ్ళు ఒక మతం అన్నారు గనక. గురువుగీచినగడి దాటటానికి మనస్కరించక! అంతే గదూ. లేకపోతే, నాగార్జునుడు బుద్ధుడిమీద ఒక స్తోత్ర శ్లోకం తన మాధ్యమికకారికల్లో చేర్చాడనే అయితే, తన భాష్యంలో శంకరుడు బుద్ధుణ్ణి భగవంతుడన్నాడుగా! నే నింతకుముందే శంకరుని స్తోత్ర శ్లోకం ఉదహరించానుగదా. మరి శంకరాచార్యుని పరమగురువు గౌడపాదుడుకూడా ద్విపదాంవరుడైన బుద్ధుణ్ణి ప్రస్తుతిస్తూ తన మాధ్యమికకారికలు ప్రారంభించాడుగదా! ఆ కారికల్లో చివరిదాని భాష్యంలో బుద్ధునిదికూడా జ్ఞానమార్గమేనని అంగీకరించాడుగదా! అయినా శంకరుడిది హిందూమతమూ, బుద్ధునిది అన్యమతమూనని భావించే చరిత్రకారుల నేమనాలి?

ఇక తాత్వికంగా చూచినప్పుడు నిరంతర ప్రవాహవాదం అంటే యిదీ. ప్రవాహం నిత్యపరివర్తన శీలం. ఒక క్షణంలోఉన్న నీరు మరొక క్షణంలో అక్కడ లేదు. అయినా ఒకేనదిగా మనం దానిని వ్యవహరిస్తున్నాం. నది వ్యవహారసత్యం. ఏ రెండు క్షణాల లోను అది ఒకటికాదు. పాతనది పోయింది. కొత్తది పోతున్నది. అందుకని పరమార్థం యేమంటే ఇట్టి నది యింతకుముందు లేదు, ఇకముం దుండబోదు. కనుక మొదటూ, చివరాలేనిది యిప్పుడుగూడా లేదన్నాడు నాగార్జునుడు. 'ఆదావన్తేచ యన్నాస్తి వర్తమానేపి తత్తథా' అనే కారికతాత్పర్యం యిది. పరమార్థ బోధనకు ఇదొకఫక్కి. అంటే 'డాగ్మా'లు వ్యర్థమని బోధపరచటం అన్నమాట.

ఇక శంకరుడు దీనినే మరొక రకంగా బోధించ పూనుకున్నాడు. అజ్ఞానికి డాగ్మటిజం పోగొట్టటానికి ఆయన మరొక పంథా తొక్కాడు. అసలు అజ్ఞానికి వాస్తవిక విషయ పరిశీలనం కుదరదన్నాడు. ఎందుకనంటే వాడిచూపు కామక్రోధలోభాలచేత మసకగించిందన్నాడు. అందుచేత భ్రాంతి కలుగుతుందన్నాడు. ఆగర్భశత్రువు పొగాకు నమిలి ఉమ్మివేస్తుంటే నన్నుచూసే ఉమ్మేసే డనుకొంటాడు ప్రతికక్షి. ఇది క్రోధజనిత భ్రాంతి. తాడునుచూచి పామని అనుకొంటాడు అజ్ఞాని. ఇది అవిద్యాజనిత భ్రాంతి. పందిరిగుంజ. పరమసుందరిలాగా కనిపిస్తుంది కామార్తునికి. ఇది కామజనిత భ్రాంతి. పరద్రవ్యాహరణ బుద్ధి గలవానికి హత్యచేసి సుఖంగా పరద్రవ్య అనుభవించవచ్చుననే భ్రాంతి కలుగుతుంది. ఇది లోభజనిత భ్రాంతి. అజ్ఞానిని యిన్ని భ్రాంతులు వేధిస్తూంటవి. అజ్ఞాని అంటే ఆలోచన లేనివాడు వివేకం లేనివాడు అని అర్థం. అటువంటివాడికి వాస్తవిక పరిజ్ఞానం శూన్యం. వాడి అనుభూతి అంత వివర్తజన్యమే కాని పరివర్తనశీలం కాదు. అంటే ఉన్నదానికి తల్లక్రిందులు చూపు తప్ప యథార్థజ్ఞానం కలుగదు. యథార్థజ్ఞానం లేనివాడికి సత్యద్వైతం ఉంటేగా, అది ప్రవాహంలాగా కొనసాగటానికి. అంచేత ప్రవాహశీలం అజ్ఞానికి తెలియదు. అజ్ఞానిది వివర్తశీలం. అంచేత అవిద్యా నిర్మూలనం అవసరం అని శంకరుని వాదం. అందుచేత అజ్ఞానియొక్క జగత్తు మిథ్య అనీ, అజ్ఞానుడే డాగ్మాలు పట్టుకొని ఊగులాడుతూంటాడనీ శంకరుని తీర్మానం. కనుక 'డాగ్మా'లు వ్యర్థమని బోధ.

ఇంక శంకరునికీ, బుద్ధునికీ తాత్పర్యంలో తేడా ఏముందీ? క్షణికత్వం చూపించి వైరాగ్యం బోధిం

చటం ఒక మతమూనూ, భ్రాంతిని ఋజువుచేసి వైరాగ్యం బోధించటం మరొక మతమూనా? కాదు. రెండూ ఒకటే.

## 19 వ పూర్వపక్షం :

గౌడపాద కారికల్లో మొదట స్తుతించింది బుద్ధుణ్ణి కాదు. నారాయణుని సుమండీ. అందులో చివరి శ్లోకానికి భాష్యంలో శంకరాచార్యుడు బుద్ధునికంటె ఉపనిషత్తో వ్యక్తమయిన సత్యమే గురుతరమన్నాడు కదండీ! మరి ఇద్దరి మతం ఒకటెల్లా అవుతుంది?

## సిద్ధాంతం :

గౌడపాద కారికల్లో మొదటిది నారాయణ స్తుతి యని కొందరి యూహ. బుద్ధుని స్తుతియని కొందరి యూహ. ఈ యిరువురూ తెలియని వాళ్ళేనంటాను. నారాయణావతారమే బుద్ధుడని గుర్తించుకోవాలి మనం. అప్పుడే ఆ వివాదం తొలగిపోతుంది. అవతారాలు నమ్మని నాస్తికులకు మతరీత్యా చెప్పగలిగేదేమీ లేదు. పురోహిత మతస్థులు నాస్తికులు కనక అవతారాలను నమ్మరు. కాని హిందూ మతస్థులందరూ అవతారాలు నమ్ముతారు. వాళ్ళకు మాత్రమే ఆ జవాబు. ఇక నాస్తికులకు జవాబు లేదని నా తాత్పర్యంకాదు. నాస్తిక దృష్ట్యా ఎవడికి వాడే దేవుడు. అంటే బుద్ధుడూ దేవుడే. పురోహితుల దృష్ట్యా సత్కర్మలు చేసినవాడే దేవుడు. బుద్ధుడు బ్రతికున్నాళ్ళూ చేసిందే సత్కర్మ.

సబ్బపాపస్స అకరణం
కుసలస్స ఉపసంపదా।
సచిత్త పరియోదపనం
ఏతం బుద్ధాను శాసనం॥

'పాపములు చేయకుండా వుండటం, పుణ్యాలు సమకూరుస్తూ ఉండటం, మనస్సుని నిష్కల్మషంగా ఉంచుకోవటం, ఇదే బుద్ధుల శాసనం.' అంచేత ఇంతకంటే సత్కర్మ ఏముంటుంది? యజ్ఞాలు నిరసించాడనేది కూడా ఒక అపోహయే. ఆయన నిరంతరమూ యజ్ఞము చేస్తుండేవాడు. ఒక్క మేకను చంపలేదేసుంటూరా? యజ్ఞంలో మేకను చంపాలని ఎక్కడ రాసి పెట్టివున్నదీ? 'యజదేవపూజాయాం' అనికదా? దేవపూజకు మాంసం కావాలా? మరి వేదంలో అలా పేర్కొనబడిందే అంటారా? పశువధ అంటే దేహ విజయంఅనిఅర్థంకాని మేకలనుకోయటంకాదే. దేహానికి అన్నంకావాలిగాని దేవునికి అన్నంతో పనేముంది? మరి వేదంలో దేవుడికి అన్నంపెట్టాలని వుందంటూరా? ఆ అన్నానికి అర్థంవేరు.

ప్రజాపతిర్వై మూర్తిరజాయత। అన్నం వైతత్॥
[ఐతరేయోపనిషత్తు.]

'ప్రజాపతి' ఆకారమును సృష్టించాడు. అదే అన్నం అని అర్థం. అంటే వస్తువుయొక్క యథార్థమైన ఆకార గ్రహణమే అన్నమని అర్థం. అదే బ్రహ్మపదార్థం. అంతేగాని మాంసమూకాదు, పప్పూ కాదు. ఇంటువంటి వేదోక్తమైన యజ్ఞం బుద్ధుడు నిరంతరం చేస్తూండేవాడు. కనక బుద్ధుడు దేవుడే. గౌడపాదుడు బుద్ధుణ్ణే స్తుతించాడు.

ఇక శంకరభాష్యంలో బుద్ధుని దర్శనంకంటె ఔపనిషదమైన దర్శనానికి ఆధిక్యం యిచ్చాడంటే, దానికి కారణం ఆనాటి బుద్ధశిష్యులు బుద్ధుని అవ్యాకృతదీక్షను గురించి మాట్లాడకుండా పూరుకోవడమే. 'నైతద్బుద్ధేన భాషితం' — అంటే బుద్ధుడిది అవ్యాకృతమన్నాడు అని అర్థంకాని, బుద్ధునికి తెలియదు అనికాదు.

అయినా ఒకనికంటె ఒకనికి ఆధిక్యత ఉన్నంత మాత్రాన ఇద్దరివీ వేరువేరు మతాలనడం ఎలా పొసగుతుంది? భిన్నత్వంవుంటే భిన్నమతాలు అంటాం. అంతేగాని ఒక అడుగు ఎక్కువవేసినంతమాత్రాన కొత్తమతం అవుతుందా? మార్క్సు దొకమతమూ, లెనిన్ దొకమతమూనా? ఎన్నటికీకాదు. బుద్ధునిదీ శంకరునిదీ ఇద్దరిదీ అద్వైతమతమే.

## 20 వ పూర్వపక్షం :

బుద్ధుడు దేవుడు విషయం అక్కరలే దన్నాడు. హిందూమతంలో దైవభక్తి ప్రధానాంశంగదా! శంకరుడు హిందూమతస్థుడుగదా! మరి శంకరుడు బౌద్ధుడెలా అవుతాడు?

## సిద్ధాంతం :

బుద్ధుడే దేవుడు కనుక ఆయనకు మరొక దేవుడు లేడు. రాముడికి మరొకదేవు డున్నాడా? బలరాముడికి మరొకదేవు డున్నాడా? లేడు. బౌద్ధులకు బుద్ధుడే దేవుడు. రామభక్తులకు రాముడే దేవుడు. అందుచేత బౌద్ధులను నాస్తికులనటం మూర్ఖత్వం మాత్రమే.

హిందూమతంలో దైవభక్తి ప్రధానాంశమే. కాని దేవుడంటే గురువే. 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః । గురుస్సాక్షాత్పరబ్రహ్మ.' బుద్ధుడు జగద్గురువు. నామమాత్రపు జగద్గురువుకాడు. ప్రపంచకంలోకల్లా ఎక్కువమంది జనాభా ఆయన శిష్యులు. ఆయనమార్గము ననుసరిస్తున్నారు. అంచేత ఆయన నిజమైన జగద్గురువు. అంచేత ఆయనయే బ్రహ్మ, ఆయనయే విష్ణు, అయనయే మహేశ్వరుడు ఆయనయే పరబ్రహ్మ.

ఇక శంకరుడు. "అహం బ్రహ్మవాది" శంకరునికంటె నాస్తికు లెవ రుంటారు? బుద్ధుడు నేను భగవంతుడను, అర్హుడను, పురుషదమ్య పంథిని, దేవమనుష్యశాస్తను, దశబలుడను అన్నాడు. శంకరుడు నేను బ్రహ్మనేనన్నాడు. కనుక నేశంకరుడు ప్రత్యక్ష బౌద్ధుడనటం నేను.

## 21 వ పూర్వపక్షం:

బుద్ధుడు సర్వసమానత్వవాది. శంకరుడు కులతత్వ వాది. అటువంటప్పుడు ఇద్దరినీ ఒక మతమనటం ఎట్లా కుదురుతుంది?

## సిద్ధాంతం:

బుద్ధుడు వయోజనులందరూ సర్వసమాను లనలేదు. పుటకతో అందరూ సమానులన్నాడు. కులములు లేనే లేవని బుద్ధుడనలేదు. అన్ని కులాలలోకి క్షత్రియుడే అధికుడని స్పష్టంగా ఒకచోట చెప్పాడు కూడా! అంతేగాదు. ఆయన బ్రాహ్మణనింద చేశాడనేది ఒక అసత్యప్రచారం. పుటకచేత ఎవడూ బ్రాహ్మణుడు కాడు. పుటకచేత ఎవడూ క్షత్రియుడుకాడు. పుటకచేత ఎవడు వైశ్యుడూకాడు. ఎవడూ శూద్రుడు కాడన్నాడు. మరియెట్లా?

న జటేన న గోత్తేన న జచ్చాహోతి బ్రాహ్మణో
యోచ సత్యంచ ధమ్మంచ సో సుచీసోచ బ్రాహ్మణో

'జడలపెంచిన మాత్రాన జాతిచేత బ్రాహ్మణుడు గాడు, గోత్రంబువలననైన।ఎవడుసత్యవ్రతుండోవాడె శుచిపరుడు, పరమ ధర్మావలంబియౌ బ్రాహ్మణుండు' అన్నారు. అటువంటి బ్రాహ్మణులను ఆయన నిందించ లేదు. పురోహితులు బ్రాహ్మణులని విఱ్ఱవీగుతూంటే ఆయన వారిని నిరసించాడు. అంతే. తన శిష్య సంఘాన్ని శ్రమణ బ్రాహ్మణు లన్నాడు. (శ్రమణులే తరువాత శర్మలుగా వ్యవహరించసాగారు). భగవద్గీత కూడా నాలుగు వర్ణములూ స్వభావాన్నిబట్టి, అనుస రించే వృత్తులనుబట్టి ఏర్పడినవంటుంది. అంతేగాని జన్మవృత్తులను ఆమోదించదు. శంకరుడు భగవద్గీతా ప్రామాణ్యం అంగీకరించాడు గనుక స్వాభావికమైన వర్ణాశ్రమ ధర్మాన్నే ఆమోదించాడన్నమాట. ఇప్పటి కుల వ్యవస్థను శంకరాచార్యుడు మూలకారణ మనటం అజ్ఞానం. దీనికి మన దక్షిణదేశ రాజకీయాలే కారణం. శంకరుడు కాదు.

## 22 వ పూర్వపక్షం:

అయితే బౌద్ధులుకూడా వర్ణాశ్రమ ధర్మాన్ని ఆమోదిస్తారా? చైనా, జపాన్‌లలో వర్ణాశ్రమధర్మం లేదుగదా? అభివృద్ధి నిరోధకమైన వర్ణాశ్రమ ధర్మమే మన దేశ పతనానికి కారణమైందని మీ రంగీకరిస్తారా? అంగీకరించరా?

## సిద్ధాంతం:

అసలు వర్ణాశ్రమ ధర్మానికి మతంతో సంబంధం లేదు. అది స్వాభావికమైన ధర్మం. ఈసంగతి తెలియక కులవ్యవస్థకు కారణం మతం అంటూంటారు కొందరు పండితమ్మన్యులు. స్వభావాన్ని జయించటమే మతంయొక్క ఆశయం. సామాజిక ధర్మాలు దేశకాలాలనుబట్టి మారుతూంటాయి. అందుకే అనేక స్మృతులు రచింపబడటం. స్మృతి ఒక రాజశాసనం తప్ప వేరేమీకాదు. రాజశాసనం మారకూడదనేదేమీ లేదు. ప్రతి రాజశాసనం కొంతమంది పండితులు దేశ కాల పరిస్థితులను దృష్టిలోవుంచుకొని చర్చించి నిర్ణయించేది. అప్పటికి మంచిదనితోచిన శాసనం అమలు జరుపుతారు. పరిస్థితులు మారినప్పుడు మళ్లీ ఆ పండితులే ఆ శాసనాన్ని సవరించడానికి జంకరు. కనీసం జంకకూడదు. అందుచేత బౌద్ధుల ఆమోదం వున్నా లేకపోయినా సమాజంయొక్క అవసరాలనుబట్టి కొన్ని సామాజిక భేదాలు వుండనేవుంటాయి. వాటికి బౌద్ధులయినా, హిందువులయినా, క్రైస్తవులయినా తలఒగ్గవలసేవుంది. ఇది ప్రజాతంత్ర మూలసూత్రం. బౌద్ధులు ప్రజాతంత్రవాదు లన్నసంగతి మరువరాదు.

ఇక వర్ణాశ్రమ ధర్మంయొక్క పరిణామాన్ని గుర్తుంచుకొంటే దాన్నిగురించి మనకున్న అభిప్రాయాలు మిథ్యాదృష్టి అని తేలిపోతుంది. 'మిథ్యాదృష్టి ర్నాస్తికతా' అని నిర్వచనం.

వర్ణాశ్రమధర్మాలు వేదకాలమునుండీ మన దేశంలో అమలులో వున్నాయి. అయితే మొదటినుండీ ఒకే రకంగా లేవు. వేదకాలంలో రంగులనుబట్టి వర్ణవ్యవస్థ నిర్ణయించబడింది.

కపిలా శ్చారుణాః పీతాః
కృష్ణాశ్చేతి పృథక్ పృథక్
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా
శ్శూద్రాశ్చేతి వివక్షితాః॥

[విష్ణుపురాణం]

చారిత్రకంగా కూడా యిది సరిపోతుంది. ఆర్యులు తెల్లటివాళ్ళు. ద్రవిడులు ఎర్రటివాళ్ళు, మంగోలులు పచ్చటివాళ్ళు. నీగ్రోలు నల్లటివాళ్ళు. ఈ నాలుగు జాతులూ భారతదేశంలో సమావేశం అయిన కొత్త రోజుల్లో రంగులనుబట్టి సామాజిక విభేదాలు ఏర్పడడం సమంజసమేనని అంగీకరించక తప్పదు. తరువాత పరస్పర సంబంధాల ఫలితంగానూ, పరస్పర సహజీవనం ఫలితంగానూ సమాజం మారిపోయింది. రంగులు కలిసిపోయినవి. స్త్రీ పురుష సంబంధం లేనిదే బిడ్డలరంగు మారదు. నల్లబ్రాహ్మలు, ఎర్ర శూద్రులు పుట్టుకొచ్చారు. ఈ దశలో వర్ణవ్యవస్థ సంస్కరణ అవసరమైంది.

'చాతుర్వర్ణ్యస్య సర్వస్య వర్ణేన
యదివర్ణో విభజ్యతే।
కామః క్రోధో భయం లోభః
శోకశ్చింతా క్షుధా శ్రమా
సర్వేషాం నః ప్రభవంతి
కస్మా ద్వర్ణో విభజ్యతే॥'

అని భరద్వాజుడడిగితే భృగువు —

'న విశేషో స్తి వర్ణానాం
సర్వం బ్రాహ్మ్య మిదం జగత్।
బ్రాహ్మణాః పూర్వసృష్టాహి
కర్మతః వర్ణతాం గతాః॥'

అని జవాబిస్తాడు — [భారతం]

భగవద్గీత దీన్నే ఇంకా స్పష్టంగా వివరిస్తుంది. అర్జునుడు విషాదయోగంలో "యుద్ధంవలన అధర్మం పెరుగుతుంది. అధర్మంవలన ఆడవాళ్ళు చెడిపోతారు. ఆడవాళ్ళు చెడిపోతే వర్ణసంకరమవుతుంది" - అంటాడు. దానికి కృష్ణుడు స్వభావాన్నిబట్టి గుణాలు, గుణాలనుబట్టి వృత్తులు, వృత్తులనుబట్టి వర్ణాలు ఏర్పడ్డాయి - అని సమాధానం ఇస్తాడు. [మోక్షయోగం 43-44 శ్లో)

స్త్రీల మూలంగా వర్ణాలు చెడిపోవు. స్వభావాలు చెడితే వర్ణాలు పోతాయి. కాని, స్వభావాలు మారేవి కావు. అంచేత వర్ణాలు స్వతంత్రంగా వుంటాయి. ధర్మబుద్ధితో కొంత విజ్ఞాన పరిశోధన స్వభావం వున్న వృత్తులు బ్రాహ్మణవృత్తులు. శౌర్యం, దెబ్బ లాట వచ్చినా వెనకాడకుండా వుండటం, దానం, నేను అని నిలబడటం, జాలి గలిగినవాళ్లు క్షత్రియులు. వ్యవసాయం, పశుపోషణ, వర్తకం, యివన్నీ వైశ్య స్వభావంతో కూడిన వృత్తులు. వెట్టి చాకిరీ శూద్ర స్వభావంతో కూడిన వృత్తి. ఈ స్వభావాలు శాశ్వత మైనవి.

అంటే వర్ణాలు కేవలం ట్రేడ్‌యూనియన్లవంటి వన్నమాట. ఇటువంటివి చైనాలోనూ ఉన్నాయి. అమెరికాలోనూ ఉన్నాయి. రష్యాలోనూ ఉన్నాయి. అయితే అవి పుటకనుబట్టి కాకుండా స్వేచ్ఛా స్వభావాన్నిబట్టి ఉన్నాయి. అంచేత అవి సమాజాభ్యుదయానికి ఆటంకం కాలేదు ఆ దేశాల్లో. కాని మన దేశంలో ట్రేడ్‌యూనియన్లు బుద్ధుని తర్వాత మళ్లీ పుటకతో ముడిపెట్టబడ్డాయి.ఇది ఏ దశలో జరిగిందో చారిత్రక పరిశీలనచేస్తే అది అప్పుడప్పుడు చేయబడటం సమంజసమేనని తెలుస్తుంది. భారతీయులు అంకోరు, శ్రీవిజయ, బర్మా, శ్యామదేశాల్లో వలసలు స్థాపించిన రోజుల్లో అంతర్జాతీయ వర్తకం పెరిగింది. ఆనాడు సరుకు ఉత్పత్తికి చేతి వృత్తులు ఆధారం. ఈ చేతి వృత్తులకు శ్రేణులు ఆధారం. ఈ శ్రేణులు వంశ పారంపర్య హక్కులవలన బలపడగలవని ఆనాటి మేధావులు తలపోసి ఆలాగే శాసించారు. అయితే అంతర్జాతీయ వర్తకం పడిపోయినప్పుడు ఆ వంశపారంపర్యవృత్తులు మారకపోవటం దురదృష్టం. ఈ మారకపోవటానికి మేధావులే కాక ప్రజలుకూడా కారణభూతు లయినారు. 'మంచి రోజులు మళ్ళీ వస్తాయి' అనే ఆశతో పాతపద్ధతులను మార్చుకోటానికి యిష్టపడలేదు. మేధావులలోకూడా అటువంటి ఆశ ఉండి ఉండాలి. అందుచేత మార్పునకై సమాజం కృషి చేయలేదు. ఇంతలో మహమ్మదీయ దండయాత్రలు వచ్చిపడ్డయి. వర్ణవ్యవస్థను నిర్మూలించడానికి అది చేసిన కృషిఫలితంగా ఎందరో నిరుద్యోగులైనవారు ఆ మతంచేత ఆకర్షింపబడ్డారు. కాని శిల్పములను ధ్వంసంచేసే కార్యక్రమం మహమ్మ

దీయులు చేపట్టటంవలన శిల్పులు, చిత్రకారులు ఆ మతంలోచేర నిరాకరించారు. రామానుజుని కృషి వర్ణభేదాలు సడలించటానికి తోడ్పడ్డది. అందువలన మాలమాదిగలు మహాపద్మదీయులలో చేరలేదు. భారతీయ నాగరికతపట్ల అభిమానంగలవారు ఆమతంలోచేర లేదు. పారిశ్రామిక విప్లవంరాకముందు వర్ణవ్యవస్థను రద్దు చేయటంవలన ఉత్పత్తి దెబ్బతినదనే ధైర్యం కలగటం అసంభవం. అందుచేతనే వర్ణ ధర్మంమీద యిప్పటికీ మన సమాజంలో భక్తిశ్రద్ధలు కలిగినవారే ఎక్కువగా ఉంటు. పారిశ్రామిక విప్లవం సాధించేవరకూ యిప్పటి కులధర్మం పోవాలన్నా పోదు.

## 23 వ పూర్వపక్షం :

పంచమజాతి యెలా యేర్పడింది? అస్పృశ్యతకు కారణం బ్రాహ్మణులే కదా?

## సిద్ధాంతం :

వర్ణములు మొదట రంగుభేదంతో ఏర్పడ్డాయని మీరు గ్రహించితే పంచమజాతి ఎలా ఏర్పడిందో అర్థమవుతుంది. వర్ణసంకరం జరిగేటప్పుడు తెలుపు, ఎఱుపు, పసుపు రంగులవాళ్ళు తేలికగా కలిసిపోయినారు. నల్లవాళ్ళయిన ఆదిమజాతులను దూరంగా ఉంచి బానిసలుగా ఉపయోగించుకొన్నారు. కడమ మూడువర్ణలవాళ్ళు వర్ణవ్యవస్థను సంస్కరించినపుడు ఆర్య, ద్రావిడ మంగోలు జాతులుకూడా కలిసిపోవటానికి అంగీకరించినవి. వృత్తి ప్రాధాన్యమునుబట్టి వర్ణవ్యవస్థ సంస్కరింప పూనుకొన్నారు. కాని ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం గుర్తుంచుకోవాలి. సిద్ధాంతరీత్యా వ్యవసాయం,పశుపాలన, వర్తకం మూడు రకాల వృత్తులవారినీ వైశ్యవర్ణంక్రింద గుర్తించారు. కాని ఆచరణలో వ్యవసాయం పశుపాలన నీచవృత్తుల క్రింద భావింపబడుతూ వచ్చాయి. దీనికి కారణం ఆర్యులరాకకు పూర్వం బానిసవ్యవస్థ ననుసరిస్తున్న ద్రావిడులే. అప్పటివరకూ ద్రావిడులు బానిసలచేత వ్యవసాయం, చేతిపనులూ, పశుపోషణ చేయిస్తూ వచ్చారు. ఆర్యులచేతిలో ద్రావిడు లోడిపోయిన తరువాత పాలకవర్గాలవారు సమాన ఛాయాలో కలిసిపోయారుగాని వ్యవసాయం, చేతిపనులు, పశుపాలన చేస్తున్న బానిసలను తమతో సమానమని అంగీకరించటానికి ద్రావిడు లంగీకరించలేదు. ద్రావిడ బ్రాహ్మణులూ, ద్రావిడక్షత్రియులూ ఉన్నారు. ద్రావిడవైశ్యులలో రైతులూ, కూలీలు, గొల్లలను చేర్చుకోలేదు. ద్రావిడవైశ్యులకూడా నల్లటివాళ్ళవటం చేత వేదార్హత లేకుండా చేశారు.

గౌడబ్రాహ్మణులు, గౌడక్షత్రియులు, ద్రావిడ బ్రాహ్మణులు, ద్రావిడక్షత్రియులకంటె 'చాల విశాల భావాలు కలిగియుంటారు. గౌడబ్రాహ్మణు లందరూ యించుమించు మాంసాహారులే. ద్రావిడ బ్రాహ్మణు లందరూ శాకాహారులే. దీనికి కారణం ఆర్యులకు వ్యవసాయం కొత్త. అందుచేత పశువులను ఎక్కువగా మాంసాహారం, పాడికోసం మాత్రమే పెంచేవారు. ద్రావిడులు ఆర్యులకంటె నాగరికులు. ఆర్యుల రాకకుముందే వ్యవసాయం ప్రధాన వృత్తిగా అవలంబించారు. మొహంజదారోలో ఎద్దుబొమ్మ, పశుపతి బొమ్మ దీనికి తార్కాణం. వ్యవసాయానికి పశువు ప్రాణప్రదం. అందుచేత వారు ఎద్దును పశుపతిని దేవుడుగా భావించేవారు. అందుచేత మాంసాహారం వారికి మొదటినుండీ నిషేధమే. ఇక ద్రావిడుల క్రింద బానిసలుగాఉన్న ఆదిమ జాతివారికికూడా కోళ్ళనూ, మేకలనూ తినటానికి అనుమతి యిచ్చారు. గానీ వ్యవసాయ పశువులను కోయడానికి మాత్రం అనుమతించలేదు. ఆదిమజాతులకు గొడ్డుమాంసం అంటేప్రీతి. దానికి కారణం వ్యవసాయం ద్రావిడులచే ప్రవేశపెట్టబడిన వృత్తి. అప్పటివరకు ఆదిమజాతులు పశువులను వేటాడి మాంసం తింటూండేవారు. ద్రావిడులు ఆదిమజాతులనోడించి వారిచే బలవంతంగా వ్యవసాయం చేయిస్తూ ఉండేవారు. ఈ వ్యావసాయకులను చాతుర్వర్ణ్య వ్యవస్థలోని వైశ్యవర్ణంలో కలపనీయలేదు. ఎందుకంటే వర్ణవ్యవస్థలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సమాన ప్రతిపత్తి ఉంది. మూడువర్ణాలకూ ఉపనయనం, వేదార్హత ఉన్నది. కనుక ద్రావిడులే యీ రైతులను, కూలీలను, గొల్లలను శూద్రులుగాచేసి ఏకంగా ఉంచారు. ఇది నాలుగవ కులమైంది. ఇక ఆదిమజాతులైన నల్లవాళ్ళను ఐదవకులం అన్నారు. పేరులేదు. యావద్భారత దేశంలోను వీరిని అస్పృశ్యులుగా భావించటం పరిపాటే. బుద్ధుని కాలానికే అస్పృశ్యు లున్నారు. ఈ అస్పృశ్యతకు కారణం రంగుద్వేషమేకాని యింకేమీకాదు. ఇప్పటికీ నీగ్రోలను అమెరికాలోను, ఆఫ్రికాలోను బానిసలుగా చూస్తూ ఉంటారు. తెల్లజాతి స్త్రీ మీద నీగ్రో కన్ను వేసినా, నీగ్రోమీద తెల్లజాతి స్త్రీ కన్ను వేసినా అమెరికాలో

నీగ్రోనే చంపివేస్తారు. కారణం, బిడ్డల రంగు చెడి పోతుందన్న భయమే. ఆ భయమే యీ దేశంలో కూడా నల్లవాళ్ళను అస్పృశ్యులుగా చేసింది. అయితే తెరచాటుగా నలుపుకూడా మిగతా కులాల్లో కలిసే పోయింది. అయినా క్షేత్రప్రధానంగా ద్రావిడులు కులాలను అనుసరిస్తూ వచ్చారు. ఈ కులభేదాలకు కారణం ఆర్యులు కానేకారు. ద్రావిడులే. ఈ సంగతి గుర్తించకపోవడంవల్లనే దక్షిణదేశంలో ఉత్తరాది వ్యతిరేకోద్యమం తలయెత్తుచున్నది. ఇదంతా ఆర్యులే చేశారనడం పచ్చి అబద్ధం.

కృషిః పాశుపాల్యం వాణిజ్యం చేతివృత్తయః
సేవాచవృత్తిః — అని అమరకోశం — వైశ్యవర్గం.

అమరుడు,శంకరుడు సమకాలికులని సంప్రదాయం. శంకరుడు అమరకోశంతో పూర్తిగా ఏకీభవించాడు. కాని శంకర మతం రైతులను, కూలీలను, గొల్లలను శూద్రులని సృష్టిస్తై చేస్తున్నది. ఆదిశంకరుని హత్యచేసిన అతని నలుగురు శిష్యులూ నాలుగు మఠాలు పంచుకున్నారనుటకు ఇదే తార్కాణం. ఆదిశంకరుడు యిప్పటి కులవ్యవస్థకు పూర్తిగా వ్యతిరేకం. బుద్ధుడుకూడా యిప్పటి పుటక కులాలకు పూర్తిగా వ్యతిరేకి. అందుచేత యిద్దరిదీ ఒక మతమే. ఇక మతానికీ, కులాలకూ అసలు సంబంధంలేనేలేదని మొదటే చెప్పాను. చారిత్రక కక్షలే సెక్టేరియనిజంకు మూలంగాని మతభేదం కాదనేది చరిత్రకారులుకూడా గుర్తించకపోవడం విచారకరం. కులాలు పోవాలి పోవాలిఅంటే పోవు. చారిత్రక కక్షలు, రంగు ద్వేషం దేశాభివృద్ధికి ఆటంకం అన్న సంగతి గుర్తిస్తేనే., పారిశ్రామిక విప్లవమొక్కటే వంశపారంపర్యా కులాలను సడలించగలదని గుర్తిస్తేనే, మనం ముందుకు పోగల్గుతాం.

## 24 వ పూర్వపక్షం :

చారిత్రక పరిశోధకుల అభిప్రాయాలను తలక్రిందుగా చిత్రించే మీ ప్రయత్నం వ్యర్థంకాదా ? మహాదేవుడే శైవశాఖకు స్థాపకుడనడం విచిత్రంగాలేదూ ?

## సిద్ధాంతం :

చారిత్రక పరిశోధన అనేది స్థిరమైనదికాదు. జడాత్మకమైనది కాదు. అది ప్రగతిశీలమైన ఒక శాస్త్రీయ పరిశీలన. అటువంటి శాస్త్రీయమైన పరిశీలన పూర్వపు నిర్ణయాలను సవరించుకొనటానికి జంకదు. సవరించుకోనిదే ముందుకు సాగిపోలేదు. ఉదాహరణకు రాముడు ఆర్యుడనీ, రావణుడు ద్రావిడుడనీ రామాయణగాధ ఆర్య ద్రావిడ సంఘర్షణను చిత్రిస్తుందనీ ఆంగ్ల చరిత్రకారులు ఆదిలో భావించారు. ఆ వాదం ఒక రామస్వామి నాయకర్‌ను కూడా తయారుచేసింది. కాని యిటీవల మరొక ఆంగ్ల పరిశోధకుడు ఈజిప్ట్ ఫెరయా అమన్‌రా అనే పేరే రాముడుగా పరిణామం చెందిందనీ, ఈజిప్ట్‌నుండి వలసవచ్చినవారి గాధయే రామాయణగాధ యనీ భావించటానికి శాస్త్రదృష్ట్యా వీలున్నదని మదరాసులో చరిత్ర పరిశోధకుల సభలో ఉపన్యసించినట్లు ఆంధ్రప్రభలో బడ్డది. కనుక చరిత్రకింద చలామణి అవుతున్న ఎన్నో అంశాలు పునర్విమర్శనకు వస్తున్నవి. రావలసి ఉన్నవి.

ఇక మహాదేవుడు అనే బౌద్ధభిక్షువు అమరావతిలో చైత్యవాదానికి ప్రారంభోత్సవం చేశాడు. "చైత్యమాయతనం తుల్యే" అని అమరకోశం. శాతవాహనుల చివరి రాజధాని అమరావతి అనేది చరిత్రకారులు అంగీకరించిన విషయమే. పల్లవులు తెలుగునాడునుండి తమిళనాడుకు తమ రాజ్యకేంద్రాన్ని మార్చుకొన్నారు. మహాబలిపురం నిర్మించారు. ప్రసిద్ధికెక్కిన పంచపాండవ ఆలయములు నిర్మించినదివారే. శివాలయ నిర్మాణానికి వారే ప్రారంభకులు. ఇది చరిత్రకారు లంగీకరించినదే.

శాతవాహన రాజులు యజ్ఞయాగాది క్రతువులు చేస్తుండేవారు కాని శివారాధన అనేది యెరుగరు. శాతవాహన రాణులు, ప్రజలు బుద్ధదేవుని స్తూపారాధన చేస్తుండేవారు. ఇక్ష్వాకులలోనే గూడ తొలి రాజులు యజ్ఞయాగాది క్రతువులు చేస్తూవుండేవారు. యజ్ఞశాలకే ఆయతనమని పేరు. చైత్యం దానికి ప్రత్యామ్నాయ మయింది. వారి రాణులు యజ్ఞశాల నాగార్జున కొండ అనబడే శ్రీ పర్వతస్తూపా రాధమునకు ఉపాసకులు. పోషకులూను. నాగార్జునుని తర్వాత ఇక్ష్వాకులలో శివభక్తులు కనిపిస్తారు. ఈవిధంగా మహాదేవుడు ప్రారంభించిన చైత్యనిర్మాణములే శివాలయములుగా పిలువబడిన వనుకొనటానికి వీలున్నదని నా అభిప్రాయం. అంతేకాదు. ఆగమములలో శైవాగమం మొదటిదని అంటారు. ఆగమశాస్త్రానికి పూర్వ మీమాంసకుల దృష్టిలో న్యూనతవుంది. మరి ఈ ఆగమకర్త లెవరైవుండాలి ? జైనులా ?

ఎన్నడూ కాదు. బౌద్ధులే . ఈ యాగమశాస్త్రానికీ, విగ్రహారాధనకూ మూలమని నా అభిప్రాయం, శైవం బౌద్ధంలో ఒక శాఖ అని నా అభిప్రాయం. మహాదేవుడే శివుడనే బిరుదుతో ప్రారంభించిన చైత్యవాద బౌద్ధ శాఖయే శైవశాఖగా పిలువబడినదని నా అభిప్రాయం ఒకప్పుడు ఆబాలగోపాలం పూజిస్తున్న బుద్ధదేవుని మతం నాశనమయి పోయిందనటం ఒక చారిత్రక భ్రమ అంటాను నేను. "తండ్రి మధ్వాచారి. తనయుడా రాఘ్యుండు, తల్లి రామానుజమతస్థురాలు. తనది కూచిమతము, తమ్ముడు బౌద్ధుండు" - అని కాసుల పురుషోత్తం ఇటీవల వాపోయాడు అటువంటి బౌద్ధధర్మం నశించిపోయిందనడం సహేతుకం కాదు. నామాంతరంపొందిం దంటాను.

ప్రాజ్ఞులాలోచించాలని నా ప్రార్థన.



# అద్వైతవాదసారం : దాని కొన్ని సాంఘిక ప్రభావాలు

శ్రీ పాములపర్తి సదాశివరావు

ఆధునిక శాస్త్రీయ పరిశోధనలు అద్వైతంలోని ఊహాజనిత సిద్ధాంతాలను నిరాకరిస్తాయనీ, అద్వైతం సాంఘికంగాను, సిద్ధాంతరంగంలోను సాముదాయకంగా ప్రగతి నిరోధపాత్రను నిర్వహించిందనీ రచయిత యీ వ్యాసంలో తెలియజేస్తున్నారు.

హిందూమత సాంప్రదాయాలకు అనుగుణ్యంగా భారతీయ సమాజాన్ని సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా శాసించే రెండు తాత్త్వికశాఖలు ఉత్తరమీమాంసా మరియు పూర్వమీమాంస అని వ్యవహరింప బడ్తున్నాయి. ఇందులో పూర్వమీమాంసాకర్త జైమిని. భాష్యకారులలో శబరస్వామి, కుమారిలుడు, ప్రభాకరుడు ప్రధానులు. కుమారిలుని సాంప్రదాయం "భాట్టమత"మనీ ఆయన శిష్యుడు ప్రభాకరుని సాంప్రదాయం ప్రభాకరమతమనీ వ్యవహరింపబడ్తాయి. కాని రెంటిలో అట్టే భేదాలులేవు.

పూర్వమీమాంస కర్మకాండను ప్రధానంగా బోధిస్తుంది. బ్రహ్మయజ్ఞ (వేదాధ్యయనం) పితృయజ్ఞ (శ్రాద్ధాదికములు) భూతయజ్ఞ (హోమ - బలిదాన క్రియలు) మనుష్యయజ్ఞ (దాన, ధర్మాలు) రూపక నిత్య, నైమిత్తిక కర్మలను ఎలా ఆచరించాలో వివరిస్తుంది. వైదిక - పురాణోక్త కర్మల విధింపుద్వారా ద్విజ - శూద్రవర్గాలను శాసిస్తుంది. పూర్వమీమాంస కర్మల ఆచరణను విధిగా శాసిస్తుంది. ఐహికదృష్టితో కర్మాచరణ సమాజంలో అనివార్యమని చెప్పుతూనే, పుణ్య పాపకర్మలవల్ల స్వర్గనరకరూపక సుఖదుఃఖాలు కూడ కల్గుతాయని పూర్వమీమాంస శాసిస్తుంది. వేద ప్రమాణంతో కర్మలను చేయటమే జన్మచరితార్థతకు మార్గం; మరో దారిలేదు అని పూర్వమీమాంసకులు వాదిస్తారు.

"వేదైకవిహితంకర్మ, నాపరమ్ మోక్షదంమతం"॥

అర్థకామములకంటే ధర్మమోక్షములు ప్రధానములనీ అందువల్ల వేదోక్త - పురాణోక్తపుణ్యకర్మాచరణ అనివార్యమనీ మీమాంసకులమతం. పూర్వమీమాంస వేదాన్ని విధి, నిషేధం, అర్థవాదం అనే విభాగాలుగా క్రమీకరించింది. మంత్రాలలో దివ్యశక్తికలదనీ (Energism), దేవతలు మంత్రాధీనులనీ, మంత్రం క్రియాధీనమనీ కనుక మతకర్మల ఆచరణ అనివార్యమనీ వాదించింది.

పూర్వమీమాంసకు ధ్యేయం కర్మాచరణ. కనుక ఈ ధోరణిని మనం నేటితాత్త్వికపరిభాషలో 'ప్రాగ్మాటిజం' (Pragmatism) అనవచ్చు. ప్రాగ్మాటిజంకు కొలతబద్ద ప్రత్యక్షాచరణయేకదా! ఐతే, ఈసంకుచిత తత్త్వంవల్ల పూర్వమీమాంస స్వతంత్రాలోచననూ, సత్యాన్వేషణశీలతనూ అరికట్టింది. "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ, అయమాత్మాబ్రహ్మ" మున్నగు వేదవాక్యాలను అర్థవాదమంటూ త్రోసిపుచ్చినది. ఆ వాక్యాలు శరీరమూ, ఆత్మ - జగత్తూ బ్రహ్మమూ వేర్వేరని చెప్పటానికి మాత్రమే కాని అంతకుమించి ప్రాధాన్యతకలవి కావని వ్యాఖ్యానించింది.

ఇక ఉత్తర మీమాంస లేక జ్ఞానకాండ దీన్ని వేదాంతదర్శన మంటారు. ప్రవర్తకుడు వేదవ్యాసుడు. భాష్యకారులలో ప్రధానులు శంకర, రామానుజ, మధ్వాచార్యులు. వీరి మతాలపేర్లే అద్వైత, విశిష్టా

ద్వైత, ద్వైతసాంప్రదాయాలు. అద్వైత సిద్ధాంతంలో భాస్కర, యాదవప్రకాశుల మతభేదాలున్నా ప్రధానమైనది శంకరభాష్యమే. శంకరుడు ఉపనిషత్తులకూ బ్రహ్మసూత్రాలకూ, భగవద్గీతకూ భాష్యాలు వ్రాశాడు. వాటిని ప్రస్థానత్రయమంటారు. శంకరుని అనంతరం ఆయన సిద్ధాంతాలకు సురేశ్వర, సర్వజ్ఞవాచస్పతి, విద్యారణ్య, మధుసూదన, అప్పయ్యదీక్షితాదులు విశేష వివరణలు కావించారు. ఆధునికయుగంలో వివేకానంద, రామతీర్థులు దేశ దేశాంతరాల్లో అద్వైత ప్రచారం కావించారు. ఈ అద్వైతవాదమే మన కిప్పుడు చర్చనీయాంశం.

## 1. ఉపనిషత్తుల మూలం

బ్రహ్మవాదం తొలుత ఉపనిషత్తులద్వారా వ్యాపకమైనది. వయస్సుమళ్ళి అరణ్యాశ్రమాలలో నివసించిన వానప్రస్థులూ, సన్యాసులూ ఆకాలంలో ప్రధానంగా బ్రహ్మజ్ఞాన విచారం సాగించారు.

"ఐతదాత్మ్య మిదగ్ంసర్వం, తత్సత్యగ్ంస ఆత్మా॥"
" ఆత్మనా ఇదమేక ఏవాగ్ర ఆసీత్,
నాన్యత్కించన మిషత్
స ఈక్షత లోకాన్ను సృజాయితి
స ఇమాల్లోకా నసృజత॥"

పైవాక్యాలకు అర్థం సమస్త జగత్తుకూడా ఆత్మయే మూలంగా కల్గియుంటదనీ సృష్టికి పూర్వం పరమాత్మ ఒకడేననీ, ఆయనకంటే వేరైనది లేదనీ, ఆయన లోకాలను సృష్టిచేయ సంకల్పించాడనీ, ఆయనే లోకాలను సృష్టించాడనీ. ఇలాంటి భావాలు ఉపనిషత్తుల్లో అసంఖ్యాకంగా ఉన్నాయి. శంకరాద్వైతానికి ఆధారం ఇలాంటి వాక్యాలే.

ఉపనిషత్తులు బుద్ధునికంటే పూర్వపువి. భారతీయ గణతంత్ర సమాజానికి చెందినవి. భారతీయ సమాజం గణతంత్ర, బానిస దశలనుండి భూస్వామ్యానికి పరిణతిజెందే కాలానికి ప్రతినిధిగా బౌద్ధంవ్యాపకమైనది. నీటివనరులూ, పంటభూములూ స్థిరపడగానే భూస్వాములుకూడ స్థిరపడ్డారు. భూస్వామ్యం సత్తావాద ధోరణిలో స్వేచ్ఛాలోచనకు ప్రతికూలమైన పూర్వ మీమాంసద్వారా సమాజాన్ని శ్రౌత, స్మార్త, పురాణోక్త కర్మకాండ పరతంత్రతలో దిగ్బంధించింది. ఐతే తిరోగమించే బౌద్ధంలో అద్వైత - వైరాగ్య చ్ఛాయలు వెంపొందాయి. గౌడపాదుడు అలాంటి వేదాంతియే. ఆ వెనుక శంకరాద్వైతం ఒక సమన్వయ వాదంగా వ్యాపకమైనది.

శంకరుని అద్వైతం పూర్వమీమాంసకు ప్రతిఘాతగా వచ్చినట్లు కనపడ్తుంది. శంకరుడు మండనమిశ్రుని ఓడించాడు. కాని వాస్తవంలో అద్వైతం పూర్వమీమాంసకు ప్రతికూలంకాదు. ప్రవృత్తిపరంగా, వ్యవహార వాస్తవంగా కర్మకాండను గుర్తిస్తూనే శంకరాచార్యుడు తన వైరాగ్యశీల బ్రహ్మజిజ్ఞాసను వెంపొందించాడు. శంకరాద్వైతం సగుణుడైన ఈశ్వరుణ్ణీ, పుణ్యపాప కర్మసంచితమైన జన్మాంతవాదాన్నీ అంగీకరిస్తుంది. నేటికీ శంకరపీఠాల్లో రాజవైభవమూ, వేదాంత ప్రబోధమూ కలిసికట్టుగా సాగుతున్న సాంప్రదాయం ప్రత్యక్ష విషయమే ... ఐతే ఉపనిషత్తులలోని అద్వైతం ప్రాథమికదశలో ఉంది. దానికి శంకరాచార్య డొక సమగ్ర శాస్త్రీయ స్థాయిని నిర్మాణం చేశాడు. కనుక శంకరాద్వైతం ఒక సమగ్ర తత్వశాస్త్ర సిద్ధాంతంగా వికసించింది.

ఇక అద్వైత తత్వశాస్త్రాన్ని, దాని విభిన్న పార్శ్వాలను సంక్షిప్తంగా చర్చిద్దాం!

## 2. కార్యకారణవాదం, బ్రహ్మనిరూపణ

" యతోవా ఇమాని భూతాని జాయంతే,
యేన జాతాని జీవన్తి
యత్ప్రయం త్యభిసంవిశన్తి
తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి॥"
" బ్రహ్మ సత్యమ్; జగత్ మిథ్యా॥ "

సర్వభూతములు, ప్రపంచము, దేనినుండి పుట్టినవో, దేనిచే ఉన్నవో, దేనియందు లయమౌనో, అది బ్రహ్మము. దీనికి ఎవ్వనిచే నించు అన్న భాగవత పద్యం సరిపోతుంది. అంటే జగత్తుకు బ్రహ్మము కారణమన్నమాట. కారణంయొక్క గుణాలు కార్యంలో ఉంటాయి. కనుక జగత్తూ, బ్రహ్మ వేర్వేరు కాదు. "కార్యమైన జగత్తుయొక్క మన జ్ఞానం కారణమైన బ్రహ్మయొక్క లక్షణాలకు సమన్వయమై యుండాలి. అలా ఉండినప్పుడు తేలేది బ్రహ్మ సత్యమనీ - జగత్తు మిథ్య అనీ" అంటుంది అద్వైతం. "జగత్తు ఒక కుండలాంటిది. ఐతే, దాని ఆధారమయ్యే బంకమట్టి (ఉపాదానకారణం), మరియు కుమ్మరివాడూ (నిమిత్తకారణం) ఈ రెండూ బ్రహ్మమే. కుండ పగిలిపోతుందనుకోండి; మిగిలేది తిరిగి బంకమట్టియే. కనుక జగత్తుకూడ లయకాలానికి తిరిగి

బ్రహ్మములో లీనమైపోతుంది. బంకమట్టికూడా "జన్మాద్యస్యయతః శాస్త్రయోనిత్వాత్॥ అలా అంతే." శాస్త్రం చెప్తూవుంది. అదే ప్రమాణం— అంటూ అద్వైత జిజ్ఞాస ప్రారంభమౌతుంది.

సరి. కారణ - కార్యాలు రెండూ ఒకటే. కాని కారణమైన బ్రహ్మమునకూ, కార్యమైన జగత్తుకూ విరుద్ధధర్మాలున్నాయికదా, ఎట్లాగని ప్రశ్న. శాస్త్రం "కారణగుణాః కార్యే సంక్రామంతి" అంటుంది. పాలలో తోడుచేస్తే పాలే పెరుగుగా మారతాయి. బంగారంతో నగచేస్తే నగయే బంగారం. ఇది పరిణామోపాదానం, బంకమట్టి కుండగా మారినట్లు - కాని "వివర్త ఉపాదానం" అని మరొకటికూడా ఉంది.

వివర్తోపాదానం అంటే కారణ లక్షణాలు కార్యంలో సంక్రమించక పోవటం, మృగతృష్ణలో నీరుండదు, కాని అది నీరని మనం అనుకొంటాము. అలా అనుకొని అందని ఎండమావుల్లో జలంకోసం పశువులు వెతుక్కుంటూ తిరుగుతాయి. అలాగే జగత్తులో మనం అనేక పదార్థాలను వేర్వేరు నామరూపాల్లో చూస్తున్నాము. వేరువేరు పదార్థాలకు వేర్వేరు గుణధర్మాలను ఆపాదిస్తున్నాము. అందువల్ల బ్రహ్మమునకూ, జగత్తుకూ విరుద్ధత యేర్పడ్తూ ఉంది. మరియు జగత్తులోని ప్రతిపదార్థానికీ,మరో పదార్థానికీ విరుద్ధత కన్పుగుతూవుంది. ఇదంతా ఒక భ్రాంతి మాత్రమే. ఐతే ఇదంతా వివర్త పరిణామమే, అంటే భ్రాంతియేనన్నమాట.

ఈ భ్రాంతికి కారణమేమిటి ? బ్రహ్మము మొదట అద్వితీయుడూ, ఒక్కడూను. "ఏకమేవా ఽద్వితీయం బ్రహ్మ" అది నిర్గుణము. కనుక బ్రహ్మమును "నేతి - నేతి" అంటే ఇదికాదు. ఇదికాదు అంటూ జగత్పదార్థాల నిరాకరణద్వారా మాత్రమే ఊహించాలి. అలాంటి బ్రహ్మమును సద్రూపమంటారు; ఇది సృష్టిదశ.

పిదప బ్రహ్మము జగత్తుగా వ్యాప్తిగాంచాడు. "తమేవ భాంత మనుభాతి సర్వమ్" ఈ దశలో బ్రహ్మము చిద్రూపమైనాడు. ఇది స్థితిదశ.

తుట్టతుదకు జగత్తు ప్రళయకాలంలో లయమైపోతుంది. అప్పుడు జగత్తు బ్రహ్మములో విలీనమౌతుంది. ఇది ఆనందరూపు బ్రహ్మము లేక లయదశ.

కనుక త్రికాలాతీతంగాను శాశ్వతంగానూ శేషించేది బ్రహ్మమే నన్నమాట.

## 3. మాయావాదం; పరిణామం

పైన అద్వైతం ఎలా నామరూప గుణధర్మసహితమైన జగత్తును 'మాయ' గాను, మాయకు అతిరిక్తమై దేశకాలాలకున్నూ, జననమరణ పరిణామాలకు అతీతమైన స్థిర శాశ్వత బ్రహ్మపదార్థాన్ని సమగ్ర శాశ్వత సత్యంగా నిరూపణ చేసిందో చూచాము.

ఇక మాయ ఏమిటి అన్నది ప్రశ్న.

మాయకు అవిద్య, అజ్ఞానం, అవ్యాకృతం, ప్రకృతి, బీజశక్తి, అవ్యక్తము అని పేర్లు. విద్యచే తొలగిపోయేది కనుక అవిద్య. జ్ఞానంవల్ల నిర్మూలమయ్యేది కాబట్టి అజ్ఞానం. నామరూపాత్మక జగత్తుకు ముందే యేర్పడినది కాబట్టి అవ్యాకృతం. జగత్పదార్థాలన్నీ తన వికారమే కనుక ప్రకృతి. వ్యాప్తమైన వృక్షం బీజంలో వలె విశాలమైన జగత్తంతా సూక్ష్మంగా తనలో ఇమిడి యున్నది కనుక బీజశక్తి. నిజమూ, అబద్ధమూ రెండూకానిది కాబట్టి అవ్యక్తము అని మాయకు నిర్వచనాలు.

అద్వైతం మాయను నిజమూ, అబద్ధమూ రెండూ కాదంటుంది. బ్రహ్మ సత్యం, మాయ బ్రహ్మంకాదు. జగత్తు మిథ్య. కాని జగత్తు మాయకాదు. కనుక మాయ కాల స్థలావరణల్లోగల పదార్థంకాని, కుందేటి కొమ్ముకలె లేని పదార్థ జ్ఞానంకాని కాదు. అది రూఢంగా ఉన్నట్టి తప్పుడు చైతన్యం అన్నమాట... ఇదీ, మాయావివరణ.

పరిణామంలో సృష్టికి పూర్వం బ్రహ్మములో మాయ విలీనమైన దశలో ఉంటుంది. నిద్రించేటప్పుడు బాహ్యచైతన్యం మానవునిలో ఇమిడియున్న విధంగా నన్నమాట. కనుక ఆ దశలో మాయ బ్రహ్మము యొక్క అద్వితీయ యేకత్వానికి భంగంకల్గించే సత్తా లేనిది. ఇలా మాయ ఒక భావనా విశేషంగాను, కార్యానుమేయంగా గ్రహింపబడ్తుంది. కనుక నిర్గుణ అద్వితీయ దశలో బ్రహ్మ పారమార్థిక సత్యమనీ, సృష్ట్యనంతరం జగత్పరంగా వ్యావహారిక సత్యమనీ, మరియు వ్యావహారిక సత్యం భ్రాంతి విశేషమే కనుక అది ప్రాతిభాసిక సత్యమనీ అద్వైతం సత్యాన్వేషణలో మూడు విభిన్న దశలను నెలకొల్పి, జగత్తు ప్రాతిభాసికమని వాదిస్తుంది.

## 4. సృష్టి పరిణామం

సృష్టికి మూలం మాయ. మాయలో ఉన్నదానిని

లేకున్నట్లు చూపే ఆవరణశక్తీ, లేనిదానిని ఉన్నట్లుగా చూపే విక్షేపశక్తీ ఉంటాయి. ఈశ్వరుడు మాయయొక్క ఆవరణశక్తికి అతీతుడుగానే మాయ యొక్క విక్షేపశక్తి ప్రసరణద్వారా జగత్తును సృష్టిస్తాడు.

మాయకు త్రిగుణా లున్నాయి. తమస్సునుండి ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి అనే పంచ భూతా లేర్పడ్డాయి. వీటియొక్క సాత్వికాంశలనుండి పంచజ్ఞానేంద్రియాలూ (శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వ, ఘ్రాణ) వాటినుండి మనస్సూ, బుద్ధీ యేర్పడ్డాయి. వాటి రాజసాంశనుండి పంచ కర్మేంద్రియాలూ (వాక్పాణి పాదపాయూపస్థలు), వాటినుండి పంచప్రాణాలేర్పడ్డాయి. ఇలా జ్ఞానకర్మేంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, మూలకంగా లింగశరీరములూ, స్థూలభూతములుగల చతుర్దశ భువనాలూ, సర్వ ప్రాణులూ, సమపదార్థాలూ సృష్టియౌతాయి. ఈ ప్రస్తరణను పంచీకరణ అంటారు. (పంచప్రాణాలు; ప్రాణాపాన వ్యానోదాన సమానవాయు తత్వాలు.)

పై ప్రస్తరణను అధ్యారోపమని అంటారు. ఐతే ఈ అధ్యారోపానికి అపవాదం (Opposit) జరిగితే "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అన్నట్లుగా తిరిగి అన్ని పదార్థాలూ పంచ భూతాత్మకమైనవనీ, ఆ పంచభూతాలూ ఆకాశాత్మకమైనవనీ, ఆ ఆకాశతత్వం త్రిగుణాత్మకమైనదనీ, త్రిగుణాలకు మూలం మాయ అనీ, ఆ మాయకు మూల పునాది ఏకైక బ్రహ్మమనీ నిరూపణౌతుంది.

ఇలా అద్వైతం deductive మరియు Inductive (వ్యాప్తిసాధక, సాధ్య) తర్క విధానాల ద్వారా ప్రపంచసృష్టిని ఊహాధారంతో నిరూపించి తన భావ పరిణామవాదాన్ని నెలకొల్పుకుంటుంది.

## 5. ఆత్మవాచన; మానవుడు

ఇక అద్వైతం మానవుణ్ణిగూర్చి ఏం చెప్తుందన్న అంశం. మానవుడు బ్రహ్మజ్ఞానాన్ని సాధించాలనీ, మాయా నివారణద్వారా మోక్షం పొందాలనీ అద్వైతం ప్రబోధిస్తుంది.

'జగత్తు మాయలేక మిథ్యకదా! అంటే అది జగ ద్రూపంలో మిథ్య అనీ, బ్రహ్మరూపంలో సత్యమనీ అన్నమాట. కాని జగత్తు లేక మిథ్యాజ్ఞానం ఎలాంటిది? 'మిథ్యాత్వం సదసద్విలక్షణత్వం' అంటే ఉన్న నిజమూ, లేని అబద్ధమూ కానిది మిథ్య అన్నమాట.

మరి దాని నివారణ ఎట్లు? 'జ్ఞానైక నివర్త్యత్వం మిథ్యాత్వం'. మిథ్యజ్ఞానంచే తొలగింపబడుతుంది. మిథ్య ఉపాధి (శరీరం) మూలకమైనది. అయినా అది "ప్రతిపన్నోపాధౌ త్రైకాలిక నిషేధ ప్రతియోగిత్వం మిథ్యా," అన్నట్లు ఉపాధిపై (జీవునిపై) ఎల్లకాలమూ ప్రభావం వేయనిది. కనుక దాన్ని నివారించ శక్యమే అని జ్ఞానకాండ ప్రతిపాదిస్తుంది.

మనం చీకట్లో ఒక తాడునుచూచి పామను కొంటాము. భయపడి నానాగల్లంతు చేస్తాము; ఆ గల్లంతు నిజమూ, అబద్ధమూ అనశక్యంకాని అవస్థ. కాని తాడు తాడనీ, పాముకాదనీ మనం తెలిసికోగానే భ్రాంతి తొలగిపోతుంది. మన భ్రమవల్ల తాడు పాముగా మారిపోలేదుగదా. అలాగే బ్రహ్మస్వరూపమైన జగత్తును మనం జగత్తనుకుంటున్నాము. అందువల్ల బ్రహ్మము జగత్తుగ కాలేదు. కనుక మనం జగత్తును జగత్తనే తత్వజ్ఞానం యేర్పడగానే భ్రాంతి తొలగిపోయి బ్రహ్మైక్యము శేషిస్తుంది. ఇదే అద్వైత జ్ఞానము.

ఇక మానవుడు. మానవులు అనేక జీవులుగా కన పడ్తున్నారు. కాని'జీవో బ్రహ్మైవ నాపరః'అన్నట్లు జీవుడు బ్రహ్మమే. జీవునికీ, బ్రహ్మమునకూ వ్యవహార దశలో భేదం ఉన్నప్పటికీ పారమార్థ దృష్ట్యా భేదం ఉండదు. వ్యవహారంలో బ్రహ్మమువలె జీవుడు సర్వజ్ఞుడూ, సర్వవ్యాపీ, సర్వశక్తివంతుడూ కాని అసమగ్రుడు. బ్రహ్మము (ఈశ్వరుడు) సృష్టికర్తయైనప్పటికీ మాయాతీతుడుకాగా జీవుడు మాయాధీనుడూ, కర్మబద్ధుడు. ఆత్మ లేక బ్రహ్మము నిరాకార, నిర్గుణము. కాని జీవుడు కర్తృభోక్తృ సుఖ దుఃఖ బంధనలకు గురియై యున్నాడు. జీవేశ్వర తా తమ్యము ఉపాధి, లేక శరీరమూలకమైనది. ఈశ్వరుడు బింబము. కాని జీవుడు శరీరావరణగతుడగు ప్రతి బింబము. జీవునియొక్క శరీరోపాధి నిక్కృష్టమైనది. అస్థిమాంసమల మూత్రకోశము. ఎల్లప్పుడూ క్షుత్పిపాసా, శ్రాంతి, క్లేశములకు లోనయేది. ఈ ఉపాధివల్లనే ప్రతిజీవుడూ వేర్వేరు దేహావరణాల్లో బంధింపబడ్డాడు. ఐతే, ఉపాధివల్ల కల్పన యీ నేను – తదితరం అన్న భేదం జీవుడు బ్రహ్మజ్ఞానం పొందినపిదప సమసిపోయేదే. కనుక జీవుడు ఉపాధిబంధనమూలకమైన "భేద" బుద్ధిని అద్వైత జ్ఞానసిద్ధిద్వారా నివారించుకోవాలి.అప్పుడు ద్వైతభావం నశించిపోతుంది.

ఉపాధిఅంటే స్థూలశరీరమేకాక, సూక్ష్మశరీరం కూడ. స్థూలశరీరం అన్నమయకోశము. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, పంచప్రాణ, పంచతన్మాత్ర మనోబుద్ధి చిత్తాహంకారములతో కూడినది స్థూలశరీరం; అలాగే పంచవాయువులు, కర్మేంద్రియాలు ప్రాణమయకోశం. జ్ఞానేంద్రియాలూ, మనస్సూ మనోమయకోశం. జ్ఞానేంద్రియ బుద్ధులు విజ్ఞానమయకోశం. ఇవన్నీ సూక్ష్మలేక లింగశరీరం. సూక్ష్మ శరీరానికి స్థూల దేహంతో మేళనమే జన్మ. విడిపోవటం మరణం. ఈ జన్మతో ఈ స్థూలదేహం నశించిపోతుంది. కాని సూక్ష్మదేహం ఉత్తరజన్మలనూ, స్వర్గనరకాలనూ పొందుతూ ఉంటుంది. మూడవది కారణశరీరం. కారణశరీరానికి అజ్ఞానం ఉపాధి. ఈ కారణశరీర భ్రాంతికూడ నిర్మూలమైనప్పుడే మోక్షం లేక బ్రహ్మ జ్ఞానసిద్ధి. అందువల్ల స్థూల సూక్ష్మ కారణ ఉపాధి బంధనలు తొలగిపోవాలి.

జీవుడు స్థూలశరీర వివేకంతో వ్యవహరిస్తాడు. అప్పుడతడు విశ్వుడు. కారణశరీరమాత్రాభిమానియైన నిద్రావస్థలో స్థూల సూక్ష్మశరీరాభిమానరహితుడు గనుక ప్రాజ్ఞుడు. స్వప్నావస్థలో వాసనామయ విహారిగా జీవుడు తైజసుడు. ఇలా ఈ మూడు దశ ల్లోను జీవుడు మాయావరణ బంధితుడే.

అలాగే ఈశ్వరుడుకూడ మూడు తత్త్వములుగా ఉన్నాడు. సమస్తభూతముల సమష్టి స్థూల సూక్ష్మో పాధులు హిరణ్యగర్భతత్త్వము. వీటన్నిటి కారణశరీ రములు అవ్యాకృత తత్త్వము. వీనియందలి చైతన్యము అంతర్యామి తత్త్వము. కాని ఈ మూడు తత్త్వముల యందీశ్వరుడు మాయాతీతుడు. మాయ ఈశ్వరాధీ నమూ, జీవుడు మాయాధీనుడూను. కనుక మాయా నివృత్తిద్వారా జీవునకు స్వరూపజ్ఞానం లేక అజ్ఞాన నివృత్తి లేక మోక్షం ప్రాప్తిస్తుంది. మాయయొక్క ఆవరణ (ఉపాధి) లేక అధ్యాస ఈ విధంగా ఉంది.

## 6. అధ్యాసానివారణ; సాధనాలు

"అతస్మిన్ తద్బుద్ధిః॥" కానిది ఔనన్న భ్రాంతియే అధ్యాస. దేహాన్ని, ఇంద్రియాలను, భార్యాపుత్రు లను, ఆస్తిపాస్తులను ఆత్మయబుద్ధితో చూడటం అధ్యాసయే. ఆ వ్యవహార సంబంధాలన్నీ ఉపాధి కల్పితమైనవేకాని ఆత్మకు చెందేవికావు. కనుక "అహ మిదం, మమేదం". ఇది నేను, ఇది నాది అన్న అధ్యాసాబంధనాలు తొలగిపోవాలి.

"బ్రహ్మసత్యం, జగన్మిధ్య
జీవో బ్రహ్మైవనాపరం:"

బ్రహ్మమేనిజం. జగత్తుమాయ కనుక జీవుడు బ్రహ్మ మేకాని మరేమీకాదు-అన్న బ్రహ్మజ్ఞాన చైతన్యాన్ని సాధించడంద్వారా జీవభావం వదలిపోయి బ్రహ్మ భావం సిద్ధిస్తుంది. అదే మోక్షం. కనుక "జ్ఞానా దేవతు కైవల్యమ్" అన్నట్టు మోక్షసాధనమూ జ్ఞానమే...

## 7. ముక్తి - విభిన్నదశలు

'సర్వమ్ ఖల్విదం బ్రహ్మ' ఈ బ్రహ్మమే సర్వమూ లేక ప్రతిదీ అన్న చైతన్యం సిద్ధించిన మహానుభావులు జీవన్ముక్తులు. వీరు జీవించియుండియే ముక్తులై యున్నారన్నమాట. జీవన్ముక్తులకు మరణకాలంలో ఎలాంటి వాసనలూ, కోరికలూ మిగలవు గనుక "న తస్య ప్రాణాః ఉత్క్రామంతి అత్రైవసమవ లీయంతే॥" అన్నట్లు వారు మరణంతో పునర్జన్మ - లేక ఉత్తరలోకవాసం లేకుండానే కైవల్యం పొందుతారు-

జప తపస్సులు, యోగాలు చేసేవారు, ఉత్తమ వైదిక విద్యాశీలురు సూర్యమండలావాసం పొంది అర్చిరాదిమార్గం ద్వారా బ్రహ్మలోకగతులై ప్రళయ కాలంలో కార్యబ్రహ్మతో సహా మోక్షం పొందుతారు. ఇది ఊర్ధ్వగతి-

యజ్ఞాలు, యాగాలు, కామ్యారాధనలు సల్పేవారు చంద్రమండలావాస ప్రాప్తిపొంది ధూమమార్గం ద్వారా కర్మఫలానుభవానంతరం తిరిగి భూలోకంలో జన్మిస్తారు-

ఇక సామాన్య జనులు. వీరు పుణ్య, పాపకర్మల ననుసరించి పుట్టూ చస్తూ ఉంటారు.

ఈ నాల్గుదశల మానవుల్లోను బ్రహ్మజ్ఞాన సిద్ధి పొందిన జీవన్ముక్తులే సర్వోత్తమ మోక్షాధికారులు. కనుక జ్ఞానమార్గం సర్వోత్తమమైనది.

జ్ఞానమార్గంలో అపరోక్ష - పరోక్ష చైతన్యము లని రెండువిధాలు. పరోక్షజ్ఞానం అనగా తత్త్వ మస్యాది వాక్యాలను పెద్దలద్వారా, గ్రంథాలద్వారా బోధపరచుకొనటం. ఇలాంటి జ్ఞానం బంధ విముక్తి, లేక అధ్యాసా విచ్ఛిత్తిని కావింపలేకున్నా ఉత్తమ పరిణతికి మార్గదర్శకమౌతుంది. ఇకను, సమగ్రమైనది అపరోక్షజ్ఞానం. ఇది అద్వైత సత్యాన్ని ఆచరణలో సాధించికొనడం. ఈ అపరోక్ష జ్ఞాన సిద్ధియే జీవన్ముక్తి.

ఐతే అపరోక్ష జ్ఞాన అనుభవం ఎలాకల్గుతుంది? రజస్తమో గుణాలను అణచివేసి సత్వ గుణాన్ని పెంపుజేసుకొంటూ సాధకుడు చిత్తశుద్ధిని సాధించాలి. రాగద్వేషాలను నిర్మూలన చేయాలి. నిష్కామకర్మాచరణ, ఈశ్వరోపాసన, యోగాభ్యాసం, ప్రాణాయామాదికం మనశ్శుద్ధికి సాధనలు. కనుక వీటిని ఆచరించాలి.

ఆత్మ నిత్యమూ జగత్తు నశ్వరమన్న నిత్యానిత్య వస్తువివేకం, ఇహాముత్ర ఫలభోగ వైరాగ్యం లేక స్వర్గ నరకాలుకూడ అనిత్యములేనన్న విరాగభావం, కోరికలనణచే శమము, దేహ సౌఖ్యాలను విసర్జించే దమము, ఈషణల వైరాగ్యం ఉపరతి, శీతోష్ణ సహనం తితీక్ష, వేదాంతశ్రవణాసక్తి సమాధానం, గురువాక్య విశ్వాసాదరాలు శ్రద్ధ, బంధవిమోచన సంకల్పము, కర్మబంధ నిర్మూలనము ముముక్షుత్వం, ఈ షడ్గుణాలను అద్వైత జ్ఞానసిద్ధికై అవలంబించాలి.

ఈ సాధనలు ఒక్క జన్మలోనే సిద్ధికాకపోవచ్చు. కాని జ్ఞానియైన గురువుద్వారా ఉపదేశంపొంది, జ్ఞాన సిద్ధి కృషికి అంకితుడైన ముముక్షువు, జన్మాంతరాల్లోనైనా, లేక ఉత్తమలోక గతులలోనైనా మోక్షం సాధించుకోగలడు. కనుక సాధకుడు నిరంతరం విధి, సాంప్రదాయ విహితంగా ఉపనిషద్గోష్ఠి జరుపుతూ, శ్రవణ, మనన, నిధిద్యాసనలను పెంపొందించుకోవాలి.

సత్సాధకునికి క్రమంగా సవికల్పక, నిర్వికల్పక సమాధి సిద్ధిస్తుంది. బాహ్యప్రపంచజ్ఞానం ఉంటూనే ఆత్మానుభవం చేకూరటం సవికల్పక సమాధి. బాహ్య జ్ఞాన నిర్మూలనతో గూడిన ఆత్మసిద్ధి నిర్వికల్పసమాధి.

నిర్వికల్పక సమాధికి ఒక సాధనం యోగశాస్త్రం. యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులనే అష్టాంగాల అనుష్ఠాన అభ్యాసాలవల్ల యోగం సిద్ధిస్తుంది. యోగశాస్త్రం పతంజలికృతము. యోగంలో రాజయోగం, హఠయోగం, కుండలినీయోగం, మంత్రయోగం, లయయోగం, కర్మయోగం, సన్యాసయోగం అని భిన్న శాఖోపశాఖ లున్నాయి. భక్తిమార్గంకూడ విశేష ప్రచారంగలదే. ఐతే, యోగశాస్త్ర చర్చ మన కిక్కడ ప్రకృతంకాదు. అయినా యోగంఅంటే దేహాన్నీ - ఆలోచనలను క్రమంగదీసి దైవభక్తి విశ్వాసాలతోడి ఆత్మజ్ఞాన మార్గావలంబనకు మానవుణ్ణి లోబరచేదేనని వేరే చెప్పవలసిన పని యుండదు.

పైన అద్వైతంలో అవలంబింపబడే తర్కసారాంశాన్ని వివరించాను. ఆధునిక విజ్ఞానశాస్త్రం వికసించని, మరియు మానవుని సాంఘిక సమానత్వ భావన రూపొందని మధ్యయుగంలో వేదాంతం విశేషించి వ్యాపకమైనది. అద్వైత పరిణామవాదం, పంచీకరణ నిరూపణ, అధ్యాసానివారణ మున్నగు శాఖలన్నీ ఊహావాద జనితములైనవే. ఆధునిక జీవశాస్త్ర, పరిణామవాద, పరిశోధనలు ఆ ఊహాగానాలను నిరాకరిస్తాయనికూడ సువిదితాంశమే.

## 8. కొన్ని సాంఘిక ప్రభావాలు - క్షీణత

అద్వైతం ప్రాపంచకదృష్టిని, చరిత్రను, విజ్ఞాన శాస్త్రాన్ని, జీవితాన్ని, దాని అనుభవ గుణపాఠాన్ని అంతా "మాయ" అంటూ, దాన్ని తొలగించే పారమార్థిక జిజ్ఞాస లేక ఆత్మజ్ఞానం వాస్తవమని వాదిస్తుంది. ఈ వాదనలు యే వనారణ్యాలనో ఆశ్రయించి బాహ్యప్రపంచ బంధనాలను వదలుకొన్న యతులూ, సాధూ, సంత్ బాబాలకు మనశ్శాంతిని చేకూర్చవచ్చు. కాని యిలాంటి వైరాగ్య ప్రబోధం సామాన్యజనుల్లో నైరాశ్య శీలతనే పెంపొందిస్తుంది...

భారతదేశంలోసాధువులూ,సంతులూ,యోగులంటూ లక్షలాది జనంఉన్నారు. వీళ్ళు పనిపాటలుచేయకుండా దేశాటన (Tramps) కావిస్తూ ఊరూరా తిరుగుతుంటారు. ఇలాంటి సాధువులకు ప్రత్యేకంగా 'మఠా' లంటూ కొన్నిగ్రామాలుకూడ ఉన్నాయి. వీరిలో కొందరు భూమీ పుట్రా, ఆస్తిపాస్తులూ ఉన్నప్పటికీ తిరిపెమెత్తుతూ ఉంటారు. ఐతే యీ సాధూసంతులు అద్వైత వేదాంతపు సాంఘిక ప్రభావాని కొక ప్రత్యక్ష నిదర్శనమంటే అదొక కటుసత్యం మాత్రమే.

బ్రహ్మసూత్రాలలో అపశూద్రాధికరణమ్ (చూడు 34 నుండి 38 వరకు) అన్న విభాగంలో శూద్రాదులకు జ్ఞానాధికారంలేదని ఉంది. శంకర భాష్యంలో ఈ సందర్భంలో జానశ్రుతుడూ, జాబాలీశూద్రులు కారనీ, కారు గనుకనే జ్ఞానాధికారం పొందారనీ వాదన చేయబడింది. ఐనా ఉన్నత వర్ణస్థులతోబాటు అద్వైతవేదాంతం పాటకజనంలోనూ వ్యాపకమైనది. వీరశైవమఠం, అచలపీఠం, వీరబ్రహ్మపీఠం మున్నగు అనేక సంస్థలు ఉన్నాయి. అలాంటి కొన్ని సంఘాల్లో ఆహార విహార లైంగిక అతిచారాది

పద్ధతులుకూడ వ్యాప్తిగాంచినట్లు చరిత్ర చెప్తూ ఉంది. ఐతే, ఆత్మజ్ఞానం యొక్క ఆదరణ పార్శ్వపు దౌర్బల్యానికి అలాంటి అనాచారాలు నిదర్శనాలౌతాయేమో. అందుకే, వేదాంతాన్ని అపహసించే 'గజం మిథ్య పలాయనం మిథ్య'లాంటి కథ లుదయించాయి. దేశం సాంఘిక సంక్షోభాలకు గురియైన దశలో ముఖ్యంగా 17, 18 శతాబ్దాలలో సామాన్య ప్రజలలోనూ అద్వైతవైరాగ్యం ప్రబలినట్లు తోస్తుంది. వీరబ్రహ్మంగారి మహిమలూ, కాలజ్ఞాన తత్త్వాలూ అలాపుట్టినవే. అలాంటి తరుణాల్లో అనేకులు యోగులూ, సాధువులూ జీవన్ముక్తి సాధనకై బ్రతికి యుండగానే సమాధుల్లో పాతిపెట్టబడ్తుండేవారు. అలా సమాధి జెందటాన్ని 'జీవసమాధి'యని చెప్తారు. జీవసమాధి జెంది సిద్ధులైనవారిని గూర్చీ-వారి మహిమలను గూర్చిన కథలూ, పాటలూ ప్రజల్లో నేటికీ వ్యాప్తమై ఉన్నాయి. సీతారామాంజనేయ కర్త లింగమూర్తి, త్యాగయ్య, వీరబ్రహ్మయోగి మున్నగు వారంతా సిద్ధపురుషులే.

వేదాంత ప్రచారానికై జీవన్ముక్తి వివేకం, ప్రబోధ చంద్రోదయం, అద్వైతకౌస్తుభంలాటి అనేక గ్రంథాలున్నాయి. వీటితోబాటు దేశభాషల్లోను సీతారామాంజనేయం (లింగమూర్తి), రాజయోగసారం (తరికొండ వెంకమ్మ), వాశిష్ఠరామాయణం, సీతపాట (సాంఖ్యం) మున్నగు అనేక గ్రంథాలు వాడుకలో ఉన్నాయి. ఇవేకాక వైరాగ్యజనకమైన స్తోత్ర, శతక, గేయ వాఙ్మయంకూడ ఉంది. ఇతిహాస పురాణ గాథలకు కృతకంగా వేదాంతపరమైన వ్యాఖ్యానాలు చేసేపద్ధతికూడ (రాముడు ఆత్మ అనీ, సీత జీవుడనీ, ఆంజనేయుడు జ్ఞానమనీ, రావణుడు మాయ అనీ, ఇలాంటి ధోరణి) ప్రబలితమైనది. ఇది సాహిత్య వివేచనలోని ఒక పెడమార్గమే.

మధ్యయుగకాలంలో వేదాంత వ్యామోహం భారతీయ సాహితీ సంస్కృతీ రంగాల కొక తీరని గుదిబండగా తయారైనది. చరమకాలపు సంస్కృత సాహిత్యకు లెందరో కావ్యాత్మ జిజ్ఞాసలో తల మునకలైపోయి పలురకాల శిల్పవాద (formalist) లాక్షణిక, ఆలంకారిక తర్కవాదాలు కావిస్తూ సాహిత్యోద్యమపు సృజన పార్శ్వాన్ని నిర్మూలం కావించారు. పిదప ఆ స్వగతశీల పాండితీ వ్యామోహం దేశభాషల్లోకినీ సంక్రమించి ప్రబంధ సుందరిని కృతక లాక్షణిక బంధనాల్లో బిగించివేసి కావ్య సహజతను కబళించివేసిందనికూడ సాహిత్యకులకు సువిదితాంశమే... కనుక అద్వైత సిద్ధాంతం సాంఘికంగాను, సిద్ధాంతరంగంలోను, సాముదాయకంగా ప్రగతి నిరోధక పాత్రను నిర్వహించిందని చెప్పవలసి యుంటుంది.

## 9. విజ్ఞాన వికాసం - భవితవ్యం

అద్వైతం జ్ఞానకాండ అయినప్పటికీ అది మతం యొక్క పూర్వ మీమాంసా మూలక అనుశాసనకూ, యోగశాస్త్రంయొక్క నివృత్తిశీల సాంప్రదాయాలకూ లోబడినట్టిదే. అద్వైతం తర్కశాస్త్రాన్ని భౌతిక వాస్తవానుభవానికి గీటురాయిగాగాక, తద్విరుద్ధ ఊహా సిద్ధాంత నిర్మాణానికి సాధనగా వినియోగించింది. భౌతిక ప్రపంచమంతా మన చైతన్యంమూలకంగానే అస్తిత్వం కల్గియుందనీ, అది మనోభావనాధీనమైనదనీ వాదన చేసింది. దేహంలో ఒక ఆత్మ - విశ్వానికి మూలం ఒక పరమాత్మ ఉంటుందన్న విశ్వాసాన్ని బలపరచింది. ఆ ఆత్మా, పరమాత్మా ఒకటేననీ, దాని భావావరణయే మానవుడూ, ప్రపంచమూ అంటూ భావవాదాన్ని నెలకొల్పింది. రూఢిజ్ఞానాన్ని, వాస్తవిక చైతన్యాన్ని సమగ్రత్వం, కేవలత్వం లేనిదని నిరాకరించ యత్నించింది. మనస్సుకు అతీతమైన వస్తు అస్తిత్వం మృగ్యమని వాదించింది. అంటే, "మన ఎదుట బల్ల ఉంది. దాన్ని మనం బల్లగా భావిస్తున్నాము కనుకనే అది బల్ల. అంతేకాని మన మనస్సుకూ, భావానికీ అతీతమైన బల్లయొక్క స్థితి బల్లకు లేదని నిరాకరించింది..." మానవునిలో తప్పులూ, భ్రాంతులూ ఉంటాయి కనుక విజ్ఞానమంతా భ్రాంతియేనని నిరూపణ చేయబూని అందుకు తర్కవాద యుక్తులను విరివిగా ఉపయోగించింది. పదార్థమూ, పదార్థ జ్ఞానమూ సర్వసమగ్రము కాదనీ, అందుకై దానిపై ఆధారపడకుండా సర్వసమగ్ర (Absolute) స్థిరశాశ్వత ఊహాకల్పిత ఆత్మజ్ఞాన సాధనకై మనస్సునూ, దేహాన్నీ తపింపజేయాలని ప్రబోధం చేసింది... ఐతే యిదంతా ఊహాజనితమైన ఒక చీట్ల పేకమేడ ధోరణియే నన్నది స్పష్టమే.

అద్వైత సిద్ధాంతానికి శ్రుతీ, ఆత్మా (పరమాత్మా) నిశ్చయాత్మక ప్రమాణాలన్న (Categorical authorites) విశ్వాసం లేక నమ్మకమే మూలపునాది. ఈ పునాదిని మన మొకహేత్వాభాస (fallacy) యని త్రోసిపుచ్చితే అద్వైత సిద్ధాంతం నిరాశ్రయమై నేల

కూలిపోవలసివస్తుంది...వాస్తవ ప్రపంచంలో అద్వైతవాది తటస్థుడు లేక నాటకంలోని ఒక పాత్రను నిర్వహించే నటకునిలాంటివాడు. అంటే అద్వైతవాదికి జీవితమంతా నటనమాత్రమే నన్నమాట !

మానవ విజ్ఞానం పలుశాస్త్ర రంగాలలో అపూర్వ వికాసం చేర్చుకుంటున్న ఈ యుగంలో పై భావవాద ధోరణులన్నీ తిరోగమింపవలసివస్తూ ఉంది. కనుక కొందరు ఆత్మవాదులు భౌతిక విజ్ఞానశాస్త్ర విజయాలను విరోధించే ప్రవృత్తిని ప్రదర్శించితే ఆశ్చర్యమేమీలేదు. అనేకులు వేదాంతు లీనాడు శాస్త్ర విజ్ఞానానికి సవాలుగా మూఢనమ్మకాలైన కొన్ని మహిమలనూ, మనస్తత్వ దౌర్బల్యాలనూ, మంత్ర తంత్ర విశ్వాసాలను లేవనెత్తుతున్నారు. కొందరు ఆత్మవలెనే, జ్ఞానంవలెనే, భ్రాంతివలెనే అద్వైత వాదానికికూడా ఒక (Exceptional status) అతీత సత్తాను నెలకొల్పుటకు తాపత్రయ పడ్తున్నారు. ఆలాంటి ధోరణులే (Neo Idealism) నూతన భావవాదం, (Neo Spiritualism) నూతన ఆత్మవాదం మున్నగు క్రొత్త పేర్లతో తలలెత్తే ఆధునికభావవాద ప్రచారాలలో ప్రతిబింబిస్తున్నాయి. కాని ప్రకృతి, పదార్థమూ దాన్ని గూర్చిన మానవ విజ్ఞానంయొక్క గతితార్కిక సమన్వయాన్ని ప్రయోగాత్మక అనుభవ గుణపాఠాలతో నిరూపించే ఈనాటి భౌతికవాద విజ్ఞాన విజయాలను పై అపవాద ధోరణుల ప్రచారం ద్వారా అరికట్టే యత్నం ఒక వృధా తాపత్రయమే.

విజ్ఞానశాస్త్ర అసమగ్రతనూ, మానవసత్తా పరిమితినీ ఒక సవాలు చేసుకొనే ఆత్మవాదం ఆ అసమగ్రతకూ, పరిమితికీ యెలాంటి పరిష్కారమూ కాదు. పైగా జీవిత సంఘర్షణలో ముందంజకు వెలుగుబాటు చూపేబదులు భావవాదం వైరాగ్య ప్రబోధంద్వారా ప్రాతికూల్యానికే నిర్బంధ విజయం కల్గిస్తుంది. కనుక అదొక తిరోగామిధోరణిగా గుర్తింపబడటం సహజం. అందుకని ఈనాటి అపూర్వ సాంఘిక పురోగమనంలో, చరిత్ర ప్రగతి నిర్మాణంలో, విజ్ఞానశాస్త్ర బహుముఖ ఉద్యమంలో ఆత్మహత్యా సదృశమైన నైరాశ్య ఆత్మవాదనిరోధాలకు ఈషణ్మాత్రంకూడ స్థానం లేదనేది శిలాక్షరమే...కనుక నేటి ప్రపంచంలో భావవాదంయొక్క పునాదులే సంచలించి పోతునట్లు సాంఘికోద్యమం నిరూపిస్తూఉంది.



# అద్వైతంలోని కొన్ని తాత్విక ధోరణులు : ఒక సమీక్ష

శ్రీ శ్రీపాద లక్ష్మీనరసింహం, యం. ఏ., బి. ఎల్.

భౌతిక విజ్ఞానశాస్త్రాలతో సన్నిహిత సంబంధం ఉన్నప్పుడే తత్వశాస్త్రం పరిపుష్టం కాగలదు. కాని దురదృష్టవశాత్తు భారతీయ తాత్విక పరిణామంలో యీ సంబంధం తెగిపోయింది. తత్ఫలితంగా మత విశ్వాసాలు, కర్మకాండ, దురహంకారం మొదలైనవి తత్వశాస్త్రంలో పెనవేసుకుపోయాయి. ఇట్టి అశాస్త్రీయ దృష్టిని పరిత్యజించాలనీ, శాస్త్రీయదృష్టితో తాత్విక పరిణామాలను పరిశీలించాలనీ రచయిత యీ వ్యాసంలో వివరించారు. అదే దృష్టితో శంకరుని అద్వైతంలోని కొన్ని ధోరణులను రచయిత సమీక్షించారు.

## 1. ఉపోద్ఘాతం

1. భారతీయ తాత్విక ధోరణులలో నేడు అద్వైతానికి విశేషమైన ప్రతిష్ఠా వ్యాప్తీ ఉన్నాయి. సాధారణంగా వేదాంతం అంటే అద్వైతమనే వాడుక.

2. ఆధునిక యుగంలో అద్వైతానికి ఇటువంటి ప్రతిష్ఠా, వ్యాప్తీ కలగడానికి స్వామి వివేకానందులే కారణం. వీరు ప్రాచ్యపాశ్చాత్య దేశాలలో విశేషంగా పర్యటనచేసి హిందూమతాన్ని ప్రచారంలోకి తెచ్చారు.

3. ప్రాచీనకాలంలో కూడ అద్వైతానికి ఈ ప్రతిష్ఠా, వ్యాప్తీ వుంది. ఆనాడుకూడా వేదాంతం అంటే అద్వైతమనేభావమే పరిపాటిలో వుండేది. అన్ని శాస్త్రాలలోకీ వేదాంతశాస్త్రం సర్వోత్కృష్టమనే అభిప్రాయం ప్రబలివుండేది.

4. ప్రాచీనకాలంలో అద్వైతానికి ఈ ప్రతిష్ఠనూ, వ్యాప్తినీ ఇచ్చినది శ్రీ శంకర భగవత్పాదులు. వీరు ఆసేతు హిమాచలం దేశం అంతా పర్యటించేరు. ఆనాడు బహుళ ప్రచారంలో వుండి, రాజాదరం అనుభవిస్తూన్న బౌద్ధమత సిద్ధాంతాలను పూర్తిగా ఖండించేరు. అనేక దురాచారాలతో నిండి క్షీణస్థితిలో వున్న హిందూమతశాఖలను శిష్టులకు ఆదరణ యోగ్యములు అయ్యేటట్లు సంస్కరించి షణ్మతోద్ధారకులుగా ప్రసిద్ధిపొందారు. ఏ శాఖయొక్క ఉపాస్య దైవతాలను నిరసించలేదు. పైగా వారిమీద సుందరమయిన స్తోత్రాలను రచించేరు. ఈ విధంగా సర్వమత సామరస్యాన్ని ఆచరణలో చూపించి ఉద్బోధించేరు. ఈకారణంచేతనే వీరి సిద్ధాంతాలతో పూర్తి అంగీకారంలేనివారుకూడా దానిపట్ల గౌరవాన్నీ ఆదరాన్నీ చూపించేరు.

## 2. శంకరుని సత్సాంప్రదాయం

5. శ్రీ శంకరులవారు అద్వైతానికి వ్యాప్తి తీసుకురావడంలో పండితులసభలు, వాదనలు, చర్చావేదికలు విశేషంగా వుపయోగించేరు. ఈ చర్చలలో పాల్గొనేవారు భగవంతుని అస్తిత్వాన్ని వొప్పుకోవాలనిగాని, వేదప్రామాణ్యాన్ని అంగీకరించాలనిగాని, సదాచారపరులయిన శ్రోత్రియులేఅయివుండాలనిగాని షరతు

లను పెట్టలేదు. న్యాయశాస్త్రబద్ధులై, ఆర్జవము (Intellectual honesty) గల ప్రతి ఒక్కరితోనూ ఆయన వాదించేరు. ఎదిరి వారి వాదనలు తప్పు అని సహేతుకంగా నిరూపించి వారిచేతనే ఒప్పించి తమ వాదనలను స్థాపించుకొన్నారు. ఇదీ అద్వైత మత స్థాపనలో వారు అనుసరించిన సంప్రదాయం.

6. కాని తరువాతివారు యీ సత్సాంప్రదాయాన్ని వదలేరు. శిష్యులకు రహస్యంగా మంత్రబోధ చేసే విధానంలోకి దింపేరు. ఇతరులతో వాదనలకు దిగవద్దని ఆంక్షలుకూడా విధించేరు. భగవంతుని అస్తిత్వాన్నీ, వేద ప్రామాణ్యాన్నీ అంగీకరించడంతోపాటు తమ జగద్గురుత్వాన్నికూడా స్వీకరిస్తేనే యీవిద్య బోధించాలనే కొత్త సాంప్రదాయాన్ని తెచ్చిపెట్టేరు. దీనితో న్యాయశాస్త్ర మర్యాదా, ఆర్జవమూ లోపించేయి. మాటలకూ, చేతలకూ మధ్య అంతరువులు పెరిగేయి. ఫలితంగా 'మెట్టవేదాంతమ'నీ, 'మరీ అద్వైతం' అనీ నిందాగర్భితమైన అపహాస్యవాక్యాలు వాడుకలోకి వచ్చేయి.

7. ఈ పరిస్థితిపోయి యథార్థమైన అవగాహన రావాలంటే శ్రీశంకరులు పాటించిన సత్సాంప్రదాయాన్ని మళ్ళీ వ్యాప్తిలోకి తీసుకురావాలి. దీనికి పునాది అధ్యయనం. న్యాయశాస్త్ర సమ్మతమూ, ఆర్జవముతో కూడినా చర్చ. ఈమాదిరి అధ్యయనమూ, చర్చావలన సరియైన తాత్విక పునాదులు ఏర్పడతాయి. ప్రజలలో విజ్ఞానవికాసానికీ, ఆచరణ శుద్ధికీ దారితీస్తాయి.

## 3. తత్త్వశాస్త్రమంటే

8. అసలు తత్త్వశాస్త్రం అంటే ఏమిటి? తత్వశాస్త్రాన్ని శ్రీ అరవిందులవారు ఈ విధంగా నిర్వచించేరు;

"మన భౌతిక జీవనానికి సంబంధించిన సత్యముల (Facts) నూ, మనోగత జీవనానికి సంబంధించిన సత్యములనూ, పరమ సత్యం అనేది వేరేవుంటే దానితో వానికిగల సంబంధములనూ, ఈ మూడింటి ప్రధాన లక్షణములనూ, బుద్ధిపరంగా గట్టిగా అవగాహన చేసుకొనేటందుకై సూత్రీకరించుటే - తత్వశాస్త్రం." (Essays on Gita - Vol. I; page 371)

9. ఈ నిర్వచనం పాశ్చాత్య సంప్రదాయానికి అనుగుణంగా వున్నట్లు అంతా అంగీకరిస్తారు. భౌతిక శాస్త్ర పరిశోధనల గురించి వ్రాసిన తన పుస్తకానికి Philosophia Naturalis Principia Mathematica అని న్యూటన్ పేరుపెట్టారు. దానిభావం భౌతిక సత్యాలకు సంబంధించిన తత్వశాస్త్రం అని. ఈ విధంగానే 19 వ శతాబ్దంలో థామ్సన్, టైట్ అనే భౌతిక శాస్త్రజ్ఞులు సుప్రసిద్ధమైన సిద్ధాంత గ్రంథం రచించేరు. దాని పేరు "Treatise on Natural philosophy" (భౌతిక తత్వశాస్త్రము.)

10. భౌతిక జీవనానికి సంబంధించిన సత్యాలను తత్వశాస్త్రంగా పరిగణించడం పాశ్చాత్య సంప్రదాయమే కాదు. మన ప్రాచీనుల సంప్రదాయం కూడా అదే. వైశేషిక దర్శనంలో చర్చించబడిన ప్రధాన విషయం భౌతిక ప్రకృతియొక్క యథార్థ స్వరూపము. ఈ స్వరూపము అణువుల కలయికవలన ఏర్పడుచున్నదని వారి సిద్ధాంతము. ఇది నేటి రసాయన శాస్త్ర సిద్ధాంతానికి సమీపం. భౌతిక ప్రపంచంయొక్క యథార్థస్వరూపాన్నే సాంఖ్యదర్శనంకూడా లోతుగా చర్చించింది. ఈ స్వరూపం అణుమూలకం (Atomic) కాదనీ, శక్తియొక్క పరిణామమువల్ల ఏర్పడినదనీ వీరి మతం. ఇది నేటి పదార్థ విజ్ఞానశాస్త్రధోరణికి సమీపం. శక్తియొక్క పరిణామంలో ప్రపంచం ఏర్పడిందని నేటి పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞులసిద్ధాంతం. అందుచేతనే ఈ ప్రపంచంలో భాగమైన పదార్థమునుండి శక్తిని తిరిగి పొందవచ్చునని అణుశక్తి పరిశోధకులు ప్రపంచానికి చూపించేరు.

11. ఈ భౌతిక ప్రపంచంలోని పదార్థాలను 24 తరగతులుగా సాంఖ్యులు విభజించేరు. ఈ విభజననే చతుర్వింశతి తత్త్వములనుగా పరిగణించేరు. అసలు తత్త్వం అనేది భౌతిక విషయ వివేచననుంచే పుట్టింది. ఇందులో మరో విశేషం గమనించవలసివుంది. భౌతిక జీవనానికి సంబంధించిన సత్యాలేగాక మనోగత జీవనానికి సంబంధించిన సత్యాలుకూడా ఈ చతుర్వింశతితత్వాలలో అంతర్భాగాలు. ఉదా: మహత్తత్వం, అహంకారం etc. ఈ తత్వాలన్నింటికీ మౌలికంగా (Primary and creative) వున్న శక్తిని వారు ప్రధానమనీ, అవ్యక్తమనీ, ప్రకృతి అనీ పిలిచేరు. వీరి మతంలో ఈ ప్రధానం 24 వ తత్త్వం.

12. ఈ ఇరవై నాలుగు తత్త్వాలనూ అతిక్రమించి ఆత్మ తత్త్వమనే 25 వ తత్త్వంకూడా వుందని వీరి సిద్ధాంతం. దీనినిగురించి తర్వాత చర్చిద్దాం.

13. భౌతిక జీవనము, మనోగతజీవనము, దీనికి భిన్నమైన పరమసత్యం అనేదివుంటే దానితోగల సంబంధాలు ఈ మూడూకూడా తత్త్వశాస్త్రములో ముఖ్యమైన అంతర్భాగాలని సాంఖ్యదర్శన పరిశీలన వలన ఏర్పడుతూంది. శ్రీ అరవిందులు తత్త్వశాస్త్రానికిచ్చిన నిర్వచనం మన ప్రాచీన సాంప్రదాయానికి అనుగుణమేనని దీనివలన గ్రహించవచ్చును.

## 4. తత్వశాస్త్రం, భౌతికశాస్త్రం

14. కాని భౌతికజీవనానికి సంబంధించిన సత్యాలను గుర్తించ నిరాకరించి, భౌతికశాస్త్ర పరిశోధనల యందు శ్రద్ధ చూపకపోవడంచేత తర్వాతవచ్చిన భారతీయ తత్త్వశాస్త్ర వివేచనకుంటుపడింది. భౌతికశాస్త్రమునుంచి తత్వశాస్త్రానికి సంక్రమించవలసిన విజ్ఞానం లోటుఅయింది.

15. గ్రీకు తత్త్వశాస్త్రజ్ఞుల ఆలోచనల (Speculations) స్థాయినిమించి మన దేశపు తాత్త్విక ఆలోచనలు సాగినా న్యూటన్, డార్విన్‌లవంటి భౌతికశాస్త్రజ్ఞుల పరిశోధనల సహాయం దానికి లభించలేదు. అందుచేతనే దాని స్వరూపనిర్మాణం అసమగ్రంగానే వుండిపోయింది. ఉదాహరణకు: సాంఖ్యుల మూల సిద్ధాంతమైన పరిణామవాదానికి డార్విన్‌వంటివారి పరిశోధనామూలకమైన పునాదులు ఏర్పడలేదు. ఇందుచేతనే కేవల తర్కమూలమైన యుక్తులచేత ఏర్పడిన వివర్తవాదం దానికి తీవ్రమైన ప్రతిద్వంద్వికాగలిగింది. పరిణామంయొక్క సత్యత్వమే శంకలోపడింది.

16. ఇటువంటి దుష్టఫలితాలు తత్త్వశాస్త్రంలో కలగడానికి కారణం భౌతికశాస్త్రంలోనుంచి సంక్రమించవలసిన విజ్ఞానం సంక్రమించకపోవడమే. నేడు భారతీయ తత్త్వశాస్త్రంలో అభివృద్ధి రావాలంటే ఈ లోపం తీరాలి.

## 5. తత్వశాస్త్రం బుద్ధిగత సూత్రీకరణ

17. తత్త్వశాస్త్రం బుద్ధిగతమైన సూత్రీకరణ అనడంలో ఒకఅభ్యంతరం రావచ్చును. యథార్థమైన పరతత్త్వం వాక్కునకు, మనస్సునకు గోచరించదు కనుక ఇట్టి సూత్రీకరణలతో ఏర్పడిన తత్త్వశాస్త్రం కేవలం వ్యర్థమని అనుకొనేవారున్నారు. ఈవాదాన్ని అంగీకరించేవారు పాశ్చాత్య తత్త్వశాస్త్రములు కేవలం ఇట్టి సూత్రీకరణలు మాత్రమేననీ, అందుచేతనే అవి పనికిమాలినవనీ వెక్కిరిస్తారు. భారతీయ తత్త్వశాస్త్ర కేవల బుద్ధిగతమైన సూత్రీకరణలు కావనీ, మన శాస్త్రంయొక్క ఆధిక్యత అదేననీ వీరి వుద్దేశం. కాని, యథార్థదృష్ట్యా తత్వశాస్త్రం బుద్ధిగతమయిన సూత్రీకరణలు కాకతప్పదు. ప్రతి శాస్త్రంయొక్క స్వరూపమూ బుద్ధిగతమైన సూత్రీకరణలే.

18. ఇంకో విషయంకూడా గమనించవలసి వుంది. పరతత్వం అతీంద్రియమనీ, అవాఙ్మానసగోచరమనీ వర్ణించే మన శాస్త్రాలుకూడా ఆ పరతత్త్వాన్ని "బుద్ధిగ్రాహ్యం అతీంద్రియం" - అనే వర్ణించేయి. మనుష్యుని బుద్ధి పరిమితమైనదన్నమాట వాస్తవమే. కాని విజ్ఞానంకోసం కృషిచేయాలంటే మనకు అందుబాటులోవున్న పనిముట్టు యీ బుద్ధి వొక్కటే. పరిమితమైనదయినా, యిది తప్ప మరో పనిముట్టు లేదు. అందుచేతనే బుద్ధిని అతిక్రమించిన పరమసత్యములను గ్రహించాలంటే బుద్ధినే ఉపయోగించుకొనవలసివుంది.

## 6. మతం తత్వశాస్త్రం

19. తత్త్వశాస్త్రం అనేసరికి ఏదో మతానికి సంబంధించిన ప్రత్యేక విషయమనే భావం కొందరికుంది. వీరివద్ద ఏదన్నా తత్త్వశాస్త్ర ధోరణిని గురించి ఎత్తితే వెంటనే దానినేదో మతానికి ముడిపెడతారు. అహేతుకంగానే అభిమానమో, వ్యతిరేకతో ప్రదర్శిస్తారు.

20. ఉదాహరణకు విశిష్టాద్వైత మనగానే అది వైష్ణవుల మత మనుకొనేవారు చాలమంది ఉన్నారు. కాని వస్తుతః విశిష్టాద్వైతులలోను, ద్వైతులలోను, అద్వైతులలోను కూడ వైష్ణవులూ ఉన్నారు; శైవులూ ఉన్నారు; శాక్తేయులూ ఉన్నారు.

21. తత్త్వశాస్త్రమూ మతమూ విభిన్న విషయాలు. తత్త్వశాస్త్రం అంటే ఏమిటో పైనచెప్పేను. భౌతిక జీవనాన్నీ, మనోగత జీవనాన్నీ అతిక్రమించిన పరమ సత్యం ఒకటుందని అంగీకరించి ఆ పరమ సత్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోనేటందుకై చేసే పద్ధతుల (ధ్యానం, జపం, తపస్సు, ఆరాధన మొదలైనవి) క్రోడీకరణమే మతం.

22. మతానికి తాత్త్వికజ్ఞానం అవసరమే లేదనువారున్నారు. కాని తాత్త్విక విజ్ఞానపు పునాదులులేని మతము కేవలం విశ్వాసంమీదనే ఆధారపడవలసి వస్తుంది. ఇట్టి కేవల విశ్వాసం క్రమేణా అంధవిశ్వాసంగా పరిణమించి అనేక దుష్ఫలితాలకు దారితీయవచ్చును. సంఘంలో వుండే అనేక దురాచారాలకు మూలం ఇట్లాంటి మూఢ విశ్వాసమే. ఇది పోయి మతం సరియైన ప్రాతిపదికమీద నిలబడగలగాలంటే దానికి తాత్త్వికపునాదులు ఏర్పరచాలి. కాని తాత్త్విక విజ్ఞానం ఏదోమతంలో పర్యవసితం కానక్కరలేదు.

## 7. తాత్త్వికధోరణులు, వేదప్రామాణ్యం

23. భారతదేశంలో ఒక సాంప్రదాయం వుంది. ఇంచుమించు ప్రతి మతమూ, ప్రతి తాత్త్వికధోరణి వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తున్నట్లు ప్రతిజ్ఞ చేస్తుంది. వేదప్రామాణ్యాన్ని అంగీకరించినవి ఆస్తిక మతాలనీ, వేదాల్ని నిరాకరించేవి నాస్తికమతాలనీ వాడుక. ప్రత్యక్షంగా వేదాల్ని ధిక్కరించిన బౌద్ధం వగైరా మతాలూ, తత్త్వధోరణులూ మన దేశంలో క్రమంగా లుప్తమైపోయేయి. ఇది చారిత్రకసత్యం. దీనికికారణం అవి వేదదూషణ చేయడమా మరొకటా అనేదిక్కడ చర్చనీయాంశంకాదు.

24. ఎన్నో విభిన్నమతాలూ, తత్త్వధోరణులూ వేదప్రామాణ్యాన్ని అంగీకరించడం హిందూమతం యొక్క సహనశీలతకు చిహ్నమని చెప్పేవారున్నారు. వీటన్నింటినీ ఒకే ఒక ముద్దగా తీసుకొని వైదిక మతం అని పేరుపెట్టడంకంటె తాత్త్విక దృష్ట్యా వానిని విభజించి, వివేచన చేయడం అవసరం.

25. షడ్దర్శనాలుగా ప్రసిద్ధి పొందిన న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంస, వేదాంత శాస్త్రములు ఆరూ ఆస్తిక దర్శనాలు. ఈ ఆరూ వేదప్రామాణ్యాన్ని అంగీకరించినవే. అయితే వీటిని మూడు జంటలుగా విడదీయవచ్చును. న్యాయ - వైశేషికాలు ఒక జంట. సాంఖ్య-యోగాలు ఒకజంట. మీమాంస-వేదాంతాలు మరోజంట. వీటిలోని ప్రతిజంటలోనూ ఒక దర్శనం ఈశ్వరుని అస్తిత్వాన్ని అంగీకరిస్తుంది. రెండోది నిరాకరిస్తుంది. న్యాయ, యోగ, వేదాంతాలు ఈశ్వరుని అస్తిత్వాన్ని ప్రతిపాదిస్తాయి. కాని వైశేషిక, సాంఖ్య, మీమాంసాదర్శనాలు ఈశ్వరుని అస్తిత్వాన్ని నిరాకరిస్తాయి. అవి నిరీశ్వర వాదాలు. భారతీయ సాంప్రదాయ దృష్టిలో ఈశ్వరుని అస్తిత్వాన్ని అంగీకరించాలనే నిబంధన ఏమీ లేదు. ఈశ్వరుని అస్తిత్వాన్ని నిరాకరించేవారు కూడా సదాచార పరాయణులైన ఆస్తికులు కావచ్చును. నాస్తికుడు వేదదూషణ చేసేవాడు మాత్రమేగాని ఈశ్వరుని అస్తిత్వాన్ని అంగీకరించనివాడని కాదు.

26. వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తున్నామని చెప్తూన్నా ఈశ్వరుని అస్తిత్వంలాంటి ప్రధానవిషయం మీదనే ప్రత్యక్షంగా భేదించే సిద్ధాంతాలు ఏలా మనుగడ చెందుతున్నవీ తెలుసుకోవలసిన విషయమే. ఇవన్నీ వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తున్నామని చెప్తూ వేదాలకు తమ కనుకూలంగావుండే భాష్యాలనే వ్రాస్తాయి. అంటే ప్రతిమతమూ తన కనుకూలమైన వాక్యాలను మాత్రం తీసుకొంటుంది. ఇష్టంలేని వానిని తోసివేస్తుంది. ఈ సందర్భంలో ఈ ప్రయోజనం నిమిత్తం నిర్మించబడిన పదజాలమే "అర్థవాదం", "గౌణం", "నహినిందా" న్యాయం మొదలయినవి. ఈ పారిభాషిక పరికరాలతో, వేదాన్ని అంగీకరిస్తూనే ఎవరికి కావలసిన మతాల్ని వారు ప్రతిపాదించ వచ్చునేమోననిపిస్తుంది.

27. మనకోర్టుల్లో జరిగే చట్ట సంబంధమైన చర్చలను ఈసందర్భంలో గుర్తుకు తెచ్చుకోవచ్చును. ప్రతి కోర్టూ చట్టానికి బద్ధమైవుండాలి. ధిక్కరించకూడదు. కాని భాష్యం చేయవచ్చు. ఈ భాష్యాలు అసలు చట్టాన్నే తల్లక్రిందులు చేసేఘటనలున్నాయి.

28. బైబిల్ పరిస్థితి కూడా ఇంతే. ఖురాన్ పరిస్థితీ ఇంతే. వడ్డీపుచ్చుకోవడం మహాపాపమని మహమ్మదీయ మతం అభిప్రాయం. దాని పర్యవసానంగా స్వాధీనపు తనఖాదస్తావేజులు వ్యాప్తిలోకి

వచ్చేయి. ప్రతి మతంలోనూ ఇల్లాగే జరుగుతూంది. జరగక తప్పదు కూడా. ఎందుచేత ?

29. పరమ ప్రమాణమనీ, శిరోధార్యమనీ అనడంలో వుద్దేశం వాటిలో మార్పు అసంభవమనీ, కాలంయొక్క ప్రభావం వాటిమీద వుండదనీ భావించడమే. కాలప్రభావానికి లోబడని వస్తువు జగత్తులో లేదు. ఆచరణ కాలప్రభావానికి లొంగి మారుతూ వుంటుంది. ఈ ఆచరణ భూత భవిష్య ద్వర్తమానాలకు అతీతమై, త్రికాలములయందూ ప్రమాణభూతమైన సిద్ధాంతాలకు కట్టుబడి వుండదు. కాలంతోపాటు సద్ధాట్లూ, కొత్తసిద్ధాంతాలూ అవసరం. వీటిని బుద్ధిపూర్వకంగా సూటిగా ప్రతిపాదించుటకు అవకాశం లేనప్పుడు భాష్యం పేరుతో పాతసిద్ధాంతాల స్థానే కొత్త సిద్ధాంతాలు ప్రవేశ పెట్టబడి వ్యాప్తిలోకి వస్తాయి.

# 8. మతదురహంకారం

30. వేదాలు అనంతాలు అనడంలో ఏ మనుష్యుడూ తన పరిమితమైన మనస్సుతో సంపూర్తిగా గ్రహించలేడనే వాదం ఇమిడివుంది. ఇది రుజువయ్యే పరిస్థితి లేదు. సర్వజ్ఞుడైన భగవంతునికి అనంతమైన తనశక్తి యొక్క పారము తెలుసునా తెలియదా - అనే ఋగ్వేదంలోని ప్రశ్నలాంటిదే ఇదీను. దానికి ఏ సమాధానం ఇచ్చినా దానిని తప్పు అని ఋజువుచేయడానికి అవకాశం వుంది. పరిమితమైన మానవ మేధస్సుకు ఒక వస్తువుయొక్క అనంతత్వాన్ని గ్రహించడం సాధ్యమా కాదా ? అన్న ప్రశ్నకు సులువైన సమాధానం లేదు.

31. వేదాలు అనంతాలనీ, మనుష్యమేధ పరిమితమనీ, అందుచేత కొన్నిభాగాలు మాత్రం జ్ఞాపకంలో మిగిలేయనీ, మిగతావి ఖిలమయ్యేయనీ చెప్పే వాదం చాలా ప్రమాదకరమైనది. కొన్ని వచనాలు ప్రమాణంగా ఇచ్చి అవి ఎక్కడివి అంటే ఖిలభాగాలలోనివని చెప్పి తప్పించుకొనే అవకాశంవుంది. ఇటువంటివి కొన్ని ద్వైతభాష్యంలో వున్నట్లు వినికిడి.

32. ఇక వేదాల నిత్యత్వం గురించి. వీటిని పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాసరూపములు అన్నా, వీటికి పరమేశ్వరుడు కర్త అన్నా ఇవి సృష్ట్యాదిలో ఉద్భవించేయనీ, వీటికి మార్పులూ చేర్పులూ లేవనీ అర్థం. సృష్ట్యాది అనంతరం పరమేశ్వరుని వలన ప్రామాణికమైన నూతన విజ్ఞానోదయం కలగలేదనే తప్పుసిద్ధాంతానికిది దారితీస్తుంది. ఈశ్వరుడు అద్రష్టుడైన వానికి ఎల్లప్పుడూ విజ్ఞానోదయం కలిగిస్తూ ఉపదేశాలు చేస్తాడనేది విజ్ఞులంగీకరించక తప్పదు. యోగసూత్రాలోని "సఏష పూర్వేషా మపిగురుః" అని ఈశ్వరుని గురించి చెప్పినవచన మే ఇక్కడ ప్రమాణం. ఈ సూత్రములో నున్న "అపి" (కూడా) అనే మాట వలన ఈశ్వరుడు పూర్వులకేకాక నవీనులకు కూడా గురువు అని అర్థం ఏర్పడుతుంది. ఈ పరిస్థితికి అనుగుణంగా వేదాల నిత్యత్వానికి భాష్యం చెప్పుకోవలసి వుంటుంది. మరోదారి లేదు.

33. ఇక వేదాల అపౌరుషేయత్వాన్ని తీసుకొందాం. ఈ అంశాన్ని న్యాయదర్శనమే అంగీకరించలేదు. "వేదః పౌరుషేయః। వాక్యసమూహత్వాత్। భారతాదివత్"-అని అన్నంభట్ట ఉపాధ్యాయులవారు తర్కసంగ్రహ దీపికలో వ్రాసేరు. న్యాయదర్శనం ఆస్తికదర్శనమే అయినా, అది అపౌరుషేయతను అంగీకరించలేదు.

# 9. భగవద్గీత, వేదములు

34. వేదం ప్రామాణిక గ్రంథం అని చెప్తూన్న భగవద్గీతలోనే ఈదిగువ వాక్యాలు కూడా కనిపిస్తాయి:

యామిమాం పుష్పితాం వాచం
ప్రవదం త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ
నాన్యద స్తీతి వాదినః
..............

త్రైగుణ్య విషయావేదా
నిస్త్రైగుణ్యోభవా ఒర్జున !
... ... ...

35. వీనిలో వేదదూషణ వుందా లేదా అన్న విచారణ అనవసరం. కాని, వీనిలో వేద ప్రామాణ్యాన్ని అంగీకరించేవారికి గౌరవం మాత్రం ఇవ్వలేదు. "వేదవాదరతు" లైన "అవి పశ్చితుల" (అవివేకుల)

బుద్ధి సమాధిలో ప్రవేశించలేదు అనిచెప్తూ వేదములు సత్వరజస్తమోగుణాత్మకములు, నువ్వు త్రిగుణాతీత స్థితిని పొందవలసింది అని అర్జునుడికి గీతాకారుడు ప్రబోధించాడు. గీతా రచన కాలంనాటికి వేదములు కేవల కర్మపరములుగానే భావింపబడి వానియందు గౌరవం సన్నగిలింది. వేదోక్తాలైన కర్మలవల్ల కలిగే స్వర్గాది సుఖాలు కూడా నాటి శిష్టులనే ఆకర్షించ లేక పోయాయి. ఈ స్వల్ప విషయాలకన్న ఏదో అధికమైన విజ్ఞానంకోసం తృష్ణ ఎక్కువైంది. వేదముల మీదవున్న అసంతృప్తి పై వాక్యాలలో కనిపిస్తుంది. ఆ విధంగానే నూతన విజ్ఞానంకోసం కలుగుతున్న తృష్ణను తాను తీర్చగలననే భావం ఈ క్రింది శ్లోకాలలో శ్రీ కృష్ణుడు సూచించేడు:

"ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవా నహ మవ్యయం।
వివస్వాన్ మనవే ప్రాహ
మను రిక్ష్వాకవేఽ బ్రవీత్॥

ఏవం పరంపరా ప్రాప్తం
ఇమం రాజర్ష యోవిదుః
సకాలేనేహ మహతా
యోగోనష్టః పరంతపః॥

సఏవాఽయం మయాతేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మేసఖాచేతి
రహస్యం హ్యేతదుత్తమం॥
[గీత. 4 వ. అ. 1—3శ్లో]

గురువు కొత్తవిషయం ఏది చెప్పినా తన స్వకపోల కల్పితంగా చెప్పడం సాంప్రదాయం కాదు. అలాచెప్తే దానిమీద ప్రామాణిక బుద్ధిదరక విలువతగ్గే భయంవుంది. అందుచేతనే సామాన్యంగా తన ఉపదేశం పరంపరాగతమని చెప్పడం ఒక ఆచారం. ఈ ఆచారంయొక్క ప్రభావంకూడా పై శ్లోకాలలో కనిపిస్తుంది. ఈ పరంపరకు తానే మొదటి గురువనీ, ఆ పరంపర కాల గర్భంలో లుప్తమైందనీ, తానే తిరిగి పునరుద్ధరిస్తున్నాననీ చెప్పడంవలన కొత్తపరం పరనే ప్రారంభిస్తున్నట్లు దానికి తానే కర్తనన్నట్లు ధ్వని కూడావుంది.

36. వేదవాదుల మనుకొనేవారిలో సాధారణంగా కనబడే మరో దుర్గుణాన్ని కూడా శ్రీకృష్ణుడు [illegible]లో సూచించి దానిని ఖండించేడు :

"వేద వాదరతా పార్థ !
నాన్యదస్తీతి వాదినః॥

దురహంకారం తొణికిసలాడే భావాలన్నీ "నాన్యదస్తి" అనే పదంలో ఇమిడివున్నాయి. మత దురహంకారానికి, అధికార దురహంకారానికి, రాజకీయ దురహంకారానికి యింకే యితర దురహంకారానికి కూడ ప్రధాన లక్షణం తాను చెప్పిందితప్ప "నాన్యదస్తి" (మరొకటి లేదు) అనే తలబిరుసుతనపు ప్రకటనే. దీని స్వరూపాన్ని షేక్స్పియర్ ఇల్లా [illegible]చేడు:

"I am Sir Oracle,
and when I ope my lips
let no dog bark."
— Merchant of Venice

("నేను సర్వజ్ఞుడను. నేను ప్రసంగం ప్రారంభించినప్పుడు అల్పులు అడ్డు ప్రశ్నలు వేయరాదు")

ఈ ధోరణినే శ్రీ కృష్ణుడు తన వాక్యంలో [illegible]నిశితంగా ఖండించేడు. *

* ఇదే అభిప్రాయాన్ని శ్రీ అరవిందులవారు [illegible] వ్యాసాలు 1 వ సంపుటంలోని సాంఖ్యయోగం, వేదాంతమూ అనే 9 వ వ్యాసంలో విస్తృతంగా విమర్శించేరు.

## 10. అధ్యాస, జ్ఞానం

37. వేద ప్రచోదితములయిన కర్మలు యావత్తూ అధ్యాసమీద, అజ్ఞానంమీద ఆధారపడి జరుగుతున్నవేనని శ్రీ శంకరుల అభిప్రాయం. వారి గ్రంథాలలో చాలచోట్ల ఇది కనిపిస్తుంది.

"బ్రాహ్మణోయజేతే" త్యా దీని శాస్త్రాణి ఆత్మని వర్ణాశ్రమవయో ఽవస్థా విశేషాఽధ్యాస మాశ్రిత్య ప్రవర్తంతే." [అధ్యాస భాష్యంనుంచి]

బ్రాహ్మణుడు యజనము చేయవలయును [illegible] మొ[illegible]ష్యము ఆత్మయందు వర్ణ, ఆశ్రమ, వ[illegible] మొదలగు విశేష అధ్యాసవ[illegible] [illegible]చి వుంటూంది.

[illegible]నే అధ్యాసను ఆశ్రయించి [illegible]నములను పోగొట్టుకోవ[illegible]

జ్ఞాన గ్రహణకు అవసరమని శ్రీ శంకరులు ఉపదేశ సాహస్రిలో చెప్పేరు.

జాత్యాద్యభిమానాదీన్ తత్ప్రతిపక్షైః శృతి స్మృతి విహితైః అపనయేత్.

జాతి కులాభిమానాలను శృతి స్మృతి విహితమైన ప్రతిపక్ష భావనవలన తొలిగించాలి. అనగా 'త్వం' పదమునకు గల లక్ష్యార్థమును బోధించుట ద్వారా, అనగా ఆత్మస్వరూపమును బోధించుట ద్వారా-అని విజ్ఞులు వివరించేరు.

# 11. అఖండజ్ఞానం, సాపేక్షజ్ఞానం

39. న్యూటన్ మహాశయుడు "యూనివర్సల్ లా ఆఫ్ గ్రావిటేషన్" అనే దానిని పరిశోధించి కనుక్కొని 1687 ప్రాంతంలో తన Principia అనే గ్రంథంలో (లాటిన్ భాషలో) బయట పెట్టేడు. అదొక ప్రకృతి సూత్రం. దీనికి ఆయన ద్రష్ట అనవచ్చును. ఆయన దీనిని గమనించక పూర్వం కూడా ఈ సిద్ధాంతం పూర్తిగా అమలులో వుంది. ఆయనగాని మరొకరుగాని దీనిని కనిపెట్టివుండక పోయినా ఇది అమలు జరుగుతూనే వుంటుంది. ఆయన దాని సమగ్ర రూపాన్ని చూచివుండలేదు. నేటికాలానికి ఐన్‌స్టీన్ మహాశయుడు యీ సూత్రానికి తన సాపేక్షసిద్ధాంతంలో మరింత సమగ్రరూపాన్ని ఇచ్చి వ్యక్తపరిచేడు. న్యూటన్ కనుగొన్న సూత్రం అసంపూర్ణంగావున్నా ప్రకృతిలో అమలులోవున్న గ్రావిటేషన్, సూత్రం మాత్రం ఐన్‌స్టీన్‌తీర్చిదిద్దిన సమగ్రరూపమే. ఐన్‌స్టీన్ మరొద్రష్ట. దీనికింకా రూపులు తీర్చేద్రష్టలు ఇక ముందూ వుండవచ్చు.

40. ఈ ద్రష్టలతో నిమిత్తంలేకుండా, వారి రచనల అపేక్షలేకుండా ప్రకృతి సిద్ధంగా వున్న సూత్రాలు నిత్యాలు.

41. ఇవి అపౌరుషేయాలు కూడాను. వీటిని ఏర్పరచినది వారి ద్రష్టఅయిన న్యూటనూ కాదు. ఐన్‌స్టీనూకాదు. వారు ఆసూత్రంయొక్క ద్రష్టలు మాత్రమే. మానవుని జ్ఞానం పరిమితం. అందుచేత వారి ద్రష్టత్వానికీ పరిమితులున్నాయి. ఉన్నా తప్పులేదు.

42. ఇట్టి సూత్రాలు అనంతాలు. అనగా అసంఖ్యాకాలు. మానవ మేధస్సు వికసించినకొద్దీ పరిణామ క్రమంలో తర తమముల వారీగా లోతయిన సిద్ధాంతాలను గ్రహించే స్థాయి ఏర్పడి, [illegible]గా హెచ్చుస్థాయిలోనున్న సూత్రాలను [illegible] తుంది. అందుచేత ఈ సూత్రాలస[illegible] మితులుండవు.

43. ఈ సందర్భంలో [illegible] ఈ సూత్రీకరణ గమనార్హం

"మానవ విజ్ఞానం అఖండం; కాని యీ అఖండ విజ్ఞానం పరిమిత జ్ఞానం గల మానవుల ఆలోచనా పరంపర ద్వారానే గ్రహింపబడుచున్నది. అఖండ సత్యస్వరూపం గల జ్ఞానం పరిమిత సత్యస్వరూపం గల సాపేక్ష జ్ఞానక్రమం ద్వారానే సిద్ధించగలదు. అఖండ జ్ఞానం, అఖండ సత్యం - ఈ రెంటిలో ఏ ఒక్కటీ కూడా మానవజాతి యొక్క అనంత కృషి ఫలితంగా తప్ప మరో విధంగా లభించదు. అనగా మనం తిరిగి ఒక వైరుధ్యంలో ప్రవేశిస్తున్నాం. సహజంగానే అఖండమైన మానవుని ఆలోచనా స్వభావానికీ, పరిమిత జ్ఞానంగల ప్రత్యేక వ్యక్తులలో ద్యోతకమయే చాల పరిమితమైన విజ్ఞానానికీ గల వైరుధ్యమే యిది. ఈ వైరుధ్యాన్ని పరిష్కరించడానికి ఒకే మార్గం ఉంది. అది అనంతమైన పరిణామం లోనే లేక మానవజాతి యొక్క నిరంతర పురోగతి ఫలితంగానే పరిష్కరింపబడగలదు."

— Engels ; Anti Duhring. Ch. 9

44. ఇట్టి సూత్రాల సముదాయమే వేదాలు. ఈ అర్థంలోనే వేదాలు అనంతాలు, అపౌరుషేయాలు, నిత్యాలు, పరమప్రమాణాలూను. వీనికి మహర్షులు ద్రష్టలు మాత్రమే. రచయితలు కారు.

45. ఈ సూత్రాల ఉనికి కాలాఽపరిచ్ఛేద్యం. అంటే ఒక కాలంలో అంతరించేవి కావని అర్థం. మరో పరిభాషలో చెప్పాలంటే వీనిని ఈశ్వరుడే సృష్టించేడనవచ్చు. అలంకారికంగా చెప్తే ఇవి ఈశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాస రూపాలనీ అనవచ్చు. ఈ అలంకారాన్ని మరింత సాగిస్తే ఉచ్ఛ్వాస నిశ్వాస రూపాలు గనక వీటికి ఈశ్వరుడుకూడా కర్త కాడనవచ్చు. ఇది అలంకారికమైన పరిభాష మాత్రమేనని మరచి పోకూడదు.

46. ఇట్లాంటి సూత్రాలు మన భౌతిక జీవితానికి సంబంధించినవి కావచ్చు; మనోగతజీవితానికి సంబంధించినవి కావచ్చు. వీనికన్న వేరైన పరమ సత్యాన్ని

సంబంధించినవీ కావచ్చు. పరమ సత్యానికి సంబంధించిన సూత్రాలను బహిర్గతం చేయడానికి మనకున్న పరికరాలు మనసూ, బుద్ధి మొదలయినవి మాత్రమే గనక ఈ పరికరాల పరిమితులలోనే ఆ బహిర్గతమైన సూత్రాల ద్రష్టత్వం కూడా పరిమితం కాకతప్పదు. ఆ పరికరాల వికసనతో ద్రష్టృత్వమూ వికసిస్తుంది. ఈ సూత్రాల సమగ్రతకూడా వికసిస్తూనేవుంటుంది. పూర్వంకన్న అధిక సమగ్రత ఏర్పడుతూంటుంది.

47. ఈ భౌతిక జీవితానికీ, మానోగత జీవితాని , పరమసత్యానికీ సంబంధించిన సత్యముల బుద్ధిగత సూత్రీకరణమే తత్త్వశాస్త్రం అని ప్రారంభంలో వ్రాసేను. సత్యంయొక్క సమగ్రరూపాన్ని క్రమక్రమంగా గ్రహించడంలో అనేక తాత్విక ధోరణులు బయలుదేరక తప్పదు. ఇదే సరియైన పంథాకూడాను. దీనికి చికాకు పడవలసినపని పనిలేదు.

## 12. తాత్వికధోరణుల పరిణామం

48. తత్వశాస్త్ర ధోరణులలో ఒక ధోరణిని మరొక ధోరణి ఓడించిందనడం రివాజుగా వినిపిస్తూంటుంది. ఈ మాటను సరిగ్గా అర్థం చేసుకోవడం అత్యవసరం. లేకపోతే చాలా అపార్థాలకు దారితీస్తుంది.

49. న్యూటన్ మహాశయుని గ్రావిటేషన్ సిద్ధాంతాన్ని ఐన్‌స్టీన్ ఖండించి దాని స్థానంలో తన సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడని కొందరు అనుకొంటూంటారు. దాని అర్థం న్యూటన్ సిద్ధాంతం వట్టి తప్పుల తడక అనీ, దానిని తెలుసుకోవలసిన అవసరం లేదనీ కాదు. న్యూటన్ చేసిన పరిశోధనల పరిమితిలో ఆనాటికది పూర్తిగా సత్యమే. దానిని ఆధారం చేసుకొని తరువాత రెండు వందల ఏళ్ళపాటు జరిగిన పరిశోధనలు దాని సత్యత్వాన్ని రుజువుచేస్తూనే వచ్చేయి. అందుచేతనే నేటికీ ఫిజిక్సు, ఇంజనీరింగ్ మొదలయిన రంగాలలో న్యూటన్ సిద్ధాంతాలు పూర్తిగా యథాతథంగా అమలులో వున్నాయి. అందుకే వాటిని నేటికీ అధ్యయనం చేస్తున్నారు. చేయకతప్పదు కూడా. అయితే పరిశోధనల స్థాయి పెరిగి కొత్తరంగాలకు న్యూటన్ సిద్ధాంతాలను అమలు జరపడానికి ప్రయత్నించినప్పుడు వాటిలోసవరణలుచేస్తే తప్పసరియైన ఫలితాలురాలేదు. ఈ సవరణలు న్యూటన్ సిద్ధాంతాల పునాది మీద జరిగినవేతప్ప వానిని కూలద్రోసినవి కావు. ఏ యే రంగాలలో న్యూటన్ సిద్ధాంతాలు అఖండ విజయాల్ని సాధించేయో ఆరంగాలలో ఆ సిద్ధాంతాల సత్యత్వం బాధితం కాలేదు. ఈ సవరణతో కూడిన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినది ఐన్‌స్టీన్. సవరణ ఐన్‌స్టీన్‌దయితే సిద్ధాంతం న్యూటన్‌ది. స్పుట్నిక్‌ల ప్రయోగంలోనూ, ధ్వనివేగాన్ని మించిన రాకెట్ల, విమానాల ప్రయోగంలోనూ, అటువంటి ఇతర రంగాలలోనూ ఐన్‌స్టీన్ సవరణతో కూడిన న్యూటన్ సిద్ధాంతం ఉపయోగపడుతూంది. సిద్ధాంతస్థాయిలో ఒకదానిని మరొకటి ఖండిస్తూందనీ, ఓడిస్తూందనీ చెప్పే పరిస్థితులు ఇటువంటివే. ఓడింపబడిందని చెప్పే సిద్ధాంతం ఏదీ సంపూర్ణంగా అసత్యం అయివుండదు. ఈ సవరణతో కూడిన పాతసిద్ధాంతం పాత సిద్ధాంతాన్ని జయించిందని సంతృప్తి పడితే పడవచ్చు కాని, యథార్థానికది జయంకాదు, అపజయంకాదు. కొన్ని పరిమితులలో అవగాహనచేసు కొన్న సిద్ధాంతాన్ని కొత్త పరిమితులలో విస్తృతం చేయడమే జరిగింది. ఇది సరియైన శాస్త్రీయ అవగాహన ధోరణి.

50. ఇక తాత్వికాలోచనల విషయంకూడా ఇంతే. సాంఖ్యాన్ని వేదాంతులు త్రోసి రాజన్నారన్నా, బౌద్ధమతాన్ని శంకరుడు ఖండించాడని అన్నా, భావవాదాన్ని భౌతికవాదం వెనక్కి నెట్టిందని అన్నా- ఈ మాదిరి వాక్యాలన్నింటికీ అర్థం ఒక్కటే. పాత సిద్ధాంతాల్ని కొత్తపరిస్థితులలో వుపయోగించడానికి అవసరమైన సవరణలు సిద్ధాంత స్థాయిలో ఏర్పడ్డాయన్నమాట. దీనిని సరిగా అవగాహన చేసుకొంటే, శంకరుడు ప్రచ్ఛన్న బౌద్ధుడా ప్రత్యక్ష బౌద్ధుడా అనే ప్రశ్నలాంటివి ఉత్పన్నంకావు.

## 13. సాంఖ్యుల ప్రకృతి

51. శ్రీ శంకరులవారి సిద్ధాంతాన్ని శ్లోకార్థంలో- "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః"- అని నిర్వచనం చేయవచ్చునని చెప్పడం పరిపాటి. అద్వైతం చేసిన స్వతంత్ర సూత్రీకరణలను గురించి చర్చించాలంటే, దానికి పూర్వం వ్యాప్తిలో వున్న తాత్త్వక సూత్రీకరణలు ఏవేవి? వాటికి అద్వైతం

చేర్చిన నూతన సూత్రీకరణలు ఏవి? -అనేది ముందుగా విమర్శించి తెలుసుకోవాలి.

52. ఒకానొకప్పుడు సాంఖ్యదర్శనం విశేష వ్యాప్తిలో శిష్టుల ఆదరణను పొందివుండేది. వీనిలో కొన్ని సూత్రీకరణలను స్వీకరించీ, కొన్నిటిని సవరించీ, కొన్నిటిని త్రోసిపుచ్చీ, కొన్ని సరికొత్త సూత్రాలను చేర్చి వ్యాసులవారు బ్రహ్మసూత్రాలతో వేదాంత దర్శనాన్ని నిర్మించేరు. బ్రహ్మసూత్రాలలో జరిగిన చర్చలలో ప్రధానమల్ల న్యాయంగా సాంఖ్య దర్శనాన్ని ప్రధానంగా విమర్శించడం జరిగింది. ఇప్పుడు మనం సాంఖ్యంనుంచి వేదాంత దర్శనం తీసుకొన్నదేమిటో పరిశీలించవలసివుంది. దీనికోసం సాంఖ్యదర్శన స్వరూపాన్ని అతిసంగ్రహంగానైనా తెలుసుకోవడం ముఖ్యం.

53. సాంఖ్య దర్శనంకూడా దానికి ముందున్న వైశేషికాది దర్శనాలనుంచి పుట్టినదే. బ్రహ్మ సూత్రాలు చేసినట్లే సాంఖ్యదర్శనం దీనికి సవరణలు చేసీ, కొత్తవిచేర్చి రూపొందినదే. అంతకు పూర్వం వున్న దర్శనశాస్త్రాలలో సాంఖ్యం ఒక విప్లవాన్నే తెచ్చింది. వాటినికూడా తెలుసుకోవడం మంచిదీ, ఉపయోగకారీ కావచ్చు. కాని ప్రస్తుతానికి అనవసరం.

54. దృశ్యమాన విశ్వంలో జడాత్మకమైనవీ, చైతన్యాత్మకమయినవీ రెండు అనుభవంలో వున్నాయి. ఈ విభజన కొంచెం ఇంచుమించుగా అన్నిదర్శనాల లోనూ వుంటుంది; వుంది.

55. శక్తి (energy) యొక్క మార్పులు (transformations), పరిణామాలు (evolution) వల్ల జడాత్మకమైన విశ్వం ఏర్పడిందని సాంఖ్యుల మూల సిద్ధాంతం. ఈ శక్తికి మౌలికస్థితిలో వారు అవ్యక్త మనీ, ప్రకృతిఅనీ, ప్రధానమనీ పేరుపెట్టేరు. దీనిలో ప్రకృతి అనే పేరు తర్వాత దర్శనాలలో రూఢం అయిపోయింది. ఈ ప్రకృతి సూక్ష్మాతి సూక్ష్మమైన శక్తిస్వరూపం. ప్రతిక్షణం మార్పు పొందుతూ, పరిణామాన్ని పొందడమే దీని స్వభావం (క్షరం). దీనికి సూటియైన ఇంగ్లీషుమాట Becoming. మన అనుభవంలో ప్రపంచంలోని ప్రతి ఒక్క వస్తువూ క్షరమే.

56. మనోగత జీవితానికి సంబంధించిన మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం మొదలయిన అంతఃకరణము లోని విభాగాలూ, ప్రవృత్తులూ యావత్తూ జడ ప్రకృతి పరిణామంలో ఏర్పడినవి మాత్రమేనని సాంఖ్యులమతం. రక్తమాంసాదులతో ఏర్పడిన ఈ శరీరంలాగే అంతఃకరణకూడా భౌతికమేనని వారి అభిప్రాయం. అది స్థూలశరీరమైతే ఇది సూక్ష్మశరీర మన్నారు. మొత్తంమీద ఈ రెండూకూడా జడాత్మ కాలే. రెండూ ప్రతిక్షణం మార్పునూ, పరిణామాన్నీ పొందుతున్న 'క్షర' పదార్థాలే. (Becoming మాత్రమే).

57. ప్రకృతికి మూడుగుణా లున్నాయన్నారు. (సత్త్వ, రజ, స్తమోగుణాలు). జడాత్మకమైన ప్రకృతిలో పరిణామక్రమంలో గుణాత్మకమైన మార్పులు (Qualitative changes) వస్తాయన్నారు. ఈ మార్పులలో ఏర్పడినదే సూక్ష్మశరీరమూ, స్థూలశరీరమూ ననీ, వాటి నైసర్గిక స్వభావాలూ, పనులూ గుణాత్మక మైనమార్పులనుంచి పుట్టినవేననీ వారు చెప్పేరు.

58. ఈ ప్రకృతిని గుణాత్మకములయిన మార్పులతో ఇరవైనాలుగు తత్వాలనుగా విభజించ వచ్చునని సాంఖ్యుల అభిప్రాయం. ఈ తత్త్వాల వివరాలను గాని, వానిలో వానికిగల తేడాలనుగాని వ్రాయడం ఇక్కడ అప్రస్తుతం. ఈ తత్త్వవిభజనను తర్వాతి దార్శనికులంతా కొంచెం ఇంచుమించులో అంగీకరించేరు. తత్త్వాలను ఏయేపాళ్ళలో సమీకరణచేస్తే గుణాత్మకమైన మార్పులువచ్చి స్థూల, సూక్ష్మ శరీరాలలోని ఏయే భాగాలు ఏర్పడతాయో ఆ వివరణలను 'పంచీకరణం' అన్నపేరుతో శిష్టులైన వేదాంత దార్శనికులు వేదాంత శాస్త్రంలో ఒక భాగంగా రూపొందించేరు. ఈ పంచీకరణ వివరాలతో కూడా మనకు ప్రస్తుతం పనిలేదు.

59. ఇన్ని మార్పులున్నా, ఇన్ని తత్వాలుగా విభజింపబడినా ప్రకృతి తన మౌలికమైన ఏకత్వాన్ని కోల్పోలేదని వీరు ప్రతిపాదించేరు. తక్కిన దార్శనికులు అంగీకరించేరు.

## 14. సాంఖ్యుల పురుషుడు

60. ఈ అక్షరాత్మకమైన ప్రకృతికి భిన్నమైన మరొక పదార్థం వున్నదా అనే విషయాన్ని కూడా వారు చర్చించేరు. ఉందన్నారు. ఇది 'క్షర' మైన పదార్థానికి భిన్నం కనక దీనిని అక్షరము అనవచ్చును. కొందరు అన్నారుకూడా. ఇది పరిణామాత్మకమైన పదార్థానికి (Becoming) భిన్నంగనక పరిణామరహితమైన (Being) పదార్థం అనవచ్చును. గుణశీలమై ప్రకృతికి భిన్నంగనక నిర్గుణంకూడాను. ఈ నిర్గుణ, అక్షర, పరిణామరహిత పదార్థానికి 'పురుషుడు' అని పేరు పెట్టేరు. ఇది పారిభాషిక పదమేగాని వాడుకలో వున్న లింగ విభేదాన్ని సూచించే మాటమాత్రం కాదు. సాంఖ్యుల మతంలో ఇది 25 వ తత్త్వం. విశ్వంలో కనిపిస్తున్న చైతన్యం ఈ పురుషతత్త్వమేనని వారి అభిప్రాయం. జడతత్త్వాలు. 24. చైతన్యతత్త్వం, 1. ఈ ఇరవయ్యైదు తత్త్వాల పరస్పర సమ్మేళన వలన విశ్వమంతా ఏర్పడిం దనేది వీరి సిద్ధాంతం.

## 15. ఒక ప్రకృతి : బహుపురుషులు

61. సాంఖ్యమతం ప్రకారం ప్రకృతిఒకటి. పురుషులనేకులు. ఈ సూత్రీకరణకు పునాదులు చాల లోతుగా వున్నాయి. బహుక్లుప్తంగా మాత్రమే ఇక్కడ వ్రాస్తున్నాను.

62. ప్రపంచంలో చాలమంది మనుష్యులున్నారు. వారు ఈ ప్రపంచాన్ని పర్యాలోకించి, విమర్శించి నప్పుడు ఒకే విధమయిన ప్రత్యక్ష గోచరాన్ని (Objective existence) తెలుసు కొంటున్నారు. ప్రపంచంలో వస్త్వధీనమైన లక్షణాలను ఒకేవిధంగా అందరూ తెలుసుకొంటున్నారు. (అదుష్టేంద్రియ గ్రహణం వున్నవాళ్లా). ఇది సరికాకపోతే శాస్త్రానికి మనుగడలేదు. మనుష్యులకూ, సమాజానికీ వునికి అసంభవము. ఈ కారణంచేత ప్రకృతి ఒక్కటేనని వీరు ప్రతిపాదించేరు.

63. ఈ ప్రపంచాన్ని తెలుసుకొంటూన్నవాళ్లు అనేకులున్నారని మనం చూస్తున్నాం. సాంఖ్యులలో కూడా మోక్షం అనేది వుంది. వీరి అభిప్రాయం ప్రకారము మోక్షం అంటే ప్రకృతితో ఎట్టి సంబంధమూ లేకుండా వుండుట. ఏ ఒకడు మోక్షం పొందినప్పటికీ మిగిలినవాళ్ళు ప్రకృతితో సంబంధం కలిగే వుంటున్నారు. ప్రకృతి లయం కావడమూలేదు. అందుచేత పురుషులు అనేకులని సాంఖ్యులు నిర్ధారణ చేసేరు.

64. ఈ సాంఖ్యుల అభిప్రాయం ప్రకారం పురుషుని లక్షణాలను శ్రీకృష్ణుడు భగవద్గీత రెండో అధ్యాయంలో సూచించేడు. అందులో ప్రకృతానికి అవసరమైనవి యివి.

నిత్య స్సర్వగత స్థాణు
రచలోఽయం సనాతనః॥ [24 వ శ్లోకం]

(ఈ పురుషుడు ఏ కాలంలోనూ వున్నాడు. ఉంటాడు. అంతటా ఉన్నాడు. స్థాణువు, అచలుడు, సనాతనుడున్ను.)

65. ఈవిధంగా ఒక ప్రకృతితో జడప్రపంచాన్నీ, అనేక పురుషులతో చైతన్యతత్త్వాన్నీ సాంఖ్యులు విస్తరించేరు. దీనిలో అద్వైతులు ఏ విధమయిన మార్పులు తెచ్చారో, కొత్తవి చేర్చేరో చూద్దాం.

## 16. అద్వైతంలో పురుషుడొక్కడే

66. చైతన్యతత్త్వం అయిన పురుషుణ్ణి అద్వైతులు అంగీకరించేరు. ఒక దృష్టిలో చూస్తే పురుషతత్త్వం వుందని రుజువుచేయడం కష్టం. ఎందుచేతనంటే దీనికి పరిణామం లేదు. మార్పులేదు. గుర్తుపట్టేటందుకు వీలయిన మరోలక్షణం లేదు. మన అనుభవంలో వున్న ప్రతి వస్తువూ ప్రతిక్షణం మారుతూన్నదే. పరిణామం చెందుతూన్నదే. మన అనుభవంలోలేని, చలనం, పరిణామంలేని, 'అక్షర' మయిన వస్తువేదో వున్నట్లు అంగీకరించడం సులువుకాదు. రుజువుచేయడం అసలే సులువుకాదు. కాని అద్వైతులు యీ బెడద యేమీ పెట్టుకోలేదు. సాంఖ్యదర్శనంలోని యీ భాగాన్ని యథాతథంగా స్వీకరించేరు.

67. అయితే అక్షర పదార్థాలు (Being పురుష తత్త్వంగలవి) బహుళ సంఖ్యాకములని సాంఖ్యుల ప్రతిపాదన. వీటి గుర్తుకొరకు అ 1, అ 2, అ 3, మొదలయిన సంఖ్యలను ఇద్దాం

అ 1, అ 2, అ 3, అ 4......

ఈ అక్షర వస్తువుల అస్తిత్వాన్ని సాంఖ్యులు చెప్పేరు. అద్వైతులు అంగీకరించేరు. అయితే ఈ అక్షర పదార్థాలలో ప్రతిఒక్కటీ మిగిలిన వానికన్న భిన్నమని సాంఖ్యుల వాదం. అద్వైతులు దీనిని వ్యతిరేకించారు. ఈ అక్షర పదార్థాలన్నీ ఒకదానికొకటి సమానమనీ, కనక అన్నీ ఒకటేననీ అన్నారు. అంటే వీరి సిద్ధాంతరీత్యా—

అ 1 = అ 2 = అ 3 = అ 4... = అ.

అన్యోన్య సమానములైన ఈ అక్షర పదార్థాలకు అక్షరము బదులు "అ" అని గుర్తువేయబడినది. ఒకే 'అక్షర'మైన పదార్థం వుందనిన్నీ, మిగిలినవి అనగా అ 1, అ 2, అ 3, అ 4 మొదలయినవి అన్నీ "అ" మాత్రమేఅనీ వీరి సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని వీరెల్లా సాధించారో చూద్దాం.

**68.** సాంఖ్యుల సూత్రీకరణ ప్రకారం అ 1 కి వున్న లక్షణాలు అన్నీ మిగిలిన అ 2, అ 3, అ 4 మొదలయిన అన్నింటికీ వున్నాయి. అవన్నీ "అక్షర" ములు. పరిణామరహితాలు. ఏవిధమైన గుణాలూ లేనివి. కాల ప్రవాహములో మార్పులు పొందనివి. అందుచేత ఏనాడూకూడ ఒకదానినుంచి మరొకదానిని వేరుచేసి గుర్తించేటందుకు వీలుకలిగే లక్షణం ఏదీ పుట్టదు. ఈ అక్షరపదార్థాలన్నీ సర్వగతాలు కూడాను. అందుచేత ప్రదేశభేదాన్నిపట్టి ఒకదానినుంచి మరొకదానిని గుర్తించడంకూడా సాధ్యం కాదు. ఇవన్నీ నిర్గుణాలుకూడా అవడంచేత గుణభేదాన్ని పట్టి వేరుగా గుర్తించడం సాధ్యపడదు. అందుచేత అ 1 ని, అ 2 నుంచిగాని, మరి ఇతర అక్షర పదార్థాలనుంచిగాని వేరుగా గుర్తించుటకు ఏలాంటి విశిష్ట లక్షణాలూ లేవు. వైశేషికులుచెప్పే "అంత్య విశేషా"లు (Residual Features) వుండడానికే వీలులేదు. అందుచేత అ 1, అ 2, అ 3, అ 4... వీనిలో వీనికి ఎట్టి భేదము వుండడానికి సాధ్యము కాదు. కనుక వీటి మధ్యనున్న సంబంధము అభేద సంబంధము మాత్రమే. అనగా ఇవన్నీ ఒక్కటే. అంటే అక్షర పదార్థం ఒక్కటేను.

**69.** ఈ అక్షర పదార్థానికి అద్వైతులు "బ్రహ్మ పదార్థం" అని పేరు పెట్టారు. దేశ కాలాద్యనవచ్ఛిన్నం కావడంచేత ఇది అనంతము కూడాను.

**70.** సాంఖ్యదర్శనంలో పురుషులసంఖ్య అనేకమై వుండగా, అద్వైతంలో అదంతా ఒక్కటేనని సిద్ధాంతీకరింపబడినదే తప్ప, అసలు అక్షర పదార్థం యొక్క అస్తిత్వం గురించి ఇద్దరిదీ ఏకాభిప్రాయమే. అసలు తగవు అక్కడలేదు. తగవు జగత్తును గురించి వుంది.

## 17. అర్థచ్ఛాయల ప్రమాదం

**71.** సాంఖ్యులఅభిప్రాయంలో జగత్తుకు అస్తిత్వం వుంది. దీనిని గురించి చెప్పేటప్పుడు అద్వైతులు కొన్నిచోట్ల మిథ్య అనీ, కొన్నిచోట్ల మాయ అనీ, కొన్నిచోట్ల అనిర్వచనీయమనీ, కొన్నిచోట్ల అసత్ అనీ పదాలను వాడేరు. ఈ పదాలను ఒక నిర్దిష్టమైన అర్థంలోగాక సందర్భాన్నిపట్టి భేదార్థాలలో వాడేరు కూడా. ఈ వాడబడిన పదాలకి పారిభాషిక అర్థం ఒకటుంటుంది. కాని ఆ పదాల్ని ఆ పారిభాషిక అర్థాలకు మాత్రమే పరిమితం చేయలేదు. శబ్దం యొక్క ధాత్వర్థాన్ని పట్టిగాని, దానికి వాడుకలో వచ్చిన రూఢ్యర్థాన్ని పట్టిగాని, సందర్భాన్ని పట్టిగాని అయా పదాలకు భిన్నార్థచ్ఛాయలు ఏర్పడుతూంటాయి. ఈ అర్థఛాయలలోనుంచి పారిభాషిక అర్థాన్ని విడదీసి ఆ అర్థానికే పరిమితమై వుంచాలి. అలా వుంచకబోతే తత్వాలకూ, గంద్రగోళానికీ దారితీస్తుంది. అలా దారితీసింది కూడాను. ఈ గంద్రగోళంలో పడకుండా మనం సిద్ధాంత ధోరణిని అవగాహన చేసుకోవాలంటే ఈ శబ్దాల్ని స్వేచ్ఛగా వాడడం మానివేసి ఒక శాస్త్రీయపద్ధతికి కట్టుబడాలి.

**72.** ఈ పదజాలంలో ఒకటి అనిర్వచనీయం. దీని వలన అనేక గంద్రగోళాలు పుడతాయి. ఒక వస్తువును అనిర్వచనీయం అనేసరికి దానిలో ఏదోఒక మహోత్కృష్టత వుందనేభావం దానిపక్కన అర్థచ్ఛాయలో స్ఫురిస్తూంటుంది. అసలు గంద్రగోళాలు అర్థచ్ఛాయల వలననే కలుగుతాయి. అనిర్వచనీయం అంటే ఇది ఇల్లాగఅని మాటలలో చెప్పడానికి వీలుపడని - అర్థం. కాని స్ఫురించే అర్థం మన అనుభవంలో లేని అసాధారణమైన వస్తువుఅని. ఈ స్ఫురితార్థం సరికాదు. మామిడిపండు తియ్యగా ఉంటుంది. ద్రాక్షపండూ తియ్యగా వుంటుంది. ఈ రెండింటిలోని తీపి ఒకటికాదు. ఈ భేదాన్ని నిర్వచించాలంటే భాష చాలదు. ఈ తేడా ప్రతిఒక్కరి అనుభవంలోనూ

వున్నప్పటికీ అనిర్వచనీయం. ఈ విధంగానే అనుభవంలోవున్న పదార్థాలను వేనినీకూడా ఒక పరిమితిని మించి నిర్వచించడం సాధ్యంకాదు. ఇది వస్త్వధీనమైన విలక్షణతవలన వచ్చినదికాదు. భాషయొక్క పరిమితులే దానికి కారణం. దీనిని 'వాచామగోచరం' అని సంస్కృతంలోచెప్పి గందరగోళం చేయవచ్చును. ఇల్లాంటివన్నీ భాషయొక్క పరిమితులవలన వస్తున్నదేనని వైయాకరణులు సిద్ధాంతీకరించేరు. ఇదిమాత్రం మరిచిపోకూడదు.

73. ఈవిధంగానే యితర పారిభాషిక పదాలు కూడా వుపయోగింపబడ్డాయి. వీటిని సవివరంగా విచారణకు పూనుకోవడం యిక్కడ సాధ్యపడదు. పైన చెప్పిన హెచ్చరిక వీటన్నింటికీ వర్తిస్తుంది.

74. శ్రుతి ఒ చోట "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్" అని [illegible]ంది. ఆదియందు సత్పదార్థం వుండెనని దీని అర్థం. మరోచోట "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అని వుంది. అంటే "ఆదియందు అసత్పదార్థం వుంది" – అని. ఈ రెండింటినీ జాగ్రత్తగా ఆలోచిస్తే 'సత్' అని మొదట చెప్పిన వస్తువునే రెండోచోట 'అసత్' అనే పదంతో చెప్పేరు అని కనిపిస్తుంది. ఈ రెండు శ్రుతులకూ అర్థం ఒక్కటే. ఇల్లా వాడడం ఎంతవరకు సరియైనది అనేది చర్చనీయాంశం కాదు. 'సత్' అనే శబ్దాన్ని రెండోచోట తల్లక్రిందులు అర్థంలో వాడేరన్నమాట. 'సత్' అనే ప్రధానమైన శబ్దానికే యీ పరిస్థితి వున్నప్పుడు మిగిలినవాని ప్రయోగం విషయమై ఎంత జాగ్రత్త అవసరమో వేరే చెప్పనక్కరలేదు.

# 18. సత్ శబ్దం నిర్వచనాత్మకం

75. లోకం అందరికీ అనుభవంలోవుండి, పరిణామ లక్షణం కలిగిన జగత్తు ఒకటే వున్నదనీ, పరిణామ, రహితమై, సామాన్యుల అనుభవంలో లేని, అక్షరమై బ్రహ్మమని చెప్పబడే పదార్థం మరొకటి ఏర్పడుతున్నదనీ పైన చూసేం. వీనిలో ఒకదానిని నిరూపించడానికై 'సత్' అనే శబ్దాన్ని వుపయోగిస్తే రెండోదానిని నిరూపించడానికై 'మొదటిది కానిది'. అంటే 'సత్ కానిది' అని చెప్పడానికై తర్కశాస్త్ర దృష్ట్యా అసత్ అని చెప్పక తప్పదు. ఇందులో దేనిని సత్పదార్థంగా చెప్పవలెననేది మన ఇష్టం, తాత్వికాభిరుచి మున్నగు వానిమీద ఆధారపడి వుంటుంది. అందరి అనుభవంలోనూవున్న జగత్తును 'సత్' అని చెప్పి, దీనికి భిన్నంగా అక్షరమైనదానిని అసత్‌గా చెప్పి వేదం "అసద్వా ఇదమగ్రఆసీత్"అని చెప్పింది. అయితే అద్వైతులు సామాన్యంగా అనుభవంలో లేనట్టి పరిణామరహితమైన అక్షరపదార్థమును 'సత్' అన్నారు. ఇల్లా అనడానికి వీలయిన నిర్వచనాన్ని ఇచ్చేరు. త్రికాలములయందూ అబాధితమై, పరిణామ రహిత మైనది 'సత్' నిర్వచించేరు. ఈ నిర్వచనంతో సామాన్య అనుభవంలోలేని బ్రహ్మపదార్థం 'సత్' అయింది. దీనికి భిన్నమైన జగత్తు 'అసత్' కావాలి.

76. ఈ విధంగా బ్రహ్మయొక్క సత్యత్వం సత్ శబ్దనిర్వచనం వలన ఏర్పడింది. క్షరముకాని పరిణామం లేని పదార్థముయొక్క అస్తిత్వాన్ని సాంఖ్యులు చెప్పేరు. దానికి బ్రహ్మపదార్థమని అభిధేయం ఏర్పరచి దానికి లక్షణమైన అక్షరత్వాన్ని సత్ అని నిర్వచనం చేయగా అద్వైతుల "బ్రహ్మసత్యం" అనే సూత్రీకరణ ఏర్పడింది. సాంఖ్యుల సిద్ధాంతంలోని అనేక పురుషవాదములను వదిలేస్తే ఏర్పడేది మాత్రమే తప్ప, తాత్వికదృష్ట్యా దీనిలో అదనం ఏమీలేదు. అయితే బ్రహ్మపదార్థాన్ని సచ్చిదానందమనీ, ఇంకా ఇతర విధంగానూ అద్వైతులు వర్ణించేరు. దానివలన ఏర్పడే కొత్త తాత్వికదృష్టి ఏమీలేదు. సాంఖ్యుల పురుషతత్వం జగత్తులో కనిపిస్తున్న చైతన్యాన్ని నిర్వచించి సాధించడానికి ఏర్పడింది. అందుచేతనే ఆ లక్షణం సత్పదార్థానికి చిత్ అనే లక్షణాన్నికూడా సాధించిపెట్టింది. చిత్ అంటే చైతన్యతత్వం అనుకోవచ్చు. నిజానికి జగత్తులోవున్న చైతన్యం త్రికాలాబాధితమని సూత్రీకరించడంకోసం ఏర్పడిందీ చర్చ. ఇది తల్లక్రిందులై త్రికాలాబాధితమైన సత్ అనేది ఒకటున్నదనీ,చైతన్యతత్వం దాని లక్షణాలలో ఒకటనీ మారింది.

77. 'బ్రహ్మసత్యం' అనే సూత్రీకరణ యీ విధంగా నిర్వచనాత్మకమై ఏర్పడగా యిక జగత్తు ఏమయిందో చూద్దాం.

## 19. విరుద్ధం : వ్యతిరేకం

78. తాత్విక దృష్ట్యా బ్రహ్మకు భిన్నమైన పదార్థం అసత్ కావలసివుంది - అని పైన చెప్పేం. ఆలాగ సూటిగా చెప్పి, అక్కడికి వదిలేస్తే అంత గంద్రగోళం వుండేదికాదు. జగత్తుయొక్క అసత్యత్వం నిర్వచనమూలకంతప్ప మరేమీ విశేషం లేదనేది అందరికీ తెలిసేది. గంద్రగోళం వచ్చేదికాదు. అయితే అద్వైతులు దానినక్కడ వదలలేదు. కొన్ని తర్క విన్యాసాలతో జగత్తుకు మిధ్య అనే ఒక కితాబును సంపాదించేరు. ఈమిధ్యాశబ్దపు అర్థవ్యాఖ్యాయలతో ఎంత గంద్రగోళమేనా వచ్చిపడింది. ఈ తర్కవిన్యాసా లన్నింటినీ వివరంగా చర్చించడం యిక్కడ సాధ్య పడదు. కనక క్లుప్తంగా వాటి ధోరణి నిక్కడ వ్రాస్తాను.

79. బ్రహ్మ సత్ అయినప్పుడు దానికి భిన్నమైన ప్రతి ఒక్కటి 'అసత్' అనే వర్గంలోకి (Category) రావాలి. ఈ విధంగా తార్కికదృష్ట్యా ప్రకరణముకు పట్టి రెండుగా విభజన (Dichotomy) సాధ్యపడు తుంది. ఇల్లా చేయడం న్యాయశాస్త్ర సమ్మతం కూడాను. ఉదాహరణకు - గోజాతికి గంగడోలు వుండడం లక్షణం. తతిమ్మా జంతువులన్నీ దీనికి వ్యతి రేకమైన (Contradictory) లక్షణం కలిగివుంటాయి. అంటే గంగడోలు లేని జంతువులు అన్నమాట. ఈ లక్షణాన్ని 'వ్యతిరేక' లక్షణం అనవచ్చును (Contradictory).

80. ఈ వ్యతిరేక లక్షణమేగాక 'విరుద్ధం' అనేది (Contrary) కూడా వుంది. గోజాతికి వ్యతిరేకమైన లక్షణాలుగల జంతుజాలంలో, గోవుకు విరుద్ధమైన లక్షణాలున్నాయని ఏ సింహాన్నో గోవిరుద్ధ జాతిగా పేర్కొంటే తార్కికదృష్ట్యా వర్గీకరణ (Classification) కుదరదు. ఉదాహరణకు ప్రపంచంలోని జంతు వులన్నీ గోవులూ - గోవులుకానివిగా వ్యతిరేక విభ జనకు వచ్చేస్తాయి. కాని గోవులూ - సింహాలూ అని విరుద్ధ లక్షణాలు కలవిగా వర్గీకరణకు పూనుకొంటే ఈ రెండు వర్గాలలోకీరాని జంతువులు ఎన్నో మిగిలి పోతాయి. ఉదాహరణకు : ఏనుగులు, లేళ్ళు. విరుద్ధ లక్షణాలను పట్టి విభజన చేయడంవలన మిగిలినవన్నీ తార్కికదృష్ట్యా జంతువులే కాదని వితండవాదనకు ఎవరన్నా పూనుకోవచ్చు కూడా. ఈ వ్యతిరేక విభ జనను ఈ విధంగా సూత్రీకరించవచ్చును.

'క' అనే లక్షణాన్ని బట్టి 'క' లక్షణము గలవీ - 'క' లక్షణము లేనివీ అని రెండుగా (Dichotomy) విభజితం అవుతాయి. వ్యతిరేక లక్షణాన్ని బట్టి విభజన చేస్తే 'అ' అనే ఏ వస్తువును తీసుకొన్నా అయితే 'క' లక్షణం కలదో, లేనిదో కావలసిందే తప్ప మూడో జాతి వి కాలేదు. దీనినే యింగ్లీషులో Law of excluded middle అని అంటారు. అంటే క లక్షణంగల జాతికీ, క లక్షణం లేనిజాతికీ కూడా చెందకుండా ఏ వస్తువూ వుండదు. విరుద్ధ (Contrary) లక్షణాలనుబట్టి విభజనకు పూనుకొంటే యీ Law వర్తించదు. తార్కికదృష్ట్యా ఆ విధమైన వర్గీకరణ తప్పు.

81. అద్వైతులు బ్రహ్మపదార్థాన్ని త్రికాలముల యందూ మార్పులేకుండావుండే సత్ పదార్థాన్నిగా నిర్వచించేరు. ఏఒక్కకాలంలో లేకపోయినప్పటికీ దీని వ్యతిరేక లక్షణం ఏర్పడుతుంది. రెండుకాలాలలో వున్నా వ్యతిరేకలక్షణంలోకే వస్తాయి. మూడు కాలాలలోనూ లేనివికూడా వ్యతిరేకలక్షణాలు కలవాని లోకే వస్తాయి. తార్కికదృష్టితో యివన్నీ 'అసత్' అనాలి. కాని అల్లా అనలేదు.

82. త్రికాలములయందూవున్న పదార్థానికి అద్వై తులు త్రికాలములయందూ లేనిదానిని విరుద్ధ లక్షణం గలదానినిగా పోటీపెట్టి దానిని ఒక్కదానినీ అస ద్వర్గంలో చేర్చేరు. త్రికాలములయందూ లేనిదానిని న్యాయ శాస్త్రజ్ఞులు 'అత్యంతాభావం'అని పేర్కొ న్నారు. ఈ అత్యంతాభావానికి అద్వైతులు 'అసత్' అని పేరుపెట్టేరు.

83. ఇక్కడొక ప్రశ్న రావచ్చు. త్రికాలముల యందూ వుండని వస్తువు లుంటాయా? ఆ వుండని వానిని గురించి ఆలోచించి, చర్చించవలసిన పనేమిటి? అనే ప్రశ్న పుడుతుంది.

84. సాంఘిక జీవనంలో ఒకవ్యక్తి మరోవ్యక్తికి తన అనుభవంలోవున్న వస్తువుల్ని గురించి వ్యక్తీక రించడానికి భాషపుట్టింది. ఈ భాష కాలక్రమంలో గతితార్కిక ప్రవాహంలో ప్రధానాభిప్రాయం మారి తల్లక్రిందులై విరుద్ధప్రయోజనాలకుకూడావినియోగపడ సాగింది. ఆ విధంగా త్రికాలాలలోనూ ఎన్నడూలేని ఉండ సాధ్యంగాని వస్తువుకు నామం కల్పించడం, దానిని గురించి వాక్యసముదాయం కల్పించడానికి

భాషకు శక్తి ఏర్పడింది. ఉదాహరణకు: కుందేటి కొమ్ము, వంధ్యాపుత్రుడు, గగనకుసుమం వగైరాలు. ఇవి భారతీయ శాస్త్రజ్ఞులు ఇచ్చిన ఉదాహరణలు. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు ఇచ్చిన ఉదాహరణలలో ఒకటి - Circular square (వృత్తాకారంలోవున్న చతురశ్రం) ఈ మాదిరివాటిని గురించి వాక్య సముదాయం ఏర్పరచవచ్చు. ఉదా: 'కుందేటికొమ్ము నరసాపురంలో నేడు దొరకలేదు.' ఈ వాక్యం అక్షరాలా నిజం. అయితే ఈ వాక్యంలో కర్త ఏమిటి? కుందేటికొమ్ము ఇది త్రికాలములయందూ వుండని వస్తువు. ఈ వస్తువును గురించి అనేక వాక్యాలు వ్రాయవచ్చు. అలాగే వృత్తాకారంలోవున్న చతురశ్రాలూ వగైరాలు. 'వృత్తాకారంలోవున్న చతురశ్రాలను గురించి కాలేజీలో నేడు పాఠం చెప్పలేదు.' ఇల్లాంటి వాక్యాల్నీ, వాక్యసముదాయాల్నీ కూడ భాష సృష్టించగలిగింది. దీనిని ఏం చెయ్యాలి? ఈ వాక్యాలలో కర్తలు త్రికాలాలలోనూ లేనివే అయినా ఈ వాక్యాలవలన కొన్ని సత్యమైన భావాలు ప్రకటితమవుతున్నాయి.

85. మనకు కనిపించే వస్తువులను యధాతథంగా సర్గిగా చూపించేటందుకు వీలుగా కెమేరా ఏర్పాటయింది. కాని సాంకేతిక పరిజ్ఞానం (Technic) వృద్ధిపొందేక గతితార్కిక ప్రవాహంలో విరుద్ధ ప్రయోజనాలను సాధించేశక్తి దానికి ఏర్పడింది. లేని వస్తువులనుకూడా ట్రిక్ ఫొటోగ్రఫీద్వారా నిజంగా వున్నవాటిని లాగే చూపిస్తూంది. ఇల్లాంటి సందర్భాలలో మనం ఏం చెయ్యాలి. మనకు చూపించిన ఫొటో యథార్థవస్తు ప్రతిబింబమో, కాదో తెలుసుకోవాలి. మనం వుపయోగించిన పరికరాలు మనకి సహాయపడడానికి బదులు గందరగోళ పరచడానికి కూడా ఉపయోగిస్తున్నాయి. భాషా విషయంకూడా ఇంతే. భాషకూడా మనుష్యుడు సాంఘిక ప్రయోజనాలకోసం సృష్టించుకొన్న ఒక పరికరం. ఈ శాఖలో సాంకేతిక పరిజ్ఞానం పెరగగా ఉద్భవిల్లినవే కుందేటి కొమ్ములూ, Cricular squares మున్నగునవి. వర్గీకరణల సమస్య వచ్చినప్పుడు వీటిని గురించి జాగ్రత్తపడడం అవసరం. ఈ కుందేటి కొమ్ములు వగైరాలను అద్వైతులు వర్గీకరించి వీనికి అసత్ అని పేరు పెట్టేరు. త్రికాలములందూ లేని అత్యంత అభావాలయిన వీనిని అసద్వర్గంక్రింద చేరుస్తే తప్పేంలేదు. కాని, ఈ అసద్వర్గాన్ని బ్రహ్మ పదార్థానికి సంబంధించిన సత్పదార్థానికి వ్యతిరేక విభజన (Contradictory) ద్యోతకంగా ఉపయోగించడం వల్లనే వచ్చింది పేచీ. కుందేటికొమ్ము వగైరా త్రికాలములందూ లేని వస్తువులను అసత్ గా విభజించినప్పుడు తర్కశాస్త్రరీత్యా వ్యతిరేకవిభాగమైన 'సత్' వర్గంలోకి బ్రహ్మపదార్థమూ, జగత్తూ అన్నీ రావాలి. ఏ ఒక్క కాలంలో వున్నదీకూడా కుందేటి కొములకు వ్యతిరేకవర్గమే అవుతుంది.

86. పైన చెప్పిన ప్రకారం త్రికాలములయందు మార్పులేని బ్రహ్మపదార్థాన్ని 'సత్' గాను, త్రికాలములయందూ ఎన్నడూలేని విరుద్ధ స్వభావముల కుందేటికొమ్ము వగైరాలను (వ్యతిరేక సూచకమైన) 'అసత్'గాను అద్వైతులు వర్గీకరణ చేయడంతోటే అందరి అనుభవంలోనూవుండి కాల పరిచ్ఛిన్నమూ, పరిణామసహితమూ అయిన జగత్తు యావత్తూ రెండు వర్గాలలోనూ చేరకుండా మిగిలిపోయింది. ఈ మిగిలిపోయిన జగత్తును ఏం చెయ్యాలనేది అద్వైతులకి ఒక సమస్య అయింది. వారి నిర్వచనం ప్రకారం ఇది 'సత్'కాదు. 'అసత్' అసలేకాదు. సదసత్ కావచ్చునా?

87. వ్యతిరేకలక్షణాలు ఆధారంగా వర్గీకరణ చేసినప్పుడు Law of excluded middle వలన సదసత్ పదార్థము అనేది వుండదు. విరుద్ధలక్షణాలకీ వుండదు. శ్రీ శంకరులవారూ ఇంతే చెప్పేరు. సదసత్ అనేది వుండదన్నారు.

88. ఈవిధంగా జగత్తు సత్ కాదు. అసత్ కాదు. సదసత్ కాదు. అందుచేత దీనిని అనిర్వచనీయం అని సూత్రీకరించేరు. ఈ సూత్రీకరణచట్టుకు సరికాదు. తాను చేసిన సదసద్విభజన విరుద్ధ (Contrary) విభజన మాత్రమే. కాని వ్యతిరేక విభజన (Contradictory) కాదు. అందుచేత సత్ కానిదీ, అసత్ కానిదీ వుండవచ్చును. ఉంది. జంతువులను ఆవులు, సింహాలు అనే విరుద్ధ స్వభావంమీద ఆధారపడిన విభజన చేసినప్పుడు ఏనుగు, లేడి వగైరా జంతువులు ఆ రెండు వర్గాలకు బయట మిగిలిపోతాయి. అవి ఆవులు కావు. సింహాలు కాదు. మిశ్రమరూపమైన గోసింహాలు కావు. వానిని అనిర్వచనీయా లనడం అపహాస్యం. ఇవి మిగిలిపోవడానికి కారణం వర్గీకరణలోనే వున్నలోపం. ఈ విధంగానే జగత్తు సత్తూ, అసత్తూ, సదసత్తూ కూడా కాకుండా బయట మిగిలిపోయింది. అద్వైతుల విభజనలోనేవున్న అసమగ్రతే దీనికి కారణం.

89. అసమగ్రమయిన విభజనవలన, ఏ వర్గాలలోకీ రాకుండా సత్ గాక, అసత్ గాక, సదసత్తూ గాక మిగిలిపోయిన జగత్తును ఏమిటో చెప్పడానికి వీలు లేవనీ, అనిర్వచనీయం అన్నారనీ చెప్పేను. అనిర్వచనీయమనే శబ్దాన్ని ప్రయోగించడంతో యీ జగత్తు ఎవరి అనుభవంలోలేని, విలక్షణమైన, వూహించ సాధ్యంకాని పదార్థం అనే అర్థచ్ఛాయ ఏర్పడుతుంది. ఈ భావం తప్పు. జగత్తు అందరి అనుభవంలో వుంది. అనుభవంలో వున్నవికూడా భాష పరిమితులవలన ఏలా అనిర్వచనీయా లవుతాయో పైన చెప్పేను. అనిర్వచనీయం అని జగత్తునకు పేరుపెట్టిన తర్వాత ఎన్నిరకాలయిన తార్కిక విన్యాసాలయినా చేయవచ్చును. అనిర్వచనీయ మనేదానిని గురించి ఏంచెప్తే మాత్రం ఎవరు కాదనగలరు?

90. తర్కదృష్ట్యా ప్రతికార్యానికీ కారణం వుండాలి. అయితే జగత్తుకి కారణం ఏమిటి? ఇది అనిర్వచనీయమాయె. కారణం సత్ కావడానికి వీలు లేదు. సదసత్ అనేది వుండడానికి వీలులేదు. అందుచేత జగత్తుయొక్క కారణంకూడా అనిర్వచనీయమే అయింది. ఈ అనిర్వచనీయమైన కారణానికి 'మాయ' అని పేరుపెట్టేరు. ఈ మాయ అనిర్వచనీయం అవడానికి కారణంకూడా సదసద్విభజనలోని లోటుయొక్క ఫలితమే.

91. ఈ అనిర్వచనీయమైన మాయను గురించి ఆలోచించి అది త్రిగుణాత్మకము అన్నారు. సాంఖ్యవాదంలోని ప్రకృతి త్రిగుణాత్మకం; ఆ లక్షణాన్ని వీరు మాయకు తగిలించేరు. ఈ మాయను గురించి అద్వైతు లుపయోగించినవాక్యాలు కొన్ని సాంఖ్యులు ప్రకృతి విషయంలో వుపయోగించిన వాక్యాల అనుకరణలాగ వుంటాయి.

92. తరువాతి ప్రశ్న అనిర్వచనీయమైన మాయకీ సత్ అయిన బ్రహ్మకీ మధ్య సంబంధం ఏమిటి? అని. ఈ మాయ బ్రహ్మలోనుంచి పుట్టిందంటే ఒకచిక్కొస్తుంది. లేదంటే మరొక చిక్కుంది. అందుచేతనే ఇదికూడా అనిర్వచనీయం కాకతప్పదు. తప్పలేదు. అయితే ఏదో ఒకదశలో ఈ అనిర్వచనీయ స్థితినుంచి ఈవలకు రాక తప్పదు. బ్రహ్మశుద్ధ సత్త్వమాయా ఉపాధియందు ప్రతిబింబితుడై అనేక జీవులుగానూ మారేడని సాధించేరు. ఇకమీదటనుంచి తక్కిన దర్శనాల అడుగుజాడలలోనే ఇదీ నడిచింది. వానిలోనికి మనం పోనక్కర్లేదు.

## 20. కనిపించేదంతా కల్లయా?

93. జగత్తులోని అనుభవాలలో స్వప్నానుభవము చాలా విలక్షణమైనది. కలలో కనుపించిన వస్తువులు కల్లలని అందరికీ తెలుసు. కలలో వున్నప్పుడుమాత్రం ఇది తెలియదు. కలయొక్క అనుభవం యధార్థము కాదనీ, మిధ్య అనీ అనవచ్చును. ఈ విధంగానే జాగ్రదవస్థలో అనగా మెలకువతో వున్నప్పుడు మనకు కనిపించే జగత్తంతాకూడా బ్రహ్మానుభవం కలవానికి కలవలెనే కనిపించవచ్చును. ఈ ఉపమానాన్ని పుచ్చుకొని జగత్తుకూడా కల్ల అనగా మిధ్య అనే భావానికి దారితీసింది. దీనికి ఒక ఆర్గ్యుమెంటు కూడా లేవదీసేరు. మనకు కలలో కనిపిస్తున్న వన్నీ మిధ్యలు. కాబట్టి కనిపించేవన్నీ మిధ్యలు. జగత్తు కనిపిస్తూంది. కనక జగత్తుకూడా మిధ్య. జగత్తుయొక్క మిధ్యాత్వాన్ని నిరూపించడానికి చెప్పిన ఒక ప్రధాన ఆర్గ్యుమెంటుయొక్క రూపం ఇది. ఈ ఆర్గ్యుమెంటు తెలుగులో చెప్పడంవలన ఈ వాదంలోని బలహీనత స్పష్టపడుతూంది. కాని, దీనికొక తార్కికపు వేషం వేసి సంస్కృతంలో ప్రయోగించేసరికి ఈ ఆర్గ్యుమెంటు చాల గంభీరంగా కనిపించి గంద్రగోళం కలిగిస్తుంది. సంస్కృతంలో దీని నిల్లా సూత్రీకరించేరు. "జగన్మిధ్యా। దృశ్యత్వాత్। స్వప్నదృశ్యవత్."

94. కనిపించేదంతా మిధ్య అనడానికి హేతువు కనిపించడమే అన్నారు. కనిపించడంవల్ల ఎంచేత మిధ్య అవుతుందో సూచించలేదు. ఈ రెండింటికీ అన్యోన్య సంబంధమూ లేదు. కనిపించేవి కొన్ని మిధ్య కావచ్చు. కొన్ని నిజం కావచ్చు. ఎండమావులలో నీరు కనిపిస్తుంది గాని అబద్ధం, మిధ్య. సముద్రంలోకూడా నీరు కనిపిస్తుంది. కాని అబద్ధం కాదు. ఎండమావులలోని నీరు కనిపిస్తూంది కనుక మిధ్య కాలేదు. అది అబద్ధమైననూ ఎందుకు కనిపిస్తూందో శాస్త్రీయ పరిశోధనలవలన తెలుసుకోవలసిన విషయం. తెలుసుకున్నారు కూడా. దీనిని తల్లక్రిందులుచేసి కనిపిస్తూంది కనక ఎండమావులలో నీరు మిధ్య అని సూత్రీకరణ చేయడం, ఈ సూత్రీకరణతో

కనిపిస్తూంది గనక సముద్రంలో నీరుకూడా మిథ్య అనడం హేతువులాగ కనిపించే ఆభాసఛాయ మాత్రమే.

95. ఒక పదార్థానికి రెండు లక్షణాలున్నాయనుకొందాం. వీనికి 'అ' అనీ, 'క' అనీ పేరు పెడదాం. ఇంకో పదార్థంలో 'అ' అనే లక్షణం కనిపించిందనుకొందాం. ఈ రెండో పదార్థంలో 'క' అనే లక్షణం వుందా, లేదా అనేది విచారణీయాంశం. అయినప్పుడు ఒక పదార్థంలో 'అ,క' కలిసివున్నాయి కాబట్టి, అంతటా కలిసే వున్నాయని భ్రమపడే వాళ్ళుండవచ్చును. అలాగ భ్రమపడ్డవాడు రెండో పదార్థంలోకూడా 'క' లక్షణం వుందనుకోవచ్చును. కాని అది భ్రమ మాత్రమే. శాస్త్రీయంగా రుజువు చేయదలచుకొంటే 'అ' లక్షణం వున్నచోటల్లా 'క' లక్షణం వుంటూంది అనే వ్యాప్తి అనగా సాహచర్య నియమము (Invariable concomittance) ఇతరత్రా రుజువు పరచాలి. మొకటి పదార్థం ఒక్కటే దీనికి వుదాహరణ అయితే సూత్రీకరణ తప్పు అవుతుంది (Fallacious induction). నిజమైతే ఆ లక్షణాలకు సాహచర్య నియమం వుందని రుజువుచేయాలి. రుజువు కాకపోతే వచ్చే హేత్వాభాసను non-sequitur అని deduction లోనూ, false cause లేక non causa pro causa అని induction లోనూ అని అంటారు. ఈ హేత్వాభాసలను గురించి తర్కభాషలో సుదీర్ఘంగా ఇంకా చర్చించడంకన్న ఒక్క వుదాహరణ ఇచ్చి ఈ చర్చను ముగించవచ్చును.

96. శ్రీ ఇ. ఎమ్. ఎస్. నంబూద్రిపాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి.

ఆయన కమ్యూనిస్టుకూడ.

శ్రీ నీలం సంజీవరెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రి.

కనుక ఆయన కమ్యూనిస్టు.

ఈ ఆర్గ్యుమెంటు తప్పు అని అందరికీ అర్థం అవుతూంది. ఎందుచేత తప్పో తెలుసుకోవాలి. శ్రీ నంబూద్రిపాద్‌కు రెండులక్షణాలున్నాయి.

అ. రాష్ట్ర ముఖ్యమంత్రి.

క. కమ్యూనిస్టు.

శ్రీ సంజీవరెడ్డివద్ద 'అ' లక్షణం వుంది. అంటే రాష్ట్ర ముఖ్యమంత్రి. 'క' అనే లక్షణం అనేది వుందా లేదా అనేది చర్చనీయాంశం. 'అ' వుందికాబట్టి 'క' వుందని అనడం శ్రీ సంజీవరెడ్డిని కమ్యూనిస్టు అనడం వంటిది.

97. అందుచేత 'అ, క' అనే లక్షణాలకు సంబంధం ఏదన్నా వుందా అని యితరత్రా స్వతంత్రంగా ఆలోచించి తేల్చాలిసిన విషయం. మన వుదాహరణలో రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రతి ఒక్కరూ కమ్యూనిస్టు కావాలా, అక్కర్లేదా అనే హంశాన్ని విచారించడం లాంటిది. ఇది సత్యం కావచ్చు. కాకపోవచ్చు. ఆగంతుకం (accidental) కావచ్చు, కేరళలోలాగ. అందుచేత చర్చనీయాంశం 'అ, క' లక్షణాల సాహచర్య నియమం.

98. ఈ విధంగానే దృశ్యత్వానికీ, మిథ్యాత్వానికీ సాహచర్య నియమం వున్నదాలేదా అనే విషయాన్ని చర్చించక స్వప్నంలో రెండూ వున్నాయి కాబట్టి జగత్తుకు వానిలో ఒక లక్షణమైన దృశ్యత్వం వుంది కనక రెండవ లక్షణమైన మిథ్యాత్వం కూడా వుందని వాదించడం తర్కదృష్టితో శ్రీ సంజీవరెడ్డి కమ్యూనిస్టు అనడంలాంటిదే.

99. జగత్తు మిథ్య అనడానికి ఉపయోగించిన ప్రధానమైన ఆర్గ్యుమెంటుయొక్క స్వరూపం ఇది.

## 21. రజ్జువూ : సర్పమూ

100. మిథ్యఅయిన ఈ జగత్తుకు ఉనికి ఎలా వుంటుంది అనే ప్రశ్నకు ప్రధానమైన సమాధానంగా అధ్యాసావాదం ఏర్పడింది. ఈ వాదం యొక్క స్వరూపం చూపించడానికై మామూలుగా ఒక వుదాహరణను ప్రామాణికంగా ఇవ్వడం పరిపాటి అయి వుంది. ఈ వుదాహరణను స్థూలంగా "రజ్జు సర్ప భ్రాంతి" అనడం రివాజు. చీకటిలోవున్న తాడును చూచి మనుష్యుడు పాము అని భ్రాంతిపడతాడు. కేవలం ఆ భ్రాంతివలన, అది నిజంగా పామైతే కలిగే భయాది వికారాలన్నీ కలుగుతాయి. యథార్థం తెలిసిన వారు ఇది పాముకాదు తాడేనని నిరూపించి చెప్పగానే ఆ భ్రమా, దానితో భయాదులూ తొలగుతాయి. ఈ విధంగానే త్రికాలాబాధితమైన బ్రహ్మ పదార్థమునందు జగత్తు భాసిస్తూంది. దీనికి కారణం అజ్ఞానం. ఇక్కడ వున్నది బ్రహ్మ పదార్థంతప్ప జగత్తు మిథ్య అని తెలిసినవాడు (గురువు) నిరూపించి జ్ఞానబోధ చేయడంచేత బ్రహ్మజ్ఞానం కలుగుతుంది.

ఆ క్షణంలోనే భ్రమ తొలగుతుంది. ఇది అధ్యాసావాదంయొక్క సంక్షిప్త స్వరూపం.

101. ఈ అధ్యాసావాదం జగన్మిథ్యావాదంయొక్క స్వరూపాన్ని భర్తీ (Complement) చేస్తుంది. ఈ అధ్యాస ఎవరికి కలుగుతూంది? - ఎక్కడ (locus) కలుగుతూంది? - మొదలయిన గంద్రగోళప్రశ్నలు చాలా ఉద్భవిస్తాయి. వాటి వివరాలలోకి మనం ఇక్కడ పోదలచుకోలేదు. స్థూలంగాచెప్తే జీవులకు కలుగుతూం దనవచ్చును.

102. ఈ రజ్జు సర్పభ్రాంతియొక్క ప్రామాణ్యాన్ని కొంచెం చర్చించవలసివుంది. ఈ భ్రాంతి కలగడానికి పూర్వం ఈ పరిస్థితు లుండాలిసి వుంటుంది.

(అ) ఒక యధార్థమైన రజ్జువు వుండాలి.

(ఆ) ఒక యధార్థమైన పాము వుండాలి.

(ఇ) ఈ రెండింటికీ కొన్ని గుణసామ్యాలుండాలి.

(ఈ) ఈ రెండింటి అనుభవం భ్రాంతికిపూర్వమే మనిషికి వుండాలి. ఇది వానికి జ్ఞాపకంలో వుండాలి. ఈ పరిస్థితులలో—

(ఉ) నిజమైన రజ్జువు మరోసారి వాని ఎదర ఉన్నప్పుడు ఈ అనుభవం కలుగుతుంది.

(ఊ) పాముకూ రజ్జువుకూ గల గుణసామ్యాలు గోచరించివుండాలి.

(ఋ) అయితే ఆ రెండింటికీ గల భేదాలు గోచరించ వుండకూడదు.

ఈ షరతులన్నీ (conditions) కుదిరినప్పుడు తప్ప రజ్జు సర్పభ్రాంతికి సావకాశం లేదు.

103. బ్రహ్మయందు జగత్తు అధ్యాస అయిందనే వాదాన్ని వైవిధంగా వివేచన చేస్తే—

(అ) యధార్థమైన బ్రహ్మపదార్థం వుండాలి.

(ఆ) ఒక యధార్థమైన జగత్తూ వుండాలి.

(ఇ) ఈ రెండింటికీ కొన్ని గుణసామ్యాలుండాలి.

(ఈ) ఈ రెండింటి అనుభవం భ్రాంతికి పూర్వమే మనిషికి వుండాలి.

(ఉ) నిజమైన బ్రహ్మపదార్థం మరోసారి వానికి సాక్షాత్కారం కలిగినప్పుడు ఈభ్రాంతి కలుగుతుంది.

(ఊ) బ్రహ్మ పదార్థానికీ, జగత్తుకూ మధ్యవున్న గుణసామ్యాలు గోచరించి వుండాలి.

(ఋ) అయితే ఆ రెండింటికీ వున్న భేదాలు గోచరించి వుండరాదు. ఈ పరిస్థితులన్నీ ఏర్పడ్డప్పుడు ఈ భ్రాంతి కలగవచ్చును. అద్వైతుల సిద్ధాంతంలో ఈ పరిస్థితు లేర్పడడానికిగల అవకాశాలు ఏమిటో పరిశీలించుదాం.

104. పై వివేచనతో ఏర్పడిన ఏడు షరతులలో;

(అ) యధార్థమైన బ్రహ్మపదార్థం వుందని వీరి సిద్ధాంతమే.

(ఆ) యధార్థమైన జగత్తు వుండడం వీరి సిద్ధాంతానికి ప్రత్యక్ష విరుద్ధం.

(ఇ) ఈ రెండింటికీ గుణసామ్యాలుండడం వీరి సిద్ధాంతానికి మరీ విరుద్ధం. దీనికి వీరి సిద్ధాంత ప్రకారం వ్యతిరేకలక్షణాలున్నాయి. ఒకటి క్షరమైతే, రెండోది అక్షరం, ఒకటి పరిణామ గతి కలదయితే రెండోది పరిణామ శూన్యం.

(ఈ) ఈ రెండింటి అనుభవంవున్న మనిషికి, అనగా బ్రహ్మానుభవం గలిగి, అది స్మృతిలోవున్న మనిషికి భ్రాంతులు ఉద్భవించవని వీరి మతం.

(ఉ) బ్రహ్మపదార్థం ఎదటపడ్డప్పుడు భ్రమ కలుగుతుందనడం సమంజసం కాదు.

(ఊ) బ్రహ్మపదార్థానికీ, జగత్తుకూ మధ్య గుణసామ్యాలు లేవు. కనక అవి గోచరించడం అసంభవం. ("ఇ" చూడునది.)

(ఋ) ఆ రెండింటికీ మధ్య భేదాలే గాని సామ్యాలు లేవు. ఇంక భేదాలు గోచరించకపోతే బ్రహ్మపదార్థమే గోచరిస్తుంది. భ్రమకి తావులేదు.

ఈ విధంగా వివేచన సాగిస్తే ఈ రజ్జుసర్పభ్రాంతి మన తాత్వికధోరణులలో ఎంత గంద్రగోళానికి దారి తీసిందో తెలుస్తుంది.

105. శ్రీ శంకరాచార్యులవారు అధ్యాసాభాష్యంలో అధ్యాసను నిర్వచనంచేస్తూ యిల్లా అన్నారు.

"లక్షణ మాహ । కోయ మధ్యాసో నామేతి । ఉచ్యతే । స్మృతిరూపః పరత్ర పూర్వ దృష్టావభాసః ॥"

ఇందులో పూర్వదృష్టంఅనే శబ్దంయొక్క బలాన్ని ముఖ్యంగా గమనించవలసివుంది. జగత్తు అధ్యాస కాకపూర్వం పూర్వదృష్టమైన, యధార్థమైన జగత్తుయొక్క అనుభవం వుండాలి. అది జ్ఞాపకం కూడా వుండాలి. ఇటీవల కొందరు ఈ పూర్వదృష్టం అనే మాటను ప్రాముఖ్యతలోంచి తప్పిస్తున్నట్లు కూడా కనిపిస్తూంది. ఈ విధంగా అధ్యాసాఘట్టం నడిచింది.

## 22. యుక్తుల బలహీనత

106. చాల రకాలయిన యుక్తులూ, చమత్కార ప్రక్రియలూకూడా అద్వైత సిద్ధాంతాన్ని రూపొందించడంలో ఉపయోగించబడ్డాయి. ఈ తర్కవిన్యాసాలలో కొన్ని కేవలమూ ఉదాహరణ ప్రమాణాలు, కొన్ని అర్థచ్ఛాయలచేత ఏర్పడినవి. ఇంకా ఇతరాలు కూడా ఇట్లాంటివే వున్నాయి. ఈ యుక్తిప్రయుక్తులను దీర్ఘముగా సమాలోచన చేయడం అనవసరం. ఎందుచేతనంటే వైదిక పరమైన అద్వైత సాంప్రదాయ దృష్టిలో బ్రహ్మపదార్థం అతర్క్యం, అప్రమేయం.

107. శ్రుతి అతర్క్యమని చెప్పిన దానిని తర్కశాస్త్రరీత్యా సాధించుటకు ప్రయత్నించడం ఒక సాహసకార్యం ఈ అతర్క్యమైన పదార్థాన్ని గురించి ఎన్నియుక్తు లుపయోగించినా వాది ప్రతివాదుల మేధస్సువల్ల, పరిజ్ఞానంవల్ల యుక్తులు హెచ్చుస్థాయికి వెడతాయేగాని, విషయం మాత్రం తుదినిర్ణయాన్ని పొందదు. బ్రహ్మపదార్థం అతర్క్యమంటూ శ్రుతి అనడంలో వుద్దేశం ఇదే.

108. అయినప్పటికీ నైయాయికులు తమ శాస్త్రబలంమీద వుండే నమ్మకంతో శ్రుతి అతర్క్యమని చెప్పినదానిని యుక్తిచేత సాధించ పూనుకొన్నారు. ఈవిధంగా పరమేశ్వరుని అస్తిత్వాన్ని న్యాయశాస్త్రం సాధించేనని ప్రకటించింది. దీనివలన అతర్క్యమని శ్రుతి చేసిన నిర్వచనం భంగపడ్డట్లయింది.

109. శ్రుతి ప్రామాణ్యాన్ని మళ్ళీ ఏర్పరచడానికి న్యాయశాస్త్ర నిర్మితమైన ఈశ్వరుని అస్తిత్వాన్ని పూర్వమీమాంస ఇంకా కొంచెం హెచ్చుస్థాయిలోని న్యాయ సహాయంతో ఖండించి పూర్వపక్షం చేసింది. పూర్వమీమాంస నిరీశ్వర దర్శనమని ప్రసిద్ధమే. అయితే వేద సమన్వయానికి పూనుకొన్న పూర్వమీమాంస నిరీశ్వర వాదాన్ని ప్రతిపాదించడంలో అర్థం ఈశ్వరుడు లేడనికాదు. న్యాయశాస్త్రంవల్ల నిర్మించబడిన ఈశ్వరుని అస్తిత్వాన్ని న్యాయశాస్త్ర సహాయంతోనే నిరాకరించవచ్చునని వారు ప్రదర్శించేరు. పూర్వమీమాంస యొక్క నిరీశ్వర స్వభావాన్ని గురించిన సాంప్రదాయం ఇదే. శ్రుతి ప్రమాణాన్ని గ్రహించి పరమసత్యము అతర్క్యమని నిజమైన, దృఢమైన విశ్వాసంకలిగితే తమయుక్తులు పూర్వపక్షమైపోతాయని ఎవ్వరూ బాధపడనక్కర్లేదు. ఎట్టి యుక్తులూ కూడ పూర్వపక్షం కాగలవనేది శ్రుతి ప్రతిజ్ఞ; అందుచేత ఇట్లా పూర్వపక్షం కావడంవలన కూడా శ్రుతి ప్రామాణ్యమే ఏర్పడుతుంది.

110. ఈ విధముగా శ్రుతి అతర్క్యమని చెప్పిన దానిని మీమాంసకులు సాధించగా, మిగిలిన ప్రశ్న బ్రహ్మ పదార్థము న్యాయంద్వారా గాక ఇతరత్రా నిరూపించడం ఎట్లాగా అనేదే. బ్రహ్మ పదార్థం వేదాంత వేద్యమనీ, అనుభవైక వేద్యమనీ సాంప్రదాయం.

111. బ్రహ్మ పదార్థము ప్రమాణ రహితం. ఆ కారణంచేత దీనిని న్యాయంద్వారా సాధించడం సాధ్యపడదు. ఇది దృష్టాంత రహితంకూడానని శ్రుతి. 'నిర్వికల్ప మనంతంచ హేతు దృష్టాంత వర్జితం.' (అమృత బిందూపనిషత్తు) ఎందుచేత నయిందో కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది. బ్రహ్మ పదార్థం త్రికాలాలయందూ పరిణామ రహితమని సిద్ధాంతం. ఇది అద్వితీయమని కూడా సిద్ధాంతం. అందుచేత దీనికి ఉదాహరణ ఏర్పడడం అసంభవం. జగత్తులో వున్న అన్ని వస్తువులూ పరిణామ సహితాలు. అందుచేత ఏ వస్తువులూ కూడా పరిణామ రహితత్వానికి ఉదాహరణలు కాజాలవు.

112. ఇటువంటి పరిస్థితులలో న్యాయశాస్త్రానికి ప్రయోజనం ఏమన్నా వుందా అనే ప్రశ్న కలగవచ్చును. లేతమొక్కల్ని పశువులూ వగైరాలు తినెయ్యకుండా కాపాడేటందుకు వానిచుట్టూ వేసే ముళ్ళకంచెలకు ప్రయోజనం వుంది. ఆ మొక్క పెద్దదై తనంతట తానుగా పశువులకు లొంగని స్థితి క్రమంగా ఏర్పడుతుంది. అంతవరకూ ముళ్ళకంచె సహాయం అవసరం. న్యాయశాస్త్రంయొక్క సహాయం కూడా అటువంటిదేనని సాంప్రదాయం. బ్రహ్మ పదార్థంయొక్క అస్తిత్వాన్ని గురించిన విశ్వాసం కలిగి, దృఢపడి, అనుభవానికి దారితీసేవరకూ ఆ విశ్వాసాన్ని మననాదులచేత దృఢపరచుకోవలసి వుంది. ఆ అనుభవం కలిగేక ఏ సహాయం అక్కరలేదు. అంతవరకూ సాధకుని స్థాయినిబట్టి మననాముల ఆవశ్యకత వుంది. వీని నిమిత్తమే న్యాయశాస్త్ర సహాయం. ఇది ఈ పరిమితులలోనే వుంటుంది.

# 23. పరోక్షా పరోక్ష జ్ఞానం : సాధన

**113.** సామాన్యంగా అనుభవంలోవున్న జగత్తుకు విలక్షణమైనది బ్రహ్మ పదార్థం. ఇది అనుభవైక వేద్యంఅని శ్రుతిచెప్తూంది. ఇది వున్నదని వేదంనుంచో, మరొకరినుంచో తెలుసుకోవడాన్ని పరోక్షజ్ఞానం అంటారు. దానిని స్వయంగా తన అనుభవంతో గ్రహించగలిగినప్పుడు అపరోక్షజ్ఞానం అంటారు. మనం సింహం ఏలా వుంటుందో బొమ్మల్నిపట్టీ, వర్ణనల్నిపట్టీ తెలుసుకోవచ్చు. అది పరోక్షజ్ఞానం. ఏ మ్యూజియంలోనో సింహాన్ని చూసి దాని స్వరూపాన్ని తెలుసుకోవచ్చు. అది అపరోక్షజ్ఞానం. దీన్ని మనం సామాన్యంగా ప్రత్యక్షజ్ఞానం అంటాం. అనవచ్చునుకూడా. అయితే బ్రహ్మపదార్థం ఇంద్రియాలకు అగోచరమని సిద్ధాంతం. ఇంద్రియార్థ సన్నికర్ష జన్యం జ్ఞానం ప్రత్యక్షం"అని న్యాయసాంప్రదాయం. ఈ తగువులో పడకుండా వుండేందుకు ప్రత్యక్ష జ్ఞానం అనకుండ దాన్నిఅపరోక్షజ్ఞానం అన్నారు. ఈ అపరోక్షజ్ఞానం పొందడానికి మార్గం ఏమిటి? దానికేమన్నా సాధనవున్నదా? - ఆలోచించవలసివుంది.

**114.** ఈసాధన ప్రారంభించేవానికి కొన్ని లక్షణాలు వుండాలన్నారు. ఈలక్షణాలు కలవాడు అధికారి. ఈఅధికారి లక్షణాల్ని సామూహికంగా సాధనచతుష్టయం అంటారు.

అ. నిత్యాఽనిత్య వస్తువివేకం.

ఆ. ఇహాఽముత్ర ఫలాభోగ వైరాగ్యం.

ఇ. శమాదిషట్క సంపత్తి. (శమ, దమ, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానం ఇవి ఆరు.)

ఈ. ముముక్షుత్వం.

ఈసందర్భంలోనే శ్రీ శంకరులవారు "మోక్ష సాధన సామగ్ర్యా భక్తిరేవగరీయసీ"- అని భక్తిని జోడించి, దానికో నిర్వచనంకూడా ఇచ్చేరు. ఈసాధనచతుష్టయంలోని వివరాలలోకి నేను ప్రవేశించడం లేదు. వీనిలో ప్రతిపాదించబడిన వైరాగ్యం వివేక పూర్వకమైనదేనని మాత్రం గ్రహించాలి. పురాణం మొదలైనవానిలోది . కాదు. మరోవిషయం. నిత్యాఽనిత్య వస్తువివేకం అన్నదాంట్లో నిత్యవస్తు వివేకం అంటే నిత్యవస్తువైన బ్రహ్మపదార్థాన్ని గురించిన జ్ఞానం. ఈజ్ఞానం తప్పకుండా పరోక్షజ్ఞానమే అయి వుండాలి. ఎందుచేతనంటే బ్రహ్మపదార్థంయొక్క అపరోక్షజ్ఞానం సాధనలో మొట్టమొదటి మెట్టు కావలెననడం అర్థరహితం. అనిత్యవస్తువుయొక్క వివేకం ప్రత్యక్షమైనదై వుండాలి. దీనివలన వైరాగ్యం ఉద్భవిల్లవచ్చును.

**115.** ఈ సాధన చతుష్టయ సంపన్నుడయిన అధికారి సద్గురువు నాశ్రయించి ఆయన వలన ఉపదేశం పొందాలి. దానిని 'శ్రవణం' అంటారు. శ్రవణంలో అతను పొందేది 'మహావాక్యోపదేశం'. వేదాంత శాస్త్రం యొక్క అసాధారణ లక్షణం 'శ్రవణం' - అని చెప్పుతారు. [అసాధారణ లక్షణం అనేది ఒక పారిభాషిక పదం. దాని అర్థం తక్కిన వాటిలో లేకుండా ఈ ఒక్కదానిలోనేవున్న ప్రత్యేకవిలక్షణం అన్నమాట. గోజాతికి గంగడోలువుండడం అసాధారణ లక్షణం. ఈ జాతికి చెందిన ఆవులకూ, ఎడ్లకూ గంగడోలు వుంటుంది. ఇతరజాతుల కుండదు. అందు చేతనే గంగడోలు గోజాతికి అసాధారణ లక్షణం.] తక్కిన శమదమాది లక్షణాలు ఇతర శాస్త్రాలలో కూడా చెప్పబడ్డాయి. శ్రవణం మాత్రం వేదాంత శాస్త్రం యొక్క ప్రత్యేక సాధనం.

**116.** ఈ శ్రవణంవల్ల గురువు ద్వారా తెలుసుకొన్న మహావాక్యార్థమును మననం చేయాలి. ఇది రెండో మెట్టు. యుక్తులచేతను శ్రవణం వలన తెలుసుకొన్న అర్థాన్ని విచారించి దృఢస్థితిని పొందడం దీని ఫలితం. యుక్తియుక్తంగా వ్రాయబడిన గ్రంథాలూ, వుపన్యాసాలూ, ప్రకరణ గ్రంథాలూ, భాష్యాలూ మొదలైనవన్నీ మననం నిమిత్తం ఏర్పడినవేయని గ్రహించాలి. ఈ మనన గ్రంథాలు సాధకునిస్థాయిని పట్టి వ్రాయబడి వుంటాయి.

**117.** శ్రవణం ద్వారా గ్రహించి, మననం ద్వారా దృఢపరచుకొన్న అర్థాన్ని నిధి ధ్యాసన చేయడం మూడో మెట్టు. దీనిలో యుక్తిప్రయుక్తులుండవు. దృఢపడిన అర్థం ఒక్కటే మనస్సులో నిలిచివుంటుంది.

**118.** ఈ శ్రవణ, మనన, నిధి ధ్యాసల వలన బ్రహ్మ అపరోక్షానుభవం సిద్ధిస్తుందని సిద్ధాంతం. సాధనను గురించి సరాసరి చెప్పినదిది.

**119.** అయితే మనన నిధిధ్యాసాదులు ఎన్నిసార్లు చెయ్యాలనేదే ప్రశ్న. "ఆవృత్తి రసకృ దుపదేశాత్" అనే సూత్రంలో 'అసకృత్'గా, అనగా చాలమార్లు, కొంచెమించు మించుగా నిత్యమూ, చేయమని నిర్దే

శించ బడింది. అయితే ఎన్నిసార్లు చేసినా బ్రహ్మ అపరోక్షానుభూతి కలుగక పోవడం ప్రత్యక్షంగా కనబడే విషయం. దీని విషయం ఏంచెయ్యాలనే ప్రశ్న ఉద్భవిల్లింది. ఇటువంటిస్థితికి కారణం పూర్వజన్మ కర్మలవలన ఏర్పడిన ప్రతి బంధకములు అని సిద్ధాంతీకరించేరు. దీనిని పూర్వపక్షం చేయడం సాధ్యంకాదు. రుజువుచేయడం అసలే సాధ్యంకాదు. ఇదో ప్రతిపాదన (Hypothesis) ఈ ప్రతిబంధకాలను తొలగించడం కోసం విధించినది ఉపాసన. శ్రీ గౌడపాద విరచిత శ్రీ విద్యారత్న సూత్రాల్లో మొదటిసూత్రం "అథ శాక్తమంత్రాగమ జిజ్ఞాసా !" అనేది. దీనికి శ్రీశంకరణ్యులు వ్రాసిన దీపికాఖ్యటీకలో అథశబ్ద ప్రయోగార్థాన్ని వివరిస్తూ "యద్యపి సాధనచతుష్టయ సంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా తథాపి ప్రబల ప్రారబ్ధతయా ప్రతిబంధక నివృత్తిద్వారా శాక్తమంత్రాణాం ఆగమస్యచ జిజ్ఞాసా—" అని వ్రాసేరు. ఈ ప్రతిబంధకాల నిమిత్తమే ఉపాసనం ఏర్పడిందని దీని తాత్పర్యం. ఈ ఉపాసన వివరాలు ఇక్కడ అప్రస్తుతం. ఈ ఉపాసనకు ప్రధానం భక్తి. అందుకే శ్రీ శంకరులు "మోక్షసాధన సామగ్ర్యా భక్తిరేవగరీయసీ—" అన్నారు.

120. వేదాంతశాస్త్రంయొక్క అసాధారణ సాధనం శ్రవణం అని పైన చెప్పేం. ఈ శ్రవణంవలన లభించేది మహావాక్యప్రాప్తి. ఈ మహావాక్యప్రాప్తి ఏ విధంగా కలుగుతుంది? దీనికి సాంప్రదాయసిద్ధంగా రెండేమార్గాలు. ఒకటి : సన్యాసాశ్రమాన్ని స్వీకరిస్తే. రెండు : శ్రీవిద్యా దీక్ష పొందినప్పటి ఒక స్థాయిలో. ఈ రెండుమార్గాలూ తప్ప మరోమార్గం చెప్పబడలేదు. ఈ రెండింటిలో సన్యాసాశ్రమ స్వీకారంలోవున్న కష్టనిష్ఠురాలు అందరికీ తెలిసినవే. ఈ ఆశ్రమం త్రైవర్ణికులకు మాత్రమే విధించబడింది. త్రైవర్ణికులలోకూడా ఆశ్రమస్వీకారానికి కావలసిన అర్హతలు వేరే వున్నాయి. శ్రీ శంకరులవారే ఒక మిషచేత ఆతురసన్యాసం పుచ్చుకోవలసివచ్చిందని అందరికీ తెలుసు.

121. ఇక శ్రీవిద్యాదీక్ష గురించి. ఇదీ ఆశ్రమ స్వీకారానికి తీసిపోనిస్థితిలోనేవుంది. దీనిల్లోవున్న వామ, దక్షిణాచారాల్ని గురించీ, మకారపంచకం వగైరాలను గురించీ అనేక పరస్పర భిన్నభావాలు శిష్యులలోనే వ్యాప్తిలో వున్నాయి. ఈ దీక్షను పుచ్చుకోనేవారిలాగే, ఇచ్చేవారికికూడా కొన్ని నియమాలున్నాయి. ఈ దీక్ష ఇప్పటికీ ఇచ్చేవారూ, పుచ్చుకోనేవారూ ఉన్నారు. అయితే వారి సంఖ్య బహు స్వల్పం. క్రమంగా ఇంకా తగ్గుతూంది. తగ్గుతుంది కూడా. దీని పూర్తినిర్వహణకు పూర్తికాలం వినియోగించాలి. ధనసహాయం కావాలి. శరీరం కాయక్లేశానికి బాగా ఓర్వగలగాలి. ఈ పరిస్థితులు సులభంగా ఎప్పుడూ ఏర్పడవు. శ్రీ శంకరులవారే — "విధేరజ్ఞానేన ద్రవిణవిరహేణాలసతయా"—అని శ్రీదేవి నర్చించడంలో తమకుగల అసమర్థతను ప్రకటించి అపరాధక్షమాపణ కోరుకున్నారు. ఇక ప్రస్తుతపరిస్థితులలో అసలే చెప్పనక్కర్లేదు.

122. ఈవిధంగా శ్రవణానికి ఏర్పరచబడిన మార్గాలు రెండూ ఆచరణలో అందుబాటులో లేకుండా పోయేయి. దానితో కేవలం బ్రహ్మ అనే పదం ఉచ్చరించడం ఒక్కటే మిగిలింది. దీనివలన వచ్చిన అనర్థకాలు చాలావున్నాయి. అద్వైతం అపహాస్యం పాలవడంకూడా వీనివల్ల కొంతకారణం. అసలు శృతే ఈఅపహాస్యం ప్రారంభించింది. "అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే। ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్.॥ - అని [మైత్రేయోపనిషత్తు].

123. తరువాతివారు నిర్గుణబ్రహ్మ ఉపాసన మొదలైనపద్ధతులు ఏర్పాటుచేసేరు. రామకృష్ణపరమహంస, వివేకానంద, రామతీర్థాదులు అద్వైతసాధనలను సామాన్యులకుకూడా అందుబాటులోకి తీసుకు రావడానికి ప్రయత్నించేరు. భగవాన్ రమణ మహర్షులవారు "నే నెవరు ?" [కోఽహం who am I] అనే ఆత్మవిచారణవలన సంపూర్ణమైన ఆత్మానుభవం కలిగి, ఆవిధంగా బ్రహ్మ అపరోక్ష అనుభవము పొందవచ్చునని నిరూపించి, ఇతరులకుకూడా ఆమార్గాన్ని ఉపదేశించారు. వీరి విశిష్టత ఏమంటే వీరు ఎట్టి గురూపదేశాన్నీ పొందలేదు. మహావాక్య శ్రవణం చేయలేదు. అద్వైతానుభూతికి వీరిసాధనము క్రొత్తదే అయితే కావచ్చు.

# 24. బ్రహ్మవిదుని బ్రహ్మత్వం

**124.** ఈ ప్రకారం సాధనచేయగా దాని ఫలితంగా సాధకుడు బ్రహ్మజ్ఞానాన్ని పొంది బ్రహ్మయే అవుతున్నాడని వారి సిద్ధాంతం. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి."

**125.** అయితే బ్రహ్మసూత్రాలు మొదటి పాదం రెండో అధికరణంలో బ్రహ్మపదార్థాన్ని నిర్వచనం చేస్తూ జగత్తుయొక్క సృష్టిస్థితిలయాలు ఎవరివల్ల నవుతున్నాయో అది బ్రహ్మమని నిర్వచింపబడింది. (జన్మాద్యస్యయతః) ఈ ముక్తి పొందిన జీవుడు బ్రహ్మపదార్థం కాగా జగత్తునకు సంబంధించిన వ్యాపారాలకు అంటే సృష్టిస్థితిలయాలకు ఆయన కూడా కారకుడవుతాడా, కాడా యని ప్రశ్న ఏర్పడుతుంది. ఈ ప్రశ్నకు సమాధానంగా బ్రహ్మ సూత్రాలలో ఆఖరుదయిన జగద్వ్యాపారవర్జ్యాధికరణంలో సమాధానం ఇవ్వబడింది. జగత్తుయొక్క సృష్టిస్థితిలయాది వ్యాపారం ఈశ్వరునకే వుంటుందనీ, తక్కిన ముక్తులందరకూ ఈశ్వరుని ఆనందం మున్నగునవి సమానంగా వుంటాయనీ, ముక్తుడికి మరల జన్మలేదనీ చెప్పేరు. [జగద్వ్యాపారవర్జ్యం । ప్రకరణాత్ అసన్నిహితత్వాచ్చ....అనావృత్తి శబ్దాత్ అనావృత్తి శబ్దాత్]

**126.** ఈ ముగింపు అద్వైతానికి పూర్తిగా సహకారికాదు. ఈ అధికరణంమీద శ్రీ శంకరులవారు వ్రాసిన భాష్యం అంతసంతృప్తికరంగా లేదనీ, అధికరణ వస్తువును కొంచెం సాగదీసి నట్లున్నదనీ శ్రీ వివేకానందు లన్నారు.

# 25. యెహోవా అర్థం 'అహం'

**127.** హిందూమతం ఒక్క అద్వైత మతం మాత్రమే కాదు. ఎన్నిరకాల మతాలు సాధ్యమో అన్ని రకాల మతాలూ హిందూమతంలో వుండడానికి తావున్నదని అనడం పరిపాటి.

**128.** కొంచెం ఇంచుమించుగా అన్ని మతాలలోనూ ఈ పరిస్థితి వుంది. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత ఛాయలు, ఇంకా ఇతర ఛాయలు అన్ని మతాలలోనూ కనిపిస్తాయి. బైబిల్‌ని తీసుకొన్నా, ఖురాన్‌ని తీసుకొన్నా ఈ స్థితి కనిపిస్తుంది. వీనిలో కొన్ని వాక్యాల్ని తీసికొని, అద్వైతాన్నో, ద్వైతాన్నో, విశిష్టాద్వైతాన్నో బోధిస్తూందనడం సరి కాదు.

**129.** బైబిల్‌లో అద్వైత ఛాయలున్నాయి. అసలు వారి మతంలో భగవంతునిపేరు యెహోవా. (Jehovah) ఈ శబ్దానికి అర్థం 'సత్'అని. ఎనలిటికల్ కన్‌కార్డెన్సు టు ది హోలీ బైబిల్ పు. 536. కాలం 2. లో యెహోవా అనే పదానికి క్రింద ఇల్లా వ్రాశారు :

JEHOVAH the existing one, the incommunicable name of the god of Israel. In the common version of the English Bible it is generally, though improperly translated by 'The Lord'.

దీని వలన బైబిలు మత ప్రకారం భగవంతుని పేరే 'సత్' అనీ, అది వాక్కునకు గోచరముకానిదనీ స్పష్టపడుతూంది.

**130.** బైబిల్‌లో Exodus అనే పుస్తకభాగంలో మూడో ప్రకరణంలో ఈ క్రింది విషయం కనిపిస్తుంది. మోసెస్‌ను ఫేరోవా వద్దకు (ఈజిప్ట్) వెళ్ళి యూదులను తీసుకురమ్మని భగవంతుడు ఆదేశిస్తాడు. తాను పంపించినట్లు చెప్పి తీసుకురమ్మన్నాడు. దానిమీద "వారా భగవంతుని పేరేమిటని అడిగితే ఏం చెప్పమంటావని మోసెస్ ప్రశ్నించేడు.

"నేను" పంపించేడని చెప్పమన్నాడు యెహోవా.

**131.** బైబిల్ అంతలోనూ I AM THAT I AM, I AM అనే రెండుమాటలే పెద్దఅక్షరాలలో (capital letters)లో వుంటాయి. వీని అర్థం అహమేవాహం, అహం అనీను. ఇది అద్వైత సిద్ధాంతంలో మంత్రస్థాయిలో వున్న మాటలని మనం తెలుసుకోవడం అవసరం. పైన వుదహరించిన మాటల గురించి ఎనలిటికల్ కంకార్డెన్స్‌లో ఇల్లా వుంది. "I AM THAT I AM or I AM. A name indicating the unsearchbleness of God than his mere existance as is commonly supposed (Hayah) [506 పు. 3 కాలం]

**132.** బైబిల్‌ను, చాలాలోతుగా పరిశీలించి, విశేషకృషి చేసిన బ్రహ్మశ్రీ కొప్పర్తి వేణుగోపాలరావుగారు (నర్సాపురం ప్రక్కనున్న సీతారామపురం) The Royal law అనే పేరుతో తమపరిశోధనలను ఒకగ్రంథ రూపంలో ఆంగ్లంలో వ్రాసేరు. ఇది రమారమి మూడువేల అరటావులు వ్రాతప్రతిలో

వుంది. ఇది ముద్రితం కాకపోవడం ఆంధ్రుల దురదృష్టం. ఈ తరువాత ప్రతిలోని కొన్ని భాగాలు చూసిన అదృష్టం నాకు కలిగింది. వీరి సిద్ధాంతం ప్రకారం బైబిల్ యోగశాస్త్ర గ్రంథము. అద్వైతాన్ని ప్రతిపాదించే గ్రంథము. ఇది గ్రీకులోనికీ, అందులోంచి ఇంగ్లీషులోకీ అనువాదం జరిగినప్పుడు అనువాదకులు చేసిన తప్పులవల్ల లోపభూయిష్ఠంగా తయారయింది. భగవత్పరమైన నామాలు రమారమి 500 వరకు దీనిలో వున్నాయి. ఇది అర్థంలో నూటికి హిందూమతంలోని భగవన్నామాలకు సరిపడతాయని వీరు చూపించేరు.

133. భగవంతుని పేర్లలో కల్లా బైబిల్ లోని యెహోవా (I A M అహం) ఒక్కటే సరియైన పేరని శ్రీ రమణమహర్షి కూడా అన్నారని తెలుస్తుంది.

# 26. ప్రార్థనల స్థానం

134. బ్రహ్మపదార్థం అక్షరము, నిర్గుణము, అయిన పరిస్థితిలో ప్రార్థనాదులకు స్థానం వుందా? వుంటే ఎటువంటిది? అని ప్రశ్న పుడుతుంది. బ్రహ్మపదార్థంనుండి మాయాసన్నివేశంచేత ఈశ్వరుని అస్తిత్వం ఏర్పడుతుందని అద్వైతులు చెప్పేరు. అసలు అద్వైతవాసనయే ఈశ్వరానుగ్రహంలేక కలగదన్నారు, శ్రీ శంకరులవారు. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా" (వివేకచూడామణి) ఈ అనుగ్రహం నిమిత్తమే ఉపాసన, ప్రార్థన, సర్వకర్మ ఫలత్యాగం ఆత్మార్పణం, భక్తి మొదలయినవి. దీనిని గురించి వివరంగా చర్చించడం ఇక్కడ సాధ్యంకాదు. ప్రార్థనను గురించి మట్టుకు ఒకటి రెండు విషయాలు చెప్పి వదిలేస్తాను.

135. భగవంతుణ్ణి ప్రార్థించినప్పుడు మన కోరికలు ఆయన నెరవేరుస్తాడనే విశ్వాసంతోనే ప్రార్థిస్తాం. ఆ నెరవేర్చడం మన ప్రార్థనయొక్క ప్రగాఢతమీద ఆధారపడివుంటుంది. అంతేకాదు, మన కోరికల స్వభావాన్ని పట్టికూడా వుంటుంది.

136. ఈ ప్రార్థన విషయంలో ఈ క్రిందివచనం కూడా గమనీయం:

"ప్రార్థనానంతరం మనస్సు తేలికపడినచో మన ప్రార్థన సఫలమయినట్లే." (Meridith వ్రాసిన Ordeal of Richard Feverel).

137. మన ప్రార్థనలు "భగవంతుని దయ కోరి చేయాలేగాని వరాలకోసం గాదు" అని ఆంగ్లంలో ఒక కవి అన్నాడు.

# 27. శంకరులు క్రియాశీలి

138. అద్వైతాన్ని దేశంలో స్థాపించి, వ్యాప్తి పొందించిన శ్రీ శంకరులవారు తమ జీవితకాలం 32 సంవత్సరాలూ కూడ సన్న్యాసం పుచ్చుకొన్నా, విధీవిరామం లేకుండా కృషిచేసి దేశంలో విజ్ఞానాన్ని వెదజల్లేరు. అన్ని మతాలయెడల సహన భావం చూపించేరు. ఆయామతాలలోని ఉపాస్య దైవతాలమీద అచంచల భక్తి శ్రద్ధలతో, ఇతరుల మనస్సులు ఉద్దీపింపచేసే స్తోత్రరత్నాలను రచించేరు. వీరి రచనలు రమారమి ఇరవైనాలుగు సంపుటాలున్నాయి. ఇంతపనిని వీరు 32 సంవత్సరాల వయస్సు లోపునే చేసేరు. అద్వైతాచార్యులు తమ జీవితంనుంచి మనకు చూపుతున్న ఆదర్శం ఇది.

139. శ్రీ విద్యారణ్యస్వామి జీవితం మనకు మరో ఆదర్శం. ఈయన వేదాలన్నిటికీ భాష్యం వ్రాసేరు. ధర్మశాస్త్రాలను నిరూపించేరు. మహమ్మదీయుల దండయాత్రలు దక్షిణాపథానికి పాకుతున్న దశలో వానికి ప్రతిఘటనగా యేర్పడిన విజయనగర సామ్రాజ్యాన్ని నిర్మించినవాడు ఆయనే. సిద్ధాంతాలకు భంగం లేకుండా కార్యాచరణలో అసమానోత్సాహమూ, సామర్థ్యమూ చూపిన మహావ్యక్తి. ఆడవాళ్ళకి ఆస్తులలో వాటాయివ్వడం ధర్మశాస్త్ర బద్ధమని నిరూపించి పోరాడిన మహానుభావుడు.

140. అద్వైతసిద్ధాంతానికి ప్రధాననాయకులైన ఈ ఇద్దరూ కార్యాచరణపట్ల ఇంత అసమాన ప్రతిభ చూపించేరు. దానికి వారి సిద్ధాంతాలేవీ అడ్డంరాలేదు. కాని, అద్వైతసిద్ధాంతానికి మాత్రం అది మనిషినిసమాజ పరిస్థితులనుంచి ముఖం తప్పించేటందుకు ప్రోత్సహిస్తుందనీ, అతడి స్వంత ముక్తికోసం ప్రపంచం ఏమయినా సరే అనే ధోరణికి దారితీస్తుందనీ ఒక వాదు ఏర్పడింది. బాధ్యతల నుంచి తప్పించుకుపోయేందుకు (Escapism) జగన్మిథ్యావాదం ఒక సిద్ధాంత విషయికమయిన పనిముట్టుగా పనికివచ్చింది. వ్యవహారిక ద్వైనా

జగత్తు సత్యమని శ్రీ శంకరులు పదేపదే చెప్పేరు. కాని, మిథ్యాశబ్దం దానిని వినబడకుండా చేసింది. మేధావులలో నిరాశావాదాన్నీ, బాధ్యతారాహిత్యాన్నీ ప్రోత్సహించింది. వీటిని తీవ్రంగా ఎదుర్కోవడానికి ఏర్పడిన సిద్ధాంత ధోరణులలో శ్రీ చైతన్య, సమర్థ రామదాస మున్నగువారి సిద్ధాంతములు గణనీయాలు. శ్రీ సమర్థ రామదాసుల దాసబోధ శివాజీనే సృష్టించినది.

**141.** జన్మదుఃఖం జరాదుఃఖం । జాయాదుఃఖం పునఃపునః । సంసార సాగరందుఃఖం । తస్మాజ్జాగ్రత జాగ్రత ॥- మొదలయిన వాక్యాలతో ప్రపంచంలో వునికి దుఃఖనిరుత్సాహ భరితమనీ, సాధ్యమైనంత త్వరలో ఈలోకంనుంచి బయటపడి బ్రహ్మపదార్థం యొక్క అపరోక్షానుభవం పొందడం ప్రశస్తమనీ అద్వైతంయొక్క బోధగా ప్రజలు అర్థంచేసుకొన్నారు. ఇప్పుడూ అదే అభిప్రాయంలో వున్నారు. ఈ అభిప్రాయాలను సిద్ధాంతరీత్యా వ్యతిరేకిస్తూ, మోక్షంకూడా త్యజించి ఈలోకంలోనే పరమేశ్వరానుభవం పొందాలనే వాదాలువచ్చేయి. వీటికి ప్రాతిపదికలు శ్రీమద్భాగవతం మొదలయిన గ్రంథాలలోనే వున్నా వానిని ప్రచారంలోకి తెచ్చింది చైతన్యులూ, కబీరూ, నానకూ, సమర్థ రామదాసు, వేమన మొదలయినవారు. సిద్ధాంతదృష్ట్యా వీరంతా అద్వైతులు కారు. కొందరు అద్వైతానికి వ్యతిరేకులు కూడాను. వీరిదృష్టిప్రకారం భగవంతుడు ఈ జగత్తులో వ్యాపించివున్నాడు. భగవదనుభవం కోసం సన్న్యాసం అవసరంలేదు. ఈ సంసారంనుంచి పోవాలనే దుర్బలులు కొందరు మోక్షంకోసం ప్రాకులాడి బయటకు పోవచ్చును. కాని ఇచటనే వుండిపోయే అనంత జనసామాన్యం మధ్యనేవుండి పరమేశ్వరుని నిత్యానుభూతి పొందవచ్చును. జన్మరాహిత్యాన్ని కోరడం తప్పు - మోక్షాన్నికూడా విడిచిపెట్టాలి - అన్నారు.

**142.** బుద్ధభగవానుడు కూడా మహానిర్వాణాన్ని సమీపించి నప్పుడు ఒక్కసారి వెనుతిరిగి చూడగా సంసారంలో, దుఃఖపడుతున్న ప్రజలు కనిపించారట. అంతట ఆయన ఈ లోకంలో ఒక్కమనిషి దుఃఖంలోవున్నా అంతకాలమూ తాను నిర్వాణంలో ప్రవేశించ కూడదని నిశ్చయించుకొని వెనుతిరిగి వచ్చేడని సంప్రదాయం వుంది.

**143.** వ్యాసుడు, నారదుడు మున్నగువారు ఈ కోటికి చెందినవారే. వారికి మోక్షము సన్నిహితంగా వున్నా ఈ లోకంలోనే వుంటూ మానవ కల్యాణం కోసమై పనిచేస్తూ మాధవుని నిత్యమూ దర్శిస్తూండ వచ్చును అని తమ జీవితముల ద్వారా చూపించేరు'

**144.** ఈ సత్సాంప్రదాయాన్ని అద్వైత సిద్ధాంతంతో కలిపి నవీనయుగంలో శ్రీ వివేకానందస్వామి ప్రపంచానికి చాటేరు. క్రియలలో చూపించేరు.

**145.** శ్రీ అరవిందులవారు యోగిక్ సాధన అనే పుస్తకంలో ఇదే అభిప్రాయం తెలిపేరు.

"ఈ ప్రపంచంలో కొందరు క్రియాశీలిత్వాన్నీ, కొందరు నిష్క్రియాపరతను బోధిస్తారు అనీ, కాని తాను బలహీనుల దృక్పథంతో ఏకీభవించలేననీ మహాభారతంలో శ్రీకృష్ణుడు చెప్పిన వాక్యాన్ని నేనభిమానిస్తా.

"నమే మతం తస్య దుర్బలస్య"

**146.** ఈ సత్సాంప్రదాయాన్ని అవగాహన చేసుకోవాలి ఆచరణలో పెట్టాలి.

**147.** ఈ వ్యాసాన్ని ముగించడానికి పూర్వం ఒకటి రెండు విషయాలు చెప్పవలసి వుంది.

**148.** ఈ వ్యాసంలో వ్రాసిన కొన్ని భాగాలు చూసి అద్వైతం తప్పు అని నిరూపించినట్లుగా కొందరు భావించవచ్చు. అల్లా అనుకొంటే పొరపాటే అవుతుంది. అది Non Sequiter అను హేత్వాభాసకు ఉదాహరణ అవుతుంది.

"A rather frequent form of this fallacy occurs when we think because we have refuted an argument for a theory, that the theory itself is necessarily false – which would be true only if the refuted argument was the only possible one for the theory. Or again, we may think that because a conclussion is true a usual argument for it is also true". (This is also a fallacy)

— Creighton's "Logic".



# శంకరునికాలంనాటి దేశపరిస్థితి: ఆయన ఉపదేశాల్లోని సాంఘిక ప్రయోజనం

శ్రీ కంభంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.,

8 వ శతాబ్దంలో భారతదేశ పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే, శంకరాచార్యుని ఉపదేశాలకు ఒక సామాజిక ప్రయోజనం ఉన్నదనీ, ఆయన నొక సంస్కర్తగా మనం గ్రహించవలసియుంటుందనీ యీ వ్యాసంలో సూచింపబడింది.

ప్రపంచచరిత్రలో అనేకమంది ప్రవక్తలు, తత్వశాస్త్రజ్ఞులు వేర్వేరుకాలాల్లో వేర్వేరు సిద్ధాంతాలను బోధించారు. అవి ప్రపంచంమీద వివిధరకాలైన ప్రభావం కలుగజేశాయి. ఆధునిక ప్రమాణాలతో పరిశీలిస్తే అవన్నీ శాస్త్రీయమైనవనిగాని, అభ్యుదయకరమైనవనిగాని చెప్పడానికి వీల్లేదు. వాటిలో అనేకం భావవాదాన్ని సమర్థించియుండవచ్చు; కుల - మత - వర్గ భేదాలను బలపరచియుండవచ్చు; దోపిడీవ్యవస్థను నిర్మూలించడాని కవి పూనుకొని యుండకపోవచ్చు. అంతమాత్రంచేత వాటన్నిటినీ అభివృద్ధి నిరోధకమైనవిగా త్రోసిపుచ్చడం సరికాదు. నిజానికి కొన్ని మతాలు, తత్వశాస్త్రధోరణులు ప్రారంభదశలో అభివృద్ధినిరోధక సాంప్రదాయాలకు, సిద్ధాంతాలకు వ్యతిరేకంగా బయల్దేరినవే. ఉదా: బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మదుల ఉపదేశాలు. వారి సిద్ధాంతాలు భావవాదకోవలకు చెందినవే అయినా, చారిత్రక దృష్టిలో వాటిని పరిశీలిస్తే వాటి సాంఘిక ప్రయోజనం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

దీని అర్థం, ఒకనాడు అభ్యుదయకర పాత్ర వహించిన ఒక తాత్విక ధోరణి ఎల్లకాలం అలాగే ఉంటుందని కాదు. ఒకప్పుడు మానవమేధస్సును అత్యున్నత పథాలకు గొనిపోయిన ఆలోచనా ధోరణులు క్రమేణా పిడివాదంగా పరిణమించి, అభివృద్ధి నిరోధకుల చేతుల్లో సాధనాలుగా ఉపయోగపడ్డం మనకు తెలుసు.

ఈ చారిత్రక దృక్పథంతో మనం శంకరుని ఉపదేశాలను పరిశీలిద్దాం.

## 8 వ శతాబ్దంలో అధ్వాన్న పరిస్థితులు

శంకరుడు 8 వ శతాబ్దంలో జీవించాడు. ఆనాడు భారతదేశం రాజకీయంగాను, ఆర్థికంగాను, సాంస్కృతికంగాను అధోగతిలో పడివుంది. ఉత్తర భారతదేశాన్ని రాజకీయంగా సమైక్యపరచిన హర్షవర్ధనుడు చనిపోయిన తర్వాత అతనిసామ్రాజ్యం రాష్ట్రకూటుల, ఘూర్జర ప్రతిహారుల, పాలరాజుల మధ్య విభజింపబడి అంతర్యుద్ధాలకు ఆలవాలమైంది. మరోవైపున మహమ్మదీయ రాజులు పశ్చిమోత్తర ప్రాంతం నుండి దండయాత్రలు చేయడానికి సిద్ధపడుతున్నారు. దక్షిణభారత దేశంలో చాళుక్యులు, పల్లవులు, వాకాటకులు పరిపాలించేవారు. ఈ అన్నిప్రాంతాల్లోను క్రూరమైన సైనిక నియంతృత్వం విలయతాండవం చేసేది. ఉద్యోగులంతా అగ్రకులాలకు చెందినవారే. ఆనాడు నిరంకుశాధికారవర్గం పైనుంచి క్రిందివరకు ఎంతక్రూరమైన పద్ధతులు అవలంబించేవారో క్షేమేంద్రుడను మహాకవి "నర్మమాల," "దేశోపదేశ" అను గ్రంథాల్లో విపులంగా వర్ణించాడు.

సంపద విభజన విషయంలో విపరీతమైన వ్యత్యాసాలుండేవి. వస్తుపాలుడు, తేజపాలుడు అను యిద్దరు వర్తక సోదరులు దానధర్మాల క్రింద 200 కోట్ల రూపాయలను ఖర్చుచేయ గలిగారంటే, ఏలా వారంత

ధనం సంపాదించారో అర్థమవుతుంది. దక్షిణాన మణిగ్రాహం అను పెద్దవర్తక శ్రేణి తూర్పు ఇండియా దీవులతో వర్తకంచేస్తూ విపరీతమైన ధనం లాభాల రూపంలో సంపాదించినట్లు చారిత్రకాధారాలున్నాయి. ఇక గ్రామసీమల్లో నివసించే కృషీవలులు (వీరే శూద్ర కులస్తులుకూడా) దారిద్ర్యంతో అర్ధబానిస జీవితం గడిపేవారు. ధనవంతులైన వర్తకులు, సామంత ప్రభువులు, దానధర్మాలకై ఖర్చుచేసే ధనం ఎక్కువగా దేవాలయాలు, యాత్రాస్థలాలు, మత సంస్థలు మొదలైనవాటికే ఇవ్వబడేది.

సాంఘికంగా చూస్తే, ప్రజల్లో మనోవికాసం పూర్తిగా అడుగంటింది. ఉత్తమ కళలకుగాని సాహిత్యానికిగాని విజ్ఞానశాస్త్రాలకుగాని ప్రోత్సాహం లేదు. ఉన్నత విద్యాసంస్థల్లో తత్వవిచారణలు అడుగంటాయి. చాలకాలం నుంచీ ప్రజల మానసిక శక్తుల్ని కల్లెంతో బిగించి ఉంచిన వర్ణవ్యవస్థ మరింత కఠోర రూపం దాల్చింది. ఆహారపానీయాదులపై విధి నిషేధాలు దైవనిర్మితములన్న విశ్వాసం ప్రజల్లో విస్తృతంగా వ్యాపించింది. అగ్రకులస్తులు హీనకులస్తులలో మూఢ నమ్మకాలను, దురాచారాలను వ్యాపింపజేసి, వారి మానసికాభివృద్ధిని అరికట్టేవారు.

అగ్రవర్ణస్తులలో ఆనాడున్న మతసాంప్రదాయాలు, వారుచేసే కర్మకాండ యీపతనావస్థకు చక్కని నిదర్శనాలు.

## పూర్వమీమాంస, వైదిక కర్మకాండ

క్రీ. శ. 700 ప్రాంతంలో కుమారిలభట్టు, ప్రభాకర పండితుడు అను యిద్దరు పండితులు (వీరిద్దరు ఆంధ్రులు) పూర్వమీమాంసకు వ్యాఖ్యానాలు వ్రాసి, వైదిక కర్మకాండపట్ల మూఢభక్తిని కలిగించారు. వైదిక కర్మలను - అంటే యజ్ఞ యాగాదులను - తు, చ తప్పకుండా అనుసరిస్తే మోక్షం లభిస్తుందనీ, మంత్రాక్షరాలలో అంతర్గర్భితంగా గొప్పశక్తి ఉందనీ, ఆమంత్రాలను ఉచ్చరిస్తే పుణ్యం చేకూరుతుందనీ, దానిఫలితాన్ని మరణానంతరం అనుభవించవచ్చుననీ- పూర్వమీమాంసకులు విశ్వసిస్తారు. కర్మకాండకు మూలమైన మంత్రాలు సర్వశక్తి సంపన్నములని వీరి అభిప్రాయం. దేవుని అస్తిత్వాన్ని నిరాకరించి నప్పటికీ, ఏదో ఒకదేవుని పేరుతో మంత్రాలను ఉచ్చరించడం, గుడ్డిగా వైదికమత కర్మలను ఆచరించడం పరమలక్ష్యంగా పెట్టుకున్న యీపూర్వ మీమాంసకులు ఆనాటి సమాజంలో అభివృద్ధినిరోధక పాత్ర వహించారు. వ్యక్తుల ఆలోచనాశక్తుల్ని వికసింపనీయకుండా, కాలచక్రాన్ని వెనుకకు త్రిప్పజూచే ధోరణిని అసలు "ఆలోచనా ధోరణి"యని పిలవడానికే వీల్లేదు. అయినా ఆనాటి రాజులు, చక్రవర్తులు పూర్వమీమాంసకులకు అమిత ప్రోత్సాహ మిచ్చేవారు. ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన చాళుక్యులు, విష్ణుకుండినులు, పల్లవులు యీ సాంప్రదాయా న్నెక్కువగా ఆదరించారు. క్రీ. శ. 5 వ శతాబ్దంలో విష్ణుకుండిన రాజైన మాధవవర్మ అశ్వమేధ, రాజసూయ యాగాలనే గాక నరమేధ యాగాలను కూడా చేశాడు.

క్రీ. శ. 730 ప్రాంతంలో కనోజ్ రాజైన యశోవర్మన్ (ప్రఖ్యాత నాటకరచయిత భవభూతి ఇతని ఆస్థానంలోనే ఉండేవాడు) శోణావతి నదీలోయ ప్రాంతంపై దాడిచేసినప్పుడు వింధ్యవాసిని పేరుతో వ్యవహరింపబడే దుర్గకు నరబలులిచ్చినట్లు చారిత్రకులు వ్రాశారు. ఇట్టి రాజులు, చక్రవర్తులు వేదాలను కంఠస్థం చేయడంలోను, వైదిక మంత్రాలను వల్లించడంలోను ప్రావీణ్యం గల పండితులకు విశేషంగా అగ్రహారాలిచ్చి పోషించేవారు. ఇట్టి అభివృద్ధినిరోధకమైన పూర్వమీమాంసపై శంకరుడు ధ్వజమెత్తాడు. అద్వైతమతాన్ని స్థాపించేముందు ఆయన కుమారిల భట్టుకు ముఖ్యశిష్యుడైన మండనమిశ్రుని దీర్ఘచర్చలలో ఓడించాడు.

పూర్వమీమాంసకులు వేదాలలో భాగమైన ఉపనిషత్తులనూ, తాత్వికచర్చలనూ విడిచిపెట్టి వాటిలోని కార్మకాండకు, మంత్రోచ్చారణకు విపరీతప్రాధాన్యమిచ్చారు; శంకరుడు యీ కర్మకాండను మంత్రాలను త్రోసిపుచ్చి ఉపనిషత్తులలోని తాత్వికచర్చలమీద తన దృష్టినంతటినీ కేంద్రీకరించాడు.

## బౌద్ధంలో దుష్టసాంప్రదాయాలు

బౌద్ధమతం కూడా ఆరోజుల్లో వెర్రితలలు వేసింది. బుద్ధుడు మానవులకు సోదరభావం, స్వేచ్ఛాలోచన, నైతిక ప్రవర్తన మొదలైన సద్గుణాలను బోధిస్తే, ఆయన శిష్యులు తమ అభిరుచుల కనుకూలంగా మూలపిటకములను తలక్రిందులుచేసి, మంత్రాలను సృష్టించడం, విగ్రహారాధనకు ప్రాధాన్యమీయడం, ప్రజల్లో మూఢనమ్మకాలను ప్రోత్సహించడం ప్రారంభించారు. నిర్వాణం సులభంగా లభించుటకు పూజా పునస్కారాల, మంత్ర

తంత్రాల మీదికి ప్రజల మనస్సులను మళ్ళించారు. చిత్ర విచిత్రమైన ప్రక్రియలను వెలికి తీశారు. "మంజుశ్రీ మూలకల్పం" యీ తంత్ర క్రియలకు పడగలెత్తింది. గుహ్య సమాజం, భైరవీ చక్రము నేర్పరచి, సారాయి- సంభోగం- మంత్రోచ్చారణలతో "ముక్తిమార్గము"ను మరింత సులభమొనర్చింది. మంత్రయానం, తంత్రయానం, వజ్రయానం అనే పేర్లతో వ్యవహరింపబడే యీ సాంప్రదాయం 7 వ శతాబ్దంలో విస్తృతంగా కొనసాగుతూంది. అనేక పరీక్షలలో నెగ్గినవారిని మాత్రమే వారు తమ గుంపులో చేర్చుకొనేవారు. 8 వ శతాబ్దం వచ్చేసరికి బౌద్ధ సాంప్రదాయాలన్నీ వజ్రయానగ్రస్థమైన మహాయానమునకు చెందియుండేవి. బయటికి భిక్షుకవేషం ధరించిన వీరందరూలోపల గుహ్యసామాజికులు. విద్వాంసులు, ప్రతిభాశాలురు అయిన కవులు సైతం శివమెత్తినట్లు 84 గురు సిద్ధుల వెంటబడి "సంధ్యాభాషయందు నిర్గుణగాన మొనర్చుచుండిరి." 7 వ శతాబ్దంలో ఉత్కళరాజ్యాన్ని పరిపాలించిన యింద్రభూతి, అతని గురువు అనంగ వజ్రసిద్ధుడు, మరికొందరు సిద్ధులుకలిసి స్త్రీలు ముక్తిదాతలనీ, పురుషులు ముక్తికి సాధనములనీ, మదం అమృతమనీ ప్రతిపాదించుటలో తమ పాండిత్యాన్నంతటినీ వినియోగించేవారట. శ్రీ కె. ఎం. పణిక్కర్ "గుహ్యసమాజ" మను బౌద్ధతంత్ర గ్రంథంలో పేర్కొనబడ్డ కొన్ని అంశాలను ప్రస్తావిస్తూ యిలా తెలియజేశారు:

"అత్యాశ్చర్యకరమయిన యీ గ్రంథంలో బుద్ధుడు దేవతలతో నిత్యమూ సంభోగక్రియలో మునిగి తేలుతున్నట్లు చిత్రింపబడ్డాడు. వినయపిటకమందలి క్రమశిక్షణ యీ గ్రంథంలో ఉద్దేశ పూర్వకంగా త్రొక్కివేయబడింది. తంత్ర శాస్త్రజ్ఞులు దీన్ని తమ ప్రమాణ గ్రంథంగా ఎంచుకొనేవారు. బుద్ధుని ఆరాధించేటప్పుడు మాంసం, చేపలు, మద్యం, స్త్రీలు - అన్నీ అనుమతింపబడేవి. ఒకచోట నరమాంసం కూడా పూజకు ఉపయోగింపబడేవనీ, పూజానంతరం దాన్ని మహాప్రసాదంగా భక్షించేవారనీ సూచింపబడింది. నరుల రక్తాన్ని మద్యంతో కలిపి త్రాగేవారటకూడా" (కె. ఎం. పణిక్కర్ : A survey of Indian History, పేజీ 107).

క్రింది కులాలకుచెందిన ప్రజాసామాన్యం ఆరోజు విద్యాగంధం లేక, మూఢనమ్మకాలలో మునిగి తేలుతూ, అగ్రవర్ణస్థులయెడ గుడ్డిభక్తిని కలిగియుండే వారు. అందువల్ల పై దురాచారాలు వారిమీద విప మైన ప్రభావం కలుగజేసేవి. ప్రపంచ ప్రఖ్యాత బౌద్ధరచయిత రాహుల్ సాంకృత్యాయన్ "శ్రీ బుద్ధచర్య" అను గ్రంథంలో క్రిందివిధంగా వ్రాశారు :

"మద్యపానమత్తులు, నర కపాలధారులు స్మశానవాసులు, మహారణ్యసంచారులు ఐన వీరు జనుల నెంతగా ధిక్కరించుచువచ్చిరో జనులు అంతగా వీరివెంటబడుచూ వచ్చిరి. బోధిసత్వులవలె, యితర దేవతలవలె యీ సిద్ధులను అద్భుత దివ్యశక్తి సంపన్నులుగ ప్రజానీకము తలంచెడిది. ఈ సిద్ధులు విచ్చలవిడిగా, స్త్రీలను సారాయము నుపభోగించువారు. రాజులుకూడ వీరికి తమకన్యలనర్పించుచుండుట యుండినది. త్రాటకం, హిప్నాటిజంవంటి కొన్ని ప్రక్రియలను వారు గుర్తెరిగి యుండిరి. వాటి ప్రభావముచేత అమాయక ప్రజలకు ఆయా చమత్కారములను జూపేవారు. అప్పుడప్పుడు హస్తలాఘవము చేతను, శ్లేషయుక్తములగు అస్పష్ట వచనములతోను జనులను ముగ్ధుల నొనర్చువారు. ఈ విధముగ అయిదు శతాబ్దములలో నొక విధముగ భారతప్రజయంతయు వారి వలలో పడి కామ వ్యసనులు, మద్యపాన లోలురు, మూఢ విశ్వాసకులుగా తయారైరి."

(శ్రీ బుద్ధచర్య : భూమిక - పేజీ 20 : ఆంధ్రానువాదం)

మహమ్మదీయ దండయాత్ర మనదేశానికి చాలా కీడు చేసినప్పటికీ, కీడుతో మేలన్నట్లు ఆనాటి ప్రజల మూఢవిశ్వాసాల నది పటాపంచలొనర్చింది. 8 వ శతాబ్దంలో పశ్చిమోత్తర సరిహద్దునుంచి భారతదేశం మీదికి దాడివెడలిన మహమ్మదీయులు దండయాత్రను, దాని ప్రభావాన్ని వర్ణిస్తూ రాహుల్జీ యిలా వ్రాశారు:

"అనంత దివ్యశక్తులకు ఆలవాలమని కొండాడుచు వచ్చిన దేవతా ప్రతిమలను వారు తునాతునకలు చేసిపోయిరి. తాంత్రికులు తమ మాంత్రిక ప్రయోగములను నెరపుచునే యుండిరి. కాని దానివలన తురుష్కులకు ఘటిల్లిన నష్టమేమియు లేదు... ఈ యుద్ధమునందు అపార జన ధనములకు హాని వాటిల్లినది. అనంత గ్రంథరాశి ఆహుతిమైనది. సాటిలేని కళామూర్తులు రూపుమాపబడినవి. ఏదెట్లయినను ఒక్క మేలు జరిగినది. కదలింపరాని మోహనిద్రలోనుంచి లోక ప్రజ కన్నుదెరచినది."

(శ్రీ బుద్ధచర్య: భూమిక - పేజీ 31, 35: తెలుగు అనువాదం.)

శంకరుడు బౌద్ధమతంమీద చేసినదాడి ప్రధానంగా తాంత్రిక ప్రధానమైన వజ్రయానంమీద, విజ్ఞానవాదశాఖమీద మాత్రమే. ఆనాడు వజ్రయాన సాంప్రదాయ మెంత జుగుప్సాకరంగా పరిణమించిందో పైన చూచాం. మానవుణ్ణి పశుస్థాయికియీడ్చి ఆతనిలో ఆలోచనా శక్తిలేకుండాచేసి, సమాజాన్ని నిర్వీర్య మొనర్చుతూన్న వజ్రయానం ప్రబలంగా ఉన్నంతకాలం అత్యంత జటిలమైన అద్వైత సూత్రాల పైకి ప్రజలదృష్టిని మళ్ళించడం అసంభవమని శంకరుడు గ్రహించి యుండాలి. జీవిత పరమార్థం నిర్వాణమని బుద్ధుడు ప్రతిపాదించగా, జీవన్ముక్తి అని శంకరుడు అన్నాడు. బుద్ధుడు "ప్రతిదీ ఉన్నదనడం ఒక విపరీత ధోరణి; ఏదీలేదనడం మరొక విపరీతధోరణి" అంటే, శంకరుడు జగత్తును పూర్తి సత్యమూ అనలేదు, పూర్తి అసత్యమూ అనలేదు. దాన్ని వ్యావహారిక సత్యమని చెప్పాడు. ఈ విధంగా ఆదిబౌద్ధానికీ, అద్వైతానికీ కొన్ని ముఖ్యమైన పోలికలున్నాయి. కాని వజ్రయాన శాఖకూ, అద్వైతానికీ పోలిక ఎక్కడాలేదు. అందువల్లనే పూర్వమీమాంసకారులు శంకరుని "ప్రచ్ఛన్న బౌద్ధు" డని విమర్శించారు. అలా విమర్శించడంలో ఆశ్చర్యంకూడాలేదు. ఈ సందర్భంలో శ్రీ కె. ఎం. పణిక్కర్ యిలా వ్రాశారు:

"మీమాంసకులు శంకరుని ప్రచ్ఛన్న బౌద్ధుడని విమర్శించారు. ఇది కొంతవరకు నిజమే. ఎందువల్లనంటే, బుద్ధునివలె శంకరుడుకూడా ఆనాడు మతంయొక్క స్థానమాక్రమించిన వైదిక కర్మకాండను నిరసించాడు. బౌద్ధులు కూడా యిలాగే శంకరుణ్ణి తమ ప్రబల శత్రువుగా పరిగణించారు. భారతదేశంలో బౌద్ధ తాత్విక సాంప్రదాయాలు పతనమవడానికి కారణం శంకరుని ఉపదేశాలేనని భావింపబడ్డం సక్రమమే కూడా."

(పణిక్కర్: A Survey of Indian History - పేజీ 101)

## కాపాలిక సాంప్రదాయం

పైన పేర్కొన్న పూర్వమీమాంస, వజ్రయాన సాంప్రదాయాలే కాక పాశుపత, కాపాలిక, శాక్తేయ, గాణాపత్య మొదలైన హేయ సాంప్రదాయాలెన్నో ఆనాడు శైవమతం పేరుతో విశేషంగా వ్యాప్తిలో ఉండేవి.

కాపాలికులు, స్త్రీ యోనిపై ఆత్మను ఊహించుకొని ధ్యానం చేయడంవల్ల మోక్షం సిద్ధిస్తుందని విశ్వసించేవారు. ఐహికాముష్మిక సుఖాలు పొందాలంటే క్రింది కర్మలు ఆచరించాలని వారి నమ్మకం (అలా ఆచరించేవారుకూడా): మనిషి పుర్రెలో భోజనం చేయడం; మృతకళేబరంయొక్క భస్మాన్ని శరీరానికి పులుముకోడం: అట్టి భస్మాన్ని తినడం; చేతిలో ఎల్లప్పుడూ దండాన్ని ధరించడం; నిరంతరం ఒక పాత్ర నిండా మద్యాన్ని నిల్వ ఉంచడం; అందులో భగవంతుణ్ణి ఊహించుకొని ధ్యానం చేయడం. కాపాలిక మతాన్ని స్వీకరిస్తే శూద్రులు బ్రాహ్మణు లవుతారని వారి నమ్మకం.

మతంపేరుతో ప్రబలే యీ అమానుష సాంప్రదాయాన్ని శంకరుడు తీవ్రంగా ఖండించాడు. "శంకర దిగ్విజయం"లో ఒక ఉదంతం ఉంది. ఉజ్జయినిలో ఒక కాపాలిక మతాచార్యుడు శంకరునికి తారసిల్లాడట. అతడు శరీరంనిండా స్మశానభస్మం పులుముకొని ఒకచేత్తో పుర్రెను, మరోచేత్తో త్రిశూలం ధరించి వచ్చాడు. శంకరునితో అత డిలా అన్నాడు: "నీవు శరీరంనిండా భస్మం పూసుకోడం బాగానే ఉంది. గాని, పవిత్రమైన పుర్రెను పుచ్చుకోకుండా అపవిత్రమైన కమండలమెందుకు పుచ్చుకున్నావు? భైరవుని అవతారమైన కపాలుణ్ణి నీవెందుకు పూజించవు? భైరవుణ్ణి పుర్రెలతోను, మద్యంతోను, నర రక్తంతోను పూజించకపోతే అతడెలా ప్రసన్నుడౌతాడు?" అప్పుడు శంకరునితో ఉన్న సుధన్వుడనే రాజు అతణ్ణీ, అతని అనుచరుల్నీ చంపివేశాడు. చివరకు

కాపాలికుల అధిపతియైన క్రకచుణ్ణి భైరవుడే చంపివేసి, కాపాలికు లందరినీ సంహారించినట్లు చెప్పబడింది. ఈ కథనుబట్టి మనకు బోధపడేదేమంటే, మానవునిలో విజ్ఞానం పెంపొందకుండా అరికట్టే యిలాంటి పైశాచిక పద్ధతుల్ని రూపుమాపేందుకు శంకరుడు తీవ్రంగా కృషిచేశాడు; కొందరు రాజులు కూడా ఆయనకు సహాయం చేశారు.

## శాక్తేయుల వామాచారమార్గం

ఇక శాక్తేయుల విషయం. సృష్టికంతకూ మూలం శక్తిస్వరూపిణి ఐన త్రిపురసుందరి అనీ; ఆమెను ఆరాధించిన వారికి మోక్షం సిద్ధిస్తుందనీ వీరు నమ్మేవారు. ఈ ఆరాధనా పద్ధతి పరమ నీచమైనది. భూర్జపత్రం మీదనో, పట్టుగుడ్డ మీదనో, బంగారు రేకుమీదనో తొమ్మిది స్త్రీ యోనుల ఆకారాన్ని గుండ్రంగా చిత్రించి అందులో మధ్యనున్న యోనిని మంత్రాలతో పూజించేవారు. మొత్తం చిత్రానికి "శ్రీచక్రము"ని పేరు. శంకరుని కాలంలో యీ మతస్థులు చిత్రాన్ని పూజించడానికి బదులు సజీవలైన కన్యల, యోనులనే పూజించేవారట. ఇందుకు "నవకన్యలు" అంటూ తొమ్మిది కులాలకు చెందినవారిని తీసుకొచ్చేవారు. పూజ ఐపోగానే, దేవికి మద్యం, మాంసం, చేపలు నైవేద్యమిచ్చి, తర్వాత మహానైవేద్యంగా వాటిని స్వీకరించేవారు. పిమ్మట ఆ కన్యలతో సంభోగించి, దేవతకు వారిని బలియిచ్చేవారు. ఈ ప్రక్రియఅంతా "పంచమకారాల"లో క్రోడీకరింపబడింది. (మద్యం, మీనం, మాంసం, ముద్ర, మైథునం). దేవి కులభేదాలకు పాటించదు! ఏ కులంవారైనాసరే, దేవీ పూజచేస్తే బ్రాహ్మణు లవుతారనీ, పూజానంతరం తిరిగి ఎవరి కులాలు వారికి లభిస్తాయనీ నమ్మేవారు. శాక్తేయులే వామాచారులని కూడా వ్యవహరింపబడేవారు.

## గాణాపత్యం, పాశుపతం

గాణాపత్యం, పాశుపతంకూడా యీ విధమైన శాఖలే. శాక్తేయులవలెనే గాణాపత్యులకుకూడా కుల విచక్షణ లేదు; వివాహ - అవివాహ విచక్షణకూడా లేదు. స్త్రీ పురుషులు విశృంఖలంగా ప్రవర్తించవచ్చు. మద్యమాంసాదులపై నిషేధంలేదు. వీరి దేవుడు గణపతి. ఇక పాశుపతావలంబకులు మోక్ష సాధనకు శరీరం నిండా బూడిద పూసుకొని ఆరు ప్రక్రియలద్వారా శివుని పూజించేవారు : 1. నవ్వడం, 2. పాడ్డం, 3. నృత్యం చేయడం, 4. ఎద్దు అరచినట్లు నాలుకను అంగుట్లోకి దూర్చి అరవడం, 5. సాగిలపడ్డం, 6. వినబడీ వినబడకుండా గొణగడం. స్వర్గప్రాప్తికి మరో 6 మార్గాలు సూచింపబడ్డాయి : 1. మేల్కొని యుండగా నిద్రిస్తూన్నట్లు భావించుకోడం, 2. శరీరావయవాలను పక్షవాతపు రోగివలె ఆడించడం, 3. కాళ్ళు పడిపోయినట్లూహించుకొని నడవడం, 4. అందమైన స్త్రీతో శృంగారచేష్టలు చేస్తున్నట్లు భావించుకోడం, 5. పదిమందీ నిషేధించిన కార్యాన్ని యుక్తాయుక్తవిచక్షణ తెలియనట్లుగా ఆచరించడం, 6. పిచ్చివానివలె మాట్లాడ్డం.

## వ్యభిచారం

దేవదాసీ పద్ధతి ఆరోజుల్లో విస్తృతంగా వ్యాప్తిలోకి వచ్చింది. మతం పేరుతో నైతిక విలువల్నెంత పతనావస్థకు దిగజార్చవచ్చునో యిది తార్కాణం. "సమయ మాతృక" "కుట్టనీమతం"అనే గ్రంథాల్లో వేశ్యల జీవితం వర్ణింపబడింది. "సమయమాతృక" రచించినది క్షేమేంద్రుడు. ఆ రోజుల్లో ఆయనొక గొప్ప విద్యావేత్త : "రామాయణం," "బృహత్కథ" మొదలైన గ్రంథాలకు సులభశైలిలో రచించిన దిట్ట; ఆయన సర్వజ్ఞుడనే పేరు సంపాదించుకున్నాడు. అటువంటి మేధావి "సమయమాతృక" అనే గ్రంథంలో ఒక వేశ్యయొక్క స్వీయచరిత్రను వర్ణించాడు. అందులోని నాయకురాలు రా దూతికగా, సామంతుని ఉంపుడు కత్తెగా, బజారు మనిషిగా, తార్పుడు కత్తెగా, బూటకపు భిక్షుకిగా, యాత్రికురాలుగా, యువకుల్ని వలలో వేసుకొనే మోసకత్తెగా ఎన్నెన్ని వేషాలువేసిందో, ఎన్నెన్ని నాటకాలాడిందో చెబుతుంది. ఆనాటి సమాజంలో వివిధ తరగతులకు చెందిన పరిఅలు - ముఖ్యంగా ఉన్నత వర్గాలవారు - నైతికంగా ఎంత పతనావస్థలో ఉండేవారో యీ గ్రంథం తెలుపుతుంది. ఇక "కుట్టనీమతం" అనే గ్రంథం ఒక తార్పుడు కత్తెయొక్క అభిప్రాయాలను తెలియజేసేందుకు రచింపబడింది. దాని రచయిత దామోదరగుప్తుడు. అతడు కాశ్మీరు రాజు వద్ద మంత్రిగా ఉండేవాడు.

"దేవీ భాగవతం" మొదలైన అసంఖ్యాకమైన తంత్రశాస్త్ర గ్రంథాలుకూడా అసభ్య ప్రక్రియల వర్ణనలతో నిండియుండేవి. దేవాలయాలమీద బూతు

బొమ్మలు ఎంతో అసహ్యాకరంగా, ప్రజల నైతిక విలువలను మట్టిపాలు చేసేవిగా చెక్కబడేవి.

భారతదేశంలో వ్యభిచారం తప్పుగా చూడబడ్డం లేదని ఇబిన్ బతూతా అను మహమ్మదీయ యాత్రికుడు వ్రాశాడు.

ఈ విధంగా మానవుణ్ణి పశుతుల్యునిగా మార్చేందు కెన్ని ఉపాయాలయినా, ఎన్ని మార్గాలయినా ఆ రోజుల్లో అనుసరింపబడేవి. మానవుణ్ణి తిరిగి మానవునిగా చేయడం ఆనాడు వివేకవంతుల కర్తవ్యమయింది. మానవు లందరిలోను పరబ్రహ్మను చూడదలచుకున్న శంకరుడు పై విధమైన అమానుష క్రియలను, ఆటవిక ప్రవృత్తిని రూపుమాపనిదే ఒక్క అడుగు కూడా ముందుకు వేయడం అసంభవమని తెలుసుకున్నాడు. కనుకనే వాటిని నిర్మూలించడాని కతడు బద్ధకంకణుడయాడు.

## శంకరుని సంస్కరణ పద్ధతి

పాశుపత, శాక్తేయ, గాణాపత్యాది శాఖల్లో ప్రవేశించిన పైశాచిక సాంప్రదాయాల్ని నిర్మూలించేందుకు ఆయన పాటుబడ్డాడు. వాటిని తాంత్రికకర్మలనుంచి విముక్తిచేసి, శుద్ధ భావనారీతులలో వాటిని పునః ప్రతిష్ఠించాడు. శాక్తేయంలోని వామాచారశాఖకు ప్రతిద్వంద్వియైన సామాయిన సాంప్రదాయం శంకరుని సృష్టియేయని భావించబడుతోంది. ఆదిశక్తిని భక్తి పూర్వకంగా ఆరాధించడం దాని విలక్షణ ధర్మం. ఈ విధమైన శక్తి పూజకు ప్రమాణ గ్రంథంగా పరిగణింపబడుతూన్న "సౌందర్యలహరి" శంకర విరచితమేనని చాలమంది అభిప్రాయము.

శంకరుడు ప్రతిపాదించిన తాత్వికధోరణి - అద్వైతం - భావవాదకోవకు చెందినదనడంలో ఎట్టి సందేహంలేదు. అయినప్పటికీ ఆనాటి సామాజిక పరిస్థితుల్లో శంకరుడొక సంస్కర్తగా అభ్యుదయ పాత్ర నిర్వహించాడు. ఆయన తన భావాలను దేశభాషల్లోకాక సంస్కృతంలోనే ప్రచారంచేసి యుండవచ్చు. వాటి ప్రత్యక్ష ప్రయోజనం జనసామాన్యానికిగాక, పండితులకోకానికే పరిమితమై యుండవచ్చు.

అయితే, ఆనాడు ప్రజాసామాన్యంమీద పండితుల ప్రభావం తక్కువదేమీకాదు. అట్టి ఉన్నతవర్గాల్లో సంస్కారం తీసుకు వచ్చేందుకు శంకరుడు తన సర్వశక్తుల్నీ ధారవోశాడు. అగ్రవర్ణస్తుల దృష్టిని తుచ్ఛమైన, అమానుషమైన, జుగుప్సాకరమైన కర్మకాండనుంచి ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన నిగూఢ తాత్విక చర్చలపైకి మళ్ళించాడు. పరమనీచమైన పశుప్రవృత్తితో చిక్కుంకట్టిన మానవమేధస్సును అత్యున్నతమైన భావనావీధులలో విహరింపజేశాడాయన.

జగత్తు వాస్తవికమా అవాస్తవికమా? పారమార్థిక సత్యానికీ, వ్యావహారిక సత్యానికీ గల సంబంధమేమిటి? పదార్థమా, భావమా ఏది ప్రధానం? మొదలైన తాత్విక సమస్యలపై మేధావుల దృష్టిని మళ్ళించడానికి మూఢవిశ్వాసాలను, తాంత్రిక కర్మలను ఎదుర్కోవడం తప్పనిసరి అయింది. ఆ విధంగా శంకరుడు తత్వశాస్త్ర పునరుజ్జీవనకు అమోఘమైన కృషిచేశాడు.

ఇందు కాయన చేబట్టిన పద్ధతికూడా విలక్షణమైనదే. ఏ మతాన్నీ, ఏ కులాన్నీ, ఏ సాంప్రదాయాన్నీ ఆయన ఖండించలేదు. ప్రతి మతంలోను, కులంలోను, సాంప్రదాయంలోనుఉన్న చెడును ఆయన నిరసించాడు. అన్ని మతాలమధ్య, కులాల మధ్య, సాంప్రదాయాల మధ్య సమన్వయం సాధించడానికి, వాటిమధ్య సహజీవనం పెంపొందించడానికి కృషిచేశాడు. వేదాలను ఆయన ఖండించలేదు; కాని వాటిలో భాగమైన నిర్జీవకర్మకాండను ఖండించాడు. బుద్ధుని ఆయన నిందించలేదు; పైగా కీర్తించాడు. దశావతారాల్లో ఒక అవతారంగా ఆయన్ని చేర్చాడు. కాని ఆనాడు వ్యాప్తిలో ఉన్న బౌద్ధ సాంప్రదాయాల్ని - విజ్ఞానవాదం - వజ్రయానం - ఆయన నిరసించాడు. శక్తిపూజను ఆయన నిరసించలేదు; అందులోని వామాచార సాంప్రదాయాన్నే ప్రతిఘటించాడు. శైవమతాన్ని ఆయన త్రోసిపుచ్చలేదు. కాని అందులోని పాశుపత, కాపాలికాది శాఖల మీద ధ్వజమెత్తాడు. ఒక సందర్భంలో ఆయన కుక్కను పూజించే శివభక్తుని చూచి, కుక్కకు బదులు లింగాన్ని పూజించవలసిందని ఉపదేశించాడట. శివుని, విష్ణువును, శక్తిని స్తోత్రంచేస్తూ శంకరుడు శ్లోకాలుకూడా వ్రాశాడు. ఆయన షణ్మతాచార్యుడని కూడ వ్యవహరింబడుతున్నాడు.

కులభేదాలయెడ శంకరుని వైఖరి యెట్టిదో తెలియజేసే గాథ ఒకటి వుంది. ఒకరోజున శంకరాచార్యుడు

శిష్యులతో కలిసి గంగానదివద్దకు స్నానానికి వెళ్తూంటే ఒక హరిజనుడు ఎదురుగా వచ్చాడట. వెంటనే ఆయన శిష్యులు అతన్ని ప్రక్కకు తప్పుకోవలసిందని హెచ్చరించాడట. అంతట ఆ హరిజనుడు "మీరు అద్వైతులుగదా! అందరిలోనూఉన్న పరబ్రహ్మ ఒకటేనని చెప్పేవారు నన్ను తప్పుకోవలసిందనటం సమంజసమా? అని ప్రశ్నించాడట. శంకరుడు ఆశ్చర్యపడి, అతడు చెప్పినమాట నిజమేనని ఒప్పుకున్నాడట. అయితే, అంతటి అద్వైతసిద్ధి మనకింకా లభించలేదు గనుక లోకవ్యవహారానికి కట్టుబడియుండి కులభేదాలను కొంతవరకు పాటించవలసి యుంటుందని తన శిష్యులకు చెప్పాడట.

ఈ విధంగా లోకవ్యవహారానికి కట్టుబడియుండాలనే రాజీధోరణి ఒకవైపున, సాంఘిక దురాచారాలను అతీతంగా ఆలోచించాలన్న ధోరణి మరోవైపున - యీ రెండుధోరణులూ పై సమాధానంలో మనకు వ్యక్తమవుతున్నాయి. యంత్రనాగరికత నానాటు ప్రబలమవుతూ, కులభేదాలు సడలిపోతున్న ఆధునికయుగంలోనే ఏ ప్రజాసంస్థ, ఏ విప్లవ పార్టీ వర్ణవ్యవస్థను ఒక్కసారి రూపుమాపడానికి ప్రయత్నించకుండా (సాధ్యం కాదుగనుక) ఒక విధమైన మధ్యేమార్గ మవలంబిస్తుంటే, 8 వ శతాబ్దంలో - అత్యంత కఠినమైన నిబంధనలతో వర్ణవ్యవస్థ ప్రజానీకంపైన పెత్తనం చెలాయిస్తున్నప్పుడు - శంకరుడులాంటి ద్వంద్వమార్గ మెందు కవలంబించవలసి వచ్చిందో అర్థంచేసుకోవచ్చు.

## శంకరుని నిర్మాణకౌశల్యం

శంకరుడు అసాధారణమైన శక్తివంతుడు. నిరంతర నిర్విరామకృషి ఆయన ప్రత్యేకత. ఏ అడవుల్లోనో కూర్చొని యోగనిద్రలో నిమగ్నమయే పలాయన ప్రకృతికా ఆయనిది. ఎల్లప్పుడూ మేధావులతో చర్చలు జరుపుతూ ఉండేవాడు. కన్యాకుమారి అగ్రం మొదలు హిమాలయపర్వతాలవరకు, కాలినడకను ప్రయాణంచేసి అగ్రవర్ణాలకుచెందిన విద్వాంసులయెదుట తన ప్రతిభను ప్రదర్శిస్తూ అద్వైతమతాన్ని ప్రచారంచేశాడు. 32 సంవత్సరాలు మాత్రమే జీవించిన ఆ మహామేధావి అనేక సంవత్సరాల్లోగాని చేయలేని పనిని పూర్తిచేశాడు. భారతీయ మేధావివర్గంమీద ఆయన ప్రభావం యిప్పటికీ స్పష్టంగా మనకు కనిపిస్తుంది.

శంకరాచార్యుడు యావద్భారతదేశాన్ని తన కార్యక్షేత్రంగా చేసుకొన్నాడు. ఉత్తరాన హిమాలయ పర్వతాల్లో బదరీనాథ్ వద్ద, తూర్పున పూరీలోను, పశ్చిమతీరంలో ద్వారకవద్ద, దక్షిణాన శృంగేరీలోను నాలుగు మఠాలను స్థాపించి, భారతదేశ ఐక్యతకు పట్టం కట్టాడు. ఒక్కొక్క మఠానికి ఒక్కొక్క ఆచార్యుడు అధిపతి. వారంతా అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తూ ఉపనిషత్తుల ఆధిక్యతను నిరూపించేవారు. ఈ చతుర్మఠాలు, వాటి అధీనంక్రింద ఉండే యితర చిన్న మఠాలు అగ్రవర్ణాల్లో హిందూ సనాతన ధర్మాన్ని ప్రచారంచేసి, భావవాద ధోరణులను కొంతకాలంవరకు ప్రతిష్ఠించగలిగాయి.

పై నాలుగు మఠాలను స్థాపించడంతోపాటు శంకరుడు సన్యాసాశ్రమ ధర్మాలను పునర్వ్యవస్థీకరించాడు. "దశనామీల" పేరుతో వ్యవహరింపబడే పది ధర్మాలూ ఆయనచే స్థాపింపబడినవే. గురువు యొక్క సందేశాన్ని దేశం నలువైపులకూ కొనిపోవాలంటే శిక్షణ గడిన ప్రచారకు లవసరం. అట్టి మత ప్రచారకులు భారతదేశంలో మొదటినుంచీ కొల్లలుగా ఉండేవారు. బౌద్ధ, జైనభిక్షువులకు పూర్వం హిందూ సన్యాసులు ఎవరి గురువు ఉపదేశాల్ని వారు వేర్వేరుగా బోధించేవారు. ప్రత్యేక మఠాలంటూ వారికుండేవి కావు. కాని శంకరుడు బౌద్ధ, జైన సాంప్రదాయాన్ననుసరించి తన శిష్యులందరినీ ఒకే ఒక సంఘంగా సమైక్య పరిచాడు. అద్వైత సిద్ధాంతం దేశం నలువైపులకూ విస్తరించ గలిగిందంటే శంకరుని నిర్మాణ కౌశల్యంకూడా కారణమేనని చెప్పాలి.

ఆ రోజుల్లో ప్రతి పెద్ద దేవాలయానికి ఒక విద్యాపీఠం ఉండేది. అందులో అగ్రవర్ణస్థులకు పెద్దయెత్తున ఉచితవిద్య బోధించేవారు. ఈ అవకాశాన్ని శంకరుడు, ఆయన శిష్యులు చక్కగా వినియోగించుకున్నారు. ప్రతి విద్యాపీఠంలోను అద్వైతం బోధింపబడేది. బౌద్ధ విశ్వవిద్యాలయాలకూ, యీ విద్యాపీఠాలకూ ఒక వ్యత్యాసం ఉంది. నాలందా మొదలైన బౌద్ధ విశ్వవిద్యాలయాల్లో బౌద్ధ సిద్ధాంతాలేగాక హిందూమత సిద్ధాంతాలుకూడా బోధింపబడేవి. విభిన్న తాత్విక ధోరణులకు మధ్య వాద ప్రతివాదాలకు సంపూర్ణ స్వేచ్ఛ ఉండేది. కుల మత భేదాలు పరిగణింపబడేవి కావు. కాని యీ దేవాలయ పీఠాల్లో అలాకాదు. హిందూ సనాతనధర్మం మాత్రమే అక్కడ బోధింపబడేది. అదైనా అగ్రవర్ణస్థులకు మాత్రమే.

శంకరాచార్యుడు జీవించియున్నంతకాలం ఆయన శిష్యులు శ్రద్ధతో అద్వైత సందేశాన్ని ప్రచారం చేశారు. కాని తర్వాత ఆ సాంప్రదాయం నశించింది. బౌద్ధారామాల వలెనే శంకర మఠాలుకూడా విలాస జీవితానికీ, అవినీతికీ ఆటపట్టులయ్యాయి. చిన్న మఠాల్లో మరీ వికృతమైన పద్ధతులు అనుసరింపబడేవి. వాటిల్లో సన్యాసులు గడిపే విశృంఖల జీవితాన్ని క్షేమేంద్రుడు తన "నర్మమాల"లో వర్ణించి అవహేళన చేశాడు. ఈ విధంగా సన్యాసులు క్రమక్రమంగా సమాజానికి బరువుచేటుగా తయారయ్యారు. వారి సంఖ్య అంతకంతకు పెరుగుతూవచ్చింది. మూఢ విశ్వాసాలు ప్రబలం కాజొచ్చాయి. సామాన్య ప్రజలు వారిని భక్తితో కొలిచేవారు. సాధు జీవితం అన్నిటికన్న సులభమైన వృత్తిగా తయారైంది. ఇప్పటికీ గ్రామసీమల్లో సన్యాసులంటేను, స్వాములవార్లంటేను భక్తి పోలేదు.

## ముగింపు

శంకరాచార్యుడు పరమపదించి 1200 సంవత్సరాలైంది. భారతమాత కనిన గొప్పమేధావులలో, తత్వవేత్తలలో, సంస్కర్తలలో ఆయనొకరు. భారతదేశంలో మొదటినుంచీ వివిధ తాత్వికధోరణులమధ్య సంఘర్షణ జరుగుతూనే వచ్చింది. ప్రజల మనోవికాసానికి మేటిబాట యీ సంఘర్షణేనని అంగీకరించాలి. శంకరుని అద్వైతం యీ తాత్విక సంఘర్షణలో విశిష్టమైన స్థానమలంకరించింది. ఆయన ఎన్నో సంవత్సరాల క్రిందట ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన భావవాద సిద్ధాంతాలకు మెరుగులుదిద్ది వాటిని అభివృద్ధిచేశాడు. వాటితో ఆధునిక భౌతికవాదులం సహజంగా ఏకీభవించజాలం. ఆయన సూత్రీకరణలను సమర్థవంతంగా పూర్వపక్షమొనర్చేందుకవసరమైన శాస్త్రవిజ్ఞానం యీనాడు మనకుంది. కాని 8 వ శతాబ్దంలో అట్టి సాధనసామగ్రి లేనందున శంకరుని ఉపదేశాలు ఆనాటి మేధావివర్గాన్ని అంతగా ఆకర్షించాయి.



# వ్యాసరచయితలు

### శ్రీ విద్యాశంకర భారతీస్వామి :

వీరు బందరులో గాయత్రీ పీఠాధిపతులు, పీఠ స్థాపకులు. అద్వైతసభకు అధ్యక్షులు. పూర్వాశ్రమంలో వీరిపేరు రాళ్ళబండి శీతారామశాస్త్రి. వీరు బందరులో న్యాయవాదవృత్తిలో గణనపొందేరు. అక్కడ సాంగవేద పాఠశాలను స్థాపించి, దానిని అభివృద్ధిచేయడం తమ జీవితధ్యేయంగా పెట్టుకున్నారు. వయస్సు 65.

### శ్రీ ఏటుకూరు బలరామమూర్తి :

వీరిది గుంటూరుజిల్లా ఏటుకూరు. పట్టభద్రులు. విజయవాడలోని "విశాలాంధ్ర" సంపాదకవర్గ సభ్యులుగా వుంటున్నారు. వీరు రచించిన "ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర", "భారతీయ తత్త్వశాస్త్రం" విశేష ప్రజాదరణను పొందేయి. వానిలో "ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర" విదేశ భాషలలోకి కూడా అనువదింపబడింది.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. వయస్సు 40.

### శ్రీ మప్పా వెంకట్రామశాస్త్రి :

వీరిది కృష్ణాజిల్లా మచిలీపట్నం. ఎం. బి., బి. యస్. పట్టభద్రులు. బందరులో ప్రాక్టీసుచేస్తున్న డాక్టరు. గురుముఖతః అద్వైతం గురించి అధ్యయనం చేసినవారు.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. వయస్సు 40.

### శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు :

వీరిది కృష్ణాజిల్లా అంగలూరు. బి.ఎస్.సి. చదివారు. ఇటీవలివరకు శ్రీకాకుళంజిల్లాలో జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా వున్నారు. వీరు వ్రాసిన "భారత తత్త్వశాస్త్ర పరిశీలన (వేదాలనుండి శంకరునివరకు)" ఆంధ్రలో బహుళ ప్రశస్తి పొందింది.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. వయస్సు 29.

### శ్రీ సారా రామచంద్రరావు :

తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం. సామాన్య రైతు కుటుంబంనుంచి వచ్చినవారు. 1937 నుంచీ రైతు వుద్యమాల్లో పనిచేస్తూవచ్చారు. కొంతకాలం తాలూకా చెరకురైతుసంఘ అధ్యక్షులుగా వున్నారు. తాత్విక అధ్యయనం ప్రత్యేక కృషిగా తీసుకొన్నారు. కాంగ్రెసువాది, వయస్సు 50.

### శ్రీ ఆచార్య బోధిభాస్కర :

ఆచార్య బోధిభాస్కర వీరి వ్యవహారనామం. అసలుపేరు శ్రీ కె. భాస్కరశర్మ. బి. కాం., బి. ఇడి. పట్టభద్రులు. కృష్ణాజిల్లాబోర్డుస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. ప్రస్తుతం ఘంటసాల హైస్కూలులో పనిచేస్తున్నారు. ఆది బౌద్ధమిషన్ సంస్థాపకులు. "బుద్ధ శతకం" వీరి రచనలలో ఒకటి. వీరి వయస్సు 35.

### శ్రీ పాములపర్తి సదాశివరావు :

వరంగలు కాపురస్తులు. కవి, విమర్శకులు. రచయిత. వీరు "చరిత్ర - సంస్కృతి", "తత్త్వశాస్త్ర ప్రథమ పాఠాలు", "అభ్యుదయ గేయాలు" రచించారు. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యనిర్వాహకసమితి సభ్యులు.

"కాకతీయ" పత్రిక సంపాదకులు. అభ్యుదయవాది. వయస్సు 35.

### శ్రీ శ్రీపాద లక్ష్మీనరసింహం :

వీరిది పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపురం. ఎం. ఏ., బి. ఎల్. పట్టభద్రులు. అడ్వొకేట్. గణితశాస్త్రం, తర్కశాస్త్రం అంటే ప్రత్యేకాభిమానం ఉంది; వాటిలో ప్రత్యేక కృషి చేసేరు. మంచి విమర్శకులు, వక్త. అభ్యుదయవాది. వయస్సు 46.

### శ్రీ కంభంపాటి సత్యనారాయణ :

తూర్పుగోదావరిజిల్లా తుని. ఎం.ఏ. పట్టభద్రులు. కాంగ్రెసువాదిగా, కాంగ్రెసు సోషలిస్టుగా, కమ్యూనిస్టుగా రాష్ట్ర రాజకీయ రంగంలో సుపరిచితులు. పెక్కు కమ్యూనిస్టు సిద్ధాంతగ్రంథాలను ఆంధ్రంలోకి అనువదించేరు. ప్రజాశక్తి, విశాలాంధ్ర సంపాదకవర్గ సభ్యులుగా పనిచేసేరు. ప్రస్తుతం 'సందేశం' సంపాదకవర్గ సభ్యులు.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. వయస్సు 49.

138

# పాఠకులకు మనవి

ఈ సంచికలోని వ్యాసాలలో ప్రకటించిన భావాలూ, వాదనలూకూడ విమర్శకు వుద్దేశించబడ్డాయి. వానిమీద వచ్చే సవ్యమైన సంగ్రహ విమర్శలకు సందేశంలో తావిస్తాం.

సవ్యం అనడంలో మా వుద్దేశం ఇది :

* విమర్శలు అభిప్రాయాల మీదనేకాని వ్యక్తులమీదికి పోనీయకూడదు.
* చర్విత చర్వణం ప్రయోజనంలేదు.
* విమర్శలు క్లుప్తంగా, సూటిగా వుండాలి.

# A BOOK OF OUTSTANDING IMPORTANCE

Innumerable are the books written by Historians - foreign as well as Indian - about the rise and fall of the East India Company in India, about its activities, which led to epoch-making changes, and about the extent of havoc which it had wrought. But none - not even the most radical anti-imperialist historians like Major B. D. Basu-have attempted to give a coherent and detailed account of the social forces - both in India and England - which facilitated the rise as well as the fall of the East India Company.

This gap has been filled by Mr. Ramakrishna Mukherjee, Guest Professor of the Hamboldt University in Berlin, who has delivered a course of lectures to the students of the Institute for Indian Studies during 1953-'54, and which were published in the form of a book entitled :

*THE RISE & FALL OF THE EAST INDIA COMPANY*

Specially enlightening is the Fourth Chapter, which deals with the stage of social development in India at the time of the advent of the East India Company. The author with the help of Indian as well as foreign authorities, has vividly described the special characteristics of Indian Feudalism, which were basically different from those of its European counterpart. He has explained how the old order was yielding place to the new, thanks to the rising forces in Indian Society; these forces would have brought about the next phase of development in India but for the superimposition of the political and economic rule of the East India Company - which in its turn was overthrown by the rising tide of Indian Nationalism as well as by the new class of industrial bourgeoisie in England.

The author has not only described the various forms of plunder resorted to by the Company, but has also depicted the seething discontent of the Indian masses, which had culminated in the great Rebellion of 1857.

Students of Indian History who wish to understand the laws of social development in relation to the Imperialist exploitation of our country during the phase of the East India Company, will find this book a valuable addition to the field of historical research.

***Price Rs. 7-50.***

---

***Distributors in India :***

**VISALAANDHRA PUBLISHING HOUSE,**

**VIJAYAWADA-2.**

Edited, Printed and Published by G. RADHAKRISHNA MURTY.
Printed at Swatantra Art Printers, Vijayawada.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B101 |
| పుస్తకం పేరు | సందేశం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 421 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1,4B,A21,B1,B2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |